# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (క - ఘ)



## రెండో సంపుటం


ప్రధాన సంపాదకుడు

**డా॥ ఎల్. చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.**

సహాయకులు

డాక్టర్ జి.వి.యస్.ఆర్. కృష్ణమూర్తి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ అత్తలూరి నరసింహారావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ బి. అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
శ్రీ ఇ. విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ.
శ్రీ ఎల్.కె. మల్లేశ్వరరావు, ఎమ్.ఏ.
శ్రీమతి టి. కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ.






1981

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు
వాల్తేరు, విశాఖపట్టణం 530 003

ప్రతిభాశాలి

ఆంధ్ర ప్రదేశ్ మాజీ ప్రధాన న్యాయమూర్తులు



శ్రీ ఆవుల సాంబశివరావు

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# ముందుమాట

తెలుగు వ్యుత్పత్తి కోశం రెండవ సంపుటాన్ని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తెలుగు సంస్కృతికి కానుకగా అర్పిస్తోంది.

ఈ కోశం ఎనిమిది సంపుటాలుగా వస్తుంది. మొదటిదాన్ని 1978 లో అందించాం. అందులో 'అ' నుండి 'ఔ' వరకు వున్న పదజాలాన్ని ఉటంకించాం. ఇందులో 'క' నుండి 'ఘ' వరకు ఉన్నాయి. 19,670 పదాల సమీకరణ యీ సంపుటం.

ఆదిలో ఆచార్య గంటి జోగిసోమయాజిగారు, ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు నాటిన భావబీజం ఈ కోశానికి అంకురార్పణ. ఆ పిమ్మట ఎందరెందరో మేధావులు యీ ప్రయత్నానికి పూనిక యిచ్చారు. ఆచార్య జి.యస్. రెడ్డిగారు, ఆచార్య తూమాటి దొణప్పగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, పట్లమూడి గోపాలకృష్ణయ్యగారు, మేకా రంగయ్యప్పారావుగారు—మరెందరో మహాభాగులు ఆసరా యిస్తుండగా జరుగుతున్న కృషి యిది. ఇంత బరువు తను భరిస్తూ, పనిజరుపుతున్నవారు మా డాక్టర్ లకంసాని చక్రధరరావుగారు.

ఆర్థిక భారాన్ని యూనివర్సిటీ గ్రాంట్సు కమీషనువారు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, మా విశ్వవిద్యాలయమూ భరిస్తున్నవి.

పైన ఉటంకించిన వారందరకు హార్దికాభివందనాలు అర్పిస్తున్నాను.

ఈ వ్యుత్పత్తి కోశం కొంత నత్తనడక నడిచింది ఇప్పటివరకు. ఆదిలో అలాగే ఉంటుందికదామరి! ఇక్కడనుండీ ఏడాదికి రెండు చొప్పున సంపుటాలు ప్రకటిస్తామని మా ఆశయం, ఆశ. మూడవది అచ్చుకు ఇచ్చేశాంకూడా. మా విశ్వవిద్యాలయ ముద్రణశాల ఈ పనికి సిద్ధంగా వుంది.

పోతే మరొక ఆలోచన. వ్యుత్పత్తి కోశమని అంటున్నాం. అసలు తెలుగు భాష, పదాలు ఎలా పుట్టాయి అనే మౌలికమైన ప్రశ్న ఇందులోనుంచి ఉదయిస్తుంది. సంస్కృతం తెలుగుకు తల్లి అని ఒక వాదమైతే, తమిళమే దీని మాతృక అని మరొక వాదం. తెలుగుకు స్వతంత్ర పుట్టుక వుంది అనేది ఒక భావం. దీన్నిగురించి పరిశోధన జరగడం అవసరం. తెలుగు పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించవలసిన అవసరమొచ్చి చాలా కాలమయింది. మా విశ్వవిద్యాలయం అందుకు పూనుకొంటుంది. తెలుగు భాషాభిమానులు అందర్నీ మరీమరీ అర్థిస్తూ వున్నాను, ఈ పరిశోధన నిశితంగా చెయ్యండీ అని. అందుకు మా విశ్వవిద్యాలయ సాయం ఎల్లప్పుడూ వుంటుంది.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు జనకులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ఉజ్జ్వల స్మృతికి అంకితంగా ఈ సంపుటాన్ని అర్పిస్తున్నాం. ఈ ఏడు వారి శతవార్షిక జయంతి. ఆయనగారు విశ్వకళాపరిషత్తును విడిచివెళ్ళి ముప్పైరెండేళ్ళు గడిచినా, వారు జీవితరంగంనుండి వెళ్ళిపోయి ముప్పైఏండ్లు దాటినా, ఆ మహామేధావి స్ఫూర్తి వెలుగు దివ్వెలాగా వెలుతురును విరజిమ్ముతూ, ఈ పరిషత్తు ముందుకు సాగడానికి బాటలు చూపుతూనే వున్నది, ఉత్సాహాన్ని కలిగిస్తూనే వున్నది. రామలింగారెడ్డిగారిది తెలుగువారిమీద ఆంధ్ర విశ్వకళాపరిషత్తుమీద ఎన్నటికీ చెరగని ముద్ర. ఏనాటికీ తరగని పలుకుబడి. వారే ఉండివుంటే ఈ వ్యుత్పత్తికోశాన్ని చూచి

ఎంత తృప్తిపడివుండేవారో ! శతవార్షిక జయంతి సందర్భంగా వారి జ్ఞాపకానికి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు మనసారా అందిస్తున్న చిరుకానుక ఈ సంపుటం.

ఈ రెండవ సంపుటాన్ని తెలుగు ప్రజలకు అందిస్తూ, ఈ ప్రయత్నాన్ని ఆశీర్వదించవలసినదని కోరుతున్నాను.

మీ

వాల్తేరు
16–3–1981

ఆవుల సాంబశివరావు
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# పీఠిక

ఆచార్యులు డా॥ వి.యస్. కృష్ణ, బ్రహ్మశ్రీ గంటి జోగిసోమయాజి, డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగార్ల కృషిఫలితంగా 1957 లో ఏర్పడిన తెలుగు వ్యుత్పత్తికోశ పథకం 1976 వరకు ఆచార్యులు శ్రీ గంటి జోగిసోమయాజి (1957 – 62), డా॥ తూమాటి దొణప్ప (1970 – 76) గార్ల పర్యవేక్షణలో కొనసాగింది (1962 ఏప్రిల్ 1 నుంచి 1970 మార్చి 31 వరకు ఈ పథకం నిధులకొరతలవల్ల ఆపివేయబడింది). ఈ వ్యుత్పత్తికోశ పథకానికి డైరెక్టరుగాను ప్రధాన సంపాదకుడుగాను అప్పటికి (ఇప్పటికీ) తెలుగు శాఖలో ఉపన్యాసకుడుగా ఉన్న నన్ను నియమించగా 1–6–1976 న ఈ నిఘంటు నిర్మాణ బాధ్యతల్ని స్వీకరించాను. తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘ సభ్యుల విలువైన సలహాలవల్ల, ఈ పథక సిబ్బంది నిరంతర కృషివల్ల తెలుగు వ్యుత్పత్తికోశ ప్రథమ సంపుటాన్ని (అ – ఔ) 20–11–1976 నాటికి పూర్తిచేసి ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయానికి ఇచ్చాం. నాటి కేంద్ర విద్యాశాఖామాత్యులైన డా॥ పి.సి. చందర్‌గారిచే ఆంధ్ర విశ్వకళాపరిషత్ స్వర్ణోత్సవ సందర్భంగా 10–7–1978 న ఆవిష్కరించబడింది. 19,670 ఆరోపాలతో కూడిన రెండో సంపుటం (క – ఘ) 16–11–1978 న ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయానికి ఇచ్చాం. ఈనాటికి ఈ సంపుటం ముద్రించబడి ఆవిష్కరణకు ఆయత్తమైంది. మొట్టమొదట మూడు సంపుటాలుగా ఉంటుందని భావించబడ్డ ఈ కోశం పరిమాణాన్ని దృష్టిలో పెట్టుకొని మొత్తం ఎనిమిది సంపుటాలుగా ఉండాలని నిర్ణయించాం. ఈ నిఘంటువు మూడో సంపుటం (చ – ణ) పూర్తిచేయబడి ముద్రణకు సిద్ధంగా ఉంది. ప్రస్తుతం నాలుగో సంపుటం (త – న) వ్రాతప్రతిపని ఒకవంక జరుగుతూండగా ఇంకోవైపు ఐదో సంపుటం (ప – భ) పని చురుకుగా సాగుతోంది. ఈ నిఘంటువు ఆరో సంపుటం (మ – ళ) మార్చి 1982 నాటికి, ఏడో సంపుటం (వ – శ) మార్చి 1983 నాటికి, ఎనిమిదో సంపుటం (స – హ) మార్చి 1984 నాటికి పూర్తికాగలదు. ఎనిమిది సంపుటాలలో లక్ష పదాలతో వెలుగొందే ఈ తెలుగు వ్యుత్పత్తికోశం మొత్తం 1984 మార్చి 31 నాటికి వెలుగులోనికి రాగలదని ఆశిస్తున్నాను.

మొదటి సంపుటంలో ఉపారోపాలుకూడా ప్రధానారోపాలుగా ఇవ్వబడ్డాయి. దీనివల్ల జాగా వ్యర్థం కావటమే కాక ప్రయోజనం కన్పించలేదు. 30–10–1978 తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘ సభ్య సమావేశంలో ఈ విషయాన్ని చర్చించి 'ప్రధానారోప భాగం ఏమాత్రం మార్పు పొందని ఉపారోపాల్ని తిరిగి ప్రధానారోపాలుగా ఇవ్వనవసరం లేదని తీర్మానించడమైనది,' అని నిర్ణయించగా ఈ సంపుటంలో ఈ ముఖ్య నిర్ణయాన్ని పాటించాం. ఈ విధంగా చేయటంవల్ల మొత్తంమీద 450 పుటల పరిమాణం తగ్గి రూ॥ 50,000 మిగలటమే కాక కోశం సుందరంగా శోభిల్లుతుంది. పదాల అర్థాలు కాలానుగుణంగా ఇవ్వబడాలనే సదాశయం ఈ భాగంలో సాధ్యమైనంతవరకు పాటించబడింది. ఈ భాగంలో దంతోష్ఠ్యోష్మశ్వాస మహాప్రాణోచ్చారణ (f) ను తెలపటానికి ఫ అక్షరాన్ని ఉపయోగించాం. లేఖనంలో భిన్నంగాఉన్నా ఉచ్చారణలో భేదంలేని నాదాల్ప ప్రాణదంత మూలీయ తాడిత వర్ణాన్ని (ర) నాదాల్ప ప్రాణదంత మూలీయ కంపిత వర్ణాన్ని (ఱ) ఇతర నిఘంటువులలోని ఆరోపాల్ని యథాతథంగా గ్రహించాలనుకొనే మేము ఈ కోశంలో భిన్నంగా స్వీకరించి పర్యాయపదాలుగా ప్రదర్శించాం. ఇదే కారణంచేత నాదాల్ప ప్రాణమూర్ధన్య పార్శ్విక వర్ణమైన ళకారంతో సంయుక్తంగా ఉన్న నాదాల్ప ప్రాణదంత మూలీయ పార్శ్విక వర్ణమైన లకారాన్ని, నాదాల్ప ప్రాణ మూర్ధన్య పార్శ్విక వర్ణమైన ళకారాన్ని భిన్నంగా గ్రహించాం. ఈ వ్యుత్పత్తి కోశం ప్రధానంగా వ్యుత్పత్తి

ప్రదర్శకంగా ఉన్నప్పటికి చారిత్రక వర్ణనాత్మకాభిధాన లక్షణాలనుకూడా సంతరించుకొన్నదనే విషయాన్ని గమనించగలరు.

ఈ రెండో సంపుటం కృషిలో భాగస్వాములు : డా॥ ఎల్. చక్రధరరావు, డా॥ జి. వి. యస్. ఆర్. కృష్ణమూర్తి, డా॥ అత్తలూరి నరసింహారావు, డా॥ బి. అరుణకుమారి, శ్రీ ఇ. విశ్వనాథరెడ్డి, శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు, శ్రీమతి టి. కనకమహాలక్ష్మి, శ్రీ జి. వి. సీతారాం (టైపిస్టు), శ్రీ బి. నూకారెడ్డి (ప్యూన్). ప్రస్తుతం నిఘంటు నిర్మాణంలో కృషి చేస్తున్న వారు : డా॥ ఎల్. చక్రధరరావు, డా॥ బి. అరుణకుమారి, శ్రీ ఇ. విశ్వనాథరెడ్డి, శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు, శ్రీమతి టి. కనకమహాలక్ష్మి, కుమారి కె. వి. రమణ, కుమారి వి. సీతామహాలక్ష్మి, శ్రీ ఎమ్. సీతారామయ్య, శ్రీ జి.వి. సీతారాం (టైపిస్టు), శ్రీ బి.వి. రమణారెడ్డి (ప్యూన్).

న్యాయవాదిగా, న్యాయమూర్తిగా, ప్రధాన న్యాయమూర్తిగా వివిధ విధులను శ్లాఘాపాత్రంగా నిర్వహించిన సరసులు సహృదయులు సద్గ్రంథకర్తలు సాహితీసద్విమర్శకులు తెలుగువ్యుత్పత్తికోశ పథక సలహాసంఘాధ్యక్షులు ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు అయిన శ్రీ ఆవుల సాంబశివరావుగారికి చేతలద్వారా మాటలద్వారా మనఃస్ఫూర్తిగా తెలుగువ్యుత్పత్తి కోశ పథకానికి సహాయాన్ని అందిస్తున్నందుకు హృదయపూర్వక కృతజ్ఞతాకుసుమాంజలులు.

1976 నుంచి తెలుగువ్యుత్పత్తికోశ పథకానికి నిధులను సమకూర్చి కొనసాగించిన నిఘంటు నిర్మాణ పోషణక్షణులు కళాపోషకులు సంస్కృతాంధ్రభాషాప్రియులు శ్రీ ఎమ్.ఆర్. అప్పారావుగారికి—

తమ అమూల్యాలైన సలహాలద్వారా పథక విజయానికి కారకులయిన, అనుభవజ్ఞులైన తెలుగు వ్యుత్పత్తికోశ పథక సలహా సంఘ సభ్యులు : డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి.ఎన్. అనసూయా దేవి, ఆచార్య జి.ఎన్. రెడ్డి, డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగార్లకు—

ఈ వ్యుత్పత్తికోశ పథకాభివృద్ధికి సర్వదా, సర్వథా సహకారాన్నందిస్తున్న ఆంధ్ర విశ్వవిద్యాలయ కార్యనిర్వహణదక్షులు సహృదయులు రిజిష్ట్రార్ శ్రీ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి, ఎమ్.ఏ. (ఆనర్స్), బి.యల్. గారికి—

ఈ కోశాన్ని సర్వాంగసుందరంగా ముద్రించడంలో పూర్తిగా సహకరించిన సన్ముద్రణ దీక్షాపరతంత్రులు ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయం డిప్యూటీ డైరెక్టరు శ్రీ జి. మదనరాజు గారికి, అసిస్టెంట్ డైరెక్టరు శ్రీ ఎమ్.ఆర్.బి. నరసింహారావుగారికి, ముద్రణాలయ సిబ్బందికి

హార్దిక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషివల్ల కోశ సంపూర్తికి కారకులయిన మా వ్యుత్పత్తికోశ పథక సిబ్బందికి

మనఃపూర్వకమైన అభినందనలు.

వాల్తేరు
27–1–1981

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకుడు
తెలుగు వ్యుత్పత్తికోశ పథకం

ఆంధ్రరాష్ట్ర అవతరణకు
అసువులను అర్పించిన



అమరజీవి
# శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తికోశ సలహా సంఘం

అధ్యక్షులు:

శ్రీ ఆవుల సాంబశివరావు, బి.ఏ., బి.యల్.

ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు

సభ్యులు:

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, డి.లిట్.

గౌరవాచార్యులు, రవీంద్ర సాహిత్యం

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

వాఙ్మయ మహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

హైదరాబాదు

శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి

మదనపల్లి

డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య

కళా-ప్రపూర్ణ

సత్తెనపల్లి

ఆచార్య జి.ఎన్. రెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.

తెలుగుశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎమ్.ఏ., పిఎచ్.డి.; డి.లిట్.

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

డాక్టర్ ఎల్. చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

కార్యదర్శి

డైరెక్టర్, ప్రధాన సంపాదకుడు

తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం

## అంకితం

మహామేధావి

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తొలి ఉపాధ్యక్షులు



కీ.శే. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారికి

# క

**క**[1] వి. హల్లుల్లో తొలి వర్ణం, జిహ్వామూల హనుమూలీయ శ్వాస స్పర్శం, అల్పప్రాణం. అన్ని ద్రావిడ భాషల్లోనూ ఉంది.

< మూ.ద్రా. *క.

**-క**[2] ప్రత్య. వ్యతిరేకక్త్వార్థంలో వచ్చే ప్రత్యయం. ఉదా. కొట్టక, తిట్టక.

త. కై. క్రియానామాల చివర వచ్చే ప్రత్యయం < చెయ్-కెయ్; గోం. వా కె. వ్యతిరేకార్థక క్రియా విశేషణం; కుఇ. అరన్గె, అరఅ; కువి. -అకి; పర్జి. అక; గదబ. -అక.

< మూ.మ.ద్రా. -*అ-*క్.

< మూ.ద్రా. *అ.

-క[2] అనుచిత విభాగంవల్ల తెలుగులోని వ్యాకరణాదుల్లో ఏర్పడ్డ వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయం.

**-క**[3] ప్రత్య. కొన్ని ధాతువులకు వచ్చే కృత్ప్రత్యయం. ఉదా.: అలుక, కినుక. పోక.

**-క**[4] ప్రత్య. ఆత్మనేపదార్థంలో అనుప్రయుక్తమైన "కొను" ధాతువుయొక్క క్త్వార్థక రూపమయిన "కొని"కి వికల్పంగా వచ్చే ఆదేశం. భాస్క.రా.అర. 2.102, జైమినీ భా. 7.23 (ఇది కవిత్రయంవారి గ్రంథాల్లో లేదు).

**-క**[5] (న్) ద్రు. రూ.చూ. కా[1](న్) ప్రత్య. "అగు"ధాతువుయొక్క నుజ్యంత రూపం; (క్రియావిశేషణత్వ వివక్షలో అను ప్రయుక్త మవుతుంది.)

ఉదా.: తెన్నగ(న్), బెట్టుగ(న్).

**కంసలతొట్టి** రూ. కంసల్తొట్టి. వి. బంగారం పనిచేసేటప్పుడు కంసాలి నీళ్లుపోసిపెట్టుకొనే మట్టిపాత్ర.

**కంసల్తొట్టి** రూ.చూ. కంసలతొట్టి. వి. బంగారం పనిచేసేటప్పుడు కంసాలి నీళ్ళుపోసిపెట్టుకొనే మట్టిపాత్ర.

**కంసాదివంపని** పో.చూ. కంసాలి. వి. చెక్కలతో ఇంటిని కప్పే పని.

**కంసాల** రూ. కంసాలి, కమసాలి, కమసాలె, కమ్మసాలి. వి. స్వర్ణకార జాతి. భోజ. 5.322.

సం. కర్మశాలా. కర్మాగారం, ప్రతిరోజూ పనిచేసే గది; ప్రా. కమ్మసాలా. కర్మాగారం; హిం.కర్మకార్. స్వర్ణకారుడు, కంసాలి, కమ్మరివాడు.

పో.చూ. క. కమ్మఅ, కమ్మాఅ. కమ్మరవాడు; తు. కమ్మారె; మ. కమ్మాళన్. శిల్పి, చిత్రకారుడు.

< ప్రా. కమ్మసాలా (అర్థవిపరి.).

**కంసాలవాఁడు** రూ. కమసాలవాఁడు. వి. కంసాలి.

**కంసాలి** రూ.చూ. కంసాల. వి. 1. స్వర్ణకారుడు. ఆం.భా. 2.284; 2. కొయ్యపనిచేసేవాడు, వడ్రంగి.

**కంసాలికప్పు** వి. టక్ టక్ మని శబ్దంచేసే కప్ప. **కంసాలిలాజు** వి. సమానమైన మట్టంలో ఇటికలను నిలువన అతికి కప్పు వేయటం.

**కంసూరి** వి. ద్వారబంధంపైకమ్మిమీద అడ్డంగా నిలిపిన చిన్న పట్టె.

**కక** వి. పెద్ద అడవుల్లోనూ, రాతికొండలపైన చిన్న పొదలాగ పెరిగే చెట్టు (Flocourtia Romoutchi: Gardenia latifolia).

**కకవల్లి** వి. లేత పసుపుపచ్చరంగు పూలుపూసే ఒకరకం మొక్క (Tylophora asthmatica).

**కకపాల** రూ. కక్కపాల. వి. 1. సన్యాసులు చంకన ధరించే సంచి. హర. 5.10; 2. మంగలిపొది. ఆం.భా. 2.301.

సం. కక్షపాల-; ప్రా. కక్ఖపాల-

క. కచ్ఛవాళ, కక్షపాల. చంకన తగిలించుకొనే సంచి.

< ప్రా. కక్ఖపాల-.

**కకవికి** రూ.చూ. కకాపిక. విణ. చెల్లాచెదరు, మిక్కిలి చెదరిన. అష్ట.మ.క. 2.105. వి. అల్లకల్లోలం, కలకలం, గత్తర.

**కకవికవడు** రూ. కకపికవడు. అ.క్రి. 1. చలించు, హంస. 5.15; 2. మిట్టిపడు, గర్వించు. **కకవికలుగా** క్రి.విణ. అల్లకల్లోలంగా. **కకవికలుచేయు** అ.క్రి. గందరగోళంచేయు; **కకవికవడు** (-పడు) రూ.చూ. కకపికపడు. అ.క్రి. 1. చలించు; 2. గర్వించు.

**కకవిక** రూ.చూ. కకాపిక. వి. 1. తారుమారు సు.శ. 22; 2. క్షుభితం, కలతనొందినది. నృసింహ. 2.7; 3. అల్లరి, గత్తర; అవ్య. చెల్లాచెదరు. కళా. 8.102.

**కకవికచేయు** స.క్రి. కలచు, క్షోభింపజేయు. లక్ష్మీ. వి. 2.7. **కకవికవడు** రూ.చూ. కకపికపడు. అ.క్రి. 1. మిక్కిలి చెదరు; 2. కలగు; **కకవికలు** వి.బ.వ. యథాయథలు, చిందరవందర. సు.శ. 22; విణ. మిక్కిలి చెదరిన.

**కకాపిక** రూ. కకపిక, కకవిక, కకావిక. విణ. చెల్లాచెదరు. వరాహ. 3.59.

సం. కాకపికా-; ప్రా. కాకపికా, కకవికా.

పో.చూ. క. కక్కరిబిక్కరి. క్రూరత్వం.

**కకావిక** రూ.చూ. కకాపిక. వి. చెల్లాచెదరు. కళా. 8.58; విణ. కలిగిన, భయపడిన. శుక. 1.312.

**కకావికలు** వి.బ.వ. 1. యథాయథలు; 2. అల్లరి, గందరగోళం, గత్తర.

**కకిముష్టి** వి. ఒక రకం మొక్క (Caltis Cinnamomea).

**కక్క**[1] రూ. కక్కాయి. వి. 1. పినతండ్రి ; 2. అయ్య, నాన్న, తండ్రి.

నే. కాకా. పినతండ్రి ; ఒ. కాకా ; హిం. కాకా. అన్న, పినతండ్రి ; గు. కాకా. పినతండ్రి ; మరా. కాకా ; పార. కాకా. అన్న, పినతండ్రి ; ఉ. కాకా. పినతండ్రి.

క. కక్క, కాకా. పినతండ్రి ; పో.చూ. మ. కాక్క. అన్న ; త. కాక్క.

< ఉ. కాకా.

**కక్క**[2] వి. 1. పాయసం ; 2. పిండివంట ; 3. సంకటి.

పో.చూ. సం. కల్క-. జిగురు, జిగురుపదార్థం; పో.చూ. ప్రా. కక్క- గుజ్జులాంటి పదార్థం ; పో.చూ. పా. కక్క. జిగురు. బంక.

< ప్రా. కక్క-.

**కక్క**[3] వి. 1. మాంసం ; 2. పోకచెక్క, వక్క ; 3. అసహ్యం, మురికివస్తువు, అశుభ్రం.

క. కక్క. అశుభ్రం.

**కక్క**[4] వి. చేప.

పో.చూ. త. కయల్. ఒకరకం చేప ; మ. కయ్యాన్. నదుల్లో ఉండే ఒకరకం చేప ; గోం. కైక్. చిన్నచేప ; పర్జి. కెయ్ ; కొలా. కయె ; నా. కయ్యే.

పో.చూ. సం. కైవర్త-. జాలరి ; ప్రా. కెవట్ట-.

**కక్క**[5] వి. పాడె.

**కక్కగట్టు** వి. తిట్టుమాట.

**కక్కపాల** రూ.చూ. కకపాల. వి. 1. సన్యాసులు చంకనదాల్చే సంచి. విప్ర. 2.97 ; 2. మంగలిపొది.

**కక్కర** రూ. కక్కెర, క్రక్కెర. పో.చూ. కొక్కెర. వి. పెద్ద జాతి కొంగ (Anthropoides Virgo).

సం. కృకవాకు-. కోడి, నెమలి, తొండ, ఒకవిధమయిన పక్షి ; పా. కక్కర ;

క. కక్కర. ఒకజాతి పక్షి.

**కక్కరకోడి** వి. కౌజు, తిత్తిరిపిట్ట, చకోరం, ఒకజాతి కముజుకోడి (Francolinus pictus); **కక్కరజీనువాయి** వి. ఒకరకం జీనువపక్షి (Urolloncha punctulata).

**కక్కరము** విశే. కఠినమైన, మోటైన, కరుకు. ద్వి. భాగ. 4 ; వి. 1. కర్రచేయి, దారుహస్తం. మల్హ. 1.94 ; 2. కాఠిన్యం.

సం. కర్కర-. కఠినమైన, గట్టిగావున్న ; ప్రా. కక్కర-. కరుకుతనం, గరుకు; దేశీ. కక్కర. నమిలేటప్పుడు పేలినట్లు ధ్వనిచేసే పదార్థం ; అమా. కక్కర- ; పా. కక్కరతా. కరుకు, కటువు ; కక్కరియ. కటువు ; హిం. కర్కర్. గట్టి, కఠినమైన ; గు. కకరుమ్. మృదువుగా లేని, గట్టి.

తు. కొక్కర. గరుకు.

< ప్రా. కక్కర-.

**కక్కరించు** అ.క్రి. మొరుగు, పెద్ద కేకలువేయు, అరచు. చెన్నబసవ. 2.30.

**కక్కరాలు** వి.బ.వ. గోధుమపిండివంట.

**కక్కరించు** చూ. కక్కరము.

**కక్కసట** చూ. కక్క.[2] వి. ముద్దపాకం, మంచిజిగురుపాకం.

**కక్కసపడు** చూ. కక్కసము.

**కక్కసపెట్టు** చూ. కక్కసము.

**కక్కసము** రూ. కరకస. కరకసా, క్రక్కస. విశే. 1. క్రూరం, ఘోరం. వేంక. పంచ. 3.11 ; 2. కరకు, వాడియైన, తీక్షణం. పాండు. 4.236 ; 3. ఇరుకైన. ద్వి.పరమ. 1.44 ; 4. కఠినం, మోటైన. వి. 1. కశాభేదం, ఒకవిధమయిన కొరడా. జైమినీ.భా. 4.77 ; 2. దుష్కరత్వం. ఆము. 4.214 ; 3. కాఠిన్యం, నిర్బంధం. వైజ. 1.97 ; 4. సంకటం, బాధ, మనఃక్రోధం ; 5. గట్టి.

సం. కర్కశ-. విశే. గట్టి, స్థిరమైన, నిశ్చలమైన ; ప్రా. కక్కస- కఠినమైన, కరుకైన ; అమా. కక్కస. గట్టి కఠినమైన, కరుకైన ; పా. కక్కస. గరుకు, మోటైన, కఠినమైన ; కక్కస్స. ; హిం. కర్కస్. గట్టితనం.

క. కక్కస, కక్కసత. గట్టితనం ; త. కక్కచమ్. కష్టం, గట్టితనం.

< ప్రా. కక్కస-.

**కక్కసపడు** అ.క్రి. 1. బాధపడు ; 2. తపించు, సంతాపించు ; 3. మోటుగా ప్రవర్తించు ; 4. గాసిల్లు. **కక్కసపెట్టు** రూ. కక్కసవెట్టు. స.క్రి. 1. బాధపెట్టు, సంకటపరచు. రామా. 8.192 ; 2. నొప్పించు, పీడించు. **కక్కసవెట్టు (-పెట్టు)** రూ.చూ. కక్కసపెట్టు. **కక్కసాలాడు** స.క్రి. వాదప్రతివాదాలుచేయు. **కక్కసించు** స.క్రి. బాధించు, హింసించు. రామాభ్యు. 6.172 ; **కక్కసిల్లు** అ.క్రి. నిండు, కిక్కిరిసి యుండు. ద్వి.సా.చ. 1.15.

**కక్కసవెట్టు** చూ. కక్కసము.

**కక్కసాలాడు** చూ. కక్కసము.

**కక్కసించు** చూ. కక్కసము.

**కక్కసిల్లు** చూ. కక్కసము.

**కక్కసు** రూ. కకుస్, కక్కోసి, కక్కోసీ, కక్కోసు. వి. మరుగుదొడ్డి.

డచ్చి. కఖుఇస్. మరుగుదొడ్డి.

క. కక్కసు. మరుగుదొడ్డి ; త. కకుస్సు, కకూస్.

< డచ్చి. కఖుఇస్.

**కక్కాయి** రూ.చూ. కక్క[1]. వి. పినతండ్రి.

**కక్కి**[1] రూ. కక్కిత[1], కక్షి. వి. 1. ముప్ఫయిరెండు మల్లయుద్ధ విన్నాణాల్లో ఒకటి.

సం. కక్షిన్. వి. మల్లబంధ విశేషాల్లో ఒకటి.

**కక్కి**[2] వి. పినతల్లి.

నే. కాకి. పినతల్లి ; ఒ., ఉ., హిం., గు., మరా., పార. కాకి.

క. కక్కి. పినతల్లి, సవతితల్లి.

**కక్కించు** చూ. కక్కు[1].

**కక్కిత**[1] రూ.చూ. కక్కి[1]. వి. మల్లయుద్ధ విన్నాణాల్లో ఒకటి. ప్రబంధ. 87.

క. కక్కిపడ. మల్లుల కుస్తీపట్లలో ఒకటి.

**కక్కిత**[2] వి. పొదలాగ ఎగబాకే లతా విశేషం (Argeyrea speciosa).

**కక్కిర** పో.చూ. కక్కెర. వి. పొదకోడి, మచ్చలకోడి.

**కక్కిరిజమ్ము** వి. జమ్ములో ఒకరకం (Typhaceae species).

**కక్కిరిబిక్కిరి** వి. తారుమారు, తత్తరపాటు.

క. *కన్కాబిక్కరి, కక్కాబిక్కి.* భయం, హడలు; *కక్కరిబిక్కరి.* క్రూరత్వం, కుటిలం.

**కక్కివచెట్టు** వి. ఒకరకం చెట్టు (posoqueria uliginosa).

పో.చూ. క. *కక్కి, కక్కె.* పసుపుపచ్చ పూలను గుత్తులు గుత్తులుగా పూసే ఒకరకం చెట్టు; తు. *కక్కె.*

**కక్కు**[1] రూ.చూ. క్రక్కు. స.క్రి. 1. వెలిబుచ్చు, వెదలించు. భార.భీష్మ. 2.397; 2. కడుపులోనిది వెలిబుచ్చు, వైజ. 2.100; వి. వాంతి, కక్కిన పదార్థం.

**కక్కించు** స.క్రి. డోకించు, వెదలించు, కక్కేట్లుచేయు; **కక్కుటాకు** రూ.చూ. కక్కులటాకు వి. పసిబిడ్డలు పాలు కక్కుతుంటే, కక్కు ఆగిపోవటానికని వేలికి తొడిగే సన్నటి ఉంగరం; **కక్కుడు** వి. కక్కటం; **కక్కుడుదోనె** రూ.చూ. కక్కుదోనె. వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; **కక్కుడుమొత్త** వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; **కక్కుతెవులు** రూ. కక్కుఁదెవులు. వి. వాంతిరోగం; **కక్కుదోనె** రూ. కక్కుడుదోనె. వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; **కక్కుఁదెవులు** రూ.చూ. కక్కుతెవులు; **కక్కులటాకు** రూ. కక్కుటాకు. వి. కక్కులను ఆపటానికి వేలికి తొడిగే సాదా ఉంగరం; **కక్కువాయి** వి. కానరోగ విశేషం. త. *కక్కువాయ్, కక్కువాన్.* ఒకరకం దగ్గు.

**కక్కు**[2] పో.చూ. కఱకు. వి. రంపం మొదలగువాని పల్లు. భోజ. 4.60, పి.శకు. 4.86; 2. సన్నికల్లుకు వేసే గాటు.

**కక్కుకొట్టు** స.క్రి. గంట్లువేయు; **కక్కుపెట్టు** రూ. కక్కువెట్టు. స.క్రి. పదునుపెట్టు; **కక్కురాయి** వి. కరుకు రాయి, సానంద. 2.6; **కక్కులకళ్ళెము** వి. 1. రంపం కక్కులవంటి కక్కులున్న కళ్ళెం; 2. నిర్బంధించటం; **కక్కులకొడవలి** వి. పదునువైపు నొక్కులు నొక్కులుగా ఉన్న కొడవలి; **కక్కువెట్టు(-పెట్టు)** రూ.చూ. కక్కుపెట్టు. స.క్రి. పదునుపెట్టు; **కక్కువేయు** స.క్రి. ఒరపిడిపెట్టు, రంపానికి పదునుపెట్టు. క. *కక్కు.* రంపం మొ. వాటి కరుకు భాగం.

**కక్కుపాల** వి. ఒకరకం చెట్టు, కుక్కిరిక, వెర్రిపాల.

క. *కకోల.* పరిమళద్రవ్యం తీసే ఒకరకం చెట్టు.

**కక్కురితి** రూ.చూ. కక్కుఱితి. వి. 1. లోభం, ఆశ; 2. అశ్రద్ధ; 3. కష్టం, ఇబ్బంది; 4. తగనిపనికి పాల్పడటం.

**కక్కుర్తి** రూ.చూ. కక్కుఱితి. వి. 1. లోభం, ఆశ; 2. ఆలస్యం; 3. అశ్రద్ధ.

**కక్కుర్తికాఁడు** రూ.చూ. కక్కుఱితికాఁడు. వి. అత్యాశాపరుడు. లోభి. పిసినిగొట్టు, ద్వి.హరిశ్చ. ఉ. 542 పం., **కక్కుర్తిపడు** రూ.చూ. కక్కుఱితిపడు. స.క్రి. ఆశపడు. శివరా. 3.72.

**కక్కుఱితి** రూ. కక్కురితి, కక్కుర్తి, కకూ్కతు, కకూ్కరితి, కకూ్కర్తి, కకూ్కఱితి, కక్లూతు. వి. 1. ఆశ, లోభం. హరి. ఉ. 3.237; ప్రభా. 1.118, జైమినీభా. 6.234; 2. అశ్రద్ధ.

క. *కకూ్రతె, కకుళతె, కక్కులాతె, కక్కులతె, కక్కులితె.* ఆశ, లోభం.

**కక్కుఱితికాఁడు** రూ. కక్కుర్తికాఁడు, కకూ్కర్తికాఁడు కకూ్కఱితికాఁడు. వి. లోభి. నార.పంచ. 1.320: **కక్కుఱితి వడు** రూ. కక్కుర్తిపడు, కక్షూఱితివడు. స.క్రి. ఆశపడు. శివరా. 3.72.

**కక్కుస్** రూ.చూ. కక్కను. వి. మరుగుదొడ్డి.

**కక్షూతు** రూ.చూ. కక్కుఱితి. వి. కక్కుర్తి, లోభం.

**కక్షూరితి** రూ.చూ. కక్కుఱితి. వి. లోభం, ఆశ.

**కక్షూర్తి** రూ.చూ. కక్కుటితి. వి. 1. ఆశ, లోభం; 2. ఇబ్బంది, కష్టం.

**కక్షూర్తికాఁడు** రూ.చూ. కక్కుఱితికాఁడు. వి. అశాపరుడు, లోభి; **కక్షూర్తిగా** క్రి.విశ.ద్రు. కష్టంగా, ఆశగా; **కక్షూర్తిపఱుచు** స.క్రి. ఆశపెట్టు, లోభపెట్టు.

**కక్షూఱితి** రూ.చూ. కక్కుఱితి. వి. ఆశ, లోభం. సారంగ. 2.109.

**కక్షూఱితికాఁడు** రూ.చూ. కక్కుఱితికాఁడు. వి. లోభి, ఆశాపాతకుడు. ద్వి.హరిశ్చ.ఉ. 452; **కక్షూఱితివడు(-పడు)** రూ.చూ. కక్కుఱితిపడు. స.క్రి. ఆశపడు. చంద్రా. 2.74; **కకూ్కఱితివఱచు** స.క్రి. ఆనగొల్పు, లోభపెట్టు.

**కక్కెర** రూ.చూ. కక్కర. వి. 1. పక్షివిశేషం. హరిశ్చ. 2.23; రసిక. 1.67; 2. ఒక పెద్ద జాతికొంగ. ఆం.భా. 2.92.

**కక్కోడి** రూ.చూ. కక్కను. వి. మరుగుదొడ్డి.

**కక్కోజీ** రూ.చూ. కక్కును. వి. మరుగుదొడ్డి.

**కక్కోను** రూ.చూ. కక్కను. వి. మరుగుదొడ్డి.

**కక్షి** రూ.చూ. కక్కి.[1] వి. మల్లబంధ విశేషం; ముప్పయి రెండు విన్నాణాల్లో ఒకటి.

**కక్లూతు** రూ.చూ. కక్కుఱితి. వి. అత్యాశ, తగనిపనికి పాల్పడటం.

**కక్షిదారుడు** వి. వ్యాజ్యంలో ఎదిరిపక్షంవాడు.

క. *కక్ష-గార.*

<సం. కక్షిన్ - + పార. దార్ + - డు.

**కగ్గ** రూ.చూ. కగ్గము. వి. కత్తి, ఖడ్గం.

**కగ్గము** రూ. కగ్గ. వి. కత్తి, దాకు. ఘటికా. 1.83.

సం. *ఖడ్గ-* కత్తి; ప్రా., అమాగ., పా., అప. *ఖగ్గ*; హిం. *ఖర్గ్, ఖగ్గ్, కడ్గ్.*

క. *కడుగ*; త. *కట్కమ్.*

<ప్రా. *ఖగ్గ-.*

**కగ్గించు** చూ. కగ్గు.

**కగ్గు** అ.క్రి. 1. నల్లబడు. కకుత్థ్స. 1.210; 2. కందు. విప్ర. 2.53; 3. వివర్ణమగు. వి. వివర్ణం. అష్టమక. 3.172.

పో.చూ. క. *కర్గు.* నల్లబడు: *కరి.* కములు, మాడు; తు. *కరన్టుని.* వెలిసిపోవు; *కర్జక్క.* మాడిపోవు, కమిలిపోవు; త. *కరుకు*, కములు; *కరుకుక్క* కములు, వేడివల్ల నల్లబడు; మ. *కరియుక.* వేడివల్ల నల్లబడు; తొద. *కళ్ఫ్- (కట్త్-).* -నల్లబడు; *కర్య్.* కములు;

గోం. *కర్‌ల్-.* కాలు; *కర్‌వానా.* మండు; పర్జి. *కైర్-కెర్వ్.* మండు, కాలు; గ. *కరిద్-.* మాడిపోవు; కువి. *కరిఅ.* నలుపు; కురు. *ఖరయ్.* కమిలిపోవు; బ్రా. *ఖర్-.* కోపం, నిప్పు.

పో.చూ. నం. *కాల-.* నలుపు; పో.చూ. పార. *క్రెజ్.* ముదురు ఎరుపు; ఉ. *క్రెజ్.*

<మూ.ద్రా. *కర్-.

కగ్గించు న.క్రి. కందజేయు, ఐంకించు; కగ్గులు వి. బ.వ. **1.** అగ్నికణాలు; **2.** మిణుగురులు; కగ్గువాఱు అ.క్రి. రంగుమాయు, కందు, నల్లబడు.

**కంక**[1] రూ. కంగ, కనక[2]. వి. నదనవు వెదురు, వెన్వెదురు, సన్నగా పొడుగ్గా గట్టిగా వుండే ఒకరకం వెదురుమొక్క (Bambos stricta, Dendrocalamus strictus).

పో.చూ. త. *కల్‌ముంగిల్.*

కంకపుల్ల వి. నవాడు నేతలో పేకదారం చుట్టిన పుల్ల. కంకబద్ద రూ. కంకిబద్ద. వి. **1.** గూన పెంకును నునువు చెయ్యటానికి కుమ్మర్లు వాడే పలచని కొయ్యముక్క; **2.** వింటిబద్ద; **3.** ఉన్ని ఏకటానికి నరం కట్టిన వెదురుబద్ద; కంకబొంగు నేలమీద మోసే ఊద్దె కొయ్య.

**కంక**[2] వి. **1.** ఒకవైపు సూదిలాగాను, రెండోవైపు వెడల్పుగానూ, పలుగులున్న పనిముట్టు; **2.** కొండప్రాంతాల్లో కలుపుతీయడానికి ఉపయోగించే ఒకరకం పనిముట్టు.

**కంకటి**[1] రూ. కంగటి. వి. మంచం. శుక. 1.115.

పో.చూ. నం. *ఖట్వికా, ఖట్వా.* మంచం; పో.చూ. ప్రా. *ఖట్టా*; అమాగ. *ఖట్టంగ.* మంచంకోళ్ల మొదలైనవి; నే.కుమా.అ.బెం.బీ. *ఖాట్*; హిం. *ఖట్, ఖాట్.* మంచం; *ఖట్వా.* చిన్నమంచం; గు. మరా. *ఖాట్*; పం. *ఖాట్ట్*; ల. *ఖాట్*; సిం. *ఖటా*; ఉ. *ఖట్, ఖాట్, ఖట్వుల.* చిన్న మంచం.

క. *ఖట్వా, ఖట్వె.* మంచం.

కంకటిరజ్జు వి. మంచం అల్లేతాడు, నులక.

**కంకటి**[2] వి. **1.** ఆయుధ విశేషం; **2.** కత్తి.

**కంకటిలు** రూ.చూ. కంకటిల్లు. అ.క్రి. ఎక్కిళ్ళు వచ్చేట్లు ఏడ్చు, బెదురు.

**కంకటిల్లు** రూ. కంకటిలు. అ.క్రి. ఎక్కిళ్ళు వచ్చేట్లు ఏడ్చు, బెదురు.

**కంకణం** వి. స్తంభంచుట్టూ కట్టగావేసిన పలచని రేకుచుట్ట.

**కంకణము** పో.చూ. కంకణాయి. వి. **1.** జలపక్షి విశేషం, కంకణాయి. ఆము. 4.101, యయా. 2.24; **2.** రావులుగు. ఆం.భా. 2.91; **3.** ముత్యాలు, పగడాలు మొదలైనవి చేర్చికట్టే నరం.

నం. *కంక-.* నారాయణపక్షి; ప్రా. *కంక.* పక్షివిశేషం; పా. *కంక.* నారాయణపక్షి; అమా. *కంక.* పక్షివిశేషం.

క. *కంక.* నారాయణపక్షి; త. *కంకణమ్.* జలపక్షి విశేషం.

**కంకణాయి** పో.చూ. కంకణము. వి. **1.** జలపక్షి విశేషం; **2.** గట్టిగా కూతకూసే ఒక చిన్నపిట్ట; **3.** బిగ్గరగా స్ఫుటంగా మాట్లాడటం (అర్థవిపరి.).

**కంకర**[1] రూ. కంకరి. వి. **1.** ఇళ్ళు మొదలైనవాటికి ఉపయోగించే లేపనద్రవ్య విశేషం, రాసున్నం. ఆం.భా. 2.17; **2.** శిలావిశేషం; **3.** సన్న గులకనేల, మొరెపు రాళ్ళున్న నేల; విణ. పరుషం.

నం. *కర్కర-.* గట్టి, స్థైర్యం; ప్రా. *కక్కర.* రాయి, గులకరాయి; మహా.ప్రా. *కక్కర.* గట్టి, కరుకు; అమా. *కక్కర.* చిన్నరాయి, గులకరాయి; పా. *కక్కరతా.* గరుకుతనం; *కక్కరియ.* కరుకుతనం; నే. *కంకర్.* చిన్నరాయి; అ. *కంకర్*; బెం. *కాకర్, కాంకర*; హిం. *కంకర్, కాకర్.* చిన్నరాయి; సిం. *కకిరో*; ఒ. గు. *కంకర.* చిన్నచిన్న రాతిముక్కలు; మరా. *కయ్‌కర్*; ఉ. *కంకర్.* అనేకచోట్ల దొరికే సున్నపురాయి.

క. *కంకరె.* రాతిమొరుం, చిన్నరాయి; త. *కంకర్.* సున్నపురాయి.

<ప్రా. *కక్కర-.*

కంకరగాడిద చూ. కంచరగాడిద. వి. అశ్వతరం, కంచరగాడిద. సానంద. 2.80. కంకరతల వి. మూర్ఖుడు, అజ్ఞాని. కంకరనేల వి. మొరపురాళ్ళనేల. కంకరమొరం వి. సున్నపురాతిముక్కలు. కంకరరాయి వి. గట్టిరాయి.

**కంకర**[2] రూ. కంకెన, కంకెర. వి. **1.** గింజలు పట్టని ఎన్ను; **2.** గింజలు రాల్చిన కంకి, యెదిగిన కంకి.

**కంకరబేడ** వి. గూనపెంకును నునుపుచేయటానికి కుమ్మర్లువాడే పలచని కొయ్యముక్క.

**కంకరము** వి. **1.** నీళ్ళు కలిపిన మజ్జిగ; **2.** కుచ్చితం.

**కంకరి** రూ.చూ. కంకర.[1] వి. **1.** సున్నం మొదలయినవి; **2.** లేపన విశేషం.

**కంకరేటు** రూ.చూ. కాంక్రీటు. వి. సిమెంటు, సన్నగులక, ఇసక కలిపిన మిశ్రం.

**కంకాలము** వి. ఏబైమూడు అస్త్రాల్లో ఒకటి.

**కంకాళం** వి. పెద్ద ఆకారం.

నం. *కంకాళ-.* అస్థిపంజరం.

<నం. *కంకాళ-.* (అర్థవిపరి.).

**కంకి**[1] వి. **1.** వరిఎన్ను, జొన్నఎన్ను, కంకెర. రామలిం.శ. 15; **2.** గింజలు పట్టిన ఎన్ను. ఆం.భా. 2.236.

క. *కంకి, కంకు.* జొన్న, నజ్జ మొదలయినవాని ఎన్ను. పో.చూ. తు. *కొరలు.* ఎన్ను; పో.చూ. త. *కరుక్కాయ్.* పరిపక్వానికిరాని చిన్నపండు, పల్చటి ఎన్ను.

కంకికర్ర వి. దిమ్మెన దుక్కను పట్టిఉండే పొడుగాటి కొయ్య. వ్య. కంకివంటి కర్ర. కంకికాడ వి. జొన్నదంటు, సీయంచ. కంకిగుండు వి.గింజలు రాల్చటానికి కళ్ళంలో పడుగుమీద తోలించే రాతిగుండు. కంకిజల్లి వి. గొల్లకంకులు పోసుకునిపోవటానికి వెదురుబద్దల్తో అల్లిన పెద్ద జల్ల. కంకిదంతె వి. కళ్ళంలో, కంకులు నెరపటానికి ఉపయోగించే కొయ్య పనిముట్టు. కంకినోరు వి. వికారమైన ముఖం. వ్య. కంకివంటి నోరు. విశాలమైన నోరు అని ఫలితార్థం. కంకిపడు కంకులు నెరపిన కళ్ళం. కంకిపురుగు వి. జొన్నకుపట్టే ఒకవిధమైన తెగులు. కంకిపొఢక రూ. కంకిపొనక. వి. గొల్లకంకులు

పోసుకొనిపోవటానికి వెదురుబద్దల్తో అల్లిన జల్ల. **కంకిపొవక** రూ.చూ. కంకిపొంణక. **కంకిబొద్ది** వి. చిన్నకంకి. **కంకిమండె** కంకులతో వేసిన నలుచదరపు కుప్ప. **కంకివేయు** రూ. కంకెవేయు. అ.క్రి. పైర్లు పంటకారుకువచ్చు.

**కంకి**[2] పో.చూ. కంకి.[1] రూ. కంగి. వి. పొదగా పెరిగే కంచె మొక్క (pisonia aculeata, wiled).

**కంకిపుత్తడి** వి. ఓషధీ విశేషం. **కంకిపుత్రి** వి. ఓషధీ విశేషం. **కంకిబద్ద** రూ.చూ. కంకబద్ద. వి. సన్నగా, పొడుగ్గా వుండే ఒకరకం వెదురుమొక్క. **కంకిబొంగు** వి. కంకిపుత్రి, ఒకరకం కంచెమొక్క (pisonia aculeata).

**కంకితెచ్చు** స.క్రి. బలవంతంగా గుంజితెచ్చు.

**కంకివాయువురోగము** వి. ఒకవిధమైన జబ్బు.

**కంకినరు** చూ. కను[1].

**కంకు**[1] స.క్రి. గద్దించు, తిట్టు. వి. **1.** గద్దింపు, తిట్టు; **2.** నోట్లోపెట్టుకొని పళ్ళతో కొరికి తినటం; **3.** అయిష్టం.

పో.చూ. క. *కంగు*. కోపం.

పో.చూ. సం. కాంక్షా-. కోరు, ఆశించు, వేచియుండు; *కష*. పోటీ, స్పర్థ; ప్రా. *కంఖ్*. కోరు; అ.మా. *కంఖా*. కోరిక, సంపద కావాలనే కోర్కె, ఆత్యాశ; పా. *కంఖా*. శంక, అనిశ్చితం.

<ప్రా. కంఖ్ (అర్థవిపరి.).

**కంకుడు**[1] వి. గద్దింపు, తిట్టు. **కంకులుపెట్టు** స.క్రి. దూరు, నిందించు, తిట్టు.

**కంకు**[2] స.క్రి. ఎగరవేయు.

**కంకుడు**[2] వి. ఎగరవేయటం. **కంకుడుకాయ** వి. పిల్లలాడుకునే బంతివంటి గుండ్రని కాయ. చమ. 3.117.

**కంకుడు**[3] రూ.చూ. కుంకుడు. వి. నబ్బులాగ నురగనిచ్చే ఒకరకం కాయ, కుంకుడుకాయ (Sapindus trifoliatus).

**కంకెడు** రూ.చూ. కమికెడు. వి. పిడికెడు.

**కంకెన** రూ.చూ. కంకర[3]. వి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి, మొదిగిన కంకి.

**కంకెర** రూ.చూ. కంకర[2]. వి. **1.** కళ్ళంలో గింజలు రాల్చిన కంకి, పిప్పికంకి; **2.** జొన్న, సజ్జ మొఁవాని ఎన్ను.

**కంకెవేయు** రూ.చూ. కంకివేయు. అ.క్రి. పైర్లు పంటకారుకు వచ్చు.

**కంకేళి** రూ. కంగేలి, కంగేళి. వి. అశోకవృక్షం. యయా. 4.20.

సం. -*కంకేలి*-.అశోకవృక్షం; ప్రా. *కంకేలి*, *కంకెల్లి*, *కంకేల్ల*;. అ.మా. *కంకిల్లి*, *కంకెల్లి*; మరా. *కంకోల*; క. *కంకేల్లి*, *కంకలి*; త. *కాకోళి*.

<సం. కంకేలి-.

**కంకేళ్ళ** పో.చూ. కంకర[2]. వి. కళ్ళంలో గింజలు రాల్చిన కంకి, పిప్పికంకి.

**కంఖాణము** రూ.చూ. కంఖాణి. వి. **1.** గుర్రం. నిరంకు. 4.125; **2.** ఆఫ్ఘనిస్థాన్ సరిహద్దుదేశం, ఆ దేశంనుంచి వచ్చిన గుర్రం.

**కంఖాణి** రూ. కంఖాణము. వి. ఆఫ్ఘనిస్థానం పరిసర ప్రాంతాలనుంచి కొనితెచ్చిన మేలిరకం గుర్రం. వరాహ. 5.27.

**కంగ** రూ.చూ. కంక[1]. వి. సన్నగా, పొడుగ్గా, గట్టిగా వుండే ఒకరకం వెదురుమొక్క (Bambusa Stricta, Dendro Calamus Strictus).

**కంగటి** రూ.చూ. కంకటి[1]. వి. మంచం. పండి.చ. 3.521.

**కంగటికాలు** వి. మంచంకోడు. జైమినీ భా. 5.85. **కంగటికాళ్ళు** వి.బవ. గాడిదకాళ్ళులాగఉండే కాళ్ళు, వంకరకాళ్ళు, పంగటికాళ్ళు. **కంగటికాళ్ళవాఁడు** వి. ముట్టుమోకాళ్ళవాడు.

**కంగరు** రూ. కంగారు[3]. వి. ఒకరకం నిచ్చెన, నూలునిచ్చెన.

**కంగలు** చూ. కంగు[3]. వి.బ.వ. వేయించిన సెనగలు.

**కంగవ** వి. స్థానం, చోటు, నెలవు, కందువ.

**కంగాణము** వి. కళ్ళంలో కావలి (చిట్టివలన శాసనం, విశాఖ జిల్లా. క్రీ.శ. 1080).

త. *కంకాణమ్*. పొలాల్లో భూస్వామికి బదులుగా ఉంచిన కావలి; *కంకాణి*. పై విచారణచేయు; పొలాలను అజమాయిషీచేసే అధికారి; *కణ్*. కన్ను; *కాణ్*. చూచు.

<త. కంకాణమ్.

**కంగాణముచేయు** స.క్రి. ధాన్యాన్ని నూర్చు.

**కంగాణాలు** చూ. కంగాణము. వి.బ.వ. పంటకళ్ళంలోని కావలి మంచెలు.

**కంగాబింగా** రూ. కంగామింగా. క్రి.విణ. **1.** నలిగినలగనట్లుగా; **2.** తొందరగా (ధ్వన్యను.).

**కంగామింగా** రూ.చూ. కంగాబింగా. క్రి.విణ. **1.** నలిగినలగనట్లుగా; **2.** తొందరగా.

**కంగారి**[1] క్రి.విణ. చీదరగా వుండే.

**కంగారి**[2] రూ.చూ. కంగారూ. వి. ఒక జంతువు.

**కంగారి**[3] చూ. కంగారు[1]. వి. కలత, పోరు.

**కంగారు**[1] పో.చూ. కలఁగు. వి. **1.** కలత, కలవరం. భాగ. 9.583; **2.** మనఃక్షోభం. మొల్ల. రా. కిష్కిం. 24; **3.** యుద్ధం. ఆం.భా. 2.222.

నే. *ఖంగార్*. వినాశం; ఒ. *ఖంగార*. భయంకరం, తీవ్రం; మరా. *ఖంగార్*. నాశనం. శిథిలం; పార. *కంగర్*. మూర్ఖత్వం.

క. *కంగాలు*, *కంగారు*. కోపం, కలవరపాటు; *కంగు*. కోపం; తు. *కంగాలు*. కలవరపాటు.

<మరా. ఖంగార్.

**కంగారుపడు** అ.క్రి. తికమకపడు, తొందరపడు, గాబరాపడు.

**కంగారు**[2] రూ.చూ. కంగారూ. వి. ఆస్ట్రేలియాలో ఉండే ఒకరకం జంతువు.

**కంగారు**[3] రూ.చూ. కంగరు. వి. ఒకరకం నిచ్చెన.

**కంగారూ** రూ. కంగారి,[2] కంగారు[2]. వి. ఆస్ట్రేలియాలో నివసించే ఒకరకం జంతువు.

ఇం. *కంగారు* (Kangaroo). ఆస్ట్రేలియన్. కంగారూ, కంగారు.

<ఇం. Kangaroo.

**కంగాలు** పో.చూ. కంగాళి. వి. **1.** అసహ్యం, రొచ్చు;

**2.** చెడిపోయినది ; విశే. చెడిన, నీచమైన.

పో.చూ. క. *కంగాలి*. దైన్యం, దౌర్భాగ్యం.

**కంగాళము** రూ.చూ. గంగాళము. వి. వర్తులాకారంగా ఉన్న లోహపాత్ర.

**కంగాళి** రూ.చూ. కంగాళీ. వి. **1.** అల్లరి ; **2.** తతబాటు ; **3.** కల్తీ.

**కంగాళిచేయు** స.క్రి. కంగారుపెట్టు, లోతుపాతులు తెలిసికొను.

**కంగాళీ** రూ. కంగాళి. విశే. **1.** నీచమైన ; **2.** కలవరపడిన ; **3.** పాడైపోయిన ; **4.** దిక్కుమాలిన ; వి. **1.** సంకరం ; **2.** రోత ; **3.** అల్లరి.

బెం. *కంగాల్*. దారిద్ర్యం ; ఒ. *కాగాల్* ; హిం. *కంగాలీ* ; సిం. *కకాల* ; మరా. *కంగాల్* ; పార. *కంగాలహ్*.

క. *కంగాలి, కంగాళి*. యాచకుడు.

<మరా. *కంగాల్*.

**కంగాళీబత్తెము** వి. నీచమైన బత్తెం, పనికిమాలినబత్తెం. **కంగాళీమంచము** వి. అసహ్యంగాఉన్న పడక, దౌర్భాగ్యపు మంచం. **కంగాళీవాఁడు** వి. నీచమైన బుద్ధిగలవాడు.

**కంగి** రూ.చూ. కంకి². వి. పొదగా పెరిగే కంచెమొక్క (**Pisonia aculeata**).

**కంగించు** చూ. కంగు.³ స.క్రి. **1.** గుట్టు బయటకు లాగటానికి యత్నించు ; **2.** కదిలించు, ప్రోత్సహించు ; **3.** కోపింపచేయు.

**కంగివేత** పో.చూ. కంగి. వి. వెదురుబద్దల అల్లకం.

**కంగిస** వి. యుద్ధం. ఆం.భా. 2.222.

మ. *కజాణిప్పి*. తగాదా, పోట్లాట.

**కంగు¹** వి. **1.** జరీ మొదలైనవాటితో వంకరగా ఏర్పరచిన కన్ను. రం.రా. 1.75, విజయ. 2.157, ఉ.హరివ. 1.59; **2.** సరిహద్దు ; **3.** మడత.

త. *కంగు*. వరస, క్రమం, అంచు.

**కంగు²** రూ.చూ. క్రంగు. వి. మోగటంలో ధ్వనికి అనుకరణం.

త. *కణీర్*. ఇత్తడి, కంచు మొదలైన లోహవస్తువులు ఒకదానికొకటి తగలటంవల్ల కలిగే ధ్వనికి అనుకరణం.

**కంగుకంగు** వి. మోగడంలో ధ్వనికి అనుకరణం. **కంగున** క్రి.విశే. ద్రు. **1.** పెద్దగా, స్వచ్ఛంగా ; **2.** ప్రతిధ్వనిలా. **కంగుమను** అ.క్రి. గంటవలె మోగు, ప్రతిధ్వనించు.

**కంగు³** అ.క్రి. **1.** కష్టమగు. రాజ.చ. 3.79 ; **2.** చలించు, కదలు.

పో.చూ. క. *కఱంగు*. నల్లబడు ; *కంగు*. కోపం ; తు. *కరెంచుని, కరంటుని*. నలుపుచేయబడిన ; *కరంకు*, కములు ; త. *కరుకు*. కమిలిపోవు ; *కరుక్కు*. మండు, కములు ; మ. *కజిక్క*. మాడు.

**కంగు⁴** వి. బిడ్డలకుపోసే చనుబాలాముదం, ఉగ్గు.

**కంగు⁵** వి. **1.** సరిహద్దు ; **2.** మడత ; **3.** పక్షం ; **4.** ఉప్పు బట్టీలోని గీతపై పిల్లవాడు నిల్చొని ఇటూఅటూ దాటిపోకుండా కాయడం.

**కంగురాయి** పో.చూ. కంగు¹. వి. తులసికోటపై అంచున అందానికి కట్టిన ఆకువంటి నిర్మాణం.

**కంగులు** వి.బవ. కొర్రలు.

**కంగేలి** రూ.చూ. కంకేళి. వి. అశోకవృక్షం.

**కంగేళి** రూ.చూ. కంకేళి. వి. అశోకవృక్షం. యయా. 4.20.

**కంగొత్తినబావ** వి. పానదానికివాడే మట్టిపాత్ర.

**కంగొవబాఱు** అ.క్రి. అలుముకొను, విస్తరిల్లు.

**కంగోరా** వి. వజానేతకోసం అమర్చిన దొడ్డిలో కన్నాల బల్ల నుంచి కుచ్చుతాళ్ళకిందికి గుంజి తగిలించటానికి గాళ్ళు చేసిన చెక్క.

**కంగోర(లు)** వి. పూలమొక్కలు పెంచడానికివాడే చిన్నతొట్టి.

**కంగోరి** వి. ఆర్చి, డోము, ఇటుకలతో కట్టిన విలువంపుగా ఉండే సరంబి.

హిం. *కంగూర*. శిఖరం, బురుజుపైగోడ ; మరా. *కంగోరా* ; గు. *కంగూర* ; పార. *కంగూరా*.

క. *కంగోరె*. ఆర్చి, డోము (నగిషీ చెక్కిన).

<మరా. కంగోరా.

**కంగోరు** వి. **1.** నిడుపుకాసె ; **2.** చెరగునేతలో డిజైను వెయ్యటానికి పొడుగ్గా దూర్చిన రంగుదారం.

క. *కంగోరె*. నగిషీలు చెక్కబడిన మడుగు, నొక్కులు పడిన గీత, నొక్కులు నొక్కులు పడ్డ గీతలు.

**కంగోరుపావడ** వి. పొడుగు కొవలుంచి కుట్టిన గాగర. ఆం.భా. 2.158.

**కంగోర్మరాయి** వి. అంచులు ఒత్తిఉన్న కూజా.

**కచ** రూ.చూ. కచ్చ¹. వి. **1.** దట్టి, కాసె ; **2.** గోచి, గుహ్యాంబరం ; **3.** వెనుకకు దోపుకునే దోవతి కొంగు ; **4.** ఆరుగురి.

**కచరించు** స.క్రి. కచ్చపోసి బట్టకట్టు. సాంబో. 5.8.

**కచటం** రూ.చూ. కచ్చడము¹. వి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి.

**కచడా** రూ.చూ. కచ్చడము¹. వి. బండిమీది గూడు, నవారి.

**కచరం** రూ.చూ. కచ్చరము¹. వి. పైనగూడుఉన్న ప్రయాణపు బండి.

**కచలం** రూ.చూ. కచ్చరము¹. వి. పైనగూడుఉన్న ప్రయాణపు బండి.

**కచిక** రూ.చూ. కచ్చిక. వి. **1.** కాలిన పిడక చూర్ణం ; **2.** బాగా కాలి చల్లారిన పిడకముక్క.

**కచిక్కు** వి. పొడిచేటప్పుడు కలిగే ధ్వనికి అనుకరణం. విష్ణు. పు. ఉ. 4. ఆ.

క. *కచక్, కచిక్, కచుంక్*. బురదలో రాయి పడటంవల్ల కల్గిన శబ్దం ; తు. *కచకచ*. జిగట ద్రవాన్ని గిలకరించేటప్పుడు వచ్చే ధ్వని ; త. *కచక్క*. బురదలో రాయి పడటంవల్ల కల్గిన శబ్దం. పో.చూ. కోట. కొచక్న్. అకస్మాత్తుగా.

**కచిగడ్డి** వి. ఒకవిధమైన నూనెను తయారుచేయడానికి ఉపయోగించే సుగంధభరితమైన గడ్డి (cymbopogon colaratus).

**కచివివి** మందారపు చెట్టు (Bauhina variegata).

హి. కచనర్ : ఉ. బౌరర ; త. సెగపుము బోరి.

**కచిహరి** రూ. కచేహరి. వి. కార్యాలయం.
హిం., ఉ. కచ్‌హరీ.
< ఉ. కచ్‌హరీ.

**కశేరి** రూ.చూ. కచేరీ. వి. కార్యాలయం.

**కచేరీ** రూ. కచేరి, కచ్చిరి, కచ్చీరి, కచ్చేరి, కచ్చేరీ, కసేరీ. వి. **1.** ప్రభుత్వ కార్యాలయం ; **2.** న్యాయస్థానం ; **3.** భోగమాట ; **4.** నదనం ; **5.** ఇష్టాగోష్ఠి ; **6.** కొలువు కూటం ; **7.** గానసభ.
సం. కృత్యాగార- ; ప్రా. కచ్చా అర- ; బెం. కాచారీ; హిం., ఉ. కచ్‌హరీ. చావడి, కార్యాలయం ; మరా. కచేరీ. కార్యాలయం, న్యాయాలయం ; సింహ. కచరీ ; పార. కచేరీ.
క. కచేరి. కచ్చేరి. సభామందిరం, చావడి, న్యాయాలయం, కార్యాలయం ; త. కచ్చేరి. కార్యాలయం, న్యాయాలయం మొ.
< మరా. కచేరీ.

**కచేహరి** రూ.చూ. కచిహరి. వి. కార్యాలయం.

**కచోరము** వి. కచ్చూరం, గంధకచోరం (Curcuma zedoo-ria).
సం. కచోర, కర్చూర ; ప్రా. కచ్చూర. ఔషధమూలిక ; నే. కచ్చూర ; హిం. కచూర్ ; పం. కచూర్ ; మరా. కచోరా, కచోల ; పార. కచూర్ ; ఉ. కచూర్.
క. కచోర, కచ్చూర.
< మరా. కచోరా.

**కచ్చ**[1] రూ. కచ. వి. **1.** దట్టి, కాసె. భార.విరా. 2.17 ; **2.** గోచీ, గుహ్యాంబరం. హరి.పూ. 7.13 ; **3.** ఉపస్థేంద్రియం. ఆం.భా. 2.136 ; **4.** వెనుకకు దోపుకొనే దోవతి కొంగు.
క. కచ్చె. గోచి, గుహ్యాంబరం, కౌపీనం, వెనుకకు దోపుకునే ధోవతి కొంగు ; కొడ. కచ్చె ; తు. కచ్చ, కచ్చె. గోచి, గుహ్యాంబరం ; త. కచ్చై. మొలతాడు, దట్టి, కాసె ; కచ్చుమై. గోచి ; కచ్చు. దట్టి, కాసె ; మ. కచ్చ. గోచి, దట్టి, కాసె ; కోట. కచ్వ్ ; తొద. కొంచ్.
సం. కక్షా. దోవతికొంగు, మొలగుడ్డ ; పా. కచ్చా. మొలగుడ్డ ; అమాగ. కచ్చ. మొలగుడ్డ ; ప్రా. కచ్చ - కచ్చా. మొలగుడ్డ.
< ప్రా. కచ్చ-.
కచ్చకాఁడు వి. కౌపీనవంతుడు, ముని. కువలచ. 5.40. కచ్చఁగట్టు[1] అ.క్రి. కాసె బిగించు. కచ్చపోయు అ.క్రి. గోచీపెట్టు. కచ్చబిగించు **1.** అ.క్రి. పోరుకు సిద్ధమగు ; **2.** గోచిపెట్టు. క్రీడా. ప. 92. కచ్చమొదలు వి. యోని మూలం. కచ్చల్లోకందులుపేయించు అ.క్రి. అతికామియగు ; స.క్రి. తొందరపెట్టు. కచ్చించు[3] అ.క్రి. **1.** కచ్చకట్టుకొను, కచ్చ బిగించుకొను. బసవ. 6.579 ; **2.** సన్నద్ధమగు. హరి.పూ. 9.95.

**కచ్చ**[2] రూ.చూ. కచ్చా. విశ. నాటు, మొరటు.

**కచ్చ**[3] రూ.చూ. కచ్చె[1]. వి. కక్ష, పగ.
కచ్చఁగట్టు[2] అ.క్రి. పగపట్టు. కచ్చపోతు రూ.కచ్చపోతు. వి. **1.** పగసాధించేవాడు ; **2.** కుళ్లుబోతు. కచ్చలుగిల్లేవాడు వి. విరోధాలు కల్పించేవ్యక్తి.

**కచ్చకాయ(రంగు)** రూ.చూ. గచ్చకాయ (రంగు) వి. గచ్చకాయ రంగు, సిమెంటు రంగు.

**కచ్చడ** రూ.చూ. కచ్చడము. వి. పైన గూడుఉన్న ప్రయాణపు బండి.

**కచ్చడపుబండి** చూ. కచ్చడము[1].

**కచ్చడము**[1] రూ. కచటం, కచడా, కచరం, కచలం, కచ్చడ, కచ్చరం, కచ్చలం. వి. **1.** దూది మొ. వాటిని తెచ్చేబండి ; **2.** సవారీ బండి.
సం. శకట-. బండి ; మరా. ఛకడా. బండి.
క. శకటు, చక్కడి. బండి.
< సం. శకట- వర్ణవ్యత్యయం.
కచ్చడపుబండి వి. పెద్ద బండి, గూడుబండి.

**కచ్చడము**[2] చూ. కచ్చ[1]. రూ. కచ్చరము. వి. **1.** కౌపీనం, గోచి. విక్ర. 2 92, మను. 2.73 ; **2.** వేశ్యలు ధరించే చీర.
సం. కచ్ఛటికా ; ప్రా. ఖచ్చట్టీ. ఖచ్చోటీ. కౌపీనం ; క. కచ్చటు, కచ్చుటు, కంచడి. (< కక్షావట) గోచి, కౌపీనం ; త. కచ్చట్టమ్ . కుచ్చిళ్లు, మడతలు.
< ప్రా. ఖచ్చట్టీ.

**కచ్చడము**[3] వి. **1.** సొగటాలు నడపడం ; **2.** నెచ్చెలులు ఆడుకొనే జూదం.

**కచ్చడి(కాయ)** రూ.చూ. కిచ్చిలి. వి. ఒక రకం నారింజ.
పో.చూ. క. కంచి. ఒక రకం పుల్లనారింజ.

**కచ్చరం** రూ.చూ. కచ్చడము. వి. గూడుబండి.

**కచ్చరము** రూ.చూ. కచ్చడము[2]. వి. గోచి, గుహ్యాంబరం. పార్వ. 6.97.

**కచ్చల్లు** చూ. కంచరి. వి. కంచరిపని చేసేవాళ్లు. కోటితీర్థం శాసనం నెల్లూరు జిల్లా క్రీ.శ. 1000.

**కచ్చలం** రూ.చూ. కచ్చడము[1]. వి. గూడుబండి.

**కచ్చలవ** రూ.చూ. కచ్చునలవ.

**కచ్చశుద్ధి** వి. బ్రహ్మచర్యం, వ్యభిచార రాహిత్యం.

**కచ్చనలవ** రూ.చూ. కచ్చునలవ.

**కచ్చా** రూ. కచ్చ[2]. విశ. **1.** పండని, పచ్చి ; **2.** కుదరని ; **3.** నీచమైన, అల్పమైన ; **4.** తక్కువ.
కా. కొంచ్. పచ్చి, పండని ; కు. కాచొ ; నే. కచ్చా, కచ్చూ. అనుభవంలేని, బాధ్యతలేని ; కాఁచొ, కాచొ. ఉడకని, పచ్చి ; బెం. కాఁచా. పండని ; ఒ. కాచా ; హిం. కాఁచొ, కచ్చా. పచ్చి, పండని ; పం.ల. కచ్చా ; సిం. కచొ ; గు. కాఁచు ; మరా. కచ్చా. పండని, ఉడకని, పచ్చి ; ఉ. కచ్చా. పచ్చి, పండని, పక్వానికి రాని.
క. కచ్చ, కచ్చా. పండని, పచ్చి. ఉడికించని, పచ్చి, మొరటు ; మ. కచ్చి. చెత్తా చెదారం.
< మరా. కచ్చా.
కచ్చావచ్చా రూ. కచ్చాబచ్చ. వి. తెగతెంపులు. విశ.

నలిగీ నలగని. కచ్చాబచ్చ రూ.చూ. కచ్చావచ్చా. విశ. నలిగీనలగని. కచ్చామనిషి వి. నీచుడు, తుచ్ఛుడు. కచ్చామాట వి. నిరర్థక భాషణం, అర్థంలేని మాట. కచ్చారంగు వి. 1. పనికిరాని రంగు ; 2. పచ్చిరంగు ; 3. ద్రావకం అద్దే వెయ్యకుండా తయారుచేసిన రంగు ; 4. ఉప్పువేసిన వేడినీళ్లలో కలిపి నూలుకు అద్దేరంగు. కచ్చావసూలు వి. వసూలు చెయ్యవలసిన మొత్తం తేలకముందు సుమారుగా చేసే వసూలు, చేసిన వసూళ్లకు లెక్క చెప్పించటం. త. కచ్చావసూల్. అక్రమంగా వినియోగించిన మొత్తాన్ని వసూలు చేయటం. కచ్చాసేరు వి. తక్కువ కొలతగల సేరు.

**కచ్చి**[1] వి. 1. సాలెవాడు లాకకొయ్యలను పడుగులో దూర్పించే వందు ; 2. పడుగులో కింది పోగులూ పై పోగులూ × ఆకారంలో కలిసే చోటు ; 3. అనికి రెండువైపులా తొడిగిన లాకల నడుమ ఉండే పడుగుభాగం ; 4. పడుగులో రెండు అనుల మధ్యభాగం ; 5. నేతలో రెండు పేక పోగులమధ్య వచ్చిన వెలితి ; 6. నేసిన రెండు బట్టల నడుమ, బెత్తెడుమేర పేకదారం వెయ్యకుండా వదిలిన పడుగు పోగులు ; 7. సాలెవాడు.

పో.చూ. క. కచ్చిజ. రెండింటిని కలుపు, కలుపు.

కచ్చికట్టు స.క్రి. 1. అనుపోసిన పడుగులో ఆనులకు దారంతో కట్లు కట్టు ; 2. సరిచేసిన తరువాత పడుగులో అనిపోగులు కూర్చి దారంతో కట్టు. కచ్చికొట్టు స.క్రి. విత్తులు (వట్టలు) కొట్టు ; విశ. విత్తులు కొట్టిన. కచ్చికొయ్య వి. ఆనుపోసేటప్పుడు పడుగులో ఆనులు పడటానికి కచ్చిపేటకు బిగించిన పుల్ల. కచ్చికోయు స.క్రి. అచ్చులో బద్దె పోగులు వరసగా కోయు. కచ్చిచివర వి. నేతపడుగులో అనివెంబడి దూర్చిన సన్న బెత్తం. కచ్చితాడు వి. పడుగులో అనిపోగులు కలిపి కట్టిన తాడు. కచ్చిపట్టె వి. ఆనుపేటల్లో మధ్యది. కచ్చిపడు అ.క్రి. నేత పల్చగా వచ్చు. కచ్చిపేట వి. కచ్చిపట్టె, అనుపేటల్లో మధ్యది. కచ్చిపెట్టు స.క్రి. నేతలో వేలెడు వెడల్పున పేకదారం నెయ్యకుండా పడుగులో వదలివేయు. కచ్చిబద్ద వి. 1. ఆనుకట్టుబడిలో అనికొయ్యల దగ్గర బిగించిన కింది వరవ కొయ్య ; 2. పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద. కచ్చిబద్దె వి. అచ్చుతుక్కోటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జానెడు పొడుగు దారాలు వదలిన గుడ్డ. కచ్చిబల్ల వి. కచ్చిపేట, అనుపేటల్లో మధ్యది. కచ్చిలాక వి. పడుగులో అనివెంబడి దూర్చిన వెదురుబద్ద.

**కచ్చి**[2] వి. కచ్చిదేశపు గుర్రం. ఆం.భా. 2.196.

సం. కచ్ఛ-. కచ్చిదేశం ; ప్రా. కచ్ఛ-. పా. కచ్ఛ. మాగాణిభూమి ; అమా. కచ్ఛ. అన్ని వైపులా నీరున్న ప్రదేశం ; హిం. కచ్ఛి. ఒక దేశం పేరు, కచ్చిదేశపు గుర్రం.

క. కచ్ఛ. ఒక దేశం పేరు.

<నం. కచ్ఛ-.

**కచ్చి**[3] రూ.చూ. కచ్చె[1]. విశ. పోట్లాడే స్వభావంకల.

కచ్చిపోతు రూ.చూ. కచ్చపోతు. వి. 1. పగసాధించే వాడు ; 2. పుణ్ణబోతు.

కచ్చి[4] వి. తీగలతో ఉన్న వాద్యవిశేషానికున్న రంధ్రం.

కచ్చిక రూ. కచిక. వి. 1. కాలిన పిడక. ఆం.భా. 2.242 ; 2. కాలిన పిడక చూర్ణం.

కచ్చిగడ్డి వి. ఒకరకం గడ్డి. దీనినుండి ఒకరకం నూనెనుకూడా తయారుచేస్తారు (Cymbopongon Martini, Andropogon Schoenanthus).

క. కసిహుల్లు, కుంతిహుల్లు ; పో. చూ. త. క. ఎత్తన్‌పిల్లు, కన్నయ్‌పిల్లు.

కచ్చించు[1] చూ. కచ్చు[1].

కచ్చించు[2] చూ. కచ్చు[2].

కచ్చించు[3] చూ. కచ్చు[1].

కచ్చించు[4] స.క్రి. సరిపెట్టు, ఇంటిగోడ మొ.వాని కొలతలను నిశ్చయించు.

కచ్చించుకొను చూ. కచ్చు[2].

కచ్చితము విశ. హెచ్చుతగ్గులు లేకుండా సరిగాఉన్న, నిర్దిష్టమైన.

సం. ఖచిత-. చెక్కబడిన, చిత్రించబడిన ; ప్రా. ఖైఅ, ఖచిఅ ; అమా. ఖచియ ; పా. ఖచిత-, రత్నాలు మొ.వానితో పొదగబడిన ; హిం. ఖచిత్. రాసిన.

పో.చూ. క. ఖచిత. అతికించిన, పొదిగిన, కలిపిన, దృఢం, కచ్చితం ; త. కచ్చితమ్. కచ్చితం, సరి, పరిశుభ్రం.

<నం. ఖచిత-.

కచ్చింపు[1] చూ. కచ్చు[1].

**కచ్చింపు**[2] చూ. కచ్చితము. విశ. ఎచ్చుతగ్గులు లేకుండ ఉండే, నిక్కచ్చి, బొటాబొటి. వి. 1. సరైన ఏర్పాటు, నిర్ణయం ; 2. కట్టడానికి కొలతలు నిర్ణయించటం, చదరంగంలో ఒక ఎత్తు వెయ్యడం.

కచ్చియ[1] రూ చూ. కచ్చె[1]. కలహం.

కచ్చియ[2] రూ. కచ్చె[2]. వి. ఒకరకం బట్టమడత.

క. కచ్చుటు, కచ్చడి. గోచి, గుహ్యాంబరం.

కచ్చిరి రూ.చూ. కచేరీ. వి. కార్యాలయం.

కచ్చిలములు పో.చూ. కచ్చడము. వి. వస్త్రవిశేషం. సిం. ద్వా. 3.188.

కచ్చీరి రూ.చూ. కచేరీ. వి. కార్యాలయం.

కచ్చు[1] స.క్రి. గవ్వలాట మొదలైన ఆటల్లో కాయల్ని నడుపు.

పో.చూ. క. కచ్చు. కరచు, కుట్టు, నొప్పించు ; త. కచ్చు (కచ్చి-). కరచు, కొరుకు.

పో.చూ. సం. కశా. ప్రతిభటత్వం.

<ప్రా. కచ్చా.

కచ్చించు[1] స.క్రి. గవ్వలాట మొదలైన ఆటల్లో కాయల్ని నడుపు. హరి.పూ. 9. కచ్చింపు[1] వి. చదరంగపుఎత్తు.

కచ్చు[2] వి. 1. గర్వం, బింకం, కాశీ. 1.122 ; 2. దాబు. ప్రబంధ. 78.

పో.చూ. త. కెచ్చు. గర్వం- ; పో.చూ. త. కరుక్కన్. గర్వి, వైరివాడు ; పో.చూ. మ. కెఋవు. గర్వం.

కచ్చించు[2] అ.క్రి. గర్వించు. కచ్చించుకొను అ.క్రి. గర్వించు. పండి.చ. 5.484. కచ్చుకొను స.క్రి. 1. పట్టుపట్టు, పంతంపట్టు. ఆం.భా. 3.129, చంద్రాంగ. 3.27; 2. డీకొను. చమ. 1.30; 3. ఆశించు. రసిక. 5.159. కచ్చుం దవము వి. ఔద్ధత్యం, గర్వం. సమీర. 6.141. కచ్చులాడి వి. దాంభికురాలు. కచ్చులు వి. బ.వ. కాంతులు, మెరుపులు. కచ్చువెట్టు స.క్రి. 1. ఎదిరించు, డీకొను. భార.శల్య. 2.125, ప్రతిఘటించు; 2. పగపట్టు < కచ్చు[2] + పెట్టు.

కచ్చు[3] వి. 1. సిగబంతి, పూబంతి. కాశీ. 3.238; 2. రేకు, దళం. వసు. 4.133.

సం. కక్షా. చుట్టుగోడ, ప్రహరి, కైవారం, చుట్టుకొలత; ప్రా. కచ్ఛా. శ్రేణి, పంక్తి, వరస.

కచ్చు[4] వి. అపేక్ష, కోరిక. పాండు. 2.11.

సం. కాంక్షా; ప్రా. కచ్ఛ, కచ్ఛి. అభిలాష, హర్షం. <ప్రా. కచ్ఛు.

కచ్చుకొను స.క్రి. ఆశించు, వాంఛించు. రసిక. 5.159.

కచ్చు[5] వి. 1. కీటు, మట్టిగోడ కట్టడంలో తడవకు మూరె డెత్తున నిర్మించే గోడభాగం; 2. చుట్టు గుడిసెల కప్పుకింద చట్రానికి పోతు, పెంటి వాసాలను తగిలించేపద్ధతి; 3. మూలవానం; 4. చెక్కడప్పనిలో ఉబ్బెత్తుగా ఉండేభాగం; 5. వాసాల చివర చెక్కిన భాగం; 6. ఇటికకు అతుక్కున్న మట్టి పెళను; 7. దనలిదారం వడికే పూన్పు కొమ్ముకొన; 8. అనికి రెండువైపులా తొడిగిన లాకల నడుమ ఉండే పడుగుభాగం.

పో.చూ. క. కచ్చు. కలుపు, ముక్క, తునక.

హిం. కచ్ఛా. వానం.

కచ్చుగీటు వి. మట్టిగోడ నిర్మాణంలోని దళలను గుర్తించే గీత. కచ్చుగుంజ వి. ఉన్ని పడుగు తోడేటప్పుడు అనిపడే గుంజ. కచ్చులమొద్దు వి. కచ్చిపీట, ఆనుపీటల్లో మధ్యది. కచ్చువానము వి. 1. ఇళ్ళకువేసే పెద్దవానం; 2. దూలంలో చొప్పించిన వానం. కచ్చువిచ్చు అ.క్రి. పురివీడి పోవు. రుక్మాం. 2.48.

కచ్చుకడా రూ. కచ్చుగడా. వి. తాబేటిపెంకు, దీన్ని ఖడ్గమని కూడా అంటారు.

హిం. కచ్ఛూ, కఛుఅ-. తాబేటిపెంకు; గు. కచ్ఛ కడుమ్. తాబేటిపెంకు.

కచ్చుగడా రూ.చూ. కచ్చుకడా. వి. తాబేటిపెంకు.

కచ్చుగుంజ చూ. కచ్చి[5].

కచ్చుపెట్టుకలుగు అ.క్రి. బాధ, గాయం, ప్రమాదం మొ. కలుగు. తాళ్ల. సం. 6.176.

కచ్చులసలప రూ.చూ. కచ్చుసలప.

కచ్చువేయు రూ. కచ్చెంవేయు. స.క్రి. ఒరల తయారీలో అడుగు బిళ్ళమీద చుట్టూ మట్టితాలికలు అంచెలుఅంచెలుగా వేళ్ళతో పైకిపెట్టు.

కచ్చుసలప రూ. కచ్చలప, కచ్చసలప, కచ్చులసలప. వి. గాబులు, గోతేలు మొ. వాటిని సర్దేటప్పుడు పూజ వేయ డానికి వాడే సలప.

కచ్చె[1] రూ. కచ్చ[3], కచ్చి[3], కచ్చియ[1]. వి. 1. కలహం. పార్వ. 2.128; 2. విప్రలాపం, విరోధోక్తి. ఆం.భా. 1.116.

క. కజ, కచ్ఛ, కచ్చె. వాదాన్ని వ్యతిరేకించటం, లేక తిరస్కరించటం. పో.చూ. గజఅ్, గజఉ. పెద్దగా శబ్దాన్ని కలిగించు, గద్దించు, విరోధోక్తి. కసరు. వెట కారం; మ. కయర్ క్క. కోపంతో ప్రారంభించు, కలహ మాడు, శిక్షించు.

సం. కక్షా. పోటీ, స్పర్ధ; ప్రా. కచ్ఛ-. విరోధం, కలహం. ద్రావిడ పదమని కొందరు.

కచ్చెకుకాలుత్రవ్వు అ.క్రి. కయ్యానికి కాలుదువ్వు. కచ్చెపోతు వి. కలహశీలుడు.

కచ్చె[2] చూ. కచ్చియ[2]. వి. 1. ఒకవిధమైన బట్టమడత. ఆం.భా. 2.153; 2. కచ్ఛభేదం, కచ్చియ.

కచ్చె[3] చూ. కచ్చి[1]. వి. అనికి రెండువైపులా తొడిగిన లాకలనడుమ ఉండే పడుగుభాగం.

కచ్చెకట్టు వి. పడుగులో అనిపోగులు చెదిరిపోకుండా దారంతోవేసిన కట్టు. కచ్చెకుంచె వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరే పదునులో ఉండగా కచ్చికీ కచ్చికీ ఆవుతూ, కచ్చులమధ్య భాగాన్ని దువ్వే కుంచె. కచ్చెకుట్టు స.క్రి. పడుగులో అనివెంబడి లాక దూర్చు. కచ్చెపట్టి వి. మరాను కట్టుబడిలో పడుగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్క.

కచ్చెయిటిక చూ. కచ్చా. వి. కాలీకాలని ఇటిక.

కచ్చెర వి. పూరిపాక కప్పునుండి రాలే దుమ్ము మొ.

క. కచ్చడ, కచ్చర. మురికి, దుమ్ము, అసహ్యమైన, పనికిమాలిన; మ. కచ్చి. గడ్డిపరక, కసవు, వలరికి.

సం. కచ్చర-. మురికి, చెడ్డ. పో.చూ. ప్రా. కచ్చవార. కసవు; హిం. క్చరా. తునకలు, ముక్కలు.

కచ్చే వి. తమలపాకుల కట్ట, పిడి.

కచ్చేరి రూ.చూ. కచేరీ. వి. 1. ప్రభుత్వ కార్యాలయం; 2. న్యాయస్థానం; 3. కొలువుకూటం; 4. పెండ్లి మొ. సంద ర్భాల్లో చాలామంది కూడిన చోటు, వేశ్యలు మొ. వారు జరిపే గానసభ మొ. జరిగే నృత్యగానాది సభ.

కచ్చేరీ రూ.చూ. కచేరీ. వి. కార్యాలయం.

కచ్రబూరుగొర్రె వి. ఒకరకం గొర్రె.

కజానా రూ.చూ. ఖజానా. వి. ధనాగారం, బొక్కసం.

కజాయము రూ.చూ. కజ్జము[1]. వి. ఒకరకం తీపి పిండివంట, భక్ష్యవిశేషం. పాండు. 4.276.

కజాయి రూ.చూ. కసాయి. వి. కటికవాడు.

కజూరము రూ.చూ. కజ్జూరము. వి. ఖజ్జూరపుచెట్టు, ఖర్జూ రపు పండు, పేరీదు.

కజ్జ[1] రూ.చూ. కజ్జము[1]. వి. అపూపం. భక్ష్యవిశేషం. కకుత్థ్స. 3.104.

కజ్జావసస వి. మేలురకం పసస.

కజ్జ[2] రూ.చూ. ఖజ్జా. వి. తగాదా.

కజ్జము[1] రూ. కజాయము, కజ్జ[1], కజ్జాయము, కజ్జియము, కజ్జెము, ఖజ్జము. వి. ఖాద్యం, భక్ష్యం, భక్ష్యవిశేషం, అపూపం. భార. ఉద్యో. 3.170.

నం. ఖాద్య- తినుబండారం, ఆహారం; ప్రా. ఖజ్జ- ఖజ్జయ; అ.మా. ఖజ్జ-, ఖజ్జగ-; పా. ఖజ్జ-. (విణ) తినేది, ఖజ్జక. (విణ) తినేది, ఖజ్జతి. తిను; నే. ఖాజా. ఒక విధమైన తీపి పిండివంట; ఒ. ఖాజా, ఖజాఅ, ఖజాలా; మరా. ఖాజా. తీపి పదార్థాలు; హిం. గు. ఖాజా. తిను బండారం. పో.చూ. ఉ. కజీమ్. గుర్రాలకుపెట్టే దాణా; కాజా. ఒకరకం తీపి పిండివంట.

పో.చూ. క. కజ్జి, కజ్జాయ. ఒక విధమైన తీపి పిండి వంట; తు. కజ్జాయ.

< ప్రా. ఖజ్జ-.

**కజ్జము**[2] రూ. కర్జము. వి. కార్యం, పని. బసవ. 6.636.

నం. కార్య- పని, వ్యాపారం, ఉద్దేశం; ప్రా. కజ్జ- కర్తవ్యం, క్రియ; కచ్చం. కార్యం; అప. అ.మా. శౌ. కజ్జం; పై. కచ్చం. వ్యాపారం, వ్యవహారం; పా. కారియ- చేయబడు: హిం. మరా. కాజ్. పని.

క. కజ్జ. కార్యం, పని.

< ప్రా. కజ్జ-.

**కజ్జా** రూ. కజ్జ[2], కజ్యా, ఖజ్యా. వి. జగడం, పోరు, కలహం. ప్రా. కజ్జాసణా; పో.చూ. హిం. కజ్జాక్. దొంగ తనం; పం. కజ్జియ. కలహం; మరా. కజ్జా. కలహం, పోరు; కజీయహ్. తగాదా; అర. కఝియా. ప్రతిజ్ఞ.

పో.చూ. క. కచ్చు. పోట్లాడు, కోత, గంటు.

< మరా. కజ్జా.

**కజ్జాకోరు** వి. పేచీకోరు, జగడమాడే స్వభావం కలవాడు.
**కజ్జాయింపు** రూ. కంజాయింపు.[1] వి. జగడం, పోట్లాట.
**కజ్జాలకోరు.** వి. పేచీకోరు.

**కజ్జావవన** చూ. కజ్జ[1].

**కజ్జాయము** రూ.చూ. కజ్జము.[1] వి. అరిసె, కజ్జం. రాజ.వి. 2.105, ఆం.భా. 2.254, పాండు. 4.176.

**కజ్జాయాలు** వి.బ.వ. నిప్పట్లు.

**కజ్జికాయ** రూ. కజ్జెకాయ, కజ్జెముకాయ, గజ్జెకాయ. చూ. కజ్జము.[1] వి. ఒకరకం తీపి పిండివంట.

**కజ్జిపుకుండలు** వి. కుమ్మరి కరణాలకు ఇచ్చే మట్టిపాత్రలు.

**కజ్జియము** రూ.చూ. కజ్జము[1]. వి. అరిసెలు, ఒక రకం తీపి పిండివంట.

**కజ్జురము** రూ.చూ. కజ్జూరము. వి. ఖర్జూరం. ఆం.భా. 2.79.

**కజ్జూరము** రూ. కజూరము, కజ్జురము, గజ్జురము. వి. ఒకానొక ఫలవృక్షం, ఖర్జూరం. యయా. 5.48.

నం. ఖర్జూర. ఒకానొక ఫలవృక్షం, ఖర్జూర; ప్రా. ఖజ్జూర; అ.మా. ఖజ్జూర; నే. అ. బెం. ఒ. హిం. ల.గు. ఖజూర్, సిం. ఖజూరీ; మ. ఖజూర; ఉ. ఖజూర్. తియ్యని పదార్థం.

క. కజూర, కజ్జూర, కర్జూర. ఖర్జూరపుపండు; తు. గజ్జిరదపరుండు; త. కచ్చూరమ్; మాల్తో. కఝి.

< పా. ఖజ్జూర. (phoenix paludosa & phoenix dactyliferad).

**కజ్జెకాయ** రూ.చూ. కజ్జికాయ. చూ. కజ్జము.[1] వి. భక్ష్య విశేషం. రామా. 2.115.

**కజ్జెము** రూ.చూ. కజ్జము.[1] వి. కజ్జం. పండిచ. 5.353.

**కజ్జెముకాయ** రూ.చూ. కజ్జికాయ.

**కజ్యా** రూ.చూ. కజ్జా. వి. జగడం, పోరు.

**కంచ** పో.చూ. కంచము. రూ. కంచా. వి. పెనం.

**కంచం** రూ.చూ. కంచము. వి. 1. భోజనపాత్ర; 2. మూరెడెత్తులో రెండు మూరల వ్యాసంతో కింది భాగంలో అడుగు పెట్టి ఒరకు అతికించే మట్టివలయం.

**కంచంకుడక** వి. అన్నం తినడానికి ఉపయోగించే కంచంలాంటి మట్టిపాత్ర. **కంచంగోలెం** వి. చౌకంగా పొడవుగా రెండంగుళాల ఎత్తుగల మట్టి తొట్టి. **కంచంచిప్ప** వి. గుండ్రంగా గుంతగా ఉండే మట్టి మూకుడు.

**కంచగార్లు** వి. బ.వ. కంచరిపనిచేసేవాళ్లు. కొత్తూరు శా. అనంతపురం జిల్లా. 699-700. పో.చూ. క. కంచగార.

**కంచటము** వి. నీటిచిర్రికూర, జలతండులం.

**కంచరము** వి. తంటెం, తగిరస, చక్రమర్దవృక్షం.

**కంచంతకాపురము** చూ. కంచి.[1]

**కంచము** రూ. కంచం. చూ. కంచు. వి. 1. కంచుపాత్ర. హర. 5.16; 2. భోజనపాత్ర. పి.శకు. 2.165; 3. పళ్లెం. ఆము. 2.16.

నం. కంస- ఒకరకం లోహం, పాత్ర; ప్రా. కంస. లోహ విశేషం; అ.మా. కంస. కంచు; పా. కంస. కంచు, కంచుపళ్లెం, కంచునాణెం; హిం. కంస్; మరా. కాసణ్డీ. కంచుపాత్ర.

క. కంచు. కంచు, కంచుగిన్నె; కంచురళి; పో. చూ. తు. కజణ. భోజనపాత్ర; త. కఞ్చమ్. కంచు, పానపాత్ర; పో.చూ. మ. కఞ్జానమ్. రూటికుండ.

< ప్రా. కంస-.

**కంచంపొత్తు** వి. సహపంక్తి భోజనాలుచేసే అనుకూల్యం.

**కంచంపొత్తు** చూ. కంచము.

**కంచర** చూ. కంచు. రూ. కంచరి. వి. కంచుపనిచేసి బతికే ఒక జాతి.

నం. కంసకార-, కాంస్యకర-, కాంస్యకార-. కంచు, ఇత్తడి మొ.వాని పనిచేసేవారు; ప్రా. కంసఅర-. కంచు పనిచేసేవాడు; పా. కంసకార-.

క. కంచగాఅ, కంచుగాఅ. కంచుపనిచేసేవాడు; మ. కంచికారె; త. కంచికారన్; మ. కంచారన్. కంచర జాతి.

< ప్రా. కంసఅర-.

**కంచరది** రూ. కంచరిది. వి. కంచరకులానికి చెందిన స్త్రీ.
**కంచరవాఁడు** వి. కంచరి, కంచుపనిచేసేవాడు. **కంచరబండి** వి. కంచరసామాన్లు పెట్టుకొని అమ్మటానికి ఊరూరా తిరిగే బండి.

**కంచరము**[1] వి. 1. రథవిశేషం. గాడి; 2. ఒక తక్కువజాతి బండి, కల్లాబండి.

నం. కచ్చర- ఖచ్చర-. కంచరగాడిద. పో.చూ. చంక్కర. బండి, వాహనం;

ద్రా. ఖచర్, ఖచల్. కంచరగాడిద.

< నం. కచ్చర- (అనునాసిక్యం, ద్విత్వ లోపం).

కంచరగాడిద పో.చూ. కంకరగాడిద. వి. బండికి కట్టే ఒకజాతి గాడిద, అశ్వతరం.

**కంచరము**[2] చూ. కంచర. వి. కంచరపని.

**కంచరి** రూ.చూ. కంచర. వి. కంచుపనిచేసేవాడు. కలుచుంబ్రు. ప.గో. జిల్లా. క్రీ.శ. 945-970 నం. ఆం.భా. 2.284.

కంచరిది రూ.చూ. కంచరది. వి. కంచరకులానికి చెందిన స్త్రీ. కంచరిపురుగు వి. ఈలపురుగు, కీచురాయి.

**కంచల** రూ. కంచెల[1]. వి. రవికె. భాగ. 10. ఉ. 803.

నం. కంచులకా. రవికె; కంచూల, కంచుల, కంచుక; ప్రా. కంచు, కంచుఅ, కంచుయ, కంచులిఅ. రవికె; అ.మా. కంచుఅ, కంచుగ. రవికె; పా. కంచుక. బిగుతైన జాకెట్టు, పాముకుబుసం; మరా. కంచోలీ. రవికె.

క. కంచుక; త. కంచుళి.

<ప్రా. కంచులిఅ.

కంచలకంచుకి వి. రవికె, కంచెల.

కంచల్లము వి. ఉద్యానవనాల్లో పెంచే అందమైనమొక్క (Bauhinia accuminata),

**కంచా** రూ.చూ. కంచ. వి. పెనం.

**కంచి**[1] వి. కాంచీపురం. హర. 2.23, విజయ. 3.200.

నం. కాంచీపురా. గ్రామనామం, కాంచీ; ప్రా. కంచి, కంచీ.

క. కంచి (కాంచియొక్క తద్భవరూపం) ; త. కంచి, కంజీవరం, కాంచి. కాంచీపురం, కచ్చి.

< ప్రా. కంచి.

కంచంతకాపురము వి. పెద్ద కాపురం, గొప్ప కాపురం. పాండు. 3.81 ; <కంచి[1] + అంత + కాపురము. కంచి ఇడ్లి వి. మసాలా వేసి వండిన పెద్ద ఇడ్లి. కంచికామాక్షి దీపం వి. మొక్కుబడి ఉన్నవాళ్లు గుడిలో వెలిగించే దీపం ప్రమిద. కంచిమేక వి. ఒక జాతి మేక, కంచిపట్టణపు మేక. క. కంచిమేక. చిన్న తెల్లని మేక.

**కంచి**[2] రూ.చూ. కంచె. వి. ముళ్లకంపతో కట్టిన దడి.

కంచిచిక్కుడు వి. చిక్కుడుజాతికి చెందిన ఒక నన్నని తీగ (Dolichos Ciliatus). కంచిజెముడు వి. పాలచెట్టు, తెల్లని కర్రకలిగి చిన్న పూలు పూసే చెట్టు (Euphabia Tuircalli). కంచిపాల వి. సీమ చిత్రమూలపుచెట్టు, దడుల్లో పెంచబడే ఎర్రని పూలుపూసే ఒక మొక్క (Pedilanthus trithymaloides).

**కంచిగరుడసేవ** రూ.చూ. కంచుగరుడసేవ.

**కంచియ** రూ.చూ. కంచె. వి. పొలంచుట్టూ ఏర్పరచిన ముళ్ల కంప, వెలుగు, బీటినేల.

**కంచీ** రూ. కాంచి, క్రైంచి. వి. ముక్కోణం ఆకారంలో కొయ్యతోనో, ఇనప బద్దలతోనో నిర్మించిన చట్రం.

**కంచు** వి. లోహభేదం. భార.శాంతి. 1.314.

నం. కాంస్య- లోహభేదం, గ్లాను ; కంస- ; ప్రా. అ.మా. కంస. కంచు ; పా. కంస. కంచునాణెం, భోజనపాత్ర ; బెం.ఒ. కాసా ; పం. కాంసీ ; హిం. కాఁసా ; సిం. కంఝో ; గు. కాంసు ; మ. కాంసెం.

క. కంచు, కంచ. (కాంస్య తద్భవరూపం) లోహభేదం, కంచుగిన్నె ; తు. కంచి. కంచు ; త. కంచమ్.

<నం. కంస-.

కంచుఅద్దెన వి. కంచుతో చేసిన ధూపార్తి. కంచు కంచము వి. కంచుతో చేయబడిన దీపస్తంభం. కంచు కంటు వి. వేయించటం మొ. వానికుపయోగించే పాత్ర, బాణలి, కందువు. ఆం.భా. 2.243. కంచుకాగడా వి. ప్రకాశవంతమైన దీపం. కంచుకుండ వి. కంచుతో తయారైన పాత్ర. కంచుకొమ్ము వి. ఊదే ఒకానొక వాద్య విశేషం. వైజ. 4.78. కంచుగరుడసేవ రూ. కంచిగరుడసేవ. వి. 1. వెట్టిచాకిరి, జీతం బత్తెం లేని కొలువు ; 2. కంచిలో జరిగే గరుడోత్సవాన్ని చూడటం (కంచుగరుడ విగ్రహం తోమడం బహు కష్టం. తద్వారా వెట్టిచాకిరి అనే అర్థం వచ్చి ఉంటుంది). కంచుగిన్నె వి. పోతపోసిన గిన్నె. కంచుడమారము వి. ఒక రకం కోడి, ఒక రకం తక్కువజాతి కుక్క. కంచుడి రూ. కంచుడు. వి. భోజనపాత్ర. కంచుడు రూ.చూ. కంచుడి. వి. పళ్లెం, చట్టివంటి మట్టిపాత్ర. కంచుడుతోవె వి. చావునాడు అగ్గి తీసుకొని పోవడానికి వాడే మట్టిపాత్ర. కంచుతల్యి వి. కంచుతో చేసిన భోజన పాత్ర. నం. కాంస్యస్థాళి- ; త. తళిగై. కంచుతుల వి. కంచుతో చేసిన పాత్ర విశేషం. కంచుదివ్వకంభము వి. కంచుతో చేయబడిన దీపస్తంభం. కంచుదివ్వదండు వి. కంచుతో చేయబడిన దీప దండం. కంచుపదను రూ. కంచు పదును. విణ. మెత్తని, మృదువు. రాధా. 2.32. కంచుపదును రూ.చూ. కంచుపదను. విణ. సున్నితం. కంచుప్రతిమ వి. కంచుతో చేయబడిన స్త్రీ ఆకారంగల దీపస్తంభం. నం. కాంస్యప్రకృతి. కంచుబండ వి. దర్వాజా ఉత్తరాసిమీద పరిచే బండ. కంచుబిత్తడిదివియ వి. స్త్రీ ప్రతిమాకారంలో చేయబడిన దీపస్తంభం. కంచురాయి వి. కంచులాగ మోగే ఒక రకం రాయి. ('క్వార్ట్జ్') జాతికి చెందిన మిశ్రశిల. దక్షిణ భారతదేశంలో లభించే పేలుడురాళ్ల జాతికి చెందిన నల్లని రాయి. కంచువాద్యము వి. భోజనం మొ. చేసేటప్పుడు మోగించే కంచుతాళాలు. కంచుసుద్దరాయి వి. కనికరాయి, రబ్బిరాయి (Metamorphic rock).

**కంచుమించు**[1] చూ. కొంచ. వి. శ్యేనభేదం. ఆం.భా. 2.90. ఒక విధమైన డేగ.

**కంచుమించు**[2] విణ. అగోచరమైన. రం.రా. 3.178, 16.

అదృశ్యం, అంతర్ధానం.

కంచుమించుగా క్రి.విణ. ద్రు. వేగంగా. రామా. 5.308.

**కంచె** రూ. కంచి[2], కంచియ. వి. 1. పశువులు మొ. వాటినుంచి రక్షించడానికి పొలంచుట్టూ నాటిన ముళ్లకంప. ఆం.భా. 2.6 ; 2. దున్నని భూమి, బీడు, బడుగునేల ; 3. ప్రభుత్వ అధీనంలో ఉన్నబీడు.

నం. కక్ష- (పుం.) మరుగుచోటు, అడివి, కక్షా. సరిహద్దు; ప్రా.మహా. కచ్ఛ. గీత, వరన ; అ.మా. కచ్ఛ. (పుం.) సరిహద్దు, ఒడ్డు ; పా. కచ్ఛా. ఆవరణ ; కచ్ఛ- చిత్తడినేల.

మాల్తో. కాంచె. అంచు.

కంచెకత్తెర వి. కంచెలను అనవసరమైనప్పుడు కత్తిరించడానికి ఉపయోగించే పెద్దకత్తెర. కంచెకోట వి. వెదురు, పేము మొ. వానితో కోటచుట్టూ ఏర్పరచిన ఆవరణ. కంచెగడ్డి వి. మెట్టనేలల్లో మొలిచే కలుపుమొక్క (Apluda aristata). కంచెగోడ వి. కంపపాతిన గోడ. కంచెవాటు అ.క్రి. కంపపాతు. కంచెరాయి వి. "సున్నపురాయి" అనబడే ఈ శిలాజాతిరాయి కొన్ని పరిణామాలకు లోనై చలవరాయిగా పరిణమిస్తుంది. రకరకాల రంగుల్లో దొరుకుతుంది. కంచెగా ఈ రాతిపలకను పాతుతున్నందున దీనికి కంచెరాయి అనే పేరు వచ్చింది. కంచెరసుములు వి. పుల్లరి, బీటిపుల్లరి.

**కంచెంచ** రూ.చూ. కంచెంచు.

కంచెంచకమ్మి రూ.చూ. కంచెంచుకమ్మి.

**కంచెంచు** రూ. కంచెంచ. చూ. కంచి[1]. వి. సాదాపోగులు, జరీపోగులుఆయిమూల వరసల్లో పడేటట్టు నేసి, పిందెమాదిరి డిజైను పెట్టి నేసిన అంచు.

కంచి[1] + అంచు[3].

కంచెంచుకమ్మి రూ. కంచెంచకమ్మి. వి. చీరకొంగులో గీరలుపెట్టి అంచులకు రెండువైపులా మందపు దారాలుపెట్టి నేసిన కమ్మి. కంచెంచుచీరె వి. అంచులో మూడు తెల్లగీరలు మూడు ఎఱ్ఱగీరలు పడేట్టు నేసిన చీర.

**కంచెమ్మ** వి. ఒక గ్రామదేవత.

**కంచెల[1]** రూ.చూ. కంచల. వి. రవికె. శృం.నై. 6.22, మను. 5.74, ఆం.భా. 3.46.

**కంచెల[2]** చూ. కంచె. వి. **1.** బీడునేల. ఆం.భా. 3.46 ; **2.** కంచె.

సం. *కచ్ఛ-* బీడునేల, తీరం ; ప్రా.పా. *కచ్ఛ-* ; ఆ.మూ. *కచ్ఛ*. చుట్టూ నీటిచే కప్పబడిన ప్రదేశం.

**కంజాట** వి. బాలురాడుకునే ఒకవిధమైన ఆట.

**కంజాయించు** చూ. కజ్జాయింపు. స.క్రి. ఏర్పాటుచేయు.

**కంజాయింపు[1]** రూ.చూ. కజ్జాయింపు. వి. నీళ్ల తగాదా.

**కంజాయింపు[2]** వి. తగినఏర్పాటు, బందోబస్తు ; విణ. విడివిడిగా ఏర్పాటుచేయబడిన.

**కంజిరి** వి. ఎనిమిదంగుళాల కైవారంతో మట్టితో సారెమీద చేసిన గుండ్రని వలయం. దీనికి ఒకవైపు ఉడుముచర్మం కట్టి మువ్వలుపెట్టి వాయిస్తారు.

కంజిరిచిప్ప వి. ఎనిమిదంగుళాల కైవారంతో మట్టితో సారెమీద చేసిన గుండ్రని వలయం. దీనికి ఒకవైపు ఉడుముచర్మం కట్టి మువ్వలు పెట్టి వాయిస్తారు,

**కంజీమంచం** రూ.చూ. కమచీమంచము. వి. పేముతో అల్లిన మంచం.

**కంజీల** వి. సాయిమేకు, బండిచక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు.

**కంజు[1]** రూ.చూ. కముజు. వి. పక్షివిశేషం, కౌజుపిట్ట.

**కంజు[2]** రూ.చూ. కలుజు[1]. వి. చేనిచుట్టూ వుంచే రాతిగోడ.

**కట[1]** వి. ఇంటిముందరి అరుగు, తిన్నె.

**కట[2]** రూ.చూ. కట్ట[2]. అవ్య. సంతాపసూచకపదం, విక్ర. 3.46.

**కట[3]** రూ.చూ. కట్ట[1]. వి. వడ్లకట్ట (మోపు).

**కటక[1]** వి. ఆషాఢ మాసంలో వచ్చే కార్తె, పుష్యమి.

సం. *కర్కట-*. పీత; ప్రా. *కక్కడ-*; పా. *కక్కటక*; మరా. *ఖెకడా*.

**కటక[2]** వి. కిటికీ రెక్కలను మూసిఉంచే గడియ. సం. *కటక*. వలయం, కడియం, తీగ.

<సం. కటక-. (అర్థవిపరి.)

**కటకం[1]** రూ. కట్టకం. వి. **1.** కట్టబడిన నిర్మాణం ; **2.** గద్దె ; **3.** పాదె.

క. *కట్టడ, కట్టణ-, కట్ ణ*. భవనం ; త. *కట్టుటమ్*. భవనం, పుస్తకానికి వేసిన పైఅట్ట ; *కట్టుణమ్*. భవనం, చేయబడిన ఆభరణం ; మ. *కెట్టుకమ్*. ఇల్లు.

**కటకం[2]** వి. **1.** గద్దగోరు ; **2.** కిటికీరెక్కలు గాలికి వాలకుండా పట్టిఉంచే పరికరం. పో.చూ. కటకం[1].

**కటకట[1]** రూ. కటకటా. 'కట' యొక్క ద్విరుక్తి. చూ. కట్ట[2]. అవ్య. అకట (సంతాప సూచకం). భాగ. 1.373, శృం.నై. 4.109 ; వి. **1.** బాధ, కష్టం. ధర్మ. 2.120 ; **2.** కోపం.

కటకటఅను అ.క్రి. జనం కిక్కిరిసి దట్టంగా మూగు, కిటకిట అను. కటకటపడు రూ.చూ. కటకటఃబడు. అ.క్రి. కష్టపడు, బాధపడు, సంతాపపడు. భార. ద్రోణ. 2.335. కటకటఃబడు రూ. కటకటపడు. అ.క్రి. **1.** కోపపడు. భార.విరా. 4.97, భార.ఉద్యో. 4.80 ; **2.** కలతచెందు ; **3.** దుఃఖించు. కటకటపెట్టు స.క్రి. బాధపెట్టు. కటకటలాడు అ.క్రి. కష్టపడు, కలవరపడు.

**కటకట[2]** పో.చూ. గడగడ. వి. కొరకడం మొదలగు వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. నవనాథ. 3. భా.

క. *కటుకటుకటి*. పండ్లను కొరకటం, గట్టి పదార్థాలను నమలినపుడు ఏర్పడే శబ్దం ; త. *కటుకటు*. *గడగడధ్వని*; తు. వదరటం లేక అతిగా మాటలాడటంలోని ధ్వని.

**కటకటా** రూ.చూ. కటకట[1]. అవ్య. అకట, హార. 2.99, మను. 3.91, ఆం.భా. 3.67.

కటకటాత్కారము వి. పళ్ళు కొరకడం, పళ్ళు నూరడం.

**కటకటాకమ్ములు** చూ. కటకటాలు.

**కటకటాలకమ్ములు** చూ. కటకటాలు.

**కటకటాలు** వి. బ.వ. ఇనపఊచలు లోనగువానిచే ఏర్పరిచే అడ్డు.

క. *కటుకటె*, కంచె, స్తంభాలవరస.

కటకటాకమ్ములు వి.బ.వ. **1.** ఇనపకమ్ములు మొ.వాటితో ఏర్పరిచే అడ్డు; **2.** మదగజాలు. కటకటాలకమ్ములు వి.బ.వ. ఇనప కమ్ములులోనగువానిచే ఏర్పరచే అడ్డు.

**కటకరము** వి. ఒకానొక మృగం, కడతి, గంధర్వం, ఒంటెపిల్ల. ఆం.భా. 2.85.

క. *కడితి, గణజి, కడజు, కడంజు. కణిజి, కణుజు*. ఒకరకం లేడి.

**కటకరోణి** రూ. కటకరోని. వి. కటకరోహిణి. నల్లనిది.

సం. కటుకరోహిణి-.

క. కటుకరోణి.

<సం. కటుకరోహిణి.

**కటకరోని** రూ.చూ. కటకరోణి. వి. ఓషధివిశేషం. కటుకిరోహిణి. విణ. నల్లని.

**కటకనరలు** రూ. కటకనరులు. వి. బ.వ. ఒకరకం వడ్లు.

**కటకనరులు** రూ.చూ. కటకనరలు. వి. ధాన్యవిశేషం.

**కటకారు(డు** వి. **1.** మేదరి, వెదురుపనివాడు, చాపలల్లేవాడు; **2.** ఒక సంకీర్ణ జాతివాడు, శూద్రస్త్రీకి వైశ్యునివల్ల పుట్టినవాడు.

**కటనము** రూ.చూ. కట్నము. వి. కానుక.

**కటపుట** చూ. కటపెట. వి. విజృంభణం. కకుత్స్థ. 2.104. వి. చెలరేగటం, వికాసం.

**కటపెట** వి. **1.** వర్షంపడేటప్పుడు కలిగే శబ్దానికనుకరణం. వైజ. 2.146 ; **2.** రాపిడిలో అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి.భాగ. 7.

త. *కటుపటావ్ఎనల్*.

**కటమర** రూ. కట్టమర. వి. హనువు, చెక్కిలిమీది భాగం. ఆం.భా. 2.143, చంద్రాంగ. 1.68.

క. *కటువాయా, కటువాయి, కటుబాయి*. నోటిచెక్కిళ్ళు, చెంప, బుగ్గ, దవడ, కణత ; త. *కటుమ్*. పనుగుకణత ; నం. *కటు*. పనుగుకణత ; పా. *కడ*. కణత, తలపక్కచోటు.

**కటంబలి** వి. జొన్ననూకలతో వండిన అన్నం, జొన్నన్నం.

క. *కట్టుమ్బులి*. మజ్జిగలో జొన్నఅన్నాన్ని పిసికి తాగడం.

**కటరా** రూ.చూ. కటోర.

**కటవ** వి. చిన్నతిప్ప, గడ్డివేయటానికి ప్రత్యేకించిన చోటు.

**కటవరాయి** వి. ఎర్రకంచు రాయి, బూడిదరంగులో ఉండే ఒకరకం రాయి.

**కటా** రూ.చూ. కట్ట². అవ్య. అకట. నిర్వ. రా. 5.103.

**కటాకటి¹** వి. సందేహం.

**కటాకటి²** విణ. **1.** కచ్చితం ; **2.** అతికష్టం.

క. *కటాకటి*. క్రమం, తగిన, కచ్చితంగా.

**కటాకటిగా** క్రి.విణ. కఠినంగా, కష్టంతో.

**కటాకటి¹** వి. జగడం, పోరు, బాధ, కష్టం.

నం. *కటుకటా*. ధ్వన్యనుకరణం ; నే. *కట్‌కట్*. నొప్పి లేక బాధ కలగటం, బాధ, శ్రమ, దుఃఖం, కష్టం ; బెం. *కట్‌కట్*. ఆశ్చర్యాన్ని సూచించే ధ్వని ; ఒ. *కట్‌కటు*. కఠినమైన బాధ ; హిం. *కటాకట్*. కొట్లాట, జగడం ; *కటాకటీ*. పళ్ళు నమలడం, బాధ, కష్టం ; గు. *కట్‌కట్*. పీడిస్తున్న.

క. *కటుకటు, కటుకటి*. బాధ, శ్రమ, దుఃఖం, కష్టం.

**కటాకటి³** క్రి.విణ. **1.** మిగలకుండ ; **2.** బొటాబొటిగా.

**కటాంజనం** వి. ఇంటిముందున్న కటకటాలు.

క. *కటాంజన*. కంచె, రక్షణకోసం ఇంటిముందు వేసిన చెక్క (కొయ్య), వాకిలి లేక ఇనపకడ్డీలు.

**కటానం** వి. కంది, పెసర మొ. పప్పుదినుసులన్నింటికి సామాన్యంగా వాడే పేరు.

**కటామణి** రూ.చూ. కటామని. వి. నూర్పిడి, కుప్పలు నూర్చడం.

**కటామని** రూ. కటామణి. వి. నూర్పిడి.

క. *కటావు*. కోయటం ; *కటాయిసు*. పంటకోయు, ఫలమనుభవించు, ముగించు ; త. *కటు*. రుతువు, కాలం ; నే. *కటాని*, పంటకోత, కోతకాలం.

బీ. *కట్నీ* ; హిం. *కాట్నీ* ; మరా. *కాట్నీ*.

**కటాయి** చూ. కటావు. వి. కోయడం.

నే. *కటామ్*. కోయడం, కోస్తున్న కోత (పంటకోత) ; మరా. *కటా*. చావు, ఖూని ; హిం. *కటావు*. కోయడం, ధాన్యం కోత ; తు. *కటావు*. కోస్తున్న, కోత ; త. *కటి-న్-ట్*. కోసివేయు.

**కటాయించు** స.క్రి. ఎగబెట్టు, ఎగవేయు. రంగా. చ. 2.171. రుణాదులను అపహరించు.

ఉ. *కటానా*. విభజింపచేయు, దాటజేయు, చంపు ; హిం. *కటానే*. విభజింపచేయు, దాటజేయు, కత్తిరింపజేయు ; క. *కటాయిసు*. కోయించు, కోయు, ముగించు ; త. *కటాచు*. ఎరవేయు, విసరివేయు.

<ఉ. కటా.

**కటారము** రూ.చూ. కటారు. భాగ. 10. ఉ. 418. వి. కటారి; బాకు, కత్తి.

**కటారి** రూ.చూ. కటారు. వి. **1.** కత్తి, బాకు. రసిక. 3.81 ; **2.** ఒకవైపున మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వచ్చేటట్టు నేసిన డిజైను ; **3.** ఒకరకం అద్దకం.

**కటారిఅంచు** వి. **1.** ఒకవైపున మొనదేలిన గుర్తులు దగ్గరదగ్గరగా వరసగా వచ్చేటట్టు నేసిన డిజైను ; **2.** ఒకరకం అద్దకం. **కటారికత్తియ** రూ. కటారికత్తె. వి. **1.** కటారి కలది (ఆడది), సౌందర్యంచేత పురుషుల హృదయాల్ని కలచేది. కళా. 1.31 ; **2.** అందగత్తె ; **3.** కటారి చేపట్టిన స్త్రీ. **కటారికత్తె** రూ.చూ. కటారికత్తియ. వి. కటారికలది (ఆడది). సౌందర్యంచేత పురుషుల హృదయాల్ని కలచేది. **కటారికనుము** వి. ఒకరకం డిజైను వచ్చేటట్టు నేసిన రవికల గుడ్డ. **కటారిషర్టింగు** వి. పడుగునూలుకు డిజైన్లు వచ్చేటట్టు రంగు అద్ది నేసిన చొక్కా గుడ్డ. < కటారి¹ + ఇం. Shirting. **కటారికా(డు** రూ. కటారుకా(డు. వి. కత్తి కలవాడు. కాశీ. 2.140.

**కటారు** రూ. కటారము, కటారి², కఠారి. వి. కత్తి, బాకు. ఉ.రా. 7.211.

నం. *కట్టార-, కట్టారక-, కర్తారికా* ; ప్రా. *కటార-, కట్టారయ, కట్టారీ*; దే.ప్రా. *కట్టారీ*; బెం. *కటార్* ; ఒరి. *కటార* ; హిం. *కటార్* ; పంజా. *కటార్* ; సిం. *కటారొ*; గు. *కటార్* ; మ. *కటారీ*.

క. *కటారి, కరారి* ; తు. *కటారి* ; త. *కట్టారి* ; మ. *కటార్, కట్టార, కట్టారి* ; కొలామీ. *కటార్*.

<ప్రా. కటార-.

**కటారుకత్తియ** రూ. కటారుకత్తె. **కటారుకత్తె** రూ.చూ. కటారుకత్తియ. **కటారుకా(డు** రూ.చూ కటారికా(డు. వి. కత్తి కలవాడు. కాశీ. 2.140.

**కటావణి** రూ.చూ. ఖటావణి. వి. **1.** పద్దు, **2.** రహస్యంగా ప్రవేశించే అధికారం. **3.** వాజ్మూలం.

**కటావు** వి. కోయడం.

**కటిక¹** రూ.చూ. కట్టిక¹. వి. మాంసం అమ్మేవాడు. విణ కఠినమైన, కరవైన, దిట్టమైన.

**కటికతనము** వి. క్రూరత్వం. వాసి.రా. 2.193, 194 ;

ధీరత్వం. కటికపని వి. కసాయిపని. కటికముక్కలవాడు వి. కరినాత్ముడు. కటికమెకము వి. ఖడ్గమృగం. కటికవాఁడు[1] వి. మాంసవిక్రేత. ఆం.భా. 2.286.

**కటిక**[2] వి. బెత్తం పట్టేవాడు.

కటికది వి. వేత్రహస్త. ఉ.రా. 4.223. కటికవాఁడు[2] రూ.చూ. కట్టికవాఁడు. వి. వేత్రహస్తుడు. కళా. 7.69.

**కటిక**[3] విశే. కేవలం, పూర్తియైన, మొత్తం.

కటికచీఁకటి రూ. కటికిచీఁకటి. వి. పెంజీకటి. మను. 1.18. కటికదరిద్రుడు వి. చాల పేదవాడు. కటికపస్తు వి. తిండి లేక మాడటం.

**కటిక**[4] రూ. కటికన, కట్టిక[2]. ఆం.భా. 2.207. వి. మల్ల సాధన విశేషం.

సం. ఖట్టిక-- కటికవాడు.

< సం. ఖట్టిక-. (అర్థ విపరి.)

**కటికన** రూ.చూ. కటిక[4]. వి. మల్లసాధన విశేషం. ఆం.భా. 2.207.

**కటికవిషేకము** వి. సమర్తాడని వివాహిత కన్యతో భర్తను కలుపటం.

**కటికరోగం** వి. నెత్తురు పారుకొనే జబ్బు.

**కటికలకత్తెర** వి. ఉన్నికత్తెర, గొర్రె బొచ్చు కత్తిరించే కత్తెర. (తె. 9).

**కటికి** రూ. కటుకు[2]. విశే. 1. కఠినమైన, గట్టి. భార. ఆది. 6.178 ; 2. అధికమైన. భార.ద్రోణ. 2.276 ; 3. దట్టమైన. మను. పీఠి. 18 ; 4. తీక్ష్ణమైన. ఉ.రా. 6.280; 5. కేవలం.

క. కటక. సూర్యుని వేడిమి, సూర్యప్రకాశం; కటుక. తీక్ష్ణమైన, వాడిమైన, కఠినమైన; తు. కడు. తీక్ష్ణత, కఠినత, క్రూరత, మిక్కుటం, అధికం; త. కటి. అమితమైన, తీక్ష్ణమైన; కటు. తీక్ష్ణమైన; కెట్టి. గట్టితనం, కఠినత్వం ; మ. కటుక్కుర్. కఠినంగా తయారవడం, కోపపడటం; కొండ. కరె[1]. చాల గట్టి, చాల కఠినం.

కటికిచీఁకటి రూ.చూ. కటికచీఁకటి. వి. చిమ్మచీకటి, గాఢాంధకారం.

**కటికేరు** వి. ఇంటికప్పుకు పనికివచ్చే తృణ విశేషం.

త. కటుకు. ఆవాలు; మ. కటుకు. ఆవాలు; కొడ. కర్ క్స్. ఆవాలు.

**కటిక్కన** రూ. కటుక్కున. క్రి.విశే. 1. గట్టిగా ; 2. మొగమాటం లేకుండా.

**కటిక్కున** రూ.చూ. కటుక్కున. క్రి.విశే. 1. గట్టిగా ; 2. మొగమాటం లేకుండా.

**కటిలె** వి. కటికినవ్వు. వి. తెచ్చిపెట్టుకొన్న నవ్వు, విషపునవ్వు.

**కటుకు**[1] రూ.చూ. కటుక్కు. వి. కొరికేటప్పుడయ్యే ధ్వనిని సూచించే శబ్దం. సిం.ద్వా. 12.9.

**కటుకు**[2] రూ.చూ. కటికి. అచ్చ.భా. 14. ప. వి. క్రూరుడు, కటికివాడు ; విశే. కఠినమైన.

**కటుకు**[3] పో.చూ. గడుసు. వి. కఠినం.

పో.చూ. సం. కఠిన-. కఠినమైన, తీక్ష్ణమైన.

క. కడుగు. గట్టియగు, గడచు, గడను, గడుసు, గట్టితనం, తీక్ష్ణత ; త. కట్టు (కట్టి-). గట్టిపరచు ; కుఱు. కడర్నాక్ర్డ్నా.

కటుకుపురిమాలు వి. ఎక్కువ పురిగల నూలు.

**కటుకు**[4] వి. విరిస్తే ఎఱ్ఱగావున్న పచ్చిపసుపుకొమ్ము.

**కటుకుతెగులు** వి. దోన తెగులు, ఒక రకం కుమ్మరిపురుగు పట్టి ఆకులు మాడిపోయే తెగులు (రా. 9).

**కటుక్కు** రూ. కటుకు[1]. వి. కొరికినప్పుడయ్యే ధ్వనిని సూచించే శబ్దం. చంద్రాంగ. 2.84.

క. కటుకటుకడి, కట్టునెకడి-. పళ్లు నూరు (కట్టకట్టకడి) ; నమలటంలో కటకట శబ్దంచేయు ; కటుకబెన్న్-. చిటపట లాడు, కటుకనె-. కఠిన పదార్థాలను కొరికినపుడు పుట్టేధ్వని కటుకు, కటుకు, కటికటి. రొట్టె మొదలైన తినుబండారాల కరకర ధ్వని; తు. కటుకుటు. కఠిన పదార్థం కొరికినపుడుగాని నమిలినపుడుగాని పుట్టేశబ్దం; త. కటుకుక్కు-. కొరకటంలోగాని, చిన్న పటకారుతో తెంచేటప్పుడుగాని వచ్చే శబ్దం.

**కటుక్కున** రూ. కటిక్కన, కటిక్కిన. క్రి.విశే. కటుక్కుమనేటట్లు, కటుక్కు. (ధ్వన్యను.)

**కటుగు** రూ. కటువు[1]. వి. శవయానం, పాడె.

సం. కటు-. 1. శవాన్ని మోసుకుపోయే గుర్రం లేక బండి ; 2. స్మశానం,

క. కటు. కాడు.

**కటుగొడగి** వి. పన్ను లేకుండ అనుభవించబడే భూమి, పన్ను లేని ఈనాం.

**కటుమరలు** రూ. కటుమర్లు, కటుమొరలు. వి. బ.వ. హనువులు, బుగ్గలు. చంద్రా. 1.98.

**కటుమర్లు** రూ.చూ. కటుమరలు. వి. బ.వ. బుగ్గలు.

**కటుమొరలు** రూ.చూ. కటుమరలు. వి. బ.వ. బుగ్గలు.

**కటువు**[1] రూ.చూ. కటుగు. వి. పాడె, కటుం.

సం. ఖాటి-. పాడె.

**కటువు**[2] విశే. గట్టి, బలమైన.

సం. కటు-. తీక్ష్ణమైన, కారమైన, చేదయిన, భయంకరమైన.

క. కటు. తీక్ష్ణమైన, కఠినమైన ; త. కటు. చేదు, తీక్ష్ణం, కారం.

< సం. కటు-. (అర్థ. విపరి.)

కటువురాయి వి. రాతినారరాని రాయి.

**కటేకాదు** వి. హాస్యగాడు, విదూషకుడు, అరవ భారత నాటకాల్లోని విదూషకుడు.

**కటోని** వి. మేకులు పీకడానికి వాడే ఇనప పనిముట్టు.

**కటోర** రూ. కటరా, కట్ర, కొటార. వి. ప్లేటులాగా ఉండే చిన్న మట్టిపాత్ర, అంచుండదు, చెవులుంటాయి. మహమ్మదీయులు వాడతారు.

**కటోలపీణె** వి. కిన్నెర, వీణవంటి తంత్రీవాద్యం.

**కట్కంరొతు** వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి.

**కట్ట**[1] రూ. కట[3], కట్టవ. చూ. కట్టు. వి. 1. చెరువులోనగువాని గట్టు, ఒడ్డు, తీరం, సేతువు, ఆనకట్ట. ఈడేరు కానవనం. కృష్ణాజిల్లా. క్రి.శ. 918–25; వి. 2. ఇంటిముందు ఎత్తుగా బల్ల

పరుపుగా కట్టిన నిర్మాణం ; **3.** బావి పళ్ళేనికి చుట్టూకట్టిన కొద్దిపాటి ఎత్తుగల గోడ ; **4.** బావిచుట్టూ కట్టిన అరుగు ; **5.** మధ్యలో నీళ్ళుపోసి గచ్చు గట్టిపరచడానికి పీలుగా మట్టితో కట్టిన మడి ; **6.** నీటిమధ్య రాళ్ళుపేర్చి నిర్మించిన దారి.

క. కట్ట్న. గట్టు, అడ్డకట్టు ; త. కట్టు. ఆనకట్ట కట్టడం, పుస్తకానికి వేసికొనే పైఅట్టను మూయడం ; మ. కట్టు. కట్టటం ; కట్ట్న. మూట, గుంపు ; కట్ట్న. ముద్ద, గట్టి ; గొం. పర్జి. కట్ట్న. గట్టు ; నా. -కట్ట్న. గట్టు, ఆనకట్ట.

<మూ.ద్రా. కట్-.

**కట్టకొమ్మ** రూ. కట్టుకొమ్మ. వి. ఆనకట్ట. **కట్టగట్టు** అ.క్రి. **1.** సిద్ధమగు ; **2.** అందరు ఏకమగు ; **3.** వరసగా మూగు.

<కట్ట[1]+కట్టు. **కట్టజెముడు** వి. జెముడులో ఒక రకం. వ్య. కట్టదగ్గర పెరిగే జెముడు. **కట్టలుతెగు** అ.క్రి. **1.** గండిపడు ; **2.** పొర్లివచ్చు ; **3.** వశం తప్పు. **కట్టవేయు** స.క్రి. **1.** అడ్డకట్టు ; **2.** గట్టుకట్టు. **కట్టస్తంభం** వి. రాళ్ళతో కట్టిన స్తంభం.

**కట్ట[2]** రూ. కట[2], కటా, కట్టా. అవ్య. అకట. సంతాపార్థకం.

సం. కష్ట-. కీడు, పీడ, శ్రమ ; ప్రా. కట్ట-. చెడు, వ్యర్థం, పీడ, చిక్కు ; అమా. కట్థ-. కష్టం ; అవ. కట్ట్న. దుఃఖం ; మ.రా. కటుకటా. సంతాపసూచకం,

క. అకట, అక్కట, కట ; త. కట్టుమ్. కష్టం.

<ప్రా. కట్ట-.

**కట్ట[3]** చూ. కట్టు. వి. **1.** ఒకటిగా చేర్చిన వస్తుసముదాయం, గుంపు, రెండు వస్తువులు ; **2.** ఇరవై లడీల నూలు లేక కొంత పోగులనూలు ; **3.** కుండలు సరఫరా చేసినందుకు వరికోత సమయంలో రైతు కుమ్మరికిచ్చిన వరిపైరు మోపు.

క. త. కట్టు. కట్ట, మూట ; మ. కట్టు. కట్టటం, మూట, గుంపు.

<మూ.ద్రా. *కట్-.

**కట్టకం** రూ.చూ. కటకం[1]. వి. కట్టిన భవనం, కట్టడం.

**కట్టకంతాపి** వి. కట్టుబడిలో వాడే మందపాటి రేకుగల కొంచెం పెద్ద సైజు తాపి. **కట్టకంరాతి** వి. ఎర్రకంచురాయి, కట్టుబడికి పనికివచ్చేరాయి.

**కట్టకడ** వి. మిక్కిలికడ, చిట్టచివర. లక్ష్మీ. వి. 2.39.

క. కట్టుకడె, కక్కడె. మిక్కిలికడ, చిట్టచివర ; తు. కట్టుకడె ; మ. కడె. చివర.

**కట్టచేప** వి. ఒకరకం చేప.

త. కట్టుకెకిచ్చాన్. సముద్రంచేప.

**కట్టడ** రూ. కట్టడి[2]. చూ. కట్టు. వి. **1.** తీరు, విధం. నిర్వ. రా. 10.120 ; **2.** ధర్మం, విధి. కాశీ. 7.52 ; **3.** నియమం, కట్టుబాటు, ఏర్పాటు. కళా. 7.264 ; **4.** ప్రకృతి, స్వభావం. భాస్క.శ. 5 ; **5.** ప్రతిఫలంగా ఇచ్చే ద్రవ్యం. కవి. క. 6.45 ; **6.** ఆజ్ఞ ; **7.** మర్యాద ; **8.** దేవతాకార్యనియమం ; **9.** అందం ; **10.** గుణం, స్వభావం.

క. కట్టులె, కట్లె. చట్టం, ఆజ్ఞ, క్రమపద్ధతి, తగిన నడవడిక, సత్యం ; తు. కట్టులె, కట్లె. చట్టం, పద్ధతి, ప్రవేశపెట్టబడిన చట్టం ; కట్టు (కట్టి). నియమం, విధి, ఆచారం ; కట్టలమ్. న్యాయచట్టం, నియమం ; త. కట్టులై. ఆజ్ఞ, నియమం, కులం లేక సంఘసభ్యుల ప్రవర్తనను కట్టుబాటులో ఉంచే న్యాయచట్టం ; మ. కెట్టుక, కెట్టు, కట్టు. పెండ్లిచేయు ; కొం. కట్. కులాచారం ; కొలా. కట్. కట్టు, నిర్మించు.

**కట్టడచేయు** స.క్రి. **1.** నియమించు, ఏర్పాటుచేయు ; **2.** ఆజ్ఞాపించు. రం.రా. 2.136, పు. ; **3.** దయచేయు ; **4.** అనుగ్రహించు. ఉ.రా. 1.225 ; **5.** ప్రసాదించు, ఇచ్చు.

**కట్టడము** చూ. కట్టు. వి. **1.** ఇల్లు మొదలైనది ; **2.** కట్టన, బంధం, కూర్పు.

క. కట్టడ, కట్టణ, కట్ట్న. ఇల్లు ; తు. కట్టోణ, కట్టడ. ఇల్లు ; త. కట్టుటుమ్, కట్టిటుమ్. ఇల్లు ; మ. కెట్టుక. కట్టు, నిర్మించు, బంధించు ; కెట్టు. కట్టు, మోపు, ఆనకట్ట, గట్టు, ఇల్లు ; కెట్టుకమ్. ఇల్లు ; గొం. కట్టునా. మూయటం ; కట్టా. వంక లేక కాలవకు అడ్డంగా ఉండే ఆనకట్ట, చేపలు పట్టు ; పర్జి. కట్ట్. కట్టటం, కట్టు ; కడ్ క్. కట్టు, పుస్తకానికి పైనవేసే దళసరి అట్ట ; కట్ట్న. గట్టు, అడ్డకట్ట ; ఒల్లా. కట్. కట్టు (బంధించు), నిర్మించు, గట్టు, ఒడ్డు ; కొలా. కట్. బంధించు, నిర్మించు ; కట్వా. తిన్నెవేదిక, చేని, గట్టు, అడ్డకట్టు ; నా. కట్ట్. బంధించు, నిర్మించు ; కట్ట్న. గట్టు, ఆనకట్ట, కందకం.

**కట్టడంపుకాసులుపేరు** వి. కట్టడపు కాసులపేరు, బంగారు నాణేలతో పొదిగింపబడి చక్కగా తయారుచేసిన ఆభరణం. **కట్టడంపుదుద్దులు** వి. ఒకరకం దుద్దులు.

**కట్టడంపుకాసులుపేరు** చూ. కట్టడము.

**కట్టడంపుదుద్దులు** చూ. కట్టడము.

**కట్టడి[1]** రూ. కట్టిడి. చూ. కట్టడ. వి. నియతి, భాగ్యం. ఆం. భా. 1.99.

**కట్టడి[2]** రూ.చూ. కట్టడ. **1.** ఆజ్ఞ. దశా. 2.127 ; **2.** (దేవతా ప్రసాదరూపమైన) నియమితద్రవ్యం. విజయ. 2.128 ; **3.** నియమం, కట్టుపాటు. సిం.ద్వా. 1.16.

**కట్టడికట్ట** చూ. కట్టు. వి. చెలియలికట్ట, వేల. అచ్చ.రా. 6.162.

**కట్టడి[3]** చూ. కట్టడి[2]. వి. గ్రామ వృత్తులవారికి కళ్ళంలో మామూలుగా ఇచ్చే ధాన్య భాగం.

**కట్టడి[4]** రూ.చూ. కట్టిఁడి. వి. కఠినుడు, కఠినురాలు.

**కట్టతుమ్మ** వి. తుమ్మలో ఒక రకానికి చెందిన ముళ్ళచెట్టు.

**కట్టనము** రూ.చూ. కట్నము. వి. **1.** బంధం. హరి.ఉ. 2.16, కూర్పు ; **2.** కానుక, ఉపాయనం. జైమినీభా. 7105 ; **3.** కట్టుకోక. ఆం.భా. 2.155 ; **4.** లంచం.

**కట్టనంగు** చూ. కడు. వి. మిక్కిలి ఇష్టుడు, ఎన్నికైన స్నేహితుడు.

**కట్టపుట్టచెండ్లు** వి. బాలక్రీడలలో ఒకటి.

**కట్టపోయు** స.క్రి. పగలగొట్టిన మట్టిని కుప్పగాపోయు.

**కట్టమట్టం** చూ. కట్టు. వి. ఎత్తుగాఉన్న పంచ, కట్ట.

క. కట్టు-. కట్టు, మట, మట్టు, మట్టస, కొలత, పొడుగు, మట్టం ; కొడ. కెట్ట్- (కెట్టి-). కట్టు, తు. కట్టుని.

కట్టు ; మట్టి. మట్టం, నిర్మించు ; త. కట్టు-. కట్టు, మట్టం, ఒడ్డుపొడవు కొలతల్లో సమంగా ఉండటం ; మ. కెట్టుక. కట్టు ; మట్టి. పొడవులలో ఒక విధమైన కొలత; మట్టం. మట్టం.

**కట్టమర** రూ.చూ. కటమర. వి. చెక్కిలి మీదిభాగం, హనువు.

**కట్టమేరలు** వి. బ.వ. గ్రామ సేవకులపై విధింపబడిన చెల్లింపులు. కనిగిరి. శా. క్రీ.శ. 1476.

తు. కట్టుని. ప్రభుత్వ పనులకు చెల్లింపు; త. కట్టు (కట్టి). చెల్లించటం ; కొండ. కటు-కాచ్. చెల్లించు.

**కట్టఁబెట్టు** చూ. కట్టు. స.క్రి. 1. అంటగట్టు ; 2. బలవంతంగా పెళ్ళిచేయు.

**కట్టయింటిగౌడు** వి. ఒక ప్రాంతంలోని కుమ్మరివాళ్ళ వర్గానికి కుల పెద్ద.

**కట్టరము** రూ. కట్టారము. వి. నాట్యబంధం. ఆం.భా. 1.130.

త. కటువుట్, చటుయ్. నాట్యవిశేషం.

**కట్టరాయి** వి. ఆయుర్వేద వైద్యులు సిద్ధంచేసి పెట్టుకున్న వంశానుగతికమైన మందు, కుప్పికట్టు.

క. కుప్పికట్టు. సీసాలో నిండిన మందు, ద్రవ్యం; త. కుప్పి-చ్చెరక్క. గాజుపాత్రలో ఉంచబడినమందు పొదరు.

దీన్నిబట్టి చూడగా మందును కలిపి ఘనపదార్థంగా ఒక రాయివలె తయారుచేయగా దీనికి కట్టరాయి అని పేరు ఏర్పడి వుండవచ్చు.

**కట్టరౌతు** వి. ఎర్ర కంచురాయి.

**కట్టలుక** చూ. కడు. వి. మనః ప్రియుల పొలయలుక. కు.సం. 8.146.

**కట్టవ** రూ.చూ. కట్ట[1]. వి. 1. పొలంలో వర్ష వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా మధ్యనవేసే మట్టి కట్ట ; 2. గడ్డి మేటుకు చుట్టూ దడిగా వేసిన ముళ్ళకంచె ; 3. బతికిన చెట్లతో కట్టిన దడి ; 4. ఆవరణ.

**కట్టా** రూ.చూ. కట్ట[2]. అవ్య. వంతాప సూచకపదం. అకటా. భాగ. 1.311.

**కట్టాకు** వి. నాటుకు సిద్ధమైన నారు.

**కట్టాణి** చూ. కడు. వి. మిక్కిలి గుండ్రని ప్రశస్త మౌక్తిక విశేషం, ఆణిముత్యం. భీమ. 1.116.

క. కట్టాణి. మంచి విలువగల ముత్యం; తు. కట్టాని. బంగారు గొలుసు; త. కట్టానిముత్తు. విలువైన ముత్యం.

<క. కట్టాణి.

**కట్టాణిగుండ్లు** వి. మెడ నగ, భూషణం, ముత్యాలహారం.

**కట్టాణిముత్తెము** వి. ఆణిముత్యం.

**కట్టాయం[1]** వి. రెండురాళ్ళు నిలువుగా రెండు అడ్డంగా ఇటుకలను పేర్చడం.

త. కట్టాయమ్. వెడల్పుగా ఇటుకలను పేర్చడం.

**కట్టాయం[2]** వి. 1. దివ్యస్థలాలలో దేవునికి చేసిన మహానివేదనం, పూజారులందరు పంచుకొనేది. దానినే వారు యాత్రికులకు అమ్ముతారు, దేవుని ప్రసాదం ; 2. నిశ్చయం.

త. కట్టాయం. పురాతనమైన పన్ను.

**కట్టాయము** రూ. కడ్డాయము, ఖడాయము. వి. బలత్కారం, నిర్బంధం. కు.సం. 8.177.

క. కడ్డాయ. బలవంతం, తప్పనిసరి; త. కట్టాయం.

**కట్టాయితపడు** చూ. కట్టాయితము.

**కట్టాయితము** చూ. కడు, ఆయితము. వి. 1. సంసిద్ధత. ఉ. హరి. 2.25; 2. సన్నద్ధమైన సైన్యం. భాగ. 6.445.

పో.చూ. క. కట్టాయ. ఆయ, కఠినమైన నిబంధన, గట్టి నిర్ణయం.

త. కట్టాయం. బలం, బలవంతం, నిశ్చయంగా.

**కట్టాయితపడు** అ.క్రి. సిద్ధపడు, పూను. వేంక.పంచ. 3.158.

**కట్టారము** రూ.చూ. కట్టరము. వి. నాట్యబంధం.

**కట్టారిగంపొయ్యి** వి. అడుగుమట్టం పెట్టి గుండ్రంగా జానెడెత్తుతో మూడు గుబ్బలు పెట్టి చేసిన పొయ్యి.

**కట్టావి** చూ. కడు. వి. మిక్కిలి వేడిమి, అధికంగావచ్చే ఆవిరి.

క. కటుక. సూర్యుని వేడిమి, సూర్యప్రకాశం; కటు. వేడిమి; త. కటుమయ్. వేడిమి.

**కట్టావులుకేరు** చూ. కట్టావి. అ.క్రి. పొగలుకమ్ము.

**కట్టి** వి. ఊడ్పులకు విత్తనం చల్లటానికి ముందు మళ్ళల్లో ఎరువుగా వేసిన తొక్కేచెట్ల ఆకు ; 2. పొట్టు, ఊక.

త. కట్టి. ముద్ద, గడ్డ, కూడటం.

**కట్టిక[1]** రూ. కటిక[1]. వి. మాంసం అమ్మే జాతి.

సం. ఖట్టిక-. కసాయివాడు, మాంసికుడు, వేటకాడు; ఖట్టికి. కటికది ; ప్రా. ఖట్టిఅ, ఖట్టిక్క. కసాయివాడు; హిం. ఖట్టిక. శౌనికుడు.

క. కటిక. కసాయివాడు; కట్టిగెయవ, కట్టిగెకార, కట్టిగెగార. హంతకుడు ; త. కటి-.

<సం. ఖట్టిక-.

**కట్టిక[2]** రూ.చూ. కటిక[2]. వి. వేత్రహస్తుఁడు, వేత్రహస్త.

**కట్టికవాఁడు** రూ. కటికవాఁడు[2]. వి. 1. వెండిబెత్తంవాడు, వేత్రహస్తుడు ; 2. స్తుతిపాఠకుడు.

**కట్టికురుపు** చూ. కట్టు.

**కట్టించు** చూ. కట్టు.

**కట్టిడి** రూ.చూ. కట్టడి[1]. వి. నియతి, భాగ్యం. ఆం.భా. 199. వి. కఠినమైన, దుర్మార్గమైన, దయలేని.

**కట్టిడితనము** కఠినత్వం, క్రూరత్వం.

**కట్టిడు** రూ.చూ. కట్టిఁడి. వి. కసాయివాడు, క్రూరుడు.

**కట్టిఁడి** రూ. కట్టడి[4], కట్టడు. వి. 1. క్రూరుడు. భార.విరా. 2.297 ; 2. ప్రౌఢుడు. వాల్మీ. 1.9 ; విణ. అయుక్తమైన చెడు.

క. కడుకు, కడెపు, కడుపు, కడుమె. కఠినత, క్రూరత; తు. కడు. తీక్ష్ణం, క్రూరత; కడ్డు. క్రూరత ; త. కటు, కటుమయ్. క్రూరత, కఠినత, దుర్మార్గం ; మ. కటు. భయంకరం ; కటుము. పరుషత్వం, కఠినత్వం, ధైర్యం, పరాక్రమం.

**కట్టినది** చూ. కట్టు.

**కట్టిపెట్టు[1]** చూ. కట్టు.

**కట్టిపెట్టు[2]** చూ. కట్టు.

**కట్టిమోత** వి. వరి, చొప్ప మొ॥ వాని కట్టలుగట్టి మోయటం, ఘనమోత.

**కట్టియ**[1] రూ. కట్టె. వి. **1.** పరక, చిగురు. భార.విరా. 1.78 ; **2.** బాణం, అమ్ము. భార.ద్రోణ. 1.371.

నం. కాష్ఠ, కాష్ఠికా ; ప్రా. కట్టియా, కఠ్ఠ-. కొయ్య, కడ్డి ; అమా. కట్ఠి ; హిం. కాష్ఠ.

క. కట్టిగె ; తు. కట్టిగె ; త. కొట్టు ; గోం. కాటియ ; బ్రా. కాట్.

<ప్రా. కట్టియా.

**కట్టియ**[2] వి. బంగారం, వెండి మొదలైనవాటిని తూచటానికి ఉపయోగించే గురివిందగింజ మొదలైనవి. ఆం.భా. 2.300.

**కట్టియగాండ్లు** వి.బ.వ. ఒట్టువాళ్ళు.

**కట్టిల్లు** అ.క్రి. నమకూడు, ఘటిల్లు.

నం. ఘటిత-. నమకూడు, ఘటిల్లు.

**కట్టివేయు** చూ. కట్టు.

**కట్టు** వి. **1.** గట్టు, తీరం. దామలూరు శాసనం, కడపజిల్లా, క్రీ.శ. 750 ; **2.** ఆకృతి విశేషం, కూర్పు. హర. 5.47 ; **3.** గింజపట్టని వరి. ఆము. 4.13 ; **4.** గృహాంతర్భాగం, మిత్రి.యయా. 3.100 ; **5.** స్నేహభావం ; **6.** కంది పప్పులోనగువాని రసం, యూషం. ఆం.భా. 2.20 ; **7.** (పొల్లుయొక్క) నమూహం ; **8.** సరిహద్దు, హద్దు ; **9.** బందం, ఏర్పాటు, ధాన్యం దాచుకోటానికి కట్టే పురిపై రక్షణగా గడ్డి మెలిచుట్టబడిన కట్టు ; **10.** తీవ్రం, గాఢం ; **11.** విరేచనాల్లో చివరవడే కల్మషం ; **12.** ఒప్పందం ; **13.** మట్టి, రాయి మొ. వాటితో రక్షణకోసం కట్టిన నిర్మాణం ; **14.** వలిగెం, మోటబొక్కెనపైన ఉన్న ఇనప కట్టు ; **15.** గొర్రు, గుంటక మొ. వాటి అడ్డకు బిగువుకోసం వేసే ఇనుపకట్టు ; **16.** నూలుపోగుల లెక్క ; **17.** చేతి మగ్గం వలకకు గుండు కలిపి బిగించిన దారం ; **18.** ఆన కట్ట, చక్రం పట్టా ; **19.** బండి ; **20.** కుల కట్టుబాటు ; **21.** విషకీటకాల విషం ఎక్కకుండా అరికట్టే మంత్రం ; **22.** రేఖామాత్రంగా ఏర్పడిన మీసం ; **23.** ఇంద్ర జాలంలో భ్రమ ; **24.** తూకం, 2 వీసెలు, 2 దడియాలు ; న.క్రి. **1.** బంధించు. భార.ఆది. 3.28 ; **2.** కూడబెట్టు. భార.ఆది. 5,58 ; **3.** ఇల్లు మొ. వాటిని నిర్మించు. భార. అర. 1.114 ; **4.** దండ మొ. వాటిని కూర్చు. పండి.చ. 1.55 పం. ; **5.** (వస్త్రాదులు) ధరించుకొను, కట్టుకొను, కట్టు. నిర్వ.రా. 1, భాగ. 10, పూ. 1257 ; **6.** గర్భం ధరించు. భార.విరా. 1.228 ; **7.** అగు, ఏర్పడు. భాస్క.రా.యు. 919 ; **8.** నిబద్ధమగు. మార్క. 2.34 ; **9.** బంధించు, మోపు. విజ్ఞా. 1.108 ; **10.** ఇంద్రియాదులను నిరోధించు. వరాహ. 2.176 ; **11.** మూయు, కప్పు. ఉ.హరి. 2.98 ; **12.** ఘటిల్లచేయు, కలిగించు. సారంగ. 2.102 ; **13.** అడ్డగించు, నిరోధించు. దశా. 6.70 ; **14.** చెల్లించు, విధించు ; **15.** ఆరోపించు, మంత్రించు, మోపు ; **16.** అంత్యాక్షరాల నందుకొనిపద్యాలు చదువు ; **17.** పన్ను మొ. వాటిని చెల్లించు.

క. కట్టు. బంధించు, నిర్బంధించు, చేర్చు, సంపాదించు ; తు. కట్టుని, కట్టుణు, కట్టుణొ. బంధించు, నిర్మించు, కట్టు, కట్ట, కట్టు ; కొట్. బంధించు, నిర్మించు, ఇచ్చు ; త. కట్టు. బంధించు, నిర్మించు, కట్టుకొను. పో.చూ. కళై. బంధించు, జుట్టు ముడివేయు ; కట్టు. కురుపులాగ గడ్డ కట్టుకొను ; మ. కెట్టుక. బంధించు, కట్టు, పట్టుకొను, కట్ట కట్టు, చేర్చు ; కట్టి. ఆనకట్ట నిర్మించు, మసీద వింపచేయు, గడ్డకట్టు ; కోట. కాఙ్ ఫ్. బిగించు ; తొద. కార్ర్వె. బిగువగు ; గోం. కట్ట్. మూసుకొను ; కొండ. కట్- (కచ్-). బిగించు, నిర్మించు, ఇచ్చు (ధర) ; కుయి. క్రటు. తాడులాగ మెలికపడు ; గస్ప. వేలాడగట్టు ; గాటి. ముడి, అతుకు ; కాజ. గడ్డకట్టేటట్లుచేయు ; కువి. గట్టికి. ముడివేయు ; కాజ్. గడ్డకట్టేటట్లు చేయు ; పర్జి. కట్. కట్టు, బంధించు, ఇల్లు నిర్మించు ; కటాకటి. ఒకటిగా కలిపికట్టు ; కోలా. కట్ట్. కట్. కట్టు ; నా. కట్ట్. కట్టు ; గద. కఢ్క్, కట్ట్. కట్టు ; కట్. వదులుచేయు ; ఒల్లా. కట్ ; కురు. కర్. రెంటిని కలిపి మెలివేయు ; కఅర్, క్రడ్. గడ్డకట్టేటట్లుచేయు ; కఅర్త్. ఘనీభవింపజేయు ; మాల్తో. కఢ్. బిగించు ; కఙ్కర్. నిబంధనలో పెట్టుకొను.

<మూ.ద్రా. .*కట్-.

**కట్టిపడుపు** న.క్రి. నిర్బంధించి కుడుపు, అవశ్యమనుభవించేట్లు చేయు, బలాత్కారంగా అనుభవించేట్లు చేయు. సారంగ. 2.33. **కట్టించు** న.క్రి. నిర్మించేట్లు చేయు. కాశీ. 3.81, బంధించేట్లు చేయు. హర. పీఠి. 9.10. **కట్టినది** వి. గర్భిణి, సూడిది (స్త్రీ, పశువు). ఆం.భా. 2.263. **కట్టిపెట్టు**[1] న.క్రి. మానివేయు, వదలి పెట్టు. **కట్టిపెట్టు**[2] న.క్రి. **1.** బలవంతంగా పెళ్ళిచేయు ; **2.** అప్పగించు ; **3.** దాలించు ; **4.** దాచు ; **5.** అణగగొట్టు ; **6.** నిర్మించు ; **7.** బంధించు ; **8.** అంటగట్టు. **కట్టివేయు** న.క్రి. **1.** నిలుపుచేయు, బంధించు, నిర్మించు. **కట్టుకట్టు** అ.క్రి. **1.** నమ్మేచేయు, పనిచేయకుండునట్లు నిర్ణయించు ; **2.** ఆవంలో నిలువుగాను, అడ్డంగాను కుండల్ని పేర్చు. **కట్టుకత** రూ.చూ. కట్టుకథ. వి. కల్పిత కథ. **కట్టుకథ** రూ. కట్టుకత. వి. కల్పితకథ. క. కట్టుకథె, కట్టుకథ్. కల్పన ; తు. కట్టుకతె. కల్పన. **కట్టుకమ్మి** వి. కట్టుచెరగు, చీరకట్టుకొనేటప్పుడు నడుముకు చుట్టుకొనే లోపలిచెరగు. **కట్టుక్కరపాని** వి. రోగవిశేషం, చిడుం. త. కట్టుక్కరపాన్. పిల్లలను బాధించే బొబ్బల్లాంటి రోగ విశేషం. **కట్టుకర్ర** వి. అల్లు చేసేటప్పుడు ఊర్పైయొక్క అడ్డపట్టెపక్కన బిగించిన కర్ర. **కట్టుకాలవ** రూ. కట్టుకాల్వ. వి. చెరువుకు నీళ్ళువచ్చే కాలవ. **కట్టుకాలు** వి. వలిగానికి వేసిన అడ్డచువ్వ. **కట్టుకాల్వ** రూ.చూ. కట్టుకాలవ. వి. చెరువుకు ఏటినుండి నీటిని మళ్ళించే కాల్వ. **కట్టుకావలి** వి. కప్పంకట్టేవాడు, అరిగాపు. **కట్టుకానులపేరు** వి. భూషా విశేషం, మెడలో వేసుకొనే కానులదండ. **కట్టుకూలి** వి. సంవత్సరమంతా ఒక రైతుకే జీతానికి కూలిపనిచేసేవాడు. **కట్టుకొంగు** రూ.చూ. కట్టుంగొంగు. వి. నడుముకు కట్టుకొనే చీరకొంగు, పైటకొంగు, కట్టుకొంగు. **కట్టుకొంగుకమ్మి** వి. చీరకట్టుకొనేటప్పుడు లోపలికివచ్చే అడ్డకొనలోనేసిన కమ్మి. **కట్టుకొను** న.క్రి. **1.** సంపాదించుకొను, తెచ్చిపెట్టుకొను. భార.అను. 6.320 ; **2.** అనుభవించు, (లాభాదులను)

హొందు. భాస్క.రా. 2.60 ; 3. ధరించు, తాల్చు. భాగ. 10, పూ. 1255 ; 4. బంధించుకొను. కువ.చ. 2.24 ; 5. పెండ్లాడు. కట్టుకొమ్మ రూ. కట్టుఁగొమ్మ. వి. అగడ్తపై కట్టిన ఆనకట్ట. కట్టుకొమ్ము వి. నీరు కాలవలోకి మళ్ళించ టానికి ఏటిపాయకు అడ్డంగా వేసిన ఆనకట్ట. కట్టుకొయ్య రూ.చూ. కట్టుఁగొయ్య. వి. మేటి, కళ్ళంలో పశువుల్ని కట్ట డానికి పాతిన కఱ్ఱ. కట్టుకోక రూ.చూ. కట్టుఁగోక. వి. పలుమారు ధరించే చీర, ధరించే వస్త్రం. కట్టుకోల వి. పట్టాలు నేసే నార అనుపోసే కొయ్యగూటం. కట్టుగడ వి. కూడబెట్టిన సంచితం, చేర్చిపెట్టిన ధాన్యం. కట్టుగడ చేయు స.క్రి. నిలువచేయు, కూడబెట్టు. కట్టుగడసరకులు వి. బ.వ. నిలవచేసిన సరుకులు. కట్టుగదూడ వి. కట్టుకారుకు వచ్చిన పెయ్య. కట్టుగరకోడె వి. వయసున ఉన్న కోడె, కట్టించే కారుకు వచ్చిన కోడె. క. కట్టిద. యుక్తవయసులో ఉన్న. కట్టుగూళి. తర్ఫీదుకోసం ఉంచిన ఎద్దు. కట్టుగఱ్ఱ వి. 1. ఎదురుదోనె గాడిలో, పడుగు దారాలు బిగించే సన్న బెత్తం ; 2. గొడ్లను కట్టివేసే గుంజ. కట్టుగాడుబిగువు వి. స్థానబలం, పెంటబిఱ్ఱు. కట్టుగాఁడు వి. వానకట్టును బిగించే పనివాడు. కట్టుగారువడ్డ వి. కట్టే అదునుకు వచ్చిన గేదె. కట్టుగారుపెయ్య వి. కట్టే అదునుకు వచ్చిన ఆవు. కట్టుగుంజ వి. పశువులను కట్టే రాట, నిట్రాడి. కట్టుగుండు వి. 1. రాళ్ళను బద్దలుకొట్టడానికి ఉపయోగించేగుండు. ద్వి. పరమ. వి. 6.40 ; 2. తూనికరాయి. ద్వి. పరమ. వి. 6.480. కట్టు గుది వి. తేలికరకం కీళ్ళజబ్బు, ఎద్దు నడిచేముందు కొద్దిదూరం వెనకాళ్ళు కుంటుతూ వెళ్ళడం. కట్టుగుఱ్ఱము వి. దొడ్డిపెట్టిన గుఱ్ఱం. కట్టుగొఱ్ఱె వి. వధించడానికి గుంజకు కట్టిన గొఱ్ఱె. కట్టుగోరు వి. పశువుల్ని కట్టటానికి పాతే కఱ్ఱ. కట్టుఁగంబము (-కంబము) ఏనుగు మొ. వాటిని బంధించే స్తంభం, కట్టు కొయ్య. కాశి. 5.135. కట్టుఁగొంగు రూ. కట్టుకొంగు, వి. చీరకట్టు చెరగు. దశా. 3.89. కట్టుఁగొమ్మ రూ.చూ. కట్టు కొమ్మ. వి. ఆనకట్ట, సేతువు. కట్టుఁగొయ్య రూ. కట్టుకొయ్య. వి. 1. మేధి. కళ్ళంలో పశువుల్ని కట్టడానికి పాతిన గుంజ, కట్రాడు. కాశ. 4.111 : 2. మేడితోఁక. ఆం. భా. 2.234. కట్టుఁగొఱ్ఱు వి. కట్టుకొయ్య. కట్టుఁగోక రూ. కట్టుకోక. వి. మొలకు కట్టుకొనే వస్త్రం, అంత రీయం. కట్టుచారు వి. ఉడుకుతున్న పప్పునుండి తీసిన నీటితో చేసిన చారు. కట్టుచాలు వి. కొండ్రకలిపే చివరి చాలు. కట్టుచిలప వి. నూలు లెక్క, లడిలో దెబ్బయ్యో వంతు నూలు. కట్టుచెరగు వి. చీరకట్టుకొనేటప్పుడు నడుముకు చుట్టుకొనే లోపలి చెరగు. కట్టుచేయు స.క్రి. 1. శాసనాదుల చేత నివారించు ; 2. ఆనతిచ్చు ; 3. ఆపు. కట్టుడురాయి వి. 1. ఎఱ్ఱకంచురాయి ; 2. గోధుమరంగు, బూడిదరంగు కలిపిన ఒకరకం సుద్దరాయి ; 3. క్వార్ట్జుజాతికి చెందిన మిశ్రశిల. కట్టుతప్పు స.క్రి. హద్దుతప్పు, నీతితప్పు. కట్టు తాడి వి. దేవతాడి. కట్టుతాపి చూ. కట్టెతాపి. వి. కట్టుబడిలో వాడే మందపాటి రేకుగల కొంచెం పెద్దసైజు తాపి. కట్టు తాల్చు అ.క్రి. తాడుపేను. కట్టుతెవులు వి. నెత్తురు పారుకునే జబ్బు. కట్టుదిట్టము వి. కట్టుబాటు, ఏర్పాటు. కట్టుదొన వి. కోనేరు, చెరువు. చంద్రాంగ. 5.147. క. కట్టుదొణె. కట్టుప కాపి రూ. కట్టుపకాను. వి. 1. ధీరుడు, శూరుడు. నిర్వ.రా. 4.47 ; 2. సన్నద్ధుడు ; 3. క్రుద్ధుడు ; 4. పోటుకాడు, బంటుకాడు. క. కట్టాళో. మిక్కిలి పరాక్రమవంతుడు. కట్టుపకాను రూ.చూ. కట్టుపకాపి. వి. 1. ధీరుడు, శూరుడు. భార.భీష్మ. 2.382 ; 2. పోటుకాడు, బంటుకాడు. కట్టుపంచె వి. ధోవతి, మొలపంచె, అంతరీయం. కట్టుపట్టు వి. ఆట పట్టు, నిధానం. కాశీ. 2.50. కట్టుపడు రూ.చూ. కట్టువడు. అ.క్రి. 1. బద్ధమగు. దశా. 5.128 ; 2. నిరుద్ధమగు, ఆగు, విరమించు ; 3. తక్కువగు, న్యూనమగు. క. కట్టుపడు. బద్ధమగు. కట్టుపద్యములు వి.బ.వ. ముందరి పద్యంయొక్క అంత్యాక్షరాలతో ప్రారంభించ బడే పద్యాలు. కట్టుపఱచు రూ.చూ. కట్టువఱచు. స.క్రి. అరికట్టు, కట్టుపడేట్లుచేయు. కట్టుపాటు వి. నిబంధనం, ఏర్పాటు, కూర్పు. కట్టుపాటుచేయు స.క్రి. 1. ఆజ్ఞాపించు ; 2. ఏర్పరచు, నియమించు. కట్టుపావ వి. మగ్గంగుంటలో మడమగూటానికి గుదులతో బిగించిన పావుచెక్క. కట్టు పెండి వి. తాడుతోకట్టిన పెండి. కట్టుపెయ్య వి. కట్టే అదు నుకు వచ్చిన ఆవు. కట్టుపోగు వి. చిలపలో చివరిపోగు. కట్టుపోతు రూ. కట్టుమోతు, కట్టుఁబోతు. వి. కట్టుమోతు, మంత్రాలమారి. కట్టుబట్ట వి. మొలనుచుట్టిన బట్ట. కట్టుబడి వి. 1. సేవచేయడానికి భృత్యులు మొ. వారికి శాశ్వతంగా ఇచ్చే మాన్యం. చంద్రాంగ. 4.24 ; 2. ఆవంలో కుండల్ని దొంతుల్లాగ క్రమంలో ఏర్పరచిన విధానం ; 3. భూకా మందుకు ధాన్యంలో ఇంత అని ఇచ్చేట్లు నిర్ణయించుకొని చేసే వ్యవసాయం, ఒకరకం కౌలు ; 4. ఒక మాన్యానికి కట్టవలసిన పన్ను ; 5. చేసినపనికి చెల్లించవలసిన మొత్తం ; 6. భవన నిర్మాణపరిమితి ; 7. గ్రామోద్యోగుల దగ్గర పని చేసే బంట్రోతు, తలారి ; 8. ఏర్పాటు, ముక్తాధాన్యం. కట్టుబడిఈనాము వి. తక్కువ కౌలుకిచ్చిన భూమి. కట్టుబడి ఖండ్రిక వి. తక్కువ ధర నిర్ణయించి ఇచ్చిన భూభాగం. కట్టుబడిపన్ను వి. భూమిమీద చెల్లింపవలసిన ఒకవిధమైన పన్ను. కట్టుబడిబంట్రోతులు వి.బ.వ. తక్కువ కౌలుకి భూములు పొందిన సేవకులు. కట్టుబడిముకాస వి. సేవచేసి నందుకు అతితక్కువ కౌలుకు ఇచ్చిన గ్రామం. కట్టుబడి రాయి వి. ఇసుపరాయి (Sandstone). కట్టుబడివాడు 1. తలారి ; 2. మంకరి. కట్టుబండి వి. సరకులబండి. విష్ణు. పు. 6.121. కట్టుబిళ్ల వి. అచ్చుకట్టేటప్పుడు పడిదారం చుట్టే కొయ్య. కట్టుమట్టు వి. 1. (పశ్వాదులను) బంధించే చోటు, పసులసాల. విక్ర. 4.78 ; 2. నివాసస్థానం, ఉనికిపట్టు. వరాహ. 6.87 ; 3. కట్టుబాటు, ఏర్పాటు. రామా. 5.325 ; 4. కుప్ప నూర్పిడిలో చిట్టచివరి పడుగుతో గింజలపై నిల్చిన గడ్డి. కట్టుమామిడి వి. 1. చిలకలు మొ. పక్షులు కొరక్కుండా బుట్టలుకట్టిన మామిడి ; 2. అంటుమామిడి. కట్టుమీఱు స.క్రి. హద్దుమీరు, కట్టడతప్పు. కట్టుముడి వి. నిబంధన. క. కట్టలె, కట్లె. చట్టం, కట్టుముడి ; త. కట్టళై. చట్టం. కట్టుమొగులు రూ. కట్టుమొయిలు. వి. ఉదయాస్తమయాల్లో సూర్యుడు కన్పించకుండా అడ్డుపడే మబ్బు. కట్టుమొయిలు

రూ.చూ. కట్టుమొగులు. వి. ఉదయాస్తమయాల్లో సూర్యుడు కనిపించకుండా అడ్డుపడే మబ్బు. **కట్టుమోతు** రూ.చూ. కట్టుపోతు. వి. మాంత్రికుడు, మంత్రాలమారి. **కట్టుంబోదలు** వి.బ.వ. అడ్డగా ఉన్న లావుపాటివి. చేజర్ల శాసనం. క్రీ.శ. 709-746, వి. పొదలతోకూడిన కంచె. **కట్టు(బోతు** రూ.చూ. కట్టుపోతు. వి. **1.** మంత్రాలమారి, మంత్రగాడు, కట్టుమోతు, దెయ్యాలను పట్టించేవాడు, చిల్లంగివాడు, ప్రయోగంచేసేవాడు ; **2.** పొగడుబోతు. **కట్టుమ్రాను** వి. జా. తెప్ప, ప్లవం, నావ. **కట్టురాతు** ఎర్రకంచురాయి. **కట్టులేనివా(డు** వి. నియమంలేనివాడు, ఉద్దాముడు. **కట్టుల్లు** వి.బ.వ. కట్టుబాటు ('బందెకాన' అని కొందరు). **కట్టువ** వి. **1.** వెలుగు, కంచె, ఎల్లకంచె. అచ్చ.రా. 5.95 ; **2.** పొలం సరిహద్దులలో నిర్మించిన రాతికట్టడం ; **3.** వంకలకు అడ్డంగావేసిన కట్టలు ; **4.** చిన్నగుట్ట ; **5.** రెండు చేలమధ్య ఉండే ఎత్తైన గట్టు ; **6.** నీటిలోనిమన్ను పెల్లగించే గసిక ; **7.** సేతు విశేషం, **8.** ఒకరకమైన ఉచ్చు. **కట్టువడు** రూ. కట్టుపడు. అ.క్రి. **1.** బద్ధమగు. హరి.పూ. 8.102 ; **2.** అడ్డుపెట్టబడు. ఉ.రా. 1.285 ; **3.** తక్కువగు. **కట్టువర్గము** వి. కట్నం ఇచ్చే వస్త్రసముదాయం. శుక. 1.135. **కట్టువఱచు** రూ. కట్టుపఱచు. వి. నిరోధించు. పి.శకు. 2.113. **కట్టువాక** వి. రోజూ కట్టుకోడానికి నేసిన చీర. **కట్టువిరువు** వి. మైలగుడ్డ, మావు. సాం.ని. 2.28. **కట్టుక** రూ. కట్టుగ. వి. పశ్వాదుల గర్భస్రావం. ఆం.భా. 2.264. అవ్య. కట్టుకొని, పరిపాలనాధికారం కలిగి. **కట్టుగ** రూ.చూ. కట్టుక. వి. గర్భస్రావం, పశ్వాదుల గర్భస్రావం.

**కట్టె** రూ.చూ. కట్టియ[1]. వి. **1.** బాణం. భార.శల్య. 1.377 ; **2.** కర్ర, కాష్ఠం, దండం. భీమ. 2.10, మను. 4.24 ; **3.** గొడ్డలి ; **4.** పంట కోసినతర్వాత మిగిలిన వేళ్ళతోఉన్న మోడు, ఉలవకంది మొ॥ వాటి ఎండుగడ్డి, **5.** కొయ్యకాలు ; **6.** వడుగు ఏరేటప్పుడు ఉపయోగించే కర్ర ; **7.** శవం. విశే. **1.** కఠినమైన ; **2.** క్రూరమైన.

**కట్టెఒల్లు** వి.బలహీనమైన శరీరం, **కట్టెకట్ట** వి. కర్రకత్తి, లాదుమీద మోది చదును చెయ్యడానికి వాడే కొయ్యకత్తి. **కట్టెకొమ్ము** వి. సన్నటి గట్టికొమ్ము. **కట్టెకొలువు** వి. గుర్రంగా ఉండే చిన్న ఆకులు కలిగి పచ్చగాఉండే పళ్ళుకాసే ఒక మొక్క. (Grewia populifolia). **కట్టెగుఱ్ఱము** వి. **1.** కర్రను గుర్రంగా చేసి ఆడుకొనే ఆట, బాల క్రీడావిశేషం. హంస. 3.146; **2.** కర్రతో చేసిన గుర్రంబొమ్మ. **కట్టెగెడ** వి. తలుపురెక్కల్లో ఒకదానికి బిగించిన పంగటిలిసకొయ్య. **కట్టెగోధుమ** వి. గింజ ఎర్రగా పొడుగ్గా ఉండే రకం గోధుమ. **కట్టెచవుడు** వి. కొయ్యచవుడు, గట్టి తెల్లని చవిటినేల. **కట్టెచిట్టె** వి. కిటికీ రెక్కలను మూసి ఉంచే గడియ. **కట్టెచిర్ర** వి. కోతిపల్ల, నేత నేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపల్ల. **కట్టెచీమ** వి. నల్లని గండుచీమ. పో.చూ. కన్న. *కట్టిరివి*, *కట్టిపహె*. నల్లని పెద్ద గండుచీమ. **కట్టెచౌరవ** వి. కొయ్యలతో కట్టిన మోటబావి ఉద్ది. **కట్టెతాపి** చూ. కట్టుతాపి. వి. **1.** కొయ్యతో చేసిన తాపి ; **2.** లాదుమీద మోది చదునుచెయ్యటానికి వాడే కొయ్యకత్తి. **కట్టెతాపు** వి. దిమ్మిన అడుగున ఉండే కొయ్యదుంప. **కట్టెదాసా** వి. ఉత్తరాసిమీద పరచిన చెక్క. **కట్టెదిమ్మస** వి. కొయ్యదిమ్మగల దిమ్మిస. **కట్టెపండు** వి. గింజలు తీయని చింతపండు, గింజలతోను, ఉట్టెలతోను ఉండే చింతపండు. **కట్టెపర్ప్ప** వి. పలచని చెక్కలతో వేసిన కప్పు. **కట్టెపసక** వి. ఒక రకం ఉన్ని. **కట్టెపా(వర** వి. ఒక రకం చెట్టు. **కట్టెపార** వి. ఇనపరేకుకు బదులు పల్చని చెక్కకు బిగించిన పార, కళ్ళంలో గింజలు పోగుచేసే కొయ్యపార. **కట్టెపారు** అ.క్రి. కట్టెవలె పొడవుగా గట్టిగా ఉందు, కొయ్యబారు. **కట్టెపిట్ట** వి. బక్కచిక్కిన వ్యక్తి. **కట్టెపురి** వి. కొయ్యలతో కట్టిన మోటుబావి ఉద్ది. **కట్టెపుల్లలు** వి.బ.వ. ఆముకాల్పుకు వాడే ముళ్ళులేని కంపకట్టెలు. **కట్టెపేవా** వి. కలం. **కట్టెపొంగలి** వి. బియ్యం పెసరపప్పుతో పాలు పోయకుండా వండిన పొంగలి. **కట్టెపొట్టు** వి. కాయపొట్టు, పెసర, వేరుశెనగ మొ॥ కాయధాన్యాల పొట్లు. **కట్టెపొడ** వి. ఇనపరేకుకు బదులు పల్చని చెక్కకు బిగించిన పార. **కట్టెపొయ్యి** వి. మూడువైపుల గోడలాగ పెట్టి ముందువైపు కట్టెలు పెట్టడానికి జానెడు వెడల్పు మూతి ఉండే పొయ్యి. **కట్టె పొరదిండు** వి. రాతిగనిలోని రెండో పొర. **కట్టెబద్ద** వి. ఇంటికప్పు వేయడంలో వాడే పల్చని చెక్క, దంతులకు మధ్య బిగించేది. **కట్టెబుద్ధి** వి. కఠిన స్వభావం **కట్టెమొద్దు** వి. గానుగరాతిని తగిలించే కొయ్యదూలం. '**కట్టెమోత** వి. వరి, చొప్ప మొదలైనవాటిని కట్టలు గట్టి మోయటం, పనమోత. **కట్టెలపొయ్యి** చూ. కట్టిపొయ్యి. వి. మూడువైపులా గోడలాగ పెట్టి ముందువైపు కట్టెలు పెట్టడానికి జానెడు వెడల్పుగల మూతి ఉండే పొయ్యి. **కట్టెలబట్టీ** వి. కట్టెపుల్లల్తో కాల్చే ఇటికబట్టీ. **కట్టెలాడెకొమ్ము** వి. ఒక రకం నాడె, పడుగు పైపోగులకు, కింద పోగులకు మధ్య పేకదారం నేయడానికి విసిరే కొయ్యనాడె. **కట్టెలోపెట్టు** స.క్రి. ఖైదులో ఉంచు. **కట్టెవిరచినట్టుగా** క్రి.విశే.ద్రు. కఠినంగా, పరుషంగా; **కట్టెవిరుపుమాట**. వి. పుల్ల విరుపుమాట, పరుషవచనం, కఠినోక్తి. **కట్టెసామాను** వి. గృహ నిర్మాణానికి కావలసిన కలప సామాను. **కట్టెసువ్వలు** వి.బ.వ. ఎత్తెగుంజ్లు, సారె తయారీలో సారె లోపలపెట్టే వెదురు చువ్వలు. **కట్టెహాల** వి. కట్టెపుల్లల్తో కాల్చే ఇటికబట్టీ.

**కట్టెడ** చూ. కట్టు. వి. కట్లపాము.

పో.చూ. క. *కట్టిన హావు*; తు. *కట్టుకడంబలె*. తెల్లని చారలున్న విషసర్పం.

**కట్టెదురు** చూ. కడు. వి. మిక్కిలి ఎదురు.

**కట్టెము** రూ.చూ. కట్యం. వి. ప్రకటన చేయడానికి అరచి చెప్పడం.

**కట్టెర** వి. పుర్రె.

**కట్టేత** వి. **1.** భర్త పోయిన స్త్రీని మరొకనికిచ్చి చేసే పెళ్ళి ; **2.** మారుమనువు.

**కట్ట్ర** వి. కిటికీ రెక్కలను బంధిస్తూ గుండ్రంగా తిరగటానికి పీలుగా అమర్చబడిన చిన్న గడియ.

నం. కటుక-. నడికట్టు, చుట్టుకొని ఉండే గొలుసుయొక్క ఒక కొక్కెం, వలయం, చక్రం.

<నం. కటక-.

కట్నంగానికలు వి.బ.వ. కట్నం, కానుక, కట్నమంటే ప్రభుత్వానికి గౌరవార్థం చెల్లించే ద్రవ్యం, కానిక అంటే దేవునికి ద్రవ్యరూపంగా కాని ఫలరూపంగా కాని భక్తితో ఇచ్చే వస్తువులు, రాజుకు, దేవుడికి సమర్పించుకొనే వస్తువులు.

కట్నంతాడు వి. ఆకుతాడు, రాట్నం ఆకుకు చుట్టినతాడు.

కట్నము రూ. కటనము, వి. 1. కానుక, కానుకగా ఇచ్చే వస్త్రం, బసవ. 4 పు. 19. పం., భాగ. 10.1208; 2. నెలకట్టు. దశా. 1.272; 3. కట్టనం, కూర్పు. దశా. 2.281; 4. ఈనాం, పని మొదలుపెట్టినప్పుడు పూర్తి అయిన తరవాత ముఖ్యులకు ఇచ్చే బహుమానం.

త. కట్టణం. ఫీజు, బాకీలు, కట్టడం. (పతిట్టుప్); కట్టు (ఇన్-జ-వ). మినహాయించు, నిర్ణయించు.

కట్నాలు వి.బ.వ. 1. సోపానాలు, మెట్లు; 2. నిషేక ముహూర్తం.

కట్యం రూ. కట్టెము. వి. ప్రకటన చేయడానికి అరచి చెప్పడం.

కట్రి రూ. కొటార. వి. ప్లేటులాగ ఉండే చిన్న మట్టిపాత్ర.

కట్రాడ రూ. కట్రాడు. వి. కట్టుకొయ్య, గుంజ.

కట్రాడు రూ.చూ. కట్రాడ. వి. కట్టుకొయ్య, గుంజ.

కట్రాయి వి. ఎర్రరాయి, కట్టుబడికి పనికివచ్చే ఒకరకం రాయి.

కట్రొతు వి. నిర్మాణద్రవ్యంగా కొన్ని ప్రాంతాల్లో వాడే ఒక రకం రాయి.

కట్ల[1] ప్రత్య. సమయాన్ని సూచించే ప్రత్యయం

కట్ల[2] రూ.చూ. కట్లి[2]. వి. ఒకానొక తీగ, ఖట్వ.

కట్ల[3] వి. కట్లమంచం, మంచపుడోలి. ఆం.భా. 2.201.

కట్లకట్టె చూ. కట్టు. వి. నార శుభ్రం చెయ్యటానికి బండమీద వేసికొట్టే కొయ్యగూటం.

కట్లకడవ చూ. కట్టు. రూ. కట్లుకడవ. వి. కట్టుపెట్టి చేసిన మట్టిపాత్ర.

కట్లకాడ చూ. కట్టు. వి. ఒకరకం కలుపు మొక్క. (Carpopogampuriens).

కట్లగుండియ చూ. కట్టు. వి. ఆయుధ విశేషం, ముసుండి, కొయ్య గుదియ.

కట్లగుదియ చూ. కట్టు. వి. ఇనపకట్లలాటి కర్ర.

కట్లంక వి. వరన గుడ్డలపై ఉంచే ఒంటిగుడ్డ.

కట్లచెట్టు వి. ఒకానొక చెట్టు, శంఖిని. ఆం.భా. 2.82.

కట్లచెర్రి చూ. కట్టు. వి. కట్లుగల చెర్రి. ఆము. 4.89.

కట్లతీగ రూ. కట్లితీగ. వి. మెట్టభూమిలో మొలిచే తెల్లని నూగు నిండిన తీగ (Coculus villosus).

కట్లదండ చూ. కట్టు. వి. నల్లపూసలు గుచ్చి బంగారు కట్టు కట్టిన దండ.

కట్లపాము చూ. కట్టు. వి. మేనిపై కట్లవంటి చారలుగల ఒక జాతి పాము.

క. కట్టినహావు, కట్టుహావు. తాచు పాముల్లో ఒక జాతి క్రూరమైన పాము; తు. కట్టుకడంబలె. తెల్లని చారలుగల ఒక పాము.

కట్లపీట వి. 1. కండెలపీట, కండెలుచుట్టే మనిషి కూర్చోటానికి రాట్నందగ్గర వేసుకొనే పీట; 2. గంజి పట్టించడానికి వడుగుపరచే పీట.

కట్లపురుగు చూ. కట్టు. వి. కట్లపాము.

కట్లపూవురంగు వి. లేత నీలంరంగు.

కట్లపొడి చూ. కట్టు. వి. బీడలు వక్కాకుతో వేసుకొనే పొగాకు కాడల పొడి.

కట్లబల్ల వి. కత్తెరకాళ్ళ మడుపుబల్ల.

కట్లమంచం చూ. కట్ల[3]. వి. యావ్యయానం, మంచపుడోలి.

కట్లమారి చూ. కట్టు. కట్ల+మారి. వి. కట్లుగలది. చుట్టూ లోహంతోగాని, కర్రతోగాని చట్రంగలది. చంద్రాంగ. 4.127.

కట్లరి వి. కత్తులు, గరిటెలు మొదలైన వంట సామాను.

ఇం. *Cutlery*. కత్తులు, కత్తెరలు మొదలైన నరికే సాధనాలు.

<ఇం. Cutlery.

కట్లలం వి. కట్లతీగె.

కట్లనంచి వి. చుట్టూ అరలేర్పరచి కుట్టిన నిడుపాటి గుడ్డ నంచి.

కట్లసరి చూ. కట్టు. కట్లదండ. వి. బంగరుపూసలు నల్లపూసలు ఒకదానితర్వాత ఒకటిగల దండ. హంస. 4.138.

కట్లసొర్ర చూ. కట్ట. వి. ఒకరకం చేప.

త. కట్లా. సముద్రపు చేప. కటాల్-ఉల్లమ్.

కట్లా వి. తగాదా, వివాదం, కలహం.

కట్లి[1] రూ. కట్లె[2]. వి. మంచండోలి.

నం. ఖట్వ, ఖట్వి, కటూహ. మంచం; హిం. ఖాట్; త. కట్టిలె; మ. కట్టిల్; గోం. కట్టెల్; కువి. కటెలి; కుఇ. కటె; మాల్తో. కటె, కటి; బ్రాహు. కట్; కురు. ఖాటి.

కట్లి[2] రూ. కట్ల[2], కట్లె[3]. వి. ఒకానొక తీగ, ఎరచిపిడుక.

కట్లియ రూ.చూ. కట్లు. స్వర్ణాదుల్ని తూచడానికి ఉపయోగించే గురివిందగింజ మొదలైన తూకం రాళ్ళు.

కట్లు రూ. కట్లియ, కట్లె[1]. వి.బ.వ. స్వర్ణకారులు ఉపయోగించే తూకం రాళ్ళు.

క. కడలె, కడ్లె; తు. కడలె; త. కట్టాలై. 1. ప్రామాణికమైన తూకం; 2. సెనగపప్పు; మ. కటాల.

కట్లుకడవ చూ. కట్టు. రూ.చూ. కట్లకడవ, కట్లు పెట్టి చేసిన మట్టిపాత్ర.

కట్లుతీయు చూ. కట్టు. స.క్రి. కడవకు చుట్టూ చిన్న బాలికలు అంటించి బద్దలు బద్దతో కొట్టు.

కట్లుపొయ్యి చూ. కట్టెలపొయ్యి. వి. మూడువైపులా గోడలాగ పెట్టి ముందువైపు కట్టెలు పెట్టడానికి జానెడు వెడల్పు మూతి ఉండే పొయ్యి.

కట్లె[1] రూ.చూ. కట్లు. వి. స్వర్ణాదుల్ని తూచడానికి ఉపయోగించే రాళ్ళు. ఆం.భా. 2.300, కవిక. 3.193.

కట్లెనంచి వి. బంగారం తూచుకొనే తూకంరాళ్ళ నంచి.

కట్లె[2] రూ.చూ. కట్లి[1]. వి. కట్లమంచం.

కట్లె[3] రూ.చూ. కట్లి[2]. వి. ఎరచిపిడుక, ఒకానొక తీగ, కట్లతీగ.

కట్లెతీగ రూ.చూ. కట్లతీగ. వి. పొదలమీద, చిన్న చెట్లమీద

పాకే ఒక తీగ (Coculus villosus).

కట్లెల వి. బంగారం తూచుకొనే తూకంరాళ్ళ సంచి.

కట్వర్క్ వి. ఎంబ్రాయిడరీ నమూనాలో కొన్ని భాగాలు కత్తిరించి కుట్టడం లేదా కుట్టినతర్వాత కత్తిరించడం.

ఇం. *Cut work*. కత్తిరింపుపని.

<ఇం. Cut work.

కఠారి రూ.చూ. కటారు. వి. **1.** బాకు ; **2.** కత్తి.

కఠిల్లు రూ. కఠీలు. వి. కొట్టడంలో అయ్యే ధ్వనికి అనుకరణం. మను. 4.37.

కఠీలు రూ.చూ. కఠిల్లు. వి. కఠిన పదార్థాల సంఘర్షణం లేక తుపాకీ మొదలగు వాని ధ్వన్యనుకరణం. ప్రబంధ. 7.88.

**కడ** రూ. కెడ, గెడు. వి. **1.** కాలం, వేళ. భార.ఆది. 3.12 ; **2.** సమీపం, దగ్గర. భార.ఆది. 3.149 ; **3.** పార్శ్వం, పక్క, వంక, వైపు. భార.ఆది. 4.94 ; **4.** స్థానం, స్థలం, ప్రదేశం, చోటు. భార.ఆది. 4.228; **5.** అంతం, తుద, అవధి, మితి, మేర. కు.సం. 6.5 ; **6.** దిక్కు, దిశ, గతి. ఉ.హరి. 3.58 ; **7.** మరణం, చావు. ఆము. 6.86 ; **8.** దరి, ఒడ్డు. పారి.పీఠి. 2.4 ; **9.** దవ్వు, దూరం. కళా. 4.93; **10.** పళువుల చివరి పక్కపన్ను ; **11.** పడుగుదువ్వే కుంచెపక్కపన్ను; **12.** అంచులో చిట్టచివరి భాగం. విశే. **1.** అంత్యం, చివరి, నీచమైన. భార.శాంతి. 1.281 ; **2.** అన్యమైన, ఆం.భా. 3.24 ; అవ్య. ఇది ద్రుతాంతంగా ఉండి అంచు ఎడ, విషయంలో, వలన అనే అర్థాల్నిస్తుంది.

క. *కడె*. చివర, అంత్యం, హద్దు, మేర, నీచం, పక్క చోటు, దిశ ; కొడ. *కడె*. అంత్యం ; *కడెకె*. చివరకు ; తు. *కడె*. అంత్యం, దిశ : త. *కటువ*. మార్గం, తోవ, దిశ ; *కడై*. అంత్యం, హద్దు, తక్కువతనం, నీచం ; *కడైచి*. అంత్యం ; మ. *కటు*. మార్గం, కడపటిమార్గం ; కోట. *కడెచ్*. అంత్యం ; *కడెచ్ అకెయ్*. పనికిమాలిన ; *కడెచ్ అచ్*. వరుసలో చివరివనిత ; తొద. *కడెచ్-*. అంత్యం ; పర్జి. *కడ*. అంత్యం, దగ్గర.

<మూ.ద్రా. *కట్-.

కడకట్టు[1] రూ.చూ. కడగట్టు. వి. **1.** నిర్ణయం, ఏర్పాటు ; **2.** కుంచె చెంపకు వేసిన దారపుకట్టు. స.క్రి. **1.** యత్నించు ; **2.** ఏర్పరుచు; **3.** నిశ్చయించు. **కడకడ** వి. **1.** చివరిదిక్కు ; **2.** ఈశాన్యదిక్కు. అచ్చ.రా. 1.97. **కడకడలి** వి. **1.** సముద్రం. యయా. 2.69 ; **2.** పశ్చిమసముద్రం. నరస. 5.87. **కడకంటచూచు** అ.క్రి. **1.** కళ్ళను ఒక వైపుకు తిప్పి చూచు ; **2.** పక్కకు చూచు. **కడకంటిచూపు** వి. **1.** కంటి చివరినుంచి చూచే చూపు. కటాక్షం. శృం.నై. 7.41 ; **2.** అవసానకాలంలో చూసే చూపు ; **3.** (ప్రేమతోకూడిన) చివరిచూపు ; క. *కడెగణ్ణు* కంటి చివరిభాగం ; తు. *కడెగన్ను*. **కడకంతలు** వి.బ.వ. దూరంగాఉండే ప్రదేశం. **కడకన్ను** రూ. కడగన్ను, వి. ఔ. అపాంగం, నేత్రాంతం. భార.భీష్మ. 2.305. **కడకళ్ళము** వి. కళ్లం అంచులు. **కడకాలము** వి. అంత్యకాలం, మరణసమయం, తుదివేళ. మరణం. వేంక.పంచ. 1.264. **కడకాలు**[1] వి.ఔ. **1.** పాదం ; **2.** పాదాగ్రం. హరి.పూ. 5.106. **కడకాలు**[2] రూ. కడగాలు. వి. గోడ కట్టడానికి లోతుగా తవ్విన గాడి, పునాదిగొయ్యి. **కడకాళ్ళద్రోచు** స.క్రి. **1.** నిరసించు. శుక. 1.70 ; **2.** తన్ను, గెంటు. **కడకుఁబోవు** (-పోవు). అ.క్రి. **1.** బహిష్ఠగు. ముట్టగు. దశా. 6.53 ; **2.** దూరంవెళ్ళు. **కడకేక** వి. మరణసమయంలో వేసే కేక. **కడకేఁగు** అ.క్రి. బహిష్ఠగు, ముట్టగు. పాం.ని. మాన. 28. <కడ+-కు+ఏఁగు. **కడకొంగు** వి. కొంగు చివర, అంచలాగ్రం. హర. 5.16. **కడకొత్తు** స.క్రి. **1.** దూరీకరించు, నిరసించు. పాండు. 4.220, **2.** చివరకు గెంటు. పో.చూ. త. *కటుత్తు*, *కటువు*. పండించు, తరిమివేయు. **కడకొఱవి** వి. **1.** సగం కాలి పొగ వచ్చే కట్టె. భార.ఉద్యో. 2.275 ; **2.** కాలగా మిగిలిన కట్టె ద్వి.హరిశ్చ.ఉ. 2.056. **కడగట్టు**[1] రూ. కడకట్టు. స.క్రి. **1.** నిర్ణయించు, నిశ్చయించు. హరి.పూ. 5.135. విధించు, నియమించు. పి.శకుం. 2.62. వి. నిర్ణయం, ఏర్పాటు. విక్ర. 8.61, **కడగట్టు**[2] వి. చక్రవాళపర్వతం. ప్రబంధ. 1.60. **కడగట్టురేఖలు** వి.బ.వ. రేఖాచిత్రంలోని కడగీతలు, సరిహద్దులు. **కడగండ్లమారి** వి. **1.** కష్టశీలుడు ; **2.** తొందర మనిషి. **కడగండ్లు** (-కండ్లు). రూ. కడగళ్లు. వి. బ.వ. ఇక్కట్లు, ఇడుములు, విపత్తు. అచ్చరా. 1.93. వి. ప్లేగు వ్యాధి. **కడగను** అ.క్రి. **1.** ముగియు ; **2.** నిశ్శేషమగు ; **3.** దరిచేరు; **4.** శాంతినిపొందు. <కడ+గను. **కడగన్ను** రూ. చూ. కడకన్ను. వి. ఔ. కంటి చివరి భాగం; <కడ+కన్ను. **కడగళ్లు** రూ.చూ. కడగండ్లు, వి.బ.వ. ఇక్కట్లు. **కడగా** క్రి.విశే.ద్రు. పక్కగా, దూరంగా. **కడగాలు** రూ.చూ. కడకాలు[2]. వి. **1.** భూమట్టానికి పైన పునాది గోడ, మీదనుండి శాత్తీల కిందిభాగంవరకు కట్టబడిన గోడ; **2.** గోడలమీద దూలం రాళ్ళకు మధ్య ఇటికముక్కలు వేయడానికి ఉంచిన ఖాళీ. **కడగాలురాయికట్టడం**. వి. చెక్కని రాళ్ళతో కట్టిన నిర్మాణం. **కడగాఱ్ఱాయి** (కడగాలు+రాయి) వి. పునాదిరాయి. **కడగిట్టు**(-కిట్టు) స.క్రి. చేరు, సమీపించు. వేంక.అం. 2.73. **కడగుంజ** వి. ఉన్నిపడుగుతోడే అనుగూటాల్లోకిందిది. **కడగుదిపాయ** వి. అచ్చుగుదిపాయల్లో చివరది. **కడగొట్టు** అ.క్రి. **1.** చచ్చు, నశించు. సారంగ.చ. .1107. విశే. చిన్న, చివరి. బసవ. 3.408 పం. వి. కడసారివాడు. <కడ+కొట్టు. **కడగోడ** వి. ఇంటి పక్కగోడ. (దీనితర్వాత గదులుండవు). **కడగోరు** వి.ఔ. కొనగోరు. నఖాగ్రం. నవనాథ. 2.90. వు. 10 పం. **కడఁగంటఁజూచు** స.క్రి. దయతో చూచు. **కడచను** రూ. కడసను. అ.క్రి. **1.** ముగియు, సమాప్తమగు. భార.ఆది. 2.209; **2.** సాంతమగు, ఫలించు. భార.అరణ్య. 3.68 ; **3.** చచ్చు, మరణించు. భార. శల్య. 1.9 ; **4.** నశించు, పోవు. భార. భీష్మ. 6.971, భార.అను. 1.99 ; **5.** ఫలించు. విప్ర. 2.19 ; స.క్రి. దాటు. భాస్క. రా. కిష్కిం. 7.66 ; విశే. అపారమైన, అనంతమైన. కు. సం. 1.52. **కడచిగురు** వి. అంచు చివరి భాగం. పడుగు నాలుగేసి పోగులు కలిపినప్పుడు అంచు చివరిభాగానికి వాడే నూలుకు నాలుగేసి పోగులు అతుకుతారు. **కడచిల్ల** రూ.చూ. కడచీల. వి. బండిచక్రం బయట బిగించే ఇనపచీల. **కడచీల** రూ. కడచిల్ల, కడంచిల్ల,

కడంచీల, కడసీల, కడిసీల. వి. బండి చక్రం ఇరుసుకు బయట బిగించే ఇనపచీల. కడచుక్క వి. కడనక్షత్రం, రేవతీ నక్షత్రం. కడచెడు అ.క్రి. దిక్కుమాలు, గతిలేక ఉండు. జాహ్నవీ. 2.82. కడచేయు స.క్రి. విడుచు, వదులు, విడిచి పెట్టు. ద్వి.నల. 2.629. కడచేరుచు రూ. కడచేర్చు. స.క్రి. 1. ధన్యునిచేయు. భార.ఉద్యో. 4.155 ; 2. కడతేర్చు, దరిచేర్చు. కడచేర్చు రూ.చూ. కడచేరుచు. స.క్రి. 1. కడతేర్చు, దరిచేర్చు ; 2. ధన్యునిచేయు. కడజముళ్లు వి.బ.వ. అంచుగట్టిదనంకోసం, అంచులో చిట్టచివరిపైపు నేతకు వాడే జమిలిపోగులు. కడజాతి వి. చివరి కులం, చండాల జాతి, చండాలకులం. పాండు. 3.95. కడజాతివాఁడు వి. చండాలుడు, బ్రాహ్మణస్త్రీకి శూద్రుడివల్ల జన్మించినవాడు. కడంచి వి. బండిచక్రం జారిపోకుండా పక్కన ఇరుసులోకి చక్రాల కడదించిన మేకు. కడంచిల్ల రూ.చూ. కడచీల. వి. కడిపెళ్ళు, బండి మోఁవాటి ఉండే చీలలు. కడంచీల రూ. చూ. కడచీల. వి. బండిచక్రం ఇరుసుకు బయటకు బిగించే చీల. కడంచు వి. బట్టకు చివర వదలిన సన్నటి అంచు. కడంచుబద్ద వి. పన్నె కట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెడల్పు బద్ద. కడఁజేయు (-చేయు) స.క్రి. అలక్ష్యం చేయు. కడకట్టునేత వి. చిట్టచివరిభాగం నేత. కడతల వి. చివరి ప్రదేశం, తుది చోటు. కు.సం. 11.153. కడతాకు స.క్రి. తుదిముట్టు, అంతుచూచు. కడతెగు అ.క్రి. ముగియు, సమాప్తమగు. మొల్ల. 13.11. కడతేర్చు రూ. కడతేఱుచు, కడితేర్చు. స.క్రి. 1. కొనసాగించు, నెరవేర్చు, నిర్వర్తించు. భార.విరా. 3.21 ; 2. రక్షించు, కృతార్థత నొందించు. భార.ఉద్యో. 3.201 ; 3. చంపు. భార.ఉద్యో. 4.414 ; 4. నశింప చేయు. ఉ.రా. 4.27. కడతేఱు అ.క్రి. 1. నెరవేరు, సిద్ధించు. భార.విరా. 3.62 ; 2. చచ్చు. భార.భీష్మ. 11.23 ; 3. మూడు. భార.శాంతి. 6.126 ; 4. ముగియు. భార.శాంతి. 6.162 ; 5. పోవు, గతించు. హరి.పూ. 1.100 ; 6. కృతార్థతనొందు. విప్ర. 3.11 ; 7. బతుకు, వర్ధిల్లు, బాగుపడు. ఉ.రా. 6.322. కడతేఱుచు రూ.చూ. కడతేర్చు. స.క్రి. 1. కడతేరజేయు, కృతార్థత నొందించు ; 2. రక్షించు ; 3. చంపు ; 4. నశింపచేయు. కడదవరుచుక్క (-తవరుచుక్క) వి. కడచుక్క, రేవతీనక్షత్రం. వేంక.అం. 1.21. కడదబ్బ వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లలు వరసకు చివరబిగించిన వెడల్పుగల బద్ద. కడదెస వి. చివరిదిక్కు, ఈశాన్యదిశ. అచ్చ.రా.బాల. 97. కడదెసకాపరి రూ. కడ దెస గాపరి. వి. ఈశానుడు. వేంక.అం. 1.17. వ్యు. తుది దిక్కును పాలించేవాడు. కడదెసగాపరి(-కాపరి) రూ.చూ. కడదెస కాపరి. వి. ఈశానుడు. కడద్రొక్కు(-త్రొక్కు) స.క్రి. తుదిచూచు. కడద్రోచు(-త్రోచు) స.క్రి. చివరకు తోయు. ఉ.హరిశ్చ. 1.67. కడనుంచు(-ఉంచు) స.క్రి. పరిత్యజించు, వదలివేయు, గెంటివేయు. కళుష్ప. 1.18. కడంతరకాలము వి. జీవితాంతం. కడపటికొండ వి. చక్రవాళపర్వతం. వేంక.పంచ. 1.7. కడపటివాడు వి. చివరిరోజు. కళా. 2.52. కడపటిమల వి. చక్రవాళపర్వతం.

కడపట్టు రూ.చూ కడఁబట్టు. అ.క్రి. 1. చనిపోవు ; 2. సొమ్మసిలు. కడపని వి. వేరొకపని. కడపల వి.ఔ. చివరి, కడపటి. హరి.ఉ. 9.40. వి. అంతం, చివరి. హరి.ఉ. 9.98. కడపలచేరు అ.క్రి. అంతమగు, నశించు, పోవు. భాగ. 10, పూ. 753. కడపళ్లు వి.బ.వ. చివరి భాగాలు. కు.సం. 10.13. కడపోవు రూ.చూ. కడవోవు. అ.క్రి. ఉడిగిపోవు. కడబంతి వి. పంక్తియొక్క చివర. కడమీఱు అ.క్రి. నియమందాటు. కడముట్టఁబడు అ.క్రి. పారంగతుడగు, అవతలి ఒడ్డుకు చేరు. భీమ. 5.170. కడముట్టించు అ.క్రి. అంతమొందించు. కడముట్టు అ.క్రి. సమాప్తమగు, ముగియు, నిశ్శేషమగు, సంపూర్ణమగు. కళా. 3.130. కడఁబట్టు(-వట్టు) రూ. కడపట్టు. అ.క్రి. 1. మూర్ఛిల్లు. వేంక.పంచ. 2 69; 2. చచ్చు. కడఁబడు(-పడు) అ.క్రి. 1. క్షయించు, తగ్గు. వేంక.పంచ. 1.176 ; 2. పడిపోవు. దశా. 4.183. కడయింటిపొరుగు వి. అతిసంసారు డైన పోటు మానిసి. బసవ. 4.104. వ. కడయిల్లు(-ఇల్లు) వి. 1. పరలోకం, స్వర్గం. ద్వి.భాగ. ; 2. పక్కఇల్లు. కడయేనుఁగు(-ఏనుఁగు) వి. దిగ్గజం. అచ్చ.రా.అయోధ్య. 38. కడయేలిక(-ఏలిక) వి. దిక్పాలకుడు. అచ్చ.రా. అరణ్య. 58. కడయొడయఁడు(-ఒడయఁడు) వి. దిక్పాలకుడు. కడయొత్తు(-ఒత్తు) వి. గృహవిశేషంయొక్క చుట్టుగోడలోని స్తంభాలమీది దూలం. కడరాలు(-ఆలు) వి. కడజాతి స్త్రీ, చండాల స్త్రీ. పండి.చ. 1.42. కడరాశి వి. మీనరాసి. కడఱెప్ప వి. కనురెప్పయొక్క కొన. శృం.నై. 5.9. కడలెంచు స.క్రి. కడచు, దాటు. అష్టమ.క. 221. వ. కడవట్టు(-వట్టు) రూ.చూ. కడవొట్టు. వి. దూలం. కడవన్నె వి. బంగారంయొక్క చివరివన్నె, పదహారోవన్నె, పదహారో వన్నె బంగారం. ఇందు. 2.198. కడవన్నెగుబ్బలి వి. కనకాద్రి, మేరుపర్వతం. ఉ.రా. 7.110. కడవాఁడు వి. 1. సమీపంలో ఉన్నవాడు, సేవకుడు. భార.విరా. 1.96 ; 2. చివరివాడు, కనిష్ఠుడు. మను. 54 ; 3. అంత్యజుడు, చండాలుడు. మల్లు. 3.96 ; 4. దూరపువాడు, అన్యుడు. కడవీను వి. చెవితుద, చెవిచివర. శృం.నై. 6.53. కడవెళ్లు స.క్రి. (దాటు) తరించు. ప్రభా. 3 124. అ.క్రి. సమాప్త మగు. కడవొట్టు రూ. కడవట్టు. వి. దూలం. కడవోవు (-పోవు) రూ. కడపోవు. అ.క్రి. ఉడిగిపోవు. శివ.పా.ఉ. 33 వ. కడవ్రేలు వి.ఔ. చిటికెనవేలు. కనిష్ఠిక. కళా. 3.120. కడసంజ వి. సాయంసంధ్య, మలిసంజ. కళా. 8.10. కడసను(-చను) రూ.చూ. కడచను. స.క్రి. దాటు, అతిక్రమించు. పాండు. 5.51. అ.క్రి. 1. కడచు, గతించు. పాండు. 5.286 ; 2. నశించు, పోవు. ఉ.రా. 3.92. కడసందు వి. ఇంటిలోని చివరి గది. కడసరము[1] రూ. కడసారము, కడసారి. విణ. చివరి, తుది. కడసారము రూ. చూ. కడసరము[1]. విణ. తుది, అంత్యం, చివర. కడసారి రూ.చూ. కడసరము[2]. వి. చివరి పర్యాయం. కడసారిచూపు వి. మరణకాలంలో చూచే చూపు. కడసారివాఁడు విణ. 1. కడపటివాడు, కనిష్ఠ సోదరుడు ; 2. అన్యుడు. కడసీల (-చీల) రూ.చూ. కడచీల. వి. బండి ఇరుసు చివరవేసిన

సీల. కడెత్తుగది వి. ఇంటిలో చిట్టచివరిగది. <కడ+ఎత్తుగది. కడెత్తుగోడ వి. ఇంటిపక్క గోడ. <కడ+ఎత్తుగోడ. కడొత్తు వి. ఇంటికప్పు చివరవేసి బిగించే అడ్డవాసం. <కడ+ఒత్తు.

**కడంక** రూ.చూ. కడఁక. చూ. కడఁగు. వి. **1.** ఉదటు, ఉద్ధతి, గర్వం. భార.అరణ్య. 1.316, రాఘవ. 2.110; **2.** శక్తి, పాటవం. భార.విరా. 5.113; **3.** విధం, రీతి, పోలిక. యయా. 5.109; **4.** పొగరు. రాఘవ. 2.112; **5.** దైన్యం. దశా. 1.275; **6.** ఆధిక్యం, అతిశయం; **7.** చేష్ట, వ్యాపారం; **8.** పూనిక, యత్నం, ఉత్తేజం.

**కడఁక** రూ. కడంక, కఱఁక[1]. చూ. కడఁగు వి. **1.** ఉదుటు, ఉద్ధతి, గర్వం. భార.అరణ్య. 1.47; **2.** పూనిక, యత్నం; ఉత్సాహం. భార.అరణ్య. 2.197; **3.** తలంపు, ఊహ. కు.సం. 2.149; **4.** శక్తి, పాటవం. నిర్వ.రా. 2.10; **5.** చేష్ట, వ్యాపారం. భార.విరా 5.113; **6.** ధైర్యం, స్థైర్యం. వసు. 3.179; **7.** విధం, రీతి, పోలిక. యయా. 5.109; **8.** ఆధిక్యం, అతిశయం. దశా. 1.275.

క. *కడగు, కడంగు, కడుగు.* ఆధికమైన కోరిక, తొందరపాటు, ఉత్సాహాదులతో ఉండు, కృషిచేయు; *కడంగు.* కోరిక, వాంఛ.

**కడఁకు** రూ. కఱఁకు. వి. నిప్పు.

**కడఁగించు** చూ. కడఁగు.

**కడఁగు** రూ. కఱఁగు[1]. అ.క్రి. **1.** అతిశయిల్లు, వర్ధిల్లు, భార. ఆది. 4.288; **2.** ఉద్యమించు, యత్నించు, పూను, ఉత్సాహించు. భార. ఆది. 6.59; **3.** సాహసించు, తెగించు. భార.భీష్మ. 2.406; స.క్రి. ప్రారంభించు, తొడగు. పారి. 1.104.

క. *కడగు, కడంగు.* కృషిచేయు, కోరికతో ఉండు, కోరిక, కృషి; పో.చూ. *కడు.* దృఢత్వం; పో.చూ. త. *కటున్.* నైవేద్యం, కర్తవ్యం; *కటు.* వేగంగా కదులు, నిండుగా ఉండు, వ్యాపించు; మ. *కటున్.*

**కడఁగించు** స.క్రి. ప్రోత్సాహపెట్టు, ప్రేరేపించు, ప్రోత్సహించు. భార.ఉద్యో. 4.242.

**కడచు** రూ. గడచు, గడుచు. స.క్రి. **1.** ఉల్లంఘించు, జవదాటు, దాటు, అతిక్రమించు. భార.ఆది. 3.220; **2.** తొలగించుకొను, తప్పించుకొను. భార.ఆది. 6.247; **3.** (నదీసముద్రాదులను) దాటు, తరించు. భార.ఉద్యో. 4.65; **4.** మించు, అతిశయించు. భార.ద్రోణ. 3.71; అ.క్రి. **1.** గతించు, జరిగిపోవు. భార.విరా. 8.106; **2.** కడముట్టు, పారముపొందు. మార్క. 5.304; **3.** చచ్చు, మరణించు. కాశీ. 6.83; **4.** నశించు, పోవు. శివరా. 3.3; **5.** తొలగిపోవు. సారంగ. 3.122; **6.** ఎక్కువగు, హెచ్చుగు, మీరు. భోజ. 5.24; **7.** సుఖంగా కాలం గడుపు, మర్యాదలతో కాలం గడుపు; **8.** మనుగడ సుఖంగా సాగు.

క. *కడె, కడచు.* దాటు, మీరు, ఉల్లంఘించు; తు. *కడపుని.* దాటు, అధిగమించు, ఉల్లంఘించు, హద్దుమీరి ప్రవర్తించు; త. *కట (న్త-; -ప్ప-).* అధిగమించు, అతిక్రమించు, ప్రపంచం, పుట్టుక మొదలైనవాటినుండి తప్పించుకొను, దాటు; *కటుట్టు.* నడుపు, గడుపు; *కటుపు.* నడుపు, విడుదలచేయు; మ. *కటుక్క.* దాటు, ప్రవేశించు, అధిగమించు; కుఇ. *గ్రాప (-గ్రాత్-).* దాటు; *గ్రాస.* దాటు; కువి. *గ్రాంచలి.* దాటు; పర్జి. *కప్ప్-కడ్డ్.* దాటు; గ. *కర్ప్-(కర్త్).* దాటు; కురు: *కట్టనా.* దాటు, అధిగమించు; *కర్తా, అనా, కట్టా, అనా.* అడ్డంగా తీసుకెళ్లు; *కట్ట్.* నది మొ॥ వానిని దాటు; *కర్త్-.* అడ్డంగా తీసుకువెళ్లు; మాల్తో. *కటె.* అధిగమించు, దాటు; *కట్రి-.* కాలం గడుపు; *కట్.* అధిగమించు; *క్రట్ట్.* కాలం గడుపు; బ్రా. *ఖ్రారింగ్.* కాలినడకను ముందుకు పోవు; *ఖ్రార్.* ముందుకు వెళ్ళు, ప్రారంభించు.

<మూ.ద్రా. *కట్-.

**కడతెంచు** (కడచు+తెంచు) స.క్రి. కడచు, దాఁటు. అష్టమ.క. 13 పం. **కడవఁగఁబడు** రూ.చూ. కడవఁబడు. అ.క్రి. గతించు, కడచు. శుక. 3.3. **కడవవాడు** స.క్రి. మీరిపలుకు, హద్దు, తప్పి మాట్లాడు. **కడవఁబడు(-వడు)** రూ. కడవఁగఁబడు. అ.క్రి. **1.** గతించు, జరుగు. భార. ఆది. 2.222; **2.** శేషించు, మిగులు. హరి.పూ. 8.37. **కడవఁబెట్టు(-పెట్టు)** స.క్రి. **1.** తొలగించు. భార.ఉద్యో. 3.6; **2.** కష్టాదులనుండి దాటించు. భార.ఉద్యో. 5.106.

**కడజు** పెంకుకప్పుగల వసారా.

**కడంజు** రూ.చూ. కడఁజు. వి. గోకర్ణ మృగం, ఒకజాతి దుప్పి.

**కడఁజము** రూ.చూ. కఱఁజము. వి. ధాన్యాదులను దాచే కొట్టు, గాదె, పొణక. కళుక్ష్న. 1.129.

**కడఁజు** రూ. కడంజు, కఱంజు, కఱఁజు. వి. గోకర్ణ మృగం, ఒకజాతి దుప్పి. ఆం.భా. 2.85.

క. *కడబ, కడబె, కడవ, కడపు, కడవె, కడహ, కఱుజ, కడతి, గఱబె.* ఒకజాతి లేడి, గోకర్ణ మృగం; తు. *కడమ.* గోకర్ణ మృగం; త. *కటుమ, కటుమాన్.* అడవిదున్నపోతు; *కటుమై, కటుంపై.* గోకర్ణమృగం; మ. *కటుమాన్.* గోకర్ణ మృగం; కొలా. *కడస్*; నా. *కరస్.*

**కడత** వి. **1.** చెవ (కట్టు) గోడలో బిగించే దర్వాజా కమ్మి; **2.** గోడలో బిగించే కిటికీ చట్రపు అంచు.

**కడతకాడు** వి. చేతిమగ్గంపలక, గుండు కలిపి బిగించిన దారం.

**కడతెంచు** చూ. కడచు.

**కడనూకు** రూ.చూ. కడపనూకు. స.క్రి. తొలగదోయు, గెంటు.

**కడంత** రూ. కడఁత. వి. కడకంటికి పక్కగా ఉండే చోటు, శిరఃపార్శ్వం, కణత.

**కడంతి** రూ.చూ. కఱఁతి. వి. కస్తూరి మృగం. శుక. 1.176.

**కడఁత** రూ. కడంత, కఱఁత, కంత[2]. వి. కంటికి పక్కగా ఉండే ప్రదేశం, శిరఃపార్శ్వం. భార.శల్య. 1.381.

క. *కటితల్.* శిరఃపార్శ్వం.

**కడఁతి** రూ.చూ. కఱఁతి. వి. కస్తూరి మృగం. ఆం.భా. 2.85.

**కడప**[1] రూ. గడప. చూ. కడచు. వి. **1.** ఇంటిగడప, దేహళి. కాశీ. 2.75; **2.** ఇల్లు.

త. *కటై.* ద్వారం, ప్రదేశం; *కటువై.* గడప.

కడపకట్ట వి. గడపకింద కట్టిన ఎత్తైన కట్ట. కడప బండలు వి.బ.వ. నాపరాళ్లు. కడపమామ వి. దేహళి, కడప, కడపరాయి వి.బ.వ. కడపబండలు, నాపరాళ్లు. కడపరాతు వి. కడపప్రాంతంనుండి వచ్చే చలువరాయి, ఎర్రరాయి. కడపళ్లాబు వి. కడప ప్రాంతంనుంచి వచ్చే చలువరాయి.

కడప[2] రూ. కడామి[1], కడిమి[2], కడివి, కడ్మి[2]. వి. కడిమిచెట్టు. హరి.పూ. 9.68.

సం. *కదంబ-, కలంబ-*; ప్రా. *కయంబ-, కలంబ-*; హిం. *కదంబ, కదంబక.*

క. *కడంబ, కడవ, కడవల్, కడవు, కడహ, కడవడ* (vanclea cadamba) ; త. *కటుంపమ్, కటుంపు.* కదంబ వృక్షం (antho cephallus cadamba) ; మ. *కటుంపు* (varella cadamba).

కడప[3] వి. బండి చక్రానికి ముందు భాగాన బిగింపబడిన చెక్కపట్టి.

కడపట చూ. కడపల. వి. తుద, అగ్రం. క్రి.విశే. అంతం, చివర, తుదకు.

కడపలి చూ. కడపల. వి. 1. గోడ అంచుకూ, ద్వారం పెట్టిన చోటుకూ, మధ్య ఉన్న నేల ; 2. తలవాకిలి ముందున్న నేల.

కడపివుచ్చు చూ. కడపు.

కడపు చూ. కడచు. స.క్రి. 1. నడుపు. భార.ఆది. 3.34 ; 2. విడిచిపెట్టు, వదలు. భార.ఉద్యో. 4.70 ; 3. జరిగేటట్టు చేయు. భార.శాంతి. 2.4 ; 4. జవదాటు. రం.రా. 1.23 వ. ; 5. ఉల్లంఘించు, మీరు. రం.రా. 1.27 వ. 3 పం. ; 6. ఐయ్యక పొమ్మను, పొమ్మను. భార.ఆరణ్య. 5.13 ; 7. పోగొట్టు, తొలగించు. కాశీ. 2.69 ; 8. పరగొట్టు. ద్వి.భాగ. 3 స్కం ; 9. పారదోలు, తరుము. మను. 1.50 ; 10. చంపు, వధించు, కూల్చు. కాశ. 3.86.

పో.చూ. క. *కళుకు, కలహం. దూరంగా* పంపు, చర్చించు ; తు. *కడపుదుణ, కడపుదుని.* పంపించు, అంపకం ; త. *కటుత్తు* (*కటట్టె*). పంపించు, నడుపు; *గడుపు; కటప్పు.* దాటు ; *కటవి, కటపు.* పంపు, నడుపు, జారీచేయు; *కటూవు.* జారీచేయు, స్వారీచేయు, నడుపు; *కటాచు* (*కటాచి-*), *కటాచు* (*కటాచ్*), నత్తలాగ నడచు, కుఇ. *గ్రాస.* (*గ్రాసి*). *గడుపు; గ్రావ* (*గ్రావ్-*). దాటు ; కువి. *గ్రావలి* దాటు; *ట్టునై-* దాటు; పర్జి. *కడ్వె.* (*కత్తె-*) దాటు ; *కడె.* (*కత్తె-*) వినురు ; ఒల్లా. *కర్వ్-* (*కర్త్-*) దాటు ; కురు. *కట్టణా.* దాటు. అధిగమించు దాటు. *కత్రై.* కాలం గడుపు; బ్రా. *ఖ్రారింగ్.* ముందుకుపోవు, దారిచేయు.

కడపివుచ్చు స.క్రి. 1. అభీష్టం నెరవేర్పక పంపు. ఉపేక్షించు. భార.ఉద్యో. 1.161 ; 2. అపాయంనుంచి తప్పించి పంపు. కాశీ. 4.64 ; 3. ముందుకు పోజేయు. కాశీ. 4.64; 4. కప్పిపుచ్చు, మరుగుపరచు. కళా. 5.17, 5. (కాలం) గడుపు. కళా. 5.121 ; కడపుచెయ్యి రూ.చూ. కడపుఁజేయి. వి. చుక్కాని. కడపుఁజేయి (-చేయి) రూ. కడపుచెయ్యి. వి. చుక్కాని, అరిత్రం, తెడ్డు. పారి. పీఠి. 24.

కడమ విశే. 1. శేషించిన, మిగిలిన, ఇతరమైన. భార.ఆది. 6.238 ; 2. న్యూనం, తక్కువైన, కొరతపడిన ; వి. 1. కొరత, వెలితి, లోటు. హరి. 3.168 ; 2. లోపం. పి.శకు. 2.176 ; 3. కడపల. భోజ. 5.318 ; 4. శేషం, మిగులు. పరమ. 4.140 ; 5. కడ, అంతం, తుద.

క. *కడమె, కడిమె.* లోటు, తక్కువతనం, మిగిలినది ; తు. *కడమె.* లోటైన, లోటు.

కడమపడు రూ.చూ. కడమపడు. అ.క్రి. 1. మిగులు. హరి.ఉ. 7.218 ; 2. కొరతపడు, లోపించు. భాగ. 10 పూ. 384 ; 3. పూర్తికాకుండు. ఆము. 4.53. కడమపఱచు స.క్రి. లోపింపజేయు. వేంక.పంచ. 1.526. కడమపెట్టు స.క్రి. చిన్నమొత్తాలుగా దాచు, కప్పిపుచ్చు. ప్రభా. 3.148. కడమపడు రూ. కడమపడు. అ.క్రి. 1. శేషించు, మిగులు. కేయూర. 2.105 ; 2. కొరతపడు, న్యూనమగు. కవిక. 4.163; 3. లోపించు. కడఁబడు అ.క్రి. తగ్గు, పోవు. ద్వి. హరిశ్చ. ఉ. 210.

కడముంత రూ.చూ. కడవముంత. వి. చెంబువంటి చిన్న మట్టి పాత్ర. హంస. 5.11.

కడములతోట వి. కడమిచెట్ల తోట.

కడమూకుడు చూ. కడవ. వి. మూతమూకుడు, కడవలు, పాల ముంతలు మొ॥ వాటిమీది మూతలకు, దీపాలు వెలిగించుకోటానికి, కిదులువస్తే నూనె పోసి నీదలు చూసుకోటానికి వాడే మట్టిమూకుడు.

కడమ్ముంత రూ.చూ. కడవముంత.

కడలకడల చూ. కడలి.

కడలడి చూ. కడలు.

కడలవైవేద్యం చూ. కడవ.

కడలాలిదోషం చూ. కడలి.

కడలి చూ. కడలు. వి. సముద్రం. మున్నీరు. శృం.నై. 8.120.

క. *కడల్, కడలు.* సముద్రం ; తు. *కడలు* ; త. *కటల్* ; మ. *కటల్.*

కడలకడల క్రి.విశే.ద్వి. దూరదూరంగా. కడలాలిదోషం వైధవ్యం, దోషం. కడలికడ వి. నేల. కడలికానుపు వి. కల్పవృక్షం. కడలికాలువ వి. సముద్రపు పాయ. కడలికూఁతురు వి. లక్ష్మి, సిరి. ఆం.నా.సం. 1.10. కడలిబత్తడికదువేదారి రూ. కడలిబత్తలికదునేదారి. వి. శివుడు. వ్యు. సముద్రం అమ్ములపొదిగా కలవాడు. కడలిబత్తలికదువేదారి రూ.చూ. కడలిబత్తడికదునేదారి. వి. శివుడు. వ్యు. సముద్రం అమ్ములపొదిగా కలవాడు. కడలిమీఁగడముద్ద వి. చంద్రుడు. ఆం.నా.సం. 1.15. కడలిమొలమాలుచేడియ వి. భూదేవి. వ్యు. సముద్రం ఒడ్డాణంగా గల స్త్రీ. కడలిమొలమాలుచేడియ కన్నవడఁతి వి. సీత. వ్యు. భూదేవి కన్న స్త్రీ. కడలియల్లుఁడు (-అల్లుఁడు) వి. విష్ణువు. సాం.ని. 1.4. కడలియెకిమీఁడు (-ఎకిమీఁడు) వి. వరుణదేవుడు. వ్యు. సముద్రానికి రాజు. కడలిరాకత్తడి వి. మొసలి. ఆం.పదా.అచర. 46. కడలిరావట్టి వి. 1. లక్ష్మి ; 2. చంద్రుడు. వ్యు. సముద్రుడి కూతురు లేదా కొడుకు. కడలిరాయఁడు 1. సముద్రాల్లో

గొప్పది, పాలసముద్రం. మను. 5.47; 2. సముద్ర ప్రభువు, నీటిరేడు, వరుణుడు. ఉ.రా. 1.316. **కడలిఱేఁడు** వి. 1. వరుణుడు, నీటిరాయడు. మను. 5.47, 2. పాలసముద్రం. **కడలివెన్న** వి. చంద్రుడు. అచ్చ.రా.యుద్ధ. 64. **కడలి వెలఁది** వి. మిన్నేరు. వ్య. సముద్రుడి స్త్రీ (భార్య). **కడలివెలఁదుక** వి. సముద్రుని భార్య, గంగ. ఆం.నా.సం. 1.33.

**కడలు** వి. 1. దిక్కు. కు.సం. 11.193; 2. తరంగం. నిర్వ. రా. 6.134; 3. పళవుల కోటిలో చివరఉండే దంతాలు.

క. *కడలుతెరె, కడలుదెరె.* సముద్రపు కెరటాలు; *కడల్.* సముద్రం; తు. *కడలు*; కొడ్. *కొడ*; త. *కటల్*; మ. *కటల్.*

**కడలంటి** వి. తరంగాల అతిశయం. కు.సం. 9.81. **కడలుకొను** రూ. కడల్కొను. అ.క్రి. 1. అతిశయించు. భార.విరా. 5.388; 2. మిక్కిలిగా సంతోషించు, పొంగు, ఉప్పొంగు. భార.ఉద్యో. 3.412; 3. కలుగు. దశా. 2.138. **కడలుకొలుపు** రూ. కడలుకొల్పు, కడల్కొల్పు. స.క్రి. కావించు, కలిగించు. శృం.నై. 7.41. **కడలుకొల్పు** రూ.చూ. కడలు కొలుపు. స.క్రి. 1. కడలు కొనేటట్టు చేయు, వ్యాపింపచేయు. భాగ. 8.719; 2. కావించు, కలిగించు. శుక. 2.32. **కడలుద్రొక్కు** (-త్రొక్కు) స.క్రి. చీకటి తప్పజేయు. **కడలువేయు** అ.క్రి. గుంపుకట్టు. **కడలెత్తు** అ.క్రి. పొంగు, తరంగితమగు. భాస్క.రా. 1.126. **కడలొత్తు** అ.క్రి. 1. పొంగు, తరంగితమగు. హరి.ఉ. 1.57; 2. వ్యాపించు. హరి. పూ. 8.168; 3. దిక్కులు చేరు. హరి.పూ. 8.168. **కడల్కొను** రూ.చూ. కడలుకొను. అ.క్రి. 1. వ్యాపించు, అతిశయించు. భార.విరా. 5.388. **కడల్కొల్పు** రూ.చూ. కడలుకొలుపు. స.క్రి. 1. వ్యాపింపచేయు. భాగ. 8.716; 2. కలిగించు. శుక. 2.32.

**కడలెత్తు** చూ. కడలు.

**కడలొత్తు** చూ. కడలు.

**కడల్కొను** చూ. కడలు.

**కడల్కొల్పు** చూ. కడలు.

**కడవ** రూ. కడువ. వి. 1. కుండ, కుంభం. భార.ద్రోణ. 4.239; 2. బిచ్చగాని పాత్ర, 3½ శేర్ల కొలగారపు కుండ; 3. నీళ్ళు తెచ్చుకోడానికి వాడే మట్టిపాత్ర.

క. *కటుహ. గడపె. కడాయి,* అర్ధగోళాకృతిగల పాత్ర; తు. *కడ్య.* సన్నని మూతిగల మట్టిపాత్ర; త. *కంటువై.* సన్నని మూతిగల పాత్ర. పో.చూ. కలం. కుండ, పాత్ర.

**కడలనైవేద్యం** వి. అమ్మవారికి నైవేద్యం పెట్టడానికి కడవలలో తీసుకువెళ్ళే అన్నం. **కడవచెవులపోతరి** కుంభ కర్ణుడు. అచ్చరా.యుద్ధ. 1.224. **కడవంచు** (కడవ+అంచు) వి. గుండంచు. పాత్రల మూతికి కింద మూడుపెట్టి పైన గుండ్రని కడ్డీ చుట్టినట్టు చేసిన అంచు. **కడవడముంత** రూ.చూ. కడవముంత. వి. నీళ్లు తాగడానికి చెంబులాగ ఉండే చిన్న మట్టిపాత్ర. **కడవతీటు** వి. తుడుం కుండలాగ ఉండే వాద్య విశేషం, తీటు. **కడవబిడ్డి** రూ.చూ. కడవ బుడ్డి. **కడవబుడ్డి** రూ. కడవబిడ్డి. వి. పూజబుడ్డి, చిన్నపిల్లలు నీళ్లు తీసుకురావడానికి వాడే చిన్న మట్టికడవ. **కడవముంత** రూ. కడముంత, కడమ్ముంత, కడవడముంత, కడుముంత వి. నీళ్లు తాగడానికి చెంబులా ఉండే చిన్న మట్టిపాత్ర. హంస. 5.11. **కడవరాశి** రూ. కడువరాసి. వి. కుంభరాసి. **కడవరాతు** వి. కడవల్ని చరచడానికి ఉపయోగించే రాయి. **కడవఱాయి** వి. కుమ్మరి కడవల్ని చరచడానికి ఉపయోగించే రాయి. హంస. 5.9. **కడవ్రాలాయి** చూ. కడవరాయి. వి. కుమ్మరి కడవల్ని చరచడానికి ఉపయోగించే రాయి.

**కడవఁగఁబడు** చూ. కడచు.

**కడవడము** రూ.చూ. కళవళము. వి. కలత, క్షోభం. హరిశ్చ. 5.72.

**కడవడించు** రూ.చూ. కళవళించు. అ.క్రి. కలతపడు. బసవ. 6 వ. 430 పం.

**కడవఁడు** వి. మగగుర్రం. వరాహ. 5.95. విఐ. సేవకుడు.

క. *కడవ.* గుర్రం, విత్తులు కొట్టబడని గుర్రం. (కణబ) త. *కడవు.* దున్నపోతు, మేక, గొర్రె; కటు. మేకపోతు, దున్నపోతు.

**కడవనాడు** చూ. కడచు.

**కడవనూకు** చూ. కడచు. రూ. కడనూకు. స.క్రి. తొలగఁ దోయు, గెంటు.

**కడవఁబడు** చూ. కడచు.

**కడవఁబెట్టు** చూ. కడచు.

**కడవరము** వి. కుస్తీపట్టు.

**కడవసము** రూ. కడానము, కదాసము, కలాసం, కలానరం, కలాన్రం, కళవనము, కళానము. వి 1. యోగులు ధరించే ఎందు చర్మం. భార.ఆది. 7.225; 2. కమిది తోలు.

క. *కడవస, కడాస.* కూర్చోడానికి ఉపయోగించే చర్మం. మ. *కడాసన్.* తోలు ఆసనం.

**కడవరము**[1] రూ.చూ. కణసరము. వి. శ్యేన విశేషం. ఒకజాతి డేగ, ఊల గద్ద.

**కడసి** చూ. కడనరము[2]. విఐ. కడపటి, తుది.

**కడాకత్తు** వి. ఆర్చికి పక్కనున్న రాతిపేర్పు.

**కడాకు** వి. కత్తితో ఆడే ఒక ఆట.

**కడాణి** రూ. కడాని. వి. బండి ఇరుసు, బండి చక్రం జారి పోకుండా పక్కన ఇరుసులోకి దించిన మేకు.

**కడావ** చూ. కడ. క్రి. విఐ. కట్టకడపట.

**కడాని**[1] రూ. కడానీ. వి. బంగారం. శృం.నై. 7.145. విఐ. మేలిమి (బంగారం),

క. *కడవర, కసవర,* బంగారం.

**కడాని**[2] రూ.చూ. కడాణి. వి. బండి కడ చీల.

**కడానీ** రూ.చూ. కడాని[1]. వి. బంగారం, కాంచనం, మేలిమి బంగారం. చంపూ.రా. 3.79.

**కడావేత** వి. చిట్ట చివరిభాగం నేత.

<కడ+నేత.

**కడామి**[1] రూ.చూ. కడప[2]. వి. కడిమిచెట్టు, కడపచెట్టు.

**కడామి**[2] రూ.చూ. కడిమి[3]. వి. నలిగిన గడ్డిపోగు.

**కడామి**[3] రూ.చూ. కడిమి[1]. వి. పట్టుదల, బలం, మగటిమి, దండోపాయం, పెద్దది, కడిమి.

**కడాయి**[1] వి. కాలమీద బోర్లించిన పెంకుపై వంపు.

**కడాయి**[2] రూ. కడై. వి. కళాయి. పిండి కలుపుకోడానికి వాడే కంచంలాగ ఉండే అంచున్న మూకుడు.

**కడాయించు** స.క్రి. ఇబ్బంది పెట్టు.

**కడారుగోడ** వి. ఇంటిపక్క గోడ.

**కడావము** రూ.చూ. కడవసము. వి. ధార్య చర్మం, ధరించటానికి ఉపయోగించే తోలు, కమిడితోలు. ఆం.భా. 2.177.

**కడి**[1] వి. 1. కబళం, ముద్ద. భాస్క.రా.యుద్ధ. 1467 ; 2. ఆహారం, తిండి. మను. 3.131 ; 3. గోమయాది పిండం ; 4. అధముడు.

క. *కడ, కడత, కడి, కడిత, కడుకు*, నరకటం, నరుకు, ముక్క ; తు. *కడి*. విరిగిన ముక్క, తునక, చిన్న ఖండం ; త. *కటి*. తిరస్కారం ; విస్తారం. *కటి*. అతి అయిన, మిక్కుటమైన, *కటి*. నరికివేయు, ముక్కలుగా నరుకు, *కటికై*. నరికిన ముక్క ; మ. *కటి*. మంచి భోజనం పెట్టు, ఒక ముద్ద, కబళం ; కురు. *కట్టనా* (కట్యాన్) విభజించు.

**కడికంచము** వి. భోజనపాత్రం. వీర.వి. 2.75. **కడిగొను** (-**కొను**) స.క్రి. కబళించు, మింగు, ముద్దగా గొను, భాగ. 8.246. **కడియెత్తు** అ.క్రి. భోజనం చేయు, ముద్దయెత్తు. శివ.సా. 479. <కడి[1]+ఎత్తు.

**కడి**[2] వి. 1. దుర్గంధం. కు.సం. 1.98 ; 2. సువాసన, సుగంధం. ఆము. 2.14, ఆం.భా. 3.61.

త. *కటి*. సుగంధం, సువాసన.

**కడిపోవు** రూ.చూ. కడివోవు. అ.క్రి. చెట్లకొమ్మలు, ఆకులు చిగురించక ఎండిపోవు, పొడగు,చెడిపోవు. **కడివోవు** రూ. కడిపోవు, అ.క్రి. 1. విభ్రమగు. కు.సం. 1.98 ; 2. వాసనపోవు, వాడిపోవు. హరి.పూ. 8.162 ; 3. తరుగు, తగ్గు, చెడు. ద్వి.హరిశ్చ.పూ. 24.14 ; <కడి[2]+పోవు.

**కడి**[3] వి. క్షతి, గాయం. ఆం.భా. 3.61.

క. *కడి*. నరుకు. కరచు, ఒకముక్క ; తు. *కడ్పుని*. నరుకు ; త. *కటి*. కాటు, కరచిన గుర్తు, పిత్తరసం, ఊర్ష. చర్మరోగం, తామర ; మ. *కటి*. నరుకు, కాటు.

**కడి**[4] వి. చోర సాధన విశేషం. ఉద్భటా. 2.239.

**కడి**[5] రూ.చూ. కడీ. 1. ఆరుబయట చాపిన పరుగు, రెండో వైపు కట్టటానికి నేలలో పాతిన రాతిస్తంభం ; 2. మూల రాయి, పశువులవల్లగాని బండ్లవల్లగాని మూలగోడలకు దెబ్బ తగలకుండ రక్షణ నిమిత్తం గోడ మూలల్లో వీధివైపున పాతిన పొడుగాటి రాయి.

**కడి**[6] రూ.చూ. కాడి.

**కడిం** వి. రాతిస్తంభపు తుండికి మీద వలయాకారంగా ఉబ్బెత్తుగా మలచిన భాగం.

**కడికండములు** చూ. కండ[2]. రూ. కడికండలు, కడిఖండలు వి.బ.వ. ఖండఖండాలు, ముక్కముక్కలు. భార.ద్రోణ. 5.114.

సం. *ఖండ*-, ముక్క, తునక.

క. *కడికండ* ముక్కలుముక్కలు. *కడ, కడి, కడత, కడిత, కడుకు*, నరుకు, ముక్క. నరికినముక్క. ముక్క. *కడియువికె* ; తు. *కడి*. విరిగిన ముక్క, తునక, ముక్క ; త. *కటికై*. నరికిన ముక్క ; కురు. *కట్టన* (*కట్యాన్*.) విభజించు.

<కడి[1]+సం. ఖండ-.

**కడికండలు** రూ.చూ. కడికండములు, వి.బ.వ. ముక్కముక్కలు.

**కడికిల్బి** వి. మేడమీదికి పోవడానికి అనువుగా కప్పుకుపెట్టిన కంత, బంగళాదిద్ది.

**కడిఖండలు** రూ.చూ. కడికండములు.

**కడిగట్టు** వి. భూ సరిహద్దు, గనిమ.

<కడి[5] +గట్టు.

**కడిగిపెట్టు** చూ. కడుగు.

**కడింకూజా** రూ. కడెంకూజా. వి. కమండలం ఆకారంలో ఉండే నీళ్ళకూజా.

**కడితము** రూ. కడితము. వి. 1. గుడ్డమీద జిగురుతో కలిపిన మసి పూసి నల్లపరచిన అట్టలుగా జేసి వానితో ఏర్పరచిన లెక్కల పుస్తకం. (పలకమీద లాగ ఈ అట్టలమీద బలపంతో రాస్తారు). పాండు. 4.80 ; 2. నల్లచీర. శివలీలా. 2.54.

క. *కడిత*. అట్టపలక ; తు. *కడత* ; త. *కటితమ్*. బహుశ. <క. కడిత.

**కడితల** వి. కేడెం, ఫలకం. కు.సం. 11.153.

**కడితలకాండ్రు** వి.బ.వ. కేడెం పట్టుకొనేవాళ్ళు. కు.సం. 11.145. **కడితలవా(డు**. వి. కేడెం పట్టేవాడు. కు.సం. 11.189.

**కడితి** రూ.చూ. కణ(తి. వి. గోకర్ణమృగం, కద(జు. మను. 4.37.

**కడితులు** వి.బ.వ, కలశం బుర్లు, దేవాలయం గోపురంపై మేడలమీద అలంకారానికి పెట్టే కలశంలాంటి మట్టి పాత్రలు.

**కడితేర్చు** రూ.చూ. కడతేర్చు. స.క్రి. చంపు.

**కడిద** వి. నల్లగా చేసి, దానిపైన పిండి బలపంతో రాయటానికి వీలైన కాగితం. (ఇది పూర్వపు లేఖన సాధనాల్లో ఒకటి).

**కడిదల** వి. కటితలం, నడుం. కు.సం. 11.190.

**కడిదొబ్బు** అ.క్రి. (నీచార్థంలో) పెద్దపెద్ద ముద్దలు చేసి మింగు.

<కడి[1]+దొబ్బు.

**కడింది** రూ.చూ. కడి(ది. విణ. 1. తీక్షణమైన, దారుణమైన. ఆము. 2.64 ; 2. గొప్పదైన, అధికమైన, పెద్ద ; 3. లోతైన, గంభీరమైన ; 4. అసాధ్యమైన. అవశ్యమైన. వి. శౌర్యం, ఆపద, ఇక్కట్టు.

**కడింది జడదారి** వి. ధూర్జటి, శివుడు, మహాజటధారి. కృ.శకు. 1.22.

**కడి(దలు(గు** చూ. కడి(ది. వి. చక్రాయుధం.

**కడి(ది** రూ. కడింది, కడు(దు. విణ. 1. జయించ శక్యంకాని (వాడు). భార.ఆది. 2.3 ; 2. అసాధ్యమైన, అశక్యమైన.

భార.ఆది. 6.246 ; 3. గొప్ప, అధికమైన, పెద్ద. కు.సం. 4.79 ; 4. దుర్భరమైన, సహింపశక్యంకాని. భార.విరా. 1.92 ; 5. గంభీరమైన, లోతైన. రం.రా. యుద్ధ. 307-వ. 6. పం.; 6. కఠినమైన, తీక్ష్ణమైన, దారుణమైన. శృం.నై. 4.173 ; 7. మహోన్నతమైన ; 8. విశాలమైన. వి. 1. కడిమి, శౌర్యం. భార.సభా. 1.124 ; 2. ఆపద, ఇక్కట్టు. వేంక.పంచ. 1.376.

క. *కడెయ*. గట్టి, బలమైన ; *కడయ*. గొప్పతనం, విస్తారం ; తు. *కడ్పు*. మోటైన, గట్టి. *కడ్డు*. క్రూరత్వం, మోటుతనం ; త. *కటితు*, కష్టమైన, గట్టి. *కటుమై*. అతియైన, మిక్కుటమైన.

**కడిమ** వి. తలుపులు మొదలైనవాటిని లాగి తెరవడానికి ఉపయోగపడే పరికరం.

**కడిమము** రూ.చూ. కలిమము. వి. మాంసం.

**కడిమి**[1] చూ. కడు. రూ. కడామి[3]. కడ్మి[1]. వి. 1. సత్త్వం, బలం, పరాక్రమం, శౌర్యం. భాక.ఆది. 6.199 ; 2. దండోపాయం. కు.సం. 4.53 ; 3. పట్టుదల. భార.భీష్మ. 1.55 ; 4. ఆధిక్యం, అతిశయం. యయా. 2.124. విశ. అధికమైన, పెద్ద. మను. 3.84.

త. *కటుమై*. మోటుతనం, క్రూరత్వం.

<కడు+ఇమి.

**కడిమి**[2] రూ.చూ. కదప[2]. వి. నీపం, కడిమిచెట్టు. పాండు. 4.21.

**కడిమి**[3] రూ. కడామి[2]. వి. వరికుప్పలు నూర్చి కళ్ళం చుట్టూ తాత్కాలికంగా వేసిన గడ్డిపోగు, మేడివామి.

**కడిమి**[4] వి. కుతిక, పాత్రల అంచుకు కిందుగా ఉండే మెడభాగం.

**కడిమిడి** వి. 1. పచ్చికనేల. భాన్క.రా.అరణ్య. 2.374 ; 2. శాద్వలం. పో.చూ. సం. *కటుక-*. కొండనడుమ.

**కడియ**[1] వి. వరలకు బదులుగా సూతికి అమర్చిన రాతిపలక.

**కడియవర్పు** వి. రాతినేత, దంతులమీద రాళ్ళను పేర్చడం.

**కడియ**[2] వి. గులకరాళ్ళు మొదలైనవి లాగి కుప్ప చేయడానికి పనికివచ్చే సాధనం, పళ్ళు బిగించిన అడ్డకర్ర.

**కడియపుటట్టు** చూ. కడియము.

**కడియము** రూ. కడెము. వి. 1. వలయాకారంగా వుండే హస్తభూషా విశేషం, పాద భూషా విశేషం, కటకం. హర. 5.16 ; 2. భక్ష్యవిశేషం, కడియం ఆకారంలో ఉండే చక్కిలం మొదలైన భక్ష్య విశేషం. కాశీ. 7.185.

సం. *కటుక-*. దారం, సన్నని తాడు ; ప్రా. *కడఅ-కడ్య-* ; హిం. *కటుక్*, *కడా*. గాజు ; మరా. *కడియాల్*, *కడియాలి*, *కడియాలె*. దస్తావేజు, గొలుసు ; *కడె*. గొలుసు, గొళ్ళెం.

క. *కడగ*. కటక, కడియం ; *కడె*, *కడెయ* ; కొడ. *కడగ*. లావుపాటి లోహపుగాజు ; తు. *కడగ*. కడియం ; త. *కటుయమ్*. కడియం ; *కటుకమ్*. కడియం ; *కలై*. కొలికి, కొక్కి ; మ. *కటుకమ్*. కడియం, ఉంగరం.

<ప్రా. కడఅ.

**కడియపుటట్టు** వి. కడియంవలె వర్తులాకారమైన భక్ష్యవిశేషం, చక్కిలం. కళా. 7.81. **కడియాలజోదు** వి. 1. హస్తభూషా విశేషద్వయం ; 2. కంకణద్వయం.

**కడియాలజోదు** చూ. కడియము.

**కడిరంగు** వి. తెలుపు, వర్ణపట్టికలోని మూలవర్ణాల మొత్తం రంగు.

**కడిల** రూ. కడిలము. వి. ఖట్వా, కడిలం, కట్లతీగె, ఒకానొక వృక్షం, ఎరచిపిడుక, వృక్షవిశేషం.

**కడిలము** రూ.చూ. కడిల. వి. వృక్షవిశేషం.

**కడివి** రూ.చూ. కదప[2]. వి. కదంబవృక్షం, కడిమిచెట్టు (Lumnitzera raemosa).

**కడివెదు** చూ. కదవ. విశ. కుండ నిండుగాఉన్న.

<కడవ+-ఎడు.

**కడివెండ్లు** వి.బ.వ. బండి మొదలగు వాటికడ ఉండే చీలలు.

**కడిసి** రూ.చూ. కొతిసె. వి. ఒక ముళ్ళచెట్టు.

**కడిసీల** రూ.చూ. కదచీల. వి. బండిచక్రం జారిపోకుండా, కుండపక్కన ఇరుసులోకి దించిన మేకు.

**కడిసె** వి. వృక్షవిశేషం.

క. *కడిసె*. చెవి పుడకలుగా ఉపయోగించే గోధుమ వర్ణంకల చిన్న కాయలుకాసే చెట్టు. త. *కడిచ్చి*. (Casearia tomentosa).

**కడిసెల** రూ.చూ. కడిసెలము. వి. మత్స్యవిశేషం.

**కడిసెలము** రూ. కడిసెల. వి. మత్స్యవిశేషం. హంస. 4.187.

త. *కటిచ్చై (మీన్)*. సముద్రపు చేప.

**కడీ** రూ. కడి[5]. వి. గోడలు కట్టేటప్పుడు చిన్న ఇటికలను రాళ్ళను మధ్య వుంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలం కోసం వుంచే పొడుగాటి పెద్ద రాయి.

**కడు** విశ.క్రి. అత్యంతమైన, మిక్కిలి. భార.సభా. 1.123. అవ్య. చాల.

క. *కడు*. చాల, గొప్పతనం ; తు. *కడు*. మించిన, అధికమైన ; త. *కటు*. నిండుగా. మ. *కటు*. అధికంగా.

<మూ.ద.ద్రా. *కట్.

**కడురొంపి** వి. మిక్కిలి బురద. బసవ. 2.533.

**కడుకొను** అ.క్రి. 1. కడగు, పూను, యత్నించు, ఉత్సహించు. భార.ఆది. 6.118 ; 2. ఓపికపట్టు, శాంతం వహించు. భార. అరణ్య. 2.4 ; 3. నిదానించు. కు.సం. 9.44 ; 4. అతిశయించు. శేష. 4 ; 5. పాదపూరక శబ్దంగా ప్రయోగించవచ్చు.

**కడుగు** రూ. కడుపు, కద్గు, కడంగు, కడఁగు[2]. స.క్రి. క్షాళనం చేయు, శుభ్రం చేయు, ప్రక్షాళించి తొలగించు, తొలగించు, తీసివేయు. భార.సభా. 1.25, అశ్వ. 4.223. వి. బియ్యం మొ. వాటిని కడిగిన నీరు, తండులీయం, కుడితి. ఆం.భా. 2.250.

క. *కలెవ్*, *కర్చు*, *కచ్చు*. శుభ్రంచేయు ; కొడ. *కట్ట్-* (*కట్టి-*). శుభ్రంచేయు ; త. *కయువు*. శుభ్రంచేయు, తీసివేయు ; *కయునీర్*. బియ్యం కడిగిన నీరు ; *కయువు*. శుభ్రంచేయు ; *కాఱియన్*. చాకలి ; మ. *కయుకుక*. శుభ్రంచేయు ; కో. *కర్ట్-* (*కచ్*), *కయ్పు* ; కుఇ. *కహ్పా*. ముఖం

కదగటం ; కువి. ఐటూపినయ్. నూనె రాయు ; కురు. ఖజ్జనా, ఖజ్జి ; మాల్తో. కజె, కజ్.

< మూ.ద్రా. *కాట్-/ *కట్- అచ్చు/ *కచ్- *కచ్-.

కడిగిపెట్టు స.క్రి. కడిగినట్లుగా ఏమీ లేకుండా చేయు. నిరంకు. 2.116. కడుగుచారు వి. కడుగుతో కాచిన చారు. కడుగుడు వి. కదగటం, వదగట్టటం, శోధనం, గాలింపు. ఆం.భా. 2.252.

**కడుచిల్లలు** రూ.చూ. కడచిలలు. వి.బ.వ. బండి చక్రాలకడ ఉండే చీలలు.

**కడుజు¹** రూ.చూ. కణుజు¹. వి. శ్యేనభేదం, ఒకజాతి డేగ.

**కడుజు²** రూ.చూ. కణుజు². పగడాల్ని తూచే మానవిశేషం.

**కడు(దు** రూ.చూ. కడి(ది. వి. ధీరం, శౌర్యం, మగటిమి, కడిది, కడిమి.

**కడు(దురీగ** చూ. కడు(దురు.

**కడు(దురు** రూ. కణు(దురు. వి. కందిరీగ. ఆము. 6.19.

క. కడందుఖు, కడందురై, కడజ, కణజ. కందిరీగ ; తు. కణజిదపురి. కందిరీగ ; త. కటుంపై. ఒక రకం కందిరీగ ; మ. కటున్నల్, కటున్నల్. కందిరీగ ; గోం. గంథేల్. వసుపురంగుగల పెద్ద కందిరీగ; కుఇ. క్రాండె. నల్ల కందిరీగ ; పర్జీ. గార్దిద్. కందిరీగ ; కొలా. గాందిల్ పొప్పి. కుట్టే ఈగ.

సం. కణభ. పో.చూ. సం. గంధాలి. గంధోలీ (కందిరీగ) ; ప్రా. గంథెల్లి. ఈగ ; మహా. గాంధేల్, గాందిల్ మాసి. జోరీగ.

కడు(దురీ(గ వి. కందురీగ, గంధోలి.

**కడుపంటు** చూ. కడుపు.

**కడుపాత్రం** చూ. కడుపు.

**కడుపు** రూ. కడ్పు. వి. 1. గర్భాశయం. భార.ఆది. 6.58 ; 2. ఉదరం, కుక్షి, పొట్ట. భార.ఆది. 6.174, విరా. 1.268 ; 3. గర్భం, చూలు. భాగ. 10.378 ; 4. గర్భస్థపిండం, భ్రూణం. ఉ.హరి. 3.157 ; 5. సంతతి. సంతానం. భీమ. 4.82 ; 6. బిడ్డ. మృత్యుం. 3.125 ; 7. పాత్రలకు ఉబ్బెత్తుగా ఉండే మధ్యభాగం.

పో.చూ. క. కిబ్బొప్పె, కిబ్బొడె. గర్భాశయం, కూపకం.

కడుపంటు అ.క్రి. కడుపు (ఆకలిచే వెన్నుకు) అంటుకొనిపోవు. ఆము. 6.18 < కడుపు + అంటు¹. కడుపాత్రం వి. 1. కడుపుకక్కుర్తి ; 2. రక్తసంబంధం. < కడుపు + ఆత్రం. కడుపుకక్కుర్తి రూ. చూ. కడుపు(గక్కుఱితి. వి. ఉదరపోషణాశ. దశ. 10.106. కడుపుకందవిత్తగు అ.క్రి. కందవిత్తువలె కడుపు మిక్కిలి వలించు, వంశవృద్ధియగు. ప్రభా. 4.41. కడుపుకాలు అ. క్రి. 1. సంతతి నశించు ; 2. కడుపు మాడు. కడుపుకుట్టు వి. కడుపుమంట, ఓర్వలేనితనం. కడుపుకూడు వి. ఆ నోటికి చాలినంతమాత్రం తిండి, కడుపుకు పరిపడే తిండి. భార. విరా. 1.198. కడుపుకొట్టు రూ. కడుపుగొట్టు. స.క్రి. బతుకుతెరువు పోగొట్టు. అ.క్రి. పీక్కువిరేచనాలగు. కడుపుకోత వి. పుత్రశోకం. కడుపుగొట్టు రూ.చూ. కడుపుకొట్టు. అ.క్రి. ఎక్కువగా విరేచనాలగు. స.క్రి. జీవనోపాధిని తొలగించు. కడుపు(గక్కుఱితి రూ. కడుపుకక్కుర్తి. వి. ఉదరపోషణాశ. ప్రభా. 1.118. కడుపు(గట్టుకొను అ.క్రి. లోభాదులచే తిండి మానుకొను. కడుపుచలువ రూ. కడుపుచల్వ. వి. 1. ఒక తల్లికి జనించిన బిడ్డలందరు ఆ తల్లి మృతిపరకు సజీవులై ఉండటం ; 2. సంతతి క్షేమంగా ఉండటం. కడుపుచల్లకదలకయుండు అ.క్రి. శ్రమపడకుండు. రామా. 2.7. కడుపుచల్లగా క్రి.విణ. తల్లికి పుట్టిన బిడ్డలందరు సజీవులై ఉండాలనే ఆశీస్సు. భార.ఆది. 6.19. కడుపుచల్లన వి. సంతతి కలిగి ఉండటం, పుణ్యం కలిగి ఉండటం. ఉ.హరి. 2.75. కడుపుచల్వ రూ.చూ. కడుపుచలువ. కడుపుచెఱువగు అ.క్రి. ఎక్కువ దుఃఖం కల్గు. కడుపుచేటు వి. ప్రసవవేదన తక్క తల్లికి, కన్నందులకు ఫలంలేదని భావం. భాగ. 1.12. కడుపుచేత(బట్టుకొను స.క్రి. పొట్ట పోసుకోడానికై జీవనోపాధికై వెదుకుకొను. కడుపుచేయు రూ. కడుపుసేయు. స.క్రి. గర్భం నిలుపు, గర్భిణిగా చేయు. కడుపు(జిచ్చు (-చిచ్చు) వి. కడుపుమంట, ఆకటిబాధ. మను. 5.27. కడుపుటగ్గి వి. జఠరాగ్ని, కడుపుకిత్తి. < కడుపు + అగ్గి. కడుపుడుకు వి. కడుపుమంట, అసహనం ; అ.క్రి. కడుపుమండు. < కడుపు + ఉడుకు. కడుపుతోఉండు రూ.చూ. కడుపుతోనుండు. అ.క్రి. అంతర్వత్నియగు, గర్భిణియగు. కడుపుతోనుండు రూ. కడుపుతోఉండు. అ.క్రి. గర్భిణియగు. కడుపుదిగు అ.క్రి. గర్భస్రావమగు. కడుపుదించు స.క్రి. గర్భస్రావం చేయు. కడుపునకు(బెట్టు రూ.చూ. కడ్పునకు(బెట్టు. స.క్రి. (శిశువులకు) ఉగ్గుపెట్టు, ఆముదంపెట్టు, పాలిచ్చు. ఐందు. 2.15. కడుపున(బెట్టుకొను స.క్రి. 1. సంరక్షించు ; 2. వెల్లడింపకుండు ; 3. జ్ఞప్తిలో ఉంచుకొను. కడుపునిండినబేరం వి. అక్కరలేని బేరం. కడుపునిండు అ.క్రి. సంతసమగు, తృప్తిపడు. కడుపునొప్పి వి. కడుపులో పుట్టే బాధ. కడుపుపంట వి. సంతతి. కడుపుపండు అ.క్రి. సంతతి కలుగు. కడుపుబ్బరం వి. ఓర్వలేనితనం, కడుపుఉబ్బరం. కడుపుబ్బు వి. 1. కడుపు ఉబ్బరించేటి రోగం, ఆనాహం (ఇందుమలమూత్రబంధం). ఆం.భా. 2.128 ; 2. మూత్రవ్యాధివిశేషం ; 3. ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనం. కడుపు + ఉబ్బు. కడుపుమంట వి. 1. కడుపుబాధ, క్షుద్బాధ. శుక. 3.379 ; 2. ఈర్ష్య, ఓర్వలేనితనం. కడుపుమసియగు అ.క్రి. 1. ఎక్కువ ఆకలి అగు ; 2. సంతతి నశించు. కడుపుమాడు అ.క్రి. 1. ఎక్కువ ఆకలిఅగు ; 2 సంతతి నశించు. కడుపుమీ(దగొట్టు అ.క్రి. వృత్తిచ్ఛేదంచేయు, జీవనాధారం పడగొట్టు. < కడుపు + మీ(దు + అ⁷ + కొట్టు. కడుపులో(బెట్టుకొను స.క్రి. 1. వెల్లడింపకుండు ; 2. జ్ఞప్తిలో వుంచుకొను ; 3. సంరక్షించు. కడుపువెళ్ళు అ.క్రి. విరేచనమగు. కడుపుశోకం వి. బిడ్డలు పోవటంవల్ల తల్లికి కలిగే దుఃఖం, గర్భశోకం. కడుపుసెగ వి. సీటి చురుకు వ్యాధి (గనేరియా). కడుపుసేయు(-చేయు) రూ.చూ. కడుపుచేయు. స.క్రి. గర్భిణిగాచేయు. కడుపూ(ద వి. 1. మలమూత్రాలు బంధించి కడుపుబ్బరించే పశురోగం. హరి.పూ. 6.45 ; 2. ఈర్ష్య, అసూయ.

**కదుపూఁద** చూ. కదుపు.
**కదుపేడు** వి. మేదరి కొన్ని వస్తువులకు కట్టే సన్నని వెదురు పేడు.
**కదుము** రూ. కుదుము. వి. కుడుం.
క. *కడుంబు, కడుబు, కడబు.* కుడుం; మ. *కడుబు.* ఒక రకం రొట్టె.
**కదుముంత** రూ.చూ. కదవముంత. వి. నోరు వెడల్పుగాఉన్న మట్టిపాత్ర. నీళ్లు తాగడానికి చెంబులాగ చేసిన చిన్న మట్టిపాత్ర.
**కదువ** రూ.చూ. కదవ. వి. కుండ.
**కదువతీటు** వి. తుదుం, పీజె. **కదువరాసి** రూ.చూ. కదవరాసి. వి. కుంభరాసి.
**కదువు** రూ.చూ. కదుగు. వి. బియ్యం మొ. వాటి కదుగు. మార్క. 3.254.
**కదెం** వి. **1.** గానుగ దూలానికి చివర బిగించే 'S' ఆకారంగా ఉండే ఇనప కొక్కెర ; **2.** దంగు సొర చివర తగిలించిన వంకి ; **3.** చుట్టుగుడిసెకొప్పు చుట్టూ పేనినేసిన గడ్డిచుట్ట ; **4.** గద్ద గోరును తగిలించే వలయం ; **5.** కావడిలో వస్తువుల నుంచే వలయం.
**కదెంమరాయి** వి. కడింకూజా. వి. కమండలం ఆకారంలోఉండే నీళ్ళకూజా.
**కదెంసొంగ** రూ. కదెపుసొంగ. వి. వంకసొంగ. పొగ పీల్చడానికి వాడే మట్టిగొట్టం.
**కదెక్కిపోవు** అ.క్రి. తపించిపోవు.
**కదెంకూజా** రూ.చూ. కడింకూజా. వి. కదెంమరాయి, కమండలం ఆకారంలో ఉండే నీళ్ళకూజా.
**కదెంచిప్ప** వి. చెవుల చిప్ప. మూతివెడల్పు తక్కువ ఉండి పట్టుకోడానికి చెవులుండే మట్టిపాత్ర.
**కదెత్తుగది** చూ. కద.
**కదెత్తుగోడ** చూ. కద.
**కదెంతీయు** స.క్రి. కొద్దిగా నీళ్ళుపోసి ఉంచడానికి పీలుగా పిసికిన మట్టికి చుట్టూ అంచుకట్టు.
**కదెపుసొంగ** రూ.చూ. కదెంసొంగ. వి. వంకసొంగ, పొగ పీల్చడానికి ఉపయోగించే మట్టిగొట్టం.
**కదెమంచు** (కదెము+అంచు) వి. గుండంచు. పాత్రల మూతి కింద మాదులాగ పెట్టి పైన కడియం చుట్టినట్లు చేసిన అంచు.
**కదెము** రూ.చూ. కడియము. వి. **1.** వలయాకారంగా ఉండే హస్త భూషా విశేషం. ఉ.హరి. 4.157 ; **2.** వలయంగా ఉండే భక్ష్య విశేషం; **3.** వలయంగా ఏర్పరచిన ఎండు గడ్డి.
**కదెమువేయు** స.క్రి. కుప్ప నూర్చి గడ్డివాము వేయు.
**కదై** రూ.చూ. కడాయి[2].
**కదొత్తు** చూ. కద.
**కద్గు** రూ.చూ. కదుగు. స.క్రి. క్షాళనం చేయు, శుభ్రం చేయు, ప్రక్షాళించు, తొలగించు. భార.అశ్వ. 4.223. వి. బియ్యం ముస్నగునవి కడిగిన నీరు, తండులీఐం, కుడితి.
**కద్దాయంచేయు** చూ. కద్దాయము.
**కద్దాయము** వి. రూ.చూ. ఖడాయము. **1.** బలాత్కారం ; **2.** సరకులపై హెచ్చు వెలలేనివాటిని కొనమని బలవంతం చేయటం.
**కద్దాయంచేయు** స.క్రి. బలాత్కారం చేయు, బలవంతం చేయు.
**కద్ది** రూ. కడ్డీ, ఖడ్డీ. వి. **1.** పాళం, బంగారం మున్నగువాని కడ్డి, శలాక, పుడక. ఆం.భా 2.275 ; **2.** బలపపుగోపు. పలకపుల్ల.
క. *కడ్డి*. చిన్నపుల్ల. కొయ్యముక్క, పలకపుల్ల.
**కద్దివత్తి** వి. అగరువత్తి. శుక. 2.39. **కద్దివేయు** స.క్రి. మూత్రాన్ని బయటకు తీసే గొట్టాన్ని దొప్పించు.
**కద్దీ** రూ.చూ. కద్ది. వి. **1.** పాళం, బంగారు మున్నగు వాటి కడ్డి, శలాక ; **2.** బలపపుగోపు, పలకపుల్ల ; **3.** రాటె తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; **4.** దబ్బారాట్నం చక్రం తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ ; **5.** అచ్చు కట్టేటప్పుడు అచ్చుబిళ్ళకు చేర్చి పడిదారం చుట్టే ఇనపపుల్ల ; **6.** దోనెకు బిగించే పొడుగాటి ఇనపచువ్వ ; **7.** మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అర్ధ పుల్ల ; **8.** రంగుల అద్దకంలో నూలు లడీలను తగిలించే ఇనపఊచ ; **9.** రంగులో తడిపిన నూలుపిండటానికి నేలలో పాతిన పొడుగు రాట.
**కద్దీగంధకము** వి. అమర శిలాగంధకం, కడ్డీలాగ ఉండే గంధకం.
**కద్దు** వి. పట్టుదల, హఠం.
**కద్దపురొతు** వి. ఎర్రకంచురాయి.
**కద్బు** రూ.చూ. కదుపు. వి. కుక్షి. హరి.పూ. 5.224. **కద్బువకుఁబెట్టు** రూ. కదుపునకుఁబెట్టు. స.క్రి. శిశువులకు ఉగ్గుపెట్టు, పాలిచ్చు. హరి.పూ. 5.194.
**కద్మి**[1] రూ.చూ. కడిమి[1]. వి. **1.** బలం, పరాక్రమం, శౌర్యం ; **2.** దండోపాయం. విణ. అధికమైన, పెద్దదైన.
**కద్మి**[2] రూ.చూ. కదవ[2]. వి. కదపచెట్టు, నీపం.
**కద్లపుడి** వి. పొగాకుకాడల చిన్న తునకలు.
**కద్లాము** రూ. కళ్ళము. వి. ధాన్యాన్ని నూర్చే చోటు, కళ్ళం.
**కద్లి** వి. ప్రహరీ టోపీమీద ఇటికవరసలమధ్యవచ్చే పెద్దనందు.
**కథాకు** వి. కత్తి విసురుల్లో ఒకటి, శస్త్రచాలనభేదం. ప్రబంధ. 75.
<హిం. *కథాకా*.
**కణకం**[1] వి. గణికుడు, ఒక రాజకీయోద్యోగి.
**కణకం**[2] వి. మన్నుపాకం. మట్టిపాత్రల తయారీకి అనువుగా బిరుగా చిక్కటిపాకంలో ఉన్న బురదమట్టి.
**కణకణ** వి. నిప్పుకాంతి. ధ్వన్యను.
**కణకణలాడు** అ.క్రి. ఎర్రబడు, మొరయు.
<కణకణ+-లు+ఆడు.
**కణగు** అ.క్రి. చచ్చు, పోవు, ముగియు.
**కణంగు** రూ.చూ. కదుగు, అ.క్రి. పూను, ప్రయత్నించు.
**కణఁక**[1] రూ.చూ. కడఁక. వి. **1.** పూనిక, యత్నం, ఉత్సాహం. వండి.చ. 1.81 ; **2.** సంతోషం, వికాసం, విక్ర. 3.107.

**కఱఁక²** రూ. కఱఁకు, కఱఁకు. వి. 1. కొరవి, ఇంగలం. కు.సం. 2.14 ; 2. పూనిక, వికాసం.

**కఱఁకు** రూ.చూ. కఱఁక². వి. కొరవి, ఇంగలం, నిప్పు. నార. పంచ. 1.495.

**కఱఁగు¹** రూ.చూ. కఱఁగు. అ.క్రి. 1. ఉద్యమించు, యత్నించు, పూను, ఉత్సహించు, భార.అరణ్య. 1.38 ; 2. తలపడు. భార.అరణ్య. 3.113 ; 3. అతిశయిల్లు. భార.విరా. 4.81.

**కఱఁగు²** రూ.చూ. కడుగు. స.క్రి. ప్రక్షాళించు, క్షాళనంచేయు, తీసివేయు వి. బియ్యం కడిగిన నీరు.

**కఱజ** వి. ఆనకట్ట.

**కఱంజు** రూ.చూ. కఱఁజు. వి. గోకర్ణమృగం, ఒక జాతి దుప్పి. ఆం.భా. 2.85.

**కఱఁజ** రూ.చూ. కఱఁజము. వి. ధాన్యాదుల్ని దాచే కొట్టు. గాదె. హంస. 2.187.

**కఱఁజము** రూ. కఱఁజము, కఱఁజ, కమజం. వి. 1. ధాన్యాదుల్ని దాచుకొనే కొట్టు. పరమ. వి. 546 ; 2. గాదె, పౌఁజక. హంస. 2.226 ; 3. గంగాళం. ఉ.రా. 6.2 ; 4. పాతర.

*క. కణజ, కళంజి, కలంజి, గళగె, గళిగె.* గాదె, ధాన్యం దాచుకొనే పెద్ద పౌఁజక. *కణజ.* గాదె ; *తు. కణజ.* గాదె ; *త. కలంచియమ్.* గాదె, సామాన్లగది.

**కఱఁజు** రూ.చూ. కఱఁజు. వి. గోకర్ణమృగం, ఒక జాతి దుప్పి.

**కఱత** వి. చేతి మగ్గం పలక వేలాడదియ్యడానికి ఆధారంగా ఉండే పక్కభాగం.

**కఱఁత** రూ.చూ కఱఁత. వి. కడకంటికి పక్కనున్న చోటు, శిరఃపార్శ్వం.పండి.చ. 1.40 వ.

*క. కణతలై.* ముఖంమీది కణత.

**కఱఁతి** రూ. కఱంతి. కఱఁతి, కడితి, కఱితి¹. వి. కస్తూరిమృగం. కాశీ. 3.48.

*క. కడవె, కడవ, కడబ, కడబె, కడసై, కడహ, కడితి.* ఒక రకం దుప్పి ; *తు. కడమ.* కఱుజు. *త. కటుమా, కటుమాన్.* అడవి దున్నపోతు. *కటంపై, కటుమై ; మ. కటుమాన్ ; కొలా. కడస్ ; నా. కరస్ ;* కుఱు. *కర్స్.* మగకఱుజు.

**కఱవేకమవు** వి. ఒక రకం గడ్డి.

**కఱవుచెట్టు¹** వి. మొక్కవుచెట్టు (Baringtonia accutangula), గృహోపాదకరణాలకు పనికివచ్చే కలవనిచ్చే చెట్టు.

**కఱవుచెట్టు²** వి. తెల్లని కర్ర కలిగి లేత ఎరుపురంగు పళ్లుకాసే ఒక చెట్టు (Barringtonia racemosa).

**కఱవతీగ¹** రూ. కనవుతీగె. వి. తీగవంటి కొమ్మలు కలిగి తెల్లని పళ్లుకాసే ఒక తీగ (Vitis cannosa).

**కఱవతీగ²** రూ. కనపతీగె. వి. పొరలుగా ఉండే ఆకులు కలిగిన ఒక తీగ (Stemona tuberosa).

**కఱవబదనిక** వి. సాగమొక్క, అందంగా ఉండే పూలుపూసే ఒక మొక్క (Vanda roxburghii).

**కఱము** వి. లోగాడిపట్ల.

నం. *కణ-.* గింజ, నూక, లేశం, సూక్ష్మమైన.

**కఱయము** వి. గాలి ఉండే మేర, వాయుపథం. రం.రా.ఉ. 68 వ.

**కఱయి** వి. నూనె కాచుకొనే పాత్ర, కళాయి.

**కఱసరము** రూ. కరసరము, కఱసెరము, కనిసెరము. వి. శ్యేనవిశేషం, ఒక జాతి డేగ. రసిక. 1.115.

**కఱసెరము** రూ.చూ. కఱసరము. వి. ఒక జాతి డేగ.

**కఱాతిగోడ** రూ.చూ. కనాతిగోడ. వి. బట్టతో ఏర్పరచిన గోడ, నరాతి.

**కఱాదిబొంగు** వి. బొంగువెదురు.

**కఱి** వి. బండి, గాడి.

**కఱిం** రూ.చూ. కనిం. వి. కాడి మానులోని రంధ్రం.

**కఱిక¹** వి. పలకపుల్ల, బలపం, పొరపైన ముక్క.

*క. కణికె, కణుకు.* కంకెలులేని జొన్నదంటు. *కడ్డికె.* కొమ్మ లేక కాడ, *తు. కణకు.* నిప్పు, కర్రలు.

పో.చూ. నం. *కఠినిక-.* గట్టిది.

కఱికరాయి వి. నలుపు, తెలుపు రంగులతో కలసిఉండే గట్టి పాలరాయి.

**కఱిక²** వి. 1. సీటిబొట్టు ; 2. గోధుమ మొ॥ వాటి రవ్వ ; 3. కొంచెం ; 4. అత్యంత సూక్ష్మ వస్తువు, నెరసు ; 5. నడిమి వేలు.

నం. *కణక-.* చిన్నకణం.

<నం. *కణక-.*

**కఱిక³** వి. నెల్లిచెట్టు.

**కఱిచి** రూ. కఱిచి. వి. బండి, శకటం.

**కఱిజము** వి. ధాన్యం కొట్టు, గాదె.

**కఱితము** రూ.చూ. కడితము. వి. గుడ్డమీద జిగురుతో కలిపిన మసిపూసి నల్లపరచి అట్టలుగా చేసి వాటితో తయారుచేసిన లెక్కలపుస్తకం.

**కఱితి¹** రూ.చూ. కఱఁతి. వి. కడితి, గోకర్ణమృగం.

**కఱితి²** రూ.చూ. కంగి. వి. ఒక విధమైన చేప.

కఱితిచేప వి. ఒక రకమైన చేప, సూదిగా ఉన్న తల, పెద్ద కళ్ళుగల చేప.

**కఱిఁతి** రూ.చూ. కంతి. వి. గ్రంథి. ఆం.భా. 2.74.

**కఱినము** రూ.చూ. కనీనము. వి. నరైన వెల. క్రి.విణ. సుమారుగా.

**కఱిశరాయి** వి. క్వార్ట్జ్ జాతికిచెందిన మిశ్రశిల (Metamorphic rock).

**కఱిశించు** న.క్రి. ఉజ్జాయించు.

**కఱిసి** పో.చూ. కశిక¹. వి. కఱిక, ముక్క.

**కఱిసించు** న.క్రి. గమనించు, గుర్తించు.

**కఱిసెము** వి. ఎన్ను.

**కఱిచి** రూ.చూ. కఱిచి. వి. బండి, శకటం.

**కఱుగూ-పెఱుగూ** క్రి.విణ. స్పష్టంగా.

**కఱుజ** రూ.చూ. కఱుజు². వి. పగడాలు తూచే తూకం.

**కఱుజు¹** రూ. కడుజు¹. వి. శ్యేనభేదం. పి.శకు. 1.110.

**కఱుజు²** రూ. కడుజు², కఱుజ. వి. పగడాలు తూచే మాన విశేషం. ఆం.భా. 2.277.

*క. కణజు.* పగడాలు తూచే మానం ; *త. కటంచు.* మూడున్నర రూపాయల విలువైన నాణెం ; *మ. కఱంచు.* బొన్నులో పదహారో భాగం, రెండు చిన్న వెండినాణాల

బరువు.

పో.చూ. సం. కఱజ-. ఒకరకం తూకం.

కఱఝు[3] వి. కుక్కలకు పట్టేపురుగు.

కఱజావాలిక వి. గలగిచెట్టు, పలచని ఆకులు కలిగిన ఒక చెట్టు (Litsea sebifera).

కఱదుఱు వి. వృక్షవిశేషం. ఒకానొక చెట్టు. హంస. 4.2.

కఱు(దురీగ చూ. కఱు(దురు.

కఱు(దురు రూ.చూ. కదు(దురు. వి. కందిరీగ. భాగ. 10.99.

కఱు(దురీగ వి. కందిరీగ. ఆం.భా. 2.95.

<కఱు(దురు+ఈగ.

కఱుపు రూ. కనువు, గఱువు, గనువు. వి. వెదురు, చెరుకు మొ॥ వాటికి ఉండే కణుపు (గ్రంథి, పర్వం.

కఱువులచెరుకు వి. ఇక్షువిశేషం, పంచదార, బెల్లం మొ॥ వాటి తయారీకి ఉపయోగించబడి పొడవుగా గడవలె ఉండే చెరకు (Saccharum officinarum).

కఱుము రూ.చూ. కనుము[3]. వి. ఒక రవికెకు సరిపడే నేత గుడ్డ.

కఱెము రూ.చూ. కన్నము. వి. 1. బండికాడికి రెండుపక్కలా ఉండే రంధ్రంలో దిగవేసే కొయ్య చీలలలో గాడిపల్ల, కణం; 2. చెరుకు గానుగలో వేసిన చెరుకును నలిపే గుండ్రని ఇరుసు.

కఱెయించు అ.క్రి. కదలక కూర్చుండు.

కఱేర వి. బలవంతంగా ఆపడం.

కఱ్ఱగార్లు వి.బ.వ. కంచర్లు. E.I. 30.14. క్రీ.శ. 699.700.

కంటి[1] చూ. కను. వి. 1. పొందడం, భాగ్యాన్ని పొందడం. భార.ఆది. 4.62; 2. చూడటం. ఆం.భా. 1.58.

కంటబడు అ.క్రి. కనపడు. భాగ. 9. పు. 153.

కంటి[2] వి. 1. నాట్యబంధం. ఆం.భా. 1.130; 2. నాట్య భేదం.

కంటం చూ. కంట్లం. వి. పాత్రల అంచుకు కిందవుండే మెడ భాగం.

కంటకపుకోల చూ. కంటకము.

కంటకము వి. 1. విరుద్ధం, విపరీతం. భార.అరణ్య. 6.32; 2. ద్వేషం, విరోధం. నవనాథ. 4.266 పు. 22 పం; 3. పరుషవాక్యం, విరుద్ధవచనం. మను. 3.84.

క. కంటక, కంట, కంటియ. ముల్లు, సూదిమొన లేదా సూది, పులకరించినపుడు రోమాదులు నిక్కపొడుచు కోడం. విసుగు లేదా బాధ కలిగించే వ్యక్తి, ఆటంకం, ప్రతిబంధకం, పాపం, అపాయం, గండం, ఉపద్రవం: తు. కంటక. అపాయం, ఉపద్రవం; త. కంటకై. క్రూరత్వం, కఠినత్వం; మ. కంటకై. ముల్లు, అపాయ కరమైన, అశుభమైన సమయం.

సం. కణ్టక-. శత్రువు, ఆటంకం, సూదితో పొడిచినట్లు కలిగేనొప్పి.

<సం. కణ్టక-. (అర్థవిపరి.)

కంటకపుకోల రూ. కంటపుకోల. వి. 1. అల్లుకట్టేటప్పుడు పడుగులో చివర దూర్చిన చువ్వ; 2. అచ్చు కట్టేటప్పుడు అచ్చుపోగుల్లో అనిపెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్నటి ఇనపచువ్వ. కంటగించు అ.క్రి. 1. నొచ్చుకొను. నిర్వ.రా. 9.79; 2. అసహ్యపడు, రోతపడు; భాగ. 7.194; 3. కోపించు, అసహ్యపడు. శుక. 2.456. కంటగింపు వి. రోతపడటం, అసహ్యపడటం. చంద్రాంగ. 5.152.

కంటగిలు రూ. కంటగిల్లు. అ.క్రి. నొచ్చు. పాండు. 5.8.

కంటగిల్లు రూ.చూ. కంటగిలు. అ.క్రి. 1. నొచ్చు; 2. ద్వేషంచూపు; 3. కోపపడు.

కంటకి వి. వస్త్రాదులకు వేసేరంగుల్లో ఒకానొక రంగు. కవిక. 3.195.

క. కంటంకి, కంటకి. స్త్రీలు కట్టుకొనే ఒకరకమైన గళ్ళ బట్ట.

కంటకిపన్నెలు వి. బ. వ. కంటకి రంగువేసిన వస్త్రం. సిం. ద్వా. 3.206.

కంటగించు చూ. కంటకము.

కంటగింపు చూ. కంటకము.

కంటగిలు చూ. కంటకము.

కంటగిల్లు చూ. కంటకము.

కంటరము వి. చెరుపు, ఆటంకం, విఘ్నం.

కంటపుకోల రూ.చూ. కంటకపుకోల. వి. 1. అల్లుకట్టేటప్పుడు పడుగులో చివరదూర్చిన చువ్వ; 2. అచ్చుకట్టేటప్పుడు అచ్చుపోగుల్లో అనిపెంబడి పోగులు చెదరకుండా పెట్టిన సన్నటి ఇనపచువ్వ.

కంటమేరవంచు స. క్రి. మట్టిపాత్రకు కుత్తిక ఏర్పడేటట్లు వేళ్ళతో పట్టు.

కంటంపట్టు స.క్రి. పాత్రకు అంచుఏర్పరచడానికి ముందు వేళ్ళతోను, బద్దలతోను కుత్తిక ఏర్పడేటట్లుపట్టు. వి. పాత్రలకు అంచు ఏర్పడటానికి పట్టేపట్టు.

కంటలము రూ.చూ. కంట్లము; వి. 1. చిల్లరసరుకులుంచి ఎద్దు మొ॥ వాటిమీదవేసే సంచుల జత. హరి.పూ. 6.21; 2. దూదిమూట; 3. తొమ్మిది మణుగుల బరువు.

కంటసము చూ. కంటు[1]. వి. విరోధోక్తి, విప్రలాపం. ద్వి. హరిశ్చ. ఉ. 1694;

పో. చూ క. కంటిసు. తిన్నగాచేయు, దుఃఖంకలగ చేయు; త. కంటునమ్. ఖండించటం, సాధించటం.

కంటసరము రూ.చూ. కంటసరి. వి. మెడలో ధరించే ఒకరకమైన నగ. చంపూ. రా. 3.23.

కంటసరి రూ. కంటసరము. వి. మెడలోధరించే ఒకనగ. పారి. 4.16.

సం. కంఠసర-; ప్రా. కంఠసర-;

త. కంటుసరమ్. గొలుసు.

<ప్రా కంఠసర-.

కంటసరులు వి.బ.వ. ధాన్యవిశేషం.

కంటాణి రూ.చూ. కంతాణి. వి. కాగితాలు మొ॥ కుట్టుకోడానికి అనువుగా కర్రపిడి, గెడ్డంవున్న ఇనపఊచ.

కంటాము వి. అరవైనాలుగు వీసెలబరువు.

కంటాలము[1] రూ.చూ. కంట్లము. వి. 1. చిల్లరసరుకులుంచి ఎద్దు మొ॥ వానిపై వేసే సంచులజత; 2. దూదిమూట; 3. తొమ్మిది మణుగుల బరువు; 4. ఇరవైమణుగుల బరువు.

**కంటాలము**[2] రూ.చూ. కంఠాణి. వి. కంటాణి.

**కంటాళము** రూ.చూ. కంట్లము. వి. నంచులజత.

**కంటి** రూ. కణితి[2]. వి. ఒకరకం చేప.

**కంటికలక** చూ. కను[1].

**కంటికజెప్పరీల** చూ. కను[1].

**కంటికెక్కు** చూ. కను[1].

**కంటిచేవ** చూ. కను[1].

**కంటింజెన్సీ** వి. జరగదగినది, అనిశ్చయం, దైవఘటన.

ఇం. *Contingency.* అనిశ్చితం.

ఇం. < Contingency.

**కంటినొప్పి** చూ. కను[1].

**కంటిపావ** చూ. కను[1].

**కంటిపులి** చూ. కను[1].

**కంటిపువ్వు** చూ. కను[1].

**కంటిపుసి** చూ. కను[1].

**కంటిపొర** చూ. కను[1].

**కంటియ** రూ.చూ. కంటె[1]. వి. చక్రాకారమైన కంఠాభరణం.

**కంటిలోనివెరము** చూ. కను[1].

**కంటివాలు** చూ. కను[1].

**కంటివింటివజీరు** చూ. కను[2].

**కంటివినికి** చూ. కను[1].

**కంటివిష్కరి** చూ. కను[1].

**కంటివిష్కి** చూ. కను[1].

**కంటీలు** రూ.చూ. గంటీలు. వి. బ.వ. చెవులకు పెట్టుకొనే పోగులు. నిరంకు. 2.116.

త. కంటి. కంఠాభరణం.

**కంటు**[1] వి. 1. శత్రువు, పగవాడు. రం.రా. అరణ్య. 192, 3 పం ; 2. పగ, ద్వేషం, వైరం. రామా. 7 204.

సం. ఖండన. ఖండించడం.

త. కంటునమ. ఖండించడం, సాధించడం.

**కంటుపెట్టు** స.క్రి. అసహ్యించు. **కంటుపడు** స.క్రి. పగపట్టు, మచ్చరించు, విరోధించు.

**కంటు**[2] వి. 1. రాతిస్తంభాలమీద అర్ధచంద్రాకారంగా చెక్కిన గుంట ; 2. రంధ్రం; 3. దూలాలఎదురుమోపు ; 4. ఏతవ మాను అతుకు.

**కంటె**[1] రూ. కంటియ. వి. 1. చక్రాకారంలో ఉన్న కంఠాభరణం, కొరవిశాసనం మహబూబ్‌నగర్‌జిల్లా క్రీ.శ. 892-922. ఆము. 6.6 ; 2. మంగళసూత్రం, కువ.చ. 4.49 ; 3. కండెనవేసేచోటు.

సం. కంఠికా. ఒకేతీగతో చేసినకంఠాభరణం, కంఠాభరణం ; ప్రా. కంఠిఆ. కంఠభూషణం, అ.మా. కంఠియా, కంఠక, కంఠికా. కంఠాభరణం ; హిం. కంఠీ. కంఠాభరణం.

క. కంటి, కంటిగె, కంటె ; తు. కంటి ; బ్రా. కండే.

<ప్రా. కంఠిఆ.

**-కంటె**[2] (న్). ప్రత్య. ద్రు. పంచమీవిభక్తిప్రత్యయం. భార. ఆది. 1.124.

త. కంటాల్. తప్ప.

< - కు + అంటె.

**కంటెగోర** వి. 1. మిద్దెపైఅంచులదగ్గర, బట్టీమనలపక్క కట్టే పల్చని మట్టిగోడ ; 2. మెట్లపక్కన కట్టేపల్చని పొట్టిగోడ.

**కంటెదూలము** వి. బావిమీదిఅడ్డపట్టె, అడ్డుగమ్మకంటెబారు.

**కంటెపునజ్జ** వి. పొడుగుకంకులువేసేసజ్జపైరు, కండసజ్జ.

**కంటెబారు** వి. కంటెదూలం.

**కంటెబొట్టు** చూ. కంటె[1]. వి. 1. తాళిబొట్టు, పుస్తె ; 2. కంఠాభరణం, మెడలో వేసుకొనే ఒకరకమైన నగ.

**కంఠెబొట్టువేయు** స.క్రి. కంటెబొట్టుకట్టు. పుస్తెకట్టు, పెళ్ళాడు.

**కంటెమ్రాను** వి. కంటెదూలం.

**కంటైనర్లు** వి. బ. వ. ప్రత్యేకవస్తువులను ఉంచడానికి ఉద్దేశించిన పాత్ర, పెట్టె.

ఇం. *Container.* పాత్ర.

<ఇం. Container + - లు.

**కంటోన్‌మెంట్** వి. సైన్యం ఉండేచోటు.

ఇం. *Contonment.* సైనికులశిబిరం.

<ఇం. Contonment.

**కంట్రాక్టరు** వి. ఒప్పందం చేసుకొన్నవాడు, గుత్తకాడు.

ఇం. *Contractor.* ఒప్పందం చేసుకొన్నవాడు.

<ఇం. Contractor.

**కంట్రాక్టు** వి. ఒడంబడిక.

ఇం. *Contract.* ఒడంబడిక.

<ఇం. Contract.

**కంట్రాక్టుబొగ్గు** వి. నేలబొగ్గు.

<ఇం. Contract + బొగ్గు.

**కంట్రోలు** వి. 1. ఇష్టానుసారంగా కాకుండా అధికార్లు నిర్ణయించిన వెలకు సరుకులు అమ్మేటట్లు చేయడం ; 2. స్వాధీనం, వశం ; 3. ఆప, అదుపు, హద్దు, ఖాయిదా.

ఇం. *Control.* అధికారం, స్వాధీనం, అదుపు, వశం ఏలు, అణచు, కట్టుబాటులో ఉంచు.

<ఇం. Control.

**కంట్రోలుధర** వి. అదుపులో ఉంచిన ధర. <ఇం. Control + ధర.

**కంట్లం** వి. పాత్రల అంచుకింద ఉండే మెడభాగం.

**కంట్లపుఎద్దు** చూ. కంట్లము.

**కంట్లపునూనె** వి. గానుగలోనుండి అప్పుడే తీసిన నూనె.

**కంట్లము** రూ. కంటలము, కంటాలము[1], కంటాళము, కంట్లాము. వి. 1. చిల్లరసరకులుంచి ఎద్దు మొ॥ వానిమీద వేసిన బుట్టలు మొ॥ వాటి జత. చెన్నబసవ. 3.33 ; 2. తొమ్మిది మణుగుల బరువు.

మహా. కంరాళీ. మధ్యలో మూతిఉన్నసంచి ; క. కంటులె, కంటాళ, కంటాళె, కంట్లె. జంతువుమీద వేసిన సంచులజత ; త. కంటాళ. ప్రయాణంసంచి.

**కంట్లపుఎద్దు** వి. కాడికట్టిన ఎద్దు. **కంట్లముకట్టు** స.క్రి. మూతికి ఉగ్గంలాగ కట్టు. **కంట్లముపడు** అ.క్రి. ఉరిపడు, బాధకల్గు.

**కంట్లాము** రూ.చూ. కంట్లము. వి. 1. జంతువులమీద వేసే

సంచుల జత ; **2.** దూదిమూట ; **3.** తొమ్మిది మణుగుల బరువు.

**కంట్లెపీట** వి. ఇనప (చేయిపట్టా) రేకులు అల్లిన చిన్న నాలుగు కోళ్ల పీట.

**కంఠసరి** వి. మెడలో ధరించే ఒక రకమైన నగ. శృం.నై. 6.44.

సం. *కణ్ఠసర-*. మెడలో ధరించే నగ.

<సం. కణ్ఠసర-.

**కంఠాణి** రూ. కంటాణి, కంటాలము². వి. కంటాణి.

**కంఠీరాయవరహా** వి. ఒక నాణెం. 2/92 లేదా 2/81 రూపాయలకు సమానం.

క. *కంఠీరవరాయనవరహ*. పది బంగారు నాణాలు (ఒక బంగారం నాణెం వెల 4⅔ అణాలు) ; *కంఠీరవరాయనహన*. ఒక బంగారం నాణెం ; *కంఠీరవరాయన హొన్ను*. కంఠీరవరాయన వరహాలో నగం.

**కండ¹** వి. **1.** మాంసం, మాంసం ముక్క, ముతుకూరు కడప జిల్లా క్రీ.శ. 800, భార.భీష్మ. 3.284 ; **2.** గుంజు. మను. 4.60.

క. *కండి*. మాంసం, కండ ; *కండవిడు*. కండరాలను పెంచడం, బలాన్ని చేకూర్చుకోవడం ; కొడ. *కాండ*. మాంసం కండ ; త. *కంటుం*. ముక్క ; మ. *కండ*. తామరలాంటి దుంపవేళ్ళు, అరటి కొమ్మలు, రెమ్మలు పెరిగే కాండం ; కొండ. *కంట్ పాట్*. జంతువు యొక్క తొడవెనక భాగంలోని కండ ; *కంట్ కల్*. కాలిపిక్క.

**కండకమ్మలు** వి.బ.వ. దుర్మాంసం పెరిగిన కండ్లు. **కండకాయ** వి. వంకాయ మొ. కండకాయలు, మృదుఫలాలు. **కండకావరము** వి. కొవ్వు, గర్వం. వేమన. 3.147. **కండక్రొవ్వు** వి. గర్వం. జైమినీ. భా. 1.45. **కండగరువము** వి. గర్వం, మను. 4.34. **కండచీమ** వి. నల్లని పెద్ద చీమ. **కండచుక్క** వి. కడుపులో కుడివక్క నల్లగా ఉండే మాంస విశేషం, కాలఖండం. ఆం.భా. 2.133. **కండవట్టు** రూ. కండపెట్టు. అ.క్రి. బలియు. రూ. **కండపెట్టు** రూ.చూ. కండపట్టు. అ.క్రి. కండపట్టు. **కండపాదుగు** వి. పాలులేని పొదుగు. **కండపముక్క** వి. నల్లగుండె.

**కండ²** రూ. కండము. వి. **1.** ఖండం, తునక. భార.ద్రోణ. 3.158 ; **2.** కలకండం ; పటికబెల్లం, కండచక్కెర. జైమినీ భా. 8.204.

సం. *ఖండ-*. పటికబెల్లం, ఒకరకం పంచదార ; ప్రా. *ఖండ*. ముక్క, భాగం, చీనీ, పంచదార ; మహా. *ఖండ*. కండచక్కెర ; *ఖండా*. ముక్క, తునియ, భాగం ; అ.మా. *ఖండ*. పంచదార, ముక్క, భాగం ; పా. *ఖండ*. విరిగిన ముక్క, చిన్నభాగం ; నే. *ఖండ*. భాగం, ముక్క, మూక, జిల్లా ; హిం. *ఖండ్*. భాగం, ముక్క, విభాగం.

క. *కండ, కండా, కండసక్కెర*. ఖండచక్కర ; త. *కంటుం*. ముక్క, బెల్లం, ఒక రకమైన చక్కెర ; మ. *కండం*. ముక్క, భాగం, గుడ్డముక్క, వస్త్రఖండం, భూభాగం ; మాల్తో. *కండ*. ముక్క, భాగం.

<ప్రా. ఖండ-.

**కండచక్కెర** వి. పటికబెల్లం. కృ.శకు. 3.48. **కండచక్కెర దిండి** వి. చిలక. ఆం.భా. 1.45. **కండతుండములు** వి.బ.వ. ముక్కముక్కలు. జైమినీ. భా. 8.94. **కండదూలం** రూ.చూ. గండదూలం. వి. దూలానికి సమాంతరంగా గుజ్జుల మీదవేసే చిన్న దూలం.

**కండ³** వి. **1.** రాతిగదిలోని ఇరవైరెండోపొర ; **2.** ఇసక ఉన్న పొర.

**కండక్టరు** వి. నడిపించేవాడు, దారి చూపేవాడు.

ఇం. *Conductor*. నిర్వాహకుడు.

<ఇం. Conductor.

**కండపురాయి** రూ.చూ. ఖండపురాయి. వి. నాలుగైదు సెంబర్లు గల పొలాలకు కలిపి హద్దుగా ప్రభుత్వంవారు పాతిన రాయి.

**కండమట్టి** వి. కుండలు చేయడానికి ప్రశస్తమైన జిగురుమట్టి.

**కండము** రూ.చూ. కండ². వి. కలకండం, శర్కరాభేదం.

**కండవడము** రూ. గండవడము. వి. యవనిక, తెర. కు.సం. 4.415.

సం. *కండపట-*. పైగుడారం, గుడారం చుట్టూ ఉండే తెర ; ప్రా. *కండవడ, కండపడ*. యవనిక.

క. *కండపట, కండపడ*. యవనిక, తెర, గుడారం చుట్టూ ఉండే తెర, పై గుడారం.

<ప్రా. కండవడ-.

**కండవాకర్ర** వి. అడ్డంగా దూలాలమీద వేసే కర్ర.

**కండవారాయి** రూ.చూ. ఖండపురాయి. వి. పొలాలకు ప్రభుత్వంవారు పాతిన రాయి.

**కండసజ్జ** రూ.చూ. కండెసజ్జ. వి. పొడుగు కంకులు వేసే సజ్జ పైరు.

**కండి¹** వి. రాతితో కట్టిన ఆర్చికి మధ్యభాగంలో బలంకోసం బిగించిన పెద్ద రాయి.

**కండి²** వి. గోడలు కట్టేటప్పుడు వాడే రాతిముక్క.

సం. *ఖండ-*.

**కండిక** రూ.చూ. గండ్రిక. వి. ఖండ్రిక. భూభాగం.

సం. *ఖండికా*. ముక్క.

<సం. ఖండికా.

**కండిగల** వి. వంటచెరకుగా ఉపయోగపడే ఒక చిన్న చెట్టు. (Kandelia rheedii)

**కండియ** రూ. కండె, గండె³. వి. **1.** ఊచకి చుట్టిన నూలి చుట్ట. పార్వ. 3.44 ; **2.** పేనిన నూలిచుట్ట ; **3.** జొన్న మొ॥ వాటికంకి ; **4.** కండెం.

క. *కండికె, కండు*. చిన్నపల్లకు చుట్టి మగ్గానికి పెట్టే దారం బంతి ; త. *కంటు*. దారపుండ, దారంబంతి ; తో. *కొడై*. పేముదారం.

సం. ఖండికా. ముక్క, భాగం ; ప్రా. *ఖండియా*. చిన్న భాగం, ముక్క ; పా. *ఖండికా*. విరిగినముక్క, కర్ర.

<ప్రా. ఖండియా.

**కండిల్చిప్ప** రూ.చూ. కండెలుచిప్ప. వి. సాలెవాడు కండెలు వేసుకొనే మట్టిచిప్ప.

**కండీగచేవ** వి. ఒకరకం చేవ.

**కందు** వి. 1. కందువ ; 2. కోట ; 3. ఖడ్గము ; 4. అలజడి ; 5. ఇడుమ ; 6. కస్తి.

**కందుకము** వి. కందుకం. క్రీడా. 82, వాల్మీ. 3.182.

సం. *కందుక-.* కర్రబంతి, ఆడుకునే బెండు ; మహా. *కందుఅ, కందుగ.* బంతి ; మరా. *కందుక్.* ఆడుకునే బంతి.

<సం. కందుక-.

**కందుబయిచేప** వి. సిరా ఆరటానికి చల్లే ఒక రకమైన ఇసకను తయారుచేయడానికి ఎముక ఉపయోగపడే ఒక జాతి చేప.

**కందుబయిపెయికి** వి. ఒకరకం చేపఎముక.

**కందువ** రూ.చూ. కందువా. వి. 1. ఉత్తరీయం. పైన వేసుకునే బట్ట ; 2. అడ్డదూలం.

**కందువా** రూ. కందువ, ఖండువా. వి. 1. ఉత్తరీయం, పైన వేసుకునే బట్ట. బహుళా. 4.174 ; 2. అడ్డదూలం.

సం. *ఖండ-.* ముక్క, భాగం ; దేశీ. *ఖండుఅ.* మహా. *కండ.* గుడ్డతో కప్పబడ్డ పట్టుదారం, మెడలోగాని మణికట్టుకుగాని వేసుకొనే గుండ్రని వెండినగ ; పర్జి. *గండె.* బట్ట.

కొలా. *ఖండవ.* వస్త్రం. *కండవా.* పంచె, బట్ట ; నా. *ఖండ, ఖండవ.* బట్ట ; ఒల్లా. *గరండ.* బట్ట.

కందువాదూలము వి. అడ్డదూలం.

**కండె** రూ.చూ. కండియ, వి. 1. సామువల్ల గట్టిపడి కండెలాగ పుష్టిగాఉన్న భుజాదుల మాంస ఖండం, కండెం. పరమ. వి. 3.48 ; 2. ఊచకు చుట్టిన నూలుచుట్ట. శుక. 2.423 ; 3. పేనిన నూలిచుట్ట ; 4. జొన్న మొదలగువాని కండె ; 5. బంగారు జరీ.

**కండెఆట** వి. నేత నేసేటప్పుడు అమర్చిన నాడె కుడి ఎడమలకు వస్తూపోతూ ఉండటం. **కండెకోక** వి. మేలైన నూలుచీర, పట్టుచీర. పార్వ. 6.113. **కండెగొల** వి. నాల్గు హస్తాల కొలబద్ద. <కండె+కొల(త). **కండెచుట్టు** స.క్రి. పల్లకు దారం చుట్టు. **కండెచెక్కు** స.క్రి. నాడెముల్లుకు పేకదారం కండెగుచ్చు. **కండెచేప** వి. ఒకరకం చేప. **కండెతెగులు** వి. కొన్ని జాతుల తృణధాన్యాల ఎన్నులకు పట్టే ఒకరకం తెగులు. **కండెపాటు** స.క్రి. నాడె ముల్లుకు పేకదారం కండెగుచ్చు. **కండెనూలు** వి. నేతలో అడ్డానికి వాడే నూలు. **కండెబద్ద** వి. 1. చూరుమట్టం వరిచూసి బాగుచేయడానికి వాడే సన్నటి బద్ద ; 2. పొడుగ్గా సన్నగా ఉండే కొయ్యతాపి. **కండెబొందు** వి. పేకకు వాడే నూలుచిలప. **కండెబోటు** వి. 1. రాట్నమీద జొన్నదంటు ముక్కకు చుట్టిన చిన్న నూలుకండె ; 2. నిండు కండెలో కొంతదారం ఉపయోగించుకోగా మిగిలిన కండె. **కండెముల్లు** నాడెలో పేకదారం కండెగుచ్చే ఇనపపుల్ల. **కండెలగుండ** వి. నూలు కండెలు వేసుకునే ఒక రకం మట్టిపాత్ర. **కండెలదిబ్బ** వి. నూలురట్నా తిరగటానికి పీలుగా వంపుతిరిగిన ఇనపచువ్వ దిగగొట్టిన కొయ్యమొద్దు. **కండెలపడిగం** వి. పేకదారం కండెలు వేసుకునే మట్టిచిప్ప. **కండెలరాటి** వి. కండెలు చుట్టేటప్పుడు చిలప తగిలించే రాటి. **కండెలరాట్నం** వి. పేకకు ఉపయోగించే కండెలు చుట్టేరాట్నం. **కండెలచిప్ప** రూ. కండిల్చిప్ప. వి. పేకదారం కండెలు వేసుకోనే మట్టిచిప్ప. **కండెవాను** వి. కండెకు కండె పూర్తిగా నేసిన జంపఖానా. **కండెపీడు** వి. పేకకు వాడే నూలుచుట్ట.

**కండెం** రూ. గండెం. వి. ఎత్తునుగాని లోతునుగాని చెప్పే పరిమాణం, రెండుగజాల కొలత.

**కండెతుండములు** రూ.చూ. కండతుండములు. వి బ.వ. ముక్కముక్కలు. రాజవి. 3.64.

**కండెన్సరు** వి. ఘనీభవింపజేసే యంత్రం.

ఇం. *Condenser.* ఘనీభవింపజేసేది.

<ఇం. Condenser.

**కండెపురాయి** రూ.చూ. ఖండపురాయి, వి. పొలాలకు ప్రభుత్వంవారు పాతిన శిలావిశేషం.

**కండెము** వి. వ్యాయామంతో గట్టిపడి, కండెలా పుష్టిగా ఉన్న భుజాల్లోని మాంసం ముక్క. విజయ. 1.109.

**కండెరాయచ్చు** వి. తారనరాయి చేసే అచ్చు.

**కండెరాయి** వి. నల్లని ఇనపఖనిజంతో కలిపిన క్వార్ట్జ్‌రాయి (Magnetic ironove).

**కండెలమండిక** రూ. కండ్లెమండికి. వి. నేతపనివారు కండెలు వేసుకోడానికి వాడే వెదల్లు మూతిగల గుండ్రని మట్టిపాత్ర.

**కండెవట్టు(-పట్టు)** చూ. కండె. అ.క్రి. నొప్పి కలుగు, లాగు.

**కండెవులుదు** వి. కందవెల్లు, ముళ్ళుండే కాండం గలిగిన ఒక చెట్టు (Mallotus repandus).

**కండెసజ్జ** రూ. కండసజ్జ. పొడుగు కంకెలువేసే సజ్జపైరు.

**కంద్ర**[1] వి. ఉలంగవం, పెద్ద నల్లచీమ.

**కంద్ర**[2] వి. కనరు, కరుడు.

**కంద్రావి** చూ. కన్నుల. వి. చూడటానికి ఘోరంగా ఉండేది, వ్యసనం, కామంవల్ల, కోపంవల్ల పుట్టిన దోష సంబంధమైనది.

**కంద్రిక**[1] రూ.చూ. గంద్రిక. వి. 1. ముక్క, తునియ. అప్ప. 2.369 ; 2. భూఖండం.

**కంద్రిక**[2] వి. శివారు, గ్రామంలోని చిన్న విభాగం.

సం. ఖండికా. ముక్క, విభాగం.

<సం. ఖండికా.

**కండ్లకమ్మి** చూ. కన్ను[1]. వి. చీరకమ్మిలో అక్కడక్కడ ఎరుపు, నలుపు పోగులు మార్చివేసిన కమ్మి.

**కండ్లతడికె** చూ. కన్ను[1]. వి. వెదురుబద్దలమధ్య పెద్దపెద్ద కన్నాలుండేలా అల్లిన తడక.

**కండ్లరావి** వి. పిప్పలీకం, అశ్వసన్నిభం, ఒకరకం రావిచెట్టు.

**కండ్లపడు** చూ. కన్ను[1]. అ.క్రి. కనిపించు, కళ్ళల్లో పడు.

**కండ్లార** చూ. కన్ను[1]. క్రి.విశే. స్వయంగా, తనివితీరేటట్లుగా.

**కండ్లుకలక** చూ. కన్ను[1]. వి. ఒకరకం కళ్ళజబ్బు, కళ్ళు వాచి పుసులుకట్టే కంటిజబ్బు.

**కండ్లుకుట్టు** చూ. కన్ను[1]. వి. కండ్లకలక.

**కండ్లునెత్తికెక్కు** చూ. కన్ను[1]. అ.క్రి. పొగరెక్కు, నిక్కు.

**కండ్లుమండు** చూ. కన్ను[1]. అ.క్రి. అసూయపడు.

**కండ్లెమండికి** రూ.చూ. కండెలమండిక. వి. సాలీలు కండెలు వేసుకోడానికి వాడే వెదల్లు మూతిగల గుండ్రటి మట్టి

పాత్ర.

**కత** రూ. కద[2]. వి. 1. చరిత్ర, కథ. భార. ఆది. 7.262; 2. వృత్తాంతం, సమాచారం, సంగతి. భార. ద్రోణ. 4.227; 3. చేష్ట, చర్య. నృసింహ. 5.86; 4. లోకో క్తి. సామెత. ఉ.హరి. 4.102.

సం. కథా-. భూషణం, భాష, చరిత్ర, చర్య; ప్రా. అప. కహా; పా. కథా-; హిం. కథా. వృత్తాంతం, మతానికి సంబంధించిన చర్చ, కథ; కహానీ. కథ.

క. కత, కతె, కథ; తు. కతె; త. కత్తై; మ. కత; కుఇ. కతె, కత్త; కువి. కత.

< సం. కథా.

**కతకాచి** వి. పెక్కు కథలు తెలిసినది. వేంక. పంచ. 1.554. **కతకారి** వి. కథలు చెప్పటంలో నేర్పరి, నేర్పరి. గడుసరి. అష్టమ. క. 1.34.23. **కతకారితనము** వి. కథాకథనంలోగల నైపుణ్యం. శుక. 2.236. **కతపత్రమిచ్చు** స.క్రి. గట్టిగా చెప్పు. పాండు. 1.168. **కతపత్రము** వి. ప్రమాణ పత్రం. పాండు. 1.63. **కతరాజు** వి. కథలు చెప్పటంలో నేర్పరి. ప్రబో. 3.79. **కతలకాచి** వి. పెక్కు కథలు తెలిసినది, కథానిధి. వేంక. పంచ. 1.554. **కతలకారి** వి. కథలు చెప్పటంలో నేర్పరి. హంస. 5.337. **కతలపుట్ట** వి. కథల కాణాచి. హంస. 2.71. **కతలుగట్టు** స.క్రి. ఉన్నవీ లేనివీ కల్పించు. < కత + -లు + కట్టు. **కతలుచేయు** స.క్రి. వికారపు చేష్టలుచేయు. **కతలువడు** స.క్రి. వికారపు చేష్టలుచేయు, నటించు.

**కతకదం** చూ. కతుకు[1].

**కతకము** వి. ఇందుగచెట్టు. నీళ్ల తేర్చడానికి ఉపయోగపడే గింజలు కాసే చెట్టు (strychnospotatorum) (Logahlaceae Potatorum).

క. కతక; త. కతకం.

**కతకమ్మ** వి. నక్రలగిచెట్టు, పలచని ఆకులు కలిగిన ఒక చెట్టు (Litsaea Sabibera).

**కతన** చూ. కతము. వి. కారణం. భార. ఆది. 8.93. విరా. 3.190.

**కతమిచ్చు** చూ. కతము.

**కతము** వి. 1. కారణం, హేతువు. భార. ఆది. 6.140; పండి. చ. 4.15; 2. తెలిపే విధం. రామా. 4.169; 3. గుర్తు.

సం. కృత-, ఫలితం, లక్ష్యం, కృత్యం, పని; ప్రా. కత-; శౌ. కద, కత; అ.మా. కయ; మా. కిద; అప. కఅ.

క. కత. కారణం, హేతువు.

< ప్రా. కత-.

**కతమిచ్చు** స.క్రి. సూచించు, గురుతిచ్చు. వసు. 4.9.

**కతవ** రూ.చూ. కత్తువ[1]. వి. 1. పంటకాలవ నుంచి పొలానికి తీసిన కాలవ; 2. వాగుకు కట్టిన ఆనకట్ట, పొలంలో కురిసిన వాన నీళ్ళకు మట్టి కొట్టుకు పోకుండా అక్కడక్కడ పోసిన కట్ట(లు); 3. కొయ్యలాకు.

**కతాయించు** పో.చూ. ఖాతా. స.క్రి. చేర్చు, ఎక్కించు. దాఖలు చేసికొను.

హిం. ఖత్, ఖథ్. దస్తావేజు, పత్రం; మరా. ఖత; అర. ఖత్. పత్రం.

క. కత్తు, కత్. దస్తావేజు, పత్రం, ఆజ్ఞా పత్రిక వ్రాత.

**కతాళి** రూ.చూ. కత్తాళి. వి. ఒక రకం కృత్రిమమైన పట్టు.

**కతావణి** రూ.చూ. ఖటావణి. వి. అవర్జా పుస్తకం, పద్దు, ఖాతా.

**కతిక** రూ.చూ. కత్తిక. వి. కృత్తిక కార్తె.

**కతిరాగోదు** వి. బాదంచెట్టు జిగురు.

హిం. కతీరా. ఒక రకం చెట్టు బంక; గోంద్. జిగురు. బంక; ఉ. కతీర్ గోంద్. ప్రసిద్ధమైన ఒక రకం బంక, జిగురు; పార. కతీర. బంక, జిగురు.

< ఉ. కతీర్ గోంద్.

**కతుకు**[1] రూ. కదుకు, గతుకు[1], గదుకు. స.క్రి. 1. తిను, భుజించు. పార్వ. 5.87; 2. కుక్కలు మొదలైనవి నాలుకతో కొంచెం కొంచెంగా తాగు. భాస్క.శ. 5.

తు. గద్ కుని, గదుకుని. గతుకు, నాకు; త. కతుక్కు (కతుక్క-). మింగు; పో.చూ. కతువు. గ్రహించు, పట్టుకొను.

**కతకదం** వి. 1. ఆకలి లేకుండా తినడం; 2. లంచం తీసుకోవడం.

**కతుకు**[2] వి. గుర్తు, కత్తితో నరికినప్పుడు ఏర్పడిన గాయపు గుర్తు.

త. కతుకుక్క. గాయపు మచ్చ, పుండు మచ్చ, మచ్చ.

< త. కతుక్కు.

**కతుక్కు** చూ. కటుక్కు. వి. కొరికేటప్పుడు వచ్చే ధ్వని అనుకరణం. శుక. 1.177.

**కతువుకమ్మ** వి. నక్రలగిచెట్టు, పలచని ఆకులు కలిగిన ఒక చెట్టు (Litsaea sebiferra).

**కతువుకుండ** వి. దావు కర్మలో వాడే కుండ.

సం. క్రతు-; కుణ్డ - పాత్ర విశేషం.

< సం. క్రతు- + సం. కుణ్డ-.

**కతోలికు** రూ.చూ. కాతోలికు. వి. పోపు అనుయాయులైన క్రైస్తవుల శాఖ.

**కత్తరము** రూ.చూ. కత్తళము. వి. 1. ఆయుధ విశేషం. కు.సం. 12.3; 2. కవచం.

**కత్తరి** విణ. 1. వర్ణ సాంకర్యంకల, సంకరం. విజ్ఞా. ఆచా. 112; 2. అనేక వర్ణాలుకల శబలం; వి. 1. భేదం తెలియని కూడిక; 2. ఎరచిల్ల పురుగు.

సం. కర్తృ-. నేసేవాడు; కర్తనం. నేత.

< సం. కర్తృ-.

**కత్తరిఆవు** వి. చాల రంగుల మచ్చలున్న ఆవు. **కత్తరికలియు** రూ. కత్తరిగలియు. అ.క్రి. సంకరమగు. **కత్తరిగలియు** (-కలియు) రూ.చూ. కత్తరికలియు. అ.క్రి. మిశ్రమగు, కలిసిపోవు, సంకరమగు. జైమినీ. భా. 8.213. **కత్తరిగుఱ్ఱము** వి. చాల రంగుల మచ్చలున్న గుర్రం. **కత్తరించు**[1] స.క్రి. చలింపజేయు, ఆడించు, కొలగించు.

పండి. చ. 5.371. కత్తరిల్లు అ.క్రి. చలించు, అల్లాడు, కదలు. శృం.నై. 7.46.

**కత్తరించు²** రూ.చూ. కత్తిరించు. స.క్రి. ఖండించు, ముక్కలు చేయు. ఉ. హరి. 1.148.

**కత్తలము** రూ.చూ. కత్తళము. వి. కవచం. అచ్చ. రా. 3.7.

**కత్తలాన** రూ.చూ. కత్తలాని. వి. 1. అశ్వాది వాహనం. ఆం.భా. 2.196. కవచం తొడిగిన అశ్వం; 2. ఖల్లాన దేశపుగుర్రం, తెల్లని గొరిజ, తోక, వెంట్రుకలున్న నల్ల గుర్రం.

**కత్తలానము** రూ.చూ. కత్తలాని. వి. 1. అశ్వాది వాహనం. కువల. 1.7; 2. ఖల్లాన దేశపు గుర్రం.

**కత్తలాని** రూ. కత్తలాన, కత్తలానము, కత్తలాను, కత్తళా, కత్తళాని, కత్తళి, ఖత్తులాణము. వి. 1. ఖల్లాన్ దేశపు గుర్రం. శృం.నై. 6.96; 2. అశ్వాది వాహనం; 3. కవచం తొడిగిన అశ్వం.

ఉ.పార. *ఖత్‌లాన్*. బదఖ్‌షాన్ దేశంలోని ఖత్‌లాన్ మండలం.

<ఉ. ఖత్‌లాన్.

**కత్తలాను** రూ.చూ. కత్తలాని. వి. ఖల్లాన దేశపు గుర్రం. చంద్రభా. 3.67.

**కత్తళ(డు** చూ. కత్తలాని. వి. వర్మితాశ్వం, అశ్వాది వాహనం.

**కత్తళము** రూ. కత్తరము, కత్తలము, కందళము. వి. 1. ఆయుధ విశేషం. కు. సం. 2.70; 2. కవచం. భార. శల్య. 2.39.

త. *కత్తణమ్*. కవచం, తొడుగు.

**కత్తళా** రూ.చూ. కత్తలాని. వి. అశ్వాది వాహనం, ఖల్లాన దేశపు గుర్రం. రాజగో. 5.88, గంధ. 6.

**కత్తళాని** రూ.చూ. కత్తలాని. వి. గుర్రం. వరాహ. 3.40.

**కత్తళి** రూ.చూ. కత్తలాని. వి. గుర్రం.

**కత్తళీ(డు** చూ. కత్తళము. వి. వర్మితుడు, కవచం తొడిగిన వాడు. కవిసంశ. 3, పు. 81.

**కత్తరు(డు** చూ. కత్తలాని. వి. ఖల్లాన దేశపు గుర్రం.

**కత్తవ¹** రూ.చూ. కత్తువ¹. వి. 1. మడికి చుట్టూ ఏర్పరచిన చిన్న గట్టు; 2. కొండల వరసకు అడ్డంగా తిరిగి ఉన్న కొండ చోటు; 3. ఏటి నీరు పక్కకు మళ్ళించటానికి అడ్డంగా వేసిన ఆనకట్ట; 4. చేను చుట్టూ కట్టిన గోడ, కరగోడ; 5. నీటిని పారుదల కాలువలకు, భూవిస్తీర్ణాన్ని బట్టి, పంచిపెట్టే తూముల కలయిక, చిన్న యాగర.

**కత్తవ²** రూ. కత్తవా. వి. 1. బాణంవంటి పనిముట్టు; 2. మట్టిని పెళ్ళగించే సాధనం, దోకుడు పారవంటి సాధనం.

**కత్తవము** వి. చిన్న మురికి కాలవ.

**కత్తవా** రూ.చూ. కత్తవ². వి. బొరిగ కంటె పెద్దపనిముట్టు.

**కత్తాయి** రూ.చూ. కత్తాళి. వి. కలబంద.

**కత్తాళి** రూ. కతాళి, కత్తాయి, కర్తాళి. వి. సాగనార మొక్క (Sanseviera zeylanica), కలబంద (Aloe barbtradensis).

క. *కత్తాల, కత్తాళి*. కలబంద; త. *కళ్ళాత్తి*; మ. *కఌవాఴ*.

**కత్తాళినార** రూ. కత్తేళనార. వి. కలబంద నుంచి తయారైన నార.

**కత్తి¹** వి. 1. ఆయుధవిశేషం ఆయుధం (తిప్పలూరు శాసనం. క్రీ.శ. 625-650). ఉ.హరి. 1.140; 2. చాకు, మంగలి కత్తి. ఆం.భా. 2.209; 3. ముప్పై రెండు విన్నాణాల్లో ఒకటి. ఆం.భా. 2.211; 4. కోత పనిముట్టు; 5. చెక్కే ఇనప పనిముట్టు; 6. కత్తివంటి కొయ్య పనిముట్టు; 7. ఒక రోజులో ఒకరు పైరును కోయటానికి సరిపడే భూమి, 40 ఎకరాల 4 కుంటలు; 8. భూమి కొలత, 17 ఎకరాలు.

సం. *కర్తృకా, కర్త్రికా*. వేటకత్తి, చురియా, బాకు; ప్రా. *కత్తియా-*; హిం. *కత్తీ*. చిన్న కత్తి; సిం. *కాతీ*. కత్తి; మరా. *కత్తి-*;

క. *కత్తి*. చాకు, బాకు; కొడ. *కత్తి*; తు. *కత్తి*; త. *కత్తి*. బాకు, కోత పనిముట్టు, కొడవలి; కో. *కత్య్-*; తొ. *కఠ్‌కొత్య్*. బాకు, చాకు; గోం. *కాతి*. కోడి కాలికి కట్టే చురియ; పర్జి. *కత్*. కోయు; ఒల్లా. *కత్*; బ్రా. *కత్తర్*. కత్తి.

<ప్రా. కత్తియా.

**కత్తికంకర** వి. పొరలు పొరలుగా ముక్కలు ముక్కలుగా ఉండే పదునైన రాతిముక్క. **కత్తికట్టు** అ.క్రి. జగడానికి సిద్ధమగు. **కత్తికట్టేదొర** వి. అధికారి, చేతిలో కత్తిని ధరించినవాడు. **కత్తికలా(డు** వి. ఖడ్గి. **కత్తికాను** వి. వడ్లవాని పనిముట్టు, గీతకట్టె. **కత్తికొడవలి** వి. ఈత కొడవలి, కంపనరికే కొడవలి. **కత్తిగంటము** వి. ఒకవైపు కత్తి, రెండోవైపు గంటమూ ఉండి రాయటానికి పనికొచ్చే పనిముట్టు. శుక. 2.416. **కత్తిగొంటు** వి. కత్తివలె తీక్షణమైనది, క్రూరస్వభావంగలది. కు.సం. 8.135. **కత్తిజెముడు** వి. ముళ్ళు కలిగిన పచ్చని కొమ్మలు కలిగిన ఒక చెట్టు (Euphorbia caducifolia). **కత్తిదూయు** అ.క్రి. కలహానికి సిద్ధమగు. **కత్తిపట్టె** వి. డాలీ కట్టుబడిలో కుక్క (కత్తి) బిగించిన కొయ్యపట్టె. **కత్తిపిట్ట** వి. పక్షి విశేషం, కోయిల. **కత్తిపిడి** వి. కత్తికి అమర్చిన పిడి. **కత్తిపిడిక** వి. ఈండ్రవాని కత్తులబుట్ట. **కత్తిపీ(ట** వి. 1. కూరలు మొదలైనవి తరగటానికి ఉపయోగించే కత్తి అమర్చిన పీట; 2. కూరలు తరగటానికి పీటలో అమర్చిన కత్తి; 3. ఒక ఆట. **కత్తిపేరిమెకము** వి. ఖడ్గమృగం. ఉ.రా. 7.390. **కత్తిబల్ల** వి. మరమగ్గం చట్రంలో, నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె. **కత్తిబల్లెము** వి. ఈటె. **కత్తిమందు¹** వి. 1. కత్తి ఒరకు పూసే వర్ణం; 2. కురుపులకు పూసే మందు; 3. పిడిలో కత్తి బిగించటానికి ఉపయోగించే బిగురు. **కత్తిమందు²** వి. మూడు పలాల చెముడు చెట్టు, మూడు పలకలచెట్టు, ముళ్ళుకలిగిన ఒకచెట్టు (Euphorbia trigona). **కత్తిమందుచెట్టు** వి. ముళ్ళు గలిగి, కాడలతో కూడిన పాలచెట్టు, కత్తిమందు చేయటానికి ఉపయోగించే చెట్టు. (Euphorbia trigona). **కత్తిమీ(దిసాము** వి. చాలా జాగ్రత్తగా చేయవలసిన పని, అపాయ కృత్యం. కువచ. 4.82. **కత్తిరేకు** వి. సలపకు రాయికి అంటుకున్న

మట్టిని తీసివేయడానికి వాడే జనప రేకు. కత్తివాటు వి. కత్తిగాటు, కత్తిదెబ్బ. కత్తివాతి వి. దూసినకత్తి, విచ్చుకత్తి. ఆం.భా. 2.11. కత్తివాతితూపు వి. అర్ధచంద్ర బాణం. భాస్క.రా. 6.998. కత్తివాతియమ్ము వి. అర్ధచంద్ర బాణం. భార. ఆరణ్య. 6.250. కత్తులబోను వి. కత్తులను అమర్చిన ఒక రకం బోను, జంతువులను పట్టటానికి, చంపటానికి కత్తులను అమర్చిన యంత్రం. చెన్న. బసవ. 2.209. కత్తులసాన వి. ఒరపిడి చక్రం, కర్షచక్రం, సాన. కత్తులుగట్టు (-కట్టు) అ.క్రి. పగపూను. హర. 2.28. కత్తులు నూఱు అ.క్రి. కలహానికి కాలుదువ్వు. కళా. 7.35.

కత్తి[2] రూ.చూ. కత్తిక. వి. కృత్తికకార్తె, వైశాఖ మాసంలో వచ్చేది.

కత్తి[3] వి. పదిహేడు ఎకరాల భూమి.

కత్తిక రూ. కతికి, కత్తి[2]. వి. కృత్తిక కార్తె, వైశాఖ మాసంలో వచ్చే కార్తె.

నం. కృత్తికా. అశ్విని మొ. నక్షత్రాల్లో మూడోది.

-కత్తియ సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం. రూ. కత్తె. అప. మతుబర్థంలోనూ, స్వార్థంలోనూ వచ్చే స్త్రీ ప్రత్యయం. ఉదా. అందకత్తియ, చెలికత్తియ మొ॥

పో.చూ. క. ఇతి, ఇత్తి. స్త్రీప్రత్యయం. ఉదా. కొల్లటిగిత్తి, కోమటిగిత్తి;

పో.చూ. నం. కర్త్రీ, కర్తా. ప్రతినిధి.

కత్తియము రూ. కత్తెము. వి. 1. బారు, బంతి, వరస. గంధ. 6; 2. అంకెల అడ్డు బంతి.

క. ఖత్తు. వ్రాలు, ఆజ్ఞాపత్రిక, దస్తూరి, గొలుసుకట్టు; మరా. ఖత. గీత.

కత్తిర రూ.చూ. కత్తెర[1]. వి. 1. పోటీగా పెట్టే కర్ర; 2. మూల కత్తెర ఆకారాన్ని బట్టి, అర్థవిపరిణామం వస్తుంది.

కత్తిరగర్ర (-కర్ర) వి. పోటీగా పెట్టిన కర్ర. కత్తిరగాపు (-కాపు) వి. కట్టుబాటు. కత్తిరపట్టు రూ.చూ. కత్తెరపట్టు. వి. సారె పైవాట తయారీలో మధ్యలోను చివర్లలోను ముడతలు రాకుండా ఉండటానికి రెండు చేతుల బొటన వేళ్ళను చూపుడు వేళ్ళను కత్తిరి మాదిరిగా చేర్చి పట్టే పట్టు.

కత్తిరి రూ.చూ. కత్తెర[1]. వి. 1. ముక్కలుగా చేసే సాధనం; 2. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొ॥నవి కదలకుండా నిలపడానికి రెండు కర్రలను పై వైపునకట్టి కింద పంగటించి నిలిపిన తాత్కాలికపు ఏర్పాటు.

కత్తిరికట్టు అ.క్రి. ఆము పడుగులో కింద మూడు గోలీలు, వాటిమీద రెండు, ఆ రెండింటి మీద ఒకటి బోర్లించిపెట్టు. కత్తిరికాలు రూ. కత్తిరిగాలు. వి. ఏతపు దోనె కింద ఎత్తుకోసం వేసిన కర్ర. కత్తిరిగాలు (-కాలు) రూ.చూ. కత్తిరికాలు. వి. ఆనుగర్రమీద బరువున్న బండిని దించకుండా నిలబెట్టడానికి పోలుకర్ర కింద ఎత్తు పెట్టే కర్రల పరికరం. కత్తిరిగూడు వి. త్రిభుజాకారంలో ఉండే గూడు. కత్తిరిగెడ వి. ఆనుగర్ర, మీద బరువున్న బండిని దించకుండా నిలబెట్టటానికి పోలుకర్ర కింద ఎత్తు పెట్టే కర్రల పరికరం. కత్తిరిపడవ వి. కురువాటం కింద నడిచేదారి. కత్తిరిపట్టు రూ.చూ. కత్తెరపట్టు. వి. సారె పై వాట తయారీలో మధ్యలోను, చివర్లోను ముడతలు రాకుండా ఉండడానికి రెండు చేతుల బొటన వేళ్ళను చూపుడు వేళ్ళను కత్తెర మాదిరిగా చేర్చి పట్టే పట్టు. కత్తిరి పోటురాయి వి. భూమి ఉపరితలం మీద దొరికే ఒక జాతి కఠిన శిల. కత్తిరిబంగళా వి. చెన్నగోడలు, మంగుళూరు పెంకు కప్పు గల ఇల్లు. కత్తిరిబొంగు వి. పోటీగా పెట్టిన కర్ర. కత్తిరివద్రం వి. కత్తిరిగోడ మీద బాజాలు, వాటి మీద గుజ్జులు, వాటిమీద వెన్ను, పైన దర్జుబద్దగాని వెదురు తడికగాని వేసి పెంకు కప్పడం, కప్పేవని. కత్తిరి వావిలి వి. ఆకులు కత్తిరించినట్లుండే ఒక వావిలి. కత్తిరి వాసం వి. మూల వాసాల పొడుగున రెండు వైపులకూ మేకు బంధింపు చేసివేసిన వాసం. కత్తిరోటు వి. సారె పై వాట తయారీలో మధ్యలోను, చివర్లోను ముడతలు రాకుండా ఉండడానికి రెండు చేతుల బొటన వేళ్ళను కత్తెర మాదిరిగా చేర్చి పట్టే పట్టు.

కత్తిరింగుకూజా వి. తాబేలు ఆకారంలో ఉండే నీళ్ళకూజా.

<ఇం. Cutting + కూజా.

కత్తిరించు రూ. కత్తరించు[2], కత్రించు. స.క్రి. కత్తెరతో ఛేదించు, చేదించు, ఖండించు. నిర్వ.రా. 5.17. శృం.నై. 7.93.

క. కత్తరిసు. కత్తిరించు, ఛేదించు.

కత్తిరింపు వి. కట్టుబడిలో క్రమంగా తగ్గించే తగ్గింపు, పెంచే పెంపు.

కత్తిరిలు రూ. కత్తిరిల్లు. అ.క్రి. ఛిన్నమగు. శుక. 1.171.

కత్తిరిల్లు రూ.చూ. కత్తిరిలు. అ.క్రి. ఛిన్నమగు. ఖండితమగు. శుక. 1.177.

కత్తిరివడ్లు రూ.చూ. కత్తెరవడ్లు. వి. బ.వ. కృత్తిక కార్తెలో నాటిన వరిపైరు పండే ధాన్యం.

కత్తిరోటు చూ. కత్తిరి.

కత్తు[1] వి. 1. కత్తిగీత; 2. శత్రుపక్షం.

హిం. ఉ. ఖత్, ఖత్. రేఖ, గీత, పత్రం, దస్కతు, నిశాని, చిహ్నం.

కత్తు[2] వి. 1. తీరు, నక్రమ విధానం; 2. ప్రాయం; 3. జోడు.

కత్తుకలుపు అ.క్రి. ఏకీభవించు.

కత్తు[3] రూ.చూ. ఖత్తు. వి. ఉత్తరం, లేఖ. ద.హిం.శా. 10.745, 35. క్రీ.శ. 1530.

కత్తులబోను చూ. కత్తి[1].

కత్తులసాన చూ. కత్తి[1].

కత్తులుగట్టు చూ. కత్తి[1].

కత్తువ[1] పో.చూ. కట్టు. రూ. కతవ, కత్తవ[1], కత్వా (బల్ల). వి. 1. ఆనకట్ట, ఏటికి అడ్డంగా కట్టిన అడ్డకట్ట; 2. గనిమ, చేనిగట్టు; 3. ఒక చిన్నగుట్ట.

పో.చూ. క. కట్టుహ. కట్టటం.

కత్తువ[2] వి. మట్టిని వెళ్ళగించడానికి ఉపయోగించే ఒక విధమైన పనిముట్టు.

-కత్తె సమాసాల్లో మాత్రమే ప్రయుక్తం. రూ.చూ. కత్తియ. అప. 1. మతుబర్థంలోనూ, స్వార్థంలోనూ వచ్చే ఒక

స్త్రీ ప్రత్యయం. ఉదా. అందకత్తె, చెలికత్తె.

**కత్తెతనము** వి. పడుచుదనం.

**కత్తెము** రూ.చూ. కత్తియము. వి. అంకెల అర్ధు బంతి.

**కత్తెర**[1] రూ. కత్తిర. కత్తిరి. వి. 1. కత్తిరించటానికి ఉపయోగించే సాధన విశేషం. వరమ. వి. 4.184; 2. కుక్క (మృగాలను కత్తెరలాగ ఖండించటం వలన కుక్కకు పెట్టిన పేరు); 3. ముప్పై రెండు విన్నాణాలలో ఒకటి; 4. ముక్కోణం ఆకారంలో కొయ్యతోనో, ఇనప కడ్డీలతోనో నిర్మించిన చట్రం; 5. అడ్డంగాగాని, నిలువునగాని ఇటికలను ఒకదానికొకటి పోటీపెట్టి పేర్చిన పేర్పు; 6. అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల పడి దారాలకు వేసిన లంకె; 7. తివాసీ నేతకు వాడే ఉన్నిపోగులు కత్తిరించే కత్తెర.

సం. *కర్తరి*-, *కర్తరికా*, *కర్తరీ*. కత్తెర; ప్రా. *కత్తరీ*; పా. *కత్తరి*, *కత్తరీ*; హిం. *కతరీ*, *కతర్నీ*. కత్తెర; అప. *కత్తరియ*;

క. *కత్తరి*, *కతి*. కత్తెర; *కత్తరిసు*. కత్తిరించు; తు. *కత్తరి*, *కత్తెరి*; త. *కత్తరి*, *కత్తరికై*; మ. *కత్తరి*; కువి. *కధెరి*; పర్జి. *కెతర్ని*; ఒల్లా. *కల్*. నరకు; మాల్తో. *కప్పె*. కత్తెర; బ్రా. *కత్తార్*. కత్తి; కైఖి. కత్తెర.

<ప్రా. కత్తరీ.

**కత్తెరకాఁడు** వి. జేబులు కత్తిరించి దొంగతనం చేసేవాడు. ప్రబంధ. 675. **కత్తెరకాలు** వి. పల్లకీ మొదలైన వాటి కాళ్ళకు అడుగున పోటీగా అమర్చే మార్పు కాలు. **కత్తెరకొయ్య** వి. 1. నేలమీద మోసే ఊతకొయ్య, ఊతకాలు; 2. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నేత బయలులో పాతిన ఒక రకం నిలువు గుంజ. **కత్తెరకోల** వి. ఒక రకం కత్తెర. **కత్తెరగడ్డ** వి. కుసితిరగడానికి వీలుగా దానికింద అమర్చిన గుంటగల రాయి. **కత్తెరగడ్డము** వి. కత్తిరించిన గడ్డం, కత్తెర వేసిన గడ్డం. శుక. 2.412. **కత్తెరగాడి** వి. కత్తెర అడుగున ఉన్న కమ్మి. **కత్తెరగాయము** వి. కత్తెర వలె ఉండే గవాక్ష విశేషం. ఉ.హరి. 2.94. **కత్తెరగుంజ** వి. 1. మరానుబడ్డీకి ఆధారంగా నేలలో పాతిన కొయ్య; 2. కత్తెర కొయ్య. **కత్తెరగొయ్య(-కొయ్య)** వి. కత్తెరఅడుగున ఉన్న కమ్మి. **కత్తెరగోడ** వి. చుట్టుగోడల మీద ముక్కోణం ఆకారంలో కప్పు వరకు కట్టిన పక్కగోడ. **కత్తెరచీల** వి. మీట, మునసలచీల వదిలి రాకుండ దాని చివరి రంధ్రంలో అడ్డంగా వేసేచీల. **కత్తెరజాయి** వి. రెండు కర్రలుపైన కలిసేటట్లు ఒకదానికొకటి మోటించటం. **కత్తెరజాల** వి. నలుపులో ఎరుపుచార. **కత్తెరదొంగ** వి. జేబులు కత్తిరించి దొంగతనం చేసేవాడు. **కత్తెరపట్టు** రూ. కత్తిరపట్టు, కత్తిరిపట్టు. వి. ఒక దానిమీద ఒకటిగా చేతులు పెట్టి కూనను లేపేపట్టు. **కత్తెరపట్టె** వి. నాలుగుసార్లు దున్నిన తరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే మొద్దు. **కత్తెరపాటు** వి. సారెపై వాటతయారీలో మధ్యలోను, చివర్లోను, మడతలు రాకుండా ఉండడానికి రెండు చేతుల బొటన వేళ్ళను, చూపుడు వేళ్ళను కత్తెర మాదిరిగా చేర్చి పట్టేపట్టు. **కత్తెరబట్ట** వి. నలుపులో ఎర్రపొడ. **కత్తెరబావిలీ** వి. స్త్రీ కర్ణభూషా విశేషం. **కత్తెరబోను** వి. 1. ఒక రకపు ఎలకలబోను; 2. అపాయస్థితి. **కత్తెరమళ** వి. కుసి తిరగడానికి వీలుగా దాని కింద అమర్చిన గుంట కల ఇనప దిమ్మ. **కత్తెరమాను** వి. మరమగ్గం చట్రం నిలబెట్టటానికి, నేతబయలులో పాతిన ఒక రకం నిలువు గుంజ. **కత్తెరరాయి** వి. కంచులాగ మోగే ఒక రకం నల్లరాయి. **కత్తెరవానము** వి. ఎదురెదురుగా కత్తెరలాగ ఉంచే వానం. **కత్తెరనుడి** వి. వీపుమీద కత్తెర మాదిరి ఉండే నుడి. **కత్తెరార్చి** వి. త్రిభుజాకారంలో ఉండే ఆర్చి.

**కత్తెర**[2] వి. 1. కృత్తికా నక్షత్రం. కాశీ. 1.138; 2. భరణి మూడు, నాలుగు పాదాల్లోనూ, కృత్తిక నాలుగు పాదాల్లోనూ, రోహిణి మొదటి పాదంలో సూర్యుడు ఉండే కాలం.

సం. *కృత్తికా*. కృత్తిక కార్తె, వైశాఖ మాసం; ప్రా. *కత్తియా*. నక్షత్ర విశేషం; పా. *కత్తికా*; హిం. *కత్తికా*;

త. *కత్తిరి*. కృత్తికా నక్షత్రం.

<సం. కృత్తికా.

**కత్తెరకాపు** వి. మొక్కలు కత్తెరలో కాసే కాపు. **కత్తెరకాయ**[1] వి. కృత్తిక కార్తెలో కాసే కొబ్బరికాయ. **కత్తెరగాలి** వి. కృత్తిక కార్తెలో వీచే వేడిగాలి. **కత్తెరచుక్క** వి. కృత్తికా నక్షత్రం. **కత్తెరనెల** వి. కార్తీక మాసం. **కత్తెరయెండ (-ఎండ)** కృత్తికలో కాసే ఎండ. **కత్తెరవంగ** వి. కృత్తిక కార్తెలో కాచే వంగకాపు. ఆం.భా. 2.59. **కత్తెరవడ్లు** రూ. కత్తిరి వడ్లు. వి.బ.వ. కృత్తిక కార్తెలో నాటిన వరిపైరు పండే ధాన్యం. **కత్తెరవాన** వి. కృత్తిక కార్తెలో కురిసే వాన.

**కత్తెరకాయ**[2] వి. వంకాయ.

త. *కత్తర*, *కత్తిరి*, *కత్తిరిక్కాయ్*. వంకాయ. (Solanum melongena)

<త. కత్తిరి+కాయ.

**కత్తెరకాయచీర** వి. మూరెడు పొడుగు కమ్మి పెట్టి నేసిన ఒక రకం చీర, వంకాయ నమూనాలో డిజైన్లు నేసిన కమ్మి.

**కత్తెజెముడు** వి. ఒక రకం ముళ్ల చెట్టు (Euphorbia caducifolia)

**కత్తెరార్చి** చూ. కత్తెర[1].

**కత్తెళనార** రూ.చూ. కత్తాళినార. వి. కలబంద నుంచి తయారైన నార.

**కత్త్యపువాడు** చూ. కత్యము.

**కత్యము** వి. బిరుదు.

**కత్యపువాడు** వి. 1. బట్టు; 2. దండోరా వేసేవాడు.

**కత్యముచెప్పు** స.క్రి. బిరుదును ప్రకటించు.

**కత్రి** వి. జక్కిణి అనే నాట్యం యొక్క అంగ విశేషం. ఉ.రా. 6.139.

**కత్రించు** రూ.చూ. కత్తిరించు. స.క్రి. కత్తిరించు. రం.రా. యు. 351 పు. 14 పం.

**కత్రీపువన్నె** వి. వంగపువ్వు రంగు.

త. *కత్తర*, *కత్తిరి*. వంకాయ; *కత్తిరిక్కాయ్*.

వంకాయ.

<త. కత్తిరి+పువ+వన్నె.

**కత్వా** (బల్ల) రూ.చూ. కత్తువ[1]. వి. నీటిపారుదల అవసరం లేనప్పుడు తూము రంధ్రానికి అడ్డంగా పైనించి దించిన కొయ్యపలక, కొయ్యలాక.

**కద**[1] రూ. కదా. అవ్య. **1.** సంతాప సూచకం. భార. సభా. 1.141, దశా. 2.148 ; **2.** ప్రశంసా సూచకం. ఉ.రా. 4.172 ; **3.** ప్రశ్నార్థకం ; **4.** సుప్రసిద్ధి సూచకం.

క. *కద*. సవ్యకు ధ్వన్యనుకరణ శబ్దం. హ ! హా ! హా !

**కదన్న** రూ. కదన్నా. అవ్య. కద. భాస్క.రా. యు. **584.** ప్రశ్న, ప్రసిద్ధి, ప్రార్థనం, నిశ్చయం, సంతాపం మొదలైన భావాలను సూచించే మహత్సంబోధనం. **కదన్నా** రూ.చూ. కదన్న. అవ్య. కద, ప్రశ్నాదుల్ని బోధించే మహత్సంబుద్ధి వాచక శబ్దం. **కదమ్మ** రూ. కదమ్మా. అవ్య. ప్రశ్న, ప్రసిద్ధి, ప్రార్థన, నిశ్చయ సంతాపాలను సూచించే మహతీ సంబోధనం. మను. 5.61. **కదమ్మా** రూ.చూ. కదమ్మ. అవ్య. కద (సంతాప సూచకం). **కదయ్య** రూ. కదయ్యా. అవ్య. ప్రార్థనా సూచకంగా అడగటం. దశా. 1.154. **కదయ్యా** రూ.చూ. కదయ్య. అవ్య. ప్రార్థనా సూచకంగా అడగటం. **కదర** రూ.చూ. కదరె. అవ్య. కద (సుమతి). **కదరమ్మ** రూ. కదరమ్మా. అవ్య. కదమ్మ, కద. రసిక. 4.44. **కదరమ్మా** రూ.చూ. కదరమ్మ. అవ్య. కదమ్మ, కద. **కదరయ్య** రూ. కదరయ్యా. అవ్య. కదన్న, కద. సారంగ. 2.170. **కదరయ్యా** రూ.చూ. కదరయ్య. అవ్య. కద, కదన్న. **కదరె** రూ. కదర, కదరే. అవ్య. కద (సంతాపాది సూచకం). రసిక. 4.177. **కదరే** రూ.చూ. కదరె. అవ్య. కద (సంతాపాది సూచకం). రుక్మి. 2.73. **కదవమ్మ** రూ. కదవమ్మా. అవ్య. కదమ్మ, కద (సంతాపాది సూచకం). ఇందు. 3.9. **కదవమ్మా** రూ.చూ. కదవమ్మ. అవ్య. కదమ్మ, కద (సంతాపానికి). **కదవయ్య** రూ. కదవయ్యా. అవ్య. కదన్న, కద (ప్రార్థనానికి). శృం.నై. 1.107. **కదవయ్యా** రూ.చూ. కదవయ్య. అవ్య. కదన్న, కద (ప్రార్థనానికి). ఉ.రా. 1.78. **కదవె** రూ. కదవే. అవ్య. కద (ప్రార్థనకు). రసిక. 5.142. **కదవే** రూ.చూ. కదవె. అవ్య. కద (ప్రార్థనకు). దశా. 1.223.

**కద**[2] రూ.చూ. కత. వి. వృత్తాంతం, కథ. భాస్క.రా. యు. 172.

**కద**[3] వి. బాణం కొన లేదా గాలపు కొక్కి.

**కద**[4] వి. ఎర్రతడ చెట్టు (Grewia tiliaefolia).

**కదం** రూ.చూ. కదము. వి. **1.** అడుగు, పాదం, అంగ, పన్నెండు అంగుళాల కొలత ; **2.** మోటబానకు అడుగున తొండం కలిపే చోటు (అర్థవిపరి.).

**కదంబొక్కెన** వి. అడుగున తూమున్న ఇనప బొక్కెన, మోట పరికరం.

**కదగరచు** స.క్రి. గట్టిగా అతుక్కొను.

<కదియు+కఱచు.

**కదడుకొను** అ.క్రి. పూను, నెలవు చేసుకొను.

**కదను** రూ.చూ. కదము. వి. సమమైన గుర్రపు పరుగు, ఒక రకమైన అశ్వగతి.

**కదవపొగు** చూ. కదపా. వి. పాయకారి సేద్యం, సొంత భూమిలేని రైతు ఇతరుల భూమిని కౌలుకుగాని, పాలికిగాని తీసుకొని సేద్యం చెయ్యటం.

**కదపా** రూ. కదుపా. వి. ఒడంబడిక పత్రం, ఈనాందారుకు రైతు రాసి ఇచ్చే ఒడంబడిక.

మరా. *కతాబా* ; అర. *కితాబ్, కితాబత్, కిత్వ్*.

క. *కతబె*. అంగీకార పత్రం.

<మరా. కతబా.

**కదపాయించు** స.క్రి. పందెంవేయు.

**కదపు** రూ.చూ. కదుపు[2]. స.క్రి. కదిలేటట్లుచేయు.

**కదబడు** చూ. కదియు. రూ.చూ. కదియబడు. అ.క్రి. **1.** అన్నం ఉడికేటప్పుడు పొంగులు తగ్గి సరైన ఉడుకు వచ్చి కుదురుకొను ; **2.** తడిసినప్పుడు గుడ్డనేత మొదలైనవి దగ్గరకు వచ్చి దట్టమగు ; **3.** దట్టమగు.

**కదమ** రూ.చూ. కొదమ. వి. తక్కినది, మిగిలినది.

**కదమవారు** వి.బ.వ. మిగిలినవారు.

**కదము** రూ. కదం, కదను. వి. అశ్వగతి విశేషం, ఆస్కందితం.

హిం. మరా. ఉ. అర. *కదమ్*. అడుగు.

క. *కదంనడెసు*. గుర్రంవలె వేగంగా నడచు.

<ఉ. కదమ్.

**కదంబకావులు** రూ. కదంబము.

**కదంబము** వి. **1.** వివిధ రకాల కూరగాయలు వేసి వండిన పప్పు పులుసు, దప్పళం, మిశ్రం. ఆం.భా. 2.168 ; **2.** పలువన్నెల పూలతో కట్టిన దండ.

సం. *కదంబ-*. బాహుళ్యం, గుంపు, సమూహం.

క. *కదంబ*. సమూహం, వివిధ రకాల కూరలు మొ॥ వాటితో కలిసిన అన్నం ; త. *కతంపం*. దేవాలయంలో నైవేద్యానికి పెట్టే దప్పళం.

<సం. కదంబ- (అర్థవిపరి.).

**కదంబకావులు** వి. బవ. మిశ్రమైన కావిరంగు బట్టలు. సిం.ద్వా. 3.206, **కదంబించు** అ.క్రి. కూడుకొను, కలియు, అంటుకొను. పి.శకు. 1.86. స.క్రి. మిళితంచేయు, కలుపు, ప్రబంధ. 5.69.

**కదంబకము** వి. మిశ్రం, కలిపింది.

సం. క. *కదంబక-*. సమూహం, గుంపు.

<సం. కదంబక- (అర్థవిపరి.).

**కదంబించు** చూ. కదంబము.

**కదలడము** చూ. కదలు.

**కదలంబారు** చూ. కదలు.

**కదలాడు** చూ. కదలు.

**కదలారతి** చూ. కదలు.

**కదలారతిపళ్లెరము** చూ. కదలు.

**కదలిక** చూ. కదలు.

**కదలించు** చూ. కదలు.

**కదలు** అ.క్రి. **1.** చలించు, అస్థిరమగు. భార. ఆది. 8.150 ;

2. పోవు, నశించు. భార.విరా. 1.274 ; 3. బయలుదేరు. ప్రయాణమగు. భాస్క.రా.అయోధ్య. 1.101 ; 4. దండెత్తు. రాజ.చ. 2.59 ; వి. 1. కదలిక, చలనం. ఉ.హరి. 1.60. కాశీ. 3.84 ; 2. ప్రయాణం, యాత్ర. ఉ.హరి. 5.109 ; 3. పూనిక, ప్రయత్నం. ఉ.హరి. 5.184.

క. *కదడు, కదల్, కదలు, కలడు.* చలించు, కలతపడు ; *కదడు, కదరు, కదలు.* కలవరము, అల్లరి, గడబిడ ; తు. *గద్దుని.* కదవు, గడబిడపరచు ; *గద్దావుని.* కదుపు ; *కదెలుని, కదెవుని, -కదెయుని.* విడదీయు, వేరుచేయు ; త. *కతర (-వ్-ప్ట్).* త్వరగా, త్వరగా పరిగెత్తు, కతర్వ్ – వేగం ; మ. *కదర్హ.* చలనం ; కొం. *గడ్ప (-గడ్పి-).* త్వరపెట్టటం ; పర్జి. *గడల్.* కదల్చటం, వణకటం.

<మూ.ద.ద్రా. *కత్-.

**కదలరము** వి. ప్రయాణం, యాత్ర. **కదలఁబారు** అ.క్రి. చలించు, కదలజొచ్చు. **కదలాడు** అ.క్రి. చలించు. కవిరా. 2.47. **కదలారతి** వి. ఒక విధమైన ఆరతి. చంద్రికా. 4.68. (వివాహాది సమయాలలో వధూవరులు మొఃవారు ప్రవేశించేటప్పుడు, పసుపు జలాదులతో కూడిన తట్టలతో ఎత్తే ఆరతి.) **కదలారతిపళ్ళెరము** వి. ఒకవిధమైన ఆరతి పళ్ళెం, వివాహాదుల్లో వధూవరాదులు ప్రవేశించేటప్పుడు పసుపు నీళ్ళతో కూడిన తట్టలతో ఎత్తే ఆరతి పళ్ళెం. చంద్రికా. 4.68. **కదలిక** వి. 1. చలనం. పరమ. వి. 4.101; 2. యత్నం. రామా. 6.106 ; 3. అవయవ విక్షేపం ; 4. ఉత్సాహం. **కదలించు** చూ. కదలుచు. స.క్రి. కదలుచు, చలింపజేయు. హర. 6.44. **కదలుచు** రూ. కదల్చు. స.క్రి. చలింపజేయు. భాగ. 10. పూ. 289, జాహ్నవీ. 4.17. **కదలుడు** వి. యాత్ర, ప్రయాణం. శకాం. 4.187, ఆం.భా. 2.219. **కదలుతులుము** వి. మల్లబంధ విశేషం. **కదలువిలుకడ** వి. పదహారు ఉపవీతాల్లో ఒకటి. **కదలువరుపడి** వి. పన్నెండు విన్నాణాల్లో ఒకటి, మల్లబంధ విశేషం. హంస. 1.206. **కదలు మెలకువ** వి. పదహారు ఉపవీతాల్లో ఒకటి. **కదలుమొన** వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78, హంస. 1.206. **కదల్చు** రూ.చూ. కదలుచు. స.క్రి. కదలజేయు, చలింపజేయు.

**కదల్చు** చూ. కదలు.

**కదా** రూ.చూ. కద[1]. అవ్య. సంతాప సూచకం. భాగ. 10, పూ. 1011.

**కదామతు** వి. ప్రాచీనత.

హిం. *కదామత్.* ప్రాచీనం, ముందు ; ఉ. *కదామత్* ; పార. *కదామత్.* ప్రాచీనత ; అర. *కదామత్.* ప్రాచీనం, ముందు.

<ఉ. కదామత్.

**కదాపం** రూ.చూ. కలాస్రం. వి. సర్సేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి కింద పరుచుకొనే గొర్రె చర్మం.

**కదావేము** రూ.చూ. కడవసము. వి. 1. ధార్య చర్మం ; 2. కమిది తోలు.

**కదిమి** రూ.చూ. కమిద. వి. పాత్రలను సర్సేటప్పుడు, కుమ్మరి కూర్చొనే చాప లేక గోతాం పట్ట.

**కదిమికొట్టు** రూ.చూ. కమిదికొట్టు. స.క్రి ఆముపొయ్యి రాచేసి మంట వ్యాపించడానికి కూర్చుని విసురు. **కదిమి తోలు** రూ.చూ. కమిదితోలు. వి. సర్సేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి కింద పరుచుకొనే గొర్రె చర్మం. **కదిమిపట్టు** స.క్రి. ఆముపొయ్యిలో అగ్గి రాజేసి మంట వ్యాపించడానికి కూర్చొని చేటతోగాని పంచితోగాని విసురు. **కదిమిపాప (-చాప)** రూ.చూ. కమిదసాప. వి. పాత్రల్ని సర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప.

**కదించు** చూ. కదియు.

**కదియఁబడు** చూ. కదియు.

**కదియిక** చూ. కదియు.

**కదియించు** చూ. కదియు.

**కదియు** అ.క్రి. 1. సమీపానికివచ్చు. భార. ఆరణ్య. 2.169; 2. సమానమగు. భార. ఆరణ్య. 2.351 ; 3. కలియు, కూడు. భార. విరా. 1.162 ; 4. తగులు, తాకు, అంటు. విజ్ఞా. 1.43 ; 5. కలుగు. దశా. 2.301 ; స.క్రి. 1. ఢీకొను, ఎదిరించు. ఉ.హరి. 1.61 ; 2. చేరు, సమీపించు. జైమినీభా. 7.80 ; 3. పొందు. (రతియందు) కూడు.

క. *కదె.* కలియు, తాకు, అంటు ; *కదుకు.* నొక్కు, అదుము ; *కదుటు.* నొక్కు, నొప్పించు, బాధించు ; తు. *కదియు (-పుట్టుని).* గట్టిగా నొక్కు, అదుము ; త. *కతువు (-కతువి-).* బాధించు, కష్టపెట్టు, కలవరపెట్టు ; కువి. *కస్జ- (కచ్-).* కలియు ; కొలా. *గద్దే-.* చేరు ; *గద్దియ్.*

<మూ ద్రా. *కత్-/*కచ్-.

**కదించు** రూ.చూ. కదియించు. స.క్రి. 1. కట్టుకొను, ధరించు. హంస. 2.175 ; 2. బంధించు, బిగించు. హంస. 2.214. **కదియఁబడు** అ.క్రి. 1. కలియబడు మీదికురుకు, లంఘించు. నిర్వ.రా. 3.27 ; 2. కలుగు. కువ.చ. 3.100. **కదియిక** వి. కదియటం, దగ్గరకు రావటం. **కదియించు** రూ. కదించు. స.క్రి. 1. కదియజేయు, కూర్చు, లగ్నంచేయు. హరి.ఉ. 3.7 ; 2. దగ్గరకు చేర్చు, సమీపింపజేయు. శృం.నై. 5.31 ; 3. కట్టు, బంధించు. భాగ. 10. ఉ. 1292 ; 4. రచించు, కూర్చు. వాశిష్ట. 1.14 ; 5. బిగించు, మూయు. హంస. 2.206 ; 6. గ్రహించు, పట్టుకొను. అని. 2.91.

**కదిర** రూ.చూ. కదురు[3]. వి. మత్స్య విశేషం.

**కదిరిటి** వి. జడ, వేణి.

**కదిలింపు** చూ. కదలు. వి. దర్వాజా నిలువ పట్టెకు రంగులు వేయడానికి తీసిన గాడి.

**కదివి** రూ.చూ. కమిద. వి. పాత్రలను సర్సేటప్పుడు కుమ్మరి కూర్చొనే చాప లేక గోతాం పట్ట.

**కదీము** వి. మిరాసీకావు, పాతకావు.

హిం. *కదీమ్.* పురాతనం ; మరా. *కదీమ్.* ప్రాక్తనం ; ఉ. *కదీమ్.* వారసత్వం ; పార. *కదీమ్.* ప్రాచీనం ;

కదీమా. ఆదిమవాసి ; అర. కదీమ్. పూర్వకాలం నుండి నివసించేవాళ్ళు.

క. కదీమ్. పురాతనం ; కదీమ. పూర్వకాలంనుండి నివసించే గ్రామస్థులు, మిరాసీదారు.

<ఉ. కదీమ్.

**కదుకు** రూ.చూ. కతుకు[1]. స.క్రి. తిను, అనుభవించు.

**కదుకొను** రూ. కదురుకొను. అ.క్రి. అతిశయించు. భాస్క.రా. యు. 2346.

**కదుంకొట్టు** స.క్రి. ఆముపొయ్యి రాజేసి మంట వ్యాపించడానికి కూర్చొని విసురు.

**కదుపా** రూ.చూ. కదపా. వి. ఒడంబడిక పత్రం.

**కదుపు[1]** చూ. కదియ. వి. సమూహం, మంద. భాస్క.రా. కిష్కిం. 4.271. (సజాతీయ పశుపక్ష్యాదుల) సమూహం, గోగణం, పశుసమూహం, సంఘం.

క. కదుపు. మంద, గుంపు ; త. కతుప్పు. పశువుల గుంపు.

పో.చూ. సం. కదంబ (క)-. సమూహం, గుంపు.

కదుపుకట్టు అ.క్రి. గుమికూడు, కలసిఉండు. పి.శకు. 2.49. కదుపుగట్టు(-కొట్టు) అ.క్రి. గుంపుకూడు. పి.శకు. 2.49. కదుపులుకదుపులుగట్టు అ.క్రి. గుమికూడు, గుంపుకూడు. నిరంకు. 4.78. కదుపులుగొను(-కొను) అ.క్రి. మందలుపెట్టు.

**కదుపు[2]** చూ. కదలు. రూ. కదపు. స.క్రి. కదిలేటట్లుచేయు, జ్ఞాపకంచేయు.

**కదుము** స.క్రి. 1. ఆక్రమించు. విష్ణుపు. 6.93 ; 2. అదుము, అణచు. కాశీ. 2.41 ; వి. దెబ్బతగిలినచోట నెత్తురు పేరుకొని వాచేవాపు, బొప్పి. ఆం.భా. 2.130.

క. కదుబు. ఆక్రమించు, దొంగిలించు, గట్టిగా పట్టుకొను ; కది. దొంగిలించు ; తు. కదివు, కదుపు, కద్పు. దొంగతనం, దొంగిలించటం ; త. కతువు. (కతువి-) దొంగిలించు, పట్టుకొను, రావలసిన భాగం కంటె ఎక్కువ భాగాన్ని తీసుకొను ; కురు. కఙ్-. అదిమిపట్టు.

<మూ.ద్రా. *కచ్-/కక్-.

**కదురు[1]** అ.క్రి. 1. వ్యాపించు, పర్వు. భార.విరా. 1.308 ; 2. కలుగు. భార. విరా. 2.33 ; 3. అతిశయించు, హెచ్చు. భార.విరా. 5.176 ; 4. విజృంభించు. కళా. 8.100.

క. కదె, చేరు, కదలె. గుంపు, సమూహం ; తు. కదికె. గాదె, నిధి ; గదరు. ముద్ద, పోగు ; త. కతిర్. పుష్కలంగా పండు, ప్రకాశించు ; కతి. అధికమగు ; కతిప్పు. చిక్కదనం ; కతుప్పు. పశువులమంద ; పో.చూ. క. కళీ. అధికంగా ఉండు ; త. కఴుము. చేరు, కలియు, పూర్తిగా ఉండు ; కొట. దృఢమగు, పరస్పరం కలియు, ప్రమాణాన్ని మించి పెరుగు, అధికమగు ; మ. కయయుక. అభివృద్ధిచెందు.

<మూ.ద.ద్రా. కచ్-/కద్-.

కదురుకొను రూ.చూ. కదుకొను. అ.క్రి. 1. అతిశయించు. చంద్రికా. 4.107 ; 2. కలియు, పైనపడు. దశా. 4.218.

**కదురు[2]** వి. 1. నూలువడికే సాధనం, తర్కువు, తంత్వాధార సూచిక. శుక. 4.419 ; 2. వాటల్ని కోయడానికి వాడే సన్నని పొడుగాటి కమ్మి.

క. కదిర్, కదరు, కదురు. నూలువడికే సాధనం ; త. కతిర్ ; మ. కతిర్.

కదురుబట్ట వి. సారెమీద పాత్రల స్వరూపం తయారవుతున్నపుడు నునుపు రావడానికి, అంచు ఏర్పడడానికి వాడే తడిబట్ట. కదురుముల్లు వి. వాటల్ని కోయడానికి వాడే సన్నని ఇనుపకడ్డీ.

**కదురు[3]** రూ. కదిర. వి. ఒకరకం చేప.

**కదె** రూ. కదే. అవ్య. సంతాపాద్యర్థ సూచకం.

**కదే** రూ.చూ. కదె. అవ్య. సంతాపాద్యర్థ సూచకం.

**కద్ద** వి. కల్లుకొలవడానికి, తాగడానికి వాడే పొడవుగా ఉండే మట్టిపాత్ర.

**కద్ది** వి. అనురాగం, సంగతి. కావ్యా. 1.68.

క. కద్ది. అనురాగం.

**కద్దుము** విశ. దట్టమైన. యయా. 2.18.

**కద్రజువి** వి. చిన్న గృహోపకరణాలకు ఉపయోగించే కలప కలిగి జపమాలికలకు ఉపయోగించే గింజలు కాసే చెట్టు.

**కన** అవ్య.ద్రు. 1. ఇది వాక్యాలంకారంగా ప్రయుక్తం. జైమినీ భా. 4.5 ; 2. కాబట్టి. వేంక.పంచ. 1,520 ; 3. సంబోధనంలో అనుప్రయుక్తమై అనురాగాదుల్ని సూచిస్తుంది ; 4. ఊతపదంగా ప్రయుక్తం.

**కనం** రూ.చూ. కన్నము. వి. బండి కాడిచివర చిరత వెయ్యటానికి చేసిన బెజ్జం.

**కనక[1]** రూ.చూ. కనుక. అవ్య. కాబట్టి.

**కనక[2]** రూ.చూ. కంక[1]. వి. పెన్వెదురు. సన్నగా, పొడుగ్గా, గట్టిగా ఉండే ఒకరకం వెదురుమొక్క.

**కనకటితనము** వి. సదనపు వెదురు, కలుపుమొక్క (Dendro calamus strictus).

**కనకట్టు** వి. తూర్పార పోసేటప్పుడు మేలురాని పక్కనపడే పొట్టూ గింజలుకలిసిన భాగం.

సం. కణ. ఒక గింజ, ధాన్యంగింజ ; ఖల-. ధాన్యం నూర్చే కళ్ళం.

క. కణ. గింజ, ధాన్యంగింజ, ధాన్యం నూర్చే కళ్ళం.

<సం. కణ- + కట్టు.

**కనకండవెంజామర** వి. బంగరుకామగల తెల్లని చామరం.

సం. కనకదండ-. బంగరుదండం.

<సం. కనకదణ్డ- + వెంజామర.

**కనకతప్పెట** వి. ఒకానొక వాద్యం, పటహం.

క. కనక. కణకణ శబ్దంగలది ; కనకతమటె. ఒకరకం కంజరి, చిన్న చర్మం వాద్యం ; త. కనకతప్పట్టయ్. కంజరివంటి చిన్న చర్మవాద్యం.

**కనకతోక** వి. తెల్లటి కుచ్చున్న తోక.

సం. కనక-. బంగారం.

<సం. కనక- + తోక.

**కనకదండె** వి. బంగారు దండం.

సం. కనక-, బంగారం ; కనకదండ-. బంగారుదండ, రాజచక్రం.

<సం. కనకదండ-.

**కనకదండెలు** వి.బ.వ. వస్త్రవిశేషం, ఒక దినుసు బట్ట.

సం. కనక-. బంగారం.

<సం. కనక- + దండె - + - లు.

**కనకన** అవ్య. 1. కోపించటం, మండటం, ప్రకాశించటం, రాలటం మొ॥ వాటికి అనుకరణం. హర. 4.14 ; 2. కణ కణ మండు. దశా. 1.182. క్రి. విశ. నిప్పుయొక్క అధిక ప్రకాశం.

క. కనల్. (కనలోర్) కోపించటం, తీవ్రమైన కోపం, కోపం ; కనల్క. ఉగ్రకోపం, కోపం ; కని. మండు ; తు. కనియూరి. పొగవాసన; కనెపుని, కనిపుని. బాధించటం, గట్టియైన, మట్టిపాత్రను కాల్చి గట్టిపడేటట్లుగా చేయు ; త. కనల్ (కనల్వ్-కనన్ను). వేడిగా వుండు, ఉడుకు, కోపంగా ఉండు, మంట, నిప్పు ; కనఱ్ఱు (కనఱ్ఱి). మండేటట్లు చేయు, వెచ్చచేయు, కాంతిగా ప్రకాశించు ; కనలి. సూర్యుడు ; కనఱ్ఱు. వేడి, మండు, కోపం ; కనఅల్, కనల్యు. కోపం ; కని. ఎర్రగా కాల్చు, మండు, కోపం తెచ్చుకొను ; కానల్. సూర్యకిరణం, వేడి, వెలుగు, ఎండ మావులు ; మ. కనల్. మండుతున్న బొగ్గులు, నిప్పు, కనెక్క. బొగ్గులాకాలు ; కనియుక. మండు ; కానల్. వేడి, అతి వెలుగు, ఎండమావులు ; కొండ. కన్. ఎర్రగా కాలిన ; కుయి. కంబ (కంబి). మండే నిప్పువల్ల దహించు, నిప్పువల్ల హాని లేక విధ్వంసం ; కప్ప (కప్ప్). మండేటట్లు చేయు, కాల్చి బొగ్గుచేయు.

సం. కనల-. మెరుపు, వెలుగు ; కనక-. బంగారం.

కనకననవ్వు స.క్రి. హేళనచేయు. కనకనమను అ.క్రి. మిక్కిలి మండు. రామా. 7.18 ; మిక్కిలి ప్రకాశించు. లక్ష్మీ. వి. 3.65, మిక్కిలిగా వెలుగు. కనకనలాడు అ.క్రి. మిక్కిలి ప్రకాశించు. <కనకన + -లు + ఆడు.

**కనకపాల** వి. తెల్లపులికిచెట్టు (Baliospermum axilliare).

**కనకపిల్లి** వి. కరణం, పట్వారి.

తు. కనకపిల్లె. గుమస్తా ; త. కనక్కప్పిళ్లై, కనక్కుప్పిళ్లయ్. గ్రామ కరణం, షరాబు, బొక్కసంపై అధికారి, గుమస్తా, ఒకనికి మారుగా వ్యవహరించటానికధికారం పొందినవాడు, ఓడమీద గుమస్తా, రశీదులు వసూలుచేసే వాడు ; మ. కణక్కపిళ్ల. పద్దులు రాసేవాడు, గుమస్తా; కణక్కు. గుణించటం, అంచనా, పద్దు.

<త. కనక్కప్పిళ్ళై.

**కనకపులు** వి. రెల్లు, శరం.

సం. కనక-. బంగారం.

<సం. కనక- + పులు (గడ్డి).

**కనకపుల్ల** వి. చేతినాదెగాడిలో అడ్డంగా బిగించిన పుల్ల.

**కనకబద్ద** చూ. కంకబద్ద. వి. 1. వింటిబద్ద ; 2. గూనపెంకును నునుపు చెయ్యటానికి కుమ్మర్లు వాడే పలచని కొయ్య ముక్క ; 3. ఉన్ని ఏకటానికి వరంకట్టిన వెదురుబద్ద.

**కనకమామిళ్లు** వి.బ.వ. కంకి కుచ్చుగా ఉండే రకం.

**కనగరంవత్తిదీపము** వి. బంగారు వత్తిగల అఖండ వర్తి దీప స్తంభం. ద.హిం.శా. సం. 5. శా.సం. 5. క్రీ.శ. 1087.

సం. కనక- బంగారం.

**కనగర్త** వి. మత్స్యవిశేషం.

**కనజం** రూ.చూ. కణజం. వి. ధాన్యం నిలవచేసుకోటానికి ఇంట్లో నేలలో కట్టిన కొట్టు.

**కన(జేయు** చూ. కను[1].

**కనపగడ్డి** చూ. కనుము[1]. వి. కనుముగడ్డి.

**కనపతీగె** రూ.చూ. కణపతీగ[2]. వి. పొరలుగా ఉండే ఆకులు కల ఒకరకం తీగ.

**కనపపూలు** రూ.చూ. కనుపపులు. వి. రెల్లు, కనుపపూలు.

**కనపరాకు** వి. గన్నేరాకులవంటి అలుగు.

క. కణప, కణయ, కళెయ. ఒకరకం ఇనప పని ముట్టు.

**కనప్పండుగ** చూ. కనుము[2]. వి. పశువులపండుగ, కనుము(గె),

**కనమ[1]** రూ.చూ. కనుమ[1]. వి. 1. కొండకోనల నడిమిత్రోవ ; 2. సందు, త్రోవ ; 3. కాంతారం.

**కనమ[2]** రూ.చూ. కలమ. వి. గాయం మానిన మచ్చ.

**కనము** వి. ఒక చెట్టు.

**కనముచేప** చూ. కననచేప. వి. ఒక రకమైన చేప.

**కన(బడకపోవు** చూ. కను[1].

**కన(బడనివా(డు** చూ. కను[1].

**కన(బడు** చూ. కను[1].

**కనరిపీపాలు** వి.బ.వ. ఒక తెగ నాణేలు.

**కనరు[1]** రూ.చూ. కనలు. అ.క్రి. కోపపడు. పి.శకు. 3.191. వి. 1. వెగటు. అము. 2.68 ; 2. కంద, వంకాయ మొ. వాటి నస, దురద ; 3. అసహ్యం ; 4. చేదు ; 5. పొగరు. మదం ; విశ. హితంకాని, వెగటైన. సమీర. 3.116.

క. కనర్. ఒగరైన, పులుపు లేక చేదు, పచ్చి, ఒగరు. పులుపు లేక చేదు రుచి, అంగీకారంకాని వాసన, ప్రత్యేకంగా కారుతున్న నూనె.

కనరుపోవు (-పోవ) అ.క్రి. వెగటగు, కాటుపోవు. పి.శకు. 1.135. కనరెక్కు అ.క్రి. వెగటగు, కాటుపోవు.

**కనరు[2]** వి. ఒకరకం చెట్టు.

**కనరెక్కు** చూ. కనరు[1].

**కనలిక** చూ. కనలు.

**కనలించు** చూ. కనలు.

**కనలు** రూ. కనరు[1]. అ.క్రి. 1. మండు, జ్వలించు, భార.సభా, 1.253 ; హరి.పూ. 6.147 ; 2. కోపించు. భార.ఉద్యో. 3.100 ; 3. తప్తమగు. సురా. 77 ; 4. తపించు. లక్ష్మీ. వి. 4.178 ; 5. జ్వాల ; వి. కోపం. హరి.ఉ. 4.52 ; విశ. మండేది.

క. కనల్ (కనల్వ్-). కోపించు, తీవ్రమైన కోపం, కోపం; కనల్కె. ఉగ్రకోపం, కోపం ; కని, మండు ; తు. కనియూరి. పొగవాసన, కనెపుని. బాధించు, గట్టియైన. కనిపుని. మట్టిపాత్రలా కాల్చి గట్టిపర్చు ; కణకు. వంటచెరకు. కట్టెలు. కణిపుని బాధించు ; త. కనల్.. (కనల్వ్, కనన్ఱ్) వేడిగా వుండు, మరుగు, కోపంగా ఉండు, మంట ;

కన్రు (కన్రి). మండించు. వేడిచేయు, కాంతిగా ప్రకాశించు ; కనలి. సూర్యుడు. కనర్పి. వేడి, వెలుగు, కోపం కనరల్, కనల్యు. కోపం ; కని. ఎర్రగా కాలే, వెలుగు, కోపం తెచ్చుకొను ; కానల్. సూర్యకిరణం, వేడి, వెలుగు, ఎండమావులు ; కనరల్. కోపం ; కరు, కోపించు, కోపం తెచ్చుకొను ; కరుప్పు-. కోపం ; మ. కనల్. మండుతున్న బొగ్గులు, నిప్పు ; కనెక్క. బొగ్గువలె కాలు ; కనియుక. వెలుగు ; కానల్. వేడి, అతి మెరుపు, ఎండమావులు ; కో. కన్. ఎర్రగా కాలే ; కుయి. కంబ (కంబి). మండేది, వనిచేయు, నిప్పువల్ల దహించు, నిప్పువల్ల విధ్వంసన, లేక హాని. కప్ప (కప్-). మండించు, కాల్చి బొగ్గు చేయు.

నం. కనల-. ప్రకాశించటం, కాంతి, కనక- బంగారం. పో.చూ. కన్దు (కనల. ప్రకాశించు) ; కన్. ప్రకాశించు.

<మూ.ద్రా.* కన్-/*కల్-, కన్*- అల్.

కనలిక వి. అలుక. కోపించటం. కనలించు న.క్రి. కనలజేయు. కోపింపజేయు. ఉ.హరి. 4.60.

**కనన** పో.చూ. కజితి². వి. ఒకరకం చేప.

కననచేప రూ. కనిసిచేప. వి. మత్స్యవిశేషం.

**కనస్టేబిలు** రూ. కనిష్టీబు, కానిస్టేబు, కానిస్టేబిలు. వి. రక్షక భటుడు.

ఇం. *Constable*. పోలీసువాడు.

<ఇం. Constable.

**కనాకత్తు** చూ. కనాసీటు. విశ. కొంచెం ఎక్కువైన.

**కనాకనికిష్టం** రూ. కనాకష్టం. వి. చాల కష్టం.

నం. కష్ట- పీడ, కీడు.

**కనాకస్టం** రూ.చూ. కనాకష్టం. వి. చాలా కష్టం.

**కనాకష్టం** రూ. కనాకనిష్టం, కనాకస్టం. వి. చాలా కష్టం.

**కనాతి** రూ.చూ. కనాతు. వి. 1. బట్టతో ఏర్పరచిన గోడ. ఆం.భా. 2.159 ; 2. బట్ట.

కనాతిగోడ రూ. కజాతిగోడ. వి. వవన నిర్మిత కుడ్యం, బట్టతో ఏర్పరచిన గోడ, బట్టతో నిర్మించిన గోడ, నరాతి.

**కనాతు** రూ. కనాతి. వి. బట్టతో ఏర్పరచినగోడ. రంగా.చ. 1.150.

హిం. కనాత్. దళసరి గుడ్డతో నిర్మింపబడ్డ గోడ ; మరా. కనాత్. గుడారానికి కప్పే గుడ్డ; ఉ. అర. కనాత్ దళసరి గుడ్డతో చేయబడిన గోడ.

క. కనాతు. బట్టతో ఉన్న గోడ.

<ఉ. కనాత్.

**కనాసీటు** చూ. కనాకత్తు. విశ. కొంచెం ఎక్కువ.

**కనారిలు** చూ. కనరు. అ.క్రి. 1. తపించు. నమీర, 1.220 ; 2. కోపగించు, క్రోధయుక్తమగు. ఉ.రా. 3.314.

**కనాలి** రూ.చూ. కనాలు¹. వి. కాలువ.

**కనాలు¹** రూ. కనాలి. వి. కాల్వ.

ఇం. *Canal*. కాల్వ.

<ఇం. Canal.

**కనాలు²** వి.బ.వ. లోగాడి, వెలిగాడి వల్లలు.

**కనిం** రూ. కణిం. వి. కాడిమానులోని రంధ్రం.

**కనికట్టు** చూ. కను¹.

**కనికనములు** చూ. కను. వి.బ.వ. చూడటం, చూడకపోవడాలు. కాళిందీ. 1.182.

**కనికనిచీకటి** వి. మనక కనుచీకటి.

**కనికరము** రూ. కనికారము. వి. 1. కరుణ. దయ, జాలి, వరాహ. 10.43 ; 2. కరుణ, శోకం. మను. 2.9.

క. కని. దయ, కరుణ, కనికరం, దయ ; తు. కనికర. దయ ; త. కని. పెరిగే మృదుత్వం, మెత్తబడటం (ప్రేమతో హృదయం అయినట్టు), కరుగు, మెత్తబడు ; కనివు. ప్రేమ, దయ ; మ. కనియక. మెత్తనైన, కనికరం గల ; కనివు. మృదుత్వం, దయ, కరుణ ; కువి. కంబలి. కంపనె. పరిపక్వమగు.

కనికరించు. న.క్రి. జాలిపడు, కరుణించు.

**కనికరాయి¹** రూ. కనికెరాయి. వి. స్ఫటికాలుగా, బండలుగా దొరికే ఒక రకం మిశ్రశిల, క్వార్ట్జ్.

**కనికరాయి²** వి. సారెమొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్న రాయి, గుబ్బిరాయి.

**కనికరించు** చూ. కనికరము.

**కనికారము** రూ.చూ. కనికరము. వి. 1. దయ, జాలి ; 2. వగపు.

**కనికెడు** యూ.చూ. కమికెడు. విశ. 1. వేళ్లు ముడువని పెద్ద పిడికెడు ; 2. కొద్దిపాటి పరిమాణంగల.

**కనికెరాయి** రూ.చూ. కనికరాయి¹. వి. ఎరుపు, తెలుపు కలిసిన రంగుతో గట్టిగా ఉండేరాయి.

**కనికోమ** చూ. కను¹.

**కనితి** వి. కణవ చెట్టు. తెల్లని కర్ర కలిగి లేత ఎరుపుపళ్ళు కాసే ఒక చెట్టు (Baringtonia racemosa).

**కనిపట్టు** చూ. కను¹.

**కనిపించు** చూ. కను¹.

**కనిపుతీగ** రూ.చూ. కణపతీగ¹. వి. తీగలవంటి కొమ్ములు కలిగి తెల్లని పళ్ళుకాసే ఒక తీగ.

**కనిపెంచువయసు** చూ.కను³.

**కనిపెట్టు** చూ. కను¹.

**కనిపెట్టుకొను** చూ. కను¹.

**కనిమిసిరిచెట్టు** వి. ఔషధ సంబంధమైన ఒక చెట్టు.

**కనియ** రూ. గనియ. వి. ముక్క, ఖండం, శకలం.

**కనియు** రూ. కమియు¹. అ.క్రి. 1. కమియు, పరిపక్వమగు, మాగు, భార. అరణ్య. 4.445 ; 2. మెత్తగిలు, మెత్తబడు; న.క్రి. చూచు.

క. కని. జాలి, దయ ; కనికర. కనికరం ; తు. కనికర. కనికరం ; త. కని. పండిన, మిగల పండిన, కరుగు. లేతపెరుగుదల, మెత్తనైన, పరిపక్వం, పండిన పండు ; కనివు. పరిపక్వం, ప్రేమ ; క్నను. జాలిపడు ; మ. కని. పండినపండు ; కనియుక. పక్వమగు, మెత్తనగు ; కనివె. దయ, జాలిగుణం ; కువి. కంబలి, కంపినయ్. పక్వమగు ; కంబ్. పక్వమగు ; కురు. ఖంజ్. పక్వమగు, పండించు ; మాల్తో. క్వాన్జ్వ. పండు.

<మూ.ద్రా. *కన్-.

**కనిలురాయి** రూ.చూ. కనేలురాయి. వి. గోడలు కట్టేటప్పుడు చిన్న ఇటికల్ని రాళ్ల మధ్య ఉంచి సందులు తప్పించి మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి.

**కనివాడు** వి. భట్రాజు.

**కనిసిచేప** రూ.చూ. కనసచేప. వి. మత్స్య విశేషం.

**కనిసెరము** రూ. కడసరము[1]. వి. ఒక రకం డేగ, శ్యేనం.

**కనిష్టిబి** రూ.చూ. కనస్టేబిలు. వి రక్షకభటుడు.

**కనీలంబాయి** వి. వరలకు బదులు రాతి పలకలు వాడి కట్టిన బావి.

**కనీనపక్షము** వి. అధమ పక్షం.

నం. కనీయస్. లఘుతరమైన ; పక్ష-. పక్షం.

<కనీయస్ + నం. పక్ష-.

**కనీనము** విశ. అధమం, హీనం.

నం. కనీయస్-. లఘుతరమైన.

<నం. కనీయస్.

**కను**[1] రూ. కన్ను[1]. వి. 1. ఇంగితం, అభిప్రాయం, జాడ. భార. భీష్మ. 2.668, భార. అరణ్య. 7.63 ; 2. నేత్రం, చూపు, దృష్టి. భార. ద్రోణ. 5.16 ; 3. (వల మున్నగు వాని) రంధ్రం. కవిక. 4.113 ; 4. నెమలిపురికన్ను, చంద్రకం. ఆం.భా. 2.96 ; 5. (బండి) చక్రం ; 6. మద్దెల మొ॥ వాటిలో ఉండే గుండ్రటి నల్ల గుర్తు, ఠానం వేసే పక్క ; 7. వంతెనద్వారం ; 8. కపట చేష్ట ; 9. వ్రణాది రంధ్రం.

క. కణ్. కన్ను, చిన్న రంధ్రం ; కణు, కణ్ణు ; కొడ. కణ్ణ్ ; తు. కణ్ణు. కన్ను, చన్మాన, భయం, అద్దె ; మ. కణ్. కన్ను, నెమలి తోకలోని కన్నులు ; కొ. కొణ్. కన్ను ; గోం. కన్. (బ.వ. కంక్.) కన్ను, రంధ్రం ; కర్. (కత్క్) ; కొం. కణ్. కన్ను, రంధ్రం ; కాణ్ (కడ్). చూచు ; కుయి. కను (బ.వ. కన్.గ.). కన్ను, రంధ్రం ; కన్రూ (బ.వ. కర్కఁక) ; పర్జి. కన్ (బ.వ. కనుల్). కన్ను ; కొలా. కన్. కన్ను, భూమిలోని చిన్నరంధ్రం ; నా. కన్. కన్ను, నెమలి పింఛం కన్ను ; ఒల్లా. కణ్. కన్ను, కను ; కురు. ఖన్న్. కన్ను, కంటి. కురుపు ; ఖన్. కంటికింపగు ; మాల్తో. క్వను. కన్ను ; బ్రా. ఖాన్. కన్ను.

<మూ.ద్రా. కణ్-/ *కాణ్-.

**కంకివరు** వి. కోపయుక్త నేత్ర దోషం. **కంటికలక** వి. పనులు కట్టే కళ్ల జబ్బు. **కంటికితెప్పలీల** క్రి. విశ. మిక్కిలి జాగ్రత్తతో. రామా. 3.132. **కంటికెక్కు** అ.క్రి. నచ్చు, కంటికి నచ్చు. **కంటిచేప** వి. పెద్ద కళ్లు కలిగిన చేప. **కంటినొప్పి** వి. పీడ. శుక. 2.283. **కంటిపాప** వి. కంటిలోని నల్ల గుడ్డు, కనీనిక. **కంటిపులి** వి. గొడ్లకు కంట్లో పుట్టే మచ్చ, కనుపులి. **కంటిపువ్వు** వి. కంట్లో పుట్టిన కాయ, శుక్లం. **కంటిపుసి** వి. దూషిక, పుసి. **కంటిపొర** వి. కంటి గుడ్డును కప్పిన పొర. **కంటిలోనివెరము** వి. మిక్కిలి బాధ. మొల్ల. యు. 1.20. **కంటివాలు** వి. చక్రాయుధం. **కంటివినికి** రూ. కంటివిన్కి. వి. పాము, కళ్లతో వినే శక్తి గలది. **కంటివిన్కరి** చూ. కంటివినికి. వి. పాము. **కంటివిన్కి** రూ. చూ. కంటి వినికి. వి. పాము. **కనఁజేయు** స.క్రి. కనబడేటట్లు చేయు. **కనఁబడకపోవు** అ.క్రి. అదృశ్యమగు. **కనఁబడనివాఁడు** వి. అదృశ్యుడు. **కనఁబడు** రూ. కనుపడు, కన్పడు, కానఁబడు. అ.క్రి. అగపడు, కనుపట్టు, గోచరించు. భార. అరణ్య. 2.169. **కనికట్టు** రూ. చూ. కన్నుకట్టు. వి. 1. కళ్ళకు కనపడనీయకుండా చేయడం, గారడి ; 2. జాల విద్యావిశేషం. ప్రబంధ. 738. **కనికాను** స.క్రి. చూచు, కనిపెట్టు. **కనిపట్టు** రూ.చూ. కనుపట్టు. స.క్రి. 1. వెదకిపట్టు, కనుగొను, తెలిసికొను. భార. శాంతి. 3.505 ; 2. కొత్తగా తెలిసికొను. **కనిపించు** రూ. కన్పించు, కాన్పించు. స. క్రి. 1. కలుగజేయు, పొందచేయు, పురుడు పోయు. సమీర. 1.224 ; 2. చూపు, చూపించు. చిత్ర.భా. 3.151 ; 3. కనజేయు, ప్రసవింపజేయు, పురుడుపోయు. చంద్రాంగ. 3.101, అ.క్రి. అగపడు, కనబడు, ప్రత్యక్షమగు. శుక. 2.415. క. కణిసు. చూచు, ఆలోచించు. **కనిపెట్టు** రూ.చూ. కనుపెట్టు. స.క్రి. దేనినైనా కొత్తదాన్ని తెలుసుకొను. **కనిపెట్టుకొను** స.క్రి. 1. ఎదురు చూచు. కళా. 5.197 ; 2. వేచు, ఆగు. **కనుకట్టు** రూ. చూ. కన్నుకట్టు. వి. గారడీ, కళ్ళకు కనబడకుండా చేయడం. మను. 4.27. **కనుకను** రూ.చూ. కనుగను. వి. ఔ. ప్రతి నేత్రం. రం.రా. 1.77 ; అ.క్రి. జాగ్రత్త కలుగు. వేమ. 1.45. **కనుకలి** వి. చూపు, దృష్టి. భార. విరా. 2.27. **కనుకుట్టు** వి. 1. నేత్రబాధకుడు, బాధకుడు. రాజవా. 3.8 ; 2. ఈర్ష్యాళువు, అసూయ పడేవాడు ; 3. పగవాడు. సాంబో. 2.145. **కనుకుట్టుఁదనము(-తనము)** వి. ఈర్ష్య, అసూయ. భోజ. 6.125. **కనుకూరుకు** రూ. కనుకూర్కు. కనుకొరుకు, కనుగూరుకు. కనుగూర్కు, కన్నుకురుకు. అ.క్రి. కనుమూయు, నిద్రించు. రామా. 2.97. **కనుకూర్కు** రూ.చూ. కనుకూరుకు. అ.క్రి. నిద్రించు, కన్నుమూయు. **కనుకొరుకు** రూ.చూ. కనుకూరుకు. అ.క్రి. నిద్రించు, కన్నుమూయు. **కనుకొలికి** వి. నేత్రాంతం, కడకన్ను. **కనుగట్టు(-కట్టు)** రూ.చూ. కన్నుకట్టు. అ.క్రి. మాయచేయు, మోసగించు; వి. ఇంద్రజాలం, గారడీ. పాండు. 3.178. **కనుగడ(-కడ)** రూ.చూ. కన్గడ. వి. 1. కడకన్ను, అపాంగం ; 2. దగ్గర. **కనుగను(-కను)** రూ. కనుకను. కన్గను. వి.ఔ. ప్రతినేత్రం. కు.సం. 7.62. **కనుగవ్వ(-కవ్వ)**. స.క్రి. మోసగించు. **కనుగలుగు(-కలుగు)** రూ.చూ. కన్గలుగు. అ.క్రి. జాగరూకుఁడగు, అప్రమత్తుడగు. **కనుగిట్టు** రూ. కనుగీటు, కన్గీటు. స.క్రి. కనుగీటు, కంటితో సంజ్ఞచేయు. కు.సం. 2.80 ; వి. కనుసైగ. **కనుగిలుచు** స.క్రి. కనుసైగచేయు. **కనుగిలుపు** రూ. కనుగిలుపు, కన్గిలుపు, కన్గిలుపు. స.క్రి. కనుసైగచేయు; వి. కనుసైగ. **కనుగిలువు** రూ.చూ. కనుగిలుపు. స.క్రి. కనుగొలుపు, కనుసైగచేయు, కన్గిలుపు. రామా. 4.156. వి. కనుసైగ. **కనుగీటు** రూ. కన్నుగీటు. స.క్రి. 1. కనుసైగచేయు, పరిహసించు. హరిశ్చ. 1.131 ; వి. కనుసైగ. దశా. 4.358. **కనుగుడ్డు** రూ.చూ. కనుగ్రుడ్డు.

వి. నేత్రగోళం. కనుగూరుకు రూ.చూ. కనుకూరుకు. అ.క్రి. కనుమూయు, నిద్రించు. కనుగూర్కు రూ.చూ. కనుకూరుకు. అ.క్రి. కనుమూయు, నిద్రించు. కనుగొలికి(-కొలికి) రూ.చూ. కన్గొలికి. వి. కంటికొలికి. కనుగొలుపు(-కొలుపు) రూ. కన్గొలుపు. స.క్రి. కనుసైగచేయు, కనుగీటు, కనుగిలుపు. మృత్యు. 2.18. కనుగ్రుడ్డు రూ. కనుగుడ్డు. వి. కంటిగుడ్డు, నేత్రగోళం. రామా. 6.188. కనుంగొను రూ. కనుఁగొను, కన్గొను. స.క్రి. 1. చూచు, పరీక్షించు. భార. భీష్మ. 1.94 ; 2. మంచి చెడ్డలు విచారించు. విక్ర. 2.92 ; 3. పొందు, పడయు. పారి. 1.61. కనుఁగడ (-కడ) రూ.చూ. కనుగడ, కన్గడ. వి. కంటికొన, కడకన్ను. కనుఁగవ (-కవ) రూ.చూ. కన్నుఁగవ. వి. కళ్ళజత. కనుఁగాపు (-కాపు) వి. కను సంజ్ఞకై కాచుకొని ఉండే సేవకుడు. హర. 3.11. కనుఁగొన (-కొన) రూ.చూ. కన్గొన వి. నేత్రాంతం, క్రీగన్ను. హరి.ఉ. 3.180. కనుఁగొను(-కొను) రూ.చూ. కనుంగొను. స.క్రి. తెలుసుకొను, ఎరుగు. ఆము. 4.52. కనుచాటు రూ.చూ. కనుఁజాటు. వి. కనుపింపకుండటం, మరుగుగా ఉండటం రహస్యం. కనుచీకటి వి. 1. సంజ చీకటి ; 2. రేజీకటి ; 3. కొంచెం చీకటి. కనుచూపుమేర వి. కంటికి కనపడేంత దూరం. శుక. 2.566. కనుచూఱయివఁగు(-ఒవఁగు) స.క్రి. యథేచ్ఛగా చూడనిచ్చు. కవిక. 3.151. కనుచెదరు అ.క్రి. చెల్లాచెదరగు. కువల. 2.146. విణ. కంటి చూపును మించిన చక్కనైన. కనుచోటు వి. రహస్యం, రహస్య స్థలం. ఉ.హరి. 3.46. కనుఁజాటు(-చాటు) రూ. కనుచాటు. వి. రహస్యం. రం.రా.ఉ. 92. పు. 15 పం. కనుతాలు అ.క్రి. కంటికి గురుత్వంగా కనిపించు, గణనకువచ్చు, చూపులకు ఆను. కనుదావురము వి. కనుచాటు, కనుమరుగు. గంధ. 67. కనుదోయి రూ. కన్దోయి. వి. కనుల జంట. కనునీరు రూ.చూ. కన్నీరు. వి. కంటినీరు, కన్నీరు, అశ్రువు. భోజ. 4.167. కనుపట్టు రూ. కనిపట్టు, కన్పట్టు. అ.క్రి. గోచరమగు, చూపట్టు. భార. విరా. 3.192. కనుపడు రూ.చూ. కనఁబడు. స.క్రి. కనపడు, గోచరించు, చూపట్టు. హంస. 1.65. కనుపండువు రూ. కన్పండువు. వి. 1. నేత్రోత్సవం ; 2. కంటికి పండుగ వంటిది. చంపూ.రా. 3.86. కనుపరుచు స.క్రి. చూపు. కనుపఱచు రూ. కన్పఱచు. స.క్రి. చూపించు. కనుపాప రూ. కన్పాప. వి. నేత్రావయవ విశేషం, కంటిలోని ప్రతిమ, కంటిపాప. మను. 5.84. కనుపులి రూ. కన్పులి. వి. పశువుల కంటి మీద ఉండే తెల్ల మచ్చ. కనుపులుము స.క్రి. మోసగించు. కనుపెట్టు రూ. కని పెట్టు, కన్పెట్టు. అ.క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. ఆము. 6.80, రక్షించు, పరమ. వి. 3.53; అ.క్రి. 1. ఎదురు చూచు, ప్రతీక్షించు. ఆము. 6.80. కనుపెంటి రూ.చూ. కనుబంటి. వి. కాగల ప్రయోజనాన్ని సూచించే పక్షి. కనుపొట్టలు వి. బ. వ. కంటిరెప్పలు. కనుబడి[1] వి. 1. రాబడి, ఆదాయం, భోజను. 1.104 ; 2. ఉత్పత్తి ; 3. అంచనా. కనుబంటి రూ. కనుపెంటి, కనుఁబెంటి, కన్పెంటి, కన్బెంటి. వి. జీలుగుపిట్ట, కాగల ప్రయోజనాన్ని సూచించే పక్షి. ఆము. 6.66. కనుబాటు వి. దృష్టి, దృష్టి దోషం, దిష్టి. కనుబేటము వి. 1. కళ్ళకుమరుగు ; 2. చక్షుఃప్రీతి, చూడడంవల్ల కలిగే అనురాగం. దశకు. 3.123. కనుబొమ రూ. కన్బొమ, కన్ను బొమ్మ. వి. భ్రూవు. మను. 5.94. కనుబొమ్మ రూ.చూ. కన్నుబొమ్మ. వి. భ్రూవు, కంటిపైన నొసటికింద ఉండే వెంట్రుకలచాలు. ఆము. 14. కనుమబ్బు వి. కనుచీకటి, మసకచీకటి. వేంక. పంచ. 1.246. సంధ్యాకాలం చీకటి. కనుమరుపు వి. 1. అడ్డపాటు, వ్యవధానం ; 2. కళ్ళకు కట్టే గంత. కనుమఱి వి. రహస్యం, చాటు. కు.సం. 2.80. కనుమఱుఁగు రూ. కనుమఱువు, కన్మఱుఁగు, కన్మఱువు. వి. 1. ఆటంకం. ప్రభు. 4.112 పు. 4 పం. ; 2. కన్నులకు కట్టే గంత. యయా. 2.16 ; 3. గోపనం, కనబడకుండ దాయటం, రహస్యం. వ్య. కంటికిమరుగు (ఆచ్ఛాదనం). కనుమఱువడు అ.క్రి. కంటికిచాటగు, దాగుకొను. కు.సం. 2.215. కనుమఱువు రూ.చూ. కనుమఱుఁగు. వి. 1. కనబడకుండ దాచడం, రహస్యం, గోపనం ; 2. కళ్ళకుకట్టే గంత ; 3. ఆటంకం. కనుమఱువుసేయు (-చేయు) రూ.చూ. కన్మఱువుసేయు. స.క్రి. కనపడకుండాచేయు. 6.60. కనుమసక వి. కొంచెం మసక చీకటి. కనుమాటు రూ. కన్మాటు. స.క్రి. కనుమొరుగు, మోసగించు, మోసం చేయు, కంటికి కనపడకుండా చేయు. రాధా. 1.99. కనుమాపు స.క్రి. మాయంచేయు. ద్వి. సారంగ. చ. 3.99 పు. 6 పం. వి. కొంచెం మూయటం. కనుమాపుచేయు స.క్రి. 1. కొంచెం మాయంచేయు ; 2. కంటికి కనుపించకుండా చేయు. కనుమాపుమాయు అ.క్రి. కొంచెం మాయు. ద్వి. సారంగ.చ. 3.99 పు. 6 పం. కనుమాయ వి. కనికట్టు, గారడీ, పసరు కట్టు. హరి. పూ. 9.135. కనుమాయు అ.క్రి. కొంచెం మాయు. కనుమూయు రూ.చూ. కన్నుమూయు. స.క్రి. 1. మోసంచేయు, వంచించు. చంద్రాంగ. 4.167 ; 2. కన్నుపడకుండ అడ్డుపెట్టు. అ.క్రి. 1. నిద్రపోవు. కవిక. 2.132 ; 2. మరణించు, దీర్ఘనిద్రచెందు. శుక. 1.306 (అర్థ వివరి.) కనుమూసిగంత రూ. కన్నుమూసిగంత, కన్మూసిగంత. వి. 1. దాగిలిమూతలు. కళా. 6.202 ; 2. కన్నులుకప్పి ఆడే ఒకానొక ఆట ; 3. పిల్లలాడుకొనే ఆటల్లో ఒకటి ; 4. కన్నులు కప్పటానికికట్టే తోలుబిళ్ల. కనుమొగుచు రూ.చూ. కన్నుమొగుచు. అ.క్రి. 1. నిద్రించు ; 2. ముకుళించు. స.క్రి. మోసగించు. కనుమొఱఁగు రూ. కన్నుమొఱఁగు, కన్మొఱఁగు. స.క్రి. వంచించు, మోసంచేయు, కనుకట్టు. భాస్క.రా. యు. 1345. కనుమోడుచు రూ.చూ. కనుమోడ్చు. అ.క్రి. కన్ను మూయు, నిద్రించు. కనుమోడ్చు రూ. కనుమోడుచు, కన్ను మోడుచు. కన్నుమోడ్చు, కన్మోడుచు, కన్మోడ్చు. అ.క్రి. కన్నుమూయు, నిద్రించు. రం.రా.యు. 34. పు. 28. పం. కనుమోసము వి. 1. చూపుతప్పడం, దృష్టిప్రమాదం, లక్ష్యం తప్పటం. భార. విరా. 4.230 ; 2. చూస్తుండగనే జరిగే వంచన. కనుఁబాటు (-పాటు) వి. 1. దృష్టిదోషం. భార. విరా. 2.47 ; 2. చూపు. విక్ర. 8.52. కనుఁబెంటి రూ.చూ. కనుబంటి. వి. కాఁగల ప్రయోజనాన్ని సూచించే పక్షి, జీలుగుపిట్ట. హంస. 3.12. కనుఁబ్రామ రూ. కన్నుఁ

బ్రాము, కన్బ్రాము. స.క్రి. మోసపుచ్చు, కనుమూయు. రామా. 5.316. కనుఱెప్పపాటు వి. కనుఱెప్పపడేటంత కాలం. కనుఱెప్పమెంట్రుకలు వి.బ.వ. కనుఱెప్పకున్న వెంట్రుకలు. కనుతెప్ప వి. కంటిఱెప్ప. కవిక. 1.55. కనువిచ్చు రూ. కన్నువిచ్చు. స.క్రి. కళ్లు తెరచు. కనువినికి వి. పాము. యయా. 2.46. వ్యు. కన్ను చెవిగాగలది. కనువినుకలి రూ. కన్నువినుకలి. వి. చక్షుశ్శ్రవం, పాము. యయా. 3.39. వ్యు. కన్ను వీనుగాకలది. పాము కంటితో వింటుందని జనశ్రుతి. కనువినుకలినెలవు వి. 1. పాముపుట్ట. 2. పాతాళం, నాగలోకం, వ్యు. పాములకు నెలవైనది. కనువినుకలినెలవుపుట్టు వి. వాల్మీకి. వ్యు. పుట్టనుంచి పుట్టినవాడు. కనువిందు వి. నేత్రోత్సవం, కన్నులపండువు. కకుత్స్థ 1.160. కనువిప్పు వి. మేలుకొని ఉండటం. కనువిప్పుకలుగు అ.క్రి. తెలిసివచ్చు. కనువెచ్చ వి. కంటివేడిమి, నులివెచ్చ. మను. 2.9. కనువెలుఁగు వి. కంటికి వెలుఁగు (కంటికి వెలుఁగు వంటిది, మార్గదర్శకం అని భావం), మార్గదర్శకుడు, మార్గం చూపేవాడు. భార. ద్రోణ. 1.66. కనువేగు రూ. కన్వేగు. అ.క్రి. కొంచెం తెల్లవారు, తెలతెలవారు. శుక. 3.204. కనువేఁదుఱు వి. 1. కనుపిచ్చి, వెఱ్ఱివలపు. మను. 3.33 ; 2. చూచినంతనే కలిగే ప్రేమ. కనువేయు రూ.చూ. కన్నువేయు. అ.క్రి. 1. వలపుగొను, మరులుకొను ; 2. ఆశించి ఉండు. వరాహ. 11.52. కనువైచు రూ.చూ. కన్నువైచు. అ.క్రి. దృష్టి ప్రసరింపజేయు, అభిలాష కలిగివుండు. వరాహ. 11.52. కనుసన్న రూ.చూ. కన్నుసన్న. వి. నేత్రసంజ్ఞ. పారి. 1.46. కనుసన్నమెలఁగు అ.క్రి. ఆజ్ఞకు లోబడి నడచుకొను. కనుసైగ వి. కనుసన్న. కనుసోగ రూ. కన్సోగ. వి. విశాలనేత్రం, కంటిపొడవు. సిం. ద్వా. 3.139. కన్గడ రూ.చూ. కనుఁగడ. వి. కడకన్ను, అపాంగం. పాండు. 4.112. కన్గంట అవ్య. ప్రత్యక్షంగా. భాగ. 8.239. కన్గను రూ.చూ. కనుకను. వి. ప్రతినేత్రం. భాగ. 8.239 కన్గలుగు రూ. కనుగలుగు, కనుగల్గు, కన్గల్గు. అ.క్రి. జాగరూకుడగు, అప్రమత్తుడగు. భార. భీష్మ. 1.80. కన్గల్గు (-కల్గు) రూ.చూ. కనుగలుగు. అ.క్రి. జాగరూకుడగు, అప్రమత్తుడగు. కన్గవ రూ. కన్నుఁగవ. వి. కన్నులజత. కన్గిఱుపు రూ.చూ. కనుగిఱుపు. స.క్రి. కనుసైగచేయు. అచ్చ.రా.యుద్ధ. 125. కన్గిలుపు రూ.చూ. కనుగిఱుపు. స.క్రి. కనుగొలుపు, కనుసైగచేయు. ఆం. భా. 3.29. కన్గీటు రూ. కనుగీటు. స.క్రి. కనుగొలుపు, కనుసైగచేయు. కన్గొన రూ.చూ. కనుఁగొన. వి. నేత్రాంతం. భాగ. 3.662. కన్గొను రూ.చూ. కనుఁగొను. స.క్రి. 1. చూచు, పరీక్షించు. నీలా. 3.46 ; 2. తెలిసికొను, ఎరుగు ; 3. పొందు, పడయు. కన్గొలికి రూ. కనుగొలికి. వి. కంటి చివరిభాగం. ఉ.రా. 4.158. కన్గొల్పు రూ.చూ. కనుగొలుపు. స.క్రి. కనుసైగచేయు, కనుగీటు. నీలా. 1.18. కన్బెదరు అ.క్రి. చెల్లాచెదరగు, కువ.చ. 2 146, కందెఱ[1](-కన్దెఱ[1]) వి. కంటిఱెప్ప, పక్ష్మలం, నేత్రచ్ఛదం, కంటికి తెరవంటిది. ఉ.హరి. 2.84. కందెఱ[2](-కన్దెఱ[2]) వి. నేత్రాల్ని తెరచేటట్లు చేసేవాడు, నేత్రోన్మీలకుడు. భార. విరా. 2.241, కాశీ. 1.121. కందోయి (కన్దోయి) రూ. కనుదోయి. వి. కనుల జంట. కన్నీరు రూ. కనునీరు, కన్నునీరు. వి. కంటినీరు, అశ్రువు. భార. ఆది. 3.140. కన్నీళ్లు వి.బ.వ. కన్నీరు. భార. ఆది. 7.27. కన్పట్టు రూ.చూ. కనుపట్టు. అ.క్రి. కనిపించు. హర. 2.25. కన్పడు రూ.చూ. కనఁబడు. అ.క్రి. కనపడు, గోచరించు, చూపట్టు. శుక. 3.354. కన్పండువు రూ. చూ. కనుపండువు. వి. నేత్రోత్సవం, కంటికి పండుగ వంటిది. కన్పఱచు రూ.చూ. కనుపఱచు. స.క్రి. చూపించు. కన్పాప రూ.చూ. కనుపాప. వి. నేత్రావయవ విశేషం, కంటిలోని ప్రతిమ. అష్ట మ.క. 1.94. కన్పించు రూ.చూ. కనిపించు. స.క్రి. 1. ప్రసరింపజేయు ; 2. పొందచేయు, ఘటింపచేయు. అ.క్రి. కనపడు, అగపడు. శుక. 2.415. క. కాణసు. చూపు, దృష్టిలోకివచ్చు. కన్పులి రూ.చూ. కనుపులి. వి. పశువులకు కంటిమీద ఉండే తెల్లమచ్చ. కన్పెట్టు రూ.చూ. కనుపెట్టు. స.క్రి. 1. కాచు, రక్షించు. పరమ. వి. 3.53 ; 2. ఆలోచించు, పరిశీలించు. సీతారా. 2.102. అ.క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. కన్బంటి రూ.చూ. కనుబంటి. వి. జీలుగుపిట్ట. కన్బొట్ట వి. కంటిఱెప్ప. కన్బెంటి రూ.చూ. కనుబంటి. వి. జీలుగుపిట్ట. సుద. 3.194. కన్బొమ రూ. కనుబొమ. వి. భ్రూవు. విజయ. 1.134. కన్బ్రాము రూ.చూ. కనుఁబ్రాము. స.క్రి. కనుపులుము, మోసపుచ్చు. దశా. 5.3. కన్మఱుఁగు రూ.చూ. కనుమఱుఁగు. వి. 1. గోపనం, రహస్యం, కళ్ళకుకట్టేగంత. యయా. 2.16 ; 2. ఆటంకం. కన్మఱువు రూ.చూ. కనుమఱుఁగు. వి. రహస్యం, గోపనం, కనులకు కట్టేగంత, ఆటంకం, నిరోధం. కన్మఱువుసేయు(-చేయు) రూ. కనుమఱువుసేయు. స.క్రి. కనపడకుండాచేయు. దశకు. 6.60. కన్మాటు రూ.చూ. కనుమాటు. స.క్రి. 1. మోసగించు ; 2. కంటికి కనబడకుండా చేయు. కన్మూయు రూ.చూ. కన్ను మూయు. అ.క్రి. నిద్రించు, దీర్ఘనిద్ర చెందు. మరణించు. స.క్రి. కనుగప్పు, వంచించు. (అర్థవిపరి.). కన్మూసిగంత రూ.చూ. కను మూసిగంత. వి. 1. దాగిలిమూతలు, గన్నులు గప్పి ఆడే ఒకానొక ఆట ; 2. కన్నులు కప్పడానికి కట్టే తోలుబిళ్ల. చమ. 3.40. కన్మొగుచు రూ.చూ. కన్నుమొగుచు. అ.క్రి. 1. కనుమూయు, నిద్రించు ; 2. ముకుళించు. కన్మొఱఁగు రూ. కనుమొఱఁగు. స.క్రి. మోసంచేయు, వంచించు. ఆము. 1.2. కన్మోడుచు రూ.చూ. కనుమోడ్చు. అ.క్రి. నిద్రించు. కన్మోడ్చు రూ.చూ. కనుమోడ్చు. అ.క్రి. కన్నుమూయు, నిద్రించు. కన్మోడ్పు రూ.చూ. కన్నుమోడ్పు. వి. నిద్ర. కన్మోసము వి. చూస్తుండగానే మోసం జరగడం. భార. విరా. 4.230. కన్రెప్ప రూ.చూ. కనుఱెప్ప. వి. కంటిఱెప్ప, కనుఱెప్ప. కన్వెలుఁగు వి. రక్షకుడు. కంటివెలుగు, మార్గం చూపేవాడు, మార్గదర్శకుడు. సుదంతా. 1.112. కన్వేగు రూ.చూ. కనువేగు. అ.క్రి. కొంచెం తెలవారు, తెలతెలవారు. కన్సోగ రూ.చూ. కనుసోగ. వి. విశాలనేత్రం, కంటిపొడవు. కను[2] వి. చెరకులోనగువాని గనుపు, పర్వం, వెదురు.

వను. 3.53.

క. కణ్. వెదురు కణుపు, కొయ్య కణుపు, గణలు. చెరకు ; కణపు, గణికె. ముడిలేక కణుపు ; తు. కారకణ్ణు. చీలమండ ; త. కణ్. చెరకు లేక వెదురు కణుపు, వేలి కణుపు, వెన్నెముక యొక్క కణుపు ; మ. కణ్, కణు, కణ్ణు, కణ్ను. చెరకు కణుపు ; కో. కణ్. వెదురు కణుపు లేక చెరకు కణుపు: కుర. ఖన్న్. వెదురులేక చెరకు పిలకను నరికిన తర్వాత ఏర్పడిన ప్రదేశం.

<మూ.ద్రా. *కణ్.

కంటివింటివజీరు వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. ముకుంద. 3.69.

**కను³** రూ. కాను. స.క్రి. 1. పొందు, పడయు (భాగ్యాన్ని పొందు), పొందు. భార. ఆది. 4.61 ; 2. చూచు. భార. అరణ్య. 2.94 ; 3. ప్రసవించు (బిడ్డను), కాంచు. భార. ఉద్యో. 4.33 ; 4. ఎరుగు, తెలియు. భార. సౌప్తి. 2.74 ;

క. కఱు, కఱ, కఱవు. దూడ, పెయ్య ; కంద, చిన్నబిడ్డ ; కందు ; దూడ, పెయ్య, తల్లి చెట్టుచుట్టూఉన్న చిన్న అరటిపిలకలు ; కంతి, కంది, కందు. దూడను ఈనిన ఆవు ; తు. కంజి. దూడ, పెయ్య ; త. కన్రు. దూడ, పిల్లగుర్రం, చిన్నచెట్టు (లేత) మొక్క అంటు ; కఱ్ఱ-అ.- దూడను కలిగిన ఆవు ; మ. కన్ను (కర్రు). చిన్న పశువు, తల్లి చెట్టును అంటిపెట్టుకొని చుట్టూ ఉన్న అరటి పిలకలు ; కఱ్ఱు. బాలుడు, పెయ్య ; కణ్ణు. పెయ్య, దూడ ; కఱ్ఱు. బాలుడు, పెయ్య, దూడ ; కో. కొఱ్. సంవత్సరం లోపు గేదెపెయ్య ; పర్జి. కర్. (కర్కుల్) (లేత) మొక్క అంట్లు ; గ. క్ర్. కను ; కుర. ఖద్ద్. బిడ్డ, లేత మొక్క లేక పిల్లజంతువు ; ఖద్దస్. కొడుకు, బాలుడు ; ఖద్దర్. బిడ్డలు ; ఖడా. చిన్నబిడ్డ, చిన్న జంతువు, చిన్న ; ఖన్జ్. ఉత్పత్తిచేయు, పండునుమోయు ; ఖన్జ్‌పా. ఫలితం. పర్యవసానం ; ఖనింగ్. జన్మనిచ్చు ; ఖన్ ; మాల్తో. గూదె. కొడుకు.

<మూ.ద్రా. *కన్-.

కృద్రూపం. *కన్-ఠ్. <*కన్-ఠ్-.

కనిపెంచువయసు వి. సంతానాన్ని కనటానికి తగిన వయసు. దశా. 6.45. కనుబడి² వి. 1. ఉత్పత్తి ; 2. అంచనా ; 3. రాబడి.

**కనుక** రూ.చూ. కన్క. అవ్య. ద్రు. 1. సుమీ. విప్ర. 3.77 ; 2. కావున, కాబట్టి. విప్ర. 4.37 ; 3. వాక్యాలంకారంగా ప్రయుక్తం. ఉ.రా. 8.86.

**కనుకని** రూ. కన్కని. వి. 1. వెరపు, భయం. భార. అరణ్య. 3.231 ; 2. తీవ్రత, అభినివేశం, పట్టుదల. బసవ. 7.570 ; 3. తత్తరపాటు. కళా. 7.158 ; 4. జాగరూకత.

**కనుకూలి** వి. ధాన్యరూపమైన కూలి.

**కనుగప్పరగాడు** వి. గబ్బిలం.

**కనుగుపోతు** వి. తోకలేని నెమలి.

**కనుగు¹** వి. ఒక దినుసు చేప.

కనుగుఁజేప వి. మత్స్య విశేషం.

**కనుగు²** వి. రవికెల గుడ్డ, కణం.

**కనువపులు** చూ. కనుము¹.

**కనువపూలు** చూ. కనుము¹.

**కనుపాలవిత్తులు** వి.బ.వ. ఉలవలు.

**కనుపిరికి** విశే. కొత్తదానిని చూచినపుడెల్ల బెదిరే గుణంగల.

**కనుపు** రూ. కన్పు, గనుపు, కణుపు. వి. వెదురు, చెరకు మొ॥ వాటిలో అక్కడక్కడ ఏర్పడి ఉండే గ్రంథి, పర్వం, గంటు, కన్ను. దశా. 10.99.

క. గణికె, గణలు. ముడి ; కణ్. వెల్లుమొక్క కణుపు ; తు. కారకణ్ణు. కాలియొక్క చీలమండ ; త. కణ్. వెదురు కణుపు ; కణు. వెదురు కణుపు, వెన్నెముక యొక్క కణుపు, వేలి కణుపు ; మ. కన్. కను, కన్ను, కన్ను, చెరకు కణుపు ; కో. కన్. వెదురు కణుపు ; తొ. కొన్. వెదురు కణుపు, చెరకు కణుపు ; కుర. ఖన్న్. వెదురు లేక చెరకు పిలకను నరికిన తర్వాత ఏర్పడిన ప్రదేశం.

<మూ.ద్రా. *కణ్-.

కనుపుకొట్టు రూ.చూ. కనుపుగొట్టు. స.క్రి. 1. ముక్కలు చేయు ; 2. పోగొట్టు ; 3. చిందర వందరచేయు ; 4. చంపు, ఖండించు ; 5. క్షోభపెట్టు. కనుపుగొట్టు రూ. కనుపు కొట్టు, కన్పుగొట్టు. స.క్రి. 1. చంపు. భార. భీష్మ. 3.248 ; 2. క్షోభపెట్టు. భార. ద్రోణ. 3.159 ; 3. పోగొట్టు. నశింపచేయు. ఉద్భటా. 1.8 ; 4. ఖండించు, సంహరించు ; 5. చిందరవందర చేయు. కనుపులగుండ్లు రూ. కన్పులగుండ్లు. వి.బ.వ. మణిమయమైన హస్త భూషణం. శుక. 1.176. కనుపులవిలుకాఁడు రూ. కనుపులవిల్కాఁడు, కన్పులవిలుకాఁడు, కన్పులవిల్కాఁడు. వి. మన్మథుడు. వ్యు. చెరకుగడ విల్లుగా కలవాడు. రాజవి. 4.22. కనుపులవిలుతుఁడు రూ. కనుపులవిల్తుఁడు, కన్పుల విలుతుఁడు, కన్పులవిల్తుఁడు. వి. మన్మథుడు. వ్యు. చెరకుగడ విల్లుగా కలవాడు. కనుపులవిల్కాఁడు రూ.చూ. కనుపుల విలుకాఁడు. వి. మన్మథుడు. కనుపులవిల్తుఁడు రూ.చూ. కనుపులవిలుతుడు. వి. మన్మథుడు.

**కనుపుచెట్టు** వి. రాతినేలల్లో పెరిగే ఒక పెద్దచెట్టు (Bosbella serrata).

**కనుబిబిరి** వి. సన్నకొమ్మలు కలిగి నూగు ఉండే ఒక చెట్టు (Casearia Wyna adensia).

**కనుమ¹** రూ. కనమ¹. వి. 1. కొండ కోనల నడిమి త్రోవ. ఆము. 3.27 ; 2. సందుత్రోవ, బిలం, కన్నం, కవిక. 4.120 ; 3. కాంతారం. చంద్రాంగ. 2.84.

క. కణమె, కణవె, కణిమె, కణివె. రెండు కొండల నడిమి సందు ; తు. కణిమె. అపవిత్రం చేయు, పోవు ; త. కణవాయ్. కొండతోవ, మిక్కిలి పొడవు లోతుగల లోయ ; కొండ. కణువెన్. కూర్గు ప్రాంతానికి తూర్పు దిక్కుగా ఉన్న సమతల ప్రదేశం.

**కనుమ²** రూ.చూ. కనుము². వి. సంక్రాంతి పండగ, కనప్పండుగ.

**కనుమరి** రూ. కన్మరి, కమార, కమ్మర, కమ్మరి, కరమల,

వి. కమ్మరి, ఇనప పనివాడు. అయస్కారుడు. కు.నం. 2.80, బసవ. 4.66.

నం. కర్మార-. కమ్మరవాడు ; ప్రా.పా. కమ్మార.- ; ఒ. కమార ; మరా. కమార్.

<ప్రా. కమ్మార.

**కనుమారి** వి. 1. పర్వతసానువు. భార. శాంతి. 1.307, ఉ.హరి. 4.56 ; 2. కొండ శిఖరం మీది సమతల ప్రదేశం. ప్రబోధ. 2.411.

**కనుమారి(బడు** అ.క్రి. కొండపై నుంచి పడు.

**కనుము**[1] వి. 1. రెల్లు. శివరా. 1.61 ; 2. కదంబ వృక్షం.

**కనువపులు** రూ. కనపపూలు, కనుపపూలు. వి. రెల్లు గడ్డి. మను. 2.9. **కనువపూలు** రూ.చూ. కనుపపులు. వి. రెల్లుగడ్డి.

**కనుము**[2] రూ. కనుమ[2]. వి. 1. మకర సంక్రమణం ; 2. శవదహనం, గ్రామదహనం, శత్రుత్వం చేసిన రోజు తరవాతి రోజు ; 3. సంక్రాంతి వెళ్ళిన మరురోజు.

**కనుము**[3] రూ.చూ. కణుము. వి. ఒక రవికెకు సరిపడే నేత గుడ్డ.

**కనువలి** వి. సంకోచం. కు.నం. 3.135.

**కనువు** రూ.చూ. కలువు[1]. స.క్రి. కలువు.

**కనెం** రూ.చూ. కన్నము. వి. బండి కాడి చివర చిరత వెయ్యడానికి చేసిన బెజ్జం.

**కనెక్షను** వి. కూడిక, చేరిక.

ఇం. *Connection*. కూడిక, సంబంధం.

<ఇం. Connection.

**కనెంబొమ్మలు** వి.బ.వ. కనుమ పండుగప్పుడు బ్రాహ్మణులు తీసుకుపోయే మట్టి బొమ్మలు.

**కనేలురాయి** రూ. కనిలురాయి. వి. గోడలు కట్టేటప్పుడు చిన్న ఇటికల్ని రాళ్ళమధ్య ఉంచి సందులు తప్పించి మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి.

**కనోజా** వి. కన్యాకుబ్జ దేశంలోని భాష.

**కనోజి** వి. కన్యాకుబ్జ నివాసి.

హిం. కనౌజియా. కన్నౌజ్ దేశవాసి ; ఉ. కనౌజీ.

<ఉ. కనౌజీ.

**కన్క** రూ. కనుక. అవ్య. ద్రు. 1. అవధారణార్థకం. భాగ. 10 ఉ. 212 ; 2. కాబట్టి.

**కన్కని** రూ.చూ. కనుకని. వి. భయహేతువు. కవిక. 3.229.

**కన్గడ** చూ. కను[1].

**కన్గంట** చూ. కను[1].

**కన్గమ** చూ. కను[1].

**కన్గలుగు** చూ. కను[1].

**కన్గల్లు** చూ. కను[1].

**కన్గవ** చూ. కను[1].

**కన్గిలుపు** చూ. కను[1].

**కన్గిలుపు** చూ. కను[1].

**కన్గీటు** చూ. కను[1].

**కన్గొన** చూ. కను[1].

**కన్గొమ** చూ. కను[1].

**కన్గొలికి** చూ. కను[1].

**కన్గొల్పు** చూ. కను[1].

**కంత**[1] రూ.చూ. క్రంత[3]. వి. 1. చిల్లి, రంధ్రం. వేమన. 1.287 ; 2. సందు. సింహ.శ. 66 ; 3. పొట్టు బట్టిలోని గాలిపోయే రంధ్రం.

**కంతరిసె** వి. పెద్ద అరిసె, పెద్ద నిప్పటి.

<కంత[1]+అరిసె.

**కంత**[2] రూ.చూ. కణత. వి. కణత, కన్ను పక్క భాగం.

**కంత**[3] రూ.చూ. క్రంత[1]. వి. 1. పెళ్లిలో ఉప్పు, పప్పు, బియ్యం పెట్టెలో పెట్టి పెళ్లివారి కిచ్చింది ; 2. పెళ్లికొడుకు వారు పెళ్లికూతురికి తీసుకొనిపోయే ప్రధాన ద్రవ్యం.

**కంత**[4] రూ.చూ. క్రంత[2]. వి. రచ్చ, సభ.

**కంతపాల** వి. సీమ చిత్ర మూలపు చెట్టు, దడుల్లోనూ, తోటల్లోనూ పెంచబడే ఎర్రని పూలు పూసే ఒక మొక్క (Pendianthus trithymaloideo).

**కంతము** వి. హాయిగా ఉండేది, సుఖంగా ఉండేది.

**కంతరిగడ్డి** వి. పశుగ్రాసంగా ఉపయోగపడే ఒక రకం గడ్డి (Chorisirb completa).

**కంతలుగట్టు (-కట్టు)** చూ. గంత. స.క్రి. మరుగుపరచు.

**కంతి** రూ. కణితి, గంత. వి. 1. బొప్పి, బొడిపి. ద్వి. హరిశ్చ. 1503 పం. ; 2. గడ్డలా పుట్టే రోగ విశేషం, కణితి, చెన్న బసవ. 229, ఆం.భా. 2.74 ; 3. దద్దురు.

నం. గ్రంథి-. ముడి, గెల లేదా గుత్తి ; ప్రా. గణ్ఠి, గంఠి ; అ.మా. గణ్ఠి. ముడి, కట్టు ; హిం. గ్రంథి, గాంఠ్. కణితిలా పెరగడం ; మరా. కందం. గడ్డ, దుంప.

<ప్రా. గంఠి-.

**కంతిరి** రూ.చూ. కంత్రి. వి. సంకరుడు, మిశ్రజాతివాడు.

**కంతిరీగ** రూ.చూ. కందురీగ. వి. తేనెటీగ, మధుపం.

**కంతు** వి. హద్దు, గడువు, నిర్ణీతకాలం.

క. *కంత, కంతు*. డబ్బు చెల్లించడానికి చేసుకొన్న ఒడంబడిక ; తు. *కంతు* ; మ. *కందాయం*. నాలుగు నెలల కాలం, పన్నులు చెల్లించే కాలం.

<క. కంతు.

**కంత్రాటు** వి. పనిచేయడానికి ఒప్పందం.

పో. *కంత్రాతు*. ఒడంబడిక, ఒప్పందం ; స్పా. *కంత్రాతా*. ఒడంబడిక, ఒప్పందం ; ఫ్రె. *కాంత్రా* ; ఇం. *Contract*.

<పో. కంత్రాతు.

**కంత్రి** రూ. కంతిరి, కంత్రీ. వి. సంకరం, సంకీర్ణం.

**కంత్రీ** రూ.చూ. కంత్రి. వి. 1. మోసం ; 2. నకలు ; 3. బజారు రకం ; 4. బలహీనమైనది ; 5. సంకరం.

**కంత్రీవాడు** వి. సంకరుడు, నీచుడు.

**కంద** వి. 1. కందమొక్క, సూరణం. సీలా. 2.57 ; 2. కంద దుంప, సింహ.శ. 59 ; 3. చిలగడ దుంప, రత్నపురి గడ్డ.

నం. *కంద-*. కంద దుంప ; మహా. *కంద*. కంద దుంప ; పా. *కంద-*. ముల్లంగి దుంపలాంటి దుంప ;

హిం. కంద్. కంద ; మరా. కంద. వేరు, దుంప.

క. కందగడ్డ. గడ్డ, వాపు, ముడి, కణుపు ; త. కంతం. తినడానికి వీలైన దుంప.

<నం. కంద-.

కందగడ్డ వి. కందదుంప. కందమూలము వి. చిలగడ దుంప, గెనుసుగడ్డ. <నం. కందమూల-. దుంప మొదలు (అర్థవిపరి.).

**కందకము** వి. 1. అగడ్త. పరిఖ ; 2. పొలంలో నీటిని బయటికి పోయేట్లు చేయడానికి తీసిన కాలువ ; 3. నేలలో కట్టిన ధాన్యం కొట్టు.

నం. కంద-, కందక-. దుంప, ముడి ; హిం. కందర్. అగడ్త.

క. కందక. అగడ్త ; తు. కందక. కందక, అగడ్త ; కొండ. కంద. పెళ్ళిళ్ళప్పుడు మంటవేసే అగడ్త ; కుయి. కంద. మంటవేసుకొనే చిన్న అగడ్త ; మాల్తో. కంద్రి. గోయి.

<నం. కందక- (అర్థవిపరి.).

**కందగంగ** వి. అందంగా పూలు పూసే ఒక చెట్టు (Hibiscus collinus).

**కందగోగు** వి. బంగారు రంగు గల పచ్చని పూలు పూసే చెట్టు. పత్తి దూదివంటి దూది నిచ్చే ఒక రకం చెట్టు (cochlospermum gossypicem).

**కందంగి** వి. అలంకారార్థం పెంచబడే ఒక మొక్క (Barringtonia racemosa).

**కందచార** రూ.చూ. కందాచారము. వి. దండు సంబంధమైన లెక్కలు రాయటం.

**కందచారము** రూ.చూ. కందాచారము. వి. 1. కట్టుబడివాళ్లు ; 2. సైన్య సంబంధమైన లెక్కలు రాయటం.

**కందడిక** వి. రూ.చూ. కందాడిక. కంబళి, గొంగళి, బొంత.

**కందణము** రూ.చూ. కందనము. వి. 1. గుండెకాయ ; 2. సొరంగం కొట్టు ; 3. మల్లుర ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి.

**కందనం** రూ.చూ. కందనము. వి. ధాన్యం దాచటానికి ఉపయోగించే పెద్ద మట్టి పాత్ర.

**కందనకాయ** చూ. కందనము.

**కందనక్కిర** వి. ఊరనక్కిర. ఉత్తర సర్కారుల్లోనూ, విశాఖ గోదావరీ మండలాల్లోనూ, రాతినేలల్లోనూ పెరిగే ఒక ముళ్ల పొద (Ximenia americana).

**కందనగాయ** చూ. కందనము.

**కందనము** రూ. కందణము, కందనం. వి. 1. మల్లబంధ విశేషం, మల్లుర ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. హంస. 1.206 ; ఆం.భా. 2.209 ; 2. గుండెకాయ ; 3. సొరంగం కొట్టు.

కందనకాయ రూ. కందనగాయ. వి. గుండెకాయ. ఎద. ఆము. 4.23. కందనగాయ రూ.చూ. కందనకాయ. వి. గుండెకాయ.

**కందపట్టెలు** వి.బ.వ. తలుపు వెనక అడ్డంగా వేసిన కఱ్ఱ ముక్కలు.

**కందపెట్టె** వి. పెళ్ళిలో పెళ్ళికొడుకు వెంట మోసుకొని పోయే ఒక రకం పెట్టె (ఇందులో ఒక కందగడ్డ ఉంచుతారు, ఈ కందలాగ సంసారం పెరగాలని శుభాకాంక్షలు తెలిపే సాంగెం).

**కందము**[1] వి. పశువుల మూపురం. భార. విరా. 5.69.

సం. స్కంధ-, స్కంధస్. మూపురం, వీపు పైభాగం ; ప్రా. ఖంధ ; అ.మా. ఖంద. భుజం, మూపు ; పా. ఖంధ-. స్థూలత (ఏనుగు), శరీరం యొక్క స్థూలత్వం, భుజం వెనుకభాగం.

<ప్రా. ఖంధ -.

**కందము**[2] వి. మాత్రాబద్ధమైన పద్యవిశేషం, జాతుల్లో ఒకటి. కవిశ. 10.

సం. స్కంధక -. ఒకరకమైన ఛందస్సు ; స్కందక-. ఒకరకమైన ఆర్యా ఛందస్సు ; స్కంధ-. ఆర్యా ఛందస్సులోని పద్యం ; ప్రా. ఖంద. ఛందస్సు ; హిం. ఆనంద కంద్. ఒకవిధమైన ఛందస్సు.

క. కంద. ఒకరకమైన ఛందం.

<ప్రా. ఖంద -

**కంద(బా)ఋ** చూ. కందు[1].

**కందమ్మ** వి. పొత్తుల్లోని శిశువు.

**కందరిక** రూ.చూ. కందరికము. వి. 1. ఎద్దుమూపుమీద వేసే గంత ; 2. ఆస్తరణంగా వేసుకొనే బొంత ; 3. గంతకింద బొంత.

**కందరికము** రూ. కందరిక, కందలికము, కందళము, కందాళము. వి. కంథాస్తరణం, వర్తకులు కూర్చోడానికి వేసుకునే బొంత, ఎద్దు వెన్నుపై అమర్చేగంత. ఆం. భా. 2.267.

సం. కంథా. చిరుగుగుడ్డ, అతుకులు వేసినగుడ్డ (సాధువులు కట్టుకొనేవి) ; ప్రా. కంధా. రజాయి, పరుపు, బొంత ; మహా. కంథా. అతుకులగుడ్డ.

**కందలికము** రూ.చూ. కందరికము. వి. ఎద్దుమూపుమీద వేసే గంత.

**కందళము** రూ.చూ. కందరికము. వి. ఎద్దు వెన్నుపై అమర్చే గంత.

**కందళించు** అ.క్రి. సంతసించు.

సం. కందళ-. మొలక.

<సం. కందళ + -ఇంచు[3].

**కందవము** వి. ఎద్దువీపుమీద వేసేగంత.

**కందవెల్తు** వి. కండెవులురుచెట్టు, ముళ్లుండే కాండం కలిగినచెట్టు (Mellothus repandus).

**కందా** వి. 1. రాజబంధువులకు, భృత్యులకు వేరుగా ఏర్పరచిన బల్ల ; 2. భోజనం ; 3. తేరతిండి.

**కందాచారము** రూ. కందచార, కందచారము. వి. 1. సేనకు సంబంధించిన లెక్కలు రాయటం ; 2 రక్షకదళం.

**కందాడిక** రూ. కందడిక. వి. గొంగళి, కంబళి.

**కందాయము** వి. 1. జ్యేష్ఠమాసంనుంచి నాలుగేసి మాసాల కాలం. ఆం.భా. 1.86 ; 2. పన్ను, కప్పం, శిస్తు.

క. కందాయ. పన్ను, ఇంటిపన్ను, భూమిపన్ను, నాలుగునెల్ల కాలం ; త. కంతాయం. జ్యోతిషశాస్త్ర సంబంధ

మైన నాలుగు నెలల కాలం; మ. *కందాయం*. నాలుగు నెలల కాలం, పన్ను చెల్లించే కాలం.

**కందారము**[1] వి. మేఘం.

సం. *కంధార-* నీళ్లను ధరించేది (మేఘం).

క. *కంద, కంధా-, కందార*. మేఘం; త. *కన్తం*. మేఘం.

<సం. కం - ధార-.

**కందారము**[2] వి. తామరతీగ, ఊక.

**కందారి** వి. ఒకానొకచెట్టు, తీక్ష్ణకంటకం.

**కందాలరాజు** వి. తేరతిండి మరిగి తిరిగే పెద్దింటి పోమరి.

**కందాళము** రూ.చూ. కందరికము. వి. ఎద్దుమూపుమీద వేసే గంత.

**కంది**[1] వి. 1. ధాన్యవిశేషం. భీమ. 3.57; 2. సస్యవిశేషం, తువరి. ఆం, భా. 2.23; గింజలు కూరగా, ఆకులు పశుగ్రాసంగా ఉపయోగం. (Candanus indicus).

క. *కడలె, కడ్లె*. సెనగలు; త. *కంతి*. పప్పు; పర్జి. *కెర్ది*. కంది.

**కందికట్టి** రూ.చూ. కందికట్టె. వి. ఆముకాల్చుకువాడే కంది చెట్టు పుల్లలు. **కందికట్టె** రూ. కందికట్టి. వి. ఆము కాల్చుకు వాడే కందిచెట్టు పుల్లలు. **కందిచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు, కందివంటి చిక్కుడు. **కందిచెక్క** వి. కందిమొక్క లున్న మడి. **కందిపప్పు** వి. కందులు విసరగావచ్చే పప్పు బద్దలు. **కందిపొట్టు** కందులపై పొట్టు. **కందిమిడత** వి. ఒక విధమైన మిడత, కందిలాఉండే మిడత. **కందులు** వి. బ. వ. ధాన్యవిశేషం.

**కంది**[2] వి. తాపం.

**కందికేర** వి. ఒకజాతి కలుపుమొక్క.

**కందించు** చూ. కందు[1].

**కందివచీల** రూ.చూ. కందెన చీల. వి. ఇరుసుమీద ఉండే చీల.

**కందిని** రూ.చూ. కందీలు. వి. పెద్దదీపం, లాంతరు.

**కందినివట్టు** వి. సారెపై పాటతయారీలో మధ్యలోను, చివర్లోను మడతలు రాకుండా ఉండడానికి రెండుచేతుల బొటనవేళ్ళు చూపుడువేళ్ళ కత్తెరమాదిరిగా చేర్చిపట్టే పట్టు.

**కందిము** వి. పందిరిగుంజ, బాజా.

**కందియన** రూ. కందెన. వి. 1. బండి ఇరుసుకు పూసేమసి, కందెన. కు. సం. 12.784; 2. బండికన్నులకు పట్టించే చమురు. ఆం.భా. 2.202.

క. *కందయ*. నల్లరంగు; *కందెన*. గ్రీజు.

**కందిరి** రూ.చూ. కంజిరి. వి. ఎనిమిదంగుళాల కైవారంతో మట్టితో సారెమీద చేసిన గుండ్రని వలయం (దీనికి ఒక వైపున ఉడుంచర్మం కట్టి మువ్వలుపెట్టి వాయిస్తారు.)

**కందిరిచిప్పలు** రూ. కందిర్చిప్పలు. వి.బ.వ. కంజిరి వాద్యానికి వాడే మట్టివలయాలు. **కందిర్చిప్పలు** రూ.చూ. కందిరిచిప్పలు. వి.బ.వ. కంజిరి వాద్యానికి వాడే మట్టి వలయాలు.

**కందిరీగ** రూ.చూ. కందురీగ. వి. మధుపం.

**కందిర్చిప్పలు** చూ. కందిరి.

**కందిలి** రూ.చూ. కందీలు. వి. లాంతరు.

**కందిలు** రూ.చూ. కందీలు. వి. లాంతరు.

**కందీలు** రూ. కందిని, కందిలి, కందిలు, కానుదీయలు. వి. దీపం, ప్రమిద.

డచ్చి. *కందెలార్*. కొవ్వొత్తి. పో. *కందీల్*. దీపం; ఫ్రె. *షాందెల్*. పాదిరిగుడి దీపం; స్పా. *కందేలా, కందేల్*. చమురుదీపం, ప్రమిద.

క. *కందీల్-*. లాంతరు, గాజుగోళం; మ. *కందీల్*. లాంట్రీన్; అర. *కందీల్*. లా. *కేండెల్*.

హిం. *కందీల్, ఖందీల్*.

<పో. కందీల్.

**కందు**[1] అ.క్రి. 1. తప్తమగు, తాపంపొందు. భార. ఆది. 4.44; 2. నొచ్చు. భార. ఉద్యో. 2.57; 3. వివర్ణమగు, తేజోవిహీనమగు, మ్లానమగు. భార. ఉద్యో. 2.107; 4. కోపించు. భాగ. 8.320; 5. మలినమగు. శృం. నై. 1.68; 6. క్షీణించు, తగ్గు, కృశించు, నశించు. శృం. నై. 6.122; 7. ఎర్రవడు. కాశీ. 4.69; 8. భయపడు, కోపగించు. యయా. 1.76; వి. 1. మాలిన్యం, నలుపు. భార. సభా. 2.89; 2. సంతాపం, దుఃఖం. నిర్వ. రా. 9.78; 3. నల్లని మచ్చ, కళంకం. భార. విరా. 2.52; 4. దోషం, లోపం. కకుత్స్థ. 1.107, ఆం.భా. 4.49; క్రి. విశే. నల్లని, కృష్ణవర్ణంకల. సిం.ద్వా. 10.83.

క. *కందు*. కాలు, ఎండ లేదా నిప్పు వేడికి కములు, ఎండవేడికి కమిలినట్లగు, కములు, కాంతిహీనమగు, కళ తరుగు, వన్నెతగ్గు, పాలిపోవు, నలుపురంగు, నలుపు, మచ్చ, బాధ, మొ. తు. *కందురి, కందు*. నల్లనగు; త. *కంతు*. పొడగు, కను. నల్లనగు, సూర్యకాంతికి కందు, పాలిపోవు (అలసిపోయి), తిరికాటు. మండిపడు, తెవా. వాడుకోడానికి వీలుకాకుండా గట్టిపడు (పెరుగుతున్నపుడు దెబ్బతగిలిన పండ్లలా), కని. బాగాపండిపోవు, ఎర్రగాకాలు, మండు, హఠాత్తుగా కోపగించు, చిరాకుపడు, *కనల్-* వేడగు, మండు (నిప్పులా), మరుగు, కోపగించు, ఎర్రనగు, మండు; మ. *కంతుక*. వేడగు; *కన్నెక*. బొగ్గులామండు.

మూ.ద్రా. *కన్.

**కందబారు** అ.క్రి. నల్లపడు, కందు, వన్నెచెడు. **కందించు** స.క్రి. ఎర్రవరచు, కందేటట్లుచేయు. **కందుగల దుండగీడు** వి. చంద్రుడు. వ్య. మచ్చగలదుష్టుడు. **కందుచెప్పు** స.క్రి. గుర్తుచెప్పు. **కందుపాఱు** రూ.చూ. కందువాఱు. అ.క్రి. 1. తపించు; 2. మలినమగు; 3. నలుపగు. **కందుబండ్లు** వి.బ.వ. నల్లని పళ్ళు (దంతాలు). కు.సం. 6.87. **కందువన్నె** వి. ఒకరకం నలుపురంగు. **కందువాఱు(-పాఱు)**. రూ. కందుపాఱు. అ.క్రి. 1. మలినమగు. మాయ. హర. 7.30; 2. వివర్ణతనొందు, నల్లనగు. **కందువెట్టు(-పెట్టు)** అ.క్రి. మురికగు, నల్లనగు.

**కందు**[2] రూ. కందువు[2]. వి. బిడ్డ, శిశువు, కొదమ, పిల్ల. మొల్ల. అయో. 1.46, ఆం.భా. 2.99.

క. *కంద*. పసిబిడ్డ, *కందు*. తేగ, తల్లి అరటిచుట్టూ ఉన్న చిన్న అరటి మొలకలు, తిరగలిలో పై రాయి,

జంతువు గర్భంలోని పిండం ; తు. కన్సజి. తేగ, తిరగలిపై రాయి ; త. కన్రు. లేగ, దూడ, పలురకాల జంతువుల్లో చిన్న జంతువులు. (కొల్). మొలక, చిన్నమొక్క, అంటు ; మ. కణ్ణు. బత్తె లేదా ఆవుదూడ, తల్లరటి చుట్టూఉన్న అరటి మొలకలు ; తొ. కొఱ్. ఏడాదిలోపున్న బఱ్ఱెదూడ ; కురు. ఖద్. పసిబిడ్డ, చిన్నజంతువులు లేదా చెట్లు ; మాల్తో. క్యాడె. కొడుకు ; బ్రా. ఖనింగ్. కను.

**కందు³** వి. పటికబెల్లం.

**కందుకక్రీడ** వి. నాట్యవిశేషం.

నం. *కందుకక్రీడా*. బంతిఆట.

<నం. కందుకక్రీడా (అర్థవివరి.)

**కందుఁడు** వి. కుమారస్వామి. సాం.ని. 1.7.

నం. *స్కంద*-. కార్తికేయుడు, దేవసేనాని ; ప్రా. *ఖంద*-. శివుని పెద్దకొడుకు, కార్తికేయస్వామి ; మహా. *కంద, ఖంద*. శివుని కొడుకు కార్తికేయుడు ; హిం. *స్కంద*. శివుని చిన్నకొడుకు.

త. *కంతన్*. స్కంద, శివుని చిన్నకొడుకు.

<ప్రా. ఖంద-.

**కందుతుమ్మెద** వి. ఒక జాతి కలుపు మొక్క.

క. *కంద*. ఒక రకం మొక్క.

**కందురి** రూ.చూ. కందూరి. వి. మొహరం సందర్భంగా పీర్లకు పెట్టే నైవేద్యం, పీర్లకు నివేదించే మాంసం. పెద.

**కందురీ** రూ.చూ. కందూరి. వి. మొహరం సందర్భంగా పీర్లకు పెట్టే నైవేద్యం, పీర్లకు నివేదించే మాంసం. విశ్వే.శ.

**కందురీఁగ** చూ. కందురు¹.

**కందురు¹** రూ.చూ. కదుఁదురు. వి. ఎఱ్ఱ తుమ్మెద, కందిరీగ.

**కందురీఁగ** రూ. కంతిరీఁగ, కందిరీఁగ, కంద్రీగ. వి. తేనెటీగ, మధుపం. ఆం.భా. 2.95.

**కందురు²** వి. తృణవిశేషం. ప్రబంధ. 201.

త. *కంబేరు*. తృణవిశేషం (Gexdarusa).

**కందురు³** వి. గుండ్రని ఆకులు, ఎక్కువగా కొమ్మలు కలిగి తినడానికి పనికొచ్చే పచ్చనిపళ్లుకాసే ఒక రకం చెట్టు. ప్రబంధ. 201. (Grewia populifolia).

**కందురుపేర్పు** రూ. కందోరుపేర్పు. వి. పానకం తయారు చేయడానికి వాడే మట్టి పాత్ర.

**కందులు** చూ. కంది¹.

**కందువ** రూ. కందువము. వి. 1. ఋతువు, కాలం. నిర్వ.రా. 3.63 ; 2. ప్రదేశం, స్థానం. నిర్వ.రా. 10.88 ; 3. కౌశలం, నేర్పు. భార. విరా. 4.29 ; 4. జాడ, ఆనవాలు, గుర్తు. భార. సౌప్తి. 1.161 ; 5. శపథం, ప్రతిజ్ఞ. భాస్క. రా. కిష్కిం. 75 ; 6. నివాసస్థలం. శృం.నై. 4.85 ; 7. మర్మం, కీలు. కాశీ. 1.8 ; 8. ఏకాంతం. విక్ర. 1.128 ; 9. సంకేత స్థలం. కవిక. 4.103 ; 10. మారుమూల. తైజ. 4.82 ; 11. తెగ, సంఘం. విష్ణుపు. 1.173 ; 12. చమత్కారం, విజయ. 1.142, శుక. 2.431 ; 13. మాయ ; విశ. 1. చిత్రమైన ; 2. కపటమైన ; 3. అసత్యం, లేని.

**కందువచుట్టము** వి. ప్రియబంధువు. నార. పంచ. 4.99. **కందువదృష్టి** వి. దివ్యదృష్టి. రం.రా.బాల. 7 ప. 27 పం. **కందువపద్మము** వి. దేవతాపుష్పం. **కందువమందిరము** వి. ఏకాంత మందిరం. **కందువమాటలు** వి.బ.వ. డొంక తిరుగుడు మాటలు, శ్లేషోక్తులు. **కందువ రాజులు** వి.బ.వ. ఎక్కువగా నటించేవారు, కపటవీరులు. **కందువెఱుఁగు** అ.క్రి. గుట్టు తెలుసుకొను. <కందువ + ఎఱుఁగు.

**కందువము** రూ.చూ. కందువ. వి. 1. నేర్పు, సామర్థ్యం ; 2. చమత్కారం.

**కందువు¹** చూ. కందువ. వి. మోసం. కు.నం. 8.135.

**కందువు²** రూ.చూ. కందు³. వి. 1. బిడ్డ ; 2. మనసు.

**కందువెఱుఁగు** చూ. కందువ.

**కందూరి** రూ. కందురి, కందురీ. వి. మొహరం సందర్భంగా పీర్లకు పెట్టే నైవేద్యం, పీర్లకు నివేదించే మాంసం, సింహా.శ.

ఉ. *కందూరీ*. భోజనం చేసేటప్పుడు కిందపరిచే వస్త్రం.

క. *కందూరి*. మహమ్మదీయుల ఒకానొక విందు రోజు.

<ఉ. కందూరీ.

**కందెన** రూ.చూ. కందియన. వి. బండి ఇరుసుకుపూసేమసి, బండి కన్నులకు పట్టించే నూనె. శృం.నై. 7.98.

**కందెనకడుగు** స.క్రి. అపకీర్తిని మాపుకొను. **కందెనచీల** రూ. కందిసచీల. వి. ఇరుసు మీద ఉండే చీల. **కందెనబిళ్ళ** వి. ఇరుసు మీద ఉండే కంతలున్న కోలుబిళ్ళ. **కందెనబెట్టు** స.క్రి. నష్టపరచు, మోసగించు.

**కందెఱు¹** (కన్దెఱు¹). చూ. కను¹.

**కందెఱు²** (కన్దెఱు²). చూ. కను¹.

**కందోయి** (కన్దోయి). చూ. కను¹.

**కందోరుపేర్పు** రూ.చూ. కందురుపేర్పు. వి. పానకం తయారు చేయడానికి వాడే మట్టిపాత్ర.

**కంద్రీఁగ** రూ.చూ. కందురీఁగ. వి. కందిరీగ.

**కన్న¹** కనిన యొక్క సంక్షిప్తరూపం. కను³ యొక్క భూతార్థక విశేషణ రూపం. విశ. కనిన. భార. ఆది. 7.87, కు.సం. 1.74.

**కన్నకొడుకు** వి. ఔరసపుత్రుడు. ఆం.భా. 2.111. **కన్నది¹** వి. తల్లి, మాత.సాం.ని. 2.3. **కన్నవాకొడుకు** వి. భయపడినవాడు. **కన్నబిడ్డ** వి. కనినబిడ్డ, సొంతబిడ్డ. **కన్నయ్య²** వి. తండ్రి, జనకుడు. సాం.ని. 2.3.

**కన్న²** కనిన యొక్క సంక్షిప్తరూపం. కను¹ యొక్క భూతార్థక విశేషణ రూపం. విశ.కనిన, చూచిన. వసు. 2.56.

**కన్నచోట** అవ్య. ఎక్కడైనా. **కన్నతిట్లు** వి.బ.వ. చెడు తిట్లు. **కన్నదేగతి** వి. చూచిందే తిండి. **కన్నమాటలు** వి.బ.వ. నీచమైన మాటలు. **కన్నవాడు**. వి. ఎవరైనా వ్యక్తి.

**-కన్న³** ప్రత్య.ద్రు. పంచమీవిభక్తి ప్రత్యయం, కంటె.భార. ఆది. 5.159.

**కన్నగాఁడు** చూ. కన్నము.

**కన్నగోల** చూ. కన్నము.

**కన్నగత్తి** చూ. కన్నము.

**కన్నడ¹** రూ. కన్నడవు, కన్నడుగు, కన్నడువు, కన్నళవు,

కన్నడువ. వి. 1. అనాదరం, తిరస్కారం. విప్ర. 3.88, చంద్రాంగ. 1.21 ; 2. ఉపేక్ష.

కన్నడచేయు రూ.చూ. కన్నడసేయు. స.క్రి. 1. తిరస్కరించు. అహల్యా. 2.81 ; 2. ఉపేక్షించు. కన్నడయొనర్చు (-ఒనర్చు) స.క్రి. 1. తిరస్కరించు, అలక్ష్యంచేయు. చంద్రాంగ. 1.21 ; 2. ఉపేక్షించు. కన్నడసేయు(-చేయు) రూ. కన్నడచేయు. స.క్రి. 1. కన్నడచేయు, కన్నడించు. చెన్న.బసవ. 4.333 ; 2. తిరస్కారం చేయు, ఉపేక్షించు. కన్నడించు[1] స.క్రి. ఉపేక్షించు, తిరస్కరించు, అనాదరం చూపు. కన్నడిదు వి. నిర్లక్ష్యంచేసేవాడు, ఉపేక్షచేసే వాడు. కన్నడీఁడు[1] విణ. (కన్నడ+ఈఁడు). ఉపేక్షించే వాడు.

కన్నడ[2] వి. ఇరవై నాలుగు స్త్రీరాగాల్లో ఒకటి. ప్రబంధ. 95.

త. కన్నడమ్, కన్నాడా. వాద్య విశేషం.

సం. కానడా. స్త్రీ రాగ విశేషం.

కన్నడగౌళ వి. సంగీతరాగాల్లో ఒకటి. చెన్న బసవ. 2.236, రాగవిశేషం. త. కన్నడ-గౌళమ్. రాగవిశేషం.

కన్నడఈఁడు చూ. కన్నము.

కన్నడము వి. 1. కర్ణాటదేశం. ఆము. 1.14 ; 2. కర్ణాట దేశం వారు మాట్లడే భాష, కర్ణాట భాష. ఆం భా. 1.110.

సం. కర్ణాట-కర్ణాటక, ఒకజాతిజనులు ; ప్రా. కణ్ణాడ. ఒకానొక దేశనామం ; అప. కణ్ణాల. కర్ణాట దేశం ; హిం. కర్ణాటు. కర్ణాట దేశం ; మరా. కర్ణాటకె ;

క. కర్ణాటు, కన్నాడ. కర్ణాటదేశం మరియు వారి భాష, కన్నడిగ. కర్ణాట దేశీయుడు, కర్ణాటుక. కర్ణాట భాష, కర్ణాట దేశీయుడు ; తు. కన్నడ. కర్ణాటక ; త. కర్ణాటకమ్ కన్నాటమ్. కర్ణాట దేశం, కర్ణాట భాష, కన్నాటన్, కన్నాటికన్, కన్నాటయన్. కర్ణాట దేశీయుడు. తా. కన్నన్. కన్నడ దేశీయుడు.

ఇది దేశ్యమనీ, కర్. నలుపు. నల్లరేగడి+నాడు. >కర్ణాటగా మారిందని కిట్టెల్ మొ॥ వారి ఉద్దేశం.

కన్నడి వి. కన్నడ దేశపువాడు, కర్ణాటకుడు. సిం.ద్వా. 1.42. కన్నడించు[2] స.క్రి. కన్నడ భాషలోనికి మార్చు. కన్నడీఁడు[2] వి. కన్నడ దేశీయుడు.

కన్నడవు రూ.చూ. కన్నడ[1]. వి. 1. తిరస్కారం. విప్ర. 5.21 ; 2. ఉపేక్ష ; 3. అశ్రద్ధ.

కన్నడవుచేఁత వి. ఉపేక్ష, తిరస్కారం. విప్ర. 5.21.

కన్నడి[1] చూ. కన్నడము.

కన్నడి[2] వి. నిలువుటద్దం.

క. కనడి, కన్నడి. అద్దం, కళ్ళజోడు ; కొడ. కణ్ణాడి. అద్దం ; తు. కణ్ణాడి, కన్నాడి ; త. కన్నాటి, కన్నటి. లోహపు లేక గాజు అద్దం ; మ. కణ్ణాటి, కన్నటు ; తా. కొణాతి.

<క. కన్నడి.

కన్నడించు[1] చూ. కన్నడ[1].

కన్నడించు[2] చూ. కన్నడము.

కన్నడిదు చూ. కన్నడ[1].

కన్నడీఁడు[1] చూ. కన్నడ[1].

కన్నడీఁడు[2] చూ. కన్నడము.

కన్నదుగించు చూ. కన్నదుగు.

కన్నదుగు రూ.చూ. కన్నడ[1]. వి. 1. అనాదరం, తిరస్కారం ; 2. ఉపేక్ష.

కన్నదుగించు స.క్రి. ఉపేక్షించు. కన్నదుగుసేయు (-చేయు) స.క్రి. తిరస్కరించు, ఉపేక్షించు. వాల్మీ. 3.33.

కన్నదువు రూ.చూ. కన్నడ[1]. వి. 1. ఉపేక్ష ; 2. అనాదరం.

కన్నఁడు చూ. కన్నయ్య[1]. వి. కృష్ణుడు.

కన్నది[2] చూ. కన్నె[1]. వి. బోగం సాని, కన్నె.

కన్నన యా.చూ. క్రన్నన. క్రి.విణ. ద్రు. శీఘ్రంగా.

కన్నవుఁగత్తి చూ. కన్నము.

కన్నవుదొంగ చూ. కన్నము.

కన్నవురాయి రూ.చూ. ఖండవురాయి. వి. పొలాలకు ప్రభుత్వం వారు హద్దుగా పాతినరాయి.

కన్నవురోలు వి. సొరెమొలను దింపడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్నరాయి, గుబ్బిరాయి.

కన్నపెట్టు చూ. కన్నము.

కన్నపోవు చూ. కన్నము.

కన్నప్పసోమవారం వి. చేనేత పనిచేసే శైకాల వాళ్ళు కార్తీక మాసంలో తొలి సోమవారంనాడు చేసుకునే పండగ.

ఈ కన్నప్ప కులంకోసం ప్రాణ త్యాగం చేసిన పేరంటాలు.

కన్నమిడు చూ. కన్నము.

కన్నము రూ. కణెము, కనం, కనెము. వి. 1. రంధ్రం, బిలం, దొంగ తవ్వే సొరంగం. బసవ. 5.340 ; 2. చిల్లి, బొరియ ; 3. దొంగలు చేసే రంధ్రం.

క. కన్న. దొంగలు గోడలకు చేసే రంధ్రం, బొరియ ; తు. కన్న. రంధ్రం ; త. కన్నమ్. దొంగలు గోడకు చేసే రంధ్రం, దొంగతనం ; మ. కన్నమ్. దొంగలు గోడలకు చేసే రంధ్రం.

కన్నగాఁడు (-కాడు) వి. ఖనకుడు, కన్నంవేసి దొంగిలించే దొంగ. కాశీ. 4.52. కన్నగోల (-కోల) వి. దొంగలుపయోగించే కర్ర. కన్నఁగత్తి(-కత్తి) రూ.చూ. కన్నవుఁగత్తి. వి. కన్నం తవ్వడానికి దొంగ లుపయోగించే కత్తి. కన్నడఈఁడు వి. దొంగ. కన్నవుఁగత్తి(-కత్తి) రూ. కన్నఁగత్తి. వి. కన్నం చేయటానికి దొంగ లుపయోగించే కత్తి. కన్నవుదొంగ వి. దొంగ, కన్నంవేసే దొంగ. కన్నపెట్టు యా.చూ. కన్నముపెట్టు. స.క్రి. అపహరించు, కన్నంవేసి దొంగిలించు. దశకు. 4.24. అ.క్రి. కన్నంవేయు. కన్నపోవు అ.క్రి. 1. కన్నం పెట్టబడినదగు. పరమ. 5.15 ; 2. కన్నం వేసి దొంగిలింపబడు. కన్నమిడు స.క్రి. 1. కన్నం వేయు. దశకు. 6.62 ; 2. కన్నం వేసి దోచుకొను. సిం.ద్వా. 10.115 ; 3. దొంగలు రంధ్రం చేయు. కన్నముగత్తి(-కత్తి) వి. కన్నం తవ్వటానికి దొంగలుపయోగించే కత్తి. కన్నముపెట్టు రూ. కన్నపెట్టు, కన్నవెట్టు. స.క్రి. 1. కన్నంవేయు ; 2. అపహరించు ; 3. కన్నంవేసి దొంగిలించు. కన్నముముట్టు వి. కన్నాన్ని తవ్వే (దొంగల)

సాధన విశేషం. కన్నమువేయు అ.క్రి. దొంగతనం చేయు.
కన్నవెట్టు(-పెట్టు) రూ.చూ. కన్నముపెట్టు. స.క్రి. 1. అపహరించు. ఘటికా. 4.185; 2. కన్నంవేసి దొంగిలించు; 3. కన్నం వేయు.

కన్నయ్య[1] వి. శ్రీకృష్ణుడు.
సం. కృష్ణ-. కృష్ణుడు; ప్రా. కణ్హ-; అమా. కణ్హ-, కసణ-; అప. కసణ, కాణ్హ; హిం. కణ్హాయా. శ్రీకృష్ణుడు; మరా. కన్హయా, కన్హైయ, కన్హ. శ్రీకృష్ణుడు. త. కిరుట్టినన్; మ. కణ్ణన్.
<ప్రా. కణ్హ-.

కన్నర రూ.చూ. కన్నఱ. వి. దుఃఖం, దురవస్థ.

కన్నరి రూ. కన్నఱి. వి. దుఃఖితుడు, దురవస్థలో ఉన్నవాడు. ఉ.హరి. 6.28.

కన్నఱ రూ. కన్నర. వి. దుఃఖం, దురవస్థ, కష్టం. రామా. 2.41.
పో.చూ. త. కన్నరై. గుడ్డితనం, గుడ్డివాడు, నిర్దయ, కఠినం.

కన్నఱి రూ.చూ. కన్నరి. వి. దుఃఖితుడు, దురవస్థలో ఉన్నవాడు.

కన్నఱ్ఱు చూ. అఱ్ఱు[1]. వి. సేద్యపుపసరానికి మెడమీద ఏర్పడ్డ చిన్న నలుగురు చర్మం.

కన్నళవు రూ.చూ. కన్నడ[1]. వి. ఉపేక్ష, తిరస్కారం.
కన్నళవుసేయు (-చేయు) స.క్రి. ఉపేక్షించు, తిరస్కరించు. వసు. 4.86.

కన్నఱవు రూ.చూ. కన్నడ[1]. వి. ఉపేక్ష, అనాదరం, తిరస్కారం.

కన్నవిటి చూ. కన్ను[1].

కన్నవెట్టు చూ. కన్నము.

కన్నా విశే. అధికమైన.

కన్నాకగు చూ. కన్నాకు[1].

కన్నాకు వి. 1. నాయకుడు. నిర్వ.రా. 5.128, భార.భీష్మ. 1.76; 2. తమలపాకు పిడిక (చిన్న కట్టకు) పైన కను తేరేటట్లు పెట్టి కట్టే మేలు ఆకు; 3. తాటాకుల పుస్తకంలో మొదటి లేక చివరి ఆకు; 4. చెట్టుయొక్క చివరి ఆకు, కోటాకు. విశే. శ్రేష్ఠమైన. ఆం.భా. 3.15.
సం. కర్ణిక-. కర్ణధారుడు, ప్రధానుడు.
కన్నాకగు అ.క్రి. 1. సేనాపతి అగు; 2. శ్రేష్ఠమగు; 3. ఇంపగు.

కన్నాగు చూ. కన్ను[1].

కన్నాఁడు చూ. కను[3]. వి. తండ్రి.
<కన్న+వాఁడు.

కన్నాత వి. 1. మల్లబంధ విశేషం. ఆం.భా. 2.207; 2. ఒకానొక రతిబంధం. శరా. 95.

కన్నార(జూచు చూ. కన్ను[1].

కన్నాలబల్ల వి. వజానేతకోసం అమర్చిన దొడ్డి చట్రంలో కుచ్చుతాళ్ళు దూర్చిన చెక్క.

కన్నాన చూ. కన్ను[1].

కన్నికలు చూ. కన్నె. వి.బ.వ. 1. నష్ట కన్యలు; 2. చెరువు కట్ట మీద ఏర్పడిన ఏడు మట్టి గుర్రాలు.
సం. కన్యకా. అవివాహిత స్త్రీ; ప్రా. కణ్ణికా.
<ప్రా. కణ్ణికా.

కన్నింగలము చూ. కన్ను[1].

కన్నిచ్చకువచ్చు చూ. కన్ను[1].

కన్నిడకాల్పు చూ. కన్ను[1].

కన్నిడు చూ. కన్ను[1].

కన్నిడుచు అ.క్రి. 1. తాటికాయలలో ముంజు లేర్పడు; 2. సీతాఫలంలో కన్ను లేర్పడు.

కన్నియ రూ. కన్నె[1]. వి. 1. వివాహంకాని బాలిక. భార. ఆది. 1.143; 2. కూతురు. భార.విరా. 2.139; విశే. 1. మొదటి, ప్రథమమైన. శృం.నై. 1.84; 2. లేత. విప్ర. 3.19; 3. కొత్త. పాండు. 4.21.
సం. కన్యా, కన్యకా. బాలిక, కుమారి; ప్రా. కణ్ణా, కణ్ణిఆ, కన్నా, కన్నగా, కన్య; అ.మా. కణ్ణా; పా. కఞ్ఞా; శౌ. కజ్జిఅ, కణ్ణఅ; అప. కణ్ణయ; పం. కన్నెఅ.
క. కన్నికె, కన్నె; త. కన్ని. కుమారి; కన్నిమై. కన్యాత్వం; మ. కన్ని; ఒరయాన్. కన్యా. నూతన వధువు.
<ప్రా. కణ్ణిఆ.
కన్నియలేడి రూ. కన్నెలేడి, కన్నెలేడు. వి. కారండవం, ఒక జాతి పక్షి. ద్వి.హరిశ్చ.పూ. 6.30. కన్నిరికము రూ.చూ. కన్నెఱికము. వి. 1. వెలయాలు, రజస్వల అయిన తర్వాత కానున్న విటుడుచేసే మొదటి సంపర్కం; 2. వేశ్యకి మొదటిసారి విటుడు ఇచ్చిన కన్యాశుల్కం; 3. కన్యగా ఉండే వేశ్యను స్థిరంగా ఉంచుకోవటం. కన్నిఱికము రూ.చూ. కన్నెఱికము. వి. 1. వెలయాలు రజస్వలానంతరం విటుడితో జరిపే మొదటి కలయిక; 2. వేశ్యకు విటుడు మొదటిసారి ఇచ్చే శుల్కం.

కన్నిరికము చూ. కన్నియ.

కన్నిఱికము చూ. కన్నియ.

కన్నీరు చూ. కను[1].

కన్నీళ్లు చూ. కను[1].

కన్ను[1] రూ.చూ. కను[1]. వి. ఔ. 1. నేత్రం, చూపు, దృష్టి. భార.ఆది. 6.289, భార.అరణ్య. 1.270; 2. బండి చక్రం కన్ను. కు.సం. 4.439; 3. ఇంగితం, అభిప్రాయం, జాడ. భాస్క.రా.యు. 2668; 4. వల మొ. వాటి రంధ్రం. కవిక. 4.113; 5. మృదంగాది వాద్యాల ముఖ భాగంలో ఏర్పరచబడిన వృత్త నీలమండలం. ఆము. 4.187; 6. నెమలిపురికన్ను, చంద్రకం. ఆం.భా. 2.96; 7. కపట చేష్ట. ఆం.నా.శే. 55; 8. వంతెన ద్వారం.
కన్నవిటి వి. అంధుడు. భల్లా. 4. (కన్ను+అవిటి). కన్నాగు అ.క్రి. కన్నుచూరక మూతపడు, నిద్రించు. భాస్క.రా.యు. 584. స.క్రి. మోనగించు. కన్నార(జూచు స.క్రి. తృప్తిగాచూచు. కన్నాన విశే. కంటికాళ కొల్పేది, కనుపండువైనది. హంస. 5.215. కన్నింగలము వి. కంటి

లోని అగ్ని. పద్మ. 3.14. కన్నిచ్చకువచ్చు వి. కను పండువుగా ఉండు, కంటికింపగు. పాండు. 3.89. **కన్నిడకాల్వు** వి. కాల్వులో నల్లనికుంక అయితే తెల్లటి చుక్కలు, ఎర్రటి కుండయితే నల్లటి చుక్కలు కన్నుల మాదిరిగా ఏర్పడిన పద్ధతి, కన్నుకాల్వు. **కన్నిడు** అ.క్రి. 1. కన్నువేయు, మోహం కలుగు. భార.అను. 2.119 ; 2. దృష్టిపెట్టు. కవిక. 3.105. **కన్నుకట్టు**[1] రూ. కనికట్టు, కనుకట్టు, కనుగట్టు, కన్నుగట్టు. స.క్రి. వంచించు, మోస గించు. కు.సం. 5.65; వి. 1. బాలక్రీడా విశేషం. ప్రబంధ. 6.13 ; 2. గారడి. **కన్నుకట్టు**[2] రూ. కన్నుగట్టు[2]. అ.క్రి. సహించకపోవు, అసూయచెందు. **కన్నుకట్టువిద్య** వి. అతీంద్రియశక్తి, గారడీవిద్య. **కన్నుకప్పు** స.క్రి. మోసం చేయు. **కన్నుకాల్వు** వి. కాల్వులో నల్లటి కుండకయితే తెల్లటి చుక్కలు, ఎర్ర కుండకయితే నల్ల చుక్కలు కన్నుల మాదిరిగా ఏర్పడిన తీరు. **కన్నుకుట్టు**[1] వి. కమ్మినేతలో అందంగా ఉండడానికి పడుగులో దూర్చిన రంగుదారం. **కన్నుకుట్టు**[2] అ.క్రి. అసూయపడు, చూపోపకపోవు. **కన్నుకురుకు** రూ.చూ. కనుకూరుకు. అ.క్రి. నిద్ర కోసం కన్నుమూయు. **కన్నుకొట్టు** అ.క్రి. కనుగీటు, కనుసైగచేయు. **కన్నుగట్టు**[1] రూ.చూ. కన్నుకట్టు[1]. స.క్రి. మోసగించు, వంచించు. **కన్నుగట్టు**[2] (-కట్టు) రూ.చూ. కన్నుకట్టు[2]. అ.క్రి. సహించకపోవు, అసూయచెందు. **కన్నుగప్పు** (-కప్పు) స.క్రి. మోసగించు. **కన్నుగానకపోవు** (-కానక పోవు) అ.క్రి. మదమెక్కు, పొగరెక్కు, కిందుమీదు గాన కుండు. **కన్నుగానకుండు** అ.క్రి. మదమెక్కు, కింద మీదు తెలియకుండు. < కన్ను + కానక + ఉండు. **కన్నుగీటు** రూ. చూ. కనుగీటు. అ.క్రి. కనుసైగ చేయు. **కన్నుఁగవ** (-కవ) రూ. కనుఁగవ, కన్గవ. వి. నేత్రద్వయం. శృం.నై. 1.67. **కన్నుచెదు** స.క్రి. పొగసును చూచివలచు. **కన్నుండఁగంటిపాఘసుగాసు** అ.క్రి. చూస్తుండ గానే మోసం జరుగు. ఉ.హరి. 5.288. **కన్నుతిరుగు** అ.క్రి. పైత్యభ్రమ కలుగు. **కన్నుదూఱు** (-తూఱు) అ.క్రి. అందమనితోచు, నచ్చు. **కన్నుదెఱచు** (-తెఱచు) అ.క్రి. 1. తెలివొందు, మేల్కొను; 2. తప్పు తెలుసుకొను. **కన్నుదోయి** రూ.చూ. కందోయి. వి. రెండు కళ్ళు. **కన్నునీరు** రూ.చూ. కన్నీరు. వి. కన్నీరు, అశ్రువు. ఆం.భా. 4.167. **కన్నునీలాలు** వి.బ.వ. నీలమణులు. **కన్నుపడు** రూ. కన్నువడు. అ.క్రి. కన్నువేయు, కోరిక కలుగు. **కన్నుపేటు** వి. నెమలికన్ను ఆకారంలోగాని గువ్వ కన్ను ఆకారంలో గాని నేసిన డిజైను. **కన్నుపొడుచు** అ.క్రి. 1. బుద్ధి చెప్పు, ప్రాయశ్చిత్తం చేయు. రాధికా. 3.63 ; 2. హాని చేయు ; 3. పీడించు ; 4. మోసగించు. **కన్నుబుటా** వి. కన్ను మాదిరిగా నేసిన పువ్వు డిజైను. **కన్నుబొమ** రూ. కన్ను బొమ్మ. వి. భ్రూవు. చంద్రాంగ. 4.210. **కన్నుబొమ్మ** రూ.చూ. కనుబొమ. వి. భ్రూవు. ఇందు. 2.161. **కన్నుమచ్చ** వి. ఎక్కువ కాలడం వల్ల లేక గడ్డి కంప అంటువల్ల కుండలపై కన్నులాగ ఏర్పడే మచ్చ. **కన్ను మిక్కిలివేల్పు** వి. శివుడు. అచ్చరా. సుందర. 87. వ్యు. ఒక కన్ను (అందరి కంటె) అధికంగా గల దేవుడు. **కన్నుమిన్ను గానకుండు** అ.క్రి. పొగరెక్కు. <కన్ను + మిన్ను + కానక + ఉండు. **కన్నుమునగ** క్రి.విశే. సమృద్ధిగా. **కన్ను మూయు** రూ. కనుమూయు, కన్మూయు. అ.క్రి. 1. నిద్రించు. కవిక. 2.132 ; 2. దీర్ఘ నిద్ర చెందు, మరణించు. శుక. 1.306. స.క్రి. కనుగప్పు, వంచించు. చంద్రాంగ. 4.167. **కన్నుమూసిగంత** రూ.చూ. కను మూసిగంత. వి. దాగుడుమూత, కళ్ళు కప్పటానికై కట్టే తోలుబిళ్ళ. **కన్నుమొగుచు** రూ. కనుమొగుచు, కన్మొగుచు. అ.క్రి. 1. కనుమూయు, నిద్రించు. కాశీ. 3.235 ; 2. ముకుళించు. జైమినీ.భా. 2.101. **కన్నుమొఱఁగు** రూ.చూ. కనుమొఱఁగు. స.క్రి. మోసగించు. భీమ. 1.111. **కన్నుమోడుచు** రూ.చూ. కనుమోడ్చు. అ.క్రి. నిద్రించు. **కన్నుమోడ్చు** రూ.చూ. కనుమోడ్చు. అ.క్రి. నిద్రించు. రాజ.వి. 1.15. **కన్నుమోడ్పు** రూ. కన్మోడ్పు. వి. కన్నుమూత, నిద్ర. హ.స. 2.53. **కన్నుఁబ్రామ** రూ.చూ. కనుఁబ్రాము. స.క్రి. 1. కనుమూయు. పద్మ. 9.93 ; 2. తప్పించుకొను, వంచించు, మోసపుచ్చు. **కన్నులకచ్చి** వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146. **కన్నులకద్దుకొను** స.క్రి. పూజించు, గౌరవించు, <కన్నులకు + అద్దుకొను. **కన్నులకఱవు** వి. కన్నులకు చూచే భాగ్యం లేక పోవడం. **కన్నులకలికి** రూ. కన్నులకల్కి. వి. కన్నులలో మనోజ్ఞత కలది, స్త్రీ, ఆడది. వేంక. పంచ. 3.180. **కన్నులకల్కి** రూ.చూ. కన్నులకలికి. వి. కన్నులందు మనోజ్ఞత కలది, స్త్రీ, ఆడది. దశా. 2.321. **కన్నులగట్టివట్టు** అవ్య. ప్రత్యక్షంగా. **కన్నులఁగట్టివట్టుండు** అ.క్రి. ఎదుట కట్టి. నట్లుండు, ప్రత్యక్షంగా కనపడుచుండు. చంద్రరే. 1.27. **కన్నులఁగట్టు** (-కట్టు) స.క్రి. మోసగించు. **కన్నులఁగప్పుకొను** స.క్రి. కన్నులకద్దుకొను, గౌరవంతో చూచు. అ.క్రి. మిక్కిలి ఆదరం కలిగి ఉండు. విజయ. 3.127. **కన్నులఁజూపు** స.క్రి. కన్నులకుచూపు, కనబరచు. గంధ. 68. **కన్నులనిప్పులురాలు** అ.క్రి. కోపంతో కన్నుఎఱ్ఱబడు. **కన్నులపక్కి** వి. నెమలి. **కన్నులపండువ** రూ.చూ. కన్నుల పండువు. వి. కన్నులపండువు. **కన్నులపండువు** రూ. కన్నులపండువ. వి. నేత్రోత్సవం, ఉత్సవం. భార. ఆశ్ర. 2.144. **కన్నులప్పగించు** అ.క్రి. నిస్సహాయుడగు. <కన్ను + లు + అప్పగించు. **కన్నులమ్రొక్కు** వి. నమస్కార విశేషం. ప్రబంధ. 880. **కన్నులఁబడు** అ.క్రి. అగపడు, కనబడు. కువల. 3.59. **కన్నులవినుకలి** రూ. కన్నులవిన్కలి. వి. చక్షుఃశ్రవం. వ్యు. కళ్ళతో వినేది, పాము. నవనాథ. 4.159. **కన్నులవిన్కలి** రూ.చూ. కన్నులవినుకలి. వి. పాము, చక్షుఃశ్రవం, వ్యు. కళ్ళతో వినేది. **కన్నులార్చు** అ.క్రి. కనుసంజ్ఞచేయు, చిత్ర.భా. 4.54. **కన్నులిచ్చు** అ.క్రి. దిగ్భ్రమచెందు. ఆశ్చర్యపడు. **కన్నులుచల్లవగు** అ.క్రి. కన్నులకు ఆనందకరమగు. కవిరా. 3.62. **కన్నులుతలకెక్కు** అ.క్రి. గర్వంతో కంటితో కింద చూడకుండు, పొగరెక్కు. **కన్నులువాచు** అ.క్రి. కను పొట్టలు ఉబ్బేటట్లు ఆకకై ఎదురు చూస్తూ ఉండు.

కమ్నులెఱ్ఱచేయు (కన్నులు+ఎఱ్ఱచేయు) అ.క్రి. కోపించు. రసిక. 4.170. కమ్నుల్మూయు అ.క్రి. నిద్రించు, దీర్ఘ నిద్ర చెందు, మరణించు. స.క్రి. కనుగప్పు, వంచించు. శుక. 4.24. కమ్నువడు (-పడు) రూ.చూ. కన్నుపడు. అ.క్రి. కన్నువేయు, కోరిక కలుగు. కమ్నువిచ్చు రూ.చూ. కనువిచ్చు. అ.క్రి. కనువిప్పు, కనుతెరచిచూచు. కమ్ను వినుకలి రూ.చూ. కనువినుకలి. వి. కళ్ళతో వినేది, పాము. ప్రబోధ. 34. కమ్నువినుకలితిన్నె రూ. కన్నువిన్కలితిన్నె. వి. శేషాచలం. ప్రబంధ. 34. కమ్నువిన్కలి రూ.చూ. కనువినుకలి. వి. కళ్ళతో వినేది, పాము. కమ్నువిన్కలితిన్నె రూ.చూ. కన్నువినుకలితిన్నె. వి. శేషాచలం. కమ్నువేయు రూ. కనువేయు. అ.క్రి. దృష్టి ప్రసరింపచేయు, అభిలాష కలిగి ఉండు. ఆము. 6.133. కమ్నువైచు అ.క్రి. గాఢంగా చూచు, దృష్టిని ప్రసరింపజేయు, అభిలాష కలిగి ఉండు. శివ.రా. 3.60. కమ్నువొందు (-పొందు) అ.క్రి. నిద్రపోవు, నిద్రించు. భార.ఆది. 6.289. కమ్నుసన్న రూ. కనుసన్న. వి. నేత్ర సంజ్ఞ. వరాహ. 11.42. కన్నెదుగు స.క్రి. జాడతీయు. <కన్ను[1]+ఎదుగు. కన్నెఱ రూ. కన్నెఱ్ఱ. వి. కోపం. రాజ.చ. 2.149. కన్నెఱచేయు రూ. కన్నెఱ్ఱ చేయు. అ.క్రి. కోపగించు, ఉద్రేకపడు. కవిక. 4.7. కన్నెఱుఁగు స.క్రి. 1. జాడ ఎరుగు; 2. చూచు, తెలిసి కొను. కన్నెఱ్ఱ రూ.చూ. కన్నెఱ. వి. కోపం. కన్నెఱ్ఱచేయు రూ.చూ కన్నెఱచేయు. అ.క్రి. కోపించు. రసిక. 5.164. కన్వేయు అ.క్రి. కోరుకొను, కన్నువేయు. <కన్ను[2]+వేయు. కన్నొట రూ. కన్నొటు. వి. కోపం. భార. శాంతి. 4.392. కన్నొటు రూ.చూ. కన్నొట. వి. భయం. కన్నొడు[1] అ.క్రి. చూడటానికి భయపడు.

కమ్ను[2] రూ.చూ. కను[2]. వి. 1. వెదురు మొ॥ వాటి కణుపు కిందిగుంట. 2. సారెమొలదించడానికి గుబ్బిరాయి మధ్యలో పెట్టిన రంధ్రం, గుబ్బికన్ను.

కమ్నులమంత వి. చెరుకు. కమ్నులమ్రాను వి. చెరకు. కమ్నులమ్రాన్విలుకాఁడు. వి. మన్మథుడు. వ్యు. చెరుకు విల్లు గలవాడు. కమ్నులమ్రాన్విలుతుఁడు వి. మన్మథుడు. వ్యు. చెరుకు విల్లుగా కలవాడు. కమ్నులవింటిజోదు వి. చెరుకు విల్లుగా కల యోధుడు, మన్మథుడు. దశా. 2.321. కమ్నుల వింటివాఁడు వి. చెరుకు విల్లుగా కల యోధుడు, మన్మథుడు. కమ్నులవిలుకాఁడు రూ. కన్నులవిల్కాఁడు. వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. విష్ణుపు. 3. కమ్నులవిలుతుఁడు రూ. కన్నుల విల్తుఁడు. వి. చెరుకు విల్లుగా కలవాడు, మన్మథుడు. ఆం. భా. 1.45. కమ్నులవిల్కాఁడు రూ.చూ. కన్నులవిలుకాఁడు. వి. మన్మథుడు. విష్ణుపు. 3. ఆ. కమ్నులవిల్తుడు రూ.చూ. కన్నుల విలుతుఁడు. వి. చెరుకు విల్లుగా కలవాడు, మన్మథుడు.

కన్నె[1] రూ.చూ. కన్నియ. వి. 1. వివాహంకాని బాలిక. కాశీ. 3.171, ఆం.భా. 2.106; 2. కుమారి, కూతురు. హర. 5.30, హరిశ్చ. 2.67; విశే. 1. మొదలు; 2. లేత; 3. కొత్త; 4. చిన్న.

కన్నెక వి. 1. కన్నె. శుక. 3.521; 2. స్త్రీ, ఆడది. దశకు. 10.23. కన్నెకయ్యము వి. 1. మొదటి యుద్ధం, యుద్ధారంభం. భార. భీష్మ. 1.110; 2. కన్నెల కయ్యం. కన్నెకలుపు వి. ప్రథమ సంగమం, తొలికూటమి. శృం.నై. 7.151. కన్నెకూరిమి రూ.చూ. కన్నెకూర్మి. వి. ప్రథమానురాగం, తొలివలపు. కన్నెకూర్మి రూ. కన్నెకూరిమి. వి. ప్రథమానురాగం, తొలివలపు. శృం.నై. 1.84. కన్నెకొమర రూ. కన్నెకొమరి. వి. ఓషధీ విశేషం, చిన్న కలబంద. హంస. 4.10. క. కుమారి. ఓషధీ విశేషం; త. కన్ని. కలబంద; కత్తాలై. మాని, కలబంద. కన్నె కొమరి రూ.చూ. కన్నెకొమరి. వి. ఓషధీ విశేషం. కన్నెకోమలి వి. ఔషధాల్లో ఉపయుక్తమయ్యే మూలికా విశేషం. కన్నెగోరుకోఁత వి. పెళ్ళికాలంలో పెళ్ళికిముందు కన్యలకు గోళ్ళు తీసే సంస్కారం. కన్నెచెఱ వి. 1. కన్నెరికం అనే బంధం; 2. పెళ్ళికాకుండా కన్యగా ఉంచటం. కన్నెతనము వి. కన్యాత్వం, కన్యాధర్మం. శ్రీరాధా. 2.184. కన్నెతాడు వి. 1. మెడతాడు; 2. రాట్నం ఆకుల తాడును కదురును కలిపే గట్టి దారం, క. కణ్ణి. తాడు, మెడతాడు; త. కణ్ణి. పెనవేయు, పూలదండ, ఎడ్లకు వేసే మెడతాడు, తాడు. కణ్ణు (-కణ్ణి). కాడిమానుకు కట్టిన తాడు. కన్నెది వి. కన్య. కన్నెపిట్ట[1] వి. కన్నెలేడి. కన్నెపిట్ట[2] వి. ఒక రకమైన బాతు. కన్నెబావి వి. 1. చిన్నబావి; 2. నీరులేని బావి. కన్నెబెబ్బులికోలు వి. వయసులో ఉన్న పులితోలు. కన్నెమావి వి. లేత మామిడి చెట్టు. కన్నెమెరుగు వి. మెరుపుయొక్క కొత్త తళుకు. కన్నెరకము రూ.చూ. కన్నెఱికము. వి. 1. కన్యాత్వం; 2. వెలయాలి తొలి రతి. కన్నెరాశి వి. కన్యారాశి. కన్నెర్కము రూ.చూ. కన్నెఱికము. వి. 1. కన్యాత్వం. ప్రభు. 69. పు. 20 పం.; 2. వార కన్యల ప్రథమ సంగమం. కన్నెఱికము రూ. కన్నిరికము, కన్నెరికము, కన్నెరకము, కన్నెర్కము. వి. 1. కన్యాత్వం. హరి.ఉ. 7.91; 2. వారకన్యల ప్రథమ సంగమం. కాశ. 4.49; 3. వేశ్యకు విటుడు మొదటసారి ఇచ్చే శుల్కం. కన్నెఱికముతీయు అ.క్రి. కన్నెరికం తొలగించు. కన్నెఱికము పెట్టు స.క్రి. కన్నెరికం తొలగించు. కన్నెలేడి రూ.చూ. కన్నియలేడి. వి. కారండవం, కల్నేటిపక్షి. యయా. 2.24. కన్నెలేడు రూ.చూ. కన్నియలేడి. కన్నెవేడి వి. ఒక రకమైన మొగ్గ లేదా అంకురం. కన్నెవేడిపిట్ట వి. కన్నియ లేడి, ఒక రకం పక్షి. కన్నెసరులు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.

కన్నె[2] వి. 1. జనపనారతో అల్లిన వలలో తాళ్ళమధ్య సందు; 2. సరిచెయ్యటానికి చాపిన ఉన్ని పడుగులో చివర ఎక్కించిన కర్రను రాగోల కట్టెను కలిపే వంకర ఇనప ఊచ; 3. సరిచెయ్యటానికిగానీ, నేత నెయ్యటానికి గానీ, చాపిన ఉన్నిపడుగు బిగింపుకు తలగోలకు తగిలించిన తాడు; 4. నలువ, బంధం.

క. కణ్ణి. తాడు, మోకు, కార్డు, మెడతాడు. కణి. ముడి, కట్టు; కొడ. కెణి. జంతువులను పట్టే బోను; తు. కణ్ణి. పేచు, నార; త. కన్ని. వల, బోను, ముడి, కట్టు,

పూలదండ, తాడు. కన్ను (కన్ని-). బిగించటం, కలపటం; కో. కయ్‌ణ. కాడిమానుకు ఎద్దుకు కట్టే తాడు.

కన్నెదుగు చూ. కన్ను[1].

కన్నెము వి. కోడిగుండెకాయ.

క. కణ్ణె, కరణె. ముద్ద, గడ్డ, పిండం, మాంసం; త. కరటు. కాలియొక్క చీలమండ, కొయ్యముడి; మ. కరణ. చెరకు కణుపు.

కన్నెముకాయ వి. కోడిగుండెకాయ.

కన్నెఱ చూ. కన్ను[1].

కన్నెఱచేయు చూ. కన్ను[1].

కన్నెఱుఁగు చూ. కన్ను[1].

కన్నెఱ్ఱ చూ. కన్ను[1].

కన్నెఱ్ఱచేయు చూ. కన్ను[1].

కన్నేయు చూ. కన్ను[1].

కన్నౌజ రూ.చూ. కన్నౌజీ. వి. కన్యాకుబ్జ దేశం.

కన్నౌజా రూ.చూ. కన్నౌజీ. వి. కన్యాకుబ్జ దేశం.

కన్నౌజి రూ.చూ. కన్నౌజీ. వి. కన్యాకుబ్జ దేశం.

కన్నౌజీ రూ. కన్నౌజ, కన్నౌజా, కన్నౌజి, కన్నోజా. వి. కన్యాకుబ్జ దేశం.

సం. కన్యాకుబ్జ-; ప్రా. కన్నౌజ్జ-; నే. కన్నౌజ; హిందుస్థానంలో ఒక పట్టణం పేరు.

క. కన్నౌజు, కన్నౌజె. ఉత్తర దేశంలోని ఒక పట్టణం పేరు.

< ప్రా. కన్నౌజ్జ-.

కన్నోజా రూ.చూ. కన్నౌజీ. కన్యాకుబ్జ దేశ భాష.

కన్నోట చూ. కన్ను[1].

కన్నోటు చూ. కన్ను[1].

కన్నోడు[1] చూ. కన్ను[1].

కన్నోడు[2] వి. 1. ఏవడో ఒకడు; 2. ప్రతివాడు.

కన్పట్టు చూ. కను[1].

కన్పడు చూ. కనుపడు.

కన్పండువు చూ. కను[1].

కన్పఱచు చూ. కను[2].

కన్పావ చూ. కను[1].

కన్పించు చూ. కను[1].

కన్పు రూ.చూ. కనుపు. వి. వెదురు, చెరకు మొ. వాటి కణుపు. గ్రంథి. పర్వం. దశా. 7.129.

కన్పుకొట్టు రూ.చూ. కనుపుగొట్టు. స.క్రి. 1. చంపు; 2. ఖండించు; 3. పోగొట్టు; 4. చిందర వందరచేయు; 5. క్షోభపెట్టు. కన్పుగొట్టు (-కొట్టు) రూ.చూ. కనుపుగొట్టు. స.క్రి. 1. చంపు; 2. ఖండించు; 3. పోగొట్టు; 4. చిందర వందరచేయు; 5. క్షోభపెట్టు. కన్పులగుండ్లు రూ.చూ. కనుపులగుండ్లు. వి.బ.వ. మణిమయ హస్త భూషణం. కన్పులవిలుకాఁడు రూ.చూ. కనుపులవిలుకాఁడు. వి. మన్మథుడు. కన్పులవిలుతుఁడు రూ.చూ. కనుపుల విలుతుఁడు. వి. మన్మథుడు. కన్పులవిల్కాడు రూ.చూ. కనుపులవిలుకాఁడు. వి. మన్మథుడు. కన్పులవిల్తుఁడు రూ. చూ. కనుపులవిలుతుఁడు. వి. మన్మథుడు.

కన్పులి చూ. కను[1].

కన్పెట్టు చూ. కను[1].

కన్పెంటి చూ. కను[1].

కన్పొట్టి చూ. కను[1].

కన్‌ఫ-ర్మేషన్ వి. స్థిరీకరించటం.

ఇం. *Conformation*. స్థిరపరచటం, రూఢిచేయటం.

< ఇం. Conformation.

కన్ఫె-సర్ వి. 1. పాపం స్వీకరించేవాడు; 2. పాపవిమోచకుడైన క్రైస్తవ మతగురువు; 3. మతగురువు దగ్గర తన పాపాన్ని ఒప్పుకునేవాడు.

ఇం. *Confessor*. పాపవిమోచన చేసే క్రైస్తవ మతగురువు.

< ఇం. Confessor.

కన్బెంటి చూ. కను[1].

కన్బొమ చూ. కను[1].

కన్బ్రామ్ము చూ. కను[1].

కన్మరి రూ.చూ. కనుమరి. వి. ఇనప్పని చేసేవాడు, కమ్మరి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1384.

కన్మఱుఁగు చూ. కను[1].

కన్మఱువు చూ. కను[1].

కన్మఱువుసేయు చూ. కను[1].

కన్మాటు చూ. కను[1].

కన్మూయు చూ. కను[1].

కన్మూసిగంత చూ. కను[1].

కన్మొగుచు చూ. కను[1].

కన్మొఱఁగు చూ. కను[1].

కన్మోడుచు చూ. కను[1].

కన్మోడ్చు చూ. కను[1].

కన్మోడ్పు చూ. కను[1].

కన్మోనము చూ. కను[1].

కన్య విశే. కొత్త. రాఘవ. 1.7.

సం. కన్యా. బాలికా, కుమారి.

< సం. కన్యా (అర్థవిపరి.).

కన్రెప్ప చూ. కను[1].

కన్వీనరు వి సమావేశ కర్త.

ఇం. *Convener*. సభకూర్చేవాడు.

< ఇం. Convener.

కన్వెలుఁగు చూ. కను[1].

కన్వేగు చూ. కను[1].

కన్సర్వెన్సి వి. రక్షణం, కాపాడటం.

ఇం. *Conservancy*. రేవు మొదలగువాటిని అదుపులో పెట్టే కమిషన్.

< ఇం. Conservancy.

కన్‌సైన్‌మెంట్ వి. బట్వాడా కావలసిన వస్తు సముదాయం.

ఇం. *Consignment*. వస్తువుల బట్వాడా.

< ఇం. Consignment.

కన్సోగ చూ. కను[1].

కన్‌స్ట్రక్షన్ వి. 1. నిర్మాణం, కట్టడం; 2. వాక్యాన్వయం.

ఇం. *Construction*. నిర్మాణం, వాక్యాన్వయం.

<ఇం. Construction.

**కవచెట్టు** వి. ఒకరకం చెట్టు.

**కపాటు** రూ.చూ. కపాతు. వి. విత్తులు తీసినకోడి.

**కపాదు** రూ. కపాది, కబాడి[1]. వి. ఎద్దుమీదగాని, గొడ్డు ఆవు మీదగాని మోటగా రెండుపక్కలా వేసేబరువు.

**కపాడివాడు** రూ. కపాదివాడు. వి. కపాడి అమ్మి జీవించే వాడు.

**కపాతు** రూ. కపాటు, కబాతు. వి. విత్తులుతీసినకోడె, కచ్చి తీసినకోడె.

దచ్చి. *కపాదోర్, కపాదురా*. కచ్చితీయడం; పో. *కపాదు*. కచ్చి (విత్తు) తీయడం; *కఫార్*. కచ్చితీయు; స్పా. *కపాదోర్*.

<పో. కపాదు.

**కపాది** రూ. చూ. కపాదు. వి. ఎద్దుమీదగాని, గొడ్డుఆవుమీద గాని మోటగా రెండుపక్కలా వేసే బరువు.

**కపాదివాడు** రూ.చూ. కపాడివాడు. వి. కపాది అమ్మి జీవించేవాడు.

**కపాయి** రూ.చూ. కబాయి వి. తురకలు తొడిగే ఒకబొక్కా.

**కపారం** రూ.చూ. కొపారం. వి. పెంకు కప్పక ముందున్న కప్పుచట్రం.

**కపాలు** వి. ఒకానొక జెట్టి పెనకువ, కన్నాతు, మల్లవిద్యలో ఒకానొక వినురు.

**కపితాను** రూ. కప్తాను. వి. సేనాధిపతి, అధికారి, వ్యవహర్త. ఆనంద. 59.

దచ్చి. *కప్టేన్*. యజమాని; పో. *కప్పితాను*. దళవాయి, పడవాలు; ఫ్రె. *కపీతన్*. ముఖ్యుడు, ఏలిక, యజమాని; స్పా. *కాపీతాన్*. దళవాయి; *కాపీతానియా*. దళవాయితనం.

<పో. కప్పితాను.

**కపిల** రూ. కపిలి, కపిలె[1], కమిల. వి. ఎద్దులనుకట్టి బావినుంచి పొలాలకు నీరుతోడే సాధనం, మోట, కపిలి, కపిలె.

క. *కపలి, కపలె, కపిలె, కవిలె, కపులె*. మోట; త. *కపిలై*.

**కపిలబావి** వి. 1. నీళ్ళుతోడటానికి కపిల అమర్చినబావి; 2. పొలాలకు పట్టడానికి నీళ్ళిచ్చే పెద్దలోతైనబావి, కపిల నూయి, మోటగలనూయి. **కపిలవానం** వి. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ.

**కపిలజడలు** వి.బ.వ. మిశ్రన. కపిలవర్ణం కలిగిన జడలు. భార. ఆది. 4.254.

సం. కపిల - +జడలు.

**కపిలపొడిచెట్టు** వి. మిశ్రన. కుంకుమచెట్టు, వంటచెరకుగా ఉపయోగపడే ఒకరకం చెట్టు. దీనినుంచి ఎర్రనిపొడి తయారుచేస్తారు. (Mallotesphillipinensis).

**కపిలవన్నె** వి. మిశ్రన. 1. నారింజపండురంగు; 2. పసుప్పచ్చరంగు; 3. బీరపువ్వు, పసుపువన్నెలు కలిసిన పట్టు రంగు; 4. ఎరుపులోని నలుపువన్నె.

నే. *కపిల్*. బూడిదరంగు.

**కపిలనన్నం** వి. మిశ్రన. వడ్లునల్లగానూ, బియ్యం తెల్లగాను ఉండే ఒక రకం వడ్లు.

**కపిలి** రూ.చూ. కపిల. వి. మోట, కపిల.

**కపిలె[1]** రూ.చూ. కపిల. వి. ఎద్దులను కట్టిబావినుంచి పొలాలకు నీరుతోడేసాధనం.

**కపిలెగుండు** వి. మోటబొక్కెన మూతికిఉండే వలయం. **కపిలెతోలు** న.క్రి. మోటతోలు. **కపిలెబిళ్ళ** వి. మోటతోడటానికి ఉపయోగించే కొయ్యచక్రం, గిలకచక్రం.

**కపిలె[2]** వి. తూనికరాయి. వరాహ. 8.89.

**కపిళవేళ** వి. మధ్యాహ్నం మూడుగంటలసమయం.

**కపురపుటనంటి** చూ. కపురము[1].

**కపురపుబాగలు** చూ. కపురము[1].

**కపురబాగాలు** చూ. కవురము[1].

**కపురమద్ది** రూ.చూ. కప్పురమద్ది. వి. నారింజరంగు కలిగిగట్టిగా ఉండే కాండకలిగిన ఒకచెట్టు. దీని కాండంతరిమెన పెట్టడానికి ఉపయుక్తం. (Eacsalpinia sappam).

**కపురము[1]** రూ.చూ. కప్పురము. వి. కర్పూరం. వసు. 2.116.

**కపురపుటనంటి** రూ.చూ. కప్పురపుటనంటి. వి. నప్తపర్ణం, ఏడాకులనటి. **కపురపుబాగలు** రూ. కప్పురపుబాగాలు. వి.బ.వ. తావిపోకపలుకులు. రాజ. 1.134. **కపురపుబాగాలు** రూ.చూ. కప్పురపుబాగలు. వి.బ.వ. తావిపోకపలుకులు. శుక. 1.32. **కపురపీడెము** రూ.చూ. కప్పురపీడియము. వి. కర్పూరం కోడి తాంబులం. వైజ. 3.72. **కపురసిల** వి. మందుకుపయోగించే ఒకరకం దినుసు.

**కపురము[2]** రూ.చూ. కప్పురము[2]. వి. జపానునుండి దిగుమతి చేయబడి తమిళదేశంలో లభించే ఒకచెట్టు (Einnamonum camphora).

**కపురపీడెము** చూ. కపురము[1].

**కపురసిల** చూ. కపురము[1].

**కపురు** వి. సొగసు, శోభ, కాంతి. శుక. 2.456.

**కపుజాలు** వి.బ.వ. గర్భగుడిపైఉన్న రాతిదూలాలు.

<కప్పు[1]+జాలు.

**కపేలా** వి. పట్టుదారానికి వేసే నారింజరంగు.

**కపేలాపిండి** వి. పట్టుదారానికి నారింజరంగు వేయటానికి వాడేపొడి.

**కపోదా** వి. 1. పెద్దవిల్లు, గొప్పవిల్లు. ఆం.భా. 2.212; 2. శిథిలధనువు.

పా. *కబాద*-. నేర్చుకోడానికి ఉపయోగపడేసాదావిల్లు.

**కప్చా** రూ.చూ. కమీజు. వి. బొక్కా.

**కప్తాను** రూ.చూ. కపితాను. వి. సేనాని, అధికారి, వ్యవహర్త, ఓడకెప్టెను.

**కప్నెరబోకి** వి. పొలికుంత.

**కప్ప** వి. మండూకం, భేకం. బెకబెకమనే ఒక రకం ఉభయచరం. కు.నం. 6.57.

క. *కప్పె*. కప్ప; కొడ. *కప్పె*. కప్ప; కోరు. *కెపక్*. కప్ప, గోదురుకప్ప; తు. *కప్పె*. కప్ప; తొ. *కొపిన్*. కప్ప; గోం. *కప్పె*. కప్ప; కొండ. *కపోకి*. కప్ప; కువి. *కప్పు*. కప్ప.

**కప్పుకాటు** వి. అసంభవం. రుక్మాం. 5.28. వేంక.అం. 72. వ్యా. కప్పుకాటువేయటం జరగదు, కాబట్టి అసంభవం అనే అర్థం, 'కప్పుకాటు' కు వచ్చివుంటుంది. **కప్పుకురువు** రూ.చూ. కప్పుకుఱువు. వి. అరికాలులో లేచే పొరలకురువు. **కప్పుకుఱువు** రూ. కప్పుకురువు. వి. వేడివల్ల అరికాలులో లేచే బొబ్బ. **కప్పగంతులాట** వి. క్రీడాభేదం, కప్పలా గెంతుతూ ఆడే ఒకరకం ఆట. **కప్పగంతులు** వి. బ.వ. కప్ప గంతులువేసేవిధంగా ఎగిరే బాణసంచా విశేషం. **కప్పుగుల్ల** వి. అరికాలులో లేచిన పొరలకురువు. **కప్పచిప్ప** వి. నీళ్లలో దొరికే గుల్ల, శంబూకం, ఆలిచిప్ప. ఆం.భా. 1.161. **కప్పడుగు** చూ. కప్పలకావడి. వి. వానరాకపోతే చేసే కప్పవంబరం. < కప్పు[1]+అడుగు. **కప్పతల్లి** చూ. కప్పలకావడి. వి. వానరాకపోతే చేసే సంబరం. **కప్పతేలు** వి. పెద్దతేలు, మండ్రగబ్బ. కప్పలాఉండే తేలు. **కప్పతోక** వి. మట్ట (మొదలు) వెడల్పుగా ఉండేతోక. **కప్పదాటు** వి. 1. వరసగా చేయవలసిన వాటిని నష్టమైనవాటిని మధ్యవదలి వేయడం; 2. పనిని మధ్యలోవదలి మరల ప్రారంభించటం; 3. చేసిన నేరం చేయలేదనటానికి చూపేతప్పుడుకారణం. **కప్పనాగర** రూ.చూ. కప్పనాగురు. వి. నాముజబ్బు. **కప్పనాగురు** రూ. కప్పనాగర, కప్పనామర, కప్పనావురు. వి. చిరుకప్పకాటువల్ల పశువులకు కలిగే విరేచన రోగం. నవనాథ. 7.140. **కప్పనాచు[1]** వి. నాచులో ఒకరకం. **కప్పనాచు[2]** వి. వరితెగులు. **కప్పనామర** రూ.చూ. కప్ప నాగురు. వి. నాముజబ్బులక్షణం. **కప్పనాలిక** వి. నాలిక కింద బొబ్బలు లేవటం. **కప్పనావురు** రూ.చూ. కప్ప నాగురు. వి. చిరుకప్పకాటువల్ల పశువులకు వచ్చే విరేచన రోగం. హరి.పూ. 6.45. **కప్పపొక్కు** వి. అరికాలిలో లేచే పొక్కు. **కప్పయెలుగుపాము** రూ.చూ. కప్పెలుఁగుఁ బాము. వి. 1. కప్పగొంతుతో అరిచేపాము ; 2. కృత్రిమ స్వభావం కలవాడు. **కప్పయెలుఁగుఁబాము** రూ.చూ. కప్పెలుగుఁబాము, కప్పెలుగుఁబాము. వి. 1. కప్ప గొంతుతో అరిచేపాము ; 2. కృత్రిమస్వభావం కలవాడు. **కప్పరతి** వి. కప్పరొదగడ్డి (Panicum colonum). **కప్పరద్దు** వి. కప్పరొదగడ్డి (Panicum colonum). **కప్పలకావడి** వి. వానరాకపోతే కప్పల్ని కావడిలో వేసి చేసుకొనే సంబరం. **కప్పలదేవర** చూ. కప్పలకావడి. వి. వానరాకపోతే చేసే కప్పసంబరం. **కప్పవకరలు** వి.బ.వ. ఒకరకం వస్త్రం. **కప్పసంబరము** చూ. కప్పలకావడి. వి. వాన రాకపోతే చేసే కప్పసంబరం. **కప్పెలుఁగుఁబాము** రూ. కప్ప యెలుగుపాము, కప్పయెలుఁగుఁబాము. వి. కప్పఅరుపు అరిచేపాము, వంచకుడు. భార. ద్రోణ. 3.107 (ఇది గోముఖవ్యాఘ్రం వంటిది). <కప్పు[1]+ఎలుఁగు+పాము.

**కప్పు[2]** వి. తాళపుబుర్ర, కప్పుతాళం.

మరా. కపా, కప్పా. తాళంకప్ప.

<మరా. కప్పా.

**కప్పుతాళము** వి. తాళంకప్ప, ముద్దబీగం.

**కప్పు[3]** వి. యోని.

క. కప్పు, కప్పు, కప్పల్. నేలలోని బొరియ, గుంట; కప్పు. తప్పు ; కర్పు, కంత, గుంట.

**కప్పచెట్టు** వి. కొండజువ్విచెట్టు. మొదట నిలువుగా పెరిగి తర్వాత ఇతరచెట్లమీద వాలి ఆ చెట్లను చంపివేసే నిరుప యోగకరమైన ఒకచెట్టు. (Ficus gibbosa).

**కప్పటము[1]** వి. ముప్పైరెండు ఆయుధాల్లో ఒకటి.

**కప్పటము[2]** రూ. చూ. కప్పడము. చూ. కప్పు. వి. కప్పు, మూత.

**కప్పడము** రూ. కప్పటము[2]. చూ. కప్పు. 1. చిరిగినబట్ట, జీర్ణ వస్త్రం. భార.ఆది. 7.225 ; 2. స్త్రీ కట్టుకోక. పాండు. 2.35 ; 3. కట్టుగుడ్డ, వస్త్రం, బట్ట. 4. మాసినబట్ట, సన్యా సుల కాటి.

సం. కర్పట. అతుకులువేసినవస్త్రం ; ప్రా. కప్పడ్, కప్పడ. వస్త్రం, జీర్ణవస్త్రం ; మహా. కప్పడిఓ. చిరిగిన బట్టలు కట్టినవాడు, బైరాగి, కప్పట. మురికిగుడ్డ, చిరిగిన గుడ్డ ; అమా. కప్పడి ; హిం. కపడా, కప్పర్ ; సిం. కపిదా. వస్త్రం ; మరా. కపడా.

క. కపడ, కప్పడ ; తు. కప్పడ, కప్పడి, కప్పడొ. వస్త్రం, పీలికలైనమురికి గుడ్డ ; త. కప్పడం.

<ప్రా. కప్పడ-.

**కప్పడీఁడు** వి. దానచిహ్నంగా కట్టిన వస్త్రాలుగల భక్తుడు, దాసరి. పండి.చ. 5.391.

**కప్పడి** చూ. కప్పడము. వి. బైరాగి. బసవ. 87.

సం. కారుటిక. యాత్రికుడు ; ప్రా. కప్పడిఅ. భిక్షు కుడు, బికారి ; మహా. కప్పడిఓ. బైరాగి : మరా. కాపడి. భిక్షుకుడు ;

క. కప్పడిగ.

<ప్రా. కప్పడిఅ.

**కప్పడికంబళి** వి. ఒకరకం కంబళి. పండి.చ. 5.346.

**కప్పడీఁడు** చూ. కప్పడము.

**కప్పతిలఁబడు** అ.క్రి. వెలికిలబడు.

**కప్పతివ్వ** వి. లేతపసుపురంగు పూలుపూసే ఒకతీగ (I pomaea eymosa).

**కప్పతీగ[1]** వి. తీగముషిణి, లతావిషముష్టి. పొదలాగ పెరిగి ఊదారంగు పూలు, నారింజరంగు పళ్ళు కాసే ఒకతీగ (Lettsomiae elliptica).

**కప్పతీగ[2]** వి. చెట్లమీద పెరిగి పచ్చని పూలుపూసే ఒకతీగ (Tiliacora racemosa).

**కప్పవాగులు** చూ. కప్పు[1]. వి. బ. వ. మరణానికి కారణమైన గొంతుజబ్బు.

**కప్పబండ** వి. దర్వాజా ఉత్తరాసిమీద పరిచే బండ.

**కప్పము** వి. 1. పన్ను. భార. ఆది. 1.7 ; 2. కానుక. భార. అను. 3.44.

సం. కల్ప. విధి, ధర్మం, అధికారం, సంప్రదాయం ; ప్రా. కప్ప-. గ్రహణ యోగ్యం, ఉచితం, అర్హం, సంప్రదాయం ; అ.మా. కప్పాయ. పన్ను ; పా. కప్ప.

క. తు. కప్ప. పన్ను ; త. మ. కప్ప. పన్ను, నివేదనం.

<ప్రా. కప్ప-.

**కప్పముకట్టు** స.క్రి. కప్పం చెల్లించు.

**కవ్వరచీకటి** రూ. కప్పిరచీకటి. వి. తెల్లబడుతున్న వేగు చీకటి.
**కవ్వరపడు** చూ. కవ్వరము[1].
**కవ్వరపఱుచు** చూ. కవ్వరము[1].
**కవ్వరపాటు** చూ. కవ్వరము[1].
**కవ్వరపోలు** వి. గాజుగుడ్డ.
**కవ్వరము**[1] వి. సంభ్రమం, తొట్రుపాటు.
క. కవ్వరె, కవళె. కలవరం, అల్లకల్లోలం.
కవ్వరపడు (కవ్వరము+పడు) అ.క్రి. తత్తరపడు, కొందరపడు, తొట్రుపడు. జైమినీ. భా. 5.193. కవ్వరపఱుచు స.క్రి. కలవరపెట్టు. కవ్వరపాటు (కవ్వరపడు +టు). చూ. కవ్వరపడు. వి. సంభ్రమం, తొట్రుపాటు. భాగ. 6.332.
**కవ్వరము**[2] వి. చిత్రవర్ణం.
సం. కర్బుర-. చిత్రవర్ణం; ప్రా. కబ్బుర-.
< ప్రా. కబ్బుర-.
**కప్పిరచీకటి** రూ.చూ. కవ్వర చీకటి. వి. తెల్లబడుతున్న వేగుచీకటి.
**కవ్వరి**[1] వి. ఇంటికవ్వుపైనున్న మొనదేలిన భాగం.
**కవ్వరి**[2] రూ.చూ. కవ్వలి. వి. ఓడ, నౌకాభేదం.
**కవ్వరిశుద్ధి** వి. మందుకు సంబంధించిన ముడిపదార్థాన్ని శుద్ధి చేసే విధానం, కవ్వరిని చూర్ణంచేసి గుడ్డలో మూటకట్టి నరమూత్రంతో ఏడుజాములు డోలాయంత్రంలో వండిన, గోమూత్రాన్ని రెండుజాములు గరిటెలోపోసి నేతితో ఏడుపొంగులు వచ్చేట్లు వండితే కవ్వరిశుద్ధి ఔతుంది.
**కవ్వరుతాళ్ళు** వి.బ.వ. మరమగ్గానికి డాబీ అమర్చి డిజైన్లు నేసేటప్పుడు అంచులకు కట్టినతాళ్ళు.
**కవ్వరుబండి** వి. బరువుకట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్య గిలక.
**కవ్వలి** రూ. కవ్వరి[2]. వి. ఓడ, నౌక. హర. 1.27.
తు. కప్పలు. ఓడ, నౌకాభేదం; త. కప్పల్. ఓడ, నౌకాభేదం; మ. కప్పల్. ఓడ, నౌకాభేదం; కొ. కపాల్. ఓడ, నౌకాభేదం.
**కవ్వా** రూ.చూ. కబాయి. వి. 1. చొక్కా, అంగీ; 2. రవిక.
**కవ్వారు** చూ. కవ్వు[1].
**కవ్వాలమ్మ** చూ. కవ్వలకావడి. వి. వానరాకపోతే చేసే కవ్వ సంబరం.
**కవ్వాసు** వి. పత్తి, దూది.
సం. కార్పాస-. పత్తి, దూది; ప్రా. కప్పాస-.
< ప్రా. కప్పాస-.
**కప్పి**[1] వి. పనికిరాని సున్నం.
**కప్పి**[2] రూ. కప్పిసే, కప్పీ[1]. వి. గిరక, గిలక, యంత్రవిశేషం.
**కప్పికోల** వి. ఒక విధమైన కోల, బాణవిశేషం.
**కప్పిడు** చూ. కవ్వు[1].
**కప్పినకన్ను** చూ. కవ్వు[1].
**కప్పిపల్కు** చూ. కవ్వు[1].
**కప్పిపుచ్చు** చూ. కవ్వు[1].
**కప్పిరము** వి. కుష్ఠవ్యాధివల్ల రంగురంగులుగా ఉన్న చర్మం. ద్వి. హరిశ్చ. 3.1086.
**కప్పిరి** చూ. కవ్వు[2].
**కప్పిరిగాడు** (-కాడు). వి. పక్షివిశేషం. (Caprimulgus asiaticus)
**కప్పిరిలు** వి. బ.వ. వజానేత నేసేటప్పుడు చివర బరువులు కట్టిన అంచుల పోగులు.
కప్పిరులనంచి వి. పడుగులో అతికిన పేటుపోగులు బిర్రుగా ఉండటానికి మగ్గానికి పైన దండెంమీదనుంచి వేలాడ దీసి చివరకట్టే బరువు.
**కప్పిరులనంచి** చూ. కప్పిరిలు.
**కప్పిళ్ళు** చూ. కవ్వు[1]. వి బ.వ. ఆముకాలినతర్వాత రేవులకి పెట్టే మూతలు. కుంపట్లు.
**కప్పిసే** రూ.చూ. కప్పి[3]. వి. మోట బావిగిలక.
**కప్పీ**[1] రూ.చూ. కప్పి[2]. గిలక, గిరక.
**కప్పీ**[2] వి. బండి కుండలో బిగించిన ఆకులను పట్టివుండే గుండ్రటి కొయ్యచట్రం.
**కప్పీ**[3] కర్రకు దవడలను అతికిన చోటు.
**కవ్వు**[1] అ.క్రి. పర్వు, వ్యాపించు, కమ్ము. భార.ఆది. 2.22. స.క్రి. 1 బంధించు, మూయు, దాచు. భార. ఆది. 8.305; 2. ఆచ్ఛాదించు, మరుగుపరచు, గోపనం చేయు, కు.సం. 5.605. వి. 1. ఆచ్ఛాదనం దశా. 8.33; 2. ఇంటి పైకవ్వు. అచ్చరా. బాల. 47.
క. కప్పు. మరుగుపరుచు, వ్యాపించు, కమ్ము; *కవి*. బంధించు, వ్యాపించు; *కవచు, కవియు, కవ్వు*. వ్యాపించు, బంధించు; *గవసణి, గవసణిగె*. మరుగు పరచే పెట్టె; *గవసణిసు*; తు. కబియుని. చుట్టుముట్టు, వ్యాపించు; *గవసణిగె*. పిడేలుయొక్క పెట్టె; త. కప్పు (కప్పి-). వ్యాపించు; కవి. చుట్టు, వ్యాపించు, బంధించు, చుట్టుముట్టు; *కవికై*. వంచు, గొడుగు; *కవిప్పు*. మూత, చాందినీ, వితానం, గొడుగు; *కవిచత్తై*. అట్టకాగితం, మూత, కత్తిపెట్టుకొనే ఒర; పొది. కమ్మ (కమ్మై) మేఘా వృతం, మబ్బు, విచారకరమైన, కమ్మల్. మబ్బు, మేఘా వృతం, మసక; మ. కప్పుక, కమ్ముక. మూయు, వ్యాపించు; *కవియుక*. పొర్లు, అధిగమించు, అతిశయించు. *కవియుక*. వ్యాపించు; *కవియన్*. అట్టగలేబు; *కవిచ్చల్*, *కమిచ్చల్*. అక్రమమైన అక్రమణ, వరదవెల్లువ; కొ. కొఫ్క్. అధికంగాఉండు, గొప్పసంఖ్యలోవచ్చు; కొఫి. గొప్పసంఖ్యలో చుట్టుముట్టు, అన్నివైపుల; కో. కవ్వ్. గుడ్డతోకప్పు; కువి. కఫ, కఫనై. బయటఅంచు; పర్జీ. కప్ప్. మూయు, వ్యాపించు; కురు. ఖప్నా. ఖచ్చితంగా మూయు, కలియు; కప్ప్. వ్యాపింపజేయు; క్మప్. దాగుకొను; ఖప్. దాగుకొను. బ్రా. కప్ప్. కప్పులేని.
సం. కవచ- కవచం, లోరవిశె.
<మూ. ద్రా. *కప్-
కప్పిడు స.క్రి. దాచు, కప్పిపుచ్చు. శేష.ధ. 4.38. కప్పినకన్ను వి. మూసుకుపోయిన కన్ను. పండి.చ. 4.108. కప్పిపల్కు అ.క్రి. దాచిమాట్లాడు, ప్రచ్ఛన్నంగా పలుకు. కు.సం. 5.126. కప్పిపుచ్చు స.క్రి. మరుగుపరుచు, దాచు.

శృం.నై. 1.84, కాశీ. 4.90. కవ్వుకాలవ వి. తోటచుట్టూ పారే కాలవ. కవ్వుకొండ వి. సారాయి బట్టీలో ఒడ్డు బుడ్డికి పెట్టిన పెద్దరంధ్రానికి సరిపడేటట్టు పెట్టే చిన్న మట్టిపాత్ర, కుమ్మరి బిందె. కవ్వుకొను అ.క్రి. కమ్ము, వ్యాపించు. భార. విరా. 2.36; స.క్రి. 1. ఆచ్ఛాదించుకొను. కు.సం. 11.142 ; 2. ఆచ్ఛాదించు, మరుగు పరచు. సరస. 3.5. కవ్వుచెక్క వి. మగ్గం సొరుగుమీద బిగించిన చెక్క. కవ్వుడు వి. ఆచ్ఛాదనం, కప్పు. కవ్వుడుగాడు వి. పెంకు కప్పే పనివాడు. కవ్వుడుబద్ద వి. ఆకుకప్పుమీది మిట్ట వల్లాలు సరిచేసే చెక్కసాధనం. కవ్వుదెంచు (-తెంచు) అ.క్రి. కమ్ము. భార.ద్రోణ. 1.89. కవ్వువడు రూ. కప్పు వడు. అ.క్రి. 1. కప్పబడు ; 2. మరుగుపడు. కవ్వువరాట వి. ఇంటికప్పు వేయడంలో దంతులకు మధ్యబిగించే పల్చనిచెక్క. కవ్వువలక చూ. కప్పుడుబద్ద. వి. ఆకుకప్పు మీద మిట్టవల్లాలు సరిచేసే చెక్కసాధనం. కవ్వుపెండె వి. ఇంటికప్పున వల్లలతో కట్టేకట్టు. కవ్వుబండ వి. 1. అడి బండ, మోటబావిలోపల వైపునున్న నూదిమాకులమీద అడ్డంగావేసిన బండ లేక చాపరాయి ; 2. ఇంటికప్పుకువాడే రాయి. కవ్వుబల్ల వి. ద్వారం మీద గొడుగుబల్ల తన్నుబల్ల లకు నడుమఉండే పలక. కవ్వురాయి[1] వి. 1. ఇంటికప్పు నకు వాడేరాయి ; 2. దర్వాజా ఉత్తరాసిమీద పరిచే బండ ; 3. శంకువుమీదగాని, ఇటికబట్టీమీదగాని మూతగాపెట్టే పెద్దబండ. కవ్వులు వి.బ.వ. ఏతానికి రెండువైపుల అమర్చే పలకలవంటి కొయ్యలు. కవ్వువడు రూ.చూ. కప్పువడు. కవ్వువెట్టు(-పెట్టు) అ.క్రి. పోరాడటంలో దెబ్బతీయటానికి పొంచినిలుచు. మను. 4.28. కవ్వువేసినట్లు అవ్య. ఊపిరి లేకుండా ఉన్నట్లు. కవ్వుసట్టి వి. పెళ్ళిపందిరికి ఉట్టికట్టి వేలాడగట్టిన మట్టిపాత్ర.

కవ్వు[2] వి. 1. చీకటి. హ.న. 4.5 ; 2. దంతక్షతం. హ.న. 4.8 ; 3. నలుపు. ఆం.భా. 1.108 ; 4. పళ్ళకు పూసే మందుపొడి; విణ. నీలం, నల్లని. ఉత్త.రా. 4.155.

పో.చూ. క. కప్పు. చేదు, కఠినం, నల్లదనంకోసం తలవెంట్రుకలకు వాడే మందు ; త. కఱుప్పు.

కప్పారు (కప్పు+ఆరు) అ.క్రి. నల్లబడు. కు.సం. 3.267. కప్పిరి వి. 1. నలుపు. కు.సం. 10.38 ; 2. కొంచెంపాటి చీకటి. విణ. కొంచెం చీకటిగాఉన్న. కవ్వుకెంపుపాళ్ళు వి.బ.వ. రక్తవర్ణంకెంపులు. కవ్వుఁగుత్తుక పులుగు రూ.చూ. కప్పుఁగుత్తుకపుల్గు. వి. నీలకంఠం. నెమలి. కవ్వుఁగుత్తుకపుల్గు రూ. కప్పుఁగుత్తుకపులుగు. వి. నీలకంఠం, నెమలి. అచ్చ. రా. కిష్కిం. 69. కవ్వుఁగుత్తుక వాఁడు వి. నీలకంఠుడు, శితికంఠుడు, శివుడు. అచ్చ. రా. బాల. 18. కవ్వుచీర వి. పోకరంగుచీర. కవ్వుటిల్లాలు వి. కాళి. వేంక.అం. 1.7. వ్యు. నల్లని స్త్రీ. కవ్వుటెరవుదారి వి. అగ్ని, కృష్ణవర్త్మ. కవ్వుటేటిగొంగ వి. బలరాముడు. వేంక. అం. 1.21. వ్యు. యమున (నల్లని నది)కు శత్రువు. కవ్వుటేఱు వి. కృష్ణానది, యమునానది. వ్యు. నల్లనిది. కవ్వుతైదువ వి. కాళి, పార్వతి. ప్రబంధ. 160. కవ్వుతైదువ పెనిమిటి రూ. కప్పుతైదువపెన్మిటి. వి. శివుడు. కవ్వుతైదువపెన్మిటి రూ.చూ. కప్పుతైదువపెనిమిటి. వి. శివుడు. కవ్వుతైదువరాచపెంచు వి. శివుడు. కవ్వుతెఱవ వి. పార్వతి. వ్యు. నల్లని స్త్రీ. కవ్వుతెఱవమేటికొడుకు వి. కుమారస్వామి. కవ్వుదేవర వి. కృష్ణుడు, విష్ణువు, రాముడు, నల్లనయ్య. కవ్వుదేవరయన్న వి. బలరాముడు. కృష్ణుడిఅన్న. కవ్వునీలి వి. ముదురు నీలిరంగు. కవ్వుఁదెరువరి (-తెరువరి) వి. అగ్ని, కృష్ణవర్త్మ. కవ్వుఁదెరువుజాడ (-తెరువుజాడ) రూ.చూ. కప్పుఁదెరువుజాణ. వి. అగ్ని. కృష్ణవర్త్మ. కవ్వుఁదెరువుజాణ (-తెరువుజాణ) రూ. కప్పుఁదెరువుజాడ. వి. కృష్ణవర్త్మ, అగ్ని. అచ్చ.రా. సుందర. 166. కవ్వుఁదెరువుదారి (-తెరువుదారి) వి. అగ్ని. కవ్వుఁద్రోవదారి (-త్రోవదారి) వి. అగ్ని. సమీర. 2.105. కవ్వుఁద్రోవరి (-త్రోవరి) వి. కృష్ణవర్త్మ, అగ్ని. సాం.ని. 1.12. కవ్వుపచ్చ వి. లేతపచ్చ. కవ్వుమల వి. కాటుకకొండ, అంజ నాద్రి. కవ్వుముత్తైదువ వి. కాళి, గౌరి. సాం. ని. 1.6. వ్యు. సుమంగళి అయిన నల్లని స్త్రీ. కవ్వుమెడపులుగు రూ. కప్పు మెడపుల్గు. వి. నీలకంఠం, నెమలి. కవ్వుమెడపుల్గు రూ.చూ. కప్పుమెడపులుగు. వి. నీలకంఠం, నెమలి. కవ్వుమెడవలంతి వి. శివుడు, నీలకంఠుడు. వ్యు. నల్లనిమెడగలవాడు. కవ్వు మేనిగాము వి. శనిగ్రహం. వ్యు. నల్లనిమేనుకలగ్రహం. కవ్వుమేనిదంట వి. శని. కవ్వురంగు వి. నలుపు, ఎరుపు కలిసిన ఒక రకంరంగు. కవ్వురా రూ.చూ. కప్పురాయి[2]. వి. నీలమణి, ఇంద్రనీలమణి, పుల్లంటురాయి. కవ్వురాయి[2] రూ. కప్పురా, కప్పుఱా, కప్పుఱాయి. వి. నీలమణి, ఇంద్రనీల మణి. ఆం.భా. 2.278. కవ్వుఱా రూ.చూ. కప్పురాయి[2]. వి. నీలమణి, పుల్లంటురాయి. కవ్వుఱాయి రూ.చూ. కప్పు రాయి[2]. వి. ఇంద్రనీలమణి, నీలం. ఆం.భా. 2.278. కవ్వు వన్నె వి. 1. ఒకరంగుమీద వేసిన మరొక రంగు ; 2. ఎరుపులోని మబ్బువన్నె ; 3. కొంచెం నలుపువన్నె. కవ్వు వేయు అ.క్రి. 1. పశువులు జబ్బుచేత నలుపెక్కు ; 2. జీవకళ తగ్గు. వి. 1. జలుబులుపోవడానికై చేసుకొనే చూర్ణం ; 2. పండ్లకు దాసెనరాసి వేసికొనిన రంగు. కవ్వువేల్పు వి. కఱివేల్పు, కృష్ణుడు, విష్ణువు. కప్పెక్కు అ.క్రి. నలు పెక్కు. వరాహ. 9.100.

కవ్వు[3] వి. క్రైస్తవ పాదర్లు ధరించే ఒకరకం వస్త్రం.

డచ్చి. కాపా. దుప్పటి, పచ్చడం ; పో. కాపా. పాదిరి అంగీ ; స్పా. కాపా. దుప్పటి, పచ్చడం.

<పో. కాపా.

కవ్వు[4] వి. చెక్కలమీద ఉలితో చేసిన సన్నటి కాలవ.

కవ్వు[5] వి. మరమేకులను బిగించడానికి పనికివచ్చే సాధనం.

కవ్వు[6] వి. కూనకున్న బయటికి కనిపించే వంపు.

కవ్వు[7] చూ. కప్పు[1]. వి. ఉత్తరాసిమీద పరచిన చెక్క.

కవ్వు[8] వి. 1. చేతి అద్దకంలో మొదట అద్దిన రేఖాచిత్రం మీద వేరే రంగుతో అద్దే అచ్చు ; 2. రంగులో నిండు దనం.

కవ్వు[9] చూ. కప్పు[1]. వి. కూజాలకు పెట్టే మూత.

కవ్వు[10] వి. గిన్నె, పాత్ర.

ఇం. *Cup*. గిన్నె, పాత్ర.

< ఇం. Cup.

కవ్వగిన్నె వి. రంగు కొలుచుకొనే చిన్న పాత్ర.

కవ్వచాలు చూ. కప్పు[1]. వి. కొంగ్ర కలిపే చివర చాలు.

కవ్వడుపొయ్యి వి. కళ్ళంలో గాలి పోవడానికి ప్రత్యేకంగా ఉంచిన పొయ్యి.

కవ్వ(దట్ట) వి. దిబ్బైను అద్దకంలో అచ్చుమీద కొట్టే కర్ర.

కవ్వరగందము చూ. కప్పురము[1].

కవ్వరగంధి చూ. కప్పురము[1].

కవ్వరపుటన(టి చూ. కప్పురము[1].

కవ్వరపుబాగములు చూ. కప్పురము[1].

కవ్వరపుబెండ చూ. కప్పురము[1].

కవ్వరపువంగ చూ. కప్పురము[1].

కవ్వరబాగలు చూ. కప్పురము[1].

కవ్వరబాగాలు చూ. కప్పురము[1].

కవ్వరబోగి చూ. కప్పురము[1].

కవ్వరబోగులు చూ. కప్పురము[1].

కవ్వరభోగాలు చూ. కప్పురము[1].

కవ్వరమద్ది చూ. కప్పురము[1].

కవ్వరము[1] రూ. కవురము[1], క్రపము. వి. కర్పూరం. ఆము. 6.62.

నం. కర్పూర-.కర్పూరం; ప్రా. కప్పూర; పా. కప్పూర; కా. కపూర్; బెం. కపూర్; ఒ. కపూర; హిం. కపుర్; పం. కపూర్; సిం. కపూర్; గు. కపూర్య. పచ్చిమామిడి ముక్కలు; మరా. కాపుర్. కర్పూరం; సింహ. కపుర్; అర. కాఫూర్.

క. కప్పుర, కప్పుర, క్రప. కర్పూరం; తు. కపుర.

<ప్రా. కప్పూర -.

కవ్వరగందము వి. 1. కర్పూరంతో కలిపిన చందనం. ఉత్త.రా. 7.245; 2. కర్పూరపు వాసన. కవ్వరగంధి వి. 1. స్త్రీ, కర్పూరంవలె పరిమళించే శరీరంగల స్త్రీ. పారి. 3.11; 2. సువాసనగల ఉడుపులను ధరించిన స్త్రీ. కవ్వరపుటన(టి రూ. కవురపుటనంటి, క్రపపనంటి, క్రపపుటనంటి. వి. నప్తపర్ణం, ఏడాకుల అరటి. ఉత్త.రా. 6.24. కవ్వరపుబాగములు రూ. కవురపుబాగలు, కవురబాగాలు, కప్పురబాగాలు. వి.బ.వ. తావిపోక పలుకులు. కవ్వరపు బెండ వి. ఒకజాతి బెండ, గంధమూలం. కవ్వరపు వంగ వి. ఒకజాతి వంగ, కూట వార్తాకి. కవ్వర బాగలు రూ. కప్పురపు బాగములు. వి.బ.వ. తావిపోక పలుకులు. శకాం. 2.80. కవ్వరబాగాలు రూ. కప్పురపు బాగములు. వి.బ.వ. తావిపోక పలుకులు. కవ్వరబోగి వి. నస్య విశేషం. భీమ. 2.139. కవ్వరబోగులు రూ.చూ. కప్పురభోగాలు. వి.బ.వ. ధాన్య విశేషం, అక్కుళ్ళు. కవ్వరభోగాలు రూ. కప్పురబోగులు. వి.బ.వ. ధాన్య విశేషం. క్రీడా. వు. 54. కవ్వరమద్ది రూ. కవురమద్ది. వి. ఒక జాతి మద్ది, గట్టి, నారింజరంగు కాండం కలిగిన ఒక చెట్టు. దీని కాండం తరిమిన పెట్టడానికి ఉపయుక్తం. పి. శకు. 2.14 (Caesalpinia sappam). కవ్వరముల్రక్రోవి వి. సౌందర్యరాశి. హంస. 2.20. కవ్వరవిడియము రూ.చూ. కప్పురవీడెము. వి. కర్పూరం తోడి తాంబూలం. కవ్వర విడెము రూ.చూ. కప్పురవీడెము. వి. కర్పూరం తోడి తాంబూలం. కవ్వరపీడియము రూ.చూ. కప్పురవీడెము. వి. కర్పూరంతోడి తాంబూలం. దశా. 9.220. కవ్వర పీడెము రూ. కవురపీడెము, కప్పురవిడియము, కప్పుర విడెము, కప్పుర పీడియము, కప్పురపీడ్యము, క్రపవీడియము. క్రపపీడ్యము. వి. కర్పూరంతోడి తాంబూలం. శృం.నై. 6.141. కవ్వరపీడ్యము రూ.చూ. కప్పురవీడెము. వి. కర్పూరంతో గలిపిన తాంబూలం.

కవ్వరము[2] రూ. కవురము[2]. వి. జపానునుండి దిగుమతి చేయబడి, తమిళనాడులో లభించే ఒకచెట్టు (Einnamonum camphora).

కవ్వరవిడియము చూ. కప్పురము[1].

కవ్వరవిడెము చూ. కప్పురము[1].

కవ్వరపీడియము చూ. కప్పురము[1].

కవ్వరపీడెము చూ. కప్పురము[1].

కవ్వరపీడ్యము చూ. కప్పురము[1].

కవ్వారాలు వి.బ.వ. మేకవట్టులు.

కప్పెక్కు చూ. కప్పు[2].

కప్పెట వి. పక్షి విశేషం. సుధ. 3.194.

కప్పెర[1] వి. 1. కపాలం, పుర్రె. ఉ.హరి. 2.126; 2. భిక్షా పాత్రం. పరమ. వి. 3.280; 3. కుంపటి. శుక. 2.192; 4. జులపాలజుట్టు; 5. ప్రధానమైన పొడవు వెంట్రుకల జుట్టుకు పక్కన కంచవలె దీర్చే పొట్టివెంట్రుకల రేక; 6. దొంగగొడ్డుకు మెళ్ళోకట్టే కొయ్యగంట.

నం. కర్పర-, ఖర్పర-. పుర్రె, పాత్ర; ప్రా. కప్పరు, ఖప్పర-. కపాలం, పుర్రె; పా. కప్పర-; హిం. కర్పర్, ఖప్పర్. పుర్రె, కపాలం.

క. ఖర్పర-. పుర్రె; మ. క్రప. భిక్షాపాత్ర.

<ప్రా. కప్పర.-

కప్పెరగిన్నె వి. రాటపై బద్దలను బిగించి, వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప. కప్పెరచాప వి. వానకు తడవకుండా ఉపయోగించే గొడుగువంటి చాప.

కప్పెర[2] వి. దయ్యంసోకుడు, గ్రహదోషం. మొ. వాటి నివారణకు వాడే మట్టి పాత్ర.

కప్పెరచీకటి రూ.చూ. కప్పురచీకటి. వి. తెల్లబరచొచ్చిన వేగు చీకటి.

కప్పెలు(గు(బాము చూ. కప్పు[1].

కప్పొడి వి. కూజాలు మొ. నవి మెరిసేటట్లు చేయడానికి వాడే పొడి.

క్రపపన(టి చూ. క్రపము.

క్రపపుటన(టి చూ. క్రపము.

క్రపము రూ.చూ. కప్పురము[1]. వి. కప్పురం. ఆము. 1.71.

క్రపపనంటి రూ.చూ. కప్పురపుటనంటి. వి. నప్తపర్ణి, ఏడాకుల అరటి. క్రపపుటన(టి రూ.చూ. కప్పురపుటనంటి. వి. నప్తపర్ణి, ఏడాకులరటి. క్రపములక వి. కప్పురపువంగ. క్రపపీడియము రూ.చూ. కప్పురవీడెము. వి. కర్పూరంతో కూడిన తాంబూలం. క్రపపీడ్యము రూ.చూ. కప్పురవీడెము.

వి. కప్పురంతోకూడిన తాంబూలం.
కప్రపీడియము చూ. కప్రము.
కప్రపీడ్యము చూ. కప్రము.
కప్సులు వి.బ.వ. 1. చొక్కాచేతికి మణికట్టువద్ద ఉండే పట్టీలు; 2. చొక్కాచేతికి మణికట్టువద్ద పట్టీలకు పెట్టుకొనే గుండీలు.
ఇం. *Cuff*. చొక్కా లేదా కోటు మణికట్టు చివర ధరించే బంధ విశేషం.
హిం. కఫ్.
కఫియతు రూ.చూ. కైఫీయతు. వి. నివేదిక, వృత్తాంతం.
కబచే రూ.చూ. కమీజు. వి. చొక్కాయి.
కబండలంకూజా రూ.చూ. కమండలంకూజా. వి. కమండ్లం కూజా.
కబరు[1] వి. గోరి.
హిం.ఉ. క్బ్ర్ - గోరి; మరా. క్బ్ర్. సమాధి; అర. క్బ్రూ. సమాధి.
<ఉ. క్బ్ర్.
కబరు[2] చూ. ఖబరు. రూ.చూ. కబురు, ఖబురు. వి. 1. సమాచారం; 2. సందేశం.
కబర్‌దార్ వి. జాగ్రత్త అనే హెచ్చరిక.
కబా రూ.చూ. కబాయి. వి. తురకలు తొడుగుకొనే ఒక చొక్కా.
కబాటు రూ.చూ. కపాతు. వి. విత్తులు తీసిన కోడి.
కబాటుకోడి వి. విత్తులు తీసిన కోడి.
కబాడపుటెద్దు చూ. కబాడము.
కబాడపువాడు చూ. కబాడము.
కబాడము రూ. కబాళము. వి. 1. ఎడ్లమీదవేసి తెచ్చే కసవు మొ. వాటి జంటమోపు; 2. బండెడు వంటచెరకు.
క. కబాడ, కవాడ. ఎడ్లబండెడు లేక గుర్రపుబండెడు గడ్డి లేక కలప మొ.
హిం. కబాడ్. ఎద్దుబండెడు సరుకు; మ. కబాడ్. సరుకు, సామాను.
కబాడపుటెద్దు వి. బరువుమోసే ఎద్దు. కబాడపువాడు వి. వంటచెరకును అమ్మేవాడు.
కబాడి[1] రూ.చూ. కపాడు. వి. ఎద్దుమీదగాని గొడ్డుఅవుమీద గాని మోటగా రెండు పక్కలా వేసే బరువు.
కబాడియెద్దులు(-ఎద్దులు) వి.బ.వ. వంటచెరకు మోసే ఎద్దులు.
కబాడి[2] చెడుగుడువంటి ఆట. ధ్వన్యను.
కబాతు రూ.చూ. కపాతు. వి. విత్తులు తీసిన కోడి.
కబాపుల్లలపొయ్యి చూ. కవ్వాంపుల్లపొయ్యి. వి. మాంసం ముక్కలు కాల్చుకొనే పొయ్యి.
కబాబు వి. వేల్చిన మాంసం.
హిం. ఉ. కబాబ్; మరా. కబాబ్. ఒక రకం వేయించిన మాంసం; పార. కబాబ్.
క. కబాబు. వేయించిన మాంసపదార్థం.
<ఉ. కబాబ్.
కబాయి రూ. కపాయి, కప్పా, కబా, కబాయా, కబ్బా[1], కబ్బాయి, కబ్బాయీ, ఖబ్బాయి. వి. 1. అంగీ. కళా. 5.179, దశా.పీఠి. 42; 2. శృంగారార్థం అన్నిటిపైన వేసికొనే చొక్కా. తురకలు తొడిగే ఒక రకం చొక్కా.
హిం. ఉ. కబా, కబాయ్. వదులువస్త్రం; మరా. కఫణీ, కఫనీ. అంగీ; కఫన్. శవంమీద కప్పే గుడ్డ.
పో. కబైయ. ప్రాచ్య సీమల్లో వాడే నిలువుటంగీ.
<పో. కబైయ.
కబాయీ రూ.చూ. కబాయి. వి. అంగరఖా, అంగీ. హంస. 5.356.
కబాలు విశ. వ్రాతపూర్వకమైన.
హిం. కబాలా. దస్తావేజు, దానపత్రం; ఉ. కబాల్. ఇంటిదస్తావేజు; పార. కబాలత్. ఒప్పుదలపత్రం, వ్రాత పూర్వకమైన పత్రం; అర. కబాల్. ఒప్పుదలపత్రం.
<ఉ. కబాల్.
కబాళము రూ.చూ. కబాడము. వి. ఎడ్లమీదవేసి తెచ్చే కసవు లోనగువాని జంటమోపు.
కబుజ[1] వి. పిడి.
హిం. ఉ. కబ్జ్. పట్టు, గ్రహణం; కబ్జా. పిడి, వశం.
<ఉ. కబ్జా.
కబుజబావి వి. చిన్నబావి.
కబుజ[2] వి. రశీదు.
హిం. ఉ. కబ్జూల్‌వసూల్. రశీదు; మరా. కబ్జ్. రశీదు; అర. కబ్జ్. రశీదు.
<మరా. కబ్జ్.
కబురు రూ. ఖబరు, ఖబురు. వి. 1. వృత్తాంతం. ఆం.భా. 3.53; 2. దంభం. ఆం.భా. 3.53; 3. విశేషం, క్రొత్త సంగతి; 4. సమాచారం.
హిం., ఉ. ఖబర్. వార్త, సమాచారం.
<ఉ. ఖబర్.
కబురుపెట్టు అ.క్రి. వార్తపంపు.
కబూలియతు రూ. కబూలియ్యతు, కబేలా[1]. వి. అంగీకార పత్రం.
హిం. ఉ. కబూలియత్. అంగీకారపత్రం; మరా. కబూలాత్, కబూలా. ఒప్పుదం, కౌలు ఒప్పందం; అర. కబూల్. అంగీకారంతో.
<ఉ. కబూలియత్.
కబూలియ్యతు రూ.చూ. కబూలియతు. వి. కడపా.
కబూలు రూ. కవులు, కౌలు. వి. సమ్మతి.
హిం. ఉ. కబూల్. అంగీకారం; మరా. కబూల్. అంగీకారం.
క. కబూల్, కబూల. అంగీకరించు, అంగీకారం, మాల్తో. కబులారె. వాగ్దానంచేయు, అంగీకరించు, ఒప్పుకొను.
<ఉ. కబూల్.
కబేలా[1] రూ.చూ. కబూలియతు. వి. దస్తావేజు.
కబేలా[2] వి. కసాయి దుకాణం.
ఉ. హిం. కర్బలా. బలిస్థానం.
<ఉ. కర్బలా.

కబోదం వి. 'ऽ' ఆకారంలోని చెక్కడపు మలుపు.
కబోది వి. అంధుడు.
పో.చూ. సం. కబంధ-. ఒక రాక్షసుడు, ఇతడి తల మొండెంలోకి దించబడింది.
క. కబోజి-. గుడ్డివాడు ; త. కపోతి. అంధుడు, అవివేకి.
కబోదిపక్షి వి. తలకిందుల పక్షి.
కబోలు పో.చూ. కబేలా[1]. వి. అంగీకరింపబడటం, మంజూరు చేయటం.
కబ్జా రైతు శిస్తు చెల్లించి దున్నుకొనే సొంతభూమి.
హిం. ఉ. కబ్జా. పిడి, పట్టు, దఖలు, వశం.
<ఉ. కబ్జా.
కబ్బపు(గూరువరి(-కూరువరి) చూ. కబ్బము.
కబ్బపు(గూర్పరి చూ. కబ్బము.
కబ్బపు(జే(తరి చూ. కబ్బము.
కబ్బము వి. కావ్యం, ప్రబంధం, గ్రంథం. భీమ. 1.12.
సం. కావ్య- ; ప్రా. కబ్బ-. అ.మా. కవ్వ ; హిం. కావ్య్. కావ్యం ; మరా. కావ్య్. కావ్యం.
క. కబ్బ. కావ్యం, కబ్బిగ, కవి ; త. కాప్పియం ; మ. కావియం.
<ప్రా. కబ్బ-.
కబ్బపు(గూరువరి(-కూరువరి) రూ.చూ. కబ్బపు(గూర్పరి. వి. కావ్యకర్త, కవి. కబ్బపు(గూర్పరి(-కూర్పరి) రూ. కబ్బపు(గూరువరి. వి. కావ్యకర్త, కవి. నీలా. 2.49. కబ్బపు(జే(తరి(-చే(తరి) వి. కావ్యకర్త, కవి. సాం.ని. 2.6. కబ్బము(దోయాలు వి. సరస్వతీదేవి. అచ్చ.రా. సుందర. 592.
కబ్బా[1] రూ.చూ. కబాయి. వి. అంగి, చేతుల్లేని పొట్టికోటు.
కబ్బా[2] వి. 1. నిశ్చేష్టత ; 2. ఆశ్చర్యం.
కబ్బాయి రూ.చూ. కబాయి. వి. అంగి. ద్వి.పరమ. 6.482.
కబ్బాయీ రూ.చూ. కబాయి. వి. అంగి.
కబ్బి వి. 1. రహస్యం, కపటం ; 2. గంభీరం ; 3. మోసం.
కబ్బిలి వి. శౌండికుడు, కల్లు అమ్మేవాడు, గమళ్ళవాడు.
క. కబ్బిల. వేటవాడు, పక్షుల్ని వేటాడేవాడు, పల్లెటూరివాడు.
కబ్బిలివాడు వి. శౌండికుడు.
కబ్బెల్లి వి. దయ్యం, పిల్లల్ని భయపెట్టటానికిగాను 'దెయ్యం వస్తుంది' అనే అర్థంలో 'కబ్బెల్లి వస్తాడు' అంటారు.
కబ్బెల్లిగాడు వి. దయ్యం.
కబ్బోరు వి. ఒక రకం బీరువా.
ఇం. *Cupboard.* వస్తువులనుంచుకొనే బల్ల.
<ఇం. Cupboard.
కమంగదచలు వి. ఒకరకమైన సముద్రంచేప.
క. *బంగదెయ్.* సముద్రంచేప ; త. *కనంగెలుతి, కమంగదచలు, కన్నన్గపత* ; మ. అయిల.
కమచీమంచము రూ. కంచీమంచం, కమిచీమంచము. వి. పేముతో అల్లిన మంచం.
కమఠం రూ.చూ. కణజము. వి. రెండుగోడలు కలిసేమూల అరగోడలుకట్టి తయారుచేసిన ధాన్యాగారం.
కమటము రూ.చూ. కమ్మటము. వి. అగసాలెవాని కుంపటి. వరాహ. 3.91.
కమటీ(డు రూ.చూ. కమ్మటీ(డు. వి. అగసాలె, కంసాలి.
కమటీ(డు చూ. కమటము.
కమండలంకూజా చూ. కమండలము.
కమండలము వి. సన్యాసుల జలపాత్ర.
సం. కమణ్డలు-. సన్యాసుల జలపాత్ర.
<సం. కమణ్డలు-.
కమండలంకూజా రూ. కబండలంకూజా, కమండ్లంకూజా, కమాండ్లంకూజా. వి. నీళ్ళుపంచుకోడానికి, పోసుకోడానికి రెండువైపులా బెజ్జాలుండి నీళ్ళుపంచుకొనే రంధ్రానికి ఏదో ఒక జంతువు తలబొమ్మ పెట్టి పైనపెట్టుకోడానికి వంకపెట్టి కమండలాకారంలోఉండే మట్టిపాత్ర. <సం. కమణ్డలు + కూజా. కమండ్లంకూజా రూ.చూ. కమండలంకూజా. వి. కెట్లికూజా.
కమండ్లంకూజా చూ. కమండలము.
కమతకా(డు చూ. కమతము.
కమతగాడు చూ. కమతము.
కమతము రూ.చూ. కమ్మతము. వి. 1. సాగులడి, సేద్యం, కృషి ; 2. అనేకులుచేరి చేసే సేద్యం ; 3. పెద్దభూములలో ఒకభాగం ; 4. జమీందారులసొంతభూమి ; 5. ఉమ్మడి వ్యవసాయం ; 6. ఒకరైతుసేద్యం ; 7. స్వయంగా వ్యవసాయం చేసుకొనే పొలం.
కమతకా(డు రూ.చూ. కమ్మతకా(డు. వి. హాలికుడు, సేద్యగాడు. ఆం.భా. 2.229. కమతగాడు రూ.చూ. కమ్మతకా(డు. వి. 1. ఆసామి తన ఇంట్లో అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికి ఇంతజీతం ఇచ్చేటట్లుగా నిర్ణయించి పెట్టుకున్న వ్యవసాయపు పనివాడు ; 2. పాలికి సేద్యం చేసేవాడు. కమతంపాట వి. ఆసామి, సాగుచేసిన రైతు పంటలో చెరినగం పంచుకొనేపద్ధతి. కమతీ(డు రూ. చూ. కమ్మతీ(డు. వి. సేద్యగాడు, కృషీవలుడు, హాలికుడు. సారంగ. 1.73. కమతు(డు వి. కమతగాడు, సేవకుడు. రామా. 8.85.
కమతంపాట చూ. కమతము.
కమతీ(డు చూ. కమతము.
కమతు(డు చూ. కమతము.
కమర్ యా. కవరు[2]. వి. రాతికుంచాలమీద అర్ధచంద్రాకారపు సొట్టలాగ మలచినగుంట.
కమరక వి. కర్మరంగమనే వృక్షవిశేషం. హంస. 4.134.
సం. *కర్మరఙ్గ-.* శిరాలం ; ప్రా. *కమ్మరంగ-.*
<ప్రా. కమ్మరంగ-.
కమరకకాయ వి. కర్మరంగంఅనేకాయ.
కమరసాల[1] వి. ఇరసాల్‌కమ్మి.
కమరసాల[2] వి. ఒడ్డాణం, మొలతాడు.
కమరి రూ.చూ. కమరు[2]. వి. ఒడ్డాణం, కవచం. ఆం.భా. 2.150.
కమరించు చూ. కమరు[1].

**కమరు**[1] రూ. కమురు. అ.క్రి. 1. కాలు, దగ్ధమగు, తాపం పొందు. భార.ఆది. 8.266 ; 2. ఉడికిపోవు, కరుగు. భార.ఆది. 8.266 ; 3. అరుగు, జీర్ణమగు. విజ్ఞా. 1.82 ; 4. వాడిపోవు. పి.శకు. 3.16 ; 5. కాగు, తప్తమగు. దశా. 3.16 ; 6. అమాయ మొ॥ నవి కలుగు ; 7. ఎండిపోవు, శుష్కించు. భార.ఆశ్ర. 2.151 ; వి. 1. కాలినకంపు, కాటువాసన ; 2. కాలుపు.

క. కమరు, కాలు, మండు, కమలు ; తు. గమెలుని, వేడిగాఉండు, కావు, వేడి, వెచ్చన ; త. కమఱు. మితి మీరినవేడి, నిప్పుమీదమిరపకాయలనుండి వచ్చేకారంతో కూడిన వాసన.

<మూ.ద.ద్రా. *కా-వి-*కవ్-వి-*కమ్-వి.

**కమరించు** స.క్రి. 1. అనూయ మొ. కలిగించు ; 2. ఉడికించు ; 3. ఎండించు. **కమరుచు** రూ. కమర్చు. కము రుచు, కముర్చు. స.క్రి. కమరజేయు. రం.రా. సుందర. 271. వు. 8 పం. **కమరులువోవు(-పోవు)** అ.క్రి. శుష్కించు, ఎండు. కు.సం. 5.169. **కమరువలచు** అ.క్రి. కమరువాసన వేయు, కమరుకంపుగొట్టు. జైమినీ భా. 8.100. **కమరువాసవ** వి. కాలినకంపు. **కమర్చు**. రూ.చూ. కమరుచు. స.క్రి. 1. కమరజేయు. భార. ఆశ్రమ. 2.151 ; 2. కందు (కోపంతో) కమలు.

**కమరు**[2] రూ. కమరి, కమ్మరు. వి. 1. ఒడ్డాణం. కాశీ. 3.240 ; 2. మొలనూలు. కాశీ. 7.5.

హిం.ఉ. కమర్. నడుం ; మరా. కమర్. నడుం ; కమర్ పట్టా. బంగారం లేక వెండిపటకా ; పార. కమర్. క. కమ్మరుబంద. నడుముకిలోలుపట్టి, పటకా.

<ఉ. కమర్.

**కమర్చు** చూ. కమరు.

**కమర్షియల్** వి. వర్తకసంఘం.

ఇం. *Commercial.* వర్తక సంబంధమైన.

<ఇం. Commercial.

**కమలం** వి. 1. తామరపువ్వునమూనాలో నేసినడిజైను ; 2. శివాచీనేతలో వచ్చే ఒకరకం డిజైను.

సం. కమల-. పద్మం.

<సం. కమల-. (అర్థవిపరి).

**కమలంకట్టి** వి. తామరపూలు, మొగ్గలు వరసగా నేసిన డిజైను. **కమలమంచు** వి. తామరపువ్వు ఆకారంలో డిజైను వేసిన అంచు. **కమలంపేటు** వి. తామరపువ్వు ఆకారంలో అంచులో నేసిన డిజైను.

**కమలమంచు** చూ. కమలం.

**కమలాపండు** వి. కమలాఫలం, నారింజభేదం.

సం. కమలా-. లక్ష్మి.

<సం. కమలా + పండు. మిశ్రమ.

**కమలాంబరం** వి. ఒకరకంలేత ఎర్రరంగు.

సం. కమల-. పద్మం ; అంబర-. వస్త్రం.

<సం. కమలాంబర-. (అర్థవిపరి.).

**కమలాలు** వి.బ.వ. తమ్మెట్లు, ఒంటిరాయిదుద్దులు.

సం. కమల-. పద్మం.

<సం. కమల- + -ము + -లు. (అర్థవిపరి).

**కమలించు** చూ. కమలు.

**కమలు** అ.క్రి. 1. కందు, వివర్ణమగు, కాలు, దగ్ధమగు. రం.రా. సుందర. 2.71. వు. 20 పం. ; 2. తపించు. వి. వైవర్ణ్యం. పి.శకు. 1.39.

క. కమరు. కొంచెంకాలు, మండు, కమలిన ; కమర, కమరు, కమరికె, కమరిగె, కవరు, కవురు. కొంచెం కాలిన, కమరిన, కాలుతున్ననూనె, నెయ్యినుండి వచ్చే నరి వడని, ఊపిరాడనివాసన; కమఱు, కముఱు. కుళ్ళుకంపు, కంపువాసన, గవలు, గవులు, కంపువాసన ; తు. కేట్లు. కంపువాసన, కుళ్ళికంపుకొట్టే ; కొట్టుని, కొట్టువి. కుళ్ళు కంపుఅగు ; తకవుల్, కౌల్. చెడువాసన ; మ. కవర్ కౌర్. శరీరం యొక్క దుర్వాసన.

**కమలించు** స.క్రి. 1. కందించు, నల్లవరుచు. వసు. 4.29 ; 2. కాల్చు ; 3. దుఃఖించు, ఏడ్చు. **కమలుచు** రూ. కమల్చు. స.క్రి. 1. కాల్చు. ప్రబంధ. 210 ; 2. కందించు, నల్లవరుచు. **కమల్చు** రూ.చూ. కమలుచు. స.క్రి. 1. కాల్చు; 2. కందించు ; నల్లపరుచు.

**కమల్చు** చూ. కమలు.

**కమవగడ్డలు** వి.బ.వ. కాచగడ్డలు.

**కమసాలవా(డు** రూ.చూ. కంసాలవాడు. వి. లోహకారుడు, బంగారుపనివాడు.

**కమసాలి** చూ. కంసాల. వి. కంసాలి, స్వర్ణకారుడు.

**కమసాలె** చూ. కంసాల. వి. కంసాలి.

**కమాటీ** వి. సేద్యపుకూలి.

**కమాండర్** వి. సేనానాయకుడు, అధికారి.

ఇం. *Commander.* సేనాధికారి.

<ఇం. Commander.

**కమాండింగ్ఆఫీసరు** వి. అధికారం చేస్తున్న ఉద్యోగస్థుడు.

ఇం. *Commanding officer.* ఆజ్ఞాపించే అధికారి.

<ఇం. Commanding officer.

**కమాండ్లంకూజా** రూ.చూ. కమండలంకూజా. వి. కమండ్లం కూజా.

**కమాన్** వి. బట్టీ పొయ్యిమీద అడ్డంగా ఉంచిన రాయి.

**కమాను**[1] వి. 1. ఒకతుక్కుడిగా సిపాయిలు పోవడం ; 2. ప్రయాణం.

హిం. కమాన్. సైన్యం, బాధ్యత. పో. చూ. మరా. కమానిర్. సేనానాయకుడు; పో.చూ.మా. కమానప్పిటి. కత్తి పిడికిలి రక్షకుడు.

పో. కమీన్యార్. పయనించు ; స్పా. కమినో. ప్రయా ణం, మార్గం ; ఫ్రె. కామాం. దండయాత్ర.

**కమామపోవు** అ.క్రి. చుట్టూ తిరుగు, దేశసంచారం చేయు.

**కమాను**[2] వి. 1. విల్లు, ధనుస్సు. రంగా. చ. 1.159 ; 2. విల్లు వంపు కట్టడం. చంపూ.రా. 1.56; 3. పడవ నడిపే సాధనం ; 4. బట్టీల్లో నిప్పు పెట్టటానికి తెరచిఉంచిన రంధ్రం ; 5. దూది ఏకేకొయ్య పనిముట్టు ; 6. మరాను మీద వడుగు తోడేటప్పుడు అనులు పడేట్టు పోగును జరప టానికి ఒక కొయ్యపట్టెను బిగించిన రేకుముక్క ; 7. మర

నాడె గాడిలో ముల్లుకు గుచ్చిన (కొయ్య) కండె ఊచ ఊడి పోకుండా బిగించిన ఇత్తడిరేకు ; 8. నేతమొాకు చుట్టే ఒక రకం చేతి గూటానికి బిగించిన ఇనప ఊచ; 9. తివాసీ మగ్గందోనె దగ్గర నూలు పడగు కట్టిన కర్ర.

హిం. ఉ. కమాన్. విల్లు, ఆజ్ఞ; కమాన్అఫ్సర్-. ఆజ్ఞలిచ్చే అధికారి ; మరా. కమాణ్, కమాన్. ధనురాకారం, విల్లు ; పార. కమాన్.

తు. కమాను. ధనురాకారం ; మ. కమాన్, కమానమ్. ధనురాకారం, నరంబి.

<ఉ. కమాన్.

**కమానుకట్టె** వి. బట్టీపొయ్యిమీద అడ్డంగా వంచిన రాయి. **కమానుకర్ర** వి. రంధ్రంచేసే పరికరం. **కమాను గూడు** వి. త్రిభుజాకారంలో ఉండే గూడు. **కమానుదస్తా** వి. పత్తిని శుభ్రపరిచే విల్లువంటి సాధనం. **కమానుపొయ్యి** వి. ముక్కోణాకారంలో ఉండే బట్టీ పొయ్యి. **కమానుబద్ద** వి. గడియారం స్ప్రింగు. **కమానుబెట్టు** వి. 1. అదువు ; 2. పరులకు లోన మాటమీద లక్ష్యం. **కమానురాయి** వి. 1. ఆర్చిలో బిగించిన రాయి, ఆర్చి నిర్మాణానికి వాడినరాయి; 2. రాతితోకట్టిన ఆర్చికి మధ్యభాగంలో బలంకోనం బిగించిన రాయి. **కమానురొాతు** వి. 1. ఆర్చిలో బిగించిన రాయి, ఆర్చి నిర్మాణానికి వాడే రాయి ; 2. రాతితో కట్టిన ఆర్చికి మధ్యభాగంలో బలంకోనం బిగించే పెద్దరాయి. **కమానొర్ప** వి. ఆర్చికి పక్కనుండే రాతిపేర్పు.

**కమానొర్ప** చూ. కమాను[2].

**కమామిషు** రూ.చూ. కమావీసు. వి. 1. వ్యవహారం ; 2. రెవెన్యూ వసూలు చేసేపని ; 3. కాలం ; 4. విశేషం.

**కమామీషు** రూ.చూ. కమావీసు. వి. వ్యవహారం.

**కమామీషు** రూ.చూ. కమావీసు. వి. 1. నిర్వాహకం ; వ్యవహార దక్షత ; 2. రెవెన్యూ పన్ను వసూలుచేసేపని ; 3. కాలం ; 4. విశేషం.

**కమాయషు** రూ.చూ. కమావీసు. వి. వ్యవహారం.

**కమాయిషు** రూ.చూ. కమావీసు. వి. వ్యవహారం.

**కమార** రూ.చూ. కనుమరి. వి. కమ్మరవాడు, ఇనపపని చేసే వాడు.

**కమాలు** వి. ఎగతాళి, వేళాకోళం, గేలి.

హిం. ఉ. కమాల్. అద్భుత కార్యం, పరిపూర్ణత.

<ఉ. కమాల్.

**కమావీసు** రూ. కమామిషు, కమామీషు, కమామీను, కమాయషు, కమాయిషు, ఖమామీను, ఖమాయిషు, ఖమావీసు[1]. వి. 1. వ్యవహారం, నిర్వాహకం ; 2. రెవెన్యూ వసూలు చేసేపని ; 3. కాలం ; 4. విశేషం.

క. కమాయిషి. వసూలు చేసిన ఆదాయం.

మరా. కమావిస్. ఆదాయపత్రాలు ; కమావిస్దార్. జిల్లా ఆదాయాన్ని వసూలు చేసేవాడు.

<మరా. కమావీస్.

**కమి** వి. 1. వంచబడిన వేళ్లుగల పుడిసిలి. భీమ. 3.7 ; 2. కబళనం. ఆం. భా. 2.260 ; 3. తృప్తి.

**కమికిలి** వి. పాణివిశేషం, పట్టిలి. ఆం.భా. 2.141.

**కమికెడు** రూ. కంకెడు, కనికెడు. వి. 1. పిడికెడు ; 2. కొద్దిపాటి పరిమాణంగల. **కమియార** క్రి.విశ. పట్టిలి నిండా, తృప్తి తీరునట్లుగా. భీమ. 3.7, కవిక. 1.40. **కమియాలు** అ.క్రి. జోలి నిండేటట్లు పెట్టు, ఆవరించు.

**కమిచి**[1] వి. లావుపాటితీగ.

**కమిచి**[2] రూ.చూ. కమ్చీ. వి. కొరడా, చబుకు.

**కమిచీ** రూ.చూ. కమ్చీ. వి. కొరడా.

**కమిచీమంచము** రూ.చూ. కమచీమంచము. వి పేముతో అల్లిన మంచం.

**కమిట్** రూ. కమీటు. వి. ఖైదులో పెట్టటం, ఒకదానికి కట్టుబడి ఉండటం.

ఇం. *Commit.* నేరం చేయు, భద్రతకై ఒప్పగించు, బాధ్యత వహించు.

<ఇం. Commit.

**కమిటి** రూ.చూ. కమిటీ. వి ప్రత్యేకంగా కార్యనిర్వహణానికై నియమింపబడిన సంఘం.

**కమిటీ** రూ. కమిటి. వి. ప్రత్యేకంగా కార్యనిర్వహణానికై నియమించబడిన సంఘం.

ఇం. *Committee.* ఏదైన పనిని చూడటానికి నియమించబడ్డ సంఘం.

<ఇం. Committee.

**కమితి** రూ.చూ. కమిద. వి. పాత్రల్ని సర్వేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేక గోతాంపట్ట.

**కమితిచేయు** రూ. కవిదిచేయు, కొదిచేయు. స.క్రి. ఆము పొయ్యి రాజేసి మంట వ్యాపించడానికి విసురు. **కమితిపట్టు** స.క్రి. ఆము పొయ్యి మంట వ్యాపించడానికి విసురు. **కమితిసురు** రూ. కమిదిసురు. స.క్రి. ఆము పొయ్యి రాజేసి మంట వ్యాపించడానికి విసురు.

**కమిద** రూ. కదిమి, కదివి, కమితి, కమిది, కమిదె. కలిమి[2], కవుత, కౌతి, కౌత. వి. పాత్రలు సర్వేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేక గోతాంపట్ట.

**కమిదకట్ట** రూ.చూ. కమిదికట్ట. వి. సర్వేటప్పుడు పాత్రలు నొక్కుపడకుండా కదలకుండా ఒత్తుపెట్టుకొనే దిండు. **కమిదచిప్ప** వి. కుండల్ని సర్వేటప్పుడు కుమ్మరి కుడివైపున పెట్టుకొనే నీళ్ళపాత్ర. **కమిదరాయి** రూ. చూ. కమిదిరాయి. వి. మోపురాయి. **కమిదసాప** (-చాప) రూ. కదిమిసాప, కయిదిచాప. కయిదుసాప, కయిద్సాప, కవితిసాప. వి. పాత్రల్ని సర్వేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప. **కమిదసుట్ట** వి. సర్వేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప.

**కమిది** రూ. చూ. కమిద. వి. పాత్రల్ని సర్వేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేక గోతాంపట్ట.

**కమిదికట్ట** రూ. కమిదకట్ట, కమిదుకట్ట, కవితకట్ట. వి. సర్వేటప్పుడు పాత్రలు నొక్కుపడకుండా, కదలకుండా ఉండటానికి ఒత్తుపెట్టుకొన్న దిండు. **కమిదకొట్టు** రూ. కదిమికొట్టు. స.క్రి. ఆము పొయ్యి రాజేసి మంట వ్యాపించడానికి విసురు. **కమిదిగోని** వి. సర్వేటప్పుడు కుమ్మరి కింద పరుచుకొనే గోతాం. **కమిదితోలు** రూ. కదిమితోలు. వి. సర్వేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి కింద పరుచుకొనే

గ్రారె చర్మం. కమిదిమెత్త రూ. కమిదుమెత్త, కవితిమెత్త, కవిదిమెత్త. వి. నర్సేటప్పుడు పాత్రల కింద పెట్టుకొనే మెత్తని దిండు. కమిదిరాయి రూ. కమిదరాయి, కమిదెరాయి. వి. కమిదమీద కూర్చుని కమిదకట్టమీద కుండనుపెట్టి నర్సేటప్పుడు కుండ తిప్పినప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి బరువుగా ఆవుగా పెట్టేరాయి, మోవురాయి. కమిదిసురు రూ.చూ. కమితిసురు. స.క్రి. ఆము పొయ్యికి నిప్పు రాజేసి మంట వ్యాపించడానికి విసురు.

కమిదుకట్ట రూ.చూ. కమిదికట్ట. వి. నర్సేటప్పుడు పాత్రలు నొక్కుపడకుండా వదలకుండా ఉండటానికి ఒత్తుకు పెట్టుకొనే దిండు.

కమిదుమెత్త రూ.చూ. కమిదిమెత్త. వి. నర్సేటప్పుడు పాత్రల కింద పెట్టుకొనే మెత్తనిదిండు.

కమిదె రూ.చూ. కమిద. వి. పాత్రల్ని నర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేక గోతాంపట్ట.

కమిదెకట్టరాయి వి. కుండల్ని నర్సేటప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి బరువుగా పోటుగా పెట్టేరాయి. కమిదెత్తురాయి వి. కుండల్ని నర్సేటప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి బరువుగా ఆవుగా పెట్టేరాయి. కమిదె మెత్తరాయి వి. కుండల్ని నర్సేటప్పుడు కమిదకట్ట జరగకుండా ఉండటానికి కట్టపై బరువుగా ఆవుగా పెట్టేరాయి. కమిదెరాయి రూ.చూ. కమిదిరాయి. వి. మోవురాయి.

కమియు[1] రూ.చూ. కవియు. అ.క్రి. 1. మిక్కుటంగా వ్యాపించు. కు.సం. 6.726 ; 2. మాగు, మిగలపండు. హరి.పూ. 6.82 ; 3. అతిశయించు. భీమ. 2.29.

కమియు[2] స.క్రి. 1. తిను, తాగు. మార్క. 1.74 ; 2. కొరుకు. పారి. 3.56 ; అ.క్రి. 1. నలుగు, క్షతమగు. భాస్క.రా. సుందర. 5.85 ; 2. ఆవరించు, కమ్ము. రామా. 5.70 ; 3. కవియు, మీదికి వచ్చు. భాను. 1.2.

కమిరీ వి. కౌలుభూమి. పద్మ. యు. 47.

ఉ. కమార్; పా. కమార్. కౌలుకిచ్చిన భూమి.

<పా. కమార్

కమిల రూ.చూ. కపిల. వి. ఎద్దులకు కట్టి బావినుంచి పొలాలకు నీరుతోడే సాధనం.

కమిషన్ రూ.చూ. కమీషను. వి. 1. బేరం చేసినందుకిచ్చే పెచ్చు ద్రవ్యం ; 2. లంచం.

కమిస్సెనరు రూ.చూ. కమీషనరు. వి. ఒక పనిని చేయడానికి అధికారంపొంది పంపబడినవాడు.

కమిస్సెరి వి. సైనికోద్యోగి.

డచ్చి. కమీసారి. పోలీసు అధికారి, న్యాయాధిపతి ; పో. కమిస్సారి ; స్పా. కమీసారి. పోలీసు అధికారి, న్యాయాధిపతి.

<పో. కమిస్సారి.

కమీజు రూ. కప్పు, కబచ, కవిసె. వి. (లోన ధరించే) ఒక రకం చొక్కా.

హిం. ఉ. కమీజ్ ; అర. కమీస్. ఒక రకం చొక్కా. పో. కమీజా ; స్పా. కమీసా. చొక్కా ; కామిసేరియా. చొక్కాలమ్మే దుకాణం ; ప్రె. కమీజాల్. రైక ; ఠ. కమీజాల్. స్త్రీల కూర్పాసం.

<ఉ. కమీజ్.

కమీటు రూ.చూ. కమిట్. స.క్రి. ఖైదుచేయడం.

కమీషనరు రూ. కమిస్సెనరు. వి. పురపాలక సంఘం మొ. కచేరీలలో ప్రత్యేక విధులుగల ప్రభుత్వోద్యోగి.

ఇం. *Commissioner.* ఒక పనిని చేయడానికి అధికారం పొంది పంపబడినవాడు.

<ఇం. Commissioner.

కమీషను రూ. కమిషన్. వి. 1. బేరానికి వచ్చే అదనపు సొమ్ము ; 2. ఆజ్ఞ ; 3. ఉద్యోగం ; 4. అధికార పత్రిక ; 5. రుసుం ; 6. తరుగు ; 7. లంచం ; 8. ఆర్డరు పంపినందుకిచ్చే అదనపు సొమ్ము.

ఇం. *Commission.* సంఘం, రుసుం.

<ఇం. Commission.

కముఖాబు రూ. కిముకాబు, కిముఖాబు. వి. విలువగల వస్త్ర విశేషం. హంస. 5.354.

కముచు స.క్రి. 1. గ్రహించు, పట్టుకొను. కు.సం. 8.113 ; 2. కబళించు, మింగు. నిర్వ.రా. 6.46 ; 3. చేర్చు, కూర్చు. దశకు. 7.113 ; 4. భక్షించు. దశకు. 10.162 ; 5. ఆను, అధరపానంచేయు. ఉ.హరి. 5.212 ; 6. నొక్కు, అదుము. శృం.నై. 7.166 ; 7. ఆకర్షించు. ఆము. పీఠి. 5 ; 8. మింగు. మను. 4.113 ; 9. ఆక్రమించు. పాండు. 4.113 ; 10. కొరుకు. చంద్రాంగ. 3.92 ; 11. ఊడబెరుకు. హంస. 5.10.

క. కవర్. బలవంతంగా తీసికెళ్లు, బలాత్కారంగా పట్టుకొను, ఒలుచు, దాచుకొను ; కవరె, కవతె. బలవంతంగా తీసికొను, బలాత్కారంగా పట్టుకొను, ఒలుచుకొను ; త. కవర్. బలాత్కారంగా పట్టుకొను, గ్రహించు, దొంగిలించు, స్వాధీనంలోకి తెచ్చుకొను, తీసికొను, అనుభవం, కోరిక, సంబంధం పెట్టుకొను ; కవర్చి. వశీకరణం, ఆకర్షణ ; కవరరు-. కోరిక ; కవవు-. కోరిక, కౌగిలించుకొను, సంభోగంచేయు, సంభోగం ; కవై. ఓర్చుకొను, కలుసుకొను, కౌగలించుకొను ; మ. కవరుక. దోచుకొను, బలాత్కారంగా దోచుకొను ; కవర్చ. దోపిడి, దోచుకొను.

కముజు రూ. కంజు[1], కయిజు, కయిదు, కవుజు, కైజు, కైదు, కౌజు. వి. కపింజల పక్షి. ద్వి.నల. 3.333.

సం. కపింజల-. కౌజు ; ప్రా. కవింజల- ; పా. కవింజల-.

క. కవిజు, కవింజు, కవుజు, కవుజుగ, గవుజిల్. గవుజిల్లకి, గవుజు ; భ్రా. కపింజల్.

<ప్రా. కవింజల-.

కముదువేయు చూ. కమిద. స.క్రి. సారెమీదనుంచి తీసిన వాటలు ఆరిపోకుండా ఉండటానికి వాటిమీద కముదలు (సంచిపట్టలు) కప్పు.

కముదు రూ.చూ. కమరు[1]. వి. గుడ్డకాలిన వాసన. అ.క్రి. 1. కాలు ; 2. వాడిపోవు.

కముదుగొల్పు(-కొల్పు) వి. 1. ముదరకాలిన ఇటిక ;

**2.** ఇటుక మొ. ఎక్కువగా కాలడం. కమురుచు రూ.చూ. కమరుచు. స.క్రి. **1.** గుర్రకాలిన వాసన కల్గజేయు ; **2.** మింగు ; **3.** లాక్కొను. కమర్చు రూ. కమరుచు. స.క్రి. **1.** గుర్రకాలిన వాసన కల్గజేయు : **2.** మింగు ; **3.** లాక్కొను. కమరుపెండ వి. ముదరకాలి నల్లబడిన పెండ.

**కముర్చు** చూ. కమురు.

**కమెరాకు** రూ.చూ. కమ్మిరాకు. వి. నల్లతమలపాకు (Piper bettle).

**కమేల** రూ.చూ. గమేళా. వి. తాపీపనివారు వాడే ఇనపగంప, ఇనపపళ్లెం.

**కమ్చీ** రూ. కమిచి², కమిచీ. వి. కొరడా, చబుకు, కశం. చౌదప్ప సీ. 7.

మరా. కమ్చి, కమ్చు. చిన్నకర్ర ; హిం.ఉ. కమ్‌చీ. బెత్తం, కొరడా.

క. కమిచి, కమిచ. కొరడా.

< ఉ. కమ్‌చీ.

**కమ్మాటి** రూ. కమ్మినేటి. వి. పల్లెటూరివాడు, కోమటి.

**కంప** రూ.చూ. క్రంప. వి. **1.** కంటకాదిభారం, ముళ్ళమండ, ముళ్లపొద, ముళ్ళచెట్టుకొమ్మ. శుక. 1.287, **2.** నశం (నూరు గొర్రెల గుంపు) ; **3.** వెదపెట్టిన తరవాత, గింజలు పూడిపోవడానికి తోలే కంప ; **4.** ఆముకాల్పుకువాడే ముళ్ళ కంప ; **5.** క్రానేగుచెట్టు (Flacourtia sekiarice).

కంపకట్టె వి. ఆముకాల్పుకుముళ్ళ కంపల్ని తీసుకొని రావడానికి వాడే పంగలకర్ర. కంపకరసాలు వి. వామిదొడ్డి. పొలం మొ. చుట్టూ ఆవరణగా కంపను పాతిన చాలు. **కంపకాలకట్టె** వి. ముళ్ళు గుచ్చుకోకుండా కంపను లాగడానికి వాడే సాధనం. **కంపకొట్టు** స.క్రి. ముళ్ళకంచె వేయు. **కంపకోట** వి. **1.** తోట మొ. వాటి రక్షణార్థం వెదురు మొ. వాటితో ఏర్పాటుచేసిన ఆవరణం, కంచెకోట ; **2.** ప్రాచీనం. కంపగట్టు స.క్రి. కంచెవేయు. విప్ర. 2.19. **కంపగుర్రలి** వి. దున్నటానికి ముందు పొలంలో చెట్లనుకొట్టే సాధనం. **కంపగొర్లి** వి. దున్నటానికి ముందు పొలంలో చెట్లను కొట్టే సాధనం. కంపగోడ వి. కంపతో గోడలాగ చుట్టూ ఏర్పాటు చేసిన కంచె. కంపజిట్ట వి. పక్షి విశేషం. **కంపతుడుపు** వి. రెండు ఎడ్లతో తోలే కంపచీపురుకట్ట. **కంపతొడుగు** రూ. కంపతొడుప. వి. కంపలకట్ట. మను. 4.54. **కంపతొడుపు** రూ.చూ. కంపతొడుగు. వి. కంపలకట్ట. కంపపల్లంచి వి. ఒకరకమైన పొద. కంపవాటు వి. వామిదొడ్డి చుట్టూ నాటిన కంపదడి. కంపపులుగు వి. శకునపక్షి. కంపపుల్ల వి. ఆము కాల్చడానికి వాడే ముళ్ళకంప. కంపల(బడ్డకాకి వి. ఎటు కదిలినా కష్టం కల్గే విషమస్థితి, కంపల్లోపడ్డ కాకిస్థితివంటి స్థితి. కంపలువట్టు అ.క్రి. అడవుల్లో ఇరుకుపడు. కంపవెట్టు (-పెట్టు) స.క్రి. **1.** కంపలు కలదిగా చేయు. బిల్హ. 3.65 ; **2.** పాడుపెట్టు.

**కంపణము** వి. ఆయుధ విశేషం.

**కంపనీ** రూ. కంపినీ, కంపెని, కంపెనీ. వి. **1.** కూడాఉండటం, సహవాసం, ఒకచోట కూడినవారు, సంఘం ; **2.** జట్టు, పరిజనం ; **3.** విందుకు వచ్చినవారు ; **4.** భాగస్థులుగా చేరిన వర్తకుల సంఘం ; **5.** పటాలంలో నూరుగురు సిపాయిలు కల్సిఉన్న భాగం ; **6.** వేశ్యాగృహం, వ్యభిచార గృహం (అర్థవిపరి.).

ఇం. *Company.* సహవాసం, వ్యక్తుల సముదాయం, సహచరులు, వర్తకసంఘం, కాల్బలంలో భటుల సమూహం.

< ఇం. Company.

**కంపరము** వి. **1.** పాండు. బసవ. 5.523 ; **2.** శవవాహనం ; **3.** జలదరింపు ; **4.** దురద ; **5.** గగుర్పాటు.

త. *కంపరం.* కంపరం ; మ. *కంబం.* వణకు, తల వణుకు.

కంపరమెత్తు అ.క్రి. గగుర్పొడుచు. < కంపరము + ఎత్తు

**కంపల్లము** చూ. కంపు.

**కంపార్టుమెంటు** వి. గది, అర.

ఇం. *Compartment.* అర.

< ఇం. Compartment.

**కంపాసు** వి. దిక్కులు చూపే యంత్రం.

ఇం. *Compass.* దిక్సూచి.

< ఇం. Compass.

**కంపినీ** రూ.చూ. కంపనీ. వి. **1.** జట్టు ; **2.** భాగస్థులుగా చేరిన వర్తకసంఘం ; **3.** వ్యభిచార గృహం.

**కంపిరుగు(డు** చూ. కంపు.

**కంపిల్లకము** వి. గొలికూర.

**కంపిల్లము** వి. గోలికూర.

**కంపు** వి. **1.** సుగంధం, సువాసన. భార.ఆను. **4.5** ; **2.** గంధం, వాసన. భార.అశ్వ. 5.62 ; **3.** దుర్వాసన, దుర్గంధం. సిం.ద్వా. 1.94.

క. *కంపు, కమ్మ, కమ్మ.* దుర్వాసన, సుగంధం ; తు. *కమ్మెన.* సుగంధం, సువాసన ; *కమ.* పూర్తిగా ఆక్రమించు.

< మూ.ద్రా. *కమ్-. (అర్థవిపరి.).

కంపల్లము వి. సూగుఉండని ఆకులు కలిగిన ఒకరకం అల్లపుమొక్క. అడవిఅల్లపుమొక్క. < కంపు + అల్లము (Zingiber ligulatum). కంపిరుగు(డు రూ. కంపు టిరుగుడు. వి. ఒకరకంచెట్టు, ఒకరకంపరిమళం, ఒకరకం పరిమళద్రవ్యం. < కంపు + ఇరుగుడు. కంపుకొట్టు అ.క్రి. **1.** సువాసనకలదగు ; **2.** దుర్వాసన కలదగు. కంపుగుమదు రూ. కంపుగుమ్మదు. వి. సూగుఉండే ఆకులు కలిగిన ఒక రకం టేకుచెట్టు. కంపుగుమ్మదు రూ.చూ. కంపుగుమదు. వి. సూగుఉండే ఆకులు కలిగిన ఒకరకం టేకుచెట్టు. కంపుటిరు(గు(డు రూ.చూ. కంపిరుగుడు. వి. భస్మగర్భ. ఒకరకం ఇరుగుడు < కంపు + ఇరుగుడు. కంపుటెలుక రూ. కంపెలుక. వి. చుంచు, గంధమూషికం. < కంపు + ఎలుక. కంపుతుమ్మ వి. సువాసనగల పూలుపూసే ఒకరకం తుమ్మచెట్టు (Acacia farnesiana). కంపుదుమ్మ (-తుమ్మ) వి. విట్టదిరం, వృక్షవిశేషం (Vachellia farcheotana). కంపునాగు వి. ఒకరకం నాగుపాము. కంపెక్కు అ.క్రి. కంపుకొట్టు. < కంపు + ఎక్కు. కంపెలుక రూ.చూ. కంపుటెలుక. వి. చుంచు. < కంపు + ఎలుక.

**కంపె** వి. 1. తాంబూలపాత్ర. ఆం.భా. 2.166 ; 2. తలుకు.

**కంపెక్కు** చూ. కంపు.

**కంపెని** రూ.చూ. కంపనీ. వి. 1. జట్టు ; 2. భాగస్థులుగా చేరిన వర్తకసంఘం ; 3. వ్యభిచారగృహం.

**కంపెనీ** రూ.చూ. కంపనీ. వి. 1. జట్టు ; 2. భాగస్థులుగా చేరిన వర్తకసంఘం ; 3. వ్యభిచారగృహం.

**కంపెనీపెంకు** వి. యంత్రంతో చేసే పెద్దపెంకు.

**కంపెలుక** చూ. కంపు.

**కంపోష్టుఎరువు** వి. ఎరువు, పెంట.

ఇం. *Compost*. ఎరువు.

<ఇం. Compost. ఎరువు.

**కంప్రేం** వి. పీపుమీదగాని, పొట్టమీదగాని నాలుగువైపులా ఉండే నాలుగుముళ్ళు.

**కంప్లైంటు** వి. 1. మొర, ఫిర్యాదు ; 2. వ్యాధి, జాడ్యం. జబ్బు.

ఇం. *Complaint*. ఫిర్యాదు.

<ఇం. Complaint.

**కంబ** వి. దద్దుగచెట్టు (Cinchona ehcelsa).

**కంబం** రూ.చూ. కంబము. వి. 1. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య ; 2. ఆరుబయట వడుగుచాపటానికి నేలలో పాతేరాతి స్తంభం ; 3. మరమగ్గం చట్రం నిలబెట్టడానికి ఆదారంగా నేతబయలులో పాతిన కొయ్య ; 4. మరమగ్గం చట్రంలో పక్కగా బిగించిన పొడుగుపట్టి.

**కంబకట్టు** చూ. కంబము.

**కంబటికోరి** వి. సర్వేటప్పుడు మట్టిపాత్రల కిందఒత్తుగా పెట్టుకొనే మెత్తనిదిండు.

**కంబడి**[1] రూ.చూ. కంబళి. వి. గొంగళి. ఆము. 4.35.

**కంబడి**[2] వి. పట్టుపురుగుల ఆహారంకోసం ఉపయోగపడే ఆకులు కాసే చెట్టు (Morus Indica).

**కంబడిచుక్క** వి. ధ్రువనక్షత్రం.

**కంబమయ్య** చూ. కంబము.

**కంబము** రూ. కంబం, కంభము. వి. 1. స్తంభం, రాడు. శృం. నై. 7.78 ; 2. మల్లపరికరవిశేషం. ఆం.భా. 2.207.

సం. *స్కంభ*-. ఆంద, గోడ, దన్ను ; *స్తంభ*, *స్తంభం*. కొమ్మ, దన్ను; ప్రా. *ఖంభ*. దన్ను, ప్రతిబంధకం, ఆటంకం, పక్షవాయువు ; మహా. *ఖంబ*. స్తంభం ; అమా. *ఖంభ*. స్తంభం ; హిం. *ఖంబ్*. స్తంభం ; మరా. *ఖంబిర్*. స్థిరమైన.

క. *కంబ*, *కంభ*. స్తంభం ; తు. *కంబ*. స్తంభం ; త. *కంపం*. స్తంభం, దీపస్తంభం ; మ. *కంపం*. స్తంభం.

<ప్రా. ఖంబ-.

**కంబకట్టు** వి. వేదికస్తంభం చుట్టూ కట్టినబట్ట. **కంబమయ్య** వి. స్తంభంలో వెలసిన అయ్య, నరసింహమూర్తి. యయా. 1.106. **కంబముబాణములు** వి.బ.వ. స్తంభాల మీద స్థిరంగా ఉంచిన బాణాసంచా. **కంబమురాయఁడు** వి. స్తంభంలో వెలసిన అయ్య, నృసింహమూర్తి. యయా. 1.120. **కంబవల్లి** వి. 1. వడుగు కడపటి రోజునచేసే స్తంభపూజ మొ॥ సంస్కార విశేషం ; 2. వడుగు కడపటిరోజు ; 3. వివాహంలో కడపటి రోజున చేసే సంస్కార విశేషం. **కంబసూత్రము** వి. బొమ్మలనాడించటానికి బొమ్మకర్రకు కట్టినదారం. **కంబాలాట** వి. బాలికల ఆటల్లో ఒకాట, నాలుగుస్తంభాలాట.

**కంబరత్రాడు** రూ. కంబరుతాడు, కంబారితాడు. వి. కొబ్బరిపీచుతో అల్లినతాడు.

**కంబరుతాడు** రూ.చూ. కంబరత్రాడు. వి. 1. ఒకవిధమైన మోకు : 2. కొబ్బరి దొప్పపీచుతో పేనిన తాడు.

మ. *కంప*. లావు. తాడు, మోకు, తాటాకు పుస్తకం రాసినకవి.

**కంబలి** రూ.చూ. కంబళి. వి. 1. గొంగళి ; 2. పట్టుపురుగుల ఆహారంకోసం ఆకులు ఉపయోగపడే చెట్టు.

**కంబలేట** చూ. కంబళి. వి. నాణ్యమైన ఒకరకం కంబళి.

**కంబళిచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు.

**కంబళి** రూ. కంబడి[1], కంబలి, కమ్మడి. వి. 1. కంబళి, గొంగళి. కు.సం. 6.100 ; 2. పట్టుపురుగుల ఆహారంకోసం ఉపయోగపడే ఆకులుకల చెట్టు (Morus Indica).

సం. *కంబల*-. ఊలు కంబళి, పైన వేసుకొనే బట్ట ; ప్రా. *కంబల*. ఉన్నిబట్ట ; మహా. *కంబల*. ఊలు కంబళి, ముతకఊలు ; అ.మా. *కంబల*. కంబళి ; పా. *కంబల*. ఊలు, ఊలుకంబళి, ఊలుదారం ; కా. *కమాలి*; నే. *కమల్*, *కంబల్*, *కామ్రొ*. కంబళి ; ఒ. *కంబళి* ; హిం. *కమ్లి*, *క్మ్య*, *కంబల్*, *కయల్* ; ల. *కమ్మల్* ; పం. *కంబల* ; సింధీ. *కమరి* ; గు. *కాంబ్లో*, *కామ్‌ళో*, *కాంబ్లి*, *కాంమ్ల* ; మరా. *కాంబ్ళీ*, *కాంబ్లేం*, *కామ్లీం* ; పార. *కమ్మల్* ; *కంబల్* ;

క. *కంబళి*. కంబళి, నల్లకంబళి ; తు. *కంబొలి*. ఊలుబట్ట, కంబళి; త. *కంపళి*. ముతక ఊలుబట్ట ; మ. *కంపళి*. ఊలుబట్ట, కంబళి ; పర్జి. *క్మ్బ*. కంబళి ; ఒల్లా. *కంబల్*. కంబళి ; మాల్తో. *క్మి*. కంబళి.

<ప్రా. కంబల-.

**కంబళికర్ర** వి. ఒకరకం వంటచెరకు. **కంబళిపండు** వి. పట్టుపురుగు చెట్టు పండు. **కంబళిపురుగు** వి. కంబళిలా ఉండే ఒకానొక పురుగు, గొంగళిపురుగు ; క. *కంబళిహుళు*. గొంగళిపురుగు ; తు. *కంబొళిపురి లేదాపుళి*. గొంగళిపురుగు ; త. *కంపళి-ప్-పుచ్చి*. గొంగళిపురుగు ; మ. *కంపిలిప్పుళు*. గొంగళిపురుగు. **కంబళిబూచి** వి. పట్టుపురుగుల ఆహారంకోసం ఉపయోగపడే ఆకులుకల ఒకచెట్టు (Mores Indica).

**కంబవల్లి** చూ. కంబము.

**కంబసూత్రము** చూ. కంబము.

**కంబాయి** వి. వస్త్రవిశేషం.

**కంబారి** రూ. కంబారీ. వి. 1. ఆసామి తన ఇంట్లోనే అన్నవస్త్రాలిచ్చి సంవత్సరానికి కొంత జీతం ఇచ్చేట్టుగా నిర్ణయించి పెట్టుకొన్న వ్యవసాయపు పనివాడు ; 2. నిత్యసేవ.

ఒ. కబారి. అడవినుంచి బొగ్గు తయారుచేసేవాడు.

<ఒ. కబారి.

**కంబారిత్రాడు** రూ.చూ. కంబరత్రాడు. వి. కొబ్బరి పీచు, తాడు. **కంబారిసేద్యం** వి. జీతగాళ్ళను పెట్టి చేయించే వ్యవసాయం.

**కంబారీ** రూ.చూ. కంబారి. వి. 1. పనివాడు, సేవకుడు; 2. నిత్యసేవ.

**కంబారుపట్ట** చూ. కంబరుతాడు. వి. ఒకరకమైన మోకు.

**కంబాల** వి. ఒకరకం కూరాకు మొక్క.

**కంబాలకూర** వి. కూరాకుదంటు.

**కంబాలాట** చూ. కంబము.

**కంబి** రూ.చూ. కమ్మి[1]. వి. 1. కమ్మి; 2. కిటికీలో అడ్డంగాగాని నిలువుగాగాని బిగించిన ఇనపబద్ద; 3. తీగ; 4. గరిటె; 5. ఎదురుకమ్మి; 6. గానుగమొద్దు మధ్య నాటిన ఇనపకమ్మి.

**కంబు** వి. 1. నజ్జపైరు; 2. గంటిపైరు.

క. *కంబు*. ఒకరకం ధాన్యం; తు. *కంబమ్*. ఒక రకం ధాన్యం; త. *కంపు*. జొన్నలు, ఇటలీజొన్న.

**కంబులు** వి.బ వ. నజ్జపైరు. నజ్జధాన్యం.

**కంబెచ్చు** రూ.చూ. కమ్మచ్చు. వి. అగసాలెబంగారం వెండి మొ. వాటి తీగతీసే పనిముట్టు.

**కంబోచ** వి. కాంబోజదేశం.

నం. *కాంభోజ*-. ఒకదేశం.

<నం. కాంభోజ-.

**కంబోరు** రూ.చూ. కమ్మవారు. వి బ.వ. కమ్మకులంవారు.

**కంభకట్టు** చూ. కంభము.

**కంభము** రూ.చూ. కంబము వి. స్తంభం.

**కంభకట్టు** వి. వివాహవేదిక మొ. వాటి స్తంభం చుట్టూ కట్టినబట్ట. కు.నం. 9.3.

**కంభారతియినాము( -ఇనాము)** వి. ఇంకా ఎక్కువగా ఇచ్చిన మాన్యం నేల.

**కమ్మ[1]**. వి. 1. కర్ణభూషావిశేషం, తాటంకం. హర. 5.44; 2. పత్రిక, జాబు. శుక. 3.443; 3. తాటాకు. ఆం.భా. 2.77; 4. మట్ట. ఆం.భా. 2.248; 5. శాకనాళం; 6. కాడ; 7. పత్రవృంతం; 8. తాటాకుమీద రాసిన దస్తావేజు.

త. *కమ్మల్*. స్త్రీలు చెవులకు పెట్టుకునే ఆభరణం; కువి. *కమ్మ*. పిడి; కొలా. *కమ్మ*. స్త్రీల చెవిదుద్దు (అర్థవిపరి.).

**కమ్మకట్టు** వి. 1. ఓడిన రాజు గెల్చిన వానికి సంధిషరతుల్ని అనుసరించి చేసే సాయం. వేంక. పంచ. 1.513; 2. కూలి తీసుకొని యుద్ధం చేయడం; 3. రాతమూలకంగా సేవ చేయడానికి ఒప్పుకోవడం. **కమ్మకట్టె** వి. 1. ఆకులు మొ. తీయడానికి ఉపయోగించిన కొడవలి బిగించిన పొడవాటి పెదురు; 2. కుసుమాయుధం; 3. పుష్పాస్త్రం. **కమ్మకత్తి** వి. కంపమండలు నరికే మొద్దుకత్తి. **కమ్మగట్టు (-కట్టు)** స.క్రి. గేలిచేయు, వెటకారం చేయు (గేలి చేయటానికి ఆపులు కడతారు). **కమ్మచిచ్చు** వి. మొక్కజొన్న తెగులు. **కమ్మటాకు** వి. ఆభరణ విశేషం. సిం.ద్వా. 4.140. (కమ్మ[1] + ఆకు) **కమ్మతెవులు** వి. మొక్కజొన్న తెవులు. **కమ్మపంజు** వి. రత్నాలుండటం చేత దివిటీలాగ వెలిగే కమ్మ, రత్న తాటంకం. మను. 3.28. **కమ్మపరుపు** వి. మట్టికప్పు మీద ఆకులు పేర్చడం. **కమ్మపువ్వు** రూ.చూ. కమ్మపూవు. వి. కమ్మపంజు. దశకు. 3.77. **కమ్మపూవు** రూ. కమ్మపువ్వు. వి. కమ్మపంజ, రత్నతాటంకం. **కమ్మశౌజు** వి. కర్ణభూషావిశేషం. సురా. 104. **కమ్మరోగం** వి. ఉల్లి తెగులు. **కమ్మలకత్తి** వి. కత్తిదోటి. **కమ్మలు** వి.బ.వ. తమ్మంట్లు, అంటుజోళ్ళు. **కమ్మాకు** వి. తాటాకు.

<కమ్మ[1] + ఆకు.

**కమ్మ[2]** వి. వ్యవసాయం ప్రధాన జీవన వృత్తిగా కల ఒక కులం పేరు. ఈ కులంవారు ప్రాచీన కాలంలో క్షత్రియులుగా ఉన్నప్పటికీ అర్వాచీన కాలంలో శూద్రులుగా పరిగణించబడ్డారు. ద.హిం.శా. సంపు. 6.633, 634, 635. క్రీ.శ. 1158, భీమ. 1.32.

వ్యు. 1. క్రమరాజు సంతతివారు కమ్మవారు, 'క్రమ' శబ్దానికి తద్భవరూపం కమ్మ కావచ్చు. సం. *క్రమ*-. మనోహరమైన వారు అనే వ్యుత్పత్తితో సం. 'క్రమ' శబ్దాన్ని సాధించవచ్చు లేదా సం. *కర్మన్*. శబ్దానికి 'కరమ' తద్భవంగా గ్రహించి జనుల ఉచ్చారణత్వర వల్ల సం. *క్రమ*-. శబ్దం ఏర్పడిందని భావించవచ్చు; 2. కమ్మమెట్ట స్థావరంగా కలవారు; 3. కమ్మనాటిని పాలించే వారు కమ్మవారు; సం. *కర్మన్*-. పని; ప్రా. *కమ్మ*-. కర్మ రాష్ట్రమే కమ్మ రాష్ట్ర మనబడేది; 4. కూర్మ కులం వారు కమ్మవారు; 5. కమ్మల్ని (ఉత్తరాల్ని) అందించేవారు కాబట్టి కమ్మవారు. ఈ వ్యుత్పత్తి విశ్వసనీయం కాదు; 6. అ. రాక్షస బాధా నివారాణార్థం కమ్మదీత ఋషికి లక్ష్మీదేవి తన చెవికమ్మ ఇవ్వగా ఆ కమ్మ నుండి 500 మంది పుట్టి రాక్షసుల్ని చంపి కమ్మవారయ్యారు. ఇదీ కల్పితంగా కన్పిస్తోంది; ఆ. ధర్మపాలుడు శత్రు పీడితుడై పారిపోతుండగా నది అడ్డగించగా రేణుకాదేవి తన చెవి కమ్మను తీసి ఆ ఋషికివ్వగా, అతడు సునాయాసంగా నదిని ఆ కమ్మ సాయంతో దాటి 'కమ్మ' నామాన్ని అతడు, అతడి సంతతి వారు ధరించారట, ఇది వాస్తవం కాకపోవచ్చు.

క్రమ రాజు సంతతి వారై కమ్మనాటికి చెందినవారు కమ్మవారు కావచ్చు.

క. *కమ్మె*-. బ్రాహ్మణుల్లోని ఎనిమిది వర్ణాల్లో ఒక వర్ణం (మైసూరు స్మార్త బ్రాహ్మణులు); మ. *కమ్మళ్*. శూద్ర ప్రభువులు (పుళమైలాగ) నాయర్ల వంటి జాతి.

<ప్రా. *కమ్మ*-<సం. కర్మన్ (అర్థ విపరి.).

**కమ్మబ్రాహ్మణులు** వి.బ.వ. పౌరోహిత్యం చేసే కమ్మవారు. **కమ్మవారు** రూ. కంబోరు. వి.బ.వ. కమ్మకులంవారు.

**కమ్మ[3]** విశే. 1. నాసికప్రియమైన, సువాసన గల. భార.ఆది. 5.138 హర. 2.20; 2. రుచికరమైన, మధురమైన. శృం.నై. 2.99; 3. చక్షుప్రియమైన, చక్కని. విక్ర. 4.44.

క. *కమ్మ*, *కంపు*. దుర్గంధం, సువాసన, *కమ్ము*. సువాసన గల, *కంపిసు*. పరిమళభరితమైన, *కమ్మగె*, *కమ్మనె*. వాసనగల, పరిమళం, *కమ్మిట్లు*. సువాసన

గలది, గమ. సువాసన తెలిపే పదం, గమన. వాసన; గంపు. పరిమళం. గబ్బు, కర్పు. దుర్వాసన; తు. కమ్మెన, కయ్యన. వాసన. గమ్మ. మంచి లేదా చెడు వాసన, గమగమ. పరిమళం, కమ్మెనల్. సువాసన ప్రసరింపజేయటం; గమసు. దుర్గంధం, గమసుని. వాసన వేయు, గమాయిసుని. సువాసన వేయు; త. కమ్మెనల్. పరిమళించు, కమకమ. ఎక్కువగా పరిమళించు, సువాసన. కమఱు. పరిమళించు; మ. కమనం. కోరదగిన; కో. గమ్ల్. సువాసన. గమగమ్న్. పరిమళించు; కొలా. కమ్కంప్. వాసన. కప్. వాసన; కురు. గమగ్రమనా. పూలుపరిమళించు, గమకె. వాసన, గమ్కార్న. పరిమళించు; గమక్. సువాసన.

<ము.ద్రా. *కమ్.

కమ్మకత్తి[2] వి. కుసుమాయుధం. కకుత్స. 3.78. కమ్మకపింద రూ. కమ్మకసింది, కమ్మకసివెంద. వి. ఒక జాతి కసింద. కాశీ. 7.185. కమ్మకపింది రూ.చూ. కమ్మకసింద. వి. ఒక జాతి కసింది. సువాసన నిచ్చే ఆకు కలిగిన చెట్టు, కమ్మకసివెంద రూ.చూ. కమ్మకసింద. వి. ఒక జాతి కసింద. కమ్మకోడె వి. ఒంగోలుజాతి కోడెదూడ. కమ్మకోమటి వి. కమ్మనాటికోమటి. కమ్మగాడుపు రూ. కమ్మగాడ్పు. వి. మలయమారుతం. కమ్మగాడ్పు రూ.చూ. కమ్మగాడుపు. వి. మలయమారుతం. కమ్మతనము వి. తియ్యదనం. కమ్మవిణ. కమ్మని. వి. కమ్మదనం, మాధుర్యం, సౌరభం, సువాసన. కమ్మనాడు వి. ఆంధ్ర దేశంలోని ఒక భాగం, వ్యు. తియ్యని దేశం. కమ్మని విణ. ఉప్పు కారం ఎక్కువ కాని, తియ్యని, మంచి వాసన గల. కమ్మనిమ్మ వి. నిమ్మ పండులాంటి వర్ణంలో ఉన్న కిత్తలి, తియ్యని నిమ్మ, శర్కాంకం. కమ్మనివింటిజోదు వి. మన్మథుడు, ఇక్షుధన్వుడు. పి.శకు. 2.129. కమ్మనివిల్తుడు రూ. కమ్మవిల్తుడు. వి. తియ్యని విల్లు కలవాడు, మన్మథుడు. ఉ.హరి. 4.115. కమ్మనీరు వి. 1. పన్నీరు, హిమాంబువు. శృం.నై. 3.102; 2. మకరందం, తేనె. ఆము. 5.121; 3. తియ్యని నీరు. కమ్మనూనియ రూ.చూ. కమ్మనూనె. వి. సువాసన ఉన్న నూనె. భార.అను. 2.308. కమ్మనూనె రూ. కమ్మనూనియ. వి. 1. సువాసన ఉన్న తైలం. హర. 2.89; 2. మంచి నూనె. కమ్మపేత వి. ఆకుతో కప్పడం. కమ్మపిల్లి వి. గంధ మార్జాలం, పునుగుపిల్లి. పి.శకు. 1.98. కమ్మపూత వి. పరిమళద్రవ్యలేపం, మైపూత, అంగరాగం, వేంక. పంచ. 3.259. కమ్మరేగు వి. బదరీవిశేషం, నక్కరేనుచెట్టు. ఆం.భా. 2.45. (Artocarpus Lakorcha). కమ్మరేమ వి. బదరీ విశేషం. కమ్మరేమపండు వి. కమ్మరేగుపండు. కమ్మవడ వి. భక్ష్య విశేషం. పాంచాలీ. 4.59. కమ్మవలచు అ.క్రి. పరిమళించు. జైమినీ భా. 1.18. కమ్మవిలు రూ. కమ్మవిల్లు. వి. తియ్యని విల్లు. కవిరా. 2.158. కమ్మవిలుకాడు రూ. కమ్మవిల్కాడు. వి. మన్మథుడు. విక్ర. 8.57. కమ్మవిలుతుడు రూ. కమ్మవిల్తుడు. వి. మన్మథుడు. కమ్మవిల్కాడు రూ.చూ. కమ్మవిలుకాడు. వి. మన్మథుడు. కమ్మవిల్తుడు రూ.చూ. కమ్మవిలుతుడు. వి. ఇక్షుధన్వుడు, మన్మథుడు. కమ్మవివిల్తునిమామ వి. చంద్రుడు, వ్యు. మన్మథునిమామ. కమ్మవిల్వానమేటి వి. మన్మథుడు. వ్యు. చెరుకు విల్లుగా కలవాడు. కమ్మవిల్లు రూ. కమ్మవిలు. వి. తియ్యని విల్లు, చెరుకు విల్లు. కమ్మోళదంటు వి. తోటకూర.

కమ్మచ్చు చూ. కమ్మి[1].

కమ్మచ్చువడీయు చూ. కమ్మి[1].

కమ్మంచు చూ. కమ్మి[1].

కమ్మటము రూ. కమటము. వి. అగసాలెవాని కుంపటి. చంద్రాంగ. 4.17.

కమ్మటీడు రూ. కమటీడు. వి. అగసాలెవాడు, స్వర్ణకారుడు.

కమ్మటి రూ.చూ. కామోటి. వి. పలెటూరివాడు.

కమ్మటీడు చూ. కమ్మటము.

కమ్మడి రూ.చూ. కంబళి. వి. గొంగళి.

కమ్మతకాడు చూ. కమ్మతము.

కమ్మతగాడు చూ. కమ్మతము.

కమ్మతము రూ. కమతము. వి. 1. పొలం. పి.శకు. 4.175; 2. కమతం, సాగు. నార.పంచ. 5.18.

క. కమత. రైతు కౌలుకిచ్చి చేయించే సేద్యం; మ. కీమత్. స్వయంగా చున్నుకొనే పొలం.

కమ్మతకాడు రూ. కమతకాడు, కమతగాడు, కమ్మతగాడు. వి. సేద్యం చేసేవాడు. శుక. 3.50. కమ్మతగాడు (-కాడు) రూ.చూ. కమ్మతకాడు. వి. సేద్యం చేసేవాడు. కమ్మతీడు రూ. కమతీడు. వి. కమతం చేసేవాడు. మను. 5.47.

కమ్మతీడు చూ. కమ్మతము.

కమ్మర రూ.చూ. కనుమరి. వి. లోహకారుడు, కమ్మరవాడు.

కమ్మరగట్టు వి. బెల్లంపాకంతో చేసిన నూవుల ఉండ. కమ్మరత వి. కమ్మరది. కమ్మరది వి. కమ్మరత. కమ్మర మాన్యం వి. కమ్మరవాడికిచ్చిన మాన్యం. కమ్మరము వి. ఇనపపనిచేసేవాని వృత్తి. ఆం.భా. 2.284. కమ్మరంమేర వి. ఇనపమేర. కమ్మరవాడు వి. కమ్మరి.

కమ్మరి రూ.చూ. కనుమరి. వి. ఇనపపనిచేసి బతికేజాతి. యయా. 2.89.

కమ్మరిఇనాం వి. కమ్మరివాడికిచ్చిన ఇనాం. కమ్మరీడు వి. కమ్మరి. వేమన. 1.52, నీలా. 3.10.

కమ్మరించు స.క్రి. కప్పు.

కమ్మరీడు చూ. కమ్మరి.

కమ్మరు రూ.చూ. కమరు[2]. వి. ఒడ్డాణం, మొలనూలు. వసు వ్యాఖ్య. 6.11, రసిక. 1.75.

కమ్మరుడు వి. కమ్మటివాడు, పల్లెటూరివాడు.

కమ్మరుబొందు వి. రెండుగాడి కొమ్ముల నడిమి బిగిబద్ద.

కమ్మసారి వి. కమ్మరి.

కమ్మసాలి రూ.చూ. కంసాలి. వి. స్వర్ణకారజాతివ్యక్తి.

కమ్మాకు చూ. కమ్మ[1].

కమ్మాన చూ. కమ్మ[3]. వి. మాధుర్యం, తీపి.

కమ్మానకొను అ.క్రి. మధురత గైకొను, తియ్యనగు. రాధికా. 4.20.

కమ్మి[1] రూ. కంబి, కమ్మీ[1]. వి. 1. బండికంటికమ్మి, నేమి. హరి.పూ. 5.172 ; 2. చీరకు పేకలోఉండే అంచు. భీమ. 1.115 ; 3. నాసికాలంకార విశేషం. నీలా. 3.49 ; 4. పేముబొద్దు ; 5. రాట్నం తిరగడానికి ఆధారంగా నిలువలకు బిగించిన ఇనపచువ్వ ; 6. దబ్బారాట్నానికి గంటం బిగించే నిలువుచెక్క ; 7. అనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డపట్టె ; 8. మరానుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావడానికి మేకులు బిగించిన పట్టె ; 9. చేనేత సాధనాల్లో వాడే ఇనపవుల్ల, గంటం.

క. కంబి. తీగె. బట్టంచుచుట్టూ ఉన్న గీతలు, ఇనపపట్టి, ఇనపచువ్వ ; తు. కంబి. తీగ, బట్టంచు, తిన్నగా ఉన్న ఇనపచువ్వ ; త. కంపి. బంగారం, వెండి, ఇనుము మొదలైన లోహాలతో చేసిన తీగ, బట్టంచుకున్న సన్నని గీత ; కంపి. గుర్రపు కళ్ళెంలో ముక్క ; మ. కంపి. వీణ తీగ, బట్టంచుకున్న చార ; కంపి. ఇనపచువ్వ.

కమ్మచ్చు రూ. కంబెచ్చు, కమ్మియచ్చు, కమ్మెచ్చు. వి. కంసాలి బంగారం, వెండి మొ. వాటి తీగతీసే పనిముట్టు. కమ్మచ్చువ(దీయు స.క్రి. 1. బలాత్కారంగా లొంగదీయు ; 2. లోహాదుల్ని పోగారుతో తీగగా సాగదీయు. కమ్మంచు వి. 1. సాగదీయటానికి సాధనమైన రకరకాల రంధ్రాలున్న ఇనపరేకు. సాంబో. 1.147 ; 2. కమ్మితీయు ; 3. ఉసిగొల్పు. కమ్మిచీర వి. సన్నంచు చీర. కమ్మించు స.క్రి. 1. కమ్మంచులో పెట్టి తీగ సాగదీయు ; 2. ఉసిగొల్పు. కమ్మితీయు అ.క్రి. తీగతీయు. పార్వ. 2.24. కమ్మిమూకు స.క్రి. కమ్మచ్చునతీయు. సారంగ. 2.42. కమ్మిపార వి. రెండు రేకులు ఒకదానికొకటి అతికిన ఇనపకామగలపార. కమ్మిబండి వి. కమ్మివేసిన మానిచక్రాలబండి. కమ్మియచ్చు(-అచ్చు) రూ.చూ. కమ్మచ్చు. వి. తీగతీయటానికి ఉపయోగించే రకరకాల రంధ్రాలున్న ఇనపరేకు. కమ్ములుపిండివార్చు స.క్రి. చాకలి బట్టల్ని చలవచేయు. కమ్ములువార్చు స.క్రి. చాకలి బట్టల్ని తెలుపుచేయు. కమ్మెర వి. సన్నంచు చీర.

కమ్మి[2] వి. 1. లోపం, తక్కువ ; 2. న్యూనత, అల్పత్వం.

హిం.ఉ. కమీ ; పార. కమ్.

క. తు. కమ్మి. లోపం ; మ. కమ్. కొద్దిగా, లోపం ; కమి. లోపం.

<ఉ. కమీ.

కమ్మి[3] వి. కొలమానం.

కమ్మించుకడవ వి. పీర్లపండుగలో నీళ్ళు తేవడానికి వాడే మట్టి కడవ.

కమ్మిటబెట్టు స.క్రి. దాచు, గూఢంగా ఉంచు.

కమ్మివేటి రూ.చూ. కమ్మాటి. వి. 1. దొంగ ; 2. ఒకతిట్టు ; 3. పల్లెటూరివాడు.

కమ్మిరంచు రూ. కమ్మిరించు[2]. వి. పాత్రల అంచుల్లో ఒకరకం.

కమ్మిరాకు రూ. కమెరాకు, కమ్మెరాకు, కమ్మేరాకు. వి. కారం ఉన్న నల్ల తమలపాకు (Piper bettle).

కమ్మిరించు[1] స.క్రి. మూయు, కప్పు, మూతపెట్టు. శృం.నై. 7.93.

కమ్మిరించు[2] రూ.చూ. కమ్మిరంచు. వి. పాత్రల అంచుల్లో ఒక రకం.

కమ్మిసద్ద వి. సజ్జలో ఒక రకం.

కమ్మీ[1] రూ.చూ. కమ్మి[1]. వి. 1. బండిచక్రం అరిగిపోకుండా అడుగున బిగించిన ఇనపకమ్మి ; 2. కిటికీలో అడ్డుగా కాని నిలువుగా కాని బిగించిన ఇనపబద్ది ; 3. కొయ్యవాసం ; 4. లావు చువ్వ, మూరెడు పొడుగుండే ఇనపచువ్వ.

కమ్మీపట్టె వి. బండిచక్రం చుట్టూ బిగించిన ఇనప కట్టు. కమ్మీపలుగు వి. రాతికి కన్నాలు వేయడానికి పనికివచ్చే పరికరం.

కమ్మీ[2] వి. మరుగు, మాటు.

కమ్మీచేయు స.క్రి. కప్పు, మరుగుపరుచు. కమ్మీపడు అ.క్రి. 1. దాచబడు ; 2. మూతపడు. కమ్మీపఱచు స.క్రి. 1. దాచు ; 2. మూయు ; 3. కప్పు.

కమ్ము[1] రూ. క్రమ్ము. వి. 1. కప్పు. బిల్హ. 1.41 ; 2. అటకలమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క. స.క్రి. కప్పు, ఆవరించు, చుట్టుముట్టు.

క. కప్పు. కప్పు, కమ్ముకొను, ఆవరించు ; తు. కబియుని. కమ్ముకొను. ఆవరించు (మేఘాల్లాగ) ; త. కప్పు (కప్పి). ఆవరించు, కమ్ముకొను, చుట్టుముట్టు, కప్పు (గొడుగులాగ), చీకటిచేయు, మూయు, పైన కప్పు, కవిప్పు. కప్పు ; కమ్ము (కమ్మి.) మబ్బుకమ్ము, చీకటిగా వున్న, నల్లని ; కమ్మల్. కాంతిహీనం (వజ్రంలా, దీపంలా, అద్దంలా). మబ్బు కమ్మిన, అస్పష్టత ; మ. కప్పుక, కమ్మిక. కప్పు, ఆక్రమించు, ఆవరించు ; కవియుక. ఆక్రమించు, కవియన్. కప్పు, మూత, దిండుగలేబు. కవిక్కల్, కమిక్కల్. వెల్లువ, అతిక్రమించు (దురాక్రమణ) ; తొ. కొఫె (కొపె). గుమికూడు ; కువి. కఫ్నై. పర్జి. కప్. కప్పు, కమ్ము ; కురు. కప్నా. సరిగా కప్పు, కలుపు.

సం. కవక. -కవచం, రవికె.

కమ్ముకొను స.క్రి. వ్యాపించు, గట్టిగా ఉంచుకొను. కమ్ముడుదల రూ. కమ్ముదల. వి. మరుగుపాటు, దాగుడు, నీరు కాలవగుండా రాకుండా అడ్డగించడం, నిరోధించడం, అడ్డంకి. కమ్ముదల (-తల) రూ.చూ. కమ్ముడుదల. వి. కప్పుదల, మరుగుపాటు. కమ్ముపీళ్లు వి. చలవచేసిన బట్టలు తడపడానికి ఉపయోగించే నీలిమందు నీరు, చౌడు, సున్నం కలిపిన నీళ్లు.

కమ్ము[2] అ.క్రి. అగు యొక్క విధ్యర్థకైకవచనం, అగు. భార. ఆది. 1.136.

కమ్ము[3] చూ. కమ్మి[1]. అ.క్రి. తీగతీయు. లోహాన్ని తీగలా సాగగొట్టు. వసు. 2.

కమ్ముబాన వి. చాకళ్ళ ఉబ్బలో బట్టల్ని ఉడికించడానికి వాడే మట్టి పాత్ర, చాకలి గూన.

కమ్ములు[1] చూ. కమ్మి[1]. వి.బ.వ. 1. బండిచక్రానికి అమర్చిన గుండ్రని ఇనప ఊచలు ; 2. బండిపట్టాలు.

కమ్ములు[2] వి.బ.వ. చేపలు.

కమ్ములు[3] వి.బ.వ. విశ్వబ్రాహ్మణులు.

కమ్ములుపిండువార్చు చూ. కమ్మి[1].

కమ్మలువార్చు చూ. కమ్మి[1].
కమ్మె వి. వాసాలమీద వేసే మండలచుట్ట.
కమ్మెచ్చు రూ.చూ. కమ్మచ్చు[1].
కమ్మెదీయు (-తీయు) స.క్రి. చెప్పకుండా వెళ్ళిపోవు.
కమ్మెర చూ. కమ్మి[1].
కమ్మెరాకు రూ.చూ. కమ్మిరాకు. వి. కారంఉన్న నల్ల తమల పాకు.

కమ్మెరాకుతీగ వి. కారం నల్ల తమలపాకుల తీగె (Piper bettle).

కమ్మెరాయి వి. ఇంటి నేలమీద పరిచే పల్చనిరాయి.
కమ్మెరి రూ.చూ. కమ్మెఱ్రి. వి. 1. అధికారవాంఛ ; 2. తాను అధికుడినన్న అహంభావం.
కమ్మెఱ్రి రూ. కమ్మెరి. వి. 1. అధికారవాంఛ ; 2. తాను ఎక్కువ వాడినన్న అహంకారం.
కమ్మెలు వి.బ.వ. నియోగి బ్రాహ్మణులలో ఒక శాఖ, ప్రథమ శాఖ నియోగులు.
కమ్మేరాకు రూ.చూ. కమ్మిరాకు. వి. కారంఉన్న నల్ల తమల పాకు.
కమ్మొల్లదంటు చూ. కమ్మ[3].
కమ్యూనిటీ వి. ప్రజలు, జనం, సంఘం.

ఇం. *Community*. జనుల సముదాయం.

<ఇం. Community.

కమ్యూనిస్టు వి. సామ్యవాదాన్ని సమర్థించే రాజకీయపార్టీకి చెందిన వ్యక్తి.

ఇం. *Communist*. కారల్ మార్క్స్ సిద్ధాంతాను యాయి.

<ఇం. Communist.

కయల రూ.చూ. కైల[1]. వి. ఒకరంగు నలుచదరం గడిలో నేసిన వేరే రంగుగడి, తురకలు కట్టుకునే ఒకరకం లుంగీ.
కయాణ వి. 1. కల్యాణం ; 2. మంచిపని.

సం. కల్యాణ-. మంగళం.

<సం. కల్యాణ-.

కయాలు వి. అస్థిర చిత్తం.

ఉ. హిం. ఖయాల్, ఖ్యాల్, ధ్యానం, ఆలోచన.

<ఉ. ఖయాల్.

కయాహము వి. గేదెదూడ.
కయి[1] రూ.కై[1]. వి. 1. చేయి, హస్తం. అచ్చ. రా. యుద్ధ. 4.93 ; 2. తొండం.

కయికట్టు రూ.చూ. కైకట్టు. వి. 1. సందర్భం ; 2. చేతి కట్టు. కయికలవా(డు రూ.చూ. కైకలవా(డు[1]. వి. 1. చేనేత వృత్తిగా కలవాడు, సాలెవాడు ; 2. చేయికలవాడు. కయికాడి వి. నిండుబండిని ఎద్దులకు కట్టినట్లే నిలబెట్టడానికి వెనకచట్టానికి పోటీ పెట్టే నిలువుకొయ్య. కయికానుక రూ.చూ. కైకానుక. వి. 1. రాజులను చూడడానికి వెళ్ళే టప్పుడు తీసుకుపోయే కానుక. శుక. 6.80 ; 2. కట్నం, లంచం. కయికాన్క రూ.చూ. కైకానుక. వి. 1. రాజులు మొ॥ వారిని చూడటానికి వెళ్ళినపుడు తీసుకువెళ్ళే ద్రవ్యం. ఉపాయనం ; 2. అలంబం. కయికాన్కచేయు స.క్రి. బహు మతులిచ్చు. శుక. 4.80. కయికానము రూ.చూ. కైకానము. వి. రాపిడి, ఒరపిడి, వంత. కయికిలి వి. దినబత్తెం, కైకూలి. రోజూ చేతికిచ్చేకూలి. <కయి[1] + కూలి. కయికిలిపోవు అ.క్రి. కూలిపోవు. కయికూడు రూ.చూ. కైకూడు. అ.క్రి. సంభ వించు, కలుగు, పుట్టు, సారంగ. 3.101. వు. 4. పం. కయికూలి రూ.చూ. కైకూలి. వి. రోజువారీబత్తెం, వ్య. రోజూ చేతికిచ్చే కూలి. కయికొను రూ.చూ. కైకొను. స.క్రి. 1. చేపట్టు, పొందు, చెందు. ఉ.హరి. 5.13, వసు. 3.16 ; 2. లక్ష్యపెట్టు, సరకుగొను. హర. 7.100. కయికొలుపు రూ.చూ. కైకొలుపు. స.క్రి. 1. ఒప్పించు ; 2. పొందు. కయికొల్పు రూ.చూ. కైకొలుపు. స.క్రి. 1. ఒప్పించు ; 2. పొందు. కయికోల రూ.చూ. కైకోల. వి. చేతికర్ర, కయికోలవాడు రూ.చూ. కైకోలవాడు. వి. తంతు వాయుడు, సాలెవాడు. కయికోలు రూ.చూ. కైకోలు. వి. 1. ప్రతిజ్ఞ ; 2. అంగీకారం. కయిదా(పులు రూ. కైదా(పులు. వి.బ.వ. నమస్కారాలు. వ్య. చేతిని చాపుటలు. కయిచిప్ప రూ.చూ. కైచిప్ప. వి. ఆల్చిప్ప. కయిచూఱ రూ. చూ. కైచూఱ. వి. కొల్ల, సమృద్ధి. ద్వి. భల్లా. 1.19. కయిచెఱ రూ.చూ. కైచెఱ. వి. 1. చేతిలోబంది ; 2. లోబడింది. కయి చేయు రూ. కైసేయు. స.క్రి. అలంకరించు, ముస్తాబుచేయు. అలంకారాలుపెట్టుకొను. కయిజామోర రూ.చూ. కైజామోర. వి. 1. హయశీర్ష కంపనం ; 2. కళ్ళెంతో వెనుకకు బిగిం చిన మూతి. కయిజారు అ.క్రి. ఒరగు, అస్తమిల్లు. కయిజాఱు రూ.చూ. కైజారు. వి. మొలకత్తి. కయిజీతగా(డు రూ.చూ. కైజీతగా(డు. వి. ఎప్పటికప్పుడు ఇచ్చిన జీతంపై బతికేవాడు. కయిజీతము రూ.చూ. కైజీతము. వి. రోజు కూలి. కయితప్పు రూ.చూ. కైతప్పు. వి. పొరపాటు, చేతిపొర పాటు. కయితాళము వి. చేతితో వాయించే కంచుతాళం. కయిదండ రూ.చూ. కైదండ. వి. చేయూత, ఊత, సాయం. పారి. 3.40 ; కవిక. 4.12. కయిదండవట్టు (-వట్టు) వి. చేయూతనిచ్చు. కాళ. 2.6. కయిపడు రూ.చూ. కైపడు. అ.క్రి. కిందకు ఒరుగు. కయిపదము రూ.చూ. కైపదము. వి. సమస్య. కయిపాడు రూ. కైపాడు. అ.క్రి. కిందికొరుగు. కయిబారి వి. చేతిబార. కాళింది. 2.90. కయిముట్టు స.క్రి. చేజిక్కించుకొను, చుట్టుముట్టు. భాగ. 10.560. కయిముడి రూ.చూ. కైముడి. వి. వాద్యవిశేషం. కయిమొలవు వి. హస్తలాఘవం, గారడి. కయిమోడుచు రూ.చూ. కైమోడుచు, కైమోడ్చు. స.క్రి. నమస్కరించు. కయిమోడుపు రూ.చూ. కైమోడుపు. వి. నమస్కారం. కయిమోడ్పు రూ.చూ. కైమోడ్పు. వి. నమస్కారం. కయిలాగు రూ.చూ. కైలాగు. వి. హస్తావలంబం, చేయూత. కువల. 2.47. కయిలాట రూ.చూ. కైలాట. వి. 1. మాయో పాయం, మాయ, మోసం ; 2. కీడు. కయిలాట కత్తియ రూ. చూ. కైలాటకత్తెయ. వి. మోసకత్తె, మాయావిని. కయిలాటకత్తె రూ. చూ. కైలాటకత్తె. వి. మోసకత్తె, మాయావిని. కయిలాటకా(డు రూ.చూ. కైలాటకా(డు. వి. మోసకాడు, మాయావి. కయిలాటకము రూ.చూ. కైలాటకము. వి. మాయోపాయం, మోసం.

**కయిలాటము** రూ.చూ. కైలాటము. వి. మోనం. **కయిలాటవము** రూ. చూ. కైలాటము. వి. నమస్కారం. **కయిలానకి** రూ.చూ. కైలానకి. వి. నాట్యవిశేషం. **కయివడి**[1] రూ.చూ. కైవడి[1]. వి. **1.** ప్రకారం, రీతి, పోలిక. భార. భీష్మ. 2.93 ; **2.** కరజవం, చేతివడి, చురుకు. సారంగ. చ. 1.76. **కయివడు** (-వడు.) రూ.చూ. కైవడు. అ.క్రి. కిందికొరుగు. **కయివళి** రూ. చూ. కైవడి[1]. వి. **1.** చేతి చురుకు ; **2.** రీతి, పోలిక. **కయివనము** రూ.చూ. కైవనము. వి. స్వాధీనం. **కయివాఁడు** వి. సాలెవాడు. **కయివారపుఁజెయ్యి** (-చెయ్యి) రూ.చూ. కైవారపుఁజెయ్యి. వి. నమస్కార విశేషం. **కయివారము** రూ.చూ. కైవారము[1]. వి. స్తోత్రం, పొగడ్త. బసవ. 2.26, ఘటికా. 2.67. **కయివారముచేయు** అ.క్రి. పొగడు, పూజించు. **కయివారి** రూ.చూ. కైవారి. వి. స్తోత్రం చేసేవాడు. **కయివాలు** రూ. కయివ్రాలు, కైవాలు, కైవ్రాలు. అ.క్రి. **1.** వంగు, ఒరుగు, దీనమగు. నుద. 3.4. ; **2.** పడు ; **3.** మ్లానమగు ; **4.** గతించు, కడచు. **కయివాలుచు** రూ. కైవాలుచు. స.క్రి. కైవాలజేయు. **కయివాల్చు** రూ.చూ. కైవాలుచు. స.క్రి. కైవాలజేయు. **కయివీఁగు** రూ.చూ.కైవేఁగు. అ.క్రి. అలయు, చేస్తున్నపనినుండి మరలు. కు.నం. 11.207. **కయివ్రాలు** రూ.చూ. కైవ్రాలు. అ.క్రి. **1.** పడు, జారు. ఆము. 4.25 ; **2.** ప్రవహించు ; **3.** వంగు. **కయివ్రాలుచు** రూ.చూ. కైవాలుచు. స.క్రి. కయివాలజేయు. **కయివ్రాల్చు** రూ.చూ. కైవాలుచు. స.క్రి. కయివాలజేయు. **కయిసడలు** రూ. కైసడలు. అ.క్రి. కైవాలు, వంగు, చెయ్యిజారు. **కయిసన్న** రూ. కైసన్న. వి. చేతి సైగ, పిలుపు. **కయిసాటిచుక్క** రూ.చూ. కైసాటిచుక్క. వి. హస్తానక్షత్రం. **కయిసేఁత** (-చేఁత) రూ.చూ. కైసేత. వి. అలంకారం, ముస్తాబు. పాండు. 3.75. **కయిసేయు** (-చేయు) రూ. కైసేయు. స.క్రి. అలంకరించు, ముస్తాబు చేయు. భార. ఆది. 4.149. అ.క్రి. అలంకారాలు పెట్టుకొను. పారి. 2.43.

**కయి**[2] రూ.చూ.కై[2]. వి.కవి, పద్యాలు అల్లేవాడు. సాం.ని. 2.6.

**కయిపదము** రూ.కైపదము. వి. సమస్య. **కయిసరుఁడు** రూ. కయీసరుడు, కైసరుడు. వి. కవీశ్వరుడు, కవిత్వం చెప్పేవాడు. <నం. కవీశ్వర-.శ్రేష్ఠుడైన కవి. **కయీసరుఁడు** రూ.చూ. కయిసరుఁడు. వి. కవీశ్వరుడు.

**-కయి**[3] రూ. కై[3]. అవ్య. **1.** నిమిత్తం, కొరకు. భార.శాంతి. 1.39. చతుర్థీవిభక్తి ప్రత్యయం ; **2.** దిశలో, వైపుగా. కువ. చ. 4.93.

**కయిక** రూ.చూ. కైక. వి. కైక, భరతునితల్లి, దశరథుని భార్య.

**కయిజా** రూ.చూ. కైజా. వి. వాగెనువెనక్కిఈడ్చికట్టడం.

**కయిజాచేయు** రూ.చూ. కైజాచేయు. అ.క్రి. కళ్ళెల పగ్గాల్ని బిగించు. **కయిజామోర** రూ.చూ. కైజామోర. వి. **1.** హయశీర్షకంపనం ; **2.** కళ్లెంలో వెనకకుబిగించిన మూతి.

**కయిజారుకట్టు** స.క్రి. అంగడిలో సుంకం కట్టు.

**కయిజు** రూ.చూ. కముజు. వి. కపింజలం, కౌజు.

**కయించి** వి. **1.** బట్టీపొయ్యి మీద అడ్డంగా ఉంచినరాయి ; **2.** కట్టుబడి సమయంలో ద్వారబంధాలు మొ॥ కదలకుండా నిలపడానికి రెండుకర్రలను పైపైపున బిగించి కట్టికింద పంగటించి నిలిపిన తాత్కాలికమైన ఏర్పాటు.

**కయించికర్ర** వి. పోటిగాపెట్టినకర్ర.

**కయిత** రూ.చూ. కైత. వి. కవిత్వం.

**కయితగాఁడు**(-కాఁడు) రూ.చూ. కైఁతగాఁడు. వి. కవి, కవిత్వంరాసేవాడు.

**కయితచాలు** వి. మడికినీరుపెట్టి దున్నినచాలు.

**కయితట్ట** వి. బంగారంగిన్నె, బంగారం.

**కయితము** రూ.చూ. కైత. వి. కయిత, కవిత్వం.

**కయితి** వి. ఆముపొయ్యిఅంటుకొన్నప్పుడు గుర్తుగా వచ్చే వేడివేడి ఆవిరి.

**కయిద** రూ.చూ. కయిదు[3]. వి. పాత్రల్ని సర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే తీరు.

**కయిది**[1] రూ.చూ. ఖైది. వి. నేరస్థుడు, ఖైది.

**కయిది**[2] రూ.చూ. కయిదు[3]. వి. పాత్రల్ని సర్పేటప్పుడు కుమ్మరి కూర్చునే తీరు.

**కయిదికట్ట** రూ.చూ. కయిదుకట్ట. వి. కమిదికట్ట. **కయిదిచావ** రూ.చూ. కమిదసావ. వి. పాత్రల్ని సర్పేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి పరుచుకొనే చావ.

**కయిదు**[1] రూ.చూ. కముజు. వి. కపింజలం, చాతకం, కైజు, ఒకజాతిపక్షి. చంద్రాంగ. 2.103.

**కయిదు**[2] రూ.చూ. ఖైదు. వి. కారాగారం.

**కయిదు**[3] రూ. కయిద, కయిది[2]. వి. పాత్రల్ని సర్సేటప్పుడు. కుమ్మరి కూర్చునే తీరు. వ్య. ఖైదులోఉన్నట్లు కదలకుండా కూర్చుని పని చేయడం.

**కయిదుకట్ట** రూ. కయిదకట్ట, కయిదికట్ట, కైదుకట్ట. చూ. కమిదికట్ట. వి. సర్పేటప్పుడు పాత్రలు నొక్కుపడకుండా, కదలకుండా ఉండటానికి ఒత్తుపెట్టుకొన్న మెత్తనిదిండు. **కయిదుచావ** రూ.చూ. కమిదసావ. వి. పాత్రల్నిసర్పేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి పరుచుకొనేచావ. **కయిదుమెత్త** వి. సర్పేటప్పుడు పాత్రల కిందపెట్టుకొనే మెత్తని దిండు. **కయిదుసావ** (-చావ) రూ.చూ. కమిదిసావ. వి. పాత్రల్ని సర్సేటప్పుడు కుమ్మరి కూర్చోటానికి ఉపయోగించే చాప.

**కయిదువ** రూ.చూ. కైదువ. వి. ఆయుధం.

**కయిదువు** రూ.చూ. కైదువు. వి. బాణం.

**కయిద్సావ** రూ.చూ. కమిదిసావ. వి. పాత్రల్ని సర్సేటప్పుడు కుమ్మరి కూర్చోటానికి పరుచుకొనే చాప.

**కయిపాల** రూ. కైపాల. చూ. కకపాల. వి. జోలె.

నం. కక్షపాల-; ప్రా. కక్షపాల-. బైరాగులు చంకలో పెట్టుకొనేసంచి.

**కయివు**[1] రూ.చూ. కైపు[1]. వి. **1.** ఉద్రేకం ; **2.** కాఠిన్యం ; **3.** కోపం ; **4.** ద్వేషం ; **5.** రోత ; **6.** విజృంభణం ; **7.** వైమనస్యం.

**కయివు**[2] రూ.చూ. కైపు[2]. వి. **1.** మత్తు ; **2.** మాదకద్రవ్యం.

**కయివుమిగులు** అ.క్రి. మత్తిలు, చెదురు, వదులగు.

కయిపెక్కు అ.క్రి. మత్తిలు, చెదురు. వదులగు. < కయిపు + ఎక్కు.
కయిపెక్కు చూ. కయిపు[2].
కయిఫియ్యతు రూ.చూ. కైఫీయతు వి. 1. వాఙ్మూలం ; 2. వర్ణన ; 3. సమాచారం.
కయిఫీయతు రూ.చూ. కైఫీయతు. వి. 1. వాఙ్మూలం ; 2. వర్ణన ; 3. సమాచారం.
కయిఫీయ్యతు రూ.చూ. కైఫీయతు. వి. 1. వాఙ్మూలం ; 2. వర్ణన ; 3. సమాచారం.
కయిఫీయ్యతునామా రూ.చూ. కైఫీయతునామా. వి. వృత్తాంతాల పుస్తకం.
కయిపు రూ.చూ. కైపు[2]. వి. మత్తు.
కయిమేకు చూ. కైలచీల. వి. బండి దొలువును పోలు క్రరనూ బిగించి కొట్టిన మేకు.
కయిరఁడు రూ.చూ. కైరఁడు. వి. ఒక రకం గుర్రం.
కయిరవడి రూ. కైరవడి. వి. కవిరఉండ.
కయిరశాల వి. వరండా.
కయిరి రూ.చూ. కైరఁడు. వి. కైరడు, గుర్రం పేరు.
కయిల రూ.చూ. కవిల[1]. వి. 1. ఆవు ; 2. నలుపు, పసుపు కలిసిన రంగు. కయిలకట్ట వి. కవిలకట్ట. కకుత్థ్స. 31. కయిలకరి వి. కపిలవర్ణంలో నలుపెక్కువ ఉన్న పస్నె. కయిలగడ్డి రూ. కయిలుగడ్డి. వి. గింజలు మిగిలిన వరిగడ్డి.
కయిలచీల రూ. కైలచీల. వి. బండి దొలువునూ పోలు క్రరనూ బిగించి కొట్టిన మేకు.
కయిలు రూ.చూ. కైలు. వి. పండిన ధాన్యం కొలత.
కయిలుగడ్డి రూ.చూ. కయిలగడ్డి. వి. గింజలు మిగిలిన గడ్డి. కయిలుగింజలు వి.బ.వ. పని చేసేవారికి ఏటేటా ఇచ్చే మేరగింజలు. కయిలుచేయు రూ.చూ. కైలుచేయు. స.క్రి. వడ్లరాసిని కొలుచు. కయిలుదారుఁడు రూ.చూ. కైలుదారుఁడు. వి. కైలు చేయించే అధికారి. కయిలుపాటు వి. పండిన ధాన్యం పరిమాణం.
కయివడి[2] రూ.చూ. కైవడి[2]. వి. తుంగ.
కయివడిముస్తె రూ.చూ. కైవడిముస్తె. వి. తుంగముస్తె.
కయివళ్లు వి.బ.వ. కవిరి ఉండలు.
కయివారపుఁజెయ్యి చూ. కయివారము[1].
కయివారము[2] రూ.చూ. కైవారము[2]. వి. చుట్టుకొలత.
కయిపు[1] రూ.చూ. కైపు[1]. 1. ఉద్రేకం, విజృంభణం ; 2. అందం, సౌందర్యం, ఒప్పిదం ; 3. విధం ; 4. కపటం.
కయిపు[2] రూ.చూ. కైపు[2]. వి. మత్తు.
కయిపెక్కు రూ.చూ. కయిపెక్కు. అ.క్రి. మత్తిలు.
కయిపెక్కు చూ. కయిపు[2].
కయానరుఁడు చూ. కయి[2].
కయ్య రూ.చూ. క్రయ్య. వి. 1. కాలువ, ఏరు, నది. రం.రా. యుద్ధ. 310, పు. 19 పం. ; 2. పొలం, కేదారం. ఆం.భా. 2.230 ; 3. మంచె ; 4. మాగాణి చేనిమడి ; 5. ఉప్పుమడి ; 6. దంతెలాంటి పొడవుకొయ్య, దబ్బ ; 7. నీటి ప్రవాహంతో భూమిలో ఏర్పడిన గుంట ; 8. వరిమడిలో నిలవడానికి వేసిన మడవ.
కయ్యలెత్తు స.క్రి. చిట్టికోళ్ళవేటకు ఉరులుపన్నేటప్పుడు గదులను ఏర్పరచు. కయ్యలోబడు అ.క్రి. ఆపదలోపడు. కయ్యారము వి. కుదపన (రొంపిగా) దున్నిన కయ్యలో గనిమల్ని పారతోనరికి నరిచేయటం.
కయ్యపుఁగ్రచ్చ చూ. కయ్యము.
కయ్యపుఁదిండి చూ. కయ్యము.
కయ్యమిచ్చు చూ. కయ్యము.
కయ్యము వి. యుద్ధం, పోరు, జగడం, కలహం. భార.సభా. 1.269, విరా. 4.184.
క. పో.చూ. కేన, కిణ. అనూయ, కోపం, ఈర్ష్య ; తు.పో.చూ. కచ్పాడుని, కచ్పాడ. దెబ్బలాడటం ; మ. కయిక్క. దెబ్బలాడు, తిట్టు ; కయర్క. కోపంతో పోట్లాడు ; కుయి.పో.చూ. కాసె. పగ, విరోధం, వంశ కలహం ; కాసెంజు. మగశత్రువు ; కాసహ ; కువి. కసకినై. దూపం.
కయ్యపుఁగ్రచ్చ వి. జగడగొండి, పేచీకోరు. పండి.చ. 2.115. కయ్యపుఁదిండి (-తిండి) వి. కలహాశనుడు, నారదుడు. అచ్చ.రా. సుందర. 2. కయ్యమిచ్చు అ.క్రి. యుద్ధంచేయు. హరి.ఉ. 4.16. <కయ్యము + ఇచ్చు. కయ్యముపొడుచు రూ. కయ్యమువొడుచు. అ.క్రి. యుద్ధం చేయు. భార.భీష్మ. 1.142. కయ్యములిడు అ.క్రి. కలహాలు పెట్టు. కళా. 2.6. < కయ్యములు + ఇడు. కయ్యము వొడుచు (-పొడుచు) రూ.చూ. కయ్యము పొడుచు.అ.క్రి. కలహించు, యుద్ధం చేయు. కయ్యముసెల్లు (-చెల్లు) అ.క్రి. యుద్ధమగు. భార.కర్ణ. 2.215. కయ్యముసేయు (-చేయు) అ.క్రి. యుద్ధం చేయు. భార.విరా. 4.207. కయ్యాటము వి. పోరు, జగడం. కయ్యాలక్రచ్చ విశ. కలహశీలుడు, పేచీకోరు. పాండు. 4.210. కయ్యాలగడుసు వి. యుద్ధంలో నేర్పరి. కకుత్థ్స. 1.205. కయ్యాలమెకము వి. నక్క. వ్య. కయ్యాలు పెట్టే జంతువు. కయ్యాలాడు అ.క్రి. పోట్లాడు, కలహించు.
కయ్యర వి. హీన జాతి ముత్యం.
కయ్యాటము చూ. కయ్యము.
కయ్యార వి. హీనజాతి ముత్తెం, తక్కువజాతికి చెందిన మౌక్తికం.
కయ్యారము చూ. కయ్య.
కయ్యాలక్రచ్చ చూ. కయ్యమ
కయ్యాలగడుసు చూ. కయ్యమ
కయ్యాలమెకము చూ. కయ్యమ
కయ్యాలాడు చూ. కయ్యము.
కయ్యు స.క్రి. పండిన పంటను నరిచేసి కొలిచి పెట్టుకొను.
కర[1] రూ. కరగ. వి. 1. తీరం, దరి, గట్టు. నృసింహ. 1.42 ; 2. సేకువ, వంతెన. ఆం.భా. 2.8 ; 3. తరంగం. ఆం.భా. 1.154.
క. కరె. గట్టు, తీరం, సరిహద్దు, గుడ్డఅంచు ; కొడ. కర్. గుడ్డ చివర రంగులతోనేసిన పట్టెలు ; తు. కరె. సముద్ర తీరం, నదిగట్టు, సరిహద్దు, గుడ్డ యొక్క రంగుల

అంచు ; త. కరై. తీరం, గట్టు, పొలం గట్టు, గుడ్డ అంచు ; మ.కర. తీరం, నదిపక్క, సముద్రానికి ఎదురు భూమి, గుడ్డ యొక్క రంగుల అంచు ; కరయన్. పట్టెల గుడ్డ ; తొ. కర్. గుడ్డ చివర రంగులతో నేసిన పట్టెలు, నదిగట్టు, దిఙ్మండలరేఖ ; బ్రాహు. క్ర్‌రకె. గట్టు, తీరం, అంచు, దగ్గర.

కరవట్నాలు వి.బ.వ. తీరపట్టణాలు. కరవాఁక రూ. కరాక. వి. 1. ఉప్పుటేరు, పొర్లునీరు ; 2. సముద్రం గట్టున ఉండే చెమ్మనేల ; 3. రేవు, సముద్రం గట్టు.

కర[2] రూ. కరా. విశే. తీక్ష్ణమయిన.

సం. కరటు.- కురచైన, లొంగని, ఇబ్బందికరవ్యక్తి ; కర్కర.- కఠినమైన, బలమైన ; కర్కశ-. మోటు, కఠిన మైన, గట్టి ; క్రకచ-, కరపత్ర-. రంపం ; ఖర-. గట్టి, కఠినమైన, మోటు, పదునైన అంచు, తీక్ష్ణమైన ; ఖరు. కఠినమైన, క్రూరమైన ; ప్రా. కరకయ. రంపం ; కా. బారూన్. పదునైన, తీక్షణమైన ; పం. ఖర్స్. తీక్ష్ణ మైన, పదునైన ; సిం. ఖరణు. తీక్ష్ణమైన, పదునైన ; గు. ఖరఁపు. తీక్ష్ణమైన, పదునైన ; మరా. ఖర్. తీక్ష్ణ మైన, పదునైన.

క. కరడు. మోటుగాఉన్న, మెరక పల్లాలుగాఉన్న, నునుపుకాని, గట్టి, పనికిరాని, ఉపయోగంలేని, దుర్మార్గ దైన ; కఱకు, కక్కు, కర్కు, గఱకు, గరకు, గర్కు, గరసు-. పల్లు, గంటు, నొక్కు, రంపం లేక ఆకురాయి పన్నుభాగం, తిరగలియొక్క గరుకుభాగం, ఎత్తుపల్లాల ఉపరిభాగం, పదును ; తు. కరడు. మోటు, ముతక, వ్యర్థ భాగం, నష్టం, ధరించు ; కర్గోటు. కఠినత, కఠినహృదయత, కఠినహృదయం ; గరు. మోటు ; గరిమె. కఠినత, అనుల్లంఘ్యత ; గర్గాను. రంపం; త. కరటు. మోటు తనం, మెరకపల్లాలుగల, మోటైనస్వభావం ; కరట్టు, మెరకపల్లాలుగల, నాగరికతకాని ; కరణ్. కూరగాయలు. పళ్ల యొక్క మెరకపల్లాల ఉపరిభాగం, గాయం, మచ్చ ; కరు. శూలం, బాణం మొ. వాటి కొనలో వెనక్కి తిరిగి ఉండే మొన ; కరుమై, కరిల్. కఠినత, క్రూరత్వం ; కరుక్కు. రంపం లేక కొడవలి, బాటికమ్మగరి, పదును. మ. కరటు. మోటైన, ఎత్తుపల్లాలుగా ఉన్న ; కఱు. మోటు ; కఱుప్పు. మోటుతనం ; కరుమ. కత్తిపదును ; కరుక్కు. రంపం లేక ఆకురాయిపన్ను, బాటిగిరికమ్మ, ఎత్తుపల్లాల ఉపరిభాగం ; కరుకరక్క. తీక్ష్ణంగా ఉండు, పదును, మోటు, కోపం పుట్టించు ; కరిక్కు. పన్ను చివరి భాగం ; కరిముళ్. గట్టిముళ్లు, సీతాఫలానికి పైనఉన్న చర్మభాగం, పనసవళ్లు ; కొ. కర్ప్. వాడి లేక కఠినత ; పర్జి. కకచ్. రంపం ; ఖర్. మోటు, రంపం.

<సం. ఖర-

కరసాన వి. 1. బాణాలు, మణులు మొ. వాటిని సాన పట్టే చక్రాకారమైన సాన. నిర్వ.రా. 6.43 ; 2. గంధం తీసుకోడానికుపయోగించే చిన్న సాన. క్రీడా. 226.

కర[3] చూ. క్రు. వి. 1. మరక, మచ్చ ; 2. నలుపు.

కరగట్టు[1] అ.క్రి. మరకపడు. కరబట్టావు వి. అచ్చు వేసిన ఆవు.

కర[4] వి. 1. పొలంచుట్టూ వేసిన కంచె, వెలుగు ; 2. పైరు దంటు ; 3. పదును.

కరగాడి వి. కంచెవేసిన చోటు. కరగోడ వి. వెలుగు నాటడానికి పొడిమట్టితో ఏర్పరచిన గోడ, కోరడి.

కర[5] వి. 1. అచ్చుతుక్కోటానికి నేసిన బద్దెల్లో కొనపోగులు ; 2. అచ్చుతుక్కోటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జానెడు పొడుగు దారాలు వదలిన గుడ్డ.

కరగట్టు[2] స.క్రి. కంబళ్ళకు దారంతో అంచులు కుట్టు.

కరక[1] వి. హరీతకి, కరకచెట్టు. హర. 6.83 (punica grassatum).

క. కరక, కరకం ; త. కటు, కటుక్కాయ్. కరక ; మ. కటుక్కాయి, కటుక్కు. కరక ; తొ. కొఱకయ్. కరక ; గోం. కర్కా, కకా. కరక ; కువి. కర్కు. కరక ; పర్జి. కర్కు. కరక.

కరకకాయ రూ. కరక్కాయ. వి. కరక్కాయ. హర. 6.83. కరక్కాయ రూ.చూ. కరకకాయ. వి. కరకచెట్టు కాయ. కరకంచు రూ. కఱకంచు. వి. 1. కరక్కాయ నీటితో రాసిన అంచు. సిం.ద్వా. 7.45 ; 2. కరకంచు వస్త్రం. ప్రబంధ. 272.

కరక[2] విశే. నల్లని. వి. కట్టెనిప్పుమీది భస్మం, నిగురు, నివురు.

కరకగడ్డము వి. మురికిగడ్డం. కరకనేల వి. నల్లరేగడి నేల.

కరకటి వి. ఒడ్డు, గట్టు, దరి.

కరకడి వి. 1. వేటాడ్డానికి ఉపయోగించే సాధనం. రుక్మా. 3.70 ; 2. ఒక వేట వనిముట్టు.

కరకంటుఁడు రూ.చూ. కఱకంఠుఁడు. వి. శివుడు.

కరకంఠునిల్లాలు రూ.చూ. కఱకంఠునిల్లాలు. వి. భవాని, పార్వతి. వ్యు. శివుని భార్య.

కరకబాలీ వి. రంపపు అంచులవలె అంచులుండే ఆకులు కలిగి చిన్న పూవులు పూసే ఒక రకం చెట్టు (Burssera Servata).

కరకబొద్ద వి. బ్రహ్మమేడిమొక్క, అల్పంగా ఉండే ఒక చిన్న చెట్టు (Ficus hispida).

కరకబొద్దు వి. సన్నని పాలిపోయిన రంగుగల బెరడు, తెల్లని కర్ర కలిగి గంధపుచెక్కలు చెక్కడంలాగ గరుకు కాగితం లాగ ఉపయోగపడే ఆకులుగల ఒక చెట్టు (Ficus asperimma).

కరకమద్ది వి. నల్ల కరకచెట్టు. తోళ్ళను పదునుచేయడానికి, ఒక రకం పచ్చరంగు తయారుచేయడానికి, గృహాది నిర్మా ణాలకు ఉపయుక్తం (Terminalia chebulla).

కరకర[1] రూ.చూ. కఱకఱ[1]. అవ్య. రాయడం, నమలడం, పళ్ళు గీరడం, కొరకటం మొ. వానిలో అయ్యే ధ్వనికి అనుకరణం. సారంగ. 3.127, సుద. 3.81.

కరకరపడు అ.క్రి. 1. మండిపడు. మొల్ల. ఆరణ్య. 1.15 ; 2. పగగొను ; 3. పట్టుపట్టు ; 4. అన్యాయపడు. కరకరలాడు అ.క్రి. 1. మండిపడు ; 2. పగగొను ; 3. పట్టుపట్టు ; 4. అన్యాయపడు. <కరకర[1]+-లు+అడు.

**కరకర**[2] రూ. కరకరము, కఱకఱ[2]. చూ. కర[2]. క్రి.విశే.ప్రదు. 1. అత్యంతంగా, మిక్కిలిగా. ఉ.హరి. 5.10, రామాభ్యు. 6.205; 2. తీవ్రంగా.

**కరకరము** రూ.చూ. కరకర[2]. క్రి.విశే. 1. మిక్కిలిగా; 2. తీవ్రంగా.

**కరకరి** రూ.చూ. కఱకఱి. వి. 1. ద్వేషం, స్పర్థ, ఈర్ష్య, అసూయ. దశకు. 7.42, శృం.నై. 5.132; 2. క్రౌర్యం. మను. 3.60; 3. చలం, పట్టుదల. ఆం.భా. 1.135; 4. వెత.

కరకరించు అ.క్రి. 1. స్పర్థవహించు. పార్వ. 6.70; 2. పగహూను, వివాదపడు. కరకరిపడు అ.క్రి. 1. ద్వేషపడు. పద్మ.ఉ. 2.82; 2. మండిపడు.

**కరకస** రూ.చూ. కక్కసము. వి. 1. పగ, విరోధం; 2. అసూయ; 3. కర్కశత్వం. విశే. కర్కశమైన.

కరకసభూమి వి. తగాదాలున్న భూమి.

**కరకసా** రూ.చూ. కక్కసము. వి. 1. కరకస, అసూయ; 2. భూమి సరిహద్దు తగాదా; 3. పగ; 4. కర్కశత్వం; విశే. కర్కశమైన.

కరకసావేల వి. కరకునేల. కరకసాస్థలము వి. తగాదాలున్న స్థలం.

**కరకు**[1] చూ. కక్కు[2]. వి. రాతిలోని గుంట.

క. కక్కు, కఱకు, కర్కు, గరకు. పల్లు, గంటు, నొక్కు, రంపం పళ్ళలాగ కోయబడిన క్రమంలేని ఉపరిభాగం.

<క. కఱకు.

**కరకు**[2] రూ.చూ. కఱకు. వి. పైరువెన్ను చూపడానికి ముందున్న పూవుదశ.

కరకుచెట్టు వి. కవుకిచెట్టు, పొడవుగా ఉండి సువాసననిచ్చే పూలుపూచే చెట్టు (Millingtonia hortensia).

**కరకుట్లు** వి.బ.వ. ఉప్పు కారం కలిపి ఎండబెట్టిన మాంసం ముక్కలు, ఉప్పానులు.

క. కఱి. పచ్చిదిగాని, ఉడకబెట్టిన ఒక శాకం, మాంసం, కూర; త. కఱి. నమలటం, కొరుకుతూ తినటం, పచ్చివి లేక ఉడకబెట్టిన శాకాలు, పచ్చిది లేక ఉడకబెట్టిన మాంసం; కఱి-క-కూట్టు-. శాకం లేక శాకాలు కొంత ద్రవరూపంగా తయారు చేయటం; మ. కఱి.

<త. కఱి-క-కూట్టు.

**కరకేరు** పో.చూ. కర[1]. స.క్రి. 1. పడుగులో పడుగేరే కర్ర మీది పోగులు వరసగా సర్దు; 2. పడుగును మొదటి నుంచి చివరివరకూ పాయలుగా విడదీయు.

పో.చూ.క. కరె. గుడ్డలేక దుప్పటికి నేతలేని దారాల అంచు.

**కరకొమ్మ** వి. ఈర్ష్య, అసూయ, మచ్చరం.

**కరకొమ్ము** వి. ఊదే వాద్యవిశేషం.

**కరక్కాయ** చూ. కరక[1].

**కరగ** చూ. కర[1]. వి. 1. కురివాడిగట్టు, చెరువుగట్టు; 2. ఆనకట్ట; 3. వంతెన.

కరగపడు అ.క్రి. క్షీణించు. మను. 6.9.

**కరగపట్టు** రూ.చూ. కరగబట్టు. స.క్రి. పుటంతీయు.

**కరగబట్టు** రూ. కరగపట్టు. స.క్రి. పుటంతీయు, కోలుపట్టిన తర్వాత మందంగా ఉండే మట్టిని దబ్బతో పల్చనగా చదునుగా వచ్చేట్లు చేయు.

**కరగసము** వి. రంపం, క్రకచం. రం. రా. ఉ. 52 పు. 8 పం.

సం. కరట-. కురచైన, లొంగని, ఇబ్బందికరవ్యక్తి; కర్కర-. గట్టిమైన, దృఢమైన; కర్కశ-. మోటైన, తీక్ష్ణమైన, దృఢమైన; క్రకచ, కరపత్ర. రంపం; ఖర-. దృఢమైన, పరుషమైన, మోటైన, పదును అంచుగల; ప్రా. కరకయ, రంపం; హిం. కర్కశ్, కత్తి.

త. కరటు. మోటుతనం, ఎత్తుపల్లాలుగల, మోటైన గుణం; కరట్టు. మెరకపల్లాలుగల, ఎత్తుపల్లాలుగల, నునుపు కాని; కరణ్. శాకాలు, పళ్ళమీదఉన్న ఎత్తుపల్లాల ఉపరిభాగం, మచ్చ; కరు. శూలం, బాణం మొ. వాని కొనయందు వెనుకకు తిరిగి ఉండే మొన, చీల; కరుమై, కరిల్. తీక్ష్ణత, క్రూరత్వం; కరుక్కు. రంపం లేదా కొడవలి యొక్క పన్ను, తాటిచెట్టు మట్ట యొక్క రంపం వళ్ల అంచు, పదును; మ. కరటు. మోటైన, లేక మెరకపల్లాలైన; కఱు. మోటైన; కరుప్పు. మోటుతనం; కరుమ. కత్తియొక్క పదును; కరుక్కు. రంపం లేక ఆకురాయి యొక్క పళ్ళు, తాటిచెట్టు మట్ట యొక్క ముళ్లు, క్రమంలేని ఉపరిభాగం; కరుకరుక్క. పరుషంగా ఉండు, పదునైన, మోటైన, కోపంకలిగించే; కరిక్కు. పన్ను, అంచు; కరిముళ్. గట్టిముల్లు, సీతాఫలం, పనసపండు మొ॥ వాటికిపైన ఎత్తుగా వచ్చిన చర్మభాగం; కరిమటల్-. పనసపండు పైభాగం.

<సం. క్రకచ-.

**కరగాబు** వి. గల్లబాన, తోళ్ళు నానబెట్టడానికి చర్మకారులువాడే పెద్ద బాన.

**కరగెడుమూస** చూ. కరుగు[1].

**కరంగి** వి. ఎర్రబిక్కిచెట్టు. దీనిద్రవం మందుల తయారీలో ఉపయోగపడుతుంది (Gardinia lucida).

**కర(గ(గొట్టు** చూ. కర(గు.

**కర(గించు** చూ. కర(గు.

**కర(గు** స.క్రి. కరిగించు. భార. విరా. 2.27. అ.క్రి. 1. (ప్రేమాదులచే) కరిగిపోవు, పరవశమగు. హరి. పూ. 6.198; 2. ద్రవమగు, నీరగు, రూపంమారు. భీమ. 4.141; 3. భస్మమగు, నీరగు. మను. 2.9. వి. కరగటం.

క. కరగు, కరగ్గు, కరు. కరిగిపోవు, క్షీణించు, దయ ప్రేమ విషయంలో మెత్తబడు, శమించు; కరగిసు, కరిగిసు, కర్గిసు. కరగిపోవు, కరగు; కొడ. కర్. అరుగు; కరకె-. అరుగు; తు. కరగుని. కరగు, ద్రవంగాచేయు, పలచనగు, కృత్రిమమగు, మెత్తనగు దయతో కరగు; కరగావుని. కరగు, కరగించు, మనసు కరగించు, బాధించు; కరవుని. కరగించు, కరగు, అరుగు; కరపుని. అరుగు; త. కరై. నీటిలోకరగు, ఘనరూపం

నుండి ద్రవరూపంలోకిమారు, క్రమంగా తగ్గించుకుంటూ పోవు, చిక్కిపోయిన, ఉన్నకొద్ది నన్నగిల్లజేయు, నీటిలో కరగు, ద్రవంచేయు, నాశనంచేయు; *కరైయల్*. కరిగిపోవు, కరుగు, కరిగేది; *కరైపు*. కరగిపోవు; మనసుయొక్క మృదుత్వం; మ. *కరకుక్కక*. కరగు, కరగిపోవు; తొ. *కర్క్న్*. కరగిపోవు. కరగు; *కర్క్*. కరగిపోవు; గోం. *గరె- మాన్-*. కరగు; కొలా. *కర్గ్*. కరగిపోవు; *కర్గ్*. కరగిపోవు, కరగు; కువి. *కరంగలి*. కరగిపోవు, కరగించు; *గ్లొంగినై*. కరగు; *కరంగ్*. కరగిపోవు, కరగించు; పో.చూ. *కగ్గు*. క్రాఁగు.

<మూ. ద్రా. *కర్-.

**కరఁగఁగొట్టు** స.క్రి. కరగించు. **కరఁగించు** స.క్రి. 1. మెత్తబరచు, కరగచేయు. భార. భీష్మ. 1.159; 2. ద్రవింపచేయు. ప్రబు. 2.18. **కరఁగువడు** రూ. కరఁగువడు. అ.క్రి. పోవు, నశించు. మను. 6.9. **కరఁగువడు (-వడు)** రూ.చూ. కరఁగుపడు. అ.క్రి. కరగు.

**కరఁచు** చూ. కరఁగు. స.క్రి. 1. ద్రవింపచేయు. ఉ. హరి. 5.174; 2. బాధించు. విజయ. 3.9; 3. మెత్తబరచు. అప్ప. 1.20; 4. రూపరచేయు. కువల. 4.28.

క. *కరగు*, *కరగ్గు*, *కర్గు*. కరగించు, కరగిపోవు, పెద్దగా క్షీణించిపోవు, దయలేక ప్రేమతో మెత్తబడు, తప్పించుపోవు; *కరగిసు*, *కరిగిసు*, *కర్గిసు*. కరగింప చేయు, కరగు; కొడ. *కర్*. అరుగు; *కరకె*. అరుగు; తు. *కరగుని*. కరగించటానికి, ద్రవింపచేయు, వలచనగు, కృత్రిమమగు, మెత్తబడు, దయతోకరగు; *కరగావుని*. కరగు, కరగించు, మనసుకరగించు, బాధించు; *కరవుని*. కరిగించు, కరుగు, అరుగు; *కరవుని*. అరుగు; త. *కరై*. నీటిలోకరుగు, ఘనరూపం నుంచి ద్రవరూపానికి మారు, క్రమంగా తగ్గించుకుంటూపోవు, చిక్కిపోయిన, ఉన్నకొద్ది నన్నగిల్లచేయు, నీటిలోకరగు, కరగు, ద్రవంచేయు, నాశనం చేయు; *కరైయల్*. కరగిపోవు, కరుగు; *కరైపు*. కరగిపోవు, మనసుయొక్క మృదుత్వం; మ. *కరకుక్కక*. కరుగు, కరిగిపోవు; తొ. *కర్క్న్*. కరిగిపోవు, కరుగు; *కర్క్*. కరిగిపోవు, కరుగు; గోం. *గరె-మాన్*. కరుగు; కువి. *కరంగలి*. కరిగిపోవు, కరిగించు; *గ్లొంగినై*. కరుగు; కొలా. *కర్గ్*. కరిగిపోవు; *కర్క్*. కరిగిపోవు, కరుగు.

**కరటిక** వి. అంచు దళసరిగా ఉండే చిన్న మట్టిపాత్ర.

**కరటము** రూ. కరడ[1], కరవటము[2], కరవట్టు, కరవడము, కరాటము. వి. 1. బరిణి, పండి. చ. 1.317. వ.; 2. పగులు చూపిన బరణి.

సం. *కరోటు-*. పళ్ళెం, గిన్నె, పుర్రె; *కరోటి-*. పళ్ళెం, గిన్నె, పుర్రె; *కరణ్డక-*. బరిణె; ప్రా. *క్రోడియ*. పళ్ళెం. గిన్నె, పుర్రె; మరా. *కరటీ*. పైపెంకు, పుర్రె.

క. *కరట*. కొబ్బరిచిప్ప.

<క. కరట<సం. కరోట-.

**కరడ[1]** రూ.చూ. కరటము. వి. 1. బరణి; 2. బుట్ట.

**కరడ[2]** చూ. కరడె[2]. వి. ఆనద్ధ వాద్యాలు పద్దెనిమిదింటి లోనూ ఒకటి.

**కరడకాండు** రూ. కరడకాఁడు. వి. కరడాన్ని వాయించే వాడు, జేగంటను మోగించేవాడు. **కరడకాఁడు**. రూ.చూ. కరడకాండు. వి. జేగంట మోగించేవాడు.

**కరడము** చూ. కర. వి. అల, తరంగం భీమ. 5.170.

**కరడాబత్తులు** వి.బ.వ. సాలెవారు.

**కరడాలు** వి. చేతిత్రాత, దస్తూరీ.

**కరడి** రూ. కరిడి. వి. ఎలుగుబంటి.

క. *కరడి*, *కడ్డి*. ఎలుగుబంటి; కొడ. *కరడి*; తు. *కరడీ*.; త. *కరటి*. భారతదేశపు నల్ల ఎలుగుబంటి, బద్ద కపు ఎలుగుబంటి; మ. *కరటి*. ఎలుగుబంటి; కొం. *కర్డి*

**కరడికుచ్చులు** వి.బ.వ. అలంకారానికి ఎద్దుకొమ్ములకు కట్టే కుచ్చులు.

**కరడిగ** రూ. కరడియ, కరడు[3], కరడె[1]. వి. పుష్పాదుల్ని ఉంచే కరండం, పూలసజ్జ, బుట్ట.

సం. *కరణ్డక-*. బరణి, పూలసజ్జ; ప్రా. *కరండఅ-*, *కరండగ -*; మహా. *కరండా*. బుట్ట.

క. *కరడగె*, *కరడిగె*, *కణ్డగె*. లింగకాయ, శివలింగం పెట్టి మెడలోకట్టుకొనే చిన్న బరిణె.

<సం. కరణ్డక-.

**కరడియ** రూ.చూ. కరడిగ. వి. పూలసజ్జ. శృం.సా. 2.100 వ.

**కరడు[1]** రూ.చూ. కరుడు[2]. వి. తరంగం, అల.భార.ద్రోణ. 2.126.

**కరడు[2]** వి. పక్షి విశేషం. ప్రబంధ. 280.

సం. *కరటు-*. ఓదెకొంగ.

క. *కరటు*, *కరేటు*. ఓదెకొంగ.

<సం. కరటు -.

**కరడు[3]** రూ.చూ. కరడిగ. వి. పుష్పాదుల్ని ఉంచుకునే కరండం.

**కరడు[4]** వి. పెరుగు మొ. వాటి ముద్ద.

**కరడుకట్టు** రూ.చూ. కరడుగట్టు. అ.క్రి. పేరుకొను, ముద్దకట్టు. **కరడుగట్టు** రూ.చూ. కరడుకట్టు. అ.క్రి. పేరు కొను, ముద్దకట్టు.

**కరడె[1]** రూ.చూ. కరడిగ. వి. పూలసజ్జ.

**కరడె[2]** రూ.చూ. కఱడియ. వి. ఒక తోలువాద్యం, ఉరుమ.

**కరణకమ్మబ్రాహ్మణులు** చూ. కరణము.

**కరణకమ్మలు** చూ. కరణము.

**కరణపుకచ్చ** చూ. కరణము.

**కరణము** రూ. కర్ణము. వి. 1. గ్రామం లెక్కలు రాసేవాడు, ఒక రాజకీయోద్యోగి. చాటుప. శ. 45; 2. గణకుడు, కరణీకుడు. ఆం.భా. 2.187; 3. కాయస్థుడు (ఇతని వృత్తి లెక్కలు రాయటం), లెక్కలు రాసేవాడు.

సం. *కరణ-*. లెక్కలు రాసేవాడు, లేఖకుడు, సహాయ కుడు, స్నేహితుడు, కా. *కర్ని*, *కర్ణి*. పని; కుమా. *కరణీ*; ఒ. *కరణి*. శక్తి; హిం. *కరణ్*. లేఖనం, వృత్తిగా గల ఒక కులం; పం. *కర్నీ*. పని; సిం. *కర్ణీ*; *కరణ*. సంభోగం; గు. *కర్ణీ*; మరా. *కుల్‌కరణీ*. కరణం; *కరనీ*. పని.

క. *కరణ*. వైశ్యునికి, శూద్రస్త్రీకి పుట్టిన కుమారుడు,

లెక్కలు రాసేవారు, లేఖకుడు ; *కరణిక, కరనిక, కర్ణిక,* లెక్కలు రాసేవారు, లేఖకుడు ; గ్రామం లెక్కలు రాసే వాడు లేక కరణం, రాజ సంబంధమైన లేఖకుడు, కరణం, కలెక్టరు కార్యాలయం తరపున స్థానికంగా ఉండే ఉద్యోగి ; త. *కరణమ్, కరనమ్.* కరణం.

<నం. *కరణ-.* (అర్థ విపరి.).

**కరణకమ్మబ్రాహ్మణులు** వి.బ.వ. ఋగ్వేద ఆశ్వలాయన సూత్రానుష్ఠాతలు అయిన బ్రాహ్మణ జాతి. **కరణకమ్మలు** వి.బ.వ. ఒక శాఖ బ్రాహ్మణులు, ఋగ్వేదనియోగ బ్రాహ్మణులు. **కరణపుకచ్చ** వి. 1. మీదికి దోపని కచ్చా (ధోవతి అంచు) ; 2. విరోధం.

**కరణాయము** వి. భూమిపన్ను.

**కరణి**¹ వి. విధం, రీతి. భార. శల్య. 1.232.

పో.చూ. నం. *కరణి-.* చేయటం, రూపొందించటం, దృక్ప్రథం ; దే.ప్రా. *కరణి.* సాదృశ్యం, సమానత, అనుకరణం, అనుకరించడం.

<నం. *కరణి-.* (అర్థ విపరి.).

**కరణి**² వి. ఐమూలరాశి.

పో.చూ.త. *కరణై.* చెరుకుగెడని కోసినట్టు ఏటవాలుగా కోసిన ముక్క.

**కరణిక** వి. కనీనిక, కనుగుడ్డు, కంటిపాప.

పో.చూ.నం. *కనీనికా. కనీనీ.* కనుగుడ్డు ; పో.చూ.క. *కనినికె.* కనుచూపు.

**కరణికము** రూ. కరణీకము, కరిణీకము, కరినీకము. చూ. కరణము. వి. కరణం యొక్క పని, గణక వృత్తి. ఘటికా. 1.22.

క. *కరణ.* కరణికం.

**కరణికుఁడు** చూ. కరణము. వి. కరణం. ద్వి. పరమ. 6.458. వ. 6. పం.

మరా. *కరణీ.* పని; *కులకరణీ.* కులంరీత్యా లేఖకుడు.

**కరణీకము** రూ.చూ. కరణికము. వి. గణకకర్మ, కరణీకం.

**కరణీకవర్తన** చూ. కరణము. వి. 1. కరణీకం మాన్యం. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 753 క్రీ.శ. 1610 ; 2. కరణం భుక్తికై విధించబడ్డ పన్ను.

**కరణుఁడు** చూ. కరణము. వి. 1. వైశ్య వుడుష శూద్ర స్త్రీ జాతుడు ; 2. ఆదాయవ్యయ లేఖనోప జీవి.

నం. *కరణ -.* చేత, వాణిజ్యం, వర్తకుడు.

<నం. *కరణ -.* (అర్థవిపరి.).

**కరంటు** రూ.చూ. కరెంటు. విశే. చెల్లుతున్న, వ్యవహారంలో ఉన్న, ఇప్పటి. వి. 1. ప్రవాహం ; 2. గతి ; 3. విద్యుచ్ఛక్తి.

**కరండము** రూ.చూ. కరుడు². వి. అల, తరంగం.

**కరఁడు** రూ.చూ. కరుడు². వి. అల, తరంగం.

**కరతిత్తి** చూ. తిత్తి. వి. 1. పాత్ర విశేషం. పండి.చ. 1.354. వ ; 2. తమలపాకులు మొ. వాటి నుంచుకొనే చేతిసంచి. వేంక. పంచ. 4.244 ; 3. తోలుసంచి.

నం. *కర-.* చెయ్యి.

<నం. *కర-.*+తిత్తి.

**కరదివియ** రూ. కరదివె, కరదివ్వియ, కరదివ్వె. వి. కరదివ్వె, దివిటీ, కాగడా.

నం. *కర-.* చెయ్యి.

క. *కరదివిగె.* దీపంగా వాడే సమంగా ఉన్న పెద్ద పళ్ళెం ; *కరదీప.* దీపంగావాడే, చెయ్యి ఉన్న పెద్ద లోహ పళ్ళెం.

<నం. *కర-.*+దివియ (<నం. *దీపికా*).

**కరదివె** రూ.చూ. కరదివియ. వి. కరదివ్వె, దివిటీ, కాగడా.

**కరదివ్వియ** రూ.చూ. కరదివియ. వి. కరదీపిక, దివిటీ, కాగడా.

**కరదివ్వె** రూ.చూ. కరదివియ. వి. కరదివియ, దివిటీ, కాగడా. ద్వి.హరిశ్చ.పూ. 1.856. పం.

**కరదు**¹ రూ.చూ. కరుడు. వి. కదలు, అల, తరంగం.

**కరదు**² వి. పైరుపొట్ట పెట్టటానికి ముందరి దశ.

**కరదూపము** చూ. కరి². రూ.చూ. కరిదూపము. వి. ఇంటి కప్పులకు పొగ మొ. వాటి వలన పట్టే బూజు.

**కరనము** వి. కార్యనిర్వహణం.

నం. *కరణ-.* పనితనం, కార్యమువటం, కారణమైన. క. *కరణ.* పనితనం, కారణమైన, నెరవేర్పడం, పని.

<నం. *కరణ -.*

**కరపక్క** పో.చూ. కర³. వి. వన్నెతగ్గిన కెంపు. ఆం.శా. 2.277.

పో.చూ.త. *కరైప్పొక్కు.* తక్కువయిన ; *కరై.* తప్పు, లోపం, నలుపుచీకటి.

**కరపచెట్టు** వి. కవుకిచెట్టు. పొడవుగా అందంగా ఉండి, సువాసన నిచ్చే పూలుపూసే చెట్టు (Millingtonia hortensis)

**కరపచ్చి** వి. పచ్చికాల్పు, ఆముకాల్పులో కుండలు సరిగా కాలని స్థితి.

**కరపాని** రూ. కర్పాణి. వి. రోగ విశేషం, ఒక విధమైన చిడుం.

త. *కరప్పన్.* పిల్లలకువచ్చే పొక్కులు ; *కరప్పాణ్.* దద్దురు, చర్మసంబంధమైనవ్యాధి, కందటం, మంటతో కూడిన చర్మం వాపు, దద్దురురోగం ; మ. *కరప్పన్.* బొబ్బలు, తలమీది చుండ్రు.

హిం. *కరపాన్.* ఒకరకమైన చర్మవ్యాధి.

<త. *కరప్పాణ్.*

**కరపుచ్చ** రూ.చూ. కరబూజా. వి. సోమకర్కటి, కర్బూజా

**కరపుపని** వి. వానపోతకు సంబంధించినపని.

**కరపోకరాయి** చూ. కరపక్క. వి. కృత్రిమమైనకెంపు.

త. *కరైప్పొక్కు-క-కల్.* ఒంద్రుసేలలో కనిపించే కృత్రిమమైనమణి.

**కరబుచ్చ** రూ.చూ. కరబూజా. వి. సిద్ధవటందోస, కర్బూజా.

**కరబుజము** వి. ఇంద్రజాలం.

పో.చూ. *కరిబేవు-.* ఘాటైన వాసనతో కూడిన ఆకులు గల చిన్న చెట్టు, కూరాకుచెట్టు.

**కరబూజ** రూ.చూ. కరబూజా. వి. ఏటిఇసుకలోకాసే మేలు జాతి దోస, సిద్ధవటం దోస, కర్బూజా.

**కరబూజా** రూ. కరపుచ్చ, కరబుచ్చ, కరబూజ, కరబూజు

కరుబూజ, కరుబూజా, కర్బూజ, కర్బూజ, కర్బూజా, ఖర్బూజా. వి. ఒకజాతిపండు, కర్బూజా, మేలుజాతిదోస, పుచ్చకాయ.

హిం.ఉ. ఖర్‌బూజా. ఒకజాతిపండు. మరా. ఖర్బూజ్. ఒకజాతిపండు; ఖర్బూజా. ఒకజాతిపండు; పార. కిరబిజ్. కుర్జుగ్. పెద్దదోసకాయ.

క. కరబూజి, కరుబూజు, కర్‌బూజి, ఖర్‌పూజి. ఒకజాతిపండు.

<ఉ. ఖర్‌బూజా.

కరబూజు రూ.చూ. కరబూజా. వి. ఒకజాతి పండు.

కరబ్బీచీర వి. ఒకరకం నేతచీర.

కరమద్ది వి. ఉత్తర సర్కారులలోను, దక్కన్ కర్ణాటక ప్రాంతాల్లోను వర్షపాతం తక్కువగా ఉండే అడవుల్లో పెరిగే ముళ్ళమొక్క, కలేకంప.

నం. కరమర్ద -. ముళ్ళమొక్క.

క. కరమర్ది, కరమర్దక, కరవన్దిగె. ముళ్ళమొక్క.

<నం. కరమర్ద-.

కరమల రూ.చూ. కసుమరి. వి. కమ్మరి.

కరము క్రి.విశ. 1. అత్యంతం, మిక్కిలి. భార.ఆది. 1.119; 2. పూర్తిగా, నిశ్శేషంగా. ఉత్త.రా. 1.104.

క. కరం, మిక్కిలి.

కరమొప్పు అ.క్రి. మిక్కిలి ప్రకాశించు. కరవాఁడి విశ. మిక్కిలి వాడియైన. పాండు. 1.117. కరవేదన వి. అధిక దుఃఖం. ప్రబోధ 3.8.

కరమొప్పు చూ. కరము.

కరలాక వి. నేతపడుగులో దండెకు అవతల దూర్చిన వెదురు బద్ద.

కరవ వి. గొర్ల శరీరం మీది తెలుపు, నలుపులమచ్చ. పో.చూ.క. కఱె. నల్లదనం, నలుపు లేక నలుపు రంగు మచ్చ.

కరవగు చూ. కరవు.

కరవటము[1] వి. క్రయ విక్రయస్థానం, అంగడి.

నం. ఖర్వట -. క్రయవిక్రయ పట్టణం.

<నం. ఖర్వట -.

కరవటము[2] రూ.చూ. కరటము. వి. బరిణి, శీర్షకరండం, ఒక విధమైన బరిణి.

కరవట్టు రూ.చూ. కరటము. వి. కరవటం. పండి. చ. 2.452.

కరవడము రూ.చూ. కరటము. వి. బరిణి.

కరవడి చూ. కఱవాడు. వి. 1. ఉప్పుచేప; 2. ఎండిన చేప.

కరవడికార్తెలు వి.బ.వ. వర్షం లేని కార్తెలు, వ్యవసాయానికి ఉపయోగం లేనివి, జ్యేష్ఠ నుంచి రోహిణి వరకు గల కార్తెలు.

కరవనుగొంగడి రూ. కరిబనగొంగడి. వి. ముదురు గొర్రె బొచ్చుతో నేసిన గొంగడి.

కరవనుగొర్రె రూ. కరిబనుగొర్రె. వి. నలుపు, తెలుపు వన్నె బొచ్చు గల గొర్రె.

కరవనున్ని రూ. కరిబనున్ని. వి. కరుకుగా ఉండే ఉన్ని.

కరవాడ రూ.చూ. కఱవాడు2. వి. ఉప్పురాసి ఎండబెట్టిన సముద్రపు చేప.

కరవాడు రూ.చూ. కఱవాడు[3]. వి. 1. ఎండిన చేప; 2. ఉప్పు చేప.

కరవాఁడి చూ. కరము.

కరవాయి వి. లోహకారుడు సుత్తెతో పాత్రలను సాగ్గొట్టేటపుడు ఒత్తుడుగా వాని లోపల చొప్పించే మొన వంపు దిమ్మె మొగపు ఇనప కమ్మి.

క. కరవాయి. కంచరవాని పనిముట్టు, కంసాలివాని దాగలి.

కరవాలు వి. ఖడ్గం, కత్తి.అచ్చ.రా. సుందర. 58.

నం. కరవాల -, కరవీర -, కరవీరక. కత్తి; హిం. కరవార్. కత్తి; మరా. కరవాళ్. వాడిగల కత్తి.

క. కరబాల, కరపాల, కరవాల, కరవాళ్, కరవాలు. కత్తి; మ. కరవాళమ్. కత్తి.

<నం. కరవాల-.

కరవు రూ.చూ. కఱవు[1]. వి. 1. కాటకం; 2. లేమి.

కరవగు రూ.చూ. కఱవగు. అ.క్రి. 1. లోటగు; 2. కాటకం కల్గు.

కరవేదన చూ. కరము.

కరవేరు వి. చెట్టువేరు (Levendulaearrosa).

కరషించు అ.క్రి. లాగు, ఆకర్షించు.

నం. కర్ష్ -. లాగు.

<నం. కర్ష్ - + - ఇంచు[3].

కరసు వి. పరుషం, పరుసదనం.

నం. కర్ష -. రాపిడి, లాగటం.

<నం. కర్ష -.

కరస్పాండెంట్ వి. 1. జాబులురాసేవాడు; 2. ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు.

ఇం. *Correspondent.* ఉత్తరప్రత్యుత్తరాలు జరిపే వాడు.

<ఇం. Correspondent.

కరా రూ.చూ. కర[3]. విశ. తీక్ష్ణమైన.

కరాచురకత్తి వి. ఖడ్గం, కత్తి. మను. 4.28. కరాచురి రూ. కరాచూరి. వి. ఖడ్గం, కత్తి. మను. 5.71. కరాచూరి రూ.చూ. కరాచురి. వి. ఖడ్గం, కత్తి. రామాభ్యు. 1.61. కరాపువ్వు వి. కారంగల పువ్వు, లవంగం.

కరాక రూ.చూ. కరవాఁక. వి. సముద్ర తీరప్రాంతం.

కరాకు వి. పొడుగాటి పొగచెట్టు ఆకు.

కరాగ చూ. కరారు. క్రి.విశ.ద్రు. నికార్సుగా.

కరాటము రూ.చూ. కరటము. వి. 1. బరణి, శీర్షకరండం, ఒక విధమైన బరిణి. ప్రబంధ. 78. చంద్రాంగ. 1.45; 2. మందులు దాచి ఉంచే పరికరం.

కరాతు వి. మల్లబంధ విశేషం. మల్లు. 3.69.

కరాపాకు రూ.చూ. కరివేపాకు. వి. కూరల్లో ఉపయోగించే సువాసన గల ఒక రకం ఆకు (Murraya Koringii).

కరాబు వి. గృహ నిర్మాణంలో పనికిరాని కొయ్యజాతి.

హిం. ఉ. ఖరాబ్. పాడు, చెడు, అశుభకరమైన, హాని కరమైన.

<ఉ. ఖరాబ్.

కరాబుచేయు స.క్రి. పాడుచేయు.

**కరామతు** రూ. ఖరామతు, ఖరామత్తు. వి. పని.

హిం. ఉ. కరామత్. అద్భుత కార్యం, చమత్కారం.

<ఉ. కరామత్.

**కరారు** రూ. ఖరారు. వి. 1. ఏర్పాటు ; 2. నిర్ణయం, నిశ్చయం ; 3. ఒప్పందం.

హిం. ఉ. కరార్. స్థైర్యం, ధైర్యం, ప్రతిజ్ఞ.

<ఉ. కరార్.

కరారుచేయు స.క్రి. ఒడంబడికచేయు. కరారునామా వి. ఒడంబడిక పత్రం, సమ్మతి పత్రం. కరారుపట్టి వి. నిశ్చయ పత్రం.

**కరాళ** విశ. 1. భయంకరమైన. వరాహ. 4.75 ; 2. చెడ్డ. శుక.స. 3.349.

సం. కరాళ-. భయంకరమైన.

<సం. కరాళ-.

కరాళించు[1] అ.క్రి. 1. బొబ్బరించు. భార.విరా. 4.108 ; 2. సకిలించు. రం.రా.యు. 421 ; 3. మెరుగు. భాగ. 10. పూ. 1196 ; 4. సాటిఅగు. విష్ణుమా. 5.171 ; 5. మండిపడు; స.క్రి. మారు, నిందించు. ద్వి.హరిశ్చ. 2.1474.

**కరాళితనము** వి. చెడ్డతనం, దౌష్ట్యం. సమీర. 3.3.

**కరి**[1] వి. 1. సాక్షి. భార.ఆది. 2.119 ; 2. నిదర్శనం. దృష్టాంతం. బసవ. 6.780 ; 3. గురి, లక్ష్యం. దశకు. 4.69 ; 4. మేర, హద్దు. హరి.పూ. 7.93 ; 5. నియమం. ప్రబంధ. 145 ; 6. వాడిబాణం ; 7. ఉపస్థ, అట్టోటు, పశుయోని.

క. గురి, కురి, గుర్తు ; త. కరి. నిదర్శనం, సాక్షి.

కరికొను రూ.చూ. కరిగొను. స.క్రి. సాక్షిగా చేసుకొను.

**కరిగొను(-కొను)** రూ. కరికొను. స.క్రి. సాక్షిగా చేసుకొను. దశా. 6.56.

**కరి**[2] రూ.చూ. కటి[1]. వి. కారునలుపు. విశ. నల్లని.

కరిదూపము రూ. కరదూపము, కరుదూపం, కరుదూపము. వి. ఇంటికప్పుకు పొగ మొ. వాటివల్ల పట్టే బూజు. కరిబాయి రూ.చూ. కరివాయి.వి. పై పెదవిమీద ఉండే నల్లమచ్చ. కరివాయి రూ. కరిబాయి. వి. గొడ్ల పై పెదవిమీద కీడు తెలియజేసే మచ్చ. కరివేల్పు వి. 1. విష్ణువు ; 2. కృష్ణుడు ; 3. రాముడు. కరివేల్పుడాకన్ను వి. చంద్రుడు.

**కరి**[3] వి. దారపుపోగు మెలితిరగగా వచ్చిన గట్టిదనం, పురి.

కరిపెట్టు స.క్రి. పురితిప్పు, మెలిపెట్టు.

**కరికపిలి** వి. కపిలగోవు, వల్లావు.

**కరికంబ** వి. గొంగడినేత చివరకు వచ్చినపుడు, పడుగులోతీసే పేకదారం దూర్చిన గొట్టం.

**కరికరి** వి. చిరచిర, కలత, కలబాటు. క్రి.విశ. త్వరత్వరగా, కోపంగా.

కరికరిపడు అ.క్రి. పగకొను, కోపపడు. పద్మ.ఉ. 2.28 ; కరికరిపెట్టు అ.క్రి. బాధించు, హింసించు.

**కరికాలబత్తులు** వి.బ.వ. నేతపనిచేసేవాళ్ళలో ఒక తెగ.

**కరికెచన్ను** వి. పాలు బాగారాని బిరుసు చన్ను.

**కరికోత** వి. 1. మిక్కిలి బాధ. మహార్తి. రాధికా. 3.69 ; 2. హింస, బాధ.

కరికోతపెట్టు స.క్రి. మిక్కిలి బాధపెట్టు, మిక్కిలి పీడించు.

**కరిగ** చూ. కరి[2]. వి. 1. పశుయోని ; 2. కాసె ; 3. మడి.

**కరిగట్టు** వి. మాగాణి, వల్లవునేల.

కరిగట్టువాగలి వి. దుంపనాగలి.

**కరిగడ్డి** వి. లద్దగడ్డి, పాలు ఎక్కువగా ఇవ్వటానికి పశువులకు పెట్టే ఒకరకం గడ్డి (Panicum Repens).

**కరిగి** చూ. కరి[2]. వి. పశుయోని.

**కరిచిలుక** వి. ఒక పోటుముట్టు.

**కరిజ** రూ. కరిజు. వి. 1. భక్ష్య విశేషం. ప్రబంధ. 112 ; 2. బొంతు, నూర్చినపుడు వచ్చే నల్లకొన్న మొ. వాటి కంకి పొట్టు ; 3. తూర్పారపోసేటప్పుడు మేలురాని పక్కన పడేసి గింజలు, పొట్టు కలిపిన భాగం ; 4. పొల్లు పంట, దండెకట్టు.

క. కరజి, కర్జి. కరజికాయ.

కరిజకాయ వి. భక్ష్య విశేషం. హంస. 1.105.

**కరిజు** రూ. చూ. కరిజ. వి. భక్ష్య విశేషం. హంస. 1.105.

**కరిడి** రూ.చూ. కరడి. వి. ఎలుగుబంటి.

**కరిడిపురుగు** వి. వేరుసెనగ ఆకులు తినే గొంగళిపురుగు.

**కరిడీకఱ్ఱ** వి. దింపులోవెళ్ళే బండివేగాన్ని తగ్గించటంకోసం చక్రాలకు ఆనేట్టు వెనకవరంకింద అమర్చిన కఱ్ఱ.

**కరిణలు** రూ. కరిజెలు. వి.బ.వ. నేతనేసేవారిలో ఒకతెగ.

కరిణబత్తుడు రూ. కరిజెబత్తుడు. వి. నేతనేసేవారిలో ఒక తెగవాడు. కరిణబత్తులు రూ. కరిణిబత్తులు, కరిజెబత్తులు, కర్ణిబత్తులు. వి.బ.వ. నేతనేసేవారిలో ఒక తెగ. కరిణవాడు రూ. కరిజెవాడు. వి. నేతనే సేవారిలో ఒక తెగకు చెందినవాడు.

**కరిణబత్తుడు** చూ. కరిణలు.

**కరిణబత్తులు** చూ. కరిణలు.

**కరిణవాడు** చూ. కరిణలు.

**కరిణి**[1] రూ.చూ. కరిణియ. వి. తబలాయొక్క నలుపువలయం.

**కరిణి**[2] రూ. కరిణె[2]. వి. చిన్నసైజు తాపీ.

**కరిణికము** రూ.చూ. కరణికము. వి. గణకకర్మ.

**కరిణిబత్తులు** రూ.చూ. కరిణబత్తులు. వి.బ.వ. నేతనేసేవారిలో ఒక తెగవారు.

**కరిణియ** రూ. కరిణి[1], కరిణె[1]. వి. మృదంగ ముఖ చర్మమందలి కృష్ణమండలం.

**కరిణీకము** రూ.చూ. కరణికము. వి. గణికకర్మ.

**కరిణె**[1] రూ.చూ. కరిణియ. వి. మద్దెల ముఖచర్మంలోని నల్లటి పూత.

**కరిణె**[2] రూ.చూ. కరిణి[2]. వి. చిన్నసైజు తాపీ.

**కరిణెబత్తుడు** చూ. కరిణెలు.

**కరిణెబత్తులు** చూ. కరిణెలు.

**కరిణెలు** రూ.చూ. కరిణలు. వి.బ.వ. సాలెవారు.

కరిణెబత్తుడు రూ.చూ. కరిణబత్తుడు. వి. నేతనేసేవారిలో.

ఒక తెగవాడు. కరిణెబిత్తులు రూ.చూ. కరిణబత్తులు. వి. బ.వ. నేతపనిచేసేవాళ్ళలో ఒక తెగ. కరిణెవాఁడు రూ. చూ. కరిణవాఁడు. వి. నేతనేసేవారిలో ఒక తెగవాడు.

**కరిణెవాఁడు** చూ. కరిణెలు.

**కరిది** వి. చర్మవ్యాధి విశేషం. ఆం.భా. 1.128.

**కరిదిండు** వి. బందబ్బద్ద, మొగరప్పేటకు దూలానికీ మధ్య వేసే చెక్క.

**కరిదువ్వ** వి. బూజు.

**కరివి** వి. చెవుల దగ్గర కంతిలాగ పుట్టే వ్రణవిశేషం.

**కరిపీకము** రూ.చూ. కరణికము. వి. గణకవృత్తి.

**కరిపాకు** రూ.చూ. కరివేపాకు. సువాసన గల ఒక రకం ఆకు (Murraya koringii).

**కరిబించు** స.క్రి. 1. అతికించు ; 2. ఇరుపక్షాలను కయ్యానికి ప్రోత్సహించు.

**కరిబియన్‌సంఘం** వి. కరిబన్ సముద్ర ప్రాంతంలో తమ వాణిజ్య, సాంఘిక వ్యవహారాలను పెంపొందించటానికి అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, నెదర్‌లాండ్సు దేశాల మధ్య క్రీ.శ. 1942 సం. లో జరిగిన ఒప్పందం.

**కరిబనగొంగడి** రూ.చూ. కరవనుగొంగడి. వి. ముదురు గొర్రె బొచ్చుతో నేసిన గొంగడి.

**కరిబనుగొర్రె** రూ.చూ. కరవను గొర్రె. వి. నలుపు, తెలుపు వన్నె బొచ్చుగల గొర్రె.

**కరిబనువ్ని** రూ.చూ. కరవనున్ని. వి. కరుకుగా ఉండే ఉన్ని, కరవను గొర్రె ఉన్ని.

**కరిబాఁదా** వి. కృత్రిమమైన ఒక రకం పట్టు.

**కరిమండలము** వి. వరి, మిరప మొ. వాటి తెగులు, అగ్గి తెగులు.

**కరిమి**[1] వి. కలేకంప, ఉత్తరసర్కారుల్లోను, దక్కన్ కర్ణాట ప్రాంతాల్లోను వర్షపాతం తక్కువగా ఉండే అడవుల్లో పెరిగే ముళ్ళ మొక్క.

**కరిమి**[2] వి. పశువులలో ఆడదాని గురి (యోని).

**కరింపాకు** రూ.చూ. కరివేపాకు. వి. సువాసన గల ఒక రకంఆకు (Murraya koringii).

**కరియ** వి. నల్లరంగు ; విశ. నల్లని.

**కరియపాకు** రూ.చూ. కరివేపాకు. వి. సువాసన గల ఒక రకం ఆకు (Murraya koringii).

**కరియముదు** వి. పచ్చికూర, వండినకూర.

**కరియాయతి** వి. తాలూకా.

**కరివియ** రూ.చూ. కరివె[1]. వి. ఇత్తడిలోనగు వానితో చేసిన పీఠాదండాన్ని పొదివికొని ఉండేట్లు సొరకాయపై అమర్చే తరంగం. ఆం.భా. 1.126.

**కరివె**[1] రూ. కరివియ, కర్వె. వి. ఇత్తడిలోనగు వానితో చేసి పీఠాదండాన్ని పొదివికొని ఉండేట్లు సొరకాయపై అమర్చే తరంగం. వాల్మీ. 3.132, చంద్రాంగ. 2.95.

త. కరువి. వాద్యవిశేషం ; మ. *కరి, కరివి, కరు.* సాధనం, నాగలి, ఆయుధం.

**కరివె**[2] రూ. కలివె[1]. వి. కరమర్దం.

**కరివెద** రూ. కరివేద. వి. వర్షం కురియడానికి ముందే నేల దున్ని విత్తనాలు చల్లడం.

**కరివేద** రూ.చూ. కరివెద. వి. నేలదున్ని విత్తటానికి వాన కోనం చూడడం.

**కరివేపాకు** రూ. కరాపాకు, కరిపాకు, కరింపాకు, కరియపాకు, కరెంపాకు, కరేపాకు, కర్వేపాకు, కటివేపాకు, కట్టివయం పాకు. వి. సువాసన గల ఒక రకం ఆకు (Murraya koringii).

*క. కరిబేవు ; త. కరివెంపు, కత్తవెప్పిలై.*

**కరివేము** వి. కృష్ణ (నురలి) నింబ.

**కరిశె** రూ.చూ. కలశం. వి. కలిశంబుడ్డి, మేడల మీద అలంకారానికి బోర్లించే మట్టి పాత్ర.

**కరిసనము** రూ. కరిసెనము, కరిసెము, కర్సనము. వి. 1. కృషి, సేద్యం, వ్యవసాయం. భార. అరణ్య. 4.293, హరి.పూ. 7.130 ; 2. ఘర్షణం.

సం. *కర్షణ -.* లాగడం, ఒరపిడి ; ప్రా. *కరసణ -.* ; గు. *కర్సణ్.* సేద్యం, కృషి.

<ప్రా. కరసణ -.

కరిసించు స.క్రి. ఘర్షించు, ఢీకొను. బహులా. 1.102. కరసింపు వి. ఘర్షణం. సత్య.సాం. 2.67.

**కరిసించు** చూ. కరసనము.

**కరిసింపు** చూ. కరిసనము.

**కరిసె** వి. 1. (ఎనబైరతులు) పలంలో నాలుగో వంతు, కాలుపలం. ఆం.భా. 2.269 ; 2. కృషి, సేద్యం.

ప్రా. *కరిస -.* మానవిశేషం, పలంలో నాలుగోవంతు. *క. కరిజు ; త. కరిచై.*

<ప్రా. కరిస -.

**కరిసెనము** రూ.చూ. కరిసనము. వి. 1. కర్షణం ; 2. ఘర్షణం ; 3. కృషి.

**కరిసెము** రూ.చూ. కరిసనము. వి. 1. కర్షణం ; 2. ఘర్షణం ; 3. కృషి.

**కరీదు** రూ.చూ. ఖరీదు. వి. వెల.

**కరుకు**[1] వి. 1. వర్తులాని చుట్టూ మసితో గీసిన గీత ; 2. పొలిగీత ; 3. మందాకుల బొగ్గుపొడి.

*క. కరకు, కరికు.* కాల్చబడుతున్న ; *త. కరు, కఱు.* నలుపు, సూర్యరశ్మికి ఎండిన వరిపంట ; *మ. కరి, కరు.* నలుపు ; *కరియ, కరుమ.* నల్లదనం ; *తొ. కరి.* బొగ్గు.

కరుకుపట్టు స.క్రి. మసిపట్టు.

**కరుకు**[2] రూ. కరువు[1]. వి. అకు కప్పుపేర్పులోని మూరెడుపన.

**కరుకు**[3] వి. అచ్చులో ఉన్న పచ్చి ఇటికకు నేలమీద నన్న రాళ్ళు, మట్టి అతకడంవల్ల ఏర్పడిన బుడిపె.

**కరుకు**[4] రూ.చూ. గరువు. వి. ఇసక, నన్న గులకరాళ్ళు కలిసిన నేల.

**కరుకు**[5] రూ.చూ. కరుగు?. వి. పైరు పొట్ట పెట్టడానికి ముందరి దశ.

కరుకుపొట్ట రూ. గరకుపొట్ట. వి. చిరుపొట్ట, ఎన్నులు పొటమరించే దశ.

**కరుకు**[6] విశ. గట్టి.

కరుకుపెట్టు స.క్రి. 1. మెరుగుపెట్టు ; 2. కుందనున్నగా

మెరుగ్గా రావడానికి తడిగుడ్డతో సారెమీద కుండను పట్టు.

**కరుగు**[1] రూ. కరుగుడు, కరువు[2], కర్వు. వి. 1. అచ్చులో పోసిన బొమ్మ. చంద్రాంగ. 2.12 ; 2. పోతపోసే అచ్చు.

క. *కరు*. చెక్కడపు పని ; *కరువిడు*. అచ్చు, నమూనా ; తు. *కరు, గరు, కరవై* ; త. *కరు*. పోతపోసే అచ్చు ; *కరుక్కు*. చెక్కడం ; మ. *కరు*. ఆకారం ; *కరుక్కుపని*. చెక్కడపు పని ;

కరగెడుమూస వి. 1. పోతపోసే అచ్చు ; 2. అచ్చు పోసిన బొమ్మ.

**కరుగు**[2] రూ. కరుకు[3], కరువు[4], గరుకు. వి. 1. గర్భం. భార. అను. 1.111 ; 2. పరిపొట్ట క్ర్ర, వెన్నుమొదట వేసేనన.

క. *కంద*. జంతువుల గర్భం ; త. *కరు*. గర్భం. జంతుగర్భంలోని పిండపు ఆరంభ దశ ; మ. *కరుపిండం*. గుడ్డులోని పసుపుసొన ; కొం. *కర్వ్*. జంతుపిండం, తేనెటీగ పురుగు దశ ; పర్జి. *కెర్వ్*. గుడ్డు ; గ. *కర్వ్* ; ఒల్లా. *కర్వ్*.

**కరుగుడు** రూ.చూ. కరుగు[1]. వి. సీసం, తగరం.

**కరుగోల** వి. చేలోని మొక్కల్ని వేళ్ళతో పెళ్ళగించడానికి ఉపయోగించే సాధనం.

< కట్టు + కోల.

**కరుంగనపత్తి** వి. ఒక రకం తెల్లనిపత్తి.

**కరుచు**[1] అ.క్రి. కలసిపోవు.

**కరుచు**[2] రూ.చూ. ఖర్చు. వి. వ్యయం, వెచ్చం.

**కరుడు**[1] రూ. కెరుడు. వి. అన్నంముద్ద, గట్టిపడిన ముద్ద. సారంగ. 2.205, వేంక. పంచ. 4.238.

కరుడుగట్టు (-కట్టు) అ.క్రి. పేరుకొను, ముద్దకట్టు, పిండమగు. భార.స్త్రీ. 1.36, వరాహ. 3.119.

**కరుడు**[2] రూ. కరడు[1], కరండము, కరఁడు, కరదు[1]. వి. అల, కెరటం. శృం.నై. 8.28.

**కరుడు**[3] వి. దినపరి లెక్క.

**కరుడుమొద్దు** రూ.చూ. కొరుడుమొద్దు. వి. కొయ్యమొద్దు, కుంచ, తుండు.

**కరుణ** రూ.చూ. కరుణు. వి. కనరు, వెగటు.

**కరుణు** రూ. కరుణ. వి. కనరు, వెగటు.

**కరుదు** వి. పలుకు, నుడి, మాట.

**కరుదువు** రూ. కరుదువ్వ. చూ. కఱు[1]. వి. కరదూపం, పొగబూజు, వాసాలకు పట్టేబూజు.

**కరుదువ్వ** రూ.చూ. కరుదువు. వి. కరదూపం, పొగబూజు.

**కరుదూపం** రూ.చూ. కరిదూపము. చూ. కఱు[1]. వి. పొగపల్ల పట్టిన మసి.

**కరుదూపము** రూ.చూ. కరిదూపము. వి. పొగబూజు.

**కరుపు** స.క్రి. నాటు, గుచ్చుకొనేట్లుగాచేయు, అంటుకొనేట్లుగా చేయు. భార. ద్రోణ. 1.173.

కరుపువానం వి. మూలవాసాలమధ్య బిగించే లావుపాటి వానం.

**కరుబరిసెబడె** వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

**కరుబూజ** రూ.చూ. కరబూజా. వి. పుచ్చకాయ.

కరుబూజకూజ వి. కరిపుచ్చకాయ ఆకారంలో ఉన్న కూజా. కరుబూజదోస వి. వృత్తకర్కటి, పుచ్చకాయ.

**కరుబూజా** రూ.చూ. కరబూజా. వి. కృష్ణబీజం, పుచ్చకాయ.

**కరుమపుసాకిరి** చూ. కరుమము.

**కరుమము** వి. కర్మ, చెయ్యి, చెయిది, చేత.

కరుమపుసాకిరి వి. చెయ్యులసాకిరి. కర్మసాక్షి, సూర్యుడు. ప్రబంధ. 788.

సం. *కర్మన్*. పని.

< సం. కర్మన్.

**కరుమల** రూ. కరుమలి. వి. కమ్మరపనిచేసే జాతి. ఆం.భా. 2.284.

సం. *కర్మార-*. ఇనప పనిచేసే జాతి.

< సం. కర్మార-.

**కరుమలి** రూ.చూ. కరుమల. వి. కమ్మర పనిచేసే జాతి. ఆం. భా. 2.284.

**కరుమొంగ** వి. కారుగక, వృక్షవిశేషం. (Averrhoa carambola).

సం. *కర్మరంగ-*. వృక్షవిశేషం.

< సం. కర్మరంగ-.

**కరువ** వి. కొండ, గుబ్బలి, గట్టు, పర్వతం. ఆం.భా. 2.27.

సం. *గ్రావా*. పర్వతం.

< సం. గ్రావా.

**కరువటిల్లు** అ.క్రి. వణకు, కంపిల్లు, తడబడు. కు. సం. 4.59.

**కరువలి** రూ. కర్వలి. వి. వాయువు, గాలి. ఈదు. భార. ఆది. 3.182.

క. *గరువలి* ; త. *వలి*. గాలి, వాయువు ; మ. *వళి* ; గోం. *వజీ* ; కుఇ. *విలు*. వ్లూ, పర్జి. *వలి*. *వల్లి* ; గ. *వల్* ; ఒల్లా. *వల్*.

కరువలికుడువరి వి. పవనాశనం, గాలిమేతగా గలది, పాము. అచ్చరా. అరణ్య. 114. < కరువలి + కుడుపు + -అరి. కరువలికొడుకు వి. 1. గాడ్పుచూలి; 2. భీముడు. భార. భీష్మ. 3.220 ; 3. హనుమంతుడు. మొల్ల. సుందర. 6 ; 4. అగ్ని. కరువలిచుట్టము వి. వాయుసఖుడు, అగ్ని. హరిశ్చ. 3.120. కరువలిపట్టి చూ. కరువలి కొడుకు. వాయుసుతుడు. కరువలిబలుకొలిజేజే వి. గాలిరూపం దాల్చిన రాక్షసుడు, తృణావర్తుడు. సీలా. 1.74. కరువలిమేతరి వి. పాము. వ్యు. గాలితిండిగాగలది. కరువలిమేపరి వి. గాలి తిండి, పాము. అచ్చ.రా. అయోధ్య. 2. కరువలియిర(-ఎర) వి. గాలితిండిగాగలది. పాము. ప్రబంధ. 330. కరువలిరిక్క వి. వాయుదేవతాకమైన నక్షత్రం, స్వాతీ నక్షత్రం, మారుతీ నక్షత్రం. కరువలివిందు వి. అగ్ని, గాలి నెచ్చెలి. మొల్ల. యుద్ధ. 67.

**కరువాదు** వి. శుష్కమత్స్యం, ఎండుచేప, నల్లచేప. ఆం.భా. 1.160.

**కరువు**[1] రూ. చూ. కరుకు[3]. వి. ఆకు కప్పు పేర్పులోని మూరెడు పన.

**కరువు**[2] రూ.చూ. కరుగు[1]. వి. 1. అచ్చునపోసిన బొమ్మ.

కు.నం. 5.99 ; 2. పోతపోసే అచ్చు.

కరువుగట్టు స.క్రి. అచ్చులోపోయు. కరవువట్టోయు స.క్రి. అచ్చులోపోయు, విగ్రహంగాచేయు. కళా. 3.13.

**కరువు**[3] రూ.చూ. కఱవు[1]. వి. దుర్భిక్షం.

కరువులో అధికమాసము వి. ఉన్న కష్టాలు చాలక మరొక పెద్ద కష్టం రావటం.

**కరువు**[4] రూ.చూ. కరుగు[2]. వి. వరిపైరుయొక్క గర్భ పుష్పం.

**కరుసు** వి. 1. పరుషవాక్కు, నిష్ఠురోక్తి, కటువిరుపుమాట, కరుకుమాట. ఆం.భా. 1.117 ; 2. పచ్చితోలు.

సం. ఘర్ష-. ఒరపిడి, రాపిడి.

<సం. ఘర్ష-.

**కరెంటు** రూ. కరంటు. విశ. చెల్లుతున్న, వ్యవహారంలోఉన్న, సాధారణమైన, వర్తమానపు, ఇప్పటి. వి. 1. ప్రవాహం, గతి ; 2. విద్యుచ్ఛక్తి.

ఇం. *Current.* ప్రవాహం, ఇప్పటి.

<ఇం. Current.

**కరెన్సీ** వి. 1. చెల్లటం ; 2. వ్యవహారం ; 3. ఒక రాజ్యం లోని నాణేల ఏర్పాటు.

ఇం. *Currency.* ద్రవ్యపు ఏర్పాటు, చెల్లుబడి, వాడుక.

<ఇం. Currency.

**కరెము** వి. పశువులకు ఏర్పడిన ఎక్కువ ధర.

**కరెంపాకు** రూ.చూ. కరివేపాకు. వి. సువాసనగల ఒక రకం ఆకు (Murraya Koringii).

**కరేపాకు** రూ.చూ. కరివేపాకు. వి. సువాసనగల ఒక రకం ఆకు, కృష్ణ నింబం (Murraya Koringii).

**కరోడా** వి. పై విచారణచేసేవాడు, రాజెదారుపై అధికారి.

హిం. కరోడీ. కోశాధ్యక్షుడు ; మరా. కరోల.

<హిం. కరోడీ (అర్థవిపరి.).

**కర్కటి** వి. ఆత్మ వినాశకం. బసవ. 1.97, భార. భీష్మ. 3.405. వ్య. ఎండ్రకాయ (పీత) పిల్లల్ని కని తాను చనిపోతుంది అని ప్రతీతి. తేళ్ల విషయంలోకూడ ఇలాగే.

సం. *కర్కట-, కర్కటక-*. పీత, ఎండ్రకాయ; *కర్కటీ*. ఆడపీత.

<సం. కర్కటీ.

**కర్కాటక** వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె.

సం. *కర్కట-, కర్కటక-*. పీత, ఎండ్రకాయ : ప్రా. *కక్కడ-* ; ప్రా. *కర్కటక* ; అ. *కేఁకొరా*. మగపీత ; *కెకురీ*. ఆడపీత ; బెం. *కాఁక* ; ఒ. *కాఁకర, కాఁకక్*, *కాకారా* ; హిం. *కేఁకా*. *గేగ్ట* ; సిం. *కకుళువా*. పీత ; గు. *ఖేఁక* ; మరా. *ఖేకడ్*. పీత.

<సం. *కర్కటక-* (అర్థవిపరి.).

**కరెక్కు** అ.క్రి. పులకరించు. కు.నం. 10.36.

**కర్కోటకుడు** వి. క్రూరుడు.

సం. *కర్కోటక-*. నాగజాతిలో ఒక క్రూర సర్పం పేరు.

<సం. కర్కోటక- (అర్థవిపరి.).

**కర్చుచెట్టు** చూ. కఱవు. స.క్రి. కరిపించు, అతుకు, కలుపు, అంటుకొనేట్లు చేయు.

**కర్చీఫ్** వి. రుమాలు, (చేతి)గుడ్డ.

ఇం. *Kerchief.* రుమాలు.

<ఇం. Kerchief.

**కర్చు** రూ.చూ. ఖర్చు. వి. వ్యయం, వెచ్చం.

**కర్ణకాయ** రూ. కర్ణికాయ. వి. గజనిమ్మకాయ.

**కర్ణము** రూ.చూ. కరణము. వి. 1. గ్రామం లెక్కలు రాసే వాడు ; 2. గణకుడు ; 3. కాయస్థుడు.

**కర్ణసాము** వి. నేతపనివాళ్ళలో ఒక తెగ.

**కర్ణాకర్ణికగా** రూ.చూ. కర్ణాకర్ణిగా. క్రి.విశ. ద్రు. జనశ్రుతిగా.

**కర్ణాకర్ణిగా** రూ. కర్ణాకర్ణికగా. క్రి.విశ. ద్రు. జనశ్రుతిగా. ఉ. హరి. 5.296. ఎవరో ఒకరికి చెప్తే, వారు మరొకరికి చెప్తే అలా పాకిన వార్తలపట్ల ఉపయోగించే మాట.

సం. *కర్ణ-*. చెవి ; *ఆకర్ణన-*. వినటం.

**కర్ణాతు** వి. మల్లయుద్ధ సంబంధమైన విసురు.

**కర్ణాలు** వి.బ.వ. వాద్యవిశేషం.

**కర్ణిబత్తులు** రూ.చూ. కరిణబత్తులు. వి.బ.వ. నేతపనిజేసే వాళ్ళలో ఒక తెగవారు.

**కర్ణుడులేనిభారతము** వి. అసలు సున్నా అయినది, అసలు లేనిది. వ్య. కర్ణుడు లేకుండా భారతం ఉండదు, ఏమీ లేకపోవటం.

**కర్ణునితలభారతము** వి. దీనికంతా నువ్వే ప్రధానుడివి అనే టప్పుడుపయోగించే మాట. వ్య. కర్ణుడి తలమీదనే భారతం నిలిచి ఉండటంవల్ల ఏర్పడిన పదబంధం.

**కర్ణేజపుడు** వి. చెవి కొరికేవాడు, చాడీలు చెప్పేవాడు.

సం. *కర్ణేజప-* చెవిలో జపించేవాడు.

<సం. కర్ణేజప-. (అర్థవిపరి.).

**కర్తరిపాణి** వి. ఒకచేతిని మరొక భుజంపైకి వచ్చేటట్లు చేతుల్ని కత్తెరలాగ కట్టుకోవడం. పండి. చ. 2.514 వ.

సం. *కర్తరీ*. కత్తెర, *పాణి-*. చేయి.

**కర్తారు(డు** వి. అల్లా, సూర్యుడు.

హిం. *కర్తార్*. అల్లా.

<హిం. కర్తార్.

**కర్తాళి** రూ.చూ. కత్తాళి. వి. కలబంద. (Aloe barbtradensis).

**కర్తిక** వి. కృత్తికా నక్షత్రం.

సం. *కృత్తికా*. ఒక నక్షత్రకూటమి.

**కర్తిమొల** చూ. కట్టు. వి. గొర్రుచెక్కకు కర్రనుబిగించే ఇనప కొండి.

**కర్తెరి** వి. కృత్తిక కార్తె, వైశాఖ మాసంలో వచ్చే ఒక కార్తె.

సం. *కృత్తికా*. ఒక నక్షత్రకూటమి.

**కర్దం** వి. ధాన్యం నిలవచేసుకోడానికి ఇంటినేలలో కట్టినకొట్టు.

**కర్దనంగూడు** వి. ద్వారబంధంమీద బొమ్మలు పెట్టుకోడానికి ఏర్పరచినగూడు.

**కర్దవ** వి. పైనుండి వేలాడే నుసి.

**కర్నంవరులు** వి.బ.వ. కారణాలు.

**కర్నకాయ** వి. దబ్బకాయ, ఈడ.

**కర్నకోల** వి. కళ్ళంలో గడ్డిలాగడానికి ఉపయోగించే కొంకి కర్ర, దోటి.

**కర్నలు** రూ. కర్నేలు. వి. సైనికోద్యోగి. (మహాబలాధిపతి),

గౌరవపదవి.

ఇం. *Colonel.* సైనికాధిపతి.

<ఇం. Colonel.

కర్నాచీ వి. వాద్యవిశేషం. అని. 3.19.

మరా. *కరణా, కర్ణా.* పొడుగ్గాఉండే గొట్టం, శృంగం ; ఉ. కర్నా. ఒకవాద్యం : పార. కర్నా, కర్న, కర్నాస్. కొమ్ములుగల, కొమ్ము, ముక్కలాగ ఎత్తుగాఉన్న పర్వతం, ఎత్తుగాగల పక్కలు ; అర. కర్నా. వాద్యవిశేషం.

<ఉ. కర్నా.

కర్నాటకచీర రూ. కర్నాటకం చీర. వి. అంచులో ఒకమాదిరి డిజైనులో రంగుపోగు దూర్చి నేసినచీర. వ్యు. కన్నడ దేశంలో తయారైన చీర.

కర్నాటకంచీర రూ.చూ. కర్నాటక చీర. వి. డిజైనుతో రంగు పోగుదూర్చి నేసిన చీర.

కర్నాటకనేత వి. 1. చీరఅంచులో కొమ్ముల మాదిరి డిజైన్లు పడేట్టు నేసిన నేత ; 2. రెండు రంగుల్లో పెండేసి పోగులు పెట్టి నేసిననేత. వ్యు. కన్నడదేశం నేత.

కర్నాటిచీర చూ. కర్నాటక చీర. వి. సీమపట్టు, దమయంతి సీమపట్టు రంగుల దారాలు వరనగా 20, 4, 10 కొలుకుల చొప్పున చివరి అంచు పెట్టి తరవాత 15–20 కొలుకుల కెంపు రంగుదారం పెట్టి లోపలి అంచుకు సీమపట్టు దమ యంతి, సీమపట్టు రంగుదారాలు 16, 4, 10 కొలుకుల చొప్పున పెట్టి నేసిననేత.

కర్నాటిపీతాంబరం వి. జానెడు బెత్తెడు వెడల్పు డిజైనుఅంచు పెట్టి నేసిన పట్టు వస్త్రం. వ్యు. కన్నడదేశపు పట్టువస్త్రం.

కర్నాటుపారచీర చూ. కర్నాటక చీర. వి. ఒకరకం నేతచీర.

కర్నికాయ రూ.చూ. కర్ణకాయ. వి. గజనిమ్మకాయ, పెద్ద నిమ్మకాయ.

కర్నెపొడి వి. కడుపుఉబ్బి పేడవెయ్యక పోవటం.

కర్నైలు రూ.చూ. కర్నలు. వి. సైనికోద్యోగి.

కర్పటైమ వి. కర్పూరతైలం.

ఇం. *Turpentine.* కర్పూరతైలం, దేవదారుచెట్టుబంక.

<ఇం. Turpentine.

కర్పాతి రూ.చూ. కరపాని. వి. రోగవిశేషం, ఒకరకమైన చిడుం.

కర్పూరకాంతులు వి.బ.వ. భక్ష్యవిశేషం.

సం. *కర్పూరకాంతి-.* కప్పురంవెలుగు.

<సం. కర్పూరకాంతి- + - లు (అర్థవిపరి.).

కర్పూరచక్కరకేళీ వి. చక్కెరకేళీభేదం, పండరటి.

సం. *కర్పూర-.* కర్పూరం.

<సం. కర్పూర-. + చక్కెరకేళీ. మిశ్ర.స.

కర్పూరపువంకాయ వి. లావుగా, గుండ్రంగా తొడిమెలకు ముళ్ళుండే వంకాయ.

<సం. కర్పూర + వంకాయ.

కర్పూరప్పాగ వి. ఆరటికాయలకు వేసేకర్పూరపుపొగ.

సం. *కర్పూర-.* కర్పూరం.

కర్పూరభోగాలు వి.బ.వ. ధాన్యవిశేషం.

సం. కర్పూర- + భోగములు.

కర్పూరవర్తి అఖండదీపము వి. నిత్యం కర్పూరదీపానికై విని యోగించే దీపం.

సం. *కర్పూరవర్తి-.* కర్పూరానికై ఉండే, *అఖండదీప.* నిత్యంవెలిగే దీపం.

<సం. కర్పూరవర్తి- + సం. అఖండదీప- (అర్థ విపరి.).

కర్పూరవర్తిలోహదండుదివియ వి. కర్పూరహారతికై విని యోగించే లోహదండంగల దీపం.

సం. *కర్పూరవర్తి-.* కర్పూరానికై ఉండే, *లోహదండ.* ఇనపదండం, *దీపికా.* దీపం.

కర్పూరవిడియము వి. కర్పూర ద్రవ్యంతో కూడిన తాంబూలం.

సం. *కర్పూర-.* కర్పూరం.

కర్ఫ్యూ వి. నిషేధాజ్ఞ.

ఇం. *Curfew.* ఇంగ్లండులో పూర్వం సాయంకాలం వాయించడానికి నిర్ణయించినగంట, సైనికశాసనం మొ॥ వానిలో ఒకనిర్దిష్టకాల వ్యవధిలో వెలుపలికి రాకూడదనే ఆజ్ఞ.

<ఇం. Curfew.

కర్బూజ రూ.చూ. కరబూజా. వి. పుచ్చకాయ.

కర్బూజా రూ.చూ. కరబూజా. వి. కృష్ణబీజం, పుచ్చకాయ.

కర్మ వి. 1. కొలువుకాడు, సేవకుడు, దేవాలయ పరిచారకుడు ; 2. దురదృష్టం.

సం. *కర్మన్.* పని, కార్యం.

<సం. కర్మన్. (అర్థవిపరి.)

కర్మకాలి రూ. కర్మంకాలి. అవ్య. దురదృష్టవశాత్తు. కర్మకాలిపోవగా. క్రి.విజ.ద్రు. వినుగు వేనటలను తెలిపే ఊతపదం. కర్మంకాలి రూ.చూ. కర్మకాలి. అవ్య. దురదృష్ట వశాత్తు. కర్మచాలక అవ్య. దురదృష్టవశాత్తు.

కర్మదాసు వి. లోహకార కులానికి చెందిన సేవకుడు.

సం. *కర్మదాస-.* పనిచేసే నౌకరు.

<సం. కర్మదాస-. (అర్థవిపరి.).

కర్మంతరాలదీవముచూచినట్లు అవ్య. ఒక కార్యంపట్ల అనక్తి చూపకుండా పట్టిపట్టనట్లు ప్రవర్తించినట్లు.

సం. *కర్మన్.* పని ; *అంతర-.* భేదం.

కర్మలమాన్యం వి. కమ్మరివాడికి ఇచ్చిన మాన్యం.

కర్మాయి వి. కుంకుమరంగు ; దచ్చి. కార్మజియన్. పో. *కర్మి* ; ఫ్రె. *కార్మై*; స్పా. *కర్మేసి, కర్మిన్.* రక్తవర్ణం.

<పో. కర్మి.

కర్మికరణాలు వి.బ.వ. దేవాలయసేవకులు, స్థానపతులు.

కర్ర రూ.చూ. కఱ్ఱ. వి. 1. పడుగుదాపినప్పుడు, కింది పోగులు కలసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటి కర్ర ; 2. అచ్చులో వడిదారం కటిన కర్ర ; 3. మగ్గం గొయ్యిలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల ; 4. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగు రాట ; 5. కమ్మి నేతలో మూడువేళ్ళ వెడల్పున నేసిన పట్టె ; 6. రంగు అద్దిన నూలు లడీలు ; 7. కొయ్యముక్క ; 8. పార మొ. సాధనాలను పట్టుకోడానికి ఫీలుగా ఉండే పొడుగాటి కొయ్యపిడి ; 9. వరి, జొన్న, సజ్జ మొ. పైరు

మొక్కలకాడ.

కర్రవీరు స.క్రి. పడుగేరే కర్రమీద పోగులు నెరిపి సాపుచేయు. కర్రకట్టి వి. ఉండేలుబద్ద. కర్రకత్తి వి. వాదు మీద మోది చదును చెయ్యడానికి వాడే కొయ్యకత్తి. కర్రకొమ్ము వి. కర్రలాగ ఉన్న సన్నని గట్టి కొమ్ము. కర్రగట్టు స.క్రి. చీరకొంగు చివర బద్దె దారాలకు ముడులు వేసి అల్లు. కర్రగుండ వి. ఆముకాల్పులో వాడే చిన్నకత్తి ముక్కలు. కర్రగుమటాం వి. బేల్దారులు, వడ్రంగులు వాడే కొయ్య సుత్తి. కర్రగురుజు వి. తలుపు చట్రాన్ని బిగించడానికి వాడే కర్రవుల్ల. కర్రచిట్టె వి. కమ్మినేతలో చిన్న పట్టెకు రెండు వైపులా వేసిన మందపు దారాలు. కర్రచెక్కముల్లు వి. కొయ్యచెక్కకు బిగించిన చేప దవడ. కర్రంచు వి. పెద్ద పాత్రలకు పెట్టే అంచు, రెండంచుల్లాగ లోపల నిలువు. బయట పరుషుగా వస్తుంది, బోదంచు. కర్రంచుదాక వి. మూతి వెడల్పుగాఉండి లోపల ఒక అంచు మీద వేరొక అంచుఉండే మట్టిపాత్ర. కర్రంచుమంద వి. అన్నం వండుకోడానికి వాడే మట్టిపాత్ర. కర్రతుమ్మ వి. తుమ్మలో ఒకరకం. కర్రతొక్కు స.క్రి. పడుగులో కర్ర దూర్చు. కర్రదారం వి. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. కర్రదిండు వి. కర్రతో చేసిన కదురుదిండు. కర్రదిద్దు స.క్రి. పడుగేరే కర్రమీద పోగులు పరచి చిక్కులుతీసి సాపుచేయు. కర్రదిమ్మిస వి. కొయ్యదిమ్మగల దిమ్మెస. కర్రనాంగలి వి. పెద్దరకం మెట్ట నాగలి. కర్రపాలక్కుళ్ళు వి.బ.వ. అక్కుళ్ళలో మంచిరకం వడ్లు. కర్రపీట వి. కుండల్ని వానేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి వాడే కొయ్యపీట. కర్రపెండలం రూ.చూ. కఱ్ఱపెండలము. వి. పెండలం మొక్కలాగ పెరిగే పెండలం (Manihot utidissima). తెగకు చెందిన దుంప. కర్రపొట్టుపొయ్యి వి. కర్రముక్కలు మొ. రగిలించి వంట చేయడానికి వాడే పొయ్యి. కర్రబట్టీ వి. కట్టెపుల్లలతో కాల్చే ఇటుకబట్టీ. కర్రముగ్గు వి. వేళ్ళ సందులనుంచి ముగ్గుపిండి వదలుతూ గీసిన సమాంతర రేఖలు. కర్రమేకు వి. కొయ్యతోచేసిన మేకు. కర్రరావ వి. ఆము కాల్పుకు ముళ్ళ కంపల్ని తీసుకురావడానికి వాడే పంగలకర్ర. కర్రలకమ్మి వి. పట్టెలు పట్టెలుగా నేసిన ఒకరకం కమ్మి. కర్రసూత్రాలు వి.బ.వ. అంచుల్లో డిజైన్లు నేయడానికి డాబీ కోలలకు కట్టిన దారాలు. కర్రాము వి. కట్టెపుల్లలతో కాల్చే ఇటికబట్టీ.

కర్రాము చూ. కర్ర[1].

కర్రి రూ.చూ. కఱి[1]. విశే. నల్లని. వి. కార్ష్ణ్యం, నల్లదనం.

కర్రిగొంగడి వి. నల్లరంగు ఉన్నితో నేసిన గొంగళి. కర్రిజాల రూ.చూ. కఱ్ఱిజాల. వి. నలుపుమీద తెలుపు మొ॥ మరొకరంగు చార. కర్రిబట్ట వి. నలుపుమీద తెల్లమచ్చ. కర్రిబూసర వి. తెలుపుమీద నలుపుచుక్క. కర్రిబొగ్గు వి. రైలుబొగ్గు, భూగర్భంనుంచి తవ్వితీసిన బొగ్గు, నేలబొగ్గు. కర్రిబొల్లి వి. శరీరం నలుపు, మొగం తెలుపుగా ఉండే వ్యాధి. కర్రిమైల వి. 1. దేహం నలుపు, మెడమీద తెలుపుగా ఉండటం ; 2. నలుపుమీద తెలుపు, ఎరుపుమచ్చ. కర్రిరాయి వి. ఎక్కువగా కాలి నల్లబడిన ఇటిక.

కర్రు రూ.చూ. కఱ్ఱు[1]. వి. చివర వెడల్పుగా ఉన్న చిన్న గడ్డపార ; 2. గొర్రుచెక్కలకు బిగించిన ఇనపముక్క ; 3. పండ్లమాను, కార్లపొలిక మొ. వాటి దిండుకు వేసిన కొయ్యపన్ను ; 4. నాగేటి ఆరుకు అమర్చే పొడుగాటి ఇనపముక్క ; 5. ఊడ్తెను నిలబెట్టే తాడుతో బిగించడానికి నేలలో పాతిన ఇనపగూటం ; 6. బొంత రాతినేలను చెక్కే సాధనం.

కర్రుకర్రువదేలు (-తేలు) అ.క్రి. గడ్డపార దిగకుండా ఉండు. కర్రుకాలు వి. కర్రును ఆరుకు బిగించే ఇనపగొండి. కర్రుకోల వి. గొర్రుచెక్కలకు బిగించిన ఇనపముక్క. కర్రుగుద్దలి రూ. కఱ్ఱుగుద్దలి. వి. పెంటపోగులు లాగటానికి గట్లు వేయటానికి ఉపయోగించే పనిముట్టు. కర్రుగొండి వి. 1. కర్రును ఆరుకు బిగించే ఇనపగొండి ; 2. గొర్రుచెక్కకు కర్రుబిగించే ఇనపగొండి. కర్రుజోడు రూ.చూ. కఱ్ఱుజోడు. వి. అరక కట్టటానికి ఉపయోగించే పగ్గాలు, పట్టెళ్ళు, మోకు, చెలకోల మొదలైన తాళ్ళగుది లేక కట్ట. కర్రుతంగోల రూ.చూ. కఱ్ఱుతంగోల. వి. మట్టితవ్వే పరికరం. కర్రుమొల రూ.చూ. కఱ్ఱిమొల. వి. గొర్రు చెక్కకు బిగించే ఇనపకొండి. కర్రువేయు స.క్రి. అనివెంబడి కర్రతొడుగు.

కర్రె రూ.చూ. కఱి[1]. విశే. నల్లని.

కర్రెగొర్రె వి. నలుపుబొచ్చుగల గొర్రె. కర్రెపూలంచు వి. ఒకరకం డిజైన్‌తో నేసిన అంచు. కర్రెమన్ను వి. బాగా నల్లగాఉండే గడిమట్టి. కర్రేయు స.క్రి. సారె కర్రతో సారెను తిప్పు.

కర్రేయు చూ. కర్రు.

కర్వలి రూ.చూ. కరువలి. వి. గాలి. కాశ. 3.149.

కర్వు రూ.చూ. కరుగు[1]. వి. 1. పోతపోసే అచ్చు ; 2. అచ్చులో పోసిన బొమ్మ.

కర్వె రూ.చూ. కరివె[1]. వి. ఇత్తడి మొ. వాటితో చేసి వీణా దండాన్ని పొదిగికొని ఉండేట్లు సొరకాయపై అమర్చే తదంగం.

కర్వేపాకు రూ.చూ. కరివేపాకు. వి. సువాసనగల ఒకరకం ఆకు. (Murraya koringii).

కర్సనము రూ.చూ. కరిసనము విశే. 1. లాగే, ఈడ్చే ; 2. గీచే, బిరిసే ; 3. దున్నే. వి. కృషి, సేద్యం, దున్నడం, లాగడం.

కఱ[1] రూ. కఱక. కఱ్ఱు[1], వి. 1. మచ్చ, మరక, డాగు. భార. ఆది. 5.15. కు.సం. 8.116; 2. అకీర్తి. సారంగ. 3.220 ; 3. నలుపు. విశే, నల్లని. రాజ. వి. 2.55, శుక. 2.486.

పో.చూ. సం. *కర్బరీ*. కాటుక.

క. *కఱె*, *కఱ్*. నల్లదనం, నలుపురంగు ; త. *కఱుప్పు*. నలుపు, చీకటి, మచ్చ ; *కఱై*. మచ్చ, మరక, తుప్పు ; మ. *కఱ*. నల్లదనం, మచ్చ, మరక, తుప్పు ; *కఱు*. నల్లని.

<మూ.ద్రా *కఱ్-.

కఱకంటుఁడు రూ.చూ. కఱకంఠుఁడు. వి. శివుడు.

కఱకంఠుఁడు రూ. కరకంఠుఁడు, కఱకంఠుఁడు. వి. శివుడు. భార. అరణ్య. 1.327. సం. *గరకంఠ* -. శివుడు ; క. *కఱెగొరల* ; త. *కఱైక్కణ్డన్*. కఱకంఠతలయేఱు

వి. ఆకాశగంగ. వ్యు. శివుని శిరస్సుపై ఉండే నది. **కఱకంఠునితలమానికము** వి. చంద్రుడు. వ్యు. శివుని శిరోభూషణం. **కఱకంఠునిల్లాలు** రూ. కరకంఠునిల్లాలు. వి. భవాని, పార్వతి. ఆం.భా. 1.40. **కఱకంఠురాణి** వి. కరకంఠునిల్లాలు, పార్వతి. **కఱగట్టు** అ.క్రి. మచ్చ ఏర్పడు. **కఱదూపము** వి. పొగచూరిన దూగర, గృహ ధూమం. దుందుమారం. భీమ. 2.45. **కఱవోవు** (-పోవు) అ.క్రి. నల్లబడు.

**కఱ**[2] రూ.చూ. కట్టి[2]. వి. 1. గంటి, వరి, మొ. వాటి దుబ్బు, సస్య గుచ్ఛం. ఆము. 4.118, ఆం.భా. 2.137 ; 2. చార, రేఖ. శుక. 2.486 ; 3. కొయ్య ; 4. దండం.

**కఱకుట్టులు** రూ.చూ. కఱకుట్లు. వి.బ.వ. కాల్చి పక్వం చేయడానికి ఇనపకాడకు గుచ్చిన మాంసం ముక్కలు. **కఱకుట్లు** రూ. కఱకుట్టులు, కఱుకుట్లు, కట్టికుట్లు, కఱుకుట్టులు, కఱుకుట్లు. వి.బ.వ. కాల్చి పక్వం చేయడానికి ఇనపకాడకు గుచ్చిన మాంసం ముక్కలు, శూలానికి గుచ్చి కాల్చిన మాంసఖండాలు. బసవ. 3.662. **కఱనూనె** రూ.చూ. కట్టినూనె. వి. మానితైలం, క్కర నూనె.

**కఱక** రూ.చూ. కఱ[1]. వి. 1. మచ్చ, నలుపు, మరక, నల్లనిది ; 2. అపకీర్తి.

**కఱకంచు** రూ.చూ. కరకంచు. వి. కరక్కాయ సిరాతో రాసిన అంచు.

**కఱకరి** వి. 1. కఠినం. మను. 2.61 ; 2. సమర్థుడు, నేర్పరి, దిట్ట. మను. 4.7 ; 3. పగవు, వంక.

పో.చూ. నం. కర్కర -. పరుషమైన, గట్టి.

**కఱకఱ**[1] రూ. కరకర[1], గరగర. వి. నమిలేటప్పుడు చేసే ధ్వనికి అనుకరణం.

క. *గఱ*. గట్టి పదార్థాలను కొరికేటప్పుడయ్యే ధ్వని ; *గఱగు, గఱుగు*. నమిలేటప్పుడయ్యే ధ్వని ; తు. *కరకర, కరుకురు*. నమిలేటప్పుడయ్యేధ్వని ; త. *కఱకఱ* (-ప్పు-, త్తు -). నమిలేటప్పుడు చేసే ధ్వనికి అనుకరణం ; మ. *కఱుకతె*. కొరుకుడుధ్వని.

**కఱకఱ**[2] రూ.చూ. కరకర[2]. క్రి.విశే.ప్రదు. 1. తీవ్రంగా ; 2. అధికంగా.

**కఱకఱి** రూ. కరకరి. వి. 1. ద్వేషం. కాశీ. 1.100. ప్రబోధ. 2.49 ; 2. బాధ. ఆము. 5.61 ; 3. బలాత్కారం.

**కఱకఱించు** అ.క్రి. పొగరెక్కు, పగగొను. **కఱకఱిబెట్టు** స.క్రి. పీడించు, బాధపెట్టు, నిర్బంధపెట్టు. ఆము. 5.61.

**కఱకు** రూ. కరకు[2], కఱుకు[2]. విశే. 1. కఠినమైన, క్రూరమైన, పరుషమైన, బిరుసు, ముదుగు, మోటు. భార.ఆది. 7.224 ; 2. తీక్ష్ణమైన, పదునైన, భయంకరమైన. భాగ. 10. ఉ. 939 ; 3. గాఢమైన, దట్టమైన, సాంద్రమైన. కాశీ. 3.234; వి. 1. కాఠిన్యం, బిరుసుదనం. భీమ. 2.128 ; 2. శౌర్యం. ఆం.భా. 2.221 ; వి.బ.వ. 1. పరుష వచనాలు. మూర్తిత్రయోపాఖ్యానము. 6.70 ; 2. క్రూర కృత్యాలు. భోజ. 5.109 ; 3. రంపం మొదలైనవాటి కక్కులు. వేణు.శ. 64.

క. *కఱుకు, కరుక్క, కక్కు, గఱుకు, గరకు, గరుక్క, గరసు*. రంపానికి పళ్ళున్న ; *కఱుక్కు*. రంపం పళ్ళు, తాటికమ్మ అంచు ; త. *కఱుక్కు*. రంపం పళ్ళు, గరికమ్మ ; మ. *కఱు*. కరవైన ; *కఱుప్పా*. కరకుదనం ; *కఱుమ*. కత్తిపదును ; *కఱుక్కు*. రంపంపళ్లు, తాటికమ్మ గరి ; *కఱుక్కక*. పదునుగా ఉండు, పదునైన, గరుకైన ; కోత. *కర్ప్*. వాడితనం, చురుకుదనం, మోటుతనం.

పో.చూ. నం. *కర్కర* -. కఠినమైన, దృఢమైన ; *కర్కశా*. పదునైన, గట్టి ; *క్రకచ* -. రంపం; *ఖర* -. గట్టి, పదునైన ; *ఖరు*. తీక్ష్ణమైన, క్రూరమైన ; ప్రా. *కరకయ* -. రంపం ; పా. *కకచ* -. రంపం.

**కఱకుగిలు** రూ. కఱకుగిల్లు, కఱగిల్లు. అ.క్రి. బిరుసెక్కు. కవిక .5.110. **కఱకుగిల్లు** రూ.చూ. కఱకుగిలు. అ.క్రి. బిరుసెక్కు. **కఱకుచీకటి** వి. భయంకరమైన చీకటి. కాశీ. 3.235. **కఱకుటమ్ము** వి. వాడిగల బాణం. **కఱకుదుమ్ము** వి. సికత, ఇసక. మను. 5.38. **కఱకుదనము**(-తనము) వి. మోటుదనం, కాఠిన్యం, పారుష్యం, క్రౌర్యం. జైమినీ. భా. 3.34. **కఱకుదేఱు**(-తేఱు) అ.క్రి. గడిదేరు, గరునగు. **కఱకుమాటలు** వి.బ.వ. కఠినోక్తులు. శృం.నై. 7.93. **కఱకులాడు** స.క్రి. కఠినోక్తులాడు. **కఱకులు** అ.క్రి. పులకించు, గగుర్పొడుచు. కు.సం. 10.40. వి.బ.వ. 1. క్రూరకృత్యాలు. భోజ. 5.109 ; 2. పరుష వచనాలు, కఠినోక్తులు. కృ.శకు. 2.222 ; 3. రంపం మొ. వాటి కక్కులు. వేణు.శ. 64. **కఱకువరహా** వి. వరాహ ముద్రగల నాణెం, నాలుగు రూపాయల విలువగల నాణెం. **కఱకుసాన** వి. సానరాయి, ఒరగల్లు, పదును పెట్టే సాన. దశా. 4.177. **కఱకెక్కు** అ.క్రి. 1. పులకించు, గగుర్పొడుచు. కు.సం. 10.426 ; 2. ఆరితేరు. భాస్క.రా. యుద్ధ. 434 ; 3. గట్టిపడు, బిరుసెక్కు. హరి.పూ. 5.142 ; 4. క్రూరమగు. కవిక. 3.110. **కఱకొను** రూ. కఱగొను. అ.క్రి. 1. గట్టిపడు. పద్మ. 3.88 ; 2. స్థిరపడు. **కఱగిల్లు** రూ.చూ. కఱకుగిలు. అ.క్రి. పదునగు, బిరుసెక్కు. **కఱగొను** (-కొను) రూ.చూ. కఱకొను. అ.క్రి. 1. గట్టిపడు ; 2. స్థిరపడు.

**కఱకెక్కు** చూ. కఱకు.

**కఱకొను** చూ. కఱకు.

**కఱక్కు** రూ.చూ. కఱుక్కు. వి. పళ్ళు కొరకడంలోని ధ్వన్యనుకరణం.

**కఱగిల్లు** చూ. కఱకు.

**కఱగు** అ.క్రి. సీరగు, మెత్తనగు. స.క్రి. కరగించు, మెత్తగా చేయు.

**కఱగొను** చూ. కఱకు.

**కఱగొఱ** వి. 1. లోపం, లోటు, దొసగు. భార.ద్రోణ. 1.223. కకుత్స్థ. 5.34. 35 ; 2. అపకీర్తి, అవమానం.

**కఱచీడ్లు** రూ.చూ. కఱచేడలు. వి.బ.వ. భక్ష్య విశేషం.

**కఱచు**[1] రూ. కఱుచు. స.క్రి. 1. పళ్ళు (దంతాలు) మొదలైన వాటితో పట్టుకొను. భార.ఆది. 2.73 ; 2. కాటువేయు, కొరుకు. భార.ఆది. 5.175, భార.విరా. 1.270 ; 3. నాటు, గుచ్చుకొను, తగులు,అంటు. భార.ద్రోణ. 1.173 ;

4. ఖండించు, ముక్కలు చేయు. శి.హరి. 1. 148, ఆము. 4.121 ; 5. అలవరచుకొను.

తు. *కజెపుని*. నములు, పక్షులు పళ్ళతోగాని ముక్కుతోగాని కొరుకు ; త. *కటి* (-ప్ప్-త్త్-). నములు, కొరికి తిను, నమలడం, కొరికితినడం ; *కఱుంపు* (కఱుంపి-). ముక్కలుముక్కలుగా తిను ; మ. *కఱుంపుక*. ఆవులు కింది పళ్ళతో తినేట్టుగా తిను.

పో.చూ. త. *కచ్చు*.

**కఱచు**[2] స.క్రి. నేర్చు, అభ్యసించు, తెలియు. భార. ఆది. 3.12. ఆది. 3.203.

క. *కల్‌*(కల్త్) ; త. *కల్‌* (కఱ్ప్-. కఱ్ఱ్). నేర్చుకొను, అభ్యసించు ; మ. *కల్‌క్క*. (కఱ్ఱ్-.). నేర్చుకొను ; గోం. *కఱితేనా*. కఱ్రి తన ; కొం. *కల్‌* (కర్ -) ; కుయి. *గ్రాంబ* (గ్రాంబి) ; కొలా. *కల్ప్‌-*, *కరప్‌* ; నా. *కరప్‌*.

మూ. మ.ద్రా. **కత్త్-*.

మూ. ద. ద్రా **క-త్త్*.

**కఱచెడలు** రూ.చూ. కఱచేడలు. వి.బ.వ. ఒకదినును తిను బండారం.

**కఱచేడలు** రూ. కఱచీడ్లు, కఱచెడలు, కటిచీడ్లు. వి.బ.వ. భక్ష్య విశేషం.

క. *చిడె*. నేతిలోగాని, నూనెలోగాని వేయింపబడి, గోళాకారంలో ఉండే భక్ష్యవిశేషం ; త. *చిటై*. బియ్యం పిండిలోచేసే గుండ్రని భక్ష్య విశేషం ; మ. *చిట*. గుండ్రని రొట్టె లేక అట్టు.

పో.చూ. *జీడి*. భక్ష్య విశేషం.

**కఱటి** వి. 1. వంచకుడు, మోసగాడు, మోసకత్తె, తుంటరి, వంచకం. రం.రా. ఆరణ్య. 172 పు. 26 పం ; 2. మూర్ఖుడు. వేంక. పంచ. 1.766 ; 3. అభాగ్యుడు. ప్రభు. 4.105 పు. 7 పం ; 4. కుజనుడు, దుష్టుడు. ఆం.భా.3.7.

క. *కరె*. దాగుకొను ; త. *కర* ( - ప్ప్ - న్త్ - ). దాచు, దొంగిలించు, దాగుకొను, వంచన, మోసం ; *కరవర్‌*. దొంగలు ; తె. *కర్‌*. దొంగలించు.

పో.చూ. నం. *ఖర్పర-*. దొంగ.

**కఱడియ** రూ. కరడె[2]. వి. వాద్యవిశేషం. కు.నం. 2.102.

క. *కరడి*, *కరడె*. రెండువైపులా వాయించే నిడుపాటి వాద్యం ; త. *కరటి*, *కరటిప్పఱై*, *కరటికై*. ఎలుగుబంటి ధ్వని చేసినట్లు మోగే ఒక వాద్యవిశేషం.

పో.చూ. నం. *కరటు-*. వాద్యవిశేషం.

**కఱత**[1] వి. చెడ్డపని, దుండగం. భార. ద్రోణ. 5.26.

నం. *కృత-*. చేయబడిన.

**కఱత**[2] రూ.చూ .కత్తు. వి. ఒడ్డు, తీరం.

**కఱతలయోగి** వి. 1. పరమపదం పొందిన యోగి. శాళ్వ. నం. 7.221 ; 2. ఆఖరుమెట్టు చేరినవాడు.

నం. *కర్త-*. చేసేవాడు.

**కఱతలాఁడు** చూ. కఱతలు.

**కఱతలు** వి.బ.వ. 1. దుశ్చేష్టలు, పోకిళ్ళు. నృసింహ. 4.135 ; 2. చేష్టలు, చేతలు. అప్ప. 2.197.

నం. *కృత-*. చేష్ట ; ప్రా. *కత-*.

<నం. కృత-.

**కఱతలాఁడు** రూ. కఱదలాఁడు. వి. 1. పోకిళ్ళమారి, దుశ్చేష్టలు చేసేవాడు. హరి. పూ. 5.242. నం. *కర్త-*. చేసేవాడు.

**కఱద** రూ. కఱదు. వి. 1. మాయమాట. పద్మ. 4.116 ; 2. చమత్కారం, వింతలు. ప్రభా. 3.47 ; 3. సంకోచం. ప్రబంధ. 555 ; 4. బుద్ధి. అప్ప. 2.197 ; 5. మాట, పలుకు. ఆం. భా. 1.110 ; 6. దుండగం ; 7. ప్రతిబింబం ; 8. ఊహ.

**కఱదతనము** వి. 1. నేర్పు ; 2. వింత ; 3. మాట ; 4. చేత, దుండగం. **కఱదలాఁడు** రూ.చూ. కఱతలాఁడు. వి. నేర్పరి, పోకిళ్ళమారి.

**కఱదు** రూ.చూ. కఱద. వి. మోసం, చెడ్డపని, వంచనం.

**కఱపడు** చూ. కఱవు[1].

**కఱపించు** చూ. కఱపు.

**కఱపు** చూ. కఱచు. వి. బోధనం. దుర్బోధనం. భార. ఆది. 4.41, భీష్మ. 1.30 ; స.క్రి. 1. నేర్పు, బోధించు. భార. ఆది. 8.43, భార. విరా. 1.233 ; 2. కలిగించు. కు.సం. 2.133.

తు. *కల్పావుని*. బోధించు, పురికొల్పు ; త. *కఱపనై*. నేర్చుకోవడం, అభ్యసించడం ; తొ. *కల్ప్*. బోధించు ; కొం. *కల్ప్*. బోధించు ; కుఇ. *గ్రాప్ప* (గ్రాప్). బోధించు, ఉసిగొల్పు.

**కఱపించు** చూ. కఱచు. స.క్రి. నేర్పించు.

**కఱయ** చూ. కఱ[1]. వి. కృష్ణవర్ణం.

**కఱలువారు** వి.బ.వ. పచ్చికూరలు తెచ్చిపెట్టేవారు.

**కఱవ** వి. ఒకానొక ఓషధి.

**కఱవగు** చూ. కఱవు[1].

**కఱవడి**[1] రూ.చూ. కఱవాడు[1]. వి. సిగబంతి.

**కఱవడి**[2] రూ.చూ. కఱవాడు[2]. వి. వరుగుచేప.

**కఱవచ్చు** చూ. కఱచు[1]. స.క్రి. 1. కనుగుకొను ; 2. మీదికి వచ్చు.

**కఱవాడు**[1] రూ. కఱవడి[1]. వి. సిగబంతి.

**కఱవాడు**[2] రూ. కరవాడు, కరవాడు, కఱవడి[2]. వి. వరగుచేప.

**కఱవు**[1] రూ. కరవు, కరువు[3]. వి. చాటకం, క్షామం, లేమి. భార. సభా. 1.271, భార. శాంతి. 4.72 ; విశే. అలభ్యమైన. భార. విరా. 4.20.

త. *కురువ్వా-*. కరువు ; గోం. *కరు*, *కర్*, *కరు*, *కర* ; కువి. *కర్యు* ; కొలా. *కరు*. ఆకలి ; నా. *కరు*.

<మూ.ద్రా. **కర-*.

**కఱవడు** అ.క్రి. కొరతపడు, తక్కువగు, లోటగు. వేంక. పంచ. 5.58 <కఱవు[1]+పడు. **కఱవగు** రూ. కరవగు. అ.క్రి. లేకపోవు, అరుదగు. రుక్మా. 1.136. **కఱవునకు తోడు ఆపపంట కలిగినట్లు** అవ్య. బాధలో మరింత బాధ కలిగినట్లు. వ్యా. కరువు మూలంగా కడుపు మండుతుంటే ఆవాలు పండితే వాటిని కాచి తాగితే మరింత మంట ఎక్కువైనట్లు. **కఱవుపడినట్టు** అవ్య. దొరికిందే చాలని ఎగ

బడినట్లు. శక. 2.344. కఱవుపచ్చు అ.క్రి. కొరతకలుగు, లోటు ఏర్పడు. కఱవుసేయు (-చేయు) స.క్రి. లోటుచేయు. కఱవోకాలమోఅని అవ్య. దొరికిందే తడవుగా అనుభవించ డానికి ఎగబడి.

కఱవు[2] వి. పూరిళ్ళు నేసేటప్పు డేర్పరచుకొనే మితం. అచ్చ. రా. బాల. 47.

కఱవోకాలమోఅని చూ. కఱవు[1].

కఱి[1] రూ. కరి[2]. క్రి, క్రె, కఱియ, కఱె, కఱ్ఱి, కఱ్ఱియ, కఱ్ఱె. విశే. నల్లని. యయా. 1.79 ; వి. 1. కార్ష్ణ్యం, నల్లదనం, ఆం.భా. 1.108. ప్రబంధ. 62 ; 2. పశుయోని ; 3. ఆడు గురి.

క. కఱె, కఱి. నల్లదనం ; కొడ. కరవి. నల్లదనం ; కరతె. నల్లని ; కరె. మచ్చ ; తు. కప్పు. నల్లదనం ; త. కఱుప్పు. నల్లదనం, చీకటి. మ. కఱ. నల్లదనం, మచ్చ, మరక, తుప్పు ; కఱు. నల్లని ; కఱుప్పు. నల్లదనం ; కొ. కఱ్. మురికి, మరక ; కొం. కార్ప్. నల్లదనం.

సం. కాల-. నల్లని, నలుపు.

పో.చూ. సం. కర్పరీ-. కాటుక.

కఱిగొను[1] (-కొను) అ.క్రి. నల్లగాఅగు. స.క్రి. మాడి పోయేట్లు చేసుకొను, అంటుకొను. సిం.ద్వా. 2.30. కఱి చిలుకు వి. బాణవిశేషం. కఱిచీర్లు రూ.చూ. కఱచేదలు. వి.బ.వ. ఒకదినుసు తినుబండారం. కఱిచేడియ వి. కాళి, పార్వతి. వ్యు. నల్లనిస్త్రీ. కఱిజాల రూ.చూ. కఱ్ఱిజాల. వి. తెలుపుమీది నలుపు. కఱిజేజే వి. 1. విష్ణువు; 2. కృష్ణుడు; 3. రాముడు (వ్యు.) నల్లనివేల్పు. కఱిజేజేయన్న (-అన్న) వి. ఇంద్రుడు. బలరాముడు, వెన్నుని అన్న. ఆం.భా. 1.46. కఱిపక్కము వి. కృష్ణపక్షం. కఱిపాము వి. నల్లనిత్రాచు, కృష్ణసర్పం. కఱిమడుగు వి. నల్లనిమడుగు, లోతైనమడుగు. కఱిమానికము వి. ఇంద్రనీలమణి, నీలం. యయా. 4.120, నీలా. 2.48. కఱిమెడదొర వి. శివుడు, నీలకంఠుడు. అచ్చ. రా. బాల. 1.70. కఱిమేనిదొర వి. నల్లనయ్య, విష్ణువు. కఱియావు(-ఆవు) వి. నల్లనిఆవు, కపిలధేనువు. ప్రబు. 5.151 పు. 8 పం. కఱిరతనము వి. నల్లనిరత్నం, నీల మణి. కఱివంకబొమలు వి.బ.వ. నల్లగా, వంకరగా ఉన్న కనుబొమలు. కు.సం. 368. కఱివన్నెవేలుపు రూ. కఱివన్నె వేల్పు. వి. విష్ణువు. సమీర. 7.79. కఱివన్నెవేల్పు రూ.చూ. కఱివన్నెవేలుపు. వి. విష్ణువు. కఱివలువప్రోడ వి. బలరాముడు. వ్యు. నల్లనిబట్టకట్టేవాడు. కఱివేపాకు రూ.చూ. కరివేపాకు. వి. కలియామాకు, కృష్ణనింబం. (Murraya koringii). కఱివేము వి. కలియామాకు. కర్వేపచెట్టు, కృష్ణనింబం. భార. అను. 3.189, కాశీ. 7.185, ఆం.భా. 2.50 (Murraya koringii). కఱివేలుపు రూ. కఱి వేల్పు. వి. 1. కృష్ణుడు. నీలా. 1.66 ; 2. విష్ణువు ; 3. రాముడు. కఱివేల్పు రూ.చూ. కఱివేలుపు. వి. 1. విష్ణువు ; 2. రాముడు ; 3. కృష్ణుడు. కఱివేల్పుకొడుకు వి. విష్ణువు కుమారుడు, మన్మథుడు. కఱివేల్పుడాకన్ను వి. విష్ణువుయొక్క ఎడమకన్ను, చంద్రుడు. కఱివేల్పువిల్లాలు వి. లక్ష్మి, విష్ణుపత్ని. కఱివేల్పురిక్క విష్ణుదేవతాకమైన నక్షత్రం, శ్రవణానక్షత్రం. కఱివేల్పురాయి వి. పచ్చరాయి. నీలమణి. కఱివేల్పుహజ్జ వి. 1. విష్ణుపదం ; ఆకాశం. అచ్చ. రా. అయోధ్యా. 13 ; 2. విష్ణుదేవుని పాదం. కఱి పామిపైదోరు వి. బలరాముడు.

కఱి[2] రూ.చూ. కఱ్ఱు[1]. వి. 1. నాగటిదుంపకు అమర్చే ఇనప బద్దె, కృషకం ; 2. మెడ, డాగు ; 3. గట్టు.

కఱితి వి. గట్టు. సీమానిర్ణయం. కఱినేల రూ.చూ. కఱ్ఱినేల. వి. ముప్పైరెండు కుంటల పొలం. కఱిమొన రూ.చూ. కఱ్ఱిమొన. వి. కర్రు యొక్క మొన. కఱిమొల రూ.చూ. కఱ్ఱిమొల. వి. అడ్డకు తగిలించే నాగవానం.

కఱియ రూ.చూ. కఱి[1]. వి. నల్లని. భార.అను. 3.189, వి. కార్ష్ణ్యం, నల్లదనం. ఆం.భా. 1.108.

కఱియకంటి వి. నల్లని కళ్ళుగలది.

కఱు[1] వి. 1. వాడిమి ; 2. వేడిమి ; 3. ఒరపు.

కఱు[2] రూ.చూ. కఱ్ఱు[1]. వి. నాగలిదుంపకు అమర్చే ఇనప బద్దె.

కఱుకు[1] వి. నరకడం మొదలైన వాటిలో అయ్యే ధ్వనికి అను కరణం. దశా. 2.369.

కఱుకు[2] రూ.చూ. కఱకు. విశే. కఠినమైన క్రూరమైన, పరుషమైన, బిరుసైన, ముదుగు ; వి. 1. తీరం ; 2. వేడిమి ; 3. వాడిమి.

కఱుకెత్తు అ.క్రి. 1. వాడియగు ; 2. గరుకగు ; 3. పులకరించు.

కఱుకుట్లు రూ.చూ. కఱకుట్లు. వి. కాల్చిపక్వం చేయడానికి ఇనపకాడకు గుచ్చిన మాంసంముక్క, శూలానికి గుచ్చిన మాంస ఖండం. కాశీ. 3.88.

కఱుకెత్తు చూ. కఱుకు[2].

కఱుక్కు రూ. కఱుక్కు. వి. నరుకుడుచప్పుడు, పళ్ళుకొరకడం లోని ధ్వన్యనుకరణం. దశా. 2.369.

కఱుగోల (-కోల) వి. పశువులకు వాత వేయడానికి ఉపయో గించే ఇనపకమ్మి, గొడుపు.

కఱుచు రూ.చూ. కఱచు[1]. స.క్రి. కాటువేయు.

కఱుదు వి. నేర్పు, ప్రౌఢతనం. హరి.ఉ. 10. 242.

త. కఱ్ఱు. విజ్ఞానం, పాండిత్యం, పవిత్రత ; కువి. జాపిల్ -. (- హ్) ; నేర్చుకొను.

కఱుదులపూవ వి. నేర్పరి. కళా. 6.183. కఱుదులాడు వి. కృషి, నేర్పరి, పెరవరి. హరి.ఉ. 7.80.

కఱె రూ.చూ. కఱి[1]. విశే. నల్లని.

కఱెవాక వి. నల్లనిప్రవాహం, యమునానది.

కఱ్ఱ రూ. కఱత[2]. వి. ఒడ్డు, తీరం. ద.హిం.శా.సం. 4. శా.సం. 989. క్రీ.శ. 1163.

కఱ్యముదులసవర్గములు వి.బ.వ. కర్యముదుకు కావలిసిన రస వర్గాలు, కూరవండటానికి కావలసిన ఉప్పు, మిరియం. మొదలైన పదార్థాలు. ద.హిం.శా.సం. 5. శా.సం. 188. క్రీ.శ. 1316.

కఱ్ఱ[1] రూ.చూ. కఱ[1]. వి. 1. కళంకం, మచ్చ, మరక, డాగు. కు.సం. 8.116 ; 2. అపకీర్తి, దూరు. సారంగ. 3.220, విశే. నల్లని. హరి.పూ. 5.252, రాజలి. 2.55.

కఱ్ఱ[2] రూ. కర్ర, కఱ[2]. వి. 1. గంటి, వరి మొ. వాటి దుబ్బు, సన్నగుచ్ఛం. ఆము. 4.118 ; 2. ధార, రేఖ. శుక. 2.486. 488 ; 3. కొయ్య ; 4. దంతం, పుల్ల, పుడక ; 5. ధార.

త. కఱిల్, వంటచెరకు, ఇంధనం.

కఱ్ఱకుట్లు రూ.చూ. కఱకుట్లు. వి.బ.వ. కాల్చిపక్వం చేయడానికి ఇనప కాడకు గుచ్చిన మాంసం ముక్కలు. శూలానికి గుచ్చిన మాంసం ముక్కలు. కఱ్ఱజవ్వాజి రూ.చూ. కఱ్ఱజవ్వాది. వి. ఒక పరిమళ ద్రవ్యం. కఱ్ఱజవ్వాది రూ. కఱ్ఱజవ్వాజి. వి. కర్రకు అంటుకొని ఉండే జవ్వాది, మేలైన సంకుమదం, పరిమళ ద్రవ్యం. వసు. 2.11. కఱ్ఱంటింత వి. ఒక రకం చెట్టు. (Desmodium Pulchellum). కఱ్ఱతేనె వి. ఒక విధమైన తేనె. ప్రబంధ. 112. కఱ్ఱమూనె రూ. కఱ్ఱనూనె. వి. కర్ర నుంచి తీసిన నూనె. కఱ్ఱవనివాడు వి. వంట కట్టెలు తెచ్చేవాడు. కఱ్ఱపుట్ట వి. చిలికిన కొయ్య మీద లేచే పుట్టగొడుగు. కఱ్ఱపెండలము రూ. కర్రపెండలము. వి. దుంపజాతికి చెందిన పెండలం, మొక్కలా పెరిగే పెండలం (Manihot utilissima). కఱ్ఱపెత్తనము వి. 1. కర్ర చేతిలో ధరించి చెలాయించే అధికారం, తాను పనిచేయక, ఇతరుల చేత చేయించే పెత్తనం ; 2. అధికారం చెలాయించడం. కఱ్ఱమడ వి. తవ్వడానికి ఉపయోగించే పనిముట్టు, తవ్వ గోల, గుద్దలి. నార.పంచ. 1.240. కఱ్ఱవడల వి. బంది మురుదుడు తీగ (Calycopteris Floribunda). కఱ్ఱవేడు వి. బంది మురుదుడు తీగ (Calycopteris Floribunda). కఱ్ఱసిరల్లి రూ. కఱ్ఱసిర్లి. వి. తెల్ల తీగ (Delbergia rubiginosa). కఱ్ఱసిర్లి రూ.చూ. కఱ్ఱసిరల్లి. వి. తెల్ల తీగె (Delbergia rubiginosa). కఱ్ఱులవ వి. అడవి కందిమొక్క (Rhynchoria Suaveorens). <కఱ్ఱ[2]+ఉలవ.

కఱ్ఱాట్ రూ.చూ. కేరట్. వి. పచ్చముల్లంగి.

కఱ్ఱి రూ చూ. కటి[1]. వి. 1. అర్జునుడు. భార.ఆది. 5.244. ఆది. 8.128, ఉద్యో. 3.117 ; 2. నల్లని. విణ. నల్లని. హరి.పూ. 9.45. కాశీ. 1.2.

కఱ్ఱిఅముడు వి. వండిందిగాని, పచ్చిదిగాని కూర. కఱ్ఱిజాల రూ. క్రిజాల, కటిజాల, కఱ్ఱెజాల. వి. నలుపు మీది తెలుపు. కఱ్ఱివెచ్చలి వి. అర్జునుని చెలికాడు, కృష్ణుడు. కఱ్ఱినేల రూ. కటినేల. వి. ముప్పైరెండు కుంటలపొలం. కఱ్ఱివేల్పు వి. అర్జునుని చెలికాడు, కృష్ణుడు. ప్రబంధ. 216. ఆం.నా.నం.దేప. 1.7. కఱ్ఱిబట్ట వి. నలుపు మీద ఉన్న తెల్లమచ్చ. కఱ్ఱెబొల్లి వి. శరీరం మీద నలుపుగా ఉండి ముఖం మాత్రం తెల్లబడే చర్మరోగ విశేషం. కఱ్ఱిమొన రూ. కటిమొన. వి. కఱ్ఱుయొక్క మొన. కఱ్ఱిమొల రూ. కర్రు మొల. కటిమొల, కఱ్ఱుమొల. వి. అడ్డకు తగిలించే నాగ వాసం. కఱ్ఱినంగాతి వి. అర్జునుని మిత్రుడు, కృష్ణుడు.

కఱ్ఱియ రూ.చూ. కటి[1]. వి. నలుపు.

కఱ్ఱివయంపాకు రూ.చూ. కరివేపాకు. వి. సువాసన గల ఒక రకం ఆకు (Murraya Koringii).

కఱ్ఱు[1] రూ. కర్రు, కటి[2], కఱు[3]. వి. 1. నాగలిపుంపకు అమర్చే ఇనపబద్దె, కృషకం ; 2. మెడ, డాగు ; 3. గట్టు.

క. కొఱు. త. కఱు. నాగటిదుంప.

కఱ్ఱుకుట్టులు రూ.చూ. కఱకుట్లు. వి.బ.వ. కాల్చిపక్వం చేయడానికి ఇనపకాడకు గుచ్చిన మాంసం ముక్కలు, శూలానికి గుచ్చిన మాంసంఖండాలు. కఱ్ఱుకుట్లు రూ.చూ. కఱకుట్లు. వి.బ.వ. శూలానికి గుచ్చిన మాంసంఖండాలు. కఱ్ఱుగుద్దలి రూ. కర్రుగుద్దలి. వి. చిన్న తవ్వుగోల, తొలిక. కళా. 4.78. కఱ్ఱుజోడు రూ. కర్రుజోడు. వి. అరకకు కట్టే పగ్గం, ఏరగట్టె. కఱ్ఱుతంగోల రూ. కర్రుతంగోల. వి. అలుగు పొడుగ్గా ఉండే తవ్వుగోల. కఱ్ఱుమొల రూ.చూ. కఱ్ఱిమొల. వి. గొర్రుచెక్కకు బిగించే ఇనపగొంది.

కఱ్ఱు[2] వి. 1. తలుపు తీసినప్పుడు కలిగేధ్వనికి అనుకరణం. వండి. చ. 1.44 ; 2. రాకి అడుపుకు అనుకరణం. శుక. 2.228 ; 3. దగ్గుకు ధ్వన్యనుకరణం. శుక. 3.30.

కఱ్ఱులవ చూ. కఱ్ఱ[2].

కఱ్ఱువట్టు (- వట్టు) చూ. కఱ్ఱి. అ.క్రి. కళంకితమగు.

కఱ్ఱె రూ.చూ. కటి[1]. విణ. నల్లని. ఆము. 6.19. వి. నలుపు.

కఱ్ఱెజాల రూ.చూ. కఱ్ఱిజాల వి. నలుపుమీది తెలుపు.

కల[1] వి. 1. స్వప్నం. భార. విరా. 1.10 ; 2. మూర్ఛ, సగం చావు.

క. కనసు, కనస, కల ; కొడ. కెనచి ; తు. కన. కల ; త. కన్పా, కనవు. కల, నిద్ర. కనవ్(కనవి -). కలగను ; మ. కినావ్. కల ; కో. కన్ట్న్. తొద. కొనాఫ్. గోం. కంచ్ కానా. కలగను, నిద్రలో కేకవేయు ; కుఇ. కడింజ, కల ; పర్జి. కెలయ్, కలగను, కెలయ్ కుడ్ క. నా. కల. కురు. ఖంధ్ నా. నిద్రించు ; మాల్తో. క్వన్డె. క్వన్ క్వె. నిద్ర.

కలగన్నయట్టులు(-అట్టులు) అవ్య. అస్పష్టమైనట్లు. శుక. 1.544. కలలోనికామ్ప వి. అసంభవం. హరి.ఉ. 7.174. కలలోనివార్త వి. అసంభవం. పాండు. 4.238. కలలో మాట వి. కల్ల. అపురూపం.

కల[2] విణ. ఉన్న. భార. ఆది. 1.48, కు.సం. 1.78. అవ్య. 1. భవిష్యదర్థకం. భార. సభా. 1.238 ; 2. సమర్థతను తెలిపేప్రత్యయం. భార.అరణ్య. 1.235. భార.భీష్మ. 2.11 ; 3. విధ్యర్థకం (వలసిన అనే అర్థాన్ని తెలుపుతుంది). భార. అరణ్య. 1.285 ; 4. ఉద్దేశాన్ని తెలుపుతుంది. హరి.పూ. 1.191 ; 5. అర్హతను తెలుపుతుంది. విజయ. 2.164.

కలకాలము వి. ఎల్లకాలం. భాగ. 10. పూ. 1129. కల తెఱగు వి. యథార్థస్థితి. భార. ఆది. 7.254. కలదెలిసి కొను. స. క్రి. ఒకవ్యవహారం కొంతసాగింతర్వాత నిజం తెలుసుకొను. కలపాటి విణ. ఉన్నదానితో, కలిగినపదార్థంతో. రాజ. చ. 3.10. కలయంత(అంత) అవ్య. కలంత, ఉన్నంత. కలయిండ్లు(ఇండ్లు) వి.బ.వ. ధనంగలఇళ్ళు. కవిక. 4.90. కలరు[1] రూ. చూ. కలవారు[1]. వి.బ.వ. కలిగిన వారు, ధనికులు, కలిమికలవారు. <కల[2]+వారు. కలరూపు వి. యథార్థం, సత్యం. భార. ఆది. 7.285,

(భూతార్థంలో)కల స్థితి. కలవాడు రూ. కలాఁడు. వి. 1. అయినవాడు, అప్తుడు. భార. ఉద్యో. 2.165 ; 2. శక్తుడు, సమర్థుడు. భార. ఉద్యో. 3.20 ; 3. ధనికుడు. భాగ. 10 పూ. 396 ; 4. కుబేరుడు. కలవారు[1] రూ. కలరు[1]. కల్వారు[2] వి.బ.వ. కలిమికల్గిన వారు. కలాఁడు రూ.చూ. కలవాఁడు. వి. ధనికుడు. కల్వారు[2] రూ.చూ. కలవాడు. వి.బ.వ. కలిమికలవారు, ధనవంతులు.

కలం[1] వి. కలంకారీ అద్దకానికి వాడే వెదురుముక్క.

కలం[2] రూ.చూ. కలము[2]. వి. ధాన్యంకొలత, 12 తూములు.

కలం[3] రూ.చూ. కలబం. వి. రంగు మొదలైనవి నూరేకల్వం.

కలం[4] రూ.కల్మ[1], కల్మే. వి. ఆరటి, నారింజ మొ. వాటిఅంటు. కొమ్మకు కట్టేఅంటు.

హిం. ఖలమ్. అంటు.

<హిం. కలమ్.

కలంతీచ వి. కాలుతున్నబట్టీపొయ్యిలోని ఊకలాగడానికి వాడే కడ్డీ.

కలక[1] వి. 1. చేపలు అప్పుడప్పుడు పైకెగిరిపడటం ; 2. ఎప్పుడైన అప్పుడప్పుడువచ్చి మొహంచూపించి పరోక్షంగా సంగతులు తెల్సికొని వెళ్ళటం, 3. వరదైవచ్చిన నీరు పాత నీటితో కలియటం.

కలకవేయు అ.క్రి. నీటిపైకిఎగిరిపడు.

కలక[2] చూ. కలగర. వి. నారుమడికి పెట్టేమొదటితడి.

కలకచాలు వి. చివరిసారి దున్నినచాలు.

కలకటరు రూ.చూ. కలక్టరు. వి. 1. జిల్లాఅధికారి ; 2. మామిడి పళ్ళలో ఒకరకం.

కలకటేరు రూ.చూ. కలక్టరు. వి. 1. కలక్టరు, జిల్లాప్రధానాధికారి ; 2. మామిడిలో ఒకరకం.

కలకండ రూ.చూ. కల్కండము. వి. 1. శర్కరాభేదం, కండచక్కెర, పటికబెల్లం ; 2. నగుబోతు

కలకండము రూ.చూ. కల్కండము. వి. చక్కెర, పటికబెల్లం.

కలకత్తాఅంచు వి. 1. సాదాఅంచునేసిన తరవాత ఒక కొలికి దారం తెలుపుది, ఒకకొలికి దారంరంగు పెట్టినేసిన అంచు ; 2. చిగురంచు వెడల్పుగానేసి రేండేసి కొలుకుల తెలుపు, రంగు దారాలు రెండు సార్లు తిరిగేట్టు నేసినఅంచు.

కలకత్తాకమ్మి వి. మూడుగీరలుపెట్టి, పట్టెలు పట్టెలుగా నేసిన కమ్మి.

కలకము వి. ఉపరసంవంటి అనుపానవిశేషం.

కలకల అవ్య. 1. నవ్వేటప్పుడు వచ్చేధ్వనికి అనుకరణం. కు.సం. 5.119, భార. ఉద్యో. 3.51 ; 2. పక్షులుకూసేటప్పుడు వచ్చేధ్వనికి అనుకరణం. భాగ. 9.ఉ. 1002 ; 3. పలకడంలో అయ్యేధ్వనికి అనుకరణం, సిం.ద్వా. 2.17 ; 4. నొప్పికలగటంలో అయ్యేధ్వనికి అనుకరణం, అని. 2.79.

క. కలకల, కలకవ్, కళకళ్. గలగల, గందరగోళంలో అయ్యేధ్వని; జనంగుంపుగా కూడిమాట్లాడేటప్పుడు వచ్చేధ్వని. కళకళ్. పక్షులకూత ; తు. కళకళ్. గందరగోళంలో అయ్యేధ్వని. గలగల. కంకణాలధ్వని. కళకళ్, కళపళ్. కొబ్బరికాయ కదిలించినప్పుడు లోపలినీళ్ల వల్ల కలిగేధ్వని ; త. కలకలకు. పక్షులు చేసే ధ్వని, జనం గుంపుగా చేరి మాట్లాడేటప్పుడు వచ్చే శబ్దం, కళకళ గలగలశబ్దంచేయు ; మ. కళకళ. గందరగోళంధ్వని ; కో. గలగలిన్. (ఐడ్-). చెట్టుకదలిక ; మాల్తో. క్వల్, క్వల్గతి. నీళ్లనుకెలుకు.

పో. చూ. సం. కల. తప్పుడు ఉచ్చారణ, నీచస్వరం, మృదుస్వరం, కలకల, గందరగోళంధ్వని.

కలకలలాడు అ. క్రి. వికాసాన్ని పొందినదగు, కలకలము వి. 1. నద్దు, సందడి, జనసమ్మర్దం, బసవ. 2.26 ; 2. వీణా ధ్వని ; 3. ధూపగుగ్గిలం.

కలకు వి. కళ్ళెం, లగాం, వాగె.

కలకుమత్తదిసుర. వి. నల్లటి పొలుసులున్న ఒకరకం చేప.

కలకేతవిద్య వి. ఇంద్రజాలవిద్య.

కలకొను రూ.చూ. కలగొను[1]. అ.క్రి. వ్యాకులపడు క్షోభించు.

కలకోటిగింజలు వి.బ.వ. ఉలవలు.

కలక్టరు రూ. కలకటరు, కలకటేరు, కలెక్టరు, కల్కటరు, కల్కటేరు. వి. 1. కలక్టరు, జిల్లాప్రధానాధికారి ; 2. మామిడి పళ్లలో ఒకరకం, చిత్తూరుమామిడి.

ఇం. *collector*. పోగుచేసేవాడు, ఒక ఉద్యోగి.

<ఇం. collector.

కలగంప వి. కలగూరగంప, అనేకవస్తువులున్నగంప. విణ. అనేకం, పెక్కు.

కలగంపకదుపు వి. సంతాన సమృద్ధికలది. భాగ. 10.258. కలగంపవలపు వి. అమ్మ చూపేవలపు, విలువలేనిప్రేమ. కాళ్ళ. సం. 3.620.

కలగర[1]. రూ. కలగలి, గలగర. వి. గుంటగలగర. ఆం.భా. 2.69.

కలగర[2] వి. నారు మడికిపెట్టే మొదటి తడి.

కలగలపు రూ. కలగలుపు, కలగల్పు. వి. 1. కలుపుగోలుతనం. పాండు. 3.62 ; 2. కొన్ని కూరలు కలిపివండిన కలగూర. పాండు 4.184.

కలగలపుచేయు స.క్రి. కలుపు, కూర్చు. రాధికా. 3.45. కలగలపునెయ్యి రూ. కలగలుపు నెయ్యి. వి. నూనె మొదలైనవి కలపటంవల్ల స్వచ్ఛంకాని నెయ్యి.

కలగలి రూ.చూ. కలగర[1]. వి. 1. గుంటకలగర ; 2. నారు మడికిపెట్టే మొదటితడుపు.

కలగలుపు రూ.చూ. కలగలపు. స.క్రి. అన్నీకలిపివేయు. వి. 1. కలుపుగోలుతనం ; 2. కలుపుగోలుమనిషి ; 3. కలగూర.

కలగలుపుచేయు స.క్రి. కలుపు. రాధికా. 3.45. కలగలుపునెయ్యి రూ.చూ. కలగలపునెయ్యి. వి. నూనె మొదలైనవి కలపటంవల్ల స్వచ్ఛంకాని నెయ్యి.

కలగల్పు రూ.చూ. కలగలపు. వి. 1. కలుపుగోలుతనం. పాండు. 3.62 ; 2. కొన్నికూరగాయలుకలిపి వండినకూర కలగూర. పాండు. 4.184 ; 3. కలిసిమెలిసిపోవడం ; 4. కల్తీపదార్థం ; 5. కలయిక, కూటమి ; విణ. మిశ్రితమైన మంచిచెడ్డలు కలసిన.

కలగాని వి. మత్స్యవిశేషం.
కలగామగు వి. చిత్రవధ.
కలగాపులగము వి. 1. కలగలుపు ; 2. గందరగోళం.
కలగాల్చు (-కాల్చు) వి. ఆములోపలికుండలు హెచ్చుతగ్గులు లేకుండా సమంగా కాలినస్థితి.
కలగుండగు చూ. కలగుండు.
కలగుండిడు చూ. కలగుండు¹.
కలగుండు రూ. కలగుఁడు. చూ. కలఁగు. వి. 1. కలత, క్షోభం ; 2. కలుషం, పాపం.

కలగుండగు అ.క్రి. క్షోభపడు, కలతనొందు. వసు. 2.142. <కలగుండు + అగు. కలగుండిడు స.క్రి. క్షోభపెట్టు, కలచు. భాస్క.రా. సుందర. 5.115. <కలగుండు + ఇడు. కలగుండుకొను రూ.చూ. కలగుండుగొను. అ.క్రి. కలతనొందు. కలగుండుగొను (-కొను) రూ. కలగుండుకొను. అ.క్రి. క్షోభపడు, కలతనొందు. భార.ద్రోణ. 1.293. కలగుండుచేయు అ.క్రి. క్షోభపెట్టు, కలచు. చెన్న.బసవ. 2.77. కలగుండు పడు రూ.చూ. కలగుండువడు. అ.క్రి. 1. కలగు, క్షోభపడు; 2. చెల్లాచెదరగు. కలగుండువఱచు స.క్రి. కలచు, కలగుండుచేయు. రాజ.వి. 3.65. కలగుండుపెట్టు రూ.చూ. కలగుండువెట్టు. అ.క్రి. క్షోభపెట్టు, కలచు. కలగుండువడు (-పడు) రూ. కలగుండుపడు. అ.క్రి. 1. కలగు, క్షోభపడు. భార.భీష్మ. 2.207 ; 2. చెల్లాచెదరగు. కలగుండువెట్టు (-పెట్టు) రూ.చూ. కలగుండుపెట్టు. స.క్రి. క్షోభపెట్టు, కలచు. భార.భీష్మ. 3.64. కలగుండుసేయు(-చేయు) స.క్రి. క్షోభపెట్టు, కలచు. భార.భీష్మ. 3.64.

కలగుండు² వి. గండశైలం, కొండనుండి జారిపడ్డ పెద్దరాయి. రామా. 5.312.
కలగుఁడు రూ.చూ. కలగుండు¹. వి. 1. కలత ; 2. కలుషం, పాపం.
కలగుమ్మటము వి. అన్నిటినీ ఒక్కటిగా కలిపివేయటం.
కలగుమ్ము స.క్రి. అడుసు బాగా కలిసేటట్లు కాళ్ళతోతొక్కు.
కలగూటులు వి.బ.వ. విధిసేవకులు. విక్ర. 5.10.
కలగూర(-కూర) రూ.చూ. కల్లెగూర. వి. 1. కూరాకు, తోటకూర మొ. శుక. 2.363 ; 2. కలిసిఉన్న పలురకాల ఆకుకూర, మిశ్రితనానావిధపత్రశాకం ; 3. పెక్కు దినుసులు కలిసిన కూర.

కలగూరగంప వి. 1. విషయసాంకర్యం. బహుళా. 1.110 ; 2. రకరకాల కూరలు కలిపినగంప ; 3. అనేక విషయాలుగల గ్రంథభాగం. కలగూరగంపచేయు స.క్రి. సంకరంచేయు. బహుళా. 1.110.

కలగొనన్ చూ. కలగొను².
కలగొనఁబాఱు చూ. కలగొను¹.
కలగొను¹ రూ. కలకొను. చూ. కలఁగు. అ.క్రి. క్షోభించు, వ్యాకులపడు. భార. విరా. 4.169.

<కలఁక + కొను.

కలగొనఁబాఱు అ.క్రి. కలతనొందు, కలగొను. భార. శల్య. 2.19. <కలగొను¹ + -అ⁷ + పాఱు.

కలగొను² అ.క్రి. వ్యాపించు, కమ్ము. కు.సం. 10.7. స.క్రి. కూడు, కలియు. మార్క. 5.7. <కలపు + కొను.

కలగొనన్ క్రి. విశే.(దు. 1. అంతట, నల్దెసలకు ; కు.సం. 9.117 ; భార.శాంతి. 5.472 ; 2. బాగుగా, చక్కగా. పద్మ. 11.50.

కలగొను³ అ.క్రి. 1. బయటకువచ్చు, వెలువడు. భార.శాంతి. 5.472 ; 2. సామీప్యంలోఉండు. పద్మ. 10.30.
కలగొరు వి. లేతఎరుపువచ్చ రంగులపువ్వుపూసే పెద్దచెట్టు, తగడచెట్టు. (Streospermum Snaveolers) (Stereosprmum Chelonoides)
కలంక రూ.చూ. కలఁక. వి. 1. కళంకం, గుర్తు ; 2. దోషం ; 3. కలత ; 4. పాపం ; 5. కామవికారం ; 6. జంకు ; విశే. కలుషితమైన.

కలంకనీరు వి. కలుషోదకం, మురికినీరు. కలంకలు దేర్చు (-తేర్చు). స.క్రి. కలతలు పోగొట్టు. పారి. 2.52.

కలంకారి రూ.చూ. కలంకారీ. వి. కలంతోచేసే అద్దకపుపని. మృత్యు. 2.5.
కలంకారీ రూ. కలంకారి. వి. రాతపనివస్త్రం, అద్దకపు వస్త్రం. హంస. 5.360.

హిం. *కలంకార్*. కలంతో అందంగా బొమ్మలు, పటాలు గీయడం ; ఉ. *కలంకార్*. కలంతో పనిచేసే వ్యక్తి, లేఖకుడు ; *కలంకారీ*. రంగువేయడం, నగిషీ ; పార. *కలంకార్*. కలంతోపనిచేసే వ్యక్తి ; *కలంకారీ*. చిత్రలేఖనం, పనితనం.

<ఉ. కలంకారీ.

కలంకు రూ.చూ. కలఁక. వి. 1. భయం, జంకు ; 2. క్షోభం, 3. కామవికారం ; 4. నింద ; 5. పాపం ; 6. కాలుష్యం.
కలఁక రూ. కలంక, కలంకు, కలఁకు², కళంకు. చూ. కలఁగు. వి. 1. భయం, జంకు, వెనుదీయటం. భార.విరా. 2.70 ; 2. వ్యాకులత, క్షోభ. భార. ద్రోణ. 2.217 ; 3. కామవికారం, వలపు. రాఘవ. 3.23 ; 4. కలంకం, దూరు, నింద. బిల్హ. 1.37 ; 5. పాపం. శశా. 3.76 ; 6. ఆవిలత, కాలుష్యం, బురద. వాశిష్ట. 3.32 ; 7. నేత్రరోగవిశేషం.

క. *కలంక్*, *కలంకు*, *కళంకు*. ఉద్రేకం, భయంకరత్వం, మచ్చ, మలినం, గుర్తు, నింద, తప్పు ; తు. *కలంకు*, *కళంకు*. మురికి ; త. *కలక్కమ్*, *కలక్కు*. విచారం, దుఃఖం ; *కలంకల్*. మురికి ; మ. *కలక్కమ్*. మురికి, కలవరం.

కలఁకజలము వి. కలిగిననీరు, మురికినీరు, ఆము. 6.8. కలఁకదేఱు(-తేఱు) అ.క్రి. ప్రసన్నతనొందు, అవ్యాకులమగు. కు.సం. 6.115. భార. విరా. 1.55. కలఁకనీరు వి. కలిగిననీరు, మురికినీరు. రాఘవ. 3.126. కలఁకపడు అ.క్రి. కలగు, క్షోభించు. కలఁకపాటు వి. కలతపొందటం, వ్యాకులత, క్షోభం. కళా. 4.117. కలఁకపాఱు అ.క్రి. 1. కలతపడు, క్షోభించు. భాగ. 10. పూ. 44 ; 2. వెలవెలపోవు ; 3. కలుషితమగు ; 4. బెణుకు, గాయంతగిలి నొప్పిఎక్కువగు.

కలఁకు¹ చూ. కలను. వి. 1. కలుషదేశం. ఆం.భా. 3.51 ;

2. ప్రదేశం. ఆం.భా. 3.51.

'కళంకళ్' యొక్క అనుచిత విభాగంవల్ల కలఁకు[1] ఏర్పడింది.

**కలఁకు**[2] రూ.చూ. కలఁక. చూ. కలఁగు. వి. కలుషం, కాలుష్యం. ఆము. 4.126.

కలఁకువ వి. కలక, కలత, సంక్షోభం. భార.ఆరణ్య. 2.422.

**కలఁగఁద్రొక్కుకొను** చూ. కలఁగు.

**కలఁగపడు** చూ. కలఁగు.

**కలఁగపాఱు** చూ. కలఁగు.

**కలఁగఁబడు** చూ. కలఁగు.

**కలఁగఁబాఱు** చూ. కలఁగు.

**కలఁగించు** చూ. కలఁగు.

**కలఁగు** అ.క్రి. 1. భీతిల్లు, భయపడు. భార. ఆది. 2.100. శృం.నై. 5.138 ; 2. చెదరు, చలించు. భార. సభా. 1.218, భార. ఉద్యో. 4.124 ; 3. ఆవిలమగు. భార. సభా. 2.23 ; 4. కలుషమగు. భార. శాంతి. 3.34. అ.క్రి. కలకరోగం కలది అగు.

క. కలంకు. కలతచెందు, చెల్లాచెదరగు, చలించు, కలతచెందించు, చలింపజేయు ; కొడ. కలంగ్. కలత చెందు ; తు. కలయని. కదిలించు ; త. కలలకు. కలత చెందు ; కలక్కు. గాభరాపెట్టు. కలక్కు, కలక్కమ్. మడ్డి, మన్ను కలసిఉండటం ; మ. కలన్నుజ. కలుషం, కలతనొందించు ; కలన్మున్, కలక్కుమ్ ; కోట. కల్గ్. కలుషం, కల్క్. కలుషం ; కుఇ. గ్లహ్ప. కలియబెట్టు, గాబరాపెట్టు ; కురు. ఖలక్. నిశ్చలతనుపోగొట్టు, మురికి చేయు ; మాల్తో. క్వల్గ్. నీళ్లను కదల్చు.

పో.చూ. సం. కలహ. తగాదా ; కొట్లాట ; కలుష. మడ్డిగాఉన్న, బురదగాఉన్న.

మూ.ద్రా. *కల్ - *కల్ - అంక్ -/ *కలక్క.

కలఁగఁద్రొక్కుకొను అ.క్రి. తొట్రుపడు. కలఁగపడు రూ.చూ. కలఁగఁబడు. అ.క్రి. చెదరు, తారుమారగు. కలఁగపాఱు రూ.చూ. కలఁగఁబాఱు. అ.క్రి. చలించు, పోవు, నశించు. కలఁగఁబడు రూ. కలఁగపడు. అ.క్రి. 1. చెదరు, తాడుమారగు. భార. భీష్మ. 2.215 ; 2. కలగు, సంక్షోభించు. భార. ద్రోణ. 4.5 ; 3. వ్యత్యస్తమగు, అపార్థం తీయబడు. భార. శాంతి. 6.527. కలఁగఁబాఱు అ.క్రి. 1. చలించు, పోవు, నశించు. భార.శాంతి. 6.202 ; 2. చెదరు. ఉ.హరి. 4.18 ; 3. కలుషమగు, ఆవిలమగు. దశా. 2.238 ; 4. వ్యాకులమగు, క్షోభపడు. చంద్రాంగ. 1.16. కలఁగించు స.క్రి. చలింపజేయు. చంద్రికా. 1.8 ; 2. ఆవిలంజేయు, కలుషం చేయు. ఉ.రా. 4.220. కలుఁగుడు వి. కలత, క్షోభం.

**కలచ** వి. కలుషం, పాపం.

సం. కలుష -. మురికియైన, మురికి, పాపం.

< సం. కలుష -.

**కలజముడి** వి. జటాజూటం, శివుని జటాజూటం. వేంక. ఆం. 1.5.

**కలజువ్వి** రూ.చూ. కలుజువ్వి. వి. కలుజువ్వి, కొండజువ్వి, కూటపర్కటి, పచ్చజువ్వి. అహల్యా. 3.29.

**కలజోదాకులు** వి.బ.వ. తెల్లటి పల్చని ఆకులు.

**కలఁచియాడు** చూ. కలఁచు.

**కలఁచు** చూ. కలఁగు. స.క్రి. 1. వ్యాకులపరచు, క్షోభ పెట్టు. భార.ఆది. 4.11, భార.ఉద్యో. 4.409 ; 2. (మనోవైకల్యం) కలగజేయు, కామవశనిగా చేయు. మను. 2.68.

త. కలంకు (కలంకి). వ్యాకులపరచు, కలతచెందించు.

కలఁచియాడు (-ఆడు) స.క్రి. కలచు, క్షోభ పెట్టు. భార.విరా. 5.158.

**కలది**[1] రూ. కళది. వి. కందురు చెట్టు, దుంపతోసహా ఈ మొక్క అన్ని భాగాలనూ తింటారు. (Colocasia Antiquolum Grewia Pupulifolia).

**కలదొక్కు** రూ. కల్దొక్కు. స.క్రి. కాళ్ళతో తొక్కి అడుసు, కలుపు.

**కలన్** రూ.చూ. కలను. వి. పోరు, కయ్యం, కలను.

కలనతపసి రూ.చూ. కలనితబిసి. వి. నారదుడు. పోరోగిరవుతపసి. కలనతపసితల్లి రూ.చూ. కలనితబిసితల్లి. వి. సరస్వతి, వాణి, నారదుని తల్లి.

**కలనితబిసి** చూ. కలను.

**కలనితబిసితల్లి** చూ. కలను.

**కలనినక్క** చూ. కలను.

**కలనిపని** చూ. కలను.

**కలను** రూ. కలన. వి. 1. స్థానం, ప్రదేశం. భార. భీష్మ. 1.99 ; 2. యుద్ధం. భాస్క.రా. ఆరణ్య. 1.180 ; 3. కళ్ళం. మార్క. 4.102 , 4. యుద్ధరంగం.

క. కళ, కణ, కళ్ళం, యుద్ధరంగం ; కొడ. కళ. కళ్ళం ; తు. కల. చదరం, పువ్వులమడి, హరిజనులు సమావేశమయ్యే ప్రదేశం ; కలను. యుద్ధం, కళ్ళం ; త. కళమ్, కళన్. ప్రదేశం, బయలు, కళ్ళం, యుద్ధ రంగం , మ. కళమ్. కళ్ళం, ధాన్యాన్ని ఆరబోయటానికి ఉపయోగించే చదరపు ప్రదేశం, యుద్ధరంగం ; కోట. కళ్, కళ్ళం, నాట్యం చేసే ప్రదేశం,తొద. కొల్న్. కళ్ళం ; గోం. కఢా. కళ్ళం, మండపం ; కొం. కఢన్. కళ్ళం ; కుఇ. క్లై. కళ్ళం, మండపం ; కువి. క్లైనూ, కలోమి ; పర్జి.కలి ; కొలా. కలవె. కర్మాగారం ; కళవె. కళ్ళం ; గ. కలిన్ ; కురు. ఖల్గ్. ప్రదేశం. వ్యవసాయానికి పనికి వచ్చే భూమి ; ఖలి. కళ్ళం ; మాల్తో. క్వలు కొండలమీది ప్రదేశం.

పో.చూ. సం. ఖల. కళ్ళం, ప్రదేశం, చోటు, ధాన్యపు కొట్టు.

కలనితబిసి రూ. కలనతపసి. వి. కలహప్రియుడైన ముని, నారదుడు. కలనితబిసితల్లి రూ. కలనతపసితల్లి. వి. నారదుని తల్లి, సరస్వతి. ఆం.భా. 1.42. కలనినక్క వి. పోరిలోని జంబుకంలాగ అవకాశాన్ని కోరేవాడు. ఆము. 4.237. కలనిపని వి. యుద్ధ కార్యం, పోరాటం. కలనుచెప్పు రూ. కలనుసెప్పు. స.క్రి. యుద్ధాన్ని ప్రకటించు, ఉభయ

పక్షాల వారు యుద్ధం చేయటానికి ఒప్పందం చేసుకొను. దశకు. 2.10. కలమ(జావరులతెన్ను వి. సూర్యుడు. వ్య. యుద్ధంలో చచ్చిపోయిన వారి మార్గం. కలమదిండితవని (-తిండితవని) వి. కలహాశనుడు, కలహముని, నారదుడు. అచ్చ.రా. బాల. 1.27. కలమవొడుచు (పొడుచు) అ.క్రి. కయ్యం పొడుచు, కలియు. కలమసెప్పు (- చెప్పు) రూ.చూ. కలనుచెప్పు. స.క్రి. యుద్ధానికి సిద్ధంగా ఉండమని చెప్పు, హెచ్చరించు. కలవెత్తు స.క్రి. 1. కలియపెట్టు; 2. గుది గుచ్చు.

**కలవెత్తు** చూ. కలను.

**కలవేత** చూ. కలయు. రూ. కలినేత, కల్నేత. వి. 1. నిలువుకు ఒక రంగు, అడ్డానికి మరొక రంగుగల నూలుపెట్టి నేసిన గట్టి నేత; 2. రంగుదారపు కండెలు బిగించిన నాడెలు మార్చు కొంటూ నేసిన నేత; 3. నేతలో పోగులు కలసిపోయేట్టు చిక్కగా నేసిన నేత; 4. అని తొక్కి, పలకకొట్టి నెయ్యటం.

కలవేతచీర రూ. కల్నేతసీర. వి. నిలువుపోగులు ఒక రంగువి, పేక పోగులు మరో రంగువి పెట్టి నేసిన రెండు రంగుల చీర.

**కలవేయు** చూ.కలయు. రూ. కల్నేయు. స.క్రి. రెండు రంగుల పోగులు కలిపి నేయు.

**కలంత**[1] రూ. కల(త. వి. 1. క్షోభం; 2. పాపం; 3. కామ వికారం; 4. జంకు.

**కలంత**[2] వి. గళంతిక, పాత్రం, చిన్న కుండ, గరగ.

**కలంతాజా** చూ. కలము[3].

**కలందాను** వి. కలాలు ఉంచుకొనే పెట్టె. హంస. 2.29.

హిం.ఉ. కలందాన్. కలాలు పెట్టుకోటానికి ఉప యోగపడే స్టాండు; పార. కలందాన్.

క. కలముగాని, కలాదాని. కలాలు పెట్టుకొనే పెట్టె. <ఉ. కలందాన్.

**కల(త** రూ.చూ. కలంత[1]. చూ. కల(గు. వి. 1. క్షోభం; 2. పాపం; 3. కామవికారం; 4. జంకు.

కల(తపడు అ.క్రి. కలగు, సంక్షోభించు. కల(తపాటు వి. కలత.

**కలప**[1] వి. నాగలి. ఆం.భా. 2.231; 2. ఇల్లుకట్టడానికి, వంట చేసుకోడానికి ఉపయోగించే దారు సామగ్రి, కొయ్యసా మాను; 3. అడితి; 4. మంగలి కత్తి మొ. వాటిని పెట్టు కొనే పొదిగు పెట్టె.

క. కలపు: త. కలప్పై. నాగలి, నాగటికర్రు; మ. కలప్పు. నాగలికి సంబంధించినది.

కలపతాల్పు వి. 1. హలాయుధుడు, బలరాముడు; 2. శూద్రుడు. కలపదారి వి. హలాయుధుడు, సాం. ని. 2.3.

**కలప**[2] రూ. కల్ప. వి. కొండల మీద పెరిగే ఒక రకం మొక్క.

**కలపకట్టియ** చూ. కలము[3].

**కలపకట్టె** చూ. కలము[3].

**కలపగడ్డ** వి. రమారమి 20 అడుగుల పొడుగున పెరిగే మొదలు కలిగి పొదగా పెరిగేమొక్క, అడవి నాభి, గంజేరి, పొత్తిదుంప, దీనిదుంప విషప్రాయమైనది (Glovia Superba).

**కలపగొట్టు** చూ. కలపు

**కలపటంనేత** చూ. కలపు. వి. రెండు రంగు దారాలు, రెండు నాడెల్లో పెట్టి నేసిన ఒక రకం నేత, కలనేత.

**కలపడము** చూ. కలయు. వి. కలపటం, మిశ్రణం. శుక. 1.133.

**కలపతి** వి. లప్పం, జనపనారను పీమను కీలులో తడిపి ఓడ సందుల్లో పొదగటం.

త. కలాపాతి; పో. కలాఫాతి; స్పా. కలాఫాతి. అర. కాలాఫస్.

< పో. కలాపాతి.

**కలపన**[1] చూ. కలపు. వి. కలపటం, మిశ్రణం. ద్వి. పరమ. 5.417, 1 పం.

**కలపన**[2] వి. 1. కలహం; 2. లేనిది కల్పించటం; 3. ఉపా యం, యుక్తి; 4. ఏర్పాటు. ఉ. హరి. 5.163.

కలపనగంప వి. 1. కలహశీలుడు. హరి. పూ. 5.92; 2. గంపల కొద్దిలేనిమాటలు కల్పించేవాడు. కలపనపిండి రూ.చూ. కలపన(బండి. వి. క్షోభం. కలపన(బండి రూ. కలపనపిండి. వి. క్షోభం. ఉ. హరి. 5.163. కలపనసేయు (-చేయు) స.క్రి. కలుపు, కల్పించు, కలవరపెట్టు.

**కలపనింపు** రూ. కల్పనింపు. స.క్రి. నేసినబట్టచుట్టటానికి దోనెపలక తిప్పు.

**కలపనేత** వి. నేసినబట్ట దగ్గర్నుంచి పన్నెవరకూ మగ్గంమీద ఉన్నపడుగు.

**కలపపుల్ల** రూ. కల్పపుల్ల. వి. పన్నెకట్టు బడిలో దువ్వెన పళ్ళ మాదిరిగా కట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు మొ॥ వాటి పుల్ల.

**కలపము** వి. 1. యక్షకర్దమం, లేపనద్రవ్య విశేషం. భార. విరా. 1.105; 2. కలపటం. పి. శకు. 4.144.

క. కలపు. కలిసినది.

**కలపముసేయు** (-చేయు) స.క్రి. కలుపు.

**కలపర** వి. ఒకరకం లిక్కి, గుంటక తోలేటప్పుడు పలుగుకు అంటిన చెత్తను తీసేపరికరం.

**కలపవేయు** రూ. కలపేయు, కల్పేయు.

స.క్రి. నేతనేసేటప్పుడు పడుగులో నాడెవేసిన తరవాత పోగు దగ్గర పడేటట్లు చేతిపలకతో అదుము.

**కలపికొను** చూ. కలుపు.

**కలపు** రూ. కలుపు. చూ. కలము. స.క్రి. హెచ్చు, ఏకభవింప చేయు. శృం. నై. 4.120.

కలపగొట్టు (-కొట్టు) స.క్రి. కలిపేటట్లుచేయు. కలపికొను స.క్రి. కలిపేట్లు చేసుకొను. భార.ఆది. 8.38.

**కలపేయు** రూ.చూ. కలపవేయు. స.క్రి. నేతనేసేటప్పుడు పడుగులో నాడెవేసిన తర్వాత పోగుదగ్గరపడేట్లు చేతిపలక తో అదుము.

**కలబం** రూ. కలం[3]. వి. రంగులుమొదలైనవి నూరేకల్వం.

**కలబంద** రూ. కలబందు, కలమంద, కలుబంద, కలుమంద. వి. ఘృత కుమారి, ఒకానొక మందుమొక్క, హంస. 4.10 (Aloe vera.)

కలబందనార రూ. కలమందనార. వి. కత్తాళినార, కలబంద నుంచి తయారైననార.

కలబందు రూ.చూ. కలబంద. వి. నాలుగైదు అడుగులపొడుగు వెడల్పుగా వుండే దళసరి మట్టలవంటి ఆకులు, ఆకుల అంచుల్లో ముళ్లు ఉండే ఎడారిమొక్క (Aloe vera.).

కలబెట్టు రూ.చూ. కలియఁబెట్టు స.క్రి. కలిసేటట్లు తిప్పు.

కలమ రూ. కనమ[2]. వి. కనమ, గాయంమానినమచ్చ.

కలమంద రూ.చూ. కలబంద. వి. ఒకానొక మందు మొక్క, ఘృతకుమారి (Aloe vera).

కలమందనార రూ.చూ. కలబందనార. వి కత్తాళినార ; కలబంద నుంచి తయారైన నార.

కలమరి చూ. కలము[1].

కలమరించు అ.క్రి. 1. అరిగించుకోలేనట్లగు ; 2. కడుపులో తిప్పినట్లగు.

కలమాగు అ.క్రి. పండు, బాగామగ్గు.

కలమాటు వి. ధాన్యంలోకలసి ఉన్నగడ్డిపరకలు, చెత్త మొద లైనవి.

కలము[1] వి. నావ, ఓడ, పోతం. భార. ఉద్యో. 4.116.

క. కల. కుండ, పాత్ర ; కొడ. కల. పెద్దకుండ ; తు. కర. మట్టికుండ ; త. కలమ్. పాత్ర, పళ్ళెం, కుండ. ఓడ. కలవర్. నావికుడు ; మ. కలమ్. కుండ, పాత్ర, ఓడ ; కో. కల్క్. కుండలు తయారు చేయటానికిఉపయోగించే మట్టికుండ. పో.చూ. బ్రా. కలస్ట్. పగిలినమట్టికుండ, పాతకుండ.

పో.చూ.సం. కవా. ఓడ.

కలమరి వి. ఓడఎక్కిపోయేవాడు. భార. శాంతి. 5.588.

కలము[2] రూ. కలం[2]. వి. పన్నెండు తూముల పరిమాణం. పరమ. వి. 3.156.

మ. కలమ్. కాలమానం.

కలము[3] వి. 1. లేఖిని, రాతకుపయోగించే సాధనం, శ్రీనాథుని చాటువు. ఆం.భా. 2.189. ; 2. బాణ విశేషం. భోజ. 1.118.

హిం. కలమ్ ; ఉ. కలమ్ ; పార. కలమ్.

క. కలము. కుంచ ; కలము, కలాము. రాత కుపయోగించే సాధనం ; మాల్తో. కల్మె.

< ఉ. కలమ్.

కలంతాజా వి. కింద కనబరిచే అదనపు సంగతి. కలవకట్టియ రూ. కలపకట్టె. వి. రాసేకలం, కలంపుల్ల. కలపకట్టె రూ.చూ. కలపకట్టియ. వి. రాతకలం. కలముపుల్ల వి. రాతపనిముట్టు.

కలము[4] వి. కలుష గంధం.

కలముపెట్టు (-పెట్టు) స.క్రి. రెండుకొమ్మల్ని కలిపికట్టు.

కలమువేయు అ.క్రి. గండివడు.

కలఁపి రూ.చూ. కలయంపి. వి. కలయంపి. ఆం.భా. 2.23.

కలఁబడు చూ. కలయు.

కలంమామిడి రూ. కలాంమామిడి. వి. పొడుగ్గా, పెద్దదిగా ఎక్కువ తీపిగాఉండే ఒకరకం మామిడి.

కలంముట్టినసుర్తు వి. చదువురాని వాళ్ళు పత్రాలు రాయించి ఇచ్చినపుడు తమచేతిరాతకు బదులుగా వేసిఇచ్చిన వేలిముద్ర.

కలాంమామిడి రూ.చూ. కలంమామిడి. వి. పొడుగ్గా పెద్దదిగా ఎక్కువ తీపిగా ఉండే మామిడి పళ్ళల్లో ఒకరకం.

కలయ చూ. కలయు. అవ్య ద్రు.క్రి.విశ. 1. అంతటా, పూర్ణంగా. భార.ఆది. 4.160, భార.ఉద్యో. 4.239 ; 2. మిక్కిలి, అధికంగా. భార. ఆది. 6.260, 3. అందరూ. భార. ఆది. 6.270, బాగుగా. భార. శాంతి. 1.2; 4. మనస్ఫూర్తిగా.

కలయఁగ క్రి. విశ. అంతటా. భార. ద్రోణ. 2.226.

కలయంపి రూ. కలఁపి, కలాఁపి, కల్లావు, కల్లేపు, కళ్ళాపి, కళ్ళావు, కళ్ళెప, కళ్ళేవ. వి. 1. స్థలశుద్ధికోసం పేడతో కలయంపి చల్లేనీరు, కస్తూరి మొ. నవి కలిపి చల్లేనీరు. భార. విరా. 3.74; 2. అలకటం. ఆం.భా. 2.23.

కలయఁబడు చూ. కలయు.

కలయఁబర్వు చూ. కలయు.

కలయిక చూ. కలయు.

కలయికము చూ. కలయు.

కలయు రూ. కలియు. అ.క్రి. ఏకమగు, ఏకీభవించు. భార. శాంతి. 2.243. స.క్రి. 1. చేరు, కూడు. ఉ. హరి. 3.108 ; 2. కూడు, రమించు. దశా. 3.24 ; 3. పొందు. దశా. 10.105.

క. కలి, కలె. కలియు ; కలసు. కలుపు ; తు. కలడుని. కలుపు ; కలపుని. కలియజేయు ; త. కల, కలుపు. ఏకంచేయు ; మ. కలరుయ. కలువు, ఏకంచేయు, కలియు ; కలరుక. కలియు ; కలన్నుక. కలియు ; కో. కల్వ్. (కల్ద్-). పిసికి కలుపు ; తొద. కస్ఫ్- (కస్త్-). కలుపు (అన్నం మొ.) ; గొం. కలీ. కలిసి కౌగలించుకొను ; కలియ్ ; కుఇ. గ్లప. కలియబెట్టి కలుపు ; కువి. కల్ప్. కలుపు ; కల్హ్. కలిసేటట్లుచేయు, కలియు ; కొలా. కలయ్. కలియు ; కురు. ఖల్. నీళ్ళు, మొ. పానీయాలతో కలుపు.

పో.చూ. సం. కల్క. మందుమొక్క ముద్ద ; అనకల్కన. కలపటం.

మూ.ద. ద్రా.*కల్-అయ్.

మూ.ద్రా*కల్-.

కలఁబడు(-వడు) అ.క్రి. కలయబడు. చంద్రాంగ. 6.74. కలయఁబడు(-వడు) రూ. కలఁబడు. అక్రి. 1. కలియు, కూడు. భాస్క. రా. బాల. .687; 2. కలబడు, కలియు. భాస్క. రా. యుద్ధ. .755; 3. (ప్రేమతో) మేను మేను తాకించు. భాస్క. రా. యుద్ధ. .755; 4. ఒరసికొను, రాచుకొను. జైమినీ భా. 3.62. కలయఁబర్వు అ.క్రి. అంతటావ్యాపించు. కలయిక రూ. కలయికము. వి. కూడిక, సంబంధం, సంగమం, కూటం. పాండు. 5.183. కలయికము రూ.చూ. కలయిక. వి. రతిబంధం, కూడిక. కలయుమెలకువ వి. మల్లయుద్ధంలోని విశేషం. కలసిమెలసి అవ్య. 1. స్నేహంతో కూడి. హరి. ఉ. 4.192; 2. రతియందు కూడి. మను. 3.28. కలసిమెలసియుండు అ.క్రి. అన్యోన్యంగా

ఉండు. కలసివచ్చు అ.క్రి. లాభంకల్గు, అచ్చివచ్చు.

కలరా వి. విషూచి, మరిడీవ్యాధి.

ఇం. *Cholera*. వాంతులూ విరోచనాలు, అయ్యే అంటువ్యాధి.

< ఇం. Cholera.

కలరిచ్చు చూ. కలరు.

కలరు² వి. 1. రంగు, వర్ణం; 2. పానీయ భేదం; 3. యువతీ సమూహం. అ.క్రి. సిగ్గువల్ల ముఖం ఎర్రబారు.

ఇం. *Colour*. రంగు.

< ఇం. Colour. (అర్థ విపరి.).

కలరిచ్చు స.క్రి. వాస్తవాన్ని మరుగుపరిచి చెప్పు. < కలరు + ఇచ్చు. కలరుకూజా వి. మెరుగురంగు వేసిన కూజా.

కలవ¹ రూ. కలువ¹. చూ. కలయు విశే. కలిసిన. వి. 1. కలియటం, కూడిక; 2. కలిపిన ఇసుక సున్నం; 3. తెలుపు, నలుపు రంగుల కలయిక.

క. కలసు, కలిసు. కలువు, ఏకంచేయు, కలిపినది.

కలువలు వి.బ.వ. కలుషమైన జలాదులు.

కలవ² రూ.చూ. కలువ². వి. కలువ.

కలవడము వి. 1. గోముఖం, అలకటం. ఆం. భా. 2.253; 2. పేడనీళ్ళు, కలయంపి, కలాపి.

కలవడు అ.క్రి. కలయు, ఏకమగు, కూడు, చేరు, పొందు. రుక్మా. 3.64.

కలవంటకము వి. 1. పెక్కు పదార్థాలను కలిపి చేసిన వంటకం, మిశ్రాన్నం. యయా. 4.9; 2. దధ్యోదనం. పాంచాలీ. 4.59; 3. పులియోగిరం, పులిహోర.

పో.చూ. క. కళసన్న-. (కలసు + అన్న). చింతపండు లేక నిమ్మరసం, పులిహోర.

కలవతోక వి. తెలుపు, నలుపురంగుల తోక.

కలవరపడు చూ. కలవరము.

కలవరపెట్టు చూ. కలవరము.

కలవరపాటు చూ. కలవరము.

కలవరపోవు చూ. కలవరము.

కలవరము రూ.చూ. కళవళము. వి. 1. కలవరింత. ఆం. భా. 1.142; 2. కలత, క్షోభం, చింత, స్వప్న భాషణం; 3. పశ్చాత్తాపం.

కలవరపడు అ.క్రి. కలతపడు. ద్వి. సారంగ. 2.83, పు. 5 పం. కలవరపెట్టు స.క్రి. కలతపెట్టు. కలవరపాటు వి. క్షోభపడటం, కలత, చాంచల్యం. విప్ర. 2.44. కలవరపోవు అ.క్రి. కలవరపడు. కలవరించు అ.క్రి. 1. (నిద్రామోహాదులచే) మైమరచిపలుకు. హరి. పూ. 8.20; 2. కలతనొందు, క్షోభపడు. శుక. 1.384. కలవరించుకొను రూ. కల్వరించుకొను. అ.క్రి. (నిద్రమొ. వాటిచే) మైమరచి పలుకు. కలవరింత వి. నిద్రామోహాదులచే మైమరచి పలకటం, మైమరచిపలికినపలుకు. కళా. 5.53. కలవరింతలగు అ.క్రి. కలవరించు. కలవరింపు వి. స్వప్న భాషణం. ఆం.భా. 1.142. కల్వరించుకొను రూ.చూ. కలవరించుకొను. అ.క్రి. (నిద్రమొ. వాటిచే) మైమరచి పలుకు.

కలవరించు చూ. కలవరము.

కలవరించుకొను చూ. కలవరము.

కలవరింత చూ. కలవరము.

కలవరింతలగు చూ. కలవరింత.

కలవరింపు చూ. కలవరము.

కలవలము రూ.చూ. కళవళము. వి. కలవరం.

కలవారంచు రూ.చూ. కళావరంచు. వి. కళావరుచుక్క ఆకారంలో డిజైను నేసిన అంచు.

కలవారంచేయు స.క్రి. కలిసేటట్లుచేయు.

కలవారి రూ. కలవారు², కల్వరం, కల్వారి, కల్వారు¹. వి. కొడవలి, లిక్క.

కలవారు² రూ.చూ. కలవారి. వి. కొడవలి.

కలవారుపేటు వి. మొగ్గ మాదిరిగా నేసిన డిజైను.

కలశం రూ. కరిశె, కలిశ¹, కలిశెం. వి. కలిశంబుడ్డి, మేడల మీద మూలల్లో అలంకారానికి బోర్లించే మట్టిపాత్ర.

సం. కలశ-. నీళ్లకుండ, కుండ.

< సం. కలశ-.(అర్థ విపరి.).

కలశం మల్లెమొగ్గపేటు రూ. కలషం మల్లెమొగ్గపేటు. వి. పెద్ద కలశం ఒకటి, మల్లెమొగ్గఒకటి చొప్పున వరసగా నేసిన డిజైను.

కలషం మల్లెమొగ్గపేటు రూ.చూ. కలశం మల్లెమొగ్గపేటు. వి. పెద్ద కలశంఒకటి మల్లెమొగ్గ ఒకటి వరసగా నేసిన డిజైను.

కలసము వి. కుమ్మరి కుండలు చేసేసాధనం.

సం. కలశ-. కుండ.

< సం. కలశ-.

కలసరేగడి వి. ఇసుక కలిపిన రేగడినేల, మసరరేగడి.

కలసిమెలసి చూ. కలయు.

కలసిమెలసియుండు చూ. కలయు.

కలసివచ్చు చూ. కలయు.

కలహారము రూ.చూ. కల్హారము. వి. సౌగంధికం, కహ్లారం. కు. సం. 9.271.

కలాఁకడవ వి. మహమ్మదీయుల పెళ్ళిళ్ళలోవాడే ఎర్రగా కాల్చిన కడవ.

కలాఁడు చూ. కల².

కలాపన రూ.చూ. కలాపము. వి. కలత.

కలాపము రూ. కలాపన. వి. కలత.

< సం. కలాప-.(అర్థ విపరి.). సం. కలాప-. గుంపు, సమూహం.

కలాఁపి రూ.చూ. కలయంపి. వి. 1. పేడనీళ్లు. ఆం.భా. 2.23; 2. అలకటం.

కలాయి రూ.చూ. కళాయి. వి. 1. తగరపుపూత, కలాయి; 2. పెద్దగిన్నె.

కలాయిలనల్ప వి. గాబులు, గాగెలు మొ. వాటిని సర్దేటప్పుడు పూజ వాడేనలప.

కలాలి రూ. కలాలీ. వి. కల్లూ సారాయి అమ్మేవాడు. విశే. కల్లు సారాయి సంబంధమైన, అబుకారి.

హిం. ఉ. కలాల్. మత్తుపానీయాలమ్మేవాడు; మరా.

**కలాలీ** ; అర. కల్‌వార్.

క. కలాప. మత్తుపానీయాలను అమ్మేవాడు.

<ఉ. కలాల్.

**కలాలుఖానా**[1] రూ. కలీఖానా. వి. సారాదుకాణం. హిం. ఉ. కలాల్‌ఖానా. సారాదుకాణం. <ఉ. కలాల్‌ఖానా.

**కలాలుఖానా**[2] వి. పద్దు.

**కలాలీ** రూ.చూ. కలాలి. వి. సారాయికి సంబంధించిన రివెన్యూ పదం.

**కలాలుఖానా**[1] చూ. కలాలి.

**కలాల్‌ఖానా** చూ. కలాలి.

**కలావంతు(డు** వి. భోగంవాడు.

సం. కలావత్. కళలు కలవాడు. <సం. కలావత్ (అర్థవిపరి.).

**కలావంతులు** రూ.చూ. కళావంతులు వి.బ.వ. భోగం వారు, వేశ్యలు.

**కలావంతులు** చూ. కలావంతు(డు.

**కలావరు** రూ.చూ. కళావరు వి. 1. చీట్లాటలోని నలుపుగుర్తున్న కాగితం ; 2. నాసాభరణం ; 3. కళావరుచుక్కమాదిరిగా నేసిన డిజైను.

**కలావరంచు** రూ.చూ. కళావరంచు. వి. కళావరుచుక్క ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**కలావరంచు** చూ. కలావరు.

**కలాసం** రూ.చూ. కడవనము. వి. కమిదితోలు, నర్సేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి పరుచుకొనే గొర్రెచర్మం.

**కలావరం** రూ.చూ. కడవనము. వి. కమిదితోలు, నర్సేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి పరుచుకొనే గొర్రెచర్మం.

**కలాసి** రూ. కళాశీ, కళాసి[2]. వి. కళాసి, ఓడమీద పనిచేసే వాడు, పడవలాగేవాడు.

హిం. ఉ. ఖలాసీ. పడవమీది నౌకరు.

క. కలాసి. కళాసి ; మ. కలాసీ. నావికుడు.

<ఉ. ఖలాసీ.

**కలాసిక** రూ.చూ. కళాసిక. వి. కలానకం.

**కలాస్రం** రూ.చూ. కడవనము. వి. కమిదితోలు, నర్సేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి కిందపరచుకొనే గొర్రెచర్మం.

**కలి**[1] వి. 1. పులియబెట్టిన కడుగు. కు.సం. 8.135 ; 2. మర్యాద.

**కలికలిచేయు** స.క్రి. మాగాణి నీళ్ళలో దున్ను. **కలికలియగు** అ.క్రి. నీరగు, ద్రవించు. **కలికుండ** వి. గంజికుండ. **కలిపోసినవెనకఉట్లు కలిగొమట** వి. కార్యం మించిపోయినా వ్యర్థమైన ఆశపెట్టుకొని ఉండటం. రుక్మా. 4.75.

**-కలి**[2] అవ్య. కొన్ని ధాతువులపై భావార్థంలో వచ్చే ప్రత్యయం. ఉదా. వినుకలి.

**కలికము** విశే. స్వల్పమైన, తక్కువ. అచ్చ.రా. యుద్ధ. 21. వి. శైత్య నివారణార్థం కంటికి వేసే మందు.

క. కలె. ఏదైన వస్తువుయొక్క చిన్నభాగం, మొత్తంలో ఒక చిన్నభాగం.

**కలికి**[1] రూ. కల్కి. వి. ఆడది, మనోజ్ఞురాలైన ఆడది. భార. ఆది. 3.27. మను. 3.45. దంట, నేర్పరి. ఆం.భా. 3.62 విశే. మనోజ్ఞమైన. అందమైన. ఉ. హరి. 3.147.

క. కలికె. నేర్పు, నేర్చుకొనడం ; కలకేతి. కలభాషిణి ; పో.చూ.మ. కల్క. నేర్చుకొను.

**కలికితనము** రూ. కల్కితనము. వి. దిట్టతనం, నేర్పు. భార. విరా. 2.67. **కలికికలిరుబో(డి** వి. చిగురువలె మెత్తని మేనుగలది, స్త్రీ.

**కలికి**[2] వి. కొంగ తలఈక. ఆం.భా. 3.62.

**కలికితురాయి** రూ. కల్కితురాయి. వి. కొంగ తల ఈకలతో చేసిన శిరోభూషణం. వేంక. మా 1.134. **కలికిపిట్ట** వి. కొంగ.

**కలిగా** క్రి. విశే. ద్రు. 1. హెచ్చుగా ; 2. ప్రత్యేకంగా.

**కలిగి** రూ. కలిమి[3], కలిమె, కలివి[3], కలివె[2]. వి. 1. పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క ; 2. చిన్న ముళ్ళ పొద.

**కలిగించు** చూ. కలుగు.

**కలిగొట్టు** రూ. కలుగొట్టు. వి. కలగొరుచెట్టు, పాటలవృక్షం. మను. 3.84. (Bignonia chelonoides, Stereospernum Suaveolens).

**కలింకాయ** వి. వాక్కాయ.

**కలింగరాన్నము** వి. గంధమూలం, కులంజం.

**కలింగలు** వి.బ.వ. 1. అలుగు, పరీవాహం ; 2. చెరువు మొ॥ వాటిలో ఎక్కువగా ఉండే నీరు పోవడానికి ఏర్పరచిన దార్లు, చెరువు తూములు.

త. కలిఙ్గల్.

**కలిచల్లుట** వి. బిడ్డ పుట్టగానే ఆ బిడ్డపై నీరు జల్లటం.

**కలిజువ్వి** రూ.చూ. కలుజువ్వి. వి. ఊడలు తెల్లని కర్ర కలిగిన ఒక చెట్టు (Ficus tomentosa).

**కలిజెం** వి. ధాన్యాన్ని దాచిపెట్టుకోడానికి అరగుడిసెవలె ఇంటిలో కట్టేగది, వర్లకొట్టు.

**కలిదేదాకు** వి. కారంగా ఉండే తమలపాకు, కమ్మెరాకు, కుంభకోణం ఆకు.

**కలిడులు** వి. బ.వ. గొంగళ్ళు నేసే కురమలలో ఒక వంశం.

**కలితనము** వి. 1. శూరత్వం. కు.సం. 10.161 ; 2. సామర్థ్యం. భార. విరా. 4.223.

సం. కలి-. యుద్ధం, కలహం.

క. కలితన. శౌర్యం.

<సం. కలి-+-తనము.

**కలితాపసి** వి. నారదుడు.

సం. కలి. కలహం, జగడం.

<సం. కలి-+తాపసి.

**కలితి** రూ. కలితీ, కల్తి, కల్తీ. చూ. కలియు. వి. మిశ్రం. విశే. మిశ్రితమైన, స్వచ్ఛంకాని.

**కలితీ** రూ.చూ. కలితి. చూ. కలియు. విశే. మిశ్రితమైన, స్వచ్ఛంకాని, కలపబడిన.

**కలినేత** రూ చూ. కలనేత, వి. రెండు రంగుల నూలు కలిపి నేసిన నేత.

**కలిపడగ** రూ.చూ కలిపడగ. వి. ఉత్సవ సమయాల్లో ఎత్తే జెండా, జెండా.

**కలిపికొను** చూ. కలుపు[1].

**కలిపాతి** వి. గాయాలు మొ. కాచడానికుపయోగించే గుడ్డ ముక్క. చంద్రాంగ. 4.176.

**కలిమట్టు** స.క్రి. బాగా కలియబెట్టు.

**కలిమట్టుగడ్డి** వి. కుప్పనూర్పిడిలో ధాన్యం రాలిన తర్వాత, బాగా వంకాలతో కలియబెట్టి, విదిలించి ఎత్తి, బయట కడిమిగావేసి తొక్కినగడ్డి, మట్టగడ్డి.

**కలిమము** రూ. కడిమము. వి. మాంసం. భార. శాంతి. 3.285.

**కలిమి**[1]. రూ. కల్మి. చూ. కలుగు. వి. **1.** సంపద, ఐశ్వర్యం. భార. విరా. 1.140 ; **2.** కలగడం, ఉండటం. భార. ఆరణ్య. 4.189 ; **3.** పుట్టుక. మార్క. 8.206 ; **4.** తట స్థించడం. ప్రభా. 2.50 ; **5.** అవటం. కళా. 2.14.

**కలిమికొండ** వి. శ్రీశైలం, సిరిగొబ్బలి. సిం.ద్వా. 3.152. **కలిమిగలవాఁడు (-కలవాఁడు)** వి. **1.** కుబేరుడు. వరాహ. 6.89 ; **2.** దనికుడు. **కలిమిగుబ్బెత** వి. లక్ష్మీదేవి. దశా. 1.164. **కలిమిచూపులబోఁడి** వి. కటాక్ష ప్రసారం చేత సంపదల నిచ్చే స్త్రీ, లక్ష్మి. హర. 6.78. **కలిమిచెలి** వి. లక్ష్మి. యయా. 4.9. **కలిమితొయ్యలి** వి. సంపదలకు అధిష్ఠానదేవత, లక్ష్మి. **కలిమితొయ్యలిగేస్త** వి. లచ్చిమగడు, విష్ణువు. **కలిమి దండుగ** వి. **1.** నేరంలేకుండా ధనవంతుడి దగ్గర రాజు పుచ్చుకొనే ధనం ; **2.** కష్టం. **కలిమిలేములు** వి.బ.వ. **1.** సంపద, దరిద్రాలు ; **2.** కష్టసుఖాలు. **కలిమివెలఁది** వి. లక్ష్మి, కలిమి చెలి. వేంక. ఆం. 1.7. **కలిమివెలఁదికోడలు** వి. సరస్వతి. వేంక. ఆం. 1.7. **కలుములచెలి** వి. లక్ష్మీదేవి. ఆం.భా. 1.41. **కలుములదొర** వి. విత్తేశుడు, కుబేరుడు. **కలుములనెవల** వి. లక్ష్మీదేవి. అచ్చ.రా. బాల. 63.

**కలిమి**[2] రూ.చూ. కమిడ. వి. పాత్రల్ని నర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే బాప లేదా గోతాంపట్ట.

**కలిమి**[3] రూ.చూ. కలిగి. వి. పొదగాపెరిగే ముళ్ళకంచెమొక్క.

**కలిమికాయ** వి. నేరేడుకాయంత ఉండి, పుల్లగా ఉండే ఒక కాయ.

**కలిమె** రూ.చూ. కలిగి. వి. చిన్నముళ్ళపొద.

**కలిమెడి** వి. కళ్ళంలో మెదిగినగడ్డి, గింజలురాలిన గడ్డి.

**కలియకట్టు** చూ. కలియు.

**కలియమాకు** వి. కరివేపాకు చెట్టు.

**కలియఁబడు** చూ. కలియు.

**కలియఁబెట్టు** చూ. కలియు.

**కలియిక** చూ. కలియు.

**కలియు** రూ.చూ. కలయు. స.క్రి. రతియందుకూడు. విజ్ఞా. 3.107 ; అ.క్రి. బంధు మిత్రాదులలోనేకమగు, చేరు. హర. 4.64.

**కలియకట్టు** స.క్రి. **1.** కలిపిగట్టిగా అంకకట్టు ; **2.** అంటుకట్టు. **కలియఁబడు** అ.క్రి. కలబడు. **కలియఁబెట్టు** రూ. కలబెట్టు. స.క్రి. **1.** ఎనుపు, ఎనియచేయు ; **2.** కలిసేట్టు కలపు. **కలియిక** వి. కలయిక. **కలియికలాగులు** వి.బ.వ. ఒకానొక రతి బంధం.

**కలియుగమహిమలు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

**కలివడగ** రూ. కలిపడగ, కలివడము, కలువడము, కల్వడగ, కల్వడము[1]. వి. ఉత్సవసమయాల్లో ఎత్తేధ్వజం, వీరధ్వజం, కు.సం. 8.42.

**కలివడము** రూ.చూ. కలివడగ. వి. ఉత్సవసమయాల్లో ఎత్తే జండా.

**కలివి**[1] రూ.చూ. కలివె[1]. వి. వృక్షవిశేషం. కరమర్దం, ఓక.

**కలివి**[2] రూ.చూ. కలిగి. వి. పొదగా పెరిగే ముళ్ళకంచెమొక్క.

**కలివి**[3] వి. తెలివి.

**కలివికల్ల** వి. ఆముకాల్పుకు వాడే కంప.

**కలివిడి** వి. **1.** అన్యోన్యమైత్రి, కలసిమెలసి ఉండటం ; **2.** ఆనందం ; **3.** సందడి.

**కలివిరి** వి. ఒకానొక వృక్ష విశేషం. హంస. 4.9.

**కలివె**[1] రూ. కరివె[2]. కలివి[1], కల్వె. వి. కరమర్దం, ఓక. పండి. చ. 5. 348 పు.

క. కరమర్దక, కరమడి. తినేపళ్ళు కాసేముళ్ళ పొద (Carrissa Carandas) ; కళవె, కళా, కళివి. తినే నల్లని పళ్ళు కాసేముళ్ళ పొద, (Carissa spihrarum), బంగాళాదేశపు ఎండుద్రాక్ష పళ్ళు, నేపాలదేశపు బెరి బెరీ పళ్ళు ; మ. కలావ్ (Carissa carandas).

**కలివె**[2] రూ.చూ. కలిగి. వి. చిన్నముళ్ళపొద.

**కలిశంబుర్జి** వి. కలశం. దేవాలయం గోపురం పైన గర్భగుడి పైనా మేడల మీద అలంకారానికి పెట్టే కూజాలాంటి పాత్ర.

**కలిశంముంత** వి. వరలక్ష్మి వ్రతంలో ఉపయోగపడే చెంబు లాగ ఉండే మట్టి పాత్ర.

**కలిశ్రాయి** రూ. కలిశిత్రాయి. వి. చిన్న చిన్న పిడతల్ని కలశాల్ని నర్సేరాయి.

**కలిశి**[1] రూ.చూ. కలశం. వి. కలిశంబుర్జి. మేడల మీద మూలల్లో అలంకారానికి బోర్లించే మట్టిపాత్ర.

**కలిశి**[2] వి. పిడత. గిన్నెలాఉండే చిన్నమట్టిపాత్ర.

సం. కలశ. కుండ.

<సం. కలశ-.

**కలిశిత్రాయి** రూ.చూ. కలిశత్రాయి. వి. చిన్న చిన్న పిడతల్ని కలశాల్ని నర్సేరాయి.

**కలిశెం** రూ.చూ. కలశం. వి. కలిశంబుర్జి. మేడలమీద మూలల్లో అలంకారానికి బోర్లించే మట్టిపాత్ర.

**కలిసిగుద్దులు** వి.బ.వ. రెండుపొట్టేళ్ళ మధ్య విడదీయకుండా పోట్లాటపెట్టే పందెం.

**కలీ** రూ. కల్లి[3], కల్లీ. వి. సున్నంకాల్చిన తర్వాత మిగిలిన రాయి.

హిం.ఉ. కలీ. సున్నం ; అర. కలఈ. సున్నం.

<ఉ. కలీ.

**కలీతు** వి. పావడ. చౌడప్ప సీ. 14.

ఉ. కలాత్. తుర్కిస్తాన్‌లోని ఒకపట్టణం, పార. కలాత్.

<ఉ. కలాత్ (అర్థవిపరి.).

**కలీఖానా** రూ.చూ. కలాలుఖానా[1]. చూ. కలాలి. వి. సారా దుకాణం.

**కలు**[1] రూ.చూ. కల్లు[1]. వి. మద్యం, సుర. భార. కర్ణ. 2.48.

**కలు**[2] రూ.చూ. కల్లు[2]. వి. **1.** శిల, రాయి. శృం.నై. 2.56 ; **2.** బండిచక్రం. కాశీ. 1.77.

కలుకోట వి. రాతితో నిర్మింపబడ్డ దేవాలయ ప్రాకారం. కలుకోడి రూ.చూ. కల్కోడి. వి. కల్కోడి (అశుభసూచకమైన కూత కూసేది), రాతికోడి. కు.సం. 1.54. కలుక్రాంత వి. త్రాయంతీలత, కలుగానుగ. కలుగచ్చ రూ.చూ. కలుగ్రచ్చ. వి. ఒక విధమైనగచ్చ. కలుగాడి. వి. 1. రాతితో నిర్మింపబడ్డతొట్టి; 2. పశువులు నీరు తాగడానికై నీరు నింపడానికుపయోగింపబడ్డ రాతితొట్టి. కలుగానుఁగ రూ. కలుగానుఁగు. వి. రాతిగానుగ. రామా. 1.127. కలుగానుఁగు రూ. చూ. కలుగానుఁగ. వి. రాతిగానుగ. కలుగ్రచ్చ రూ. కలుగచ్చ. వి. ఒక విధమైన గచ్చ. కలుఁగానుగు (-కానుగు) వి. త్రాయంతీ. కలుజువ్వి రూ. కలజువ్వి, కలిజువ్వి, కల్జువ్వి, కల్లుజువ్వి. వి. కూటపర్కటి, కొండజువ్వి. హంస. 4.11. (Ficus tomentosa). కలుపొన్న రూ. కల్పొన్న. వి. ఒకానొక జాతిపొన్న. కు.సం. 1.54. కలుబంద రూ.చూ. కలబంద. వి. కలమంద. ఆం.భా. 2.65. కలుమఠములు వి.బ.వ. రాతితో నిర్మింపబడ్డ మఠాలు. భీమ. 2.47. కలుమంద రూ.చూ. కలబంద. వి. కలబంద. కలుముచ్చు వి. నిష్ప్రయోజకుడు. కల్కోడి రూ. కలుకోడి. వి. కలుకోడి. పండి. చ. 4.197. కల్జువ్వి రూ.చూ. కలుజువ్వి. వి. కూటపర్కటి, కొండజువ్వి. కాశ. 3.50. (Ficus tomentosa). కల్పొన్న రూ. కలుపొన్న. వి. ఒకానొక జాతిపొన్న. పండి. చ. 197. పు.

కలుక్కు అవ్య. మనసు నొవ్వడంలోని అనుకరణం. సారంగ. 3.50.

క. కలకు. కదలించు, కదుపు, కలుపు, కలవరపరచు, కలవరపడు.

కలుగు రూ. కలుపు. అ.క్రి. 1. ఉండు, నిలుచు. భార. ఆది. 1.119 ; 2. కలదగు, కలవాడగు. భార. ఆది. 8.4 ; 3. సంభవించు, లభించు, ప్రాప్తించు, దొరకు. భార.అరణ్య. 2.218 ; 4. అగు. మార్క. 7.18 ; 5. పుట్టు. భాగ. 9.159 ; 6. అర్హమగు, తగు. ఆము. 1.2 ; 7. చాలు, ఓపు. స.క్రి. 1. పొందు. భార.ఆది. 2.34. ; 2. కలిగి ఉండు. భార.ద్రోణ. 2.237; 3. కడచు. విష్ణుపు. 2.228 ; 4. రమించు. అని. 2.141.

తు. కరియుని. సాధ్యమగు ; త. కలి. కనబడు, సుఖంగా పెరుగు (నాటు) వృద్ధిచేయు ; కొలా. కల్-. ఒకవేళ,

కలిగించు రూ. కల్గించు. స.క్రి. 1. ఉంచు, నిలుపు. భార. ఉద్యో. 1.373 ; 2. వ్యక్తపరచు. భార. శాంతి. 479 ; 3. సృజించు, పుట్టించు. రం.రా. బాల. 53 పు. 19 ; 4. లభింపచేయు.

కలుగుడు వి. గరుగచెట్టు. తినేపళ్ళు కాసే ఒక పెద్దచెట్టు. (Garuga pinnata).

కలుగొట్టు రూ.చూ కలిగొట్టు. వి. పాటలవృక్షం.

కలుఁగు రూ. కల్గు[2]. వి. 1. రంధ్రం, కన్నం. కాశీ. 5.193 ; 2. గుహ, గుహలాగ తొలిచిన రంధ్రం, సొరంగం ; 3. పుట్ట ; 4. బైదు.

క. కుఱికుణి. కన్నం, సమాధి.

కలుఁగుకానుపు తపని రూ. కల్గుకానుపుతపని. వి. వల్మీక సంభవుడు, వాల్మీకిముని. అచ్చ. రా. బాల. 27. కలుఁగున్‌లాయపుఁదేజి (-తేజి) రూ. కలుఁగులాయపుఁదేజి. వి. మూషిక వాహనం. కువ.చ. 1.7. కలుఁగులాయపుదేజి రూ.చూ. కలుఁగున్‌లాయపుఁదేజి. వి. మూషిక వాహనుడు. శశా. 5.90.

కలుచ వి. 1. క్షోభం, కలత. భార. భీష్మ. 1.186 ; 2. కారణం. భార. శాంతి. 1.138 ; 3. దోషం. భార. శాంతి 4.183.

సం. కలుష-. దోషమైన, మురికిగా ఉన్న ; ప్రా. కలుస-. మలినమైన, పాపమైన.

మ. కలశల్. సంభ్రమం, తత్తరపాటు ,

<ప్రా. కలుస -.

కలుచపడు అ.క్రి. కలతపడు. నృసింహ. 5.4.

కలుచు రూ.చూ. కల్చు. స.క్రి. మోహించు, వలచు. ఆం.భా. 3.96.

కలుజు[1] రూ. కల్జు[1]. వి. 1. రాకట్టు, శిలాబంధం. ఆం.భా. 1.162 ; 2. నూతిగోడ.

త. కలింకు, కలించు, కలుంకు. కాలవ, చెరువు మొ. వాటిని బంధించడానికి విడవడానికీ ఉపయోగించే సాధన విశేషం.

కలుజు[2] రూ.చూ. కల్జు[2]. వి. 1. స్వర్ణకారుడు ; 2. అలుగు.

కలుపు[1] రూ. కల్పు[1]. చూ. కలియు. స.క్రి. చేర్చు, కూర్చు. ఉ.హరి. 5.33 ; వి. 1. కలయిక. శృం.నై. 7.151 ; 2. దధి, పెరుగు, మిశ్రదధి. ఆం.భా. 2.295. శశా. 3 ; 3. పైరు మొ. వాటితో కలిసి మొలచిన గడ్డి మొ.

క. కలసు, కలిసు. కలుపు ; కళె. లాగు, తీయు, నాశనం చేయు, కలుపు మొక్క ; కొడ. కల్. కలుపు మొక్కలు ; తు. కలెపిని, కలెపుని. తీసివేయు, తీయు ; కలెవుని. తీయబడు ; త. కళ్. కలుపు తీయు, లాగు ; కళ్ పు. కలుపు తీయడం, కళ్ళల్. కలుపు తీయడం, లాగడం ; కళై. కలుపుతీయు, పైకిలాగు, తొలగించు, నిర్మూలించు, పూర్తిగా పోగొట్టు ; మ. కళ. కలుపు ; కళయుక. వదిలించుకొను, రద్దుచేయు ; తొ. కొల్. చెట్లబెరడు తీసినపుడు చలికాలంలో ఆకులు లేకుండా నగం ఎండి నగం పచ్చగా ఉండు ; కొలా. కళ్. కలుపుకొను.

కలిపికొను స.క్రి. చేర్చు, కలుపు, ఒకటిగా చేయు. భార. అను. 3.2. కలుపుకొంత్ర రూ. కలుపుఁగొంత్ర. వి. మొదటి అరక ఒకసారి చుట్టివచ్చేటప్పటికి నడిమి ఎడం మిగిలిన అరకలు పూర్తిగా కలిపేట్టు వేసిన కొంత్ర. కలుపుకోలు రూ.చూ. కలుపుఁగోలు. వి. మైత్రి, ఐకమత్యం. కలుపుగడ్డ వి. పొలంలో కొంత్ర ఇంకా కలుపుకోవలసిన భాగం. కలుపుగుంటక వి. పైరులో కలుపు తీసే రెండు, మూడు పడుగుల గుంటక. కలుపుగుద్దలి వి. కలుపు తీసే పనిముట్టు. కలుపుఁగొంత్ర (-కొంత్ర). రూ.చూ. కలుపుకొంత్ర. వి. మొదటి అరక ఒకసారి చుట్టి వచ్చేసరికి నడిమి ఎడం మిగిలిన అరకలు పూర్తిగా కలిపేటట్లు వేసిన కొంత్ర. కలుపుగోలు (-కోలు) రూ.చూ. కల్పుఁగోలు. వి. మైత్రి, ఐకమత్యం. కలుపుఁగోలు (-కోలు) రూ. చూ. కల్పుఁ

గోలు. వి. మైత్రి, ఐకమత్యం. చంద్రాంగ. 3.108. **కలుపుఁగోలుతనము** వి. ఐకమత్యం. రామా. 5.134. **కలుపుచాలు** రూ. కలుపుజాలు, కలుపుసాలు, కల్పుజారు, కల్పుజాలు. వి. 1. కొంద్ర కలిపేచాలు ; 2. నాటు వెయ్యడానికి ముందు మాగాణిలో దున్నిన ఆఖరి చాలు. **కలుపుచీల** వి. కొయ్య ముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీసే పనిముట్టు. **కలుపుజాలు** రూ.చూ. కలుపుచాలు. **కలుపుతొట్టె** వి. రంగులుకలిపే తొట్టె. **కలుపుదంతి** వి. పైరులో కలుపు పోవడానికి చేత్తోలాగే వళ్ళదంతె. **కలుపుపైరు** వి. కలుపుతీయడానికి వీలైనంత ఎత్తుగా పెరిగినపైరు. **కలుపుసాలు** రూ.చూ. కలుపుచాలు. **కలుపుసేద్యం** వి. కలుపు పోవడానికి నేల గుల్లబారటానికి పైరులో పావటం, గుంటక మొ. నవి లాగటం.

**కలుపు**[2] రూ.చూ. కల్పు[2]. చూ. కలుచు. వి. 1. ప్రేమ, మోహం ; 2. రతి.

**కలుపు**[3] వి. 1. మిశ్రదధి, పాలతో తయారయ్యే ఏదైనా పదార్థం. ఆం.భా. 2.295 , 2. పెరుగు.

**కలుపుకూర** వి. కలగూర.

**కలుమంద** రూ.చూ. కలబంద. వి. ఒకానొక మొక్క. ఆం.భా. 2.65.

**కలుము** వి. 1. కలుషగంధం. ఆం.భా. 1.106 ; 2. మురికి, మకిలి.

క. కలుంబు. కిళం, అశుచి, మైల, మాలిన్యం.

**కలుములచెలి** చూ. కలిమి.

**కలుములదొర** చూ. కలిమి.

**కలుములనవల** చూ. కలిమి.

**కలురొట్టె** వి. మైదాపిండి పులియబెట్టి తయారు చేసే మెత్తటి రొట్టె.

**కలువ**[1] రూ.చూ. కలవ[1]. విఱ. కలిసిన. వి. 1. కూడిక, సంయోగం ; 2. తెలుపు, నలుపురంగులకలయిక.

**కలువ**[2] రూ. కలవ[2], కల్వ. వి. ఉత్పలం, కువలయం. శృం.నై. 3.66.

క. కలవె, కలువె. వాసన ఉన్న నీటి కలువ.

**కలువకంటి** రూ. కల్వకంటి. వి. కలువలాంటి కన్నులున్న స్త్రీ, కువలయాక్షి. భీమ. 5.113. **కలువగొంగ** వి. కలువలకు శత్రువు సూర్యుడు. ప్రబంధ. 802. **కలువచెలి** వి. కుముదబాంధవుడు, చంద్రుడు. భర్తృ. 2.89. **కలువదుంప** వి. ఉత్పలమూలం. **కలువనేస్తి** వి. చంద్రుడు. వేంక. ఆం. 2.77. **కలువరాయఁడు** వి. కలువరేడు. శశా. 4.201. **కలువఱాకట్టు** వి. శిలాబంధ పుష్కరిణి. **కలువతేకు** రూ. కల్వతేకు. వి. 1. కువలయదళం, ఉత్త.రా. 2.266 ; 2. పిరుదుల మీది నక్షత్రం. వేంక. ఆం. 2.77. **కలువతేఁడు** వి. చంద్రుడు. దశా. 2.302. **కలువలచెలిరేక** వి. నెలవంక. మృత్యు. 2.63. **కలువలదాయ** వి. సూర్యుడు. **కలువలదొర** వి. చంద్రుడు. రాజ.వి. 4.44. **కలువలయనుంగు** రూ. కల్వలయనుఁగు. వి. చంద్రుడు. అచ్చరా. అయోధ్యా. 2.18. **కలువలరాయఁడు** వి. చంద్రుడు. ఉ.రా. 7.356. **కలువలతేనితోడు** వి. లక్ష్మీదేవి. ఆం భా. 1.41. **కలువలవిందు** వి. చంద్రుడు, కుముదబాంధవుడు. **కలువలసూడు** వి. సూర్యుడు. **కలువవిందు** వి. చంద్రుడు, కుముదబాంధవుడు. రామా. 6.30. **కలువవిల్తుడు** వి. మన్మథుడు, పుష్పధన్వుడు. సానంద. 5.91.

**కలువడము**[1] రూ.చూ. కలివడగ. వి. ఉత్సవాదుల్లో ధ్వజస్తంభం మొ. వాటికి వేలాడ కట్టే కలువదండ, ప్రాలంబమాలిక. రం.రా.అమా. 88.

**కలువడము**[2] రూ. కల్వడము[2]. వి. వితానం, మేలుకట్టు. సాం, ని. 2.19.

**కలువము** రూ.చూ. కల్వము. వి. మందునూరే రాయి.

**కలువాయిబ్రహ్మజ్ఞానం** వి. కలువాయి వేదాంతం, మెట్టవేదాంతం.

**కలువాయివేదాంతం** వి. మెట్టవేదాంతం.

**కలువు** రూ.చూ. కలుగు. అ.క్రి. 1. పుట్టు. వసు. 4.14 ; 2. కలదగు, కలవాడగు ; 3. చాలు, ఓపు, సమర్థమగు ; 4. ఉండు, నిలుచు ; 5. అగు ; 6. సంభవించు, లభించు, ప్రాప్తించు, దొరుకు ; 7. అర్హమగు.

**కలుస** స.క్రి. కలుపుతీయు.

**కలుసుకూర** రూ.చూ. కలుసుఁగూర. వి. 1. పప్పు, కూరలు కలిపిచేసిన కూర ; 2. పులుసువేయని తీయనికూర ; 3 పుల్లకూర.

**కలుసఁగూర** (-కూర) రూ. కలుసుకూర. వి. కలగలుపు కూర. జైమినీభా. 3.50.

**కలుహారగంధి** వి. స్త్రీ. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 672 క్రీ.శ. 1139.

**కలుహారము** రూ.చూ. కల్హారము. వి. కల్హారం.

**కలెఅతుకు** స.క్రి. అచ్చుతికే పదుగులో కిందిపోగులూ, పైపోగులు కలిపి మొత్తం అతుకు.

**కలెక్టరు** రూ.చూ. కలక్టరు. వి. కలక్టరు, జిల్లా ప్రధానాధికారి.

**కలెంగెడికాయ** వి. పుచ్చకాయ.

**కలెంపూచీర** వి. నడిమినేతలో ఒకరకం పువ్వు డిజైను పడేట్టు నేసిన చీర.

**కలేకంప** వి. ఆము కాల్చడానికి వాడే అడవిచెట్టు కంప, కరమద్ది.

**కలేజా** వి. ధైర్యం.

హిం.ఉ. కలేజా. గుండె.

<ఉ. కలేజా.

**కలొత్తుడు** వి. కాలికి రాయిగుచ్చుకొన్నప్పటి బాధ.

**కల్కటరు** రూ.చూ. కలక్టరు. వి. జిల్లా అధికారి.

**కల్కటేరు** రూ.చూ. కలక్టరు. వి. జిల్లా ప్రధానాధికారి.

**కల్కట్టె** వి. ఆము కాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకు రావడానికి వాడే వంగల కర్ర.

**కల్కండ** రూ.చూ. కల్కండము. వి. చక్కెర, పటికబెల్లం.

**కల్కండము** రూ. కలకండ, కలకండము, కల్కండ. వి. కండ చక్కెర, పటికబెల్లం. ప్రబంధ. 112.

సం. ఖణ్డ -. ముక్క, భాగం.

<కలు[2] + సం. ఖణ్డ-.

**కల్కి**[1] రూ.చూ. కలికి[1]. విఱ. మనోజ్ఞమైన, అందమైన. మను.

5.68. వి. **1.** ఆరడి, మనోజ్ఞమైన ఆరడి. ఉ.రా. 5.69 ; **2.** దంట, నేర్పరి.

**కల్కితనము** రూ.చూ. కలికితనము. వి. దిట్టతనం, నేర్పు.

**కల్కి**[2] రూ.చూ. కలికి[3]. వి. కొంగ.

**కల్కితురాయి** రూ.చూ. కలికితురాయి. వి. కొంగతల ఈకలతో చేసిన శిరోభూషణం.

**కల్గొడి** చూ. కలు[2].

**కల్గించు** చూ. కల్గు[1].

**కల్గు**[1] రూ.చూ. కలుగు. అ.క్రి. **1.** కలవగు, కలవాడగు. భార. ఆది. 6.291 ; **2.** చాలు, ఓపు, సమర్థమగు. భార. విరా. 1.143 ; **3.** సంభవించు. భార. విరా. 3.170 ; **4.** పుట్టు. విక్ర. 1.39 ; **5.** ఉండు, నిలుచు. విజయ. 3.15 ; **6.** తగు, అర్హమగు.

**కల్గించు** రూ.చూ. కలిగించు. స.క్రి. **1.** లభింపచేయు. ఉ.రా. 4.146 ; **2.** ఉంచు, నిలుపు ; **3.** వ్యక్తపరుచు ; **4.** పుట్టించు.

**కల్గు**[2] రూ.చూ. కలుఁగు. వి. **1.** గుహ, సొరంగం. అచ్చ.రా. యు. 445 ; **2.** రంధ్రం, కన్నం ; **3.** పుట్ట.

**కల్గుకానుపుతపసి** రూ.చూ. కలుగుకానుపుతపసి. వి. వాల్మీకి.

**కల్చడం** వి. కలవడం.

**కల్చు** రూ. కలుచు. స.క్రి. మోహించు, వలచు. కు.సం. 8.142.

**కల్జు**[1] రూ.చూ. కలుజు[1]. వి. **1.** రాకట్టు, శిలాబంధం ; **2.** నూతిగోడ.

**కల్జు**[2] రూ. కలుజు[2]. వి. కంసాలి, వడ్రంగి. రామలిం.శ. 23.

**కల్జుకూర** వి. అనేకరకాల కాయలతో వండినకూర.

**కల్జువ్వి** చూ. కలు[2].

**కల్టేకు** రూ.చూ. కల్లటేకు. వి. నీలగిరుల్లో పెరిగే ఒకచెట్టు (Dellinia bracteata).

**కల్తి** రూ.చూ. కలితి. వి. మిశ్రం. విశే. మిశ్రితమైన, స్వచ్ఛం కాని.

**కల్తీ** రూ. చూ. కలితి. వి. మిశ్రం. విశే. మిశ్రితమైన, స్వచ్ఛం కాని.

**కల్త్రెంతు** వి. చిన్నదైనరాయి.

**కల్దువ్వవేల** వి. ఎర్రరంగుగల తువ్వనేల.

**కల్దేగొడ్డు** వి. ఎలుగ్గొడ్డు, ఎలుగుబంటి, కరిడి, కల్డి.

**కల్దొక్కు** రూ.చూ. కలదొక్కు. స.క్రి. కాళ్ళతోతొక్కి అదును కలుపు.

**కల్నీళ్ళు** వి. బియ్యం కడిగిననీళ్ళు, కడుగు.

**కల్నేటు** వి. కన్నె లేడి.

**కల్నేత** రూ.చూ. కలనేత. వి. **1.** నిలువుకు ఒక రంగు, అడ్డానికి మరొక రంగుగల నూలు పెట్టి నేసిన గట్టి నేత ; **2.** రంగుదారపు కండెలు బిగించిన నాడెలు మార్చుకొంటూ నేసిన నేత ; **3.** నేతలో పోగులు కలిసిపోయేటట్టు చిక్కగా నేసిన నేత ; **4.** అనితొక్కి, వలక కొట్టి నెయ్యటం.

**కల్నేతచీర** రూ.చూ. కలనేతచీర. వి. నిలువుపోగులు ఒక రంగువి పేకపోగులు మరో రంగువి పెట్టి నేసినరెండు రంగులచీర.

**కల్నేయు** రూ.చూ. కలనేయు. స.క్రి. రెండురంగుల పోగులు కలిపినేయు.

**కల్ప** రూ.చూ. కలప[2]. వి. కొండమీదపెరిగే ఒకరకంమొక్క.

**కల్పగంటి** వి. జొన్నకాడలా ఉండే కలుపుమొక్క.

**కల్పనింపు** రూ.చూ. కలపనింపు. స.క్రి. నేసినబట్టచుట్టటానికి దోనె పలకతిప్పు.

**కల్పపుల్ల** రూ.చూ. కలపపుల్ల. వి. పన్నెకట్టుబడిలో దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా కట్టిన కలపజొన్న మొ. వాటిపుల్ల.

**కల్పు**[1] రూ.చూ. కలుపు[1]. అ.క్రి. చేర్చు, కూర్చు. వి. **1.** కలయిక ; **2.** పైరు మొ. వాటిలో కలిసి మొలిచినగడ్డి మొ. ; **3.** పెరుగు, మిశ్రదధి.

**కల్పుఁగోలు** రూ. కలుపుఁగోలు. వి. మైత్రి, ఐకమత్యం. చంద్రాంగ. 3.108 ; **కల్పుజారు** రూ.చూ. కలుపుచాలు. వి. **1.** కొంద్రకలిపేచాలు, **2.** నాటువేయటానికి ముందు మాగాణిలో దున్నిన ఆఖరిచాలు. **కల్పుజాలు** రూ.చూ. కలుపుచాలు. వి. **1.** కొంద్రకలిపేచాలు ; **2.** నాటువేయటానికి ముందరదున్నిన ఆఖరిచాలు.

**కల్పు**[2] చూ. కలుచు. రూ. కలుపు[2]. వి. మోహం, వలపు. కు.సం. 5.74.

**కల్పుమాదం** వి. మట్టి, నీరుకలిపిఅదునుతొక్కడం.

**కల్పేయు** రూ.చూ. కలపవేయు. స.క్రి. నేతనేసేటప్పుడుపడుగుతో నాడె వేసిన తర్వాత పోగుదగ్గర పడేట్లు చేతిపలకతో అదుము.

**కల్పొన్న** చూ. కలు[2].

**కల్మ**[1] రూ.చూ. కలం[4]. వి. అరటి, నారింజ మొ. వాటిఅంటు, కొమ్మకుకట్టేఅంటు.

**కల్మ**[2] వి. సుమారు అయిదంగుళాలమందంలో ఉండే చిక్కని రాతిపొర.

**కల్మకిందచచ్చు** వి. రాతిగనిలోని పొర, చెక్కలుచెక్కలుగా ఉండి రాయి సరిగా రానిపొర. **కల్మమీదిచెక్కు** వి. రాతిగనిలోని మూడోపొర, గోడకట్టుబడికి పనికివచ్చే రాయిగల పొర.

**కల్మతోక** వి. **1.** నల్లటితోకకుచ్చు ; **2.** తెల్లటితోకకుచ్చు.

**కల్మి** రూ.చూ. కలిమి[1]. వి. కలగడం, ఉండటం. భార. అరణ్య. 4.784 ; **2.** పుట్టుక. మార్క. 8.206. ; **3.** తటస్థించడం. ప్రబో. 2.50 ; **4.** అరవటం, కావటం. రశా. 2.14 ; **5.** సంపద, ఐశ్వర్యం.

**కల్మిరాయి** వి. గోడలకట్టుబడికి పనికివచ్చేరాయి.

**కల్మే** రూ.చూ. కలం[4]. వి. అరటి, నారింజ మొ. వాటిఅంటు, కొమ్మకుకట్టే అంటు.

**కల్యాట్లు** వి.బ.వ. అగచాట్లు, ప్రయాసలు.

**కల్యాణతిలకంఅంచు** వి. పెండ్లిబొట్టుమాదిరిగా, మూడేసి చుక్కలు రెండువరసలుపెట్టి, వాటికిమధ్యనిలువుగీరలు పడేట్లు డిజైను నేసిన అంచు.

<సం. కల్యాణతిలక- + - ముఅంచు.

**కల్యాణము** వి. వివాహం.

సం. కల్యాణ-. అందం, శుభం, సుఖం, అదృష్టం.

<నం. కల్యాణ- (అర్థవిపరి.).

**కల్యామాకు** రూ.చూ. కరివేపాకు. వి. కరింపాకు.

**కల్ల**[1] విశే. 1. అసత్యమైన. భార.శల్య. 2.281 ; 2. మాయా కల్పితమైన. అచ్చ.రా.యు. 57 ; 3. దొంగస్వభావం కల. అచ్చ.రా.యు. 6.416; 4. తెచ్చిపెట్టుకొన్న; వి. 1. తప్పు, నేరం. భీమ. 3.193 ; 2. భంగం, హాని. పరమ. 3.297 ; 3. అసత్యం. ఆం.భా. 1.116 ; 4. పరుష వచనం ; 5. మోసం.

క. కళ్ (కల్ద్). దొంగలించు ; కళ్. దొంగతనం; కళ్ళ, కళ్. దొంగ ; కొడ. కళ్ళే. దొంగతనం, అబద్ధం ; కళ్ళి. ఆడదొంగ ; తు. కళ్ళ. మోసమైన, నిజాయితీలేని ; త. కళ్ (కట్-కత్). దొంగలించు, వంచించు ; కళ్ళల్. దొంగలించటం ; కళ్ళన్. దొంగ, బందిపోటు, మోసగాడు; కళ్ళి. ఆడదొంగ, పనిదొంగ ; మ. కళ్ళమ్. దొంగతనం. దొంగసంతకంచేయడం, దొంగరవాణా; తొ. కొల్ (కొడ్-). దొంగిలించు ; కొల్న్. దొంగ ; గోం. కల్లాన్, కల్లిన. దొంగిలించు ; కల్లా. కల్లె, కల్వెల్. దొంగ ; కొండ. కళ్వ (కర్డ్). దొంగిలించు ; కురు. కల్ బస్. దొంగ ; మాల్తో. క్వెల్. దొంగిలించు, దోచుకొను.

<మూ.ద్రా. కళ్-.

**కల్లగుట్టు** వి. తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యం. ఆము. 2.58. **కల్లగుల్ల** వి. బొంకులపోగు, అబద్ధాలాడేవాడు. ఒంటి. శ. 17. **కల్లచేయు** రూ.చూ. కల్లసేయ, మోస పుచ్చు. **కల్లచ్చులు** వి.బ.వ. తప్పుతూనికకట్లు. **కల్లజగడము** వి. అబద్ధపు పోట్లాట. **కల్లతనము** వి. 1. వంచన, మోసం. భాగ. 6.5 ; 2. నేరం, తప్పు. భాగ. 9.14 ; 3. చెడ్డతనం, దుశ్చేష్ట. కాశీ. 4.90. **కల్లబొల్లికబురులు** వి.బ.వ. మాయమాటలు. **కల్లబొల్లిమాటలు** వి.బ వ. మాయమాటలు. **కల్లరి** విశే. అసత్యమైన. శుక. 1.55. వి. 1. దుష్టుడు, దుష్టురాలు. భాగ. 10.93; 2. వంచ కుడు, మాయలాడు. దశా. 8.189 ; 3. తప్పుచేసిన వాడు, అపరాధి. సారంగ. 2.15; 4. గదరి, దిట్ట. చంద్రాంగ. 2.74; 5. అసత్యమాడేస్త్రీ. చెన్నబసవ. 2.24. **కల్లరికత్తె** వి. మోసకత్తె, అబద్ధాలాడేస్త్రీ. **కల్లరితనము** వి. సాహసకృత్యం. రాజ.వి. 3.45. **కల్లరీఁడు** వి. దొంగ, మోసరి. సాం. ని. 2.12 **కల్లలుపెనచు** స.క్రి. అబద్ధాలు సృష్టించు. ద్వి. కల్యా. 129. **కల్లవచ్చు** అ.క్రి. కీడు కలుగు. **కల్లవాటు(-పాటు)** వి. కలత, కళవళం. సారంగ. 11.16. పం. **కల్లవాపు** వి. 1. నొప్పిలేనివాపు; 2. పొడుగు లేదా గంగడోలు మీదివాపు. **కల్లవెల్లియగు** అ.క్రి. చెల్లా చెదరగు. బసవ. 4.34. పం. **కల్లసేయు (-చేయు)** రూ. కల్లచేయు. స.క్రి. మోసపుచ్చు. ద్వి. హరిశ్చ. పూ. 1953.

**కల్ల**[2] వి. తోట మొ. వాని వెలుగు, కట్టువ, ముళ్ళకంపనాటి ఏర్పాటు చేసినదడి. ఆం.భా. 2.12. ఉ.హరి. 4.308.

**కల్లగర్ద** వి. కంచెగా పెంచబడే ఒకరకం చెట్టు (Rhus-mysorensis). **కల్లచాలు** వి. ముళ్ళకంపతో వేసిన కంచె వరస. ముళ్ళకంచె.

**కల్ల**[3] వి. ఆముకాల్చడానికి ఉపయోగించే ఒక చెట్టు.

**కల్లం** రూ.చూ. కళ్ళము. వి. బట్టిదగ్గరున్న చదును చేసిననేల.

**కల్లంలోకొలుచుకపోవు** చూ. కళ్ళము. అ.క్రి. చేసిన ప్రయత్నం వృథాపోవు.

**కల్లంగడి** చూ. కల్లు[1].

**కల్లచ్చు** చూ. కల్లు[2].

**కల్లటిక** చూ. కల్లు[1].

**కల్లటేకు** రూ. కల్టేకు. వి. నీలగిరుల్లో పెరిగే ఒకచెట్టు (Dellenia bracteata).

**కల్లడి** విశే. పొంగే స్వభావం కల.

**కల్లము** వి. 1. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి, మల్లబంధ విశేషం. ప్రబంధ. 88. 2. రతిబంధ విశేషం. రాధికా. 6.137.

**కల్లరావి** వి. కొండరావిచెట్టు, తెల్లని కఱ్ఱకలిగిన ఒకరకం చెట్టు (Ficus Arnotliana).

**కల్లరీఁడు** చూ. కల్ల.

**కల్లరు** రూ.చూ. కల్లరుజు. వి. మత్స్యవిశేషం.

**కల్లరుజు** రూ. కల్లరు. వి. మత్స్యవిశేషం. హంస. 4.187.

**కల్లవెల్ల** వి. గజిబిజి.

**కల్లాం** రూ.చూ. కళ్లము. వి. బట్టీలదగ్గర చదును చేసిన నేల.

**కల్లాకపటములేని** చూ. కల్ల[1]. విశే. అమాయకమైన, నిర్మల మైన.

**కల్లాపు** రూ.చూ. కలయంపి. వి. పేడకలిపి చల్లిననీరు.

**కల్లాస** చూ. కల్లు[1].

**కల్లి**[1] రూ.చూ. కళ్లి. వి. నాగజెముడు లేదా నన్నజెముడు, ఒక కంచెమొక్క.

**కల్లి**[2] వి. 1. గ్రామదేవతల కొలుపులలో నిప్పులగుండం బదులు భక్తులు తొక్కడానికి పరిచిన మడిముళ్ళ పోగు; 2. కష్టమైనపని నెరవేర్చడం ; 3. అల్లరి.

**కల్లిచేష్టలు** వి.బ.వ. చిన్నపిల్లలు చేసేతెలివైన ముచ్చట చేష్టలు.

**కల్లి**[3] రూ.చూ. కలి. వి. రాతిబండల్లో ఉండేమట్టి, సున్నం కాల్చిన తర్వాత మిగిలిన రాయి.

**కల్లిసున్నం** వి. సున్నపురాతిని కాల్చి దబ్బాలకెత్తిన సున్నం.

**కల్లి**[4] అవ్య. పక్క, వెంట, వంక.

<-కు+వెల్లి.

**కల్లివకనేల** చూ. కల్లు[2].

**కల్లీ** రూ.చూ. కలి. వి. సున్నంకాల్చిన తర్వాత మిగిలినరాయి.

**కల్లు**[1] రూ. కలు[1]. వి. 1. మద్యం, సుర. కు.సం. 2.60. భార. విరా. 2.93 ; 2. ఒకవిధమైన మద్యం. రం.రా. అయో.

క. కళ్, కళ్ళు, కల్లు, కల్లు ; కొడ. కళ్ళి. మద్యం ; తు. కలి. తాటికల్లు ; త. కళ్, కల్లు, తేనె ; కళి. మత్తిలు, మత్తు, ఉత్సాహం, మదం; కళిప్పు. మత్తు ; మ. కళ్, కళ్ళు. కల్లు ; కో. కళ్. తాటికల్లు, సారా ; గోం. కల్ (కద్దా). పులబెట్టినమద్యం, కల్లు, బీరు, నీళ్లకలిపినసారా, ద్రాక్షసారా ; కువి. మఱ, కాయూ. కల్లు ; కాయూ . దేశీ సారా ; కాడు. కల్లు ; మారకాడు. సగ్గుబియ్యంసారా ;

కొలా. (కిన్). కల్. కల్లు ; నా. కల్.

నం. కల్యా. సారా. (మైకంకలగచేసేది.) ; ప్రా. కల్లా. సారా ; కల్లాల. సారా అమ్మేవాడు ; హిం. కల్ (వ)అర్, కలార్. సారా ; మరా. కడ్. మత్తిలు, కడంగ-. మైకంకలిగించేసారా.

<మూ.ద్రా. *కళ్.

**కల్లంగడి** వి. సారాకొట్టు. **కల్లటిక** వి. సురాభాండం, కల్లుకుండ. వేమన. 3.170. **కల్లాన** వి. కల్లుమీద ఆన. **కల్లుకడవ** రూ.చూ. కల్లుగడవ. వి. కొబ్బరికాయ. **కల్లుకద్ద** వి. కల్లు పోయడానికి, తాగడానికి వాడే చిన్నమట్టిపాత్ర. **కల్లుకుండ** వి. కల్లుతో ఉన్నకుండ. **కల్లుగడవ** రూ. కల్లుకడవ. వి. కొబ్బరికాయ. **కల్లుగలాసు** రూ. కల్లుగిలాసు. <కల్లు+ ఇం. glass. **కల్లుగిన్నె** వి. కల్లుతాగే గిన్నె. **కల్లుగిలాసు** రూ.చూ. కల్లుగలాసు. వి. కల్లుతాగే చిన్నమట్టిలోటా. <కల్లు+ఇం. glass. **కల్లుగీన** వి. కల్లుగీతలో ఈత చెట్టుకు కట్టే మట్టికడవ. **కల్లుగుబ్బ** రూ. కల్లుగొబ్బ. వి. అడుగున సన్నంగా పైన వెడల్పుగాఉండే చిన్నమట్టిపాత్ర. **కల్లుగురిగ** రూ. కల్లుగురిగి. వి. కల్లుతాగడానిక గ్లాసులాగ పొడుగ్గా ఉండే మట్టిపాత్ర. **కల్లుగురిగి** రూ.చూ. కల్లుగురిగ. వి. కల్లుతాగడానికి గ్లాసులాగ ఉండేమట్టిపాత్ర. **కల్లుగొబ్బ** రూ.చూ. కల్లుగుబ్బ. వి. అడుగున సన్నంగా పైన వెడల్పుగా ఉండేచిన్నమట్టిపాత్ర. **కల్లుతేట** వి. కల్లుపైన తేరినతేట. **కల్లుత్రాగుట** వి. సురాపానం. **కల్లువడి** వి. కల్లుకొలిచి పోయడానికి వాడేమట్టిపాత్ర. **కల్లుపాక** వి. కల్లుఅమ్మేపాక. **కల్లుపెంట** వి. కల్లుఅమ్మేచోటు. **కల్లుబింకి** వి. అడుగుపలకలాగ మూతి పొడుగ్గా బుంగగా ఉండి కడవకన్నచిన్నదిగా ఉండే మట్టిపాత్ర. **కల్లుబుంగ** వి. కల్లుగీసేచెట్టుకు కట్టే మట్టికడవ. **కల్లుబొప్పి** వి. కల్లు తాగడానికి వాడే చిన్నమట్టిపాత్ర. **కల్లుముంత** వి. కల్లు తాగడానికి లేదా కల్లుకొలవడానికి వాడే మట్టిపాత్ర. **కల్లురేగు** అ.క్రి. పశువులు మిక్కిలి కలతపడు. **కల్లులొట్టి** వి. కల్లు తీయడానికి తాటిచెట్టుపైభాగంలో గీతకింద కట్టడానికి మెడ పొడవుగా మూతి బుంగగా ఉండే మట్టి పాత్ర. **కల్లువర్దన** వి. కల్లువడ్డించడం. **కల్లువడ్డింపు** వి. కల్లువర్దన. **కల్లువెల్లి** వి. సురాసముద్రం. **కల్లుసంద్రము** వి. కల్లు సముద్రం. **కల్లూట** వి. అప్పుడప్పుడు ఆగివచ్చే ఊటబొట్లు. <కల్లు+ఊట.

**కల్లు**[2] రూ. కలు[3]. వి. ఔ. 1. రాయి. కు.సం. 2.60 ; 2. బండి చక్రం, బండికన్ను. భార. కర్ణ. 3.341.

క. కల్, కల్లు, కలు, కడల్, కల్, కబ్, కన్. రాయి, గట్టివస్తువు ; కొడ. కల్లి. రాయి ; తు. కల్లు. రాయి ; త. కల్ (కఱ్, కన్). రాయి, గులకరాయి, రత్నం, మైలురాయి ; కల్లన్. రాతిగుండె కలవాడు ; మ. కల్లు. రాయి ; కల్, కల్లు. రాయి, రత్నం; కల్ల. గాజుపూసలు ; కో. కల్. రాయి, మైలురాయి ; పర్జి. కెల్. రాయి ; గ. ఒల్లా. కండ్ (ఏ.వ.), కండు. రాయి. కండిల్ (బ.వ.). రాళ్ళు ; బ్రై. పెద్దగుండ్రాయి.

<మూ.ద్రా.*కల్.

**కల్లచ్చు** వి. ఒరగల్లు. బసవ. 4.127. **కల్లిసకనేల** వి. నల్లటి ఇసకనేల. **కల్లుగానుగ** రూ.చూ. కల్లుగాన్గు, రాతి గానుగ. **కల్లుగామఁగ** రూ.చూ. కల్లుగాన్గు. వి. రాతిగానుగ. **కల్లుగాన్గు** రూ. కల్లుగానుగ, కల్లుగానుఁగ. వి. రాతిగానుగ. సానంద. 3.57. **కల్లుజువ్వి** రూ.చూ. కలుజువ్వి. వి. ఈడలు, తెల్లనికర్ర కలిగిన ఒకచెట్టు (Ficus tomentosa). **కల్లుప్పు** వి. రాతిఉప్పు, సైంధవ లవణం. **కల్లురాయి** వి. వేయించిన చింతగింజల్ని చితగ్గొట్టే గుంకటి రాయి. **కల్లువడు(-పడు)**. అ.క్రి. స్తంభించు, చేష్టలుడుగు, రాపడు. మను. 5.19. **కల్లేఱు** (కల్లు+ ఏరు) వి. ఔ. 1. పట్టెనంలోని వీరభద్ర పర్వతపాద మూలంలో పారే ఒక ఏరు. కాశీ. 3.28 ; 2. సెలయేరు.

**కల్లు**[3] వి. కత్తి మొ. వాటి వాదరలో ఏర్పడిన చిన్నగండి.

**కల్లు**[4] వి. బండి కుండను పూటీని కలిపేకొయ్య.

**కల్లూట** చూ. కల్లు[1].

**కల్లె** వి. మొక్క.

**కల్లెం** వి. మరమగ్గం బొమ్మకు, నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర.

**కల్లెగూర (-కూర)** రూ. కలగూర. వి. 1. తోటకూరలా ఉండే ఒకరకం ఆకుకూర ; 2. పెక్కు దినుసులు కలిసిన కూర.

**కల్లెర** వి. 1. తరంగం, క్షీరం. మా. 1.132 ; 2. సురగ.

**కల్లెదు** రూ.చూ. కల్లేదు. వి.ఔ. ఒకానొక పిట్ట. సుద. 3.194.

**కల్లెత్తు** వి. అరికాలికి ముల్లు మొదలైనవి గుచ్చుకొని దుర్మాంసం పెరగడం.

క. కల్లొత్తు అరికాలిలో రాయి గుచ్చుకొని పెరిగిన దుర్మాంసం.

**కల్లెలుక** రూ.చూ. కల్లెల్క. వి. పొలంలో కలుగుల్లోఉండే ఎలక.

**కల్లెల్క** రూ. కల్లెలుక. వి. పొలంలో కలుగులో ఉండే ఎలక. మను. 4.25.

<కల్లు[2]+ఎల్క.

**కల్లేకు** రూ.చూ. కళ్ళేకు. వి. లేత తమలపాకు.

**కల్లేదు** రూ. కల్లెదు. వి. ఔ. ఒకానొక పిట్ట. మను. 4.58.

**కల్లేపు** రూ.చూ. కలయంపి. వి. పేడ కలిపిన నీళ్లు.

**కల్లేఱు** చూ. కల్లు[2].

**కల్లోలము** వి. అలజడి.

<సం. కల్లోల-. అల. (అర్థవిపరి.)

**కల్వ** రూ.చూ. కలువ[2]. వి. ఉత్పలం, కలువ. ఉ.రా. 2.124. **కల్వకంటి** రూ.చూ. కలువకంటి. వి. కలువలలాంటి కన్నులున్న ఆడది. నీల. 2.77. **కల్వరారాయి** వి. చంద్రకాంత శిల. అచ్చ. రా. బాల. 214. **కల్వతేకు** రూ.చూ. కలువతేకు. వి. 1. కలవరేకు. వేంక. ఆం. 2.75 ; 2. పిదుల మీది నక్షత్రం. **కల్వలదొరదారి** వి. 1. పార్వతి, గౌరి ; 2. శివుడు. **కల్వలయనుఁగు** రూ.చూ. కలువల యనుంగు. వి. చంద్రుడు. అచ్చ.రా.బాల. 98. **కల్వలసామి** వి. చంద్రుడు. ముకుంద. 2.183.

**కల్వడగ** రూ.చూ. కలివడగ. వి. ఉత్సవసమయంలో ఎత్తే ధ్వజం, జెండా. కు.సం. 12.205.

**కల్వడము**[1] రూ.చూ. కలివడగ. వి. ఉత్సవాల్లో ధ్వజస్తంభా

లకు వేలాడగట్టే కలవపూదండ, ప్రాలంబమాలిక.
కల్వరము[2] రూ.చూ. కలువరము[2]. వి. వితానం, మేలుకట్టు.
కల్వపువ్వంచు వి. కలవపువ్వు ఆకారంలో డిజైనుపడేట్టు నేసిన అంచు.
<కల్వ+పువ్వు+అంచు.
కల్వము రూ. కలువము. వి. మందునూరే రాయి. నవనాథ. 5.200.
కల్వరం రూ.చూ. కలవారి. వి. కొడవలి.
కల్వరించుకొను చూ. కలవరము.
కల్వారి రూ.చూ. కలవారి. వి. కొడవలి.
కల్వారు[1] రూ.చూ. కలవారి. వి. గడ్డికోయటానికి, పైరు కలుపు తియ్యటానికి పనికివచ్చే కొడవలి.
కల్వారు[2] చూ. కల[2].
కల్వె రూ.చూ. కలివె[1]. వి. కరమర్దం, ఓక. సారంగ. 2.79. పు. 20 పం.
కల్హారము రూ. కలహారము, కలుహారము. వి. కహ్లారం, సౌగంధికం. ఎరుపు తెలుపు కల్గిన సుగంధభరితమైన కలువపువ్వు.
నం. కహ్లార-. సౌగంధికం ; ప్రా. కల్హార-.
<ప్రా. కల్హార-.
కళ వి. 1. మూర్ఛ. కువ.చ. 2.139 ; 2. మూర్ఛన ; 3. ఉపశాఖ, రెమ్మ.
క. కల. మూర్ఛన, మధురమైనస్వరం.
కళపట్టు రూ. కళపట్టు. అ.క్రి. మూర్ఛనొందు, సొమ్మసిల్లు. దశా. 10.160. కళబుట్టు(-పుట్టు) అ.క్రి. మూర్ఛనొందు. కళవట్టు(-వట్టు) రూ.చూ. కళపట్టు. అ.క్రి. కళపట్టు. కళవాఱు(-పాఱు) స.క్రి. ఆశపడు. విప్ర. 4.16.
కళకళలాడు అ.క్రి. 1. సుందరంగాఉండు ; 2. సంతోషంగా ఉండు.
క. కళ్, కఱ్. కాంతిగా ; కళకళిసు. మెరయు, కాంతివంతంగాఉండు.
కళంకు రూ.చూ. కలంక. వి. మచ్చ.
కళంగిడి రూ.చూ. కళంగిరి. వి. పుచ్చకాయ.
కళంగిరి రూ. కళంగిడి. వి. పుచ్చకాయ. (Eucumis Colocynthis).
కళది రూ.చూ, కలది. వి. కందురుచెట్టు, గుండ్రని ఆకులు ఎక్కువ కొమ్మలు కలిగి తినడానికి పనికివచ్చే పచ్చని పళ్ళు కాసే చెట్టు (Grewia Pupilifolia).
కళపెళ రూ. కళిపెళ. వి. 1. అరిచినప్పుడయ్యే శబ్దానుకరణం. అష్ట. మ.క. 2.70. పు. 20 పం. ; 2. ఉడుకుతున్నపుడయ్యే శబ్దానుకరణం. సీలా. 3.34.
క. కళ్. అన్నం ఉడుకుతున్నపుడయ్యే శబ్దానికి అనుకరణం, జనసందోహం చేసే శబ్దం. కలకలసినగు. గట్టిగానవ్వు ; గలగల, గళగళ్. కటుక్కుమనే శబ్దం, గడగడధ్వని ; కలకల. శబ్దం, పక్షుల కలకలం ; తు. కలకల. కలకల శబ్దం, గలగల. కంకణాలధ్వని; త. కలకల. (-ప్పు-త్తు) గలగల ధ్వనియగు ; కళకళప్పు, కళకళమ్. రణగొణధ్వని ; కొ. గలగల. కలకలశబ్దం ; మాల్తో. క్వల్. క్వ్ఞలే ; నీళ్లకదలిక, గవ్వలనవ్వడి.

నం. కల. అస్పష్టధ్వని, మధురధ్వని ; కలకల-. అవ్యక్తధ్వని.
కళపొయ్యి వి. ఒకపొయ్యికి కట్టెలుపెట్టి మంటవేస్తే పక్కనున్న రెండో పొయ్యికికూడా మంట వ్యాపించడానికి వీలుగా చేసినట్టి జాయింటు పొయ్యి.
కళవరము వి. మల్లబంధ విశేషం. ఉ. హరి. 3.69.
కళవళపడు చూ. కళవళము.
కళవళపాటు చూ. కళవళము.
కళవళమగు చూ. కళవళము.
కళవళము రూ. కలవరము, కలవలము. వి. 1 నిద్ర, మోహం, మొ. వాటివల్ల కలిగే కలవరింత. శృం. నై. 3.96 ; 2. సంభ్రమం, తొందర, తొట్రుపాటు. కాశీ. 5.66 ; 3. వ్యాకులత్వం, క్షోభం. శుక. 3.375.
క. కళవళ్. కలవరపాటును సూచించే శబ్దం ; కళవలికె. కలవరం. నిస్పృహ; కళవళిసు. కలవరపడు; తు. కళవళ్. చింత, దుఃఖం; త. కలవలమ్. మానసిక సంక్షోభం, కలవరం ; కలవరి. క్షోభించు.
కళవళపడు స.క్రి. 1. సంభ్రమించు. భాగ. 4.339 ; 2. కలతపడు. జైమినీ. భా. 4.151. కళవళపాటు వి. 1. తొట్రుపాటు. సీలా. 3.14 ; 2. కలత. కళవళమగు అ.క్రి. క్షోభించు, కళవళపడు. నృసింహ. 4.139. కళవళించు రూ. కదవడించు. అ.క్రి. 1. కలతపడు. భార. విరా. 2.31 ; 2. తొట్రుపడు. ఉ. హరి. 5.270 ; 3. చలించు. ఉ.హరి. 5.276 ; 4. విరహవ్యధపొందు. శృం.నై. 2.116 ; 5. కలవరపడి అరచు. కాశీ. 4.12.
క. కళవళిసు. దుఃఖించు, తొట్రుపడు.
కళవళిక వి. పోలిక.
కళవళించు చూ. కళవళము.
కళవసము రూ.చూ. కదవసము. వి. ధరించటానికుపయోగించే తోలు. కువ.చ. 2.35.
కళదిబ్బి వి. నగభాగం వరకు రంధ్రాలుండి గంజివార్పుకు వాడే రెండంచులతో ఉండే మట్టి మూకుడు.
కళాచిక వి. తమ్మపడిగం. ఆం.భా. 2.168.
నం. కలాచికా. ప్రకోష్ఠం, ముంజేయి మొదలు మోచేతి వరకు ఉండే ప్రదేశం.
<నం. కలాచికా. (అర్థవిపరి.).
కళాచికలు వి.బ.వ. నాట్యభంగిములు.
కళాంజి రూ.చూ. కాళంజి. వి. తమ్మపడిగం, తమ్మ ఊసే పాత్ర. అహల్యా. 5.19.
కళాయి రూ. కలాయి, కళాయా. వి. 1. ఇత్తడి పాత్రలు మొ. పూసే తగరం పూత ; 2. అద్దానికి వెనకపూసే పూత ; 3. కళాయిగల గంగాళం ; 4. పిండి కలపడానికి వాడే కంచంలాగ ఉండే అంచున్న మూకుడు.
క. కలయి. తగరపుపూత ; మ. కలాయి. తగరపు పూత.
కళాయిపెనము వి. బాండీ మాదిరి లోతుగా ఉండి పట్టుకోడానికి వీలుగా చెవులుగల మట్టి పాత్ర.
కళాయా రూ.చూ. కళాయి. వి. పాత్రలకు తగరం పూయడం

చిలుము పట్టకుండా ఉండటానికి పాత్రలకు పూసే తగరపు పూత.

**కళావతు** వి. బట్ట అంచులకుగాని కమ్ములకుగాని, డిజైన్ల కోసంగాని వాడే సన్నటి మెరపు దారం.

**కళావంతులఇనాం** చూ. కళావంతులు.

**కళావంతులు** రూ. కలావంతులు. వి.బ.వ. వేశ్యలు.

**కళావంతులఇనాం** వి. దేవదాసీలకు వారి సేవకు పారితోషికంగా జమిందారులు, నవాబులు మొ. వారు ఇచ్చిన భూమి.

**కళావరంచు** చూ. కళావరు.

**కళావరిఅంచు** చూ. కళావరు.

**కళావరు** రూ. కలావరు. వి. 1. పేకముక్కల్లో ఒకదాని పేరు ; 2. కళావరు చుక్క మాదిరిగా నేసిన డిజైను.

<డచ్చి. క్లొవర్. ఒకరకం పేకముక్క పేరు.

**కళావరంచు** రూ. కలవారంచు, కలావరుఅంచు. **కళావరిఅంచు** కిలావరంచు. వి. కళావరుచుక్క ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. **కళావరిఅంచు** రూ.చూ. కళావరంచు. వి. కళావరుచుక్క మాదిరిగా నేసిన డిజైను.

**కళాశీ** రూ.చూ. కలాసి. వి. కూలీ, పడవ మీది పనివాడు.

**కళాసగందపొడి** వి. సున్నం మొ. లేపన ద్రవ్య విశేషం.

**కళాసము** రూ.చూ. కదపనము. వి. ధరించడానికుపయోగించే తోలు. శృం.నై. 6.115.

**కళాసి**[1] వి. నాట్యవిశేషం. శ్రీరం.మా. 4.162.

**కళాసిక** మా. కలాసిక. వి. 1. తాండవాదులచివర చేసే నృత్యవిశేషం. శృం.నై. 8.187 ; 2. ముగింపు. పాండు. 4.37. **కళాసించు** అ.క్రి. 1. కళాసిక చేయు. కాశీ. 3.23 ; 2. అలయు. విక్ర. 5.61.

**కళాసి**[2] రూ.చూ. కలాసి. వి. ఓడలో పని చేసే వాడు.

**కళాసువాఁడు** చూ. కళాసి[2]. వి. ఓడలో పనిచేసేవాడు.

**కళి** వి. సంకటి.

<త. కళి. సంకటి.

**కళికతీగ** వి. బండిమురుదుడుతీగ (Ealycopteris floribunda).

**కళింగ** చూ. కలింగలు. వి. చెరువులో ఎక్కువగా ఉన్న నీరు పొర్లి పోవటానికి పల్లంగా ఉన్న చివర కట్టిన రాతి కట్టడం.

**కళింగళం** చూ. కలింగలు. వి. ఆనకట్ట, అడ్డకట్టు.

**కళిపెళ** రూ.చూ. కళపెళ. వి. బాగా కాగటం యొక్క అనుకరణం.

**కళిపారన** వి. కొండ జువ్వి చెట్టు. ఇతర చెట్ల మీద పెరిగి ఆ చెట్లను చంపివేసే ఒక చెట్టు. (Ficus gibbosa).

**కళుకు**[1] రూ. కళుక్కు[1]. విశ. ప్రకాశవంతమైన. వసు. 5.113. వి. 1. కాంతి. ఘటికా. 1.1 ; 2. పొడి. కళా. 1.10 ; 3. కిరణం ఆం.భా. 1.82.

క. కలె, కళకళె. కాంతి, కిరణం, అందం, గుర్తు.

**కళుకు**[2] రూ. కళుక్కు[2]. వి. పక్షి భేదం. ఆం.భా. 2.98.

**కళుపుకల్ల** వి. ఆము కాల్చుకు వాడే ఒకరకం ముళ్లకంప.

**కళేబరము** వి. 1. శవం ; 2. శరీరం.

సం. కళేబరం-. శరీరం. (అర్థ వివరి.).

**కళుక్కు**[1] రూ.చూ. కళుకు[1]. విశ. ప్రకాశవంతమైన. వి. 1. కాంతి ; 2. కిరణం ; 3. పొడి.

**కళుక్కు**[2] రూ.చూ. కళుకు[2]. వి. పక్షి భేదం. ఆం.భా. 2.98.

**కళ్టి** వి. ఎలుగుబంటి.

**కళ్యము** రూ.చూ. కళ్లియము. వి. కళ్లెం. భార.అరణ్య. 1.95.

**కళ్లము** రూ. కల్లం, కల్లాం. వి. 1. ధాన్యం నూర్చే చోటు. ఆము. 4.13 ; 2. బట్టీ దగ్గర ఉన్న చదును చేసిన నేల.

**కళ్ళంచెయ్యడం** వి. 1. వడ్లు మొ. ధాన్యాల్ని నూర్చడానికి అనువుగా నేలను తయారుచేయటం ; 2. వెదజల్లడం, అపరిశుభ్రంగా ఉంచడం. **కళ్ళంపూజ** వి. కళ్లంలో కంకి కుప్పకు చేసే పూజ.

**కళ్లాలు** స్త్రీ ప్రత్యయం. (ఇది సమాసాంతాల్లోనే ఉంటుంది) ఆలు వంటిది. వేంక. పంచ. 4.412.

< - కళ్ + మూ.ద్రా. *ఆళ్.

**కళ్లి** రూ. కల్లి[1]. వి. జెముడు. చంపూ.రా. 7.33.

**కళ్లియము** రూ. కళ్యము, కళ్లెము, కళ్ళాము, కళ్ళెము. వి. కళ్ళెం. కవిక. 2.72.

సం. ఖలీన-, ఖలీన-. కళ్లెం ; ప్రా. ఖలిణ, ఖలీణ. అ.మా. ఖలిణం.

క. కడియాఁణ, కడివాణ, కడ్డియన-. కళ్లెం ; కొడ. కడ్‌వళమ్. కళ్లాలు ; తు. కడివాణ ; త. కటివాళమ్. గుర్రం కళ్లెం ; మ. కట్వాలమ్. ముక్క ; తొ. కడణమ్. (కడాంట్) కళ్లెం.

<ప్రా. ఖలిణ -.

**కళ్లె** రూ. కళ్ళ, కళ్ళియ, గళ్ల, గళ్లె. వి. శైత్యం వల్ల చిక్కబడిన ఉమ్మి. అచ్చ.రా.కిష్కిం. 66.

**కళ్లెము** రూ.చూ. కళ్లియము. వి. ఖలీనం. దశా. 2.66.

**కళ్ళ** రూ.చూ. కళ్లె. వి. శైత్యం వల్ల చిక్కబడిన ఉమ్మి. నృసింహ. 2.69.

**కళ్ళంచెయ్యడం** చూ. కళ్లము.

**కళ్ళంపూజ** చూ. కళ్లము.

**కళ్ళాపి** రూ.చూ. కలయంపి. వి. పేడ కలిపిన నీళ్ళు.

**కళ్ళాపు** రూ.చూ. కలయంపి. వి. పేడ కలిపిన నీళ్ళు.

**కళ్ళాము** రూ.చూ. కళ్లియము. వి. కళ్లెం.

**కళ్ళి** వి. రాశి, పోగు.

**కళ్ళికోటపెంకు** వి. యంత్రంలో తయారు చేసిన పెంకు, బరువుగా మందంగా ఉంటుంది.

**కళ్ళియ** రూ.చూ. కళ్లె. వి. శైత్యం వల్ల చిక్కబడిన ఉమ్మి.

**కళ్ళీ** వి. లాల్చి, కాలరులేని వదులైన జుబ్బా.

**కళ్ళె** వి. రంగుపూత.

**కళ్ళెవ** రూ.చూ. కలయంపి.ఉదయంపూట వాకిట్లో జల్లే పేడ నీళ్ళు.

**కళ్ళెపువ్వు** వి. కలువపువ్వు.

<కల్వ పువ్వు <కలువ పువ్వు.

**కళ్ళెము** రూ.చూ. కళ్లియము.

**కళ్ళేకు** రూ. కల్లేకు. వి. లేత తమలపాకు.

**కళ్ళేవ** రూ.చూ. కలయంపి. వి. ఉదయం పూట వాకిట్లో జల్లే పేడ నీళ్ళు.

కవ వి. 1. శిశుద్వయం. కు. సం. 8.12 ; 2. యుగళం, జోడు. హర. 3.4 ; 3. పన్నెండంటెలకు బిగించినవల్ల మధ్య వెలితి, రెండు పడుగు పోగులు పట్టేవెలితి. విజ. రెండు. భార. విరా. 5.45.



క. కవల్-. యుగళం, జత ; తు. కబ. వేళ్ళమధ్య ప్రదేశం ; త. కవలై. అనేకదారులు కలిసిన చోటు ; మ. కవ, యుగళం. రెండుకొమ్మలకలయిక, శృంగాటం, కాళ్ళ మధ్య ఖాళీస్థలం; కవల. రెండు మార్గాలు కలసిన ప్రదేశం.

కవకట్టె రూ. కవరకట్టె. వి. రాగోల, ముళ్ళకంపలు ఎత్తటానికి ఉపయోగించే పంగల కర్ర. కవగూడు (-గూడు) అ.క్రి. 1. జతగాకలియు. ఇందు. 3.56 ; 2. రతికి కూడు. కవగూర్చు (-గూర్చు) స.క్రి. జతచేయు. శ్రీ రాధా. 3.147. కవగొను (-కొను) స. క్రి. జతగూడు, కలియు. హంస. 5.308 ; కవజాడి వి. నేతలో రెండు పోగులు తెగినప్పుడు వచ్చిన వెలితి. కవదివియకోలలు వి.బ.వ. జంట దివిటీలు. కవపడు అ.క్రి. నేతనేసేటప్పుడు రెండుపోగులు తెగి వెలిత ఏర్పడు. కవపాయు రూ.చూ. కవవాయు. అ క్రి. జత విడుచు, వియోగంపొందు. కవపిట్ట వి. చక్రవాకం. సురంతా. 2.151. కవపులుఁగు. రూ.కవపుల్గు వి. జక్కవ, చక్రవాక పక్షి. వేంక. ఆం. 1.13. కవపుల్గు రూ.చూ. కవపులుఁగు. వి. జక్కవ. కవపుల్గుదాయ వి. చందురుడు. వేంక. ఆం. 1.13. కవలకాయ వి. అమడకాయ, జంటకాయ. కవలపిల్లలు వి.బ.వ. ఒకతల్లికి ఇంచుమించుగా ఒకే సమయంలో జన్మించిన శిశుద్వయం. కవలవారు వి.బ.వ. 1. నకులసహదేవులు. భార. ఆది. 5.133 ; 2. కుశలవులు ; 3. యమళ శిశువులు. కవలు[1] రూ. కవల, కవలి, వి.బ.వ. 1. కవల పిల్లలు. భార. ఆది. 8.213 ; 2. జంట. కవవాయు (-పాయు). రూ. కవపాయు. అ.క్రి. జతవిడుచు, వియోగం పొందు. కు.సం. 2.221. కవవేల్పులు వి.బ.వ. అశ్వినీ దేవతలు. కవసందు రూ. కవ్వసందు. వి. నేతలో రెండు పోగులు తెగినప్పుడువచ్చిన వెలితి.

కవకవ వి. 1. సవ్వడంలో ధ్వనికి అనుకరణం. ఉ.హరి. 1.80; 2. పక్షులకూతకు ధ్వన్యనుకరణం. ద్వి. నల. 3.969.

క. కవకవ-. కోపంతో మాట్లాడేటప్పుడు వచ్చేధ్వనికి అనుకరణశబ్దం. కవకవనవ్వు అ.క్రి. హేళనగానవ్వు.

కవకిప వి. పావురాలధ్వనికి అనుకరణం. శుక. 1.133.

క. కవకవ. కోపంతోమాట్లడేటప్పుడు అయ్యేఅనుకరణం.

కవట[1] వి. 1. చిగుళ్ళతో ఉన్న లేతకొమ్మ. పండి. చ. 5.236. పు. ; 2. స్కంధశాఖ, పెద్దకొమ్మ. భార. విరా. 1.162 ; 3. లేత తమలపాకు. విజ. లేత.

మ. కవ. పంగలాగఉన్న కొమ్మలజత.

కవటాకు వి. 1. లేతాకు ; 2. లేత తమలపాకు.

కవట[2] వి. పశురోగ విశేషం నవనాథ. 1.41. పు. 4 పం.

కవట[3] వి. ఇటుక ఆములో రాళ్ళు బాగాకాలకపోవడం.

కవటాకు చూ. కవట[1].

కవడి వి. రొమ్ము, అక్కు, వక్షఃస్థలం.

కవడువాయు (-పాయు) అ.క్రి. బాధానివర్తియగు. తాళ్ల. సం. 8.64.

కవడె వి. వాద్యవిశేషం. ఆం.భా. 1.128.

క. కవచ. ఢంకా.

కవణ వి. 1. కుత్సితుడు ; 2. పేదవాడు.

<సం. కృపణ-. కుత్సితుడు.

కవణకాఁడు వి. మల్లవిద్యావేత్త, జెట్టి. మల్ల. 1.13. ఆం. భా. 2.208.

సం. గమన-. నడక ; ప్రా. గమణ. గతి, గమనం.

<ప్రా. గమణ+-కాఁడు.

కవణము[1] రూ. కవళము. వి. ఉడకబెట్టిన ఉలవలు, దాణా. భార.ఉద్యో. 1.93 ; 2. ఆహారం. అచ్చ.రా. యు. 2.93.

సం. కబళ-. కవలం. ప్రా. కబల-. కవల. శౌ. కవల. అ. మా. కవల. మా. కవల. పాళి. కబల.

క. కవణ, కవల, కవళ ; తు. కబళె. కవలె. గవల. త. కవళం ; మ. కవళం, కవిళె.

< ప్రా. కవల-.

కవణము[2] వి. చికిత్సార్థం కళ్ళకికట్టినకట్టు. బసవ. 6.480.

కవతము వి. 1. పచ్చిక ; 2. ఎండుగడ్డి.

కవను వి. గడ్డి. పచ్చిక. ఆం.భా. 2.76.

త. కవత్తై. గడ్డి.

కవము వి. క్రమం, వరస, పద్ధతి.

సం. క్రమ ; ప్రా. కమ-. యుక్తమగు, పరంపర, అనుక్రమం : అ. మా. కమ-. మర్యాద, నియతి.

క. కవ.



< ప్రా. కమ-.

కవయు స. క్రి. కూడు. రమించు. భార. ఆది. 4.44.

త. కవై. కలుసుకొను, కౌగలించుకొను, కవవు-. కలుసుకొను, కౌగలించుకొనటం, సంభోగం. కవర్. కలిసికొను, కౌగలించుకొను.



కవర[1] రూ.చూ. గవర. వి. బలిజకులం.

కవర[2] చూ. కవరు[2]. వి. కొత్తరంగు గుడ్డనీళ్ళలో పెట్టినపుడు కొద్దిగా రంగు తరగడం, బట్టరంగు తగ్గడం.

కవరకట్టె రూ.చూ. కవకట్టె. వి. రాగోల, ముళ్ళకంపలు ఎత్తడానికి ఉపయోగించే పంగల కర్ర.

కవరగుజ్జు రూ.చూ. కొమరగుజ్జు. వి. వెనుగాడిని మోసేపెద్ద గుజ్జు.



కవరబారు అ.క్రి. పురిగొల్పకుండానే ఒకరిపైకిపోవు.

కవరు[1] వి. 1. ఏతపుకొమిరెకు చెక్కిన పంగలకొన ; 2. కర్రలకు చివర సహజంగా ఏర్పడే పాయ.

కవరుగుజ్జు రూ.చూ. కొమరగుజ్జు. వి. వెనుగాడిని మోసే పెద్ద గుజ్జు.

కవరు[2] రూ.చూ. కమర్. వి. రాతికుంచాల మీద అర్ధచంద్రాకారపునొట్టలాగ మలచిన గుంట.

కవరు[3] వి. ఒకరకం అడవిజాతి ఎద్దు.

కవరు[4] వి. 1. రాసినజాబును ఉంచే కాగితపుసంచి ; 2. పైకప్పు ; 3. పుస్తకం అట్ట ; 4. సైకిలు టైరుకేసు ; 5. తలదాచుకొనేకావు.

ఇం. *Cover*. పైకప్పు.

< ఇం. Cover.

**కవళలు** వి.బ.వ. పాచికలు. ఆము. 1.59.

**కవల** రూ.చూ. కవలు[1]. వి. జంట, జత.

**కవలి** రూ.చూ. కవలు[1]. వి. జతి.

**కవలు**[2] వి.బ.వ. వేదాదులపఠనంలో కొంతసామ్యంచే ఒకటి విడిచి మరిఒకటి కలిసే భాగాలు. కళా. 4.41.

కవలుకొను అ.క్రి. 1. కవలుపోవు, వేదాదిపఠనంలో ఒకటి విడచి వేరొకటి వచ్చికలియు. వి.క్ర. 4.50. కవలుపోవు (-పోవు) అ.క్రి. వేదాది పఠనంలో కొంతసామ్యంచే ఒకటి విడవబడి మరొకటి వచ్చికలియు. పాండు. 2.19.

**కవల్య** వి. తమలపాకులమోద.

**కవల్లు** వి. చమురులో ఊరబెట్టిన తెల్లచేప.

క. స్వాదిబలంజిల్ ; త. చూదహ ; మ. చూడహ. నెలూరి.

**కవళము** రూ.చూ. కవణము[1]. వి. 1. యాచించి పెట్టించుకొనే కూటిముద్ద ; 2. అన్నంముద్ద, కబళం.

**కవళికలు** రూ. కవిళికలు. వి.బ.వ. మార్పులు, పోలికలు.

**కవాడము** వి. ఎద్దులు మోసే (గడ్డి. ధాన్యం మున్నగువాని) బరువు, గడ్డిచొప్ప.

క. కవాడ, కబాడ. ఎద్దులు లేక గుర్రాలు మోసే (గడ్డి, కట్టెలు మొ.) బరువు.

హిం. కబాడ్. బరువు, గుర్రం లాగే బరువు ; మరా. కబాడ్. బరువు, సామాను.

< క. కవాడ.

**కవాడి** వి. ఇటికలతుప్ప.

**కవాతు** వి. దండువారు చేసే సాధనం, కసరతు. (డ్రిల్లు).

హిం. కవాయిద్. యుద్ధనియమాల్లో ఒకటి ; మరా. కవాయిత్. సైన్యం చేసే కసరత్తు, సేనావిన్యాసం ; ఉ. కావాయిత్. సైన్యవిన్యాసం.

క. కవాతు, కవాయిత, కవాయితు. సేనావిన్యాసం ; మ. కవాయత్. కసరత్తు, సైన్యంచేసే కసరత్తు.

< ఉ. కవాయిద్.

**కవాలగడ్డి** రూ.చూ. కవ్వాలగడ్డి. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క, పశువుల మేతకు ప్రశస్తమైనది.

**కవి** వి. 1. పెట్టు, మొగి.కు.సం. 12.101 ; 2. సంభోగం ; క్రి.విశే.క్రియ. ఒకేసారిగా, పూర్తిగా.

కవిగొను(-కొను) అ.క్రి. 1. కవియు, వ్యాపించు. కవిక. 4.30 ; 2. ఢీకొను, కవిచేయు అ.క్రి. 1. సహగమనంచేయు. జైమినీ. భా. 5.109 ; 2. వ్యాపించు ; 3. దృష్టిపడు ; 4. రచించు. కవించు రూ.చూ. కవియించు. స.క్రి. 1. పురికొల్పు భాగ. 9.102 ; 2. మటిల్లజేయు, కలిగించు. శృం.నై. 3.10 ; 3. పరపు, ప్రయోగించు ; 4. పడవైచు. కవిదల(-తల) వి. కలియటం, తాకటం, ఢీకొనటం, చెలరేగటం. కు.సం. 2.69. కవింపు రూ. కవ్వింపు. వి. రెచ్చగొట్టటం.

**కవికిపోవు** అ.క్రి. కాయలు మొ. కిందపడటంచేత దెబ్బతిని కుళ్ళిపోవు.

**కవిటి** చూ. కమిద. వి. పాత్రలను సర్దేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేక గోతాంపట్ట.

**కవిడి**[1] వి. లేతమట్ట.

**కవిడి**[2] వి. చర్మవాద్య విశేషం.

**కవితికట్ట** రూ.చూ. కమిదికట్ట. వి. సర్దేటప్పుడు పాత్రలు నొక్కుపడకుండా ఉంచటానికి ఒత్తుపెట్టుకున్న దిండు.

**కవితికొట్టు** రూ. కవుదికొట్టు. స.క్రి. ఆముకు అగ్గిపెట్టడానికి ముందు పొయ్యిల ముందు నిప్పు రాజేసి చేటతోగాని తడికతోగాని విసురు.

**కవితిగుడ్డ** వి. సర్దేటప్పుడు మట్టిపాత్రలకింద ఒత్తుమడతవేసి పెట్టిన బట్ట.

**కవితిమెత్త** రూ.చూ. కమిదిమెత్త. వి. సర్దేటప్పుడు పాత్రల కింద పెట్టుకొనే దిండు.

**కవితిసాప** రూ.చూ. కమిదిసాప. వి. పాత్రలను సర్దేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి పరుచుకునే చాప.

**కవిదిచేయు** రూ.చూ. కమితిచేయు. స.క్రి. ఆము పొయ్యి రాజేసి మంట వ్యాపించడానికి విసురు.

**కవిదిమెత్త** రూ.చూ. కమిదిమెత్త. వి. సర్దేటప్పుడు పాత్రల కింద పెట్టుకొనే మెత్తని దిండు.

**కవిబికిమొద్దు** వి. ఆములో మొదట కాక పెట్టడానికి వాడే ఒక రకం కర్ర తుండు.

**కవియించు** చూ. కవియు.

**కవియు** రూ. కమియు[1]. అ.క్రి. 1. పర్వు, వ్యాపించు. భార.ఆది. 2.132 ; 2. పైపడు, పైకొను, పడు. కు.సం. 2.200. 12.102, భార. భీష్మ. 2.371 ; 3. కప్పు, ఆచ్ఛాదించు, కు.సం. 6.100 ; 4. ఎదుర్కొను, మార్కొను. భార. భీష్మ. 2.250 ; 5. కలుగు, సంభవించు. కాశీ. 7.139 ; 6. పొదువకమ్ము. ఆం.భా. 3.117 ; 7. చేరు, సమీపించు. ఆం.భా. 3.124.

క. కవి. మీదకు వచ్చు, పైబడు, ఎదుర్కొను, పొదువు, వ్యాపించు; కవర్. బలవంతంగా తీసికొను, పైబడు, పట్టుకొను, దాచుకొను, గవి, గవు ; తు. కబియుని. అతిగా వ్యాపించు, చుట్టుకొను ; త. కవి. మూయు, కవిప్పు. మేలుకొట్టు, బలవంతంగా పెట్టుకొను, గ్రహించు; కవర్. బలవంతంగా పట్టుకొను, దోచుకొను, వశం చేసుకొను ; మ. కవియుక. పొర్లిపోవు, మించు, అధిగమించు; కమియుక. అతిగా వ్యాపించు, అధిగమించు ; కో. కవ్. పూర్తి చేయు, బట్టతో కప్పుకొను. కవచ. కవచంలాంటి రవికె.

< మూ.ద్రా. *కవ్. వ్-.

కవియించు రూ. కవించు, కవ్వించు. స.క్రి. 1. పరపు, ప్రయోగించు. భార. ఉద్యో. 5.342 ; 2. పడవైచు. రం. రా. కిష్కిం. 237 వ. 12 పం ; 3. పురికొల్పు. ద్వి. హరిశ్చ. ఉ. 2.708. పం. 4. మటిల్లజేయు, కలిగించు. కవియుదెంచు (-తెంచు). అ.క్రి. 1. కవించు. భార. విరా. 5.192 ; 2. కూడవచ్చు, కలసివచ్చు. భార. ఉద్యో. 5.192 ; 3. పర్వు, వ్యాపించు, భార. భీష్మ. 1.300 ; 4. విజృంభించు. భార. ఆరణ్య. 3.97 ; 5. పైకొనవచ్చు; మార్కొనటానికి వచ్చు. హరి. పూ. 7.85 ; 6. దృష్టి పరపు, కన్నువేయు.

**కవిరి**[1] వి. 1. పోకచెక్కలు కాపగా అడుగుకు దిగిన పదార్థం

ఖాదిరం, కాచిన పోకచెక్కల సారం.

నం. ఖాదిర-, ఖదిర-. వృక్షజాతి, పోకచెట్టు ; ప్రా. ఖయర-, ఖయిర-. ఖదిర వృక్ష సంబంధి ; అప. ఖయర-.

<ప్రా. ఖయిర-.

కవిరియుండ వి. పీడియంతో సేవించడానికి చేసిన కావి ఉండ, ఖాదిరముటిక.

కవిరి² వి. అటవకింది రాట.

కవిల¹ రూ. కయిల, గవిల, గవిలా, గవిలె. విఐ. కపిలవర్ణం గల.భార. ఆది. 4.253.

నం. కపిల-; ప్రా. కవిల-. వర్ణవిశేషం; అ. మా. కవిల; పా. కపిల-. హిం. కపిల్. గోధుమరంగు, ఆవు రంగు లాంటి తెల్లని రంగు.

క. కవలె, కవిలె. గోధుమరంగు ఆవు. కపిల్, కవిల, కవిలు-. గోధుమరంగు.

<ప్రా. కవిల-.

కవిలమొదవు వి. కపిలగోవు, పుల్లావు. భార. అను. 3.19.

కవిల² రూ.చూ. కవిలియ. వి. 1. కట్ట ; 2. తాటాకుల లెక్కల పుస్తకం, లెక్కల పుస్తకం.

కవిలతూము రూ. కవిలెతూము. వి. మారెళ్ళ (దర్శి. పొదిలి) సీమలో వాడుకలో ఉన్న పెద్ద కొలత తూము, ముప్పైరెండు మానికల పరిమాణం. కవిలసంచి వి. బంగారం వర్తకుడు మచ్చు ముక్కలు, ఒరపిడిరాయి మొదలైనవి వేసుకొనే సంచి. వరాహ. 4.138.

కవిల³ వి. మోట.

కవిలగుట్ట వి. కవిలతో నీళ్ళు తోడటానికి వీలుగా బావికి అమర్చిన గుట్ట.

కవిలి¹ వి. మరమేకులను బిగించడానికి పనికివచ్చే సాధనం.

కవిలి² వి. ముక్కోణం ఆకారంలో కొయ్యతోనో ఇనప బద్దల తోనో నిర్మించిన చట్రం.

కవిలిగడ్డ వి. 1. ఘట్టించిన నీలపటపు లెక్కల పుస్తకం, కడితం. భోజ. 3.55 ; 2. తాటాకుల లెక్క పుస్తకం ; 3. ధనాదాయ వ్యయాదుల దినసరి లెక్కలు రాసే పుస్తకం ; 4. ప్రాంతీయ చరిత్ర ; 5. అయిదరిటాకుల కట్ట.

నం. కపిలిత-. కపిలవర్ణం గలదిగా చేయబడ్డ ; ప్రా. కవిలిఅ. గోధుమరంగుపూత పూయబడిన.

క. కవళిగె, కవళిక. తమలపాకుల లేక అరిటాకుల కట్ట, రాసిన తాళపత్రాల కట్ట.

<ప్రా. కవిలిఅ+కట్ట.

కవిలియ రూ. కవిల², కవిలె. వి. 1. కట్ట; 2. తాటాకుల లెక్కల పుస్తకం, లెక్కల పుస్తకం.

కవిలు వి. చీలికలాగ ఉండే రంధ్రం.

కవిలె రూ.చూ. కవిలియ వి. 1. ఘట్టించిన నీలపటపు వర్ణం లెక్కల పుస్తకం, కడితం. ఘటికా. 1.22 ; 2. తాటాకుల లెక్కల పుస్తకం ; 3. ధనాగమవ్యయాదుల దినసరి లెక్కలు రాసే పుస్తకం ; 4. ప్రాంతీయ చరిత్ర ; 5. అయిదర టాకులకట్ట.

కవిలెకట్ట వి. ఆస్తిపాస్తుల సంబంధమైన కాగితాలకట్ట.
కవిలెకెక్కు అ.క్రి. జాబితాలోనికిచేరు. పండిచ. 2.471. పు·
కవిలెతూము రూ.చూ. కవిలతూము. వి. ధాన్యం కొలత ముప్పైరెండు మానికల పరిమాణం. కవిలెపట్టు వి. కడిత పుస్తకం. సానందో. 2.59 ; లెక్కలు మొదలైనవి రాసిన పాత కాగితాల కట్ట. కవిలెపుట్టి వి. ధాన్యంకొలత, 640 మానికలు, పెద్ద పుట్టి.

కవిళికలు రూ.చూ. కవళికలు. వి.బ.వ. పోలికలు, కవళికలు.

కవిసె రూ.చూ. కమీజు. వి. చొక్కా, కప్చా.

కవు రూ.చూ. కవును¹. వి. 1. వ్యుత్పత్తిలో 'కాను' శబ్దానికి మీదవర్ణం లోపించగా మిగిలిన రూపం ; 2. శరీరం, మేను ; 3. నడుం.

కవుకి వి. సువాసనగల పూలుపూసే అందమైన మొక్క (Millingtonia hostensis).

కవుకుదెబ్బ వి. బయటకి కన్పించని గట్టి దెబ్బ.

కవుకున క్రి.వి.ఐ. ద్రు. తటాలున, ధ్వన్యనుకరణం. శుక. 2.249.

కవుకులు వి.బ.వ. 1. కష్టాలు, ఇబ్బందులు, అగచాట్లు; 2. పసిపిల్లలు.

కవుఁగిలి రూ.చూ. కౌఁగిలి. చూ. కవుఁగిలు. వి. జా. 1. రొమ్ము, కళా. 5. 99 ; 2. ఆలింగనం. సాం.ని. 3.51 ; పర్జి. కప్ఁగిల్, కంగిల్-. ఒడి.

కవుఁగిలించు చూ. కవుఁగిలు.

కవుఁగిలింత చూ. కవుఁగిలు.

కవుఁగిలింపు చూ. కవుఁగిలు.

కవుఁగిలు రూ. కౌఁగిలు. స.క్రి. కౌగిలించు. పారి. 4.10.

కవుఁగులించు రూ. కౌఁగిలించు. స.క్రి. కౌగిలించు. భార. విరా. 1.247. కవుఁగిలింత రూ. కౌఁగిలింత. వి. ఆలింగనం. కాశ. 1.42. కవుఁగిలింపు రూ.చూ. కౌఁగిలింపు. వి. కౌగిలింపు, ఆలింగనం.

కవుచిప్ప వి. ఆల్చిప్ప, ముత్యపు చిప్పల జంట.

కవుచు రూ. కవును¹, కౌచు, కౌసు¹. వి. 1. ఆమ మాంస గంధం, మాగుడు పొలకంపు. ఆము. 2.3. వేంక. పంచ. 1.751 ; 2. మాంసం. ఆం.భా. 2.131 ; 3. చేపమీది పొలుసు.

క. కప్రటు. కాలుతున్న నూనె, చేప, పచ్చిమాంసం, గుడ్లు మొ॥ వాని అసహ్యమైన వాసన.

కవుచుముచ్చు వి. రక్కసుడు. కవుచుమేఁతరి వి. రాక్షసుడు, పొలతిండి. కవుచుమేపరి వి. పొలతిండి, రాక్షసుడు.

కవుఁజు రూ.చూ. కముజు. వి. 1. కౌఁజు ; 2. గువ్వజాతిలో చేరిన అడవి పూరి పిట్ట.

కవుట రూ.చూ. కవుటు¹. వి. గొడ్లకు కాలు బిగిసిపోయే జబ్బు.

కవుటు¹ రూ. కవుట, కౌట, కౌటు. వి. గొడ్లకు కాళ్ళు బిగపట్టే జబ్బు.

కవుటుగుల్ల వి. పశువుల గిట్టలోని పుండు.

కవుటు² వి. పొగమొక్క కాండానికి ఆకుకూ మధ్య వేసే పిలకలు, పొగచెట్టు పూత.

**కవుటు**[3] యా. కవసు[2]. వి. మురిగిన కుళ్ళనీళ్ళ.

**కవుడీలు** చూ. కౌడీలు. వి.బ.వ. జోహార్లు, మొక్కులు.

**కవుదు** రూ. కౌదు. వి. 1. ప్రమాదం, తప్పు. పి.శకు. 1.76 ; 2. కపటం. ఆం.భా. 1.13 ; 3. అపస్వరం, స్వరం తప్పడం.

సం. కపటు- ; ప్రా. కవడ-. మాయ , పా. కపటు. మోసం.

క. కబటు, కవడ, కవడి. మోసం ; తు. కబటు. వంచన ; కబటి. మోసకత్తె ; త. కవటు. మోసం ; మ. కపటు. మోనం, జిత్తు.

<ప్రా. కవడ-.

**కవుదువెట్టు(-పెట్టు)** స.క్రి. మోసగించు, కికురించు.

**కవుదువు** రూ.చూ. కౌదువు. వి. మాదిరి, కైవడి, రీతి. ఆం.భా. 2.302.

**కవుతి** యా.చూ. కమిద. వి. పాత్రలను నర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే చాప లేదా గోతాంపట్టి.

**కవుదికొట్టు** యా.చూ. కవితికొట్టు. స.క్రి. ఆముకు అగ్గిపెట్ట డానికి ముందు పొయ్యల ముందు నిప్పు రాజేసి చేటతో గాని తడికతోగాని విసురు.

**కవుసు**[1] యా. కవ, కా-[2], కౌను[1]. వి. 1. మధ్యం, నడుము. దశా. 2.294 ; 2. ల స్తకం, వింటి నడిమి భాగం.

**కవుసు**[2] యా. కౌను[2]. వి. 1. పాదరక్షావిశేషం ; ఒక విధ మయిన చెప్పు. ఆం.భా. 2.298 ; 2. ఆకుచెప్పు.

**కవున్సిలు** యా.చూ. కౌన్సిలు. వి. ఆలోచన సభ.

**కవురు**[1] రూ.చూ. గవర. వి. బలిజకులం.

**కవురు**[2] యా. కౌరు. వి. 1. ముదురురంగు, వర్ణాధిక్యం. ప్రబంధ. 78, హంస. 3.193 ; 2. తుమ్మెదల గుంపు. హంస. 3.193 ; 3. గుడ్డకు కొత్తగా వేసిన ఎక్కు వైన ముదురుఛాయ, ఎర్రనిరంగు ; 4. స్తంభం, స్తంభానికి చెక్కిన గాడి.

**కవురు**[3] వి. తలకొమ్మ గిల్లిన తర్వాత పుట్టే చిగురు.

**కవుల** వి. 1. దర్వాజ పక్కన గోడముందుగా కట్టబడే రాతి దిమ్మ ; 2. గోడ కట్టుబడిలో గట్టిదనంకోసం మధ్య మధ్య స్తంభాకారంలో కట్టే నిర్మాణం.

**కవులరాలు** వి. కవుల పక్కనున్న రాతిదిమ్మ.

**కవులవనరము** వి. కపిలగోవు, పల్లావు.

**కవులు**[1] రూ.చూ. కౌలు. వి. రాజులు లోనగువారు రైతులు లోనగువారికి జారీచేసిన ఒడంబడిక.

**కవులుదారు** రూ.చూ. కౌలుదారు. వి. రైతు, అరకాడు.

**కవులునామా** రూ.చూ. కౌలునామా. వి. ఒడంబడిక పత్రం.

**కవుల్లాయము** వి. కౌళ్ళమీద వచ్చే రాబడి.

**కవులు**[2] వి.ఆ.వ. వేదాదులలోని కవులు, పనసలు మొ॥వాటి క్రమం. చిత్రభా. 1.4.

**కవుల్లాయము** చూ. కవులు1.

**కవుళిగ** వి. 50 ఆకులుగల తమలపాకుల కట్ట, పిడి.

క. కవళిగె. తమలపాకుల కట్ట.

<క. కవళిగె.

**కవుసు**[1] యా.చూ. కవుచు. వి. మాంసం.

**కవుసు**[2] రూ.చూ. కవుటు[3]. వి. కుళ్ళనీళ్ళ.

**కవెల** మా.చూ. కైల[1]. వి. మహమ్మదీయులు కట్టుకోటానికి నేసిన ఒకరకం గళ్ళ లుంగీ.

**కవెలసంచి** చూ. కవిలియ. వి. 1. పాతపుస్తకాల కట్టలుంచు కొనే సంచి ; 2. తూకం రాళ్ళు వగైరాలుంచుకొనే సంచి.

**కవేలపట్టు** స.క్రి. సారెమీద దోనెపెంకును తయారుచేసే టప్పుడు వెదురు బద్దతో పట్టు.

**కవేలపెంకు** రూ. కవ్వేలపెంకు. వి. పెన్నుగాడికి వాడే పెద్ద సైజు పెంకు.

**కవేలి** వి. దోనెపెంకు, ఇంటి పెన్నుగాడిమీద పరిచే పెంకు.

**కవేలిల్లు** వి. పెంకుటిల్లు.

**కవ్యాంపుల్లపొయ్యి** యా. కబాలపుల్లలపొయ్యి. వి. మాంసం ముక్కలు కాల్చుకొనేపొయ్యి.

**కవ్వ**[1] చూ. కవ. వి. 1. అనుపోసిన నూలులో ఒకటి పైకి ఒకటి కిందికి వచ్చిన రెండు పోగుల దారం ; 2. అచ్చు కట్టే టప్పుడు, రెండు అచ్చుకర్రల పడిదారాలకు వేసిన లంకె ; 3. నాడె వాటేసినప్పుడు, పడుగులో ఒకవైపు నుంచి మరొక వైపుకు అడ్డంగా కలిసి మళ్ళీ తిరిగే వరసలో కలిపిన దారం.

**కవ్వకమ్మి** వి. గోరంచు కమ్మి మాదిరిగా, రెండు పోగులు పెట్టి సన్నగా గీరపడేట్టు నేసిన కమ్మి. **కవ్వసందు** రూ.చూ. కవసందు. వి. పన్నె దండెలమధ్య బిగించిన పుల్లల మధ్య వెలితి.

**కవ్వ**[2] వి. 1. జొన్న, చోడి మొ॥ వాటి పొల్లులో మిగిలిన నావ గింజ, దీన్ని దంచి ఉడకబెట్టి పశువులకు దాణాగా వేస్తారు ; 2. నూగు.

**కవ్వగుమ్ముడు** వి. తారు గుమ్ముడుచెట్టు, ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Gelina asiatica).

**కవ్వడి** వి. అర్జునుడు. భార. ఆది. 8.185.

సం. కపర్దిన్-. జడలు కలవాడు, శివుడు; ప్రా. కవడి, కవడ్డి-. శివుడు, యక్షవిశేషం ; దేశీ. కవ్వాడో-. కుడి చేయి ; అవ. కవడ్డియ, కపర్దికా.

<ప్రా. కవడి (అర్థ వివరి.).

కవ+వడి. అని వ్యాకర్తలు. రెండు చేతులతో బాణాల్ని వేయటంలో వాడికలవాడు అని వారి వ్యుత్పత్తి.

**కవ్వడికొడుకు** వి. అభిమన్యుడు. **కవ్వడిచెలి** వి శ్రీకృష్ణుడు. వ్యు. అర్జునుని మిత్రుడు.

**కవ్వపుగట్టు** చూ. కవ్వము.

**కవ్వపుఁగట్టు** చూ. కవ్వము.

**కవ్వపుఁగొండ** చూ. కవ్వము.

**కవ్వపుమల** చూ. కవ్వము.

**కవ్వపుమలత్రాడు** చూ. కవ్వము.

**కవ్వపుమలదాల్పు** చూ. కవ్వము.

**కవ్వము** వి. 1. మంథానం, పెరుగు చిలికే సాధన విశేషం. హరి. పూ. 5.196 ; 2. రంగు రుద్దే కర్ర.

క. కవ్వరి, కౌవరి, కవ్వళి (కౌబళితె), కాళి కోవరి-. గుండ్రంగా తిరగడం, కలవరం, సంభ్రమం ; త. కవమ్. కవ్వం.

**కవ్వపుగట్టు** వి. కవ్వమైన కొండ - మందర పర్వతం.

మంథాద్రి. సీలా. 2.41. కవ్వపు(గఱ్ఱ(-కఱ్ఱ) వి. తరిగోల, త్రాటం, పెరుగు చిలికే సాధనం. కవ్వపు(గొండ(-కొండ) వి. కవ్వమైనకొండ - మందర పర్వతం, మంథాద్రి. శివరా. 2.10. కవ్వపుమల వి. కవ్వపుకొండ, మందరపర్వతం. కవ్వపుమల్లత్రాడు వి. నాగుపాము. వేంక. ఆం. 3.102. కవ్వపుమలదాల్పు వి. మందర పర్వతాన్ని ధరించినవాడు, కూర్మావతారంలోని విష్ణువు.

కవ్వలు వి.బ.వ. గింజలులేని ధాన్యం, తరకలు, పొల్లుగింజలు.

కవ్వళ్ళు వి.బ.వ. మూడు, నాలుగు అంగుళాల పరిమాణం కలిగిన చిన్న మంచినీటి చేపలు.

కవ్వాలగడ్డి రూ. కవాలగడ్డి. వి. ఎర్ర నేలల్లో ఎక్కువగా మొలిచే పశువుల మేతకు ప్రశస్తమైన కలుపుమొక్క (Elensina algyptiace).

కవ్వించు రూ.చూ. కవియించు. స.క్రి. రెచ్చగొట్టు, ఉసికొల్పు.

కవ్వింపు రూ.చూ. కవింపు. వి. రెచ్చగొట్టటం.

కవ్వు స.క్రి. 1. కబళించు ; 2. అపహరించు.

క. కప, కబ, గబ, గప్పు. గుటుక్కున మింగేటప్పుడు ఆతురతను సూచించేశబ్దం ; తు. గబగబ. భూమిలోనికి చొచ్చుకొని పోయే సముద్ర భాగం, మింగటం ; త. కప్వు. బలాత్కారంగా పట్టుకొను, ఆతురతగా పట్టుకొను ; మ. కప్పుక ; కొండ. కబ్వ్-(కబ్వి-). వెడల్పుగా తెరిచిన పెద్దనోటితో బలవంతంగా పట్టుకొను. (కుక్క, పులి మొ.) కుయి. కప్వ (కప్వ్-). ద్రవాన్ని ద్వేషంతో మింగు, తాగు, గుటుక్కున మింగు ; కురు. ఖప్పహ్. మింగు, తాగు.

కవ్వుకొను స.క్రి. 1. ఆదుకొను ; 2. ఆక్రమించు.

కవ్వేలపెంకు రూ.చూ. కవేలపెంకు. వి. పెన్నుగాడికి వాడే పెద్దసైజు పెంకు.

కవ్వోము వి. పల్లకి మోసేవారి ధ్వన్యనుకరణం.

కశింతొట్టి వి. కలం కారీ అద్దకం కోసం బెల్లం, ఇనుముకలిపిన మిశ్రమం పోసిన పాత్ర.

కశబా రూ.చూ. కసుబా. వి. పెద్దగ్రామం, శాఖానగరం.

కశ్మ వి. గూడ, గుంటకు నీళ్ళు వచ్చేకాలవ.

కశ్మి వి. ఉత్తర సర్కారులలోని అడవి ప్రాంతాలన్నిటిలోను పెరిగే ఒక చెట్టు.

కష్టపు(జచ్చుట వి. దుర్మరణం, చెడుచావు. భార. శల్య. 2.55.

నం. కష్ట-. కీడు, దుఃఖం.

కష్టపు(బాటు వి. భంగం, చెరుపు. ప్రభా. 1.73.

నం. కష్ట-.దుఃఖం, కీడు.

కష్టమాఫీసు వి. దిగుమతులు మీద సుంకం వసూలుచేసే కార్యాలయం.

ఇం. *Customs Office*. దిగుమతులపై సుంకం వసూలు చేసే కార్యాలయం.

< ఇం. Customs Office.

కస[1] రూ. కసము. వి. గుర్రం మొదలైన వాటిని కొట్టే చబుకు, కొరడా. కు.నం. 2.160.

నం. కశ, కశా. కొరడా, చబుకు ; ప్రా. కస, కసా. చర్మయష్టి, చబుకు ; కసిఅ, కసిఆ. కొరడా ; అ.మా. కసా ; పా. కసా ; హిం. కశా. కొరడా ; కశ్. మరా. కశా. కొరడా.

క. కస, కశె. కొరడా ; మ. కశ. కొరడా.

< ప్రా. కస-.

కసగోల (-కోల). వి. కొరడా కర్ర. కు. నం. 2.160.

కస[2] పో.చూ. కసటు. వి. 1. రంజక ద్రవ్యాలు మొదలైన వాటిసారం ; 2. కసటు, మాలిన్యం.

నం. కషాయ-. ఓషధులు వేసి కాచిననీరు ; పా. కసాయ-, కసావ-. వగరయిన కషాయరసం.

క. కస. తుక్కు, చెత్త, కుడవటం, వ్యర్థమైన మొక్క. తు. కస. చెత్త ; మ. కశ. కోడిలో ఒకభాగం ; మాల్తో. కసె. శరీరం మీది మురికి.

కసకసముంగి వి. ఒకరకం చిన్న నేతగడి.

కసక్కు వి. పొడవటం మొ. వాటి ధ్వన్యనుకరణం.

కసక్కున క్రి. విశ. గట్టిగా, ఉన్నట్లుండి.

కసగు స.క్రి. ఇచ్చు. అ.క్రి. లొంగు.

కసటు వి. 1. విషాదం, ఖేదం, దుఃఖం. భార. భీష్మ. 1.223 ; 2. అపరిశుభ్రం. భార. మౌసల. 8.7 ; 3. పాపం. భార. ఆరణ్య. 6.307 ; 4. నిష్ఠురత్వం, పారుష్యం. రం.రా. అయోధ్య. 97 ; 5. వెగటు, అరుచి ; 6. మలినపదార్థం.

పో.చూ. క. కస,కసవు. చెత్త, కుడవటం, వ్యర్థమైన మొక్క ; మావి. కసరు. చెత్త మొ. కల్మషం ; గసి, గస్తు. నీరు మొ. వానిలో అడుగున చేరేమురికి, మస్తు లేక కాచిన వెన్నలేక అవడాయ ; తు. కజవు, కజావు. చెత్త, మావి ; కజిలు. మావి ; కస. చెత్త, కుడవటం ; కసంటు. నీరు మొ. వానిలో అడుగున చేరేమురికి ; కసరు. నీరు మొ. వానిలో అడుగున చేరేమురికి, కాల్చిన ఇనప చిట్టం, లోహంలోని మస్టు ; గజిళం-. మురికిగానున్న, మలినమైన ; త. కచటు. అపరిశుభ్రం, మురికి, మడ్డి, తప్పు, కళంకం, అసంపూర్ణం. కచంటు. మడ్డి ; కన్నల్. కుడవటం, తిరస్కారం, చెత్తకుప్ప ; మ. కచ్చి. తృణం, చెత్త ; పర్జి. కసటు. మురికియైన ; కురు. కస్పా. శరీరంమీద మురికి ; మాల్తో. కసె. శరీరంమీద మురికి.

నం. కచ్చర-. మురికి, మలినమైన, దుర్మార్గుడైన.

కసపిస రూ.చూ. కసమస. వి. 1. నమలడంలో కలిగేధ్వనికి అనుకరణం ; 2. ఆదుర్దా, తొందర.

కసబా రూ.చూ. కసుబా. వి. పెద్దగ్రామం, శాఖానగరం.

కసబు వి. 1. విషాదం, ఖేదం, దుఃఖం. భార. భీష్మ. 1.223 ; 2. నిష్ఠురత్వం, పారుష్యం. రం. రా. అయోధ్య. 93.

నం. కష్ట-. పై. కసిటు. దుఃఖం, పీడ, వ్యథ ; పా. కసటు. చెడు, మిథ్య, అసత్యం.

< ప్రా. కసట- ?

కసబెస రూ.చూ. కసమస. వి. బాగానూరటం మొదలైన వాటిలో కలిగేధ్వన్యనుకరణం. నవనాథ. 5.211.

మ. కశకశ. నలిపి పొడిచేయు, చేతితో నొక్కు.

కసమస రూ. కసపిస, కసబెస, కసిమస, కసిమసి. వి. 1.

తొందర, వేగం.శృం.నై. 3.72, 5.57 ; **2.** తొట్రుపాటు, సంభ్రమం. విక్ర. 8.87 ; **3.** తినటం మొ. వాటిలో అనుకరణం. నవనాథ. 1.47. పు. 11. పం.

మ. కళకళ. పులుపు, వగరు రుచుల్ని అనుకరించేశబ్దం.

**కసము** రూ.చూ. కస[1]. వి. కళ, కొరడా.

**కసరగొంగడి** వి. అన్నిరంగులూ కలిసిన ఉన్నితో నేసిన గొంగడి.

**కసరతు** రూ. కసరత్తు. వి. **1.** కవాతు; **2.** శరీర వ్యాయామం; **3.** అభ్యాసం.

హిం. ఉ. *కస్రత్.* వ్యాయామం.

< ఉ. *కస్రత్.*

**కసరత్తు** రూ.చూ. కసరతు. వి. **1.** కవాతు ; **2.** శరీరవ్యాయామం ; **3.** అభ్యాసం.

**కసరికొట్టు** చూ. కసరు[1].

**కసరు**[1] రూ. కసురు[1]. అ.క్రి. **1.** విజృంభించు, హెచ్చు. కాశీ. 2.40 ; **2.** చలించు. ద్వి.భాగ. 7 ; **3.** కోపపడు, విసుగుకొను. పాండు. 4.210 ; **4.** బొంకు, అసత్యమాడు. స.క్రి. ఉపాలంభించు, తిట్టు. మను. 5.23. వి. **1.** కోపం. ఆము. 5.60 ; **2.** దోషం. రత్న. 28 ; **3.** పొగరు, గర్వం. ద్వి. సారంగ. 3.105 ; **4.** విజృంభణం, అతిశయం. కవిరాజ. 5.265 ; **5.** గాలివాన. రాజ. వి. 3.19 ; **6.** పెచ్చు, లాభం.

క. *గజఱ్, గజఱు.* పెద్దధ్వని చేయు, గద్దించు, ధ్వని, కోపంగా చేసేధ్వనిలేక మాట. *కసమ.* చమత్కారం కాని ; త. *కటువు.* కోపంతో, *కటుల్.* కోపంతో ; *కచైకు.* నిర్దయతో ; *కచక్కు.* బాధించు ; *కచ.* అసహ్యంగా ; *కాయ్.* అలసటతో, నిర్దయతో ; మ. *కయిర్క్క.* కోపంతో లేచు, క్రూరం, గద్దించు, దండిచు. *కయర్క, కయఋక.* గద్దించు ; కుఱు. *కచ్‌కచ్/నా.* కోపించు, తొందరపడు ; *కచ్‌కచ్.* తొందర, కోపం. *కచ్‌కచ్‌ర్.* కోపించు.

మూ.ద.ద్రా.*కచ్-./*కత్-.

<మూ.ద్రా.*కాచ్-./*కాయ్-.

**కసరికొట్టు** స.క్రి. తిట్టు. చంద్రాంగ. 1.62. **కసరుకొను** రూ. కసురుకొను. అ.క్రి. **1.** కోపపడు. నరస. 5.19 ; **2.** ఘోషించు. నరస. 5.19. **కసరుఁదవము (-తవము)** వి. దోషం. పి. శకు. 56. **కసరెట్టు** అ.క్రి. తుఫాను కలుగు. మను. 3.9.

**కసరు**[2] పో.చూ. కసటు. రూ. కసురు[2]. వి. పచ్చికాయ, పిందె. బాస్క.రా. సుందర. 178. విణ. పచ్చి, లేత.

క. కస. గట్టి, పచ్చి, వగరుపండు.

**కసరుకాయ** రూ. చూ. కసరుఁగాయ. వి. లేతకాయ.

**కసరుఁగాయ (-కాయ)** రూ. కసరుకాయ. వి. లేతకాయ. రం.రా.అయోధ్యా. 1.37.

**కసరు**[3] రూ. కసురు[3]. వి. **1.** పసిపిల్లలు విసర్జించే ఆకుపచ్చని మలం ; **2.** పొట్టలో బాగా జీర్ణంకాని ఆహారం ఒదిపి ; **3.** జంతువుకడుపులోని మలం.

**కసరు**[4] వి. తీవ్రమైనగాలి, కొద్దివర్షంతో కూడిన వాతావరణం, వానగాలి.

**కసరుకాలవ** రూ. కసరుకాల్వ, కసురుకాలవ, కసురుకాల్వ. వి. ఏటినుంచి తోటకు నీళ్ళుపెట్టే కాల్వ.

**కసరుకాల్వ** రూ.చూ. కసరుకాలవ. వి. ఏటినుంచి తోటలోకినీళ్ళు పెట్టేకాలవ.

**కసరెట్టు** చూ. కసరు[1].

**కసవు** రూ. కసువు. కస్వు. వి. **1.** గడ్డి, తృణం. కాశీ. 7.206 ; **2.** పెంట, తుక్కు. భీమ. 3.62.

సం. ఘాస-; ప్రా. ఘాస-. గడ్డి, కసవు ; పా. ఘాస-. గడ్డి, పచ్చిక, తిండి.

క. కస, కసవు. చెత్త, పనికిరానిమొక్క ; తు. కస ; మ. కళ. కోడిలో ఒకభాగం.

< మూ.ద్రా.* కచ్.—

**కసవుకోడి** వి. **1.** ఒకజాతికోడి ; **2.** ఉల్లంగిపిట్ట ; **3.** ముక్కుపురుడుపిట్ట. **కసవుగ్రద్ర** వి. చెత్తాచెదారం. బసవ. 3.532 ; **కసవుగువ్వ** వి. ఒకజాతిగువ్వ. **కసవుఁగఱచు(-కఱచు)** అ.క్రి. **1.** చెడిపోవు, తక్కువగు. రామా. 7.272 ; **2.** పూరిమేయు. **కసవుఁగఱ్ఱ(-కఱ్ఱ)** వి. గడ్డిపరక, తృణాగ్రం. రామా. 6.133. **కసవుఁగుప్ప (-కుప్ప)** వి. **1.** గడ్డిమేటు ; **2.** పెంటకుప్ప. **కసవుపోఁచ.** వి. గడ్డిపరక. హరిశ్చ. 2.49. **కసవువాఁడు.** వి. పెంటఊడ్చేవాడు.

**కసాయి**[1] రూ. కజాయి, కసాయీ. వి. కటికవాడు.

హిం. ఉ. *కసాఈ.* కసాయివాడు ; మరా. *కసాఈ.* కసాయివాడు ; అర. *కస్సాబ్.*

క. *కసాబ, కసాయి.* కసాయివాడు ; మ. *కసాప్.* కసాయివాడు.

< ఉ. *కసాఈ.*

**కసాయిచెత్త** వి. కసాయి అంగళ్ళలో పారవేసే పనికిమాలిన చెత్త. **కసాయితనం** వి. జాలిలేకపోవటం, కర్కశత్వం.

**కసాయి**[2] వి. జేబు.

**కసాయీ** రూ.చూ. కసాయి[1]. వి. కటికవాడు.

**కసాల** రూ. కసాలా, కసాలు. వి. **1.** దబ్బుపుఇబ్బంది, చిక్కులు ; **2.** కష్టం, దుఃఖం.

హిం. ఉ. *కసాలా.* కష్టం, శ్రమ.

< ఉ. *కసాలా.*

**కసాలా** రూ.చూ. కసాల. వి. **1.** తగవు ; **2.** కష్టం.

**కసాలు** రూ.చూ. కసాల. వి. ఇబ్బంది, ఇక్కట్టు.

**కసి**[1] వి. **1.** తమి, ఆపేక్ష. పండి. చ. 2.166 ; **2.** తీట, దురద. భార. కర్ణ. 2.300 ; **3.** కోపం, పగ.

**కసిపోవు** రూ.చూ. కసిపోవు. అ.క్రి. ఉపశమిల్లు, తగ్గు. **కసిమసఁగు** అ.క్రి. **1.** విజృంభించు, చెలరేగు, అతిశయించు. భార.ఆది. 4.201; **2.** పారద్రోలు. భార.ఆది. 6.202 ; **3.** అధికమగు, వ్యాపించు. వరాహ. 10.28 ; **4.** నిపుణుడగు, ఆరితేరు. ఆం.నా.శే. 35; స.క్రి. **1.** నరకు, ఖండించు. రామా. 5.20 ; **2.** చంపు, సంహరించు. రామా. 6.9. **కసిమిరి** రూ. కసిరె. వి. **1.** దురద. ఉ. హరి. 5.21 ; **2.** చర్మరోగవిశేషం. **కసిపోవు** రూ. కసిపోవు. అ. క్రి. ఉపశమిల్లు, తగ్గు.

**కసి**[2] రూ.చూ. కసు. విశే. 1. పచ్చి. పక్వంకాని, లేత . 2. అల్పమైన.

**కసికందు** రూ. కసిగందు, కసుకందు, కసుగందు, కసుఁగందు. వి. లేతబిడ్డ. పారి. 3.44. **కసికాటు** రూ. కసిగాటు. విశే. అల్పమైన. పాండు. 3.72 ; వి. 1. దంతక్షతం. సురా. 128 ; 2. కొంచెపుపంటికాటు. విజయ. 3.4. **కసికాట్లుచేయు** అ.క్రి. కొంచెంగా కరచు, కొంచెంగాకొరుకు. ద్వి. సారంగ. 2.67. **కసికోత** రూ.చూ. కసిఁడికోఁత. వి. 1. ఎప్పుడూ పెట్టేబాధ. కువల. 3.99; 2. చిన్న చిన్నముక్కలుగా కోయటం. **కసిగందు(-కందు)** రూ.చూ. కసికందు. అ.క్రి. కొంచెంకందు. **కసిగాటు** రూ. చూ. కసికాటు. వి. 1. చిన్నకాటు. పాండు. 3.72; 2. దంతక్షతం. ప్రబంధ. 5.6 ; విశే. అల్పమైన, కొంచెమైన. దిలీప. 3.213.

**కసికింద** రూ.చూ. కసివెంద. వి. రోడ్లపక్క, బంజనేలల్లో ఏటాలేచి తుప్పగా పెరిగేమొక్క (Cassia Occidentalis).

**కసికిపోవు** రూ. గసికిపోవు. అ.క్రి. క్రమేణా తరిగిపోవు.

**కసిక్కు** వి. ముళ్ళుమొదలైనవాటిని గుచ్చుకొనేటప్పటి అనుకరణం. సానందో. 2.5.

**కసిగడ్డి** వి. వాసనగల నూనె తయారీలో ఉపయోగించే ఒక రకం గడ్డి, కామంచిగడ్డి (Cymbopogon martini)

**కసింకాలవ** వి. 1. ఊటకాలవ ; 2. మురికినీటికాల్వ.

**కసిఁగాటు** వి. అనిష్టభక్షణం.

**కసిఁడి** విశే. అల్పమైన. పాండు. 4.42.

**కసిఁడికోఁత** రూ. కసికోఁత, కసినికోఁత. వి. 1. ఎప్పుడూ పెట్టేబాద. వరాహ. 5.93, పాండు. 4.145 ; 2. చిన్న చిన్న ముక్కలుగా కోసేకోత.

**కసిదసింగర్** వి. ఒకరకం డిజైను నేతనేసేటప్పుడు అంచుల సూత్రాలు దింపటానికి పెట్టినకొయ్య.

**కసిదుక్కి** వి. నీళ్ళలో గడ్డలు బాగా కరిగిపోయి బురదయ్యేట్లు దున్నినదుక్కి.

**కసిని** రూ.చూ. కాసిన్ని. విశే. కొంచెం, అల్పమైన.

**కసినికోఁత** రూ. చూ. కసిఁడికోఁత. వి. చిన్న చిన్న ముక్కలుగా కోసేకోత. శుక. 3.297.

**కసింత**[1] రూ. కాసింత. వి. మరికొంచెం, కొంచెం, రవంత.

**కసింత**[2] రూ.చూ. కసివెంద.

**కసింద** రూ.చూ. కసివెంద. వి. పసుపుపచ్చని పూలు పూసే ఒక మొక్క (Cassia occidentalis), కానమర్దం. ఆము. 6.13.

**కసిబిసి** విశే. నలిగిన. భాస్క.రా. యు. 1.432 ; 2. పటుత్వం లేని. వి. 1. క్రోధం. ద్వి. భాగ. 6.121 ; 2. బాగా నలిగేట్లు నమలడంలో అనుకరణం. పాంచాలీ. 1.78 ; 3. మనసులోని బాధను ఓర్వలేక పోవటం.

**కసిమస** రూ.చూ. కసమస. వి. తొందరగా తినడంలో ధ్వన్యనుకరణం. వేంక. పంచ. 6.85.

**కసిమసి** రూ.చూ. కసమస. వి. 1. సంభ్రమం, కలవరం ; 2. గజిబిజి.

**కసిమింద** రూ.చూ. కసివెంద. వి. ఒకరకం తుప్పమొక్క.

**కసిమిందకంప** వి. ఆముకాల్వలో వాడే కసిమింద చెట్టు కంప.

**కసిమిరి** రూ. కసిరె. వి. తీట, దురద. ఉ.హరి. 5.21.

**కసియ** రూ. కసె. వి. కవురు, తలకొమ్మ గిల్లిన తర్వాత పుట్టే చిగురు, పొగాకుమొగ్గ.

**కసియము** రూ. కసెము, కస్సెము. వి. 1. కషాయం ; 2. నీటి ఊటగల ప్రదేశం.

సం. కషాయ-. ఒగరు, ఓషధులు వేసి కాచిననీరు ; ప్రా. కసాయ-.

< ప్రా. కసాయ-.

**కసిరె** రూ.చూ. కసిమిరి. వి. 1. ఒకరకం చర్మరోగం, ఒళ్ళు దురద ; 2. గొడ్డు ఎండలో నిలవలేకపోవటం.

**కసిరెగొర్రె** వి. ఒకరకం గొర్రె, వెంట్రుకలు నెరిసినగొర్రె.

**కసిలాడు** అ.క్రి. కదలు, చలించు.

**కసివింద** రూ.చూ. కసివెంద. వి. కానమర్దం, పచ్చనిపూలు పూసే ఒకమొక్క (Cassia occidentalis).

**కసివెంద** రూ. కసికింద, కసింత[2], కసింద, కసిమింద, కసివింద. వి. కానమర్దం, రోడ్లపక్కనా, బంజరునేలల్లోనూ ఏటాలేచి తుప్పగా పెరిగే మొక్క (Cassia occidentalis).

సం. కాసమర్ద- ; ప్రా. కాసమద్దగ. కసిందచెట్టు ; క. కసింది. కసిందిచెట్టు.

< ప్రా. కాసమద్దగ.

**కసీదా** రూ.చూ. కసీదు. వి. వస్త్రంమీద జరీ మొ. కుట్టుపని, బుటాపని.

**కసీదు** రూ. కసీదా. వి. వస్త్రంమీద జరీ మొ. వానితో పూలు మొ. కుట్టుపని, బుటాపని. ప్రబంధ. 179.

హిం. ఉ. కశీదా. బుటాపని.

క. కసిది, కసుతి, కసాది. బుటాపని.

< ఉ. కశీదా.

**కసీసము** విశే. నల్లని. కాశీ. 6.161, ఆము. 4.10. వి. 1. నల్లబట్ట. ఆం. భా. 2.155 ; 2. అన్నభేది.

సం. కాసీస-. ఉపధాభేదం ; ప్రా. కసీస-.

< ప్రా. కసీస-.

**కసు** రూ. కసి[2]. విశే. లేత, అల్పమైన. బిల్హ. 1.67.

క. కసు. పచ్చి, పండని, లేత ; తొద. కసురు. పచ్చిది, పండని.

**కసుకందు** రూ.చూ. కసికందు. అ.క్రి. కొంచెం శ్రమపడు. **కసుగందు** రూ.చూ. కసికందు. అ.క్రి. 1. కొంచెం శ్రమపడు. భార.సౌప్తి. 1.70 : 2. మిక్కిలి బాధపడు. శృం.నై. 4.34 ; 3. మిక్కిలి వాడిపోవు. భీమ. 4.146 ; కసుగందులుగందు (-కందు). అ.క్రి. మిక్కిలి వాడు. కళా. 4.103. **కసుఁగందు** రూ.చూ. కసికందు. వి. 1. లేతబిడ్డ, పసికూన, పారి. 3.38 ; 2. నలుపు. మైరా. 1.134. **కసుఁగన్ను(-కన్ను)** వి. సన్నని నడుం. బిల్హ. 1.67. **కసుఁగాయ (-కాయ)** వి. లేతకాయ. సుమతి. 21. **కసుఁగౌను (-కౌను)** వి. సన్నని నడుం. బిల్హ. 1.67.

**కసుగు** అ.క్రి. సణుగు, గొణుగు. ద్వి. హరిశ్చ.ఉ. 1541.

స.క్రి. 1. బాధించు, మిక్కిలి బాధించేటట్లు తిప్పు. నవనాథ. 2.107; 2. అట్టిట్టు ఊవు. ఆడించు. నవనాథ. 2.148, 3. పులుము; 4. నలచు.

క. కసుక. వెళ్ళు, కదులు; గజిబ్, గజిబు. పెద్ద ధ్వనిచేయు, కొనరు; మ. కుసుకుసు. గుసగుసమాట లాడు; కురు. కచ్‌కచ్. కోపం పుట్టించు.

**కసుపా** రూ.చూ. కసుబా. వి. పెద్దగ్రామం, శాఖానగరం.

**కసుబా** రూ. కశబా, కసబా, కసుపా, కసుబె, కసుబే, కస్బా, ఖసుబా, ఖసుబె, ఖసువె, ఖస్బా. వి. 1. పెద్దగ్రామం, శాఖానగరం; నె.శా. 2. సం. కందుకూరు. క్రీ.శ. 1683–84; 2. తాలూకాలోని ప్రధాననగరం; 3. పట్టణం.

మరా. కస్‌బా. ముఖ్యపట్టణం; ఉ. కస్‌బా. చిన్న పట్నం; పార. కసబత్. పెద్దగ్రామం, చిన్నపట్నం; అర. కశబ్. ముఖ్యపట్టణం.

<ఉ. కస్‌బా.

**కసుబె** రూ.చూ. కసుబా. వి. పెద్దగ్రామం, శాఖానగరం.

**కసుబే** రూ.చూ. కసుబా. వి. పెద్దగ్రామం, శాఖానగరం. ద.హిం.శా. సంపు. 10. శాసం. 759. క్రీ.శ. 1668.

**కసుమాలము** రూ. కసుమూలము. వి. 1. రోత. కాశీ. 7.206; 2. మలినపదార్థం. కాళ. 3.97. విశ. 1. క్రూరమైన. వేంక.పంచ. 3.323; 2. పాపిష్ఠమైన. బ్రహ్మో. 2.79; 3. పాపాత్ముడైన.

సం. కశ్మల-. మలినం, నింద్యం, పాపం; ప్రా. కష్మల-, పావం.

క. కసుమాళ, కసకిల్ (లు). చీపురుకట్ట; తు. కజె; త. కసుమాలం; మ. కసుమాలం.

<సం. కశ్మల-.

**కసుమూలము** రూ.చూ. కసుమాలము. వి. అసహ్యం, కల్మషం.

**కసురు**[1] రూ.చూ. కసరు[1]. స.క్రి. చీదరించు.

**కసురుకొను** రూ.చూ. కసరుకొను. స.క్రి. 1. చీదరించు; 2. పశువు కొమ్ముతో పొడవబోవు; 3. కోపంతో మందలించు.

**కసురు**[2] రూ.చూ. కసరు[2]. వి. 1. పిందె. నిర్వ.రా. 10.122; 2. లేతకాయ. భాస్క.రా.యు. 1179; 3. సముద్రం రేగి చేసేధ్వని; 4. పొగరు.

**కసురు**[3] రూ.చూ. కసరు[3]. వి. 1. (జంతువుల కడుపులోని) మలం; 2. ఒడిపి; 3. చీటిడబ్బు కట్టగా మిగిలిన పైకం.

**కసురుకాలవ** రూ.చూ. కసరుకాలవ. వి. ఏటినుంచి తోటకు నీళ్ళుపెట్టే కాలవ.

**కసురుకాల్వ** రూ.చూ. కసరుకాలవ. వి. ఏటినుంచి తోటకు నీళ్ళుపెట్టే కాల్వ.

**కసురుగొట్టు (-కొట్టు)** అ.క్రి. గాలి వేగంగావీచు.

**కసువామి** చూ. కసువు.

**కసువు** రూ.చూ. కసవు. వి. 1. చెత్త; 2. ఇల్లు ఊడ్చగా వచ్చిన చెత్త, దుమ్ము మొ. పశువుల తొక్కుడుబడ్డగడ్డి; 3. కోసిన రాగి, చేమ మొ. మెట్టపైర్ల దంట్లు.

**కసువామి** వి. గడ్డివామి, గడ్డికుప్ప.

**కసె** రూ.చూ. కసియ. వి. తలకొమ్మగిల్లిన తర్వాత పుట్టే చిగురుపొగాకు మొగ్గ.

**కసెం** వి. నూలు రంగును పీల్చుకోటానికి తయారు చేసిన మిశ్రం.

**కసెచేరులు** వి.బ.వ. చొక్కా బొందులు.

**కసెము** రూ.చూ. కసియము. వి. జలప్రాయప్రదేశం, నీళ్ళు చిదచిదలాడే నేల. చెమ్మనేల.

**కసేరిగడ్డి** వి. ఎండుగడ్డి, ఇళ్ళకప్పులకు ఉపయోగపడే ఒకరకం గడ్డి. (Heteropogon contortus)

**కసేరీ** రూ.చూ. కచేరీ. వి. 1. కోర్టు; 2. గానసభ.

**కసైతాడు** వి. బండికి చాపవేసి బిగించే తాడు.

**కస్కె** వి. అల్చిప్ప.

**కష్టబాధలు** వి.బ.వ. కష్టాలు, బాధలు.

సం. కష్ట -. కష్టం, బాధ -, నొప్పి.

<సం. కష్టబాధ -.

**కస్టమ్స్** వి. దిగుమతులపై పన్ను.

ఇం. *customs*. దిగుమతి పన్నులు.

<ఇం. customs.

**కస్టర్డ్‌పుడ్డింగ్** వి. గుడ్డు, చక్కెరకలపి ఆవిరిమీదవండిన పదార్థం.

ఇం. *custard pudding* తినుబండారం.

<ఇం. custard pudding.

**కస్తి** వి. 1. కష్టం, శ్రమం, శోకం, దుఃఖం. కాళ. 3.72; 2. విపత్తు. ఆం.నా.సం. 2.59; 3. శోకం. ఆం.భా. 1.135; 4. అప్పువసూలు చేయటంలో చేసే ఒత్తిడి.

సం. కష్ట -. కష్టం, లోపం; హిం. కస్త్. పో.చూ. మరా. కస్తీ. నష్టం; పార. కశిదన్.

క. కస్తి. కష్టం; మ. కష్టమ్. గట్టి, చెడు, బాధగా, గట్టిగా, కష్టం.

**కస్తిపడు** అ.క్రి. దుఃఖపడు. ఉత్త.రా. 6.251. **కస్తిపెట్టు** స.క్రి. దుఃఖపెట్టు. శృం.నై. 8.130.

**కస్తురి** వి. 1. మృగమదం, ఒకవిధమైన పరిమళద్రవ్యం. కు.సం. 8.97; 2. కస్తూరీమృగం. పి.శకు. 1.98; 3. ఒకానొక చెట్టు. బహుళా. 2.21.

సం. కస్తురికా, కస్తూరికా, కస్తూరీ, కస్తూరి. మృగమదం; పా. కత్థురియా, కత్థురిఅ; హిం. కస్తూరికా, కస్తూరి; కస్తూరియా. కస్తూరీ, కస్తూరీమృగం.

క. కస్తురి, కత్తురి. కస్తూరీ.

<సం. కస్తూరీ -.

**కస్తురిపట్టియలు** రూ. కస్తూరిపట్టియలు. వి.బ.వ. 1. పుష్పవిశేషం. భాను. 1.9; 2. ధాన్యవిశేషం. **కస్తూరిపట్టెలు** రూ.చూ. కస్తూరిపట్టెలు. వి.బ.వ. 1. పుష్పవిశేషం; 2. ధాన్యవిశేషం; 3. ద్వారబంధానికి రెండువక్కల గోడలో బిగించి ఉండే నిలువుకొయ్యలు; 4. గుర్రపు తుండ్లు. **కస్తురిపసుపు** రూ.చూ. కస్తూరిపసుపు. వి. గంధహరిద్ర. **కస్తురిపిల్లి** వి. కస్తూరిపిల్లి. **కస్తురిమళ్ళచీర** వి. స్త్రీవస్త్ర విశేషం. **కస్తురిమెకము** వి. కస్తూరీమృగం. యయా. 1.28. **కస్తురిపీఠియ** రూ. కస్తూరిపీఠియ. వి. కస్తూరి

మృగం యొక్క బొడ్డుకాయ. భల్లా. 3. ఆ. కస్తురిపీణె రూ.చూ. కస్తూరిపీణియ. వి. కస్తూరీమృగం యొక్క బొడ్డు కాయ.

కస్తూరితుమ్మ వి. పొదగాపెరిగే ముళ్ళ కంచెమొక్క (Acacia Farnesiana).

కస్తూరివిగరాలు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

కస్తూరివట్టియలు రూ. కస్తురిపట్టియలు, కస్తురిపట్టెలు, కస్తూరి పట్టెలు. వి.బ.వ. ధాన్యవిశేషం.

కస్తూరివట్టెలు రూ.చూ. కస్తూరిపట్టియలు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.

కస్తూరివసుపు రూ. కస్తురిపసుపు. వి. సువాసనగల ఒక జాతి పసుపు (Curcuma aromatica).

కస్తూరిమల్లు చూ. కస్తురి. వి. స్త్రీలుకట్టుకొనే ఒక విధమైన గళ్ళచీర.

కస్తూరిపీణియ రూ. కస్తురిపీణియ, కస్తురిపీణె, కస్తూరిపీణె. వి. కస్తూరీమృగం యొక్క బొడ్డుకాయ. పార్వ. 1.62.

కస్తూరిపీణె రూ.చూ. కస్తూరిపీణియ. వి. కస్తూరీమృగం యొక్క బొడ్డుకాయ. పార్వ. 1.62.

కస్పీలు వి.బ.వ. లంచాలు, మామూళ్ళు.

కస్బా రూ.చూ. కసుబా. వి. జిల్లాలోని ప్రధాననగరం.

కస్మీర వి. కాశ్మీరదేశం.

సం. కాశ్మీర -. కాశ్మీరదేశం.

<సం. కాశ్మీర -.

కస్యము వి. తవ్వినకాలువ.

కస్వు రూ.చూ. కసవు. వి. 1. గడ్డి, తృణం. బసవ. 3.532 ; 2. పెంటతుక్కు.

కస్సుమను అ.క్రి. కోపగించు, కోపించు.

కస్సెము రూ.చూ. కసియము. వి. జలప్రాయప్రదేశం, నీళ్ళు చిదచిదలాడే నేల ; చెమ్మనేల.

కహకహ వి. పెద్దనవ్వుకు అనుకరణధ్వని. కాశీ. 7.30.

క. కహ. అనుకరణధ్వని.

కహకహకహ వి. పెద్దనవ్వుకు అనుకరణం. సమీర. 4.44. హిం. కహకహా. పెద్దనవ్వుకు అనుకరణ ధ్వని.

కహకహనవ్వు అ.క్రి. కోపంతో నవ్వు.

కహళకాఁడు వి. కాహళ ఊదేవాడు.

# కా

కా[1] చూ. అగు. అవ్య. ద్రు. 'అగు' ధాతువు యొక్క తుమర్థ భావ లక్షణాల్లో వచ్చేరూపం. 1. అర్థవిశేషం లేకుండనే తుమున్నంతాలకు అనుప్రయుక్తమవుతుంది. భార. ఆది. 6.247, ఉద్యో. 3.45. ; 2. అవటానికి, అయ్యేటట్లు మొద లైన అర్థాన్ని తెలుపుతుంది. భార. ఆది. 6.248 ; 3. అయి (ప్రయోజనాన్ని తెలిపే 'కి' 'కు' లకు అనుప్రయుక్త మవుతుంది). భార.ఆది. 6.277 ; 4. విధేయ విశేషణాలకు, క్రియావిశేషణాలకు అనుప్రయుక్తమై అయ్యేటట్లు మొ. అర్థాలనిస్తుంది. భార. ఆది. 7.155 ; 5. 'అని' (ఇది ఈ అర్థంలో తరచుగా ఏవార్థమైన 'అ' కారానికి తర్వాత కనబడుతోంది). భార. ఆది. 7.208 ; 6. హేతువును తెలిపే 'కి' 'కు' లకు అనుప్రయుక్తమవుతుంది. భార. విరా. 5.331 ; 7. అనుసరించి, పట్టి అనే అర్థాల్ని ఇస్తుంది. పాండు. 2.171.

<అగు + - అ[7].

కా[2] అవ్య. కద (నిశ్చయార్థంలో). జైమినీ భా. 1.28.

కా[3] ప్రత్య. పెక్కునామవాచకాలకు వాచ్యమయ్యేటప్పుడు మతుబర్థంలో వస్తుంది. కొన్నిచోట్ల స్వార్థంలో కూడా వస్తుంది. తిర్యగ్వాచకాల్లో కూడావస్తుంది. ఉదా. ఆటకాఁడు, చెలికాఁడు, బట్టికాఁడు.

కాంచి రూ.చూ. కామంచి. వి. 1. దోదగడ్డి వంటి తృణవిశేషం. (Cymlopogon caesieus) ; 2. కాసెగడ్డి తినటం వల్ల వచ్చే కడుపు జబ్బు.

కాక[1] 'అగు' యొక్క వ్యతిరేకక్త్వార్థక రూపం. అవ్య. 1. తక్క అనే అర్థాన్ని తెలుపుతుంది. భార. ఆది. 2.159 ; 2. లేకుండా, కాకుండా, అనే అర్థాన్ని తెలుపుతుంది. భార. ఆది. 6.128 ; 3. ప్రతిజ్ఞా, నిశ్చయాదుల్ని తెలుపుతుంది. భార. ఆది. 6.200 ; 4. వికల్పాన్ని (పక్షాంతరంలో) తెలుపుతుంది. భార. ఆది. 7.237 ; 5. అంతమాత్రమే కాని అనే అర్థాన్ని తెలుపుతుంది. భార. ఆది. 7.262 ; 6. 'కానిమ్ము' అనే అర్థాన్ని ఇస్తుంది. భార. ఉద్యో. 4.155 ; 7. 'కాని' అనే అర్థాన్ని తెలుపుతుంది. భార. అరణ్య. 3.365 ; 8. కలగక, సంభవించక, చాలక, అనే అర్థాల్నిస్తుంది. భార. అరణ్య. 3.328 ; 9. కామచారా నుజ్ఞను తెలుపుతుంది. భీమ. 1.15 ; 10. ఆశీర్వాదాన్ని తెలుపుతుంది. పారి. 2.26 ; 11. శాపాన్ని తెలుపుతుంది.

కాకపోవు అ.క్రి. అవకుండు, చెడిపోవు. కాకున్నె అవ్య. 1. నిశ్చయాన్ని తెలుపుతుంది. భార. అరణ్య. 2.164 ; 2. కదా, కాదా, కాకపోవునే. కాకేమి అవ్య. మరోదాని లేమిని తెలుపుతుంది. ఏవార్థం. భార. ఆది. 1.97 ; అగు ననటం, అదే, కాకయేమి. <కాక + ఏమి.

కాక[2] వి. చిన్నాయన, పినతండ్రి.

హిం. ఉ. కాకా. తండ్రి, సోదరుడు ; పార. కాకా. అన్న, మేనమామ.

<ఉ. కాకా.

కాక[3] రూ.చూ. కాఁక. వి. 1. ఆముకాల్పుయొక్కవేడి ; 2. సెగ, వేడి, వేడిమి.

కాకకొట్టు రూ.చూ. కాకలుకొట్టు. స.క్రి. ఆముపొయ్యిలో కట్టెలు పెట్టడానికి ముందు నిప్పు రాజేసి, చేటతోగాని, తడికెతోగాని విసురు. కాకతీయు స.క్రి. ఆముపొయ్యి దగ్గర నిప్పురాజేసి ఆము మండడానికి చేటతోగాని, తడికెతోగాని విసురు. కాకపట్టు స. క్రి. ఆముపొయ్యి దగ్గర అగ్గి రాజేసి, మంట ఎక్కువ కావటానికి చేటతోగాని, తడికెతోగాని విసరు. కాకపెట్టు స. క్రి. కాకలుకొట్టు, ఆముపొయ్యి దగ్గర నిప్పు రాజేసి మండటానికి చేటతోగాని, తడికెతోగాని విసురు. కాకలుకొట్టు రూ. కాకకొట్టు. స.క్రి. ఆముపొయ్యిలో కట్టెలు పెట్టడానికి ముందు నిప్పు రాజేసి చేటతోగాని, తడికతోగాని విసరు. కాకలుతీరు అ.క్రి. ఆరితీరు, ముక్కాకలుతీరు ; గడితీరు. (అర్థవిపరి.). కాకవిసురు స.క్రి. ఆముపొయ్యిదగ్గర నిప్పురాజేసి చేటతోగాని తడికెతోగాని విసరు. కాకెల్లగొట్టు స.క్రి. ఆముపొయ్యిదగ్గర అగ్గిరాజేసి మండటానికి చేటతోగాని, తడికెతోగాని విసురు. కాకేయు స.క్రి. ఆముపొయ్యిలో కట్టెలు పెట్టడానికి ముందు అగ్గిరాజేసి మండటానికి చేటతోగాని, తడికెతోగాని విసురు. <కాక[3]+ ఏయు.

కాకకొడిసె వి. పాలచెట్టు, కొరగచెట్టు, తెల్లటిపూలు పూసే చెట్టు. తెల్లగాఉండే దీని కలప ఉత్తరభారత దేశంలో ఉపయుక్తం (Holarrhena antidyseuterica).

మ. కొడగ. పాల.

కాకడా రూ.చూ. కాగడా[1]. వి. దీపం.

కాకపెండాలు వి.బ.వ. సన్నరకం వడ్లు.

కాకపాల రూ.చూ. కాకుపాల. వి. వాతనారాయణాకు (Zizyphus trineroius).

కాకమల్లి వి. అడవిమల్లి.

కాకమారి వి. కాకిచంపు. ఆకుపచ్చని పూలు. తెలుపు, ఎరుపు, నలుపురంగు కాయలు కాసే ఒకతీగ. (Anamirta cocculus).

కాకమేడి వి. అత్తి, మేడి, అంజూర

కాకర[1] రూ.చూ. కాఁకర. వి. సారవంతమైన భూముల్లో విరివిగా కాసే తీగపైరు. (Momordica charantia).

కాకరకాయపదును విఇ. పెంకి స్వభావంకల. కాకరచిత్త వి. వరితెగులు. పచ్చపురుగులు పట్టి ఆకులు తింటాయి. కాకరపువ్వంచు వి. కాకరపువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. <కాకరపువ్వు + అంచు. కాకరపువ్వు వి. ఒకరకం కమ్మి డిజైను. కాకరపువ్వుపేటు వి. కాకరపువ్వు మాదిరి డిజైను.

కాకర[2] వి. దూది ఏకే కమాను పలకలను బిగించిన తోలు పట్టె.

కాకరి వి. ఒంటరి, ఏకాకి, వ్యర్థుడు.

కాకా వి. కార్యసాధన కోసం చేసేసేవ.

కాకాటువ్వా వి. పసుపుపచ్చని జుట్టుగల పెద్దతెల్లచిలక.

పో. కాకాతూ; స్పా. కాకాతూ; ఆ.ఫ్రె. కకతూఎన్; డచ్చి. కకెతో.

కాకాదు అ.క్రి. ఎంతమాత్రంకాదు.

<కాదు + కాదు.

కాకాలి వి. 1. కలిగొట్టు ; 2. అడవి ఉలవలు, కారుకొల్లి.

సం. కాకోలి. అడవిఉలవ.

<సం. కాకోలీ.

కాకాలుగుణించు స.క్రి. కాగుణింతం రాయు.

కాకి వి. 1. కాకం. కు. సం. 4.35. కాశీ. 3.84 ; 2. నల్లటివన్నె గల్గిన పందెం కోడిపుంజు. విఇ. నీచమైన, అల్పమైన, చిన్న, తక్కువైన.

క. కాకి, కాకె, కాగె. కాకి ; కాకికాకా కావు కావు. కాకుల అరుపు ; కొడ. కాకె. కాకి ; కొ. కాకిఅరుపు ; తు. కక్కె. కాకి ; కాకే. కాకి ; త. కాక్కై. కాకి ; కాకమ, కాక్కాయ్. కాకి; కాక్కా. కాకులఅరుపు; కాక్కావ్ ఎనల్. కాకి అరుపు ; మ. కాక్క. కాకి ; కాక్కచ్చి, కాకన్. కాకి ; కోట. కాక్, కామ్క. కాకి ; తొ. కాక్, కక్. కాకి ; గోం. కాకఢ్, కావాల్ ; కొండ. కాకి ; కుఇ. కాక, బావ ; కువి. కావ్వ, కావ ; పర్జి. కావల్ ; కొలా. కక. కాక ; గద. కాకలి ; ఒల్లా. కాకల్ ; కురు. ఖాఖా ; మాల్తో. క్వక్వే ; బ్రా. ఖాఖో.

సం. కాక-.కాకి ; కాకీ. ఆడకాకి ; ప్రా. కాక, కాగ ; పా. కాక, కాగీ, ఆడకాకి ; అ.మా. కాక, కాగ, కాగీ. ఆడకాకి

<సం. కాకి.

కాకిఎంగిలి వి. చిన్న పిల్లలు గుడ్డలో పెట్టి తినుబండారాన్ని కొరకటం. కాకి క్రి విఇ. కాకినలుపు. కాకికలువ వి. అల్లిపువ్వు, కాకోత్పలం. కాకికూఁత వి. కాకిఅరుపు. కాకిగూడు వి. జొన్న, సజ్జ మొ. మెట్టపైర్లు కోసేసిన కట్టలు నాలు గైదిటిని కలిపి నిలబెట్టి గుడిసెలాగా వేసిన కుప్ప. కాకిగోల వి. 1. కాకుల సంగమం చూచిన వానికి దోషం తగులుతుందని దానిపరిహారార్థంగా, వాడు చనిపోయాడని బంధువులకు తెలియజేసి దుఃఖించేట్లు చేస్తారు-ఈ చెడ్డవార్త విని చుట్టాలు చేసే గోల-వెంటనే నిజాన్ని చెప్పి ఓదార్చి దోషాన్ని పారదోలు తారు ; 2. పదార్థం లభించి నంతనే కాకులన్నీ చేసేగోల. కాకిగోలచేయు అ.క్రి. అర్థంలేని సందడిచేయు. కాకిచంపు వి. కాకమారి. తెలుపు, ఎరుపు, నలుపు రంగుల కాయలు, ఆకుపచ్చపూలు పూసే తీగ (Anamirta coculus). కాకిచంపువిత్తులు వి.బ.వ. కాకమారి. కాకుల్ని చంపటానికి ఎరగా ఉపయోగించే విత్తులు. కాకిచాయ వి. కాకి గుడ్డరంగు. కాకిచావు వి. దిక్కు మాలిన చావు, ఆకస్మికమృతి. కాకిచిప్ప వి. నీటిగుల్ల, కప్పచిప్ప, శంబూక. యయా. 3.30. కొలా. కాకె. గుల్లచేప ; నా. కాకె. గుల్లచేప, నత్త. కాకిచిప్పర. వి. చిప్పరలో ఒక రకం కలుపుమొక్క. (panicum prostratum) కాకిచిమ్మ వి. కాకిరోగం, మూర్ఛరోగం. పశువు నడుస్తూ, నడుస్తూ పడిపోయేరోగం. కాకిచూపు వి. పక్కకు చూడటానికి తలతిప్పిగాని చూడలేవట్టిచూపు, కాకిలాగ చూచేచూపు కాకిచూపుచూచు స. క్రి. మెల్లకంటి చూపు పెట్టు

కాకిచెష్టలమనిషి వి. అద్దరపుమనిషి, విద్దూరపు మనిషి. కాకిచెష్టలు వి.బ.వ. కాకిసోమాల. మూర్ఛలో గలిగే పెక్కువికారాలు. కాకిచెఱకు వి. శరం, తృణవిశేషం. అడవిచెరకు, చెరకువంటి ఒకానొక కసువుగడ్డి. ఆం. భా. 2.75. క. కాగెగబ్బు, కాగిబియరు. ఇంటికప్పుకు, పశు గ్రాసానికి పనికివచ్చే ఒకరకం గడ్డి (Saccharum Spontanecum). కాకిజొన్న వి. బొంతునల్లగా ఉండే రకం జొన్న. కాకిశివు వి. మూర్ఛల్లో ఒకరకం అపస్మారం, కాకిసొమ్మ. త. కాక్కై-వలి. మూర్ఛ జబ్బుపడటం. కాకితుమికి రూ.చూ. కాకితుమ్మికి. వి. నల్లతుమికి, కాక తిందుకం. కాకితుమ్మి రూ. చూ. కాకితుమ్మికి. వి. నల్ల తుమ్మికి, కాకతిందుకం. కాకితుమ్మికి రూ. కాకితుమికి, కాకి తుమ్మి, కాకితూకి. వి. నల్లతుమికి, కాకతిందుకం; త. కాక్కాయ్‌త్కాళి. ఒకరకం చెట్టు (Diosfyros-ebeeum). కాకితూకి రూ.చూ. కాకితుమ్మికి. వి. నల్లతుమికి, కాకతిందుకం. హంస. 4.11. కాకిదొండ వి. కాకతుండి, కొంచెం నల్లగాఉండి, పచ్చికాయలు చేదుగా, పళ్ళుతియ్యగా ఉండే దొండ (Cocinia indica). ఆం. భా. 2.60. క. కాగెదొండె, కాకతుండె, కాగతొండె. కాకిదోర వి. ఎరుపులో కొంత లెక్క నలుపు కల్గిన రంగు. కాకినెరెడ వి. నల్లమబ్బు. కాకినేరెడు రూ.చూ. కాకినేరేడు. వి. నీలనేరేడు. కాకినేరేడు రూ. కాకినెరెడు. వి. నేలనేరేడు, కాకజంబువు. ఆం. భా. 2.46. పో. చూ. క. కాగినీఅళె. కాకిపదుపు వి. కాకులగుంపు. భార. కర్ణ. 2.61. కాకిపిట్ట వి. కాకి. నీలా. 1.111. కాకిపెంపుడు వి. కోయిల, పరభృతం. ద్వి. తి. సా. 12 పు. 6 పం. కాకిపెనర రూ. కాకిపెనరు. వి. పిల్లపెనర, కాకముద్గ. ఆం. భా. 2.58. కాకిపెనరు రూ. చూ. కాకిపెనర. వి. పిల్లపెనర, కాకముద్గ. ఆం. భా. 2.235. కాకిపెసలు వి.బ.వ. పిల్లపెసలు. ఆం. భా. 2.235. కాకిపొన్న వి. ఉప్పుపొన్న చెట్టు, ఊడలుండే ఒకరకం చెట్టు (Rhizophola contrigata). కాకిబంగారమగు అ.క్రి. కనిపించక పోవు. కాకిబంగారము రూ. చూ. కాకిబంగారు. వి. అభ్రకం. కాకిబంగారు రూ. కాకిబంగారము. వి. 1. అభ్రకం, మైకా. ఆం. భా. 2.278 ; 2. బంగారం వంటి రంగు ఉండేపూసలు. క. కాగెబంగార, కాగెబింగార ; తు. కాకెబంగారు ; త. కాక్కాయ్‌పొన్, కాక్కైపొన్. వివాహాలు మొ. శుభకార్యాల సమయంలో అలంకారార్థం ఉపయోగించే బంగారు రేకుల్లాంటి రేకులు. కాకిబరివట వి. కాకిగడ్డి, ఒక రకం కలుపుమొక్క. కాకిబలగము వి. ఎక్కడెక్కడి వారో కలిసిన బంధువుల సమూహం. కాకిబాతు వి. ఒకవిధమైన అడవిబాతు. కాకిబీర వి. ఒకజాతికిచెందిన తీగ (Hugonia mystax). కాకిబుడ్డాకు వి. ఒకరకం కలుపు మొక్క (Cardio sperum). కాకిబుసికేలు వి. బొంతు నల్లగా ఉండేరకం జొన్న. కాకిబేగడ వి. కాకిబంగారు. ద్వి. పరమ. 4.323,14. కాకిబొచ్చ వి. నల్లగాఉండే బొచ్చు చేప. కాకిబొంతరాయి వి. ఇటుక కాల్చడంలో మంట ఎక్కువై చిట్టెంగట్టిన నల్లటి రాయి. కాకిబ్రౌమ వి. ఖాకిగుడ్డరంగు. కాకిమట్టి వి. ఒకరకమైన తీగ, దీని విత్తనాలనుండి వచ్చే నూనె కొన్నిరకాల చర్మవ్యాధుల్ని నయంచేస్తుంది. కాకిమాచి వి. ముదురు పసుపురంగు పళ్ళుకాసే ఒకమొక్క, ఇది రమారమి 5 అడుగుల ఎత్తు పెరుగుతుంది (Solanum indicum). కాకిమాదుజొన్న వి. పొట్టు (బొంతు) నల్లగాను గింజతెల్లగాను ఉండే రకం జొన్న. కాకిమారేడు వి. ఒకరకం మారేడు చెట్టు. కాకిముక్కులు వి.బ.వ. గింజలు పెద్దగాఉండే నల్ల రకం వడ్లు. కాకిమేడి వి. బ్రహ్మమేడి. అల్పంగాఉండే ఒకచిన్న చెట్టు. ఆం.భా. 2.42 (Ficus hispida). కాకి మొర్ప వి. ఆకాశం రంగు మొరసనేల. కాకిరాయి వి. 1. క్వార్ట్జ్ జాతికి చెందిన మిశ్రశిల (Metemorpticrock) ; 2. బండమీద నరకులు గుర్తిస్తూ గీతలుగీయటానికి వాడే ఎర్రటిరాయి. కాకిరెక్కలు వి.బ.వ. వడ్లునలుపు బియ్యం తెలుపుగల ఒకరకం వరి. కాకిరెక్కాకు రూ. చూ. కాకి తెక్కాకు. వి. వెదల్పాటి ఆకులుండే కలుపుమొక్క. కాకిరెల్లు రూ.చూ. కాకితెల్లు. వి. శరం, రెల్లు, కాకివెదురు (Soccharum spontanum). కాకిరేగు వి. ఒకరకం రేగిచెట్టు. కాకితెక్కలు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. కాకితెక్కాకు రూ. కాకి రెక్కాకు. వి. ఒక జాతి కలుపుమొక్క. కాకితెల్లు రూ. కాకిరెల్లు. వి. ఒకజాతిరెల్లు. కాకివన్నె వి. ఒకవన్నెగల పందెపు కోడిపుంజు. కాకివానం వి. వన్నటివానం. కాకివెదురు వి. తృణవిశేషం, కాకిరెల్లు, రెల్లు. వెదురుకొయ్యలో ఒకరకం. హంస. 5.44. క. కాకెబియరు. ఇంటికప్పుకు, పశుగ్రాసంగాను ఉపయోగ పడే ఒక రకం గడ్డి (Saccharum spontanum). కాకిసొమ్మ చూ. కాకిచెమ్మలు. రూ. కాకిసోమాల, కాకిసోమాలు. వి. మూర్ఛావిశేషం, అపస్మారం. త. కాక్కవలి. మూర్ఛరోగం. కాకిసోమాల రూ. చూ. కాకిసొమ్మ. వి. అపస్మారం. కాకిసోమాలు రూ. చూ. కాకిసొమ్మ. వి. 1. వెర్రిమొర్రి తనం, పిచ్చినంచు, వెర్రిబాగుల తనం ; 2. ఒకవ్యాధి, కాకిసొమ్మలు. కాకులిమెర వి. ఎర్రగొడచెట్టు. నలుపుగాని, నలుపుతో కూడినసిమెంటు రంగుగాని కల్గిన బెరడు, పసుపుగాని నలుపుతో కూడిన పసుపురంగులోగాని ఉండే కర్ర కలిగి, ఆకుపచ్చని పూలు, ఎరుపులో కూడిన బూడిదరంగులో ఉండేపళ్ళు కాసే ఒకచెట్టు (Diospyros-monana cordifolia). కాక్షారివిత్తులు వి.బ.వ. కాకిచంపు విత్తులు.

కాకితము రూ. కాకిదము, కాగజము, కాగతము, కాగదము, కాగితము, కాగిదము, కాయిగము. వి. రాయటానికి ఉప యోగించే పత్రవిశేషం. భీమ. 1.73 ; ఉత్తరం, జాబు.

హిం. ఉ. కాగజ్. కాగితం.

< ఉ. కాగజ్.

కాకితమ్మ వి. కాకతీయుల కులదేవత.

< కాకిత + అమ్మ.

కాకితి వి. పెదబిక్కిచెట్టు. పెద్దపెద్ద ఆకులు, పూలు ఉండే ఒక చెట్టు (Gardenia latifolia).

కాకిదము రూ.చూ. కాకితము. వి. కాగితం.

కాకిరంగు రూ.చూ. ఖాకీరంగు. వి. ఖాకిగుడ్డరంగు.

కాకిరశింగు వి. హిమాలయాల్లో పెరిగే ఒకరకం మందుచెట్టు.

కాకు వి.గాని. బాధ, అవమానం, నింద, ఈసడింపు. సిం. ద్వా. 7.9. విశ. 1. వెల్లాచెదరైన, చిందర వందరైన. రామా. 6.251; 2. కళావిహీనమైన. విష్ణు. పు. 2; 3. వ్యర్థమైన, వట్టి. మైరా. 1.72; 4. వివాదపడిన. పాంచాలీ. 4.24.

క. కాకు, కాంకె, ఎక్కువగా వేడిచేసిన స్థితి, చిరాకు, అలసట, సూర్యరశ్మి వలన కలిగిన స్థితి, బాధ మొ॥; త. కాయ్. బాధించు, కష్టపెట్టు, నిందించు.

కాకుచేయు రూ. కాకుసేయు. స.క్రి. 1. నిందించు, అవమానపరచు. హరి.పూ. 4.155; 2. వ్యర్థపుచ్చు. మైరా. 1.72; 3. అణచు. చంద్రాంగ. 1.21; 4. బాధించు, హింసించు. ద్వి.తి.సా. 1. పు. 6. పం. 12. కాకుఁదనము వి. దుశ్చేష్ట, దుండగం. వేంక. పంచ. 4.429. కాకువడు అ.క్రి. కలతనొందు. భాగ. 8.318. శశా. 4.127. కాకువరచు రూ.చూ. కాకుపఱచు. స.క్రి. గాబరాపెట్టు. కాకుపఱచు రూ. కాకుపరచు. స.క్రి. వశపరచుకొను, అనుకూలం చేసుకొను. భాగ. 8 318. కాకుసేయు(-చేయు) రూ.చూ. కాకుచేయు. స.క్రి. 1. అవమానపరచు, నిందించు. కాశీ. 5.88; 2. అణచు. మను. 3.19; 3. లేకుండా చేయు, లోపింపచేయు. కాళిందీ. 6.17.

కాకువెన్నె చూ. కాక1.

కాకుపాల రూ. కాకపాల. వి. 'ఆలీవ్' రంగుతోకూడిన బూడిద రంగులో ఉండే కర్ర కలిగి కొమ్మలు లేక నిటారుగా పెరిగే ఒక చెట్టు (Zizyphus trinervia) వాతనారాయణాకు.

కాకులిమెర చూ. కాకి.

కాకెల్లగొట్టు రూ. కాక3.

కాకేమి చూ. కాక1.

కాకేయు చూ. కాక3.

కాకోటి1 వి. కావడిబద్ద.

కాకోటి2 వి. మజ్జిగ కుండలోకి చీమలు ఎక్కకుండా నీళ్ళుపోసి పెట్టే మట్టికుదురు.

కాక్డా రూ.చూ. కాగడా1. వి. దివిటి.

కాక్మారీవిత్తులు చూ. కాకి.

కాగజము రూ.చూ. కాకితము. వి. కాగితం.

కాగంచు చూ. కాగు1.

కాగడ రూ.చూ. కాగడా1. వి. కాగడా.

కాగడా1 రూ. కాకడా, కాక్డా. కాగడ, కాఁగడా. వి. కొయ్య లేక గుడ్డతో ఏర్పరచిన చేతి దివ్వటీ.

మరా. కాక్డా, కాంక్డా. గుడ్డతో చేసిన దీపపువత్తి.

కాగడా2 వి. వాసనలేని బెంగుళూరు మల్లెపువ్వు.

కాగతము రూ.చూ. కాకితము. వి. కాగితం. విష్ణు. పు. 3.24.

కాగదము రూ.చూ. కాకితము. వి. కాగితం.

కాగా రూ. కాఁగ. అవ్య. కావున, కనుక, కాబట్టి.

కాగించు చూ. కాగు1.

కాగితము రూ.చూ. కాకితము. వి. కాకితం. దశా. 3.45, ఉత్తరం, జవాబు, ప్రత్యుత్తరం.

కాగితాలాట వి. కాగితాలతో ఆడే ఆట.

కాగితాలాట చూ. కాగితము.

కాగిదము రూ.చూ. కాకితము. వి. కాగితం.

కాగిన వి. మత్స్య విశేషం.

పో.చూ.త. కాక్కన్. సముద్రం చేప, రమారమి 1½ అం. పొడుగుంటుంది.

కాగు1 రూ.చూ. కాఁగు. వి. 1. నీళ్ళు కాగబెట్టటానికి ఉపయోగించే పెద్ద లోహపు పాత్ర; 2. ధాన్యంపోసే రొమ్ము లెత్తు మట్టికుండ; 3. మూతి చిన్నదిగా, పొట్ట పెద్దదిగా గుండ్రంగా ఎత్తుగా ఉండే పెద్దమట్టిపాత్ర; 4. రంగునీళ్ళు ఉడకబెట్టే పెద్దదబ్బా. అ.క్రి. 1. ఎండు, అరు; 2. ఉడుకు, వెచ్చనగు, వేడెక్కు, మరుగు.

కాగంచు వి. కాగులకు పెట్టే దబ్బగా ఉండే అంచు.

కాగించు స.క్రి. కాచు, కాలేటట్లుచేయు. కాసుడుకుండ వి. నీళ్ళు కాచుకోడానికి వాడే మట్టి పాత్ర. కాగుపొట్ట వి. వడ్లు నిల్వచేసుకోటానికి వాడే పెద్ద మట్టిపాత్ర. కాగురాయి రూ. కాగుఱ్ఱాయి. వి. కాగులు, తొట్లు మొ॥ వాటిని నరేసేరాయి. కాగుఱ్ఱాయి రూ.చూ. కాగురాయి.

కాగు2 రూ.చూ. కానుగు. వి. కానుగచెట్టు, జదేసి ఆకులు రెమ్మగా కలిగి పాటల వర్ణపు పూలు పూసే ఒక చెట్టు. దీని కలప బండి చక్రాల తయారీలో ఉపయుక్తం (Pongamia-glabra).

కాంకారి రూ. కాముగారి. వి. పని, మరమ్మత్తు.

హిం. ఉ. కామ్. పని.

కాంకీటు రూ. చూ. కాంక్రీటు. వి. కట్టుబడికి కావలసిన రాళ్ళు దారికి గుట్ట.

కాంక్రీటు రూ. కంకరేటు, కాంకీటు. వి. సిమెంటు, నన్నగులక, ఇనక కలిపిన మిశ్రమం.

ఇం. *Concrete.* సిమెంటు ఇనక నల్లరాళ్ళ మిశ్రమం.

< ఇం. Concrete.

కాంగ రూ.చూ. కాఁగ. అవ్య. ద్రు. అవగా.

కాంగా రూ.చూ. కాఁగ. అవ్య. ద్రు. కావున, అగునట్టి. ద.హిం.శా. 10.776. క్రీ.శ. 1736.

కాంగు వి. ముతకగుడ్డ, సీలిగుడ్డ.

కాంగుండ వి. నీళ్ళుకాగబెట్టడానికి వాడే మట్టి పాత్ర.

కాంగో వి. ఒకరకం ఎరుపురంగు, పొడిరంగు.

కాంగ్రెసు వి. భారతదేశ స్వాతంత్ర్య సిద్ధికై క్రీ.శ. 1885 లో స్థాపించబడ్డ రాజకీయ పక్షం.

ఇం. *Congress.* సభ.

< ఇం. Congress.

కాంగ్రెసుబార్డరు వి. ఒకవైపు పచ్చ, తెలుపు, ఎరుపు రంగుల్లో వేలెడేసి వెడల్పు పట్టెలువేసిన అంచు, కాంగ్రెసు పార్టీ జండాలాగ ఉండే అంచు.

ఇం. *Congress border.* కాంగ్రెసు అంచు.

< ఇం. Congress border.

కాఁక రూ. కాక, క్రాఁక. చూ. కాఁగు. వి. 1. కోపం. జైమినీ. భా. 1.64; 2. తాపం, బాధ. మను. 3.93; 3. విరహవ్యధ. ఆము. 5.155; 4. తపస్సు. వసు. 2.46; 5. వేడిమి. ఉత్త.రా. 2.161, 6. జ్వరం; విణ. వేడిగా ఉన్న.

కాఁకకురుపులు వి.బ.వ. వేడివల్ల వచ్చే కురుపులు. కాఁక చేయు స.క్రి. కాపుపెట్టు, నేర్పు గడించు, వేడిచేయు. కాఁకదేఱు అ.క్రి. 1. తప్తమగు. కవిరా. 3.110 ; 2. గడి తేరు, గడునుమీరు. కాఁకవీరుడిదెవులు వి. అతిసారం, గ్రహణి. కాఁకమాటలు వి.బ.వ. కోపం మాటలు. కాఁకరా వి. వెలుగులరేడు, సూర్యుడు. ప్రబంధ. 216. త. కాయ్-కతిరోన్. సూర్యుడు. కాఁకలమదేఱు అ.క్రి. అరి తేరు, గడునుపారు. హంస. 5.110. కాకలుతేరు అ.క్రి. 1. కడగండ్లుపడు ; 2. ఆరితేరు. కాఁకవడు అ.క్రి. తప్త మగు, కాలు. గంధ. 20. కాఁకవెలుఁగు వి. ఉష్ణరశ్మి, సూర్యుడు. రామా. 3.52.

కాఁకర రూ. కాకర[1]. వి. కారవేల్లం, కాకర. బహుళా. 4.14 (Mormordica charantia).

పో.చూ. త. కారై. లతావిశేషం (Balsauper) ; పో.చూ. పర్జి. కాకఁది. వంగ ; పో.చూ. ఒల్లా. కాకల్ కాకసిల్. వంగ.

కాఁకరపాదు వి. కాండవల్లి. కాఁకరపువ్వువత్తి వి. కాల్చే టప్పుడు కాకరపువ్వువంటి నిప్పుకణాలు రాలే ఒకానొక బాణ సంచు. కాఁకరవత్తి వి. బాణసంచు విశేషం, కాకరపువ్వు వత్తి.

కాఁగ రూ. కాగా, కాంగ, కాంగా, కాఁగా. అవ్య.ద్రు. కనుక, కాబట్టి. చూ. కా[1]. ఆం.భా. 3.70.

త. ఆకైయాల్. కాబట్టి.

కాఁగఁబోలు చూ. కాన్. అవ్య. ఊహను తెలిపేది. హరి.ఉ. 6.107.

కాఁగడా రూ.చూ. కాగడా. వి. కరదీపిక, చేతిదివ్వెటి. హంస. 3.28.

కాఁగలించుకొను రూ.చూ. కౌగలించుకొను. స.క్రి. ఆలింగనం చేసుకొను.

కాఁగా రూ.చూ. కాఁగ. అవ్య.ద్రు. 1. కనుక, కాబట్టి. బహుళా. 108 ; 2 అయ్యేటట్లుగా.

కాఁగాని విశ. కూడని, కాని, తగని. శృం.నై. 7.151. త. అకాతు. తగని, కూడని. కాఁగానే అవ్య. జరిగిన వెంటనే[1].

కాఁగు రూ. కాగు[1], క్రాఁగు. చూ. కాయు[1]. అ.క్రి. 1. కోపించు. నృసింహ. 4.130 ; 2. కాలు, తప్తమగు. కాశీ. 3.152 ; 3. బాధపడు. ప్రబంధ. 59. వి. 1. పెద్దబాన. ఉ.హరి. 4.86 ; 2. రాగిబిందె లేక దేగిసా. పాండు. 4.211.

క. కాంకె, కాకు, కాయ్పు, కావు, కావొ. వేడి ; కాయ్, కాయ్‌ద్, కాద్. వేడెక్కు, కోపగించు ; కాయిసు, కాసు. వేడిచేయు ; కావర, కావుర. కోపం, మానసిక వేదన ; కొడ. కాయ్. వేడెక్కు, కాగు ; కాచ్. కాగు, కరగు ; తు. కాయిపుని. వేడిచేయు, కాచు ; కాయావుని. వేడిచేసినదానిని తీసుకొను ; కావు. వేడి ; త. కాంజె. వేడి ; కాయ్. కోపపడు, కాల్చు, ఆకలితో బాధపడు ; కాంకు. పెద్ద మట్టికుండ ; కాయ్చ్చల్. వేడిచేయటం ; కాయ్మ్పు. నిప్పుల్లో వేడిచేయటం ; కాయ్త్తు. కాలేటట్లు చేయు ; కాయ్ప్పు. అయిష్టం ; కాయ్మై. అసూయ ; కాంకై. వేడి, జ్వరం తగిలినట్లుగా ఉండటం ; కాంతు (కాంతి). కాల్చు, కోపపడు ; కాంకు, కాంకై. నీళ్ళు కాచు కునే మట్టికుండ ; మ. కాయల్, కాయ్పు. వేడివస్తువు ; కావ్చల్. వేడి, ఉష్ణం ; కామ్చుక, కాయ్క్క. కాచు ; కాయుక, కాంతుక. వేడిగా ఉండు ; కో. కాయ్ (కాచ్-). వేడెక్కు ; కచ్. వేడిచేయు ; కాచ్. వేడిచేయు ; కయ్. వేడెక్కు ; తొ. కొయ్, కోయ్ (కోస్-). వేడిగాఉండు ; కాచ్, కోచ్-. కాచు, వేడిచేయు ; కాపానా. వేడిచేయు ; కొండ. కసిస్. నిప్పు అంటించు, పొయ్యి ముందుగాని, సూర్యరశ్మితో కాని కాచుకొను ; కాంద. వేడిగా ఉండు ; కాస్ప. వేడిచేయు; కువి. కైయలి. వేడెక్కు; కదలి. కాల్చు నట్టి ; కెయి. వేడి ; కైయు, కీఅవి. వేడిచేయు ; కాక. వేడి ; పర్జి. కాపిప్. వేడి ; కాఁక. నీళ్ళు కాగటంవల్ల ఏర్పడ్డ వేడి ; కొలా. కాంగ్, కాయ్‌చ్. వేడగు ; కంగ్-. (కం క్‌క్-), కప్. కాచు, మరగించు ; నా. కాంగ్. వేడగు ; కాప్. వేయించు, కాచు ; గద. కాయ్‌ప్(కాయ్‌ల్-). మర గించు; కాయ్‌కిల్, కాయ్‌కిప్. జ్వరం; ఒల్లా. కాయ్‌కిల్, కాయ్‌ప్. కాచు, మరగించు ; కాయ్‌కిర్. జ్వరం ; కురు. ఖాయ్‌హ్. ఆరబెట్టటం ; ఖైఖైర్నా. పూర్తిగా ఆరు ; ఖైగ్‌నా, ఖైదఅనా. ఎండేట్లు చేయు, ఆరేటట్లు చేయు ; మాల్తో. క్యయె. ఎండు, ఆరు ; బ్రా. ఖాఖర్. నిప్పు, కోపం.

<మూ.ద్రా. *కాయ్-. *కా-క్-/-.క్క్-.

కాఁగుబిందె వి. నీళ్ళు కాచుకోడానికి ఉపయోగించే రాగి బిందె, దేగిసా.

కాఁగుడు చూ. కాఁగు, వి. తపించటం, తపనం, కాగటం.

కాచగడ్డ రూ. కమనగడ్డ. వి. పడుగుకుపెట్టే గంజి తయారు చెయ్యటానికి పనికివచ్చే ఒకరకం దుంప.

కాచండి రూ. కానండి. వి. పానపాత్ర.

సం. కాచ-. గాజు.

<సం. కాచ- + అండీ.

కాచి వి. ఏటా మొలిచి 3 అడుగుల ఎత్తు పెరిగే గడ్డిమొక్క (Solanum nigrum).

కాచికొను చూ. కాచు[1].

కాచికోలు చూ. కాచు[1].

కాచిపుల్ల వి. దోనె గాడిలో, బద్దెచువ్వ తగిలించటానికి అమ ర్చిన కొయ్యపుల్ల.

కాచిపోవు చూ. కాచు[1].

కాచీకోక రూ.చూ. కాసీకోక. వి. బిగింపుకు కాని అందానికి కాని నడుంకి చుట్టుకొనే ఒకరకం బట్ట.

కాచు[1] స.క్రి. 1. కాపాడు, రక్షించు. భార.ఆది. 6.286 ; 2. మన్నించు, రక్షించు. భార.సభా. 1.45 ; 3. సమయ. కనిపెట్టు, ఎదురుచూచు. భార.అరణ్య. 3.45 ; 4. అపు. భాస్కరా.సుందర. 2.58 ; 5. పథ్యంచేయు ; 6. గౌర వించు, లక్ష్యపెట్టు.

క. కాయ్, కాయి, కాయు, కా. రక్షించు ; కాయిసు. పరిరక్షించు ; కాపు, కాపూ. రక్షించటం ; కాయి, కాహి.

కావలివాడు ; తు. కావళ్, కావల, కావలు, కావలి. కావలి ; కావుని. నిరీక్షించటం ; కాతోనుని. నిరీక్షించు ; కావు, కావ్వు. నిరీక్షించటం ; కాపెలె, రక్షకుడు ; కావలు. రక్షణ ; త. కా. రక్షించు ; కాక్కై. కాపాడే ; కాప్పు, కావల్. రక్షణ, భద్రత ; కావలాన్. రక్షకుడు; మ. కాక్కుక. రక్షించు, పాలించు ; కాప్పు. జాగ్రత్తగా ఉంచు ; కాప్పిక్క. రక్షించు ; కావల్. కావలివాడు ; తొ. కొలా, కోఫ్. పరిరక్షించు ; గోండి. కేపానా. రక్షించు ; కెపన. కువికా, కావలి ; పర్జి. కాప్ ; కొలా. కయ్ ; గద. కాప్ ; కురు. ఖాప్నా ; మాల్తో. కపె ; బ్రా. ఖ్యాఫింగ్. మేపు ; ఖ్యాహింగ్. మేయు.
మూ.ద్రా. *కా-. కాపాడు.

**కాచికొను** రూ.చూ. కాచుకొను. స.క్రి. కాపాడు, రక్షించు. భార.ఆది. 7.43. అ.క్రి. ప్రతీక్షించు. **కాచికోలు** రూ. కాచుకోలు. వి. కాచుకొనటం, రక్షించుకొనటం. భార. ఉద్యో. 1.348. **కాచిపోవు** స.క్రి. అరసికొను, ఆపదలో ఆదుకొను. **కాచుకొను** రూ. కాచికొను. స.క్రి. కాపాడు, రక్షించు. విక్ర. 3.129 ; అ.క్రి. ప్రతీక్షించు, నిరీక్షించు. కళా. 4.177. **కాచుకోలు** రూ.చూ. కాచికోలు. వి. కాచుకోవటం, రక్షించుకొనటం. భార.ఉద్యో. 1.348. **కాచువాడు** వి. రక్షకుడు.

**కాచు**[2] చూ. కాయు[3]. అ.క్రి. 1. బయలుదేరిన కాయలు కలది అగు. భార.ఆది. 4.20 ; 2. (ఎండ మొ.) ప్రసరించు. కు.సం. 6.137 ; స.క్రి. (కాయ మొ. వానిని) కాయు. హరి.పూ. 5.142 ; (ఎండ మొ.) కాయు, ప్రసరింపజేయు. అచ్చరా. అయోధ్య. 42.

**కాచు**[3] రూ.చూ. కాఁచు[4]. వి. మాంసం.
**కాచుమేపరి** వి. మాంసాశనుడు, రాక్షసుడు. **కాచుమేపరితనము** వి. మాంసాశనత్వం.

**కాచు**[4] వి. పోకను కాచగా అడుగుకు దిగిన మడ్డి, కవిరి వాడు గట్టిపడడానికి జిగురునీళ్ళతో కలిపి వాడే ద్రవ్యం.

**కాజ** రూ.చూ. కాఁజ. వి. ఒకజాతి కలువమొక్క.
**కాజగడ్డ** వి. ఒకరకం కలువమొక్క.

**కాజపుతైలము** రూ. కాయపుట్టితైలము. వి. కాయపుట్టితైలం (Melalecua leucacadendran).

**కాజా**[1] వి. 1. గుర్రానికి పైన వేసిన జీను. రంగ.చ. 1.159 ; 2. కళ్ళెం.
ఉ. కాజ. కళ్ళెం ; పార. కాజ. దీర్ఘంగా ఉన్న కళ్ళెం.
< ఉ. కాజ.

**కాజా**[2] వి. భక్ష్య విశేషం.
హిం.ఉ. ఖాజా. భక్ష్య విశేషం.
< హిం. ఖాజా.

**కాజా**[3] వి. చొక్కాకు గుండీలు పెట్టుకోడానికి ఎదపట్టె మొ. చోట్ల ఉండే కన్నం.
మరా. కాజేఁ.
పో. కాజా ; సావ. కాహా. కన్నం, పెట్టె.

**కాజాకుండ** పో.చూ. కూజా. వి. గుండ్రంగా 12 అంగుళాల వ్యాసంలో అర్ధ అడుగు లోతులో అంచు సన్నగా అడుగున లోడిగా ఉండే మట్టిపాత్ర.

**కాజి**[1] వి. వృక్ష విశేషం. పారి. 2.49.
పో.చూ.త. కాంచి.

**కాజి**[2] రూ.చూ. ఖాజా. వి. మహమ్మదీయుల ఆచారి, మహమ్మదీయ న్యాయాధిపతి, న్యాయకర్త.

**కాజీ** రూ.చూ. ఖాజా. వి. న్యాయాధిపతి.

**కాజుదారు** రూ. కానుదారి (వాడు) వి. గుర్రపువాడు.
ఉ. కాజదార్. గుర్రం కళ్ళెం గలవాడు.
< ఉ. కాజదార్.

**కాజేయు** రూ.చూ. కాఁజేయు. స.క్రి 1. చంపు ; 2. అపహరించు ; 3. తినివేయు.

**కాంచర** రూ.చూ. కానర. వి. తినటానికి ఉపయోగించే పళ్ళు కాసే తీగె.

**కాంచి** రూ.చూ. కంచి. వి. 1. ముక్కోణం ఆకారంలో కొయ్యతోనో, ఇనుప బద్దీలతోనో నిర్మించిన చట్రం ; 2. తిటికిలో వాలుగా ఉన్న భాగం ; 3. సుమారు మూరెడు పొడుగుండే ఇనపచువ్వ.

**కాంచిరంగు** వి. వక్కరంగులో ముదురువన్నె.

**కాంచు**[1] రూ. కాఁచు[3], కానుచు, కాన్చు. స.క్రి. 1. దర్శించు, చూచు. భార.ఆది. 1.94. ఉ.హరి. 4.81; 2. (బిడ్డను)కను. భార.ఆది. 6.231 ; 3. పొందు. భార.ఆది. 8.298 ; 4. కలుగు, చాలు, ఓపు. భార. ఆది. 8.299 ; 5. కనిపెట్టు. భార.అరణ్య. 2.82. విక్ర. 1.154 ; 6. తలచు, ఎంచు. భార. అను. 3.125. శృం.నై. 1.7 ; 7. ఆశ్రయించు. భాస్క.రా. సుందర. 782.3.
క. కాణిసు. చూపించు, అగపడు కొడ. కట్-(కటి-). చూపించు ; తు. కాణుసావ్పుని, కాణిసావ్పుని. చూపించు ; త. కాటు (కాట్టి-) చూపించు. కణ్. కాట్పు. సంతోషకరమైన, ప్రీతికరమైన, కళ్ళ ఎదుట ఉన్నది, వింత, వేడుక, కనపరచటం, చూపటం ; మ. కాణిక్క. చూపించు, ప్రత్యేకించి కనపరచు, కాట్టుక. చూపించు, కనపరచు ; కాడ్మ. చూపించు ; కోట. కట్-(క.ట్-). చూపించు ; తొద. కొ.ట్-. చూపించు.

**కాంచు**[2] చూ. కాఁగు స.క్రి. 1. జొన్నలు, బియ్యం మొ. వాటి పిండి, గంజితియ్యటానికి ఉడకబెట్టు ; 2. (దనలికాయలు) కాచు, ఉడకబెట్టు.
**కాంచువడియము** రూ.చూ. కాఁచువడియము. వి. కవిరి కుప్పె.

**కాంచెనమాలగడిచీర** వి. నాలుగుపోగుల నల్పదరం రంగు గడిలో మధ్య రెండేసి రంగుపోగులు నిలువు, అడ్డం సృటంగా వడేట్టు వేసినచీర (ఒకానొక సినీతార పేరు మీద ప్రచారంలోకి వచ్చింది).

**కాంజామా** వి. ఉగ్రాణి, కారుబారి.

**కాఁచర** రూ.చూ. కానర (చెట్టు). వి. వృక్ష విశేషం. (Luffatuberosa) ఆం. భా. 2.70.
పో.చూ. క. కాసర, కాసరక, కాస్రు, కాసారక, వృక్ష విశేషం (Strychnosnwevomica) ; తు.

కామెరుదమర ; త. కాంచిరమ్, కాంచిరై, పై ; మ. కాన్తైరమ్.

కా(చి వి. కాకమాచి, ఓషధి విశేషం. హంస. 4.10.
క. కాచిగిడ. ఓషధి విశేషం ; పో.చూ.మ. కాబ్బిల్. చిన్నరకం చెట్టు (Dioscorealata).
సం. కాకమాచికా, కాకమాచీ.

కా(చు[1] రూ. క్రా(చు. చూ. కా(గు. స.క్రి. 1. కాగేట్లు చేయు, తపించేట్లు చేయు. భార. సభా. 2.89 ; శృం.నై. 4.120 ; 2. చలికాచుకొను, చలిపోగొట్టుకొను. నారపంచ. 1.504 ; 3. (నొప్పి మొ. పోవటానికి) వెచ్చచేయు.
క. కాసు, కాయిసు. వేడిచేయు. చలిపోగొట్టుకొను, నీళ్ళు మరగబెట్టు, వేయించు ; తు. కాయ్‌పు. వేడిచేయు, మరిగబెట్టు, వేయించు; త. కాయ్చ్చు. మరగబెట్టు, వండు, నిప్పులో వేడిచేయు ; మ. కాచ్చుక. వేడిచేయు, మరగ బెట్టు, బట్టీలో ఆవిరి వచ్చేట్టు వేడిచేయు.

కా(చు[2] వి. ఖాదిరం, కవిరి. ఆం.భా. 2.167.
క. కాచు ; తు. కాచు, కాచి. వక్కలు ఉడకబెట్టిన తర్వాత అడుగున మిగిలిన మస్తు ; త. కాచు-క్-కట్టి. ఖాదిరం, కవిరి, లేతకొబ్బరికాయలు, వక్కలు మొ. వాటి వల్ల తయారైన మిశ్రమం ; మ. కాచ్చు.
కా(చుకట్టె వి. కవిరి. కా(చువడియము రూ. కాంచువడి యము. వి. ఖాదిరం, కవిరి. ఆం. నా.శే. 55.

కా(చు[3] రూ.చూ. కాంచు[1]. అ.క్రి. చూచు.

కా(చు[4] రూ. కాచు[3]. వి. మాంసం.
కా(చుమేపరి వి. రాక్షసుడు.

కా(జ రూ. కాజ. వి. ఒకజాతి కలుపుమొక్క.

కా(జర రూ.చూ. కానర. వి. కాచర.

కా(జేయు రూ. కాజేయు. చూ. అగు. స.క్రి. 1. అయేట్లుచేయు, కావించు, కలుగజేయు. బసవ. 3.1001 ; 2. ముగించు కొను ; 3. అపహరించు, దొంగిలించు, పోగొట్టు ; 4. వెచ్చించు ; 5. చంపు.

కాట్ వి. మంచం.
ఇం. *Cot.* మంచం.
< ఇం. Cot.

కాట[1] వి. 1. పులిసిన అంబలి. చెన్నబసవ. 2.26 ; 2. కడుగు ; 3. గంజి.
క. కాటి. మజ్జిగ కలిపి తినే రాగి అంబలి ; మ. కాడి. అంబలి. సం. కటు. కారమైన. పుల్లని, పులిసిన ; పా. కటుక. చేదైన, పుల్లని, కారమైన, తీక్ష్ణమైన ; అ.మా. కటుఅ, కటుక, చేదు, కారం, పుల్లని.

కాట[2] విశే. 1. పోకిరి స్వభావంకల ; 2. తొందరపాటుకల.

కాటకతనము చూ. కాటకము[1]. రూ. కాటకాయితనము. వి. 1. కిరాతకత్వం ; 2. దౌడు ; 3. దోపిడి.

కాటకము[1] చూ. కాడు. వి. కరువు, క్షామం.
క. కాటుక, కాడు. సంకటం, ఆపద ; కొడ. కటు. ఆపద, చెత్త ; తు. కాడ్యుని, గాడియుని, గాడ్యుని, కష్టపెట్టు, బాధ కలిగించు ; గాదు, గాడ. బాధ, హింస ; కాట. కష్టం ; కాటుక, కాటికె, కాటిగె. బాధించేవాడు ; కాటాళి. మూర్ఖుడు.

కాటకము[2] చూ. కాటా. వి. పెద్ద బరువుల్ని తూచడానికి ఉప యోగించే త్రాసు.

కాటకాయితనము రూ.చూ. కాటకతనము. వి. 1. కిరాతకతనం; 2. దౌడు ; 3. దోపిడి.

కాటరుబూటరు వి. పనికిమాలినవాడు.

కాటన్ వి. దూది, పత్తిచెట్టు, నూలుబట్ట.
ఇం. *Cotton.*
< ఇం. Cotton.

కాటమయ్య వి. అడవిలో పసుల గాపరుల ప్రతిష్ఠించి ఆరా ధించే దేవత.

కాటమరాజు వి. కాత్రేడు.

కాటా రూ. ఖాటా. వి. పెద్దతాసు, డెబ్బైఅయిదుసేర్ల తూకం.
సం. కాష్ఠ-. కొయ్యముక్క, కర్ర, పొడవును కొలిచే పని ముట్టు, ఒకరకం కొలమానం ; అ.మా. కట్ఠ ; పా. కట్ఠ. కొయ్యముక్క, పాకల మేకు ఉపయోగించే కర్ర సామాగ్రి, కర్ర. హిం. కాఠ్. కర్ర ; మరా. కఠ్ఠి. కొయ్య, కర్ర.
< ప్రా. కట్ఠ-.
కాటాగరు వి. పెద్దతాను తూచే మనిషి. కాటాదారుడు వి. పెద్ద తాను తూచే మనిషి. ఉ. పార-.దార్. కలవాడనే అర్థంలో వచ్చే ప్రత్యయం.

కాటాముదము చూ. కాడు[1].

కాటావేయు చూ. కాటు[1]. స.క్రి. రంధ్రంచేయు.

కాటిక రూ.చూ. కాటుక. వి. 1. కాటుక ; 2. వరి, సజ్జ, జొన్న మొ. పైర్ల తెగులు.
కాటికఎన్ను వి. కాటికపట్టిన (నల్లబడిన) కంకి. కాటిక కంకి వి. కాటిక పట్టిన (నల్లబడ్డ) కంకి. కాటికకండ్లచీర రూ. కాటికండ్లచీర. వి. అయిదు కొలుకులు నలుపు, ఒక కొలికి ఎరుపు, ఒక కొలికి తెలుపు, ఒక కొలికి ఎరుపు చొ॥ నడిమి నేతకు పెట్టి ఎర్రంచు వేసిన చీర. కాటికకమ్మంచు వి. చిలకపచ్చరంగు చీరలో, ఒక కొలికి ఎరుపు (మద్ది రంగు), చిలకపచ్చరంగుల దారాలు పెట్టి నేసిన ఒక రంగు అంచు. కాటికతెగులు వి. వరి, సజ్జ, అరిక, జొన్న మొ॥ పైర్లతెగులు. కాటికపేను వి. పొగాకుకు పట్టే నల్లపురుగు. కాటికమబ్బు వి. నల్లటిమేఘం. కాటికరోగం వి. వరి, సజ్జ, అరిక, జొన్న మొ. పైర్ల తెగులు. కాటికలుపోవు అ.క్రి. జొన్నకంకి నలుపెక్కు. కాటికాకు వి. ఒకరకం కలుపు మొక్క. < కాటిక + ఆకు.

కాటికండ్లచీర రూ.చూ. కాటికకండ్లచీర. వి. అయిదు కొలుకులు నలుపు, ఎరుపు, తెలుపు, ఎరుపు. వరసగా ఒక్కొక్క కొలికి చొ॥ నడిమి నేతకు పెట్టే ఎర్రంచు వేసిన చీర.

కాటికాకు చూ. కాటిక.

కాటికా(డు రూ. కాటిగా(డు. వి. పక్షివిశేషం. ఆం. భా. 2.98.
పో. చూ. త. కాట్టై. కొలంకి పిట్ట.

కాటికాపరి చూ. కాడు[1].

కాటికాపరితనము చూ. కాడు[1].

కాటికి(గాళ్లచా(చు చూ. కాడు[1].

**కాటిగాఁడు** రూ.చూ. కాటికాఁడు. వి. పక్షివిశేషం.

**కాటిపాపడు** చూ. కాడు[1].

**కాటిపాపఁడు** చూ. కాడు[1].

**కాటిపాపలవాండ్రు** చూ. కాడు[1].

**కాటియాముదము** చూ. కాడు[1].

**కాటిరంగు** పో. చూ. కాటుక. వి. బొగ్గుమాదిరి నల్లరంగు.

**కాటివేఁడు** చూ. కాడు[1].

**కాటీ** వి. అచ్చుకట్టేటప్పుడు, పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పల్లి.

హిం. కాఁటీ.

**కాటు**[1] చూ. కఱచు. రూ. కాఁటు, కాఁడు. వి. 1. దంశనం, కరవటం. కు. సం. 9.117 ; 2. కరవటం వల్ల కల్గిన గాయం, గంటి. నృసింహ. 4.43 ; 3. దోస మొ. వాటి గుణాన్ని తెలిసికొనటానికి మొదట చాకుతో వేసిన చిన్న బెజ్జం.

క. కాటు. కొరకటం వల్ల కలిగిన గాయం, గొడ్డలివల్ల గాని, కత్తివల్లగాని తెగినగాయం ; *కడి*. కరచు ; *కడిత*, *కడత*. కరవటం ; కొడ. *కడి*. కొరకు, గాయం ; తు. *కడెపిని*, *కడెయుని*, *కడెవుని*. కరచు, పండ్లుకొరకు ; త. *కటి*. కరచు ; *కటిప్పు*. గాయంమచ్చ ; మ. *కటి*. కొరకటంవల్ల కల్గిన గాయం, కరవటం ; *కటిక్క*. కరచు ; *కటియుక*. బాధపడు, బద్దలగు ; కోట. *కయ్‌డీ*. కరచు ; *కయ్‌డ్*, *కయ్‌డ్‌ల్*. గాయం ; తొ. *కొడ్‌య్* (*కొడ్‌చ్-*). గీకుకోవాలనే కోర్కెను కలిగిఉండు ; కొండ. *కట్*. కరచు ; కురు. *కట్నా*. పండ్లతో కొరికి గాయపరచు ; బ్రా. *గట్*. గాయం.

**కాటుకొలుపు** రూ. కాటుకొల్పు. స. క్రి. ఉసికొల్పు. **కాటుకొల్పు** రూ.చూ. కాటుకొలుపు. స. క్రి. ఉసిగొలుపు. **కాటుపడు** రూ. చూ. కాటువడు. అ. క్రి. గాయపడు, క్షతమగు. **కాటుపెట్టు** స. క్రి. కరచు, గంటుపెట్టు. **కాటుపోవు** రూ. చూ. కాటువోవు. అ. క్రి. మాడి అడుగంటు. **కాటుబంటు** వి. బాగా కాటు వేసేది (కుక్క మొ.). **కాటుబంటుఁదనము** (-తనము) వి. బాగా కరవగల్గినశక్తి. సారంగ. 1.92. **కాటుమరుగు** అ. క్రి. పులి మొ. అడవి మృగాలు ఊరిపశువులను చంపటానికి అలవాటు పడు. **కాటులాట** రూ. కాట్లాట. వి. కరచుకొనటం. **కాటులాడు** రూ. కాట్లాడు. అ. క్రి. కలహించు. భార. శాంతి. 1.45. **కాటువడు** (-పడు) రూ. కాటువడు. అ. క్రి. గాయపడు, క్షతమగు. నిర్వ.రా. 4.76. **కాట్లకుక్క** వి. కరిచేకుక్క. **కాట్లాట** రూ. చూ. కాటులాట. వి. కాటులాట. **కాట్లాడు** రూ. చూ. కాటులాడు. స. క్రి. కాటురాడు, పోట్లాడు, కోట్లాడు.

**కాటు**[2] వి. మాడువాసన. రామలిం.శ. 55, మాడి అడుగంటటం.

క. కాటు, కాంటు, *గాటు*, *గాటు*. పొగాకు, మిరప కాయలు మొ. వాటి ఘాటువాసన ; తు. *గాటు*, *ఘాటు* ; త. *కటి*. వాసన, వాసనవేయు.

**కాటుకాటుగా** క్రి. విశ. రుచిభంగంగా (వంటకం కాటు పోయి వాసనగొట్టిన విధంగా). **కాటుపీలి** వి. మసి మాదిరి నలుపురంగు. **కాటుపోవు** రూ. చూ. కాటువోవు. అ. క్రి. మాడిఅడుగంటు. **కాటుబొగులు** వి. పండీ పండని స్థితి. **కాటురంగు** వి. 1. బొగ్గు మాదిరి నలుపురంగు ; 2. నలుపు మాదిరిగా గోరగా ఉండే రంగు. **కాటువాసన** వి. పొగతో కూడిన వాసన. **కాటువోవు** (-పోవు) రూ. కాటుపోవు. అ. క్రి. మాడి అడుగంటు. సాంబో. 5. 295.

**కాటు**[3] వి. 1. కోరా నూలు, చలవ చెయ్యని ముడి నూలు ; 2. పసుపు పచ్చరంగు.

**కాటు**[4] వి. 1. గాడిచెక్కలమీద ఉలితో తీసిన సన్నటి కాలవ ; 2. పెద్దరాతి బండలనుంచి పొరలు పొరలుగా రాతి పలకలను వేరుచేయడానికి కొలత ప్రకారం పగలకొట్టడానికి, గుర్తుగా గీసిన గీత ; 3. ఉన్ని కదురుపైన చేసిన గాడి ; 4. పగులు.

**కాటుకొయ్య** వి. నరికేకొయ్య కింద మోపుగా ఉండే కొయ్య దిమ్మ. **కాటుచెక్క** వి. నరికే కొయ్య కింద మోపుగా ఉండే కొయ్యదిమ్మ.

**కాటుక** రూ. కాటిక. వి. 1. కజ్జలం, కంటికి ఉపయోగించే లేపనద్రవ్యం, పోతన చాటువు ; 2. సస్యరోగ విశేషం ; 3. నలుపు ; 4. నలుపు, గోధుమరంగుల మధ్యస్థమైన రంగు.

క. కాడిగె. మసి, కాటుక ; తు. కాడిగె ; పో. చూ. త. కాఱు. గలుపుచేయు.

**కాటుకకంకి** వి. ఒకవిధమైన తెగులు వల్ల చెడిపోయి, నల్లబడిన జొన్న మొ. వానివెన్ను. **కాటుకకట్టు** వి. చచ్చిన వాని కండ్లకు కాటుక పెట్టడం, ఒకరకం కట్టు. **కాటుకకంటి గుఱ్ఱము** వి. ఇంద్రాయుధమనే పేరుగల గుర్రం. **కాటుక కనులు** వి.బ.వ. కాటుకలాగ ఉన్న నల్లటి కండ్లు. **కాటుకకొండ** వి. అంజనాద్రి భార. ద్రోణ. 2.259. దశా. 3.185. **కాటుకగింజలు** వి.బ.వ. జిరిగివిత్తులు, కొల్లివిత్తులు, కటవిత్తులు. **కాటుకగుబ్బలి** వి. అంజనాద్రి. **కాటుకపచ్చ** వి. ముదురాకు పచ్చ. **కాటుకపట్టు** అ.క్రి. నలుపారు, నల్లబడు. మను. 3.18. **కాటుకపిట్ట** వి. ఖంజనపక్షి, ఖంజరీటం, మంద పిచ్చుక. వసు. 3.108. **కాటుకరేకులపొడ** వి. పులిపెంజర. **కాటుకరేకులు** వి. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **కాటుక ఱాయి** వి. సౌవీరాంజనం. **కాటుకతేకులపాము** వి. కాటుకలాగ నల్లగా పొడలున్న ఒకరకం పాము, పులిపెంజర. **కాటుకతేకులు** వి.బ.వ. ఒకదినుసు వడ్లు. **కాటుకవేయు** స.క్రి. మోసగించు ; అ.క్రి. వరిపంటకు తెగులేర్పడు.

**కాటుగలియు** (-కలియు) అ.క్రి. పెద్దజనసమూహంలో పిల్లలు తప్పిపోవు.

**కాటుగుంజ** వి. రంగులో తడిసిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

**కాటుచీర** వి. ఒకకొలికి ఎరుపు రెండుకొలుకులు పోకరంగూ పెట్టినేసిన చీర.

**కాటుపీట** వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకారుకు ఊనికగా పెట్టేకొయ్య.

**కాటుమొద్దు** వి. పంటెకు నూలు చుట్టేటప్పుడు పంటెకారుకు ఊనికగా పెట్టేకొయ్య, నరికేకొయ్య కింద మోపుగా ఉండే

కొయ్యదిమ్మ.

కాటెనము వి. వరి, జొన్న మొ. వాటి తెగులు.

కాటెట్టి రూ. చూ. కాటేటి. వి. ఒకానొక క్షుద్రదేవత.

కాటేజి వి. 1. గుడిసె ; 2. పలు వసతులు కల ప్రత్యేక గృహం.
ఇం. *Cottage*. పూరిల్లు.
< ఇం. Cottage.

కాటేజి ఇండస్ట్రీస్ వి.బ.వ. కుటీర పరిశ్రమలు.
ఇం. *Cottage industries*. గృహపరిశ్రమలు.
< ఇం. Cottage industries.

కాటేరమ్మ చీర చూ. కాటేటి. వి. కోడలు కాపరానికివచ్చినపుడు అత్తగారు నేయించిపెట్టే చీర.

కాటేరికోక చూ. కాటేటి. వి. నల్లటి బద్దెఅంచులతో నేయించిన ముతక చీర.

కాటేరు చీర చూ. కాడు[1].

కాటేటి రూ. కాటెట్టి. చూ. కాడు[1]. 1. గ్రామంలోఉండి స్త్రీలకు పూనే ఒకానొక క్షుద్రదేవత ; 2. స్త్రీలకు మైలఅయ్యే వ్యాధి; 3. గయ్యాళి.

కాట్కుడు వి. కఠినుడు.

కాట్టెడుపు చీర చూ. కాత్రేడు చీర. వి. కాటేరి చీర.

కాట్నెపిండి వి. పట్టు దారానికి నల్లరంగు వెయ్యటానికి వాడేపొడి.

కాట్నెరేషం వి. ఒకరకం పట్టు.
హిం.ఉ. రేశమ్. పట్టు.

కాత్రగడ వి. శత్రువులు రాకుండా, రక్షణార్థం దట్టంగా కొయ్యలునాటి కట్టినదడి.

కాత్రగడ్డి వి. పూరింటి కప్పుకు పనికివచ్చే ఒకరకంగడ్డి.

కాత్రబద్ద వి. రెండునొగల బండినొగలను వెనుకవైపున బంధించినకర్ర.

కాత్రేకు చీర చూ. కాడు[1].

కాత్రేదంచు చూ. కాడు[1].

కాత్రేరు చూ. కాడు[1].

కాత్రేరుచీర చూ. కాడు[1].

కాత్రేఁడు చూ. కాడు[1].

కాత్రేఁడుపావలవాఁడు చూ. కాడు[1].

కాత్రేని పూజ చూ. కాత్రేఁడు.

కాత్రేని వనము చూ. కాత్రేఁడు.

కాత్రేను చీర చూ. కాడు[1].

కాత్రేపు చీర చూ. కాడు[1].

కాత్రేలు చీర చూ. కాడు[1].

కాత్రేవంచు చీర చూ. కాడు[1].

కాట్లకట్టె వి. నవారుమగ్గం నిలువుకొయ్యలమధ్య బిగించిన కర్ర.

కాట్లకుక్క చూ. కాటు[1].

కాట్లపీట వి. 1. దబ్బా రాట్నానికి చిన్న కదురు బిగించే చిన్న పీట ; 2. మట్టు మగ్గానికిపైన అమర్చిన కొయ్యపీట.

కాట్లమారి చూ. కాటు[1]. వి. కయ్యాల మారి.

కాట్లాట చూ. కాటు[1].

కాట్లాడు చూ. కాటు[1].

కాడ[1] రూ.చూ. కాఁడ. వి. 1. కర్ర, బలపం ; 2. కమండలం కూజా భాగంలో చేత్తోపట్టుకోడానికి అమర్చిన వంకీ; 3. చేత్తోపట్టుకొని లాగటానికి వీలుగా దంతెకు వేసినకర్ర ; 4. సెలగపార మొ. వాటి పార (పలుగు) కు కారు (కర్ర) తో కలిపే ఇనపకొండి లేక కాడ ; 5. జొన్న మొ. వాటి కంకికి ఆధారంగా ఉన్న కర్ర ; 6. పడుగేరే కర్రకు తగిలించే ఇనపగొలును కొక్కెం ; 7. పారను పట్టుకొనేపిడి ; 8. ఇటికచ్చుకు పట్టుకోడానికి పెట్టిన పొట్టికారు; 9. తాపీరేకును పిడిని కలిపే వంగిన ఇనపచువ్వ.

కాడకర్రి వి. డిజైను పనికివాడే చిన్నకరిటి. కాడగొను అ.క్రి. నాటుకొనిపోవు. కాడచూరు వి. సన్నగా, పల్చగా ఉన్న చూరు. కాడచెముడు రూ.చూ. కాడజెముడు. వి. కాండస్నుహి. కాడజెముడు రూ. కాడచెముడు. వి. కాండస్నుహి. సుమంత, దుగ్ధ, గండీరి. కాడతాపి వి. సన్నగా పొడుగ్గా కోలగా ఉండే రేకుగల చిన్నతాపి. కాడపురుగు వి. జొన్న మొ. కణుపుల్లో చేరిదంటు తొలిచేపురుగు. కాడమల్లిపేటు వి. అంచులో ఒకరకం పూలు వరసగా పడేట్లు నేసిన డిజైను. కాడరాగి వి. నాలుగురిక్కల ఎన్ను లుండే ఒకరకం కలుపుమొక్క (Eleusine aegyptiaca desf).

కాడ[2] రూ.చూ. కడ. అవ్య. వద్ద, దగ్గర. వి. పరిస్థితి.

కాడిటికె చూ. కాడు[1].

కాడారంబము రూ. కాడారంభము. వి. దుక్కిదున్నడం, మెట్ట సేద్యం.
< కాడి + అరంబము[1].

కాడారంభము రూ.చూ. కాడారంబము. వి. వర్షాధారంపై చేసే మెట్టదుక్కి, మెట్టపంట కోసం చేసే సేద్యం. ద. హిం.శా. సంపు. 4. శా. సం. 80.

కాడి రూ.చూ. కావడి[1]. వి. 1. ఎద్దులమెడమీద మోపే అడ్డ కొయ్య ; 2. జడ్డీపక్కలనున్న బొంగు ; 3. ఇటుకతో రాళ్ళతో కట్టిగాని, కొయ్యతో చేసిగాని, నిటారుగా నిలిపి, పైనున్న వస్తువులకు ఆధారంగా వాడే సన్నటి పొడుగాటి నిర్మాణం.

కాడికట్టుతాడు వి. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు. కాడికట్టె వి. కాడికున్న రంధ్రంలో పెట్టేకొయ్య ముక్క. కాడికుంటెవ వి. నొగలు, కాడి కలిపి కట్టేతోలు లేక తాడు. కాడికొండె వి. కాడిమధ్య బిగించి ఉండే వంకిచీల. కాడి క్రిందకు వచ్చు అ.క్రి. ఎద్దు కాడికిందకు వచ్చినట్లే ఒకవ్యక్తి ఇంకొకనికి లోబడు. కాడిగట్టు (-కట్టు) రూ. కాఁడి గట్టు. వి. రెండు పొలాల మధ్య హద్దుగా వేసినమట్టి కట్ట. కాడిగట్లమందు అ.క్రి. పక్కనుండు. కాడితగిలించు స.క్రి. జతకూర్చు, పెండ్లిచేయు. కాడితమ్మె వి. కాడికి తగిలించే పట్టెళ్ళకొనతాడు. కాడితాకించు స.క్రి. కోడెను సేద్యానికి మరపటానికి శుభముహూర్తంలో అరకు కాడితాకించి ప్రారంభించు. కాడితాడు వి. పట్టెళ్ళు లేనప్పుడు వాటికి బదులు ఎద్దులు మెడకిందుగా తీసి కాడికి కట్టేతాడు. కాడి దువ్నకం వి. భూమికొలత, కాడిఎద్దులు దున్నగలిగిన నేలం, 6 గుంటలు లేదా 3/8 ఎకరం. కాడిపట్టె వి. పొలం చదును చెయ్యటానికి ఉపయోగించే పొడుగాటి

మొద్దు. కాడిపలుపు వి. కాడితాడు, పట్టెడ, బండికాడికి ఎడ్లను కట్టేతాడు లేక తోలుపరికరం. కాడిపాలు చూ. కావడిపాలు. వి. ఆసామి పొలం, రైతు తననాగలితో దున్ని పంట చెరిసగం పంచుకొనే పద్ధతి. కాడిపీట వి. బండి పోలుకర్రకు కాడిగట్టె వైపు పైన అతికినపీట, పైపీట. కాడిపొత్తు వి. రైతులు తమతమ అరకలతో ఒకరికొకరు సహకరించుకొంటూ చేసే సేద్యం. కాడిమాకు వి. నాగలి, మోట, బండి, మొ. లాగటానికి ఎడ్ల మెడమీద మోపే అర్ధకొయ్య. కాడిమాదం వి. ఎద్దుల మెడమీద మోపేకొయ్య. కాడిమాను వి. నాగలి, మోట, బండి, మొ. లాగడానికి ఎడ్ల మెడమీద మోపే అర్ధకొయ్య. కాడిమాను కొండి వి. కాడి మధ్య వేసిన చీల. కాడిమానుపీట వి. బండి పోలుకర్రకు కాడికి కట్టేవైపు పైన అతికిన పీట. కాడినుడి వి. అర్రుమీద ఉండే నుడి.

**కాడీ** వి. పన్నె కట్టుబడిలో దంతెలమధ్య దువ్వెనపళ్ళ మాదిరిగా వరసగా కట్టిన కలప, బొన్న, గలుగు, వెదురు కొండ చీపురు మొ. వాటి పుల్ల(లు).

**కాడు**[1] చూ. కాటకము. వి.ఔ. 1. శ్మశానం, వల్లకాడు. భార. అను. 3.210 ; 2. అడవి, కాన. శివరా. 2.109 ; 3. చెడు, కీడు. భీమ. 2.116; 4. చికాకు; 5. మరవు ; 6. నాశనం.

క. కాడు. అడవి ; కాటు, కాడ. అడవిమనిషి ; కాడు. దురుసుగా ప్రవర్తించు, కష్టపెట్టు ; కాడికె. కష్టపెట్టునట్టి ; కాడిగె. కష్టాలను కలగజేసేవాడు ; కాటు. కష్టం, బాధ ; కాటుక. కష్టాలను కలగజేసేవాడు, బాధలు పెట్టేవాడు ; కొడ. కడి. అడవి ; కటు. కష్టం, బాధ ; తు. కాడు. అడవి ; కాడ. మొరటు, శక్యంకాని ; కాటు, కాటె. మొరటు, అలవికాని జంతువు ; కాడ్యుని, గాడియుని, గాడ్యుని. కష్టపెట్టు, బాధపెట్టు ; గాడుగాడ. బాధ, హింస ; కాటు. కష్టం, బాధ, అపాయం ; కాటుకె, కాటికె, కాటిగె. కష్టాలు కలిగించేవాడు ; కాటుళె. మొరటువాడు ; త. కాటు. అడవి, శ్మశానం ; వయత్-,కాట్. వరిపొలం; కాటిర్. అడవి, కాన, శ్మశానం ; కాటన్. అడవిలో తిరిగేవాడు ; కో. కఢ్. చెట్లులేని అడవి ; కొ. కాఢ్. వ్యవసాయంచేసే భూమి ; కొలా. వెగడ్. పొలం ; వెగడ్. మరొకపంట వేయటంకోసం కలుపు మొ. వాటిని కాల్చివేసే పొలం.

<మూ.ద్రా. *కాట్-.

**కాటాముదము** రూ. కాటియాముదము(-ఆముదము). వి. నేపాళచెట్టు, పసుపురంగుతో కూడిన ఆకుపచ్చని పూలుపూసే ఒక చెట్టు. దీని గింజలనుంచి తీసిన నూనె మందుల్లో ఉపయోగిస్తారు (Tatropha curcaus). కాటికాపరి వి. శ్మశానపు కావలివాడు. కాటికాపరితనము వి. శ్మశానపు కావలి ఉద్యోగం. మార్క. 1.234. కాటికిఁగాళ్లుచాఁచు అ.క్రి. చావుకు సిద్ధపడు. ద్వి.హరిశ్చ. ఉ. 1057 పం. కాటిపాపడు రూ.చూ. కాటిపాపఁడు. వి. 1. నల్లగా మురికి అవటం ; 2. వల్లకాటిలో కావలి ఉండేవాడు ; 3. కుమ్మర్లను యాచిస్తూ వారి గోత్రాదుల్ని చెప్పేవాడు (మట్టి దొంగిలించిన కారణంగా వెలివేయబడ్డ కుమ్మరి అట). కాటిపాపఁడు రూ. కాటిపాపడు. వి. 1. గొల్లవాడు. బసవ. 4.138 పం. ; 2. శ్మశానంలో కావలికాసేవాడు. ద్వి. హరిశ్చ. ఉ. 2.184. క. కాటు, కాడ. అడవిమనిషి, వేటగాడు. కాటిపాపలవాండ్రు వి.బ.వ. చేతవిద్యచేసే ఆటవిక జనులు. కాటియాముదము (-ఆముదము) రూ.చూ. కాటాముదము. వి. నేపాళచెట్టు, పసుపుతోకూడిన ఆకుపచ్చని పూలుపూసే ఒకచెట్టు. దీని గింజలనుంచి తీసిన నూనె మందుల్లో ఉపయోగిస్తారు (Tatropha curcaus). కాటిరేఁడు రూ. కాట్రేఁడు. వి. 1. మృగయులు మొదలైనవారు కొలిచే శివరూప దేవత. ఇందు. 2.71 ; 2. శివుడు, ముక్కంటి. కాశీ. 3.49 ; 3. శ్మశానాధిపతి. కాటేరుచీర రూ.చూ. కాట్రేడుచీర. వి. ఒకరకం చీర. కాట్రేకుచీర రూ. చూ. కాట్రేడుచీర. కాట్రేడంచు వి. నీలిరంగు దారాలు పెట్టి నేసిన అంచు. కాట్రేడు వి. ఒక రకం వేటకుక్క. కాట్రేడు చీర రూ. కాటేరుచీర, కాట్రేకుచీర, కాట్రేనుచీర, కాట్రేవుచీర, కాట్రేలుచీర. వి. 1. కోడలు కాపురానికి వచ్చినప్పుడు అత్తగారు నేయించి పెట్టే చీర ; 2. కడుపుతోఉన్న స్త్రీకి అయిదోనెలలో పెట్టే ఒక రకం చీర ; 3. చిగురంచున ఇరవై జమిలిపోగుల తెలుపు వదిలి ఇవతల ఆరు జమిలి పోగుల నీలిఅంచు, రెండు వేళ్ళ వెడల్పున కమ్మి నేసిన చీర ; 4. తెలుపులో ఎరుపు, నలుపు గళ్లుపడేట్లు నేసిన చీర ; 5. అయిదు రంగుల్లో పట్టెలు పట్టెలుగా నేసిన చీర. కాట్రేఁడు రూ. చూ. కాటిరేఁడు. వి. 1. వేటగాళ్ళు మొదలైనవాళ్లు కొలిచే శివరూప దేవత. శివరా. 3.83 ; 2. శివుడు. 3. శ్మశానాధిపతి. కాట్రేఁడుపాపలవాఁడు వి. హస్తలాఘవం చేసేవాడు. కాట్రేనిపూజ వి. కాట్రేడు దేవత పూజ. కాశీ. 3.43. కాట్రేనివనము వి. శ్మశానం. కాట్రేనుచీర రూ.చూ. కాట్రేడుచీర. వి. ఒకరకం చీర. కాట్రేవుచీర రూ.చూ. కాట్రేడుచీర. వి. ఒకరకంచీర. కాట్రేలుచీర రూ.చూ. కాట్రేడుచీర. వి. ఒకరకంచీర. కాట్రేవంచుచీర వి. ఒకరకం అంచుపెట్టి నేసిన చీర. కాడటికె వి. శవాలు కాల్చిన బూడిదను నదిలో కలపడానికి ఎత్తుకొనిపోయే మట్టిపాత్ర. కాడుచేయు స.క్రి. 1. చీకాకు పరచు. భీమ. 4.180 ; 2. నాశంచేయు. కాడుజెముడు వి. తీగజెముడు, చిన్న పూలు పూసే ఒక తీగ (Sarcostem-mabre nistignna). కాడుపడిపోవు అ.క్రి. కనబడక పోవు. హరి.పూ. 6.89. కాడుపడు రూ. కాడ్పడు. అ.క్రి. 1. కనబడకపోవు. భార.శాంతి. 3.158 ; 2. నశించు, చెడు. మార్క. 3.301 ; 3. చెడ్డది అగు, దుష్టమగు. హరి. ఉ. 9.37 ; 4. ధర్మక్షయమగు, సర్వధర్మాలు నశించు. హరి.ఉ. 9.42 ; 5. క్షోభపడు, వ్యాకులమగు. ఆము. 6.12. త. కాటు-పటు. వృధాఅగు. కాడుపఱచు రూ. కాడుపఱుచు, కాడ్పఱచు, కాడ్పఱుచు. స.క్రి. 1. క్షోభపెట్టు కు.సం. 5.65 ; 2. అవమానపరచు. పండి.చ. 1.53 పు. 3. వశింపచేయు, చంపు, పాడుచేయు. దశకు. 7.68 ; 4. భగ్నంచేయు. సమీర. 1.196. కాడుపఱుచు రూ.చూ. కాడుపఱచు. స.క్రి. 1. క్షోభపెట్టు. భాస్క.రా.సుం. 259 ; 2 భగ్నంచేయు. భోజ. 7.170. కాడుపాటు రూ.చూ. కాడ్పాటు.

వి. క్షోభ, కలత. కాదుబీదు విశే. వ్యర్థమైన. కాదొనరించు స.క్రి. కాదుచేయు. కాద్పడు రూ.చూ. కాదుపడు. అ.క్రి. 1. నశించు. ఉ.రా. 2.46 ; 2. క్షోభపడు, వ్యాకులపడు. ఉ.రా. 8.367 ; 3. కనబడకపోవు, నష్టమగు. కాద్పఱచు రూ.చూ. కాదుపఱచు. స.క్రి. పాడుచేయు. పాండు. 3.8. కాద్పఱుచు రూ.చూ. కాదుపఱుచు. స.క్రి. నశింపజేయు, అవమానపరచు, భగ్నంచేయు, పాడుచేయు, క్షోభపెట్టు, వ్యాకులపెట్టు. కాద్పాటు రూ. కాదుపాటు. వి. క్షోభ, కలత. వేంక. పంచ. 1.482.

కాదు² అ.క్రి. కారు, స్రవించు. కు.సం. 11.56.

పో.చూ. త. కాల్. నోటినుంచి చొంగలాగ పాము కోరలనుండి విషంలాగ బయటకు కక్కు. (కండ్లనుండి నీరు లాగ) నరంనుండి నెత్తురు కారిపోవునట్లుగా కారు.

కాదు³ అ.క్రి. వేడెక్కు. కు.సం. 11.56.

కాదురాయి రూ. కాద్రాయి. వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి.

కాదొనరించు చూ. కాదు¹.

కాద్పడు చూ. కాదు¹.

కాద్పఱచు చూ. కాదు¹.

కాద్పఱుచు చూ. కాదు¹.

కాద్పాటు చూ. కాదు¹.

కాద్రాయి రూ.చూ. కాదురాయి. వి. భూమి ఉపరితలంమీద సర్వసాధారణంగా దొరికే రాయి, 'గ్రనైట్,' ఎఱ్ఱ కంచు రాయి.

కాద్లుకడుగు రూ.చూ. కాళ్లు కడుగు. స.క్రి. కాళ్ళను నీళ్ళతో క్షాళనం చేయు, H.A.S. 13-32. క్రీ.శ. 1121.

కాణము¹ వి. కులుత్థాదికమైన అశ్వాదిగ్రాసం, గుర్రాలు మొదలైనవాటికి పెట్టే ఉలవలు మొ. భక్ష్యం, దాణా. భార ఉద్యో. 1.93.

సం. ఖాదన-. నమలటం, తినటం, ఆహారం, భోజన పదార్థాలు ; మహా. ఖాణ. ఆహారం, తినటం ; హిం. ఖాన్. ఆహారం ; ఖానా. తిను.

క. ఖాణ, ఖాన. ఆహారం, దాణ ; త. కాణమ్. ఉలవలు ; మ. కాణమ్.

కాణము² చూ. కాణయాచి. వి. 1. వంశపరంపరాగతమైన హక్కు. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 584.

కాణయాచి రూ. కాణాచి. వి. 1. చిరకాల నివాసస్థానం. రామాభ్యు. 6.193 ; 2. ఆటపట్టు. విశే. వంశపరంపరాగతమైన. కాళ. 4.37.

క. కాణి. ఆస్తి, ఆస్తి మీదహక్కు, బహుమానం. కాణాచి. భూమిపై వంశపరంపరాగతమైన హక్కు, కార్యాలయరుసుం. త. కాణి-యాట్చి. భూమి కార్యాలయాలు, సంస్థానాలు, రాజ్యాలు, మొ॥ వాటిమీద వంశపరంపరాగతమైన హక్కు, వారసత్వం వల్ల సంక్రమించిన రాజ్యం, సంస్థానం, హక్కుభుక్తంలో ఉన్నది ; కాణచి, కాణి. భూసంబంధమైన ఆస్తి, సంస్థానం, స్వాధీనంలో ఉన్నది, హక్కు, వారసత్వపు హక్కు, 1.32 ఎకరాలను కొలిచే భూమికొలత, భూమి ; ఆట్చి. యజమాన్యంమీది హక్కు కలిగివుండటం, సంతోషం.

కాణయాచిస్వాస్థ్యము వి. వంశపరంపరాగతమైన హక్కు.

కాణాచి రూ. చూ. కాణయాచి. విశే. 1. చిరకాలానుభూతమైన. విప్ర. 5.17 ; 2. వంశపరంపరాగతమైన. కళా. 3.191 ; వి. 1. చిరకాల వాసస్థానం. విజయ. 1.20 ; 2. వంశాచారం. కాళ. 4.25.

కాణాచికాఁడు వి. చిరకాలానుభవం కలవాడు. వరాహ. 11.14. చిరకాలనివాసి. ప్రబంధ. 216. కాణాచియగు (-అగు) స. క్రి. నివాసం చేసికొను.

కాణి¹ రూ. చూ. కాని. వి. 1. రూపాయిలో అరవైనాలుగో వంతు విలువగల రాగినాణెం, అణాలో నాల్గవ భాగం. ఆం. భా. 2.272 ; 2. తమిళదేశంలోని భూపరిమాణ విశేషం, 1.3. ఎకరాల వైశాల్యం గల భూమి ; 3. ఇరవై గుంటల నేల.

కాణి² రూ. చూ. కావడి¹. వి. ఎడ్ల మెడమీద వేసే కఱ్ఱ.

కాణిగరచు స. క్రి. కాణి తాపిడిచేయు, కాడితాకించు.

కాణిగొలుసు వి. కాడికలిపి కట్టే తోలు లేదా తాడు.

కాణిక రూ.చూ. కానిక¹. వి. కానుక, కట్నం.

కాణివతీగ వి. అల్పంగా ఉండే ఒకరకం తీగ (Vitispedata).

కాంట్రాక్టు వి. ఒప్పందం, గుత్త.

ఇం. *Contract*. ఒప్పంచం, గుత్త, ఒడంబడిక.

< ఇం. Contract.

కాండి రూ. చూ. కావడి¹. వి. కాడి.

-కాండు రూ. చూ. కాఁడు³. ప్రత్య. వృత్తికారులకు మతుబర్థంలో చేర్చే ప్రత్యయం.

కాంద్ర¹ వి. ఒకవిధమైన గడ్డి. కాశీ. 6.262.

పో. చూ. త. కౌన్ద్రై. ఒకరకం చెట్టు.

కాంద్రగడ్డి వి. ఒకరకం కలుపుమొక్క. కాంద్రదుబ్బులు వి.బ.వ. ఒకవిధమైన గడ్డిదుబ్బులు, జమ్ముదుబ్బులు.

కాంద్ర² వి. అనురుడు.

కాంద్రించు చూ. కాంద్రు.

కాంద్రింత చూ. కాంద్రు.

కాంద్రిల్లు అ. క్రి. నేల పగులుచూపు.

కాంద్రు వి. 1. ఉమ్మువేసేముందు చేసే ధ్వనికి అనుకరణం ; 2. పలి గాంద్రింపు. ధ్వన్యనుకరణశబ్దం.

తు. కాంకరిపుని. ఉమ్మువేసేముందు చేసే ధ్వని. పో. చూ. త. కాఱు. కఫాన్ని బయటకు తెచ్చుకొను ; కాన్ అవ్. దగ్గి కఫాన్ని ఉమ్మివేయు.

కాంద్రించు అ.క్రి. ఉమ్మివేయటానికి పూర్వం శ్లేష్మాన్ని కంఠంలోకి తెచ్చుకోటానికి 'కాంద్రు' మని ధ్వనిచేయు.

కాంద్రింత వి. కాంద్రించి ఉమ్మటం.

కాంద్రేగు¹ రూ. చూ. కానరేగు. వి. పొదగా 6 అడుగుల ఎత్తు పెరిగే ఒకరకం ముళ్ళచెట్టు (Flacountia Sapoda) (Flacourtia ramontchin).

కాంద్రేగుచెట్టు వి. కానరేగుచెట్టు.

కాంద్రేగు² వి. కదుపూద.

కాండ్లు చూ. కాడి¹. వి.బ.వ. ఎద్దుల మెడమీద మోపే అడ్డు కొయ్యలు. భార. విరా. 5.58.

కాఁటు రూ.చూ. కాటు[1]. వి. గంటు, గాయం.

కాఁడ రూ. కాడ. వి. 1. బాణం. ఆము. 4.243; 2. కూరాకు మొ॥ వాటి కాడ, కూరాకులోని తొడిమ. ఆం.భా. 2.248; 3. తామరతూడు; 4. కమ్మ; 5. ఒకసేద్యపు పనిముట్టు.

క. కాడె. తొడిమ, కాడ; త. కాయ్పు. పువ్వు, ఆకు మొ. వాటి తొడిమ; కొల్. పువ్వు కాడ; కుఇ. కాండి, కాంఁడు. కాడ, తొడిమ; పర్జి. కాఖుమ్. తొడిమ; పో. చూ. మాల్తో. కడె. కూరాకు మొ. వాటి కాడ.

సం. కాండ-.తొడిమ, కాడ, కొమ్మ, రెమ్మ; ప్రా. కండ-. తొడిమ, కాడ.

కాఁడఁగబాఱు చూ. కాఁడు[1].

కాఁడఁబాఱు చూ. కాఁడు[1].

కాఁడి[1] రూ. చూ. కావడి[1], కాని. వి. 1. యుగం, ఎద్దు మొ. వాటిమెడపైన ఉండే కఱ్ఱ. భార. విరా. 5.53; 2. యుగం వంటి ఆయుధ విశేషం. మల్లువు. 3.69.

కాఁడిగట్టు(-కట్టు) రూ.చూ. కాడిగట్టు. వి. రెండు పొలాల మధ్య ఉన్న గనిరు, చిన్నగట్టు. కాఁడిగట్టు వ్యవసాయం వి. నడుమ చిన్నగట్టు మాత్రం ఉండి రెండు పొలాల్లో ఇద్దరూ చేసే వ్యవసాయం. కాఁడిపొత్తు వి. రైతులు తమలో తాము సాయం చేసుకొనే సేద్యం. కాఁడిమాను వి. పశువులను, నాగలి, బండి మొ. వాటితో చేర్చి కట్టే వ్యవసాయ పరికరం. కాఁడిమ్రాఁకు వి. కూబరం, నొగ. సాం. ని. 2.46. కాఁడిమెడి వి. ఎద్దుకు అఱుపై ఉండే మెడి.

కాఁడి[2] వి. కాపుడుగంజి, కడుగునీరు. ఆం. భా. 2.250.

క. కాటి, కాఱె. మజ్జిగతో కలిపి తాగే రాగి మొ. వాటి గంజి; త. కాటి. బియ్యం కడుగునీళ్ళు: మ. కాటి. ఎసరు, గంజి.

కాఁడు[1] స. క్రి. నాటు, గుచ్చుకొను. కు. సం. 4.73. భార. ద్రోణ. 2.32. అ. క్రి. 1. స్థిరపడు. పాండు. 4.48; 2. గుచ్చుకొను. రసిక. 3.176; 3. కమ్ము, సాంద్రమగు, దట్టమగు.

త. కాల్. పాముకోరలనుండి విషంవచ్చినట్లు వచ్చు, కంకివెన్ను వేసినట్లు బయటకు వచ్చు.

కాఁడఁగఁబాఱు స. క్రి. గుచ్చు, నాటు. భార. శాంతి. 1.47. కాఁడఁబాఱు స.క్రి. గుచ్చుకొను.

కాఁడు[2] అ. క్రి. (వాడు) కాఁడు (అనుదాతువు యొక్క వ్యతిరేకార్థకమైన మహదర్థక ప్రథమ పురుషైకవచనం).

-కాఁడు[3] రూ. -కాండు. ప్రత్య. 1. మతుబర్థంలో వచ్చే ఒక పుం ప్రత్యయం. భార.ఆది. 6.33; 2. కొన్ని జంతువుల పేర్ల చివరకూడ చేరే ప్రత్యయం. ఉదా. ఇబ్బందికాఁడు.

కాత1 చూ. అగు. రూ. చూ. కావుత. అవ్య. 1. కాక, అనను నరే, కావుత. అవుగాక, అంగీకారర్థకం. భార. అను. 3.39. మార్క. 8.9; 3. కాక. అనటానికి మారుగా ప్రయోగింపబడేది. ధర్మ. 1.32; 2. ఆశీరర్థకం. అచ్చ.రా.బాల. 1.6.

కాత[2] వి. కాపు, పలింపు.

కాతపవన వి. ఎక్కువకాలం మన్నే కలపనిచ్చే ఒకచెట్టు, ఈ కలపపడవల తయారీకి ఉపయుక్తం (Ariocarpus-hisuta).

కాతరచేయు రూ. చూ. కాతరుచేయు. స. క్రి. లక్ష్యపెట్టు, ఆదరం చూపు.

కాతరపడు అ. క్రి. వెతనొందు, తత్తరపడు.

కాతరము రూ.చూ. కాతరును. వి. ముతక కాగితం.

కాతరముకాకితము వి. ముతకకాగితం.

కాతరిల్లు అ. క్రి. 1. ఉత్సహించు, సిద్ధపడు. కు. సం. 1.98; 2. భయపడు.

క. కాతరిసు.

కాతరుచేయు రూ. కాతరచేయు, కాతీరుచేయు. స. క్రి. లెక్కచేయు, ఆదరంచూపు.

హిం. ఉ. ఖాతిర్. ఆదరం, సమ్మానం.

< ఉ. ఖాతిర్ + చేయు.

కాతరును రూ. కాతరను. వి. ముతకకాగితం.

పో. కరూష్. ముతకకాగితం; కర్తాజ్. అనుమతి పత్రం, కాకితం; స్పా. కర్తూచో. ఫ్రె. కర్తూష్. అర; కర్తాస్. కాగితం ఒడంబడిక పత్రం.

< పో. కర్తూష్.

కాతా[1] రూ. చూ. ఖాతా[1]. వి. 1. వ్యాపారంలో సంబంధం, లెక్క ఇచ్చి పుచ్చుకోలు లెక్క, తాత్కాలికంగా అరువు మీద వస్తువుల నిచ్చే వివరాలు రాయబడ్డ పుస్తకం.

కాతాపెట్టు స.క్రి. అరువుపెట్టు.

కాతా[2] రూ.చూ. ఖాతా[2]. వి. టెంకాయపీచు.

కాతాళము రూ.చూ. కాంతాళము. వి. 1. కోపం. జైమినీభా. 7.94; 2. సామ్యం, పోలిక. వేంక. పంచ. 3.281; 3. దుడుకుతనం; 4. అనూయ; 5. పిరికితనం; 6. ఈడు ఉద్ది.

కాతాళించు రూ.చూ. కాంతాళించు. అ.క్రి. కోపించు.

కాతాళించు చూ. కాతాళము.

కాతీరుచేయు రూ.చూ. కాతరుచేయు. స.క్రి. ఖాతరుచేయు, లెక్కచేయు.

కాతేరుకంకె వి. కాతేరు గ్రామంనుంచి తెచ్చే రాతి ముక్క.

కాతోలికు రూ. కతోలికు. వి. పోపు అనుయాయులైన క్రైస్తవుల శాఖ.

పో. కతోలికు. ఇం. *Catholic.*

< పో. కతోలికు.

కాదము చూ. కాదు.

కాదా చూ. కాదు.

కాదు క్రి. విజ. తగదు, కూడదు. భార.అరణ్య. 3.170; వి. 1. విరోధం, 2. పక్షం.

త. అకాతు. కాదు, కూడదు, వీలుకాదు.

కాదము స.క్రి. నిరాకరించు, మెచ్చకుండు. భార. ఆది. 1.125. శల్య. 1.87. కాదా అవ్య. నిశ్చయాన్ని తెల్పుతుంది. పాండు. 4.275. త. అకాత్. అవునా, అదికాదా. కాదుపోదము అ.క్రి. అంగీకరించకుండు. కాదె రూ. కాదే. అవ్య. ప్రశ్నార్థకం. భార. ఆది. 2.176, శాంతి. 1.79. కాదే

రూ. చూ. కాదె. అవ్య. **1.** నిశ్చయార్థకం విష్ణు. వ. 7.184 , **2.** ప్రశ్నార్థకం. భార.ఆరణ్య. 1.330.

కాదె చూ. కాదు.

కాదే చూ. కాదు.

కాన[1] రూ. కోన[1]. వి. అడవి.

నం. కానన-. అడవి. పా. కానన-.

క. కా ; తు. కాన ; త. కానమ్, కానకమ్, కాన్ ; కాల్, కా. అడవి, తోట, ఉద్యానవనం ; కానల్. అడవి, తోట. సముద్రతీరం, కొండవాలులో ఉన్న అడవి ; మ. కానమ్. అడవి ; కానల్. ఎండిపోయిన అడవి.

<నం. కానన-.

కానపుంజు వి. అడవికోడి, పొదకోడి. సాం.ని. 4.83. కానరేగు రూ. కాండ్రేగు[1]. వి. ములువెలమ, కాండ్రేగుచెట్టు (Flacourtia Sepiarica). కానసిరి వి. వనలక్ష్మి. యయా. 3.41.

కాన[2] అవ్య. నంబోధనంలో ప్రయుక్తమై ప్రేమను, క్రోధాన్ని సూచిస్తుంది. శృం.నై. 8.5. వరాహ, 5.52.

కాన[3] రూ. కావున, గాన. అవ్య. ద్రు. కావున. భార. ఆది. 3.12. భార. ఉద్యో. 1.358.

కాన[4] వి. కాలవ, చెరువు మొ. వాటి నీటితో సాగుచేసే నేల.

కానక అవ్య. **1.** చూడక, కనపడక. భార. ఆది. 1.96 ; **2.** లేకలేక. శృం.నై. 3.95 ; **3.** ఆలోచించక. శుక. 4.54.

కానకకను న.క్రి. లేకలేక పడయు.

కానగ[1] రూ.చూ. కానిక[1]. వి. బహుమతి.

కానగ[2] రూ.చూ. కానుగ. వి. కానుగచెట్టు. బదేసి ఆకులు రెమ్మలుగా కలిగి పాటల వర్ణపు పూలు పూసే ఒకచెట్టు. దీని కలప బండి చక్రాల తయారీలో ఉపయుక్తం (Pongamiaglabra).

కానగు[1] చూ. అగు. అ.క్రి. అగు.

కానగు[2] రూ.చూ. కానుగు. వి. గానుగు.

కానఁగఁబడు చూ. కను. రూ.చూ. కానఁబడు. అ.క్రి. కనబడు, చూపట్టు. భార. ఆరణ్య. 2.238. హరి. ఉ. 6.63.

కాననగు చూ. కను. అ.క్రి. అగపడు, కనబడు, చూపట్టు. భార. ఆరణ్య. 3.120. హర. 6.5.

కాననిది చూ. కను. వి. గుడ్డిది, అంధురాలు.

కాననివాఁడు చూ. కను. విశే. అంధుడు. భాగ. 7.182.

త. కాణార్.

కానన్వచ్చు రూ. కానవచ్చు. చూ. కను. అ.క్రి. కనబడు, చూపట్టు. శృం.నై. 3.95.

త. కాణ్వా, కాణ్వరు.

కానమి చూ. కను. వి. **1.** అజ్ఞానం. రం.రా.యు. 358 ; **2.** కను. దాతువుయొక్క వ్యతిరేక భావార్థకం, చూడకపోవటం, కనబడకుండటం. భార. ఆది. 6.289.

త. కాణామై.

కానఁబట్టు చూ. కను. అ.క్రి. కనబడు, భాస్క. రా. యు. 15.

కానఁబడయు చూ. కను. న.క్రి. కను, చూచు, హర. 4.59.

కానఁబడు రూ. కానఁగఁబడు. చూ. కను. అ.క్రి. కనబడు, చూపట్టు. శృం.నై. 3.95.

కానరానడుగులమేటి వి. అగపడని కాళ్ళుగలది, పాము.

కానరానికాళ్లయది రూ. కానిరాని కాళ్ళయది. చూ. కను. వి. సర్పం, పాము. ఆం.నా.సం. 4.18.

కానరానిచుక్క చూ. కను. వి. అభిజన్న నక్షత్రం, అభిజిత్తు బొమ్మరిక్క.

కానరానివాడు చూ. కను. వి. **1.** అంధుడు ; **2.** అదృశ్యుడు.

కానవచ్చు రూ.చూ. కానన్వచ్చు. చూ. కను. అ.క్రి. అగపడు, కనబడు, చూపట్టు. విక్ర. 2.108.

కానా వి. **1.** చిన్నరంధ్రం ; **2.** రాళ్ళ వరసలకు మధ్యఉన్న స్థలం ; **3.** బట్టీలలో నిప్పుపెట్టడానికి తెరచి ఉంచిన రంధ్రం ; **4.** అలమార బిగించడానికి గోడలో వదిలిన ఖాళీ ; **5.** వంతెనకింద నీరు పోవడానికి ఏర్పరచిన గొట్టం లేక తూము, వంతెన.

కానాగమ్మి వి. మంటవేసే బట్టీపొయ్యి. కానాచెక్క వి. అలమారును అరలుగా విభజించే చెక్క, కానాలచీర వి. ఒక రకం గడిచీర. కానాలుకట్టు స.క్రి. ఇసకబట్టీలాగ ఆము పొయ్యులు సందులు సందులుగా కట్టు.

కానామలు వి.బ.వ. నేతపనిచేసే దేవాంగుల దగ్గర అడుక్కొనే ఒక తెగవారు, వీరముష్టులు.

కాని[1] రూ. కాణి. వి. **1.** రూపాయిలో అరవైనాల్గోవంతు విలువగల రాగినాణెం, అణాలో నాల్గో భాగం. భార. శాంతి. 4.387 ; **2.** భూమికొలత.

నం. కాకణ-, కాకణి చిన్ననాణెం, కాకిణి ; ప్రా. కాగిణి ; పా. కాకణ-, కకణికా ; అమా. కాగణి. బంగారం, వెండి తూచే రెండు వడ్లగింజల బరువుగల తూకం.

క. కాణి-.1/64 వంతు ; పో.చూ.త. కాణి. 1/80 వ వంతు ; కాణమ్. పూర్వకాలంలో ఉన్న బరువు, బంగారం, భాగ్యం ; కాణి. భూమికొలత ; మ. కాణి. కాలంలో లేక స్థలంలో ఒకభాగం.

<ప్రా. కాగిణి.

కానికిఁగొను న.క్రి. తక్కువఇచ్చు, లక్ష్యపెట్టు. భార. శాంతి. 4.387.

కాని[2] రూ. కానీ. చూ. అగు. అవ్య. **1.** పూర్వోత్తరాలైన వ్యాక్యార్థాలకున్న భేదాన్ని సూచించేటట్లుగా ప్రయుక్తం. భార. ఆది. 3.41 ; **2.** తక్క. భార. ఆది. 4.79 ; **3.** కొన్నిచోట్ల అర్థవిశేషం లేకుండానే ఊతపదంగా ప్రయుక్తం. భార. విరా. 2.89 ; **4.** బెదిరింపును తెలుపుతుంది. అష్టమ క. 1.89 ; **5.** పర్వాలేదనే అర్థాన్ని తెలుపుతుంది. విశే. **1.** చెడ్డ ; **2.** ఓర్వలేని. న.క్రి. అంగీకరించు.

కానికాలము వి. మంచికాలం కానిది, చెడుకాలం. కానికులము వి. చండాలజాతి, తక్కువకులం. వాశి.రా. 2.229. కానికూడు వి. తగనికూడు. నీచార్జనం. కానిచ్చు అ.క్రి. జరగనిచ్చు. ఆము. 6.66 ; నెరవేర్చు.

కాని[3] వి. **1.** భూమికొలత, 8 గొర్లు, గొర్రు = 3 ఎక. 12 సెం. ; **2.** ఎకరంలో సగం ; **3.** రెండెకరాల నేల.

కాని[4] రూ.చూ. కావడి[1]. వి. ఎడ్లమెడమీద వేసే కఱ్ఱ. యుగం.

కానిగుంజ వి. రంగులో తడిసిన నూలు లడీలు పింద

టానికి వీలుగా నేలలో పాతిన హొడుగురాట. కానికాడు వి. కాడికి ఎడ్లను కట్టేకాడు.

కానిక[1] రూ. కాణిక. కానగ[1], కానికి. కానికె, కానిగ[1], కానుక, కాన్క, కాన్కి. క్రానుగ. వి. 1. బహుమతి, కానుక. భార. ఆది. 3.26. యయా. 4.26 ; 2. ఉపాహారం. భార. అను. 4.433 ; 3. చూపు, దృష్టి.

క. కాణికె, కాణ్కె. కానుక, బహుమతి ; కొర. కణ్కి. దేవుని మొక్కు తీర్చుకోడం ; తు. కాణికె, కాణిగె. పై అధికారికిచ్చే బహుమతి ; త. కాణిక్కై. బహుమతి, దేవాలయానికి, చర్చికి, గురువుకి, లేదా గొప్ప వ్యక్తులకు ఇచ్చే బహుమానం, కాన్క ; మ. కాడ్చ, కాడ్య. కానుక ; కాణిక్క. బహుమతి, కానుక ; తొ. కొణ్ ట్య. హిందూ దేవాలయానికిచ్చే కానుక.

కానికపెట్టు వి. గుడికివెళ్ళి దేవుడికి చేసే మొదటిపూజ. కానికమాడలు వి.బ.వ. కానుకగా ఇచ్చే బంగారు నాణాలు.

కానిక[2] రూ.చూ. కానుగు. వి. ఒకరకం పెద్ద చెట్టు. (Dalbugia arborea Airtie).

కానికట్టె వి. కానిగుంజరు అమర్చిన అడ్డకట్టె.

కానికి రూ.చూ. కానిక[1]. చూ. కను1. వి. కానుపు, దృష్టి, చూపు.

కానికె రూ.చూ. కానిక[1]. వి. కానుక.

కానిగ[1] రూ.చూ. కానిక[1]. వి. బహుమతి.

కానిగ[2] వి. గోడలో పెట్టిన రంధ్రం, చువ్వలు లేనికిటికీ.

కానిగ[3] రూ.చూ. కానుగు. వి. ఐదేసి ఆకులు రెమ్మగా కలిగి పాటల వర్ణపు పూలు పూసే ఒకచెట్టు. దీని కలప బండి చక్రాల తయారీకి ఉపయుక్తం. (pongamia glabra).

కానిగపని వి. సామాన్యపు పని.

కానిగె రూ.చూ. కానుగు. వి. గానుగు, ఒకరకం చెట్టు.

కానితనము చూ. అగు. వి. 1. చెడ్డతనం, కూడని తనం ; 2. పగ, శత్రుత్వం ; 3. దుర్మార్గం, దౌష్ట్యం.

కానితిరుగులు తిరుగు అ.క్రి. చెడుతిరుగుళ్ళు తిరుగు.

కానిత్రోవ చూ. అగు. వి. ఆకాశమార్గం లేక నక్షత్రమార్గం.

కానిపని చూ. అగు. వి. చెడ్డపని, దుండగం, చెడుగు.

కానిపించు చూ. కానుచు. రూ. కానుపించు, కాన్పించు. స.క్రి. 1. చూపు, చూపించు, దర్శింపచేయు. భార. ఆరణ్య. 7.7 ; 2. (అమాత్యులకు) దర్శనమిచ్చు. అ.క్రి. కన్పడు, ప్రత్యక్ష మగు, కనబడు, కనపడుచు, కవిరాజ. 4.83.

కానిపేరిది చూ. అగు. విశ. ఇష్టంలేని, పనికిరాని. భార. ఆరణ్య. 5.302.

కానిపోని చూ. అగు. విశ. లేనిపోని, అసత్యమైన. శుక. 4.54.

కానిమాట వి. 1. ఊరక మోపిన నింద ; 2. అనరాని మాట ; 3. అశ్లీలం.

కానిమి వి. కాకపోవడం.

కానిరాని కాల్లయది రూ.చూ. కానరాని కాళ్లయది. వి. అగపడని కాళ్ళుగలది, పాము.

కానిపలను వి. కానికార్యం, తగనిపని. కళా. 8.160.

కానివాఁడు చూ. అగు. వి. 1.తటస్థుడు, సంబంధించనివాడు. భార. ఆరణ్య. 7.416 ; 2. అంటేద ; 3. తగనివాడు, కిట్టనివాడు, అయిష్టుడు. విశ. 1. పనికిమాలిన, అసమర్థుడైన. భార. ద్రోణ. 5.105 ; 2. అనర్హుడు. భార. శాంతి. 4.65 ; 3. అయిష్టమయిన.

త. అకాతవన్. స్నేహితుడుకాని వాడు, అసమర్థుడు.

కానివావి వి. 1. తగనిపని. హరి. 1.235 ; 2. విరోధం. శుక. 3.405.

కానిస్టీబిలు రూ.చూ. కనస్టేబులు. వి. పోలీసు ఉద్యోగి.

కానిస్టీబు రూ.చూ. కనస్టేబులు. వి. పోలీసు ఉద్యోగి.

కానీ రూ.చూ. కాని. అవ్య. 1. కానిమ్ము, అంగీకారం తెలుపుతుంది, కాని, అట్లే, వల్లె. విక్ర. 3.61. ఇదిప్రార్థనాద్యర్థక క్రియఅయినా క్రమంగా అవ్యయంగా మారింది ; 2. వికల్పాన్ని తెలుపుతుంది. కాశీ. 2.9. కళా. 4.112 ; 3. బెదిరించేటప్పుడు ప్రయుక్తం. దశా. 1.243.

కానీమి చూ. అగు. రూ. కానీయమి. వి. 'కానిచ్చు' కు వ్యతిరేక భావార్థకం, కానీయక పోవటం.

కానీయమి రూ.చూ. కానీమి. వి. కానీయక పోవటం.

కానీలా అవ్య. 1. నిర్లక్ష్య సూచకం ; 2. భయపెట్టే మాట.

కాను[1] వి. నీరు కలియనిమజ్జిగ, చిక్కనిమజ్జిగ. కాళ. 4.93. ఆం. భా. 2.259.

త. కణ్ (ట్-ప్-). అధికమైన ఫలితం.

కాను[2] వి. ఉప్పుగడ్డి.

కాను[3] వి. వేళ, సమయం.

కాను[4] అవ్య. హేతువును తెల్పుతుంది, అవుతుండగా.

కాను[5] అవ్య. స్థలనిర్దేశాన్ని సూచిస్తుంది.

కాను[6] వి. 1. ద్వారాలున్న గోడలమధ్య దూరం, అడ్డుగోడల మధ్యభాగం ; 2. ఒడ్డు తట్టు మీద చేరిన నీరు బయటికి పోవటానికేర్పరచిన దారి.

పో. కాను. గొట్టం, తూము ; స్పా. కాణొ. పొడవైన గొట్టం, చిమ్మనగొట్టం.

< పో. కాను.

కానుక రూ.చూ. కానిక[1] వి. బహుమతి ; దేవుడు, గురువు, రాజు మొ. వారికి గౌరవార్థంగాఇచ్చే ద్రవ్యం, ఉపాయనం. భాగ. 10. ఉ. 770. ఉత్త.రా. 1.235.

కానుకవెట్టు స.క్రి. బహుమతిఇచ్చు. కళా. 5.2. కానుకపెట్టు రూ. కానుకవెట్టు. స.క్రి. బహుమతులిచ్చు. కానుకలందు అ.క్రి. బహుమతులుపొందు. < కానుక + -లు + అందు. కానుకలిచ్చు అ.క్రి. బహుమతులిచ్చు < కానుక + -లు + ఇచ్చు. కానుకలెత్తు అ.క్రి. బహుమతులుపొందు < కానుక + -లు + ఎత్తు. కానుకవెట్టు (-పెట్టు) రూ.చూ. కానుకపెట్టు. స.క్రి. బహుమతులిచ్చు. కానుకసేయు (-చేయు) స.క్రి. కానుకలిచ్చు.

కానుగ రూ.చూ. కానుగు. వి. గానుగుచెట్టు (pongamia glabra).

కానుగు రూ. కాగు[3]. కానగ[2], కానిక[2], కానగు[2], కానిగ[3], కానిగె, కానుగ, కాన్గ, కాన్గు, కాన్గె, గానుగ[1]. గానుగు. వి. గానుగు. వేంక. పంచ. 4.522, కరంజం, కాగుచెట్టు. సముద్రతీరపు అడవుల్లోను, ఏటిగట్లమీద, కొండలమీద పెరిగే చెట్టు. ఆకుసుపచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు. దీని

గింజలనుంచి తీసిన చమురు వైద్యంలో ఉపయోగిస్తుంది. ఆకును పశువులు తింటాయి (Pongamia glabra).

క. కానగు. కలపకు పనికివచ్చే చెట్టు (Dalbergia cancedaria). త. కానాకణమ్. ఒకపెద్దవృక్షం; కొంద. కాఖాని.

కానుగొయి రూ.చూ. కానూనుగోయి. వి. ముల్కీ ఉద్యోగి, మండలాధికారి.

కానుగోయి రూ.చూ. కానూనుగోయి. వి. ముల్కీ ఉద్యోగి, మండలాధికారి. అధికృతుడు, సర్వఖల్కి, భూస్వామ్యంతో ఆర్జింపబడ్డ పెద్దమండలం యొక్క అధికారి, ఒకతాలూకా రివాజు ఎరిగి భూములు వివరపు లెక్కపెట్టుకొనే ఉద్యోగస్తుడు.

కానుచు రూ.చూ. కాంచు[1]. స.క్రి. చూచు, దర్శించు, కాంచు. విష్ణు.పు. 8.309.

కానుదీయులు రూ.చూ. కందీలు. వి. దీపం, ప్రమిద.

కానుపించు చూ. కానుపు.

కానుపించుకొను చూ. కానుపు.

కానుపు రూ. కాన్పు. చూ. కానుచు. వి. 1. ప్రాప్తి, పొందడం. భార. ఆది. 6.283; 2. దర్శనం, దృష్టి. భార. విరా. 2.84; 3. తలపు, అభిప్రాయం. భార. అను. 4.175; 4. భావించటం, జ్ఞానం. కాశీ. 6.78; 5. ప్రసూతి, ప్రసవించడం. ఆము. 4.78; 6. సంతానం. విప్ర. 1.23.

కానుపించు రూ.చూ. కానిపించు. అ. క్రి. కనిపించు, కాన్పించు. స.క్రి. చూపించు. కానుపించుకొను అ.క్రి. కన్పించు.

కానుముక్క వి. అంగీగుడ్డ, చొక్కాలకోసం నేసినబట్ట, రకరకాల రంగుల్లోను గళ్ళలోను, చారల్లోను, డిజైన్లలోను నేస్తారు.

కానులు వి.బ.వ. మరానుకట్టుబడిలో అడ్డపట్టెను ఆకులను బిగించిన కట్టెలు.

కానూను వి. శాసనం, చట్టం, నియమం.

హిం. ఉ. పార. కానూన్. చట్టం, నియమం.

< ఉ. కానూన్.

కానూనుగోయి రూ. కానుగొయి, కానుగోయి. వి. గ్రామంలో పై విచారణ చేసేవాడు (Overseer).

కానె చూ. కాని. వి. గుంజ.

కానెం వి. బూడిదగుంట, ఆముపాడు, మసిగాడి, మసిగుంట, మసిపాదు, ఆము దగ్గరగా బూడిదను తీసిపోసిన గుంట.

కానెంపాక్క వి. ఆముదగ్గర బూడిదపోసిన గుంట. కానేలు వి.బ.వ. మసిగుంటలు.

కానేలు చూ. కానెం.

కానోవు చూ. కాన్. అవ్య. 1. కాబోలు. భార. శాంతి. 3.310, కకుత్థ్స. 1.143; 2. ఔనేమో.

కాన్క రూ. చూ. కానిక[1]. వి. దేవుడు, గురువు, రాజు మొ. వారికి గౌరవంగా ఇచ్చే ద్రవ్యం, ఉపాయనం. ఉ. రా. 1.235.

కాన్కి రూ. చూ. కానిక[1]. వి. 1. చూపు. కు. సం. 6.162; 2. కానుపు; 3. దేవుడికి సమర్పించే ద్రవ్యం, కట్నం.

క. కాణికె. కానుక, చూపు.

కాన్గ రూ. చూ. కానుగు. వి. గానుగు.

కాన్గు రూ. చూ. కానుగు. వి. గానుగు. హంస. 4.11; అచ్చరా. యు. 4.38, అం. భా. 2.47.

కాన్గె రూ. చూ. కానుగు. వి. గానుగు.

కాన్చు రూ. చూ. కాంచు[1]. స. క్రి. 1. కన్పట్టు, తెలిసికొను. భార. విరా. 3.99; 2. ఆశ్రయించు, శరణుజొచ్చు. భార. ఉద్యో. 4.289; 3. చూచు.

కాంతాలము రూ. చూ. కాంతాళము. వి. కోపం.

కాంతాలములపడు రూ. కాంతాళపడు. అ. క్రి. ఈర్ష్యపడు. చంద్రాంగ. 4.234.

కాంతాళపడు చూ. కాంతాళము.

కాంతాళము రూ. కాతాళము, కాంతాలము. వి. 1. తాలిమిలేమి, అధైర్యం. ప్రభా. 3.42; 2. కోపం, వ్యాకులం మీద వచ్చేకోపం. ద్వి. పరమ. వి. 8.607 పు. 8 పం.; 3. ఈర్ష్య. విష్ణుపు. 2.

త. కాంతాళమ్. కోపం.

కాంతాళపడు రూ.చూ. కాంతాలములపడు. అ. క్రి. అధైర్యపడు. చంద్రాంగ. 4.275. కాంతాళించు అ.క్రి. కోపపడు, కినియు.

కాంతాళించు చూ. కాంతాళము.

కాందారి రూ. కాఁదారి. వి. నడిరేయి, అర్ధరాత్రి.

కాందారిప్రొద్దు రూ.చూ. కాఁదారిప్రొద్దు. వి. అర్ధరాత్రి. కాందారిమాందారి రూ.చూ. కాఁదారిమాఁదారి. వి. నడిరేయి, అర్ధరాత్రి. కాందారిమాందారిప్రొద్దు రూ. కాఁదారి మాఁదారి ప్రొద్దు. వి. నడిరేయి, నిశీథం. అం. భా. 1.94. కాందారిమాందారివేళ వి. నడిరేయి. మల్ల. 3.85.

కాంద్ర వి. జమ్ముగడ్డి, ఏనుగు గడ్డి. ప్రవాహాల పక్కన, మురికి కాల్వల పక్కన గుబురుగా, పొడుగ్గా పెరిగేగడ్డి, ఇళ్ళ కప్పుకిది ఉపయోగం (Typha elephantina).

కాఁదారి రూ. కాందారి. వి. అర్ధరాత్రి

కాఁదారిప్రొద్దు రూ. చూ. కాందారిప్రొద్దు, అర్ధరాత్రి, నడిరేయి. భీమ. 1.111. కాఁదారిమాఁదారి రూ. కాందారి మాందారి. వి. అర్ధరాత్రం. యయా. కాఁదారిమాఁదారి ప్రొద్దు రూ.చూ. కాందారి మాందారి ప్రొద్దు. వి. నడిరేయి, అర్ధరాత్రి. యయా. 2.89.

కాన్పించు చూ. కాన్పు.

కాన్పించుకొను చూ. కాన్పు.

కాన్పు రూ. చూ. కానుపు. చూ. కానుచు. వి. 1. పొందు, ప్రాప్తి. భార. ఆది. 4.283; 2. దర్శనం, దృష్టి. భార. విరా. 2.84; 3. తలపు, అభిప్రాయం. భార. అను. 4.175; 4. భావించడం. కాశీ. 6.78; 5. ప్రసూతి, ప్రసవించడం. ఆము. 4.78; 6. సంతానం. విప్ర. 1.23.

కాన్పించు రూ. చూ. కానిపించు. స. క్రి. చూపు, చూపించు, దర్శింపచేయు. దశకు. 7.154; అ.క్రి. కన్పడు, ప్రత్యక్షమగు. కళా. 2.98; కాన్పించుకొను స.క్రి. చూచు. కాన్పుకుండ వి. ప్రసూతిగదిలో మలమూత్రా

లకు వాడే మట్టికుండ. కాన్పుకెక్కు అ.క్రి. ప్రకాశించు, కనబడు. కాన్పుచేయు స.క్రి. ప్రసవ సమయంలో సాయపడు. కాన్పునడుపు స.క్రి. కాన్పుచేయు. కాళ. 4.10.

కాన్లుమచ్చలు వి.బ.వ. ఆము పడుగులో మొదట పెద్దకుండలు తర్వాత మధ్యరకం కుండలు, వాటిపైన పేర్చిన చిన్న కుండలు.

కాన్వెంటు వి. క్రైస్తవులచే స్థాపింపబడిన పాఠశాల.

ఇం. *Convent*. క్రైస్తవులచే స్థాపింపబడిన పాఠశాల. ఒకచోట కలసి ఉండే (క్రైస్తవ మత) స్త్రీల సమాజం. అట్టివారుండే భవనం.

< ఇం. Convent.

కాన్వొకేషను వి. విశ్వ విద్యాలయ స్నాతకోత్సవం.

ఇం. *Convocation*. విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం. సభ. రాష్ట్రాల పాదిరీల సభ; విశ్వ విద్యాలయాల శాసన సభ.

< ఇం. Convocation.

కాపటము రూ.చూ. కాఁపటము. వి. కాపటం పెట్టడం.

కాపంతము వి. 1. కుక్కమెడకు కట్టేకఱ్ఱ. ఆం. శా. 2.290; 2. కుక్కను కట్టేరాట.

పో. చూ. హిం. ఖావింద్. ప్రభువు, యజమాని.

కాపరి చూ. కాపు[1].

కాపరొడ్డ వి. 1. కసువు, చెత్త, తాలు; 2. అరిగ, కొఱ్ఱ, దామ, వరిగె, మొ. పంటలు నూర్చగా మిగిలిన ఆకు, కాడ మొదలైనవి. ఇవి పశువులకు ఆహారం; 3. పశువులకు మేతగావేసే ఎండిన లేక పచ్చిపైన మొక్కలు, ఆకులు, కాడలు.

కాపలా వి. కావలి, కాపుదల, కాపుదారి.

< కాపుదల.

కాపాడు చూ. కాపు[1].

కాపాయము రూ. కాపేయము. వి. పొదుపు, మితవ్యయం.

కాపి[1] రూ. కాపీ[1]. వి. రాత నేర్చుకోడానికి పైనపెట్టే వరవడి, నకలు.

ఇం. *Copy* నకలు, నమూనా.

< ఇం. Copy.

కాఫి[2] రూ.చూ. కాఫీ. వి. కాఫీగింజలు, కాఫి, పానీయ విశేషం.

కాపికఱ్ఱలు రూ.చూ. కాఫీకలరు. వి. వక్కరంగులో నలుపువన్నె.

కాపించు చూ. కాపు[1].

కాపిడు చూ. కాపు[1].

కాపిచ్చు వి.బ.వ. పాలుపట్టి తినటానికి అనువుగా ఉండే గింజలు.

కాపీ[1] రూ.చూ. కాపి[1]. వి. నకలు, నమూనా, చూచిరాయటం.

కాఫీ[2] రూ.చూ. కాఫీ. వి. 1. పానీయవిశేషం; 2. కాఫీ మొక్క, తెల్లని పూలుకల ఒకరకం మొక్క, దీని గింజలతో కాఫిపొడి తయారు చేస్తారు (Coffee ara Bica).

కాపు[1] రూ.చూ. కాఁపు[1]. చూ. కాచు. వి. 1. రక్షణ, రక్షణం. భార. శాంతి. 5.299; 2. పశుదు, లోలుడు. కువల. 4.133; 3. రక్షకుడు, కావలివాడు. ఉ.రా. 6.61; 4. వ్యవసాయం చేసేవాడు; 5. రెడ్డి, పంటకాపు, మోటాటివాడు; 6. వ్యవసాయకుడు, సంసారి; 7. బలిజవాడు.

కాపరి వి. కాపాడేవాడు, రక్షకుడు. భాగ. 1.482. < కాపు[1] + -అరి. కాపాడు స.క్రి. కాచు, రక్షించు. ఆము. 5.40. త. కాప్పాఱ్ఱు-. రక్షించు. కాపించు రూ.చూ. కాఁపించు. స.క్రి. కావచేయు, రక్షింపచేయు. మను. 3.19. కాపిడు రూ. కాఁపిడు. స.క్రి. కాపుదలపెట్టు, కావలిపెట్టు. పండి. చ. 3.880. బసవ. 3.407. కాపుకాఁడు వి. కాపరి, రక్షకుడు. అచ్చరా.యు. 6.79. కాపుకూలి వి. పశువుల కాపరికిచ్చే భృతి. కాపుగడ వి. రక్షణం. రం. రా. అయోధ్య. 138 పు. 9 పం. కాపుచెక్క వి. పన్నెకట్టుబడిలో ఈనె పుల్లల వరసకు చివర ఈనెలు చెదిరిపోకుండా బిగించిన వెదల్పుబద్ద. కాపుచేయు స.క్రి. నిరోధించు కాపుజిట్ట వి. కమ్మి ఇవతల నేసిన రెండు పోగులు. కాపుంచు స.క్రి. కావలాఉంచు. కాపుదనం రూ.చూ. కాపుదనము. వి. రైతుగా ఉండటం. కాపుదనము(-తనము) రూ. కాపుదనం. వి. 1. కాపుల పెత్తనం; 2. గ్రామపెత్తనం; 3. కర్షక జాతి. కాపుదల(-తల) వి. ఏడుగడ. కాపుదారి వి. కాపలా, కావలి, రక్షణ. కాపుమాలు వి. కాపులు వడికిన నూలు. కాపున్యాయం వి. రైతున్యాయం, సంసారి ధర్మం. కాపుబద్ద రూ. కాబ్బద్ద. వి. పన్నె కట్టుబడిలో ఈనె పుల్లల ఈనెలు చెదిరిపోకుండా చివర బిగించిన వెదల్పు బద్ద. కాపుబిళ్ళ వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబిళ్ల. కాపువెట్టు(-పెట్టు) రూ. కాపెట్టు. అ.క్రి. కావలి ఉండు. ఉ.రా. 4.130, విక్ర. 1.86. కాపెట్టు రూ.చూ. కాపువెట్టు. స.క్రి. కనుపెట్టుకొను, కాచుకొను. హంస. 2.110. < కాపు[1] + పెట్టు.

కాపు[2] చూ. కాయు[3]. వి. కాయలుకాయడం, కాపుకు రావడం, పైరు పూర్తిగా పండిన దశ.

కాపుగొప్పు వి. పైరుకాపుకు వచ్చేముందు కలుపు మొక్కలు తవ్వటం. కాపుతొడుగు అ.క్రి. పండు, పంటకు వచ్చు. కాపుదిగు అ.క్రి. కాయలుకాయు.

కాపు[3] రూ.చూ. కాఁపు[3]. వి. కుండలు మొ. వాటిని కాల్చడం.

కాపుకుండ వి. సారాగూన, సారాయిబట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్ద మట్టిపాత్ర. కాపుడుబాన రూ.చూ. కాపుబాన. వి. సారాగూన. కాపుబాన రూ. కాపుడుబాన, కాడ్బాన. వి. సారాయిబట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్ద మట్టిపాత్ర, సారాగూన.

కాపుదనంపార వి. చెలకపార, మట్టిపని చేయడానికి వర్దెవారు, రైతులువాడే పార.

కాపురానికిపంపు చూ. కాఁపురము. స.క్రి. కోడరికానికి పంపు.

కాపురానికివచ్చు చూ. కాఁపురము. అ.క్రి. పెద్దదగు, రజస్వల అగు.

కాపులు వి.బ.వ. 1. చిన్నపిల్లల చేతులకుంచే కడియాలు; 2. ముంజేతికి పెట్టుకొనే ఆభరణాలు, మురుగులు, గాజులు.

కాపెట్టు చూ. కాపు[1].

కాపేయము రూ.చూ. కాపాయము. వి. పొదుపరితనం, కాపాయం.

కాప్థి రూ.చూ. కాప్థీ. వి. ఒకవిత్తనం.

కాఫీగింజలు వి. మ్లేచ్ఛఫల, అ్రటంతి.

**కాఫీ** రూ. కాపి², కాపీ², కాఫి. వి. కాఫీ గింజ.

ఇం *Coffee.* కాఫీమొక్క, కాఫీగింజలు, కాఫీపొడరు. పానీయ విశేషం.

<ఇం. Coffee.

కాఫీకలరు రూ. కాపికల్రు, కాఫీకల్రు. వి. వక్కరంగులో నలుపువన్నె. ఇం. *Coffee Colour.* కాఫీపొడిరంగు. <ఇం. Coffee Colour. కాఫీకల్రు రూ.చూ. కాఫీకలరు. వి. వక్కరంగులో నలుపువన్నె. కాఫీపిడత వి. గుండ్రని అంచు చిన్న మూడుఉండే చిన్నపిడత. కాఫీపొయ్యి వి. బొగ్గులు వేసి మంటరాజేసి చిన్న పాత్రపెట్టి కాఫీ మొ. కాచుకోడానికి ఉపయోగించే చిన్నపొయ్యి.

**కాబూసి** వి. పిల్లల్ని భయపెట్టడానికి 'కాబూసి' పేరు ఉచ్చరిస్తారు. పరాసు 'బుస్సీదొర' బూసి, బూచి అయ్యాడు.

**కాబేజి** వి. కాబేజి, గోబీపువ్వు, పువ్వుగోబి, మధ్యపువ్వు.

ఇం. *Cabbage.* గోబీపువ్వు.

<ఇం. Cabbage.

**కాబ్బద్ద** రూ.చూ. కావుబద్ద. వి. పన్నెకట్టుబడిలో ఊనెపుల్లల వరనకు చివర బిగించిన వెదల్లుబద్ద.

**కాబ్బాన** రూ.చూ. కావుబాన. వి. సారాగూన.

**కామ్** వి. శిస్తుకు సంబంధించిన పదం.

హిం. ఉ. కామ్. పని.

<ఉ. కామ్.

కామ్‌లెక్క వి. చిత్తులెక్క, దినవహి, గ్రామకరణాలు రానుకొనే స్వంత లెక్కలు.

**కామ** వి. **1.** పువ్వుకాడ. కు.సం. 5.168 ; **2.** కలువ, తామర మొ. వానికాడ. భార. కర్ణ. 3.37 ; **3.** గదాదండం. భార. కర్ణ. 1.169 ; **4.** ఛత్రదండం. హరి. పూ. 7.178 ; **5.** కూరకాడ, శాకనాళం. ఆం.భా. 2.248 ; **6.** జెండాకర్ర. భార. కర్ణ. 2.118. **7.** మగగురి, కళాశాస్త్రం. 3.62.64 ; **8.** చన్నుమొన. పాండు. 5.278 ; **9.** కట్టె, కాడ ; **10.** గొడ్డలికామ ; **11.** రంగు అద్దిన నూలులడీలు గుంజకు తగిలించి పిండే కర్ర, గుండ్రటిది. దీన్ని లడీల్లో దూర్చి మెలిపెడతారు. దీంతో పోగులు విడిలిస్తారు. కొన్నిచోట్ల రంగునీళ్ళలో ఉడికే లడీలను దీంతో తిరగేస్తారు ; **12.** పట్టుదారం చుట్టే పంటె కట్టుబడిలో మధ్య బిగించిన కర్ర ; **13.** పార మొ. సాధనాలని పట్టుకోడానికి పీలిచ్చే పొడుగాటి కొయ్యపిడి.

క. కావు, కాము, కావ్వు. కాడ, కొమ్మ. కర్రపిడి ; కొడ. కవ్. కర్ర ; తు. కావు. ; త. కాంపు. పువ్వు కాడ, కొమ్మ, పూలకొమ్మ. తిన్నని చేతిపిడి ; మ. కాంపు. కొమ్మ, కాడ, గొడుగుకర్ర ; తొద. కాఫ్. బోలుగాఉన్న కొమ్మ ; గోం. కామె. చెమ్చాకాడ ; కువి. కంబ, కాంబ. చేతిపిడి.

**కామక** రూ. కామకా. క్రి. విశే. ద్రు. తప్పకుండా.

**కామకా** రూ.చూ. కామక. క్రి.విశే. ద్రు. ఆగత్యంగా, గట్టిగా.

**కామంకూతు** వి. కాముని దహనం అనే ఒక నాటకం. ఈ ప్రదర్శనాల్లో కాముని చిత్రం కాలుస్తారు. ఢిల్లీలో రామలీల వంటిది. కాని అందులో రావణుని బొమ్మలు కాలుస్తారు.

**కామంచి** రూ. కాంచి, కామంజి, కావంచి. వి. **1.** నిమ్మగడ్డి, తృణవిశేషం (Cymbopogon Caesius). ఆం.భా. 2.76 , **2.** నల్లబుడునర ; **3.** బోదగడ్డివంటి తృణ విశేషం. (Solanumnigrum).

క. కామంచ, కామంచి, కాచి, కాంచి, కావంచి. నిమ్మగడ్డి. (Andropogon Schochanthus).

కామంచిగడ్డి వి. ఒకరకం నూనె తయారీకి ఉపయోగించే గడ్డి, కసిగడ్డి. క. కచిహుల్లు. (Cymbopogon martini). కామంచి చెట్టు వి. నక్కద్రాక్ష.

**కామంజి** రూ.చూ. కామంచి. వి. **1.** నిమ్మగడ్డి ; **2.** నల్లబుడునర.

**కామణ్ణు** వి. కాముడు, మన్మథుడు.

**కామదార్లు** వి.బ.వ. ఒకరకం వడ్లు, ధాన్యవిశేషం. హంస. 4.178.

**కామధేనువు అంచు** వి. ఒకరకం రంగునూలుతో నేసిన అంచు.

**కామందు** రూ.చూ. ఖామందు. వి. యజమాని, భూస్వామి.

**కామన్వెల్తు** వి. బ్రిటిషు పరిపాలనకింద పూర్వం ఉండి ఇప్పుడు స్వతంత్రంగా ఉన్న కొన్ని రాజ్యాల కూటమి.

ఇం. *Common-Wealth.* ప్రజాప్రభుత్వం.

<ఇం. Common Wealth

**కామపార** వి. కొండిపార, కొయ్యపార.

**కామప్ప** వి. వర్షంకోసం కాపులు ఊరేగించి ఊరినడుమలో పెట్టే కామదేవుని ప్రతిమ.

**కామభోగము** వి. దేవునికి చేసే భోగ విశేషం.

సం. కామభోగ-. ఇచ్ఛాభోగం.

<సం. కామభోగ-. (అర్థవిపరి).

**కామమద్దు** వి. ఉన్ని వడికేటప్పుడు కదురు ఊచ తొడమీద పెట్టి తిప్పటం.

**కామరా** రూ.చూ. కామ్రా.వి. **1.** గది, అర , **2.** ఓడలోని గది.

**కామర్లు** రూ.చూ. కామాల[1]. వి.బ.వ. పచ్చకామెర్లు.

**కామలు** వి.బ.వ. **1.** అంచులు ; **2.** చనుమొనలు.

**కామవరపు జీడి** రూ. కామారపు జీడి. వి. తగులుకొంటే వదలనిది.

**కామసజ్జ** వి. శివయోగి యొక్క పరికరం.

**కామా** వి. చదవటంలో కొంచెం నిలపవలసిన చోట వేసే గుర్తు (,).

ఇం. *Comma.* విరామ చిహ్నం.

<ఇం. Comma.

**కామాకు** వి. ఒక రకమైన కంద.

**కామాక్షి** వి. **1.** మొగులుదాల్చే ఒకనగ ; **2.** ఒకానొక వాద్య విశేషం.

సం. కామాక్షి-. దేవీమూర్తి భేదం, కంచిలోని దేవి.

<సం. కామాక్షి-. (అర్థవిపరి.).

**కామాటకము** రూ.చూ. కామాటము. వి. **1.** మోటపని, కూలి పని ; **2.** సంసార సామాగ్రి.

కామాటకము చేయు స.క్రి పటాటోపంచేయు.

**కామాటము** రూ. కామాటకము. వి. **1.** మోటపని, కూలిపని.

రామా. 8.135 ; 2. సంసారసామగ్రి, ఇంటిపరికరాలు. రామా. 8.185 ; 3. పెద్దయెత్తున చేసేపని.

సం. కర్మఠ-. కార్యనిపుణుడు ; ప్రా కమ్మఠ-. పనిలో నేర్పు కలవాడు.

క. కామాట. కూలిపని ; కామాటె. రోజుకూలివాడు ; త. కామాట్టి. కూలివాడు, జడుడు ; మ. కామాట్టి. తాపీ పనివాడు, సేనకు ముందుదారి బాగుచేసే సిపాయి.

< ప్రా. కమ్మఠ-.

**కామాటి** రూ.కామాటీ. వి. 1. కార్మికుడు, మట్టిపనివాడు, కూలి పని చేసేవాడు, మోటపని చేసేవాడు, కామాటం కలవాడు.

క. కామాటి. రోజుకూలి చేసేవాడు ; త కామాట్టి. కూలివాడు, జడుడు ; మ. కామాట్టి. తాపీపని చేసేవాడు, సేనకు ముందు తోవ బాగుచేసే సిపాయి.

**కామాటీ** రూ.చూ. కామాటి.వి. కార్మికుడు, మట్టిపనివాడు.

**కామాటీలు** వి.బ.వ. 1. నెల్లూరి వాసులైన అగ్ని కుల క్షత్రియులు ; 2. బొంబాయిలో ఉన్న తెలుగువారు ; 3. పోకిరులు.

**కామావుచేయు** స.క్రి. జరిగిన సంఘటనలను తెలియకుండా చేయు.

**కామారవు జీడి** రూ.చూ. కామవరవుజీడి. వి. తగులుకొంటే వదలనిది.

**కామాల**[1]. రూ. కామర్లు, కామెర[1], కామెల. వి. కన్నులు పచ్చ నయ్యేరోగ విశేషం. ఆం.శా. 2.127.

సం. కామలా. ఒకరకమైన కామెర్లు, పైత్యం అడ్డటం. క. కామలె, కర్మపలె, కామణి, కామని, కామాలె, కామిణి. ఒక రకమైన కామెర్లు ; తు. కామలె. కామెర్లు ; పిత్తకామలె. కామెర్ల, పైత్యం అడ్డటం ; త. కామాలై. మ. కామల, కామిల ; బ్రా. కవల్.

< సం కామలా.

**కామాల**[2] రూ.చూ. కాఁబోలు. అవ్య. కాబోలు.

**కామాలి** వి. కామెర్ల రోగి.

**కామి** చూ. అగు.వి. 1. తగకుండటం. భార. అను. 2.240 ; 2. కాకపోవటం. శృం. నై. 3.93 ; 3. అగు. ధాతువు యొక్క వ్యతిరేక భావార్థక రూపం.

**కామిమెసర** వి. గిరుగుడు చెట్టు, చిలకదుద్ది చెట్టు (Ceacaseria tomentosa).

**కామిరి** రూ.చూ. క్రామా. వి 1. ఓడలోని గది ; 2. అర గది.

**కామిలేడి పిట్ట** వి. ఒకరకమైన పక్షి.

**కామీలు** అవ్య. సంపూర్తి, కేవలం.

**కాము**[1] వి. పిడి, తాపి, మొ. వాటిని పట్టుకోడానికి వీలుగా అమర్చిన కొయ్య ముక్క.

**కాము**[2] వి. నిలువున ఎత్తుగా పెరిగే పెద్దచెట్టు. పాటల వర్ణపు పూలుపూసే ఒకచెట్టు. కానుగు చెట్టు. (pongamia glabra).

**కాముక** అవ్య. నిక్కచ్చిగా, నిష్కర్షగా, తప్పక.

**కాముకునిలజ్జ** వి. అసంభవం. రాధికా. 4.79. 'కామాతురాణాం న భయం, న లజ్జా' అని శాస్త్రం. కాముకులకు సిగ్గు ఉండటం అసంభవం. కాబట్టి 'కాముకుని లజ్జ'. అంటే అసంభవం అనే అర్థం వచ్చింది.

**కాముగారి** రూ.చూ. కాంకారి. వి. పనిమరమ్మత్తు.

**కాముని పున్నమ** వి. ఫాల్గుణ పౌర్ణమి, హోలీ.

**కామెడి** వి. సుఖాంత నాటకం.

ఇం. *Comedy.* సుఖాంత నాటకం.

< ఇం. Comedy.

**కామెర**[1] రూ.చూ. కామాల[1]. వి. కళ్లు పచ్చనయ్యే రోగ విశేషం. సహదేవ శిక్ష. 1.102.

**కామెర**[2] రూ.చూ. క్రామా. వి. 1. గది, అర ; 2. ఓడలో గది.

**కామెల** రూ.చూ. కామాల[1]. వి. కామల, పసరిక.

**కామోటి** రూ. కమ్మటి. వి. పల్లెటూరివాడు.

**కామోసు** అవ్య. కాబోలు, కామాల.

**కాంపుడు కాగు** వి. సారాగూన, సారాయి బట్టీలో వాడే అడుగు మందంలో ఉండే పెద్ద మట్టిపాత్ర.

**కాంపౌండు గోడ** వి. ప్రహరీగోడ.

ఇం. *Compound.* ఆవరణ.

< ఇం. Compound.+ గోడ.

**కాంబోది** వి. సస్య విశేషం. విష్ణువు. 3.181.

క. కాంబోజి. స్త్రైసినిమొక్క ; త. కాంబోజి. సస్య విశేషం.

**కాఁపరము** చూ. కాఁపు[3].

**కాఁపత** చూ. కాఁపు[1]. వి. శూద్ర స్త్రీ, కాపుది.

**కాఁపది** రూ.చూ. కాఁపుది. వి. 1. శూద్రజాతి స్త్రీ. ఉ. హరి. 4.33 ; 2. పనిమనిషి.

**కాఁపమాటలు** చూ. కాఁపు[1].

**కాఁపిడు** రూ.చూ. కాపిడు. స.క్రి. కాపుంచు, కాపలా ఉంచు.

**కాఁపించు** రూ. కాపించు. స.క్రి. 1. కాచేట్లుచేయు. నదనాథ. 1. 39. పు. 9. పం ; 2. పొంగేట్లుకాచు.

పర్జి. కావిప్-, కాపిల్. వేడిచేయు.

**కాఁపు**[1] రూ. కాపు[1]. వి. 1. కర్షకుడు, సేద్యగాడు. భార. సౌప్తి. 1.31 ; 2. పంటకులం, ఆంధ్రుల్లో ఒకకులం. ఆము. 4.133 ; 3. శూద్రుడు. ఆం బా. 2.282 ; 4. రక్షించటం.

త. కాప్పు. సంరక్షణ, కావల్. కంచె.

< మూ.ద్రా.* కా-రక్షించు.

కాఁపమాటలు వి.బ.వ. మోటుభాష, కఠినపుమాటలు. కాఁపుకాఁడు వి. 1. సేద్యగాడు ; 2. శూద్రుడు. కాఁపుడు వి. రక్షించటం. కాఁపుతనము వి. అనాగరికమైన పరిస్థితి, వ్యవసాయదారులస్థితి. కాఁపుది రూ. కాఁపది వి. శూద్ర స్త్రీ. ఉ. హరిశ్చ. 4.33 < కాపు[1] + అది. కాఁపువాఁడు వి. శూద్రుడు, వ్యవసాయదారుడు. వేమన. 2.325.

**కాఁపు**[2] వి. 1. గృహస్థు. భార. ఆది. 4.267 ; 2. కాపురం, నివాసం. కళా. 3.260.

తు. కాపు. (కారిదకాపు) కోడిగుడ్లు పెట్టడానికి కూర్చునే స్థలం ; త. కాప్పు. రక్షణ. (పిన్.) కా (త్రి-ప్ప్-) భద్ర పరచు, రక్షణ ; మ. కాప్పు. దామ, ఆవరణ, తోలు,

వి. కుండల్ని సర్దేటప్పుడు మోకాలికింద మోపుగా పెట్టు కొనే కఱ్ఱదిమ్మ. కాలికిబలపం కట్టుకొని తిరుగు అ.క్రి. 1. అదేపనిగా ఎక్కువగా తిరుగు ; 2. కాళ్ళు అరిగిపోయేట్టుగా తిరుగు. కాలికిబంధాలువేయు స.క్రి. అటకట్టుకొను. కాలికి బుద్ధిచెప్పు అ.క్రి. పారిపోవు. పండి.చ. 1.452. కాలికి ముల్లుగ్రుచ్చుకొనకుండు అ.క్రి. ఏమాత్రం అపాయం కలగ కుండు. ప్రబోధ. 4.56. కాలికివేస్తే మెడకు మెడకువేస్తే కాలికివేయు స.క్రి. ఏదోవిధంగా వాదంలో తికమకలు పెట్టు. కాలికివేస్తే వేలికి వేలికివేస్తే కాలికివేయు చూ. కాలికి వేస్తే మెడకు మెడకు వేస్తే కాలికి వేయు. స.క్రి. ఏదో విధంగా వాదంలో తికమకలు పెట్టు. కాలికొంకులు వి.బ.వ. దేగ మొ. పక్షుల కాళ్ళయందలి కొంకివంటి వంకరగోళ్ళు. కాలికొద్ది రూ. చూ. కాలికొలది. అవ్య. నడవటంలోను, పరిగెత్తటంలోను కాలిలోఉన్న శక్తినంతా ఉపయోగించ గలిగినంత. కాలికొద్దీపరుగెత్తు రూ. కాలికొద్దీ పరుపెత్తు. అ.క్రి. ఎంతశక్తి ఉన్నదో అంతశక్తినీ ఉప యోగించి పరుగెత్తు. కాలికొద్దీపరుపెత్తు రూ. చూ. కాలి కొద్దీపరుగెత్తు. అ. క్రి. వేగంగా పరుగెత్తు. కాలికొంది రూ. చూ. కాలికొలది. అవ్య. నడవటంలోను, పరిగెత్తటం లోను కాలిలో ఉన్నశక్తినంతా ఉపయోగించ గలిగినంత. కాలికొలది. కాలికొలది రూ. కాలికొద్ది, కాలికొంది. అవ్య. 1. కాలిదారా. ఆము. 4.35 ; 2. నడవటంలోను, పరి గెత్తటంలోను కాలిలో ఉన్న శక్తినంతా ఉపయోగించ గలిగినంత. కాలిక్రిందికనవ్వగాఁజూచు స. క్రి. హీనంగా చూచు. శుక. 3.128. కాలిగాలి వి. పశువుల కాళ్ళకు పుళ్ళుపడే జబ్బుగాలి. కాలిగుంజ రూ. కాలగుంజ, కాలుగుంజ, కాళిగుంజ, కేళిగుంజ. వి. 1. నిట్రాటికి చుట్టుగాని, పందిరి గుంజలకు పక్కనగాని పాతిన పొట్టిగుంజ ; 2. ఇళ్ళకు ఒక పక్కగా దించిన వసారాకు ఆధారభూతమైన కొయ్య కంబం. కాలిగూడు వి. 1. కొఱ్ఱ, జొన్న, మొ. పైర్లు కోసికట్టిన కట్టలు కొన్ని నిలబెట్టి గుడిసెగా వేసిన కుప్ప ; 2. చిన్నగూడు. కాలిగోటికిదీటువచ్చు అ. క్రి. ఏమాత్రం సరిపోలకపోవు. కాలిగోరునపోలకుండు అ. క్రి. ఏమాత్రం సరిరాకుండు. రామా. 5.179. కాలిజోడు వి.బ.వ. పాదరక్షలు. కాలిజోళ్ళుతెగేదాక అవ్య. ఎక్కువగా అధికంగా. కాలిడనిచ్చు (-ఇచ్చు) స. క్రి. ప్రవేశించనిచ్చు. హంస. 3.114. కాలిడనిల్చు అ. క్రి. ధైర్యంగా నిలబడు. కు. సం. 10.144. కాలిడు అ. క్రి. 1. చొచ్చు, ప్రవేశించు, అడుగుపెట్టు, గృహప్రవేశంచేయు. వేంక. పంచ. 1.86 ; 2. కాపురముండు. క. కాల్ ఇడు. అడుగువేయు, నడుచు ; త. కాల్ ఇటు. అడుగుపెట్టు, ప్రవేశించు <కాలు² + ఇడు. కాలితెరువు రూ. కాలిదెరువు, కాలుదెరువు, కాల్దెరువు. వి. కాలితోవ. కాలిత్రోవ రూ. కాలిద్రోవ, కాల్త్రోవ. వి. కాలితోవ. కాలిదాటగు అ.క్రి. కీడుతగులు. కాలిదారి రూ. కాల్దారి. వి. కాలితోవ. కాలిదెరువు (-తెరువు) రూ. చూ. కాలితెరువు వి. కాలితోవ. కాలిదోవ (-తోవ) రూ. చూ. కాలిత్రోవ. వి. కాలిబాట. కాలిద్రోవ (-త్రోవ) రూ.చూ. కాలితోవ. వి. కాలిబాట. కాలినడ రూ. చూ. కాల్నడ. వి. పాదచారం, కాలినడక. కాలినడక రూ.చూ. కాల్నడక, వి. బండీ బడకాలేకుండా నడచిపోవడం. కాలిపట్టె వి. రాట్నం అడ్డపట్టె. కాలిపరుగు వి. ఒకబంతి ఎడ్లచే తొక్కించే పలచటి పడుగు. కాలిపాటు వి. పశువుల కాళ్ళ సౌష్ఠవం, పొంకం. కాలిపాదువ వి. మల్లయుద్ధంలోని మెలకువ. కాలిపారువ వి. మల్లయుద్ధం మెలకువలలో ఒకటి. కాలిపిందె వి. ఎద్దుకాలికి వేసేకడియం. కాలిపీట వి. రాట్నం అడ్డ పట్టె, తొక్కుడుపీట. కాలిపుట్టువు వి. పాదజుడు, శూద్రుడు, నాలుగో వర్ణంవాడు, పాదంనుంచి పుట్టినవాడు. కాలిబంటు రూ. కాల్బంటు. వి. పదాతి, కాల్బలం. కాలిబందము రూ. చూ. కాల్బందము. వి. 1. బందం తాడు, కాళ్ళకు కట్టడానికి ఉపయోగించేతాడు, 2. చెట్టెక్కటానికి కాలికి వేసేబందం. కాలిబాట వి. మనుష్యులు నడకను పోవడానికి వీలయినదారి. కాలిబోను వి. ఒక విధమైన బోను. మను. 4.37. కాలిమట్టులు వి.బ.వ. కాలి తొక్కుళ్ళు. పారి. 1.23. కాలిమడి రూ.చూ. కాల్మడి. వి. కాలుమడుచుకొని విడిచేది, మూత్రం, ఉచ్చ. కాలిమానిసి రూ.చూ. కాలుమానిసి. వి. కాల్బలం, పదాతి. పల్నా.వు.22. కాలిమీదకాలుతీయకుండా అవ్య. ఏమాత్రం పనిచేయకుండా, హాయిగా. కాలిమీదకాలువేలిమీదరాయివేసుకొని అవ్య. అట్టహాసంగా, పనీపాటాలేకుండా. కాలిముల్లు వి. కాలిలో గుచ్చుకొన్నముల్లు. ఉ. రా. 1 149. విణ. (కాలిలోని ముల్లువంటివాడు) క్షణక్షణబాధకుడు. కాలిమూఁక వి. పదాతిదళం, కాల్బలం. రంగా. చ. 1.137. కాలిమెడ రూ. చూ. కాలుమెడ. వి. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి మెడకు కలిపికట్టే కట్టు. కాలిమొద్దు రూ. కాలుమొద్ద, కాలుమొద్దు. వి. పంటెకునూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టేమొద్దు. కాలిరస్తా వి. కాలిబాట. కాలిసంకెల వి. 1. చరణశృంఖలం ; 2. పనులకు అడ్డం. (అర్థవిపరి.). కాలీచవరగా క్రి. విణ. కాళ్ళుఅరిగిపోయేట్టుగా. పాండు. 2.204. కాలుకడ వి. కాళ్ళవైపు. భార.ఉద్యో. 1.65. కాలు కండి వి. గోడలకట్టుబడిలో వాడేఇటిక రాతిలోని నాలుగో వంతుముక్క. కాలుకదల్చు అ.క్రి. ముందడుగువేయు. కాలు కంబము వి. ద్వారంయొక్క పక్కచెక్క. బిల్హ. 2.115. కాలుకిందపెట్టనీయకుండా అవ్య. ఏమాత్రం పనిచేయనీయ కుండా. కాలుకొనవిచ్చు స. క్రి. కాలునిలవనిచ్చు. భార. ద్రోణ. 5.275. కాలుకొను² రూ. కాలుగొను², కాల్కొను², అ. క్రి. 1. కాలుమోపు, నెలకొను. కు. సం. 12.99 ; 2. కాలితోనడచు. నిర్వ. రా. 6.36. కాలుకొన్నంత అవ్య. కాలితోనడువఁగలిగినంత. నిర్వ. రా. 4.76. కాలుకొలుపు² అ. క్రి. కాలుకొను. కాలుగాలి వి. పశువులకు గొరిజలయందు పుండుపడే వ్యాధి. కాలుగాలినపిల్లి (-కాలినపిల్లి) వి. బాధతో ఇటూ అటూ పరిగెత్తేవాడు. కాలుగాలినపిల్లివలె అవ్య. 1. ఒకచోటు నిలవక. ద్వి. హరిశ్చ. 2.1243 ; 2. ఆలస్యానికి ఓర్వలేక. కాలుగిద్ద వి. గిద్దలోనాల్గోవంతు. కాలుగీరు అ.క్రి. సైగచేయు. కాలుగుంజ రూ. చూ. కాలిగుంజ. వి. 1. నిట్రాటికి చుట్టుగాని, పందిరిగుంజలకు పక్కనగాని పాతిన పొట్టిగుంజ ; 2. ఇళ్ళకు ఒకపక్కగా దించిన వసారాకు

ఆధారభూతమైన కొయ్యకంబం ; **3.** మరమగ్గం చట్రం నిలబెట్టటానికి ఆధారంగా నేతబయలులో పాతిన కొయ్యరాట. **కాలుగొను**[2] (-కొను) రూ. చూ. కాలుకొను[2]. అ. క్రి. నడచు, నిలుచు, కాలుకొను. **కాలుచాచు** రూ.చూ. కాలుసాచు. అ.క్రి. ప్రయాణమగు. స. క్రి. **1.** యత్నించు, సిద్ధపడు ; **2.** వ్యతిరేకించు. **కాలుచాపు** స. క్రి. ఆశించు. అ.క్రి. **1.** విశ్రాంతి తీసుకొను ; **2.** పనిచేయడం, మానివేయు ; **3.** త్వరగానడచు. **కాలుచ్చు.** వి. ఒక వేటసాధనం, పశు పక్ష్యాదుల కాళ్ళు తగులుకొనేటట్లు బిగిసే ఉరి. యయా. 2.19. <కాలు[3]+ఉచ్చు. **కాలుజాచు** (-చాచు) రూ.చూ. కాలుసాచు. స.క్రి. **1.** యత్నించు. **2.** వ్యతిరేకించు. అ. క్రి. **1.** సిద్ధమగు ; **2.** అసమర్థతను తెలుపు. **కాలుజాపుపీట(-చాపుపీట)** రూ. కాలుజాప్పీట. కాల్జాప్పీట. వి. **1.** దబ్బారాట్నం పీటకు బిగించిన పొడుగుపట్టె ; **2.** రాట్నం అడపట్టె. **కాలుజాప్పీట** రూ.చూ. కాలుజాపుపీట. **కాలుజారు** అ. క్రి. **1.** తప్పుదారి తొక్కు ; **2.** వ్యభిచరించు. **కాలుతక్కువవాడు** వి. వడిగా నడవలేనివాడు. భార. విరా. 5.225. **కాలుతళిగె** వి. కంచెడు పదార్థంలో నాల్గోవంతు, తలిగెలో నాల్గోవంతు. **కాలుతీసిపెట్టకుండా** అవ్య. ఏమాత్రం పనిచేయకుండా. చూ. కాలుక్రిందపెట్టకుండా. **కాలుత్రొక్కికంకణంకట్టు** స. క్రి. విధి విహితంగా పెళ్ళిచేసుకొను. **కాలుత్రొక్కికొనివచ్చు** అ. క్రి. వెన్నంటివచ్చు. **కాలుత్రొక్కికొను** అ.క్రి. తొందరపడు. **కాలుదన్ను(-తన్ను)** రూ.చూ. కాల్దన్ను. అ.క్రి. కాలునిలుపు, కదలక నిలుచు. **కాలుదివిటీ** రూ. కాల్దివిటీ. వి. ప్రభువులు మొదలైనవారు పోతున్నప్పుడు పట్టేదివ్వె. **కాలుదివిటీమర్యాద** వి. రాచమర్యాదల్లో ఒకటి, రాజులు మొదలైనవారు పోతుంటే దివిటీలను వంగిపట్టుకొని ముందు నడిచే ఆచారం. **కాలుదివియ** వి. ప్రభువులు మొదలైనవారు పోతున్నప్పుడు పట్టే కాగడా. భార.విరా. 3.4. **కాలుదువ్వు** అ.క్రి. సిద్ధపడు. **కాలుదూయు** అ.క్రి. **1.** పారిపోవు ; **2.** లేచిపోవు. **కాలుదెరువు** రూ.చూ. కాలితెరువు. వి. కాలిబాట. **కాలుద్రవ్వు (-త్రవ్వు)** రూ. కాల్ద్రవ్వు. అ. క్రి. **1.** ఎద్దులాగా కాలితో నేలను తవ్వు ; భార. సభా. 2.183 ; **2.** అకారణంగా కయ్యానికి సిద్ధపడు. **కాలుద్రొక్కు (-త్రొక్కు)** రూ కాల్ద్రొక్కు. స. క్రి. **1.** వెంబడించు. విజయ. 2.159. అ. క్రి. **1.** వివాహమాడు, పెండ్లాడు. ఆం. భా. 2.177 ; **2.** కాలూదు, నిలిచియుండు (అడిదము సూరకవిచాటువు) ; **3.** అభిముఖుడగు, ఎదురుపడు ; **4.** యువతీయువకులు కూడుకొను. **కాలునిలుచు** అ. క్రి. ఒక ఒకచోట స్థిరంగాఉండు. **కాలువేలగీరు** స. క్రి. **1.** కాలితో నేలనుగీరు ; **2.** సిగ్గుపడు. **కాలువేలదింపకుండా** అవ్య. హాయిగా. **కాలువట్టు** రూ. కాలుబట్టు, కాల్పట్టు. స. క్రి. **1.** ఆశ్రయించు ; **2.** నమస్కారంచేయు. **కాలువడు** రూ. చూ. కాల్పడు. అ. క్రి. చిక్కుకొను, లోబడు. **కాలువలము** వి. పలంలో నాల్గవభాగం. ఆం. భా. 2.269. **కాలుపురుగుతొలుచు** అ. క్రి. ప్రయాణేచ్ఛ విపరీతంగా కలుగు. **కాలుపెట్టినవేళ** వి. **1.** కాపరానికి వచ్చినవేళ ; **2.** వచ్చిన సమయం. **కాలుపెట్టేనందిచ్చు** అ.క్రి. ఏకొంచెమైన అవకాశమిచ్చు. **కాలుపొడుచు** అ.క్రి. కాలును. పాండు. 4.237. **కాలుబట్టితీయు** స.క్రి. కింద పడదోయు. **కాలుబట్టు(-పట్టు)** రూ.చూ. కాలుపట్టు. అ.క్రి. పశువులకు పట్టలుకొట్టు. **కాలుబలము** రూ.చూ. కాల్బలము. వి. కాలితో నడిచేసేన, పదాతిబలం. భార.భీష్మ. 2.165. **కాలుబైటపెట్టకుండా** అవ్య. ఏమాత్రం శ్రమపడకుండా, అనాయసంగా. **కాలుబోసుకొను** (-పోసుకొను) అ.క్రి. కోలుకొను. **కాలుమడి** రూ.చూ. కాల్మడి. వి. **1.** మూత్రం ; **2.** పశువుల మూత్రబంధరోగం. **కాలుమడుచు** రూ. కాలుముడుచు, కాల్మడుచు. అ.క్రి. మూత్రవిసర్జనంచేయు. **కాలుమానిసి** రూ. కాలిమానిసి. వి. పాదచారియైన మనిషి, పదాతి. భార. భీష్మ. 3.97. క. కాల్-అళ్. సిపాయి ; త. కాల్-ఆళ్. సిపాయి, పదాతి దళం ; మ. కాల్-అళ్. సిపాయి, పదాతిదళం. **కాలుముడుచు** రూ. చూ. కాలుమడుచు. అ. క్రి. **1.** మూత్రవిసర్జనంచేయు ; **2.** అకారణంగాసిద్ధపడు. **కాలుమొద్ద** రూ. చూ కాలిమొద్దు. వి. వంటెకునూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగాపెట్టే మొద్దు. **కాలుమెడ** రూ. కాలిమెడ. వి. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి మెడకు కలిపి కట్టేకట్టు. **కాలుమొద్దు** రూ. చూ. కాలిమొద్దు. వి. వంటెకు నూలుచుట్టేటప్పుడు ముక్కుగా ఊనికగా పెట్టే మొద్దు. **కాలుమోపుబల్ల** వి. కుండల్ని నర్సేటప్పుడు మోకాలికింద మోపుగా పెట్టుకొనేదుక్క. **కాలుమ్రొక్కు** స. క్రి. నమస్కరించు. **కాలురావడదిరుగు (-తిరుగు)** అ. క్రి. కాళ్ళుఅరిగిపోయేట్టుగా తిరుగు. ఉ. హరి. 1.131. **కాలురాయి**[2] రూ. కాల్రాయి. వి. నిట్రాటకు చుట్టూ పాతిన రాయి. **కాలురి** వి. ఒకవేటసాధనం, పశుపక్ష్యాదుల కాళ్ళు తగులుకొనేట్లాగ్గే ఉరి. ఉ. హరి. 4.22. < కాలు[2] + ఉరి. **కాలువల** వి. పశుపక్ష్యాదుల కాళ్ళకు తగులుకోటానికై వేటగాళ్ళు పన్నే వల. పి. శకు. 2.14. **కాలువురు** రూ.చూ. కాల్పురు. వి.బ.వ. కాలిబంట్లు. **కాలుసాగు** అ.క్రి. పశువులను కాలుసాగటానికి విడుచు. **కాలుసాచు(-చాచు)** రూ. కాలుచాచు, కాలుజాచు, కాల్సాచు. స.క్రి. ఆశించు. హర. 3.434. అ.క్రి. **1.** ప్రయత్నించు, సిద్ధపడు ; **2.** ప్రయాణమగు ; **3.** బాకీ ఎగ్గొట్టు ; **4.** కాలూను. **కాలుసేతులు కట్టించి తెచ్చు** స. క్రి. నిర్బంధంగా కొనివచ్చు. హంస. 3.141. **కాలూను** అ. క్రి. **1.** స్థిరంగా నిలుచు. శుక. 2.268 ; **2.** చొచ్చు ; **3.** అంతదొరుకు < కాలు[2] + ఊను. **కాలూదు** అ.క్రి. **1.** కాలుపెట్టు. కాలుమోపు. శృం. నై. 5.127 ; **2.** పోవటానికి సిద్ధంగా ఉండు. హంస. 2.149 ; **3.** అగు, ఎక్కువకాలముండు. విక్ర. 2.226 ; **4.** ప్రవేశించు, చొచ్చు. వా.రా. 1.114. క. కాలూఱు. అడుగుపెట్టు, వచ్చు ; తు. కాయూరుని. అడుగుపెట్టు (ప్రవేశించు, వచ్చు ; త. కాల్-ఊన్ఱు. భూమిపై నిలదొక్కుకొను. <కాలు[2]+ఊదు. **కాలెత్తు.** అ. క్రి. **1.** చెడిపోవు ; **2.** పోరుకుసిద్ధమగు ; **3.** రతికి. <కాలు[2]+ఎత్తు. **కాల్కడ** రూ. కాలికడ. కాల్గడ. వి. కాళ్ళకడ, పండుకొనేటప్పుడు కాళ్ళుంచుకొనే శయ్యాభాగం.

భారత. ఉద్యో. 1.65. కాల్కడియము రూ. కాలికడియము. వి. పాదవలయం, అందె. హంస. 1.79 ; 2. కాలికడియం. కాల్కొనివిల్చు స. క్రి. గట్టిగా ఎదిరించినిలబడు. కు. సం. 11.35. కాల్కొను[2] రూ. చూ. కాలుకొను[2]. అ. క్రి. కాలుమోపు, నెలకొను, నిలుచు. హరి. ఉ. 9.98. కాల్గద (-కద) రూ.చూ. కాల్కడ. వి. కాళ్ళకడ, పడుకునేటప్పుడు కాళ్ళుంచుకొనే శయ్యాభాగం. హరి. పూ. 1.87. కాల్గట్టు (-కట్టు) రూ. కాలికట్టు. వి. అడిగర్ర, పాదుక. పండి. చ. 1.41. కాల్గట్టుగొను (-కొను) అ. క్రి. పాదధూళి తీసుకొను. పండి. చ. 1.118. కాల్జాప్పీట రూ. చూ. కాలుజాపుపీట. వి. 1. దబ్బారాట్నం. 2. రాట్నం అడుగుపట్టె. కాల్దమ్ను (-తమ్ను) రూ. కాలుదన్ను.అ. క్రి. కాలునిలుపు, కదలకనిలుచు. భార.మౌసల. 197. కాల్దారి రూ. చూ. కాలిదారి. వి. కాలితోవ. కాల్దివిటీ రూ. చూ. కాలుదివిటీ. వి. ప్రభువులు మొదలైనవారు నడిచేటప్పుడు పట్టేకాగడా. కాల్దెరువు (-తెరువు) రూ. చూ. కాలితెరువు. వి. కాలితోవ. జైమినీ భా. 2.5. కాల్దోమికడుగు (-తోమికడుగు) స. క్రి. కాళ్ళబాగా రుద్దుకొని కడుగుకొను. పండి. చ. ప్రథ. 2. ష. 298. కాల్ద్రవ్వు (-త్రవ్వు) రూ. చూ. కాలుద్రవ్వు. అ. క్రి. కారణంలేకుండా (కలహానికి) సిద్ధపడు. భార. శాంతి. 2.282. కాల్ద్రొక్కు (త్రొక్కు) రూ. చూ. కాలుద్రొక్కు. స. క్రి. 1. పెండ్లిఆడు. చంపూ. రా. 2.74. అ. క్రి. 1. ఎదురుపడు ; 2. నిలుచుండు. కాల్ద్రోవ (-త్రోవ) రూ. చూ. కాలిత్రోవ. వి. ఒకడు మాత్రం నడచిపోవటానికి వీలైనమార్గం, కాలిబాట. ప్రబోధ. 5.98. కాల్నడ రూ. కాలినడ. వి. కాలినడక, పదసంచారం. భార. భీష్మ. 1.154 ; వి౽. కాలితో నడిచిపోవటానికి వీలయిన. జాహ్నవీ. 2.123. క. కాల్నడె. కాలినడక ; త. కాల్నడై-. కాల్నడక రూ. కాలినడక. వి. కాలినడక, పదసంచారం. కాల్నడవా(డు వి. పాదచారి, కాలినడకన పోయేవాడు. కాల్పట్టు రూ. చూ. కాలుపట్టు. స.క్రి. 1. నమస్కరించు ; 2. ఆశ్రయించు. కాల్పడు రూ. కాలుపడు. అ.క్రి. 1. చిక్కుకొను. వేమన. 3.93 ; 2 కాలుపడు. కాల్పుట్లు వి.బ.వ. పుట్టిలో నాల్గోభాగం. కాల్బంటు రూ. చూ. కాలిబంటు. వి. కాలిబంటు. కాల్బందము రూ. కాలిబందము. వి. 1. బందంతాడు. చెన్నబసవ. 5.252 ; 2. చెట్టెక్కటానికి కాలికివేసేబందం. కాల్బలము రూ. కాలుబలము. వి. కాలితోనడిచే సేన. భార.ఆరణ్య. 2.221. మార్క. 8.104. కాల్మడి రూ. కాలిమడి. వి. 1. మూత్రం, ఉచ్చ. హరి. పూ. 6.5 ; 2. కాలుమడి. కాల్మడు(చు రూ. చూ. కాలుమడు(చు. అ. క్రి. మూత్ర విసర్జనంచేయు. కాల్మఱుతురు వి. మరుతురులో నాల్గవ భాగం. కాల్రాయి రూ. చూ. కాలురాయి[2]. వి. నిట్రాటకు చుట్టూపాతిన రాయి. కాల్వురు రూ. కాలువురు. వి.బ.వ. పదాతులు, కాలిబంట్లు. భార. ఆది. 1.80, కు. సం. 11.35. కాల్సాచు(-చాచు) రూ. చూ.కాలుసాచు. అ.క్రి. అకారణంగా సిద్ధపడు. కళా. 1.149; 2. దండెత్తు. శేష. 4.90 ; 3. ప్రయత్నించు. రామలిం.శ. 51. కాళ్లకుపోవు అ. క్రి. మలవిసర్జనకు వెళ్ళు. కాళ్లజెఱ్ఱి వి. కర్ణజలూక, చెవిలో ప్రవేశించేజెర్రి. ఆం. భా. 2. 88 ; కువి. కాసెక్ర్రి. జెర్రి. కాళ్ళనిచ్చెన వి. రెండుపొడుగాటి కర్రలకు (మామూలుగా వెదురు) అడ్డకర్రలను బిగించి చేసిన నిచ్చెన. కాళ్ళనుగ్రుమ్ము (-క్రుమ్ము) స. క్రి. తన్ను. కాళ్ళబాతు వి. కాలుపొడుగు మనిషి. కాళ్ళవేళ్ళబడు అ. క్రి. మిక్కిలి దీనంగా ప్రార్థించు. కాళ్ళసాటు స. క్రి మోకాళ్ళపైన కుండను పెట్టుకొనినర్సు. కాళ్ళాడకుండు అ. క్రి. ఏమీతోచకపోవు. కాళ్ళు వి.బ.వ. 1. రెండువస్తువులు, జత ; 2. పాదాలు. కాళ్ళుగుంజు అ. క్రి. కాళ్ళనొప్పులు పుట్టు. కాళ్ళుతీయు అ. క్రి. కాళ్ళనొప్పులు పుట్టు.

కాలు[3] వి. పొలం.

కాలుగచ్చు రూ. చూ. క్రాలుగచ్చు. వి. బావంజి.

కాలురాయి[1] రూ. చూ. కారురాయి. వి. కట్టుడురాయి.

కాలువ రూ. కాలవ, కాల్వ. వి. 1. పరంపర. భార.భీష్మ. 3.234 ; 2. నీళ్ళుపోవటానికి తవ్వినమార్గం, కుల్య.ఆము. 6.8.

క. కాల్, కాలివె, కాలువె, కాల్వె, కావలె. నీటి ప్రవాహం, కాలువ, ఆళ్వానం ; తు. కాలివె. వ్యవసాయానికి నీటి పారుదల కాలవ, కాలువ ; త. కాల్. కాల్-వాయ్, వాయ్-క్కాల్. నీటిపారుదల కాలవ ; మ. వాయ్ క్కాల్. చిన్న లేక సన్నని కాలవ. పో. చూ. త. కాల్.

పో. చూ. సం. ఖల్ల-.కాల్య, కందకం ; ప్రా. ఖల్ల-ఖాల-.

కాలువకుంట్లు వి.బ.వ. గ్రామంలో సమిష్టి కాలువ తవ్వటంలో విధింపబడిన జరిమానాలు. కాలువకుపోవు అ. క్రి. బహిర్భూమికి వెళ్ళు. కాలువక్రంత వి. దొరువా రొంకా. సుద. 4.69. కాలువకట్టు వి. బహిర్భూమికి వెళ్ళటం. కాలువవనిముఖాలు వి.బ.వ. కాలువ మరమ్మతులు. కాలువవంపు వి. కాల్వపారకపుపొలం, కాలువ కింద నీరు పారే పొలం. కాలువలుగట్టు (-కట్టు) అ. క్రి. ప్రవహించు, ఏకధారగా వెడలు. ఉ. హరి. 1.148.

కాలూమ చూ. కాలు[3].

కాలూ(దు చూ. కాలు[3].

కాలెండరు రూ. చూ. కేలెండరు. వి. తారీకుల సూచిక.

కాలెత్తు చూ. కాలు[3].

కాలేజి రూ. కాలీజు. కాలేజీ. వి. కళాశాల.

ఇం. *College*. కళాశాల.

< ఇం. College.

కాలేజిబార్డరు వి. నాలుగయిదు వరసల్లో ఏటవాలుగా పోగులు పడేట్లునేసిన అంచు.

ఇం. *College border*.

< ఇం. College border. (అర్థవిపరి.).

కాలేజీ రూ.చూ. కాలేజి. వి. కళాశాల.

కాల్కడ చూ. కాలు[2].

కాల్కడియము చూ. కాలు[2].

కాల్కొనివిల్చు చూ. కాల్కొను[2].
కాల్కొమ[1] చూ. కాలు[1].
కాల్కొమ[2] చూ. కాలు[2].
కాల్గడ చూ. కాలు[2].
కాల్గట్టి చూ. కాలు[2].
కాల్గట్టిగొమ చూ. కాల్గట్టి.
కాల్గాస్ వి. వంటచెరకుగా ఉపయోగపడే వాయు విశేషం.
 ఇం. *Calgas*. కాల్టెక్స్ కంపెనీ తయారుచేసే వాయువు.
 <ఇం. Calgas.
కాల్చిగంపలకెత్తు చూ. కాల్చు.
కాల్చు చూ. కాలు[1].
కాల్చుకొనితిను చూ. కాల్చు.
కాల్జాప్పట చూ. కాలు[2].
కాల్తట్టు పో.చూ. కాలువతట్టు. వి. బహిర్భూమికి వెళ్ళటం (కాలువవైపువెళ్ళటం మామూలు గనుక "కాలువతట్టు" "కాల్తట్టు" గా మారిఉండవచ్చు).
కాల్దన్ను చూ. కాలు[2].
కాల్దారి చూ. కాలు[2].
కాల్దివిటీ చూ. కాలు[2].
కాల్దెరువు చూ. కాలు[2].
కాల్దొమికడుగు చూ. కాలు[2].
కాల్ద్రివ్వు చూ. కాలు[2].
కాల్ద్రొక్కు చూ. కాలు[2].
కాల్ద్రోవ చూ. కాలు[2].
కాల్నడ చూ. కాలు[2].
కాల్నడక చూ. కాలు[2].
కాల్నడవాఁడు చూ. కాలు[2].
కాల్పట్టు చూ. కాలు[2].
కాల్పడు చూ. కాలు[2].
కాల్పించు చూ. కాలు[1].
కాల్పు చూ. కాలు[1].
కాల్పుట్లు చూ. కాలు[2].
కాల్పుపోవు చూ. కాలు[1].
కాల్పుబండ చూ. కాలు[1].
కాల్పురావ చూ. కాలు[1].
కాల్పురాయి చూ. కాలు[1].
కాల్పువడు చూ. కాలు[1].
కాల్పోడ చూ. కాలు[1].
కాల్బంటు చూ. కాలు[2].
కాల్బందము చూ. కాలు[2].
కాల్బలము చూ. కాలు[2].
కాల్బాలు వి.బ.వ. ఒకదినును వడ్లు.
కాల్మడి చూ. కాలు[2].
కాల్మడుఁచు చూ. కాలు[2].
కాల్మణుతురు చూ. కాలు[2].
కాల్రాయి చూ. కాలు[2].
కాల్వ రూ.చూ. కాలువ. వి. కాలువ. రం.రా. సుందర. 240.
కాల్వడి చూ. కాలు[1].
కాల్వ్రేరు చూ. కాలు[2].
కాల్వ్రాచు చూ. కాలు[2].
కాళ రూ. కాళి, కాళియ, కాళె. వి. బూరకొమ్ము, వాద్య విశేషం. పండి. చ. 5.358.
 సం. కాహలా. ఒకరకమైన వాద్యం ; ప్రా. కాహల-, కాహలఅ, కాహలా ; మా. కాహలా. సంగీతవాద్యం.
 క. కాళె, కాహలె ; త. కాళమ్. బాకా, కొమ్ము ; మ. కాళాంజి.
 <ప్రా.కాహల-
కాళంగి వి. ఒకకులం పేరు.
కాళంజి రూ. కళాంజి, కాళంజిక, కాళాంజి[1]. వి. తమ్మపడిగం, తమ్మ ఉమిసేపాత్ర. ప్రబా. 2.15.
 క. కాళంజి, కాళాంజి. ఉమ్మువేసేపాత్ర, వానన నీళ్ళు చల్లే వెండి లేక ఇత్తడి పాత్ర; త. కాళాంచి. ఉమ్మువేసేపాత్ర, తమలపాకు పెట్టేపాత్ర (పిరపోత) ; మ. కాళాంజి, కాళాంచి. ఉమ్మువేసే పెద్దపాత్ర, బాహా రూపంలో వెండి లేక బంగారం జడకుచ్చులు.
కాళంజిక రూ.చూ. కాళంజి. వి. ఉమ్మితొట్టె. ఉ.రా. 8.313.
కాళత్తి వి. ఒక పవిత్ర శైవక్షేత్రనామం, కాళహస్తి. బసవ. 204.
 సం. కాళహస్తి-. సుప్రసిద్ధశైవక్షేత్రం.
 <సం. కాళహస్తి .
కాళాగజ్జ చూ. కాలు[2]. వి. బాలక్రీడావిశేషం, పిల్లలు కాళ్ళు దాపి ఆడేఆట.
కాళాంజి[1] రూ.చూ. కాళంజి. వి. తమ్మపడిగం, ఉమ్మువేసే పాత్ర. రాజ. చ. 3.202.
కాళాంజి[2] వి. నెమలి ఈకలతో చేసిన (కుంచె) చీపురు.
కాళి రూ.చూ. కాళ. వి. బూరకొమ్ము, వాద్యవిశేషం.
కాళియ రూ.చూ. కాళ. వి. బూరకొమ్ము, వాద్యవిశేషం. అష్టమ.క. 4.198 పు. 22. పం.
కాళీ రూ.చూ. ఖాళీ. విణ. శూన్యమైన. వి. ఖాళీ, శూన్య భాగం.
 కాళీబిళ్ళ వి. బండి కుండకు సాయిమేకుకు మధ్యనున్న సందులో ఇరుసుకు వేసినబిళ్ళ.
కాళె రూ.చూ. కాళ. వి. బూరకొమ్ము.
కాళ్లకుపోవు చూ. కాలు[2].
కాళ్లదెబ్బ చూ. కాలు[2].
కాళ్ళవిచ్చెవ చూ. కాలు[2].
కాళ్ళమ్రగుమ్ము చూ. కాలు[2].
కాళ్ళబాతు చూ. కాలు[2].
కాళ్ళవేళ్ళబడు చూ. కాలు[2].
కాళ్ళపాటు చూ. కాలు[2].
కాళ్ళాడకుండు చూ. కాలు[2].
కాళ్లాము (కాళ్ళ+ఆము) వి. సుమారు 80 పొయ్యిబండి అయిదారు అంతస్తులుగా పేర్చబడిన లక్ష ఇటుకలను కాల్చే పెద్దబట్టి.
కాళ్ళు చూ. కాలు[2].

కాళ్ళగుంజు చూ. కాలు¹.

కాళ్ళతీయు చూ. కాలు².

కావం విణ. ఖాయమైన, నిర్ధారణమయిన.

కావగు అ.క్రి. ఎర్రనగు, కావిఅగు.
<కావి+అగు.

కావచ్చు చూ. అగు. అ.క్రి. 1. పూర్తికావడానికి సిద్ధమగు. భార. ఆది. 5.8 ; 2. కానోపు ; 3. ఊహను తెలుపుతుంది.

కావంచి రూ.చూ. కామంచి. వి. నిమ్మగడ్డి, తృణవిశేషం. ఆం.బా. 2.76 (Cympogon eaesius).

కావటి రూ.చూ. కావడి¹. వి. కావిడి.

కావటిఉట్లు చూ. కావడి¹.

కావటికొమ్ము చూ. కావడి¹.

కావటిచేర్లు చూ. కావడి¹.

కావటితప్పాలు చూ. కావడి¹.

కావటిబద్ద చూ. కావడి¹.

కావటిమట్టు చూ. కావడి¹.

కావడము చూ. అగు. వి. అవటం.

కావడి¹ రూ. కాడి, కాటి², కాండి, కాఁడి¹, కావటి, కావిఠ, కావిడి, గావడి. వి. ఔ. అనా. నీళ్ళ మొ. మోయటానికి రెండు కొనలను ఉట్లమర్చిన వెదురు బద్ద. భార. మౌసల. 29.

పో.చూ. సం. కాచ-, కాజ-. కావడి ; ప్రా. కాయ, కావ. కావడు-కహార్ క్యామొ ; మహా. కావడ్. దే. ప్రా. కావ, కావడమ్ ; అ.మా. కావరర.

క. కావడి, కాగడి ; తు. కావడి ; త. కావటి, కా, కావు, కావుతటి, కావు, వోర్. ; మ. కావటి, కావు, కావుక, కావిక్క. ; గోం. కాంజానా. ; కొండ. కాంజ్, కాస. ; పర్జి. కావ, కాజ, కాచన్, కాఁన్. ; ఒల్లా. కాసల్, కాఁజ్, కాన్. ; కుఇ. కాస. ; కువి. కాంజు, కాచ. ; కొలా. కావఅ్. ; గ. కాసల్, కాంజ్, కాఁజ్ ; కాఁన్.

కావటిఉట్లు రూ.చూ. కావడియుట్లు. వి.బ.వ. కావడి రెండు చివరల తాళ్ళతో అల్లిన ఉట్లు. కావటికొమ్ము వి. కావడి బద్దచివర. కావటిచేర్లు రూ.చూ. కావడిచేయులు. వి.బ.వ. కావడితాళ్ళు. కావటితప్పాలు వి.బ.వ. కావడిలో తెచ్చిన ఉత్తరాలు. కావటిబద్ద రూ. కావిటిబద్ద. వి. కావడికి కట్టిన బద్ద. కావటిమట్టు రూ.చూ. కావడిమట్టు. వి. కావిడికి కట్టే పొడవైన ఉట్టి. కావడికుండలు వి.బ.వ. కావడి కొయ్యకు రెండువైపుల నీళ్ళు మోయడానికి అమర్చిన రెండు మామూలు కడవలు. కావడిచుక్కలు వి.బ.వ. బృహస్పతి కిందివైపున మూలగా ఉండే రెండుచుక్కలు. కావడిచేయులు రూ. కావటిచేర్లు. వి.బ.వ. కావడితాళ్ళు. కావడించు స.క్రి. 1. కావడి లాగ కాళ్ళూ చేతులూ కట్టి అటూఇటూ వేలాడదీసి కర్ర కావడి లాగ చేయు. కు. సం. 2.84 ; 2. కావడిలోపెట్టు. పాండు. 3.89 ; 3. కావడిలో పెట్టి తేవటానికి వీలగు. సుదంతా. 3.195 ; 4. కావడిగా కట్టు. కావడి పాటువడు అ.క్రి. నీళ్ళు మోయు. కావడిపాలు రూ.చూ. కాడిపాలు. వి. ఆసామి కౌలుదారు తన నాగలితో దున్ని పంట చెరి సగం పంచుకొనే పద్ధతి. కావడిపెట్టె వి. బోషాణం వలె చిన్నదిగా ఉండేకొయ్యపెట్టె. కావడిబద్ద రూ. కావటిబద్ద. వి. కావడికోసం ఉపయోగించే కర్ర. కావడిమట్టు రూ. కావటిమట్టు. వి. కావడిఉట్టి. కావడిమాను వి. నాగలి, మోట, బండి మొ. లాగటానికి ఎద్దుల మెడమీద మోపే అడ్డపట్టె. కావడియుట్లు (-ఉట్లు) రూ. కావటిఉట్లు. వి.బ.వ. కావిడి రెండు చివరల తాళ్ళతో అల్లిన ఉట్లు. కావడివడుగు వి. నీళ్ళకావడితెచ్చే బ్రాహ్మణుడు. కావడివాఁడు వి. కావడి మోసేవాడు.

కావడి² చూ. కాడి. వి. బండి లాగే ఎద్దుల మెడలపై మోపే కొయ్య.

కావరము రూ. కావలము. వి. 1. గర్వం, మదం. భార. ఉద్యో. 3.28 ; 2. కొవ్వు.

క. కావర, కావుర, కామొరు,కోపం ; పో.చూ. త. కాయ్‌ప్పు. అయిష్టం, అసహ్యం.

కావరమువట్టు అ.క్రి. పొగరెక్కు. హంస. 5.167. కావరి వి. 1. దుర్మదం కలవాడు. ఆం.బా. 3.7 ; 2. దూర్తుడు. కావరించు అ.క్రి. 1. కావరం కలవాడగు, గర్వించు, పొగరెక్కు. పరమ. వి. 2.39 ; 2. మదించు. కావరితనము వి. గర్వం, అహంకారం. కావరుఁడు రూ.చూ. కావలుఁడు. వి. 1. కావరం కలవాడు. భార.అరణ్య. 6.62 ; 2. దుర్మదుడు.

కావరి చూ. కావరము.

కావరించు చూ. కావరము.

కావరితనము చూ. కావరము.

కావరుఁడు చూ. కావరము.

కావలచు చూ. అగు. అ.క్రి. అగు, కావలయు. ఆము. 6.66.

కావలము రూ.చూ. కావరము. వి. 1. మదం. శృం.నై. 8.196 ; 2. దురాచారం. విష్ణు.పు. 2.286 ; 3. పాపం. విష్ణు.పు. 3.135 ; విణ. గర్వంకల.

కావలుఁడు రూ. కావరుఁడు. వి. గర్వంకలవాడు. కు.సం. 5.79.

కావలయు పో.చూ. అగు. అవ్య.ద్రు. ఊహను తెలుపుతుంది, కాబోలు. భార.ఆది. 3.115. అ.క్రి. 1. గర్హణాన్ని తెలుపుతుంది. కాశీ. 7.49 ; 2. ఇష్టమగు, కోరు. విప్ర. 5.72 ; 3. సంబంధంకలిగిఉండు, బాంధవ్యంకలుగు. ఉ.రా. 4.216 ; 4. ఆవశ్యకమగు, అవసరమగు. ఇందు. 2.5 ; 5. అగు, కాస్తియగు.

కావలసినంత అవ్య. సమృద్ధిగా. కావలసినవాడు చూ. అయినవాడు. వి. ఆప్తుడు, ఇష్టుడు.

కావలసినంత చూ. కావలయు.

కావలసినవాడు చూ. కావలయు.

కావలి చూ. కాయు². వి. 1. రక్షణ, కాపు. ఉ. హరి. 2.138 ; 2. నిర్బంధం, బంధనం.

కావలికాఁడు వి. 1. రక్షకుడు, కాచేవాడు. కాశ. 1.63 ; 2. కావలిఉండే నౌకరు. క. కావలిగాఱ, కావలాకాసేవాడు. కావలికాచు స.క్రి. కావలిఉండు. కావలిపని వి. మూలలు

వచ్చేలట్టుగా కొయ్యబిగింపుచేయడం. కావలిపెట్టు రూ.చూ. కావలివెట్టు. స.క్రి. 1. బంధించు. యయా. 4.8. ; 2. రక్షకుడిగాఉంచు, కాపుదలఉంచు. **కావలిబొట్టు** వి. బిడ్డలకు రక్షగాఉండే నల్లనితిలకం. **కావలియగు(-అగు)** అ.క్రి. రక్షకుడ(ల)గు భార.భీష్మ. 1.174. **కావలియుండు(-ఉండు)** అ.క్రి. రక్షకుడు(లు)గాఉండు. మై.రా. 2.156. **కావలియొసఁగు (-ఒసఁగు)** స.క్రి. రక్షణనిచ్చు. **కావలివాఁడు** వి. కాచేవాడు, రక్షకుడు. భార. విరా. 4.192. **కావలివెట్టు (-పెట్టు)** రూ. కావలిపెట్టు. స.క్రి. 1. రక్షకుడుగాఉంచు. భార.శల్య. 2.26; 2. బంధించు. **కావళులుపెట్టు** రూ. కావళులువెట్టు. స.క్రి. రక్షకులనుగాఉంచు, **కావళులువెట్టు(-పెట్టు)** రూ.చూ. కావళులుపెట్టు. స.క్రి. రక్షకులుగా ఉంచు. నిరంకు. 4.70.

**కావలిచెట్టు** వి. కొండల్లో పెరిగేఒకవిరళమైనచెట్టు.

**కావలుకారు** వి. ఒకరాజకీయోద్యోగి.

**కావలుఁడు** చూ. కావలము.

**కావలె** అ.క్రి.ద్రు. 1. ఆవశ్యకమగు, కావలయు. భార.ఆది. 4.177 ; 2. గర్భజాన్ని తెలుపుతుంది. నరస. 2.47 ; 3. అవసరమగు , 4. కోరు ; 5. కావలసియుండు, జరగకుండు ; 6. కాస్తితగియుండు.

పో.చూ. క. అగలెవెయ్కు, అగబేకు. కావలసిఉండు ; తు. అవోడు ; త. ఆకుఅ, అగు, పూర్తిఅగు.

**కావళులపెట్టు** చూ. కావలి.

**కావళులువెట్టు** చూ. కావలి.

**కావవేయు** రూ.చూ. కావువేయు. స.క్రి. మామిడిపళ్ల పంటటానికి గడ్డిలోపెట్టి ముగ్గవేయు, మాగవేయు.

**కావా** వి. అశ్వాలమండలాకారగతి, అశ్వగతివిశేషం. వె.భద్రా. 1.41.

**కావాకదము** వి. అశ్వమండలాకారగతి. **కావాతిరుగు** అ.క్రి. గుర్రం మండలాకారంగా తిరుగు. **కావాబల్ల** వి. ఒకరకపు పలక.

**కావి** విశ. ఎర్రని, అరుణం. కు.సం. 5.139 ; భార.శల్య. 2.101 ; వి. 1. కాషాయవస్త్రం, ఎర్రబట్ట. పారి. 1.115 ; 2. ఎరుపు. ఆం.భా. 1.108.

క. కావి. ఎర్రమట్టి, ఎర్రరంగుబట్ట ; తు. కావి. కావె. ఎరుపు ; త. కావి, చెవ్వవ్, చె. ఎర్రరంగు ; మ. కావి, చొవ్వ, చె. ; కో. కయేవ్. కాషాయవస్త్రం.

**కావికోక** వి. గోధుమరంగుచీర. **కావిగాము (-కాము)** అ.క్రి. ఎర్రనగు, ఎర్రపడు. మను. 2.71. **కావిగోఁచిదారి** వి. సన్యాసి. ఆం.భా. 2.176. **కావిచీర** వి. కాషాయవస్త్రం. **కావికాలుపు** రూ. కావికాల్పు. వి. సన్యాసి, కాషాయధారి. **కావికాల్పు** రూ.చూ. కావికాలుపు. వి. సన్యాసి, కాషాయదారి. **కావిపుట్టగోఁచులసామి** వి. సన్యాసి, యతి. ఆం.నా.సం. 2.2. **కావిరావిరంగు** వి. ఇటికరాతిరంగు. **కావిఱా** రూ. కావిఱాయి. వి. పద్మరాగం, కెంపు. **కావిఱాయి** రూ.చూ. కావిఱా. వి. 1. ఎర్రనిసుద్దరాయి, జేగురురాయి ; 2. కెంపు. **కావులు** వి.బ.వ. యతికాటీలు. **కావులుగలాఁడు** వి. సన్యాసి. సాం.ని. 2.7. వ్యు. కావిరంగు బట్టలు గలవాడు.

**కావించిచెప్పు** చూ. కావించు.

**కావించు** చూ. అగు. స.క్రి. 1. చేయు, చలుపు. భార. ఆది. 1.114 ; 2. కలిగించు, లభింపజేయు. భార.అరణ్య. 1.235 ; 3. సృజించు, నిర్మించు. భార.శాంతి, 6.479 ; 4. ఆరోపించు. భాస్క.రా. కిష్కిం. 4.53 ; 5. సిద్ధంచేయు. కాశీ. 3.212 ; 6. నెరవేర్చు, సఫలంచేయు. పారి. 4.12. 7. రచించు. విష్ణుపు. పీఠి. 25.

**కావించిచెప్పు** స.క్రి. లేనిపోనివి కల్పించిచెప్పు.

**కావిటిబద్ద** చూ. కావిడి.

**కావిడ** రూ.చూ. కావడి[1]. వి. కావిడి.

**కావిడి** రూ.చూ. కావడి[1]. వి. పొడుగాటి కర్రకు రెండు అంచుల్లోను బరువును వేలాడదీసి మోసేసాధనం.

**కావిటిబద్ద** రూ.చూ. కావటిబద్ద. చూ. కావిడి. వి. ఇరువైపులా కావిడికుండల్ని కట్టడానికి వాడే వెదురుబద్ద. **కావిడిబుంగ** వి. కావిడి కర్రకు అమర్చే సీళ్ళకడవ.

**కావిరి** వి. 1. పొగవంటినల్లని పదార్థం. భార. అరణ్య. 1.182 ; 2. నలుపు. కృష్ణవర్ణం. ఉ.హరి. 5.216 ; విశ. నల్లని. విష్ణు పు. పూ. 3. అ.

క. కావళ, కావుళ, గావళ ; పో.చూ. త. కార్.

**కావిరికప్పు** అ.క్రి. నల్లనగు, కావిరిపర్చు. **కావిరిబొట్టు** వి. పీడాపరిహారార్థం శిశువులకు పెట్టేనల్లనిబొట్టు. భాగ. 10. పు. 297. **కావిరివిరియు** అ.క్రి. నల్లదనం వ్యాపించు.

**కావిలిగద్ద** వి. చిలగడదుంపజాతికి చెందినగడ్డ.

**కావిలించుకొను** స.క్రి. కౌగలించుకొను.

**కావిళము** వి. చేప ? మొసలి ? గంధ. 16.

**కావిళ్ళు** వి.బ.వ. కావలాకాయడం.

**కావు[1]** వి. 1. రోదన ధ్వనికనుకరణం. హరి.పూ. 5.150 ; 2. కాకరుతం.

క. కావు, కా. ధ్వన్యనుకరణం; త. కువా-క్, కువా. రోదన ధ్వని, ధ్వన్యనుకరణం.

**కావుమనేడ్చు** అ.క్రి. ఎలుగెత్తి ఏడ్చు. <కావు[1]+-నన్+ఏడ్చు.

**కావు[2]** వి. 1. దొంగలు ఇతరులకు కనబడకుండా ఉండటానికి పెట్టుకునే తిలకం. వేంక. పంచ. 3.199 ; 2. వశీకరణానికి పెట్టుకొనే అంజనం. వసు. 5.118. ; 3. దయ్యాలను విడిపించే మాంత్రికులు ధరించే తిలకం. ప్రబంధ. 72.

క. కావు కాపూ, కావు. రక్షణ ; త. కావు. నుదుటిమీదపెట్టే మంత్ర తైలం, కావు-కా-పొట్టు ; మ. కావు. నుదుటిమీదనల్లని మచ్చ.

**కావువించు** స.క్రి. బొట్టుపెట్టు.

**కావు[3]** వి. 1. పాతరలోనగువానిపైకప్పు. మను. 4.60 ; 2. పాతర ; 3. నేల పాతరకు కట్టేరాతి కట్టడం ; 4. కాయలను ముగ్గపెట్టటం, 5. ఆము కాల్పులో వేడి ; 6. నలుపు.

క. కప్పు, కప్పు, కప్పల్, క్ అప్పు. తవ్వు, గబ్బరిసు, తవ్వు, గోడకిందతవ్వు ; తు. కర్పు. ; త. కాప్పు, కా(ప్-ల్పు-).

**కావుగప్పు (-కప్పు)** స.క్రి. అంతట గప్పికొని పోవు.

కావురుగప్పు. కావుడించు స.క్రి. పళ్ళుకావునుంచి తీయు. కావుపట్టు స.క్రి. 1. మిక్కిలి బాధించు, యాతన పెట్టు. నవనాథ. 1.48, 25 ; 2. మాగవేయు, చితకతన్ను. కావుపాఁతర 1. భూమిలో చుట్టురాళ్ళుకట్టి, గింజలు పోసు కొనటానికి ఉపయోగించేగుంట. 2. భూమిలోదించి ఉంచి, ధాన్యం పోసిపెట్టుకొనటానికి ఉపయోగించే పెద్ద మట్టి బాన ; 3. బలిఇచ్చిన వస్తువులను పాతిపెట్టినది ; 4. పొగాకుకు నారువేయటానికి తవ్వినగొయ్యి ; 5. నేల పాతర. కావుపెట్టు స.క్రి. పండించు. కావువచ్చు అ.క్రి. మాగి పండ్లకు మంచిరంగువచ్చు, కావువేయటంచే పండు. కావువేయు రూ. కావవేయు, కావేయు. అ.క్రి. గాలిచొరకుండ గడ్డి మొదలైనవి కప్పి పచ్చికాయలు పండవేయు. కావేయు రూ.చూ. కావువేయు. అ.క్రి. గాలిచొరకుండ గడ్డి మొ. వాటినికప్పి పచ్చికాయలు పండవేయు.

**కావుట** చూ. అగు. రూ. కావుడు. వి. అవటం. భార. ఆది. 1.138.
త. అకుతల్.

**కావుడు** రూ.చూ. కావుట. వి. అవటం. కు.సం. 6.116.
త. అకుతల్.

**కావుత** రూ. కాత¹. అవ్య. 'అగు' ధాతువుయొక్క ఆశీరాద్యర్థక ప్రత్యయాంత రూపం, ఆశీరర్థకం. భార. ఆది. 8.287.

**కావుదిగు** అ.క్రి. 1. పశువులు ఒకదానినొకటి పొడవటంవల్ల కడుపువాచు ; 2. కడుపుబ్బు.

**కావున** రూ.చూ. కాన³. అవ్య. ద్రు. 1. హేతువును తెలిపేది. భార. ఆది. 4.142 ; 2. కాబట్టి, అవటంచేత.

**కావురు** వి. 1. రాత్రుల్లో కింది వెలుతురు శాఖ ఆకాశంలోకి వ్యాపించిన కాంతి ; 2. సంధ్యాసమయంలో సూర్యుని కిరణాలవల్ల మేఘాల్లో ఏర్పడే ఎర్రరంగు.
కావురుగప్పు (-కప్పు) స.క్రి. కావుగప్పు. కావురుగ్రమ్ము (-క్రమ్ము) అ.క్రి. ఎర్రమబ్బువేసి ఎర్రగా కాంతివచ్చు. కావురుమబ్బు వి. దట్టంగా ఆవరించిన నల్లమబ్బు.

**కావులు** చూ. కావి.

**కావులుగలాఁడు** చూ. కావి.

**కావేయు** చూ. కావు³.

**కావేరిగుఱ్ఱములు** వి.బ.వ. ఉత్తమజాతికి చెందిన గుర్రాలు. బాగాపరిగెత్తేగుర్రాలు. మొల్ల. సుందర. 172.

**కావేశి** రూ.చూ. కావేషము. వి. ద్వేషం, కార్పణ్యం.

**కావేషము** రూ. కావేశి, కావేషి, కావేషీ. వి. విరోధం.

**కావేషి** రూ.చూ. కావేషము. వి. పగ, వి. విరోధం.

**కావేషీ** రూ.చూ. కావేషము. పగ, విరోధం.

**కావోను** అవ్య. 'కావచ్చును' అనేదానికి భ్రష్టరూపం. బహుశా అని అర్థం.

**కాశ¹** రూ.చూ. కాసె². వి. గ్రావకారుడు.

**కాశ²** రూ.చూ. కాసె⁴. వి. 1. పశుయోని ; 3. తోక కిందిభాగం.

**కాశపుల్ల** రూ.చూ. కాశిపుల్ల. వి. కుండలకు కుతికకింది గీతలు గీయడానికి వాడే బోదపుల్ల.

**కాశరాయి** రూ.చూ. కాశెరాయి. వి. ఎర్రకంచురాయి.

**కాశికూర** రూ.చూ. కాసికూర. వి. ఒకరకంకూర.

**కాశికోక** రూ.చూ. కాసెకోక. వి. సన్ననిబట్ట.

**కాశిగడ్డి** వి. పునుక గడ్డి.

**కాశిపుల్ల** రూ. కాశపుల్ల. వి. కుండలకు కుతికకింద గీతలు గీయడానికి వాడే బోదపుల్ల.

**కాశిబేడ** రూ.చూ. కాసిబేడ. వి. మెడలో వేసుకొనే ఒకరకమైన పతకం.

**కాశిరాయి** రూ.చూ. కాశెరాయి. వి. ఎర్రకంచురాయి.
కాశిరాయికట్టుబడి వి. మూగకట్టు, మొనరాయి కట్టుబడి, మోటుదారి, మోడిరాయి కట్టుబడి, సాధారణకట్టు, చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి.

**కాశిరేగు** వి. ఒకరకమైన రేగుపండు.

**కాశివాడు** రూ.చూ. కాసెవాఁడు. వి. రాళ్ళుచెక్కడం, రాళ్ళతో ఇళ్ళుకట్టడం చేసేవాడు.

**కాశిసంకటము** వి. గ్రహణి, సులిగడుపు, శీతభేది.

**కాశీకోక** రూ.చూ. కాసెకోక. చూ. కాసియ. వి. నడుముకు కట్టుకునే గట్టి సన్నని బట్ట.

**కాశీచుక్క** వి. ధ్రువనక్షత్రం.

**కాశీరోగం** వి. మూత్రం ఎర్రగావచ్చే ఒకరకం ఉష్ణరోగం.

**కాశె** చూ. కామంచి. వి. బోదగడ్డి వంటి తృణవిశేషం.

**కాశెపని** రూ.చూ. కాసెపని. వి. రాళ్ళుమలిచేపని.

**కాశెరాయి** రూ. కాశరాయి, కాశిరాయి. వి ఎర్రకంచురాయి.

**కాశెవాడు** రూ.చూ. కాసెవాఁడు. వి. రాళ్ళు చెక్కడం, రాళ్ళతో ఇల్లు కట్టడం చేసేవాడు.

**కాశోడు** రూ.చూ. కాశెవాఁడు. వి. రాళ్ళుచెక్కడం రాళ్ళతో ఇళ్ళుకట్టడం చేసేవాడు.

**కాష్టము** వి. చితి, శవదహనానికి ఏర్పరచిన కట్టెలకుప్ప.
సం. కాష్ఠ. కర్ర-.
<సం. కాష్ఠ-(అర్థవిపరి).

**కాష్తు** వి. సాగవంతం చేయటం.
హిం. కాశ్‌త్. వ్యవసాయం ; ఉ. కాశ్‌త్. వ్యవసాయానికనువుగావుండే ప్రాంతం ; పార. కాష్‌తన్. భూమిని వ్యవసాయానికి అనువుగాచేయటం ; కాష్‌త్. పరిశ్రమించటం ; అర. కాష్‌తన్. భూమిని వ్యవసాయానికి అనువుగా చేయటం.
<ఉ. కాశ్‌త్.

**కాస** రూ.చూ. కాసె¹. వి. వెనక్కి బిగించి కట్టేకోక, చీర, వస్త్రం. అని. 4.34.

**కాసరము** చూ. కాస. వి. కాసెకోక.

**కాసండి** రూ.చూ. కాచండి. వి. పానపాత్ర.

**కాసనామర** వి. 'కాసెగడ్డి' తినటం వల్ల వచ్చే నాముజబ్బు.

**కాసంత** చూ. కాసు.

**కాసర** రూ. కాంచర. కాఁచర, కాఁజర. వి. 1. వృక్షవిశేషం, కాశహర. కాశీ. 3.23 ; 2. అడవుల్లోను, మెరకనేలల్లోను ఎక్కువగా పెరిగే తీగమొక్క (Luffa tuberosa).
సం. కాసారి- ఓషధీ విశేషం.
<సం. కాసారి-.
కాసరకూసర వి. 1. చెడటం ; 2. నెరవేరక పోవటం.

కానరహూపరచేయు స.క్రి. చిందరవందరచేయు. కానరతీగె వి. దట్టంగాఉండే ఒకరకమైన తీగ.

కానరవంట్లు వి.బ.వ. బ్రాహ్మణులు పెళ్ళిలో వాడే నాలుగు అరివేణిపాత్రలు.

కానరలు వి.బ.వ. ఒకరకం ధాన్యం. ప్రబంధ. 112.

కానరవడ్లు చూ. కానరలు. వి.బ.వ. ధాన్య విశేషం.

కానరికుండలు వి.బ.వ. పెండ్లిలో పెట్టేనగం ఐరేణికడవలు (8 కుండలు).

కానలవాడు రూ. కానల్నాడు. వి. 1. ఒకానొక దేశం. క్రీడా. 14; (ఇక్కడినుండి వచ్చిన బ్రాహ్మణులను కానలనాటి వారంటారు); 2. కోనలదేశం; 3. కోనలదేశం నుండి వచ్చిన బ్రాహ్మణ జాతి.

కానల్నాడు రూ.చూ. కానలనాడు. వి. 1. ఒకానొకదేశం. క్రీడా. 44; 2. కోనలదేశం; 3. కోనలదేశం నుంచి వచ్చిన బ్రాహ్మణ జాతి.

కాసా రూ.చూ. ఖాసా. వి. దాసీసంతతి.

కాసావా(డు వి. 1. బానిన, దాసీపుత్రుడు; 2. వంశ పరంపరగా దాస్యం చేసేవాడు.

కాసి[1] వి. 1. పొదవైనగడ్డి; 2. ఒక ఆకుకూర; 3. పిల్లిని చిన్నపిల్లలు పిలిచేపద్ధతి.

కాసికూర రూ. కాశికూర. వి. ఒకరకం ఆకుకూర.

కాసి[2] వి. కాశీకావట్టణం.

సం. కాశీ. వారణాసి.

<సం. కాశీ.

కాసి[3] రూ.చూ. కాసె[1]. వి. దట్టి.

కాసికోక రూ. చూ. కాసెకోక. వి. మొలచుట్టు పూర్వ కాలంలో చుట్టుకొంటూఉండే పొడవైనపట్టీ.

కాసించు స. క్రి. కాసెగాకట్టు, కట్టు, బిగించు. సిం. ద్వా. 7.45.

<కాసి[3] + -. ఇంచు[3].

కాసిని రూ. చూ. కాసిన్ని. విణ. కొన్ని, కాసిన్ని.

కాసింత చూ. కాను.

కాసిన్ని రూ. కసిని[1] కాసిని. విణ. కొన్ని.

కాసిపుల్ల రూ. చూ. కాసెపుల్ల. వి. ఏకుతయారు చెయ్యటానికి ఉపయోగించే పుల్ల.

కాసిపేటంచు వి. ఒకరకం డిజైనులో నేసినఅంచు.

కాసిబేర రూ. కాశిబేర. వి. మెడలోవేసుకొనే ఒకరకమైన పతకం.

కాసియ రూ.చూ. కాసె[1] వి. 1. వస్త్రం, చీర, వెనక్కిబిగించి కట్టే కోక; రామా. 6.83; 2. కచ్చ.

కాసియబారడు వి. గ్రావకారుడు, రాతిపనివాడు.

కాసిళ్ళు వి.బ.వ. నజ్జ, తయిద, జొన్న పీటి పచ్చికంకులు కాల్చి నలిపితే వచ్చే గింజలు.

కాసీకోక రూ. కాసెకోక. వి. బిగింపుకుకాని, అందంకోసం కాని, నడుంకు చుట్టుకునే ఒకరకం బట్ట.

కాసీ(డు రూ. కాసె[2]. వి. కాసెవాడు, రాతిపనివాడు. పరమ. వి. 5.48.

కాసీదట్టి చూ. కాసె[1] వి. బిగింపుకు కాని, అందం కోసంకాని, నడుంకుచుట్టుకొనే ఒకరకం బట్ట.

కాసీవాళ్ళు వి.బ.వ. రాతిపనివారు.

కాసు వి. 1. దుగ్గాణిలో పదోవంతు, దమ్మిడిలో అయిదో వంతు. భాగ. 10. ఉ. 965; 2. పదకొండణాల ఎత్తుగల బంగారపు నాణెం. ద్వి. హరిశ్చ. పూ. 1198; 3. పైకం, ధనం. నిరంకు. 2.128.

క. కాసు. చిన్నరాగినాణెం, డబ్బు; తు. కసు, కాసు. దమ్మిడిలో నగమైన పాతరాగినాణెం; త. కాచు. బంగారం, డబ్బు, ప్రాచీనమైన బంగారునాణెం, చిన్నరాగి నాణెం; మ. కాశు. బంగారం, చిన్నరాగినాణెం, డబ్బు; కో. కచ్. రూపాయి; తొ. కో. స్. రూపాయి.

పో. చూ. సం. కర్ష-. బంగారం లేదా వెండి యొక్క భార విశేషం.

కాసంత క్రి.విణ. కొద్ది, చిన్నభాగం. కాసింత విణ. కొంచెం. కాసుకవ్వర వి. కాసువీసం, కోరీ. బహుళా. 1.111. కాసుకుకాకపోవు అ. క్రి. పనికిరాకపోవు కాసుకుఁగొను (-కొను) స. క్రి. లక్ష్యపెట్టు. ద్వి. హరిశ్చ. 1104. కాసుచేయు అ. క్రి. పనికివచ్చు. శాళ్వ సం. 5.101. కాసునుగీసు దూసికొను స. క్రి. తృణమో పణమో సంపాదించుకొను. శుక. 2.362. కాసులపేరు వి. స్త్రీలుధరించే ఒకరకమయిన కంఠాభరణం. కాసులి వి. బాగా మొనదేలికంతువు ఆకారంలో ఉండే ఉలి, మంచి ఉలి. కాసువీసములు వి.బ.వ. ఏ కొంతోడబ్బు. నిప్ర. 4.27.

కాసెల్లడుల్లు అ. క్రి. డబ్బంతా ఖర్చగు.

కాసుగడ్డి వి. 'కాచి', 'కాకమాచి' అనబడే పొదలాగ పెరిగే తృణ విశేషం.

కాసుదారివా(డు చూ. కాజుదారు. వి. గుర్రపువాడు.

కాసె[1] రూ. కాన, కాసి[3]. కాసియ. వి. గాసెకోక, దట్టి. యయా. 5.74; 2. కచ్చ భేదం, కుచ్చెల. ఆం. భా. 2.158, 2.284.

సం. కచ్ఛా. వెనక దోపుకొనే ధోవతికొంగు, కచ్చ; ప్రా. కచ్ఛా. కటిమేఖల. కటివస్త్రం, కాసెఅ సూక్ష్మ వస్త్రం.

క. కాసి, కాసె. వెనక్కి దోపుకొనే కొంగు.

<ప్రా. కాచిఅ.

కాసెకట్టు రూ. చూ. కాసెగట్టు. అ. క్రి. గోచినవరించుకొను. కాసెకోక రూ. కాశీకోక, దాశీకోక, కాసికోక, కాసీకోక వి. దట్టి. కాసెగట్టు (-కట్టు) రూ. కాసెకట్టు. స. క్రి. కచ్చగట్టు. కాసెనిలుకడ రూ. కాసెనిల్కడ. వి. 1. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78; 2. ముప్పయిరెండు విన్నాణాల్లో ఒకటి. కాసెనిల్కడ రూ. చూ. కాసెనిలుకడ. వి. మల్ల బంధ విశేషం. ఆం. భా. 2.209. కాసెపోసికట్టు స. క్రి. విశంతువులు చీరను తలకిందులుగా తిప్పి అడ్డవేసి (గోచి) కట్టు. కాసెబిగించు అ. క్రి. నడుంకట్టు, సిద్ధమగు. కాసెబాయు (-పూయు) అ. క్రి. నన్నద్ధుడగు, నన్నద్ధుడవటానికి గుడ్డ ఒకతీరుగా కట్టు. కాసెవోయు (-పోయు) స. క్రి. గుడ్డను గోచివలె వెనక్కి బిగించికట్టు.

కాసె[2] రూ. కాశి[1], కాసీఁడు. వి. 1. రాతిపనివాడు. ఆం. భా.

2.284 ; 2. రాయితొలిచేపని.

సం. కష-, కషా. కాష. రాసేది, గీచేది, రాయడం, ఒరగల్లు ; ప్రా. కస-. ఒరయిక, ఒరపిడి పెట్టడం, ప్రహరించడం, ఒరగల్లు. కసఇ. ఒరయు, రాచు, తొలచు.

<ప్రా. కస-.

కాసెపని రూ. కాశెపని. వి. రాతిపని. కాసెభట్టు వి. రాతిపనివాడు. కాసెయులి (-ఉలి) వి. టంకం, రాయి తొలచటానికుపయోగించే పనిముట్టు. వేమన 3.238. కాసెవాఁడు రూ. కాశివాఁడు, కాశెవాడు, కాశోడు. వి. రాతి పనివాడు, రాతిని తొలిచేవాడు. ఆం. భా. 2.284.

కాసె[3] చూ. కామంచి. వి. 1. బోదగడ్డివంటి తృణవిశేషం ; 2. "కాసెగడ్డి" తినటం వల్ల వచ్చే కడుపుఉబ్బు.

కాసె[4] రూ. కాశ[2] వి. 1. పశుయోని ; 2. ? తోకకిందిభాగం.

కాసెపుల్ల రూ. కాసిపుల్ల వి. ఏకుతయారుచెయ్యటానికి ఉపయోగించే పుల్ల.

కాసెల్లడుల్లు చూ. కాను.

కాస్టిక్‌సోడా వి. అద్దకం, రంగు తయారుచేయడానికి వేణ్ణీళ్ళలో కలిపే ఒకరకం లవణం.

ఇం. *Caustic soda.* లవణవిశేషం.

<ఇం. Caustic soda.

కాస్త[1] విణ. కొద్ది ఐన.

కాస్తకూస్త విణ. చాలాకొద్దిగా.

కాస్త[2] వి. సేద్యం, వ్యవసాయం.

హిం. ఉ. కాశ్త్. వ్యవసాయం.

<ఉ. కాశ్త్.

కాస్తకారీ వి. రైతుశిస్తుచెల్లించి దున్నుకొనే సొంత భూమి.

కాస్తదార్ వి. వ్యవసాయం చేసేవాడు.

హిం. ఉ. కాశ్త్‌దార్. వ్యవసాయదారుడు.

<ఉ. కాశ్త్‌దార్.

కాస్యవాడు వి. గ్రావకారుడు, రాతిపనివాడు.

కాహిలా రూ. చూ. ఖాయిలా. వి. కాయిలా.

-కి రూ.చూ. ప్రత్య.గు. షష్ఠీవిభక్తి ప్రత్యయం. షష్ఠ్యర్థంలో ఇ,ఈ, ఐలకు తర్వాత ప్రాయికంగా 'కి' మిగిలిన అచ్చుల తర్వాత 'కు' గాను ఉంటుంది. ఉదా. హరికి, శ్రీకి, పైకి - ప్రాయికంగా అనడంచేత నీకు, ఈకు, మీకు మొ॥వాటిల్లో రాదు. 1. సప్తమీవిభక్త్యర్థకం. భార. ఆది. 5.244; 2. పైకి, మీదకి, పైన, మీద. భార.ఆది. 6.271 ; 3. సంబంధసామాన్యాన్ని తెలుపుతుంది. (ఈ అర్థంలో క్రియతో అన్వయం ఉండదు.) భార.సభా. 2.59 ; 4. పంచమీవిభక్త్యర్థకం. భార.సభా. 2.279, భార.శాంతి. 5.599 ; 5. నిర్ధారణార్థకం, లోపల. భార. అను. 4.276 ; 6. చతుర్థీవిభక్త్యర్థకం. ఆము. 5.143 ; 7. తృతీయావిభక్త్యర్థకం. కళా. పీఠి. 21 ; 8. బంధుతాసంబంధాన్ని తెలుపుతుంది. ఉదా. మఱఁదికి ; 9. స్వస్వామిభావసంబంధాన్ని తెలుపుతుంది. ఉదా. వానికైదు మేడలున్నవి ; 10. అవయవావయవిభావసంబంధం. ఉదా. పక్షికిరెక్కలు రెండుంటాయి ; 11. జన్యజనకభావసంబంధం. ఉదా. అతనికి ఇద్దరుకొడుకులున్నారు.

కికకిక రూ.చూ. కికాకిక. వి. నవ్వటంలో అయ్యేధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 2.127 ; క్రి.విణ. గట్టిగా, బిగ్గరగా.

పో.చూ. క. కికు్క. పెద్దధ్వని, కీచుమనేఅరుపు ; త. కెక్కట్టుమ్-. నవ్వు, హాసం ; కెక్కలి. తీవ్రంగానవ్వు.

కికాకిక రూ. కికకిక. వి. నవ్వడంలో అయ్యేధ్వనికి అనుకరణం. కళా. 1.40, 8.171.

కికింకిరి[1] చూ. కింకిరి[1]. వి. అసహ్యం, మురికి.

కికింకిరి[2] చూ. కింకిరి[2]. వి. కోపవికారం, చీదర.

కికురించు చూ. కికురు.

కికురింత చూ. కికురు.

కికురింతలాట చూ. కికురింత.

కికురింపు చూ. కికురు.

కికురు రూ. కిక్కురు[1]. వి. వంచన, మోసం. ఆం.భా. 2.292. ధ్వన్యనుకరణ శబ్దంకావచ్చు.

కికురించు రూ.చూ. కిక్కురించు. స.క్రి. 1. మోసపుచ్చు, వంచించు. భాగ. 10. పూ. 4.96, మను. 3.129 ; 2. ఓడించు, జయించు, సారంగ. 2.113 ; 3. పోగొట్టు, హరించు. వసు. 5.116. అ.క్రి. తప్పించుకొనితిరుగు, నక్కినక్కితిరుగు. భాగ. 10.పూ. 458. కికురింత రూ. రింత. వి. 1. మోసంచేయటం ; 2. మోసం ; 3. దాగటం. కికురింతలాట వి. దాగుడుమూతలాట. కికురింపు వి. 1. మోసంచేయటం ; 2. మోసం. ఆం.భా. 2.292. కికురుపెట్టు రూ.చూ. కికురువెట్టు. స.క్రి. వంచించు, మొరగు, నక్కినక్కిచేయు, క్రోసివేయు. కికురుపొడుచు రూ.చూ. కికురువొడుచు, స.క్రి. వంచించు, మొరుగు, నక్కినక్కిచేయు. భాగ. 8.208, 10 పూ. 756. కికురులాట వి. దాగిలిమూతలాట. చెన్నబసవ. 5.378. కికురువెట్టు రూ. కికురుపెట్టు, కిక్కురుపెట్టు. స.క్రి. 1. తోసివేయు, తోసిపుచ్చు. భాగ. 8.295 ; 2. వంచించు, కికురించు. రామా. 3.145. కికురువొడుచు రూ. కికురుపొడుచు, కిక్కురువొడుచు. స.క్రి. మోసగించు, వంచించు. భాగ. 10. పూ. 431.

కిక్కస వి. 1. క్రోవివంటి తృణవిశేషం. ఆం.భా. 2.75 ; 2. నలమనే సుగంధద్రవ్యం. ఆం.భా. 2.75.

కిక్కసకసవు వి. గనుపదంటు. కిక్కసగడ్డి వి. ఉదకమండలంలో బాటలవెంబడి పెరిగేఒకరకం గడ్డి (Pennisetum vitiousan).

కిక్కపాలు వి. గర్భిణి చన్నులమీదరేఖలు.

<*కిక్క+చాలు.

కిక్కిరికాడ వి. వ్యాపారంమధ్యలో కలిగించేఅడ్డంకి.

కిక్కిరియు రూ.చూ. క్రిక్కిఱియు. అ.క్రి. గుంపగు, చేరు, కూడు.

కిక్కిఱిబిక్కిఱి చూ. క్రిక్కిఱియు. విణ. సందర్భశుద్ధిలేని (అర్థ వివరి.).

కిక్కిఱిబిక్కిఱిమాటలు వి.బ.వ. సందర్భశుద్ధిలేని మాటలు.

కిక్కిఱియు రూ.చూ. క్రిక్కిఱియు. అ.క్రి. కిటకిటలాడు.

కిక్కిస వి. పావుచెక్కలబిగింపుకు పాతినకొయ్య.

కిక్కిసఅడ్డగ్ర వి. మగ్గంగుంటలో, పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల.

**కిక్కిసగడ్డి** వి. ఒకవిధమైనగడ్డి. (Phragmiteskarka).

**కిక్కు** వి. 1. చెవులులేనిరాట్నంబొమ్మకు చేసినగాడి ; 2. దబ్బారాట్నంగంటం అమర్చడానికి రాట్నంబొమ్మకు చేసిన గాడి ; 3. చేరుబద్దకు బిగింపుకోసంపెట్టిననరకు, నాట.

**కిక్కుముక్కురుమను** చూ. కిక్కురు². అ.క్రి. నోరెత్తు, కొంచెంగా మాట్లాడు. మను. 6.122.

**కిక్కురించు** చూ. కిక్కురు¹.

**కిక్కురింత** చూ. కిక్కురు¹.

**కిక్కురు¹** రూ.చూ. కికురు. వి. మోసం, వంచన.

కిక్కురించు రూ. కికురించు. స.క్రి. వంచించు, మోసపుచ్చు. భాస్క.రా. సుందర. 267. కిక్కురింత రూ.చూ. కికురింత. వి. మోసం, వంచన. కిక్కురువెట్టు (-పెట్టు) రూ.చూ. కికురువెట్టు. స.క్రి. వంచించు, మోసపుచ్చు. రసిక. 3.90 ; విష్ణుమా.4.253. కిక్కురుపొడుచు (-పొడుచు) రూ.చూ. కికురుపొడుచు. స.క్రి. వంచించు, మోసపుచ్చు.

**కిక్కురు²** వి. 1. నిశ్శబ్దం. హర. 6.122 ; 2. అల్పమైన కంఠధ్వనికి అనుకరణం.

పో.చూ. క. కిక్కు. పెద్దధ్వని, అరుపు.

కిక్కురుమనక అవ్య. నిశ్శబ్దంగా, పెదవులుకదల్చకుండా. కిక్కురుమను అ.క్రి. కొద్దిగాపలుకు.

**కిక్కిస** అవ్య.(దు. గట్టిగా, బిగిసేటట్లు, మిక్కిలికదియిక, చచ్చేటట్లు, ప్రాణంపోయేటట్లు. పారి. 3.38. వి. బలాత్కారం.

క. కిక్కఱ్. దగ్గరగా ఉండు, దట్టమగు, గుమికూడు ; కిక్కఱిసు. దగ్గరగాఉండు, దట్టమగు, గుమికూడు.

**కిగ్గడ** వి. 1. తూర్పారపోసేటప్పటి మేలురాని (మంచిగింజలు రాని) ; 2. పక్కనపడేపొట్టు, గింజలుకలిసినతుప్ప.

**కిగ్గ్ర** వి. దోనెముందరవేసిన గుడ్డముడుచుకు పోకుండా అడ్డంగా పైపైపు బిర్రుపెట్టేపొడుగుచెక్క.

**కిగ్గాడి** రూ. కగ్గాడి, కిగ్గాటి, కీగాఁడి. విశ. అల్పమైన, నీచమైన, పనికిమాలిన. కళా. 8.183 ; వి. 1. అంబేద, దిట్టతనంలేనివాడు. ప్రభా. 1.78 ; 2. అప్రయోజకుడు, ఎందుకూపనికిరానివాడు. ఆం.భా. 3.27.

క. కిగ్, కిఱ్. స్వల్పం, తక్కువతనం. ఉదా. కిగ్గణ్ణు. చిన్నకన్ను ; త. కీఱ్-క్-కాఱై. నీచమైనది, అల్పమైనది.

<*క్రిగ్గాడి.

కిగ్గాడికాఁడు వి. అప్రయోజకుడు. శుక. 3.280.

**కిగ్గాడీ** రూ.చూ. కిగ్గాడి. విశ. అల్పమైన, నీచమైన, పనికిమాలిన ; వి. 1. కొరగానివాడు. 2. అంబేద.

**కిగ్గాటి** రూ. చూ. కిగ్గాడి. విశ. అల్పం, నీచం, పనికిమాలిన. వి. 1. కొరగానివాడు ; 2. పోమరి ; 3.అంబేద.

**కిగ్గు** అ. క్రి. జంకు. స. క్రి. సందేహించు.

**కింక¹** రూ. చూ. కినుక¹. వి. 1. కోపం. భార. ద్రోణ. 3.13 ; 2. బాధ, పీడ. విజయ. వి. 2.20 ; 3. పశువుల్ని మేకల్నీ చంపే ఒకరకం రోగం, తెగులు. ఆం. భా. 2.124 ; 4. గట్టిపట్టు, విడవకుండా పెద్వడం.

కింకటచేయు స. క్రి. బాధపెట్టు, పీడించు, కారించు. కింకవీరు వి. శిశువులు పోరుపెట్టినపుడు దృష్టిదోషం పోవటానికి మూడు బొగ్గులు వేసి తీసే పారాణి నీళ్ళు. కింకనీళ్ళుతీయు స. క్రి. పిల్లలు పోరు మానటానికి ఎఱ్ఱనీళ్ళు దిగదుడిచి పారబోయు. కింకపట్టు అ. క్రి. 1. పోరుపెట్టు ; 2. కసిపట్టు, పగపట్టు. కింకపెట్టు అ. క్రి. మారాంచేయు, అలుగు.

**కింక²** వి. కంకిపొట్టు వదలనిగింజలు, అక్కడక్కడ గింజలతో ఉన్న బొంత.

**కింకిరి¹** వి. 1. ఏవ, రోత, రోతపని. కావ్యా. చూ. 1.2 ; 2. మలం. నవనాథ. 189.4.

పో. చూ. క. కిట్టి, కిట్టి. స్రావం, వృక్షాదుల బంకము, ఇనుము, చిట్టెంనూనెమడ్డి,గుంటలో పడేసిన అవపేడ.

కింకిరిచేయు స. క్రి. ఏరుగు, మలంవిడుచు. కింకిరిపడు¹ అ. క్రి. రోతపడు, ఏవగించు. ద్వి. హరిశ్చ. 4.1584. కింకిరిపాటు¹ వి. రోతపడటం. భార. అరణ్య. 5.291. కింకిరిపోవు అ. క్రి. మకిలపోవు, మురికిఅగు.

**కింకిరి²** చూ. కినుక. వి. 1. కోపం. ఉ. హరి. 4.68 ; 2. అపవాదం.

కింకిరిపడు² అ.క్రి. 1. కోపించు, కోపగిల్లు. భార.అను. 1.68. మార్క. 1.58 ; 2. అసూయపడు. ద్వి. హరిశ్చ. 4.2713. కింకిరిపాటు² వి. కోపపడటం. భార.అరణ్య. 5.291.

**కింగళించు** అ. క్రి. మల్లురు కుస్తీపట్టుపట్టు.

**కింగళింపు** వి. మల్లవిద్యా సంబంధమైన షోడశోపవీతాలలో ఒకటి. హంస. 1.206.

**కింగాణము** వి. తారుమారు, వేరుపాటు.

కింగాణముసేయు (-చేయు) స. క్రి. గెలిచేయు.

**కింగాటి** చూ. కిగ్గాడి. వి. కొరగానిపని. ద్వి. భాగ. 4.1104.

**కింగిరి** చూ. కిఱు². విశ. 1. అల్పమైన ; 2. తేలికైన ; వి. నీచుడు.

**కింగ్స్వే** వి. మామూలు గిరలుపడేట్టు నేసినఅంచు.

ఇం. *King's way*. రాచబాట.

<ఇం. King's way (అర్థవిపరి.).

**కిచ** వి. 1. కోతులు, పక్షులుమొదలైన వానికూతలో అయ్యేధ్వని కనుకరణం ; రం. రా. కిష్కిం. 198. పు. 25. పం ; 2. చక్కిలిగింత ; 3. చక్కిలిగింతవలన కలిగే జలదరింపు.

క. కివ, కిచి, కిము, కీచు. ధ్వన్యనుకరణ శబ్దం ; తు. కిచికిచి, కివకివవాతు ; కిమకిమ ; కినుకిఱు ఎలుకలు చేసే కిచకిచ ధ్వని ; కీచుని. కీచుమని అరచు ; త. కీచు. పక్షుల కిచకిచ శబ్దం ; కీకీ. కోడిపిల్లలు కిచకిచమనే చేసేధ్వని ; మ. కిచ్చుకిచ్చు. కిచకిచలాడు.

కిచకిచ వి. పక్షులు మొదలైనవాటికూతలో అయ్యే ధ్వన్యనుకరణం. కిచకిచకూయు అ. క్రి. కిచకిచమని ధ్వనిచేయు. కిచకిచకొట్టు అ. క్రి. కూయు. కిచకొట్టు అ. క్రి. కిచకిచమని ధ్వనిచేయు. రం. రా. కిష్కిం. 198 పు. 25 పం. చక్కిలిగింతకలుగు. క. కిచగుట్టు, కిచిగుట్టు. పక్షులులాగ కిచకిచమని ధ్వనిచేయు, కోతులవలెఅరచు ; తు. కిమకిఱు. ఎలుకల కిచకిచ శబ్దం ; త. కిచ్చుకిచ్ఎనల్.

బల్లులు చేసే కిచకిచ శబ్దం వంటిది, కిచ్చ్-. ఐతు. పక్షులు, బల్లులు మొ. చేసే కిచకిచ ధ్వని వంటిది, కలిసించు, కోతులవలె అరచు, శిశువులవలె అరచు ; మ. కిచ్చుకిచ్చు, కిలుమక, కెంచుక. కీచుమని అరచు.

**కిచాట** రూ. కిచాటు. చూ. కీఁచు. వి. వాగ్వాదం.

**కిచాటు** రూ. చూ. కిచాట. వి. 1. కయ్యం ; 2. లోటు, లేమి.

**కిచిడి**[1] రూ. చూ. కిచ్చడి[1]. వి. పులగం.

**కిచిడి**[2] రూ. చూ. కిచ్చిలి[1]. వి. నారింజభేదం.

**కిచిడీ**[1] రూ. కిచిలి, కిచ్చడి[2], కిచ్చిలి[2]. వి. దక్షిణాదిలో పేరు పడ్డ మంచిరకం వడ్లు.

**కిచిడీలు** వి.బ.వ. పిచికచెంబఅనే సన్నరకం బియ్యం. **కిచిడీనంబావులు** వి.బ.వ. G.E.B. 24వ నెంబరు ధాన్యం. **కిచిడీసాంబ** వి. మంచిసన్నరకం వడ్లపేరు.

**కిచిడీ**[2] రూ. చూ. కిచ్చిలి[1]. వి. ఒకజాతినారింజ.

**కిచిడి**[3] రూ. చూ. కిచ్చడి[1]. వి. నానావస్తువులు చేర్చివండిన చిత్రాన్న విశేషం.

**కిచిలి** రూ. చూ. కిచిడీ[1]. వి. ధాన్యవిశేషం.

**కిచుకు** చూ. కిచ. వి. ధ్వని విశేషానికి అనుకరణం, పాము మొ. భక్షించేటప్పుడు చేసేధ్వనికి అనుకరణం. వేంక.పంచ. 3.370.

క. కిచ, కిచకు, కిచి, కిచు, కీచు. అనుకరణ శబ్దం.

**కిచ్చడి**[1] రూ. కిచిడి[1], కిచిడి[3], కిచ్చిడి[2], ఖిచ్చడి. వి. నానా వస్తువులు చేర్చివండే చిత్రాన్న విశేషం. బియ్యం, పప్పు కలిపినేతితో వండిన అన్నం. కాశీ. 7.185.

హిం. ఖిచడీ. పప్పు బియ్యం కలిపి వండే వంటకం ; మరా. ఖిచడీ, ఖిచిడీ. ఒకరకం వంటకం, పప్పు బియ్యం కలిపివండే వంటకం ; ఉ. ఖిచ్ డీ. పప్పు బియ్యం కలిపి వండే వంటకం ; పార. కిచ్ రీ. పప్పు, బియ్యం, వెన్న మొ. వాటితో తయారుచేసే భారత దేశపు వంటకం.

క. కిచడి, కిచ్చడి. బియ్యం, పప్పుల మిశ్రమం ; త. కిచ్చటి. బియ్యం, పప్పు కలిపి వండిన వంటకం.

<మరా. ఖిచడీ.

**కిచ్చడి**[2] రూ. చూ. కిచిడీ[1]. వి. ఒకరకం వడ్లు.

**కిచ్చపెట్టు** స.క్రి. గిల్లిపెట్టు.

**కిచ్చాటు** వి. ఇబ్బంది.

**కిచ్చాటుగావుండు** అ.క్రి. కొంచెం ఇబ్బందిగా ఉండు. <కిచ్చాటు+. - అ[7] + ఉండు.

**కిచ్చిడి**[1] రూ. చూ. కిచ్చిలి[1]. వి. నారింజ భేదం (Citrus-maderaspatla).

**కిచ్చిడి**[2] రూ. చూ. కిచ్చడి[1]. వి. నానావస్తువులు చేర్చివండే చిత్రాన్న విశేషం.

**కిచ్చిరిపండు** రూ. చూ. కిచ్చిలిపండు. వి. ఒకదినుసునారింజ.

**కిచ్చిలి**[1] రూ. కిచిడి[2], కిచిడీ[2], కిచ్చిడి[1], కిత్తలి[2], కిత్తళి. వి. 1. ఒకజాతి నారింజ, కమలాఫలం ? ; 2. పెద్దనిమ్మ.

క. కిచిలి, కిత్తళె, కిత్తిళె. నారింజపండు ; తు. కిత్తిలి, కత్తిలి, కత్లె. నారింజపండు ; త. కిచ్చిలి. ఒకరకం నారింజ.

**కిచ్చిలిచెట్టు** వి. నారింజచెట్టు. **కిచ్చిలిపండు** రూ. కిచ్చిరిపండు, కిత్తలిపండు, కిత్తిలిపండు. వి. నారింజపండు.

**కిచ్చిలి**[2] రూ. చూ. కిచిడీ[1]. వి. ఒకరకం వడ్లు.

**కిచ్చిలిగడ్డ** వి. తెల్లని లేదా పసుపుతోకూడిన తెల్లని పూలు పూసే ఒకమొక్క (Heychicem cronaricum).

**కించ** వి. 1. మనోవ్యథ. సానంద. 3.38 ; 2. లోటు.

సం. కించ-. ఏమైన.

<సం. కించ-. (అర్థవిపరి.).

**కించపడు** స.క్రి. చింతించు. **కించపఱచు** స.క్రి. చులకన చేయు.

**కించాటు** చూ. కించ. వి. వ్యాకులం.

**కించాయిలు** వి.బ.వ. అప్పగింతలు.

**కించు** రూ. క్రించు. విణ. అల్పమైన, నీచమైన. జైమినీభా. 4.122 ; వి. అల్పుడు, నీచుడు.

పో.చూ. క. కిన్, కిళ్. తక్కువస్థితి, హీనస్థితి ; కిన్నెల. దిగువ భూమి. కీళ్, కిఱ, కిళ్. తక్కువతనం, నీచత్వం ; కిఱతన, తక్కువతనం ; కొడ. కీ. కింద ; కి-ళి. కింద ; కిది. కిందభూమి ; తు. కీలు. తక్కువ, హీనమైన ; కిడు. తక్కువైన ; కిదుకె, కిదుగె. హీనుడు, నీచుడు ; త. కిళ్, కీళ్యు. దిగువభూమి లేక స్థలం ; కిఱతు. కిందఉన్నది ; కీళ్యు. కిందభూమి, కిఱతు. కిందఉన్నది ; మ. కీళ్, కిఴ. కిందిస్థలం ; కిఴక్కు. తమిళదేశం లోని దిగువభూమి ; కోట. కి. కింది ; తొద. కి. కింది ; కకొయ్. కిందిభూమి ; పర్జి. కిడి. తక్కువ, కింద ; కురు. కియ్యా. కింద ; కీతా, కియ్యానాc. కింది ; కితన్ తా. హీనంగాపుట్టిన ; బ్రా కి-కీ-కే. కింద ; కేరఘ్. కిందివైపు, కింద.

పో.చూ. సం. కించిత్. కొంచెం.

**కించుఁదనము** (-తనము) వి. బడలిక, మాంద్యం.

**కిటకిట** రూ.చూ. గిటగిట[2]. వి. 1. పళ్ళు కొరకటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. మను. 5.19 ; 2. వీణ మొదలైన వాటి బిరడా తిప్పటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వైజ. 1.118.

క. కిటి. ధ్వన్యనుకరణ శబ్దం ; కిటికిటి. కలతపెట్టే శబ్దం ; త. కటుకటు, పండ్లవలె వదులగు, ఆభరణంలో నూదిలాగ గలగలలాడు, గలగలధ్వని, ఉరుమువంటి ధ్వని ; కటుకటాయ్. భయంతోవణకు ; కిటుకిటు. చలికి పండ్లు కదలటంవల్ల ఏర్పడే చప్పుడు వంటిదికలుగు, వణకు ; మ. కటుకిటుక్క. వణకు.

**కిటకిటమను** అ.క్రి. కిటకిటమని ధ్వనిచేయు. దశా. 6.82. **కిటకిటలాడు** అ.క్రి. కిక్కిరియు, సమృద్ధంగాఉండు.

**కిటవత** వి. ఉపకారస్మరణం, కృతజ్ఞత.

**కిటి** వి. యశస్సు, కీర్తి.

**కిటికి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిటికిటి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం, దొడ్డి వాకిలి దాటు. మ. 50.

**కిటికీ** రూ. కిటికి, కిటికిటి, కిట్టికీ, కిడకి, కిడికి ; కిరికీ, కిరిటీ, ఖిడికి. వి.గవాక్షం.

త. కటికి. గవాక్షం ; మ. కిటిక్క, కుఱుక్క ; కొలా.

కిడిక్కి; ప్రా. కిడిక్కి.

హిం. ఉ. ఖిడ్‌కీ-గవాక్షం.

< ఉ. ఖిడ్కి.

కిటికీగజాలు వి.బ.వ. కిటికీ కమ్ములు, కిటికీచువ్వలు.

**కిటికీచువ్వలు** వి.బ.వ. కిటికీకమ్ములు.

**కిటికె** వి. కృత్తికకార్తె.

సం. కృత్తికా. ఒక నక్షత్రం.

**కిటుకగు** చూ. కిటుకు.

**కిటుకు** వి. 1. అకార్యం, దుష్కృత్యం, చెడ్డపని. విష్ణు పు. 7.94, 2. మర్మం, రహస్యం, గుట్టు. కళా. 5.38; 3. చిక్కు. ద్వి. హరిశ్చ. పూ. 1.872; 4. కపటం, మోసం. ఆం. భా. 1.138.

పో.చూ. త. కెటుతల్, చెరుపు, కీడు; పర్జి. కిక్టకక్ట్. వంకరటింకర, కిట్క మౌనమగు; కిట్కురె. చప్పుడు లేకుండా, మౌనంగా.

కిటుకగు అ.క్రి. 1. పగయగు; 2. మోనమగు; 3. మరుగగు.

**కిట్టవారమట్ట** వి. తృణవిశేషం.

**కిట్టమి** చూ. కిట్టు[2].

**కిట్టికీ** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిట్టికోల** చూ. కిట్టు[1]. వి. ఇరికించటానికి ఒకతట్టు కొనలుచేర్చి కట్టి చిన్న కోలలతో ఏర్పరచిన సాధనం, వేళ్ళకు కింద మీదపెట్టి ఒత్తే చిటికోల.

క. కిట్టి. రెండు కర్రలమధ్య చేతులు, చెవులు, ముక్కులు, మొ॥నవి నొక్కే ఒకరకం సాధనం; త. కిట్టిక్కోల్. చేతులు, పాదాలు నొక్కే ఒకసాధనం, కోడెలవిత్తులు పరికరం, ఔషధసంబంధమైన నూనె తీసే సాధనం, ఇనుముతో చేసిన పరికరం; కిట్టి. ఇనుముతో చేసిన పరికరం. కిట్టు. దవడ పండ్లవలె గట్టిగా పట్టుకొని ఉండు, బిగించు, బంధించు.

< త. కిట్టిక్కోల్.

**కిట్టింపు[1]** చూ. కిట్టు[2].

**కిట్టింపు[2]** చూ. కిట్టు[2].

**కిట్టు[1]** వి. రెండుకొయ్యలను చేర్చి బిగించినముడి.

క. కిట్టి. రెండుకొయ్యలమధ్య ఉంచి మనిషి చేతులు, చెవులు, ముక్కును ఒత్తి బాధించేశిక్ష.

**కిట్టు[2]** స.క్రి. 1. సమీపించు, కదియు, చేరు. భార. ఆది. 6.263, విరా. 1.83; 2. కవియు, తాకు. భార. సభా. 1.207; 3. చంపు. భార. కర్ణ. 3.261; 4. సరిపెట్టుకొను.

క. కిట్టు, గిట్టు, గెటు-.తాకు, సమీపించు, చేతికందు, చేరు, పొందు; కిడు. తాకటం; గిట్టిసు, గిటిసు. చేరు; తు. గిట్టు. దగ్గర; కిట్టు. చేరువ. కొత. కిట్ట్ (కిట్టి-). పొందు; త. కిట్టు. సమీపించు, దగ్గరకుచేర్చు. కిట్టై. సమీపించు, యుద్ధంలో కలిసికొను, తనస్థానంలోకి చేరు; కిట్టుక. చేతికివచ్చు; కిట్టు. దగ్గర, సమీపం; కిట్టమ్. సమీపం, దగ్గర; కిట్టి. కిట్టికోలలో ఉపయోగించే బిగింపు సాధనాలు; మ. కిట్టుక. చేతికివచ్చు, పొందు, చేరు; కిటయుక. ఎదురుదెబ్బకొట్టు, పొందు; కిటెక్క. ఎదురు దెబ్బకొట్టు; కిటు. సమీపం, దగ్గర, సమం; కిటుచ్చల్. కలవటం, తగవులాడటం, తొ. కిట్-(కిట్య్-). గేదె కొమ్ములు మొదలైనవి పట్టుకొను; కిడ్. దగ్గర, సమీపం; మాల్తో. కిటె. దగ్గర; క్రిత్. సమీపించు.

< మూ.ద్రా. *కిట్-.

కిట్టమి రూ. గిట్టమి. వి. 1. పగ, విరోధం; 2. కలియమి. కిట్టింపు[1] వి. దావు. కిట్టింపు[2] రూ. గిట్టింపు. వి. అమ్మకం లోని లాభం, గిట్టింపు. కిట్టుకొను స.క్రి. చేరుకొను, సమీపించు. దశకు. 6.110,111. కిట్టుబడి వి. అమ్మకంలోనిలాభం. కిట్టుమాను వి. రంగులో తడిసిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

**కిట్టెంటుశ్రోత్రియం** వి. నాలుగో వంతు మాత్రమే పన్ను కట్టుకోవలసిన నేల.

ఇం. *Quitrent*. నేలపన్ను; సం. శ్రోత్రియ. వేద బ్రాహ్మణుడు.

< ఇం. Quitrent.

**కిడకి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిడికి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిడణ** చూ. కీడిణ. వి. వ్యాపారప్పన్ను, క్రీడారం.

**కిడ్నీ** వి. 1. మూత్రపిండం; 2. ఆహారంగావాడే గొర్రె పశువు మొ॥ వాటి మూత్రపిండం.

ఇం. *Kidney*. మూత్రపిండం.

< ఇం. Kidney.

**కిణకిణలాడు** అ.క్రి. జలదరించు, గణగణమను.

క. కిణిగుట్టు, కిణికిణిఎన్ను. చిన్నగంటలు మొదలైన వాటివలె గణగణమనిమోగు; తు. కిణికిణి. చిన్న గంటలు గణగణమనే ధ్వని. కిణిలు. చిన్నగంటలు కిందపడటం వల్ల కలిగిన శబ్దం; గిణిగిణి, గిణిలు. చిన్నగంటల గణగణమనే ధ్వని; త. కిణ్-ఎనల్, కిణ్, కిణ్-ఎనల్ కణిర్ ఎనల్ కిణిల్-ఎనల్ కిణుక్కు-కిణుక్కు-ఎనల్ గణగణమనే ధ్వనిని సూచించేది; మ. కిణుకిణ. గణగణ శబ్దం; కిణున్నుక, కిణుక్కుక. గణగణమను; తొ. కాణ్-ఇన్. గణగణమను; పర్జి. కిణి. చిన్నగంటల ధ్వని.

పో.చూ. సం. కింకిణీ. చిన్నగంట; ప్రా. కిణికిణంత. కిణ్‌కిణ్‌మని శబ్దం చేయటం.

**కిండర్‌గార్టెన్** వి. వస్తుప్రదర్శనతోకూడిన బోధనా పాఠశాల, ప్రదర్శ రూపమైన బోధనాపద్ధతి.

ఇం. *Kindergarten*. వస్తుప్రదర్శనతో కూడిన బోధనాపాఠశాల.

< ఇం. Kindergarten.

**కిండలు** వి. ఏక నక్షత్రం, ఎగతాళి.

**కిత** వి. దేవతార్పణంకోసం కళ్ళంలో ఒక పక్కపోసే మూడు దోసిళ్ళ ధాన్యరాశి, వరికుప్ప.

**కితకిత** వి. చక్కిలిగింత, ధ్వన్యను.

**కితవార** రూ.చూ. కిత్తనార. వి. ఒకరకం నార.

కితవారగుడ్డ రూ.చూ. కిత్తనారగుడ్డ. వి. కాన్వాసుగుడ్డ.

**కితము** రూ.చూ. క్రితము. వి. పూర్వం, ముందు.

**కితాబు**[1] వి. పుస్తకం.
హిం. కితాబ్. పుస్తకం; ఉ. కితాబ్. నకలు, పుస్తకం; పార. కితాబ్. వర్ణనం, రాయటం, పుస్తకం; అర. కితాబ్. పుస్తకం, సంపుటం.
<ఉ. కితాబ్.

**కితాబు**[2] రూ.చూ. ఖితాబు. వి. బిరుదు, గౌరవచిహ్నం. ఆనంద. పీఠి. 68.

**కిత్త**[1] రూ.చూ. కిత్తు. వి. చేతనాచేతనాగ్ని, నిప్పు.

**కిత్త**[2] వి. నేతపనికి తెచ్చుకొన్న (నూలు) సరుకు.

**కిత్త(డు** వి. కృష్ణుడు.
సం. కృష్ణ-. కృష్ణుడు.
<సం. కృష్ణ-.

**కిత్తనార** రూ. కితనార. వి. బాగనార, కలబంద, మంచం నులక నెయ్యటానికి వాడే ఒక రకంనార (Agaveamcricana).
త. కత్తాళై (కల్ + తాళై). కలబంద; కత్తాళై. కలబంద.
**కిత్తనారగుడ్డ** రూ. కితనారగుడ్డ. వి. కిత్తనారతో నేసిన గుడ్డ, మోటుగుడ్డ.

**కిత్తలి**[1] రూ. కిత్తళి. వి. కలబంద జాతికి చెందినమొక్క (Agaveamericana).

**కిత్తలి**[2] రూ.చూ. కిచ్చిలి[1]. వి. కిచ్చిలి, నారింజపండు.
**కిత్తలిపండు** రూ.చూ. కిచ్చిలిపండు. వి. నారింజపండు.

**కిత్తళి** రూ.చూ. కిచ్చిలి[1]. వి. ఒకజాతినారింజ.

**కిత్తా** వి. 1. పర్యాయం, దఫా; 2. పరిమాణం.
హిం. కిత్తా. ఎంత.
<హిం. కిత్తా.

**కిత్తాను** చూ. కిత్తనార. వి. కిత్తనారగుడ్డ.

**కిత్తి**[1] వి. సారెమీద తిరిగే మట్టిముద్దను గిరివేసేచెక్క.

**కిత్తి**[2] రూ.చూ. కిత్తు. వి. అగ్గి, నిప్పు, చేతనాచేతనాగ్ని. ఆం.బా. 1.48.
**కిత్తికంటివేల్పు** వి. శివుడు. వ్యు. అగ్నినేత్రుడు.

**కిత్తిలిపండు** రూ.చూ. కిచ్చిలిపండు. వి. నారింజపండు.

**కిత్తు** రూ. కిత్త[1], కిత్తి[2]. వి. అగ్గి, నిప్పు. సాం.ని.దేవ. 12.
క. కిర్చు, కిచ్చు-.నిప్పు; కొడ.తిత్తి; తు. కిచ్చికిచ్చు, కిచ్చె. అసూయ, నిప్పు; కిత్తు. మెరుపు, పిడుగు; త. కిచ్చు. నిప్పు; కోట. తిచ్. నిప్పు, తొ. తిత్, కచ్. నిప్పు; గోం. కిస్; కొండ. సిసు; కుఇ. సిసావడి. చెకుముకి. కువి. హీచు, హిజ్జు. నిప్పు; పర్జి. కిచ్; కొలా. కిస్; నా. కిచ్చ్; గ. కిస్, కిచ్చు; ఒల్లా. కిస్; కురు. చిచ్చ్; మాల్తో. చిచు.
<క. కిచ్చు.

**కిథలమ్** వి. దారలతో కూడిన పెద్దనోరచేప.

**కిదుకు** అ. క్రి. మూలుగు, చిన్నపిల్లలు నిద్రలేచేటప్పుడు ఆలస్యం వల్ల ఒక విధంగా మూలుగు. భాగ. 10. పూ. 225.
పో.చూ. క. కిత్తడ. అసహ్యత, చీదర; గిజిగిజి. గందరగోళాన్ని సూచించే ధ్వని; కిసరు, కిసురు. అయిష్టాన్ని సూచించటం; కిసుర్. ఓర్వలేకపోవు; కిసుర్, కిసుళ్, కెసరు. ఓర్వలేని లేదా అసహ్యమైన పరిస్థితి, అపకారం; తు. కెదయని. ఉద్రేకాన్ని పొందు; బ్రా. కిజ్న్. మూలుగు, చిరాకుపడు; క్రతింగ్. మూలుగు.

**కిదువు** వి. తక్కువరకం, తక్కువది.

**కినగినపడు** స. క్రి. మిక్కిలికోపగించు, ధ్వన్యనుకరణశబ్దం.

**కినాయి** వి. జేబు.

**కినార** రూ. చూ. కినారా. వి. తివాసీఅంచు.

**కినారా** రూ. కినార. వి. కట్ట, తీరం.
హిం. ఉ. కినారా. తటం, నదిఒడ్డు, అంచు.
<ఉ. కినారా.

**కినియు**[1] స.క్రి.అ.క్రి. 1. కోపించు. భార. ఆది. 2 168, ఉద్యో. 1.255; 2. ద్వేషించు. సీతారా. 3.142.
క. కినిసు. కోపాన్ని పొందు, ఆగ్రహాన్ని పొందు; త. చిన. కోపాన్నిపొందు; చినవు. కోపించు; చినమ్. కోపం; చినవల్. యుద్ధం, చినవల్, చినవునర్. శత్రువులు; మ. చినమ్. ఉగ్రకోపం; చినమ్. ఉగ్ర కోపం; చినిప్పు. కోపం; చినిప్పుక్క. కోపం కలగజేయు; చినిప్పు. కోపం.
<క. కినిసు.

**కినియు**[2] స. క్రి. సమీపించు, చేరు (నలపక్షంలో). హరిశ్చ. స. 2.47.

**కినుక**[1] చూ. కినియు[1]. రూ. కింక[1], కినుకము, కిన్క. వి. కోపం, అలుక, కనలు. భార. విరా. 5.176.
**కినుకకా(డు** వి. కోపంకలవాడు, కోపశీలుడు, కోపి.

**కినుకము** రూ.చూ. కినుక[1]. వి. కోపం.

**కినుక**[2] వి. అర్రాడటం, ఉనికి. శుక. 3.196.

**కినుపడు** రూ.చూ. కినువడు. అ.క్రి. కోపపడు.

**కినుపు** చూ. కినియు[1]. వి. కోపం. కాశీ. 4.148.
**కినుపువడు** (-పడు) రూ. చూ. కినువడు. అ. క్రి. కోపపడు. **కినువడు** రూ. కినుపడు, కినుపుపడు, కిన్వడు. అ. క్రి. కోపపడు. భార. విరా. 4.218.
<కినుపు + పడు.

**కినువడు** చూ. కినుపు.

**కిన్క** రూ. చూ. కినుక[1]. వి. కోపం. భార. ఉద్యో. 3.364.

**కింద** రూ. చూ. క్రింద. అవ్య. దిగువ.
**కిందకట్టు** వి. పునాదికట్టుబడి. **కిందగు** అ. క్రి. ఓడు, తగ్గు, కిందగు <కింద+అగు. **కిందర్ధ** వి. దర్వాజా చట్రపుకింద కమ్మి. < కింద + అర్ధ. **కిందపట్టె** వి. ఇరుసుకుపైన పరానికి కింద ఉండి మొత్తం పరాన్ని మోసే పెద్దకొయ్య. **కిందపెచ్చె** వి. మూతి, గూనచివర సన్నటిభాగం. **కిందాపు** వి. మెట్లుకట్టేటప్పుడు కింద ఆధారంగా పెట్టిన పోటీగుంజ.

**కిందాపు** చూ. కింద.

**కిందికచ్చు** చూ. కిందు.

**కిందికుంచెవేయు** చూ. కిందు.

**కిందికొలికి** చూ. కిందు.

**కిందికోర్తల** చూ. కిందు.

**కిందికోల** చూ. కిందు.
**కిందికోల్తల** చూ. కిందు.
**కిందిగుండు** చూ. కిందు.
**కిందిగుది** చూ. కిందు.
**కిందిపట్టె** చూ. కిందు.
**కిందిపలక** చూ. కిందు.
**కిందిబోదె** చూ. కిందు.
**కిందిరోలు** చూ. కిందు.
**కిందు** రూ. చూ. క్రిందు. వి. జౌ. **1.** వశం, అధీనం. రం. రా. ఉ. 133 ; పు. **2** దిగువ.

**కిందికచ్చు** వి. అనులో మధ్యపీటకు బిగించిన చివరి కొయ్య. **కిందికుంచెవేయు** అ. క్రి. నరిచేసేటప్పుడు, కుంచెతల కిందుగాపట్టుకొని, పడుగుకు కిందిభాగం దువ్వు. **కిందికొలికి** వి. అనుపోసిన పడుగులో చివరఅని వద్దభాగం. **కిందికోర్తల** రూ. చూ. కిందికోల్తల. వి. అనుపోసిన పడుగులో చివర అనిపద్దభాగం. **కిందికోల** వి. అనుకొయ్యలలో చివరి కొయ్య. **కిందికోల్తల** రూ. కిందికోర్తల. వి. అనుపోసిన పడుగులో చివరి అనిపద్ద భాగం. **కిందిగుండు** వి. చేతి మగ్గంపన్నె బిగించిన కిందికొయ్య. **కిందిగుది** వి. మగ్గంలో పూనుగర్రకు కట్టిన దారం. **కిందిపట్టె** వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. **కిందిపలక** వి. మరమగ్గంలో పన్నెబిగించిన కిందికొయ్య. **కిందిబోదె** వి. దర్వాజా చట్రపుకింది కమ్మి. **కిందిరోలు** వి. చెరువునీళ్ళు బయటకి పోవటానికి ఉన్న తూముల్లో కిందిది. **కిందుపడు** రూ. చూ. క్రిందుపడు అ. క్రి. కిందపడు. **కిందువడు (-పడు)** రూ. చూ. క్రిందుపడు. అ. క్రి. కిందపడు. **కిందుసేయు (-చేయు)** రూ. చూ. క్రిందుసేయు. స. క్రి. కిందచేయు.
**కిన్నర** రూ. చూ. కిన్నెర. వి. వీణావిశేషం.
**కిన్నెర** రూ. కిన్నర. వి. వీణావిశేషం, కిన్నరుల వీణ వంటి వీణ. శృం. నై. 1.5.

సం. కిన్నరా. వీణావిశేషం ; హిం. కిన్నరీ. సారంగి అనే వీణ.

క. కిన్నరి, కిన్నూరి ; త. కిన్నరమ్ ; మ. కిన్నరమ్. వీణలేదా ఫిడేలు ; పర్జి. కిం(ది. వీణ ; మాల్తో. కేం(దె.

<సం. కిన్నరా.

**కిన్నెరకాయలు** వి.బ.వ. వీణెకు బిగించే పెద్దసైజున్న ఎండుసొరకాయలు, తుంబీఫలాలు. హంస. 1.210. **కిన్నెరపట్టచెట్టు** వి. వృక్షవిశేషం. **కిన్నెరసొర** వి. కాయ గుండ్రంగా ఉండే రకంసొర.
**కిన్నెవరులు** వి.బ.వ. ఒకదినుసు వడ్లు.
**కిన్వడు** రూ. చూ. కినుపడు. అ. క్రి. కోపపడు. హరి. పూ. 9.81.
**కిఫాయతు** రూ. చూ. కిఫ్ఫాయతు. వి. లాభం.
**కివ్వమామ** వి. రంగులో తడిసిన నూలులడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట.

**కివ్వమామనునవం** వి. కానిగుంజకుతగిలించిన ఇనపకడ్డీ.
**కిఫ్ఫాయతు** రూ. కిఫాయితు, కిఫ్ఫాయతీ, కిఫ్ఫాయితు. వి. లాభం, ఆదాయం.

హిం. కిఫ్ఫాయత్. తక్కువఖర్చు, కొద్దిలో పనిజరగడం; మరా. కిఫాయత. లాభం ; ఉ. కఫాయత్. తగినంత, అల్పవ్యయం , పార. కిఫ్ఫాయత్, కిఫాయ. శక్తి, మిత వ్యయం ; అర. కిఫ్ఫాయతీ. తగినంత, చాలినంత.

<ఉ. కఫాయత్.

**కిఫ్ఫాయితీ** రూ.చూ. కిఫ్ఫాయతు. వి. లాభం, కిట్టుబాటు.
**కిఫ్ఫాయితు** రూ.చూ. కిఫ్ఫాయతు. వి. లాభం.
**కిబ్లే** విశ. మాన్యమగు.

హిం. కిబ్లా. పూజ్యతాసూచకం ; ఉ. కిబ్లహ్. మాన్యుడు పూజ్యుడు ; పార. కిబ్లహ్. పవిత్రస్థానాలు ; అర. కిబ్లహ్. పూజ్యతాసూచకం, మాన్యుడు, పూజ్యుడు.

<ఉ. కిబ్లహ్.

**కిమిడి** వి. గాజుతయారు చేయడానికి ఉపయోగించే చెకుముకి రాయి.

**కిమిడికల్లు** వి. గాజుతయారు చేయటానికి ఉపయోగించే చెకుముకిరాయి.
**కిముక** వి. బొమ్మకచిమొక్క, చెంగల్వకోష్టు. (Costus specioscus)
**కిముకాబు** రూ.చూ. కిముఖాబు. వి. బంగారంపువ్వులతోగాని, వెండిపువ్వులతోగాని కుట్టిన విలువైన ఒకరకం పట్టుబట్ట. మల్లుపు. 4.18.
**కిముఖాబు** రూ. కిముఖాబు, కిముకాబు. వి. బంగారం పువ్వులతో గాని, వెండిపువ్వులతోగాని కుట్టిన విలువైన ఒకరకంపట్టుబట్ట. పార్వ. 5.149.

క. కింకాబ్, కినకావు. బంగారం లేదా వెండిదారాలతో నేసిన పట్టుబట్ట.

<క. కింకాబ్.

**కిముదు** విశ. కొంచెం, అల్పం. ఆం.భా. 3.16.

క. కిముత్. అణగగొట్టబడినస్థితి, చిన్నదిగాచేయటం.

<క. కిముత్.

**కింబత్తులు** వి.బ.వ. ఒకదినుసువడ్లు.
**కిమ్మ** వి. రహస్యం, గుట్టు, కీలు.
**కిమ్మతు** రూ. కిమ్మత్తు, ఖిమ్మతు. వి. వెల, ధర.

హిం.ఉ. కీమత్. ధర, వెల ; మరా. కిమ్మత్, యోగ్యత, విలువ ; అర. కీమత్. వెల, మూల్యం.

<ఉ. కీమత్.

**కిమ్మత్తు** రూ.చూ. కిమ్మతు. వి. వెల, ధర.

**కిమ్మత్తురవానా** వి. ఆయానరకుల వెలను ధ్రువీకరించే పత్రం.
**కిమ్మను** అ.క్రి. **1.** ఔపమ్యవాచకం. మను. 3.6 ; **2.** ప్రశ్న వేయు, మాటాడు, నోరెత్తు. సారంగ. 3.108.

క. కిల్. ఏమి ? ఏమిటి ? ఇదికాని అదికాని ; పో.చూ. త. కిమా-ల్-ఎనల్, కిమా-చ్-చియా-వ్-ఎనల్. గొణుగుడును తెలియజేసే ధ్వనికి అనుకరణం, మూలుగు ; మ. కిమ్. ఏమిటి ?

సం. కిమ్. ఏమి.

<సం. కిమ్+అను.

**కిమ్మ** వి. ప్రీతి. హంస. 2.111.

**కిష్టన్** రూ.చూ. క్రిష్టన్. వి. ముదురుగులాబిరంగు.

**కియావడి** రూ.చూ. కియ్యవడి. వి. హల్లుకింది అక్షరం, యావడి, క్యావడి.

**కియ్య** రూ. కియ్యము. వి. హల్లుకిందరాసేయకారం. ఆం.బా. 2.187.

**కియ్యవడి** రూ. కియావడి, కియ్యావడి, క్యావడి. వి. ఒక హల్లుకింది యకారం. **కియ్యావడి** రూ.చూ. కియ్యవడి. వి. హల్లుకింది యవర్ణం.

**కియ్యము** రూ.చూ. కియ్య. వి. హల్లుకింది యకారం.

**కియ్యావడి** చూ. కియ్య.

**కిరకిర** వి. క్రిరుమనటం, గరగరమనటం, ఆకలిచే ఒడలు కొంకర పోవటం. ధ్వన్యను.

**కిరకిరమను** అ. క్రి. కిరకిరమని శబ్దంచేయు, క్రిరుమను. **కిరకిరలాడు** అ. క్రి. కిరకిరమని శబ్దంచేయు, కిర్రుమను.

**కిరగావి** వి. ఎద్దుకు కాడిమరప (అలవాటుచెయ్య) టానికి అమర్చిన గానుగ మాదిరి కొయ్య యంత్రం.

**కిరంజి** రూ.చూ. కిరమంజి. వి. చినాలిరంగు.

**కిరదు** వి. బెస్తలు సవారిమోసేటప్పుడు నడిచేనడకల్లో ఒకటి. ప్రబంధ. 605.

**కిరమంజి** రూ. కిరంజి, కిరింజి, కిర్మంజి. వి. చాకిలేటురంగు, వంకాయ రంగు.

క. కిరమంజి. చాకలేటురంగు.

<క. కిరమంజి.

**కిరమంజివిత్తనాలు** వి.బ.వ. పట్టునూలుకు రంగువేయ టానికి వాడే ఒకరకం విత్తనాలు.

**కిరసనాయిలు** రూ. కిరసనాలు, కెరసనాయిలు. చూ. కిరోసిన్. వి. గబ్బునూనె, భూగర్భంనుంచి తీసిన ఒకరకం నూనె.

ఇం. *Kerosine oil.* ఇంధనంగా ఉపయోగపడే ఒక రకం నూనె.

<ఇం. Kersoine oil.

**కిరసనాలు** రూ. చూ. కిరసనాయిలు. వి. మట్టితైలం, దీపాల కుపయోగించే నూనె.

**కిరసనూనె** చూ. కిరోసిన్ వి. కిరసనాయిలు.

ఇం. *Kerosine.* ఇంధనద్రవ విశేషం.

<ఇం. Kerosine + నూనె.

**కిరస్తానము** రూ. చూ. కిరస్తాను. వి. క్రైస్తవ ప్రజాసమూహం.

**కిరస్తాని** రూ. చూ. కిరస్తానీ. విశ. క్రైస్తవమత సంబంధ మైన.

**కిరస్తానీ** రూ. కిరస్తాని. విశ. క్రైస్తవ మతసంబంధమైన.

హిం. *ఈసాఈ.* క్రైస్తవుడు; ఉ. *ఈసాఈ.* క్రైస్తవుడు.

ఇం. *Christian.* క్రైస్తవమతస్థుడు, క్రీస్తుమతసంబంధ మైన.

<ఇం. Christian.

**కిరస్తాను** రూ. కిరస్తానము, కిరిస్తాను. వి. క్రైస్తవుడు.

ఇం. *Christian.* క్రైస్తవుడు.

<ఇం. Christian.

**కిరాకు** వి. చీల్పు, పగులు.

ఇం. *Crack.* పగులు.

<ఇం. Crack.

**కిరాణా** రూ. చూ. కిరానా. వి. ఆహారసామగ్రి, చిల్లర సామాను.

**కిరాణాకొట్టు** రూ. చూ. కిరానాకొట్టు. వి. చిల్లరసామాన్లు అమ్మేకొట్టు.

**కిరానా** రూ. కిరాణా, ఖిరాణా, ఖిరానా. వి. చిల్లరదినుసులు, చిల్లరసామాను, ఉప్పు, మిరపకాయ, చింతపండు మొదలైన మసాలాలు.

హిం. *కిరాయా*; సిం. *కిర్యాణో*; మరా. *కిరాణా*.

<మరా కిరాణా.

**కిరానాకొట్టు** రూ. కిరాణాకొట్టు. వి. చిల్లర దినుసులమ్మే దుకాణం.

**కిరాయ** రూ. చూ. కిరాయి. వి. బాడుగ, కూలి.

**కిరాయి** రూ. కిరాయ. వి. అద్దె, బాడుగ, కూలి.

హిం. *కిరాయా.* బాడుగ, అద్దె; ఉ. *కిరాయా.* బాడుగ, అద్దె; పార. *కిరాయహ్.* బాడుగకు ఇవ్వటం, అర. *కిరాయహ్.* బాడుగ, అద్దె.

క. కిరాయ. బాడుగ, అద్దె.

<ఉ. కిరాయా.

**కిరి** రూ.చూ. కిఱు². విశ. చిన్న, కొంచెం.

**కిరిపిల్లాండ్లు** వి.బ.వ. మట్టెలు.

**కిరికతి** వి. కృత్తికకార్తె.

సం. కృత్తికా. ఒకనక్షత్రం, మూడోనక్షత్రం.

<సం. కృత్తికా.

**కిరికి** వి. తాపీరేకును, పిడినికలిపే వంకర ఇనపచువ్వ.

**కిరికిటీ** రూ. చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిరికిడి** వి. వరంబంగుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకుబిళ్ళ.

**కిరికిరి** వి. అడ్డు, గొడవ, అల్లరి. ధ్వన్యను.

**కిరికిరిచేయు** స. క్రి. గొడవపెంచు, ఇబ్బందిపెట్టు, అడ్డు తగులు. **కిరికిరిపెట్టు** స. క్రి. గొడవపెంచు, ఇబ్బందిపెట్టు, అడ్డుతగులు.

**కిరికీ** రూ. చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిరికీలబాయి** వి. గిలకబావి.

**కిరికీలసాటవ** వి. చెక్కలతో నిర్మించిన సాటవ.

**కిరిగానిగె** వి. ఎద్దుకు కాడిమరప (అలవాటుచెయ్య) టానికి అమర్చిన గానుగ మాదిరికొయ్య యంత్రం.

**కిరిగె** రూ. కిలిగె. వి. కన్నెపిల్లలు కట్టుకొనే చీర.

క. కిఱిగె. బాలికలు కట్టుకొనే చీర.

<క. కిఱిగె.

**కిరింజి** రూ. చూ. కిరమంజి. వి. చినాలిరంగు.

**కిరిటీ** రూ. చూ. కిటికీ. వి. గవాక్షం.

**కిరిదీపావళి** వి. దీపావళి తర్వాత వచ్చే అమవాస్య.

**కిరిమెట్లు** చూ. కిఱ్ఱు. వి.బ.వ. నడిచేటప్పుడు కిర్రుమని శబ్దం చేసే తోలుచెప్పులు.

**కిరియు** అ. క్రి. తేలికగు, బిరగు.

క. గిఱకు. దగ్గరగాఉన్నది, ఒత్తుకొనబడిన (గుంపు వలె), త. చిఱ్. గుమిగూడిఉండు, బిగుతుగాఉండు (గాజు వలె), బిగించు, మూయు, దగ్గరకి చేర్చిబిగించు ; మ. చెఱుక్కుక. తగిలించు ; పర్జి. కెద్ప్. మూయు, తాళం వేయు ; కొలా. గెళ్-(గెత్త్-). గట్టిగామూయు (తలుపు మొ.).

**కిరిస్తాను** రూ. చూ. కిరస్తాను. వి. క్రైస్తవుడు.

**కిరీటం** వి. టోపి.

నం. కిరీటు-. కిరీటం.

< నం. కిరీట- (అర్థవిపరి.).

**కిరీటాలు** వి.బ.వ. గింజను బొంతుపూర్తిగా ఆవరించిఉండే రకం జొన్నలు.

నం. కిరీటు-.కిరీటం.

< నం. కిరీట-(అర్థవిపరి.).

**కిరీటిపచ్చ** వి. మరకతం, గరుడపచ్చ. వరాహ. 4.111. విజయ. 3.26.

నం. కిరీటి-. కిరీటంకలవాడు, అర్జునుడు.

నం. కిరీటి- + పచ్చ.

**కిరుకు**[1] వి. చెప్పులు మొదలైన వాటి ధ్వనికి అనుకరణం. అష్టమ. క. 1.49.

పో. చూ. క. కిఱు, కిఱ్క. ధ్వన్యను.

**కిరుకు**[2] వి. తిప్పటం, తిప్పు.

క. కిఱుకు. గోకు, తుడిచివేయు.

**కిరుగు** విశే. అడవ, వ్యర్థమైన.

**కిరుదు**[1] రూ. చూ. కిఱుదు. విశే. హీనమైన.

**కిరుదువేల** వి. వ్రరభూమి.

**కిరుదు**[2] రూ. చూ. కిర్దు[2]. వి. వ్యవసాయంచేయటం.

**కిరుదుకట్లు** వి. బచ్చునపని, నగిషీపని.

**కిరుదెప** వి. 1. రొండిలో కలిగే ఒకవాత రోగం. ఆం. భా. 2.126 ; 2. నడుంవాతం.

**కిరునాలుక** వి. కొండనాలుక.

క. కిఱు-. చిన్న.

< క. కిఱు + నాలుక.

**కిరుపు** అ. క్రి. శరీరావయవాలు కదిలించు.

**కిరుపుకొను** అ. క్రి. జంకు, వెనుదీయు. భార. సౌప్తి. 1.121.

**కిరుస** విశే. రెండువైపుల వాదరగలిగి వాడిఉన్న. కళా 7.12 ; వి. రెండు పక్కల వాయికలిగిన, వాటమైన ఒక విధముయినకత్తి. కువచ. 4.31.

క. కిర్తు. ఆకృష్టఖడ్గం ; త. కిఱిచు. మలయాబాకు ; కిరిసు. మలయాబాకు, రెండువైపులపదును ఉన్నకత్తి; కిరిసు-క్-కత్తి. రెండువైపుల పదును ఉన్న కత్తి ; మ. కిరిచు, కిరిచి. బాకు ; క్రుషి. బాకు ; పో చూ. పర్జి. కిరియ. పగలి పోయిన గొడ్డలి ; మలయ్ క్రిస్.

**కిరుసకత్తి** వి. రెండంచులున్న చిన్నకత్తి.

**కిరోసిన్** వి. కిరసనాయిలు, గబ్బునూనె, దీపాలువెలిగించటానికి ఉపయోగించేనూనె.

ఇం. *Kerosine*. కిరసనాయిలు, ఇంధన ద్రవవిశేషం.

< ఇం. Kerosine.

**కిర్దాబాదు** వి. వాసయోగ్యం.

హిం. ఉ. కర్ద్. ఆశ్రయపాత్రం, ఆబాద్. నగరం.

< ఉ. కర్ద్ ఆబాద్.

**కిర్ది** రూ.చూ. కిఱుదు. విశే. తక్కువ, చిన్న.

**కిర్దిచీర** వి. కన్నెపిల్లలు కట్టుకొనే చిన్న చీర, ఓణి.

**కిర్దు**[1] రూ.చూ. కిఱుదు. విశే. తక్కువరకం.

**కిర్దు**[2] రూ. కిరుదు[2], ఖరుదు, ఖర్దు. వి. వ్యవసాయం చేయటం.

హిం. కర్ద్. అధీనం, వశం ; మరా. కిర్ద్, కిర్ద్. రోజువారీ జమాఖర్చుల పుస్తకం ; పార. కర్ద్. పని, పరిశ్రమ, ఉద్యోగం ; ఉ కర్ద్. అమలుకార్యం ; అర. కర్ద్. కార్యం.

< ఉ. కర్ద్.

**కిర్మంజి** రూ.చూ. కిరమంజి. వి. చాకిలేటురంగు, వంకాయ రంగు.

**క్రిర్గి** పో. చూ. కిట్టు. వి. మంచిఎండ.

**క్రిరు** రూ చూ. కిట్టు. వి. క్రిరుమనేధ్వని.

**క్రిరుక్రిరు** రూ.చూ. కిట్టుకిట్టు. వి. క్రిరుక్రిరుమనేధ్వని. **క్రిరుగ** క్రి.విశే.ద్రు. చాల బాగా, ధ్వన్యనుకరణ శబ్దం. **క్రిరుక్రిరువ** క్రి.విశే.ద్రు. క్రిరుక్రిరుమంటూ. **క్రిరుపురుగు** రూ.చూ. కిట్టుపురుగు. వి. కీటక విశేషం. **క్రిరుమాను** వి. బండ్లు మొ. వానికి సుంకం పుచ్చుకొనే తావుకు తోవకడ్డంగా వేసిఉండే తలుపు.

**కిర్లి** వి. మల్ల బంధవిశేషం. ఆం.భా. 2.209.

**కిర్లుకొను** అ.క్రి. కెవ్వుమని కేకవేయు.

**కిఱకిఱ** చూ. కిట్టు. వి. రథం బండిపట్టాలు, చెప్పులు మొ. వాటిమోత.

క. కిఱ. ధ్వన్యనుకరణం ; కిఱకిఱ. చెప్పులు, బండి చక్రాలు మొ. వాటిచప్పుడు.

< క. కిఱకిఱ.

**కిఱపు** రూ.చూ. కిఱుపు. స.క్రి. కన్ను గీటు, కన్నుసైగచేయు.

**కిఱపుంచు** రూ. కిఱువుంచు. స.క్రి. తాకట్టుపెట్టు, కుదువపెట్టు.

క. కిరయు. క్రయం, ధర.

**కిఱు**[1]. రూ.చూ. కిట్టు. వి. 1. తలుపులు వేసేటప్పుడు, తీసేటప్పుడు అయ్యేధ్వనికి అనుకరణం, 2. చెప్పులతో నడిచేటప్పుడయ్యేధ్వనికి అనుకరణం ; 3. కావడి మోసేటప్పటి ధ్వనికి అనుకరణం.

**కిఱుఁజెప్పు(-చెప్పు)** రూ. కిఱుకుఁజెప్పు, కిట్టుఁజెప్పు. వి. క్రిరుచెప్పు. శృం.నై. 8.125. **కిఱుమెట్లు** రూ.చూ. కిట్టు మెట్లు. వి.బ.వ. క్రిరుచెప్పులు.

**కిఱు**[2] రూ. కిరి. విశే. 1. అల్పమైన. వేంక. పంచ. 1.287 ; 2. సన్నం.

క. కిఱు. చిన్న.

< క. కిఱు.

**కిఱుకూత** వి. సన్ననికూత.

**కిఱుకు** చూ. కిట్టు. వి. 1. భ్రమణం, పర్యటనం. జైమినీ భా. 6.234 ; 2. తలుపులు తీసేటప్పుడు కలిగేధ్వనికనుకరణం.

తక. 2.124 ; విఇ. తక్కువైన.

**కిఱుకు(జెప్ప** రూ.చూ. కిఱుఁజెప్పు. వి. కిర్రుచెప్పు.

**కిఱుకుపొడుచు** అ.క్రి. తిరుగు, సంచరించు. భాగ. 10పూ. 756.

**కిఱుగు** వి. లొంగినది, పాతది, మితిమీరినది.

**కిఱుచు** స.క్రి. తొలగద్రోయు, గెంటు.

**కిఱుదు** రూ.చూ. కిఱుదు. విఇ. తక్కువ.

**కిఱుదు** రూ. కిరుదు[1], కిర్ది, కిర్దు[1], కిఱుడు. చూ. కిఱు[2]. విఇ. న్యూనం, తక్కువ. వరాహ. 10.108.

క. *కిఱియ*. చిన్నదైనది.

< క. కిఱిదు.

**కిఱుదుకట్లు** వి.బ.వ. కుమ్మరి కుండలమీద చేసే ఒకరకం నగిషీపని. హంస. 5.13.

**కిఱుపు** రూ. కిఅపు. వి. కనుసైగ, కన్నుగీటు.

**కిఱుపులు** వి.బ.వ. మానవులు పెట్టేకష్టనష్టాలు.

**కిఱుపుంచు** రూ.చూ. కిఅపుంచు. స.క్రి. తాకట్టుపెట్టు, కుదువ పెట్టు.

**కిఱ్ఱు** రూ. కిర్రు. కిఱు[1]. వి. 1. తలుపు వేసేటప్పుడు తీసేటప్పుడు వచ్చేధ్వనికి అనుకరణం. కాశీ. 4.101 ; 2. కావడిమోసేటప్పుడు బద్దకు భుజాలరాపిడివల్ల కలిగేధ్వనికి అనుకరణం. హంస. 1.172 ; 3. చెప్పులతో నడిచేటప్పు డయ్యేధ్వని. అనుకరణం. హంస. 3.90.

క. *కిఱ్*, *కిరు*. ధ్వన్యనుకరణం ; *కిఱ*, *కిఱుకు*, *కిఱికి*, *కిఱు*, *గిఱుకు*. *గిఱికి*, *గిఱుకు*, *గిఱు*. కిర్రుమనే శబ్దం ; తు. *కిరికిరి*, *గిరిగిరి*. కిర్రుమను ; *కిర్క్*. కిర్రుమనేధ్వని ; త. *కిఱిచ్చిటు*. కొత్తచెప్పులు, నూనె గానుగ మొదలైనవి చేసే కిర్రుమనే శబ్దాన్ని చేయు, కావలాదారుని దగ్గర ఉండే గిలకలాగధ్వని చేయు ; మ. *కిఱుయుక*. తలుపులాగ కిర్రుమను ; *కిరుకిర*. గలగలధ్వని ; *కిరుకిరుక్క*. గలగలధ్వనిచేయు ; కో. *గిర్క్*. పక్షులను భయపెట్టటానికి గంటను మోగించు ; బ్రా. *కిడ్కా*. కిర్రుమనే ధ్వని. నడిచేటప్పుడు వచ్చేశబ్దం.

< క. కిఱ్.

**కిఱ్ఱుకిఱ్ఱు** రూ. కిర్రుకిర్రు. విఇ. కిర్రుకిర్రుమను. **కిఱ్ఱుగామను** వి. ఒకరకం బాలక్రీడ. **కిఱ్ఱుగానుగత్రిప్పళ్లు**. వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 3.146. **కిఱ్ఱుచెప్పులు** వి.బ.వ. కిర్రుకిర్రుమనేట్లుగా తయారు చేసినచెప్పులు **కిఱ్ఱు(జెప్ప (-చెప్ప)** రూ.చూ. కిఱుఁజెప్పు. వి. కిర్రుమనే చెప్పు. **కిఱ్ఱుపురుగు** రూ. కిర్రుపురుగు. వి. చిర్పుచిర్పుమని ధ్వని చేసేరెక్కలున్న కీటకం. **కిఱ్ఱుమెట్లు** రూ. కిరుమెట్లు, కిఱుమెట్లు. వి.బ.వ. కిర్రుచెప్పులు. **కిఱ్ఱు(బొగాలు** వి. కిర్రు పావుకోళ్ళు. వైజ. 2.45. **కిఱ్ఱుపోగు** అ.క్రి. ఖల కార్యం జరుగు. **కిఱ్ఱెక్కించు** స.క్రి. కిర్రుపెట్టు.

**కిఱ్ఱెక్కించు** చూ. కిఱ్ఱు.

**కిల** వి. నవ్వటం మొ. వాటియందయ్యే ధ్వని.

**కిలకలు** వి.బ.వ(?). ధ్వన్యను. చంటిపిల్లలకువచ్చే క్రిమివ్యాధి.

**కిలకిల** రూ. కిలాకిల. వి. 1. నవ్వటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. యయా. 5. 81 ; 2. సేన కదిలేటప్పుడు పెట్టే కేకల ధ్వన్యనుకరణం ; 3. పక్షులు చేసే ధ్వనికి అనుకరణం.

క. *కిలికిలినగు*. సంతోషంతో నవ్వు : *కిల*. సంతోషంతో నవ్వే నవ్వుకు అనుకరణం : *కిల్*. ధ్వన్యనుకరణం : *కిలకిల్-గుట్టు*, *కిలికిలిగుట్టు*. మనస్ఫూర్తిగా నవ్వు ; తు. *కిలకిల*, *కిలికిలి*. మనస్ఫూర్తిగానవ్వు ; త. *కిల్కిల్*. కిలకిలారావం ; *కిలుకిలు*. గలగల లేక గణ గణ ధ్వని ; *చిలై*. ధ్వనించు, ప్రతిధ్వనించు ; *కిల్-కిల్-ఎనల్*. ఘల్లుఘల్లు మనే శబ్దాన్ని సూచించేది ; *కిలుక్కు* (*కిలుక్క్*). మోగించు, గంటకొట్టు ; *కిలుకిల్ ఎనల్*. గణగణమనే ధ్వనిని సూచించే ధ్వన్యనుకరణం ; *కిలుంకు* (*కిలుంకి-*). మోగించు, గణగణమని ధ్వనిచేయు ; మ. *కిలుకిల*, *కిలుకిలు*. గణగణమనే ధ్వని, పెద్దనవ్వు, కోతిఅరుపు ; *చిల*. ధ్వని ; *కిలుకిలుక్క*. గలగల మని ధ్వని చేయు, మోగించు ; *కిలుక్క*. గిలక ; *కిలున్నక*. గంటలను మోగించటం ; కోత *గిల్*, *గిల్గిల్*. జమోత్సాహంతోనవ్వు ; కుఇ. *కిలకిల*. ఉటుసుపోనిమాటలు మాట్లాడేటప్పుడు వచ్చే శబ్దం, లేక గందరగోళంగా సంభాషణ జరిపినప్పుడు వచ్చే ధ్వని.

పో. చూ. సం. కిలకిల-. సంతోషాన్ని వ్యక్తం చేసే ధ్వనులు.

**కిలకిలనవ్వు** అ. క్రి. కిలకిలమనిధ్వని వచ్చేట్లు నవ్వు. **కిలకిలమను** అ. క్రి. కిలకిలమని ధ్వనిచేయు. ఆం. భా. 3.97. **కిలకిలలాడు** రూ. కిలకిల్లాడు. అ. క్రి. కిలకిలమని ధ్వనిచేయు. నీలా. 2.81. **కిలకిల్లాడు** రూ. చూ. కిలకిలలాడు. అ.క్రి. కిలకిలమని ధ్వనిచేయు.

**కిలకిల్లాడు** చూ. కిలకిల.

**కిలకొట్టు** చూ. కిలకిల. అ. క్రి. 1. కిలకిలమని ధ్వనిచేయు. ద్వి. పరమ. వి. 2.58, చంద్రాంగ. 2.5 ; 2. మోగు, శబ్దించు ; 3. గిలకొట్టు.

**కిలము** రూ. చూ. కిలుము. వి. లోహాదుల మలం, రాగిచెంబు మొ. వాటికి కలిగేమురికి.

**కిలరము** రూ. చూ. కీలరము. వి. 1. పశువులమంద. ద. హిం.శా. సంపు. 4. శా. సం. 1012 ; 2. గొడ్లసావిడి.

**కిలా** రూ.చూ. కిల్లా. వి. కోట.

**కిలాకిల** రూ. చూ. కిలకిల. వి. నవ్వటంలో అయ్యేధ్వనికి అనుకరణం. దశా. 185.

**కిలాడి** రూ. కిల్లాడి. వి. 1. నేర్పరి ; 2. తగవులు పెట్టేవాడు ; 3. రంకులాడి ; 4. మోసగాడు.

హిం. ఉ. *ఖిలాడీ*. ఆటగాడు, కుస్తీపట్టేవాడు, గారడీవాడు.

< ఉ. ఖిలాడీ. (అర్థవిపరి.).

**కిలాతము** వి. గుర్రం. యయా. 2.39.

ఉ. ఖలాత్-. అర్మీనియా దేశపు రాజధాని.

< ఉ. ఖలాత్. (అర్థవిపరి.).

**కిలాదారు** రూ. కిలేదారు. వి. కోటఅధికారి. ఆనంద. పీఠి. 112.

హిం. ఉ. *కిలేదార్*. కోటకలవాడు.

< ఉ. కిలేదార్.

**కిలారము** రూ.చూ. కిలరము. వి. పశువుల మంద. ద.హిం.శా నంపు. 4. శా.నం. 1010; ఆం.భా. 2.261.

**కిలారి** రూ. చూ. కీలారి. వి 1 గొల్లవాడు, ఆవులకాపరి. ఆం. భా. 2261. 2. పసులకాపరి; 3. కాటిపాపడు.

**కిలారించు** చూ. కలకిల. అ. క్రి. 1. సింహనాదంచేయు. వేం.మా. 3.42; 2. కిలకిల మని ధ్వనిచేయు, కిలకొట్టు; 3. చప్పట్లుచరచు.

**కిలారుచు** రూ.చూ. కిలార్చు. చూ. కిలకిల. అ. క్రి. 1. బొబ్బరించు, కిలకిలమని మోగు; 2. అట్టహాసంచేయు.

**కిలార్చు** రూ. కిలారుచు. అ.క్రి. బొబ్బరించు, సింహనాదం చేయు. ఉ. రా. 7.120.

**కిలావరంచు** రూ. చూ. కళావరంచు. వి. కళావరుచుక్క ఆకారంలో డిజైన్లు నేసిన అంచు.

**కిలావారార్చి** వి. కళావరురూపంలో ఉండే ఆర్చి.

**కిలావరుమాను** వి. కళావరు రూపంలో ఉండే ఆర్చి.

**కిలాసము** వి. బలుపు, సిబ్బం.

క. కిలాస. గాయం మానేటప్పుడు పైన ఏర్పడేపొర.

< క. కిలాస.

**కిలించు** రూ. చూ. కిలించ. స. క్రి. పట్టుకొను. సాంబో. 5. 101.

**కిలింట** రూ. కిలేంటు. వి. ఓడ తరలిపోవడానికి ఇచ్చే సెలవు చీటి.

**కిలుము** రూ. కిలము. వి. లోహాదుల మలం, రాగిచెంబు మొ. వాటికి కలిగే మురికి.

క. కిలుబు, కిలబు, కిలుంబు, కిలువు. చిలుము; త. చిలుమ్బు. చిలుం; కుఇ. కిలు. మురికి; కువి. కిల్మో. తుప్పు.

< క. కిలుబు.

**కిలేంటు** రూ.చూ. కిలింట. వి. ఓడ తరలి పోవడానికి ఇచ్చే సెలవుచీటి.

**కిలేదారు** రూ.చూ. కిలాదారు. వి. దుర్గాధిపతి.

**కిలోగ్రాం** వి. వెయ్యిగ్రాముల బరువు.

ఇం. *Kilogram*. వెయ్యిగ్రాముల బరువు.

< ఇం. Kilogram.

**కిలోమీటరు** వి. వేయిమీటర్ల దూరం.

ఇం. *Kilometer*. వేయి మీటర్ల దూరం.

< ఇం. Kilometer.

**కిలోవాట్లు** వి. వేయి వాట్లు.

ఇం. *Kilowatts*. వెయ్యి వాట్లు.

< ఇం. Kilowatts.

**కిల్ల** వి. 1. దెబ్బ; 2. అడుపు; 3. లేశం.

**కిల్లల** అవ్య. ద్రు. కీచుమంటూ, గట్టిగా.

**కిల్లలబొబ్బలు** వి.బ.వ. పెద్దపెద్దకేకలు, బొబ్బరింతలు.

**కిల్లలాడు** అ.క్రి. అరచు, కేకలుపెట్టు.

**కిల్లలాడు** చూ. కిల్లల.

**కిల్లా** రూ. కిలా, కిల్లె, ఖిల్లా, ఖిల్లే. వి. కోట. రంగా.చ. 2.44.

హిం. ఖిల్లా. కోట; కిలా. దుర్గం; కోట. ఉ. కిలా. దుర్గం, కోట; పార. కిలత్‌కల. కోట; కోటలు. అర. కలఅ. కోట.

క. కిల్లె. కోట; మ. కిల్ల; బ్రా. కల్ల.

< ఉ. కిలా.

**కిల్లాదారి** రూ. కిల్లెదారి, ఖిల్లాదారి. వి. కోట యాజమాన్యం.

ఉ. కిలాదార్. కోటఅధిపతి.

< ఉ. కిలాదార్.

**కిల్లాకు** వి. 1. ఆజ్ఞాపత్రం. ఉ. హరి. 4.218, కళా. 7.27; 2. ఖండపత్రిక, చీటి.

**కిల్లాకుచీటి** రూ. కిళాకుచీటి. వి. చీటి.

**కిల్లాడి** రూ.చూ. కిలాడి. వి. 1. మోసగాడు, కల్లరి; 2. నేర్పరి; 3. మాయ, దగా.

**కిల్లాయి** వి. దాడి, కొండెం.

**కిల్లాయిలమారి** వి. తాకట్లమారి. చాడీగొట్టు.

**కిల్లారి** రూ.చూ. కీలారి. వి. పశువులకాపరి.

**కిల్లి** రూ. కిళ్ళి[2]. వి. ఒకరకం జెట్టిపట్టు, మల్లబంధ విశేషం, ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. మల్ల.భూ. 3.69, ఆం. భా. 2.209.

**కిల్లీ** రూ. కిళ్ళి, కిళ్ళి[1]. వి. తాంబూలం.

**కిల్లు** అ.క్రి. మరణించు. ఆం. భా. 3.87.

క. కిధల్. ధ్వన్యనుకరణ శబ్దం.

< క. కిల్ (అర్థవిపరి.).

**కిల్లె** రూ.చూ. కిల్లా. వి. దుర్గం, కోట.

**కిల్లెదారి** రూ.చూ. కిల్లాదారి. వి. దుర్గాధిపతి.

**కిల్లేగిత్తిరిగాడు** వి. 1. తోలుబొమ్మలాటలోని హాస్యగాని పాత్ర; 2. తంటాలమనిషి.

**కిల్లెముబారకు** వి. మహమ్మదీయుల బిరుదు.

హిం. ఉ. పార. కిలాముబారక్.

< ఉ. కిలాముబారక్.

**కిల్లేదారు** వి. కోటయజమాని.

ఉ. కిలేదార్. కోట అధిపతి.

త. కిల్లేతార్. దుర్గాధికారి.

< ఉ. కిలేదార్.

**కిళాకుచీటి** రూ.చూ. కిల్లాకుచీటి. వి. చీటి.

**కిళ్ళకేతుడు** వి. కుచేష్ట చేసేవాడు.

**కిళ్ళి** రూ.చూ. కిల్లీ. వి. తాంబూలం.

**కిళ్ళి[1]** రూ.చూ. కిల్లీ. వి. తాంబూలం.

**కిళ్ళి[2]** రూ.చూ. కిల్లి. వి. ఒకరకం జెట్టిపట్టు.

**కివకివ** వి. 1. కోకిల పావురం మొదలయిన పక్షుల ధ్వనికి అనుకరణం. కువల. 1.17, 2. నజుగుడు, మూలుగు, ప్రతిధ్వని మొ. ధ్వన్యనుకరణ శబ్దం. శుక. 1.256.

పో.చూ. త. కువా-క్-కువా. బొబ్బరింతను సూచించే ధ్వనికి అనుకరణం.

**కివుకు** స.క్రి. (గొంతును) పిసుకు.

క. కివచు, కివుచు, కిమిచు, కియుచ్చు, కిలిచు, కివుచ్చు. చేతితోనులుము లేక నలుపు, చేతిలోముద్ద చేయు; కిముర్చు. చేతితోపిసికినది; పో.చూ. త. చిమిట్. వలపన్ను, పట్టుకొను. చిల్-ఎనల్. గట్టిగాఉన్న;

చెవిట్లు. నలుపు, నాశనంచేయు, చంపు.

<క. కివుచు.

**కివ్వు** చూ. కివకు. అ.క్రి. మడియు, చచ్చు, తునుగు.

**కిశ్నీకేతుడు** వి. కుచేష్టలు చేసేవాడు, దుష్టుడు.

**కిష్ట** వి. కృష్ణానది.

<సం. కృష్ణా. కృష్ణానది.

**కిష్టగుదురుచీర** వి. నిలువుకు తెలుపు అడ్డానికి నలుపు రంగులు పెట్టి నేసినచీర.

ఇందలి 'కిష్ట' శబ్దం, కృష్ణశబ్ద భవంకావచ్చు.

**కిష్టరాయి** వి. సాకెమొలను దించడానికి గుబ్బిగుడ్డలో పొదిగిన రంధ్రమున్నరాయి.

ఇందలి 'కిష్ట' శబ్దం కృష్ణశబ్ద భవంకావచ్చు.

**కిష్టోడిరొడ్డ** వి. ఒరలు మొ. వాటిని అతకటానికి సన్నగా దుబ్బుగా నలపతో తయారుచేసుకొన్న మట్టి తాలిక.

**కిస** వి. నెమలి కూత. ధ్వన్యను.

**కినక** వి. మొన, కొన.

కినకకర్ర వి. మొనఉన్న కర్ర.

**కినకిన** విణ. విస్తారమైన, అధికమైన ; క్రి. విణ. ద్రు. విస్తారంగా, అధికంగా, గట్టిగా, బిగ్గరగా.

**కినమన** వి. వ్యథ, బాధ. విజయ. 3.37.

పో.చూ. క. కిసుర్, కిసుఙ్, కెసరు. భరించలేని స్థితి.

**కినరగు** చూ. కినరు[1].

**కినరు[1]** వి. **1.** దృష్టిదోషం, అంటుసోకటం వలన పసిపిల్లలకు కలిగేదోషం. ప్రభు. 2.42 ; అము. 4.175 : **2.** కోప వికారం ; **3.** చూపోపమి, కనుకుట్టు.

క. కిసరు, కిసురు. దృష్టిదోషం.

<క. కినరు.

**కినరగు** అ.క్రి. బిడ్డలకు జలుబుచేయు. **కినరునీరు** వి. శరీరంలోని పనికిరాని జలం. **కినరువడు(-పడు)** అ.క్రి. **1.** దిష్టితగులు ; **2.** పగగొను.

**కినరు[2]** వి. పదును, వాడి.

**కిసాన్‌చెర్ఖా** వి. కొయ్యరాట్నం, ఒకకొయ్యపట్టెకు రెండు చక్రాలు అమర్చి తయారు చేసిన రాట్నం.

హిం. ఉ. కిసాన్. రైతు ; చర్ ఖా. రాట్నం.

<హిం. కిసాన్ చర్ ఖా.

**కిసాన్‌రాట్నం** వి. కిసాన్ చెర్ఖా.

హిం. ఉ. కిసాన్. రైతు.

<హిం. కిసాన్+రాట్నం.

**కిసాయి** రూ. చూ. కీస[2]. వి. జేబు, కీస.

**కిసాలు** వి. **1.** నవ్వటంలో అయ్యేధ్వనికి అనుకరణం. మృత్యు 1.9 ; **2** సంతోషం.

క. కిసు. ధ్వన్యనుకరణశబ్దం ; త. కిచుకిచు. బుస్సు మనేశబ్దం. పో. చూ. మ. కిచ్చు-క్-కిచ్చు. కిచకిచ ధ్వని.

కిసాలువ అవ్య.ద్రు. సంతోషంగా, ధ్వన్యనుకరణం.

**కిసికాళ్ళుగానడచు** అ. క్రి. నృత్యంచేస్తూ కాళ్ళు వంగంటించి నడచు.

**కిసికింత** వి. కాసింత, కసింత.

**కిసించు** అ. క్రి. కృషిచేయు, పొలందున్ను.

సం. కృషి - వ్యవసాయం.

<సం. కృషి- + -ఇంచు[3].

**కిసిమిసి** రూ. కిసుమీసు, కిస్మిను. వి. లఘుద్రాక్ష. మృత్యు 2.55. (Vitis vinifera).

హిం. ఉ. కిశ్‌మిశ్, కిశ్‌మిశీ, కిశ్మిస్. ఎండుద్రాక్ష ; మరా. కిస్‌మిస్. గింజలు లేనిద్రాక్ష ; పార. కిష్‌మిష్. ఎండుద్రాక్ష, గింజలేనిద్రాక్ష ; అర. కిస్‌మిస్. ఒకరకం ద్రాక్ష.

త. కిచుమిచు. గింజలులేని చిన్నద్రాక్ష ; కిస్మిస్ పఴమ్. గింజలు లేని చిన్నద్రాక్ష.

<ఉ. కిశ్మిస్.

కిసిమిసిపండు వి. లఘుద్రాక్షఫలం.

**కిసుక** వి. కృషి, సేద్యం. ఆం. భా. 2.233.

సం. కృషిక-. వ్యవసాయం.

<సం. కృషిక-.

**కిసుమీసు** రూ. చూ. కిసిమిసి. వి. లఘుద్రాక్ష.

**కిస్తా** వి. **1.** టోకరా ; **2.** ఎదురుదెబ్బ తీయటం.

హిం. ఉ. కిశ్త్. చదరంగంలో రాజును దెబ్బ తీసే ఎత్తు.

<ఉ. కిశ్త్.

**కిస్తి** రూ. చూ. కిస్తీ[1]. వి. పన్నుచెల్లించే వాయిదా.

**కిస్తీ[1]** రూ. కిస్తి, కిస్తు. వి. **1.** వంతుచొప్పున చెల్లించే ద్రవ్యం. విశ్వే.శ. 41 ; వాయిదా, పన్ను చెల్లించవలసిన కాలం ; **2.** లంకణం.

హిం. ఉ. కిస్త్. భాగం, అంశం, న్యాయం.

పార. కిశ్. న్యాయం చేయటం, భాగం, పన్ను, వాయిదా ; అర. కిస్త్. భాగం, వాయిదా ప్రకారం చెల్లించే ద్రవ్యం.

<ఉ. కిస్త్.

**కిస్తీ[2]** వి. పక్కలు పల్లుగా, మధ్యఎత్తుగా ఉండే కిటికీ తలుపుల రెక్కల చెక్కడపు పనిగల భాగం.

**కిస్తీచట్రం** వి. కిస్తీలు చెక్కిన చట్రం. **కిస్తీతలుపు** వి. కార్నిను తలుపు, అంచులువాలుగా నరికి, మధ్యభాగం చదునుగా ఉంచి తయారుచేసిన చెక్కలను చట్రంలో బిగించిన తలుపు. **కిస్తీదర్వాజా** వి. చట్రం మీద మరో చట్రం బిగించిన దర్వాజా. **కిస్తీరెక్క** వి. కిస్తీతలుపురెక్క. **కిస్తీలసాటవ** వి. వెదురు బద్దలతో అల్లిన సాటవ.

**కిస్తీబంది** రూ. చూ. కిస్తీబందీ. వి. వాయిదాలఏర్పాటు.

**కిస్తీబందీ** రూ. కిస్తీబంది. కిస్తీలందు. వి. వాయిదాల ఏర్పాటు.

<హిం. ఉ. కిస్త్‌బందీ. వాయిదాలపై డబ్బుచెల్లించే పద్ధతి.

<ఉ. కిస్త్‌బందీ.

**కిస్తీబందు** రూ. చూ. కిస్తీబందీ. వి. వాయిదాల ఏర్పాటు.

**కిస్తు** రూ.చూ. కిస్తీ[1]. వి. పన్ను చెల్లించేవాయిదా.

**కిస్మసు** వి. క్రీస్తు జన్మదినోత్సవం.

ఇం. *Christmas*. క్రీస్తు జన్మదినోత్సవం.

<ఇం. Christmas.

కిస్మమపండుగ రూ. కిస్మీసు పండుగ. వి. క్రీస్తు జన్మ దినోత్సవం.
కిస్మిసు రూ. చూ. కిసిమిసి. వి. చిన్నద్రాక్ష.
కిస్మీసుపండుగ రూ.చూ. కిస్మసు పండుగ. వి. క్రీస్తు జన్మ దినోత్సవం.
కిమ్మనుమను అ. క్రి. గుర్రుమను, ధ్వన్యనుకరణశబ్దం.
కీ[1] వి. 1. తాళపుచెవి ; 2. గుండుసూది.
ఇం. *Key*. తాళంచెవి, గుండుసూది మొ. వాటితో గుచ్చి జతపరచు.
< ఇం. Key.
కీ[2] వి. పల్లంగా ఉండేద్వీపం, నీటితో ఉండేరాతిగట్టు.
ఇం. *Key*. పల్లంగా ఉండేద్వీపం, నీటితో ఉండే రాతి గట్టు.
< ఇం. Key.
కీకట వి. పడుగుపికిన తరవాత ధాన్యంమీద ఉంచేపరకలు, చెత్త, పొల్లు మొదలైనవి.
కీకటకుప్ప వి. పొల్లుతోకూడ పోగుచేసిన రాశి.
కీగంటిచూపు రూ. చూ. క్రీఁగంటిచూపు. వి. కిందిచూపు లేదా పక్కచూపు.
కీగర వి. కళ్ళంలో గడ్డిలాగేకర్ర.
< క్రీ- + కర్ర.
కీగాఁడి రూ. చూ. కిగ్గాడి. వి. అప్రయోజకుడు.
కింకాబు రూ. కిన్కాబు. వి. బుటాలు నేసినపట్టు.
క. కింకాబ్. వెండి లేదా బంగారు జరీతోనేసినపట్టు.
కీఁక వి. 1. ఏనుగుకూత ; 2. నెమలికూత.
సం. కేకా. నెమలికూత.
< సం. కేకా.
కీచట చూ. కీఁచు. రూ. కిచాటు. వి. తగాదా, వివాదం.
కీచంటపడు అ. క్రి. చనుబాలులేక బిడ్డచిక్కిపోవు.
కీచంటిబిడ్డ వి. తల్లిచనుబాలులేక చిక్కిపోయిన బిడ్డ.
కీచరబాఁచర రూ. చూ. కీఁచరబాఁచర. విశ. కలగిన, చెల్లా చెదరైన. క్రి. విశ. గందరగోళంగా, చెల్లా చెదురుగా.
కీచుగొంతు చూ. కీఁచు. వి. సన్నని గొంతు.
కీచురాయి రూ.చూ. కీఁచుటాయి. వి. 1 రాత్రిళ్ళ పొలాల్లో తెంపులేని రొదచేసే చిన్నపురుగు, ఈలపురుగు ; 2. కుమ్మరపురుగు.
కీచుటాయి రూ. చూ. కీఁచుటాయి. వి. 1. ఈలపురుగు ; 2. కుమ్మరపురుగు.
కీచులాట చూ. కీఁచులాడు. వి. వివాదం.
కీచువిరిగి వి. ఉపయోగకరమైన కలపకలిగిన ఒకచెట్టు (Cordiaobliqua).
కీఁచట్లాడు చూ. కీఁచు. అ. క్రి. కలహించు.
కీఁచరబాఁచర రూ. కిచరబాఁచర, కినరబానర, కిసర్‌బానర్. వి. 1. అర్థంకాని బాష ; 2. గాబరా.
కీఁచా రూ. చూ. కీస[2]. వి. జేబు, అంగరకానంచి.
కీఁచాయి రూ. చూ. కీస[2]. వి. జేబు, అంగరకానంచి.
కీఁచు వి. 1. కోతులు మొదలయిన వాని ధ్వనికి అనుకరణం. భోజ. 5.94 ; 2. అవ్యక్తధ్వని.
క. కిచు, కిచ, కిచి, కిసు. ధ్వన్యనుకరణం; కిచ-గుట్టు. కిచి-గుట్టు, కిచకిచఅను. పక్షులవలె కిచకిచమని శబ్దంచేయు, కోతులవలె అరచు ; కిచక్ అన్ను. పక్షుల్లాగ కిచకిచమని శబ్దంచేయు ; కిచుకిచు. పక్షుల కిచకిచలు. ఎలుకలవలె కీచుమని అరచు ; కిచికిచి. కిచకిచ ధ్వని ; కిచుకిచు, కిచుకిటు. ఎలుకలు అరిచే కీచుకీచు మనే అరుపు ; కిచుని. కీచుకీచుమను ; త. కిచ్చ్-ఇటు. కీచుమను ; కిచ్చు. కీచుమనే ధ్వని. పక్షుల కిచకిచలు ; కిచ్చు-క్-కిచ్చు. కీచుకీచు మని ధ్వనిని వ్యక్తంచేసేది ; కిచుకిచు. కీచుకీచుమని ధ్వనిని వ్యక్తం చేసేది ; కిచ్-చాన్. పసిబిడ్డ ; మ. కిచ్చు-క్-కిచ్చు. కిచ్చు-కిచ్చు. కిచకిచధ్వని ; కించుక, కెంచుక. కీచు కీచుమని ధ్వనిచేయు.
కీఁచుతలగడ వి. అదిమినప్పుడు కీచుకీచుమనేట్లు లోపల విల్లు పెట్టి కుట్టిన తలగడ. కీఁచుబిళ్ళ వి. అదిమినప్పుడు కీచు మనేట్లుగా లోపల విల్లుపెట్టి కుట్టిన బటువు తలగడ. కీఁచుబుఱ్ఱ రూ.చూ. కీఁచుబుట్ట. వి. 1. అదిమేటప్పుడు కీచు మనే తలగడ ; 2. బాల్య క్రీడావిశేషం. కీఁచుబుట్ట రూ. కీఁచుబుఱ్ఱ వి. 1. అదిమినప్పుడు కీచుకీచనిధ్వని చేసే తలగడ. రాధికా. 4.96 . 2. బాల్యక్రీడా విశేషం. హంస. 3.146. కీఁచుమను అ.క్రి. కీచుమనిధ్వనించు. కీఁచుటాయి రూ. కీచురాయి, కీచుటాయి. వి. ఇలకోడి, చిమ్మట, ముదురు కుమ్మర పురుగు. కీఁచులాడు అ.క్రి. వాదులాడు, కలహించు.
కీఁజీఁకటి వి. కింది చీకటి, క్రినీడ.
కీటకుడు వి. విషమబుద్ధి కలవాడు.
సం. కీటక-.పురుగు.
< సం. కీటక-(అర్థవిపరి.).
కీటడఁగించు చూ. కీటడఁగు.
కీటడఁగు అ.క్రి. చచ్చు, మడియు.
కీటడఁగించు స.క్రి. గర్వమణచు, చంపు.
కీటు[1] రూ. గీటు. వి. 1. గోడపెట్టేటప్పుడు ఒక తడవ వేసే మట్టిముద్దలవరుస. రాజ. వి. 3.40, మట్టిగోడ యొక్క ఖండం ; 2. చీలిక, పగులు.
పో.చూ. క. కీతు. ముక్క, ఖండం (పండ్లు, మాంసం మొ॥ వాటి) ; గీఱు, గీటు. వరుస, గీత ; కీఱు, గీకు, గీచు. తుడిచివేయు ; గిఱు. కలంతో గీత లేక గీతల్ని గీయు ; కీఱుక్కు. తుడిచివేయు ; కొర. గిచ్-(గిచి-). గీకివేసి గుర్తును చేయు ; తు. కిరు, గిరు. గోకు, గీచు ; గీఱు. గీత, గుర్తు ; కిరుని, గిరుని. గీకివేయు. తుడిచి వేయు ; గీచుని. గీతలుగీయు ; గీసుని. తుడిచివేయు, గీకివేయు ; త. కీఱ్ఱు. గుర్తు, గీత, ముక్క, ఖండం ; కీఱు. గీకివేయు. తుడిచివేయు, ముక్కలుచేయు, ముక్క, ఖండం ; కీల్. చించు ; కీఱవ్. గుర్తించటం, గీతలు గీయడం, రాయడం ; కీఱుక్కు(కీఱుక్కి-). గజిబిజిగారాయు ; కిరుక్కల్. రాయటం ; మ. కీఱ్ఱు. ఖండం, ముక్క; కీఱు. చార, నిలువుమచ్చ ; కీఱుక, గోకు, గీచు, గీతలుగీయు ; కీఱుక్క. తుడిచివేయు ; కోట. కిర్. గుర్తు, గీత ; గోం.

కిర్. గాయం ; కిర్ వాంజ్. గీచు, గోకు ; కుఇ. గిర. గుర్తు, గీత ; పర్జి, గిర్. గీత, గుర్తు ; కిర్. గీకు, గీయు ; కోలా. కిర, కిర. గీర, గీత.

**కీటుకాల్వ** వి. ఏటినుంచి తోటకు నీళ్ళుతెచ్చే కాల్వ. **కీటువేయు** స.క్రి. 1. కీట్లతో మట్టిగోడపెంచు ; 2. ఎక్కువ తిండితిను.

**కీటు**[2] వి. ఉపేక్ష.

క. కీటు. తిరస్కారం, నిరసన, ఉపేక్ష.

<క. కీటు.

**కీడాడు** చూ. కీడు[1].

**కీడిక** రూ.చూ. కీడిన. వి. నగం పాలుపోసిన వడ్లగింజ.

**కీడిన** రూ. కీడిక. వి. నగం పాలుపోసిన వడ్లగింజ.

**కీడిసె** రూ.చూ. కీలిసె. వి. తూర్పారపోసేటప్పుడు మేలు. రాని పక్కన పడే పొట్టు, గింజలు కలిసిన భాగం.

**కీడు**[1] వి. 1.అపకారం, చెరుపు, ఆపద. భార. ఉద్యో. 3.36 ; 2. అకార్యం, దుష్కృత్యం. భార. శాంతి. 1.302 ; 3. పాపం, దురితం. భార. ఆశ్ర. 1.153 ; 4. అశుభం. భార. స్త్రీ. 2.58 ; 5. నాశం, చేటు, హాని. భార. అరణ్య. 4.231 ; 6. కసటు, మాలిన్యం, దోషం. మార్క. 3.315 ; 7. తప్పు, నేరం, అపరాధం, నృసింహ. 4.118 ; విశే. 1. దుష్టం, చెడ్డది. భార. ఉద్యో. 2.63 ; 2 అశుభకరమైన. భార. ఉద్యో. 3.171 ; 3. హానికరమైన, అనర్థకరమైన. భార. భీష్మ. 3.433 ; 4. అధమమయిన, తక్కువయిన. భార. అశ్వ. 4.218 ; 5. అనర్థమయిన, అనుచితమైన, తగని. ఆము. 3.62.

క. కెడు, కిడు. నాశనమగు ; కెడిసు, కిడిసు. నాశనం చేయు ; కెట్ట. నాశనమైన, చెడిపోయిన ; కెట్టె. చెడు, నాశనం ; కెడక, కిడిక, కెడుక, కిడుక. నాశనం చేయబడిన వాడు ; కెడకి, కెడకె, కెడుకి, కెడుకతన. దుష్ప్రవర్తన ; కెడకు, కెడుకు. అక్రమం, వినాశనం ; కెడుహ, కిడు. నాశనం ; కిడి. అక్రమానికి గురైనవాడు ; కిడి, కిడుక. అక్రమాన్ని చేసేవాడు ; కొర. కెడ్. నాశనంచేయబడు ; కెడి. నాశనం ; తు. కెడగుని. నాశనమగు ; కెడుమ, కెడ, కెడకు. నష్టం ; కెడకె. అణచివేసేవాడు ; కెట్ట. చెడు; కేడు. దుష్కృత్యం, అపాయం, వినాశం, నష్టం ; కేడగె, కెడింగె. దుష్కృత్యాలు చేసేవాడు ; త. కెటు. (కెటుర్-కెట్ట్-) నాశనం చేయు, నాశనమగు ; కెట్ట. చెడు, నాశనంచేయబడిన ; కేట్టవన్. చెడు. దుర్నీతిగలవాడు ; కెటుతి. నాశం, నష్టం ; కెటుంపు. నాశం, చెడు ; కేటు. నాశం, నష్టం ; కిటున్. నాశనమైన, దౌర్భాగ్యుడు ; కేటి, చెటి. చెడువాసన. నాశనమైనది, చెడిపోయినది (ఆహారం, పూలు మొ॥నవి) ; మ. కెటు. నాశం ; కెటుక. నాశనం చేయబడు ; కెటుతి. నాశం, అపాయం ; కెటుంపు. కుళ్ళటం ; కెటుంపిక్క. ఎండదంవల్ల నాశనమగు ; కెటుక్క. నాశనమగు ; కేటు. నాశనం ; కో. కెడ్-(కెట్-). చచ్చు, నాశనమగు ; కెడ్చ్-. నాశనమగు ; కెడ్. నాశం ; తొ. కొడ్. చెడిపోవు ; కొడ్చ్. నాశనం చేయు ; సిడ్య. చెడువాసన.

<మూ.ద్రా.*కెట్-.

**కీడాడు** స.క్రి. నిందించు, దూరు. భార.కర్ణ. 3.86. **కీడుతీయు** స.క్రి. చెడుముహూర్తంలో సమర్తాడిన పిల్లకన్నెరికం జరుపు. **కీడుపడు** రూ.చూ. కీడ్పడు. అ.క్రి. 1. వశమగు, లొంగు. భార. భీష్మ. 3.396 ; 2. కుంగు ; 3. తక్కువపడు ; 4. అణగు ; 5. ఓడు. త. కీళ్-ప్-పట్టు. చచ్చు, నశించు, కష్టపడు ; మ. కీళ్పటి. విధేయత, నమ్రత, అణకువ. **కీడుపఱచు** రూ. కీడుపఱుచు, కీడ్పరచు, కీడ్పరుచు, కీడ్పఱచు, కీడ్పఱుచు, కీడ్వఱచు. స.క్రి. 1. అణచు, అణగదొక్కు. భార. ఆది. 8.75 ; 2. లొంగదీయు ; 3. చెరచు ; 4. నాశనంచేయు, పోగొట్టు. త. కీళ్పటుత్తు. లొంగదీయు. **కీడుపఱుచు** రూ. చూ. కీడుపఱచు. స. క్రి. 1. అణచు ; 2. లొంగదీయు ; 3. చెరచు ; 4. నశింపచేయు. **కీడుపాటు** రూ. కీడ్పాటు. చూ. కీడుపడు. వి. 1. కష్టం, శ్రమ. భార. విరా. 1.103 ; 2. ఓటమి, అపజయం. హరి. ఉ. 10.146 ; 3. చావుగుర్తు, అశుభం. **కీడుమేళ్ళు** వి.బ.వ. 1. ప్రశ్నకు రెండువైపులు ; 2. మంచిచెడ్డలు. **కీడువడు (-వడు)** రూ. చూ. కీడ్పడు. అ. క్రి. తక్కువపడు, లొజ్జగు. కేయూ. 3.28. **కీడువెట్టు (-పెట్టు)** రూ.చూ. కీడ్వెట్టు. స.క్రి. తక్కువచేయు, అధఃకరించు. **కీడ్పడు** రూ. కీడుపడు, కీడువడు, కీడ్వడు. అ. క్రి. 1. తక్కువపడు, లొజ్జగు. భార. ఆది. 5.164 ; 2. దాగు, అణగు, అజ్ఞాతంగాఉండు. భార. విరా. 4.76 ; 3. దైన్యాన్నిపొందు. భార. భీష్మ. 3.396 ; 4. చిన్నబోవు, అసూయచెందు. భార.శాంతి. 1.17 ; 5. కుంగు. హరి.పూ. 5.90. **కీడ్పరచు** రూ. చూ. కీడుపఱచు. స. క్రి. అణచు. **కీడ్పరుచు** రూ. చూ. కీడుపఱచు. స. క్రి. అణచు. **కీడ్పఱచు** రూ. చూ. కీడుపఱచు. స. క్రి. 1. పోగొట్టు. భార. సభా. 1.270 ; 2. అణచు, అణగదొక్కు. ప్రభా. 5.142. **కీడ్పఱుచు** రూ. చూ. కీడుపఱుచు. స. క్రి. 1. తిరస్కరించు. భార. ఉద్యో. 4.391 ; 2. లొంగదీయు. భార. భీష్మ. 3.58 ; 3. అణచు, అణగదొక్కు. భార. కర్ణ. 2.123 ; 4. తీసివేయు. శుక. 3.89. **కీడ్పాటు** రూ. చూ. కీడుపాటు. చూ. కీడుపడు వి. 1. దైన్యం. భార. విరా. 4.80 ; 2. తక్కువతనం, హైన్యం. భార. శాంతి. 5.415 ; 3. పరాభవం, అవమానం. భార. శల్య. 2.21 ; 4. చేటు, హాని. హరి. ఉ. 9.80 ; 5. అశుభం. ఆం. భా. 199. **కీడ్వడు (-వడు)** రూ. చూ. కీడ్పడు. అ. క్రి. 1. వశమగు. లొంగు. హరి. 9 92 ; 2. చచ్చు, నశించు. రామాభ్య. 203. **కీడ్వఱచు (-వఱచు)** రూ. చూ. కీడుపఱచు. స. క్రి. 1. నశింపచేయు. పండి.చ. 4.98 ; 2. మించు. **కీడ్వెట్టు(-పెట్టు)** రూ. కీడువెట్టు. స.క్రి. తక్కువచేయు, అధఃకరించు. దశకు. 1.75.

**కీడు**[2] వి. కత్తిపదును.

**కీడెఱ** రూ. చూ. కిడఱ. వి. క్రయ విక్రయాలపై విధించే సుంకం లేక పన్ను.

**కీడ్పడు** చూ. కీడు[1].

**కీడ్పరచు** చూ. కీడు[1].
**కీడ్పరుచు** చూ. కీడు[1].
**కీడ్పఱచు** చూ. కీడు[1]
**కీడ్పఱుచు** చూ. కీడు[1].
**కీడ్పాటు** చూ. కీడు[1].
**కీడ్వడు** చూ. కీడు[1].
**కీడ్వఱచు** చూ. కీడు[1].
**కీడ్వెట్టు** చూ. కీడు[1].
**కీంౘ్ర** వి. ఎక్కువగానీరు పీల్చేమెట్టనేల.
**కీత** విశే. తక్కువ. నికృష్టమైన, స్వల్పమైన, నీచమైన. వి. లోకువ, హుళక్కి.
పో. చూ. క. కట్. తక్కువస్థితి, తక్కువతనం; తు. కీఱు. తక్కువ, హీనం; త. కీట్. కింద.
**కీతకుంచములు** వి.బ.వ. తక్కువకొలతలు. **కీతకుండ** వి. తాటి చెట్టెక్కి తొట్లోఉన్న కల్లును పంచుకోడానికి వాడే మట్టిపాత్ర
**కీతు** వి. కొబ్బరాకులచాప, అల్లినకొబ్బరిమట్ట.
క. కీతు. పళ్ళు, ఆకులు మొ. వాటిముక్క.
<క. కీతు.
**కీదొర** వి. 1. పల్చగానేసిన బట్టకు నేతగాళ్ళు వరిపిండి పలచగా ఉడికించి పూసేది; 2. లోతొర.
**కీనీర** రూ. చూ. క్రీనీర. వి. దీపం కింది నీడ.
**కీనీరు** రూ. చూ. క్రీనీరు. వి. భూమిమీదనే ఉండేఊటనీరు.
**కీనీరునేల** రూ. చూ. క్రీనీరునేల. వి. కిందినీరున్ననేల.
**కీనీరుబావి** వి. మంచిఊటబావి.
**కీనెలుదీసిఅలుకు (-తీసిఅలుకు)** స. క్రి. చక్కనిగీతలు పడేట్టు వంకరపోకుండా ఇంటినేలనుఅలుకు.
**కీన్కాబు** రూ. చూ. కింకాబు. వి. బుటాలువేసినపట్టు.
**కీబోర్డు** వి. పియానో మొ. వాటిలోమీటలుండే పలకం, ముద్రికల పీట.
ఇం. *Keyboard*-. పియానో మొ. వాటిలో మీట లుండేఫలకం.
<ఇం. Keyboard.
**కీయు** స. క్రి. చివ్వు, చీరు, చెక్కు.
**కీర** రూ. చూ. కీరె. వి. 1. దోసజాతికి చెందిన తీగెమొక్క; 2. కాయగూరలు; 3. ఆకుకూరలు.
**కీరకాయ** రూ. కీరగాయ. వి. పందిరిదోసకాయ. **కీరగాయ** రూ. చూ. కీరకాయ, పందిరిదోసకాయ.
**కీరింగ్స్** వి.బ.వ. తాళం చెవులగుత్తి.
ఇం. *Key-rings*. తాళంచెవులగుత్తి.
<ఇం. Key-rings.
**కీరించు** స.క్రి. కీలించు, కట్టు. శివరా. 2.53.
**కీరితి** వి. యశం. హంస. 1.15.
సం. కీర్తి-. యశస్సు, హిం. కీర్తి. యశం;
క. కీరితి, కీర్తి; త. కీర్‌త్తి, చీర్‌త్తి; మ. కీర్‌త్తి.
<సం. కీర్తి-.
**కీరె** రూ. కీర. వి. 1. దోసజాతికి చెందిన తీగెమొక్క; 2. కాయగూరలు, 3. ఆకుకూరలు.
క. కీరె, కిరె, అనేక విధాలైన ఆకుకూరలు; త. కీరై. ఆకుకూరలు, కూరగాయలు; మ. చీర. ఆకు కూరలు; కోట. కిర్. ఒకరకం ఆకుకూర; తొద. కిర్వ్. ఒకరకం ధాన్యం.
<క. కీరె-.
**కీర్తిశేషుడు** వి. మరణించినవాడు.
సం. కీర్తిశేష - మిగిలినకీర్తిగలవాడు.
<సం. కీర్తిశేష - (అర్థవిపరి.).
**కీల** వి. కలేకంప (Blistering papaya of srazil Carissa Carandus)
**కీలం** వి. గోడకట్టేటప్పుడు రాళ్ళమధ్య వచ్చేసందు.
**కీలకప్పు** వి. ఒకపక్కన చూరునుంచి వెనుగాడిదాకా కప్పి దాన్ని నాలుగువైపులా కలిపి తయారుచేసినకప్పు.
**కీలకము** వి. 1. మర్మం, కిటుకు; 2. కీలు, కొరగుంది.
నం. కీలక-. మంత్రంగాల్లో ఒకటి.
సం. కీలక-. (అర్థవిపరి.).
**కీలగొంతు** వి. సన్నటి రావుడుగొంతు.
**కీలనచేయు** స. క్రి. ధరించు. కీలించు. హర. 5.55.
**కీలరము** రూ. కిలరము, కిలారము, కీలరు, కీలారము. వి. పశులమంద. కు. సం. 4.11.
క. కిరార, కిలార (<సం. క్షీరాగార-) పాలు. పెరుగు మొ. అమ్మేఇల్లు.
<క. కీలార.
**కీలరముసేయు (-చేయు)** స. క్రి. మందకట్టు.
**కీలరి** చూ. కీలు[1].
**కీలరు** రూ. చూ. కీలరము. వి. పశువులమంద. బసవ. 7.815.
**కీలరువాండ్రు** వి. పశులకాపరి.
**కీలాడ** వి. ఊరుచుట్టూ ఉండే పాటిపొలం.
**కీలాడుమట్టి** చూ. కీలు[1].
**కీలారము** రూ. చూ. కీలరము. వి. పశువులమంద. భీమ 5.87. భోజ. 6.313.
**కీలారి** రూ. కిలారి, కిల్లారి, ఖిలారి, ఖిల్లరి. ఖిలారి. చూ. కిలారము. వి. గొల్లవాడు. చంద్రభా. 2.115.
క. కిలారి (< క్షీరాగారి) ఆవులకాపరి, పశులకాపరి; త. కిలారి. గొల్లవాడు.
మరా. ఖిల్లారి.
<క. కీలారి.
**కీలారితనము** వి. పశుపాలకత్వం. భార. విరా. 1.100.
**కీలి** వి. తాళంచెవి.
క. కీలి, తాళంచెవి.
<క. కీలి.
**కీలిగె** రూ.చూ. కిరిగె. వి. కన్నెపిల్లలు కట్టుకొనే చిన్న చీర.
**కీలించు** చూ. కీలు[1]. రూ. కిలించు. స. క్రి. 1. ప్రయోగించు, మీదపడవేయు. నిర్వ. రా. 3.28; 2. కదియబట్టు, దగ్గరగా చేర్చు. భాగ. 10 పూ. 6.37; 3. ఘటిల్లచేయు, కూర్చు, పెట్టు, ధరింపచేయు. ఆము. 5.38, యయా. 4.90, ఆం. భా. 3.138; 4. తగిలించు.
క. కీలిసు, కట్టు, ఏర్పరచు.
<క. కీలిసు.

**కిలిపిట్ట** వి. ఒకరకం చేప.

**కిలిసె** రూ. కిడిసె. వి. తూర్పార పోసేటప్పుడు మేలురాని (మంచి గింజలరాని) పక్కన పడేపొట్టు, గింజలు కలిసిన భాగం.

**కిలు**[1] వి. **1.** సంధి, అతుకు, మర్మస్థానం. నిర్వ. రా. 9.17; **2.** ఉపాయం. కేయూ. 3.189, భోజ. 6.103; **3.** ముడి. హరి. పూ. 8.31; **4.** కీలకం, గుట్టు, కిటుకు, మర్మం. భాగ. 10 ఉ. 742; **5.** రీతి, విధం. కాశీ. 7.179; **6.** ఉర. విజయ. 1.106; **7.** కపటచేష్ట. హంస. 4.234; **8.** మరానుతిరిగేటప్పుడు బెండకాయ చక్రంతో బాటు తిరిగేవంకర ఇనప ఊచ; **9.** కిటికీ రెక్కలు ఆడటానికి వీలుగా రెక్కలనూ చట్రాన్ని కలుపుతూ బిగించిన ఇనపబద్దీ; **10.** దర్వాజపైన వేసిన చెక్కలలోనుంచి పైకివచ్చిన కుసి తలుపు భాగం; **11.** సన్నటి గొళ్ళెం: **12.** సీల.

క. కీల్, కిలు. గుండుసూది, కొయ్యచీల, కీలు, యుక్తి, ఉపాయం, గోప్యం; తు. కిలి. కొయ్యసీల, రహస్యం, కీలు; త. కిల్. పశువుల శరీరంలోని కీలు. తలుపులు మొదలైనవి తిరగటానికి వేసే కీలు; మ. కిలమ్. సీల, మేకు; కుఇ. కిల. సీల, మేకు, ఊక; పర్జి. కిలఁవి. కీలు, కిలి, కీలు.

పో.చూ. సం. కిల-.మొనదేలిన కొయ్య ముక్క, సీల, కొయ్యమేకు; కీలక. గుండుసూది, అడ్డకొయ్య, గుదికొయ్య; కీలకా. గుండుసూది, అడ్డకొయ్య.

**కిలరి** వి. కిలెరిగినవాడు, మర్మజ్ఞుడు, కిటుకు తెలిసిన వాడు. **కిలాడుమట్టి** వి. జిడ్డుగాఉండే మట్టి. **కిలుకత్తి** వి. మరకత్తి, మడతకత్తి. **కిలుకాఁడు** వి. మరతిప్పేవాడు, సూత్రధారి. భార. ద్రోణ. 3.62. **కిలుకొను** రూ. కిల్కొను. అ.క్రి. **1.** తగులు, తగులుకొను, చిక్కుకొను, అంటిఉండు. భార. శాంతి. 4.358; **2.** గుచ్చుకొను, నాటు. శృం. నై. 6.5; **3.** ఒప్పు, ఉండు. శృం. నై. 6.90. **కిలుకొలుపు** రూ. కిలుకొల్పు, కిల్కొల్పు, గిలుకొలుపు, గిల్కొలుపు. స.క్రి. **1.** బంధించు. భార. విరా. 2.45; **2.** నాటుకొనేట్లుచేయు. భార. కర్ణ. 2.242; **3.** ఉంచు, ఉండేట్లుచేయు. వరాహ. 7.95; **4.** తాల్చు, వహించు. సీతా. రా. 1.18. **కిలుకొల్పు** రూ.చూ. కిలుకొలుపు. స.క్రి. **1.** తాల్చు, వహించు. భీమ. 4.8; **2.** లగ్నంచేయు, తగులుకొనేట్లుచేయు, బంధించు. రామా. 4.148; **3.** పెట్టు, ఘటించు, కూర్చు. రామా. 4.149; **4.** నిలుపు. వసు. 3.169; **5.** అమర్చు. **కిలుగంటు** రూ. కిల్గంటు. వి. కేశబంధ విశేషం, దూముడి, జారుముడి. కాళ. 4.118. **కిలుగుఱ్ఱము** వి. మరగుఱ్ఱం. **కిలుఁగొప్పు (-కొప్పు)** రూ. కిల్గొప్పు. వి. కేశబంధవిశేషం, జారుముడి కొప్పు, వదులుగా ముడి వేసినకొప్పు. శృం. నై. 8.112. **కిలుచు** రూ. కిల్చు, స.క్రి. **1.** ధరించు, తాల్చు. వేంక. పంచ. 4.101; **2.** కూర్చు; అ.క్రి. ఉండు. **కిలుచూపు** స.క్రి. మర్మాన్ని ఉద్దేశించు. **కిలుజడ** రూ.చూ. కిల్జడ. వి. స్త్రీలువేసుకొనే ఒకరకం జడ. శుక. 2.232. **కిలుటోడ** వి. యంత్రాలతో నడిచే పడవ, నౌకావిశేషం. మృత్యు. 3.43.37. పు. **కిలుపడు** అ.క్రి. తగులుకొను. భాగ. 5.1.17. **కిలువరుచు** రూ.చూ. కిలుపఱచు. స.క్రి. **1.** కట్టు; **2.** కలుపు; **3.** ఉంచు. **కిలుపఱచు** రూ. కిలుపరుచు, కిలుపఱుచు, కిల్పఱుచు. స.క్రి. **1.** అనుకూల పరచు; **2.** కలుపు, దగ్గరకు చేర్చు; **3.** ఉంచు. **కిలుపఱుచు** రూ.చూ. కిలుపఱచు. స.క్రి. తగులజేయు. **కిలుబందు** వి. మడతబందు, రెక్కలు తెరుచుకోడానికి మూసుకోడానికి వీలుగా కమ్ములకు పట్టి ఉంచే రెండు రెక్కల పరికరం. **కిలుబొమ్మ** రూ.చూ. కిల్బొమ్మ. వి. **1.** ఎముకతో అమర్చిన బొమ్మ, మరబొమ్మ. ఉ.రా. 1.317; **2.** సూత్రధారి అనబడే స్త్రీ; **3.** అస్వతంత్రుడు. **కిలుబొమ్మరము** రూ.చూ. కిల్బొమ్మరము. వి. మరబొంగరం. **కిలుమండి** రూ. కిలుమండె. వి. **1.** కీలు లేదా అవయవ సంధిలోపుట్టే కురుపు; **2.** క్యాన్సరు వంటి రోగం; **3.** అవయవాలు కలిపే సందు: **4.** మోకాటిలో పుట్టే వ్రణం; **5.** జారుముడి. **కిలుమండె** రూ.చూ. కిలుమండి. వి. మోకాళ్ళదగ్గర గడ. **కిలుమలఁగు** రూ. కిల్మలఁగు. అ.క్రి. వెనుదిరుగు, మరలు. **కిలుముడి** రూ.చూ. కిల్ముడి. వి. వెంట్రుకలు జారుగా వేసినముడి, కిలుగంటు, పిడిగంటి. **కిలెరిగినవాత** వి. తగిన ప్రతీకారం < కీలు[1] + ఎరిగినవాత. **కిలెఱుఁగు** స.క్రి. గుట్టుతెలిసికొను < కీలు[1] + ఎఱుఁగు. **కిల్కొను** రూ.చూ. కిలుకొను. అ.క్రి. **1.** అంటుకొను. వరాహ. 12.29; **2.** ముడిపడు, ముడుచుకొను. కవిక. 4.176; **3.** కూడుకొను, అతుకుకొను, కలిసికొను. **కిల్కొల్పు** రూ.చూ. కిలుకొలుపు. స.క్రి. **1.** కలిగించు, పొందించు, కలుగచేయు. హరి. పూ. 7.240; **2.** పెట్టు, ఘటించు. శుక. 2.456. **కిల్గంటు** రూ.చూ. కిలుగంటు. వి. కేశబంధ విశేషం, దూముడి, జారుముడి. విజయ. 3.13. **కిల్గొప్పు(-కొప్పు)** రూ చూ. కిలుఁగొప్పు. వి. కేశ బంధవిశేషం. హర. 6.45. **కిల్చు** రూ.చూ. కిలుచు. స.క్రి. ధరించు, తాల్చు. ద్వి. పరమ. 5.429. పు. **కిల్జడ** రూ. కిలుజడ. వి. స్త్రీలువేసుకొనే ఒక విధమైన జడ. ఉ.రా. 1.44. **కిల్జెట్ట(-చెట్ట)** వి. కీళ్ళకు, గిట్టలకు వచ్చే ఒకరకంజబ్బు. **కిల్పఱుచు** రూ.చూ. కిలుపఱచు. స.క్రి. అనుకూల పరచు. **కిల్బొమ్మ** రూ. కిలుబొమ్మ. వి. మరబొమ్మ. ఉ. హరి. 2.73. **కిల్బొమ్మరము** రూ. కిలుబొమ్మరము. వి. మరబొంగరం. ప్రబంధ.1.09. **కిల్మలఁగు** రూ.చూ. కిలుమలఁగు. అ.క్రి. వెనుదిరుగు, మరలు. **కిల్ముడి** రూ. కిలుముడి. వి. జారు ముడి. సాం. ని. 2.14. **కీళ్ళవాతం** వి. మోకాళ్ళ మొ. వాటివాపు.

**కిలు**[2] వి. కొయ్యకు చెదలు పట్టకుండాను, డాబాకప్పు ఉరవకుండాను పూసేనల్లటి చిక్కనిద్రవ్యం.

**కిలుగుడ్డ** వి. కిలురంగు వేసిన బట్ట. **కిలుచాప** వి. తారుపోసి నీళ్ళు కారకుండా ఉండేట్లు తయారుచేసిన పట్ట, టార్పాలిను.

**కిలెరిగినవాత** చూ. కీలు[1].

**కిలెఱుఁగు** చూ. కీలు[1].

**కీల్కామ** చూ. కీలు[1].
**కీల్కాల్పు** చూ. కీలు[1].
**కీల్గంటు** చూ. కీలు[1].
**కీల్గావ్వ** చూ. కీలు[1].
**కీల్చు** చూ. కీలు[1].
**కీల్జడ** చూ. కీలు[1].
**కీల్జెట్ట** చూ. కీలు[1].
**కీల్పాటుచు** చూ. కీలు[1].
**కీల్బొమ్మ** చూ. కీలు[1].
**కీల్బొమ్మరము** చూ. కీలు[1].
**కీల్మలఁగు** చూ. కీలు[1].
**కీల్మడి** చూ. కీలు[1].
**కీళేరు** వి. చెరువు కట్టకింద సాగుబడి అయ్యే భూమి.
**కీళ్ళవాతం** చూ. కీలు[1].
**కీన[1]** చూ. కీత. విశ. తక్కువ, అల్పం, కొంచెం. శివరా. 2.3, కాశీ. 5.214.

**కీనంత** వి. రవ్వంత, కానంత, కొనంత. **కీనపాలు** వి. చిన్నభాగం. **కీనమధ్యస్థము** వి. పంచాయితీలో మోసం లేదా వంచన. **కీనవెలితి** రూ. కీనవెల్తి. విశ. కొంచెం తక్కువది. శివరా. 2.3 ; వి. కొంచెం తక్కువ వాడు. రామాభ్యు. 3.138. **కీనవెల్తి** రూ.చూ. కీనవెలితి. విశ. కొంచెం తక్కువది. భీమ. 3.46.

**కీస[2]** రూ. కిసాయి, కీఁచా, కీఁచాయి, కీసా1. కీసాయి. వి. జేబు.

హిం. ఉ. పార. కీసా. జేబు ; ఖీసా.

< ఉ. కీసా.

**కీసతిత్తి** వి. జేబు.

**కీసర** వి. తిత్తి మొదలైనవాటి లోపలిపొర, జేబు. హంస. 4.156 ; విశ. అల్పమైన.

< కీస[1] + అర[1]-.

**కీనరబానర** రూ.చూ. కీఁచరబాఁచర. వి. అర్థం కానిభాష.
**కీనర్ బావర్** రూ.చూ. కీఁచరబాఁచర. వి. అర్థం కానిభాష.
**కీసా[1]** రూ.చూ. కీస[2]. వి. జేబు, చొక్కాలోని సంచి.
**కీసా[2]** వి. బరువులో లేదా తూకంలో నాల్గోవంతు.
**కీసాయి** రూ.చూ. కీస[2]. వి. జేబు, అంగరక సంచి.
**కీస్రా విరిగి** వి. ఉపయోగకరమైన కలప కలిగిన ఒక చెట్టు. (Cordiaoblique).
**కీవ్‌పాస్** వి. అర్థం కానిభాష.
**కీసు** వి.బ.వ. తాళం చెవులు, బీగాలు.

ఇం. *Keys*. తాళంచెవులు.

< ఇం. Keys.

**-కు** రూ.-కి వి. **1.** ద్వితీయార్థకంలో వాడే అంత్య ప్రత్యయం. భార. ఆది. 2.128 ; **2.** పంచమార్థకంలో వాడే అంత్య ప్రత్యయం. భార. ఆది. 5.239 ; **3.** జన్యజనక సంబంధాన్ని తెలుపుతుంది. భార. ఆది. 8.224 ; **4.** చతుర్థ్యర్థకంలో వాడే అంత్యప్రత్యయం. భార. సభా. 1.261 ; **5.** తృతీయార్థకంలో వాడే అంత్యప్రత్యయం. భార. సభా. 2.3; **6.** సప్తమ్యర్థకంలో వాడే అంత్య ప్రత్యయం. భార. అరణ్య. 2.216 ; **7.** పైన, మీద, అనే అర్థాల్లో వస్తుంది. భార. భీష్మ. 1.296 ; **8.** మారుగా, బదులుగా అనే అర్థాల్లో వస్తుంది. భార. అను. 2.429 ; **9.** షష్ఠ్యర్థంలో వచ్చే విభక్తి ప్రత్యయం, సంబంధ సామాన్యాన్ని తెలుపుతుంది. భాగ. 7.80 ; **10.** సంబంధ విశేషాన్ని తెలుపుతుంది ; **11.** స్వస్వామిభావ సంబంధాన్ని తెలుపుతుంది ; **12.** అవయవావయవిభావ సంబంధాన్ని తెలుపుతుంది.

క. కెŕ, గె. చతుర్థీ విభక్తి ప్రత్యయం ; తు. కు, గు ; త. క్కు ; మ. క్కు, -ఇక్కు ; కో. -క్ ; తొ. -క్ ; గోం. -క్ ; కుఇ. -కి ; -గి ; కువి. కి ; పర్జి -గ్ ; -జ్ ; కొలా. ఇా్, -ఊజ్ ; మాల్తో. -క్, -ఇక్.

< మూ.ద్రా. -*క్కు.

**కుక్క** వి. **1.** వేపి, శునకం. భార. ఆది. 5.234 ; **2.** నీచుడు ; **3.** అల్పమైన బుద్ధికలవాడు. శుక. 2.452. విశ. అల్పమైన, నీచమైన.

సం. కుర్కుర- , ప్రా. కుక్కుర ; పా. కుక్కుర.

క. కొర. మొరుగు ; తు. కొరెప్పురి. మొరుగు ; త. కుక్కల్. కుక్క. కుక్కన్. అరుచు ; మ. కుక్కరమ్. కుక్క. కుర. అయిష్టమైన శబ్దం ; కురెక్క. మొరుగు ; కో. కెర్వ. మొరుగు.

< ప్రా. కుక్కుర-.

**కుక్కగులాబి** వి. ఒకరకంమొక్క. **కుక్కగొడుగు** వి. పుట్టగొడుగు, చత్రా. కం. **కుక్కగొర్రె** వి. అడవిగొర్రె. **కుక్కచంక** వి. పాలుతక్కువగా ఉండే పొదుగు. **కుక్కచిలుకకూర** వి. ఒకవిధమయిన మూలిక. **కుక్కచుక్క** వి. పునర్వసు నక్షత్రం. **కుక్కచ్చు** రూ.చూ. కుక్కయచ్చు. వి. కుక్క ఆకృతిగల వాత, కుక్కముద్ర. విజ్ఞా. ప్రా. 64. **కుక్కతుమికి** వి. తెల్లని పూలుపూసే ఒకచెట్టు (Diospyros avaglifolia) **కుక్కతులసి** రూ. కుక్కతొలసి, కుక్కతొళసి, వి. మరువం పత్రిర్జకం, మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క (Ocinum Carrum). **కుక్కతెగులు** వి. కుక్కగజ్జిలాగ మొక్కమీద ఏర్పడేబూజు తెగులు, మజ్జిగ తెగులు. **కుక్కతొల(ళ)సి** రూ. చూ. కుక్కతులసి. వి. మరువం (Ocinum Carrum). **కుక్కదోస** వి. బుడమదోస. **కుక్కనెత్తిమీదిటెంకాయ** వి. అస్థిర విషయం. **కుక్కవోము** వి. పైరు మొక్కల్లో ఒకవిధమైన కలుపు మొక్క. **కుక్కపాల** రూ. కుక్కవాళ. వి. పటపత్రం, లావుగా, పొడవుగా ఉండే వేళ్ళుకలిగి ఆకుపచ్చతోకూడిన పసుపు లేక ఊదారంగు పూలుపూసే తీగ. ఆం.భా. 2.66. (Tylophora asthmatica). **కుక్కపీకులాట** వి. **1.** ఒకటి చేయబోయి అవస్థలో ఇరుక్కోడం ; **2.** సులభమనిపించే కష్టాల పాల్జేయడం. **కుక్కపొగాకు** వి. **1.** కుకున్ద, అడవిపొగాకు ; **2.** ఏటామొలిచే చిన్న కలుపుమొక్క (Commiphora berryi). **కుక్కపొదుగు** వి. పెద్దదిగా ఉండి పాలు తక్కువగా ఉండే పొదుగు. **కుక్కబద్ద** వి. బొమ్మమేడిచెట్టు, అల్పంగా ఉండే ఒక చిన్నచెట్టు (Ficushispida). **కుక్కబుడ్డ** వి. పచ్చనిపూలు పూసే ఒక మొక్క లేక తీగ. (Grewiapilosa). **కుక్కబూరుగు** వి. ఒకజాతిబూరుగు

హంస. 4.11. కుక్కబేడి వి. రబ్బరువంటి మాను కలిగిన ఒక మొక్క (Streblus asper). కుక్కముల్లు వి. దద్రు రోగ విశేషం, పొక్కుల వ్యాధి. కుక్కమూతిపిందె వి. కాపుడిగినపుడు కలిగే కుక్కమూతి వంటి మూతిగల పిందె. కుక్కమేడి వి. కాకిమేడి. కుక్కమొగి రూ. కుక్కమొయి, కుక్కమోగి. కుక్కమోవి. వి. లేతఆకుపచ్చరంగు ఆకులు కలిగి పచ్చని పెద్దపూలు పూసే ఒక చిన్నచెట్టు. (Ochana bamblei). కుక్కమొయి రూ.చూ. కుక్కమొగి. వి. లేతాకుపచ్చరంగు ఆకులు కలిగి పచ్చని పెద్దపూలు పూసే ఒక చెట్టు (Ochana Gamblei). కుక్కమోగి రూ.చూ. కుక్కమొగి. వి. లేతాకుపచ్చరంగు ఆకులు కలిగి పచ్చని పెద్దపూలు పూసే ఒకచెట్టు (Ochana Gamblei). కుక్కమోవి రూ.చూ. కుక్కమొగి. వి. లేతాకుపచ్చరంగు ఆకులు కలిగి పచ్చని పెద్దపూలు పూసే ఒక చిన్నచెట్టు (Ochana Gamblei). కుక్కయచ్చు రూ. కుక్కచ్చు. వి. కుక్క ఆకృతిగలవాత, కుక్కముద్ర. విజ్ఞా. ప్రా. 41. కుక్కలకట్టు వి. కుక్కలు మొరగకుండ చేసే చోరసాధన విశేషం. చెన్నబసవ. 294. కుక్కల్లి వి. మొనతేలిన ఆకులు కలిగి నల్లని పళ్ళు కాసే అడవిచెట్టు. (Mametylon deccanense). కుక్కవాయింట రూ. కుక్కవావింట. వి. శ్వేతబర్బర. ఆం.బా. 2.267. కుక్కవాళ రూ.చూ. కుక్కపాల. వి. లావుగా పొడవుగా ఉండే వేళ్ళు కలిగి ఆకు పచ్చతో కూడిన పసుపులేక ఊదారంగు పూలుపూసే ఒక తీగ (Tylophora astmatica). కుక్కవావింట రూ.చూ. కుక్కవాయింట. వి. శ్వేతబర్బర. కుక్కవెఱ్ఱి వి. వెఱ్ఱికుక్క కాటువల్ల కలిగే రోగవిశేషం. కుక్కవెలగ వి. ముళ్ళు కలిగి లేత పసుపురంగు కర్రకలిగిన ఒకచెట్టు (Limonia acidissima).

కుక్క² వి. 1. పంగలకట్టెమీద వేసే బిగుదంతె; 2. తొట్టి పీటకు బదులు వేసే కర్ర; 3. ఎదురు దోనెదగ్గర అమర్చిన పళ్ళచక్రం, బిగింపుకు వేసిన ఇనపకొక్కెం.

కుక్కకర్ర వి. దాబీ కట్టుబడిలో కుక్కబిగించిన కొయ్య. కుక్కకొయ్య వి. గిలకకు రెండు వైపులా ఆధారంగా నిలపబడిన చిన్న కొయ్యముక్క. కుక్కగొయ్య వి. పల్లిరును (కిందిగిలక) తిరగటానికి ఆధారంగా మోట బావి లోపలికి చొచ్చుకు వచ్చేట్టు వేసినకొయ్య. కుక్కచక్రం వి. కుక్కను గుంజే దాబీచక్రం. కుక్కతాడు వి. 1. దాబీ చక్రాన్ని గుంజే రేకు; 2. కుక్కకు వేలాడదీసిన దారం. కుక్కదొల్ల వి. ఎరుపుతోలేజల్ల. కుక్కమూతిరాయి వి. ఉష్ణ దేశాల్లో వానాకాలం తర్వాత భూమి లోపలి పొరల్లోఉన్న సుద్దనీరు. కుక్కమైల వి. గోధుమవన్నెతో నలుపు కలిసిన రంగు. కుక్కసూత్రం వి. దాబీచక్రాన్ని గుంజేరేకు, కుక్కకు వేలాడదీసిన దారం. కుక్కాని వి. గేటుకు మధ్య రెక్కలు ఆనడానికి వీలుగా పాతిన కొయ్య లేదా రాతిదిమ్మ.

కుక్కాని² చూ. కుక్క².

కుక్కి వి. 1. తాళ్ళు వదులై పల్లంపడిన మంచం. శివరా. 4.46, భోజ. 5.288; 2. ఎరువు మొ.నవి తోలటానికి బండిమీదవేసే వెదురు లేక పేళ్ళతో అల్లిన గూడువంటి సాధనం; విశే. 1. లోతైన. ద్వి.భాగ. 9 స్కం.; 2. పాడు బడ్డ ద్వి. భాగ. 9.

సం. కుక్షి-. మధ్యభాగం, బోలుగా ఉండేది; ప్రా. అమా. శౌ. కుక్షి-.

క. కుకుక్క. నొప్పించు, బొరిగతో భూమిని కొద్దిగా తవ్వు; కుజి. గుజి. కన్నం, నిమ్నం; త. కుళి. లోతుగా చేయు. (నాలటి) గుంట (తివా) కన్నం, గుంట కుజి. గొయ్యి, గుంట, కన్నం; మ. కుళి. గుంటగాఉన్న; కుజిక్క. గుంట, కన్నం, గోరి, తవ్వు.

< ప్రా. కుక్షి-

కుక్కిపడు రూ.చూ. కుక్కివడు. అ.క్రి నేతనదలి పల్లమగు. కుక్కిమంచము వి. తాళ్ళునదలి పల్ల పడ్డ మంచం. కుక్కివడు (-పడు) రూ. కుక్కిపడు. అ.క్రి. కుక్కిఅగు, నేతనదలి పల్లమగు, దిగబడు. విష్ణుపు. 4.215.

కుక్కిదము చూ. కుక్కు.

కుక్కిరి వి. జల్ల.

కుక్కి రూ.చూ. కొక్కి².

కుక్కు రూ.చూ. క్రుక్కు. స.క్రి. 1. కుక్కు, అదుము; 2. పిండు; 3. పేనును చంపేటట్లు గోటితోనొక్కు; 4. దూర్చు, దొప్పించు.

కుక్కిదము రూ. చూ. క్రుక్కిదము. విశే. 1. క్రిక్కిరిసిన, దట్టమైన, సాంద్రమైన. కు.సం. 5. 127; 2. అందమైన. పంచ. 1.244. కుక్కుట వి. మల్లకాస్త్రంలోని పన్నెండుగతుల్లో ఒకటి. కుక్కుటపుదండ వి. మల్లశాస్త్రం లోని పన్నెండు దండల్లో ఒకటి. కుక్కుడు రూ.చూ. క్రుక్కుడు. వి. పీడనం, ఒత్తుడు. కుక్కుపెట్టు స.క్రి. గట్టిగా నొక్కు, ఒత్తు.

కుక్కురుకో రూ. కుక్కురుకోయి, కుక్కురోకో, కుక్కురోకోయి. వి. కోడికూతయొక్కఅనుకరణం. ధ్వన్యను.

కుక్కురుకోయి రూ.చూ. కుక్కురుకో. వి. కోడికూతయొక్క అనుకరణం.

కుక్కురోకో రూ.చూ. కుక్కురుకో. వి. కోడికూతయొక్క అనుకరణం.

కుక్కురోకోయి రూ.చూ. కుక్కురుకో. వి. కోడికూతయొక్క అనుకరణం.

కుంక రూ. కుంకి. వి. 1. విధవ. వేమన. 2.150; 2. బాల విధవ, ముండమోపి; 3. మానకమ్మ; 4. కుక్క; 5. అనద; 6. నిందావాచకంగా ప్రయోగించబడే శబ్దం; 7. అల్పార్థకం.

పో.చూ.క. కుగ్గు, కుంగు. కుంగిపోవు. నీరసపడు: త. కుంగు. తగ్గు.

కుంకముండ వి. చిన్నతనంలోనే మగడుపోయిన స్త్రీ. వేంక. పంచ. 4.44.

కుంకం రూ. కుంకుము. వి. ముఖానికిబొట్టుపెట్టుకోడానికి ఉపయోగించే పసుపుతో చేసినపొడి, మున్నణం.

సం. కుంకుమ-. ఎర్రటిద్రవ్యవిశేషం.

క. కుంకుమ; త. కుంకుమం.

<నం. కుంకుమ-.

**కుంకటి** రూ.చూ. కూఁకటి. వి. జుట్టు, పిల్లజుట్టు. విణ. ప్రధానమైన.

**కుంకటిమూఁగ** రూ.చూ. కూఁకటిమూఁగ. వి. 1. కూఁకటిముప్వ; 2. భరద్వాజపక్షి. **కుంకటివేరు** రూ.చూ. కూఁకటివేరు. వి. ప్రధానమైనవేరు, తల్లివేరు. **కుంకట్లు** వి.బ.వ. ముంగురులు <కుంకటి+లు.

**కుంకట్లు** చూ. కుంకటి.

**కుంకంవామ్నారీచీర** వి. ఒక్కొక్కకొలికి. ఎరుపు, నలుపు, ఎరుపు చొప్పున వరసగా పెట్టి నేసినచీర.

**కుంకి** రూ.చూ. కుంక. వి. 1. విధవ; 2. చిన్నతనంలో మగడుపోయిన స్త్రీ; 3. నిందార్థకశబ్దం.

**కుంకిడి** రూ.చూ. కుంకుడు. వి. ఇంటిఆవరణలో పెంచుకొనే ఉపయోగకరమయిన చెట్టు. కాయలనుండి వచ్చేనురుగు. అభ్యంగనస్నానానికి ప్రశస్తం. (Sapindus detergens or emarginatus).

**కుంకీ** వి. ఒకరకంపావురం.

**కుంకు** రూ.చూ. క్రుంకు. అ.క్రి. అస్తమించు.

**కుంకుడుంగు** వి. కుంగిపోవటం.

**కుంకుచామంతులు** వి.బ.వ. పుష్పవిశేషం.

**కుంకుడి** రూ.చూ. కుంకుడు. వి. సబ్బుకులదులుగా వాడబడే నురుగునిచ్చే కాయలు కాసే చెట్టు. (Sapindus Emarginatus).

**కుంకుడు** రూ. కంకుడు[3], కుంకిడి, కుంకుడి, కూకిడి, కూఁకుడు[1], కొంకిడి[1], కొంకుడు, కొంగుడు. వి. సబ్బుకుబదులుగా వాడబడే నురుగునిచ్చే కాయలుకాసే చెట్టు. ఫేనిలం. ఆము. 4.157. (Sapindus Emarginatus).

క. కుగ్గెలె, కూగెలె, కుంకుడుచెట్టు; పర్జి. కుపీ డొంగ్. హుల్ప అనేపేరుగలచెట్టు.

**కుంకుడుకాయ** వి. తలరుద్దుకోడానికి ఉపయోగపడే ఒకరకంకాయ. **కుంకుడుపండు** వి. ముదిరినకుంకుడుకాయ. ఆము. 4.157. **కుంకుడుఁబురుసు** రూ. కుంకుడుఁబురువు. వి. కుంకుడు కాయలకు పట్టే ఒకానొక ఎఱ్ఱనిపురుగు. **కుంకుడుఁబురువు** రూ.చూ. కుంకుడుబురుగు. వి. కుంకుడు కాయలకుపట్టే ఒకానొక ఎఱ్ఱనిపురుగు.

**కుంకుమకడ్డీచీర** వి. ఎరుపురంగు పట్టెలు పట్టెలు పడేట్టునేసిన చీర.

**కుంకుమపువ్వు** రూ. కుంకుమపూవు. వి. ఒకానొక అంగటి దినుసు, సుగంధద్రవ్యం, కాశ్మీరజన్మం. శృం.నై. 7.11.

**కుంకుమపూలు** వి.బ.వ. ఎఱ్ఱనివన్లు.

**కుంకుమపూవు** రూ.చూ. కుంకుమపువ్వు. వి. కాశ్మీరజన్మం. దశా. 1.14, ఆం.భా. 2.161.

**కుంకుమరేక** వి. ఆభరణవిశేషం.

**కుంకుమ** రూ.చూ. కుంకం. వి. నుదుట పెట్టుకొనే రాగ ద్రవ్య విశేషం.

**కుంకుంపూలు** వి.బ.వ. 1. కుంకుమపూలు; 2. ఎఱ్ఱని పూలు.

**కుంకుంపూలు** చూ. కుంకుమ.

**కుంగు** రూ.చూ. క్రుంగు. అ.క్రి. 1. తగ్గు; 2. వంగు.

**కుచోద్యము** వి. 1. అనూయ; 2. ఎత్తుగడ.

నం. కు-. చెడ్డ; చోద్య-.తోలతగిన, ఆశ్చర్యకరమైన, ఆక్షేపింపతగిన.

<నం. కు-+చోద్య- (అర్థవిపరి.).

**కుచ్చ** వి. బాలికలుఆడే చింతగింజల ఆటలోని ఎనిమిది గింజలు.

**కుచ్చము** వి. నాలుగుపైసలు (వెనుకటినాలుగుపైసలు).

**కుచ్చల** వి. రవిక. శుక 1.85.

నం. కుచేల-. చిరిగినవస్త్రం. అల్పవస్త్రం.

<నం. కుచేల-.

**కుచ్చలమెకము** రూ.చూ. కుచ్చులమెకము. వి. చమరీమృగం.

**కుచ్చలి** రూ. కుచ్చెలి, గుచ్చలి. వి. కోలి,రేగు. హంస. 4.132.

**కుచ్చలిగంత** రూ. కుచ్చెలిగంత. వి. యోగులు, యోగినులు ధరించే బొంత. పరమ. వి. 1.181.

త. కుచ్చరి. పూర్వకాలంలోఉపయోగించే ఒకరకం దుస్తులు.

**కుచ్చలిబొంత** రూ. కుచ్చెలిబొంత. వి. యోగులూ, యోగినులు ధరించేబొంత. యయా. 3.56.

**కుచ్చి**[1] వి. కొచ్చిన్.

**కుచ్చిగుఱ్ఱము** వి. కొచ్చిన్‌నుండి తెచ్చిన గుఱ్ఱం.

**కుచ్చి**[2] వి. చిన్నగుడిసె.

**కుచ్చిటప్పాలు** రూ.చూ. కూచిటప్పాలు. వి.బ.వ. ఊసిపోని కబుర్లు.

**కుచ్చితము** విణ. నీచమయిన, నింద్యమైన. భార.విరా. 1.182; వి. 1. కపటం, ఉ.హరి. 5.301; 2. నీచత్వం. కుత్సితత్వం. వేంక.పంచ. 3.137.

నం. కుత్సిత-. నిందితం, నికృష్టం; ప్రా. కుచ్ఛిత. నిందితం, గర్హితం.

క. కుచ్చిత. నీచమయిన; త. కుచ్చితం. హేయ మయిన, నీచమయిన.

<ప్రా. కుచ్ఛిత-.

**కుచ్చితుఁడు** చూ. కుచ్చితము. వి. 1. కుజనుడు, దుష్టుడు, బసవ. 408; 2. అల్పుడు.

నం. కుత్సిత-.నిందితుడు, నికృష్టుడు; ప్రా. కుచ్ఛిత-.

<ప్రా. కుచ్ఛిత-.

**కుచ్చిపరచు** స.క్రి. పట్టుదారం చిలప కొనలు చేతులతో పట్టుకొని జాడించు.

**కుచ్చిమట్ట** వి. తాటి, కొబ్బరి మొ॥ చెట్ల మట్టలను ఒక వైపున నలగ్గొట్టి తయారు చేసిన కుంచె.

**కుచ్చిరి**[1] వి. గడ్డి మోపుకింద బడ్డీ కట్టి నిర్మించిన కట్టడం.

**కుచ్చిరి**[2] రూ.చూ. కుచ్చె[2]. వి. తాటి, కొబ్బరి మొ॥ చెట్ల మట్టల్ని ఒకవైపు నలగగొట్టి తయారు చేసిన కుంచె.

**కుచ్చిలి** రూ.చూ. కుచ్చె[1]. వి. 1. పింజె; 2. గాగరా, పావడ.

**కుచ్చిలు** రూ.చూ. కుచ్చె[1]. వి. 1. పింజె; 2. గాగరా,

పావడ.

**కుచ్చిళ్లు** రూ. కుచ్చెలు, కుచ్చెళ్లు. వి.బ.వ. బాలక్రీడా విశేషం. గూఢమణి క్రీడ. కళా. 6.202.

**కుచ్చు**[1] వి. 1. పువ్వులు మొ॥వాటి గుత్తు. ఆం. భా. 2.40; 2.స్త్రీలు జడలో అల్లుకొనే భూషణవిశేషం (వి.బ.వ. లోనే ప్రయోగం). వేంక.మాన. 2.130; 3. పట్టు మొ॥ వాటికుచ్చు; 4. కొనచెవిలోఉంచుకొనే భూషావిశేషం (వి.బ.వ. లోనే ప్రయోగం); 5. మరమగ్గంలోని ఒకసొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేపిడి.

నం. కూర్చ-.గుత్తి; ప్రా. కుచ్చ-తృణవిశేషం, గడ్డి పరకలు, గడ్డం; కచ్చయ. గడ్డిచుట్ట; కుచ్చీ. వెల్ల వేసే కుంచె; నే. కుచో. కుంచె, అ. కూఁసి; బెం. కుచి, కుఁచి. చిన్నకుంచె; బీ. కూఁచ్. నేతగాని కుంచె; కూఁచా పారిశుద్ధ్యపు పనివారి చీపురు; హిం. కూఁచ్. సాలెవాని కుంచె; పం. కుచ్చ్, కూచ్. చేనేతగాని కుంచె; కుచ్చా, కూచా, కుచ్చి, కుచ్. కుంచె; మరా. కుఁచ్లీ. సాలెవానికుంచె.

క. కుచ్చు, కొచ్చు. గుత్తు, కుచ్చు, మూట; తు. కుచ్చి. కుచ్చు, స్త్రీలజుట్టు; త. కంచ్చు. కుచ్చు, గుత్తు; కుచెమ్. పూగుత్తి, గుత్తి, కుచ్చు (మాలా) దారపు కుచ్చు; మ. కుచ్చు. కుచ్చు.

< ప్రా. కుచ్చ-.

**కుచ్చుఅడ** వి. వజానేతకోసం మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో నడిమి జల్లినుంచి కిందికి వేలాడే లావుపాటి దారాల మొత్తం. **కుచ్చుఇగ్గు** స.క్రి. నాడె ఆడడానికి మర మగ్గం కుచ్చుగుంజు. **కుచ్చుతాడు** వి. అడ్డతాడు మర మగ్గంలో నాడెను నడపడానికి ఆధారంగా కుచ్చుకట్టిన తాడు. **కుచ్చుతాడువల్ల** వి. మగ్గంకుచ్చుతాడు కట్టడానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యవుల్ల. **కుచ్చుతోఁకమెకము** వి. జల్లిమెకం. **కుచ్చుదండె** వి. మర మగ్గం చట్రంలో మేరువు పలకకు కిందగానిలువు పట్టెలు బిగించిన మధ్య కర్ర. **కుచ్చుదారం** వి. మరమగ్గంలో నాడెను నడపడానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం. **కుచ్చుదారంవుల్ల** వి. మగ్గం కుచ్చుతాడు కట్టడానికి ఆధారంగా చట్రం నిలువు పట్టెకు బిగించిన కొయ్యవుల్ల. **కుచ్చుదొడ్డి** వి. అంచుల్లో డిజైను వడే వజానేతకోసం మగ్గానికి పైన కుచ్చుతాళ్లు వేలాడదియ్యటానికి అమర్చిన ఈనెలచట్రం. **కుచ్చుమగ్గం** వి. మరమగ్గం. ఒకరకం మగ్గం నేతనేసేటప్పుడు పడుగులో పేకదారం వెయ్యటానికి కుచ్చుపట్టుకొని గుంజేది. **కుచ్చుమీను** వి. పెద్ద తోకగల చేప, గండోలం. **కుచ్చులబర్రె** వి. చమరీమృగం. **కుచ్చుల మెకము** రూ. కుచ్చలమెకము, కుచ్చెలమెకము. వి. చమరీ మృగం. **కుచ్చులాగు** స.క్రి. నాడెలాగు, నాడె ఆడడానికి మరమగ్గం కుచ్చుగుంజు. **కుచ్చుసూత్రం** వి. మరమగ్గంలో నాడెను నడపడానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం.

**కుచ్చు**[2] రూ.చూ. గుచ్చు. స.క్రి. ప్రవేశపెట్టు, పొడు.

**కుచ్చు**[3] వి. ఇంటి కప్పుపైనున్న మొనతేలిన భాగం.

**కుచ్చె**[1] రూ. కుచ్చిలి, కుచ్చిలు, కుచ్చెల[1]. వి. 1. పింజె.ఆం. భా. 3.153; 2. కెంపుపని. ఆం. భా. 2.277; 3. గాగరా, పావడ.

త. కుచ్చు-.మడత (స్త్రీలు బట్టలు కట్టుకునేటప్పుడులా); కుచనమ్. భారత స్త్రీలు ధరించే బట్ట మడత, కంచిస్త్రీలు ధరించే బట్టమడత; కుచ్చు-క్-కెంపు. ఉబ్బెత్తుగా ఉన్న ఉపరి భాగమున్న కెంపు.

**కుచ్చెతీయు**[1] స.క్రి. సానపట్టు.

**కుచ్చె**[2] రూ. కుచ్చిరి[2]. వి. తాటి, కొబ్బరి మొ॥ చెట్ల మట్టలను ఒక వైపున నలగ్గొట్టి తయారు చేసిన కుంచె.

**కుచ్చె**[3] రూ.చూ. కుచ్చెల[2]. వి. 1. పిడకల లాంటి వాటిని దాచుకొనే పెద్దబుట్ట; 2. పిడకల గుట్ట; 3. రాశి.

**కుచ్చెతీయు**[2] స.క్రి. పిడకలు మొ॥ వాటిని ఐదేసిచొప్పున పేర్చు. **కుచ్చెపెట్టు** స.క్రి. పిడకలు మొ॥ వాటిని అయిదేసి చొప్పున పేర్చు.

**కుచ్చెల**[1] రూ.చూ. కుచ్చె[1]. వి. 1. కుచ్చె, పింజె. దశా. 8.123; ఉ.రా. 6.161; 2. గాగర, పావడ. హంస. 1.120.

**కుచ్చెల**[2] రూ. కుచ్చె[3]. వి. 1. పిడకలు దొప్ప మొ॥ వాటి పోగు, రాశి. శుక. 2.408; 2. ఎనిమిది గొర్రులకొలది భూపరిమాణ విశేషం.

నం. గుచ్ఛ-.పూలగుత్తి. సమూహం; ప్రా. గుచ్ఛ-గుచ్ఛఅ-గుంచ-గులుచ్ఛ, గులుంచ-గిచ్ఛ; అ.మా. గిచా. నాటిన మొక్కల సమూహం; గుచి. ఇరవై తమల పాకుల కట్ట; పా. గిచ్ఛక; నే. గు(చ్)చ్ఛ. గుత్తి; హిం. గుచీ. వందతమలపాకుల కట్ట; పం. గుచ్ఛా-.పళ్ళ గుత్తి; గుచ్ఛి. మంగలి పొది.

< ప్రా. గుచ్ఛ-.

**కుచ్చెలమెకము** రూ. కుచ్చులమెకము. వి. చమరీమృగం, జడలబర్రె.

**కుచ్చెలి** రూ.చూ. కుచ్చలి. వి. రేగు. ఆం.భా. 2.74.

**కుచ్చెలిగంత** రూ.చూ. కుచ్చలిగంత. వి. యోగులూ, యోగినులు ధరించే బొంత.

**కుచ్చెలిబొంత** రూ.చూ. కుచ్చలిబొంత. వి. యోగులూ, యోగినులు ధరించే బొంత.

**కుచ్చెలు** రూ.చూ. కుచ్చిళ్లు వి.బ.వ. 1. చీరకుచ్చె; 2. బాలక్రీడా విశేషం.

**కుచ్చెళ్లు** రూ చూ. కుచ్చిళ్లు. వి.బ.వ. 1. చీరకుచ్చె (ఆడుదాని) కోక కుచ్చె; 2. బాలక్రీడా విశేషం.

**కుంచ** చూ. కుంచీ. వి. బిడ్డలకు వేసే బైరవానం.

**కుంచం** రూ.చూ. కుంచము. వి. 1. నాలుగు మానికల ప్రమాణం గల కొలపాత్ర; 2. చెరువు తూముల నుంచి నీరు బయటకి వచ్చే రంధ్రాన్ని కావలసినప్పుడు కప్పిపెట్టటానికి ఉపయోగించే బరువయిన కొయ్యమొద్దు; 3. చెరువునుంచి ఇవతలకి నీరువచ్చే తూము; 4. బండి ఇరుసుకు తగిలిఉండి ఆకుల ద్వారా చక్రాన్ని పట్టిఉంచే గుండ్రటి కొయ్యదిమ్మ; 5. ఆకులు వెయ్యటానికి ఇరుసు దూర్చటానికి బండిచక్రం మధ్య ఉన్న గుండ్రటి కొయ్య; 6. గొడ్డలి తూము; 7.

కత్తెర మధ్యలోని ఇనపచుట్ట.

**కుంచంసెగ** వి. పడిశ నివారణకు పట్టే సెగ. **కుంచం కట్టు** వి. కుండకట్టు, బండి కుండకు కట్టిన ఇనపకట్టు.

**కుంచతుండు** వి. కరుదుమొద్దు.

**కుంచబద్దలు** రూ. చూ. కుంచెబద్దలు. వి.బ.వ. 1. కుంచె కట్టు బడిలో పురి బిగింపుకు రెండు పక్కలావేసి కట్టిన వెదురు బద్దలు ; 2. ఉన్నిపడుగు సరిచేసే కుంచెకు రెండుపక్కలా బిగించిన వెదురుబద్దలు.

**కుంచము** రూ. కుంచం, కుంచాము వి. 1. నాలుగు మానికల ప్రమాణంగల కొలతపాత్ర. భార. అను. 5.211 ; 2. బండి చక్రం కుండ.

నం. కుంచి-. ఎనిమిది దోసిళ్ళ కొలత.

త. కుంచమ్-. కొలత.

< నం. కుంచి-.

**కుంచములతోమంచుకొలుచు** స.క్రి. అసాధ్య కార్యాల్ని నిర్వర్తించు.

**కుంచాము** రూ.చూ. కుంచము. వి. 1. నాలుగు మానికలు ప్రమాణం కల కొలత పాత్ర ; 2. బండిచక్రం కుండ.

**కుంచి** రూ.చూ. కుంచె వి. 1. కుచ్చు ; 2. సురటి.

**కుంచికర్ర** రూ.చూ. కుంచెకర్ర. వి. 1. ఈ త్తెతాడు బిర్రు పుట్టే పొడుగుకర్ర ; 2. పడుగు దువ్వే కుంచెకు పక్క భాగంలో కట్టిన పొడుగుకర్ర ; **కుంచికోల** రూ.చూ. కుంచెకోల. వి. 1. తలుపు లోపలి గడియ తీయటానికి ఉపయోగించే వంకర ఇనపకోల ; 2. ఒక విధమైన బాణానంచు ; 3. ఆనుపీటకూ కింద పీటకూ బిగించిన కొయ్యల్లో చివర కొయ్య. **కుంచిగ్గు** రూ.చూ. కుంచె ఇగ్గు. స.క్రి. గంజిలో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వు. **కుంచితోలు** రూ.చూ. కుంచెతోలు. వి. కుంచి చెంపలకు కట్టేతోలు. **కుంచిదండి** రూ.చూ. కుంచెదండి. వి కుంచె చివ్వ దండె కర్ర, కుంచెవెన్ను బిగింపుకు లోపల అమర్చికట్టే వెదురు బొంగు. **కుంచిపరుపు** రూ.చూ. కుంచెపరుపు. వి. 1. పురి అడుగు భాగం ; 2. కుంచె చేసేటప్పుడు పడుగుమీద సమంగా ఆనటం. **కుంచిపిడి** రూ.చూ. కుంచెపిడి. వి. పడుగుదువ్వే కుంచె పట్టుకోటానికి పైన బిగించిన కొయ్య. **కుంచిపురి** రూ. కుంచెపురి. వి. కుంచెకట్టుబడిలో ఒకరకం గడ్డి వేళ్ళతో పొడుగ్గా కట్టిన కుచ్చు. **కుంచిపేము** రూ.చూ. కుంచెపేము. వి. కుంచెకట్టుబడిలో వెన్నుకూ కుంచెపురి మీద పక్క భాగాలకూ అల్లిన మొగలినార. **కుంచిబద్దలు** రూ.చూ. కుంచెబద్దలు. వి.బ.వ. 1. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్దలు ; 2. ఉన్నిపడుగు సరిచేసే కుంచెకు రెండుపక్కలా బిగించిన వెదురు బద్దలు. **కుంచిసెంప(-చెంప)** రూ. కుంచెచెంప. వి. పడుగు దువ్వే కుంచెపక్క భాగం, **కుంచీపు** రూ.చూ. కుంచె వీపు. వి. పిడికి కిందగా ఉండే కుంచె పైభాగం.

**కుంచించుకొను** స.క్రి. ముడుచుకొను.

నం. కుంచ్. ముడుచుకొను.

< నం. కుంచ్ + -ఇంచు$^{3}$ + కొను.

**కుంచివి** చూ. కుంచె. వి. 1. చిత్రాలు వేసే కుంచె ; 2. ఈగలు తోలే కుంచె.

**కుంచియ** రూ.చూ. కుంచె. వి. 1. ఈగలు మొ. వాటిని తోలుకునే సాధనం. ద్వి. హరిశ్చ. ఉ. 1389 పం. ; 2. కుచ్చు ; 3. చిత్రం రాసే తూలిక ; 4. కుచ్చుపెట్టిన వస్త్రం ; 5. సాలెవాడు పడుగు సరిచేసే సాధనం ; 6. గుత్తిగా కట్టిన నెమలిపురి కట్ట ; 7. గోడలు వెల్ల వేయటానికి ఉపయోగించే సాధనం.

**కుంచీ** వి. 1. బాలురు ధరించే కుచ్చున్నటోపి ; 2. ఈగల్ని తోలుకునే చామరం.

నం. కుంచికా. తూలిక, చామరం, కుంచెకోల, కూర్చికా, కుంచు. ప్రా. కుంచియా, కుంచిగా, కొంచిగా ; హిం. కుంచీ ; మరా. కుంచీ. పిల్లలు ధరించే కుచ్చుటోపి.

< మరా. కుంచీ.

**కుంచీపు** చూ. కుంచి.

**కుంచు** రూ. క్రుంచు స.క్రి. 1. వంచు. కవిక 2.101 ; 2. తగ్గించు. నిరంకు. 4.35 ; 3. అపహసించు. రాజవా. 4.90 ; 4. ముణుచు.

క. కుంచు. కుగ్గు, కుంగు, కుగ్గు. వంచు, తగ్గు ; కునుంగు ; వంగు ; కుని. వంగు. వంచు ; కున్, కూను. వంచిన ; త. కుని. వంచు ; కున్గు. తగ్గు ; కులు. చిన్నదగు , మ. కునియక. వంగు, వంచు ; కులు. చిన్నదగు.

**కుంచె** రూ. కుంచి, కుంచియ. వి. 1. గుత్తిగాకట్టిన నెమలిపురి కట్ట. భార. సభా. 2.31 ; 2. కుచ్చు. మను. 4.28 ; 3. చమరీమృగంతోకతో తయారుచేసి ఈగలను తోలుకునే చామరం. పాండు. 2.3 ; 4. కుచ్చిళ్ళుపెట్టినవస్త్రం. విష్ణు. పు.ఉ.5 ; 5. సాలెవాడుపడుగు సరిచేసే సాధనం. హంస. 2.11 ; 6. చిత్రాలు రాసేతూలిక ; 7. గోడకు వెల్లవేయ డానికి ఉపయోగించే సాధనం, మట్ట ; 8. వంచెకొంగు.

క. కుంచ, కుంచిగె. ఒకవిధమైన చామరం ; త. కుంచమ్. చామరం, చమరీమృగంవంటి మృగంయొక్క కుంచెలాంటితోక, ఈగలను తోలుకోడానికి వాడే అందంగా అలంకరింపబడ్డ చామరం.

నం. కుంచికా. తూలిక. చామరం, వెదురుకొమ్మ, కుంచెకోల. కూర్చికా, కూర్చికా, కుంచిఅ ; ప్రా. కుంచియా, కుంచిగా, కొంచిగా. తూలిక ; హి. కుంచీ ; మరా. కుంచీ. పిల్లలు పెట్టుకొనే కుచ్చుటోపి.

< ప్రా. కుంచియా.

**కుంచెఅచ్చు** వి. మొగలినారతోకుంచె బిగించడానికి చేసిన కొయ్యచట్రం. **కుంచెఇగ్గు** రూ. కుంచిగ్గు. స.క్రి. గంజితో తడిపిన పడుగునుచాపి కుంచెతో దువ్వు. **కుంచెఈడ్చు** స.క్రి. గంజితోతడిపి పడుగును చాపి కుంచెతో దువ్వు. **కుంచెఈపు** రూ.చూ. కుంచెవీపు. వి. పిడికి కిందగాఉండే కుంచెపైభాగం. **కుంచెఎన్ను** రూ.చూ. కుంచెవెన్ను. వి. పిడికి కిందగాఉండే కుంచెపైభాగం. **కుంచెకట్ట** వి. కుంచె లాగ కట్టిన చిన్నగడ్డిమోపు. **కుంచెకట్టు** వి. 1. మరాను ఇరుసుపై వేసినకర్రచెక్క , 2. కుంచెకట్టుబడిలో పురికి పైభాగంలో వేసినకట్టు. **కుంచెకట్టువాళ్లు** వి.బ.వ.

నూలు సరిచేసి కుంచె తయారుచేసే ఒక తెగవాళ్లు, ఎరికలవాళ్ళు. కుంచెకట్లఎరికలవాళ్లు వి.బ.వ. నూలునరిచేసే, కుంచెలు తయారుచేసే ఒకతెగవాళ్ళు, ఎరికలవాళ్ళు. కుంచెకట్లవాడు రూ. కుంచెకట్లోడు. వి. పడుగుదువ్వే కుంచెలు తయారుచేసేవాడు, కుంచెరకలవాడు. కుంచెకట్లోడు రూ.చూ. కుంచెకట్లవాడు. వి. పడుగుదువ్వేకుంచెలు చేసే వాడు, కుంచెరకలవాడు. కుంచెకఱ్ఱ రూ. కుంచికఱ్ఱ. వి. 1. ఊత్తైతాడుబిఱ్ఱుపెట్టే పొడుగుకఱ్ఱ ; 2. పడుగుదువ్వే కుంచెకు పక్కభాగంలో కట్టిన పొడుగుకఱ్ఱ. కుంచెకాళంజి వి. తమ్మపడిగం, తమ్మతొట్టి. కుంచెకులోళ్లు వి.బ.వ. నూలు నరిచేసి కుంచెలుచేసే ఒకతెగ ఎరికలవాళ్ళు. కుంచెకోత వి. దొంగతనంగా పొలంలోని పైరుకోసుకొనిపోవటం. కుంచెకోపు వి. పడుగుదువ్వే కుంచెభాగం. కుంచెకోల రూ. కుంచికోల. వి. 1. తలుపులోపల గడియ తీయడానికి ఉపయోగించే వంకర ఇనపకోల. చెన్న బసవ. 3.436. రాజ.వి. 1.24 ; 2. ఒకవిధమయిన బాణాసంబా. ప్రబంధ. 77 ; 3. ఆను పీటకూ కింది పీటకు బిగించిన కొయ్యల్లో చివరికొయ్య. కుంచెగుంజు స.క్రి. గంజితో తడిపిన పడుగుచాపి కుంచెతో దువ్వు. కుంచెగేడి వి. పిడికి కిందగాఉండే కుంచెపైభాగం. కుంచెగొడ్డేలు వి. వరివేళ్ళనరికే గొడ్డలి. కుంచెగోడు వి. పిడికిలి కిందగాఉండే కుంచెపైభాగం. కుంచెచట్టం రూ. కుంచెసట్టం. వి. కుంచెపురి అడుగుభాగం. కుంచెచివ్వు వి. కుంచెపడుగుదువ్వే పనిముట్టు, వెన్నుబిగింపుకు లోపల అమర్చి కట్టినకఱ్ఱ. కుంచెచెంప రూ.చూ. కుంచిసెంప. వి. పడుగుదువ్వే కుంచెపక్కభాగం. కుంచెచేయు స.క్రి. కుంచె వేయు. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతోదువ్వు. కుంచెతట్టు వి. పడుగుదువ్వే కుంచెపక్కభాగం. కుంచెతీయు స.క్రి. గంజితోతడిపిన పడుగును చాపికుంచెతో దువ్వు. కుంచెతోలు రూ. కుంచితోలు. వి. కుంచెచెంపలకు కట్టిన తేకిచేప మొ. వాటితోలు. కుంచెదండి రూ. కుంచిదండి. వి. కుంచెచివ్వుదండె కఱ్ఱకుంచె (పడుగుదువ్వేపనిముట్టు) వెన్నుబిగింపుకు లోపల అమర్చికట్టిన వెదురుబొంగు. కుంచెదరికట్టు వి. కుంచె చెంపకువేసినదారపుకట్టు. కుంచెదువ్వు స.క్రి. గంజితోతడిపిన పడుగునుచాపి కుంచెతో పోగులు దువ్వు. కుంచెన్ను రూ.చూ. కుంచెవెన్ను. వి. పిడికి కిందగాఉండే కుంచెపైభాగం. కుంచెపట్టు స.క్రి. 1. కుంచెవేయు, గంజితో తడిపినపడుగును చాపిన కుంచెతో దువ్వు ; 2. అంబలిపెట్టి ఉన్నిపడుగుమీద కుంచెలాగు ; 3. నేతనేయు. కుంచెపరుపు రూ. కుంచిపరుపు. వి. 1. పురి అడుగుభాగం ; 2. కుంచెనేసేటప్పుడు పడుగుమీద సమంగాఅనటం. కుంచెపిడి రూ. కుంచిపిడి. వి. పడుగు దువ్వే కుంచెపట్టుకోటానికి పైనబిగించిన కొయ్య. కుంచె పిడికిలి వి. పడుగుదువ్వే కుంచెపట్టుకోటానికి బిగించిన కొయ్య. కుంచెపురి రూ.చూ. కుంచిపురి. వి. కుంచెకట్టుబడిలో ఒకరకం గడ్డివేళ్లతో పొడుగ్గా కట్టిన కుచ్చు. కుంచెపుల్లలు వి.బ.వ. కుంచెకట్టడానికి వాడేఒకరకం గడ్డివేళ్ళు. కుంచె పెట్టు రూ. కుంచెపెట్టు. స.క్రి. గంజితో తడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వు. కుంచెపేము రూ. కుంచిపేము. వి. కుంచె కట్టుబడిలో వెన్నుకూ కుంచిపురిమీదిపక్కభాగాలకూ అల్లిన మొగలినార. కుంచెబద్దలు రూ. కుంచబద్దలు, కుంచి బద్దలు. వి.బ.వ. 1. కుంచెకట్టుబడిలో పురిబిగింపుకు రెండు పక్కలా వేసికట్టిన వెదురుబద్దలు ; 2. ఉన్నిపడుగు సరి చేసే కుంచెకు రెండుపక్కలా బిగించిన వెదురుబద్దలు. కుంచెబాడిస వి. కుంచెపురి సమంగానరికే ఇనపపనిముట్టు. కుంచెబుజం వి. పిడికి కిందగాఉండే కుంచెపైభాగం. కుంచె మట్ట వి. తాటి, కొబ్బరి మొదలైన చెట్లమట్టల్ని ఒకవైపు నలగ్గొట్టి తయారుచేసిన కుంచె. కుంచెముల్లు వి. కుంచెపురికి వాడే ఒకరకంగడ్డివేరు. కుంచెమూత వి. పడుగు దువ్వే కుంచె పక్కభాగం చేత్తోపట్టుకోటానికి వీలుగాకట్టే గోనెపట్టా లేదా తేకిచేపతోలు. కుంచెమూల వి. పడుగుదువ్వే కుంచె పైభాగం. కుంచెమేరువ వి. పిడికికిందగా ఉండే కుంచెపై భాగం. కుంచెరికలవాళ్లు రూ. కుంచెరికలోళ్ళు. వి.బ.వ. నూలునరిచేసే కుంచెలుచేసే ఒకతెగఎరికలవాళ్ళు. కుంచెరికలోళ్ళు రూ.చూ. కుంచెరికలవాళ్లు. వి.బ.వ. నూలుసరిచేసి కుంచెలుచేసే ఒకతెగఎరికలవాళ్ళు. కుంచెలకట్లవాళ్లు రూ. కుంచెలకట్లోళ్ళు. వి.బ.వ. కుంచెలు తయారుచేసే ఒకతెగ ఎరకలవాళ్ళు. కుంచెలకట్లోళ్ళు రూ.చూ. కుంచెలకట్లవాళ్లు. వి.బ.వ. కుంచెలతయారుచేసే ఒకతెగఎరికలవాళ్ళు. కుంచెల కొరిచెలవాళ్లు వి.బ.వ. నూలునరిచేసే కుంచెలు తయారుచేసే ఒక తెగఎరికలవాళ్ళు. కుంచెలాగు స.క్రి గంజితోతడిపిన పడుగును చాపి కుంచెతో దువ్వు. కుంచెలుకులోళ్ళు వి.బ.వ. నూలునరిచేసే కుంచెలుచేసే ఒకతెగవాళ్ళు. కుంచె విదుచు స.క్రి. గంజితో తడిపిన పడుగుకు చాపి కుంచెతో తదుపు. కుంచెవిసరు అ.క్రి. తోకజాడించు, ఉల్లాన పడు. కుంచెవీచు అ.క్రి. 1. తోకజాడించు, ఉల్లాసపడు. కుంచెవీపు రూ. కుంచీపు, కుంచెఈపు. వి. పిడికికిందగాఉండే కుంచెపైభాగం. కుంచెవెట్టు (-పెట్టు) రూ.చూ. కుంచెపెట్టు. స.క్రి. గంజితో తడిపిన పడుగును చాపి పడుగుతో దువ్వు. కుంచెవెన్ను రూ. కుంచెఎన్ను, కుంచెన్ను. వి. పిడికిలి కిందగా ఉండే కుంచెపైభాగం. కుంచెసట్టం (-చట్టం) రూ.చూ. కుంచె చట్టం. వి. కుంచెపురిఅడుగుభాగం. కుంచెసారించు అ.క్రి. 1. ఉల్లానపడు ; 2. తోకజాడించు. కుంచెసెంప రూ. కుంచెచెంప. వి. పడుగుదువ్వే కుంచె పక్కభాగం.

కుంజడా రూ. కుంజరి. వి. చిల్లర అంగడివాడు, పచారి దుకాణం వాడు, పళ్ళమ్మేవాడు.

కుంజరి రూ. చూ. కుంజడా. వి. చిల్లరంగడివాడు, పచారి దుకాణంవాడు, పళ్ళమ్మేవాడు.

కుట వి. వర్తకుడు, వ్యాపారి.

కుటాక వి. పక్షివిశేషం. ఆం. భా. 2.98.

త. కుటింకు. పక్షి.

కుటిలపడు అ. క్రి. చెడు.

సం. కుటిల-. వంకరైన, కపటంగల.

< సం. కుటిల- + పడు - (అర్థవిపరి.).

కుటిలపఱచు రూ. చూ. కుటిలపఱుచు. స. క్రి. 1. చెరచు ; 2. నశింపచేయు, పాడుచేయు.

కుటిలపఱుచు రూ. కుటిలపఱచు. స.క్రి. 1. నశింపచేయు.

భాగ. 6.307 ; **2.** చెరచు.
నం. కుటిల -. వక్రమైన.
<నం. కుటిల - + - పఱుచు.

**కుటిలము** వి. జబ్బు.
నం. కుటిల -. వక్రములు.
<నం. కుటిల - (అర్థవివరి.).

**కుటువ** వి. కూడిక, చేరిక.

**కుట్ట**[1] రూ. చూ. గుట్ట[1]. వి. **1.** పర్వతం ; **2.** ఉపలరాశి రాతిగుట్ట ; **3.** రాశి, పోగు.

**కుట్ట**[2] రూ. చూ. కుట్టియ. గుదస్థానం.

**కుట్టడము** చూ. కుట్టు.

**కుట్టారిక** రూ. చూ. కుట్టారుగ. వి. ధాన్య విశేషం, ఆళ్ళు.

**కుట్టారిగ** రూ. చూ. కుట్టారుగ. వి. ధాన్య విశేషం, ఆళ్ళు.

**కుట్టారుగ** రూ. కుట్టారిక, కుట్టారిగ. వి. క్షుద్రకోద్రవం, ధాన్య విశేషం, ఆళ్ళు. ఆము. 4.134.
<కుఱు + అరుగ.

**కుట్టావలు** రూ. కుట్టావాలు. వి.బ.వ. సర్షపవిశేషం, చిన్న ఆవాలు.
<కుఱు + ఆవలు.

**కుట్టావాలు** రూ. చూ. కుట్టావలు. వి.బ.వ. సర్షపవిశేషం చిన్నఆవాలు.

**కుట్టిచూచు** చూ. కుట్టు.

**కుట్టించు** చూ. కుట్టు.

**కుట్టియ** రూ. కుట్ట[2], కుట్టె. వి. గుదస్థానం.
క. కుండె, కుండె. పిరుదు, గుదం, పృష్ఠభాగాలు ; త. కుంటి. పిరుదు, పృష్ఠభాగాలు ; మ. కుంటి. పృష్ఠభాగాలు. గుదం.

**కుట్టు** స. క్రి. **1.** తేనెటీగలు మొ. నవి. కుట్టు. భార. ఆరణ్య. 1.251 ; **2.** అంకురం మొ. వాటిని పొడుచు. కు. సం. 4.107 ; **3.** గుచ్చు. మను. 4.60 ; **4.** ఆకులు మొ. వాటిని కుట్టు. ఆము. 4.35 ; **5.** చెవులు మొ. వాటిని కుట్టు; అ.క్రి. **1.** బాధకలుగు ; **2.** అనూయాగ్రస్తుడగు. వి. **1.** కడుపునొప్పి, బాధ. భార. ద్రోణ. 4.89 ; **2.** కుట్టటం, కుట్టినదారం. ఉ.రా. 6.131 ; **3.** పొయ్యిలో కిక్కిరిసిన బూడిద మొదలగునవి. **4.** కుట్టగా ఏర్పడిన రంధ్రం ; **5.** పగ, ద్వేషం ; **6.** ఇంటికప్పును ఆకు పరచి కుట్టడం ; **7.** కమ్మినేతలో అందానికి పడుగులో దూర్చిన రంగుదారం.
క. కుట్టు. గుచ్చు, పొచ్చు, మలబద్ధకం వల్ల వచ్చిన కడుపునొప్పి; కుటుకు. కుట్టు (చీమలా), కుడుకు. ముక్కుతో పొడుచు ; కొండ. తెలుకొండి ; తు. కుట్టుని. తేనెటీగలాగ కుట్టు ; కుళువిని. కుట్టు ; కొడపుని. కరచు, ముక్కుతో పొడుచు ; త. కుట్టు (-న్-వ్-). రంధ్రంచేయు, కుట్టు, పొడుచు ; కుట్టు(-న్-వ్-). రంధ్రం చేయు, పొడుచు, తవ్వు, కుమ్మరించు (ద్రవంలాగ) ; కుట్టుచి. ఇళ్ళకప్పు వేయటానికి ఉపయోగించే పొడుగు సూది ; మ. కుత్తుక. పొడుచు ; కుత్తు-కొత్తుక. వినరు, బాల్చు ; కొటుక్క. తెలుకొండి ; గోం. కొట్ట్. ఆకులను కలిపికుట్టు ; కోల్. కుట్టు ; కుయి. కుట్-అ. ప్రకోపించు పురికొల్పు ; పర్జి. కుట్ట్. కుట్టు ; కొలా. కుట్ట్. కుట్టు ; కుట్-, కుట్-గ, కుట్ట్. కుట్టు ; ఒల్లా. కుట్. కుట్టు ; కురు. కుడ్. పొడుచు ; మాల్తో. కుడె. సూదితో పొడుచు ; కుడ్. పొడుచు ; బ్రా. ఘట్. పొడుచు ; ఖుల్లంగ్. కుట్టు, పొడుచు.
<మూ. ద్రా. *కుట్.
**కుట్టడము** వి. కుట్టుపని. శుక. 1.200. **కుట్టిచూచు** స.క్రి. చీల్చి చూచు. **కుట్టించు** స. క్రి. కుట్టచేయు, కుట్లేట్లుచేయు. < కుట్టు + -. ఇంచు[3] **కుట్టుకాఁడ** వి. కుట్టుపోగు. **కుట్టుగఱ్ఱ** (-కఱ్ఱ) వి. కాలుతున్న బట్టీ పొయ్యిలోని ఊకను లాగటానికి వాడేకడ్డీ. **కుట్టుచేఁదు** వి. దుర్మార్గుడు. వరాహ. 4.24. **కుట్టుటాకు** వి. విస్తరి, విడిఆకులు కుట్టగా ఏర్పడిన ఆకు. <కుట్టు+ఆకు. **కుట్టుడాకు.** వి. కుట్టిన విస్తరాకు. <కుట్టుడు + ఆకు. **కుట్టుడు.** వి. కుట్టటం. **కుట్టుతీయు** స. క్రి. అంచులో వేరే రంగు దారం, వేరేనాడెతో మలిపి డిజైన్లు పడేట్టునేయు. **కుట్టుతేలు** వి. **1.** క్షుద్రుడు. ఆం. భా. 3.46 ; **2.** కంటకం, ముల్లు. ఆం. భా. 3.46. **కుట్టుదబ్బ** వి. దోనెముందర నేసినగుడ్డ ముడుచుకుపోకుండా, అడ్డంగా పైవైపు బిఱ్ఱుకొట్టే కొయ్య బద్ద. **కుట్టువేత** వి. అంచులో వేరేరంగు పేకదారాలు పెట్టి డిజైన్లు (పువ్వులు, ఆకులు, మొగ్గలు మొ. నవి) పడేట్టునేసిన నేత. **కుట్టుపేటు** వి. కుప్పడం నేత, అంచులో వేరే రంగు పేక దారాలు పెట్టి డిజైన్లు పడేట్టునేసే నేత. **కుట్టుపేడు** వి. మర్మాన్ని వెలిపుచ్చే శత్రువు. **కుట్టుపేళ్ళు** వి.బ.వ. కుట్టేపేళ్ళు, ముళ్ళు. **కుట్టుపొడుచు** స. క్రి. ఆము పొయ్యిని కర్రతో కదిలించు. **కుట్టుపోగులు** వి.బ.వ. చెవులకు పెట్టుకొనే ఉంగరం లాంటి రింగులు. **కుట్టుపోయు** స. క్రి. కుట్టు. **కుట్టుబద్ద** వి. పూరింటి ఆకు కప్పును కుట్టడానికి వాడే రంధ్రం గల వెదురుబద్ద. **కుట్టుముల్లు.** వి. నేతనేసేటప్పుడు గుడ్డను బిఱ్ఱుపెట్టటానికి అంచు చివర గుచ్చే సన్నటి లోహపు ముక్క. **కుట్టుసూల** వి. శూలరోగం.

**కుట్టుసురు** చూ. కుఱు.

**కుట్టూపిరి** చూ. కుఱు.

**కుట్టూదపు** చూ. కుఱు.

**కుట్టూర్పు** చూ. కుఱు.

**కుట్టె** రూ.చూ. కుట్టియ. వి. గుదస్థానం.

**కుట్ర** విశే. **1.** భయంకరమయిన. కాశీ. 3.65 ; **2.** అల్పమైన. విజయ. 2.46 ; వి. **1.** మాయపన్నుగడ, ద్రోహబుద్ధితో చేసేపన్నాగం ; **2.** మోసం.
క. కుట్టు. లోపం, తప్పు, బాధ, కష్టం.

**కుట్రపువాఁడు** వి. కుట్టుపని చేసేవాడు, దర్జీ, సౌచికుడు.

**కుడ** రూ. కుడు. వి. దీపస్తంభం.

**కుడక** రూ.చూ. గుడక. వి. **1.** కొబ్బరి కురిడీ ; **2.** గంధం మొ॥ ఉంచుకొనే చిన్నపాత్ర ; **3.** కొబ్బరి మొ॥ వాటి. చిప్ప.

**కుడకము** వి. శకటభేదం.

**కుడకె** రూ.చూ. కుడుక. వి. **1.** గంధంగిన్నె ; **2.** కొబ్బరి గుజ్జు ; **3.** తక్కెడ, సిబ్బి.

**కుడతా** రూ. కుడితిసీ. వి. పొక్క.

హిం.ఉ. కుర్తా.

<హిం. కుర్తా.

**కుడపొయ్యి** రూ.చూ. కొడిపొయి. వి. పెదపొయ్యి.

**కుడలు** వి.బ.వ పాత్రలు.

**కుడనము** రూ.చూ. కుప్పనము. వి. **1.** పాము కూనం. రం రా.యు. 3.84 ; **2.** రవిక. కాశీ. 7.40.

**కుడి** విణ. వలపల, ఎడమకాని. ఉ. హరి. 1.119 ; వి. **1.** ఆహారపదార్థం, కుడుపు. నార. పంచ. 4.100 ; **2.** కుడి భాగం మను. 4.9.

క. కుడి. తాగు ; త. కుఙ్. ఆహారం ; కుటి (-ట్ -; -ప్ప-). కప్పులో నుండి తాగునట్లు తాగు- (కుంటుప) ; కుఙ్ఞు-కె-కై. కుడిచేయి (ఆహారం తీను కొనేటప్పుడు ఉపయోగించినట్లు ఉపయోగించు) ; మ. కుటి. తాగటం, భోజనం తరువాత నీరుతాగు ; కొం. యుణ్-. తిను ; యుణికి. కుడిచేయి.

**కుడిఅని** వి. అచ్చులో కుడివైపు పోగులు. **కుడికొప్పు** వి. ధనికులైన స్త్రీలు కుడిపక్కగా పెట్టుకునే కొప్పు. **కుడికొమ్మ** వి. కుడికాలితో పావ చెక్కతొక్కి కుడిఅనిలోకి కుడిచేత్తో ఎడమవైపుకు విసిరిన నాడె. **కుడికోల** వి. అనుపోసిన పడుగులో చివరి అని పద్ద భాగం. **కుడితల కొమ్ము** వి. బుడతలకొయ్య మగ్గంమీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడంపక్కనే నేలలో పాతిన కొయ్య గూటం. **కుడితలమాను** వి. మగ్గంమీద నేతబట్టకు చుట్టే కొయ్య (దోనె)కు ఆధారంగా ఎడంపక్కన నేలలో పాతిన కొయ్య గూటం. **కుడితివికొయ్య** వి. మగ్గంమీద నేతబిర్రు పెట్టటానికి మోకుకట్టేకొయ్య. **కుడిదూలం** వి. మూల గజ్జల కింద భాగాన్ని కదొత్తులతో కలిపే అడ్డదూలం. **కుడినీరు** వి. తాగవలసిన నీరు, పానీయం. దశా. 7.278. **కుడిపలక** వి. మగ్గం పలకకు జానెడు ఇవతలవరకూ నేసిన నేత. **కుడిప్రక్క** వి. **1.** దక్షిణం, వలపంక ; **2.** కడుపు **కుడిబుజము** వి. ముఖ్యమయిన అండ <కుడి + సం. భుజ - **కుడిముక్క** వి. గుజ్జులమీద బిగించే అర్ధకర్ర. **కుడిముట్టు** వి. భోజనపాత్ర, కంచం. కు. సం. 7.39. **కుడియడుగు వరువడి** వి. పన్నెండు వరవళ్ళల్లో ఒకటి, పధ్నాల్గు విన రుల్లో ఒకటి. ప్రబంధ. 78 ; హంస. 1.206. **కుడియొర భృంగి** రూ. కుడివారభృంగి. వి. పన్నెండు దండల్లో ఒకటి. ప్రబంధ. 78. **కుడివాటు** వి. కుడిచేత్తో కుచ్చుపట్టుకొని నేత నేయడం. **కుడివాదాడి** వి. మగ్గం చట్రం కింద కుడివైపు పల్లపు చోటు. **కుడివాయి** వి. మగ్గానికి బిగించిన అచ్చు కర్రల్లో ముందుది. **కుడివారదండ** వి. పన్నెండు దండల్లో ఒకటి. **కుడివారభృంగి** రూ.చూ. కుడియొరభృంగి, పన్నెండు దండల్లో ఒకటి. **కుడివారము** వి. మేలుదారం, పంటలో భాగం.

**కుడిచికూర్చుండు** చూ. కుడుచు.

**కుడితి** వి. **1.** బియ్యం మొ॥ వాటి కడుగునీరు. చంద్రరే. 1.92, అం. బా. 2.250 ; **2.** రంగులు కలుపుకునే గోలెం.

**కుడితిగూనె** రూ. కుడ్తి గూన. వి. **1.** నూలు కండెలు వేసుకొనే ఒకరకం మట్టిపాత్ర ; **2.** పశువులకు నీళ్ళు, కడుగు మొ॥ వాటిని నిలవ ఉంచే గూన.

**కుడితిసీ** రూ.చూ. కుడతా. వి. చిన్నచొక్కా.

**కుడిదల (-తల)** వి. జీవనం, భూమి.

**కుడినం** వి. కట్టుబడిలో పనికిరాని రాతిముక్క.

**కుడిపి** వి. కురూపి, అంగవికలుడు. భీమ. 5.22.

సం. కురూపిన్-.అందంలేనివాడు ; ప్రా. కురువి, కురూవి-.

క. కురూపు ; త. కుఙ్ఞమ్.

<ప్రా. కురువి-.

**కుడిపించు** చూ. కుడుచు.

**కుడిపినవారు** చూ. కుడుచు.

**కుడిమిగా(డు (-కా(డు)** రూ. కుడిమివా(డు. వి. పాములవాడు ; **2.** విష వైద్యుడు.

త. కుటుమి. పాములవాడు, పాముకాటుకు మం దిచ్చేవాడు.

**కుడిమివా(డు** రూ.చూ. కుడిమిగా(డు. వి. **1.** పాములవాడు ; **2.** విషవైద్యుడు.

**కుడు**. రూ.చూ. కుడ. వి. దీపస్తంభం.

**కుడుక** రూ. కుడకె. వి. **1.** పాత్ర. బసవ. 6.120 ; **2.** తక్కెడ తట్ట, తక్కెడ సిబ్బి. శేష. 2.76 ; **3.** మట్టిముద్ద.

క. కొడ. మట్టిపాత్ర, కుండ ; కుడికె. చిన్నమట్టి పాత్ర, లోహం లేదా కర్రతో చేసిన పాత్ర. కొడ. కుడికె. వంటచేసుకొనే పాత్ర ; తు. కుడ్కె, కుడ్కె, గుడ్కె. చిన్నమట్టిపాత్ర ; త. కుటుమ్. నీళ్ళకుండ, చక్రంనడిమి భాగం ; కుటుక్కె. కొబ్బరి లేదా ఏదైనగట్టి పెంకుతో చేసిన పాత్ర ; మ. కుటుమ్. నీళ్ళకుండ ; కుటుక్క. పాత్రగా చేసిన పెంకు ; కో. కొఙమ్. చిన్నమూతి ఉన్న నీళ్ళకుండ ; తొ. కుఙ్ కి. చిన్నకుండ.

పో.చూ. నం. కూటు-. నీళ్ళకుండ.

**కుడుకవగోలు** వి. కుట్ర. టక్కు.

**కుడుకిలు** స.క్రి. ముడుచుకొను.

**కుడుక్క** వి. పన్నెండు అనద్ధ వాద్యాల్లో ఒకటి.

**కుడుచు** రూ. కుడ్చు. స.క్రి. **1.** తిను, భుజించు. భార. ఆది. 6.292 ; **2.** సుఖ దుఃఖాదుల్ని అనుభవించు, పొందు, చెందు. భార. విరా. 3.90 ; భార. అను. 5.116 ; **3.** తాగు, పానంచేయు. ద్వి. సార. చ. 2.97. పు. 16 పం.

క. కుడి. తాగు ; కొడ. కుడి ; తు. కుడ్పుని. ఎక్కు వగా తాగు, మింగు ; త. కుటి (-ట్-ప్ప-). కప్పులో తాగు ; మ. కుటిక్క. తాగు, మింగు ; కోట. కుడి. (కుడ్చ్) తాగు ; తొ. కుడ్తె. తాగు ; కువి. గోహ. పీల్చు.

<మూ.ద్రా. *కుట్.

**కుడిచికూర్చుండు** అ.క్రి. సోమరిగాఉండు. భీమ. 4.58.

**కుడిపించు** కుడుచుయొక్క హేత్వర్థకం ; స.క్రి. తినిపించు,

తాగించు. హర. 1.7. కుడిపినవారు వి.బ.వ. అనుభవింప చేసినవారు. **కుడుచుకొను** స.క్రి. 1. (పన్ను గుడిచినట్లు) చప్పరించు ; 2. (పాలు) తాగు. **కుడువవిచ్చు** స.క్రి. 1. కుడిపించు ; 2. విందిచ్చు < కుడుచు + -అ[7] + ఇచ్చు. **కుడువఁబెట్టు** స.క్రి. 1. కుడిపించు ; 2. విందించు. < కుడుచు + -అ[7] + పెట్టు.

**కుడుతుడుకొయ్య** రూ. కుడుతుడుగొయ్య. వి. మగ్గంమీద నేత బట్ట చుట్టేకొయ్య (దోనెకు) ఆధారంగా, ఎడంపక్కన నేలలో పాతిన కొయ్యగూటం.

**కుడుతురుగొయ్య(-కొయ్య)** రూ.చూ. కుడుతుడుకొయ్య. వి. మగ్గంమీద నేతబట్టచుట్టే కొయ్య. దోనెకు ఆధారంగా ఎడం పక్కన నేలలో పాతిన కొయ్యగూటం.

**కుడుంతలుపు** వి. కుసిమీద తిరిగే తలుపు.

**కుడుపరి** చూ. కుడుపు.

**కుడుపు** చూ. కుడుచు. రూ. కుడ్పు. స.క్రి. 1. అనుభవింపచేయు. భార. ద్రోణ. 5.30 ; 2. భోజనం. భార. అను. 2.87 ; 3. భోజన పదార్థం, భుక్తి. విజ్ఞా, ఆదా. 82 ; 4. జీవిక, జీవనోపాయం, జాహ్నవీ. 4.54 ; 5. విందు. హర. 2.74.

**కుడుపరి** వి. కుడిచేవాడు, తినేవాడు. అచ్చ.రా. ఆరణ్య. 114. < కుడుపు + -అరి. **కుడుపుడుగుట** వి. పస్తు, ఉపవాసం. శృం. నై. 7.85. < కుడుపు + ఉడుగుట. **కుడుపుదక్కు (-తక్కు)** అ.క్రి. ఒక్కపొద్దుండు, ఆహారం లేకుండు. భార. అను. 2.87. **కుడుపువెట్టు(-పెట్టు)** స.క్రి. 1. భోజనం పెట్టు ; 2. నైవేద్యం పెట్టు.

**కుడుమాడువట్టి** వి. పంచకప్పుమీద వేసే పట్టి.

**కుడుమాయ** వి. కుండ.

**కుడుము** చూ. కుడుచు. వి. భక్ష్యవిశేషం, తీపి పూర్ణంలోన ఉంచి చేసిన భక్ష్యం. మోదకం. భార. ఉద్యో. 1.312.

క. కుడుబు, కుడుంబు. మోదకం.

**కుడుముదాలుపు (-తాలుపు)** వి. గణపతి. **కుడుమురొట్టె** వి. ఆవిరికుడుం, గుంతపొంగలి. **కుడుములతిండికాఁడు** వి. విఘ్నేశ్వరుడు. ఆం.నా.నం. 1.12.

**కుడువవిచ్చు** చూ. కుడుచు.

**కుడువఁబెట్టు** చూ. కుడుచు.

**కుడ్చు** యా.చూ. కుడుచు. స.క్రి. 1. తాగు, పానంచేయు. కు.నం. 7.131 ; 2. తిను, భుజించు. భార. ఆరణ్య. 5.306.

**కుడ్తి** వి. బేల్దారులూ, వడ్రంగులూ వాడే కొయ్యసుత్తి.

**కుడ్దాం** రూ. గడం, గుడ్డాం. వి. అనుకర్ర, బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ కింద ఎత్తుగా పెట్టినకొయ్య.

**కుడ్పు** రూ.చూ. కుడుపు. స.క్రి. అనుభవింపచేయు ; వి. 1. అనుభవించటం ; 2. భోజనం ; 3. భోజన పదార్థం, భుక్తి ; 4. జీవిక, జీవనోపాయం.

**కుడ్మలలం** వి. ఒకరకం కలుపుమొక్క.

**కుణంబము** వి. కొయ్యతోటకూర.

**కుంట** యా. గుంట, గుంత, గ్రుంత. వి. 1. అల్పతటాకం, నీరు నిలిచేపల్లం, నీటికుంట. పి. శకు. 3.64; 2. చెరువు. వేంక. పంచ. 5.42 ; 3. భూపరిమాణవిశేషం ; 4. అరఎకరం ; 5. పావు ఎకరం ; 6. రేవుదగ్గర నీటికోసం తవ్వినగుంట ; 7. తెలంగాణా, రాయలసీమల్లో చాలచోట్ల $2\frac{1}{2}$ సెంట్లు, కోస్తా జిల్లాల్లో ఎన్నో రకాలుగా ఉంది. $2\frac{1}{2}$ సెంట్లు, $6\frac{1}{4}$ సెంట్లు, ఎకరంలో $\frac{1}{8}$, $\frac{1}{3}$, $\frac{1}{4}$ మొ. ; 8. మాగాణీ పంట లకు, తోటలకు నీళ్లు పెట్టడానికి పొలంలో తవ్విన చిన్న జలాశయం , 9. బట్టీల్లో నిప్పుపెట్టటానికి తెరచిఉంచిన రంధ్రం ; 10. బావి కైవారం కొలత, రెండుగజాల నిడివి ; 11. గ్రామ నామాంత్యపదం. ఉదా. నల్లకుంట మొ.

సం. కుణ్డ-. భూమిలో గుండ్రని కన్నం (నీటికోసం లేదా యజ్ఞం చేయటానికి) గొయ్యి, నూయి, జలాశయం ; ప్రా. కుండ-. జలాశయ విశేషం.

క. కుణ్టె. నీటికుంట, మడుగు, చెరువు ; గుణ్టె, గుణ్డ. లోతు, గుణి. కుణి, గుటి. నీటికుంట ; కొండ, కుండ ; కొడ. కుండి. గొయ్య. తు. కుండ. నీటికుంట, కన్నం, మడుగు ; గుండి. లోతు, లోయ ; త. కుణ్టు. లోతు (మటి) మడుగు, చెరువ (కన్.-అక్) ఎరువు వేసే గొయ్యి, 1089 చ. అడుగుల భూపరిమాణం $= \frac{1}{40}$ ఎకరా ; కుణ్టె. జలాశయం, చిన్నచెరువు ; మ. కుణ్టు. లోతైనది ; కుణ్టమ్. గొయ్యి ; గోం. కుండొ. జలాశయం ; కువి. గుంటొని. గొయ్యి , పర్జి. గుట్టు. జలాశయం.

< ప్రా. కుండ-? ద్రావిడ శబ్దం కావచ్చు.

**కుంటదూలం** రూ.చూ. కుంటదూలము. వి. కడదూలా నికి గోడకు అడ్డంగా ఉండే చిన్నదూలం. **కుంటదూలము** రూ. కుంటదూలం కుంటిదూలం, కుంటినదూలం, కుంటిల దూలం, కుంటెనదూలం, గుంటదూలం, గుంటదూలము. వి. గోడమీదనుంచి దూలంమీదికి వేసే మరో చిన్నదూలం. **కుంటవేల** వి. ఆరుబారల చదరపునేల. **కుంటబావి** వి. కుంటల లెక్కన కొలిచి కట్టిన బావి. **కుంటముక్కు** వి. మత్స్యభేదం. సిం. ద్వా. 1.221. **కుంటసొర** వి. కాయ, పనసకాయ ఆకారంలో ఉండేరకం చేప. **కుంటగల్జెర** యా.చూ. గుంట గలిజేరు. వి. భృంగరాజం, గుంటకలగర.

**కుంటగించు** రూ.చూ. కుంటుగించు. అ.క్రి. ఆగు, నిలుచు.

**కుంటి** రూ.చూ. కుంటు. వి. 1. పాదవికలుడు, పాదరహి తుడు. నరస. 5.179. విణ. అవిటి, వికలమైన.

**కుంటికుడుపు** వి. కుంటివాడు. కాశీ. 5.291. **కుంటికురమ** రూ. కుండికురమ. వి. కాళ్లకువచ్చే కురమ. **కుంటికూపమ్మ** వి. చేతకానివాడు, ఎంబెన్న. **కుంటిగడపరి** వి. అనూరుడు. కాళిందీ. 2.146. **కుంటిగాము** వి. శనిగ్రహం. **కుంటిచింత** వి. దువ్వెనలు చేయటానికుపయోగించే కలప నిచ్చే ఒకచెట్టు (Pleurostyliawightie). **కుంటితనము** వి. పాదరాహిత్యం, కాళ్ళుసరిగాలేకపోవటం. క. కుంటితన, కుంటితనం. **కుంటిది** వి. పంగుస్త్రీ. **కుంటినేరేడు** వి. తెల్లనిపూలు, ఎర్రనిపళ్ళుకాసే తోటల్లో పెంచేఒకచెట్టు (Eugenia bracteata). **కుంటిపుల్ల** చూ. కుంటెన. వి. ఆను పోసేటప్పుడు పోగు సాఫుగారావటానికి దుక్కి గొట్టంలో నిలబెట్టిన పుల్ల. **కుంటిపుల్లదుక్కి** వి. కుంటిపుల్ల కిందిమొద్దు. **కుంటివాఁడు** వి. అవిటివాడు, అవయవ వికలుడు. **కుంటినమర్థన** వి. అందిపొందని సమర్థన. **కుంటి**

సాకు వి. కారణంలేకుండా, హేతువిరుద్ధంగా చెప్పిన కారణం.

**కుంటికత్తియ** రూ. చూ. కుంటెనకత్తియ. వి. కుంటెనకత్తి. తార్పుడు కత్తె.

**కుంటికత్తె** రూ. చూ. కుంటెన కత్తియ. వి. కుంటెనకత్తె, తార్పుడుగత్తె.

**కుంటికొయ్య** రూ. చూ. కుంటెనకొయ్య. వి. అనుపొడుగు పీటకు బిగించిన కొయ్య.

**కుంటిదూలం** రూ. చూ. కుంటదూలము. వి. గోడమీద నుంచి దూలం మీదికి వేసే మరో చిన్నదూలం.

**కుంటిన** వి. చీర అంచుల్లో నూలుపోగులకు అతికిన జరీపోగులు, చీర కట్టుకున్నపుడు పాదాలు మీదికి వచ్చే అంచుకు జరీ పోగులు.

**కుంటివకత్తియ** రూ. చూ. కుంటెనకత్తియ. వి. తార్పుకత్తె.

**కుంటివకత్తె** రూ. చూ. కుంటెనకత్తియ. వి. తార్పుకత్తె.

**కుంటివదూలం** రూ. చూ. కుంటదూలము. వి. గోడమీద నుంచి దూలం మీదికి వేసేమరో చిన్నదూలం.

**కుంటిమూరు** చూ. కుని. వి. చేలో ఒకమూల కోసుగాఉన్న భాగం.

**కుంటిలదూలం** రూ. చూ. కుంటదూలము. వి. గోడమీదనుంచి దూలం మీదికి వేసే మరో చిన్నదూలం.

**కుంటు** రూ. కుంటి. విశే. పాదవికలమైన, పాదరహితమైన. భార. ఆరణ్య. 1.301. కాశీ. 1.121. వి. కుంటితనం. కళత్త్స. 1.60. న. క్రి. 1. కుంఠితమైపోవు. చంద్రాంగ. 4.180 ; 2. పాదవైకల్యంతో వక్రంగానడచు.

క. కుంటు. కుంటు, కుంటితనం ; కూణ్ణు, కుణ్ణు. కుంటివాడు ; కొడ. కుంట్. కుంటగు, కుంటు ; తు. కుంటి. కుంటితనం ; కుణ్ణు. కుంటితనం ; త. కుస్టు (-ఇన్- ; వ్-). గిడసవారిన ; కుట్టియ్. చిన్న ; కుటు. వంగిన, వంపుగల ; కుణ్టై. చిన్న. కుటు. వంగిన, వంపుగల ; కుణ్టై. చిన్న ; కుణక్కు (-ఇన్- ; -వ్-). వంగు ; కుణి. కుంటిది ; కుంటు (-ఇన్- ; వ్-). ఒక కాలితో కుంటు (కంవరా), వంగు ; మ. కుణ్వాన్ (కుణ్వి-). కుంటి ; కోట. కుణ్ట్. (కుట్టి-) కుంటి ; కుణ్టి. కుంటి ; కుణ్టన్. రెండుకాళ్ళు పనికిరానిమనిషి, స్త్రీ ; కుణ్టో కుట్. కుంటితనం ; కుణ్ట్. కొద్దిగా కుంటితనం ఉన్న మనిషి ; తొ. కుట్. కుంటితనం ; గోం. కూటా. కుంటి ; పర్జి. కూటుల్. కుంటి ; కొలా. కుంట్. కుంటు.

పో. చూ. సం. కుణ్ఠ. కుంటు. కుణ్ఠ-. అలసమయిన. ద్రావిడభాషలనుంచి ఈ పదం సంస్కృతంలోకి ప్రతిదేయపదంగా ప్రవేశించి ఉంటుంది.

< మూ. ద. ద్రా. కుణ్-ట్-.

**కుంటుకాల్వ** వి. పొలంలో తవ్విన కుంటనుంచి తీసిన కాల్వ. **కుంటుగించు** రూ. కుంటగించు. అ. క్రి. కుంటు. **కుంటువట్టు** అ. క్రి. 1. జుల్మానావేయు ; 2. వానపట్టు. **కుంటువడు** రూ. చూ. కుంటువడు. అ. క్రి. 1. చెడు, భగ్నమగు. జైమినీ భా. 4.101 ; 2. కుంటగు ; 3. తగ్గు, క్షీణించు ; 4. ఆగు ; 5. సొట్టపడు. **కుంటువఱచు** స. క్రి. చెరచు, పాడుచేయు. వరాహ. 1.30. **కుంటుపిచ్చుక** వి. 1. పాదరహితుడు. పంగువు. పాండు. 5.261 ; 2. అనూరుడు. **కుంటువడు (-వడు)** రూ. కుంటుపడు. అ. క్రి. 1. కుంటగు, నడవలేనిదగు. భార. అను. 4.285 ; 2. తగ్గు, క్షీణించు, కుంఠితమగు. జైమినీ భా. 5•187, రామాభ్యు. 8 ; 3. తెగు, ఖండితమగు. రాఘవ. 4.169 ; 4. ఆగు, నిరోధించబడినదగు. చంపూ రా. 3.25. **కుంటువాఱు (-పాఱు)** అ. క్రి. మొక్కపోవు, బలహీనమగు, నీరసపడు. అచ్చ.రా. బాల. 68. **కుంటువిసురు** స. క్రి. అనుతో కొలతకొయ్యను పోగుచుట్టి వచ్చేట్టు అనుగొట్టం తిప్పు. **కుంట్లు** వి.బ.వ. 1. వంకరలు ; 2. పనికి హాజరుకాని రోజులు.

**కుంటుకొయ్య** రూ. చూ. కుంటెనకొయ్య. వి. అనుపొడుగు పేటకు బిగించిన కొయ్య.

**కుంటెన** వి. 1. తార్పటం, తార్పు, నాయికానాయకుల మధ్య చేసేదూత కృత్యం. కువ. చ. 1.3 ; 2. నాయికా నాయకులను కూర్చేవాడు, కుంటెన వాడు. రాజ. వి. 2 ; 3. నాయికానాయకులను కూర్చేది, కుంటెన కత్తె . 4. దూలం మీద అడ్డంగా పరిచే వాసం.

సం. కుట్టనీ-. కుంటెనకత్తె ; ప్రా. కుట్టణీ ; అప. కుట్టిణీ ;

క. కుట్టణి, కుట్టని, కుంటుణి, కూంటణి. తార్పుడుగత్తె ; కుంటుణిగ. తార్పుడుగాడు ; తు. కుంటుణి గారె. జారుడు ; త. కుంటుప్పణివిడై. సేవ ; మ. కుంటుప్పణి.

< ప్రా. కుట్టణీ.

**కుంటెనకత్తియ** రూ. కుంటికత్తియ, కుంటికత్తె, కుంటినకత్తియ, కుంటినకత్తె, కుంటెనకత్తె. వి. తార్పు కత్తె. ఆం. భా. 2.110. **కుంటెనకత్తె** రూ. చూ. కుంటెనకత్తియ. వి. తార్పుకత్తె. **కుంటెనకాఁడు** వి. తార్పుకాడు. కలు. ౪. 83. **కుంటెనకావితనము** వి. తార్చేస్వభావం. విక్ర. 8.54. **కుంటెనకుచ్చులు** వి.బ.వ. ఈద్పులనే కర్ణభూషా విశేషం. **కుంటెనకొయ్య** రూ. కుంటికొయ్య, కుంటుకొయ్య. వి. కుంటికొయ్య. అనుపొడుగుపీటకు కొయ్య. **కుంటెనతనము** వి. నాయికా నాయకులను తార్చేపని. శృం. నై. 3.66. **కుంటెననడచు** స. క్రి. నాయికానాయకులకు దూత కృత్యంనడుపు. నిరంకు. 3.29. **కుంటెననడపు** స.క్రి. తార్చు. **కుంటెనపని** వి. నాయికానాయకులను తార్చేపని. వైజ. 4.29. **కుంటెనపంపు** స. క్రి. నాయికానాయకులకు దూతకృత్యంనడుపు. కాశీ. 3.100. **కుంటెనపీట** వి. అనుపీటల్లో మధ్యది. **కుంటెనపుచ్చు** రూ. చూ. కుంటెనపుచ్చు స. క్రి. 1. కుంటెనపంపు ; 2. దూతనుపంపు. **కుంటెనపోవు** రూ. చూ. కుంటెనపోవు. అ. క్రి. నాయికానాయకులకు దూతకృత్యంనడపు, కుంటెనగా ప్రవర్తించు. పండి. చ. 4.282. **కుంటెనముడి** వి. తాటాకుల పుస్తకం దారానికి మధ్యఉండే ముడి. **కుంటెనమోకు** వి. జువ్వాయిమోకు. **కుంటెనయంపు** స.క్రి. కుంటెనగాపంపు. **కుంటెనలువహించు** స. క్రి. తార్చు. శుక. 3.109. **కుంటెనవుచ్చు (-పుచ్చు)** రూ. కుంటెనపుచ్చు.

న.క్రి. కుంటెన పంపు. పండి చ. 4.164. 3. కుంటెనపోవు (-పోవు) రూ. కుంటెనపోవు. అ.క్రి. నాయికానాయకులకు దూతకృత్యంనడపు, కుంటెనగా ప్రవర్తించు. పండి. చ. 4.281. కుంటెనీఁడు వి. కుంటెనకాడు. విక్ర. 7.124.

**కుంటెనచెట్టు** వి. కొండమయూరచెట్టు, గట్టిగా ఉండే కర్ర కలిగి, ముదురు ఎరుపు రంగుపూలు, నల్లనిపళ్ళు కాసే ఒక చెట్టు. (Ardesia humilis).

**కుంటెనదూలం** రూ.చూ. కుంటదూలము. వి. గోడమీద నుంచి దూలం మీదికి వేసే మరో చిన్నదూలం.

**కుంటెనీఁడు** చూ. కుంటెన.

**కుంటెండ్లు** రూ.చూ. కుంటేళ్లు. వి.బ.వ. చెవులకు పెట్టుకునే ఒక విధమైన గుండ్రని ఆభరణాలు.

**కుంటెళ్లు** రూ.చూ. కుంటేళ్లు. వి.బ వ. స్త్రీల చెవినగలు.

**కుంటేళ్లు** రూ. కుంటెండ్లు, కుంటెళ్లు. వి.బ.వ. స్త్రీల చెవినగలు. చంద్రరే. 2.20.

త. కుంటలమ్. మగాళ్ళు పెట్టుకునే బంగారు చెవి పోగులు ; కుంట్లు-ల్-కుటుక్కన్. పెద్దచెవిరింగు.

**కుంట్లు** చూ. కుంటు.

**కుండ** వి. 1. ఇరుసును తగిలించే బండి చక్రం నడిమిగుబ్బ. బార. కర్ణ. 3.350 ; 2. మేడలు మొ. వాటి మీదఎత్తే కలశాకారంలోఉన్న అలంకార విశేషం. విక్ర. 4.136 ; 3. మృదాది భాండం, మట్టి మొ. వాటితోచేసిన పాత్ర. వేమన. 1.84 ; 4. వర్తులమైన భాండం. ఆం. భా. 2.246 ; 5. వృత్తియందు పాత్ర మాత్ర పరం ; 6. నూలులడీలు నానబెట్టే మట్టి తొట్టి ; 7. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్య గుండు ; 8. ఇటుకను కాల్చే కట్టడం ; 9. కిటికీ రెక్కలను మూసి ఉంచేగడియ ; 10. స్ఫోటకపుపొక్కు ; 11. పాదు ; 12. పెట్రొమాక్స్ లైట్‌లోని మాంటిల్ (Mantle) నుకట్టే మట్టి ఉపకరణం.

సం. కుణ్డ. కుండ ; ప్రా. కుండీ. కుండియా ; కుమా-కునో. వంటపాత్ర ; ఒ. కుండ. మట్టిపాత్ర ; కుండా. పెద్దమట్టిపాత్ర ; కుండీ. రాతిపాత్ర ; మరా. కుఁడా. తెరచిఉన్న మూతిగల కూజా ; కుఁడీ. చిన్నకూజా.

క. కుండ ; త. కుండమ్.

< సం. కుణ్డ-.

**కుండకట్టు** 1. బండి కుండకు చుట్టూకట్టిన ఇనపరేకు ; 2. మోటబొక్కెనపైన ఉన్న ఇనప కట్టు. **కుండకడువు** వి. బానకడువు, కుండలా గుండ్రంగా ఉండే కడువు. మార్క. 1.224. **కుండకాల్పు** రూ. కుండగాల్పు. వి. నరిగా కాలినఇటిక. **కుండకొయ్య** వి. పట్టుమగ్గం దోనెను ఎడమవైపున మోసేకొయ్య గూటం. **కుండకోతి** వి. మర మగ్గం దోనెమోసేకొయ్య గూటం. **కుండగడుగు** (-కడుగు) న.క్రి. పూర్తిగా శోధించు, పూర్తిగా వ్యయంచేయు. **కుండగాల్పు** (-కాల్పు) రూ.చూ. కుండకాల్పు. వి. నరిగా కాలినఇటిక. **కుండగీఁడు** వి. చుట్టూగుడిసె కొప్పునతగిలించే పగిలిన కుండపైభాగం. **కుండగోఁకరి** వి. వంటవాడు. ద్వి. నల. 2.700. **కుండగోలదాల్పు** వి. సన్యాసి. < కుండ + కోల + తాల్పు. **కుండతలకాయ** వి. మగ్గం మీదనేత బట్టచుట్టేకొయ్య ఆధారంగా ఎడం పక్క నేలలో పాతిన కొయ్య గూటం. **కుండదెబ్బ** వి. కడవలతో కుమ్మరించి నట్టు వానకురిసే నీరు. **కుండపట్టీ** వి. 1. కుండకట్టు, బండి కుండకు చుట్టూ కట్టిన ఇనపరేకు ; 2. మోట బొక్కెనపై ఉన్న ఇనప కట్టు. **కుండపులి** వి. గుంట నక్కల్ని భయ పెట్టడానికి కుండతో చేసిన దిష్టిబొమ్మ. **కుండపెంకు** వి. 1. నరిగా కాలినపెంకు ; 2. పగిలినకుండముక్క. **కుండ పొదుగు** వి. కుండంత పొదుగు. పాండు. 5.244. **కుండపోఁగులు** రూ.చూ. కుండప్రోఁగులు. వి.బ.వ. ఒక విధ మయిన చెవిపోగులు. **కుండపోత** వి. కడవపోత, కుంభవృష్టి, కడవలతో కుమ్మరించి నట్టు వానకురవడం. **కుండ ప్రోఁగులు** రూ. కుండపోఁగులు. వి.బ.వ. ఒకరకమైన చెవి పోగులు. నీలా. 3.49. **కుండబంతి** వి. కందుక క్రీడావిశేషం, రెండు ఎత్తురాళ్ళమీద ఒక కర్రనుంచి దాన్ని బంతితో కొడుతూ ఆడేఆట. **కుండబిరుసు** వి. ఒకరకం బాణానంచు. **కుండబుట్ట** వి. సున్నం, గులక మొ. వాటికొలతకు వాడే బుట్ట. **కుండమట్టు** వి. 1. గుడిసె నడికప్పున తగిలించే పగిలినకుండ అంచు ; 2. కుండ మూతి గల అంచు. **కుండ మదుం** వి. గూన తూము, కుమ్మరివాడు చేసిన మట్టి గొట్టాలతో అమర్చిన చెరువు, తూము. **కుండమార్చు** న.క్రి. ఒకటిచ్చి మరొకటి పుచ్చుకొను. **కుండమార్పు** వి. మార్పు. వినిమయం, ఒకటిచ్చి మరొకటి పుచ్చుకోవడం. నరస. 5.19. **కుండమార్పు పెళ్ళి** వి. ఒక ఇంటికొడుకు కూతుళ్ళకు వేరొక ఇంటికూతురు కొడుకులతో పెళ్ళిచేయడం, ఎదురు బదులు పెళ్ళి. **కుండరాసి** వి. కుంభరాసి. **కుండవర** వి. మట్టితోచేసిన బావివర. **కుండవీనులజోదు** వి. కుంభకర్ణుడు. రావణుని తమ్ముడు. అచ్చ.రా. యుద్ధ. 6.225. **కుండవేఁగు** అ.క్రి. వేరుపడు, వేరే కాపరం పెట్టు. < కుండవేఱు + అగు. **కుండానబ** వి. కుంభతుంబి, గోరక్షతుంబి, ఘటా లాబువు. < కుండ + అనబ. **కుండానుగు** వి. వృక్షవిశేషం. వి. కుండవంటి గుండ్రని కాయలు కాచే అనుగు చెట్టు, గోరక్షతుంబి. < కుండ + అనుగు.

**కుండకము** వి. 1. లోపం, కొరత ; 2. నష్టం, హాని.

క. కుఱు. చిన్నది ; కొరె. లోపం ; కొడ. కొరు, కొరవు. లోపం ; తు. కురు. చిన్న, తక్కువ ; కుద్య, కుడ్య. పొట్టి, చిన్న ; త. కుఱు. చిన్న, పొట్టి, లోపం ; కుఱు. చిన్న, పొట్టి ; కుఱు. కొరత, నష్టం, అవమానం ; కో. కుర్గ్-(కుర్గి-). చిన్నదగు, తక్కువగు ; తొ. కుర్క్ (కుర్క్). చిన్నదగు.

**కుండంగి** రూ.చూ. కొండంగి. వి. కొండముచ్చు, కోతి.

**కుండఁగి** రూ.చూ. కొండంగి. వి. కొండముచ్చు.

**కుండానబ** చూ. కుండ.

**కుండానుగు** చూ. కుండ.

**కుండి**[1] రూ. కుండీ. వి. తులసి కోటలో మొక్కను పాతటానికి ఉంచినజాగా.

సం. కుండీ. గిండి.

**కుండి**[2] రూ.చూ. కుండె[1]. వి. నలుచదరం నూయి.

**కుండికురమ** రూ.చూ. కుంటికురమ. వి. కాళ్ళకువచ్చేకురమ.

**కుండియ** రూ.చూ. కుండె¹. వి. నలుచదరం నూయి.

**కుండి** రూ.చూ. కుండి¹. వి. **1.** నీళ్ళుపోసే పెద్దతొట్టి; **2.** చిన్న మట్టిపాత్ర; **3.** పూలమొక్కలను పెంచేమట్టిపాత్ర; **4.** మధ్యలో నీళ్ళు పోసి గచ్చును గట్టిపరచడానికి మట్టితో కట్టిన తొట్టె; **5.** సున్నం కప్పు కొప్పున చేసినపాదు; **6.** కప్పులో బిగించిన కొక్కెం.

**కుండు** వి. **1.** మొక్కలు వేయడానికి ఉపయోగించే మట్టి పాత్ర. విప్ర. 2.69; **2.** పొడుం మొ. నూరడానికి ఉపయోగించే పాత్ర; **3.** నీరు నిలవ చేసిఉంచటానికి కట్టిన చిన్న కుండం.

క. కుండికె. నూనె, నేయి మొ. ఉంచుకొనే చిన్న మట్టిపాత్ర; త. కుంటు. మధ్యరకం గుండ్రని పాత్ర: మ. కుండమ్. కుండ, గొయ్యి, గుండ్రని పళ్ళెం, చిన్న గుంట; పర్జి. కుండారి. చిన్నమట్టికుండ.

సం. కుణ్డ-. నీళ్ళతొట్టి.

**కుండుగట్టు(-కట్టు)** అ.క్రి. గుండ్రంగా గుంటకట్టు.

**కుండె¹** రూ. కుండి³, కుండియ. వి. నలుచదరం నూయి.

**కుండె²** వి. తంతువు, నూలుపోగు.

**కుండెవల** వి. చేపలవల.

**కుండ్రాయిపొట్టు** వి. మత్స్య విశేషం.

**కుతకుత** వి. ఉడకడం మొ. వాటిలోఅయ్యే ధ్వనికి అనుకరణం.

క. కుతకుత. అనుకరణశబ్దం; కుతకుత. నీళ్లుమరిగినప్పుడైన శబ్దం; కొడ. కొడ్కె. నీళ్లు మొ. మసలు; కొది. పొంగే శబ్దంతో ఉడుకు; తు. కొదిప్పుని, కొదియుని. ఉడుకు; త. కుతుకుతు. వణుకుతో వచ్చిన జ్వరాన్ని తెలుపుతుంది; కుతుంపు. (ఇన్-, ప్-). ఉడుకు, మరుగు; కొతి కొతి. ఉడుకుతున్న అన్నం మొ. పొంగు; మ. కుతకుత (అనుకరణ) ఉరుములాంటి శబ్దం, వేగాన్ని తెలియజేసేది; తొ. కుఱొయ్. మరగటానికి వచ్చే నీరు.

**కుతకుతలాడు** అ.క్రి. **1.** కుతకుతమని ధ్వనించు; **2.** కోపించు; **3.** కళవళపడు.

**కుతగుడు** వి. **1.** దుష్టుడు. బసవ. 6.233; **2.** కృతఘ్నుడు; **3.** చేసిన మేలు మరచినవాడు.

క. కుటుక, కుటుగ, కటుక. కుటిగ, కుట్టిగ. కొట్టే వాడు;

సం. కృతఘ్న-. చేసిన మేలు మరచినవాడు.

<సం. కృతఘ్న-.

**కుతాపి** విశ. కుంటి, అనుకరణ శబ్దం.

**కుతి** వి. **1.** శోకం, దుఃఖం. ఆం.బా. 1.135; **2.** కోరిక; **3.** కన్తి; **4.** కుతిలపాటు.

క. కుదె. బాధ, మనసులో బాధపడు, దుఃఖించు; త. కొతి. బాధ; మ. కొతిక్క. ఉడుకు.

**కుతిగాఉండు** అ.క్రి. ప్రియమైన వస్తువుకోసం లేక మనిషి కోసం తహతహపడు. **కుతిదీరు-(తీరు)** అ.క్రి. **1.** దాహం తీరు; **2.** తృప్తిఅగు.

**కుతిక** రూ.చూ. కుత్తుక. వి. కంఠం, గొంతు. విష్ణుపు. 3.112.

**కుతికంటు** రూ. కుత్తికంటు, కుత్తిగంటు, కుత్తుకంటు. వి. మెడకు అనుకొని ఉండే కంఠహారం, అడ్డిగ, నాగవానం నాడు పెళ్ళికూతురు మెడలో పెట్టే నగ, కవిరా. 2.182. ఆం.బా. 2.148. <కుతిక + అంటు. **కుతికవాపు** రూ. కుతికాపు, కుతికోపు. వి. గొంతువాపు. **కుతికాపు** రూ.చూ. కుతికవాపు. వి. గొంతువాపు. **కుతికోపు** రూ.చూ. కుతికవాపు. వి. గొంతువాపు.

**కుతికలపాటు** వి. విచారం, బాధ.

**కుతికాపు** చూ. కుతిక.

**కుతికినపడు¹** చూ. కుతిక. అ.క్రి. గొంతులో అడ్డుపడు.

**కుతికిలఁబడు** చూ. కుతికిలు.

**కుతికిలు** రూ.చూ. కుదికిలు. అ.క్రి. కుంగబడు, కూలబడు.

**కుతికిలఁబడు** రూ. కుదికిలఁబడు. అ.క్రి. కుంగబడు, కూలబడు. పల్నా. 251, మను. 4.27.

**కుతికె** రూ.చూ. కుత్తుక. వి. గొంతు.

**కుతికెనవేసికొను** చూ. కుత్తుక. స.క్రి. ఇష్టం లేకపోయినా సహించు.

**కుతికేట** వి. కాడిని, పోటుకర్రను కలిపి కట్టేతాడు.

**కుతికోపు** చూ. కుతిక.

**కుతినీ** రూ. కుత్తిని, ఖుతినీ. వి. ఒకవిధమైన పట్టుబట్ట. రసిక. 3.141.

హిం. ఉ. ఖుత్‌నీ. పట్టుబట్ట.

<ఉ. ఖుత్‌నీ.

**కుతిల** రూ. కుతిలము, కుదిల. వి. బాధ, దుఃఖం. హరిశ్చ. 4.191.

క. కుదె. ఉడుకు, మరుగు, కాగు, మనసు బాగుండక బాధపడు, బాధ; కుదిగె. ఉడకడం మొ. బాధ, పొంగులుగా లేపటం; త. కొతి. బాధ దుఃఖం; మ. కుతిక్క. ఉడుకు.

**కుతిలకుడుచు** రూ. కుతిలగుడుచు. అ.క్రి. బాధపడు, దుఃఖపడు. పద్మ. 3.21. **కుతిలగుడుచు(-కుడుచు)** రూ.చూ. కుతిలకుడుచు. అ.క్రి. బాధపడు. **కుతిలగొను(-కొను)** అ.క్రి. బాధపడు, దుఃఖపడు. భాగ. 9.523. **కుతిలపడు** రూ.చూ. కుదిలపడు. అ.క్రి. బాధపడు, దుఃఖపడు. భార. అను. 2.340. **కుతిలపఱుచు** రూ. కుదిలపఱచు, కుదిలపఱుచు. స.క్రి. బాధపడేట్టుచేయు, బాధించు. హరి. ఉ. 9.77. **కుతిలపాటు** వి. బాధ. యయా. 1.23. **కుతిలపెట్టు** రూ. కుతిలవెట్టు. స.క్రి. పీడించు, బాధపెట్టు. భార. శాంతి. 2.89. **కుతిలవెట్టు (-పెట్టు)** రూ.చూ. కుతిలపెట్టు. స.క్రి. పీడించు, బాధపెట్టు యయా. 3.93.

**కుతిలము** రూ.చూ. కుతిల. వి. బాధ, దుఃఖం. ప్రబోధ. 5.5.

**కుతుక** రూ.చూ. కుత్తుక. వి. కంఠం. రాజ. వి. 3.190.

**కుతుబు** వి. ప్రశంస, పొగడ్త.

హిం. ఉ. కుతుబ్. పుస్తకాలు.

<ఉ. కుతుబ్.

**కుతుంబిర** రూ.చూ. కొత్తిమెర. వి. కొత్తిమెర.

**కుతెకపొట్ట** వి. చిరిపొట్ట, ఏర్పడుతున్న ఎన్ను.

**కుతేర** క్రి.విశ. ధ్రు. కుత్తుకబంటిగ.

**కుత్ర¹** వి. డాబీకోలలను లేపడానికి దిండువక్రాన్ని కొన్నిచోట్ల దిండుగాడిని గుంజే ఇనపరేకు.

హిం. కత్తా. కత్తి.

<హిం. కత్తా.

**కుత్త**[2] వి. పృష్ఠ భాగానికి వాడే పదం.

**కుత్తతాడు** వి. డాలీచక్రాన్ని గుంజెరేకుకు వేలాడ తీసినదారం.

**కుత్తలి** రూ.చూ. కుత్తెలి. వి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపుతీత పనిముట్టు.

**కుత్తిక** రూ.చూ. కుత్తుక. వి. కంఠం. చంద్రాంగ. 2.88.

**కుత్తికంటు** రూ.చూ. కుతికంటు. వి. నాగవల్లినాడు పెళ్ళికూతురి మెడకు కట్టే ఆభరణ విశేషం.

**కుత్తికాలు** వి. మరమగ్గం చట్రం నిలబెట్టడానికి ఆధారంగా నేత బయలులో పాతిన కొయ్యరాట.

**కుత్తిగంటు** రూ.చూ. కుతికంటు. వి. కంఠానికి బిగిసికట్టిన పట్టెడ నగ, పట్టెడ.

**కుత్తివి** రూ.చూ. కుతినీ. వి. ఒకరకం పట్టుబట్ట. సానంద. 1.18.

**కుత్తు**[1] రూ.చూ. కుత్తుక. వి. గొంతు, గొంతుక.

**కుత్తు**[2] స.క్రి. ఒకదానిపై ఒకటి క్రమంలో నిలుపు. అ.క్రి. కప్పు వేయు.

**కుత్తుక** రూ. కుతిక, కుతికె, కుతుక, కుత్తిక, కుత్తు[1], కుత్తుకము. వి. కంఠం. భార. ఆది. 6.196, భార. భీష్మ. 2.364.

క. కుత్తిగె. గొంతు ; త. కురల్. గొంతు, శ్వాసనాళం, (కుఱున్) కురల్‌వళై. గొంతుముడి, గొంతు ; కుటల్. నాళం, ఒకరకమైన గొంతు ; గదబ. క్రొడొంగ్. కంఠం ; బ్రా. గుట్. కంఠం.

**కుత్తుకంటు** రూ.చూ. కుతికంటు. వి. నాగవల్లినాడు పెళ్ళికుమార్తెకు మెడనుకట్టేఆభరణ విశేషం. రాజవి. 1.62. **కుత్తుక(గందువా(డు (-కందువా(డు)** వి. నీలకంఠుడు. శివుడు. **కుత్తుకబంటి** వి. కంఠదఘ్నం, గొంతువరకుమున గటం.

**కుత్తుకము** రూ చూ. కుత్తుక. వి. కంఠం. శ్రీరం. మా. 10-20.

**కుత్తెకపడు(-పడు)** అ.క్రి. పారిపోవు.

**కుత్తెము** వి. ఇరుకు, బిగుతు, తొక్కిడి.

**కుత్తెలి** రూ. కుత్తలి. వి. కొయ్యముక్కకు ఇనపచువ్వ అమర్చిన కలుపు తీయడానికి ఉపయోగించే పనిముట్టు.

**కుదప** రూ. కుదెప, గుతప. వి. 1. రొంపిదుక్కి ; 2. కంటిలో ఒకకొలికిలో ఏర్పడిన దుర్మాంసం ; 3. బడితె, పెనరకంది, అనుము మొ॥ వాటి కుప్పలుకొట్టి గింజలు రాల్చటానికి ఉపయోగించే దుడ్డుకర్ర ; 4. దండెను మోసే పంగల కొయ్య, లేక రాయి.

**కుదపగట్టు (-కట్టు)** అ.క్రి. కండ్లలో కాయకాచు. **కుదప చేయు** స.క్రి. దమ్ముచేయు, రొంపిదుక్కిచేయు.

**కుదరవేయు** అ.క్రి. పొలంలో పశువులను మందగాతోలి విశ్రాంతినిచ్చు ; స.క్రి. సమ్మతింపచేయు.

**కుదలు** రూ.చూ. కుదులు. అ.క్రి. కదలు, చలించు.

**కుదవ**[1] రూ.చూ. కుదువ[1]. వి. తాకట్టు.

**కుదవ**[2] రూ చూ. కుదువ[2]. వి. పశువుల మేతగడ్డికోసం ప్రత్యేకించిన పొలం.

**కుదికిల(బడు** చూ. కుదికిలు.

**కుదికిలు** రూ. కుతికిలు. అ.క్రి. పిర్రలు నేలను ఆనేటట్లు కూలబడు. ఉ.హరి. 3.64.

**కుదికిల(బడు** రూ.చూ. కుతికిల(బడు. అ.క్రి. చదికిలపడు, పిర్రలునేలమీదఆనేట్లు కూర్చొను. పండి.చ. 2.93.

**కుదిచ్చు** రూ.చూ. కుదియించు. స.క్రి. 1. తగ్గించు, కుదించు ; 2. సరిగాపట్టేట్టు ఇటు, అటూకదిలించు.

**కుదించు** రూ.చూ. కుదియించు. స.క్రి. 1. అణచు. జైమినీ. భా. 8.73 ; 2. బిగించు, బిగబట్టు. ప్రభా. 2.37 ; 3. తగ్గించు ; 4. ముడుచు ; 5. దుఃఖపెట్టు.

**కుదియ(గ(బట్టు** చూ. కుదియు.

**కుదియ(బట్టు** చూ. కుదియు.

**కుదియ(బడు** చూ. కుదియు.

**కుదియ(బెట్టు** చూ. కుదియు.

**కుదియించు** చూ. కుదియు.

**కుదియు** అ.క్రి. 1. ఆగిపోవు, ఉపశమిల్లు. భార.విరా. 2.47 ; 2. వ్యర్థమగు, పనికిమాలినదగు. భార.అను. 1.258 ; 3. కుంగు, దిగబడు. భార. అశ్వ. 3.72 , 4. తగ్గు. రం.రా. కిష్కిం. 219 పు. 29 పం. ; 5. చెడు, పాడగు. హర. 6.45. ; 6. వెనుదీయు. జంకు. ద్వి.హరిశ్చ. ఉ. 1128 ; 7. నశించు, పోవు. ద్వి. హరిశ్చ. ఉ. 2080 ; 8. సంకుచితమగు. రం.రా.బాల. 33. పు. 28 పం. ; 9. కుందు, దుఃఖించు. కకుత్స. 3 116.

క. కొరె. కోయు ; కుసి. వంగు (బరువుతో వంగు) మునుగు, ఇచ్చివేయు, దొర్లు ; కుడి. బిగుతగు ; తు. కుదుపుని. పెరుకు, కోయు ; కుసియుని. కుసుపుని. ముడుచుకొనిపోవు, ముకుళించుకొని పోవు ; కుస్కుని, కుసురుని. ముడుచుకొనిపోవు. భయపడు ; త. కుఱై (-ట్ప్-ప్ప్-) వింటినారిని గంటుకు అమర్చు. కుఱై ; (-ట్-వ్-) చెదరు, పొడగు (క్) కుఱు. పెరుకు ; కుఱై. కోయు ; మ. కుటుమ్. బిగుతు ; కుటెక్క. గంటు పెట్టు ; పర్జి. కుడ్-, కుట్ట్. కోయు.

**కుదియ(గ(బట్టు(-పట్టు)** స.క్రి. బిగియబట్టు. భాగ. 10 ఉ. 1226. **కుదియ(గ(బట్టు(-పట్టు)** స.క్రి. బిగియబట్టు. ఆము. 4.35. **కుదియ(బడు** అ.క్రి. దిగబడు, కూలబడు. దశా. 2.139. **కుదియ(బెట్టు** అ.క్రి. కుంగచేయు, కూల్చు. అచ్చ.రా. యు. 4.74. **కుదియించు** రూ. కుదిచ్చు, కుదించు. స.క్రి. 1. అదుము, నొక్కు. భార. విరా. 2.310 ; 2. అర్థగించు, ఆపు, భార. ఉద్యో. 4.314 ; 3. అణచు. భార. భీష్మ. 3.130 ; 4. తగ్గించు. భార. ద్రోణ. 5-314 ; 5. నియమించు, లొంగచేయు, వశపరచు. భార. అను. 4.208 ; 6. మరలించు, తిప్పు. మార్క. 7.204 ; 7. బిగించు, బిగబట్టు. యయా. 1.10 ; 8. దుఃఖపెట్టు. ద్వి.హరిశ్చ. ఉ. 1029 పం. క. కుదురు. స్థిరపడు, పొందు, నిశ్చలంగాఉండు.

**కుదిర** వి. గుర్రం. కవిస. 1. ఆ.

క. కుదిరె, కుదురె, కుదరె, గుర్రం , కొడ. కుదిరె; తు. కుదురె, కుదె ; త. కుతిరై. ; మ. కుతిర; కోట. కుద్రె; కొండ. గుఱ్ఱమ్. ; కువి. గూరుమి. మగ

గుర్రం ; గులామి. ఆరగుర్రం ; పర్జి. గుర్రొల్. ; గుర్రం ; కొలా. గుర్రమ్. ; నా. ఘుర్రమ్. పో.చూ. సం. కుదర-. గుర్రం.

<క. కుదిరె.

మూ.ద్రా. *కుతిర్.

**కుదిరిక** చూ. కుదురు.

**కుదిరిచ్చు** చూ. కుదురు.

**కుదిరించు** చూ. కుదురు.

**కుదిర్తి** రూ. కుద్దురత్. వి. అధికారం.

హిం. ఉ. కుద్రత్. శక్తి, ప్రభుత్వం.

<ఉ. కుద్రత్.

**కుదిల** రూ.చూ. కుతిల. వి. బాధ.

**కుదిలపడు** రూ. కుతిలపడు. అ.క్రి. దుఃఖించు, బాధపడు. **కుదిలపఱచు** రూ.చూ. కుతిలపఱుచు. స.క్రి. బాధపెట్టు. పరమ. వి. 5.48. **కుదిలపఱుచు** రూ.చూ. కుతిలపఱుచు. స.క్రి. బాధపెట్టు. రసిక. 6.34.

**కుదిలిక** చూ. కుదులు.

**కుదిలించు** చూ. కుదులు.

**కుదివడు** (-పడు) అ.క్రి. 1. కదలు ; 2. వణకు ; 3. అదరు.

**కుదీలు** రూ. కుదెలు, కుదేలు. వి. కాకితాలఆట (పేకాట) లో అయిదు పట్లుపడతానని చేసే ప్రతిజ్ఞ.

పో. కొదేల్యు, కొదేలి. పేకాటలోని పరిభాషాపదం. ఓంబ్రి అనే ఆటలో ఆటగానికి ప్రతికూలంగా గెలుపు కలగడం.

<పో. కొడీలి.

**కుదుకవగోలు** వి. మోసం. ద్వి. హరిశ్చ. ఉ. 1327.

**కుదుకవగోలుగైకొను** (-కైకొను) అ.క్రి. మోసంచేయు. ద్వి.హరిశ్చ. ఉ. 1286.

**కుదుచు** స.క్రి. 1. అణచు, పోగొట్టు. భాస్క.రా. ఆరణ్య. 1.76 ; 2. బంధించు. దశకు. 3.112 ; 3. బిగపట్టు, నొక్కు.

క. కుదె. నంకెల ; గుత్త్. దగ్గర, బిగుతు ; పో.చూ. త. కుతై. ఉంగరంలా చుట్టుకొని ఉండే దారం మడత, జారుముడి, చేతికడియపు కొక్కెం ; మ. కుతమ్. బిగుతు, సాగేగుణంకలది.

**కుదుచుకొను** అ.క్రి. విలవిల కొట్టుకొను, తన్నుకొను. పద్మ. 9.193.

**కుదుటపడు** చూ. కుదురు.

**కుదుటఁబడు** చూ. కుదురు.

**కుదుప**[1] వి. వంచన, మోసం. నిర్వ.రా. 7.84.

**కుదుప**[2] వి. పెరుగుముద్ద. బహులా. 3.57 ; 2. దుర్మాంస పిండం.

**కుదుపు** స.క్రి. కదలించు. వి. 1. కదలిక, చలనం ; 2. ఆయాసం. విణ. కుంటిఅయిన.

క. గుది. దుముకు ; కుదకు. కందం (గుర్రపు దాటు) ; త. కుత (-ప్పు, ట్ట్-). దుముకు, గెంతు ; కుప్పి. గంతులువేయు ; మ. కుతి. గెంతు, దౌడుతీయు ; కుతికక్క. గెంతు.

**కుదుమట్టము** వి. తగినది, సరిపోయినది.

**కుదుము** వి. పాప. కంచు. కు. సం. 10.165.

త. కుంచు. పక్షిపిల్లలు, కులువి. చిన్నపాప.

**కుదురరుగు** చూ. కుదురు.

**కుదురు** వి. ఔ. అనా. 1. పాదు, ఆలవాలం. కు.సం. 7.19 ; 2. ఆస్పదం, స్థానం, ఆశ్రయం. భార. విరా. 2.122 ; 3. నెలవు, ఉనికిపట్టు. బసవ. 1.103. పం ; 4. మొదలు; మూలం. హరి. ఉ. 9.220 ; 5. కుదిరిక, పొందిక, ఉ. రా. 4.190 ; 6. వరస. విజయ. 2.78 ; 7. అగసాలెవాని కుంపటి. నీలా. 3.3 ; 8. నిలకడ, స్థైర్యం, స్వస్థత ; 9. వంశం ; 10. చుట్టకుదురు ; 11. పొయ్యికి పక్కన ఎత్తుతక్కువగా కట్టిన చిన్నమెట్టు ; 12. వడ్లుదంచటానికి రోలుమీదఉంచే వెదురుబుట్ట ; 13. కావడిలో వస్తువుల్ని ఉంచే వలయం ; 14. ఉన్నిదారం వడికేటప్పుడు ఆధారంగా పెట్టినమట్టు 15. సర్దుబాటు. విణ. 1. స్థిరమైన, కదలని. కళా. 5.154 ; 2. సరైన ; 3. నిశ్చయమైన. అ.క్రి. 1. కుదురుపడు, నెలకొను. గంధ. 212 ; 2. చక్కపడు, మాను, బాగుపడు. వేమన 1.60 ; 3. సరిపడు. పొసగు ; 4. స్థిరపడు ; 5. లభ్యమగు ; దొరుకు ; 6. బాగుపడు, చక్కబడు.

క. కుదురు. స్థిరపడు, లోతునేల ; కుదరు. నది రెండుపాయలకి సముద్రానికి మధ్య ఉండేభూమి ; తు. కుదురు. చెట్లగుంపు, నది రెండుపాయలకి సముద్రానికి మధ్య ఉండే భూమి ; కుదురుని. జబ్బునుండి బాగుపడు ; కుది. స్థిరమైన, కుదురైన ; త. కుతిర్ (-ంట్- ; -వ్-). స్థిరపడు, కుదురు ; మ. కుతిర్. వరిపొలాల్లో ఉండే చిన్న మట్టి దిబ్బలు. కోట. కుద్-ఐద్- (ఐద్-). స్థిరంగా ఉంచు.

<మూ. ద్రా. *కుత్-.

**కుదిరిక** వి. 1. అమరిక, పొందిక ; 2. నిలకడ ; 3. నెమ్మది, స్వస్థత. **కుదిరిచ్చు** స. క్రి. 1. కుదుర్చు, ఏర్పాటుచేయు ; 2. పొందుచేయు, సరిచేయు. **కుదిరించు** స. క్రి. నిలుపు, స్థిరపడు, నెలకొను, బాగుపడు. **కుదుటపడు** రూ. చూ. కుదుటఁబడు. అ. క్రి. స్వస్థతనొందు. **కుదుటఁబడు** రూ. కుదుటపడు. అ. క్రి. పూర్వస్థితికి వచ్చు, శాంతించు. <కుదురు + అ(౯) + పడు. **కుదురరుగు** వి. పొయ్యికి పక్కన ఎత్తుతక్కువగాకట్టిన చిన్నఅరుగు. **కుదురుకొను** రూ. కుదుర్కొను. అ. క్రి. 1. నెలకొను, ఉండు. ప్రవర్తిల్లు. భాగ. 8.245 ; 2. స్థిరపడు, పాదుకొను, స్వస్థమగు. విక్ర. 2.70 , 3. నిలుచు, నిలకడకలిగిఉండు. వాల్మీ. 2.121 ; 4. కలుగు. శుక. 3.439 ; 5. చక్కబడు. **కుదురుకొలుపు** రూ. కుదురుకొల్పు. స. క్రి. నిలుపు. నెలకొల్పు. జైమినీ భా. 1.61. **కుదురుకొల్పు** రూ. చూ. కుదురుకొలుపు. స. క్రి. నిలుపు, నెలకొల్పు. పి. శకు. 2.113. **కుదురుచు** రూ. కుదుర్చు. స.క్రి. 1. కుదరచేయు ; 2. ఉపశమిల్లచేయు, మాన్పు. **కుదురుచేయు** రూ. చూ. కుదురుసేయు. స. క్రి. 1. చక్కచేయు, బాగుపరచు ; 2,

పాదుచేయు ; 3. ఆలవాలంచేయు ; 4. కలుగు, చక్కబడు. **కుదురునిండు** అ. క్రి. వ్యాపించ వలసిన చోటంతా వ్యాపించు. **కుదురువట్టు** వి. పంటికుదుళ్ళు. కవిక. 5.110. **కుదురుపడు** రూ. కుదుర్పడు. అ. క్రి. 1. కట్టుపడు. పారి. 5.80 ; 2. స్థిరపడు. దశా. 1.222 ; 3. నెలకొను. ఆం.భా. 3.99. **కుదురుపర్చు** రూ. చూ. కుదురుపఱుచు. స.క్రి. 1. నెలకొల్పు ; 2. ధరించు ; 3. కల్గించు. **కుదురుపఱచు** రూ. చూ. కుదురుపఱుచు. స.క్రి. ధరించు, తాల్చు, పెట్టు, అమర్చు. శృం. నై. 8.112. **కుదురుపఱుచు** రూ. కుదురుపర్చు, కుదురుపఱచు, కుదుర్పఱచు, కుదుర్పఱుచు. స.క్రి. 1. నెలకొల్పు, నిలుపు. పారి. పీఠి. 18 ; 2. పెట్టుకొను. ఉ.రా. 3.347 , 3. కలిగించు, ఘటించు. కవిరా. 5.218 ; 4. ధరించు, తాల్చు, అమర్చు. నీలా. 1.13. **కుదురుపాటు** రూ. కుదుర్పాటు. వి. స్థైర్యం, నిలకడ. చంద్రాంగ. 6.148. **కుదురుపెట్టు** రూ. కుదురువెట్టు. అ. క్రి. గింజలు చిందకుండా రోటిపై కుందెన పెట్టు. **కుదురులెత్తు** స. క్రి. మొలకెత్తు, బయలుదేరు. శివలీలా. 1.45. <కుదురులు + ఎత్తు. **కుదురువెట్టు** (-పెట్టు) రూ. చూ. కుదురుపెట్టు. అ. క్రి. గింజలు చిందకుండా రోటిపై కుందెనపెట్టు. **కుదురుసేయు** (-చేయు) రూ. కుదురుచేయు. స. క్రి. 1. చక్కచేయు, బాగుపరచు. రామలిం.శ. 73 ; 2. పాదుచేయు ; 3. ఆలవాలంచేయు. **కుదుర్కొను** రూ. చూ. కుదురుకొను. అ. క్రి. ఉండు. కుదురుకొను. వేంక. పంచ. 1.52. **కుదుర్చు** రూ. చూ. కుదురుచు. స. క్రి. కుదరచేయు ; 2. ఉపశమిల్లచేయు, మానుపు. **కుదుర్పడు** రూ. చూ. కుదురుపడు. అ. క్రి. తేరు, స్వస్థమగు. కకుత్థ్స. 4.161. **కుదుర్పఱచు** రూ.చూ. కుదురుపఱుచు. స.క్రి. 1. పెట్టుకొను. జైమినీభా. 3.38 ; 2. నెలకొల్పు ; 3. కల్గించు. **కుదుర్పఱుచు** రూ. చూ. కుదురుపఱుచు. స. క్రి. 1. ధరించు, తాల్చు, పెట్టు, అమర్చు ; 2. నెలకొల్పు, నిలుపు ; 3. పెట్టుకొను ; 4. కలిగించు, ఘటించు ; 5. పెట్టుకొను. **కుదుర్పాటు** రూ.చూ. కుదురుపాటు. వి. స్థైర్యం, నిలకడ.

**కుదురుజువ్వి** వి. చిన్నచిన్న సామానులు తయారుచేయటానికి ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు (Putrantiva Roxburghii).

**కుదుర్కొను** చూ. కుదురు.

**కుదుర్చు** చూ. కుదురు.

**కుదుర్పడు** చూ. కుదురు.

**కుదుర్పఱచు** చూ. కుదురు.

**కుదుర్పఱుచు** చూ. కుదురు.

**కుదుర్పాటు** చూ. కుదురు.

**కుదులు** రూ. కుదలు. అ.క్రి. 1. (నిద్రనుండి మేలుకొన్నపుడు) కదలు. ద్వి. నల. 4.22 ; 2. అదురు, చలించు ; 3. పాటుతప్పు.

క. కుదుకు. ఒకరకమైన గుఱ్ఱం పరుగు, పరుగెత్తడం ; తు. కుసురుని. వణకు ; త. కుతి (ట్-; ప్ప్-). దుముకు ; కూళై (-ట్-ప్ప్-). కదలు (చామరం కదలునట్లు) ; కుతఱు. వదులగు (విరియబోనుకునే జుత్తులాగ). పో.చూ.త. కళై. తెండాలాగ కదలు ; కుతి. గెంతు (సీటిలా కదలు); మ. కుతిక్క. దుముకు ; కుతఱు కదలు.

**కుదిలిక** వి. కుదలటం, కలవరం, అదరటం. **కుదిలించు** స.క్రి. కదలు, ఎదుర్చు. కాశీ. 6.227. **కుదులుకొను** అ.క్రి. 1. విలవిల కొట్టుకొను. భాగ. 10. పూ. 4.35 ; 2. కంపించు, వణకు. **కుదుల్చు** స.క్రి. కుదలజేయు, జాడించు. మల్హా. 3.99.

**కుదుల్చు** చూ. కుదులు.

**కుదువ**[1] రూ. కుదవ[1]. వి. 1. తాకట్టు. శుక. 2.360 ; 2. న్యాసం, దాచుకొన్న ధనం, ఆం. భా. 2.267.

త. కుతువై. తాకట్టు ; కొతువై-.

**కుదువవట్టు** స.క్రి. తాకట్టుపట్టు. **కుదువపెట్టు** స.క్రి. తాకట్టుంచు. రామలిం.శ. 49. **కుదువవిడిపించు** స.క్రి. తాకట్టు విడిపించు. **కుదువవేయు** స.క్రి. చదుమలగొట్టు, మలగొట్టు.

**కుదువ**[2] రూ. కుదవ[2]. వి. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లి పోవడానికి పొలంగట్టు చివర పల్లంగా ఉన్నవైపు కట్టిన రాతికట్టడం.

**కుదెప** రూ.చూ. కుదప. వి. 1. రొంపదుక్క ; 2. కంటి కొలకులో ఏర్పడిన దుర్మాంసం ; 3. బడిత ; 4. పెసర, కంది, అనుము మొ. వాటి కుప్పలు కొట్టి గింజలు రాల్చడానికి ఉపయోగించే దుడ్డుకర్ర.

**కుదెలు** రూ.చూ. కుదీలు. వి. చీట్ల పేకాటలో ఐదుపట్లు పడ్తానని చేసే ప్రతిజ్ఞ.

**కుదేలు** రూ.చూ. కుదీలు. వి. కాకితాల ఆట (పేకాట)లో అయిదుపట్లు పడతానని చేసే ప్రతిజ్ఞ.

**కుద్దు** వి. చిన్నరోకలి, పన్నులేని రోకలి బండ.

**కుద్దుముగ్గు** రూ.చూ. గుద్దుముగ్గు. వి. మొట్టికాయలు ముగ్గు.

**కుద్దురత్** రూ.చూ. కుదిర్తి. వి. అధికారం.

**కుద్దెర** వి. ఒకరకం చేప.

క. కంద. కొన్దై, మ. పల్లంకొలి ; పర్జి. కుత్త. ఒకరకం చేప.

**కునష్టి** రూ.చూ. కునిస్టి. వి. 1. కుంటివాడు, పంగువు ; 2 ఎల్లప్పుడూ జబ్బుతో బాధపడేవాడు.

**కునష్ఠి** రూ.చూ. కునిస్టి. వి. 1. పంగువు ; 2. నిత్యం జబ్బుతో బాధపడేవాడు.

**కుని** వి. 1. వీధి మలుపు తిరుగుడు, మూల ; 2. చేనిలో నలుచదరపు గట్లకు (గనిమలకు) మీరిఉన్న భాగం ; 3. ఇంటిస్థలంలో చతురస్రంగా ఒకమూల ఎక్కువఉండటం ; 4. దున్నేటప్పుడు చేలో మూలగా వచ్చిన భాగం, చేలో కోనుగా ఉన్న భాగం.

క.కోణ్, కోణ, కోణె, కోన. మూల, కోణం ; తు. కోణ, కోణె. మూల, కోణం ; త. కోణ్. కోణాకారం ; కోణం. వంకరస్వభావం ; కోణయ్. వంపు, కోణం ; కోణల్. వంపు ; కోణై. వంకర ; మ. కోణ్. వంపు, వంకర, కోణం ; కోట. గోణ్. గదిమూల.

పో.చూ. సం. కోణ-మూల, దిక్కులు చూపేయంత్రం మూల.

కునిచాలు వి. వంకరగా వచ్చిన చాలు, మొల్లిచాలు, కునిలో దున్నినచాలు. కునిచుట్టు వి. కునిలో దున్నటానికి అరకతిరిగే చుట్టు. కునిపట్టె వి. కునిలో దున్నినచాలు, వంకరగా వచ్చినచాలు, మొల్లిచాలు. కునిమలుపు వి. కునిచుట్టు, కునిలో దున్నటానికి అరక తిరిగే చుట్టు.

**కునికి** వి. ఇంటికప్పుకు పనికివచ్చే ఒకరకం గడ్డి.

**కునికిపడు** చూ. కునుకు.

**కునికిపాటు** చూ. కునుకు.

**కునికిల** రూ.చూ. కునికిలి. వి. తల, శిరం.

**కునికిలవేయు** స.క్రి. కుంగవేయు.

**కునికిలి** రూ. కునికిల. వి. తల. భార. కర్ణ. 1.175.

**కునిష్టి** రూ. కునష్టి, కునష్ఠి, కునిష్ఠి, కునుస్టు. వి. కుంటివాడు. ఆం. భా. 2.122.

క. కునిష్ఠ. వంకర, కుటిలస్వభావం ; కునస్టై ; త. కుని. వంకర, (చివక),కొనస్టై. కుటిలస్వభావం ఉన్న వ్యక్తి ; మ. కునిష్టమ్ అయిష్టం.

**కునిష్ఠి** రూ.చూ. కునిసి. వి. కుంటివాడు.

**కునుకు** రూ. కున్కు. వి. అల్పనిద్ర. రామలిం.శ. 7 ; అ.క్రి. 1. నిద్రచేతూగు, తూలు ; 2. తగ్గు.

క. కునుంగు. తూగు, వంగు ; కుంగు, కుగ్గు. వంగు, కిందకివంగు , కునుచు, కుగ్గు. వంగు, మునుగు ; కుళుగు. ముడుచుకొను, మునుగు ; కుణ్ని, కూన్. వంగు ; కునుగు. తనంతట తాను ముడుచుకొను, వంగు ; కుని. వంగు, మునుగు ; త. కుఱు (-ట్ట్-;-ప్ప్-). తగ్గు (స్త్రీ) ; కుఱుకు (ఇన్-;-ఇవ్-). తగ్గు ; కున్ను (-ఇన్-ప్-). వంగు, కృశించు ; కున్కు (-ఇన్-;-వ్-). తగ్గు. కుని. (-ఇట్- ; ప్-). వంగు ; కూను (-ఇ న్-;,ప్-). కిందకివంగు ; కూన్. వంగు ; మ. కుఱుక. తగ్గు ; కుని యుక. వంగు ; కూనుక. వంగు ; గోం. కూర్కానా. నిద్రలోఊగు, తాగినవాడిలా ఊగు. కథ వింటున్నవారిలా ఊగు , కువి. కూర్నకలి. నిద్రలోఊగు ; పర్జి. కూర్క్. నిద్రలోఊగు, కూరుకుడ్, కూర్కుకుడ్. నిద్దర మత్తు ; ఒల్ల. కుర్కల్. నిద్ర ; మాల్తో కూగె. కునుకు.

మూ.ద.ద్రా. *కూన్-వ్-.

కునికిపడు అ.క్రి. నిద్రచేతూగిపడు. క. కుని. ముందుకు వంగు ; త. కుని. (-ఇంట్- ; ప్-). ముందుకు వంగు. నైఋత ; మ. కునియుక, ముందుకువంగు. కునికిపాటు రూ.చూ. కునుకుపాటు. వి. నిద్రతో తూగిపడటం. కునుకు పట్టు రూ.చూ. కునుకుపట్టు. అ.క్రి. 1. పని మందగించు ; 2. నిద్రవచ్చు. కునుకుపాటు రూ. కునికిపాటు. వి. నిద్రవల్ల ఊగడం. కునుకువట్టు (-పట్టు) రూ. కునుకుపట్టు. అ.క్రి. నిద్రపోవు. రామలిం.శ. 3.

**కునుగు** వి. జొన్నకళ్ళంలో ధాన్యంతో కలిసిఉన్న సన్నటి పొట్టునుసి.

**కునుము** అ.క్రి. నిద్రించు.

**కునుసు** వి. పట్టికాగ్రం, మంచంపట్టెయొక్కకుని. మల్హ. 2.101.

**కునుస్టు** రూ.చూ. కునిష్టి. వి. పంగువు, కుంటివాడు.

**కున్కు** రూ.చూ. కునుకు. వి. అల్పనిద్ర. చెన్నబసవ. 3.428.

**కుంత** రూ.చూ. గుంత. వి. తక్కువ లోతుగల విశాలమైన గొయ్యి.

**కుంతుకొను** అ.క్రి. పూడిపోవు, నిండిపోవు.

**కుంతురు** రూ.చూ. కూంతురు. వి. కూతురు.

**కుంద**[1] వి. 1. స్తంభం ; 2. స్తంభాలమీద మోపుగా ఉండే గుంటగల దిమ్మ ; 3. అట్టహాసం, కూటపుష్పం ; 4. గుట్ట, తిప్ప, తిన్నె.

క. కుంద. ఇటుకలతో కట్టిన స్తంభం ; తు. కుంద. రాతితోగాని ఇటుకలతోగాని కట్టినస్తంభం; త. కంతు. స్తంభం; పర్జి. కుడి, కుడ్డి. నదిఒడ్డున కట్టినగోడ ; మాల్తో. కుంద, దుక్క, అడ్డంవేసిన మొద్దు.

**కుంద**[2] రూ. కుందా. వి. తుపాకి అడుగు.

**కుందం** వి. రెండురాళ్ళు నిలువున, రెండు అడ్డాన ఇటుకలను పేర్చడం.

**కుందకము** వి. 1. అభ్యంతరం ; 2. లోపం ; 3. ఖాళీగా ఉండే భూమి ; 4. సేద్యం చేయకుండా విడిచిపెట్టిన భూమి.

**కుందటిల** వి. పక్షివిశేషం. హంస. 3.13.

**కుందనం** వి. గుంగ్రటి పెంకులకుప్ప.

**కుందనము** వి. అపరంజి, పరిశుద్ధమైన బంగారం. శృం.నై. 6.106.

క. కుందన. మంచి బంగారం ; కుందణ. తు. కుం దణ బంగారు. మంచి బంగారం ; కుందణ. కల్తీలేని బంగారం ; త. కుంతనమ్. (<తె) బంగారం, మంచి బంగారం, నగలో రాళ్ళు తాపటానికి ఉంచిన ఖాళీస్థలం.

**కుందపోటు** వి. వసారా గుంజలు, పందిరి కాలిగుంజలు, ఒకే వరసలో లేకపోవడమనే తప్పు, వరసలో ఉండటమే నివారణ.

**కుందరగడ్డి** వి. పశువుల మేతకు ఉపయోగపడే ఒకరకం గడ్డి. (Ischaemum Pilosum).

**కుందరుబీళ్లు** వి.బ.వ. రెల్లుపొలాలు.

**కుందా** రూ.చూ. కుంద[2]. వి. తుపాకి అడుగు.

**కుందావప** వి. మనస్సులో తపన.

**కుందాము** వి. పెంకును కాల్చే బట్టీ.

**కుందాయి** వి. కుందావలె అర్ధబలుపుగల ఆవడి.

**కుందార్చు** చూ. కుందు.

**కుంది** రూ. కుందిన, కుందియన[1], కుందెన[1]. వి. 1. కుందెన, ధాన్యందంచు కొనే రోలు. ఆం. భా. 2.239 ; 2. వంచే టప్పుడు ధాన్యం చెదిరిపోకుండా గుంటచుట్టూ అమర్చే రాతి కుదురు , 3. ఒకవిధమైన దీపం పాత్ర ; 4. దబ్బా రాట్నం, చక్రం ఆకులు బిగింపుకు అమర్చిన కొయ్య ; 5. పట్టుదారం చుట్టేటప్పుడు పంటికొస మోపటానికి పెట్టే ముట్టు ; 6. ఇటుకబట్టీలోని నిలువుపొయ్యి పై భాగం ; 7. కుండకింది కుదురు ; 8. చిన్న మట్టిపాత్ర.

క. కుందణిగె, కుందణి, కుందలిగె. దంచినపుడు చెదిరిపోకుండా రోలు చుట్టుఉంచిన కర్ర చక్రం ; చూ.

కుదురు, కుదురు. రోలు నుండి గింజలు చెదిరిపోకుండా అమర్చిన చక్రం; త. కుంతాణి. ధాన్యం చెదిరిపోకుండా రోటిచుట్టు అమర్చిన చక్రం; (ఇంతుపాక); మ. కుంతాని. ధాన్యం దంచుకునే రోలు; కూంతాణి.

కుందిక చూ. కుందు.

కుందికట్టు వి. బాల్యక్రీడా విశేషం. యయా. 3.35.

కుందికాళ్లు వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. విష్ణు పు. 7.202.
త. కుంత్-ఉప్పు. ఒక కాలితో గెంతి ఆడుకునే మగ పిల్లల ఆట; కుంతు. (-ఇన్-; -మ్-) ఒంటికాలితో గెంతు; కుంతాజ్‌కుచ్చి. ఒక ఆటగాడు తక్కిన ఆటగాళ్ళను పట్టుకోవడానికి నిర్ణీతకాలంలో గెంతి ఆడే ఆట; మ. కుంతుక. కాలివేళ్ళమీద నడచు.

కుందికుట్టాడు అ.క్రి. ఎన్నిగంటలు వైచినా ఒకచోటనే ఉండు.

కుందికొను చూ. కుందు.

కుందించు చూ. కుందు.

కుందివ రూ.చూ. కుంది. వి. 1. ధాన్యం దంచుకొనేరోలు; 2. దంచేటప్పుడు ధాన్యం చెదిరిపోకుండా గుంటచుట్టూ అమర్చే రాతికుదురు; 3. ఒకవిధమైన దీపంపాత్ర.

కుందియన[1] రూ.చూ. కుంది. వి. 1. కూర్చోలేని పసిబిడ్డ కూర్చోటానికి ఏర్పరచిన తొట్టె. విష్ణు పు. 7.125; 2. ధాన్యం దంచుకునే రోలు; 3. దంచేటప్పుడు ధాన్యం చెదిరిపోకుండా గుంటచుట్టూ అమర్చే రాతి కుదురు; 4. ఒకవిధమైన దీపం పాత్ర.

కుందియన[2] వి. వృక్ష విశేషం.

కుందిరికి వి. వృక్ష విశేషం, అందుగుచెట్టు.

కుందిలు చూ. కుందు.

కుందిల్లు చూ. కుందు.

కుందివెలగ వి. బంజరు భూముల్లో పెరిగే ఒక మొక్క (Sidamysonesis).

కుందు అ.క్రి. 1. తపించు, ఉడుకు. భార. ఆది. 4.51; 2. కుంగు. భార. అరణ్య. 4.94; 3. తగ్గు, క్షీణించు. భార. విరా. 1.294; 4. బాధపడు, నొగులు. భార. ఉద్యో. 2.21; 5. చింతించు, శోకించు, ఏడ్చు. భార. ద్రోణ. 2.234; 6. కాంతిహీనమగు. విక్ర. 2.107; 7. కాలు చక్కగా నేలనానించక నడచు; వి. 1. న్యూనత. తక్కువ, క్షీణత, భార. విరా. 4.234; 2. దుఃఖం, చిత్ర భా. 4.117; 3. పశురోగం; 4. మాంసం కైమా చెయ్యటం; 5. చిరుచిరుగా నరకటం; 6. కుందురుగడ్డి; విణ. 1. పొట్టి. పద్మ. 9.298; 2. శూన్యం. ఆం.బా. 3.24.
క. కుందు. బాధతో కుందు, తగ్గు, క్షీణించు; తు. కుందుని. తగ్గు, క్షీణించు, ఎండిపోవు; త. కున్ఱు (-ఇన్-; వ్-). తగ్గు; కుంతు (-ఇన్-ఇవో-). కాలివేళ్ళతో నిలబడు; కుఱు (-ట్-ప్ప్-). క్షీణించు (స్త్రీ) కుఱు-కుఱు నడు (-ట్-; ప్ప్-), చిన్న అడుగులతో ఊగు (పసిపిల్లలా) కుత్తై (ంట్-మ్-) అభిమానంతో వేలాడు, కష్టాలతో బాధ పడు, తగ్గు; మ. కుఱుక. పొట్టగు, తగ్గు; తొ. కుర్ద్ (్ద). చిన్నదగు.
కుందార్చు స.క్రి. దుఃఖం తీర్చు. కుందిక వి. కలత, క్షోభం. పి. శకు. 1.39. కుందికొను రూ. కుందుకొను. అ.క్రి. చింతిల్లు. శుక. 2.563. కుందించు స.క్రి. 1. తపింపచేయు. భార. విరా. 2.75; 2. తక్కువ పరచు, న్యూనపరచు. భార. ఉద్యో. 3.45; 3. బాధ పెట్టు. భీమ. 2.50; 4. తేలికచేయు. కుందిలు రూ. చూ. కుందిల్లు. అ.క్రి. 1. కుంగిపోవు, డిల్లపడు; 2. బాధపడు. కుందిల్లు రూ. కుందిలు. అ.క్రి. 1. కుంగిపోవు, డిల్లపడు. కు.సం. 10.42; 2. బాధపడు. కుందుకొను రూ.చూ. కుందికొను. అ.క్రి. చింతిల్లు. కుందుపడు రూ.చూ. కుందు వడు. అ.క్రి. 1. డిల్లపడు; 2. బాధపడు. కుందువడు (-పడు) రూ. కుందువడు. అ.క్రి. 1. డిల్లపడు, కాశీ. 2.79; 2. బాధపడు, పీడనొందు. చంద్రికా. 3.15. కుందెనగిరి రూ.చూ. కుందెనగిటి. వి. బాలక్రీడా విశేషం. కుందెనగిటి రూ. కుందెనగిరి. వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146. కుందెనగుడి వి. బాలక్రీడా విశేషం. కాశ. 3.33.

కుందురు వి. తృణ విశేషం. ప్రబంధ. 201. (Boswellia thurifera).
క. కుందురు. తృణవిశేషం.
కుందురునట్టు వి. నల్లమట్టి భూముల్లోని ధాన్యపు పొలాల్లో లేచి పంటను పాడుచేసే ఒకరకమైన గడ్డి.

కుందురువేళ్ళు వి.బ.వ. ఒకరకం పిండివంట.

కుందురెల్లు రూ.చూ. కుందుతెల్లు. వి. కాశం

కుందుతెల్లు రూ. కుందురెల్లు వి. కాశం, ఒకరకంరెల్లు.

కుందెటికొమ్ము చూ. కుందెలు.

కుందెన[1] రూ. చూ. కుంది. 1. ధాన్యం దంపేరోలు. ఆం. భా. 2.235; 2. వెదురుతో గాని ఇనపరేకుల్తోగాని చేయ బడిన కుదురువంటి వస్తువు; 3. ప్రమిద; 4. వృక్ష విశేషం.

కుందెన[2] వి. ఒకరకం చెట్టు.

కుందెన[3] వి. కుందర, ఉర్రంకి, ఇంటికప్పుకు పనికివచ్చే ఒక రకం గడ్డి. (Ischaemumpilosum).
కుందెనకొమ్ము వి. కుందేటికొమ్ము.

కుందెనగిరి చూ. కుందు.

కుందెనగిటి చూ. కుందు.

కుందెనగుడి చూ. కుందు.

కుందెలు రూ. కుందేలు. వి. శశం, చెవులపిల్లి, భార. ఆది. 6.186.
క. కుందిలి. కుందేలు; త. కుంతు (-ఇన్-; ట్-). వేళ్లమీదనిలబడు; చూ. మ. కుంతుక. వేళ్లమీదనిలబడు.
కుందెటికొమ్ము రూ. కుందేటికొమ్ము. వి. కుందేటికొమ్ము. మల్లభూ. నీతి. 5. కుందెవల రూ.చూ. కుందేటివల. వి. కుందేటివల. హంస. 4.185.

కుందెవల చూ. కుందెలు.

కుందేటికొమ్ము చూ. కుందేలు.

కుందేటిగడ్డి చూ. కుందేలు. వి. ఒకరకం గడ్డి (Aristida funiculata).

కుందేటికాల్పు చూ. కుందేలు.

కుందేటివల చూ. కుందేలు.

కుందేలు రూ. చూ. కుందెలు. వి. చెవులపిల్లి, కుందేలు. శృం. నై. 8.187.

కుందేటికొమ్ము రూ. చూ. కుందెటికొమ్ము. వి. 1. శశశృంగం, చెవులపిల్లికొమ్ము. (అసంభవాన్ని తెలుపు తుంది) ; తపతీ 2.60 ; 2. శశశృంగం. ఆం. భా. 2.66. కుందేటిజాల్పు వి. శశధరుడు, చంద్రుడు. అచ్చరా. యు. 1.55, 510. కుందేటివల రూ. కుందెవల. వి. కుందేళ్ళను పట్టుకోవటానికి ఉపయోగించేవల. కాశ. 3.46. కుందేలు చెలియాకు వి. సుమారు అయిదడుగుల ఎత్తు పెరిగి పచ్చని పూలు పూసే ఒకచెట్టు. (Notonia grandiflora).

కున్న రూ. కున్ని, కున్నె, కూన[1]. వి. బుడతడు, శిశువు. బనవ. 1.358.

క. కున్న. చిన్నపేను ; కున్ని. కూన, కుక్కపిల్ల ; కుందు. తగ్గు ; కుఱు[1]. చిన్నది ; పో. చూ. తు. కున్ని. చిన్నది, పసిది, కూన, కుక్కపిల్ల ; చూ. త. కుఁను (-ఇన్- ; వ్-). తగ్గు ; కునుఁచు. చిన్నపక్షిపిల్ల ; మ. కునుంచు. చిన్న, పసి ; కో. కుంజ్. పసిపిల్లలు, భగ వంతుని బిడ్డలాంటి పురుషులు ; కొలా. కూన. కుక్కపిల్ల.

కున్నఁడు వి. బాలుడు, బిడ్డ. పండి. చ. 2.485.

కున్ని రూ. చూ. కున్న. వి. చిన్నది, వయసుకు మించిన మాటలు, పనులు కలది.

కున్నె రూ. చూ. కున్న. వి. 1. శిశువు. రాజవా. 4.91 ; 2. ముక్క, తుంట ; 3. పిడకనుగ్గు.

కువకము వి. శకటభేదం, రాజస్త్రీ లెక్కే తెరలుకల బండి, ఘోషా స్త్రీలకోసం తెరకట్టినబండి. భార. ఆశ్రమ. 2.28.

కువణం రూ. చూ. కుప్పడం. వి. అంచుకు పేకరంగు కలవ కుండా వేరేరంగు నూలుపెట్టి రెండునాడెలతో పోగులు మలుపుతూ చేత్తోనేసిన బట్ట.

కువణంనాడె రూ. చూ. కుప్పఱంనాడె. వి. అంచునేతలో వేరే రంగు పోగులుపెట్టి కుప్పడం నేతనెయ్యడానికి ప్రత్యే కంగావాడే కొమ్మునాడె. కువణంపట్టు రూ. చూ. కుప్ప డంపట్టు. వి. అంచుల్లో వేరేరంగుదారం వేరేనాడితో మలిపిడిజైన్లు పడేట్టు నేయటం.

కువడం రూ. చూ. కుప్పడం. వి. అంచుకు పేకరంగు కలవ కుండా వేరే రంగు నూలుపెట్టి రెండునాడెలతో పోగులు మలుపుతూ చేత్తో నేసినబట్ట.

కువసము రూ. కుప్పసము, కుబుసము, కూసం[1], కూసము[1]. వి. 1. పాము కూసం. రం. రా.యు.పు. 3849 ; 2. రవిక. కాశీ. 7.40.

పో. చూ. సం. కూర్పాస-. రొమ్ముకవచం ; కూర్పా సక. రవిక, స్త్రీలు ధరించే రవిక, రొమ్ముకవచం ; ప్రా. కుప్పాస.

క. కుప్పస, కుప్ప, కుబస, కుబుస, కుబ్బస, కుబ్స. రవికె, రొమ్ముకవచం ; కొడ. కుప్పియ. కూర్గ్ వారు వేసుకొనే కోటు ; మ. కుప్పస. రవికె ; త. కుప్పా సమ్. కోటు, జాకెట్టు, రొమ్ముకవచం, పాముకూసం ; మ. కుప్పాయమ్. రవిక, గౌను, వస్త్రం ; కో. కుపా చమ్. రవిక, గౌను, వస్త్రం ; తొ. కుపాసమ్. కోటు ; కొలా. కుబసమ్. రవిక ; నా. కుబషమ్. రవిక.

< ప్రా. కుప్పాస-.

కుపినికోర రూ. చూ. కుపినికోరా. వి. గచ్చకాయరంగులో ఉండేముడి పట్టు.

కుపినికోరా రూ. కుపినికోర. వి. గచ్చకాయ వన్నెలోఉండే ముడిపట్టు.

కుప్ప[1] రూ. కుప, కువ్వ[1], కూవ. వి. 1. రాసి, పోగు. భార. విరా. 2.52 ; 2. కోసినపైరు నూర్చడానికిముందు అమ ర్చిన పోగు ; 3. కోసినగడ్డి, నూర్చినధాన్యం మొ. వాటి రాసి ; 4. కొన్నిఓదెలు కలిపివేసిన పంటగడ్డి గూడు.

క. కుప్పె, గుప్పె. రాసి, గుమి ; కొడ. కుప్పి. చుక్కలు చుక్కలుగా జారుతున్నపేడ ; కిప్. గింజలురాశి, చెత్త ; తు. కుప్పె, గుప్పె. కుప్ప ; కికుప్పె ; త. కుప్పై. రాసి, తిరికటు. కుప్పై, కువై కువియల్, కుంపల్, కువి, కుమి (-ట్టి- ; ప్ప-). కుప్పపెట్టు ; మ. కుప్ప. మురికికుప్ప, చెత్త ; కుమీ. రాసి ; కువెక్క. కుప్పపెట్టు ; తొ. కిప్. చెత్త ; గోం. కుప్ప. రాశి ; కుఇ. కుప ; కువి. ప్రొ ; కూప. మట్టిదిబ్బ ; పర్జి. కుప్ప, మట్టికుప్ప, గడ్డికుప్ప ; కొలా. కుప్కలెన్. కుప్పపెట్టు ; ఒల్లా. కొపె. కొండ, అడవి ; కొప్. నిండినది, నిండటం ; మాల్తో. కొపె.

కుప్పకూలు రూ. చూ. కుప్పగూలు. అ.క్రి. కుప్పగాకూలి పోవు. కవిక. 2.197. కుప్పకొను అ.క్రి. ఎక్కువగు, నిండు కొను. కుప్పకోలు వి. ఆధిక్యం, పెంపు. కుప్పకోలుగొను (-కొను) అ.క్రి. నిండుకొను, మెండగు. ద్వి.హరిశ్చ. 3.61. కుప్పగించు అ.క్రి. ఈగాడు. కుప్పగూలు(-కూలు) రూ. కుప్ప కూలు. అ.క్రి. కుప్పగాకూలు, పోగుగాపడు. భాస్క.రా.యు. 498. కుప్పగూలుచు (-కూలుచు) రూ. చూ. కుప్పగూల్చు. స. క్రి. కుప్పకూల్చు. కుప్పగూల్చు (-కూల్చు) అ. క్రి. కుప్పలుగా పడవేయు, రాసులుగాకూల్చు. భాస్క. రా. యు. 1965. కుప్పఁగూర (-కూర) క్రి. విశే. 1. కుప్పలు కుప్పలుగా. భార. భీష్మ. 3.335 ; 2. చిన్నాభిన్నంగా. భార. ద్రోణ. 3.152 ; కుప్పఁగూరలు (-కూరలు) వి.బ.వ. కుప్పలు, పోగులు పోగులు భార. ఆశ్వ. 1.31. కుప్ప తించు స. క్రి. కుప్పలుగా పడవేయు. సమీర. 7.127. కుప్పతిప్పలు రూ. కుప్పతెప్పలు. వి.బ.వ. పోగులు పోగులు, సమృద్ధి. కుప్పతిలఁబడు అ.క్రి. కుప్పగా పడు, పోగుగాపడు. జైమినీ భా. 5.51. కుప్పతిలు రూ. కుప్పతిల్లు. అ.క్రి. కుప్ప గాలు పడు, పోగుగాపడు. వేంక. పంచ. 1.607. కుప్పతిల్లు రూ.చూ. కుప్పతిలు. అ.క్రి. కుప్పలుగా పడు, పోగుగాపడు. కుప్పతెప్పలు రూ. చూ. కుప్పతిప్పలు. వి.బ.వ. పోగు పోగులు. మృత్యు. 2.15. కుప్పతొక్కుళ్ళు వి.బ.వ. చచ్చు గడ్డిలో గింజలు. కుప్పనఁగూర (-కూర) వి. కుప్పలు కుప్పలు. భార. కర్ణ. 2.298. కుప్పనఁగూరలు (-కూరలు) వి.బ.వ. కుప్పలు కుప్పలు. భోజ. 7.125. కుప్పనఁగూరు (-కూరు) అ. క్రి. గుంపుకూడు. పారి. 3.11. కుప్పనూర్చు స. క్రి. వడ్లను గడ్డినుంచి వేరుచేయు. కుప్పనూర్పు వి. పండినపంటను కోసికుప్పగా చేసినతర్వాత దానిని పశువులు ట్రాక్టర్లు మొ. వాటితోనూర్చటం, మహనూలు. కుప్పపెట్టు

స. క్రి. 1. పోగుచేయు; 2. కూడబెట్టు. **కుప్పలుగట్టు** (-కట్టు) అ. క్రి. కుప్పలుగా ఏర్పడు, పోగులుగా ఏర్పడు. కేయూ. 2.116. **కుప్పలుగాగురియు** అ. క్రి. ఎక్కువగా కురియు. తాళ్ళ. సం. 4.179 <కుప్ప[1] + -లు + అగు + అ[7] + కురియు. **కుప్పలుగొట్టు** (-కొట్టు) స. క్రి. కుప్పనూర్చు. **కుప్పలుగొను** (-కొను) అ. క్రి. కుప్పలగు, రాసులగు. రం. రా. ఉ. 78 పు. 10 పం. **కుప్పలుతెప్పలు** వి.బ.వ. కుప్పతెప్పలు. **కుప్పలుఉుకు** అ. క్రి. కుప్పలు కుప్పలుగా ఉరుకు, మిక్కిలి వ్యాపించు. చిత్రభా. 2.76. <కుప్ప[1] + -లు + ఉుకు. **కుప్పలువడు** (-పడు) అ. క్రి. 1. పోగగు. వరాహ. 10.34; 2. స్తంభించు. దశా. 4.45. **కుప్పవడు** (-పడు) అ. క్రి. 1. కుప్పగాకూడు, పోగగు, పుంజీభవించు. చంద్రాంగ. 2.94. 2. స్తంభించు. దశా. 4.45. **కుప్పవేయు** రూ. కుప్పేయు, కుప్వేయు. స. క్రి. కోసినపైరు మేటగావేయు. **కుప్పపుడి** రూ. చూ. కొప్పునుడి. వి. గజపునుడి, గొడుగునుడి, చెండునుడి, ధననుడి, ధాన్యపునుడి, మూపురం మీద ఉండే నుడి. **కుప్పాము** వి. ఊకతో రాళ్ళను కాల్చే గుండ్రటి ఇటికబట్టీ. **కుప్పేయు** రూ.చూ. కుప్పవేయు. స. క్రి. కుప్పపోయు, పోగుపెట్టు, పోగేయు, రాశివేయు, కుప్పపెట్టు, కుప్పకొట్టు.

**కుప్ప[2]** వి. పాణివిశేషం (ఇది 'పుడిసిలి, కమికిలి' వంటిది) ఆం. భా. 2.141.

చూ. క. కుడితె, కుడతె, కుడుతె. అరచేయి, ముఖ్యంగా ముడిచి ఉన్నఅరచేయి; చూ. త. కుమ్మి. చేతులు తట్టుతూ నాట్యం చేయడం.

**కుప్పట** వి. ఒకవిధమైనకూలి. వేంక.పంచ. 5.43.

**కుప్పటగురిగింజ** వి. బాల్యక్రీడావిశేషం. హంస 3.146.

త. కుప్పలవిళైయట్టు. ఇసకతో ఆడుకునే పిల్లలఆట.

**కుప్పటంనేత** రూ. చూ. కుప్పడంనేత. వి. అంచగుప్పినేత.

**కుప్పటమంచు** రూ.చూ. కుప్పడమంచు. వి. బట్టచివరవేరే రంగుదారంపెట్టి రెండునాడెలతో పోగులుమలుపుతూ చేతి మగ్గంమీదనేసినఅంచు.

**కుప్పడం** రూ. కుపణం, కుపనం. వి. అంచుకు పేకరంగు కలవకుండా వేరేరంగు నూలుపెట్టి రెండునాడెలతో పోగులు మలువుతూ చేత్తో నేసినబట్ట.

**కుప్పడంవజ** రూ.చూ. కుప్పడంవజా. వి. వజాకుప్పడం. **కుప్పడంవజా** రూ. కుప్పడంవజ. వి. వజాకుప్పడం, చీర అంచులో పువ్వులు పడేట్లు వేరే రంగు పోగులు మలిపి నేసిన డిజైను. **కుప్పడంసీర** రూ.చూ. కుప్పడం చీర. వి. 1. అంచుకుపేకరంగు పోగుకలవకుండా వేరే రంగు నూలుపెట్టి రెండునాడెలతో పోగులు మలువుతూ నేసిన చీర; 2. అంచుకు ఏరంగుఉంటే పేకకు అదేరంగు పెట్టి నేసిన చీర. **కుప్పడంచీర** రూ. కుప్పడంసీర, కుప్పణంచీర. వి. 1. అంచుకుపేకరంగు పోగుకలవకుండా వేరే రంగు నూలుపెట్టి, రెండునాడెలతో పోగులుమలువుతూ నేసిన చీర.; 2. అంచుకు ఏరంగు ఉంటే పేకకు అదే రంగుపెట్టి నేసిన చీర. **కుప్పడంచెట్లకమ్మి** వి. కమ్మి నేతకు వేరేరంగు పోగులుపెట్టి చెట్ల ఆకారాల్లో డిజైన్లు పడేటట్లు చేత్తో, పోగులుమలుపుతూ నేసిన కమ్మి. **కుప్పడంనేత** రూ. కుప్పటంనేత, కుప్పణంనేత. వి. అంచగుప్పినేత, అంచుల్లో వేరేరంగు పేకదారాలుపెట్టి, డిజైన్లు (పువ్వులు, మొగ్గలు మొ॥వి) పడేట్టు నేసేనేత. **కుప్పడంపట్టు** రూ. కుపణంపట్టు. వి. అంచుల్లో వేరేరంగుదారం వేరేనాడెతో మలిపి డిజైన్లుపడేట్టు నెయ్యడం. **కుప్పడంపని** వి. అంచులో వేరేరంగు పేకదారాలుపెట్టి డిజైన్లు (పువ్వులు, మొగ్గలు, ఆకులు మొ॥నవి) పడేట్టు నేసేనేత.

**కుప్పడమంచు** రూ. కుప్పటమంచు, కుప్పణమంచు. వి. బట్ట చివర వేరేరంగుదారంపెట్టి రెండునాడెలతో పోగులు మలుపుతూ చేతిమగ్గంమీదనేసినఅంచు.

**కుప్పణమంచు** రూ.చూ. కుప్పడపుంచు. వి. కుప్పడమంచు.

**కుప్పణంచీర** రూ.చూ. కుప్పడంచీర. వి. 1. అంచుకు పేకరంగు పోగుకలవకుండా వేరేరంగునూలుపెట్టి రెండు నాడెలతో పోగులుమలుపుతూ నేసినచీర; 2. అంచుకు ఏరంగుఉంటే పేకకు అదేరంగు పెట్టినేసినచీర.

**కుప్పణంవాడె** రూ. కుపణంనాడె. వి. అంచునేతతో వేరేరంగు పోగులుపెట్టి కుప్పడం నేతనెయ్యడానికి ప్రత్యేకంగా వాడే కొమ్మునాడె.

**కుప్పణంనేత** రూ.చూ. కుప్పడంనేత. వి. అంచగుప్పినేత.

**కుప్పము** వి. 1. గ్రామం. ఆం.భా. 2.23; 2. పల్లెవాళ్ళ గూడెం.

క. కొప్ప, కొప్పె. చిన్నపల్లె; తు. కొప్ప. మారిము శేరు, పరియాజాతివారుకట్టుకునే గుడిసె; త. కుప్పమ్. పల్లె (లేదా) జాలర్లు మొ॥ చిన్నజాతివారిచిన్నపల్లె.

చూ. ప్రా. ఖుంపా. వృష్టినివారణం.

**కుప్పలించు** రూ.చూ. కుప్పళించు. స.క్రి. ఉదుకు.

**కుప్పళించు** రూ. కుప్పలించు. న.క్రి. ఉదుకు.

**కుప్పసము** రూ.చూ. కుపసము. వి. 1. చొక్కా. శృం.నై. 6.60; 2. పాముకుబుసం. జైమినీ భా. 6.42; 3. రవిక. ఆము. 5.104.

**కుప్పసోడి** వి. ఒకరకం కలుపుమొక్క (Elusine aegyftiaca).

**కుప్పాము** చూ. కుప్ప[1].

**కుప్పి[1]** రూ.చూ. కుప్పె[2]. వి. కాచాదిపాత్ర విశేషం.

**కుప్పికట్టు** రూ. కుప్పెకట్టు. వి. ఆయుర్వేద వైద్యులు కోవలుగా చేసిపెట్టుకున్న వంశానుగతమైన రహస్యపు మందు.

**కుప్పి[2]** వి. మరనాడెమొన అరిగిపోకుండా బిగించిన ఇనప శేక ఇత్తడి పొన్ను.

**కుప్పి[3]** వి. అవాక్పుప్పి, నదాప, ఒక రకమైన పువ్వు. (Ruta angustifolia). హంస. 4.10.

త. కుప్పి. ఒకరకమైనపువ్వు.

**కుప్పిగంతు** చూ. కుప్పించు. వి. చిన్నదుముకు, చిన్నగంతు. భాగ. 10. పూ. 1337.

**కుప్పిగంతుకొను** రూ.చూ. కుప్పిగంతుగొను. అ.క్రి. దుముకు, గంతులేయు. **కుప్పిగొంతుగొను** (-కొను) రూ.

కుప్పిగంతుకొను. అ.క్రి. దుముకు, గంతువేయు. భోజ. 7 39. కుప్పిగంతులు వి.బ.వ. బాల్యక్రీడావిశేషం. విష్ణు పు. 7 202. కుప్పిగంతులువేయు అ.క్రి. కుప్పించు, దుముకు.

**కుప్పిచెట్టు** వి. కుప్పెంట చెట్టు.

త. కుప్పె-మేణి. (Acalypha indica); మ. కుప్ప-మేణి. (Acalypha indica).

**కుప్పించు** అ.క్రి. 1. దూకడానికి ముందు కాళ్ళు కదియబట్టి నేలని అదుము. భాస్క.రా. ఆరణ్య. 2.53; 2. దుముకు, దూకు. రామాభ్యు. 6.93; 3. ఊపిరిపట్టు.

క. కుప్పళిసు, కుప్పరిసు, కుప్పిసు. పాదాలు రెండు ఒక దిగ్గర చేర్చి దుమకటం; తు. కుప్పలిపుని, కుప్పొలిపుని, కుప్పలిపుణి. పాదాలురెండు ఒకదగ్గర చేర్చి దుమకటం; త. కుప్పుఱు (-ఱ్, వ్-) దుముకు; కో. కుప్. పాదాలునరిగ్గా పెట్టి దూరంగా దుముకు; కుపర్. దూరంగా దుమకడానికి నిలబడు; తొ. కుప్, లిప్, కుప్. ఒ.రె. దూరపుగంతు.

కుప్పింపు వి. గంతు, దాటు.

**కుప్పిదొల్లి** వి. పెద్దగంప.

**కుప్పింపు** చూ. కుప్పించు.

**కుప్పియ**[1] రూ.చూ. కుప్పె[1]. వి. 1. గొడుగు మీద గుబ్బ, బొగడ; 2. నవరానికి ఉండేగ్రంథి.

**కుప్పియ**[2] రూ.చూ. కుప్పె[2]. వి. 1. కాచాదిపాత్ర విశేషం; 2. గిండిలోనగు వాటిమీది మూత; 3. ఔషధపు ఉండ; 4. ఇత్తడి మొ. వాటితో చేసి ఎద్దుకొమ్ముల తగిల్చే తొడుగు; 5. కత్తిఒరకు చివర అమర్చే తొడుగు.

**కుప్పీలు** వి.బ.వ. బాలికా క్రీడావిశేషం.

**కుప్పె**[1] రూ. కుప్పియ[1]. వి. 1. గొడుగు మీది గుబ్బ, బొగడ. రం. రా. యు. 3.49. పు. 22. పం.; 2. నవరానికి మొదట ఉండేగ్రంథి. హంస. 1.216.

క. గుబ్బి. గుబ్బ; తు. గుబ్బి, గుబ్బె. గుబ్బమేకు, అలంకారార్థమైన గుబ్బగుండీ; త. కుమిఴ్. గుబ్బ (కట్టుకోళ్ళకు) గుబ్బమేకు, కత్తిమొన మొ. వాని పిడిపైన ఉండేదిబ్బ, గొడ్డలిగుబ్బ; కుమిఴి. గుబ్బ; కుప్పి. బెత్తం మొ. వాని పొన్నులేక కట్టు; మ. కుమిఴ్. గుబ్బ, కత్తి మొ. వాని పిడిపైన గుబ్బమేకు. కుక్కగొడుగు, పుట్టకొక్కు; కుప్పి. ఎద్దు కొమ్ముపై పెట్టిన ఇత్తడి బొడిపె.

కుప్పెకొమ్ము వి. పశువుల తలమీద జంటగా మొలిచే గట్టి అవయవ విశేషం.

**కుప్పె**[2] రూ. కుప్పి[1], కుప్పియ[2], కొప్పియ, కొప్పె[2]. వి. 1. గిండిలోనగు వాటిమీది మూత. నృసింహ. 3.132; 2. కాచాదిపాత్ర విశేషం. భీమ. 5.115; 3. కత్తి ఒరకు చివర అమర్చే తొడుగు. ఆం. భా. 2.215; 4. ఇత్తడి మొదలైన వాటితో చేసి ఎద్దు కొమ్ముకు అమర్చేతొడుగు; 5. కత్తి ఒరకు చివర అమర్చే తొడుగు.

సం. కుప్య-కూపకా, కూపికా, కూపీ. పాత్ర విశేషం; ప్రా. కుప్ప-. నాశిక వెండిబంగారాలు కాక తక్కినలోహాలతో చేసిన గృహోపకరణం.

క. కుప్పి. చిన్నపాత్ర; తు.త.మ. కుప్పి.

<ప్రా. కుప్ప-.

కుప్పెకట్టు రూ.చూ. కుప్పికట్టు. వి. ఆయుర్వేద వైద్యులరహస్యపు మందు. కుప్పెకూపి వి. మందుకుప్పి. గాజుబుడ్డి. కత్తిపిడి. కుప్పెకోల వి. బాణవిశేషం. భార. భీష్మ. 2.393.

**కుప్పెంట** వి. హరితమంజరి, మూరుకొండ.

క. కుప్పె, కుప్పెగిడ. దిబ్బల్లో మొలిచే మొక్క. హరితమంజరి; త. కుప్పె. మేణి, హరితమంజరి; మ. కుప్పమేణి. హరితమంజరి.

**కుప్పెన** వి. ఒకజాతి అడవి చెట్టు.

**కుప్పేయు** చూ. కుప్ప[1].

**కుబనంమాను** రూ. కుసుంమాను, కూనంమాను. వి. దోర్నపటె కాధారంగా ఉండే నిలువుగుంజ.

**కుబాయతీగ** వి. దారిగుమ్మడి తీగ (Pluraria tuberosa).

**కుబుసము** రూ.చూ. కుపసము. వి. 1. చొక్కా, మార్క. 3.104; 2. నిలువుటంగీ. మను. 1.59; 3. పాము యొక్క కూసం, చర్మం. ఆం. భా. 1.148; 4. తలుపుకు పైన, కింద ఉంచేకూచం.

**కుబుసు** వి. దగా, మోసం, కికురింత.

**కుబ్బి** రూ.చూ. గుబ్బి[2]. వి. సారెనులువుగా తిరగడానికి వీలుగా రంధ్రం ఉన్నరాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మె.

**కుమదు** రూ.చూ. గుముదు. వి. గుముదు, ఒకచెట్టు.

**కుమందన్** రూ. కుమందాను. వి. దళవాయి, సైనికోద్యోగి.

పో. కొమందంతి; ఫ్రెం. కొమాండా.

<పో. కొమందంతి.

**కుమందరులు** చూ. కుమందన్. వి.బ.వ. అధిపతులు, దళవాయులు.

రంగా. చ. 2.74.

**కుమందాను** రూ.చూ. కుమందన్. వి. సర్వసేనాని.

**కుమామం** రూ.చూ. కుమ్మరాము. వి. కుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం.

**కుమారపున్నమ** వి. భాద్రపద పౌర్ణమి.

సం. కుమార-. కొడుకు, కుమారస్వామి.

<సం. కుమార- + పున్నమ.

**కుమారిత** రూ.చూ. కొమరిత. వి. కుమారి, ఆడకూతురు, ఆడపడచు.

**కుమారితె** రూ.చూ. కొమరిత. వి. కూతురు.

**కుమారిలు** రూ. కుమారిల్లు. అ.క్రి. (లోలోపల) తపించు, ఉడుకు. పారి. 1.114; 2. రగులు, రాజుకొను. ప్రబోధ. 2.68.

త. కుమై. ఉడుకు, కుంపు, ఎక్కువగాకాలు; కుమిల్. ఉడుకు; మ. కుమళెక్క. ఉడుకు.

**కుమారిల్లు** రూ.చూ. కుమారిలు. అ.క్రి. 1. కుములు, రాజు; 2. లోలో తపించు, ఉడుకు.

**కుమార్త** రూ.చూ. కొమరిత. వి. కూతురు.

**కుమార్తె** రూ.చూ. కొమరిత. వి. కూతురు.

**కుమి**[1] రూ.చూ. కుమ్మి[1]. వి. ధాన్యాదులుంచుకునే పొణక.

గాదె, గరిసె. ఆం. భా. 2.240.

**కుమి**[2] రూ.చూ. కుమ్మి[2]. వి. బాలికలు ఆడుకునే ఒక ఆట.

**కుమిలించు** చూ. కుములు.

**కుము** రూ.చూ. కుమ్ము[1]. స.క్రి. దంచు, పొడుచు, వి. **1**. దెబ్బ, వేటు, వేత; **2**. వివాదం; **3**. ఇబ్బంది.

**కుముటు** వి. **1**. కాసభేదం. ఆం.భా. 2.126; **2**. వాంతికి ముందు కంఠబిలంలో కలిగే వికారం. అ.క్రి. వాంతికిముందు కంఠం వికారమెత్తు.

క. కుముటు, కుమటు. వాంతి వచ్చినట్లుండు, రోత యైన, అసహ్యమైన; త. కుమట్టు వాంతి వచ్చేటట్లుండు.

**కుముదాళ్ళు** వి.బ.వ. తెలిక జాతి భేదం.

**కుమురు** వి. కమటం, కుంపటి.

**కుములు** అ.క్రి. **1**. (లోలోపల) తపించు, ఉడుకు. భాగ. 4.226; **2**. రాజు, రవులు. చంద్రాంగ. 4.167; **3**. సడలు, బిగి వీడు. దశా. 2.139.

క. కుంపటె, కుప్పటె, కుప్పుడిగె, కుమ్మటు, కుమ్మటె. కొలిమి; కొమె. రవులు; తు. గుమెలుని, గుమ్లుని. కణకణ లాడుతున్న నిప్పులు, నివురుగప్పిన నిప్పు; గుముల, కుమెపుని. చేపలాగ కుళ్ళిపోవు, కొలిమి; త. కుమై. ఎక్కువ వేడి, వాలిపోవు; కుమఱు. వేడిచేసినప్పుడు వచ్చే బుడగలు; కుంపి. వేడిబూడిద; కుంపు. ఎక్కువగా కాలిపోవు; కుమ్మట్టి. పొట్టును వేసు కొనే పాత్ర; కుమ్మాయమ్. బాగా ఉడికిన పప్పు; మ. కుముఱుక. వేడిగాఉండు; కుంపల్. లోపలి వేడి, కుమ్మల్. ఉక్కపోసినట్లుండు, ఉష్ణంగానుండు.

మూ.ద.ద్రా. *కుమ్-.

**కుమిలించు** స.క్రి. **1**. ఉడికించు[1]. చంద్రాంగ. 4.165; **2**. బాధపెట్టు. రాధా. 2.68. త. కుముళి. బుడగలు లేచు, కుమై.

**కుంప** వి. సారాఊటను పోసిపెట్టడానికి వాడే మట్టిపాత్ర.

**కుంపటాము** చూ. కుంపటి[1].

**కుంపటి**[1] చూ. కుమ్ము. వి. **1**. నిప్పులుంచేపాత్ర. నృసింహ. 3.127; **2**. పగిలిన కుండ; **3**. నిప్పుపొయ్యి; **4**. పూరి కప్పు లేవకుండా వేసే పగిలిన చట్టి.

క. కుంపటె, కుప్పడిగె, కుప్పటె, కుమ్మటె, కుమ్మటు. నిప్పులుంచే మట్టిపాత్ర, ఇటుఅటు సులభంగా తీసుకువెళ్ళే కొలిమి; తు. గుమెలు, గుమెలుని. నివురు కప్పిన నిప్పులాగుండు; త. కుమ్మట్టి. మీదనుంచే పదార్థాల్ని వేడిగా ఉండడానికి లోపల ఉంచే మండుతున్న పొయ్యి; (తివ్) కుంప్-ఇటు-చట్టి. ఎటుబడితే అటు సులభంగా తీసుకువెళ్ళే కొలిమి, కంసాలులు నిప్పు పెట్టుకునే కుంపటి; కుంపి. వేడిబూడిద; కుమతమ్. పొయ్యి, ఇనపకుంపటి; చూ.మ. కుంబల్. లో వేడి.

**కుంపటాము** వి. చాలా పొయ్యిలున్న గుండ్రటి బట్టి. **కుంపటితొట్టి** వి. బొగ్గులతో వంటచేసుకోడానికి వీలుగా చేసిన కుంపటి. **కుంపటిపావలం** వి. శైవులైన కొన్ని కులాల వారు సాంబ్రాణి పొగ వేయడానికి ఉపయోగించే మట్టి పాత్ర. **కుంపటిపెట్టు** స.క్రి. **1**. తగాదాపెట్టు; **2**. ఏదోఒక అనాహుతం తెచ్చిపెట్టు. **కుంపటిపెనము** వి. పొయ్యికి అమర్చి ఉండే మట్టి పెనము. **కుంపటిపొయ్యి** వి. కుంపటి తొట్టి. వి. బొగ్గుతీసి వంట చేసుకోడానికి సారెమీద చేసిన వంటపొయ్యి. **కుంపటిసుడి** వి. ముచ్చెగుంటలో ఉండే సుడి, అశుభదాయకమైన సుడి. **కుంపటెత్తుకొను** అ.క్రి. కష్టాలు తెచ్చిపెట్టుకొను. <కుంపటి[1] + ఎత్తుకొను. **కుంపట్లు** రూ. కుంపిట్లు. వి.బ.వ. ఆము కాలిన తర్వాత రేవులకు పెట్టే మూతలు.

**కుంపటి**[2] వి. ఉన్నిదారం (కూర్పొని) వడికేటప్పుడు పెట్టే తిప్పే కుదురు.

**కుంపటెత్తుకొను** చూ. కుంపటి[1].

**కుంపట్లు** చూ. కుంపటి[1].

**కుంపాసు** వి. దిక్సూచి.

పో. కుంపస్సు; ఇం. *Compass*.

<పో. కుంపస్సు.

**కుంపించు** స.క్రి. బాధించు, పీడించు.

**కుంపిట్లు** రూ.చూ. కుంపట్లు. వి.బ.వ. ఆముకాలిన తర్వాత రేవులకు పెట్టే మూతలు.

**కుంపిణి** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘం, ఆంగ్లేయ ప్రభుత్వం వారు.

**కుంపిణీ** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘం.

**కుంపిని** రూ. కుంపెణి, కుంపిణీ. కుంపినీ, కుంఫిణి, కుంఫిణీ. కుంఫిని, కుంఫినీ, కుంబిణి. వి. పాశ్చాత్య వర్తక సంఘం, ఆంగ్లేయ ప్రభుత్వంవారు.

పో. కుంపన్యి; స్పా. కొంపనీయా; ఫ్రెం. కోంపేఞా; మలయ. కుప్పిణ్ణి, కుంబణ్ణి; ఇం. *Company*.

<పో. కుంపన్యి.

**కుంపిణివివర్తకుఁడు** వి. కంపెనీ వర్తకుడు.

**కుంపినీ** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘం.

**కుంపీ** వి. పిల్లలు డబ్బు దాచి పెట్టటానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టి బుడ్డి.

**కుంపీలు** వి.బ వ. వెలక్కాయ మాదిరి ఉండే చిప్పబుడ్లలో ఒకరకం.

**కుంపె** రూ. కంపె. వి. తాంబూల పాత్ర. ఆం.భా. 2.166.

త. కుంపా. వెండి లేదా ఇత్తడితో చేసిన ఒకరకమైన పాత్ర.

<త. కుంపా.

**కుంపెవ** వి. కర్ణభూషా విశేషం. ఆం.భా. 2.148.

**కుంపెరుగు** వి. దధిభేదం, కుండపెరుగు. ఆం.భా. 2.259.

<కుండ + పెరుగు.

**కుంఫిణి** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘం, ఆంగ్లేయ ప్రభుత్వం వారు.

**కుంఫిణీ** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘం, ఆంగ్ల ప్రభుత్వంవారు.

**కుంఫిని** రూ.చూ. కుంపిని. వి. ఆంగ్లేయ ప్రభుత్వంవారు, పాశ్చాత్య వర్తక సంఘం.

**కుంఫినీ** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘంవారు.

**కుంబం** రూ.చూ. కుంభం. వి. బండి ఇరుసుకు తగిలి ఉండి ఆకులద్వారా చక్రాన్నిపట్టి ఉంచే గుండ్రటి కొయ్యదిమ్మ.

**కుంబకట్టు** రూ.చూ. కుంబంకట్టు. వి. బండి కుండకు చుట్టూకట్టిన ఇనపరేకు. **కుంబంకట్టు** రూ. కుంబకట్టు, కుంబుంకట్టు, కుంభకట్టు. వి. బండికుండకు చుట్టూకట్టిన ఇనపరేకు.

**కుంబకట్టు** చూ. కుంబం.

**కుంబకోణము** వి. మోనం.

ఎం. కుంభఘోణ-. తంజావూరు జిల్లాలో ఒక ప్రసిద్ధ పట్టణం.

<నం. కుంభఘోణ- (అర్థవిపరి.).

**కుంబంకడవ** రూ. కుమ్మంకడవ. వి. జాతర్లలో దున్నపోతును నరకడానికి ముందు దాని తలమీద నీళ్ళుపోయడానికి వాడే మట్టిపాత్ర.

**కుంబంకుండ** రూ.చూ. కుంభంకుండ. వి. జాతర్లలో కుంభం కూడు వండడానికి వాడే మట్టిపాత్ర.

**కుంబపుకుండ** రూ.చూ. కుంభంకుండ. వి. జాతర్లలో కుంభం కూడు వండడానికి వాడే మట్టిపాత్ర.

**కుంబరి** రూ.చూ. కుమ్మరి. వి. కుండలు మొదలైన మట్టి పాత్రలను తయారుచేసే కులానికి చెందినవ్యక్తి.

**కుంబరిపని** రూ.చూ. కుమ్మరిపని. వి. మట్టిపాత్రలు చేసేవారి వృత్తి.

**కుంబాద్రి** వి. జ్ఞానపిత, శిశువు పెరిగి పెద్దై క్రైస్తవ మత ధర్మానుసారంగా ప్రవర్తించడానికి నామకరణ సందర్భంలో పూటపడేవాడు.

పో. కుంపాద్రి. జ్ఞానపిత, మిత్రుడు, ఇరుగుపొరుగువాడు ; స్పా. కుంపాద్రే.

<పో. కుంపాద్రి.

**కుంబి**[1] రూ. కుంబీ. వి. బట్టను చలవచేయడం.

**కుంబి**[2] వి. గోడలోని దిమ్మమీది మూరు.

**కుంబిగోడ** రూ.చూ. కుమ్మిగోడ. వి. బావికి కట్టిన గుండ్రటిగోడ.

**కుంబింకుండ** రూ.చూ. కుంభంకుండ. వి. జాతర్లలో కుంభం కూడు వండటానికి వాడే మట్టిపాత్ర.

**కుంబీ** రూ.చూ. కుంబి[1]. వి. బట్టను చలవచేయడం.

**కుంబీలు** రూ. కుంబులు, కుమ్మీలు, కుమ్ములు. వి.బ.వ. పిట్టగోడలు.

**కుంబుంకట్టు** రూ.చూ. కుంబంకట్టు. వి. బండికుండకు చుట్టూ కట్టిన ఇనపరేకు.

**కుంబులు** రూ.చూ. కుంబీలు. వి.బ.వ. పిట్టగోడలు.

**కుంభం** రూ. కుంబం. వి. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండిచక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య.

నం. కుంభ-. కడవ.

<నం. కుంభ-. (అర్థవిపరి.).

**కుంభకట్టు** రూ.చూ. కుంబకట్టు. వి. కుండకట్టు, బండి కుండకు వేసిన ఇనప కట్టు.

**కుంభకట్టు** చూ. కుంభం.

**కుంభకర్ణుడు** వి. ఎక్కువగా నిద్రపోయేవాడు.

నం. కుంభకర్ణ-. రావణుని సోదరుడు.

<నం. కుంభకర్ణ- (అర్థవిపరి.).

**కుంభంకుండ** రూ. కుంబంకుండ, కుంబపుకుండ, కుంబింకుండ, కుమ్మంకుండ. వి. జాతర్లలో కుంభంకూడు వండడానికి వాడే మట్టిపాత్ర.

**కుంభము** వి. గ్రామదేవత కొలుపులు మొ. సందర్భాల్లో ఆయా దేవతల కాహారార్థం పోసే అన్నపు రాశి.

**కుంభారతి** వి. అలఘారతి.

**కుంభిణి** రూ.చూ. కుంపిని. వి. పాశ్చాత్య వర్తక సంఘంవారు.

**కుమ్మ** వి. నీరుపోసిన నిప్పు, జ్వాల లేని నిప్పు, ఊక నిప్పు.

**కుమ్మకు** రూ. కుమ్మక్కు. వి. 1. సహాయం, తోడు ; 2. దురాలోచన, గూడుపుఠాణి, దొమ్మి.

క. కుమకి, కుముకు, కుమ్మకు. సహాయం ; త. కుమ్మక్కు, కుముక్కు ; మ. కుమక్. సహాయం ; బ్రా. కుమక్. సహాయం, తోడు.

**కుమ్మక్కు** రూ.చూ. కుమ్మకు. వి. గూడుపుఠాణి, దొమ్మి.

**కుమ్మంకడవ** రూ.చూ. కుంబంకడవ. వి. జాతర్లలో దున్నపోతును నరకడానికి ముందు దానిమీద నీళ్ళుపోయడానికి వాడే మట్టిపాత్ర.

**కుమ్మంకుండ** రూ.చూ. కుంభంకుండ. వి. జాతర్లలో కుంభం కూడు వండడానికి వాడే మట్టిపాత్ర.

**కుమ్మర** రూ. కుమ్మఱ. వి. కుండలు మున్నగునవి చేసి జీవించే జాతి, కులాల జాతి. ఉ.హరి. 3.48. విణ. నల్లని.

నం. కుంభకార-, కుమ్మరి ; ప్రా. కుంభఅర-, కుంబార ; అమా.అప. కుంభిఅర-, కుంభార ; పా. కుంభకార-.

క. కుంబాఱ, కుంబఱ. కుమ్మరి ; తు. కుంబారె ; త. కుంపకారన్. కుమ్మరి ; మ. కుంభకారన్ ; కుఱ. కుంబరెంజు ; కువి. కుంగ్బ, కూంగ్బ, కూంగ్బా కుమ్మరి ; పర్జి. కుమ్మల్. కుమ్మరి.

<ప్రా. కుంభఅర-.

**కుమ్మరగువ్వ** వి. పక్షివిశేషం, ఖంజరీటం. **కుమ్మరచెట్టు** వి. ఒకానొకచెట్టు. **కుమ్మరత** వి. కుమ్మరది, కులాలస్త్రీ. **కుమ్మరది** వి. కుమ్మరజాతి స్త్రీ, కులాలి. **కుమ్మరపురుగు** రూ. కుమ్మరపురువు, కుమ్మరపుర్వు. వి. కుమ్మరవానివలె ఎల్లప్పుడు మట్టిలోఉండే పురుగు. **కుమ్మరపురువు** రూ.చూ. కుమ్మరపురుగు. వి. కుమ్మరవానివలె ఎల్లప్పుడు మట్టిలోఉండే పురుగు. **కుమ్మరపుర్వు** రూ.చూ. కుమ్మరపురుగు. వి. కుమ్మరవానివలె ఎల్లప్పుడు మట్టిలో ఉండే పురుగు (భట్టుమూర్తి చాటువు). **కుమ్మరపొణకు** వి. మెత్తని కర్ర కలిగిన ఒక పెద్ద చెట్టు, దీని కలపనుంచి తీసిన నార ఏనుగుల మోకులు తయారీలో ఉపయుక్తం (Sterculia Villosa). **కుమ్మరపొనిక** వి. కుమ్మరచెట్టు, నల్లని ముంజగడ్డి, కృష్ణముంజం. ఆం.భా. 2.64. **కుమ్మరపోలిక** రూ.చూ. కుమ్మరపోల్కి. వి. కుమ్మరచెట్టు, నల్లని ముంజగడ్డి. **కుమ్మరపోలికచెట్టు** రూ. కుమ్మరపోలికిచెట్టు. వి. వృక్షవిశేషం. **కుమ్మరపోలికి** రూ.చూ. కుమ్మరపోల్కి. వి. వృక్షవిశేషం. వేగి, తణుకుచెట్టు (Cyrocarpus Jacquine). **కుమ్మరపోలికిచెట్టు** రూ.చూ. కుమ్మర

పోలికచెట్టు. వి. వృక్షవిశేషం. కుమ్మరపోల్కి రూ. కుమ్మరపోలిక. కుమ్మరపోలికి. వి. వృక్షవిశేషం. వేగి. హంస. 4.11. కుమ్మరబద్ధు వి. కొండగురవతీగ (Smilax macrophylla). కుమ్మరబూచి వి. కుమ్మరపురుగు. కుమ్మరమన్ను రూ. కుమ్మరిమన్ను. వి. బండు, కాలవమట్టి, కుంటమన్ను, చెరువుమట్టి కుమ్మరవాఁడు వి. కుమ్మరి, కులాలుడు. కుమ్మరసాన రూ. కుమ్మరిసాన. వి. 1. కులాలచక్రం. దశా. 1.195 ; 2. బాలక్రీడా విశేషం. కుమ్మరసారె రూ.చూ. కుమ్మరిసారె. వి. 1. బాలక్రీడా విశేషం. హంస. 3.146 ; 2. కులాలచక్రం ; 3. రోహిణీ నక్షత్రం, కుమ్మరిసారె మాదిరి కోనుగా ఉండే అయిదు (ఆరు ?) చుక్కల మొత్తం. కుమ్మరసారెచుక్క వి. కుమ్మరిసారె ఆకారంలో ఉండే నక్షత్రం, విశాఖానక్షత్రం. కుమ్మరస్వరూపము వి. కుండలు, మూకుళ్లు మొ. వాటి ఆకారం (వస్తువు). కుమ్మరాటకం వి. కుమ్మరివృత్తి. కుమ్మరామ రూ.చూ. కుమ్మరాము. వి. కుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం. కుమ్మరామి రూ. చూ. కుమ్మరాము. వి. కుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం. కుమ్మరాము రూ. కుమామం, కుమ్మరామ, కుమ్మరామి, కుమ్మరిఆమం. వి. కుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం. కుమ్మరాముగోడ వి. కుండలు కాల్చడానికి ఆముకు ముందువైపు మట్టితోగాని, ఇటుకతోగాని, అర్ధచంద్రాకారంగా కట్టిన గోడ. కుమ్మరావము వి. కుమ్మరి కాల్చటానికి ఏర్పరచిన కుండలు మొ. వాని దొంతర. ఉ.హరి. 3.48 < కుమ్మర + ఆవము.

**కుమ్మరం** వి. కుమ్మరపని, కుమ్మరవృత్తి.

**కుమ్మరాటకం** చూ. కుమ్మర.

**కుమ్మరామ** చూ. కుమ్మర.

**కుమ్మరామి** చూ. కుమ్మర.

**కుమ్మరాము** చూ. కుమ్మర.

**కుమ్మరాముగోడ** చూ. కుమ్మర.

**కుమ్మరావము** చూ. కుమ్మర.

**కుమ్మరి** రూ. కుంబరి. చూ. కుమ్మర. వి. కుంభకారుడు. కుమ్మరవాడు. కాశీ. 2.99.

కుమ్మరిఆమం రూ. చూ. కుమ్మరాము. వి. కుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం. కుమ్మరిచక్రం వి. సారె, మట్టితో పాత్రలు చేయడానికి కుమ్మరి ఉపయోగించే చక్రం. కుమ్మరిపని రూ. కుంబరిపని. వి. మట్టిపాత్రలు చేసేవారి వృత్తి. కుమ్మరిపెంకు వి. మామూలుగా ఇళ్ళు కప్పడానికి వాడే చిన్నపెంకు. కుమ్మరిపొయ్యి వి. వంటచేయడానికి సారె మీదుగా కవిడిగా చేత్తో కుమ్మరి తయారు చేసే మట్టిపొయ్యి. కుమ్మరిబట్టీ వి. ఆముకుండలు కాల్చడానికి నిర్మించిన కట్టడం. కుమ్మరిబిందె వి. కప్పుకుండ. కుమ్మరిమట్టి వి. కుమ్మరమన్ను. చెరువు, కుంటలు మొ. వాటి నుండి కుమ్మర్లు తెచ్చేబంకమట్టి. కుమ్మరిమన్ను రూ. చూ. కుమ్మరమన్ను. వి. వరదల్లో కొట్టుకొని వచ్చిన మెత్తని మట్టి. కుమ్మరిమాన్నెం రూ. చూ. కుమ్మరిమాన్యం. వి. తమకు చేసినసేవకు పారితోషికంగా జమిందార్లు నవాబులు మొ. వారు కుమ్మర్లకు ఇచ్చినభూమి. కుమ్మరిమాన్యం రూ. కుమ్మరిమాన్నెం. వి. తమకు చేసిన సేవకు పారితోషికంగా జమిందారులు, నవాబులు మొ. వారు కుమ్మర్లకు ఇచ్చిన భూమి. కుమ్మరిరాయి వి. రాయిసర్చేటప్పుడు వాటిలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రటి రాయి. కుమ్మరివర వి. అడుగు ఎత్తులో మూడు, నాలుగు అడుగుల వైశాల్యంతోచేసిన మట్టివలయం. కుమ్మరిసాన రూ. చూ. కుమ్మరసాన. వి. కులాలచక్రం. కుమ్మరిసారి రూ. చూ. కుమ్మరిసారె. వి. సారె, మట్టిపాత్రను చేయటానికి కుమ్మరి ఉపయోగించే చక్రం. కుమ్మరిసారె రూ. కుమ్మరసారె, కుమ్మరిసారి, వి. 1. కులాలచక్రం. భార. ఉద్యో 4.116 ; 2. బాలక్రీడా విశేషం. కుమ్మరిసెట్టి వి. కుండలు మొ. మట్టిపాత్రలను తయారుచేసే కులానికి చెందినవాడు.

**కుమ్మరించు** రూ. కుమ్మలించు, క్రుమ్మరించు. స. క్రి. 1. మిక్కుటంగా వెలువరుచు. భీమ. 1.117. ఆము 4.83 ; 2. కుండమున్నగు వాటి నుంచి జలాది పదార్థాల్ని అధికంగా వెలువరుచు.

క. కుప్పరిసు, కుక్కరిసు, కుప్పళిసు. పైకెత్తినేల మీదికి విసరటం, త. కుముకుము. వ్యాపింపజేయు. కుప్పఱుట్టల్లు. విసరటం, లేక కిందికి తోయటం.

కుమ్మరింత రూ. కుమ్మలింత. వి. దిగబోయటం, మల్లబంధ విశేషం. కుమ్మరింపు[1] వి. కుమ్మరించటం. హంస. 1.206.

**కుమ్మరింత** చూ. కుమ్మరించు.

**కుమ్మరింపు[1]** చూ. కుమ్మరించు.

**కుమ్మరింపు[2]** వి. మల్లబంధ విశేషం.

త. కుప్పరట్టల్లు. విసరటం లేక కిందికితోయటం.

**కుమ్మరిలు** రూ. కుమ్మరిల్లు. అ.క్రి. కుండలోనగు వాటినుంచి జలాదులు ఒక్కసారిగా పడు. హరి. పూ. 5.149.

**కుమ్మరిల్లు** రూ. చూ. కుమ్మరిలు. అ. క్రి. జలాదు లొక్కసారిగా వెలువడు, నీళ్ళుచిందు, కారు.

**కుమ్మరు** రూ. చూ. క్రుమ్మరు. అ. క్రి. తిరుగు, చరించు.

**కుమ్మఱి** రూ. చూ. కుమ్మర. వి. కుమ్మరజాతి.

**కుమ్మలించు** రూ. చూ. కుమ్మరించు. స. క్రి. 1. మిక్కుటంగా వెలువర్చు ; 2. కుండ మొ. వాటినుంచి జలాది పదార్థాల్ని అధికంగా వెలువరుచు.

**కుమ్మలింత** రూ. చూ. కుమ్మరింత. వి. 1. దిగబోయటం ; 2. మల్లబంధ విశేషం.

**కుమ్మి[1]** రూ. కుమి[1]. వి. 1. కుసూల విశేషం, ఒకవిధమగు పొణక. పండి. చ. 1.44 వ ; 2. కప్పుఎగరకుండా దాని మీద వేసేకట్టు.

త. కుమై. బట్టలబుట్ట ; కొమ్మె. బట్టలబుట్ట ; మ. కుమి. కుప్ప, దిబ్బ.

**కుమ్మి[2]** రూ. కుమి[2]. వి. చప్పట్లు కొడుతూ చేసేనాట్యం.

త. కుమ్మి. చప్పట్లు కొడుతూ పాడుతూ చేసేనాట్యం ; కొమ్మి, కొమ్మి, కొప్పి. చప్పట్లు కొడుతూ ఆడే ఒకఆట ; పో. చూ. కుమి.

**కుమ్మిగోడ** రూ. కుంబిగోడ. వి. బావికి కట్టిన గుండ్రటిగోడ.

**కుమ్మిటి** వి. పూలమొక్కలు పెంచడానికి 6 అంగుళాలనుంచి

18 అంగుళాల వరకు ఎత్తుగల మట్టికుండీ.

**కుమ్మీలు** రూ. చూ. కుంబీలు. వి.బ.వ. పిట్టగోడలు.

**కుమ్ము**[1] రూ. కుము, క్రుమ్ము, గుమ్ము[5]. వి. **1.** పోటు, దెబ్బ, దెబ్బలాట, జగడం. ఘటికా. 2.116; **2.** ఇబ్బంది. స.క్రి. **1.** పొడుచు. ప. చ. 2.59; **2.** నలగగొట్టు, దంచు. శేష. 3.37. మట్టిని పాకం చేయడానికి కాలితో బాగా తొక్కడం.

క. కుమ్ము, గుమ్ము. రోకలితో దంచు; కొడ. కుమ్మ్- (కుమ్మి). చిలకటం, గిలకొట్టటం; త. కుమ్ము. రోటిలో నెమ్మదిగాదంచు; కుమై, కుఱు. రోటిలో నెమ్మదిగా దంచు, దంచటం; కుఱ్ఱు. దంచు, కొట్టు, పోటు, కుట్టు, పొడుచు, కొట్టు, రోటిలో దంచినట్లు దంచటం, కుట్టు, పిడికిలితో నెత్తిమీదకొట్టు, పో. చూ. కుమి. ఎక్కువగా దంచు; మ. కుమ్ము; కో. కుమ్ (కుమి). రోటిలో వేసి మెల్లగాదంచు; తొ. కుమ్ (కుమి). మెల్లగా దంచటం; గోం. కురుమానా. రోటిలోదంచటం.

**కుమ్ముకొను** అ.క్రి. పొడుచుకొను. **కుమ్ముడిగడచు (-కడచు)** స.క్రి. మట్టినికుమ్మి దిమ్మనతో అణగగొట్టు. **కుమ్ముదుమ్మగు** అ.క్రి. పగగొను, వైరపడు. **కుమ్ముపురుగు** రూ. చూ. కుమ్ముపురువు. వి. ఒక జాతిపురుగు. **కుమ్ముపురువు** రూ. కుమ్ముపురుగు, కుమ్ముపుర్వు. వి. ఒక జాతిపురుగు. ప్రబంధ. 1.30. **కుమ్ముపుర్వు** రూ.చూ. కుమ్ముపురువు. వి. ఒకరకం పురుగు. **కుమ్ములాట** వి. దెబ్బలాట. **కుమ్ములాడు** అ.క్రి. పోట్లాడు, పోరు. శివరా. 4.27.

**కుమ్ము**[2] వి. **1.** పొట్టునిప్పు, కుకూలం. చంద్రాంగ. 4.167; **2.** పిడకనిప్పు, పిడకలతో వేసుకొనే చలిమంట.

పో.చూ. క. కుంబు. చెడిపోవు, పుచ్చిపోవు; పో.చూ. తు. కుంటు. చెడిపోవు, పుచ్చిపోవు; కుంబి. ఎండమావి; త. కుంపి. వేడిబూడిద; మ. కుంపి. కుంపిరి, ఎండమావి; కుంపల్. లోపలి వేడి, కుమ్ము.

**కుమ్ముకాఁచు** రూ.చూ. కుమ్ముగాఁచు. అ.క్రి. పిడక మంటవద్ద చలి పోగొట్టుకొను. **కుమ్ముగాఁచు** రూ. కుమ్ముకాఁచు. అ.క్రి. చలిమంటచే శరీరాన్ని వెచ్చచేసికొను. శివరా. 4.27. **కుమ్ముసేయు (-చేయు)** స.క్రి. పాడుచేయు.

**కుమ్ము**[3] విణ. గూఢమైన.

**కుమ్ముసుద్ది** వి. **1.** సంకేతవృత్తాంతం, గూడార్థం గల వంగతి; **2.** పొడుపుకథ. **కుమ్ముసుద్దులు** వి.బ.వ. గుస గుసలు.

**కుమ్ములు** రూ.చూ. కుంబీలు. వి.బ.వ. పిట్టగోడలు, కుమ్మీలు.

**కుమ్మె** చూ. కుమ్ము[1]. వి. **1.** పోటు, పొడుపు. వేంక. పంచ. 2.105; **2.** గంటు, నొక్కు.

పో.చూ. క. కొమె. కాలటం మొదలెట్టు, అగ్గిలేక కోపం; త. కుమై. కష్టం.

**కుమ్మెనొక్కు** అ.క్రి. గాయమగు. **కుమ్మెలుపోవు** అ.క్రి. నొక్కులుపడు, గంట్లుపడు. ప్రభా. 5.62.

**కుమ్మేయు** స.క్రి. జాడు మొ. వాటితోగట్టిగా కట్టు.

< కుమ్ము[1] + వేయు.

**కుయ** రూ.చూ. కుయ్య[1]. వి. వరానికి అడ్డంగా వేసే ఇనప బద్ద లేదా కొయ్య.

**కుయి** రూ.చూ. కూయి. వి. మొర. భాగ. 10. పూ. 995. విణ. రక్షకమైన.

**కుయిపెట్టు** రూ.చూ. కుయివెట్టు. అ.క్రి. మొరపెట్టు. **కుయిపోవు** రూ. కుయివోవు. అ.క్రి. రక్షకంగా పోవు. రుక్మా. 2.101. **కుయివెట్టు (-పెట్టు)** రూ. కుయిపెట్టు. అ.క్రి. మొరపెట్టు. ఆము. 2.48. **కుయివోవు (-పోవు)** రూ.చూ. కుయిపోవు. స.క్రి. విడిపించబోవు, రక్షించబోవు.

**కుయిండ్లు** రూ.చూ. కువ్విన్లు. వి.బ.వ. **1.** బల్ల ముంతలపైన మూయడానికి బుడబుడక మోస్తరుగాచేసిన మట్టి మూతలు; **2.** పాత్రలు పడకుండా మూడువైపుల ఆపుగా పెట్టడానికి వాడే చిన్నమట్టి దిమ్మలు.

**కుయిలు** వి. కిటికీ లేదా వాకిలి చట్టాలు బిగించడానికి కొయ్య చివర వేసేతాలి.

**కుయో** రూ.చూ. కుయ్యో. వి. భయదుఃఖాదులతో చేసే ధ్వన్యనుకరణం, ఆర్తధ్వని యొక్క అనుకరణం.

**కుయోమొర్రో** రూ.చూ. కుయ్యోమొఱ్ఱో. వి. దుఃఖాదుల్లో చేసే ధ్వనికి అనుకరణం. **కుయోమొఱ్ఱో** రూ.చూ. కుయ్యో మొఱ్ఱో. వి. భయదుఃఖాదులతో చేసే ఆర్తధ్వనియొక్క అనుకరణం. ద్వి.సా.చ. 3.158.

**కుయ్య**[1] రూ. కుయ, కుయ్యి[3]. వి. చక్రం కుండ అరగకుండా ఉండడానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోవైపునా వేసిన ఇనప కట్టు, వరానికి అడ్డంగా వేసే ఇనప బద్దీ లేదా కొయ్యపట్టి, **2.** గానుగ దూలానికి చివర బిగించే 'S' ఆకారపు ఇనపకొక్కెం.

**కుయ్యమొల** వి. కొయ్యతో చేసినమేకు.

**కుయ్య**[2] రూ. కుయ్యి[1], కుయ్యెన. వి. **1.** బల్లముంతలపైన మూయడానికి బుడబుడక మోస్తరుగా చేసిన మట్టిమూత, పాలకుండలమీద పెట్టేమూత; **2.** పాత్రలు పడకుండా మూడువైపుల ఆపుగా పెట్టడానికి వాడే చిన్నమట్టిదిమ్మ.

**కుయ్యచిప్ప** వి. పాలకుండల మీద పెట్టేమూత. **కుయ్య మూకుడు** వి. **1.** పాలకుండల మీద పెట్టేమూత; **2.** గోడల్లో నేలలో డబ్బులు, నగలుపూడ్చి పెట్టి దాచుకోడానికి ఉపయోగించే మట్టిపాత్ర.

**కుయ్యంరాయి** రూ. కుయ్యాంరాయి. వి. రాతితో కట్టిన ఆర్చి, మధ్యలో బలం కోసం బిగించిన పెద్దరాయి.

**కుయ్యంరౌతు** వి. కుయ్యంరాయి. రాతితో కట్టిన ఆర్చి మధ్యలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

**కుయ్యవెత్తు** స.క్రి. అచ్చుకట్టేటప్పుడు, కిందిపడిదారాలు పైపడి దారాలతో లంకె పడేటట్టు పైకితీయు.

**కుయ్యన్న** వి. పనికిమాలిన వాడు, ఎంబెన్న.

**కుయ్యాంరాయి** రూ.చూ. కుయ్యంరాయి. వి. రాతితో కట్టిన ఆర్చి మధ్యలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

**కుయ్యాంకట్ట** వి. కిటికీ రెక్కల్ని బంధిస్తూ గుండ్రంగా తిరగ డానికి వీలుగా అమర్చబడిన చిన్నగడియ.

**కుయ్యాడు** చూ. కుయ్య[2].

**కుయ్యాలించు** చూ. కుయ్య[2].

మొ. వాటి హారం.

**కూటువు** రూ.చూ. కూటువ. వి. 1. గుంపు. అచ్చ.రా. ఆరణ్య. 2.6 ; 2. స్త్రీ, పురుషుల సాంగత్యం ; 3. పోగు ; 4. దండు.

**కూడ** రూ. కూడా. పో.చూ. కూడు. అవ్య.ప్ర. 1. సహార్థకం. భార. ద్రోణ. 5.210 ; 2. సముచ్చయార్థకం. హర. 6.24 ; 3. సైతం.

క. కూడ్. కలసి, కూడా ; త. కూడు. కలిసిఉండి.

**కూడగట్టకొను** చూ. కూడు².

**కూడదీసికొను** చూ. కూడు².

**కూడదెచ్చుకొను** చూ. కూడు².

**కూడపోయు** చూ. కూడు².

**కూడముట్టు** చూ. కూడు².

**కూడమెట్టు** చూ. కూడు².

**కూడబడు** చూ. కూడు².

**కూడబలుకుకొను** చూ. కూడు².

**కూడబాఱు** చూ. కూడు².

**కూడబెట్టు** చూ. కూడు².

**కూడలి** చూ. కూడు². రూ. గూడలి. వి. 1. నద్యాదులు కలిసేచోటు. బసవ. 7.973. పు. ; 2. ఎల్ల. అవధి ; 3. రెంటినూటి కూడిక ; 4. చౌరస్తా.

క. కూడల్. కూడలి ; త. కూటల్. నదీముఖం.

**కూడలిదారి** వి. చౌకు, నాలుగు దారులు కలిసేచోటు. **కూడలిపట్టు** వి. 1. రచ్చపట్టు, సమావేశ స్థలం, పలువురు కలుసుకోనే స్థలం , 2. కచేరిసావడి. **కూడలిఱాయి** వి. ఎల్లరాయి, సరిహద్దురాయి. **కూడలివాయి** వి. రెండుపంచలు కలిసి మూలలో ఏర్పరచిన నీటిదారి.

త. కూటల్‌వాయ్.

**కూడా** రూ.చూ. కూడ. అవ్య. సహార్థకం, తోడ.

**కూడామాడా** చూ. కూడు².

**కూడిక** చూ. కూడు².

**కూడికెవాండ్లు** చూ. కూడు². వి.బ.వ. పాలికాపులు.

**కూడికొను** చూ. కూడు².

**కూడించు** చూ. కూడు².

**కూడిపోయు** చూ. కూడు².

**కూడిహూడిమెలగు** చూ. కూడిమాడు.

**కూడిమాడు** చూ. కూడు².

**కూడియాడు** చూ. కూడు².

**కూడియుండు** చూ. కూడు².

**కూడివచ్చు** చూ. కూడు².

**కూడు¹** చూ. కుడుచు. వి. తిండి, అన్నం. భార.ఆది. 7.256.

క. కూళ్. అన్నం ; త. కూళ్. గంజి, అన్నం ; కూళ్తై(-న్త్-వ్-). మెత్తనగు, బాగాపండిన ; మ. కూళ్. అన్నం ; కూఱమ్. దైవప్రసాదం.

మూ.ద.ద్రా. *కూళ్.

**కూటికల్లు** వి. వరికల్లు. **కూటికుండ** వి. అన్నంకుండ, అన్నం వండటానికి వాడే మట్టికుండ. **కూటికుండలచేటు** వి. తిండిచేటు. **కూటికుమకు** వి. భోజనాయనంతో పట్టే నిద్ర. **కూటికువ్వలు** వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112. **కూటిగంజి** వి. వరి కూటిగంజి, అన్నం వండి వార్చిన గంజి. **కూటిచవిత్తేల్చు** అ.క్రి. అన్నం రుచి చూపు. పారి. 1.49. **కూటిదుత్త** వి. చేనినట్టి, పొలంలోకి అన్నం మొ. తీసికొనిపోవడానికి వాడే మట్టిపాత్ర. **కూటినీళ్ళు** వి.బ.వ. పుల్లనీళ్ళు, తరవాణి. **కూటిపేద** వి. తిండిలేనివాడు, తిండిలేనిది. **కూటిపేద తోడుతప్పినట్లు** అవ్య. కూటిపేద మరొక పేదవాని తోడును సహించలేడు, యాచకునికి యాచకుడు శత్రువుకదా ! అలా జత వదిలినట్లు. సుద. 3.74. **కూటిప్రొద్దు** వి. భోజనవేళ. శుక. 2.333. **కూటిప్రొద్దు సంకటి** వి. వేళకు భోజనం. **కూటిబీద** వి. 1. దరిద్రుడు, అన్నాతురుడు. పాండు. 4.158 ; 2. నిరుపేద. శుక. 3.352. **కూటిముచ్చు** వి. మిక్కిలి తిండిపోతు. **కూటిలోమట్టిపోయు** అ. క్రి. జీవనాధారం పోగొట్టు. **కూటిలోవులు** వి.బ వ. లోవికుండలు, అన్నం వండడానికి ఉపయోగించే మట్టిపాత్రలు. **కూటివడియములు** వి.బ.వ. అన్నంలో నువ్వులు మొ. సంబారాల్ని చేర్చి చేసిన వడియాలు. **కూటివెచ్చము** వి. తిండిఖర్చు. **కూటిసారా** వి. అన్నంనుంచి తీసిన సారాయి. **కూడుగుడుచు** అ.క్రి. నీచ స్థితిని అనుభవించు. భాగ. 1. **కూడుసుద్దకురాని** విణ. ఎందుకు పనికిరాని. **కూడుగూటిప్రాయము** వి. చిన్నతనం. పాండు. 4.180. **కూడుగోకలు(-కోకలు)** వి.బ.వ. అన్నవస్త్రాలు. సానంద. 1.152. **కూడుగ్గబట్టు** అ.క్రి. అన్నం తినక ఉపవాసాలుండు. <కూడు¹ + ఉగ్గబట్టు. **కూడుచీరయిచ్చు(-ఇచ్చు)** స.క్రి. తిండిబట్టా పెట్టి పోషించు. భార. విరా. 1.219. **కూడుజీతము** వి. భోజనం నిమిత్తం భూమి రూపంగా ఇచ్చే దానం. ద.హిం.శా.సం. 1142, క్రీ.శ. 1268 నం. **కూడునీరు** వి. కూటినీళ్లు, గంజి. శుక. 11.103. **కూడువర్తన** వి. నిత్యభోజనాది కృత్యాలకిచ్చే భూదానం.

**కూడు²** అ.క్రి. 1. శక్యమగు, సాధ్యమగు. భార.ఆది. 1.115 ; 2. కలసిఉండు. భార. ఆది. 4.47 ; 3. కలుగు, సంభవించు. భార. ఆది. 5.204 ; 4. యుక్తమగు, తగు. భార. ఆది. 6.227 ; 5. గుమిగాచేరు, సంఘీభవించు. భార. ఆరణ్య. 1.251 ; 6. సమకూడు, లభించు. వరాహ. 4.103 ; 7. చాలు, సమర్థమగు. సారంగ. 3.29 ; 8. సంబంధించు ; స.క్రి. అ.క్రి. 1. చేరు, కలియు. భార. సభా. 1.152 ; 2. రమించు, సంభోగించు. భార. ఆరణ్య. 2.331 ; స.క్రి. 1. పొందు, చెందు ; భాగ. 10 పూ. 757 ; 2. కలుపు, సంకలితంచేయు. అప్ప. 4.149.

క. కూడు. యుక్తమగు ; కూర్చు ; కొడ. కూడ్. కలియు ; కూట్ (కూచ్-). కలియు, చేర్చు ; తు. కూడుని, కూటుని, కూణ్టుని, కూటు. కలియు, కలుపు. సంభోగించు, సభ ; త. కూటు. యుక్తమగు, గుమికూడు ; మ. కూటుక, కూటు, కూట్టుక, కుట్టు ; తొ. కూడ్, కూట్ ; కువి. కూది-కి, కూరె, చేర్చు ; కువి. ఖోడ్డ్, ఖోడ్డా. చేర్చు, కూర్చు, కూడదీయు.

పో.చూ.సం. కూటు-. సమూహం.

< మూ ద్రా. *కూణ్ట్-/కూట్-

**కూడ(గట్టుకొను(-కట్టుకొను)** స.క్రి. కూడదీసుకొను, తనతో వచ్చేటట్లు చేసుకొను. **కూడ(దీసికొను(-తీసికొను)** స.క్రి. 1. కూడదెచ్చుకొను ; 2. చేర్చుకొను ; 3. అనుకూలంగా చేసుకొను. **కూడ(దెచ్చుకొను(-తెచ్చుకొను)** స.క్రి. చేర్చుకొను. అనుకూలపరుచుకొను ; **కూడపోయు.** స. క్రి. కూడబెట్టు, రాసిపోయు, తాళ్ళ, సం. 98. **కూడముట్టు** స. క్రి. తరిమి కలుసుకొను, వెంటాడు. విక్ర. 6.78. **కూడమెట్టు** స.క్రి. అనుకూలంగా రాయించు. **కూడ(బడు(-పడు)** అ.క్రి. 1. కూడు, చేడు. భార. ఉద్యో. 1.79 ; 2. ముడుగు. కాశీ. 137 , 3. స్వస్థమగు, కుదురుపడు, దశకు. 3.52. **కూడ(బలుకుకొను(-పలుకుకొను)** స.క్రి. ముందుగా అనుకొని నిర్ణయించుకొను. అ.క్రి. ఒక మాటకు వచ్చు. **కూడ(బాయు(-పాయు)** అ.క్రి. 1. కలిసికొను, ఏకమగు. భార. విరా. 3.4; 2. కుదురుపడు. **కూడ(బెట్టు(-పెట్టు)** స.క్రి. 1. సమావేశంచేయు, ఒకచోగూర్చు. ఉ. హరి. 3.5 ; 2. నిలవచేయు. విక్ర. 2.163 ; 3. సంధానంచేయు, కలుపు, తార్చు. కవిక. 4.113 ; 4. పట్టుదారం పోగులు కలిపి సిల్కు పంటెకు చుట్టు. **కూడామాడా** అవ్య. కలిసిమెలసి. **కూడిక** వి. 1. పొందిక. నీలా. 2.24 ; 2. రతి, సంభోగం. ఆం.భా. 2.178 ; 3. సంకలనం. **కూడికొను** స.క్రి. కూడు, కలియు. **కూడించు** స.క్రి. 1. కూడబెట్టు, కూర్చు; 2. ఎచ్చవేయించు. < కూడు[2] + -ఇంచు[3]. **కూడిపోయు** స.క్రి. చిన్న కదుర్లకుచుట్టిన ఉన్నిపోగులు కలిపి పెద్ద కదురుకు చుట్టు. **కూడిమాడిమెల(గు** అ.క్రి. కలిసిమెలసి తిరుగు. విప్ర. 4.68. **కూడిమాడు** అ.క్రి. కలసిమెలసి ఉండు, అనగిపెనగి ఉండు. పి. శకు. 2 49. స.క్రి. రమించు, కూడు. హంస. 5.120. **కూడియాడు(-ఆడు)** అ.క్రి. కలసిమెలసి తిరుగు. **కూడియుండు(-ఉండు)** అ.క్రి. కలసి ఉండు. **కూడివచ్చు** అ.క్రి. లాభంకలుగు, కలిసివచ్చు. త. కుటి-వా. **కూడుకవచ్చు** అ.క్రి. కలసివచ్చు. **కూడుకొను** రూ. కూడ్కొను. స.క్రి. 1. కూడు, కలసికొను. భార. భీష్మ. 2.373 ; 2. మిత్రునిగా చేర్చుకొను. ఆము. 4.252 ; 3. రమించు. **కూడుదల** వి. లాభం, లబ్ధి. వేంక. మా. 1.68 ; క. కూడుదలె ; త. కూటుతలె, కూటుతల్. **కూడ్కొను** రూ.చూ. కూడుకొను. స.క్రి. 1. రమించు. సిం.ద్వా. 11.151 ; 2. కలిసికొను ; 3. మిత్రుడిగా చేర్చుకొను.

**కూడ్కొను** చూ. కూడు[2].

**కూణలమ్మ** రూ.చూ. కూనలమ్మ. వి. ఒక గ్రామదేవతపేరు.

**కూణలమ్మకోక** వి. ఒకరకం చీర.

**కూంధ్రాయిపొట్టు** రూ. కుణ్ద్రాయిపొట్టు. వి. మసాలాగావేసే ఉప్పుచేప పొడి.

**కూతదూరం** రూ.చూ. కూఁతదూరము. వి. 1. పిలిస్తే వినబడేంత దూరం ; 2. కూతవేటుదూరం, కోను.

**కూతవేటుదూరం** రూ.చూ. కూఁతవేటుదూరము. వి. కూత వినపడేంత దూరం. కూతదూరం, పిలుపుమేర.

**కూతు** వి. వీథిభాగవతం.

**కూత్తాడు** అ.క్రి. నాట్యంచేయు.

**కూన[1]** రూ.చూ.కున్న. పో.చూ. గున్న: వి 1. శిశువు. కళా. 3.86 ; ద్వి. హరిశ్చ. ఉ. 1736 పం ; 2. పశుపక్ష్యాదుల శిశువు. ద్వి. హరిశ్చ. 743 పం. ; 3. తీగ. సాంబ. 3.58 ; 4. కన్నె, పడచు. విజ. లేతదైన. వసు. 2.82.

క. కున్ని ; కొడ. కూఙ్, కున్ ; తు. కొడ్, కుర్ని; త. కుంచు ; పో.చూ. కున్ను. క్షీణించు ; మ. కున్ను; కొలా. కూన.

సం. కుణక.

**కూనగిలిగిచ్చ** వి. ఒకరకపుమొక్క. **కూనగుంట** రూ. కూనగుంత. వి. చిన్నపల్లం. **కూనగుంత** రూ.చూ. కూనగుంట. వి. 1. మీటు మొదలు అనే పల్లం. హంస. 1.193 ; 2. ఏతంబావిదగ్గర మాను నిలవడానికి పాతిన కంబానికి వెనక వున్న గుంత. **కూనపులివాళ్ళు** వి.బ.వ. పద్మసాలీల దగ్గర కథలుచెప్పి అడుక్కొనేవాళ్ళు. **కూనమ్మ** వి. కూనవలె నడువలేని ఆడుది, కుంటిది. **కూనరాగము** రూ. కూనిరాగము. వి. 1. పిల్లరాగం, లోలోపలనే పాడుకొనే పాట ; 2. సంతోషంతో ఏకాంతంగా వారిలోవారు తీసేరాగం, కూనిరాగం. **కూనరొయ్య** వి. చాలచిన్నపాటి సముద్రం రొయ్య, రొయ్యపొట్టు. **కూనరోగము** పి. నేత్రరోగ విశేషం. **కూనలమ్మ** రూ. కూణలమ్మ. వి. కొలిచినవారికి కూనల్ని ఇచ్చే ఒక గొప్ప గ్రామదేవత. **కూనలమ్మచీర** రూ. కూనాలమ్మచీర. వి. 1. ఒకరకం గళ్ళచీర, వరసగా ఎనిమిది పోగులు ఎరుపు, ఒకపోగు పసుపు, ఎనిమిది పోగులు ఎరుపు, నాలుగు పోగులు పసుపూ రంగులు పెట్టి రిబ్బనంచుగాని బలపాలంచుకాని పెట్టి నేసిన చీర. శుక. 2.411 ; 2. నల్పదరంగడి చిటికెన వేలెడు ఎడంగా ఎర్రకొలికి నీలికొలికి పడేట్టు నేసిన చీర ; 3. తెలుపులో బొటనవేలెడు వెడల్పునేసి, రెండు కొలకులు నలుపు పెట్టి నేసిన చీర ; 4. ఎరుపు నీలి కలిసిన చిన్న గడిచీర ; 5. గొల్లవాళ్ళు కట్టే ఒకరకం వన్నె చీర. **కూనలమ్మపటము** వి. కూనలమ్మకు ఇష్టమైన గళ్ళచీర. వైజ. 3.100. **కూనలు** వి.బ.వ. పిల్లలకు కళ్ళలో పెరిగే కండలు. **కూనారి** వి. సంగనాచి, సంగ.

**కూన[2]** వి. 1. వెల్తురుగూన, వెల్తురుకోసం గోడలో "ం°ం" రూపంలో బిగించిన గూన పెంకులు ; 2. పెంకులోని వంపు.

**కూనతూము** వి. మునలవాయి చెరువునీళ్ళు బయటకి పోవటానికి ఉన్న తూముల్లో పైది. **కూనదిడ్డి** వి. గవాచిగోడలో పెట్టిన రంధ్రం, చువ్వలులేని కిటికీ. **కూనదొప్ప** వి. పెంకులుగా పగలగొట్టని నిండుగూన. **కూనపెంకు** రూ.చూ. గూనపెంకు. వి. ఏనగాడ పెంకు, పెంకుటింటి కప్పులో వెన్నుగాడుకు కప్పే పెద్దసైజు పెంకు. **కూనవంపు** రూ. కూనొంపు. వి. పెంకు కప్పేటప్పుడు వెల్లకిల పెట్టిన రెండు పెంకుల మీదుగా బోర్లించిన బంటి పెంకు ఉన్నతీరు. **కూనిల్లు** రూ. గూనిల్లు. వి. కూనపెంకు కప్పిన ఇల్లు. **కూనొంపు** రూ.చూ. కూనవంపు వి. పెంకు కప్పేటప్పుడు వెల్లకిలపెట్టిన రెండు పెంకుల మీదుగా బోర్లించిన బంటి పెంకు ఉన్నతీరు.

**కూన**[3] వి. కంటిలో పెరిగే దుర్మాంసం.

**కూనారి** చూ. కూన[1].

**కూనాలమ్మచీర** రూ.చూ. కూనలమ్మచీర. వి. ఒకరకం గళ్ళ చీర.

**కూని** రూ.చూ. ఖూనీ. వి. నరహత్య, హత్య.

**కూనిరాగము** రూ.చూ. కూనరాగము. వి. లోలోన పాడుకొనే పాట లేక రాగం.

**కూనిల్లు** చూ. కూన[2].

**కూనీ** రూ.చూ. ఖూనీ. వి. నరహత్య, హత్య.

**కూనీకోర్** వి. హంతకుడు.

**కూనీసలాపు(లు** వి.బ.వ. వంగిచేసే నమస్కారాలు.

హిం. ఉ. ఖూనీ. హత్య ; సలామ్, నమస్కారం.

**కూప**[1] విఐ. చెవిటి ; క్రి. విఐ. నిండుగా, పూర్తిగా.

**కూప**[2] రూ.చూ. కూలు[2]. వి. చాపీరేకును, పిడిని, కలిపే వంగిన ఇనపచువ్వ.

**కూపరాతు** వి పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు పొలం నాలుగుమూలలా గుర్తుగా పాతిన రాయి.

**కూనొంపు** చూ కూన[2].

**కూంతు** రూ.చూ. కూఁతు. వి కూతురు. ద. హిం. శా సం 4. సం. 1087. క్రీ.శ. 1065 సం.

**కూంతుఱు** రూ.చూ. కూఁతు. వి. కూతురు, కుమార్తె. ద. హిం. శా.సం.శా. 6. సం. 586. క్రీ.శ. 1074 సం.

**కూఁత** చూ. కూయు. వి. 1. మొర, ఆర్తధ్వని. కళా. 3.153 ; 2. ప్రలాపం, ప్రేలుడు. కళా. 5.50 ; 3. అరుపు, కేక. కువచ. 2.80.

త. కువ్వల్. ఆర్తధ్వని.

**కూఁతకైదువు** వి. ఊదినంతమాత్రానే శత్రువుల గుండెలు పగలగొట్టేది, శంఖం, బూరగొమ్ము. **కూఁతకొచ్చినకోడి** వి. వయసువచ్చిన పుంజు < కూఁత + -కు + వచ్చిన + కోడి. **కూఁతదూరము** రూ. కూతదూరం వి. 1. కేకకు అందే టంత దూరం ; 2. కోసు. **కూఁతనేల** వి. కూతవేటుమేర, కోసునేల, క్రోశం. ఆం.భా. 2.9. **కూఁతపట్టు** వి. కూత వేటు మేర. **కూఁతపట్టునేల** వి. కూతనేల, కేకకు అందేంత దూరం, క్రోశం.ఆం.భా. 2.9. **కూఁతపెట్టు** స.క్రి. వార్తనంపు. **కూఁతలిడు** అ.క్రి. 1. కూయు. నీలా. 3.10, 2. మొర పెట్టు. త. కూప్పులిడు. < కూఁత + -లు + ఇడు. **కూతలువెట్టు(-పెట్టు)** అ.క్రి. కేకలువేయు, అరచు. కాశీ. 7.90. **కూఁతవాటు** వి. చక్రాయుధం **కూఁతవేటు** వి. కోసు దూరం. **కూఁతవేటుదూరము** రూ. కూతవేటుదూరం. వి. 1. కోసుదూరం. హరిశ్చ. 3.65 ; 2 కూతవేస్తే విన పడేంతదూరం. **కూఁతవేటుమేర** వి. కూతవేస్తే వినబడేంత దూరం, కోసుదూరం. కకుత్స్థ. 2.8.

**కూఁతు** రూ. కూంతు, కూంతుఱు, కూఁతురు, కూఁతుఱు. వి. 1. కూతురు, పుత్రిక. భార. ఆది. 3.51 ; 2. ఆడశిశువు, బాలిక. భార. ఆది. 4.47.

క. కూసు ; త. కుంచు ; కొ. కుక్స్.

**కూఁతుకొడుకు** రూ. కూఁతురుకొడుకు. వి. దౌహిత్రుడు, మనవడు. **కూఁతుంగతులుసను(-చను)** అ.క్రి. కూతుర్ని అతగటానికి వెళ్ళు, పెత్తనంపోవు. కు సం. 8.2. **కూఁతుబిడ్డ** రూ. కూఁతురిబిడ్డ. వి. 1. గంగానది ; 2. కూతురి కూతురు, మనవరాలు.

**కూఁతురిబిడ్డ** చూ. కూఁతురు.

**కూఁతురిబుడమ** చూ. కూఁతురు.

**కూఁతురు** రూ.చూ. కూఁతు. వి. 1. పుత్రిక, కొమార్తె. భార. ఆది. 5.108, 2. ఆడది. భార. ఉద్యో. 3.199 ; 3. ఆడ శిశువు, బాలిక. కళా 4.67.

**కూఁతురిబిడ్డ** రూ.చూ. కూతుబిడ్డ వి. 1. లక్ష్మికి కూతురు, గంగ ; 2. కూతురి కూతురు, మనవరాలు. **కూఁతురిబుడమ** రూ.చూ. కూఁతురుబుడమ. వి. ఏలావాలుకం, నూగుదోస, **కూఁతురుకొడుకు** రూ.చూ. కూఁతుకొడుకు వి. మన వడు. **కూఁతురుబుడమ** రూ. కూఁతురిబుడమ. వి. ఏలా వాలుకం. నూగుదోస. ఆం.భా. 2.61.

**కూఁతుఱు** రూ.చూ. కూఁతు. వి. కూతురు, కుమార్తె.

**కూపి** రూ.చూ. కూబు. వి. కంట్రాక్టు తీసుకొన్న అడవి.

**కూపీ** రూ. కూబీ. వి. 1. రహస్యం, గుట్టు ; 2. ఓడ.

సం. కూపీ. కుప్పె.

< సం. కూపి (అర్థవిపరి.).

**కూపీతీయు** స క్రి. ఆరాతీయు, జాడకనుగొను.

**కూపు** రూ. చూ. కూబు. వి. కంట్రాక్టరు తీసుకున్న అడవి.

**కూబి** వి. ఏమితెలియని వ్యక్తి.

హిం. ఖూబ్. మంచి.

< ఉ. ఖూబ్- (అర్థవిపరి.).

**కూబీ** రూ. చూ. కూపీ. వి. 1. రహస్యం, గుట్టు ; 2. జాడ.

**కూబు** రూ. కూపి, కూపు. వి. కంట్రాక్టు తీసుకొన్న అడవి.

హిం. ఉ. ఖూబ్. మంచిది.

< ఉ. ఖూబ్ (అర్థవిపరి.).

**కూమవారి** వి. ఆయా కులస్థుల మీదవేసేపన్ను.

**కూముడి** వి. బొంతకాకి, ద్రోణకాకం.

**కూయి** రూ. కుయి, కుయ్యి[2], కూ. చూ. కూయు. వి. 1. కూత, అరుపు. కు.సం. 5.68 ; 2. దుర్వార్త, భయవార్త. ఆర్తి సందేశం. భార. విరా. 4.27 ; 3. మొర, ఆర్తధ్వని. మార్క. 1.146 ; విఐ. రక్షకమైన. భార. విరా. 5.234.

క. కూ. మొర ; త. కూ. కూతలో ధ్వని ; కూవల్. బిగ్గరగాఏడ్చు ; మ. కూ. పెద్దగామొరపెట్టు, కూయి. వేటకేక ; పర్జి. కూయి. పిల్చు ; మాల్తో. కూక్రె. బయటికి పిలుచు.

**కూయిచెప్పు** స. క్రి. ఎవరినైనా సాయానికి ఎలుగెత్తి పిలుచు. కాశీ 4.66. **కూయిపోవు** అ. క్రి. వార్త వెంటవెళ్ళు. **కూయివచ్చినవారు** వి.బ.వ. ఆర్తిసందేశాన్ని తెచ్చినవారు. హర. 7.29. **కూయివచ్చు** అ. క్రి. పిలుపువచ్చు. జైమినీ భా. 1.100.

**కూయు** రూ. కుయ్యి. అ. క్రి. 1. అరచు. భార. విరా. 4.86 ; 2. మొరపెట్టు. హరి. ఉ. 6.9 ; 3. పేలు. నిరంకు. 4.67.

క. కూగు, కూకు. బిగ్గరగా అరచు ; కూ. కేక ; కొడ. కు. కూయు ; తు. కూగుని, కూగు. కేకవేయు ; త.

కూప్రా, కూయు, సాయానికిపిలుచు; కూయులి. పలుకు చెప్పు; మ. కూకుక. కూవ్వక. అరచు, కేకవేయు: తొ. కూక్. కూయు, గోం. కుస్పానా, ఖూనానా. కొర్కు సెక్, కూస్, కుయి. కూపక. బిగ్గరగాఅరచు; పర్జి కూయ్, కూన్. కూయు; కొలా. కూగ్-కూగ్-త్. నాయి. కూగ్; ఒల్లా. కూయ్- ఖాయ్, మాల్తో. క్యూకె, క్యూక్; బ్రా. కూక్-, కన్-.

పో. చూ. సం. కూజ్-.

< మూ. ద్రా. *కూయ్-/*కూక్-.

**కూర** వి. **1**. వండినశాకం, పక్వశాకం, భార. ఆరణ్య. 1.94; **2**. అపక్వ శాకపదార్థం; **3**. కూరాకు; **4**. మాంసం.

క. కిరె, కీరె; త. కీరై. కూరలు; కజీ. శాకాలు: మ చీర; పో. చూ. గోం. క్యూసి; ఉడికిన పప్పు: కొం. కుస, కుసె; కుయి. కూస. ఆకుకూరలు; కువి. కూచ; పర్జి. కుచ్చు. కూరలు; కొలా. కుచ్చె; నా. కుచ్చె. వండిన కూరలు; గ. కుసె, కుచ్చె.

**కూరకాడ** వి. కూర, తోటకూరకాడ మొ. **కూరగాయ కవిత్వము** వి. స్వల్పలాభానికై పొగుడుతూ చెప్పేకవిత్వం. **కూరకుండీ** వి. కూరలు వేసుకోడానికి వాడేమట్టిపాత్ర. **కూరగాయకవులు(-కాయకవులు)** వి.బ వ. కూరగాయికవిత్వం చెప్పే కవులు. **కూరగాయలు(-కాయలు)** వి.బ.వ. కూరలు, కాయలు, తోటకూర, అరటికాయ మొ. ఆకు, కాయగూరలు. కు. సం. 6.35. ద. హిం. శా. సంపు. 5. సం. క్రీ. శ. 1296 సం. **కూరగాయవైద్యము(-కాయవైద్యము)** వి. చిల్లర వైద్యం, నాటువైద్యం. **కూరగాయి** వి. ఒకానొక చిన్న మొక్క (Flacourtia cataphracta). **కూరగుత్తి** వి. దస్తాగిన్ని, దస్తాదాక నాలుగువైపులా నాల్గుమట్టి చిప్పలు గుత్తుగా అతికించి ఉండిపైన పట్టుకోడానికి కాడ ఉన్న పాత్ర. **కూరచిప్ప** వి. నన్నని అంచుతో కొంచెం లోతుగా ఉండే మట్టికంచం **కూరతోట్టి** వి. కూరగాయలు పండించేతోట. ద. హిం. శా. 10 సం. శా. సం 422 క్రీ. శ. 1269సం. **కూరదొండ** వి. మామూలు దొండ, కూరవండుకునే దొండకాయ. **కూరవార** వి. కూరగాయలు, శాకపాకాదులు **కూరవెల్లి** వి. తెల్లని చిన్నపూలు పూసేఒకమొక్క. **కూరవల్లేరు** వి. ఎర్రనిపళ్ళు కాసేతీగ. **కూరపసుపు** వి. కారు పసుపు, కారల్లం, పసుపు జాతికిచెందిన ఒకమొక్క (zingiber cassumunar). **కూరవుచ్చ** వి. చిన్నసైజు కాయ, పొరకాయరుచి ఉండేరకం. **కూరమిరప** వి. పెద్ద మిరపకాయరకం. **కూరముక్క** వి. కూరలోని ఒకదునక. **కూరముక్కు** వి. మత్స్యవిశేషం. హంస. 4.187. పో. చూ. త. కిరై-మీన్. **కూరవండికనవేరగోరు** స. క్రి **1**. తగనిపని చేయు. తాళ్ళ. 8.175; **2**. కూరఉండగా గడ్డి కోసం వెదుకు. **కూరాకగు** అ. క్రి కుమిలిపోవు, కూరవలె ఉడికిపోవు, వేంక. పంచ. 4.260. **కూరాకు** రూ. కురాకు. వి. కూరగా వండుకొనే ఆకు, ఆకుకూర. భార. భీష్మ. 2.8. < కూర + ఆకు. **కూరాకుకోసితిను** స. క్రి. ఆకూ అలమూతిను. భార. భీష్మ. 2.8. **కూరాకుచేయు** స. క్రి. **1**. చంపు. సారంగ. 1.90. **2**. తేలికచేయు. **కూరాకు పురుగు** వి. ఆకుకూరలకు పట్టేపురుగు. **కూరాకైయుడుకు (-ఉడుకు)** స. క్రి. **1**. తపించు. వేంక. పంచ. 4.560.; **2**. కూరాకువలె ఉడుకు.

**కూరగొయ్యలు** రూ.చూ. కూరెగొయ్యలు. వి. ఆర్ద్రానక్షత్రం.

**కూరట** వి. పోరలటం.

పో. చూ. త. కూర్ (-త్తె, -ప్-). వంగు.

**కూరాకగు** చూ. కూర.

**కూరాకు** చూ. కూర.

**కూరాకుకోసి తిను** చూ. కూర.

**కూరాకుచేయు** చూ. కూర.

**కూరాకుపురుగు** చూ. కూర.

**కూరాకైయుడుకు** చూ. కూర.

**కూరాటికలి** చూ. కూరాడు.

**కూరాటికుండ** చూ. కూరాడు.

**కూరాటిమేడిద** చూ. కూరాడు.

**కూరాడికుండ** చూ. కురాడు.

**కూరాడు** వి. ధాన్యామ్లం, కలి, పులియబెట్టిన కడుగునీరు. మొల్ల. సుందర. 74.

పో.చూ.క. కూరాంబు. గంజి.

**కూరాటికలి** వి. పులియబెట్టిన గంజితేట, బియ్యం కడుగు నీళ్ళు. **కూరాటికుండ** రూ. కూరాడికుండ, కూరాడుకుండ. వి. **1**. గంజినీళ్ళు, బియ్యం కడుగునీళ్ళు పులియబెట్టేకుండ; **2**. పెళ్ళి మొ. శుభకార్యాల్లో వంటపొయ్యిల దగ్గర పసుపు కుంకుమ రాసి పూజచేసిపెట్టే నీటికడవ. **కూరాటిమేడిద** వి. పులికడుగు. **కూరాడికుండ** రూ.చూ. కూరాటికుండ. వి. **1**. గంజినీళ్ళు, బియ్యం కడుగునీళ్ళు పులియబెట్టే కుండ; **2**. పెళ్ళి మొ. శుభకార్యాల్లో వంటపొయ్యి దగ్గర పసుపు కుంకుమ రాసి పూజచేసిపెట్టిన నీటికడవ. **కూరాడుకుండ** రూ.చూ. కూరాటికుండ. వి. **1**. కులదేవతా స్థాపనకు బదులుగా ఉంచిన అన్నంకుండ; **2**. గంజినీళ్ళు, బియ్యం కడుగునీళ్ళు పులియబెట్టే కుండ.

**కూరింగ్** వి. పూతప్రతం.

**కూరిచి** రూ. గురించి, కూర్చి. అవ్య. గురించి, ఉద్దేశించి. 'కూరుచు' ధాతువుకు క్త్వార్థకరూపం, ఇది ద్వితీయా విభక్తిపై చేరుతుంది. దక. 3.593.

క. కుఱితు. దృష్టితో; త. కుఱిత్తు. ఉద్దేశంతో; మ. కుఱిచ్చు. వైపు, నిమిత్తంగా.

< కూరుచు + -ఇ.

**కూరిచికోలు** చూ. కూరుచు.

**కూరించు** చూ కూరు[1].

**కూరిమి** రూ. కూర్మి. వి. **1**. స్త్రీకి పురుషుడిమీదగాని, పురుషుడికి స్త్రీమీదగాని ఉండే అనురాగం, వలపు. భార. ఉద్యో. 1.350; **2**. స్నేహం. భార. ద్రోణ. 5.21; **3**. వలపు, తమి, తీవ్రానురాగం. సు.శ. 33; **4**. అనురాగం. విశ. కూరిమిగల, ప్రియమైన. రాజ. చ. 2.95.

క. కూర్మె. ప్రేమ, అనుబంధం; కూర్. ప్రేమించు, అనుబంధం కలిగిఉండు; త. కూర్; మ. కూఱుక.

ప్రేమించు ; కూఱు. ప్రేమ.

కూరిమికత్తియ రూ.చూ. కూర్మి కత్తియ. వి. ప్రేమ గల స్త్రీ. కూరిమికత్తె రూ.చూ. కూర్మికత్తియ. వి. ప్రేమ గలది, స్నేహంగలది, చెలికత్తె. కూరిమికాఁడు రూ. కూర్మికాఁడు. వి. ప్రియుడు, వలపుకాడు, స్నేహితుడు. కృ.శకు. 2.168.

కూరు[1] అ.క్రి. 1. కలుగు. భార. ఆది. 7.178. 2. దొచ్చు, తూరు. భార. ఉద్యో. 3 268 ; 3 పొందు. భార. అశ్వ. 4.233 ; 4. మునుగు, నిమగ్నమగు. భాగ. 6.142 ; 5. కుంగు, అడగు. ప్రబంధ. 734 ; 6. (మందు మొదలగు వాటిని) దట్టించు, దిట్టంగా నొక్కు, కుక్కు, దొప్పించు, పో.చూ.క. కూర్. వాడిమి ; కులుకు. కుక్కు ; త. కూర్. దొచ్చు, వంగు; మ. కుఱుయ్యూక. నోటిలో కుక్కు కొను ; కుఱు.కోర్. ప్రవేశించు ; కోర్త. ప్రవేశపెట్టు ; మాల్తో. కోర్. అధికమగు, సరిపడు ; కోర్త్. అధికంగా సరఫరాచేయు ; కొర్. ప్రవేశించు ; కొర్త్. ప్రవేశపెట్టు.

కూరించు స.క్రి. కుక్కు, అద్దుకొను, కూర్చు. కూరుకొని పోవు అ.క్రి. 1. కలుగు ; 2. కుక్కు ; 3. దొచ్చు ; 4. దిగబడు, కూర్కొను. కూరుకొను రూ.చూ. కూర్కొను. స.క్రి. కుక్కు. భాగ. 10 పూ. 496. అ.క్రి. 1. కలుగు. రామాభ్యు. 3.93 ; 2. దొచ్చు ; 3. దిగబడు. కూరుమట్టు వి. గుంజలు మొదలైనవి పాతడానికి గడ్డపగులుతో తవ్విన లోతైనగుంట. కూరుమొన[1] వి. యుద్ధసన్నద్ధసేన.

కూరు[2] అ.క్రి. నిద్రించు. వసు. 2.22.

తు. కూరుని. మగతగాఉండు, నిద్రతో ఉండు, కూర్కు ; త. కూర్. వంగు ; గోం. కూర్కోసా. నిద్రలో తల ఆడించు; కూర్క్న, కూర్కాకా ; పర్జి. కూర్క్. తల ఆడించు ; మాల్తో. కూగె. నిద్రించు.

< మూ.ద్రా. కూర్.

కూరుమొన[2] వి. నిద్రించేసేన. భార. స్త్రీ. 2.20.

కూరు[3] రూ.చూ. కూలు[2]. వి. 1. నేలమీద ఆనుతూ ఒంటిరెక్క తలుపు తిరగడానికి తోడ్పడే తలుపు పట్టెలోని చెక్కబడిన భాగం, కుసి ; 2. తాపిరేకును పిడిని కలిపే వంగిన ఇనపచువ్వ.

కూరుకిడు చూ. కూరుకు.

కూరుకు చూ. కూరు[2]. రూ. కురుక, కురుకు, కూర్కు. అ. క్రి. 1. నిద్రించు. భాగ. 9.405 ; 2. మూతపడు. వి. నిద్ర. శుక. 3.411.

తు. కూయని, కూలుని. నిద్రించు ; పో.చూ.త. కూర్. వంగు ; మ. కూమక. వంగు ; గోం. కూర్క్. నిద్రలో తలఊచు ; కుయి. కోర. నిద్రవచ్చు. పర్జి. కూర్క్. తలఊచు ; కురు. మాల్తో. కూగ్. నిద్రించు.

కూరుకిడు రూ.చూ. కూర్కిడు. అ.క్రి. నిద్రించు. కూరుకుపాటు రూ.చూ. కూర్కుపాటు. వి. కునికిపాటు, తంద్ర. కూరుకువాఁడు రూ చూ. కూర్కు వాఁడు. వి. నిద్రపోతు, నిద్రాళువు.

కూరుగుండంగి వి. ఏట్రింత, పనులపోలిగాడు, కాలకంఠం, దాత్యూహం.

కూరుచు రూ.చూ. కూర్చు. అ.క్రి. 1. ఇష్టపడు, ప్రియపడు. భార. ఉద్యో. 3.217 ; 2. సంఘటన చేయు. స.క్రి. 1. కలిగించు, కావించు. ప్రబోధ. 2.49 ; 2. కలుపు, చేర్చు ; 3. కూడబెట్టు ; 4. రచించు ; 5. లాల్చు ; 6. పూర్తి చేయు.

కూరిచికోలు రూ.చూ. కూర్చికోలు. వి. కలియగట్టుకోవటం. కూరుచుకొను రూ.చూ. కూర్చుకొను. స.క్రి. 1. అనుగ్రహ పాత్రునిగా చేసికొను. దశా. 2.37 ; 2. సంపాదించు ; 3. పోగుచేసుకొను ; 4. మిత్రుడిగా చేసికొను ; 5. వెంటబెట్టుకొను. కూరుచుకోలు రూ చూ. కూర్చికోలు. వి. కలియగట్టుకొనటం.

కూరుచుండఁబడు చూ. కూరుచుండు.

కూరుచుండఁబెట్టు చూ. కూరుచుండు.

కూరుచుండు రూ.చూ. కూర్చుండు. అ.క్రి. ఉపవిష్టుడగు. ఆసీనుడగు. కాశీ. 5.40.

కూరుచుండఁబడు రూ.చూ. కూర్చుండఁబడు. అ.క్రి. కూలబడు, కూర్చుండజేయు. < కూరుచు + ఉండు + -అ[7] + పడు. కూరుచుండఁబెట్టు రూ. చూ. కూర్చుండఁబెట్టు. స.క్రి. కూలబడు, కూర్చుండజేయు. < కూరుచు + ఉండు + -అ[7] + పెట్టు.

కూరువరి చూ. కూరుపు.

కూరుపు రూ. కూర్పు. చూ. కూర్చు. వి 1. కుట్టు, కూరటం, ఘటన. ప్రబంధ. 78 ; 2. కలుపు ; 3. రచన ; 4. అచ్చు.

కూరుపరి రూ. కూర్పరి. వి. రచయిత, కూర్చేవాడు. అచ్చు. రా. బాల.12 ; 2 నారికి బాణం సంధించే చోటు. ఆం.భా. 2.211.

కూరువ రూ. చూ. కూర్వ. వి. ఓడకూర్పుకు వేసే వంకర కొయ్య

కూరువాముక్క చూ. కూరువ. వి. గడియవెయ్యడానికి వసతిగా తలుపు వెనకలిగించిన కర్రముక్క.

కూరె వి. 1. దున్నటానికి, విత్తటానికి పనికివచ్చే పరికరం ; 2. అక్కడి కట్టె ఒకపైరు విత్తినచాళ్ళమధ్య ఆముదాలు, పత్తి మొ. వాటి విత్తనాలు వేసేకొయ్యపరికరం.

కూరెగొయ్యలు రూ. కూరగొయ్యలు. వి బ.వ. ఆరుద్రా నక్షత్రం, గొర్తిచెక్కల్లాగా వరసగా ఉండేమూడు చుక్కలు.

కూరేగంట్లు వి.బ.వ చీరపోతులు, చీరపేలు.

కూర్కిడు చూ. కూర్కు.

కూర్కు రూ. చూ. కూరుకు. అ. క్రి. 1. నిద్రించు, కునుకు. కాశీ. 5.40 ; 2. మూతపడు, నిమీలితమగు. శుక. 1.190.

కూర్కిడు రూ. కూరుకిడు. అ. క్రి. నిద్రించు. బిల్హ. 2.36. కూర్కుపాటు రూ. కూరుకుపాటు. వి. కునికిపాటు, తంద్ర. వరహ. 11.126. కూర్కువాఁడు రూ. కూరుకు వాఁడు. వి. నిద్రాళువు, నిదురపోతు. ఆం. భా. 3.11.

కూర్కొని కూర్కొని చెవులఁబోయు చూ. కూర్కొను.

కూర్కొను రూ. కూరుకొను. స. క్రి. కుక్కు. భార. స్త్రీ.

1.142, అ. క్రి. 1. కలుగు. రామా. 3.93; 2 దిగబడు, డించుకొనిపోవు.

త. కూఱుకొళ్.

**కూర్కొని కూర్కొని చెవులఁబోయు** స. క్రి. నూరిపోయు. భార. స్త్రీ. 1.142.

**కూర్చి** రూ. చూ. కూరిచి. అవ్య. గురించి, ఉద్దేశించి. దశా. 3.178.

**కూర్చికోలు** చూ. కూర్చు.

**కూర్చించు** చూ. కూర్చు.

**కూర్చియిచ్చుమిటారి** చూ. కూర్చు.

**కూర్చు** రూ. కూరుచు. చూ. కూడు[2]. స. క్రి. 1. కూడిక కావించు. భార.ఆది. 7.54. 2. కూడబెట్టు, నిలవచేయు. భార. ఆది. 7.132; 3. కలిగించు. భార. విరా. 1.107; 4. అతుకు, ఏకంచేయు. భార. విరా. 2.52; 5. సంధానంచేయు, సంఘటన చేయు. భార. విరా. 2.80; 6. మిత్రునిగాచేయు, మైత్రికలుపు. భార. ఉద్యో. 3.75; 7. పొందించు, చెందచేయు. భార. అను. 5 66; 8. (వింటిని) సంధించు. శృం. నై. 1.79; 9. చేర్చు, కలుపు. కాశీ. 2.147; 10. (కార్యాన్ని) సంఘటనచేయు, ఒన కూర్చు. కాశీ. 6.56; 11. లగ్నంచేయు. భీమ. 6.26; 12. అంటించు. హర. 2.30; 13. (అలంకారంగా). పెట్టు. హర. 4.87; 14. రచించు. ఆము. 1.13; 15. సమావేశంచేయు, పోగుచేయు. రాఘవ. 4.77; 16. (వస్త్రాదులు) కుట్టు. ద్వి. పరమ. వి. 2.84; 17. చేయు. వసు. 3.184. అ.క్రి. 1. ఇష్టపడు. భార. సభా. 1.40; 2. సంఘటించు. భార. విరా. 1.28.

క. కూర్. ప్రేమించు. త. కూర్ (-న్ద్-; -వ్). కోరు; మ. కూఱుక. ప్రేమించు.

**కూర్చికోలు** రూ. కూరిచికోలు, కూరుచుకోలు, కూర్చుకోలు. వి. కూర్చుకోటం. భార. శల్య. 2.17. **కూర్చించు** స.క్రి. ప్రేమించేటట్లుచేయు. **కూర్చియిచ్చుమిటారి** వి. తార్పుకత్తె. **కూర్చుకొను** రూ. కూరుచుకొను. స. క్రి. 1. వెంటపెట్టుకొను. హర. 6.32; 2. పోగుచేసుకొను. హర. 6.40; 3. సంపాదించు. జైమినీ భా. 3.74; 4. మిత్రునిగా చేసుకొను. దశా. 2.87; 5. అనుగ్రహపాత్రునిగా చేసుకొను. **కూర్చుకోలు** రూ. చూ. కూర్చికోలు. వి. కలియగట్టుకొనటం. **కూర్చుగుమ్మలు** వి.బ.వ. కూర్చేస్త్రీలు, అనగా తనపైకూర్మిగల వారు, మిత్రులు. కు. సం. 6.27. **కూర్చుచుట్టము** వి. ప్రియబంధువు. పాండు. 3.68.

**కూర్చుండఁగఁబెట్టు** చూ. కూర్చుండు.

**కూర్చుండఁబడు** చూ. కూర్చుండు.

**కూర్చుండఁబెట్టు** చూ. కూర్చుండు.

**కూర్చుండు** రూ. కూకుండు, కూరుచుండు. అ. క్రి. ఉపవిష్టుడగు, ఆసీనుడగు. భార. విరా. 5.316.

క. కూర్; పో. చూ. త. కుంతు.

**కూర్చుండఁగఁబెట్టు** స. క్రి. కూర్చుండచేయు. భీమ. 4.89. **కూర్చుండఁబడు** రూ. కూరుచుండఁబడు. అ. క్రి. చతికిలబడు, కూలబడు. భార. భీష్మ. 1.188. **కూర్చుండఁబెట్టు** రూ. కూరుచుండఁబెట్టు. స. క్రి. కూర్చుండఁజేయు. కళా. 7.145.

**కూర్చొనికుంపట్లమ్ము** చూ. కూర్చొను.

**కూర్చొను** అ. క్రి. సిద్ధమగు, తయారగు, కూర్చుండు.

**కూర్చొనికుంపట్లమ్ము** స.క్రి. తానుకదలకనే వారికీ వీరికీ తగాదాలు పెట్టు.

**కూర్ణిశాతు** రూ. చూ. కూర్నీసిషాతు. వి. వందనం, మొక్కు.

**కూర్నీసిషాతు** రూ. కూర్ణిశాతు. వి. సలాం, వందనం, రంగా. చ. 2 85.

హిం. కూర్ణిశాత్; మరా. కుర్ నిషాతు; ఉ. కోర్నిశాత్; పార. కోర్నిషాత్.

<ఉ. కోర్నిశాత్.

**కూర్పన** చూ. కూర్చు. వి. పోగవటం, గుమికూడటం.

**కూర్పనపడు** (-వడు) అ.క్రి. పోగగు, గుమిగూడు. పార్వ. 6.84.

**కూర్పరి**. చూ. కూర్చు.

**కూర్పించు** చూ. కూర్చు.

**కూర్పు** రూ. చూ. కూరుపు. వి. 1. కుట్టు, కూర్చటం: 2. రచన; 3. అచ్చు.

**కూర్పరి** రూ. చూ. కూరుపరి. వి. 1. వింటినారిలో బాణం కూర్చేచోటు, మౌర్వీమధ్య తంతు బంధం. ఆం. భా. 2.211; 2. కూర్చువాడు, రచయిత. **కూర్పించు** స.క్రి. నిర్మింపచేయు. భీమ. 5.89.

**కూర్మయివాండ్లు** వి.బ.వ. ఒకతరహా బిచ్చగాళ్ళు.

**కూర్మా** రూ. కురుమా[2], కుర్మా. వి. కుర్మా. పలావు మొ. భోజన పదార్థాల్లో నంజుడుగా ఉపయోగించేకూర.

ఉ. కోర్మా;

త. కఱుమా.

<ఉ. కోర్మా.

**కూర్మి** రూ. చూ. కూరిమి. వి. 1. వాత్సల్యం. భార. సభా. 2.67. హర. 4.5; విశ. కూరిమిగల, ప్రియమైన. కాశీ. 1.12.

**కూర్మికత్తియ** రూ. కూరిమికత్తియ, కూరిమికత్తె, కూర్మికత్తె. వి. స్నేహంగలది, ప్రేమగలది. కువల. 4.165. **కూర్మికత్తె** రూ.చూ. కూర్మికత్తియ. వి. ప్రియురాలు, చెలికత్తె. **కూర్మికాఁడు** రూ. చూ. కూరిమికాఁడు. వి. ప్రియుడు. స్నేహితుడు.

**కూర్వ** రూ. కూరువ. వి. ఓడకూర్పుకు వేసేవంకరకొయ్య.

పో. కుర్వా. ఓడవంపుకొయ్య; ఫ్రె. కూర్బ్. వంకర, వంకరయిన; స్పా. కూర్వా. వంకర, వంకరగల. కోర్వా. మోకాలివంపు, వంకరైన, ఓడపక్కల బిగించేవంపుబద్ద.

<పో. కుర్వా.

**కూర్వు** స.క్రి. రెండు లేదా మూడు పట్టుపోగులు కలిపివడిపెట్టు, కూర్చు.

**కూఱు** స. క్రి. పొందు, కూడు.

**కూలగంత** వి. కూనగుంత.

**కూలమాకు** చూ. కూలు[1].

**కూలఁద్రోయు** చూ. కూలు[1].

**కూలఁబడు** చూ. కూలు[1].
**కూలమ్ము** చూ. కూలు[2].
**కూలవేయు** చూ. కూలు[1].
**కూలారుచు** చూ. కూలు[1].
**కూలార్చు** చూ. కూలు[1].
**కూలి** రూ. కూలీ. వి. **1.** పన్ను. మార్క. 5.138 ; **2.** చేసిన పనికి ప్రతిఫలంగా ఇచ్చేధనం, భృతి, జీతం. శుక. 2.363 ; **3.** కూలిపని ; **4.** కూలివారు ; **5.** శిస్తు, **6.** బాడుగ.

క. కూలి. జీతం, బాడుగ ; కొడ. కులి. రోజుకూలి ; తు. కూలి. బాడుగ ; త. కూలి. జీతం ; మ. కూలి. బాడుగ, జీతం ; కో. కుడ్. రోజుకూలి. తొ. కొక్వ్యిల్య్. లంచం, పెళ్ళికొడుకు పెళ్ళికూతురి తండ్రికి చెల్లించేది. పర్జి. కూలి. జీతం.

పో. చూ. హిం. ఉ. కులీ. నౌకరు.

**కూలికాఁడు** వి. కూలివాడు, కూలిపనిచేసేవాడు. వేంక. పంచ. 1.681. క. కూలికాఱ, కూలిగార ; కొడ. కూజ్‌గరవ్, కుల్యకర్న ; త. కూలిక్కారన్. కూలివాడు ; మ. కూలిక్కారన్. **కూలిచదువుచెప్పవాఁడు** వి. డబ్బు పుచ్చుకొని చదువు చెప్పేవాడు, భృతకోపాధ్యాయుడు. వరాహ. 5.55. **కూలిచేయు** స.క్రి. జీతానికి పని చేయు. **కూలిపాలి** వి. కూలిపని. **కూలిపడు**[1] స.క్రి. కూలిపని చేయు. **కూలిపడుగు** వి. కూలికి నేసినపడుగు (బట్ట). **కూలిపని** వి. కూలికిచేసేపని, భృతకవృత్తి. హరిశ్చ. 4.107. **కూలిపనివాఁడు** వి. కూలికిపనిచేసేవాడు, భృతకుడు. విజ్ఞా. ప్రా. 36. **కూలిపాటు** వి. కూలిపనిచేయటం. పార్వ. 2.93. **కూలిపట్టు** అ. క్రి. పనిదొరుకు. **కూలిమనిషి** వి. కూలీ, పనివాడు, జీతానికి పనిచేసేవాడు. **కూలియాలు** **(-ఆలు)** వి. వెలయాలు, వేశ్య. కు. సం. 8.143. **కూలివాఁడు** వి. కూలిపని చేసేవాడు, జీతగాడు. ఆం. భా. 2.288. త. కూలియాళ్. కూలీ ; మ. కూలియాళ్. కో. కుజాళ్.

**కూలించు** చూ. కూలు[1].
**కూలిపడు**[2] చూ. కూలు[1].
**కూలీ** రూ. చూ. కూలి. వి. వైతనికుడు, సంబళకాడు, కూలివాడు.
**కూలు**[1] అ.క్రి. **1.** చచ్చు, మరణించు. భార. అరణ్య. 1.162. భార. ఉద్యో. 2.271 ; **2.** కారు. భార. ఉద్యో. 5.991 ; **3.** పడు. ఉ. హరి. 1.167 ; **4.** భగ్నమగు, విరుగు. విష్ణు పు. 4.32 ; **5.** ధ్వంసమగు, పాడగు. శుక 2.131.

క. కూలు. కిందపడు, తిరగబడు, నాశనంచేయబడు ; కూరు, కుసి. క్షీణించు ; కూను. వంగేస్థితి ; తు. కుసుక్కని. మునుగు, పగులు ; త. కులై. పాడుచేయబడు, చెల్లాచెదరగు ; కూన్. వంగు ; మ. కులయక. కదులు, కూలుక. వంగు ; గోం. కుస్. పడు, చెట్లఆకులురాలు ; కుయి. కూర. కిందపడు ; కొలా. కూల్. కూట్. నీళ్ళ కుండ మొ. వాటికన్నంనుంచి నీరుకారు ; నా. కూళ్. కారు.

< మూ. ద్రా* కూల్.

కూలనూకు స. క్రి. పడేటట్టుకొట్టు. కూలద్రోయు స. క్రి. కిందపడతోయు. **కూలఁబడు** అ. క్రి. **1.** చచ్చు. రామాభ్యు. 6.139 ; **2.** విరిగిపడు రామా. 8.61, **3.** చదికిలబడు. కువ. చ. 2.141. **కూలవేయు** స. క్రి. కిందపడేటట్లుతోయు, కూర్చోబెట్టు. **కూలారుచు** రూ. చూ. కూలార్చు. స. క్రి. కూల్చు. చంపు. **కూలార్చు** రూ. కూలారుచు. స. క్రి. కూల్చు. చంపు. పండి. చ. 3.225. పు. క. కులై. **కూలించు** స. క్రి. కుల్చు. రాల్చు. పాండు. 5.17. క. కూలిసు. రాల్చు. **కూలిపడు**[2] అ. క్రి. **1.** కూలిపోవు ; **2.** విరిగిపడు. **కూలుచు** రూ. కూల్చు. స.క్రి. **1.** పడగొట్టు. భార. ద్రోణ. 1.197 ; **2.** చంపు, వధించు, **3.** తోయు ; **4.** పాడుచేయు. **కూలురూపు** వి. అమాంతంగాపడిన రూపం. **కూల్చు** రూ. చూ. కూలుచు. స.క్రి. **1.** చంపు, వధించు. భార. శాంతి. 1.199 ; **2.** భగ్నంచేయు, పాడుచేయు. ఉ. హరి. 3.7 ; **3** తోయు, పడతోయు. శుక. 3.58 ; **4.** పడగొట్టు.

**కూలు**[2] రూ. కూను[2]. కూరు[3]. వి. **1.** లవిత్రమూలం, పిడిలో అమర్చేకత్తిలోనగు వాటి మొదటిభాగం. ఆం. భా. 2.231 ; **2.** కొడవలి, గొడ్డలి, సెలగపార మొ. వాటిపార (పలుగు) ను కదిపే ఇనపకొండి లేదా కాడ.

పో. చూ. క. కుయిలు, కొయిలు, కొగ్గు. కోయు, నరుకు.

**కూలమ్ము** వి. బాణవిశేషం. చంద్ర భా. 2.41.

**కూలెగాఁడు** చూ. కూలి. వి. కూలివాడు.
**కూల్చు** చూ. కూలు[1].
**కూళ** వి. **1.** మూఢుడు, అవివేకి. కాశీ. 2.110 ; **2.** కుజనుడు, చెవిటి, కుత్సితుడు, మల్లభూ. నీతి. 43 ; **3.** దీనుడు. కృపణుడు, దరిద్రుడు. శుక. 2.363 ; **4.** క్రూరుడు. రసిక. 3.89 ; **5.** పిసినిగొట్టు ; **6.** పేదవాడు.

క. కూళ ; తు. కూళో, ఖూళో ; త. కూళన్, కూళమ్.

**కూళఁడు** రూ. కూళుఁడు. వి. **1.** అవివేకి, మూఢుడు. హరి.పూ. 5.88 ; **2.** పిసినిగొట్టు. భల్లా. 5 ; **3.** దీనుడు ; **4.** క్రూరుడు ; **5.** చెవిటి ; **6.** పేదవాడు. **కూళతనము** వి. **1.** కక్కుర్తి, దైన్యం. శుక. 2.63 ; **2.** పేదరికం ; **3.** పిసినితనం, తులువతనం. **కూళమారి** వి. **1.** దుష్టశీలుడు. ప్రబంధ. 655 ; **2.** పేదవాడు ; **3.** చెవిటి. **కూళస్వరము** వి. మోటుగొంతు, కరకుగొంతు. **కూళుఁడు** రూ. చూ. కూళఁడు. వి. **1.** కుత్సితుడు ; **2.** మూఢుడు ; **3.** ఎడ్డివాడు.

**కూళం** రూ. చూ. కూళము. వి. వడ్లు, అరికలు మొ. గింజల పొట్టు.
**కూళము** రూ. కూళం, కూళాం. వి. పనికిమాలినగడ్డి, పొట్టు.
**కూళాం** రూ. చూ. కూళము. వి. వడ్లు, అరికలు మొ. గింజల పొట్టు.
**కూళుఁడు** చూ. కూళ.
**కూళ్ళాపిడలు** వి. బ.వ. పిండివంటలలోని భేదం.
**కూళ్ళపెంకు** వి. పెంకుటింటి ముందువా దోనెలకువాడే పెంకు.
**కూళ్ళు** చూ. కూలి. వి.బ.వ. **1.** కూలీలు ; **2.** కూలిపనులు.

**కూవ** రూ. చూ. కుప్ప[1]. వి. పోగు, కువ.

**కూవారిల్లు** అ. క్రి. పూర్తిగా దుర్బలమగు.

**కూవిత** వి. కూతురు, కుమార్తె. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 114. క్రి. శ. 1423 సం.

**కూస[1]** వి. కుప్ప, కువ్వ, కూవ.

**కూస[2]** వి. ముక్కుపొడుం చేసుకొనే మట్టిపాత్ర.

**కూసం[1]** రూ.చూ. కుపసము. వి. చొక్కా.

**కూసం[2]** రూ. చూ. కూచము. వి. దోర్నపట్టెకాధారంగా ఉండే నిలువుగుంజ.

**కూసంతలుపు** వి. కుసితలుపు, కుసిమీద తిరిగేతలుపు. **కూసంపురుగు** వి. వరి 'పొట్ట' తినేపురుగు, దంటుతొలిచే పురుగు. **కూసంమాను** రూ.చూ. కుసనంమాను. వి. దోర్న పట్టెకు ఆధారంగా ఉండే నిలువుగుంజ.

**కూసం[3]** రూ. చూ. కుసుమ. వి. డెల్టాలో ఎక్కువగా పండే పంట.

**కూసంత** విశే. కాసంత, కాసింత, కసింత.

**కూసము[1]** రూ. చూ. కుప్పసము. వి. 1. పాము యొక్క పైతోలు, పాము పొర. రఘు. రా. 9.11 ; 2. చొక్కా. వేమన. 2.21.

**కూసము[2]** రూ.చూ. కూచము. వి. 1. కొయ్య కంబానికి చివరన తొలిచిన సన్నని తొలుపు ; 2. ఇంటికి ఉపయోగించే కొయ్యస్తంభం ; 3. కొయ్య.

**కూసలేఱగు** అ. క్రి. పాము కూసంతో సమమగు.

**కూసాము** రూ. చూ. కూచము. వి. స్తంభం.

**కూసి** రూ. కూసు[1]. వి. చిన్నపిల్ల.

క. కూసు. శిశువు ; తొ. కుక్. బాలిక, కూతురు.

**కూసియగు (-అగు)** రూ. చూ. కూచియగు అ. క్రి. 1. వాడియగు ; 2. కూలబడు.

**కూసు[1]** రూ. చూ. కూసి. వి. శిశువు ; విశే. చిన్న, తక్కువైన, నీచమైన.

**కూసు[2]** వి. కొప్పు, ఇంటికప్పుపై నున్న మొన దేలినభాగం.

**కూసుముడి** వి. నిట్రాడింటి కొప్పుమీద కట్టినకట్టు. **కూసుముడిల్లు** వి. ఒంటి నిట్రాడిల్లు.

**కూసుమతము** రూ. చూ. కూచిమతము. వి. సాతాని మతాల్లో ఒకమతం.

**కూసుబెట్టు** స. క్రి. కూర్చోబెట్టు.

**కూసులు** చూ. కూసు[2]. వి.బ.వ. బండిపారులపై బిగించే చిన్న నిలువలు గుజ్జులు.

**కూసువిద్య** వి. అలవాటయిన పని.

**కెకమ** రూ. కెకవుఁడు. వి. మూర్ఖుడు.

**కెకరించు** స.క్రి. అభిలషించు, కోరు. నవనాథ. 1.67. పు. 16 పం. అ.క్రి. పెనుగులాడు.

పో.చూ. క. కెక్కరిసు. ఎఱ్ఱనగు ; త. కెక్కరి. తియ్యని.

**కెకవుఁడు** రూ.చూ. కెకమ. వి. మూర్ఖుడు.

**కెకుకెక్కుమను** స.క్రి. గేలిచేయు. ధ్వన్యను.

క. కెక్కు. గోకర్షధ్వని.

**కెక్కరలుకొట్టు** అ.క్రి. ఆశ్చర్యం ప్రకటించు. ధ్వన్యను. కకుత్థ్స. 52.

**కెక్కరించు** రూ.చూ. కొక్కరించు. అ.క్రి. కోడివలెగెలుకు మట్టిని ఎగజిమ్ము.

క. కెక్కళిసు. భయంతోఉండు.

**కెక్కర్లోడు** వి. సంవత్సరానికో మూడేళ్ళకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి చరిత్రనూ, ఆచార వ్యవహారాలనూ గోత్రాలతో చెప్పేవాడు.

**కెఙ్-** రూ. కెఞ్-, కెన్-, కెమ్-. విశే. ఎఱ్ఱని.

క. కె, కెమ్. ఎరుపు ; కెఞ్క, కెఞ్గల్, కెచ్చనె, కెచ్చు, కెనఁచగె, కెన్బఁనె, కెన్దు, కెబ్బు, కెంపుకేసు, కిసు. ఎరుపు. కెక్కరిసు, కెఞలిసు. ఎఱ్ఱనగు ; కొడ. చొ- చొప్-చొండ్. ఎఱ్ఱనగు ; చొజ్, ఎఱ్ఱని ; చొపి. ఎరుపు. ఎఱ్ఱదనం ; తు. కెమ్-, కెన్బఁ. కెన్బిఁ. ఎరుపు ; త. చె-, చెమ్- చెవ్వచెయ్య, చేతకమ్ చెట్టు, ఎరుపు ; చెక్కమ్, చెక్కర్. చెవ్వల్, చెవర్-' ఎనల్, చే, చేక్కై, చేకు, చేకై. చేంతు, చేప్పు, చేయ్, చివ్వ-ఎనల్. చివప్పు ; చివేరి-ఎనల్, ఎఱ్ఱదనం, చెప్పై. మ. చె-చెమ్-చేయ్. ఎరుపు ; చెమ్మ, చెవ్వ, చొన, చొవ్వ. ఎఱ్ఱదనం ; చెక్కల్. చేకువ; కో. కెన్, కెవ్. ఎరుపు; కెప్. ఎరుపు, ఎఱ్ఱదనం ; తొ. కొ-. ఎరుపు ; పర్జి. కెయ్. ఎరుపు. కురు. ఖేసా. ఎరుపు, రక్తం ; ఖేస్. రక్తం, కోపం ; మాల్తో. క్వేసా. ఎరుపు ; క్వేస్లా-. ఎఱ్ఱని ; క్వేసు-. రక్తం ; బ్రా. ఖిసున్. ఎరుపు, బంగారం.

<క. కెమ్.

**కెంగుచ్చు** వి. ఎఱ్ఱనికుచ్చు. ఆము. 4.92. **కెంగేలు** రూ. కేఁగేలు. వి. ఎఱ్ఱనిచేయి. భార.విరా. 2.310.

**కెంగట** రూ. గెంగట. వి. తాటిటెంక. ఆం.భా. 2.78.

పో.చూ. త. టెంకాయ్-.పండిన, పక్వమైన.

**కెంగుచ్చు** చూ. కెఙ్-.

**కెంగేలు** చూ. కెఙ్-.

**కెచ్చల** వి. తెలివితక్కువతనం.

**కెచ్చు** వి. పొరతోపెళ్లగించినపెళ్ళ.

క. కెచ్చు. ముడి.

<క. కెచ్చు.

**కెచ్చెలి** వి. దుండగీడు, తుంటరి.

క. కెచ్చు. గర్వం ; త. కిచ్చల్,-అత్తమ్. ఉపద్రవం.

**కెచ్చెలితనము** రూ. కెచ్చెళితనము. వి. అల్లరి, దొమ్మి. త. కిచ్చల్-అత్తమ్, కిచ్చిల్-అత్తమ్-. ఉపద్రవం. **కెచ్చెళితనము** రూ.చూ. కెచ్చెలితనము. వి. అల్లరి, దొమ్మి.

**కెచ్చెళితనము** చూ. కెచ్చెలి.

**కెఞ్-** రూ.చూ. కెఙ్-. విశే. ఎఱ్ఱని.

**కెంజడ** వి. ఎఱ్ఱనిజడ. మను. 1.59. **కెంజాయ** వి. ఎఱ్ఱనిరంగు. భార. భీష్మ. 2.22. భీమ. 4.123. **కెంజిగురు** రూ. కెంజివురు. వి. ఎఱ్ఱనిచివురు. ఉ.రా. 6.18. **కెంజిగురువిల్తుడు** వి. మన్మథుడు. **కెంజివురు** రూ.చూ. కెంజిగురు. వి. ఎఱ్ఱనిచిగురు. కకుత్థ్స. 5.55. **కెంజేయి** వి. హస్తపద్మం. కాశీ. 2.112.

**కెంచము** విశే. దిట్ట అయిన. ఉ. హరిశ్చ. 4.114.

క. కెంచు. గ్రామీణమయిన.

<క. కెంచు.

**కెంజడ** చూ. కెఞ్-.

**కెంజాయ** చూ. కెఞ్-.

**కెంజిగురు** చూ. కెఞ్-.

**కెంజిగురువిల్తుడు** చూ. కెఞ్-.

**కెంజివురు** చూ. కెఞ్-.

**కెంజేయి** చూ. కెఞ్-.

**కెట్టలముప్రొర** వి. ఒకమొక్క.

**కెట్టి** వి. కమండలం ఆకారంలో ఉండేనీళ్ళకూజా.

ఇం. *Kettle*. పాత్రవిశేషం.

<ఇం. Kettle.

**కెట్లికూజా** వి. మూతిదగ్గరనంది, పులి మొ॥ జంతువుల ఆకారంలో ఉండే కూజా.

<ఇం. Kettle + కూజా.

**కెడ** రూ.చూ. కద. వి. 1. పార్శ్వం, పక్క. భార. ద్రోణ. 4.303 ; 2. దిక్కు. ప్రబంధ. 149.

**కెడగూడు(-కూడు)** అ.క్రి. 1. పక్కఉండు. కు.సం. 5.123 ; 2. గుమిగూడు. కాశీ. 3.138. స.క్రి. 1. రమించు, భోగించు. మల్హ. 2.173 ; 2. అనుసరించు. **కెడ(బాయు** స.క్రి. విడిచిపెట్టు. **కెడయాడు** అ.క్రి. నడయాడు, సంచరించు. షో.చ. 8.39.

**కెడమ** వి. వైపు.

**కెడపు** చూ. కెడయు. స.క్రి. 1. చంపు. భాస్క.రా.కిష్కిం. 193. హరిశ్చ. 5.143 ; 2. పాడుచేయు, నాశనంచేయు. కాశీ. 6.176 ; 3. పడవేయు, కూల్చు. జైమినీ భా. 3.109 ; 4. వినరివేయు, తోయు. రామా. 4.50 ; 5. హరించు, పోగొట్టు. శేష. 1.51.

క. కెడవు, కెడలు. పడు, నేలమీదపడగొట్టు ; తు. కెడగమ్. చెడిన ; త. కిటుప్పు. 'కిట' యొక్క ప్రేరణ రూపం, పడగొట్టు, పడిన ; కిటు. పడిన, అచలనమైన ; మ. కిటుక. నశింపచేసిన, పాడుచేసిన, చెరగొట్టిన.

<క. కెడపు.

**కెడమాలు** అ.క్రి. 1. మార్పుచెందు. శ్రీరాధా. 1.165 ; 2. నష్టపడు.

**కెడయిక** చూ. కెడయు.

**కెడయు** రూ. గెడయు. అ.క్రి. 1. విరిగిపడు, కూలు. భార. భీష్మ. 3.353. హరి.పూ. 5.151 ; 2. చచ్చు, మరణించు. హరి.ఉ. 8.79 ; 3. భిన్నమగు, తెగు. ఉ.హరి. 2.181 ; 4. పాయు, ఎడమగు. ఆం.భా. 3.85 ; స.క్రి. ఉద్దేశించు.

క. కెడు, కిడు. నాశంచేయబడు, చెడిపోవు , కెడిసు. నాశంచేయు , కొర. కెడ్(కెట్ట్). పాడుచేయు ; కెడి. నాశనం ; తు. కెడగుని, కెడిసు. నాశంచేయు, పాడుచేయబడిన ; కెడుకు, కెడ, కెడకు-. నష్టం ; త. కెటు (-ప్-ట్ట్). నశించు ; కెట్ట-. పాడైన, శిథిలమైన ; కెటుటి. నష్టం, చెరపు ; కెటుప్పు. చెడిన, శిథిలమైన ; కేటు. శిధిలం, చెడు, చావు ; మ. కెడుక. నశింపచేయు; కిటుక్క. పడు, విశ్రాంతి ; కిటుకుకఇడె, కిటుయుక. కొట్టు, తట్టు ; కెటు. నశించు ; కెటుక్క. నష్టపరచు. పాడుచేయు ; కేటు-నాశనం ; తొద. కొట్(కొట్-), పాడుచేసిన, చచ్చిన ; కొద్ప్-. నశించు ; కొర్క్సె. చచ్చు ; మాల్తో. కిడె. కిందపడిఉన్న.

<క. కెడిను.

**కెడయిక** వి. 1. పాటు, పతనం ; 2. చావు, మరణం.

**కెదవు** చూ. కెదయు. విణ. వొరిగిన, పక్కకుపడిన. భాగ. 8.199. వి. పాటు, పతనం.

క. కెడవు, కెడపు, కెడహు-. పడవేయు, పడేటట్లు చేయు ; తు. కెడగుని. పాడుచేయు ; త. కిటుప్పు. నిద్రించు.

<క. కెదవు.

**కెద్బెరయు** అ.క్రి. అడ్డదిడ్డంగా పడివుండు, కలగాపులగమగు భార.శల్య. 1.104.

**కెద్బెరనగు** చూ. కెద్బెరను.

**కెద్బెరను** విణ. సంకీర్ణమైన, కలసిన. కు.సం. 11.127.

క. బెరసు. కూడిక. కలయిక.

**కెద్బెగనగు** అ. క్రి. అటూఇటూ అడ్డదిడ్డంగా పడు. కు. సం. 11.194.

**కెణుక** వి. పొలంలో పడ్డ వాననీళ్ళు పొర్లిపోవడానికి పొలం గట్టు చివరపల్లంగాఉన్న వైపు కట్టిన రాతికట్టడం.

క. కెణకు. మాటలచే కాని చేతలచేకాని ప్రేరేపించు.

**కెంటలము** వి. గర్భవతికి ఎనిమిదోనెలలో పెట్టేకొత్త అలంకార విశేషం. సిం. ద్వా. 3.36.

**కెదకు** స. క్రి. పెల్లగించు, పెకలించు.

క. కెదకు. కదలించు. వురికొలుపు, పెల్లగించు.

<క. కెదకు.

**కెన్** రూ. చూ. కెఞ్-. విణ. ఎర్రని.

**కెందమ్మి** వి. ఎర్రతామర, రక్తోత్పలం. పారి. 3.24. <కెన్ + తమ్మి. **కెందామర** వి. ఎర్రతామర, రక్తోత్పలం. శృం. నై. 8 71. <కెన్- + తామర. **కెందొగ** రూ. కెందొవ. వి. ఎర్రకలువ. ఉ. రా. 6.61. <కెన్-+ తొగ. **కెందొగరు (-తొగరు)** వి. రక్తవర్ణమైన వస్త్రం <కెన్- + తొగరు. **కెందొవ** రూ. చూ. కెందొగ. వి. ఎర్రకలువ. **కెంధూళి** వి. ఎర్రనిధూళి. మను. 1.38. సం. ధూళి-దుమ్ము. <కెన్-+సం. ధూళి. **కెన్నురువు** వి. ఎర్రనినురుగు. ఆము. 4.100. <కెన్+నురువు.

**కెందమ్మి** చూ. కెన్ -.

**కెందామర** చూ. కెన్-.

**కెందొగ** చూ. కెన్-.

**కెందొగరు** చూ. కెన్-.

**కెందొవ** చూ. కెన్-.

**కెంధూళి** చూ. కెన్-.

**కెన్నడి** వి. సాంబారు.

**కెన్నురువు** చూ. కెన్-.

**కెమ్** రూ. చూ. కెఞ్-. విణ. ఎర్రని, పూర్వానుబంధం.

**కెంబట్టు** వి. ఎర్రపట్టు. <కెమ్+పట్టు. **కెంబసుపు** వి. కుంకుమ. శుక. 2.423. <కెమ్- + పసుపు. **కెంబువ్వ**

వి. ఎఱ్ఱని పువ్వు. అచ్చరా. యు. 323. <కెమ్- + పువ్వు. కెంబెదవి వి. ఎఱ్ఱనిపెదవి. రక్తవర్ణంగల పెదవి. <కెమ్- + పెదవి. కెమ్మోము వి. ఎఱ్ఱనిముఖం. దశా. 3.104. <కెమ్- + మోము. కెమ్మోవి వి. ఎఱ్ఱనిపెదవి. శృం. నై. 2.26. <కెమ్- + మోవి. కెమ్మోవికప్పు వి. పంటినొక్కు. కెమ్మోవిగురి వి. పలునొక్కు, దంతక్షతం. సాంబ. 1.1.

కెంవగు చూ. కెంపు.

కెంపారు చూ. కెంపు.

కెంపు వి. 1. రక్తిమ, ఎరుపు. భార. విరా. 4.106; 2. పద్మరాగమణి. వసు. 2.45; 3. దంతక్షతం. దశా. 7.156. విణ. ఎఱ్ఱని.

క. కెమ్-. కెంపు-. ఎరుపు, ఎఱ్ఱరంగు; తు. కెంపు, ఎరుపు, ఎఱ్ఱరంగు; త. కెంపు-. పద్మరాగం, ఎఱ్ఱరాయి; పో. చూ. ఇరుమ్, పొన్. ఇనుము. చెమ్, పొన్. రాగి. పకమ్, పొన్. బంగారం మొదలగునవి; మ. కెంపుకళ్. కెంపులు.

కెంవగు విణ. ఎఱ్ఱని. జైమినీ భా. 2.53. అ. క్రి. ఎరుపెక్కు. కెంపారు అ. క్రి. ఎఱ్ఱనగు, ఎరుపెక్కు. కాశీ. 2.628. <కెంపు + -ఆరు. కెంపుకంటి వి. ఎఱ్ఱని కన్నులుగలది, కోయిల. కెంపుకనులపులుఁగు వి. కోయిల. కెంపుగదలు (-కదలు) అ. క్రి. ఎఱ్ఱనగు. కెంపుగాతు వి. అంగారకుడు, ఎఱ్ఱని గ్రహం. కెంపుగాము వి. ఎఱ్ఱని గ్రహం, కుజుడు, అంగారకుడు. కెంపుదేఱు (-తేఱు) అ.క్రి. ఎరుపెక్కు. కెంపురా[1] వి. అరుణుడు, సూర్యుడు. కెంపురా[2] వి. ఎఱ్ఱనిరాయి. కెంపువచ్చు అ.క్రి. మామిడికాయరంగు మారి పండటానికి సిద్ధమగు. కెంపుసవతు వి. స్వాతీనక్షత్రం. వ్యు. కెంపుతో సమానమైనది. కెంపెక్కు అ.క్రి. ఎఱ్ఱనగు, పండబారు[1]. భార. విరా. 2.319. <కెంపు + ఎక్కు.

కెంపెక్కు చూ. కెంపు.

కెంబట్టు చూ. కెమ్-.

కెంబసువు చూ. కెమ్-.

కెంబువ్వు చూ. కెమ్.

కెంబెదవి చూ. కెమ్-.

కెమ్మోము చూ. కెమ్-.

కెమ్మోవి చూ. కెమ్-.

కెమ్మోవికప్పు చూ. కెమ్-.

కెమ్మోవిగురి చూ. కెమ్-.

కెయ్య రూ. చూ. క్రయ్య. వి. మడి, కేదారం, కాలువ.

క. కెయ్, కయ్, కెయి, కెయ్యి, కై-. మడి, పొలం, భూమి; కొడ. కెట్టి, తడిమట్టి; తు. కెయి. నిలకడగా ఉన్న లేక పెరుగుతున్న పైరుగల పొలం; త. చెయ్. పొలం, తడినేల; మ చెయి. వరిపొలం; పర్జి. కేన్. పంటమార్చి వేసేభూమి; కేన్. ఇడె, శనిక్కమ్-ఇడ్; మాల్తో. ఖ్వెజు. నేలమట్టి; కురు. ఖజ్జి, భూమి, మన్ను, బంక మన్ను, శవం.

<క. కెయ్యి.

కెర వి. కిలకిలధ్వని, ధ్వన్యను.

కెరకొట్టు రూ.చూ. కెరగొట్టు. అ.క్రి. కలకలకూయు.

కెరగొట్టు(-కొట్టు) రూ. కెరకొట్టు. అ.క్రి. కిలకిలమను. ఆం. భా. 2.97.

కెరటము చూ. కరడము. వి. అల.

కెరడము వి. ఒయ్యారం, కులుకు

కెరదు రూ. చూ. కరుడు[1]. వి. అన్నంకెరడు, కరుడు.

కెరలఁజేయు చూ. కెరలు.

కెరలించు చూ. కెరలు.

కెరలివడు చూ. కెరలు.

కెరలియాడు చూ. కెరలు.

కెరలు రూ. కెర్లు, కెల్లు. అ. క్రి. 1. అతిశయించు. భార. అశ్వ. 1.116; 2. కూయు, రుతంచేయు. మను. 3.111; 3. సంభ్రమించు, తత్తరపడు. పాండు. 1.114; 4. విజృంభించు, చెలరేగు. రాఘవ. 4.225; 5. భ్రమించు, తిరుగు, పొరలు. వసు. 3.135; 6. వ్యాపించు, ప్రసరించు. భర్తృ. 1.77; 7. ఎగురు; 8. పొంగు; 9. కోపించు, చిరాకుపడు.

క. కెరళ్, కెలర్, కిలిర్. అరచు, కూయు, కోపించు, విలపించు, కేక వేయు; తు. కెరెయుని. పసిపిల్లవలె ఏడ్చు; త. కిళర్-. పైకిపొంగు, మిక్కిలి కోపంతో అతిశయించు; పో. చూ. మ. కిళరుక. కదుపు, కదులు కిళరుక- దుమ్మువలెపైకిలేచు; కుయి. కెల్ప. ఉద్వేటట్లు చేయు.

<క. కెరళ్.

కెరలఁజేయు స. క్రి. 1. చిరాకుపెట్టు; 2. బాధపెట్టు; 3. పెంపొందించు; 4. ఉత్సాహపెట్టు. <కెరలు + -అ[7] + చేయు. కెరలించు స.క్రి. 1. కోపింపచేయు. పారి. 1.126; 2. బాధించు. రామాభ్యు. 5.277; 3. ప్రకోపింపచేయు, ఉద్రేకింపచేయు. శశా. 4.59. <కెరలు + -ఇంచు[8] కెరలివడు అ.క్రి. 1. తొందరపడు. సారంగ. 3.32; 2. బాధపడు. కెరలియాడు (-అడు) అ. క్రి. 1. ఉత్సహించు. ఉ. హరి. 5.47; 2. చెలరేగు. కెరలుకొను రూ. కెర్లికొను. కెర్లుకొను. అ. క్రి. 1. పెంపొందించు, వృద్ధిపొందు. భాగ. 10 పూ. 757; 2. చెలరేగు. హంస. 2.27; కెరలుచు రూ.చూ. కెరల్చు. స.క్రి. 1. ఎగయజేయు; 2. ఉత్సాహపెట్టు; 3. వ్యాపింపచేయు; 4. కోపింపచేయు. కెరలుపొడుచు రూ. చూ. కెరలుపొడుచు. అ. క్రి. వర్ధిల్లు, విజృంభించు. కెరలువొడుచు (-పొడుచు) రూ. కెరలుపొడుచు. అ. క్రి. 1. పెరుగు, వర్ధిల్లు. భాగ. 5. 1.107; 2. విజృంభించు, చెలరేగు. భాగ. 8.295. కెరలెత్తు అ.క్రి తేరుకొను, ఏపుగాపెరుగు భాగ. 10పూ. 757. సాంబో 2.193. <కెరలు + ఎత్తు. కెరల్చు రూ. కెరలుచు. స.క్రి. 1. ఎగయజేయు. వరాహ. 3.75; 2. ఉత్సాహపెట్టు. మను. 4.30; 3. తమకింపచేయు. కళా. 6.124; 4. వ్యాపింపచేయు. ఉ.హరిశ్చ. 4.115; 5. కోపింపచేయు. చంపూ రా. 3.14.

కెరలెత్తు చూ. కెరలు.

కెరల్చు చూ. కెరలు.

**కెరనవాయిలు** రూ. చూ. కిరసనాయిలు. వి. మట్టినూనె.
**కెర్జము** రూ. చూ. కేరజము. వి. కేరజం అనే పక్షి.
**కెర్గ** వి. **1.** తాపం, వేడిమి ; **2.** అక్కసం.
క. కెరళ్, కెరళు. పెద్దగాఅరచు ; కెరళు. బాధ మొ. వాటివలెపెరుగు, గాయంవలె వ్యాపించు.
< క. కెరళు.
**కెర్లి** వి. మల్లయుద్ధ విన్నాణం.
**కెర్లికొను** చూ. కెర్లు.
**కెర్లు** రూ. చూ. కెరలు. అ. క్రి. **1.** విజృంభించు, చెలరేగు. కువల. 3.95 ; **2.** కోపించు, చిరాకుపడు. విప్ర. 4.59.
**కెర్లికొను** రూ. చూ. కెరలుకొను. అ. క్రి. **1.** కేకలు వేయు ; **2.** విసుగుకొను. **కెర్లుకొను** రూ. చూ. కెరలుకొను. అ. క్రి. కలవరించు, కేకలువేయు. హంస. 2.27.
**కెఱ** రూ. చూ. గెఱ. వి. రేఖ. అప్ప. 2.197.
**కెల** వి. **1.** నృత్తం. సాంబో. 2.34 ; **2.** నటన.
**కెలగించు** రూ. చూ. కెల్లగించు. స. క్రి. **1.** పీకు ; **2.** పెల్లగించు.
**కెలంకు** రూ. కెలఁకు². వి. **1.** దిక్కు, దెస ; **2.** పార్శ్వం, పక్క ; **3.** సమీపం, దాపు.
క. కెల. పక్క.
< క. కెల.
**కెలంకులు** రూ. కెలఁకులు. వి.బ.వ. **1.** దిక్కులు. భార. అరణ్య: 3.297 ; **2.** పక్క. దశా. 5.29 ; **3.** సమీపం.
**కెలఁకరించు** అ.క్రి. కోడి మొ. నవి పురుగులు మొ. వానిని తినటానికి ముక్కుతో మట్టినిచిమ్ము.
పో. చూ. క. కెరలు. గోళ్ళతోగిచ్చు, గీచు ; త. కిళఱు. గుచ్చు ; మ. కిళఱుక. పైకిలేచు, దుమ్మువలె పైకిలేచు.
**కెలఁకు¹** రూ. కెలుకు. స. క్రి. **1.** రేపు. పండి. చ. 4.291 ; **2.** ఊడబెరుకు, పీకు. కాశీ. 7.95 ; **3.** (గడచిన దుఃఖానుభవాల్ని) స్మృతికితెచ్చు.
క. కెళర్. పోరుతెరచు, పగులగొట్టు, కనబడు, లేచు, అతిశయించు, విప్పు, తెరచు ; కెణకు. చేతలతో కాని మాటలతోకాని చికాకుకల్గించు, లేక పుట్టించు ; తు. కళికుని. కదుపు, కదులు, చికాకుకల్గించు, కోపంతెప్పించు ; త. కిళమ్. గుచ్చు, గీచు, కోడివలెగీచు, పందిలా నాశనం చేయు ; తె. కిళి (-కిలి). పెద్దగరిటితో తీయు.
**కెలఁకు²** చూ. కెలను. రూ. చూ. కెలంకు. వి. పక్క. ఆం.భా. 2.138.
**కెలఁకులు** రూ. చూ. కెలంకులు. వి.బ.వ. **1.** పక్క. భార.విరా. 2.327 ; **2.** దిక్కు.
**కెలన** చూ. కెలను.
**కెలను** చూ. కెలఁకు. వి. **1.** పార్శ్వం, పక్క. భార.శాంతి. 2.358 ; **2.** దాపు, సమీపం. హర. 2.73 ; **3.** దిక్కు, దెస; విణ. **1.** సమీపస్థుడు. భార.విరా. 1.137; **2.** పోటీ వాడు. పి. శకు. 4.64.
క. కెల. పక్క, కుడిలేదా ఎడమవైపు, సామీప్యం ; పర్జి. కెల. పక్క, పార్శ్వం.
< క. కెల.
**కెలన** అవ్య. ద్రు. దగ్గర, చెంత. భార. ఆది. 3.155.
**కెలయు** అ. క్రి. **1.** విర్రవీగు, గర్వించు, నిక్కు. రం. రా. అరణ్య. 66. 15 ; **2.** కేరు, చెలరేగు. దశా. 8.190 ; **3.** వేడుకపడు, ఉత్సాహపడు. చంద్రాంగ. 5.53 ; **4.** కనరుకొను, కోపపడు. దశా. 4.119 ; **5.** గర్జించు.
క. కెలె. అరచు, కేకలువేయు, సంతోషంతో కాని, కోపంతో కాని అరచు ; తు. కెలెపుని. కోడివలెకూయు, అరచు; త. చిలై. ప్రతిధ్వనించు, కోపించు ; మ. చిలప్పు. చెడినలోహపుపాత్ర యొక్కశబ్దం ; చిలమ్పు. గణగణమని ధ్వనించే ఆభరణం ; పో. చూ. కుయి. కిలచిల. అస్పష్టమైనధ్వని, గునగునలు.
< క. కెలె.
**కెలవగ** వి. ప్రాంతప్రదేశం.
**కెలవాడి** వి. కిలాడి, టక్కరి, తాళ్ళ. సం. 12.14.
**కెలవు¹** వి. అనురాగం, వలపు. కాశీ. 3.144. నరస. 3.144.
క. కెలె, జెని, జెలె. కూడిక, కలయిక, స్నేహం, స్నేహితుడు, జతగాడు. పో. చూ. త. కెలి. తీవ్రంగా కాంక్షించు, కోరు.
< క. కెలె.
**కెలవు²** వి. **1.** దూరం. జైమినీ భా. 5 53 ; **2.** పక్క. పార్శ్వం. జైమినీ భా. 123 ; మను. 5.26.
పో. చూ. క. కెళగు. కిందనుండు, హీనంగాఉండు, తక్కువస్థితి యందుండు ; పర్జి. కెల. పక్క.
**కెలస** రూ. చూ. కెలసము. వి. **1.** సేవ, ఉపచారం ; **2.** పని, కృత్యం.
**కెలసము** రూ. కెలస. వి. **1.** సేవ, ఉపచారం. కు. సం. 2.25. పండి. చ. 362. పు ; **2.** పని, కృత్యం. కు. సం. 4.54 ; **3.** అక్కర, కావలసినపని, అభీష్టకృత్యం. భార. అరణ్య. 5.228 ; **4.** నిమిత్తం, హేతువు. ఆము. 4.96 ; **5.** వేడుక.
క. కెలస. పని, వ్యాపారం, వ్యవహారం, ఉపయోగం, ప్రయోజనం ; తు. కెలస. పని, ఉద్యోగం, అనుభవం ; తె. కెలె. పైపని ; కొండ. కెలెస. పని.
< క. కెలస.
**కెలుకు** రూ. చూ. కెలఁకు¹. స. క్రి. కలియబెట్టు, కెలకరించు.
**కెల్లగించు** రూ. కెలగించు, కెళ్ళగించు. స క్రి. **1.** పెల్లగించు. కు.సం. 8.101 ; **2.** రేచు.
పో. చూ. క. కెల్ల, కెల్లె, దారంముక్క, చిన్నముక్క ; తు. కెళకుని. కదులు, చికాకు కల్గించు, కోపం కల్గించు ; త. కెళ్ళు. చిరాకుకల్గించు, విసిగించు. హరించు, కోపంకల్గించు. కిలై. గీచు, గిచ్చు, కోడివలె గిలుకు, పందివలె కుళ్ళగించు ; మ. కిళ. కెలకు, గీచు ; తె. కిళి(కిల్చ్-). గరిటతో పైకితీయు (ఆహారం) ; కొండ. కళ (ప్-ట్-). గీచు, గిచ్చు.
**కెల్లి¹** పో. చూ. కెర్లి. వి. **1**. మల్లబంధ విశేషం.
**కెల్లి²** ప్రత్య. నుంచి.
**కెల్లికొమ్ము** చూ. కెల్లి¹. వి. ఒకటిముందుకు, ఒకటి వెనుకకు

తిరిగిఉండే కొమ్ము.

**కెల్లు** రూ. చూ. కెరలు. అ. క్రి. అతిశయించు, విజృంభించు.

**కెల్లుమలఁగు** అ. క్రి. పరాఙ్ముఖమగు, పెడమొగంపెట్టు. హర. 3.81; **కెల్లురేగు** అ.క్రి. విజృంభించు. శాళ్వ. 7.236. **కెల్లువాఱు(-పాఱు)** అ.క్రి. 1. సంతోషించు. భార. ద్రోణ. 4.114 ; 2. చొరబడు, చొచ్చు.

**కెళకుళి** రూ. చూ. కేళాకుళి. వి. క్రీడానరస్సు. షో. చ. 8.38.

క. క్రీడాకుళి. క్రీడానరస్సు, కొలను.

**కెళకూళి** రూ. చూ. కేళాకుళి. వి. క్రీడానరస్సు.

**కెళగు** వి. ఆర్తవం, ముట్టు.

**కెళవు** వి. 1. దూరం. జైమినీ భా. 5.58 ; 2. పక్క. జైమినీ భా. 8.123, మను 5.26.

క. కెళగు. కిందితనం, అడుగు.

<క. కెళగ.

**కెళాకుళి** రూ. చూ. కేళాకుళి. వి. క్రీడానరస్సు. రసిక. 3.117.

**కెళాకూళి** రూ.చూ. కేళాకుళి. వి. క్రీడానరస్సు. రాజవా. 3.81.

**కెళ్ళగించు** రూ.చూ. కెల్లగించు. స.క్రి. పెల్లగించు.

**కెళ్ళించు** స.క్రి. కిందిదానినిపైకి తెచ్చు.

**కెళ్ళు**[1] స.క్రి. తిను.

త. కిళ్ళు. కొద్దిగాతీసుకొను.

<త. కిళ్ళు.

**కెళ్ళుకొను** స.క్రి. నోటవేసుకొను. కవిక. 2.197.

పో.చూ. కళ్ళు. (ఐణ్,-వ్-) కొద్దిగా తీసుకొను.

**కెళ్ళు**[2] అవ్య. దఢాలున, చటుక్కున. ధ్వన్యను.

**కెళ్ళుఱుకు** రూ. క్రేళ్ళురుకు. అ.క్రి. గంతులిడు. పద్మ. 7.243.

**కెళ్ళువారు** రూ. క్రేళ్ళువాఱు. అ.క్రి. 1. గంతులిడు ; 2. విజృంభించు ; 3. చెదరిపోవు.

**కెవవిబంటు** పో.చూ. గవను. వి. గవనిబంటు, కోటగుమ్మం కాచేవాడు. ప్రబంధ. 78.

త. కవుణి-.కోటద్వారం, పట్టణద్వారం.

**కెవ్వు** వి. అరవటంలో అయ్యేదుఃఖాది ధ్వనిసూచకం. అని. 4.46.

క. కెవ్వనె. కీచుమనేధ్వని, రాయివిసిరేటప్పుడయ్యే ధ్వని. పో.చూ. కేవు. ఎగవూపిరితీయు, ఆయాసపడు.

**కెవ్వున** క్రి. విశ. ద్రు. దడాలున, ఒక్కసారిగా, గట్టిగా, ప్రతిధ్వనించేట్లుగా. వసు. 2.11. అని. 4.49.

**కే** వి. ఉత్సాహాన్ని తెలిపే ధ్వన్యనుకరణం. హరి. పూ. 5.212.

త. కేయ్-ఐణల్ -. అరుపును తెలియజేసేవిధానం.

**కేక** వి. 1. అరుపు, పెద్ద కూత. సారంగ. 2.3 ; 2. హరిజనులు చిందులుతొక్కుతూ వేసే కేక.

సం. ప్రా. కేకా. నెమలికూత.

క. కేకే. ప్రథమధ్వని ; కేగు, కేకు. నెమలికూత, తు. కేకి. సంతోషంతో వేసేకేక ; త. కేకై. నెమలికూత.

<సం. కేకా. (అర్థవిపరి.).

**కేకవేయు** స.క్రి. పిలుచు. అ.క్రి. అరచు. **కేకించు** అ.క్రి. ధ్వనిచేయు, కేకలువేయు. కు.సం. 5.86.

క. కేగు. నెమలిలాగకూయు.

**క్రేకటకెమ్మటలాడు** చూ. కేకటకెమ్మటలు.

**కేకటకెమ్మటలు** రూ.చూ. కేకటగెమ్మటలు. వి.బ.వ. వేళాకోళాలు.

**కేకటకెమ్మటలాడు** స.క్రి. పరిహాసాలాడు, పండి.చ. 4.111 వ.

**కేకటగెమ్మటలు** రూ. కేకటకెమ్మటలు. వి.బ.వ. వేళాకోళాలు. పండి. చ. 4.273.

**కేకరించు** అ.క్రి. 1. కేకలువేయు. నవనాథ. 3 ; 2. సకిలించేరీతిగా ధ్వనిచేయు. శుక. 1.427 ; స.క్రి. 1. మించు, తక్కువచేయు. గంధ. 199 ; 2. గద్దించు, అదలించు.

క. కేకరిసు (క్యేకరిసు). కేకరింత, కేకలువేస్తూ అమ్ము ; త. కేవు (ఐణ్,-వ్-). బరువుగాఊపిరిపీల్చు, ఎగఊపిరితీయు.

<క. కేకరిసు.

**కేకరింత** వి. 1. గొంతుసరిచేసికొనేటప్పుడు కలిగేశబ్దం, నకలించు ; 2. కేకలువేయటం. క. కేకరికె. కేకరింత, అరుచు.

**కేకరింత** చూ కేకరించు.

**కేకన** రూ. కేకిన. వి. చప్పట. రాజ.చ. 2.160.

**కేకనలాడు** రూ.చూ. కేకిసలాడు. అ.క్రి. పరిహాసం చేసేటప్పుడు కేకలువేస్తూ చప్పట్లుకొట్టు. మత్స్య. 3.98. **కేకనలు** రూ.చూ. కేకినలు. వి.బ.వ. పరిహాసం చేసేటపుడు కేకలువేస్తూ కొట్టేచప్పట్లు. రాజ.చ. 2.160. **కేకసలుగొట్టు (-కొట్టు)** రూ.చూ. కేకినలుగొట్టు. అ.క్రి. 1. ఎగతాళి చేస్తూ చప్పట్లుకొట్టు ; 2. ఉత్సాహపరచు. **కేకసల్గొట్టు** రూ.చూ. కేకినలుగొట్టు. అ.క్రి. 1. పరిహాసంచేసేటప్పుడు కేకలువేస్తూ చప్పట్లుకొట్టు ; 2. ఉత్సాహపరుచు.

**కేకించు** చూ. కేక.

**కేకిన** రూ.చూ. కేకన. వి. 1. నమస్కారం, మొక్కు. హంస 4.213 ; 2. కేకలువేస్తూకొట్టేచప్పట.

**కేకినగొట్టు(-కొట్టు)** అ.క్రి. పరిహాసంచేస్తున్నపుడు కేకలు వేస్తూ చప్పట్లుకొట్టు. చంద్రాంగ. 4.17. **కేకినలాడు** రూ. కేకసలాడు. అ.క్రి. పరిహాసం చేసేటపుడు కేకలు వేస్తూ కొట్టేచప్పట్లు. భార.మౌనల. 41 **కేకినలు** రూ. కేకసలు. వి.బ.వ. నమస్కారాలు, మొక్కులు, చప్పట్లు. బహులా. 2.41. **కేకినలుగొట్టు(-కొట్టు)** రూ. కేకసలుగొట్టు, కేకసల్గొట్టు, కేకిసల్గొట్టు. అ.క్రి. పరిహాసం చేసేటపుడు కేకలువేస్తూ చప్పట్లుకొట్టు. పారి. 3.12. **కేకిసల్గొట్టు** రూ.చూ. కేకినలుగొట్టు. అ.క్రి. పరిహాసంచేసేటపుడు కేకలువేస్తూ చప్పట్లుకొట్టు.

**కేకూళి** వి. 1. గుంట, చెలమ ; 2. మడుగు.

**కేకన్ను** రూ.చూ. క్రేగన్ను. వి. కడకన్ను.

**కేగరించు** అ.క్రి. సమీపించు. పండి.చ. 2.229.

**కేఁగేలు** రూ.చూ. కెంగేలు. వి. ఎర్రనిచేయి. శృం.

**కొంచదనము** రూ. చూ. కొంచెతనము. వి. సన్నదనం, కార్శ్యం.

**కొంచదనముసెయు (-చేయు)** స. క్రి. తక్కువపరచు.

**కొంచపడు** రూ. చూ. కొంచెపడు. అ. క్రి. అల్పత్వంచెందు, న్యూనపడు. తాళ్ళ. సం. 11.2. భా. 17.

**కొంచపఱుచు** రూ. చూ. కొంచెపఱచు. స. క్రి. కించపరుచు.

**కొంచపాఱు** రూ. చూ. కొంచెపాఱు. అ. క్రి. 1. సంకోచించు, వెనుదీయు ; 2. కొంచెమగు.

**కొంచపోవు** స. క్రి. తీసికొనిపోవు.

**కొంచించు** చూ. కొంచు.

**కొంచియము** రూ.చూ. కొంచెము. విశ. అల్పమైన, తక్కువైన. కాశీ. 3.140. చంపూ. రా. 6.92 ; వి. 1. లోటు ; 2. అచిరకాలం ; 3. సంక్షేపం.

పో. చూ. సం. *కించిత్*. కొంచెం.

**కొంచియముచేయు** రూ.చూ. కొంచెముచేయు. స.క్రి. 1. పంచించు, మోసపుచ్చు. ఆము. 6.40 ; 2. తక్కువపరుచు, అవమానించు. చంద్రికా. 4.45.

**కొంచు** రూ. కొంజు. అ. క్రి. 1. సంకోచించు. భార. ఆది. 5.166 ; 2. మందగించు. ఉ.రా. 1.181 ; 3. భయపడు. ఉ. రా. 3.214 ; 4. కొనదు ; వి. 1. మదం, గర్వం. చంద్రాంగ. 4.245 ; 2. కొంకు, సందేహం. అచ్చరా. కిష్కిం. 29 ; 3. తక్కువ, లోపం. నీలా. 1.48 ; 4. మురికి, చెమట. ఆం. భా. 1.140 : 5. మత్తు ; విశ. తక్కువ, అల్పం. అచ్చ. రా. యుద్ధ. 100.

క. కొఱె. తక్కువగు, తగ్గు, క్షీణించు ; త. కొంచు. (-ఇన్-వ్-). బాలుర లాగవేలు, స్త్రీలలాగా ప్రేమగా మాట్లాడు ; మ. కొంచుక. వదరు.

**కొంచించు** అ. క్రి. 1. సంకోచించు. దశా. 4.171 ; 2. తగ్గు. కాళింది. 2.28. **కొంచు(డు** వి. అల్పుడు. సీతా. వి. 1.105.

**కొంచెకత్తె** చూ. కొంచెము.

**కొంచెకా(డు** చూ. కొంచెము.

**కొంచెకొంచెము** చూ. కొంచెము.

**కొంచెగా(డు** చూ. కొంచెము.

**కొంచెతనము** చూ. కొంచెము.

**కొంచెతనముసేయు** చూ. కొంచెము.

**కొంచెపడు** చూ. కొంచెము.

**కొంచెపఱుచు** చూ. కొంచెము.

**కొంచెపాఱు** చూ. కొంచెము.

**కొంచెపు(గవులు** చూ. కొంచెము.

**కొంచెపు(దనము** చూ. కొంచెము

**కొంచెపుబుద్ధి** చూ. కొంచెము.

**కొంచెపువా(డు** చూ. కొంచెము.

**కొంచెమగు** చూ. కొంచెము.

**కొంచెము** రూ. కొంచియము. విశ. 1. అల్పమైన, తక్కువైన. భార. శాంతి. 6.38 ; 2. సుకరం, తేలికైన, చులకనైన. శుక. 4.16. వి. 1. న్యూనత, కొరత, లోటు. భాగ. 1.95 ; 2. సంక్షేపం, సంగ్రహరూపం. వరాహ. 9.131 ; 3. అల్పకాలం, అచిరకాలం. సారంగ. 3.251.

క. కొంచ, కొంచె. స్వల్పమైన, తక్కువతనం, తు. కొం(ద. చిన్న, న్యూనత్వం ; త. కొంచ్చు. కొంచం. చిన్న ; మ. కొంచం. చిన్న, కొంచ్చు. పొట్టి, తక్కువైన.

**కొంచెకత్తె** వి. 1. జాణ, నేర్పరి. కువ. చ. 4.13 ; 2. అమాయకురాలు ; 3. సామాన్యురాలు. **కొంచెకా(డు** రూ. చూ. కొంచెగా(డు. వి. సామాన్యుడు, అల్పుడు. శుక. 3.285. **కొంచెకొంచెము** విశ. ఇంచుకించుక. **కొంచెగా(డు (కా(డు)** రూ. కొంచెకా(డు. వి. అల్పుడు, సామాన్యుడు. ఉ. రా. 8.112. **కొంచెతనము** రూ. కొంచదనము. వి. 1. తక్కువతనం, సూక్ష్మత్వం, అచ్చ.రా. అరణ్య. 23 ; 2. అల్పత్వం, నీచత్వం. **కొంచెతనముసేయు (-చేయు)** అ. క్రి. అవమానపరచు. శేయూ. 4.135. **కొంచెపడు** రూ. కొంచపడు. అ. క్రి. 1. తక్కువగు, కొరతపొందు. భోజ. 6.191 ; 2. వ్యర్థమగు, నిష్ఫలమగు. విష్ణుపు. 2.217 ; 3. లాఘవంపొందు, తేలికగు. ఇందు. 6.62 ; 4. తగ్గిపోవు, క్షీణించు. నీతి. 5.9. ; 5. సన్నగిల్లు, కృశించు. చంద్రాంగ. 1.97. **కొంచెపఱుచు** రూ. కొంచపఱుచు. స. క్రి. 1. తగ్గించు, తక్కువచేయు. జైమినీ భా. 5.193 ; 2. న్యూనపరచు, లాఘవపరచు. చెరచు, పాడుచేయు. వరాహ. 2.124. **కొంచెపాఱు** రూ. కొంచపాఱు అ. క్రి. 1. కొంచెమగు ; 2. వెనుదీయు. **కొంచెపు(గవులు (-కవులు)** వి.బ.వ. కుకవులు, అల్పకవులు. పాండు. 1.16. **కొంచెపు(దనము (-తనము)** వి. న్యూనత. దశకు. 12.124. **కొంచెపుబుద్ధి** వి అల్పబుద్ధి. **కొంచెపువా(డు** వి. అల్పుడు. భార. ఉద్యో. 1.14. **కొంచెమగు** అ. క్రి. తక్కువగు. జైమినీభా. 5.155. **కొంచెముగొప్ప** విశ. ఎక్కువ తక్కువ. **కొంచెముచేయు** రూ. కొంచియముచేయు, కొంచెముసేయు. స. క్రి. పంచించు, మోసపుచ్చు. ఆము. 6 40. **కొంచెముసేయు (-చేయు)** రూ. చూ. కొంచెముచేయు. స. క్రి. తక్కువచేయు, చెరచు, మోసపుచ్చు.

**కొంజా** వి. గంటనూరి, రెప్ప, వాలుగాఉన్నచూపు, దాదాకు దించినపంచ.

**కొంజు** రూ. చూ. కొంచు. అ. క్రి. 1. వినువుచెందు. భాగ. పూ. 10.505 ; 2. సంకోచించు. భాగ. పూ. 10.1317 ; 3. లోభించు. కుచేల. 1.108 ; 4. భయపడు.

**కొంజె** వి. చేనులో ఒకమూలకోసుగాఉన్న భాగం.

**కొంజెర** రూ.చూ. కొంజేరు. వి. పిల్లకాలవ, పంటకాలవనుంచి తీసినచిన్నపిల్ల కాలవ.

**కొంజేరు** రూ. కొంజెర, కో(జేరు. వి. పిల్లకాలవ, పంటకాలవనుంచి తీసిన చిన్నకాలవ.

**కొటాయి** వి. పెద్దపెళ్ళిపందిరి.

**కొటార** రూ. చూ. క్రట. వి. ప్లేటులాగ ఉండి చెవులుండి అంచులేని చిన్నమట్టిపాత్ర, మహమ్మదీయులు వాడే ఒక పాత్ర.

**కొటారము[1]** రూ. చూ. కొట్టరువు. వి. కళ్ళెం. ఉప్పు, మొ. రాసులుగా ఉండేచోటు. వసు. 2.149.

**కొటారము[2]** వి. పేర్చిన దొంతులవరస.

**కొటారి** రూ. చూ. కొట్టరి. వి. ఉగ్రాణపువాడు, కోష్ఠాధికారి. బసవ. 2 వు. 46 పం.

**కొటారు**[1] రూ. చూ. కొట్టరువు. వి. 1. ఉప్పు మొ. రాసులుగా ఉండేచోటు. మను. 3.80 ; 2. ఆస్పదం, స్థానం. చెన్న బసవ. 2.24 ; 3. కొట్టు. హంస. 2.226, 4. కళ్ళెం, కుప్పలునూర్చే చోటు ; 5. ధాన్యం నిలవచేసే పెద్దబాన.

**కొటారు**[2] రూ.చూ. కోటేరు. వి. నాగలి.

**కొటి** రూ. చూ. కోటి. వి. కోటికాఁడు, చారుడు.

పో. చూ. క. కొల్. చంపు ; పో. చూ. త. కొల్ ; మ. కొల్లుక.

కొటికాఁడు రూ. కొట్టికాఁడు. కోటికాఁడు. వి. 1. వధ చేసేకింకరుడు. జైమినీ భా. 8.41 ; 2. వేగరి.

**కొటిక**[1] రూ.చూ. కొట్టిక[1]. వి. గ్రామం, పట్టణం, పల్లె. జైమినీ భా. 1.86.

**కొటిక**[2] రూ. కొట్టిక[2]. వి. 1. వామనుడు, పొట్టివాడు. ఆం.భా. 2.123 ; 2. లోభి.

క. కుఱు. కురుచదనం ; త. కుట్టై. కురుచదనం, కుఱ్ఱు. చిన్న, కుఱుమై. పొట్టితనం ; మ. కుట్టన్. బాలుడు.

**కొటికి** వి. పసుపుతోకూడిన తెలుపురంగూ, ముళ్ళుకలిగిన ఒక తీగ (Olasesandens).

**కొట్టకొన** వి. చిట్టచివర.

**కొట్టడి**[1] రూ. కొట్టడీ, కొట్టిడి, కొట్టెడి. వి. నరకులుంచే గది, కొట్టు. హంస. 1.119.

ఒ. గు. కోఠి ; హిం. కోఠీ. బంగలా ధాన్యం గిడ్డంగి, వ్యాపారస్థలం ; మరా. కోఠాడీ. పెద్దయిల్లు, ధాన్యం గిడ్డంగి, బంగలా.

క. కొట్టడి, కొఠడి, కోఠడి. గది ; పో.చూ.తు. కొట్య ; త. కొట్టుటి. మ. కొట్టారం, కొట్టిల్. పెద్ద, ఇల్లు ;

<మరా. కోఠాడి.

**కొట్టడి**[2] వి. 1. స్త్రీ సమూహం. బసవ. 1.295. భార. ఉద్యో. 3.183 ; 2. బృందం, సమూహం. బసవ. 1.13 వు. 18 పం.

**కొట్టడీ** రూ.చూ. కొట్టడి[1]. వి. నరకులుంచే గది, కొట్టు. హంస. 1.81.

**కొట్టనము** రూ.చూ. కొట్నము. వి. 1. వడ్లదంపుకిచ్చే ధాన్యం ; 2. సేవ.

**కొట్టము**[1] రూ. కొట్టాము[1], కొట్టాయి, కొష్టం. వి. 1. ఏనుగులు, గుర్రాలు మొదలైన వాటిని ఉంచే శాల. ఎర్ర గుడిపాడు శాసనం, కడపజిల్లా క్రీ.శ. 575 నం, భార. ఉద్యో. 1.93 ; 2. శాల, చావడి. వైజ. 4.66 ; 3. కొట్టు, నరకులుంచేగది. ఆం.భా. 2.15.

సం. గోష్ఠ -. పశుశాల, సభాస్థానం ; ప్రా. గొట్ఠ - ; అమా. గుట్ట- ; హిం. కోష్ఠ్. గృహాంతర్భాగం, ధనాగారం.

క. కొటిగె, కొట్టక్కె, కొట్టుగె, కొట్టిగె. ఇంటికి వెలుపల ఉన్న శాల, పశుశాల ; కొడ. కొట్టి. శాల ; తు. కొట్టు. గుడిసె, ఇల్లు ; కొట్య. శాల ; త. కొట్టిల్. శాల గుడిసె ; మ. కొట్టారం. శాల ; కొట్టిల్. పశుశాల, ఇల్లు ; కుఇ. గుడ. ఇల్లు ; బ్రా. కొటవ్. ఇల్లు.

<ప్రా. గొట్ఠ-.

**కొట్టము**[2] రూ. కొట్టాము[3]. వి. నృత్య విశేషం, హల్లీసకం, కోలాటం. ఆం.భా. 1.130.

**కొట్టరి** రూ. కొటారి, కొఠారి. వి. ధాన్యంకొట్టుపై అధికారి. ద. హిం.శా. సంపు. 4 శా.సం. 1114 క్రీ.శ. 1167 నం. క. కొఠ్ఠారి.

<క. కొట్టారి.

**కొట్టరు** రూ.చూ. కొట్టరువు. వి. కొట్టు.

**కొట్టరువు** రూ. కొటారము[1], కొటారు[1], కొట్టరు, కొట్టారము, కొట్టారువు, కొఠారు. వి. ధాన్యాదులుంచే కొట్టు. బసవ. 6 వు. 671 పం.

సం. కోష్ఠాగార -. ఉగ్రాణం, నరకులుంచేగది ; ప్రా. కొఠ్ఠార -, కొఠ్ఠాగారం. ధాన్యం ఉంచే కొట్టు.

క. కొట్టార ; తు. కొట్టార ; త. కొట్టారం. గాదె.

<ప్రా. కొఠ్ఠార -.

**కొట్టాడు** చూ. కొట్టు[1].

**కొట్టాము**[1] రూ.చూ. కొట్టము[1]. వి. పశుశాల. చంద్రరే. 2.64.

**కొట్టాము**[2] వి. ఒకానొక దేశం.

**కొట్టాము**[3] రూ.చూ. కొట్టము[2]. వి. హల్లీసకం, కోలాటం, నృత్యవిశేషం.

**కొట్టాయి** రూ.చూ. కొట్టము[1]. వి. తృణపర్ణాదిశాల.

కొట్టాయిఉత్సవము వి. విష్ణ్వాలయాల్లో జరిగే ఒక ఉత్సవం.

**కొట్టారమండపము** చూ. కొట్టారము.

**కొట్టారము** రూ.చూ. కొట్టరువు. వి. ధాన్యాదుల్ని దాచుకొనే కొట్టు.

కొట్టారమండపము వి. దేవుడి ఉగ్రాణం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1142 క్రీ.శ. 1144.

**కొట్టారువు** రూ.చూ. కొట్టరువు. వి. ధాన్యాదులుంచే కొట్టు.

**కొట్టి**[1] రూ.చూ. కోటి, వి. వేగు, చారుడు. ఆము. 3.17.

కొట్టికత్తె వి. పరిచారిక, సేవకురాలు. శేయా. 4.50. కొట్టికాఁడు రూ.చూ. కొటికాఁడు. వి. వేగులవాడు, చారుడు. మను. 4.37.

**కొట్టి**[2] చూ. కొట్టడి. వి. కొట్టు.

**కొట్టిక**[1] రూ. కొటిక[1]. వి. గ్రామం లేక పట్టణం. ద్వి. హరిశ్చ. ఉ. 527 పం.

పో.చూ. క. కుడియ, కుడు. రైతు ; కుడి. ఒకే గుడిసెలో నివసిస్తున్న సేవకకుటుంబం ; పో.చూ.తు. కుడి. దేవళం ; త. కుటి. ఇల్లు, నివాసం ; కుటికై. పర్ణశాల ; మ. కుటి. గుడిసె, కుటుంబం, భార్య కుటిల్. ఇంటికి వెలుపల ఉన్న చిన్న ఇల్లు ; పో.చూ. కుఇ. గుడి. ఇంటిలో మధ్యగది ; పర్జి. గుడి. దేవాలయం, గ్రామపు విశ్రాంతి మందిరం ; కొలా. గుడి. దేవళం ; ఒల్లా. గుడి. దేవళం ; పో.చూ. కుటి, కుడ్య, కూటు. గుడిసె ; మాల్టో. కుర్య. పొలాల్లో ఉన్న ఇల్లు

ద్రా. కుడ్. (పి.) గుడిసె, చిన్న ఇల్లు, భార్య ; కుటికా-, కుటీరా, కుటుంగక, కుటీచక ; కోట, కుటుంబ. గృహం.

**కొట్టిక²** రూ.చూ. కొటిక². వి. లోభి, పిసినారి.

**కొట్టికొలారముచేయు** చూ. కొట్టు¹.

**కొట్టికోలాహలముచేయు** చూ. కొట్టు¹.

**కొట్టిగడ్డ** వి కాకిదొండ.

**కొట్టించు** చూ. కొట్టు¹.

**కొట్టిడి** రూ.చూ. కొట్టడి¹. వి. కొట్టు.

**కొట్టిడిచీర** వి. ఒకరకం గళ్ళచీర. **కొట్టిడినేత** వి. ఒక రకం గడినేత. **కొట్టిడియెద్దులు** వి.బ.వ. నరకులబళ్ళకు కట్టే ఎద్దులు.

**కొట్టినపిండి** చూ. కొట్టు¹.

**కొట్టిపెట్టు** చూ. కొట్టు¹.

**కొట్టిపోయు** చూ. కొట్టు¹.

**కొట్టిపోళ్ళు** వి.బ.వ. అడవిప్రాంతాల్లో కొత్తగా సాగుచేసే భూములు.

**కొట్టివే(త** చూ. కొట్టు¹.

**కొట్టివేయు** చూ. కొట్టు¹.

**కొట్టు¹** స.క్రి. 1. తాడించు, ప్రహరించు, దంచు. కు.నం. 2.98 ; 2. వెళ్ళగొట్టు, పారదోలు. భాగ. 1.312 ; 3. కొట్టిచంపు. జైమినీ భా. 7.55 ; 4. చరచు. ఆము. 3.22 ; 5. చేయు, కావించు. ఆము. 6.40 ; 6. దంచు. కళా. 6.36 ; 7. కొరికివేయు. కకుత్థ్స. 5.17 ; 8. అడు, తిట్టు. ప్రభు. 3.83. ప. 2 పం ; 9. భేదించు, వగలగొట్టు. శుక. 3.446 ; 10. ఛేదించు ; 11. ప్రేరణార్థకంలో ధాతువుకు అనుప్రయుక్తమౌతుంది. ఉదా. చెడగొట్టు మొ. ; 12. అనుకరణాలకు అనుప్రయుక్తమై ఉచ్చరించు, అను, పలుకు అనే అర్థాల్నిస్తుంది. ఉదా. చీకొట్టు మొ. ; అ.క్రి. 1. తగులు, తాకు. వరాహ. 10.38 ; 2. ఎక్కువగా కలుగు. దశా. 6.71 ; వి. 1. దెబ్బ ప్రహారం. వరాహ. 2.135 ; 2. దండోపాయం. ఆం.భా. 2.190 ; 3. తాకటం ; 4. కొయ్యసాధనాలతో కొట్టడం ; 5. నరికిన మాంసముక్క.

క. కుట్టు, కొట్టు. విసురు, పొడుచు ; కొడ. కొట్ట్ ; తు. కుట్టుని. కొట్టు ; త. కొటు (-ట్ట్-). కొట్టు, కాళ్ళతోలాగు ; కుట్టు, కుట్టు. కొట్టు ; తా. క్వట్క్. తలుపు మొ. వాటిని తట్టు ; మ. కొట్టుక. మోగించు ; గోం. కొత్తానా, గొట్ట్, కొమ్క్ ; కొండ. కొట్క్. కొట్టు ; కుఇ. కొస్ప (కొస్త్). కొట్టు ; కోడు. పొడిచేయు ; పర్జి. కొట్ట్ : కొలా. కొట్ ; ఒల్లా. కొట్ ; కురు. ఖొట్నా. బద్దలుగొట్టు, తట్టు ; కోతుర్. తట్టు ; మాల్తో. కొటె. కొట్టు, తట్టు ; బ్రా. కుట్టింగ్, గొట్. తట్టు ; కొట్. ముక్కలుగాచేయు.

<మూ.ద్రా.* కొట్ -.

**కొట్టాడు** రూ.చూ. కొట్లాడు. అ.క్రి. 1. బాధపడు. భాగ. 6.43; 2. జగడమాడు. **కొట్టికొలారముచేయు** అ.క్రి. అనవసరమైన ఆర్భాటంచేయు. **కొట్టికోలాహలముచేయు** అ.క్రి. హడావుడిచేయు. **కొట్టించు** స.క్రి. 1. మోగింపచేయు, కొట్టచేయు. మను. 4.37 ; 2. పడగొట్టించు, తవ్వించు. శుక. 3.50 ; **కొట్టినపిండి** వి. క్షుణ్ణంగా తెలిసినవిషయం. **కొట్టిపెట్టు** స.క్రి. ఖండించు. **కొట్టిపోయు** స.క్రి. మిక్కిలి ఎక్కువగా మాట్లాడు. **కొట్టివే(త** వి. 1. తీసివేత ; 2. కొట్టివేయడం. **కొట్టివేయు** 1. కూల్చు, పడగొట్టు. కువల.చ. 3.3 ; 2. తగ్గించు ; 3. తీసివేయు, వ్యవకలనంచేయు ; 4. అననుకూలంగా పరిష్కరించు ; 5. దొంగిలించు. **కొట్టుకపోవు** అ.క్రి. ప్రవాహంలో పడిపోవు. **కొట్టుకలాడు** అ.క్రి. బాధలో ఉండు, తన్నుకలాడు. **కొట్టుకవచ్చు** అ.క్రి. ప్రవాహంలో కొట్టుకొనివచ్చు. **కొట్టుకాడు** అ.క్రి. కొట్టాడు, బాధపడు. రాధా. 2.46. **కొట్టుకువచ్చు** స.క్రి. తీసుకువచ్చు, పట్టుకువచ్చు. **కొట్టుకొనిపోవు** అ.క్రి. జలాదిప్రవాహాల్లో పడి ముందుకు పోవు. **కొట్టుకొనివెళ్ళు** అ.క్రి. ప్రవాహాదుల్తో కలసి ముందుకు పోవు. **కొట్టుకొను** అ.క్రి. 1. సంచలించు, కదులు ; 2. ఆందోళించు, డోలాయమానమగు, ఊగు ; 3. శ్రమపడి పనిచేయు ; 4. బాధపడు ; 5. తన్నుకొను, ఏడ్చు. **కొట్టుడుకళ్ళం** వి. వరిగడ్డిలో ఉండే ముందు పట్టలు, బల్లకు వేసికొట్టి గింజలురాల్చడానికి ఏర్పరచినచోటు. **కొట్టుడుగడ్డి** వి. వడ్లు దులిపివేసిన గడ్డి. **కొట్టుడుబల్ల** రూ కొట్టుబల్ల. వి. ధాన్యం రాల్చడానికి వరి కట్టల్ని కొట్టే బల్ల. **కొట్టుడుబిళ్ళ** వి. గోళికాయ. **కొట్టుడురాసి** వి. పిడేటుతో రాల్చిన వడ్లకుప్ప. **కొట్టుపడు** రూ. కొట్టువడు. అ.క్రి. 1. దెబ్బలు పడు, తాడితమగు. భాగ. 6.123 ; 2. బాధపడు, పీడితమగు. హంస. 2.151 ; 3. వ్యయమగు. **కొట్టుపిడి** వి. మట్టిగడ్డల్ని నన్నగా కొట్టడానికి ఉపయోగించే కొయ్య సుత్తి. **కొట్టుబల్ల** రూ.చూ. కొట్టుడుబల్ల. వి. ధాన్యం రాల్చడానికి వరి కట్టల్ని కొట్టే బల్ల. **కొట్టుమిట్టాడు** అ.క్రి. అతిశయించు, స్వేచ్ఛగా సంచరించు. భాగ. 9.101. **కొట్టుమిట్టిపడు** అ.క్రి. మిడిసిపడు, ఎగిరిపడు. ఉ. హరిశ్చ. 4.26. **కొట్టులమారి** రూ. కొట్లమారి. వి. దెబ్బలుతినే స్వభావం కలవాడు. **కొట్టులాట** రూ. కొట్లాట. వి. కలహం, జగడం. **కొట్టులాడు** రూ.చూ. కొట్లాడు. అ.క్రి. దెబ్బలాడు. రాజ. వి. 3.121. **కొట్టువడు** (-వడు) రూ.చూ. కొట్టుపడు. అ.క్రి. 1. దెబ్బలుపడు, తాడితమగు. మను. 4.86 : 2. బాధపడు. **కొట్టేయు** స క్రి. 1. ప్రహరించు, కొట్టు. 2. వంచించు, మోసపుచ్చు. 3. దొంగిలించు. **కొట్లమారి** రూ.చూ. కొట్టులమారి. వి. దెబ్బలుతినే స్వభావం కలవాడు. చంద్రాంగ. 6.127. **కొట్లాట** రూ.చూ. కొట్టులాట. వి. కలహం, జగడం. కువల. 5.9. **కొట్లాడు** రూ. కొట్టాడు, కొట్టులాడు. అ.క్రి. దెబ్బలాడు. భార. ఉద్యో. 3.242.

**కొట్టు²** వి. 1. సామగ్రులుంచేగది. అచ్చరా. బాల 47 ; 2. ధాన్యం మొ. దాచుకొనేగది ; 3. చెరసాల.

సం. కోష్ఠ, కోష్ఠికా. కొట్టు, కొట్టము ; ప్రా. కోట్ఠ, అ.మా. కుట్ట. ;

క. కొట్టగె, కొట్టగె, కొటిగె. గాదె, గది మొ. ; తు. కొట్టు, కొట్య. కొట్టు ; త. కొట్టకారం. సామగ్రు

లుంచే గది.

<ప్రా. కోట్ఠ -.

కొట్టుగది వి. సరకులు పెట్టుకొనేగది. కొట్టుచీకుడు గుడ్డలు వి.బ.వ. అంగట్లో ఉండిపోయి చీకుపట్టిపోయిన గుడ్డలు. కొట్టుచెక్క వి. గాడిదర్వాజాలో అమర్చే తలుపు చెక్క. కొట్టుపెద్ద వి. ఉగ్రాణపువాడు, కొటారి.

కొట్టు[3] వి. ఒకానొక చెట్టు. పి.శకు. 2.14.

కొట్టు[4] రూ. కొట్టె[1]. వి. గూనపొట్టె, ధాన్యం దాచడానికి వాడే పెద్ద మట్టిపాత్ర.

కొట్టె[1] రూ.చూ. కొట్టు[4]. వి. 1. ఒకవిధమైన గాదె. ఆం.భా. 2.240 ; 2. ధాన్యం దాచే కాగు, బాన, విత్తు.

త. కొట్టు. గాదె, పౌణక.

కొట్టె[2] వి. పండులోని గింజ.

కొట్టెక్కలు వి.బ.వ. ఒక దినుసు భక్ష్యం.

కొట్టెడి రూ.చూ. కొట్టడి[1]. వి. గది, కొట్టు.

కొట్టెలమన్ను వి. ఊకమట్టి. వి. ఒకభాగం మట్టిలో రెండు భాగాలు పొట్టుపోసి వారంరోజులు మురగబెట్టి పాకంచేసిన మట్టి, గాబులు, గరిసెలు చేయటానికి ఉపయుక్తం.

కొట్టేయు చూ. కొట్టు.

కొట్ట్రి రూ.చూ. కొట్రి[2]. వి. వామనుడు.

కొట్నంసోల చూ. కొట్నము.

కొట్నము రూ. కొట్టనము. వి. 1. ధాన్యము. బసవ. 4.102 ; 2. వడ్లు మొ. వాటి దంపు. ద్వి. హరిశ్చ. ఉ. 1.661 పం ; 3. ఊడిగం. యయా. 2.63 ; 4. వివాహ తంత్ర విశేషం ; 5. వడ్లు దంచడానికి కూలిగా ఇచ్చే బియ్యం.

క. కొట్టణ ; త. కొట్టుణం ; మ. కొట్టుణం ; పా. కొట్టున.

కొట్నంసోల వి. ధాన్యం కొలత, రెండు సోలలు, పడిబళ్ళారి సేర్లు. కొట్నముల పాటలు వి.బ.వ. పెళ్ళిలో కొట్నాలు దంచేటప్పుడు పాడే పాటలు. కొట్నములు దంచు స.క్రి. పెళ్ళిలో స్త్రీలు పలురకాల వడ్లుకలిపి పాడుతూ దంచు.

కొట్ర[1] వి. 1. పిండి మొ. వాటిని ఉడకబెట్టడానికి పెట్టిన ఎసరు. కాళ 3.36 ; 2. ఉడికిన సంగటి పాకంలో కలిపే నూక.

కొట్ర[2] రూ. కొట్ట్రి. వి. వామనుడు. ఆం.భా. 2.123.

కొట్రాకు రూ. కొట్రేకు, కొడేకు, కోట్రేకు, కోడేకు. వి. పైరు పొట్టపై నిటారుగా వేసిన ఆకు, కొడిఆకు. పొట్టాకు.

కొట్రేకు రూ.చూ. కొట్రాకు. వి. పైరుపొట్టపై నిటారుగా వేసిన ఆకు, కొడిఆకు, పొట్టాకు.

కొట్లమారి చూ. కొట్టు[1].

కొట్లాట చూ. కొట్టు[1].

కొట్లాడు చూ. కొట్టు[1].

కొట్లెం వి. నారపడుగు నలగకొట్టే కొయ్యగూటం.

కొట్వాలు రూ.చూ. కొత్వాలు. వి. 1. నగర రక్షకుడు ; 2. న్యాయాధికారి.

కొఠా వి. సాల, భవంతి.

సం. కోష్ఠ-. గృహమధ్యం, గాదె ; ప్రా. కోట్ఠ-.

<ప్రా. కోట్ఠ -.

కొఠాకారిక వి. కోశాగారాధిపతి.

సం. కోష్ఠ-. ఇంటిమధ్యభాగం ; ప్రా. కోట్ఠ -.

కొఠారి రూ.చూ. కొట్టరి. వి. కొట్టుపెద్ద, కొట్టువాడు.

కొఠారు రూ.చూ. కొట్టరువు. వి. కొట్టు. ఆం.భా. 2.15.

కొఠిడి రూ.చూ. కొఠీ. వి. గది.

కొఠీ రూ. కొఠిడి, కొఠే. వి. వ్యాపార సంస్థ, ధనాగారం.

సం. కోష్ఠక.- పెద్దఇల్లు ; హిం.ఉ. కోఠీ. పలుగదు లున్న భవంతి, పెద్ద కొట్టు.

<ఉ. కోఠీ.

కొఠీదారు(డు వి. వడ్డీవ్యాపారం చేసేవాడు. హిం. ఉ. *కోఠీదార్*. పెద్ద కొట్టుగలవాడు. < ఉ. *కోఠీదార్*.

కొఠీవేయు స.క్రి. ధనాగారం నిర్మించు లేదా తెరచు.

కొఠే రూ.చూ. కొఠీ. వి. 1. పావుకారు ఇల్లు ; 2. వర్తక సంఘం.

కొడ[1] వి. మంటయొక్క చివరిభాగం.

కొడ[2] వి. స్పర్శ.

కొడక రూ. కొడుక. వి. చిన్నగిన్నె.

కొడక(డు రూ.చూ. కొడుక(డు. వి. కుర్రవాడు.

కొడగకత్తి రూ.చూ. కోడకత్తి. వి. ఒకరకం కత్తి.

కొడత వి. చేత్తో దిబ్బెన్లు అద్దేటప్పుడు బట్టకు నునుపురావడానికి కొట్టే కొయ్య.

కొడతం రూ. కొడితె. వి. ఉన్నిదంచే కొయ్యగూటం.

కొడతకొయ్య వి. దోకుడుపార.

కొడతము రూ. కొణత, కొణతము, కొడిత, కొనతం. వి. 1. కుక్క మొ. వాటి మెడకు కట్టి పట్టుకొనే కర్ర. పద్మ. 1.113 ; 2. మల్లుల పరికరం ; 3. ఒంటి పలుగు దొంతెకు నాగల బదులు అమర్చిన రెండడుగుల పొడుగున్న కర్రముక్క.

క. కొడతె. కుక్కకు కట్టే కర్ర.

కొడతంకర్ర వి. గానుగచక్రం వెనగకుండా బిగించేకొయ్య.

కొడతలి రూ.చూ. కొణతలి. వి. 1. గుమ్మటంలాంటి పని ముట్టు ; 2. ఒకరకం చిన్నరాటి ; 3. ఊత్తె తాడు బిగింపుకు వేసే కొయ్యచెక్క.

కొడవము రూ.చూ.గొఱవము. వి. గుర్రాల్ని తోమే సాధనం.

కొడపానం వి. బిందెసీళ్ళు తెచ్చుకొనే లోహపాత్ర.

కొడపాయి రూ.చూ. కొడిపొయ్యి. వి. పెదపొయ్యి.

కొడపొయ్యి రూ.చూ. కొడిపొయ్యి. వి. పెదపొయ్యి.

కొడమ రూ. కొడము[1]. వి. ముఖభాగంలో కట్టు లేదా మధ్యలో వలలాగ అల్లిక కలిగిన ఊతవంటి మత్స్య గ్రహణ సాధన విశేషం. ప్రబంధ. 194.

క. *కొడమె*, *కొడంబె*. చేపల్ని పట్టే గంప ; పో.చూ. కుడుంపై.

కొడమంగలి వి. మంగలి.

కొడమడుపు వి. చెరువుతూము.

కొడము[1] రూ.చూ. కొడమ. వి. ముఖభాగంలో కట్టు లేదా మధ్యలో వలలాగ అల్లిక కలిగిన ఊతవంటి మత్స్యగ్రహణ సాధన విశేషం.

కొడము[2] రూ.చూ. కొడుము. వి. 1. కుంభహారతి ; 2. కుండ.

**కొదంపొయ్యి** రూ.చూ. కొడిపొయ్యి. వి. ఒకపొయ్యికి కట్టెలు పెట్టి మంట వేస్తే పక్కనఉన్న రెండో పొయ్యికికూడ మంట వ్యాపించడానికి వీలుగా చేసిన జాయింటుపొయ్యి, పెదపొయ్యి.

**కొదలి** రూ.చూ. కొడవలి. వి. కొడవలి.

**కొదలిపులుసు** వి. పెద్దపెద్ద ఆకులు కలిగి గింజలనుంచి నూనె వచ్చే ఒకచెట్టు (Scheichera tridega).

**కొడవలి** రూ. కొడలి, కొడేలి, కొడేలు, కొర్వలి. వి. జా. అవా. లవిత్రం, కక్కులు కలిగి వక్రాకారంగా ఉండి గడ్డి మొ. కోయటానికి ఉపయోగపడే ఒక పనిముట్టు. వరాహ. 12.24.

క. కొడగోలు. కొడవలి; త. కొటువాళ్; మ. కొటువాళ్; తా. క్వడ్, కొట్టి, కొత్తి. పెద్ద వంకర కత్తి; గో. కునంకమ్. కొడవలి; కొండ. కొర్వెలి; కువి. డోవెల్లి. కత్తి; పర్జి. కొడ్క. కువంకయ్. పెద్ద వంకర కత్తి; కొలా. కొడ్వల్. కొడవలి; నా. కొడ్వల్.

**కొడవలిలిక్క** వి. గడ్డి దోకడానికి పై అంచున కూడ పదును ఉన్న కొడవలి.

**కొడిస** రూ. కొడిస[1], కొడిసె[1], కోడిసె. వి. కొండమల్లి, కుటజం. ఆం.భా. 2.50 (Larigatia antidysenterica).

పో.చూ. సం. కుటజ-. కొండమల్లె; ప్రా. కుడయ-. క. కొడసిగె, కొడసిగు, కొరిసిగు; త. కుటచమ్; మ. కుటకప్పాల.

<ప్రా. కుడయ-.

**కొడాపొయ్యి** రూ.చూ. కొడిపొయ్యి. వి. పెదపొయ్యి.

**కొడాప్పొయ్యి** రూ.చూ. కొడిపొయ్యి. వి. పెదపొయ్యి.

**కొడారు** రూ.చూ. కోడేరు. వి. నాగలి.

**కొడి** వి. 1. దీపశిఖనుంచి వెలువడే పొగ. పి.శకు. 2.179; 2. దీపశిఖ. పాండు. 2.127; 3. దీపంవత్తి మొ. వాటి దగ్ధాగ్రం, వాలినచివర; 4. లక్షణం, చిహ్నం, స్వభావం; 5. జెండా.

పో.చూ.సం. కోటి-, కూట-. శిఖరం; ప్రా. కొడి; అప. కోటి;

క. కుడి. మొనదేలిన చివరిభాగం, దీపశిఖ, జెండా; కొడ. కొరి. ధ్వజం; తు. కొడి; త.మ. కోటి; మ. కోటి; తా. క్వెట్. చివర, చనుమొన; గో. కొడి. బాణాదుల అగ్రం; కొలా. కొడి. బిందువు; మాల్తో. కోరు. అగ్రం.

<మూ.ద్రా. *కొట్-.

**కొడిగట్టు(-కట్టు)** అ.క్రి. 1. దీపంకాంతి హీనమగు; 2. వత్తికాలి చివర బొగ్గుగా ఏర్పడు; 3. ధ్వజారోహణం చేయు. **కొడిపొయి** రూ.చూ. కొడిపొయ్యి. వి. ఒకపొయ్యికి కట్టెలుపెట్టి మంటవేస్తే పక్కనఉన్న రెండో పొయ్యికికూడా మంట వ్యాపించటానికి వీలుగా చేసిన పొయ్యి, పెదపొయ్యి. **కొడిపొయ్యి** రూ. కుదపొయ్యి, కొడపొయి, కొడపొయ్యి, కొదంపొయ్యి, కొడాపొయ్యి, కొడాప్పొయ్యి, కొడిపొయి, కొళపొయ్యి. వి. ఒకపొయ్యికి కట్టెలుపెట్టి మంటలు చేస్తే పక్కనున్న రెండోపొయ్యికికూడా మంట వ్యాపించడానికి వీలుగాచేసిన జాయింటుపొయ్యి, పెదపొయ్యి. **కొడిమేను** వి. దర్వాజావక్కఉన్నగోడ. **కొడివడు(-వదు)** అ.క్రి. 1. చలించు, వణకు. కు.సం. 11.79; 2. కుంగు. కు.సం. 11.80. **కొడివాఱు(-పాఱు)** అ.క్రి. దీపం కొనసాగు. పి.శకు. 2.179. **కొడివేయు** స.క్రి. జెండా ఎగరవేయు. **కొడిసాగు** అ.క్రి. కొనలుసాగు. శాశ్ల. సం. 11.78. **కొడిస్తంభము** వి. ధ్వజస్తంభం. **కొడెక్కు** అ.క్రి. దేవాలయంలో ఉత్సవం ప్రారంభమగు. <కొడి + ఎక్కు.

**కొడిక** వి. తెల్లటికంకి, నల్లటి విత్తనాలుండే జనపమొక్కలాంటి కలుపుమొక్క (Chrozophorottent).

**కొడిగ** రూ. కొడిగె, కొటిగ, కొటిగె[2]. వి. ముంజూరు, చూరు ముందు భాగం. రం.రా.సుం.

పో.చూ.క. కొడకె, కొడంకె. చెవి; త. కొటుంకై. చూరు; మ. కొటుంకై.

**కొడిగె** రూ.చూ. కొడిగ. వి. ముంజూరు, చూరుముందుభాగం. ఘటికా. 2.66.

**కొడితి** వి. 1. పిడిగల చిన్న కర్రదిమ్మ; 2. చుట్టూ గుడిసెల కప్పుకింది చట్రానికి పోతుపెంటి వాసాలను తగిలించే పద్ధతి; 3. దూది ఏకేటప్పుడు కమానునరం కట్టే కొయ్య బడితె.

**కొడితీగె** వి. ఆకుపచ్చని పూలుపూచే ఒకరకం తీగ (Anamiata coculus).

**కొడితె** రూ.చూ. కొడతం. వి. ఉన్నిదంచే కొయ్యగూటం.

**కొడిద** రూ. కొడిది[1], కొడిదిలి, కొడ్దిలి, కొటిద[1], కొటిదిరి, కొటిదిలి. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగువేళ్ళు వంపగా ఏర్పడ్డ చేర, అరచేయి, పుడిసిలి. ఆం. భా. 2.140.

క. కుడతె, కుడితె, కుడుతె. అరచేయి; పో.చూ. కు. కొండె. ద్రవాల్ని కొలవడానికి ఉపయోగించే సాధనం; త. కొటుంకై. పుడిసిలి; కుటింకై. అరచేయి; మ. కుండు. బోలుగా ఉన్న భాగం; కొటున్న, కుటున్న. పుడిసెడు.

**కొడిదాడు(-తాడు)** వి. నాగటిమోకు చివరపురిఊడకుండా వేసే ముడి.

**కొడిది[1]** రూ.చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగు వేళ్ళు వంపగా ఏర్పడిన చేర, అరచేయి, పుడిసిలి.

**కొడిది[2]** రూ. కొడ్డి. వి. ఒకానొక చెట్టు. జైమినీ భా. 3.74. (Eluytia colliana).

క. కొడసిగు. వృక్షవిశేషం.

**కొడిదిపూన** రూ. కొడ్డిపూస. వి. ములకాటినిగుచ్చిధరించే వెండి మొదలైనవాటి బిళ్ళ. వేంక. పంచ. 1.598.

**కొడిదిలి** రూ.చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగు వేళ్ళువంచగా ఏర్పడిన చేర, అరచేయి. బహుళా. 4.106.

**కొడిపె** రూ. కొడెపె. వి. జొన్నకు పట్టే తెగులు.

**కొడిపెదంటు** వి. ఎన్నువేయని జొన్నదంటు.

**కొడిమి** రూ. కొడెము. వి. 1. బండినొగల వెనకవైపు; 2. బండి చక్రంలోని నిలువు పట్టె.

**కొడిమిదుత్త** వి. తమిళులు పెళ్ళిమంటపంలో నూనె పోసి దీపం పెట్టటానికి వాడే మట్టి పాత్ర.

**కొడిముదుసు** వి. చంద్ర తీగె, ముదురు ఎరుపురంగు పూలు పూసే ఒక తీగ (Mimosa Ruhicaulis).

**కొడిమురుసు** వి. సుమారు అయిదడుగులఎత్తు పెరిగే తెల్లని పూలుపూసే ఒకచెట్టు (Petalidium Barlericides).

**కొడిమె**[1] రూ. కొడిపె[1]. వి. 1. అపనింద. కళా. 5.56 ; 2. అనృతం, అసత్యం. ఆం. భా. 1.118 ; 3. పాపం, దోషం. అచ్చ. రా. బాల. 1.49 ; 4. దురవస్థ ; 5. కష్టం.

క. కుడు. వక్రత్వం ; త. కుఱుమై. కఠినోక్తులు, నింద ; మ. కుఱుమ, కొఱుమ. నిరంకుశత్వం.

**కొడిమెలాడు** స.క్రి. నిందించు, దూషించు, తిట్టు. **కొడిమెలాఁడు** వి. పాపాత్ముడు, నిందలుమోపేవాడు. **కొడిమెలుగట్టు** (-కట్టు) అ.క్రి. నిందలువైచు, పాపం కట్టుకొను.

**కొడిమె**[2] రూ. కొడిపె[2]. వి. 1. చేపలబుట్ట, కుపేజి. ఆం. భా. 1.159 ; 2. నావ, పడవ.

క. కొడమె, కొడంబె. చేపలుపట్టే సాధనం ; పో.చూ. కుటుంపై. వల.

< క. కొడమె.

**కొడివర్లు** వి.బ.వ. పిండి వంటలు.

**కొడిపె**[1] రూ.చూ. కొడిమె[1]. వి. 1. అనృతం ; 2. దురవస్థ ; 3. కష్టం.

**కొడిపె**[2] రూ.చూ. కొడిమె[2]. వి. చేపలబుట్ట.

**కొడిసె**[1] రూ.చూ. కొడస. వి. కొండమల్లె, తుప్పగాపెరిగే తెల్లటి పూలుపూసే అడవిచెట్టు (Wrightiatinctoria).

**కొడిసె**[2] రూ.చూ. కొడిసె[2]. వి. మత్స్యవిశేషం.

**కొడిసె**[1] రూ.చూ. కొడస. వి. కొండమల్లె, తుప్పగాపెరిగే తెల్లటి పూలుపూసే అడవిచెట్టు (Wrightiatinctoria).

**కొడిసెకాయ** వి. కొడిసెచెట్టు కాయ, ఇంద్రయవం. **కొడిసెపాల** రూ. కొడిసెప్రాలు. వి. కొడిసె కాయ. ఇంద్రయవం. సిం. ద్వా. 2.50 (Holarhena Antidysentenia wrightiatinctoria). మ. కొడగపాల. **కొడిసెప్రాలు** రూ.చూ. కొడిసెపాల. వి. కొడిసెకాయ, ఇంద్రయవం (Wrightiatinctoria).

**కొడిసె**[2] రూ. కొడిస[2]. వి. మత్స్యవిశేషం. సిం. ద్వా. 1.240.

**కొడిసెపొరక** వి. దూలాల మీద వేసేదొంతి, వావిలి పొరక.

**కొడుక** రూ.చూ. కొడక. వి. చిన్నగిన్నె.

**కొడుకఁడు** చూ. కొడుకు. రూ. కొడకఁడు. వి. 1. బిడ్డడు. భాగ 10. ఉ. 32 ; 2. పుత్రుడు.

క. కొడ. చిన్న ; త. కుఱుకన్. చిన్న.

**కొడుకు** రూ. కొడ్కు. వి. 1. పుత్రుడు. భార. ఆది. 4.10 ; ముంజేరుశాసనం, విశాఖ జిల్లా క్రీ.శ. 709 సం. ; 2. మగశిశువు, బాలుడు. భార. ఆది. 5.31 ; 3. పురుషుడు, మగవాడు. వేంక. పంచ. 4.488.

క. కొడ, బాల్యం, జంతుశిశువు ; పో.చూ. కొరె. బలహీనమైన, చిన్న ; త. కుఱుకన్. బాలుడు ; కుఱు. చిన్న, బాల్యం ; పో. చూ. కొఱున్ను, కొఱున్తు. చిన్న, లేత ; కొం. కొఱో. కొడుకు, బాలుడు ; కుయి. కొడ్గి. ప్రౌఢంకాని ; పక్వంకాని ; పర్జి. కొడ్. మిక్కిలిచిన్న, కొత్త, లేత ; కొయంగ్ ; నా. కొవ్వె. చిన్నపక్షి, పిల్ల జంతువు ; మాల్తో. గొరొ. చిన్న.

పో.చూ. సం. కోరక-. మొగ్గ ; కోణక. సద్యోజాత జంతుశిశువు.

**కొడుకుకూఁతురు** వి. మనుమరాలు. **కొడుకుకొడుకు** వి. మనుమడు. **కొడుకుఁగుఱ్ఱ** వి. 1. పుత్రుడు. భార. ఉద్యో. 4.591 ; 2 గారాబు బిడ్డ. వేంక. పంచ. 4.401. **కొడుకువారు** వి.బ.వ. మగపెళ్ళివారు.

**కొడుగు** వి. పూతమట్టి, ఇటికబట్టీ, బయటిపూతకువాడేఎర్రమట్టి.

**కొడుంక** రూ. కోడుంక. వి. అధివాసం.

**కొడుఁగురు** చూ. కొడి. రూ. కొడుఁదురు, కొణుఁగురు, కొణుఁదురు. వి. 1. దీపపు చిట్టెం ; 2. శైత్యాదులచే శరీరానికి కలిగేవంకర.

**కొడుఁగురుపోవు** రూ.చూ. కొడుఁగురువోవు. అ. క్రి. శైత్యాదులచే వంకరపోవు, మెలికలుతిరుగు. **కొడుఁగురువోవు(-పోవు)** రూ. కొడుఁగురుపోవు. అ.క్రి. శైత్యాదులచే వంకరపోవు, మెలికలుతిరుగు. కేయూ. 3.270.

**కొడుఁదురు** రూ. చూ. కొడుఁగురు. వి. దీపపుచిట్టెం.

**కొడుపు** వి. 1. అప్పడాలు మొ॥ ఒత్తేగుండ్రని కర్ర. కాశీ. 1.138 ; 2. బలపం మొ. వాటికడ్డి. సిం. ద్వా. 8.113 ; 3. ఢంకా, తేగంట మొ. వాటిని వాయించే కోల. రామాభ్యు. 6.7 ; 4. తంబుర, వీణ మొ. తంత్రీవాద్యాల్ని వాయించటానికి వేలికి తగిలించుకొనే లోహపుగోరు ; 5. జంతికలు చేసేగొట్టం ; 6. వెదురుకణుపుల నడిమిభాగం ; 7. పత్తికాడ, పత్తినుంచి గింజలు వేరుచేయటానికి వాడే ఇనపకడ్డీ.

క. కొడుపు, కొడుహు, గుణకు, గుణుకు. వాద్యాల్ని వాయించడానికి ఉపయోగించే కర్ర ; పో. చూ. తు. కొడంటి. కర్ర లేక ఇనపసుత్తి ; త. కుణిల్. వాద్యాల్ని వాయించడానికి ఉపయోగించేకర్ర.

**కొడుపుకొను** స. క్రి. రాల్చుకొను.

**కొడుపురుతీగ** వి. చంద్రతీగ, తిప్పతీగ (Tinospava cordifolia).

**కొడుము** రూ. కొడము[1]. వి. 1. బిందెవంటి కుండ, బాన. క్రీడా. 117 ; 2. తీర్థపు బిందె ; 3. నీళ్ళబిందె.

క. కుడు, కొడు, కొడ. నీళ్ళకుండ ; తు. కొడపాన ; త. కుడుమ్.

సం. కుటు- ; ప్రా. కుడ ; పా. కుట ; హిం. కులియా ; సిం. కుళవ-.

**కొడె** చూ. గొడుగు. వి. గొడుగు, ఎండుబాటు పుట్టువు.

**కొడెక్కు** చూ. కొడి.

**కొడెపె** రూ. చూ. కొడిపె. వి. జొన్నకు పట్టేతెగులు.

**కొడెము** రూ. చూ. కొడిమి. వి. 1. బండినొగలవెనుకవైపు ; 2. బండిచక్రంలోని నిలువుపట్టె.

**కొడేకు** రూ.చూ. కొట్రాకు. వి. పైరుపొట్టపై నిటారుగా వేసిన ఆకు, కొడాకు, పొట్టాకు.

కొడేలి రూ. చూ. కొడవలి. వి. కొడవలి.

కొడేలు రూ. చూ. కొడవలి. వి. కొడవలి.

కొడ్కు రూ. చూ. కొడుకు. వి. పుత్రుడు. దాక్షారామశాసనం. తూ. గో. జిల్లా. క్రీ. శ. 1081. నం.

కొడ్డి రూ. చూ. కొడిది². వి. ఒకానొకచెట్టు (Eluytia-collina).

కొడ్డిపూన రూ. చూ. కొడిదిపూన. వి. ముల్లుతాటిని గుచ్చి ధరించే వెండి, మొ. వాటిబిళ్ళ. జైమినీ భా. 3.74.

కొడ్డిలి రూ. చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగు వేళ్ళు వంచగా ఏర్పడిన చేర, అరచేయి, పుడిసిలి.

కొడ్వలి రూ. చూ. కొడవలి. వి. కొడవలి.

కొణగికొమ్మలరాగి వి. కోలగాఉండే ఎన్నులుగలరాగి, రాగులలో ఒకరకం పంట.

కొణజము రూ. చూ. కొణజా. వి. వాకిటికావలి ఇల్లు, ద్వారాన్ని మాత్రం రక్షించేపంచ.

కొణజా రూ. కొణజము. వి. వాకిటికావలి ఇల్లు, ద్వారాన్ని మాత్రం రక్షించే పంచ.

కొణత రూ. చూ. కొడతము. వి. 1. మల్లసాధన విశేషం. ఆం. భా. 2.207 ; 2. కుక్కను కట్టేకొయ్య.

పో. చూ. క. కణత, చెక్కతో చేసిన గద.

కొణతకట్టె వి. గుది. దొంగగొడ్డు పరుగెత్తకుండా మెడకు వేలాడగట్టే బరువుకొయ్య.

కొణతము రూ. కొడతము. వి. 1. కుక్క మొ. మెడకు కట్టి పట్టుకొనే కర్ర. వేమ. శ. 36 ; 2. మల్లసాధన విశేషం. శశా. 2.117 ; 3. కుక్కను కట్టేకొయ్య ; 4. చేతులకు వేసేసంకెల ; 5. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి మెడకు కలిపికట్టే కట్టు.

కొణతంబిళ్ళ వి. ఊడ్తెతాడు బిగింపుకు వేసేచెక్క.

కొణతలి రూ. కొడతలి, కొంతలి. వి. 1. గుమ్మటం లాంటి పనిముట్టు ; 2. ఒకరకం చిన్నరాట ; 3. ఊడ్తెతాడు బిగింపుకు వేసేకొయ్యచెక్క.

కొణతలిదిమ్మ వి. రాటతిరగటానికి రాటికూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. కొణతలిదుక్క వి. రాటి తిరగటానికి రాటికూలానికి ఆధారంగా ఉన్న కొయ్య.

కొణతాము వి. పెద్దతాళంచెవి.

కొణదరాలు వి.బ.వ. రెండోసారి కాల్చిన సున్నపురాళ్ళు.

కొణామణి రూ. కొనామని, కోణామణి. వి. కృష్ణా, గోదావరి డెల్టాల్లో ఎక్కువగా పండించే పొడుగైన వడ్లు.

కొణిగ రూ. చూ. కొడిగ. వి. ముంజూరు, చూరుముందరి భాగం. మను. 6.3.

కొణిగచూరు వి. ముంజూరు. ఆం. భా. 2.21.

కొణిగె¹ రూ. కొళిగె, కోణిగ, కోళిగె. వి. నమస్కారం. ప్రబంధ. 880.

క. కంయు. నమస్కృతి ; త. కొణివల్. వంపు ; కోణు. వంచబడు ; మ. కోటుక, కోణుక. వంగు.

కొణిగె² రూ. చూ. కొడిగ. వి. ముంజూరు. వసు. 4.63.

కొణిఁగె వి. దిబ్బ, కుప్ప. కృష్ణ. 1 20.

క. కుడు. ఎగుడు దిగుడుగా ఉండటం : త. కోణల్. గుట్ట ; కూటం, దిబ్బ, గుట్ట ; మ. కణక్కు. ఏటవాలుగా ఉండటం.

కొణిత రూ. చూ. కొడతము. వి. మల్లపరికర విశేషం, కంబం.

కొణితం వి. పట్టుపరుగు నరిచేయటానికి నిలబెట్టిన ఊడ్తెతాడు బిగింపుకోసం వేసిన కొయ్య బిళ్ళ.

కొణిద¹ రూ. చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగు వేళ్ళు వంపగా ఏర్పడినచేర, అరచేయి, పుడిసిలి.

కొణిదెఁడు వి. అరగుప్పెడు.

కొణిద² రూ.చూ. కొణిది¹. వి. మనుష్యుల్లో ఒకజాతి (వర్ణం).

కొణిది¹ రూ. కొణిద². వి. జాతి (వర్ణ) భేదం.

కొణిది² వి. ఒకచెట్టు.

కొణిదిరి రూ. చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగువేళ్ళు వంపగా ఏర్పడినచేర.

కొణిదిలి రూ. చూ. కొడిద. వి. బొటనవేలు కాక తక్కిన నాలుగు వేళ్ళు వంపగా ఏర్పడిన చేర. ద్వి. హరిశ్చ. పూ. 1427 పం.

కొణిదెఁడు చూ. కొణిద¹.

కొణుగు రూ. చూ. గొణుఁగు. అ. క్రి. ఎవరికీ వినిపించకుండా నోటిలో ఉచ్చరించుకొను.

కొణుఁగురు రూ. చూ. కొడుఁగురు. వి. 1. దీపపుచిట్టెం ; 2. శైత్యాదులచేత కలిగేవంకర.

కొణుజు రూ. కొణుసు, కొనుజు. వి. 1. పిడుజు, పశువుల దేహంనుంచిరక్తం పీల్చే కీటక విశేషం ; 2. మట్టిలోఉండే నన్నని పురుగు.

పో. చూ. క. కున్న. ఒకరకంపేను ; తు. కుణజె. కళ్ళకు బాధకలిగించే ఒక కీటకం.

కొణుజెక్కు అ.క్రి. కొణుజులుపట్టు, పశువుల పిడుదులు పట్టు. హరి. పూ. 6.5.

కొణుజెక్కు చూ. కొణుజు.

కొణుఁదురు రూ. చూ. కొడుఁగురు. వి. 1. దీపపుచిట్టెం : 2. శైత్యాదులవల్ల కలిగే వంకర.

కొణుపు వి. గొడ్లకు వాతపెట్టే శలాక.

కొణుసు రూ.చూ. కొణుజు. వి. 1. పిడుజు ; 2. మట్టిలో ఉండేనన్నని పురుగు.

కొంట చూ. కొను. వి. కొనటం, కొనుబడి.

కొంటరి వి. తుంటరి, పోకిరి, టులిపి.

నం. కుంఠ-. మూర్ఖమైన, మొద్దుగా ఉన్న ; ప్రా. కుంఠ. మందంగాఉన్న, మూర్ఖమైన ; పా. కుంఠ. కుంటి, వంగిన, మొద్దుగాఉన్న; నే. కూల్డిను. కుంటి ; పం.కుండ్. మొద్దుగాఉన్న ; సిం. కొటు. మొద్దుగాఉన్న.

<నం. కుంఠ - + -అరి.

కొంటి రూ. చూ. కొంటు. వి. 1. ఒండిసిక, గాలికిరేగి ఒక చోట కూడుకొన్న నన్నని ఇసక ; 2. పొల్లును తూర్పార పట్టగా వచ్చిన నన్నపొట్టు.

కొంటికర్ర వి. కొంకికర్ర. కళ్ళంలో వట్టిగడ్డిలాగే కర్ర.

కొంటు రూ. కొంటి. వి. 1. గాలికిరేగి ఒకచోట కూడుకొన్న నన్నని ఇసుక ; 2. పొల్లును తూర్పార పట్టగావచ్చిన నన్న పొట్టు.

**కొంటె** వి. 1. అకార్యకరణ శీలుడు, దుష్టుడు, ధూర్తుడు. భాగ. 10పూ. 8.22 ; 2. అల్లరితనం, పోకిరితనం.

క. కొండె, కొండెయ. చాడీలుచెప్పేవాడు ; తు. కొంటు. దుర్మార్గుడు, మొండి, మూర్ఖత్వం ; పో. చూ. త. కుంటుణి. నింద, కొంటి, చాడీలు చెప్పేస్వభావంకల ; కొంటి. దుర్మార్గుడు, మొండి, మూర్ఖత్వం ; పో. చూ. మ. కొంటె. అవిధేయఅయిన స్త్రీ.

**కొంటెకోణం** రూ.చూ. కొంటెకోణంగి. వి. కోణంగి, కొంటె వాడు. **కొంటెకోణంగి** రూ. కొంటెకోణం. వి. కొంటెవాడు. **కొంటెచేష్టలు** వి.బ.వ. తుంటరి పనులు, అల్లరిపనులు. **కొంటె తనము** వి. 1. ధౌష్ట్యం, దౌర్త్యం, అకార్యం. భోజ. 5.331 ; 2. క్రూరత్వం. కృ. శకు. 2.179 ; 3. అల్లరి తనం. **కొంటెపనులు** వి.బ.వ. ఆగడాలు. **కొంటెపాడికట్ట** వి. చెడ్డవాడు, చెనటి. **కొంటెబొమ్మలు** వి.బ.వ. బూతు బొమ్మలు. **కొంటెభాగోతులు** వి.బ.వ. కొంటెకోణంగులు. కుక్కు. 22. **కొంటెవ్రాతలు** వి.బ.వ. బూతురాతలు.

**కొంటెకాసులు** వి.బ.వ. కానులుదండగా చేయడానికి వీలుగా కొండీలు అతికి చేసిన కానులు.

**కొండ**[1] వి. 1. పర్వతం. భార. ఆది. 3.111 ; 2. ఘన కార్యం, గొప్పపని. హరి. పూ. 7.179 ; విణ. గొప్పదైన. విప్ర. 4.77.

క. కొండ. పర్వతం ; కొత. కుండి ; తు. గుడ్డె ; త. కున్ఱమ్, కున్ఱు, మ. కున్నమ్ కున్ను. కొండ ; తొ. కుడ్, కుడ్స్. బండరాయి ; గోం. కుడ్. పర్వతం, అడవి ; పర్జి. కొండి. పర్వతం ; నా. కొడ్.

**కొండకసము** వి. గుడిసెల గోడలు మొ. వాటికి ఉప యోగపడే ఒకరకం చెట్టు. (Saccharum Carundinaceum). **కొండకంది** వి. అడవిప్రాంతాల్లోని ఒకరకం కంది మొక్క (Cajanus indicus). **కొండకరింద** వి. పైడి తంగేడు, పచ్చని పూలుపూసే ఒకపొద (Cassiasophera) **కొండకరేపాకు** వి. సున్నని ఆకులు నల్లనిమాను కలిగిన ఒకచెట్టు (Calcsena will denovii). **కొండ కల్జువ్వి** వి. ఊడలు కలిగి తెల్లనికర్ర కలిగిన ఒకచెట్టు (Ficus tomentosa). **కొండకసివ** వి. మానుకు పొడవైన ముళ్ళుండే ఒకరకం మొక్క (Mallotus repandus). **కొండకసింద** రూ. కొండకసివింద. వి. ఒకజాతి కసింద చెట్టు (Toddia aculeata). **కొండకసిమంద** రూ. కొండ కసిమి. వి. చిన్న చిన్న పూలుపూసే ఒకచెట్టు లేక పొద. **కొండకసిమి** రూ. చూ. కొండకసిమంద. వి. చిన్న చిన్న పూలుపూసే ఒకచెట్టు లేక పొద (Zanthoxylum Alatum). **కొండకసివింద** రూ. చూ. కొండకసింద. వి. తీటకసింద. (Taddia aculeata). **కొండకాకి** వి. ఒక జాతి కాకి, అద్రికాకం. **కొండకాంచనపుపిట్ట** వి. పక్షి విశేషం. **కొండకాంచనము** వి. కందవెల్తుచెట్టు, బోదెకు ముళ్ళుండే ఒకపొద (Mallotus Repandus). **కొండకాటి గాడు.** వి. వృక్షవిశేషం (Dendrociltarufa). **కొండ కాలువ** వి. సెలయేరు, ఝరం. **కొండకావిరాయి** వి. ఇంగి లీకం. **కొండకాసులవాఁడు** వి. తిరుపతి వేంకటేశ్వర స్వామి. **కొండకాసులు** వి.బ.వ. తిరుమల కొండకు కట్టిన మొక్కు బళ్ళముడుపులు **కొండకుంకుమ** వి. ఒకానొక పొద లేక చిన్నమొక్క (Mallotus Rhamnifolius). **కొండ కెదిరిచూచు** స. క్రి. నిరంతరం నిరీక్షించు. **కొండకొక్కిత** వి. పెద్దబిక్కిచెట్టు, పెద్ద పెద్ద పూవులు ఆకులు ఉండే ఒక చెట్టు, దీనికర్ర తరిమెనపెట్టడానికి ఉపయుక్తం(Gardenia Latifolia). **కొండకొన** వి. కొండకొమ్ము, శిఖరాగ్రం. **కొండకొమ్ము** వి. కొండకొన, శిఖరాగ్రం. **కొండకొరింత** వి. కొరింద జాతిలో ఒకరకం తీగ, ముళ్ళు, పెద్ద పెద్దఆకులు ఉండేఒక తీగ (Acacia caeria). **కొండకోట** వి. పర్వతం మీద కట్టినదుర్గం. **కొండకోఁతి** వి. 1. బాలక్రీడా విశేషం. హంస. 3.146 ; 2. కొంటెకోణంగి. **కొండకోలు** వి. తగ్గడం కొద్దిగాకావడం. **కొండగంగ** వి. అందమైన పూలుపూసే ఒకతీగ (Hibiscus collinus). **కొండగడ్డ** రూ. కొండ గెడ్డ. కొండమీదనుండి పారేకాలువ, కొండవాగు. **కొండ గనరు** వి. కొండజువ్విచెట్టు, ఇతరచెట్లమీదపెరిగి ఆచెట్లను చంపివేసే ఒకరకంచెట్టు (Albizzia fuberculata). **కొండగన్నేరు** వి. ఒకపెద్దచెట్టు, దీనిరెమ్మలు బుట్టల అల్లకా నికి ఉపయుక్తం (Salixtetrasperma). **కొండగరువుతీగె** వి. కొండగురవ తీగ, లతావిశేషం. **కొండగర్బతీగ** వి. కొండగురవతీగ (Smilax macrophylla). **కొండ గలిగిచ్చ** వి. ఒకానొక వృక్షం. **కొండగలుంగ** వి. గొండిచెట్టు లేక పొద (Glycomis pantaphylla). **కొండగాఁ గను(-కను)** స.క్రి. గొప్పగా భావించు. విప్ర. 4.77. **కొండ గాలి** వి. ఉత్తరవాయవ్య దిశలనుండి వీచే గాలి. **కొండగిరి** వి. వీపుమీద ఎక్కడైన రెండువైపులా ఉఁడే సుడి. **కొండ గిలిగిచ్చ** వి. పొదలాగ పెరిగి పచ్చని పూలుపూసే మొక్క (Crotalaria Albida). **కొండగుద్దలి** వి. రాళ్ళు పెక లించే గుద్దలి. **కొండగుముదు** రూ.చూ. కొండగుమ్మడు. వి. ఒకజాతి గుమ్మడు. **కొండగుమ్మడు** రూ. కొండగుముదు. వి. ఒకజాతి గుమ్మడు. హంస. 4.11. **కొండగురవతీగ** వి. ఒకానొకతీగ. (Smilax Zerylanica). **కొండ గుఱుతు** వి. స్థూలంగా పెట్టుకొనే గుర్తు. వ్య. కొండను గుర్తుగా చూపించటం. **కొండగెడ్డ** రూ.చూ. కొండగడ్డ. వి. కొండమీదనుండి పారే కాలువ, కొండవాగు. **కొండ గొనుగు** రూ.చూ. కొండగోఁగు. వి. అక్షోటం, మృదు ద్రుమం, ఒకానొకచెట్టు, కొండగోగు. **కొండగొబ్బి** వి. ములు గొవింద మొక్క, పచ్చని, తెల్లని పూలుపూసే ఒకమొక్క. (Barleria Prionitis). **కొండగొఱియ** రూ. కొండ గొఱె, కొండగొఱ్ఱియ, కొండగొఱ్ఱె. వి. కొండల్లో ఉండే ఒక జాతి గొఱ్ఱె. వాశి. 2.43. **కొండగొఱె** రూ.చూ. కొండ గొఱియ. వి. కొండల్లో ఒకజాతి గొఱ్ఱె, రోహిష్ఠం. **కొండగొఱ్ఱియ** రూ.చూ. కొండగొఱియ. వి. కొండల్లో ఉండే ఒక జాతి గొఱ్ఱె. **కొండగొఱ్ఱె** రూ.చూ. కొండగొఱియ. వి. కొండల్లో ఉండే ఒకజాతి గొఱ్ఱె. పి.శకు. 2.15. క. *కొండగుఱి కొండకుఱి.* అడవి గొఱ్ఱె, కొండగొఱ్ఱె. **కొండగొలుగు** వి. అసంఖ్యాకమైన ఊడలు ఉండే అందమైన చెట్టు, చెట్లవరసలమధ్య పెంచే చెట్టు.

(Ficus Benjamina). కొండగోంగూర వి. కాడకు ముళ్లుండి నారనిచ్చే గోంగూరచెట్టు, ముళ్ళ చెల్లపాకుచెట్టు. (Hitriscus furcatus). కొండగోఁగు రూ. కొండ గొనుగు. వి. కొండపత్తిచెట్టు. వి. బంగారు రంగు పూలు పూసే, దూది నిచ్చే ఒకరకం చెట్టు. యయా. 4.19. (Cochilospermum gossypium). కొండగోమ వి. 1. కందరాళం. అం. భా. 2.48 ; 2. ఒకచెట్టు, కర్ణికార వృక్షం (Ficus Infectoria). కొండగోరింక వి. పక్షి విశేషం. కొండగోల వి. ఒకానొక మృగం. కొండంగి రూ. కుండంగి, కుండఁగి, కొండఁగి, కొండెంగ, కొండెఁగ. వి. కొండముచ్చు, గోలాంగూలం. ద్వి. హరిశ్చ. ఉ. 1059. పో.చూ.సం. కుండగ-?. కొండఁగి రూ.చూ. కొండంగి. వి. కొండముచ్చు. కొండచరియ వి. కొండపక్క భాగం. కొండచిక్కుడు వి. ఒకరకం చిక్కుడు. కొండచిగర రూ. కొండచిరగ. వి. కొండదిరిసెనచెట్టు. నీలగిరికొండల్లో పెంచే ఒకచెట్టు (Albizzia stipulata). కొండచింత వి. పసుపుపచ్చని పూలు పూసే ఒకచెట్టు, నీడకోసం పెంచే ఒకచెట్టు. (greloia pilosa). కొండచిందుగ వి. బండి చిందుగ చెట్టు, సువాసనగల పూలుపూసే ఒకచెట్టు. కలప గృహోపకరణాలకు ఉపయుక్తం. కొండచిరగ రూ.చూ. కొండచిగర. వి. కొండదిరిసెన చెట్టు, నీలగిరి కొండల్లో పెరిగే ఒకచెట్టు. (Albizzia stipulata). కొండ చిరుగు వి. తెల్లనిపూలు, రెమ్మలకు చిన్న ఆకులుఉండే ఒక చెట్టు, కాఫీతోటల్లో నీడనిచ్చేచెట్టు. (Albizzia Marginata). కొండచిలువ వి. ఒక మహాసర్పం, కొండపాము. మను. 4.115. కొండచీమ వి. ఒకజాతి చీమ. కొండ చీఁపురు వి. చిన్నఆకులుగల ఒకమొక్క ఏజెన్సీలో దొరికే ఒకజాతి చీపురుగడ్డి (greloiasarvifolia). కొండచుట్టు తిరునాళ్ళు వి. రథసప్తమినాడు దేవుని కొండచుట్టూ చేసే ఊరేగింపు, గిరిప్రదక్షిణం. కొండచూలి వి. హిమవత్పుత్రి, పార్వతి. వేమ. 2.222. కొండచెట్టు వి. నల్లబలుసు చెట్టు (Canthium didrymam). కొండచేయు స.క్రి. 1. పెద్దచేయు. విక్ర. 2.15 ; 2. గొప్పచెప్పు. కొండజాజి వి. గోదావరీ పరీవాహక ప్రాంతంలోని కొండల్లో పెరిగే ఒకచిన్న మొక్క. (Dysophyllia Quadrifolia). కొండజావర వి. తుమ్మజిగురువంటి జిగురునిచ్చే ఒకచెట్టు. (Marcaranga Roseburghi). కొండజీలుగు వి. మర్రి చెట్టు, కొండజీవలగ్గుచెట్టు. దరులు కట్టడానికి, గుడిసెలు మొ. వాటి నిర్మాణానికి కర్ర ఉపయోగపడే చెట్టు. (Caryotaurens). కొండజీవలగ్గ వి. గృహనిర్మాణానికి, వ్యవసాయ పరికరాలకు ఉపయోగపడే కలపనిచ్చే ఒకచెట్టు. (Caryotaurens). కొండజుంగురు వి. ఒకానొకచెట్టు, ఆకు మొదలులో పువ్వులుపుట్టే ఒకచిన్నచెట్టు. (Careania esculanta). కొండజువ్వి[1] వి. ఒకజాతి జువ్వి, కలు జువ్వి, కొంది ఊడలుగలిగి ఎప్పుడూ పచ్చగాఉండే ఒక చెట్టు, ద్వి. పరమ. వి. 2.54. ప. 8 పం. (Ficus Retusa). కొండజువ్వి[2] వి. ఇతరచెట్లమీద పెరిగి ఆ చెట్లను చంపే ఒకరకం చెట్టు. (Ficus gibbosa).

కొండజెరి వి. ఒకానొక చిన్న గడ్డిమొక్క (Preudosorghum Fusciculare). కొండజెట్టి వి. ఒకజాతి పెద్ద జెర్రి. కొండజెట్టిగడ్డి వి. తృణవిశేషం. కొండజొన్న వి. ఒక విధమైన జొన్న (Sorghum Vulgare). కొండజ్వరము వి. మన్యజ్వరం, మలేరియాజ్వరం. కొండటంగుడి వి. కలప నిచ్చే ఒకపెద్దచెట్టు, ఇరిడిచెట్టు. (Irgaxylocarpa). కొండంటింత వి. పుష్పసంబంధమైన ఆకులుకలిగిన లేత పసుపురంగు పూలుపూసే ఒక మొక్క (Dasmodium Pulchellum) కొండతంగెడు రూ. కొండతంగేడు[1] వి. పగడితంగేడు (Cussia Mantania). కొండతంగేడు[1] రూ.చూ. కొండతంగెడు. వి. పగడితంగెడు, ఒక జాతి తంగేడు. కొండతంగేడు[2] రూ. కొండతంగెరు. వి. కర్ర గట్టిగాఉండి గృహాది నిర్మాణాలకు ఉపయోగపడే ఒకరకం చెట్టు. (Xylia dolabriformis). కొండతంగేడు తీగ వి. తెల్లనిపూలు పూసే ఒకరకంతీగ, దీని వేరుడు పీచు తయారు చేయడానికి ఉపయుక్తం. కొండతంగేరు రూ.చూ. కొండతంగేడు[2]. వి. కర్రగట్టిగాఉండి గృహాది నిర్మాణాల కుపయోగపడే ఒకరకంచెట్టు. (Xylia dolabriformis). కొండతంటెము వి. లేతపసుపురంగు పూలుపూసే అద్దంలాంటి ఆకులు కలిగిన ఒక అందమైనమొక్క . (Cassiaglancer). కొండతామర[1] వి. ఒకరకంచెట్టు సింధూరపురంగు పూలుపూసే ఒకరకంచెట్టు. (Sterculia Colorata). కొండతామర[2] వి. కొండగురువతీగ (Smilax macrophylla). కొండ తుమ్మి వి. తెల్లనిపూలుపూసే ఒకమొక్క. (Lucas Mantina). కొండతెక్కలి వి. తెల్లటి పూలుపూసే ఒకతీగ (Symphorema involucratum). కొండతేనె వి. కొండల్లోని పట్టుతేనె. కొండత్రిమ్మరి వి. కోతి వ్య. కొండల్లో తిరిగేది. కొండదంతెన వి. కొండగురువతీగ. (Smilax macrophylla). కొండదాసరి వి. ముష్టి ఎత్తుకొని జీవించే ఒకజాతి, దాసరి. రామలిం.శ. 78. కొండ దాసరితనము వి. కొండగాని చెట్టుగాని ఎక్కి బిచ్చమెత్తు కొనే వృత్తి, బిచ్చమెత్తి బతకడం. రామలిం.శ. 78. కొండ దిగు అ.క్రి. బింకం తగ్గించుకొను. కొండనరుము వి. కొండ చరియ. కొండనాలుక రూ.చూ. కొండనాల్క. వి. పైనుండే నాలుక, ఉపజిహ్వ, ఘంటిక. కొండనాల్క రూ. కొండ నాలుక. వి. పైనుండే నాలుక, ఉపజిహ్వ. భీమ. 3.37. కొండనిమ్మ[1] వి. మునుకుడుచెట్టు, కర్ర గట్టిగాఉండి అరు దుగా పెరిగే ఒకచెట్టు. (Limonia Alata). కొండనిమ్మ[2] వి. పచ్చని పూలుపూసే ముళ్ళుగల ఒకచెట్టు. (Atlanta monophylla). కొండనీలి వి. కరునీలిమొక్క, ఎరుపుతో కూడిన పసుపురంగు పూలుపూసే మొక్క, నీలిమందు తయారీలో ఉపయుక్తం (Indigofera argantea). కొండమదగరుడికాను(-తగరుడికాను) అ.క్రి. అల్పుడు అధి కునిపై విజృంభించు. భార. ఉద్యో. 1.237. కొండను ద్రవ్వి యెలుకనుబట్టు స.క్రి. ఎక్కువ పనిచేసి స్వల్పలాభం పొందు. < కొండ[1] + -ను + త్రవ్వి + ఎలుక + ను + పట్టు. కొండనువ్వులు వి. బ. వ. ఒకరకం నువ్వులు. కొండనెక్కెర వి. ఊరనెక్కెడ చెట్టు, మొద్దుగా

అండాకారంగా ఉండే ఎఱ్ఱని ఆకులు కలిగిన ఒకచెట్టు (Ximenia Americana) కొండనెమ్మి వి. మిక్కిలి ఎత్తుగా పెరిగే, కాండంబోలుగా ఉండే ఒకచెట్టు, కలప గృహాది నిర్మాణాలకు ఉపయుక్తం (Dichopsis elliptica). కొండనేరేడి ముళ్ళుండే ఒకచిన్న మొక్క. (Xylosma longifolia), కొండంతలుచేయు స.క్రి. అధికంగాచేయు, గోరంతలు కొండంతలుచేయు. అల్పవిషయాన్ని అధికంగాచేయు అని నుడికారం. కొండందుగ వి. బూడిదరంగు బెరడు ఎఱ్ఱనికఱ్ఱ కలిగఉండే ఒకచెట్టు. (Aglaio Roxburghiana). < కొండ[1] + అందుగ. కొండదాఁకు అ.క్రి. ఔన్నత్యంపొందు, ఎక్కువ సంతోషం పొందు. విజయ. 2.20. < కొండ[1] + -ను + తాఁకు. కొండపగతుఁడు వి. ఇంద్రుడు. రాజ. వి. 1.71. వ్యు. కొండలకు శత్రువు[1]. కొండపగులు వి. లోయ. కొండపచ్చారి వి. ఉసిరి ఆకులను పోలిన ఆకులు కలిగిన ఒకచెట్టు. (Phyllanthus Polyphyllus). కొండపట్టు రూ.చూ. కొండవట్టు. అ.క్రి. 1. దేశాంతరగతుడగు; 2. కొండలలోకి పారిపోవు. కొండపట్టె వి. కోడిపీటల బండికి ఎద్దుల పట్టెకింద నొగలను కలిపే కఱ్ఱ, మునలంపట్టె. కొండపందు వి. అపురూపం. కొండపత్తి రూ.చూ. కొండప్రత్తి. వి. వృక్ష విశేషం, ఒకజాతి పత్తి. కొండపలుకు రూ.చూ. కొండపల్కు. వి. పర్వత గుహల్లోని ప్రతిధ్వని. కొండపల్కు రూ. కొండపలుకు. వి. పర్వత గుహల్లోని ప్రతిధ్వని. చంద్రాంగ. 1.53. కొండపల్లి వి. నాలుగు అడుగుల ఎత్తు పెరిగి, పసుపుపచ్చని పూలుపూసే ఒకమొక్క (Hibiscus Lampas). కొండపసుపు వి. పచ్చని పూలుపూసే ఒకమొక్క. (gibbosa bullifera). కొండపాట వి. పొ్రిచెట్టు. తెల్లని కఱ్ఱ కలిగిన ఒకచెట్టు. (Kydicalycina). కొండపావట వి. కర్ణికారిజాతికిచెందిన ఒకచెట్టు. (Webera coymbora). కొండపావరి వి. ఒకానొక వృక్ష విశేషం. (Panetta tomentosa) కొండపాము వి. కొండచిలువ, అజగరం. కొండపాల వి. రాళ్ళమీద పొదల మీద పాకే ఒకతీగ. (Sarcostema breuestigma). కొండపిక్క వి. కొండరాతిముక్క. కొండపిచ్చిక రూ.చూ. కొండపిచ్చుక. వి. ఒకజాతి పిచ్చుక. కొండపిచ్చుక రూ. కొండపిచ్చిక. వి. ఒకజాతి పిచ్చుక. హంస. 3.12. కొండపిండి వి. గట్టిగా కొమ్మలు కలిగిన ఒకచెట్టు, దూది నిచ్చే ఒకచెట్టు. ఆం.భా. 2.65. వ్యు. ఈ చెట్టు ఆకులు రాళ్ళను పిండిచేస్తాయట. (Lusticia Tranque bariensis). కొండపిండిగావించు(-కావించు) స.క్రి. అసాధ్య కార్యాలు నిర్వర్తించు. కాశ. 2.24. కొండపిండిగొట్టు(-కొట్టు) అ.క్రి. 1. ఎక్కువ కష్టపడు. 2. అసాధ్యమైన పనిచేయు. కొండపిల్లర వి. కొండజువ్విచెట్టు, ఊడలుండే ఒకరకంచెట్టు. (Ficus Restusa). కొండపులికు వి. తెల్లపులికు చెట్టు, పెద్ద ఆకులుండే ఒకరకంచెట్టు (Givotia Rottlere formis). కొండపుల్లేరు వి. తినడానికి పనికివచ్చే పళ్ళు కాసే ఒకరకం చెట్టు (Antidesma glaesembilla gaertu). కొండపొడవు విణ. అత్యధికం. విజయ. 2.90.

కొండపొలకు వి. తెల్లపులికిచెట్టు, పెద్దపెద్ద ఆకులుండే ఒక రకంచెట్టు, (Givotia rotteriformis). కొండపొలారి వి. తినడానికి పనికివచ్చే ఒకరకం పళ్ళుకాసేచెట్టు (Antidesma ghaesembilla). కొండపోక వి. బళ్ళారి ప్రాంతంలో పెరిగే ఒక చిన్నమొక్క (Cordia perrottetti). కొండపోడు వి. కొండమీద తుప్పలుగా ఉన్న ప్రదేశం. కొండప్రక్క వి. కొండచరియ. కొండప్రత్తి రూ. కొండపత్తి. వి. ఒకజాతిపత్తి, ఎరుపు వన్నెపత్తి. (Kydia calycina). కొండబరిగె వి. సస్యవిశేషం. హంస. 4.127. కొండబాతు వి. గిరిశం, ఆడేలు. కొండబిక్క వి. పెద్దబిక్కచెట్టు, పెద్దపెద్ద ఆకులు పువ్వులుఉండే ఒక రకంచెట్టు. (Gardenia latifolia). కొండబుడమ వి. వృక్షవిశేషం. కొండబూరుగ రూ. కొండబూరుగు[1]. వి. కూటశాల్మలీ వృక్షం, ఒకరకం బూరుగుచెట్టు. ప్రబంధ. 78. (Salmalia malabarica). కొండబూరుగు[1]. రూ.చూ. కొండబూరుగ. వి. కూటశాల్మలీ వృక్షం, ఒకరకం బూరుగు (Salmalia malabarica). కొండబూరుగు[2] వి. కొండ గోగుచెట్టు, బంగారువన్నెగల మృదువైన రక్షకపత్రాలు కలిగిన పూలుపూసే ఒకచెట్టు (Cocholospermum gossypicum). కొండబెండ వి. కొడగంగచెట్టు, అందం కోసం తోటల్లో పెంచే చెట్టు, ఒకజాతి బెండ (Hibiscus Collinus). కొండబొటుక వి. ఒకానొక చిన్నచెట్టు. (Cordia Perrotletti). కొండమంగ[1] వి. మందంగా ఉండే నున్నని ఆకులు కలిగి తెల్లని పూలుపూసే ఒకచెట్టు (Randia Candollena). కొండమంగ[2] వి. పెద్దబిక్క చెట్టు. పెద్దపెద్ద ఆకులు, పూవులుఉండే ఒకచెట్టు. దీనికఱ్ఱ తరిమెన పెట్టడానికి ఉపయుక్తం. (Gardenia latifolia). కొండమంగ[3] వి. ముళ్ళుకలిగి అడవుల్లో పెరిగే. ఒకమొక్క (Randia Corymbosa). కొండమంగలి వి. కొండలమీద క్షౌరంచేసే మంగలి. కొండమంగలిక్షౌరం వి. సగం సగం చేసినపని, ఎగుడుదిగుడుగా చేసినపని. కొండమనిషి వి. అనాగరకుడు. కొండమబ్బు వి. కొండలాగ ఆవరించిన మేఘం. కొండమయూర రూ. కొండమయూరి. వి. కొంటెనమొక్క, రమారమి మూడడుగుల ఎత్తు పెరిగి గులాబిరంగుపూలు, ఊదా రంగు పళ్ళుకాసే ఒక చెట్టు (Andisiahumillis) కొండమయూరి రూ.చూ. కొండమయూర. వి. కొంటెనచెట్టు. రమారమి మూడడుగుల ఎత్తు పెరిగి గులాబి రంగు పూలు, ఊదారంగు పళ్ళుకాసే ఒకచెట్టు (Andisiahumillis). కొండమఱ్ఱి వి. కొండజువ్విచెట్టు, కొమ్మలనుండి ఊడలుఉండే ఒకరకం చెట్టు (Ficus Tomentosa). కొండమల్లయ్య వి. శ్రీశైలమల్లికార్జునస్వామి, శివుడు. యయా. 1.106. కొండమల్లియ రూ. కొండమల్లె. వి. ఒక జాతిమల్లె, గిరిమల్లిక, వాసనలేని పచ్చనిపూలు పూసే సన్నని తీగ (Polygonumbarbatum). కొండమల్లె రూ.చూ. కొండ మల్లియ. వి. ఒక జాతిమల్లె, గిరిమల్లిక. కొండమామిడి వి. కొంటెనచెట్టు. రమారమి మూడడుగుల ఎత్తుపెరిగి గులాబిరంగు పూలు, ఊదారంగు పళ్ళు కాసే ఒక చెట్టు

(Andisiahumillis). **కొండమారేడు** వి. ఒక జాతి మారేడు (Bengal quinle, angle marmuos). **కొండమిడికర** వి. ఒకానొక మొక్క (Dithyrocurpus paniculatus). < కొండ¹ + అమిడి కర. **కొండమిరప¹** వి. కారం ఎక్కువగా ఉండే చిన్నరకం కాయకాసే మిరప చెట్టు (Capsium minimum). **కొండమిరప²** వి. కుక్క మిరప, ఒకరకం కలుపుమొక్క (Croton Sparriflouss). **కొండమీది కోతిదిగివచ్చు** అ.క్రి. ఎలాటిదైనా అందు బాటులోకివచ్చు. **కొండముక్కిడి** వి. ఒకజాతి ముక్కిడి చెట్టు. హంస. 4.11 (Schredbera Swietenoides). **కొండముక్కి** వి. గుగ్గిలం చెట్టు, కోయంబత్తూరు అడవుల్లో పెరిగే దడులు కట్టుకోడానికి ఉపయోగించే ఒక చెట్టు (Balsamodendron). **కొండమునగ** వి. బెండురంగు బెరడు, తెల్లని కర్ర కలిగిన ఒక చెట్టు (Moringa Concanensis). **కొండముచ్చు** రూ.చూ. కొండ్రముచ్చు. వి. నల్లని ముఖం గల పెద్దకోతి, గోలాంగూలం, వేమ. 2.64. **కొండమునగ** వి. బెండువంటిబెరడు, తెల్లని కర్ర ఉండే ఒక చెట్టు (Maringa Coucanensis). **కొండముసురు** వి. కొండలోముచ్చు వంటిది, నల్లని ముఖం గల కోతి. **కొండముంతడి** వి. తెలుపు లేక నీలం రంగుపూలు పూసే ఒకచెట్టు (Hamiltonia Suaveolcns) **కొండముసవ** వి. 1. మూతిముడుచుకొని ఏమీ తెలియనట్లు నటించేవాడు ; 2. నల్లనిముఖంగల పెద్దకోతి. **కొండమైపాకి** వి. మోటువడ్లలో ఒకరకం. **కొండ్రముచ్చు** రూ. కొండ ముచ్చు. వి. నల్లని ముఖంగలకోతి, గోలాంగూలం. ప్రబంధ. 788, వ్య. కొండల్లో ముచ్చువంటిది. **కొండయరఁటి** ( - అరఁటి) రూ.చూ. కొండరఁటి. వి. ఒకరకం అరటి. **కొండయల్లుఁడు** ( - అల్లుఁడు) వి. హిమవంతుని అల్లుడు, శివుడు. హర. 5.47. **కొండయిప్ప** ( - ఇప్ప) వి. గిరిమధూకం. **కొండయుసిరిక** ( - ఉసిరిక ) వి. ఒకరకం ఉసిరిచెట్టు, పుల్ల ఉసిరిక. **కొండయూట** (-ఊట) వి. కొండల్లో నుంచి పుట్టే నీరు, సెలఊట. **కొండయెక్కు** ( - ఎక్కు) రూ. కొండెక్కు. అ.క్రి. 1. ఉన్నత స్థితికి వచ్చు. మృత్యు. 2.67 ; 2. గర్వంచేబిర్రబిగియు. సింహ.శ. 17 ; 3. ఆరిపోవు ; 4. సంతోషించు. **కొండయొంటవ** వి. ఎర్ర ముంగిస. **కొండరఁటి** రూ. కొండయరఁటి. వి. అడవిఅరటి చెట్టు. < కొండ¹ + అరఁటి. **కొండరా¹** వి. కొండరాయి. **కొండరా²** వి. కొండలరాజు, హిమవంతుడు. **కొండరాగి¹** రూ.చూ. కొండరావి. వి. ఒకజాతి రావిచెట్టు, పుల్ల మామిడి వంటి ఒక చెట్టు, ఊరగాయకు పనికివచ్చే కాయలుకాసే ఒక చెట్టు. **కొండరాగి²** వి. ముళ్ళు కలిగి, జిగురు నిచ్చే ఒక రకం చెట్టు (Balsa moderndron Berryi). **కొండరాచూలి** వి. పార్వతి. వ్య. కొండలరాజు (హిమవంతుని) కూతురు. **కొండరాయఁడు** వి. పర్వతరాజు, హిమవంతుడు. వీర.వి. 3.108. **కొండరావి** రూ. కొండరాగి¹. వి. ఒక జాతి రావిచెట్టు, పుల్లమామిడిచెట్టు వంటి ఒక చెట్టు, ఊరగాయకు పనికివచ్చే కాయలుకాసే ఒక చెట్టు. హంస. 4.11 (Ficus Arnottiana). **కొండరి** వి. పర్వత రాయుడు, కొండవాడు, కిరాతుడు, బోయ. సిం.ద్వా. 11.19 < కొండ¹ + అరి. **కొండరేగు¹** వి. కాంద్రేగుచెట్టు. కొండమీద, అడవుల్లోనూ పెరిగే ఒక చెట్టు (Flacontia Ramontchi). **కొండరేగు²** వి. ముళ్ళు కలిగి, జిగురునిచ్చే ఒకరకం చెట్టు (Balsamoadendron Candatum). **కొండరేగు³** వి. చిన్న చిన్న పళ్ళుకాసే, అల్లుకుపోయే కొమ్మలు కలిగిన ఒక చెట్టు (Zizyphus nummularia). **కొండరొతు** వి. ఉత్తరాతు గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. **కొండఱెక్కలు గొట్టినదిట** వి. ఇంద్రుడు. వ్య. పర్వతాల రెక్కల్ని కొట్టిన శూరుడు. **కొండఱేఁడు** వి. హిమవంతుడు. భోజ. 5.191. **కొండలకేగు** అ.క్రి. 1. అనాథమగు. శాశ్వ. నం. 5.24 ; 2. అడవులకు వెళ్ళు. **కొండలజబ్బు** వి. జెబ్బవాపు. **కొండలమసుపులు** వి.బ.వ. పైపై మెరుగులు. శాశ్వ. నం. 5.24. **కొండలము** వి. ఒకరకం కలుపు మొక్క. < కొండ¹ + అలము. **కొండల రాయఁడు** వి. 1. ఏడుకొండల కధిపతి, వేంకటేశ్వరుడు. ప్రబంధ. 24; 2. హిమవంతుడు. **కొండలాటిపక్షి** వి. కొల్లాటి పక్షి. **కొండలుకోటలుచేసి చెప్పు** స.క్రి. గోరంతలు కొండంతలు చేసిచెప్పు, తక్కువదానిని ఎక్కువ చేసిచెప్పు. వేంక. పంచ. 4.147. **కొండలుచేయు** స.క్రి. పెద్దచేయు. **కొండలువట్టు** రూ. కొండలువట్టు. అ.క్రి. దిక్కుకొకరై చెదరిపోవు, దేశాలపాలైపోవు, కొండల్లోకి పారిపోవు. **కొండలుపెరుగు** అ.క్రి. ఎక్కువగు, కొండలుగా పెరుగు. శాశ్వ.నం. 8.50. **కొండలువట్టు** ( - వట్టు) రూ.చూ. కొండలుపట్టు. అ.క్రి. దేశాలపాలైపోవు, కొండల్లోకి పారిపోవు. **కొండలేర్లవండు** అ.క్రి. ఎక్కువగా ఉండు. **కొండలొట్ట కమ్మజిట్ట** వి. అడవిలో ఉండే ఒక పక్షి. **కొండల్లము** వి. ఒక జాతి అల్లం, తృణపుష్పిక. < కొండ¹ + అల్లము. **కొండవంగ** వి. ఒక జాతివంగ, గిరివార్తాకం (Oriolus melanocphalus). **కొండవట్టు** ( - వట్టు) రూ. కొండపట్టు. అ.క్రి. పర్వతాల్లోకి పారిపోవు. కాశీ. 6.21. **కొండవరగోఁగు** వి. ఒకానొక సస్యం, ధ్వాంసి. **కొండవలిగాలి** వి. పైరగాలి. **కొండవాగు** వి. కొండమీది నుంచి పారేకాలువ. **కొండవాఁడు** వి. పర్వతీయుడు, కిరాతుడు, బోయ. **కొండవాలాటం** వి. కొండవాగు. **కొండవావిలి** వి. లుకిచెట్టు, బళ్ళు, గృహోపకరణాలుచేయ టానికి ఉపయోగపడే ఒక చెట్టు (Viteseleucoxycon). **కొండవిరిగి** వి. ఉపయోగకరమైన కర్ర కలిగిన ఒక చెట్టు (Cordiaobliqua). **కొండవిల్లు** వి. మేరుపర్వతం. భీమ. 4.138. **కొండవీటిచేంతాడు** రూ. కొండవీటిచేంతాడు. వి. 1. కొండవీటిలో నూతుల నీరు తోడటానికి ఉపయోగించే చేంతాడు ; 2. అతి దీర్ఘమైన విషయం ; 3. మిక్కిలి పొడవు. **కొండవీటి చేంతాడు** రూ.చూ. కొండవీటి చేంతాడు వి. 1. కొండవీడులో నూతులనీరు తోడటానికి ఉపయో గించే చేతాడు ; 2. అతిదీర్ఘమైన విషయం ; 3. మిక్కిలి పొడవు. **కొండవీటిజంగము** వి. కొండమల్లయ్య, శివుడు. ఆం.నా. నం. 1.6. **కొండవీడు** వి. 1. ఆంధ్రప్రదేశ్‌లో ఒక పట్టణం. ఆము. 1.36 ; 2. కైలాసపట్టణం. అచ్చరా.

బాల. 2; 3. కుబేరుని నివాసం. కొండవెదురు వి. సదనపవెదురు, పన్వెదురు, ఒకరకం వెదురు (Dendrocalamus Strictus). కొండవెంపలి[1] వి. బిల్లుమాను వంటిమాను మెరిసే ఆకులు కలిగి, గులాబిరంగు పూలు పూసే ఒక చెట్టు (Mundulea suberosa). కొండవెంపలి[2] వి. ఎర్రని పూలుపూసే ఒకరకం చెట్టు (Indigofera Pacifolia). కొండవెల్తు వి. అడవి నెల్లిచెట్టు (Molcotus repandus). కొండవేగిస వి. గృహాది నిర్మాణాలు మొ. వాటికి కర్రగా ఉపయోగపడే ఒకరకం చెట్టు (Pt^ro Carpus Marsupicum). కొండవేప[1] వి. గరుగచెట్టు, మందంగా ఉండే ఎర్రని బెరడు కలిగి తినే పళ్ళు కాసే ఒకరకం చెట్టు (Garugapinnata). కొండవేప[2] వి. దేవదారు చెట్టును పోలిన ఒక చెట్టు (Chukrasiatabularis). కొండవేలుమబండు అ.క్రి. సమృద్ధిగా పండు. రుక్మా.చ. 1.14. కొండశిల వి. కొండచిలువ. కొండసజ్జ వి. ఒకరకం సజ్జ పంట. కొండసంపెగ వి. ఒక జాతి సంపెంగ. హంస. 4.11 (Michelia Champaca). కొండసిక వి. పర్వత శృంగం, కొండకొన. కొండసూడు వి. దేవేంద్రుడు, గోత్రవైరి. అచ్చ.రా. కిష్కిం. 25. కొండాంత్రికగడ్డి వి. అన్ని ఋతువుల్లోనూ పెరిగే ఒకరకం గడ్డి, కోడిజుట్టు, కోడిజుట్టు గడ్డి (Oplimenus Compositus). <కొండ[1] + అంత్రిక గడ్డి. కొండాముదము వి. నేపాళచెట్టు. (Balospe umum Axilluare, Jatrophacurcus). < కొండ + ఆముదము. కొండిప్ప వి. నారింజపండు రంగుగల పొడవైన పళ్ళుకాసే ఒక చెట్టు (Isonand:alancelata). <కొండ[1] + ఇప్ప. కొండిరికి వి. గృహాది నిర్మాణాలకు పనికివచ్చే ఒక చెట్టు (Cardia-obliqua). <కొండ[1] + ఇరికి. కొండీత వి. ఈతచెట్లలో ఒకరకం. దీని ఆకులు చాపల అల్లకానికి ఉపయుక్తం (Phenix Humilis). < కొండ[1] + ఈత. కొండుచ్చింత వి. ముళ్ళుండే ఒకరకం మొక్క (Solanum terilopatum). కొండుస్తె వి. మెరిసే పచ్చని రంగుగల పళ్ళుకాసే ఒక చెట్టు (Solarum Torvum). <కొండ + ఉస్తె. కొండెక్కికూర్చుండు అ.క్రి. 1. కలిసిరాకుండు; 2. గర్వించి కూర్చొను. <కొండ[1] + ఎక్కి కూర్చుండు. కొండెక్కు రూ.చూ. కొండ యెక్కు. అ.క్రి. 1. గర్వంచే బిర్రబిగియు, మిర్రెక్కు; 2. దీపం ఆరిపోవు; 3. ఉన్నత స్థితికి వచ్చు; 4. సంతోషించు. <కొండ[1] + ఎక్కు. కొండెర్రమట్టి వి. ఇసకకలిసి ఉండే ఎర్రమన్ను. <కొండ[1] + ఎర్రమట్టి. కొండ్రాయి వి. ఎర్ర మొరం, సున్నపురాయి, ఎర్రకంచుకరాయి, నల్లరాయి, కవికరాయి. <కొండ[1] + రాయి.

కొండ[2] వి. ఆకాశం.

త. కొంటుల్. మేఘం, వర్షం, గాలి; కొణ్ము. మేఘం, ఆకాశం; మ. కొంటుల్. మేఘం, ఆకాశం.

కొండగీఁడు రూ. చూ. కొండెగీఁడు. వి. చాడీలు చెప్పేవాడు.

కొండవ్న రూ. చూ. కొండెన్న. వి. తేలు.

కొండపోవు స. క్రి. కొంచపోవు, తీసికొనిపోవు.

కొండము వి. గుండం. ఆ. భా. 2.241.

సం. కుండ-; ప్రా. కుండ - కొండ.

క. కొండ. గొయ్యి; త. కొంటుం, ఎత్తైనప్రదేశంలో ఉన్నజలాశయం.

<ప్రా. కుండ-

కొండాట[1] రూ. చూ. కొండాటము[1]. వి. 1. స్తుతి, పొగడ్త. కళా. 1.18; 2. అన్యచింతలేక ఒకదానిమీద మనసు లగ్నం చేయడం, వ్యాసంగం.

కొండాట[2] రూ.చూ. కొండాటము[2]. వి. 1. కలహం, పోరు; 2. వ్యాసంగం; విణ. బాధకమైన.

కొండాటమాడు చూ. కొండాటము[2].

కొండాటము[1] చూ. కొండాడు. రూ. కొండాట[1]. వి. 1. అన్యచింతలేక ఒకదానియందు మనస్సులగ్నం చేయడం. నవనాథ. 4.136. పు. 14పం; 2. స్తుతి, పొగడ్త. లక్ష్మీ. వి. 1.76; 3. సంతోషం.

క. కొండాట. స్తుతి; త. కొంటాట్టమ్. స్తుతి, పొగడిక; మ. కొంటాట్టమ్.

కొండాటముసేయు (-చేయు) స. క్రి. పొగడు. మల్హ. 3.4.

కొండాటము[2] రూ. కొండాట[2]. వి. కలహం, పోరు. వేంక. పంచ. 4.468. విణ. బాధకం. వేంక. పంచ. 2.90.

కొండాటమాడు అ. క్రి. పోట్లాడు, కోరాడు.

కొండాడు[1] స. క్రి. పొగడు, స్తుతించు. రాజ. చ. 3.133.

క. కొండాడు. పొగడు; స్తుతించు. అత్యధికంగా గౌరవించు; కొడ. కొండడ్. పొగడు; తు. కొండాడుని. పొగడు, స్తుతి; త. కొంటాటు (కొంటు + అటు) స్తుతించు, పొగడు; మ. కొంటాటుక.

కొండాడు[2] స. క్రి. దుమ్మురేపు. ఆం. భా. 3.132. అ. క్రి. కొట్లాడు, జగడమాడు.

పో. చూ. త. కొంట్-అటు. దుఃఖంలా పెరిగేట్లు చేయు.

కొండాంత్రికగడ్డి చూ. కొండ[1].

కొండాముదము చూ. కొండ[1].

కొండి[1] రూ. కొండెం. వి. 1. పితడెక్క. వేంక. పంచ. 1.326; 2. తేలుతోక. ఆం. భా. 2.88; 3. తేలుతోక చివరఉండేముల్లు; 4. రెక్కతలుపు అంచుల్లో అమర్చే తేలుతోకవంటిఇనపగొళ్ళెం; 5. కర్రను ఆరుకుబిగించే ఇనపకొక్కెం; 6. పారను కామకర్రతో కలిపే ఇనప కొండి; 7. టేపులోనిరేకు, లేక గుడ్డచుట్టను బయటకు నెట్టేగుండీ; 8. చూరుకుట్టుబద్ద చివరవంకరభాగం.

క. కొండి. తేలుతోక, గోడలోఅమర్చినకొక్కె; తు. కొండి; త. కొంటి. తలుపు, నాగలి మొ. వాటికి అమర్చే ఇనపభాగం; మ.కొట్టుక. తేలుకొండి; కుయి, పర్జి. కొంటుచ్. ఇనపకొక్కెం.

పో. చూ. సం. కుండ-.మొద్దు, దుక్క; ప్రా. గొండి; మరా. గొండా. గుత్తు, గెల మొ.

కొండికర్ర వి. మోటబావి దగ్గర వంగటించిన కర్ర. కొండికర్రు వి. కర్రుకు ఆరుకు బిగించే ఇనపకొక్కెం. కొండి

కల్లు వి. కఱ్ఱను ఆకుకు బిగించే ఇనపకొక్కెం. **కొండికారు** రూ. కొండికాలు. వి. గొఱ్ఱుచెక్కపైఉన్న ఇనపకొండి కఱ్ఱు బిగించడానికి వేసిన ఇనపకొండి. **కొండికాఱుఁడు** వి. శంఖం ఊదేవాడు. **కొండికాలు** రూ. చూ. కొండికారు. వి. గొఱ్ఱుచెక్కపై ఉన్న ఇనపకొండి గొఱ్ఱును బిగించడానికి వేసిన ఇనపకొండి. **కొండికాళ్ళు** వి.బ.వ. తప్పెగోలయొక్క కాడకు ఆధారంగా ఉండే భాగాలు. **కొండికాను** వి. **1.** ప్రతిశనివారం భజన బృందం ఊరిలో తిరిగేటప్పుడు కంబంలో వేసేనాణెం ; **2.** విషకీటకాల బారినుండి రక్షణ కోరుతూ ఇష్టదేవాలయాల్లో పెద్దదీపం ప్రమిదలో వేసే నాణెం. **కొండికోల** వి. దండం, ముల్లుకఱ్ర. **కొండిచిప్ప** వి. కొండీలుండి నూనెపోసుకోడానికి ఉపయోగించే చిప్ప. **కొండిచీల** వి. బండినొగ వెనకభాగంలో మోకును బిగించి కట్టడానికి ఉపయోగించే ఇనపచీల. **కొండిజడ** వి. చిన్న పిల్లలకు ముందర జడవేసి కొండిలాగ చుట్టినజడ. **కొండిటేకు** వి. ముడిఎక్కువగా ఉండే నాసిరకం టేకు. **కొండితాడు** వి. అచ్చుకట్టుదారం, అచ్చుతాడు వడిదారాల బిగింపుకు అచ్చుకఱ్ర మీద మెలికల్లో దూర్చిన పురిదారం. **కొండిదారం** వి. అచ్చుకట్టేటప్పుడు వడిదారాలు బిగింపుకు అచ్చు కఱ్రమీదమెలికల్లో దూర్చిన పురిదారం. **కొండిపార** వి. కామపార, కఱ్రలో పారరేకు కుసిదిగవేసిన సెలగపార. **కొండిమళ** రూ.చూ. కొండిమొల. వి. గొఱ్ఱుచెక్కపై ఉన్న ఇనవకొండి కఱ్రుబిగించడానికి వేసిన ఇనపకొండి. **కొండిమిళ్ళి** వి. చిన్నమిళ్ళి, పక్కకుగొట్టంగల ముక్కుచెంబు. **కొండిమూల** వి. కోనుగాఉన్నచేనిమూల, కుని. **కొండిమొల** రూ. కొండిమళ. వి. **1.** గొఱ్ఱుచెక్కపై ఉన్న ఇనపకొండి, కఱ్రు బిగించడానికి వేసిన ఇనపకొండి ; **2.** ఇనపకొక్కెం. **కొండివల** రూ. కొండెవల. వి. చేపల్నిపట్టడానికి ఉపయోగించే ఒకరకంవల. **త.** కొంౘైవలై.

**కొండి²** వి. రెక్కకాని తోకకాని లేనిది, మొండిది.

**కొండిక** రూ. కొండుక, కొండొక. విజ. చిన్న, కొంచెం, అల్పం. కలిదిండి శాసనం, కృష్ణాజిల్లా క్రీ. శ. 1022–66 సం. మార్క. 5.240 ; వి. **1.** బాలిక. యయా. 4.126 , **2.** శిష్యుడు. రామలిం.శ. 35 ; **3.** బాలుడు.

క. కొడ. బాల్యం, అల్పత్వం, కొణను, కొదమజంతువు ; తు. కొరె. చిన్న, బలంలేని ; త. కున్ఱు. లోపం ; మ. కొఴున్ను, కొఴున్తు. చిన్న, మృదువైన, లేత ; పర్జి. కొఙ్. మిక్కిలిచిన్న ; కొలా. కొవ్వె. జంతువు లేక పక్షి పిల్ల ; నా. కొవ్వె. జంతువు లేక పక్షిపిల్ల.

పో. చూ. సం. కోరక-, కోర. మొగ్గ ; కుణక. అప్పుడే పుట్టిన జంతుశిశువు.

**కొండికది** వి. బాలిక. **కొండికనగవు** వి. చిరునవ్వు, మందహాసం. వరాహ. 10.84. **కొండికనాఁడు** రూ.చూ. కొండుకనాఁడు. వి. బాల్యం. **కొండికవాఁడు** రూ.చూ. కొండుకవాఁడు. వి. బాలుడు. కు.సం. 10.164.

**కొండిప్ప** చూ. కొండ¹.

**కొండియ** రూ. చూ. కొండె. వి. స్త్రీ. పురుషులుతలకుముందు భాగంలో వేసుకొనేసిగ, ముందుసిగ. విప్ర. 1.68.

**కొండియము** రూ. కొండెము. కొండేము. వి. చాడీ, ఇతరులపై లేనిపోని నేరాలు చెప్పడం. భార. అను. 2.61.

క. కొండె, కొండెగ, కొండెయ. నింద, చాడీ ; త. కొంటి, కొంటియమ్- ; మ. కొంటుణ.

**కొండియుఁడు** చూ. కొండియము. రూ. కొండీఁడు, కొండెఁడు. వి. చాడీలమారి, కొండెగాడు. భార. శాంతి. 3.467.

**కొండిరికి** చూ. కొండ¹.

**కొండీ¹** వి. **1.** గానుగదూలానికి చివరబిగించే ఇనపకొక్కెం ; **2.** పోతువానంలో మొనచెక్కిన భాగం ; **3.** గోడకి తగిలించడానికి, అంచుకింద పట్టుకోడానికి వీలుగా పెనానికి ఉండేకొక్కెం.

**కొండీలుపెనం** రూ. గుండీపెనం, గొండాలపెనం, గొండీలపెనం. వి. రెండంగుళాలలోతు, అడుగువెడల్పు, రెండంచులుండి పిండివంటలు చేసుకోడానికి ఉపయోగించే మట్టిపాత్ర.

**కొండీ²** వి. చింతకాయ.

**కొండీఁడు** రూ. చూ. కొండియుఁడు. వి. కొండెగాడు, చాడీలమారి. బసవ. 1.579.

**కొండీత** చూ. కొండ¹.

**కొండు** స. క్రి. తెచ్చు, తీసుకొనివచ్చు.

**కొండుక** రూ.చూ. కొండిక. విజ. **1.** చిన్నవాడు. భార. ఆది. 3.70. బాదినేపల్లి శాసనం. కర్నూలుజిల్లా, క్రీ. శ. 8వ శతాబ్దం ; **2.** చిన్న. భార. ఆది. 5.259 ; **3.** వివేక హీనుడు, భార. శాంతి. 1.71

**కొండుకనాఁడు** రూ. కొండికనాఁడు. వి. బాల్యం. భార. ఆది. 4.139. **కొండుకవాఁడు** రూ. కొండికవాఁడు. వి. బాలుడు. భార.ఆది. 4.118.

**కొండుచ్చింత** చూ. కొండ¹.

**కొండుస్తె** చూ. కొండ¹.

**కొండె** రూ. కొండియ. వి. **1.** స్త్రీ పురుషులు తలయొక్క ముందు భాగంలో వేసుకొనే సిగ, ముందుసిగ. ఆము. 1.75 ; **2.** నాగవానం, గొళ్ళెం తగిలించడానికి వీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనపకొక్కెం ; **3.** పంగకు సహజంగా ఉన్నపాయ ; **4.** కుసినేలమీద ఆనుతూ తలుపు తిరగడానికి తోడ్పడే తలుపుపెట్టెలోని చెక్కబడిన భాగం.

క. కొండె, గొండె. జుత్తు ; తు. గొండె ; త. కొంౘై ; మ. కొంటు ; కొం. కొండ్.

**కొండెకుసిరెక్క** అ.క్రి. పొగరెక్క.

**కొండెం** రూ.చూ. కొండి¹. వి. **1.** పీతడెక్క ; **2.** తేలుతోక ; **3.** తేలుతోక చివరఉండే ముల్లు ; **4.** రెక్కతలుపు అంచుల్లో అమర్చే తోకవంటి ఇనపగొళ్ళెం ; **5.** తలుపు రెక్కలను కలిపి ఉంచడానికి వాడే కొయ్యముక్క ; **6.** కఱ్రును ఆకుకు బిగించే ఇనప కొక్కెం ; **7.** పారను కఱ్రకు కలిపే ఇనపకొండి ; **8.** టేపులోని రేకు లేక గుడ్డ చుట్టను బయటకు నెట్టే గుండీ ; **9.** చూరు కుట్టుబడ్డ చివర వంగిన భాగం.

**కొండెకత్తియ** చూ. కొండెము.

**కొండెకత్తె** చూ. కొండెము.

**కొండెకాఁడు** చూ. కొండెము.
**కొండెకానితనము** చూ. కొండెకాఁడు.
**కొండెక్కికూర్చుండు** చూ. కొండెక్కు.
**కొండెక్కు** చూ. కొండ[1].
**కొండెగాఁడు** చూ. కొండెము.
**కొండెగీఁడు** చూ. కొండెము.
**కొండెంగ** రూ.చూ. కొండంగి. వి. కోతి.
**కొండెగ** రూ.చూ. కొండంగి. వి. కోతి, కొండముచ్చు.
**కొండెఁడు** రూ.చూ. కొండియుఁడు. వి. కొండేలుచెప్పేవాడు, చాడీచెప్పేవాడు. సు.శ. 85, వేమ. 3.149.
**కొండెతనము** చూ. కొండెము.
**కొండెదూలం** చూ. కొండెం. వి. గుజ్జులమీది చిన్నదూలం.
**కొండెన్న** చూ. కొండి. రూ. కొండన్న. వి. తేలు.
**కొండెపుఁగొఱవి** చూ. కొండెము.
**కొండెపుఁదపసి** చూ. కొండెము.
**కొండెము** రూ.చూ. కొండియము. వి. చాడీ, ఇతరులపై లేని పోని చాడీలు చెప్పటం. శ్రీరం. మా. 5.34.
  **కొండెకత్తియ** రూ. కొండెకత్తె. వి. చాడీలుచెప్పే స్వభావం గల స్త్రీ. **కొండెకత్తె** రూ.చూ. కొండెకత్తియ. వి. చాడీలు చెప్పే స్వభావంకల స్త్రీ. **కొండెకాఁడు** రూ.చూ. కొండెగాఁడు. వి. చాడీలమారి, కొండేలు చెప్పేవాడు. రామలిం. శ. 11. **కొండెకానితనము** వి. పిశునత్వం, కొండీలు చెప్పటం. నిరంకు. 4.23. **కొండెగాఁడు** రూ. కొండెకాఁడు. వి. చాడీలమారి, కొండేలు చెప్పేవాడు. వేమన. 2.58. **కొండెగీఁడు** రూ. కొండగీఁడు. వి. చాడీలుచెప్పేవాడు. ఆం. భా. 3.13. **కొండెతనము** వి. చాడీలుచెప్పే స్వభావం. **కొండెపుఁగొఱవి(-కొఱవి)** వి. కొండేలమారి. పండి. చ. 2. 116 ప. **కొండెపుఁదపసి(-తపసి)** కొండేలుచెప్పే ముని, నారదుడు. చిత్ర.భా. 5.10. **కొండెములల్లు** స.క్రి. చాడీలుచెప్పు. <కొండెము + -లు + అల్లు. **కొండెములుచెప్పు** స.క్రి. చాడీలుచెప్పు. శుక. 4.111.
**కొండెర్రమట్టి** చూ. కొండ[1].
**కొండెవల** రూ.చూ. కొండివల. వి. చేపల్నిపట్టడానికి ఉపయోగించే ఒకరకం వల.
**కొండేము** రూ.చూ. కొండియము. వి. చాడీ, ఇతరులపై లేని పోని నేరాలు చెప్పడం.
  **కొండేలమారి** వి. చాడీలమారి. అహల్యా. 3.43.
**కొండేలమారి** చూ. కొండేము.
**కొండేలుపట్టు** స.క్రి. మందంగా తయారైన పాత్రను పలచగా చేయు.
**కొండొక** రూ.చూ. కొండిక. విశ. 1. చిన్నది. భార. ఆది. 3.148; 2. పొట్టి, హ్రస్వం. భార. ఆది. 6.260; 3. కొంచెం. భార. విరా. 1.207; 4. చిన్నవాడు; క్రి.విశ. 1. కొంచెంసేపు, కొంచెందూరం. భార.విరా. 1.13; 2. కొంచెంగా. భార. విరా. 1.196.
  **కొండొకనవ్వు** వి. చిరునవ్వు, మందహాసం. భార. విరా. 5.114. **కొండొకప్రొద్దు** వి. కాసేపు, కొంతసేపు. బసవ. 5.127. **కొండొకవాఁడు** వి. చిన్నవాడు, పొట్టివాడు.

**కొంద్ర** రూ. కోంద్ర. వి. 1. ఒకసారి చాలుచుట్టిన కొలదిగల పొలం. కాశీ. 4.299.
  **కొంద్రకయిదువు** రూ.చూ. కొంద్రకైదువు. వి. నాగలి, హలం. **కొంద్రకైదువు** రూ. కొంద్రకయిదువు. వి. నాగలి. రాజ.వి. 1.71. **కొంద్రచేయు** స.క్రి. భూమిదున్ను, వ్యవసాయం చేయు. **కొంద్రచేసికొను** అ.క్రి. వ్యవసాయంచేసికొను. **కొంద్రపోతు** వి. ఎలుగుబంటి. **కొంద్రవేయు** స.క్రి. భూమిని దున్నేటప్పుడు చాలువుగా దాళ్ళుపెట్టు.
**కొంద్రాయి** చూ. కొండ[1].
**కొంద్రి** వి. కొయ్యకు సహజంగా ఉన్నపాయ.
**కొండ్లకర** రూ.చూ. కొండ్లకర్ర. వి. 1. పదుగేరేకర్ర; 2. గాజులకట్టె.
**కొండ్లకర్ర** రూ. కొండ్లకర. వి. 1. పదుగేరేకర్ర, పదుగుదాపినప్పుడు కిందిపోగులు కలసిపోకుండా వేరుచేసే కొండ్లుగల గుంద్రటి సున్నటికర్ర; 2. గాజులకట్టె, పట్టుదారం పడికేటప్పుడు పెద్దరాట్నం దగ్గర కదుర్లపేట కిందుగా, కొన్ని చోట్ల పక్కనపెట్టే కొయ్యపట్టె.
**కొండ్లకోల** వి. పదుగు దాపినప్పుడు కిందిపోగులు కలసిపోకుండా వేరుచేసే కొండ్లుగల గుండ్రటి సున్ననికర్ర.
**కొండ్లగొలుసు** వి. ఊడ్తె అడ్డపట్టెకుగాని, సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు.
**కొండ్లపీట** వి. గాజులకట్టె, పట్టుదారం పడికేటప్పుడు పెద్దరాట్నం దగ్గర కదుర్లపీటకు కిందుగా కొన్నిచోట్ల పక్కన కొండ్లుగల కొయ్య.
**కొండ్లసుత్తె** వి. మేకులు పీకడానికి వాడే సుత్తి, కొండ్లుగల సుత్తి.
**కొణముదంచు** చూ. కొట్నము. స.క్రి. ధాన్యందంచు.
**కొణ్ణేలు** వి.బ.వ. చిన్న పాత్రలు పొయ్యిలోకి జారిపోకుండా ఉండటానికి పొక్కిళ్లదగ్గరే లోపలికి చిలకమూతుల్లా పెట్టిన మట్టి కుండీలు.
**కొణ్ణేలమూకుడు** వి. రెండంగుళాలలో అడుగు వెడల్పు మోగల రెండంచులుండి పిండివంటలు చేసుకోడానికి ఉపయోగించే మట్టిపాత్ర.
**కొతిక** వి. ఒకానొక మొక్క (Rymphacacsculanta).
**కొతికకొను** చూ. కొసుకు.
**కొతిబీర** వి. ఎమికబీర, కాకిముష్టి, ఒకరకంతీగ (Celtis cinnamonua).
**కొతిమిరి** రూ.చూ. కొత్తిమిరి. వి. దనియపుమొక్క, దాన్యాకం. ఆం.భా. 2.249.
  **కొతిమిరిపురుగు** వి. దీపంలోపడి చచ్చే ఒకవిధమైన పురుగు. వ్యు. ఇది దీపంలోపడి కాలేటప్పుడు కొత్తిమెర వాసన వస్తుందట.
**కొతిమెర** రూ.చూ. కొత్తిమిరి. వి. కొత్తిమిరి.
**కొతిమెరి** రూ.చూ. కొత్తిమిరి. వి. కొత్తిమిరి.
**కొతుకు** రూ.చూ. కొదుకు. అ.క్రి. 1. జంకు, వెనుదీయు. రసిక. 4.170; 2. వర్ణలోపంగాని పదలోపంగాని కల్గేట్లు మాట్లాడు; వి. 1. వర్ణలోపంగాని పదలోపంగాని కలది. ఆం.భా. 1.118; 2. జంకు, సంకోచం.

**కొతికికొను** రూ. కొదికికొను. అ.క్రి. జంకు, భయపడు.

**కొతుకుపడు** అ.క్రి. 1 తగ్గు, తక్కువగు. హంస. 2.80; 2. మాటలో పదంగాని అక్షరంగాని లోపించు.

**కొతుమరి** రూ.చూ. కొత్తిమిరి. వి. కొత్తిమిరి.

**కొతుంబిర** రూ.చూ. కొత్తిమిరి. వి. దనియం మొక్క.

**కొత్త** రూ.చూ. క్రొత్త. విశే. నూతనమైన, నవ్యమైన వి. నయాపైన.

**కొత్తనీరు** వి. నది మొ. వాటిలోనికి కొత్తగా వచ్చేనీరు. **కొత్తమాస** వి. కొత్తఅమావాస్య. వి. ఫాల్గుణ మాసంలో వచ్చే అమవాస్య. < కొత్త + అమాస. **కొత్తముట్టు** రూ.చూ. క్రొత్తముట్టు. వి. ప్రథమ రజస్వల. **కొత్తరికము** వి. కొత్తదనం, నవ్యత్వం. **కొత్తలపండుగ** వి. కొత్త ధాన్యం ఇంటికి తెచ్చుకొన్న తరవాత చేసే పండుగ. **కొత్తలెట్టుట** వి. కొత్తపడ్లు దంచి ఇంట్లో వాడటానికి ముందుచేసే మంగళారంభం. **కొత్తవారు** వి.బ.వ. తెలియనివారు, విదేశీయులు.

**కొత్తకొలువు** వి. ఎక్కువగా కొమ్మలుండి గుండ్రని ఆకులు కలిగి తినడానికి పనికివచ్చే పళ్ళుకాసే చెట్టు (Grewia Poperlifolia).

**కొత్తడము** రూ. కొత్తము[1], కొత్తళము, క్రొత్తడము, క్రొత్తలము, క్రొత్తళము. వి. కోటబురుజు. రం.రా.యు. 303 పు. 18. పం.

క. కొత్తళ, కొత్తళ. కోటబురుజు; తు. కొత్తల, కొత్తళ; త. కొత్తళమ్; మ. కొత్తళమ్, కొంతళమ్.

**కొత్తడి** వి 1. స్త్రీ సమూహం. భార. ఉద్యో. 3.183; 2. బృందం.

**కొత్తమరి** రూ. కొత్తిమిరి. వి. దనియం మొక్క.

**కొత్తమల్లి** చూ. కొత్తిమిరి. వి. దనియం మొక్క.

**కొత్తమిరి** రూ.చూ. కొత్తిమిరి. వి. దనియం మొక్క.

**కొత్తము[1]** రూ.చూ. కొత్తడము. వి. కోటబురుజు. మల్హ 3.7.

**కొత్తము[2]** రూ.చూ. కొత్తెము[1]. వి. తాటిపండులోని విత్తులేని భాగం.

**కొత్తముట్టు** రూ.చూ. క్రొత్తముట్టు. వి. పెనచిన రాట్నపు నూలిపోగు, నూలిపోగు అకుకు.

**కొత్తళము** రూ.చూ. కొత్తడము. వి. కోటబురుజు. ద.హిం.శా. సంపు. 7. క్రీ.శ. 1560 సం.

**కొత్తవాలు** రూ.చూ. కొత్వాలు. వి. న్యాయాధికారి.

**కొత్తవాలుచావడి** వి. న్యాయశాల, న్యాయాలయం, తీర్పుచెప్పేచోటు.

**కొత్తామ** రూ.చూ. కొత్తెము[2]. వి. మెడవెనకభాగం.

**కొత్తి** వి. స్త్రీ. బసవ. 6.210. పం.

**కొత్తివి** వి. తాటిపండు మొ. వాటిలో తొడిమదగ్గర ఉండే కండగల భాగం.

**కొత్తిపోళ్ళు** వి.బ.వ. అడవి ప్రాంతంలో కొత్తగా చేసే భూములు.

**కొత్తిమిర** రూ.చూ. కొత్తిమిరి. వి. దనియం మొక్క.

**కొత్తిమిరి** రూ. కొతిమిరి, కొతిమెర, కొతెమెరి, కొతుమరి, కొతుంబిర, కొత్తమరి, కొత్తమిరి, కొత్తిమిర, కొత్తిమెర, కొత్తిమెరి, కొత్తిమేర, కొత్తుమరి, కొత్తుమిరి, కొత్తుంబరి, కొత్మీర. వి. ధనియం మొక్క, ధాన్యాకం. ఆము. 5.248.

సం. కుస్తుంబరి, కుస్తుంబురు; ప్రా. కుత్తుంబరీ-, కుత్థుంబరీ;

క. కొంతంబరి, కొత్తంబరి, కొత్తుమరి, కొత్తుమిరి, కొత్తుంబరి, కోతంబరి. కొత్తుమిరి; తు. కొత్తంబెరి, కొత్తుంబరి, కొత్తంబ్రి, కొత్తెంబరి; త. కుత్తంపరి, కొత్తమల్లి, కొత్తుమరి, కొత్తుమలి; మ. కొత్తంపాలరి.

< ప్రా. కుత్తుంబరీ.

**కొత్తిమెర** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తిమెరి** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తిమేర** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తువడు** అ.క్రి. బట్ట మొ. చిల్లులుపడు.

**కొత్తుమరి** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తుమరివిత్తులు** వి.బ.వ. ధనియాలు.

**కొత్తుమిరి** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తుంబరి** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియం మొక్క.

**కొత్తెమ** రూ.కొత్తెమ్మ. వి. యోగిని, యోగాభ్యాసం చేసే ఆడది. శ్రీనాథుని చాటువు.

సం. కోౢతిక-. భూశయనవ్రతంగలవానప్రస్థాశ్రమవాసి; ప్రా. కొత్తిఅ.

త. కోత్తై-. వైష్ణవ సన్యాసిని.

< ప్రా. కొత్తెఅ.

**కొత్తెమసాని** రూ. కొత్తెమ్మసాని. వి. యోగిని. విప్ర. 2.14.

**కొత్తెము[1]** రూ. కొత్తము[2]. వి. తాటిపండులోని కండ.

కురు. గుద్దా. పళ్ళలోని గుంజు;

నే. గుదూ. పం. గుద్ద్.

**కొత్తెము[2]** రూ. కొత్తాము. వి. మెడలేక తలవెనుకభాగం.

**కొత్తెమ్మ** రూ.చూ. కొత్తెమ. వి. 1. యోగిని, యోగాభ్యాసం చేసే ఆడది; 2. అమాయకురాలివలె నటించే స్త్రీ.

**కొత్తెమ్మసాని** రూ.చూ. కొత్తెమసాని. వి. యోగిని, యోగాభ్యాసంచేసే ఆడది.

**కొత్మీర** రూ.చూ. కొత్తిమిరి. వి. ధనియపు మొక్క.

**కొత్వాల్** రూ.చూ. కొత్వాలు. వి. పోలీసు అధికారి.

**కొత్వాలు** రూ. కొట్వాలు. కొత్తవాలు, కొత్వాల్. వి. పోలీసు అధికారి. కృష్ణ.శ. 2.123.

సం. కోష్ఠపాల-; ప్రా. కోట్టవాల.

హిం.మరా.ఉ.పార. కోత్వాల్. కోటలోని ఉద్యోగి;

క. కొత్తవాల; త. కొత్తవాల్, కొత్తువాల్; మ. కొత్తువాల్.

< ఉ. కోత్వాల్.

**కొద[1]** రూ.చూ. కొదవ. వి. 1. కొరత, లోపం, న్యూనత. హర. 2.51; 2. అక్కర, తమి, ఆశ. భోజ. 7.115; 3. మిగులు, శేషం. ఆము. 6.83; 4. సంకోచం, జంకు. పరమ. వి. 3.71.

**కొదగొను** (-కొను) స.క్రి. విశ్వాసం పొందు. **కొదతీరు** రూ. కొదదీరు. అ.క్రి. లోటుతీరు. **కొదదీరు** (-తీరు)

రూ.చూ. కొదతీరు. అ.క్రి. లోటుతగ్గు. కొదపడు రూ.చూ. కొదపడు. అ.క్రి. తగ్గు, క్షీణించు, ఎత్తువడు. అచ్చరా. యు. 2.55. కొదవడు (-వడు) రూ. కొదపడు. అ.క్రి. 1. మిగులు, శేషించు. నిర్వ.రా. 5.39 ; 2. తగ్గు, క్షీణించు. దశ కు. 34 ; 3. కొరతపడు. పి.శకు 3.106 ; 4. విచ్ఛిన్నమగు, వరాహ. 1.9. కొదపెట్టు (-పెట్టు) స.క్రి. తక్కువచేయు, అవమానించు.

కొద² వి. చెక్కలమీద ఉలితో తీసిన సన్నటికాలవ.

కొదగ వి. పలచెట్టు, చెక్కడపువనికి ఉపయోగపడే ఒకచెట్టు (Holarrhena antidysenterica).

కొదమ¹ వి. 1. పశుపక్ష్యాదుల పిల్ల. భార.విరా. 1.95 ; 2 లేత, పిన్న, చిన్న. భీమ. 2.44 ; 3. బలిష్ఠమైన. దశా. 2.10.

పో. చూ. క. కణసు. అడవి జంతువులకూన ; పో.చూ.త. కొఞుమై. అందం ; కుఱ. లేత ; కుఱవి. వసిది ; పో.చూ.మ. కోఞున్ను. కొఞున్ను. లేత ; పర్జి. కొడే. మిక్కిలి లేత అయిన ; కొలా. నా. కొవ్వె. జంతువు కూన ; మాల్తో. కురొ. శిశువు ; పో.చూ. సం. కోరక - కోర-. మొగ్గ ; కుఱక -. అప్పుడే పుట్టిన జంతు శిశువు.

కొదమఏనుగు వి. ఏనుగుగున్న. <కొదమ¹+ఏనుగు. కొదమతనము వి. చిన్నతనం, లేతవయసు. హరి.పూ. 6.175. కొదమతుమ్మెద వి. పిల్ల తుమ్మెద. శృం.నై. 8.5. కొదమపిడుగు వి. తీక్ష్ణమైన పిడుగు. కొదమపులి వి. చిన్న పులి. కకుత్స. 1.127. కొదమపెయ్య వి. చిన్నవయసు ఆవు, లేత ఆవు. కొదమప్రాయము వి. చిన్నతనం. ఘటికా. 2.26. కొదమయెండ (-ఎండ) వి. ఈరెండ, లేత ఎండ. కాశీ. 1.123. కొదమరి వి. పిల్లలుగలది. పండి. చ. 4.260 పు. <కొదమ¹+-అరి.

కొదమ² విశే. మిగిలిన.

కొదమల్లి చూ. కొత్తిమిరి. వి.బ.వ. దనియాలు, కొత్తిమెర విత్తులు.

కొదమపోతు చూ. కొదమ¹. వి. ఒక జాతి దున్నపోతు.

కొదరించు చూ. కొదరు.

కొదరిసె వి. కడిసెచెట్టు. గుండ్రని ఆకులు కలిగిన ఒకచెట్టు (Cleist anthus collinus).

కొదరు అ.క్రి. 1. అతిశయించు. హరి. ఉ. 7.173 ; 2. చెదరు ; 3. రేగు ; 4. రాసే కలం నుంచి సిరాచిందు.

క. కుదిర్, కుదుర్. అతిశయించు, వృద్ధిపొందు ; త. కుతుఞు. విడివడ్డ ; మ. కుతఞుక. విదగొట్టు, ముడి విప్పు ; పెం. కుత్. వదులుచేయు.

కొదరించు స.క్రి. కుదించు, తగ్గించు.

కొదలించు చూ. కొదలు.

కొదలు విశే. 1. అవ్యక్తమైన, అస్పష్టమైన. కళా. 6.196 ; 2. మందమైన, అలసమైన. చంద్రభా. 3.107, అ.క్రి. తగ్గు, సంకుచితమగు.

క. కొదలు. మాట్లాడటంలో తొందరపడు, నత్తిగా మాట్లాడు ; తు. కొద్దె, గొద్దె. నత్తిగామాట్లాడటం ; త. కుతలై. పిల్లలు అస్పష్టంగా మాట్లాడు ; కఴఞు (ఇన్-ఙ్-) ; మ. కుళఞుక. నత్తిగామాట్లాడు.

కొదలించు స.క్రి. కుదించు, తగ్గించు, సంకుచితంచేయు, కు. సం. 9.346. కొదలువడు రూ.చూ. కొదల్పడు. అ.క్రి. న్యూనతచెందు. కొరతపడు. కొదలుపెట్టు స.క్రి. తక్కువ చేయు. కొదల్పడు రూ. కొదలువడు. అ.క్రి. న్యూనత పొందు, కొరతపడు నిర్వ. రా. 5.105.

కొదల్పడు చూ. కొదలు.

కొదవ రూ. కొద¹, కొదువ¹. చూ. కొఱ. వి. 1. అవమానం. రం. రా. అరణ్య. 166పు. 4పం. ; 2. తక్కువ పాటు, న్యూనత. రామా. 3.65 ; 3. లోపం. కళా. 2.43 ; 4. అపరాధం, నేరం, తప్పు. విప్ర. 4.19 ; 5. లేమి. వేఙు.శ. 33 ; విశే. 1. న్యూనమైన. ఆం.భా. 3.24.

కొదవచేయు స.క్రి. చిన్నబుచ్చు, అవమానించు. విప్ర. 4.73. కొదవపడు అ.క్రి. 1. కొరతపడు, తక్కువగు. పరమ. 5.14 ; 2. భంగమగు, చెడు. వేంక. పంచ. 1.96. కొదవపుచ్చు స.క్రి. నాశనంచేయు. కాళిందీ. 1.35. కొదవపెట్టు స.క్రి. అసంపూర్తిగావదలివేయు.

కొదవి వి. బొంతవేగినచెట్టు, కొమ్మలకు ముళ్ళుండి కలపనిచ్చే ఒకరకంచెట్టు (Bredelia restusa).

కొదికల్లు వి. నల్లగారచెట్టు, మిరపకాయలవంటి పళ్ళుకాసే ఒకచెట్టు (Cappardice cadaba).

కొదికొను చూ. కొదుకు.

కొదుక చూ. కొదవ. విశే. న్యూనం ; తక్కువ. ఆం. భా. 3.24.

కొదుకు రూ. కొతుకు. అ.క్రి. 1. జంకు, వెనుదీయు. నరస. 3.58 ; 2. వర్ణలోపంగా మాట్లాడు, మాటనములు. దశా. 5.5.

క. కొదలు, కొద్లు. జంకుగా లేదా నత్తిగామాట్లాడు ; కొఱంబ. జంకు ; త. కొన్ను. నత్తిగామాట్లాడు.

కొదికొను రూ. చూ. కొతికొను. అ.క్రి. భయపడు, జంకు. విప్ర. 3.3.

కొదుగు వి. పరాఙ్ముఖం, పెడమొగం, విసుగు.

కొదుసురపోవు అ.క్రి. ముడిపడు.

కొదువు¹ స.క్రి. 1. ఏదైనానోటిలో వేసికొని మింగకుండా నములు ; 2. ఊరించు.

తు. కొఱపున, కొఱపుని. మింగకుండానములు ; త. కుతప్పు (-ఇన్-న్). నములు ; ఉతప్పు. నోటిలో అటు ఇటు కదుపు.

కొదువు² వి. ఇనపశలాక.

కొదువ¹ రూ. కొదవ. వి. లోటు. కొరత. పల్నా. 81.

కొదువ² వి. తాకట్టు.

త. కొతువై. తాకట్టు.

కొద్ది¹ రూ.చూ. కొఱంది. విశే. 1. అల్పం, కొంచెం. రం.రా. బాల. 20పు. 30పం. ; 2. ప్రమాణంకల. ప్రబంధ. 710 ; వి. 1. పరిమితి, పరిమాణం. రం.రా.అయో. 88పు. 19 పం. ; 2. శక్తి. విప్ర. 4.31.

తు. కొంగ్రద. చిన్న ; త. కొత్తమ్. హద్దు ; కుఇ. గొంచె, గొంచెక. కొంచెం, కొన్ని.

కొద్దికా(డు వి. క్షుద్రుడు, అల్పుడు. ఆం. భా. 3.13. కొద్దికొద్ది క్రి. విశ. కొంచెం కొంచెం. ఆం. భా. 3.67. కొద్దిగా క్రి. విశ. కొంచెంగా. కొద్దిది విశ. అల్పమైన. కొద్దిపడు అ. క్రి. కొంచెపడు. ధనుర్విద్యా. 1.50. కొద్ది వఱచు రూ. చూ. కొద్దిపఱుచు. స. క్రి. న్యూనతనందించు. కొద్దిపఱుచు రూ. కొద్దిపఱుచు. స. క్రి న్యూనతనందించు, తక్కువచేయు. వేమన. 1131. కొద్దిమంది వి. తక్కువ మంది. కొద్దిమీఱు అ. క్రి. సమృద్ధమగు. కొద్దివా(డు వి. కొంచెగాడు, అల్పుడు.

కొద్ది² ప్రత్య. అనుసారంగా, వరకు.

కొద్దడ్డి వి.బ.వ. నాలుగుపైసలు. వి. డబ్బు.

కొద్దేటువేయు స. క్రి. పాత్రమీద నలపతో కొద్ది కొద్దిగానర్చు.

కొన్ రూ. చూ. కొన్ని. విశ. కొన్ని పాండు. 4.147.

కొన వి. 1. చివర, కొస, భార. ఉద్యో 2.112 ; 2. వృక్షాదుల చివరికొమ్మ, అగ్రశాఖ. భార. శాంతి. 3.394 ; 3. గుర్రంజూలు, కేసరం. ఆం. భా. 2.197.

క. కొనె. చివర, మూల, కాడ. కొట్టి ; తు. కొనె, కొనై.

కొనకాడ వి. కొనదిమ్మ. కొనకొను రూ.చూ. గొనకొను. అ. క్రి. పూను, ప్రయత్నించు. భార. ఆది. 4.74. కొన కొయ్య వి. అనుపీటకు బిగించిన పల్ల. కొనగోరు వి. గోటి కొన, నఖాగ్రం. భీమ. 1.110. కొనచిటుకులు వి.బ.వ. చేపని పాడిపశువుల్ల కొద్దిగాలభించినపాలు. కొనచీకటి వి. వేకువ సమయంలో ఉండే లేతచీకటి. జాహ్నవి. 486. కొనచెవి వి. చెవికొనక. కొనంచు వి. పాత్రవెలపలి లేదా లోపలి అంచుకింద భాగం. <కొన+అంచు కొనదిమ్మ వి. కొన కాడ. కొనపీట వి. అనుపీటల్లో చివరది. కొనబావిలీ వి. చెవిచివరన ధరించే అలంకార విశేషం. కొనముక్కు వి. 1. నాసికాగ్రం. వైజ. 4.67 ; 2. పంటముక్కు, పంటెకుకింది వైపున ఆకుల చివర్లను కలిపికట్టినకొన. కొనముని(గించు స.క్రి. 1. పూర్తిగా ముంచు. ఉద్భ. 1.188 ; 2. మిక్కిలి బాధపెట్టు. కొనమున(గు అ. క్రి. 1. పూర్తిగామునుగు ; 2. మిక్కిలిబాధపడు. కొనమొదలుగా క్రి విశ.ద్రు. మొత్తంగా. కొనమొదలుగాపెట్టు స. క్రి. ఒకచివరనుండి రెండోచివర వరకు పెట్టు. కొనరిక్క వి. రేవతి నక్షత్రం. అచ్చ.రా. బాల. 158. కొనరెట్ట వి. హస్తాగ్రం, రం. రా. అయో. 89పు. 5పం. కొనలకెక్కు అ. క్రి. వర్ధిల్లు, కొనలిడు. వర. రా. 1 269. పు. 4పం. కొనలిడు అ.క్రి. వర్ధిల్లు, అతిశయించు. భాగ. 9.577.<కొన+-లు+ఇడు. కొనలు విరుడు. అ. క్రి. కొనలొత్తు, వర్ధిల్లు, అతిశయించు. భార. అరణ్య. 5 28. కొనలువాఱు(-పాఱు) అ.క్రి. వ్యాపించు. ప్రసరించు. ప్రబో. 2.105. కొనలుసాగు అ.క్రి. 1. కొనసాగు, వర్ధిల్లు. కాశీ. 7.234; 2. వ్యాపించు, ప్రసరించు శాశ. 1.57. కొనలెత్తు అ. క్రి. పెరుగు, అలము కొను, పెంపొందు, కొల్కొను <కొన+-లు+ఎత్తు. కొనలొత్తు అ. క్రి. వర్ధిల్లు, రం. రా. బాల. 25 పు. 20 పం. <కొన+-లు+ఒత్తు. కొనవాసం వి. చిట్టచివరివాసం. కొన వేయు స. క్రి. లేతపశువులకు తల్లిరొమ్ము పట్టిపాలుకుడిపించు. కొనసాగించు చూ. కొనసాగు. స. క్రి. వృద్ధిచేయు, పెంచు. ప్రబోధ. 4.33 ; అ.క్రి. కొనసాగు 1. వర్ధిల్లు, పెరుగు, అతిశయించు. భాగ. 10పూ. 197 ; 2. పూర్తి అగు, నెరవేరు, సఫలమగు, వరాహ. 11.24 ; 3. ప్రసరించు, వ్యాపించు. కొనాకు వి. చివరిఆకు. <కొన+ ఆకు. కొనాకులుమేయు స.క్రి. పై పైనరుచి చూచు.

కొనకొనంగోడి రూ. కొనకొన(గోడి, కొలకన(గోడి, కొలకల కోడి. వి. జలకుక్కుటం, నీటికోడి, బొల్లికోడి. క్రీడా. 52.

కొనకొన(గోడి రూ. చూ. కొనకొనంగోడి. వి. నీటికోడి. ఆము 4.183.

కొనటి వి. కురూపి, అంగహీనుడు. భార. అను. 5.93.

క. కునిష్ట, కొనష్టె. వక్రత్వం; త. కునట్టు, కునట్టై. అల్లరి ; మ. కునిష్టమ్. అయిష్టం, పగ, ద్వేషం.

పో. చూ. సం. కునష్ట-.

కొనటివా(డు వి. కురూపి. భార. శాంతి. 3.70.

కొనతం రూ. చూ. కొణతము. వి. దొంగగొడ్డుపరుగెత్తకుండా కాలికిమెడకూ కలిపికట్టే కట్టు.

కొనరు అ. క్రి. చచ్చు, నీలుగు.

కొనాకు చూ. కొన.

కొనాకులుమేయు చూ. కొన.

కొనాయిచెట్టు వి. కోలపొన్నచెట్టు (Cassia fistula).

కొనామణి రూ. చూ. కొణామణి. వి. కృష్ణా, గోదావరి డెల్టాల్లో ఎక్కువగా పండించేవడ్లు, పొడుగుపాటి గింజల వరిరకం.

కొనామొదటికి చూ. కొన. అవ్య.ద్రు. చివరినుంచి మొదటికి.

కొని రూ. చూ. కొన్ని. విశ. కొన్ని నిర్వ. రా. 7 63.

కొనిగడ్డి వి పశువులమేతకు పనికివచ్చే ఒకరకం కలుపుమొక్క (Panicum Maximum).

కొనిచను చూ. కొను.

కొనితెచ్చిపెట్టుకొన్నతద్దినం చూ కొను.

కొనితెచ్చు చూ. కొను.

కొనితెచ్చుకొను చూ. కొను.

కొనిపించు చూ. కొను.

కొనిపెట్టు చూ. కొను.

కొనిపోవు చూ. కొను.

కొనిమూల వి. చేనులో కొనుగాఉన్నమూల.

కొనియాట చూ. కొను.

కొనియాడు చూ. కొను.

కొనివచ్చు చూ. కొను.

కొను రూ. కో². స. క్రి. 1. అపహరించు, హరించు. భార. ఆది. 3.29 ; 2. ధనాదులు పరిగ్రహించు, స్వీకరించు. భార.ఆది. 7.54. భార.శాంతి. 1.288; 3. పట్టుకొను. ఆది. 3.148 ; 4. వశపరచుకొను, ఆక్రమించు, స్వాధీన పరచుకొను. భార. సభా. 1.137 ; 5. తీసికొనిపోవు. భార. అరణ్య. 3.362 ; 6. అతిశయించు, విజృంభించు, వ్యాపించు. కు. సం. 5.651 ; 7. తిను. భార. ఉద్యో. 2.38 ; 8. ఆధారంగా చేసుకొను. భార. ఉద్యో. 2.169 ; 9. అనుసరించు. భార.భీష్మ. 1.31; 10. లోనగు, ఇముడ్చు

కొను. భార.భీష్మ. 2.82, **11.** కొట్టు. భార.భీష్మ. 3.319; **12.** తలచు, ఎంచు. భార.ద్రోణ. 4.316 ; **13.** పూను. భార. కర్ణ. 3.60 ; **14.** లక్ష్యపెట్టు, నరకుచేయు. భార. శాంతి. 6.225 ; **15.** వెలకుతీసుకొను. భార. అశ్వ. 4 195; **16.** నెరవేర్చు, సాధించు. రం.రా.యుద్ధ. 289పు. 1పం. ; **17.** లక్ష్యంగాచేయు, సరిగాచేయు. రం. రా. ఉ. 75పు. 17పం ; **18.** చేరనిచ్చు. హరి. పూ. 5.142 ; **19.** తాగు. హర. 2.124 ; **20.** ఖండించు, నరకు. ఆము. 1.9 ; **21.** తాల్చు, ధరించు. పాండు. 1.185 ; **22.** కలియు, కూడు, చేరు. పాండు. 2.80 ; **23.** తెచ్చుకొను. హంస. 1.27 ; అ.క్రి. **1.** అతిశయించు, విజృంభించు. వ్యాపించు. కు. సం. 5.651 ; **2.** పనికివచ్చు, చెల్లు, సాగు. భార. విరా. 4.197 ; **3.** అగు, ఏర్పడు. రం. రా. అయో. 121 పు. 29పం. **4.** ఉండు, నెలకొను. కవిక. పీఠి. 8 ; **5.** ఏర్పడు ; **6.** ఎంచు.

క. కొళ్, కొళు, కొళ్ళు. పొందు, దొంగిలించు, తీసికొనిపోవు, కొళ్. దోచుకొనటం ; కొడ ; కొళ్ళ్-(కొవ్వ్-కొండ్-) ; తు. కొణుని ; త. కొళ్ (ఉళ్ -; ఉణ్ - వ్-.) తీసికొనిపోవు, పరిశీలించు, కలిగిఉండు, ఆక్రమించు, ఆలోచించు , మ. కొళ్క. పాత్రవలెపట్టుకొను, పొందు, క్రొట్టు, తెలియు. కొళ్. పట్టుకొనడం, కొనడం, తీసుకొనడం ; కొడ. కువిల్, (కువిడ్) మోయు, ధరించు ; కొం. కొళ్-/ కొణ్ - (కొడ్-). పెళ్ళాడు, మొదలుపెట్టు ; కుఇ. కొడ, కొను. తీసుకొను, లాగు ; కువి. కోడ్, కోడ్జ్. తీసుకొనడం ; కొలా. కొర్ - కొత్. తీసుకొనిపోవు. కొస్ - (కొస్త్ - ) ; నా. కొయ్ - (కొర్ -). తెచ్చు, కొస్. తీసుకొను ; పో. చూ. మాల్తో. కొవ్. తీసుకొనిపోవు.

<మూ. ద్రా. *కొళ్ -/ కొల్-.

**కొంగోలు** రూ. చూ. కొనుగోలు[1]. వి. కొనటం, క్రయం. **కొనిచను** న. క్రి. కొనిపోవు. పారి. 4.52 త. కొండయిపో. తీసికొనిపోవు. **కొనితెచ్చిపెట్టుకొన్న తద్దినం** వి. అనవసరంగా కల్పించుకొన్న చిక్కు. **కొనితెచ్చు** న. క్రి. తీసికొనివచ్చు. కాశీ. 5.28. **కొనితెచ్చుకొను** న. క్రి. ఆపదలు మొ. వాటిని తనపై పడేట్లు చేసుకొను. **కొనిపించు** న.క్రి. కొనజేయు, విలువకు పుచ్చుకొనజేయు. **కొనిపెట్టు** న.క్రి. కొనిఇచ్చు, పిలిచిఇచ్చు. గంధ. 131. **కొనిపోవు** రూ.చూ కొంపోవు. న.క్రి. అపహరించు. తీసుకొనిపోవు. రాజ.చ. 2.31. క. కొండు హోగు ; త. కొలటుపో ; మ. కొండుపో. **కొనియాట** చూ. కొనియాడు. వి. **1.** ఆచరించడం. భార. అరణ్య. 5.44 ; **2.** శ్లాఘనం. భార. ద్రోణ. 1.78 ; **3.** కొలవడం. హరి. ఉ. 7.52 ; **4.** ఆదరించడం. **కొనియాడు(-ఆడు)** న.క్రి. **1.** మెచ్చు, పొగడు, స్తుతించు. భార. ఆది. 7.246 ; **2.** గౌరవించు, ఆదరించు, పాటించు. భార. విరా. 2.52 ; **3.** అవలంబించు, ఆచరించు. భార. విరా. 1.179 ; **4.** కాపాడు, రక్షించు, పోషించు. భార. కర్ణ. 3.48 ; **5.** తలపోయు. భార. అను. 1.9 ; **6.** భజించు, సేవించు, కొలచు. భార. అను. 2.136. **కొనివచ్చు** అ క్రి. తీసికొనివచ్చు. మను. 4.28 ; క. కొండబరు. తీసుకొనివచ్చు ; త. కొంటువ (-న్త్ -న్) ; మ. కొంటువరిక. **కొనుకొను** రూ. కొనుక్కొను, కొన్కొను. న.క్రి. వెలకుకొను. **కొనుక్కొను** రూ.చూ. కొనుకొను. న క్రి. వెలకుకొను. **కొనుగోలు**[1] రూ. కొంగోలు, కొన్గోలు. వి. కొనడం, క్రయం. **కొనుగోలు**[2] వి. (నాట్య) శబ్దోచ్చారణం. ప్రబంధ. 94. **కొనుచువచ్చు** రూ. కొన్నువచ్చు. న.క్రి. కొనితెచ్చు. **కొనుట** రూ.చూ. కొంట. వి. గ్రహించటం. **కొనుబడి** వి. కొనుగోలు, క్రయం. **కొనుమొదలు** వి. క్రయధనం, కొనడానికిచ్చిన సొమ్ము. పెట్టుబడిసొత్తు, అసలు. త. కొళ్ ముతల్. వెల. **కొన్కొను** రూ.చూ. కొనుకొను. న.క్రి. వెలకుకొను. **కొన్గోలు** రూ.చూ. కొనుగోలు[1]. వి. కొనటం. **కొన్నువచ్చు** రూ.చూ. కొనుచువచ్చు. న.క్రి. కొనితెచ్చు, తెచ్చు. **కొంట** రూ. కొనుట వి. కొనటం. భార. కర్ణ. 1.187. **కొన్నకాంత** వి. భార్య. **కొంపోవు** రూ. కొనిపోవు. న.క్రి. అపహరించు, తీసుకొనిపోవు. ప్రభా. 3.143.

**కొమక** వి. **1.** లోటు, కొరత ; **2.** దాసగు.

**కొమజు** రూ.చూ. కొఱుజు. వి. పిదుజు, పసులదేహంలో చేరి రక్తాన్ని పీల్చే క్రిమి, గోమారి. హరి. పూ. 6.5.

**కొవేరు** అ.క్రి. వాడిపోవు.

**కొన్కొను** చూ. కొను.

**కొన్గోలు** చూ. కొను.

**కొన్నువచ్చు** చూ. కొను.

**కొంట** చూ. కొను.

**కొంత** వి. ఇంచుక, కొద్ది, కొలది. భార. ఆది. 6.188.

క. కొఱె. స్వల్పత ; తు. కొం(ద. చిన్న ; త. కుఱై. తక్కువతనం ; కుఱైంత. తక్కువ, స్వల్పం ; మ. కుఱు లేకపోవటం ; కుఇ. గొంబె, గొంబెక. కొన్ని, కొంచెం.

**కొంతపడి** క్రి. విశ.ద్రు. కొద్దిగా.

**కొంతపుమొగ్గరము** చూ. కొంతము.

**కొంతము** వి. ఈటె, బల్లెం. కు.సం. 11.119.

సం. కుంత-. ఈటె ; ప్రా. కొంత. కుంత.

క. కొంత ; తు. కుంతం ; త. మ. కుంతం.

<ప్రా. కొంత-.

**కొంతపుమొగ్గరము** వి. కుంతాకారంగా ఉండే వ్యూహం. కు.సం. 11.91.

**కొంతలము** వి. ప్రాకారావయవం.

**కొంతలి** రూ.చూ. కొఱతలి. వి. **1.** గుమ్మటంలాంటి పనిముట్టు ; **2.** ఒకరకం చిన్నరాట ; **3.** ఊరెత్తై తాడు బిగింపుకు వేసే కొయ్య.

**కొందఱు** వి బ.వ. కొంతసంఖ్య గలవారు, కొంతమంది. భార. ఆది. 7.133.

**కొందల**[1] వి. తెల్లని మంచినీటి చేప.

**కొందల**[2] వి. లేతపసుపురంగు పూలుపూసే ఒక పెద్ద చెట్టు (Albizzia Thonpson).

**కొందలపడు** చూ. కొందలము.

**కొందలపఱుచు** చూ. కొందలము.

కొండలపాటు చూ. కొండలము.

కొండలపెట్టు చూ. కొండలము.

కొండలమందు చూ. కొండలము.

కొండలము వి. 1. క్షోభం, కలత. భార. విరా. 4.172; 2. బాధ. భార. ద్రోణ. 2.247; 3. సందియం. సంశయం. భాగ. 8. 225; 4. నైచ్యం. విష్ణు పు. 2.126; 5. విచారం. హరిశ్చ. 3.258.

సం. గుండల-. మద్దెలమోత; ప్రా. గొండల-, గుండల-. హర్షసూచకమైన తుములధ్వని.

క. గొండల; త. కొంతళమ్. కలత, సంక్షోభం.

< ప్రా. గొండల-.

కొండలపడు అ.క్రి. 1. కలతపడు. భార. ద్రోణ. 2.292; 2. దుఃఖించు, శోకించు. భాస్క.రా. 4.266. కొండలపఱచు చూ. కొండలపడు. స.క్రి. కలతపెట్టు, ఏడిపించు. భార. విరా. 1.97. కొండలపాటు వి. కలత, సంక్షోభం. భార. విరా. 2.135. కొండలపెట్టు స.క్రి. 1. కలత నొందించు, కలవరపెట్టు. మార్క. 6.72; 2. బాధపెట్టు. హరి. పూ. 4.22. కొండలమందు అ.క్రి. దుఃఖించు. కొండలించు అ.క్రి. కలతపడు, ఉ.హరి. 4.25.

కొండలించు చూ. కొండలము.

కొండాక అవ్య. కొంతవరకు. వరాహ. 6.27.

< కొంత + దాఁక.

కొందు స.క్రి. 1. పొడుచు. ఉ.రా. 7.456; 2. నజ్జుగా నరకు.

క. కొత్తు. ముక్కలుగాచేయు, నరకు; త. కొంతు (-ఇన్-ప్-). ముక్కలుచేయు, నరకు; కొత్తు (ఇన్-ప్-). కరచు; కుత్తు (-ఇన్-ప్-). పొడుచు, గుచ్చు, దూర్చు; మ. కొత్తుక. కొట్టు, పొడుచు, గుచ్చు, దూర్చు; కుట్టుక. కొట్టు.

కొన్నకాంత చూ. కొను.

కొన్నాళ్లు వి.బ.వ. కొన్నిరోజులు, కొంతకాలం. సీలా. 3.25.

< కొన్ + నాళ్ళు.

కొన్ని రూ. కొన్-, కొని. విశ. కొలది, కతిపయార్థకం. బసవ. 4 పు. 113 పం. భార. విరా. 2.29.

క. కుందు-. తగ్గు; త. కున్ఱు. క్షీణత.

కొమ్న వి. పలుపు ముడివేయటానికి కాడికి బిగించిన ఇనప కొక్కెం.

కొన్సేలు వి. మంత్రాంగ సభ.

పో. కొన్సెల్యు-. మంత్రాంగం; స్పా. కొన్సీలియో. పాదిరి గుడికి సంబంధించిన సంఘం; ఫ్రెం. కోన్సెయ్; ఇం. Council.

< పో. కొన్సేల్యు.

కొపారం రూ.చూ. కపారం. వి. పెంకు కప్పకముందున్న కప్పు చట్రం.

కొపెర రూ.చూ. కొప్పెర[3]. వి. 1. వర్షంలో తడవకుండాను, మనిషి నెత్తిన పొట్టు పడకుండాను తలమీద వేసుకొనే గోనెగూడ; 2. గూడలాగ వేసిన మడత కంబళి; 3. ఇంటి కప్పుపై ఉన్న మొనదేలిన భాగం; 4. కట్టుబడిలో పొడుచుకొనివచ్చిన రాతిముక్క; 5. మొగరం రూపంలో ఉన్న గ్రామదేవత కొప్పు-.

కొపిరార్చి వి. తమలపాకార్చి, మధ్యభాగంలో గుమ్మటంలాగ ఉండి పై చివర మొనదేలి ఉండే ఆర్చి.

కొపురు వి. 1. శిఖరం, కొండకొమ్ము. అచ్చ.రా. కిష్కిం. 102; 2. ఉన్నతి. అచ్చ.రా. అరణ్య. 23.

సం. గోపుర-; ప్రా. గోఉర-; హిం. గోపుర్. నగర ద్వారం, స్వర్గ ద్వారం.

క. కుప్పె. గుట్ట; త. కువటు. శిఖరం, చెట్టు, కొమ్మ; మ. కువటు. పర్వత శిఖరం; పర్జి. కుప్ప. చిన్న మిట్ట, చిన్నదిబ్బ.

< సం. గోపుర-.

కొపెర రూ.చూ. కొప్పెర[1]. వి. పెద్ద మూతిగల పాత్ర. కువ.చ. 1.41.

కొప్పరము పో.చూ. కొప్పు[1]. యా. క్రొపము. వి. 1. మూపు. ఉ. హరి. 6.108; 2. శిఖరం. విశ. ముమ్మరమైన, అధికమైన. దా.శ. 16.

సం. కూర్పర-. మోకాలి లేక మోచేతిచిప్ప.

తు. కొంప, కొంపె. గుట్ట; త. కొప్పరమ్. మోకాలు, మోచేయి; కొండ. కుప. ధాన్యరాశి; పెం. కుప. గుట్ట; కుపిలి. మట్టిదిబ్బ; మండ. కుప. గుట్ట; గద. కుప్ప. గుట్ట; ఒల్లా. క్రొపె. గుట్ట; బ్రా. కోప. భుజం.

కొప్పరించు రూ. కొప్పించు. అ. క్రి. 1. విజృంభించు, అతిశయించు. ఉ.హరి. 4.256; 2. కోపంచేత రోమాంచం కలదగు. ఉ.రా. 7.413; 3. పళ్ళు ఇకిలించు. స.క్రి. 1. నిండుగాపోయు. విప్ర. 3.28; 2. వెక్కిరించు; 3. మించు; 4. పుటంవేయు; 5. నింపు; 6. కేరు; 7. ఉబ్బరించు. క. కుప్పు; త. కువి. అతిశయించు; కూవల్. ఆధిక్యం, అతిశయం; మ. కువి. అతిశయించు; పర్జి. కొప్పె. నిండుగాఉండు; ఒల్లా. కోప్. నిండు; కురు. ఖోపా; మాల్తో. కొపె. గుట్ట, దొంతి. కొప్పరింత వి. 1. అతిశయం, విజృంభణం. ముమ్మరం; 2. వెక్కిరింత.

కొప్పరాయి వి. ఆముపొయ్యికి పైభాగంలో ఉండేరాయి.

కొప్పరించు చూ. కొప్పరము.

కొప్పరింత చూ. కొప్పరము.

కొప్పి వి. గుండ్రంగా వేసిన గడ్డివామి.

కొప్పించు రూ.చూ. కొప్పరించు. అ.క్రి. కొప్పరించు.

కొప్పియ రూ.చూ. కుప్పె[2]. వి. మందుగుళిక, మాత్ర.

కొప్పిరిగి వి. కంబళి లేదా గోనెసంచి ముసుగు.

కొప్పు[1] వి. 1. పురుషులసిగ, జుట్టుముడి. భార. ఆది. 7.44; 2. వింటికొన, గనయం. భీమ. 5.95; 3. కబరి స్త్రీల జుట్టు. దశా. 6.34; 4. ఇంటికప్పు యొక్క ఊర్ధ్వ భాగం ఉన్నతస్థానం. చంద్రాంగ. 5.91; 5. తల; 6. గోనెసంచి రెండుకొనల్ని ఒకచోటచేర్చి వర్షంలో తడవకుండా వేసుకొనే గూడవంటిది; 7. పర్వత శిఖరం; 8. దంతె తోలేటప్పుడు రెండుదాళ్ళమధ్య కోనుగా తేరిన మట్టిచాలు; 9. ఆర్చిలో నాభిరాయి బిగించేప్రదేశం.

క.త.మ. కొప్పు. సిగ, కేశపాశం ; గోం. కూపడ్ ; కురు. ఖోపా , కుఇ. కప ; మాల్తో.కొప.

కొవ్వుకఱ్ఱ వి. కొమరుగుజ్జు, వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. కొవ్వుకఱ్ఱగుజ్జు వి. కొమరుగుజ్జు, వెనుగాడిని మోసే పెద్దగుజ్జు. కొవ్వుగఱ్ఱపీట (-కఱ్ఱపీట) వి. కొమర పీట, కొమరమీదిపీట. కొవ్వుగువ్వ వి. పక్షివిశేషం, కూకుడుగువ్వ. కొవ్వుగొలుసులు వి.బ.వ. ఆభరణ విశేషం, కొప్పుకురెండువైపుల పెట్టుకొనేగొలుసులు. కొవ్వుతోలు వి. దూదిపికేకొయ్య పనిముట్టు చివరి వంపుకు చుట్టిన తోలు. కొవ్వురాయి వి. గురుగులుకట్టించటానికి వాడేరాయి. కొవ్వులోకొఱవి వి. మిక్కిలి తుంటరి. కొవ్వువల వి. తల వెండ్రుకల్ని బంధించే ముత్యాలసరం, జడబిళ్ళ. కళా. 7.66. కొవ్వువానము వి. కొప్పుకువేసేవానం వెనుబద్ద. కొవ్వుశీల వి. వాసాలను దూలాలకు బిగించే కొయ్యమేకు. కొవ్వునుడి రూ. కుప్పనుడి. వి. మూపురంమీదఉండే ఫలప్రదమైన నుడి. కొప్పెక్కించు స.క్రి. పైకెత్తు, గౌర వించు. చంద్రాంగ. 5.91 < కొప్పు[1] + ఎక్కు + -ఇంచు[3]. కొప్పెత్తు అ.క్రి. పరాజితమై పారిపోదానికి సిద్ధపడు. < కొప్పు[1] + ఎత్తు.

కొవ్వు[2] వి. నాట్యవిశేషం. కోవు. దశా. 7.1287.

పో.చూ. క. కుప్పు. దుముకు; పో.చూ. కుప్పళి పుణ, కుప్పాళిపుణె ; పో.చూ. త. కొప్పె. బాలక్రీడా విశేషం.

కొవ్వుమారురాయి వి. కొప్పునూరు ప్రాంతం నుండి వచ్చే చలువరాయి.

కొప్పె రూ.చూ. కుప్పె[2]. వి. మందు ఉండ.

కొప్పెక్కించు చూ. కొప్పు[1].

కొప్పెత్తు చూ. కొప్పు[1].

కొప్పెర[1] రూ. కొపెర. వి. 1. కాగు, వెడల్పుమూతిగల చిన్నపాత్ర. జైమినీ భా. 4.110 ; 2. తలపుఱె. దశా. 8.157 , 3. కమండలం.

సం. కొర్పర -; ప్రా. కొప్పర -, కుప్పర. పాత్ర. క. కొప్పర, కొప్పరిగె. కాగు, నూనెఉంచుకొనే పాత్రవిశేషం ; తు. కొప్పరిగె. కాగు ; త. కొప్పరై, రాగి లేదా ఇత్తడి కాగు ; మ. కొప్పర.

< ప్రా. కొప్పర-.

కొప్పెర[2] రూ.చూ. కొబ్బెర. వి. చిప్పతీసిన టెంకాయ, నారికేళపేశం.

కొప్పెర[3] రూ. కొపిర. వి. 1. వర్షంలో తడవకుండాను, తూర్పార పోసే మనిషినెత్తిన పొట్ట దువ్వపడకుండాను తలమీద వేసుకొనేగూడ ; 2. గూడలాగ వేసిన గోనె గూడ ; 3. ఇంటికప్పుపైన ఉన్న మొనదేలిన భాగం ; 4. కట్టుబడిలో పొదుగుకొని వచ్చిన రాతిముక్క ; 5. మొగరం రూపంలోఉన్న గ్రామదేవత కొప్పు.

కొప్పెర[4] వి. ఆముదగ్గర పనిచేసేటప్పుడు కప్పుకునేఉన్ని కాలువ.

కొప్రము రూ.చూ. కొప్పరము. వి. శిఖరం. నీలా. 1.28.

కొబ్బరి రూ.చూ. కొబ్బెర. వి. 1. చిప్ప తీసిన టెంకాయ ; 2. నారికేళపేశం.

కొబ్బరికల్లు రూ.చూ. కొబ్బెరకల్లు. వి. నారికేళాసవం, కొబ్బరినుంచి తయారుచేసిన కల్లుపాక. కొబ్బరికాయ రూ.చూ. కొబ్బెరకాయ. వి. నారికేళఫలం. కొబ్బరికురిడి వి. ఎండిన కొబ్బరిగుంజు. కొబ్బరిగుంజు రూ.చూ. కొబ్బెర గుంజు. వి. కొబ్బరికాయలోని భక్ష్య పదార్థం. కొబ్బరిచిప్పె వి. బెల్లంపాకం పట్టి కొబ్బరి తురుమువేసి చేసే తిను బండారం. కొబ్బరిచెట్టు రూ.చూ. కొబ్బెరచెట్టు. వి. నారికేళవృక్షం (Cocosruciberra.) కొబ్బరిత్రాడు వి. కొబ్బరి పీచుతో పేనిన తాడు. కొబ్బరిదూది వి. మొవ్వులో ఆకును అంటుకొని ఉండేదూది వంటిపదార్థం. కొబ్బరివార వి. టెంకాయపీచు, డొక్కపీచు. కొబ్బరివారచీర వి. నిలువు పోగులు తెలుపు, పేకపోగులు ఎరుపు రంగులు పెట్టినేసిన చీర. కొబ్బరినూనె రూ.చూ. కొబ్బెరనూనె. వి. కొబ్బరిముక్కల నుండి తీసినచమురు. కొబ్బరిపండు రూ.చూ. కొబ్బెరపండు. వి కొబ్బరికాయ, నారికేళం. కొబ్బరిపాలు వి. కొబ్బరిగుజ్జు నుండి పిండిన తెల్లని ద్రవం. కొబ్బరిపిట్టు వి. బియ్యంపిండి కొబ్బరిగుంజు కలిపి ఆవిరిలో వండే భక్ష్య విశేషం. కొబ్బరిపీచు వి. టెంకాయపైన ఉండే పీచు. కొబ్బరిపువ్వు రూ.చూ. కొబ్బెరపూవు. వి. మొక్కలు మొలచిన కొబ్బెరికాయలో ఉండవలె ఉండే మెత్తని పదార్థం. కొబ్బరిపూవు రూ.చూ. కొబ్బెరపూవు. వి. మొక్కమొలిచిన కొబ్బరికాయలో ఉండవలె ఉండే మెత్తని పదార్థం. కొబ్బరిబరికె వి. రాటిపై బద్దను బిగించి వాటిమధ్య తోర్లించి కట్టిన కొబ్బరి చిప్ప లేదా రేకు లేదా కఱ్ఱ చిప్ప. కొబ్బరిబెల్లము వి. కొబ్బరినుండి తయారుచేసిన బెల్లం. కొబ్బరిబొండము రూ.చూ. కొబ్బెరబొండము. వి. 1. పీచుతీయని (పలవని) కొబ్బరికాయ ; 2. లేతకొబ్బరికాయ. కొబ్బరియుండ (-ఉండ) రూ.చూ. కొబ్బెరయుండ. వి. కొబ్బరి, బెల్లం, బియ్యప్పిండితోకలిపి చేసే భక్ష్య విశేషం. కొబ్బరిలవుజు వి. బెల్లంపాకం పట్టి కొబ్బరి తురుము వేసి చేసే భక్ష్యం. కొబ్బరిసారాయి వి. కొబ్బరినుండి తీసినసారాయి. కొబ్బరి సిరకా వి. కొబ్బరిసారాయి. కొబ్బరీవెలగడిచీర మూడేసి రంగుల పోగులు పడుగు పేకలు పెట్టిన నేసిన గళ్ళచీర. < కొబ్బరి + ఈనెల చీర.

కొబ్బరీవెలగడిచీర చూ. కొబ్బరి.

కొబ్బెర రూ. కొప్పెర[2], కొబ్బరి, కొవ్వెర, గొబ్బరి. వి. 1. కొబ్బరికాయ, కొబ్బెరపండు. రామలిం.శ. 17. నీలా. 1.7 ; 2. కొబ్బరికాయలోని భక్ష్య పదార్థం. ప్రబంధ. 641.

క. కొబరి, కొబ్బరి. నారికేళం ; తు. కొప్పర, కొప్పరి, కొబరి, కొబ్బరి ; త. కొప్పరి, కొప్పరై ; మ. కొప్పర.

కొబ్బెరకల్లు రూ. కొబ్బరికల్లు. వి. నారికేళాసవం. కొబ్బెరకాయ రూ. కొబ్బరికాయ. వి. టెంకాయ. కొబ్బెర కుంచె వి. నేతనేసేటప్పుడు అప్పుడప్పుడు పడుగుకు గంజి పూయడానికి ఉపయోగించే కొబ్బరిపీచుతో చేసినకుంచె. కొబ్బెరగుంజు రూ. కొబ్బరిగుంజు. వి. కొబ్బరికాయలోని

భక్ష్య పదార్థం. (Cocuscvuciberra) కొబ్బెరచెట్టు రూ. కొబ్బరిచెట్టు. వి. టెంకాయచెట్టు, నారికేళవృక్షం. (Cocuscvuciberra.) కొబ్బెరనూనె రూ. కొబ్బరినూనె. వి. కొబ్బరినూనె, కొబ్బరిగుంజు నుండి తీసిననూనె. కొబ్బెరపండు రూ. కొబ్బరిపండు. వి. కొబ్బరికాయ. కొబ్బెరపువ్వు రూ.చూ. కొబ్బెరపూవు. వి. మొక్కమొలుస్తున్న కొబ్బరికాయలో ఉండవలె ఉండే మెత్తని పదార్థం. కొబ్బెరపూవు రూ. కొబ్బరిపువ్వు, కొబ్బరిపూవు, కొబ్బెర పువ్వు. వి. మొక్కమొలుస్తున్న కొబ్బరికాయలో ఉండవలె ఉండేమెత్తని పదార్థం. కొబ్బెరబొండము రూ. కొబ్బరి బొంతము. వి. 1. పీచుతీయని కొబ్బరికాయ ; 2. లేత కొబ్బరికాయ. కొబ్బెరయుండ (-ఉండ) రూ. కొబ్బరి యుండ. వి. కొబ్బరి, బియ్యపిప్పిండి బెల్లం కలిపిచేసే భక్ష్యవిశేషం.

**కొమ**[1] రూ.చూ. కొమ్మ[1]. వి. చెట్టు కొమ్మ, శాఖ.

**కొమ**[2] రూ.చూ. కొమ్మ[2]. వి. 1. స్త్రీ. విజయ. 1.33 ; 2. చెలి, సఖి. రసిక. 4.166 ; 3. భార్య

**కొమర** రూ. కొమరు[3], కొమిర[2], కొమిరి[1], కొమిరె[2], కొమెర, కొమెరి, కొమెరు, కొమెరె, కొమ్ర, కొమ్రె, కొవిరె. వి. పెద్దదూలాల మీద పిల్లదూలాన్ని నిలిపే కొయ్యముక్క, మేలుదూలం మీదిగుజ్జు.

కొమరకొయ్య రూ. కొమరుకొయ్య, కొమరుగొయ్య, కొమెరకొయ్య, కొమ్మరగుయ్య. వి. కొమరుగా ఉపయోగించే కర్ర. కొమరగుజ్జు రూ. కవదుగుజ్జు. వి. కొప్పుకర్ర గుజ్జు, వెనుగాడిని మోసే పెద్ద గుజ్జు. కొమరదూలం వి. కుంటదూలం, గోడమీదినుంచి దూలంమీదవేసే చిన్న దూలం. కొమరపీట రూ. కొమిరపీట, కొమెరపీట. వి. కొమరమీదిపీట, ఎనుగర్రపీట. కొమరబడితె వి. కొమర కొయ్య, కొమరగా వాడిన కొయ్య. కొమరబల్ల వి. కొమర మీది పీట. కొమరిల్లు వి. కొమరలు నాటిన పూరిల్లు. <కొమర + ఇల్లు.

**కొమరస్వామి** వి. కుమారస్వామి. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934.

సం. కుమారస్వామిన్. స్కందుడు.

త. కుమారచామి. స్కందుడు.

<సం. కుమారస్వామిన్.

**కొమరారు** చూ. కొమరు[1].

**కొమరాలు** చూ. కొమరు[1].

**కొమరిత** రూ. కొమరితె, కొమర్త, కొమర్తె, కొమారిత, కొమారితె, కొమార్త, కొమార్తె, కొమెరిత. వి. కూతురు, కుమార్తె. పాంచాలీ. 2.31.

సం. కుమారీ. కూతురు ; పా. కుమారీ. కుమారికా ; ప్రా. కుమరీ, కుమారియా ; నే. కువారీ. కుమా. బాలిక ; ఒ. కుఆఁరీ, కౌఁరీ. కన్య ; హిం. కునాఁరీ ; పం. కఁవారీ, కువా. కుఅ, కమా. కన్య ; సిం. కుఆరీ. కన్య ; గు. కువఁరీ.

క. కుమారి, కువరె ; త. కుమరి.

<ప్రా. కుమరీ.

**కొమరితె** రూ.చూ. కొమరిత. వి. కూతురు.

**కొమరిల్లు** చూ. కొమర.

**కొమరు**[1] విశ. 1. మనోహరమైన, చక్కని. భార.ఆది. 2.26 ; 2. పదుచుదయిన. హర. 1.23; వి. 1. విధం. భార.విరా. 4.270 ; 2. మనోజ్ఞత, సొంపు.

సం. కూఒర-. అందమైన.

త. కొమ్మై. అందం. కుమరి. చిన్నమొక్క. మొ.

కొమరారు క్రి.విశ. బాగుగా, అందంగా. కు.సం. 1.98; అ.క్రి. వికసించు. <కొమరు[1] + ఆరు. కొమరాలు వి. 1. సుందరి. కు.సం. 6.15 ; 2. యువతి, జవరాలు. వేంక.పంచ. 4.234. <కొమరు[1] + ఆలు. కొమరుతనము రూ.చూ. కొమరుఁదనము. వి. యౌవనం. కొమరువా(డు వి. యౌవనం. కకుత్స్థ. 4.26. కొమరు(దనము రూ. కొమరునతనము. వి. యౌవనం. కళా. 4.49. కొమరుమిగులు అ.క్రి. అందంగా ఉండు. కొమరుంబ్రాయము(-ప్రాయము) రూ. కొమరుఁ బ్రాయము. వి. యౌవనం. కళా. 4.46. కొమరు(బ్రాయము రూ.చూ. కొమరుంబ్రాయము. వి. యౌవనం, చక్కదనం. నీలా. 3.10. కొమరొందు అ.క్రి. అందగించు. <కొమరు[1] + ఒందు. కొమరొప్పు అ.క్రి. 1. అందగించు ; 2. మేలగు. <కొమరు[1] + ఒప్పు.

**కొమరు**[2] రూ.చూ. కొమరుఁడు. వి. కుమారస్వామి. ఆం.నా. నం. 1.7.

క. కువర, కొబర, కొమర, కొమార, కొవర, కోర. బాలుడు, యువకుడు, కుమారస్వామి, కొడుకు ; త. కుమారన్.

బహుశా ద్రావిడ భాషలనుంచి సంస్కృతంలోనికి ప్రతిదేయం కావచ్చు.

కొమరుడాలు వి. కోడి. కొమరుసామి వి. కుమారస్వామి. సం. కుమారస్వామిన్. కొమరుసామితేరు వి. కుమారస్వామి వాహనం, కోడి. కొమరుసామిరథము వి. కుక్కుటం. భీమ. 2.28. కొమరేఱు వి. పిఠాపుర సమీప గ్రామమైన కుమారారామంలో ఉన్న దివ్యవాహిని, స్వామిపుష్కరిణి. భీమ. 2.62. పో.చూ. త. కుమరియాఱు. కుమరినది. <కొమరు[2] + ఏఱు.

**కొమరు**[3] రూ.చూ. కొమర. వి. పెద్దదూలాలమీద పిల్లదూలాన్ని నిలిపే కొయ్యముక్కలు, మేలుదూలంమీది గుజ్జు.

కొమరుకొయ్య రూ.చూ. కొమరకొయ్య. వి. 1. ఇంటి వెనుకబద్ద కింది కురుజు మేలుదూలంమీది గుజ్జు ; 2. కొమరుగా ఉపయోగించే కర్ర. కొమరుగర్ర(-కర్ర) రూ. కొమిరెకర్ర. వి. కొమరగా వాడిన కర్ర. కొమరుగొయ్య రూ.చూ. కొమరకొయ్య. వి. కొమరుగా ఉపయోగించిన కర్ర.

**కొమరుఁడు** రూ. కొమరు[2], కొమారుఁడు. 1. పుత్రుడు, కొడుకు. రం.రా.బాల. 12 పు. 24 పం. ; 2. పురుషుడు, మగవాడు. విక్ర. 3.78 ; 3. కౌమారవయస్కుడు. ఆం. భా. 2.118 ; 4. కుమారస్వామి. ఆం.భా. 1.44.

సం. కుమార- పుత్రుడు, స్కందుడు ; ప్రా. కుమర-. బాలుడు, యువరాజు, అవివాహితుడు ; జై.మహా.

కుమర-; శౌ. కుమార; మా. కుమాల; అమా. కువర. యువరాజు; పా. కుమార.

క. కువర, కొమర, కొమార, కోర. బాలుడు, పడుచువాడు, కొడుకు. యువరాజు; త. కుమరన్. యువకుడు, కుమారస్వామి.

<ప్రా. కుమర-.

కొమరె రూ.చూ. కొమిరె[1]. వి. అప్పుడే యౌవనం పొందమిన స్త్రీ, జవ్వని.

కొమరేఱు చూ. కొమరు[2].

కొమరొందు చూ. కొమరు[1].

కొమరొప్పు చూ. కొనురు[1].

కొమర్త రూ.చూ. కొమరిత. వి. 1. కూతురు; 2. ఆడపడుచు.

కొమర్తె రూ.చూ. కొమరిత. వి. 1. కూతురు; 2. ఆడపడుచు.

కొమారి రూ.చూ. కొమిరె[1]. వి. స్త్రీ, యువతి. చంద్రాంగ. 4.191.

కొమారిత రూ.చూ. కొమరిత. వి. పుత్రిక, కూతురు. పాంచాలీ. 2.10.

కొమారితె రూ.చూ. కొమారిత. వి. కూతురు.

కొమారు(డు రూ.చూ. కొమరు(డు. వి. 1. పురుషుడు, మగవాడు. కళా. 3.130; 2. కుమారుడు, పుత్రుడు. సారంగ. 2.85.

కొమార్త రూ.చూ. కొమరిత. వి. 1. కన్య. కువల. 2.28; 2. కూతురు.

కొమార్తె రూ.చూ. కొమరిత. వి. కూతురు.

కొమి రూ.చూ. కొమ్మి[1]. వి. మెరుపుగల నల్లని ఆకులుండే ఒక తీగ, కొండపాపటతీగ (Chomelia Asialica).

కొమిర[1] వి. 1. బాలుడు; 2. కుమారుడు; విణ. లేప్రాయానికి సంబంధించిన.

సం. కుమార-. కొడుకు.

<సం. కుమార-.

కొమిర[2] రూ. చూ. కొమర. వి. పెద్ద దూలాలమీది పిల్ల దూలాన్ని నిలిపే కొయ్యముక్క, మేలుదూలంమీది గుజ్జు.

కొమిరపీట రూ. చూ. కొమరపీట. వి. కొమరమీది పీట, వెనుగ్రపీట.

కొమిరి[1] రూ.చూ. కొమర. వి. పెద్దదూలాలమీద పిల్లదూలాన్ని నిలిపే కొయ్యముక్క. మేలుదూలంమీది గుజ్జు.

కొమిరి[2] రూ. కొముదు. వి. దున్నకం సరిగా కలియని నేల.

కొమిరె[1] రూ. కొమరె, కొమారి. వి. 1. యువతి. విక్ర. 2.245; 2. కూతురు, పుత్రిక. వసు. 3.105; 3. స్త్రీ. శుక. 1.375; 4. కొమార వయసులో ఉన్న స్త్రీ. ఆం.భా. 2.106; విణ. యౌవనం కల. ఆము. 4.35.

సం. కుమారీ. బాలిక, కన్య; ప్రా. కుమరీ.

<ప్రా. కుమరీ.

కొమిరె[2] రూ.చూ. కొమర. వి. 1. పెద్దదూలాలమీద పిల్లదూలాల్ని నిలిపే కొయ్యముక్క; 2. మోటబావిపై దోర్న పట్టెకు ఆధారంగా ఉండే గుంజ; 3. సిడెమానుకు ఆధారంగా నేలలో పాతిన కొయ్య.

కొమిరెకర్ర రూ.చూ. కొమరుగర్ర. వి. కొమరుగా వాడిన కర్ర.

కొమిరెగొయ్యలు వి.బ.వ. గొర్తికొయ్యల్లాగ ఉండే మూడు చుక్కలు, ఆరుద్రానక్షత్రం.

కొముదు రూ.చూ. కొమిరి[2]. వి. 1. దున్నకం సరిగా కలియని నేల; 2. రెండు చాళ్ళమధ్య కోసుగా తేరిన మట్టి చాలు.

కొమెర రూ.చూ. కొమర. వి. పెద్దదూలాలమీద పిల్లదూలాల్ని నిలిపే కొయ్యముక్క, మేలుదూలంమీది గుజ్జు.

కొమెరకొయ్య రూ.చూ. కొమరకొయ్య. వి. కొమరగా ఉపయోగించే కర్ర.

కొమెరగోడ వి. చుట్టుగోడలమీద ముక్కోణం ఆకారంలో కట్టిన పక్కగోడ.

కొమెరత రూ.చూ. కొమరిత. వి. సుకుమారి, కొమ్మ.

కొమెరపీట రూ.చూ. కొమరపీట. వి. కొమరమీది పీట, వెనుగ్రపీట

కొమెరి రూ.చూ. కొమర. వి. పెద్ద దూలాలమీద పిల్ల దూలాన్ని నిలిపే కొయ్యముక్క, మేలుదూలంమీది గుజ్జు.

కొమెరు రూ.చూ. కొమర. వి. పెద్ద దూలాలమీద పిల్లదూలాన్ని నిలిపే కొయ్య, మేలుదూలంమీది గుజ్జు.

కొమెరె రూ.చూ. కొమర. వి. పెద్ద దూలంమీద పిల్ల దూలాన్ని నిలిపే కొయ్య.

కొంప వి. 1. ఇల్లు. క్రీడా. 265; 2. అల్పగృహం, రామా. 7.7.

క. కొంపె. గుడిసె, చిన్నగ్రామం; తు. కొప్పు. గుడిసె; పో.చూ. త. కుప్పమ్. జాలరులు మొ. వారు నివసించే పల్లె; కుఇ. కుంబు. ఇల్లు; ప్రాం. ఖుంపా. గడ్డితోనేసిన ఇల్లు.

కొంపకునిప్పుపెట్టు స.క్రి. కొంప ముట్టించు, నాశనం చేయు. కొంపకూల్చు స.క్రి. కుటుంబానికి అపాయం కలగజేయు, చెరచు. కొంపగుండమగు అ.క్రి. కొంపగుల్ల అగు, సర్వనాశనమగు. కొంపగుల్లచేయు స.క్రి. కొంపకూల్చు. కొంపగూలు(-కూలు) అ.క్రి. ఇల్లు కూలిపోవు, ఇంటిపని చెడు. కొంపచెఱచు స.క్రి. సర్వనాశనం చేయు. శుక. 3.95. కొంపచెఱుపు వి. కొంప చెరచేవాడు, పలుగాకి, దుష్టుడు. హంస. 5.113. కొంపతీయు రూ. కొంపదీయు. స.క్రి. నాశనంచేయు. కొంపదీయు(-తీయు) రూ.చూ. కొంపతీయు. స.క్రి. నాశనంచేయు. కొంపవట్టేటిలో(గట్టు(-కట్టు) స.క్రి. కూడనిపనిచేయు. కొంపపోవు అ.క్రి. నాశనమొందు. కొంపమీదపడితిను అ.క్రి. ఒకరి ఇంటచేరి వారి తిండితో బతుకు. కొంపముంచు స.క్రి. 1. సర్వనాశనంచేయు; 2. పాడుచేయు; 3. కుటుంబానికి అపాయం కలుగచేయు. కొంపమునిగిపోవు అ.క్రి. జరుగకూడనిది జరుగు. కొంపమునుగు అ.క్రి. పూర్తిగా నాశనమగు. కొంపమ్ముకొను స.క్రి. ఉన్న ఆస్తిపాస్తులను పాడుచేసుకొను. < కొంప + అమ్ముకొను. కొంపలంటుకొను అ.క్రి. విపరీతమైన ఆపదగాని నష్టంగాని కలుగు. <కొంప + -లు + అంటుకొను. కొంపలార్చు స.క్రి. కొంపతీయు, చెరచు. <కొంప + -లు + ఆర్చు. కొంపలార్పు స.క్రి. కొంపలుతీయు, ఇతరుల్ని నాశనం చేయు. కొంప + -లు + ఆర్చు. కొంపలుకాల్చు స.క్రి.

ఇతరుల్ని నాశనంచేయు. కొంపలుముంచు స.క్రి. ఇతరుల్ని నమ్మించి సర్వనాశనంచేయు. కొంపలుముట్టించేకొలివి వి. తగాదాలు పెట్టేరకం మనిషి. కొంపాగోడు వి. ఆస్తిపాస్తులు.

**కొంపాగోడు** చూ. కొంప.

**కొంబి** వి. నారు, వరిమొలకలు.

**కొంపోవు** చూ. కొను.

**కొమ్మ1** రూ. కొమ1. **1.** శాఖ. భార. ఆది. 4.21 ; **2.** కోట గోపురం మొ. వాటి శిఖరం, శృంగం. విక్ర. 7.183 , **3.** చెక్కమీద చెక్కిన తీగ.

క. కొంబు, కొంబె. చెట్టుకొమ్మ ; కొడ. కొబ్. త. కొంపు. కొమ్మ ; మ. కొంపు. కొమ్మ ; కొం. కొయ్మ ; కువి. కోమ ; కొలా. కొమ్.

**కొమ్మచెట్టు** వి. వృక్షవిశేషం (ceropegia tuberosa). **కొమ్మటెంకిమెకము** వి. కోతి. **కొమ్మంట్లు** వి.బ.వ. కొమ్మను అతికించి పెంచిన కొత్త మొక్కలు. <కొమ్మ1 + అంటు + -లు. **కొమ్మతెగులు** వి. మిరపకొమ్మలు ఎండి పోయే తెగులు. **కొమ్మతొక్కు** స.క్రి. కొమ్మంట్లు కట్టు. **కొమ్మత్రిమ్మరి** వి. కోతి, వానరం. అచ్చ.రా.యు. 1.123. వ్యు. కొమ్మలవెంట తిరిగేది. **కొమ్మదాఁటుమెకము** వి. కోతి. వేంక.ఆం. 4.95. **కొమ్మదాసరి** వి. ఊరినడిమి చెట్టెక్కి బిచ్చం కోసం కేకలువేసే ఒక జాతి దాసరివాడు. **కొమ్మపురుగు** వి. కాయధాన్యాల్ని తినే పురుగు. **కొమ్మమెకము** వి. శాఖామృగం, వానరం, కోతి. అచ్చ.రా.కిష్కిం. 8. వ్యు. కొమ్మలమీద ఉండే మృగం. **కొమ్మలుపోవు** రూ.చూ. కొమ్మలువోవు. అ.క్రి. అతిశయిల్లు. **కొమ్మలువోవు** ( - పోవు) రూ. కొమ్మలుపోవు. అ.క్రి. అతిశయిల్లు. నిర్వ.రా. 8.78. **కొమ్మవిడచు** స.క్రి. చెట్లకు కొత్తకొమ్మలు పుట్టు. **కొమ్మవేయు** అ.క్రి. చెట్లకు కొత్తకొమ్మలు తొడుగు. **కొమ్మసాగు** అ.క్రి. కొత్తకొమ్మలు తొడుగు. **కొమ్మెక్కి కూర్చుండు** అ.క్రి. ప్రాధేయపడేకొలది బిగువుచూపు.

**కొమ్మ2** రూ. కొమ2, కోమ2. వి. **1.** ఆడది, స్త్రీ. మను. 6.18 ; **2.** భార్య ; **3.** కన్య.

త. కొంపన్ - అర్. స్త్రీ. మొక్కరెమ్మవలె బలహీన మైనది, కొమ్మై. యువతి, అందం, యువతి వక్షస్థలం ; కొలా. కొమ్మల్, కొమ్మళ్. కూతురు.

**కొమ్మకారుగుల్ల** వి. శంఖశి, ఎరకత్తె, కార్పుడుగత్తె.

**కొమ్మ3** వి. గొరివిచెట్టు, తెల్లనిపూలుపూసే ఒకానొక చెట్టు (Ixora paciflora).

**కొమ్మంటరేవులు** చూ. కొమ్మ1. వి.బ.వ. ఆముగోడల పక్క నుంచి, కొమ్మరేవ వెంబడి అటు ఒకటి ఇటు ఒకటి నందులు వచ్చేలాగ కట్టిన రేవులు.

**కొమ్మవగొల్లిపిండిచెట్టు** వి. పూతికచెట్టు (Basella Cordifolia).

**కొమ్మవగొలిమిడి** వి. మూలఫల.

**కొమ్మవగోర** వి. వృక్షవిశేషం, ఉవల భేదకం, కొండపిండి చెట్టు.

**కొమ్మనఁటి** చూ. కొమ్ము.

**కొమ్మనరఁటి** చూ. కొమ్ము.

**కొమ్మరగొయ్య** ( - కొయ్య) రూ.చూ. కొమరకొయ్య. వి. కొమరగా ఉపయోగించే కఱ్ఱ.

**కొమ్మి1** రూ. కొమి. వి అడవిలో పెరిగే ఒక ఫలవృక్షం, దీని చువ్వలు పౌణక (గాదె) అల్లడానికి ఉపయుక్తం. కళా. 3.69 (Chomelia asiatica).

త.మ. కొమ్మి.

**కొమ్మి2** వి. మత్స్యవిశేషం.

**కొమ్మిసొర** వి. ముఖభాగంలో రంపం వంటి కొమ్ము గల చేప.

**కొమ్మి3** వి. ఎర్రగోరింటచెట్టు మెరిసే ఆకులు కలిగి పొదలాగ పెరిగే ఒక చెట్టు (webera corymbosa).

**కొమ్ము** వి. **1.** పశుశృంగం, విషాణం. భార. ఆది. 7.99 ; **2.** ఏనుగుదంతం. కు.సం. 4.121. **3.** కొమ్మ, వృక్షశాఖ. నిర్వ.రా. 10.71 ; **4.** బలం, సేన. భాగ. 10 పూ. 187 ; **5.** కొమ్ముబూర, వాద్యవిశేషం. భాగ. 10 పూ. 725 ; **6.** ఉత్సాహం. భాగ. 10 పూ. 1144 ; **7.** విల్లు, కావడి మొ. వాటికొన. భీమ. 4.134 ; **8.** చెరువుకొన, కలుజు, మరిగొమ్ము. **9.** శివరా. 3.102 ; **10.** పందికోరం, వరాహ, దంష్ట్ర. పారి. 1.49 ; **11.** బాలచంద్రరేఖలోని రెండు కొనల్లో ఒకటి. కాశ. 3.149 ; **12.** కోట శృంగం, కోట కొమ్మ. మొల్ల. 1.4 ; **13.** సొర మొ. చేపలకు ముఖభాగంలో ఉండే రంపం వంటి అవయవం. దశా. 1.289 ; **14.** పల్లకి మొ. వాటికి ముందు, వెనక ఉండే దండె. రాజ.వి. 2.43 ; **15.** హల్లుకు చేర్చే ఉకారం యొక్క చిహ్నం. అప్ప. 4.49 ; **16.** పర్వతశిఖరం. అచ్చ. రా. యు. 2.41 ; **17.** చర్మకారుడు కొవ్వునుంచుకొనే పాత్ర ; **18.** పనువు మొ. వాటి పొదపైనదంత ; **19.** గొర్లవాడు బండం తగిలించుకోడానికి అమర్చిన వంక కొయ్య ; **20.** కోజేరు వేసినపుడు ఏడికోలకొన అరిగిపోకుండా అతుకు వేసిన కొయ్యముక్క లేదా ఇనపముక్క ; **21.** బండిచక్రంలో నిలువుపట్టె ; **22.** కుమ్మరాములో గోడ చివరి అంచు, కోపు ; **23.** ఇటిక అచ్చును పట్టుకోడానికి పెట్టే పిడి ; **24.** ఊడ్డె తాడు తగిలించి బిర్రుపెట్టే వంగల కొయ్య ; **25.** పడుగుపై పోగులకు కిందిపోగులకు మధ్య నుండి చేత్తో విసిరే, గేదెకొమ్ముతో చేసిననాడి.

క. కొంబు. కొమ్ము, దంతం ; కొడ. కొబ్ -. కొమ్ము, కొమ్మ ; తు. కొంబు. కొమ్ము, చెట్టుకొమ్ము ; త. కొంపు. ఏనుగు దంతం, కొమ్మ, కొమ్ము, గొట్టం, పల్లకి, దండం ; మ. కొంపు. దంతం, కొమ్ము, కొమ్ముబూర ; కొ. కుబ్. కొమ్ముబూర ; కొండ. కొవ. కొమ్మ, కొమ్ము ; కువి. కోము. కొమ్ము, కొమ్మ, కొమ్ము, శృంగం ; కొలా. కొమ్. వృక్షశాఖ, కొమ్ము ; నా. కొమ్మ్. కొమ్ము.

**కొమ్మనఁటి** రూ.చూ. కొమ్మనరఁటి. వి. కొమ్ములవలె ఉండే కాయలుగల అరటి, కదళీ విశేషం. రసిక. 1.64. <కొమ్ము + అనఁటి. **కొమ్మనరఁటి** రూ. కొమ్మనఁటి. వి. కదళీవిశేషం. శృం.నై. 6.139 (Musaparadisiaca). **కొమ్ముఆట** వి. కండెఆట, నేతనేసేటప్పుడు కండె అమర్చిన నాడి కుడి ఎడమలకు వస్తూ పోతూ ఉండటం. కొమ్ముఇగ్గ

న.క్రి. పడుగుపోగులకు మధ్యగుండా పేకదారపు కండెగల నాడి ఒకవైపునుంచి మరొకవైపుకు పారేట్టు చేయు. **కొమ్ముఇనాం** వి. యుద్ధంలో కొమ్ముబూర ఊదిన వారికిచ్చే బహుమతి. **కొమ్ముకదుపు** వి. నాడెగాడి, నాడెలో పేకదారం కండెకు అమర్చేసందు. **కొమ్ముకంది** వి. కందుల్లో ఒకరకం (Candianss indicus). **కొమ్ముకళింగ** వి. చెరువులో ఎక్కువగా ఉన్ననీరు పొర్లిపోవడానికి కట్టకు పల్లంగా ఉన్న చివరకట్టిన రాతి కట్టడం. **కొమ్ముకసింత** వి. ఒకానొక వృక్షం (Carsia Sophera). **కొమ్ముకాకర** వి. ఒకజాతి కాకర, కాకరవెల్లవిశేషం (Memoldia charantia). **కొమ్ముకాచు** అ.క్రి సహాయంగా ఉండు. **కొమ్ముకాటు** వి. పంది. **కొమ్ముకాడు** వి. 1. పంది, వరాహం. సిం. ద్వా. 8.19 ; 2. అగసాలె, కంసాలి. వసు. 1.62 ; 3. కొమ్ము బూర ఊదేవాడు, మాతంగసదృశుడైన ఒక జాతివాడు. ఆం.దా. 2,289. **కొమ్ముకుచ్చులు** వి.బ.వ. ఎద్దుమొగాన వేలాడేట్టు కొమ్ములకు కట్టిన కుచ్చులు. **కొమ్ముకుప్పెలు** రూ. కొంకుప్పెలు, వి.బ.వ. స్త్రీలు జడలో ధరించే ఆభరణ విశేషం. **కొమ్ముకొట్టేగుణం** వి. ఇతరులను మోసంచేసే అలవాటు. **కొమ్ముకొయ్య** వి. నర్సేటప్పుడు బిందె కుండలు మొ. వాటికి పూజలుకొట్టటానికి ఎద్దుకొమ్ముతో చేసిన అచ్చు. **కొమ్ముగజ్జెలు** వి.బ.వ. ఎద్దుకొమ్ములకుకట్టి నొసటి మీదకు పడేట్టు కట్టిన చిరుమువ్వల పట్టెడలు. **కొమ్ముగుడిసె** రూ.చూ. కొమ్ముగొడిసె. వి. 1. గొడ్ల కొమ్ములో పుట్టే వ్రణం ; 2. కొమ్ములో పురుగుపట్టి తొలవడం. **కొమ్ముగురిసె** వి. 1. కొమ్ముగొడిసె, కొమ్ములో పుట్టేవ్రణం ; 2. కొమ్ములో పురుగుపట్టి తొలవడం. **కొమ్ముగొడిసె** రూ. కొమ్ముగుడిసె. వి. 1. గొడ్ల కొమ్ములో పుట్టే వ్రణం ; 2. కొమ్ములు పురుగుపట్టి తొలవడం. **కొమ్ముగొలుసు** వి. 1. కొమ్ముగొడిసె, కొమ్ములో పుట్టే వ్రణం ; 2. కొమ్ములో పురుగుపట్టి తొలవడం. **కొమ్ముచిక్కుడు** వి. తోటల్లోను పెరళ్ళలోనూ పెంచే చిక్కుడుజాతికి చెందిన పైరు (Dolichostypicus). **కొమ్ముచిమ్ము** స.క్రి. పడుగుపోగుల మధ్యగుండా పేకదారపు కండెగల నాడెను ఒక వైపునుంచి మరొకవైపుకు విసురు. **కొమ్ముచీల** వి. ఏడిచీల కొన అతుకు. **కొమ్ముచేప** వి. ఒకానొక ఆరచేప, శృంగి. **కొమ్ముచౌల** రూ.చూ. కొమ్ముచోల. వి. ముఖ భాగంలో రంపంవంటి కొమ్ముగల ఒకరకం బొరచేప. **కొమ్ముచోల** రూ. కొమ్ము చౌల. వి. ముఖభాగంలో రంపంవంటి కొమ్ము ఉన్న చేప. కు.సం. 11,160. **కొమ్ముటుడుము** వి. కొమ్ముగల ఉడుము. మను. 4.53. <కొమ్ము + ఉడుము. **కొమ్ముటేనుగు** వి. మగఏనుగు, పురుషగజం. హర. 3.25. <కొమ్ము + ఏనుగు. **కొమ్ముడొల్ల** వి. 1. కొమ్ముగొడిసె, కొమ్ములో పురుగులుపడి తొలవడం ; 2. ముక్కు వెంబడి సీమ్ము కారడం. **కొమ్ముతేజి** వి. ఎద్దు, వృషభం. పాండు. 1.165. **కొమ్ముదారు (-తాడు)** వి. తోలు, నూలు, వెంట్రుకలు మొ॥ వాటితో పేని కొమ్ములు రెంటికి అడుగువైపున కట్టే తాడు. **కొమ్ముదుక్కి** వి. చాలువెంటచాలు పట్టి దున్నటం. **కొమ్మునాడె** వి. నేతనేసేటప్పుడు పడుగుపై పోగులకు కింది పోగులకు మధ్య పేకదారం కండె అమర్చివేసే పనిముట్టు, గేదెకొమ్ముతో చేయబడిన, చేత్తో విసిరే నాడి. **కొమ్మువగ్గం** వి ఎడ్లకొమ్ములకు మేడికి కలిపికట్టి ఎడ్లను మలపటానికి ఉపయోగించే చేంతాడు. **కొమ్ముపట్టు** అ.క్రి. బాకాఊదు. **కొమ్ముపనస** వి. ఒకరకం పనస. **కొమ్ముపరి** వి. 1. కొమ్ములో పురుగులుపడి తొలవడం ; 2. ముక్కులో సీమ్ము కారడం. **కొమ్ముపారు** అ.క్రి. నేతనేసేటప్పుడు పడుగులో నాడె ఒక వైపునుంచి మరొకవైపుకు వెళ్ళు. **కొమ్ముపాలికాడు** వి. కొమ్ముపాలుకు పనిచేసేవాడు. **కొమ్ముపాలు** వి. ఆసామి ఎద్దులలో తనది ఒక ఎద్దు కలసి సాగుచేసే రైతు పంటలో ఎనిమిదోవంతు తీసుకొనే ఏర్పాటు. **కొమ్ముపాలేరు** వి. కొమ్ము పాలుకు పనిచేసే పాలేరు. **కొమ్ముపురుగు** వి. ఎన్నెమ్మ పురుగు, కొబ్బరిచెట్టు పువ్వుతొలిచి గెలలకు హానిచేసే పురుగు. **కొమ్ముపూస** వి. మరనాడిలో కండెపోగు బయటకి రావడానికి బెజ్జం చేసి బిగించిన గాజుపూస. **కొమ్ముపెండె** వి. గరిసెల మీద అల్లినపెండె. **కొమ్ముపెసర** వి. ఒకజాతి పెసర, సస్యవిశేషం. **కొమ్ముపెసలు** వి.బ.వ. ఒకరకం పెసలు. **కొమ్ముపొట్ల** రూ. కొమ్ముపొళ్ళ. వి. ఒకరకం పొట్ల, కన్యాకుబ్జం. **కొమ్ముపొళ్ళ** రూ.చూ. కొమ్ముపొట్ల. వి. ఒకరకం పొట్ల. **కొమ్ముబీర** వి. వానాకాలంలో పెరళ్ళలోనూ, మెట్టపొలాల్లోను పెంచే ఒకరకం బీర (Luffaacutangula). **కొమ్ముబుడ్డి** వి. పొడవుగా ఉండే ఒకరకం చిచ్చు బుడ్డి, మామిడాకుబుడ్డి. **కొమ్ముబూర** వి. కొమ్ములాగ ఉండే బూర, వాద్యవిశేషం. **కొమ్ముబెండ** వి. పెరళ్ళలోనూ, సారవంతమైన తోటల్లోనూ, పెరిగే బెండజాతిలో ఒకరకం (Hitriscus csulentus). **కొమ్ముమాచకమ్మ** రూ. కొమ్ము మాసకమ్మ. వి. రొమ్ములుగల మాచకమ్మ, స్తనాలు ఉండి రజస్వలకాని స్త్రీ. **కొమ్ముమాదు** వి. ఒకానొక వృక్షం. **కొమ్ముమాద** రూ. కొమ్ముమోద. వి. తలలో పుండు పుట్టి అయిదారు నెలల్లో కొమ్ము వాడిపోవడం. **కొమ్ముమాసకమ్మ** రూ.చూ. కొమ్ముమాచకమ్మ. వి. రొమ్ములున్న మాచ కమ్మ, రొమ్ములుండి రజస్వలకాని స్త్రీ. **కొమ్ముముల్లు** వి. నాడెముల్లు, నాడెలో పేకదారంకండెగుచ్చే ఇనపముల్లు. **కొమ్ముమోద** రూ.చూ. కొమ్ముమాద. వి. తలలో పుండు పుట్టి అయిదారు నెలల్లో కొమ్మువాలిపోవడం. **కొమ్మురేవు** వి. ఆము గోడకు కొమ్ములాగపెట్టిన రంధ్రం. **కొమ్ములక్క** వి. సువాసననిచ్చే ఒకరకం నేపాళం జాతిచెట్టు (Croton aromaticus). **కొమ్ములగొత్తి** వి. 1. అరుదుగా కొమ్ములు మొలిచిన గొర్రె ; 2. అపూర్వవిషయం. **కొమ్ములయురుము (-ఉరుము)** వి. కొమ్ములుగల ఉడుము. మను. 4.53. **కొమ్ములాడు** వి. 1. పంది, అడవిపంది. కకుత్స్థ. 4.77 ; 2. ఏనుగు. **కొమ్ములాడె** వి. కొమ్మునాడె. **కొమ్ములుగలవేలుపు** రూ.చూ. కొమ్ములుగలవేల్పు. వి. విఘ్నేశ్వరుడు. **కొమ్ములుగలవేల్పు** రూ. కొమ్ములుగలవేలుపు. వి. విఘ్నేశ్వ రుడు. రాజ. చ. 1.5. **కొమ్ములుచివ్వు** స.క్రి. పౌరుషాలు ఎక్కించు. **కొమ్ములుచూపి గేదెబేరమాడు** అ.క్రి. విషయం అంతా చెప్పకుండా వ్యవహారం సాగించు. **కొమ్ములుచూపు** రూ.చూ. కొమ్ములునూపు. అ.క్రి. 1. కొమ్ములువేయు ;

2. ఎదిరించు. కొమ్ములుతిరుగు అ.క్రి. గొప్పకీర్తిని సంపాదించు. కొమ్ములుమొలచు అ.క్రి. గొప్పవాడగు, ఆధిక్యం కలుగు. కొమ్ములువచ్చు అ.క్రి. 1. ఆధిక్యం పొందు ; 2. గొప్పవాడగు. కొమ్ములుసూపు (-చూపు) రూ. కొమ్ములు చూపు. అ.క్రి. 1. అలక్ష్యంచేయు. కు.సం. 5.166 ; 2. కొమ్ములు వేయు, పొడవవచ్చు. వి.క్రి. 1.156. కొమ్మువాటు వి. నేతనేసేటప్పుడు పడుగుపై పోగులకు కింది పోగులకు మధ్య పేకదారం వచ్చేటట్లు నాడె వెయ్యటం. కొమ్మువాటుఇగ్గు స.క్రి. వాటులాగు, నేతపడుగులో పేక దారం పడటానికి మరమగ్గం కుచ్చుగుంజు. కొమ్మువాటేయు స.క్రి. వాటేయు, పడుగుపోగుల మధ్యనుంచి పేకదారపు కండెగలనాడె ఒకవైపునుంచి మరొకవైపుకు పోయేట్టుచేయు. <కొమ్ము+వాటు+వేయు. కొమ్ము వాఁడు వి. 1. ఏనుగు ; 2. అడవిపంది ; 3. హరిజనుడు (వ్యు. కొమ్ముబూర ఊదేవాడు). కొమ్మువాలుడు వి. 1. కొమ్మలో పుట్టేవ్రణం ; 2. కొమ్ములో పురుగుపట్టి తొలవడం. కొమ్మునజ్జ వి. 1. ఒకరకం ఆహారధాన్యం (Permisetum typhoidem). కొమ్మునత్తె వి. రాతిపనివాళ్ళువాడే ఒకరకం సుత్తి. కొమ్ము సుద్దులు వి.బ.వ. సంకేతవృత్తాంతాలు. కొమ్ముసెనగ వి. మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు (Cicer arietinum). కొమ్మొరిదానరి వి. ఒకజాతి వైష్ణవుడు.

కొమ్మొరిదానరి చూ. కొమ్ము.

కొమ్మెక్కికూర్చుండు చూ. కొమ్మ[1].

కొమ్మేయు చూ. కొమ్ము. స.క్రి. పడుగుపోగుల మధ్యనుండి పేకదారపు కండె ఒకవైపునుండి మరొకవైపుకు పారేట్టు చేయు.

క్రొమ రూ.చూ. కొమర. వి. పెద్దదూలాలమీద పిల్లదూలాన్ని నిలిపే కొయ్యముక్క, మేలుదూలంమీదిగుజ్జు.

క్రొమాకొట్టు చూ. క్రొమ. వి. కొమరగుజ్జులోని ఒక కొయ్య.

క్రొమె రూ.చూ. కొమర. వి. పెద్దదూలాలమీద పిల్ల దూలాన్ని నిలిపేకొయ్యముక్క.

కొయకర్ర వి. చామలమాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం (Panicum italicuasetanialitalic.)

కొయకాలు రూ.చూ. కొయ్యకాలు. వి. వరి మొ॥ పస్యాల మోడు.

కొయకాలుచోడి వి. నాలుగైదునెలల్లోపండే ఒకరకం ఆహారధాన్యం (Eleusine Cericana Cymosurus Coracanus).

కొయగండ రూ.చూ. కొయ్యకంద. వి. కన్నులు మొ॥ వాటిలో పెరిగే దుర్మాంసం.

కొయగాలు (-కాలు) రూ.చూ. కొయ్యకాలు. వి. 1. కోత కోసినవరి మొ॥ సస్యాలమోడు ; 2. జాతరలోను ఉత్స వాలలోను కాలికికట్టుకొనే కొయ్య.

కొయగూర (-కూర) రూ. కొయిగూర, కొయుగూర, కొయ్య కూర, కొయ్యగూర, కొయ్యిగూర, కొయ్యుగూర. వి. కొయ్యతోటకూర. బహులా. 5.8, హంస. 4.133. (Anaranthus tritris).

కొయతొ వి. ఒకరకం కొడవలి.

కొయపట్టె రూ.చూ. కొయ్యపట్టె. వి. మరమగ్గం నిలువుపట్టెలకు బిగించిన అడ్డపట్టె.

కొయబత్తలు రూ.చూ. కొయంబత్తులు. వి.బ.వ. కోయంబత్తూరు వడ్లు, ఒకరకంవడ్లు.

కొయబత్తులు రూ.చూ. కొయంబత్తులు. వి.బ.వ. కోయంబత్తూరు వడ్లు, ఒకరకంవడ్లు.

కొయంబత్తులు రూ. కొయబత్తలు, కొయబత్తులు, కోయం బొత్తులు. వి.బ.వ. కోయంబత్తూరువడ్లు, ఒకరకంవడ్లు.

కొయంబొత్తులు రూ.చూ. కొయంబత్తులు. వి. కోయంబత్తూరు వడ్లు.

కొయికంద రూ.చూ. కొయ్యకంద. వి. కళ్ళు మొ॥ వాటిలో పెరిగే దుర్మాంసం.

కొయిగూర (-కూర) రూ.చూ. కొయగూర. వి. కొయ్యతోట కూర.

కొయింగ వి. ఒకరకం తెల్లనిచేప.

కొయిదు వి. దున్నగామిగిలినదున్నని భూభాగం.

కొయిదుచాలు వి. చేనులో దున్నగామిగిలిన కోను భాగం. కొయిదుమూర వి. కొయిదుచాలు, చేనులో దున్నగా మిగిలినభాగం.

కొయినా రూ.చూ. క్వైనా. వి. మలేరియాజ్వరానికి ఉప యోగించేమందు.

కొయిలగోపి రూ.చూ. కొయ్యలగోపి. వి. పెడకట్టెమనిషి.

కొయిలమొకిరి వి. పచ్చనిపూలుపూసే ఒకచెట్టు (Wrightia tomentosa).

కొయిలారి వి. కంచినిమొక్క, నల్లని మానుకలిగి అందంగాఉండే పూలుపూసే ఒకమొక్క. (Bauhina Variegata).

కొయుగూర (-కూర) రూ.చూ. కొయగూర. వి. కొయ్యతోట కూర.

కొయుటాకు వి. బిర్రితోటకూర (Anarantus tristis).

కొయ్య వి. 1. మొద్దు, మూర్ఖుడు. భార. ఉద్యో. 2.9 ; 2. కోతకోసినవరి మొ. సస్యాలమోడు. కాశీ. 7.143 ; 3. దంతం, పల్లు. వేంక. పంచ. 3.185 ; 4. కర్ర. దారువు. మను. 4.60 ; 5. స్తంభం, గుంజ ; 6. గొర్రు, గుంటక మొ. వాటిదిండులో మార్చినకొయ్యముక్క ; 7. బెరడు తీసినచెట్టుబోదె ; 8. దూదిఏకేటప్పుడు కమానునరంకొట్టే కొయ్యబడితె.

క. కొఱి, కొఱె, కోఱి. మోడు ; పో.చూ. త. కొయ్యాక్కట్టె. ఒడ మొ. వాటిలో సామానులు కదల కుండా కట్టే కొయ్య ; కుఱ్ఱి. దూలం ; కుత్తి. ముక్క, విభాగం ; మ. కుఱ్ఱి. పొట్టిగాఉన్న ఏదైనవస్తువు, దూలం ముక్క , కుఱుటు. కర్రముక్క ; పర్జి. కొయ్యె. కర్ర వాద్యాన్ని మోగించడానికి ఉపయోగించే కర్ర ; కొయ్యా. నస్యవిశేషం.

కొయ్యకండ రూ. కొయగండ, కొయికంద, కొయ్య గండ. వి. కళ్ళ మొ. వాటిలో పెరిగే దుర్మాంసం. కొయ్యకండె వి. కొయ్యపుల్లమీద లేదా జొన్నకర్ర మీద చుట్టిన పేకదారం. కొయ్యకర్ర వి. ఎన్ను

వేయకుండా ఉండే వరికివచ్చే ఒకరకం తెగులు. **కొయ్యకర్రవడు** స. క్రి. వరికి ఎన్నువేయకుండా చేసే తెగులుపట్టు. **కొయ్యకాటుక** వి. దళంగా అలదినకాటుక. **కొయ్యకాలు** రూ. కొయకాలు, కొయగాలు, కొయ్యగాలు. వి. 1. జొన్నవరి మొ॥ సస్యాలకోయగా మోడు ; 2. జాతరల్లోను, ఇతరఉత్సవాల్లోను కాలికికట్టుకొనే కొయ్య. రామలిం. శ. 58. **కొయ్యకూర** రూ.చూ. కొయగూర. వి. కొయ్యతోటకూర. **కొయ్యకొర్ర** వి. ఎన్నువేయనీకుండాఉండే వరితెగులు. **కొయ్యగండ** రూ.చూ. కొయ్యకండ. వి. కళ్లు మొ. వాటిలోపెరిగే దుర్మాంసం. **కొయ్యగరిటె** వి. అగప. **కొయ్యగాలు (-కాలు)** రూ.చూ. కొయ్యకాలు. వి. జొన్న, వరి మొ. సస్యాలు కోయగా మిగిలిన మోడు. **కొయ్యగుది** వి. పంటిగుది, దోనెగాడిలో బద్దెచువ్వ బిగించడానికి పుల్లకు కట్టిన తాడు. **కొయ్యగూటము** రూ. కొయ్యిగూటాము. వి. 1. దిమ్మసా, 2. ఎదురుదోనెను మోసేకొయ్యగూటం **కొయ్యగూటాము** రూ.చూ. కొయ్యగూటము. వి. 1. దున్నిన మట్టిగడ్డల్ని చితకకొట్టేసాధనం ; 2. ఎదురుదోనెను మోసే కొయ్యగూటం. **కొయ్యగూర (-కూర)** రూ.చూ. కొయగూర. వి. కొయ్యతోటకూర (Anaranthus tritis). **కొయ్యచవుడు** వి.గట్టిగాఉండిఉప్పరిసేచవిటినేల,కట్టెచవుడు. **కొయ్యచిలుకు** వి. కిటికీరెక్కలనుమూసిఉంచే గడియ. **కొయ్యచెక్కు** వి. ఇటికకోతకు, పచ్చిఇటికను చెక్కడానికి ఉనికి వచ్చే కొయ్యకత్తి, కట్టె. **కొయ్యజోడు** వి. బొంత, ద్రుపదం. **కొయ్యతనము** వి. 1. దుష్టచేష్ట, కొంటెపని. కాశీ. 4.94 ; 2. దౌష్ట్యం. పరాహ. 11.76. **కొయ్యతాపి** వి. గరుకుగాఉన్నచోట్ల చదునుచేయడానికి వాడేకర్రతాపి. **కొయ్యతుండు** వి. అచ్చుగావాడే కొయ్యదుంప. **కొయ్యతెడ్డు** వి. 1. కర్రగరిటె ; 2. ఓడతెడ్డు. **కొయ్యతోటకూర** పో.చూ. కొయ్యగూర. వి. కొయుగూర, ఒకరకంతోటకూర. **కొయ్యదిండు** వి. అచ్చుపోసినపెంకును వంచేసాధనం. **కొయ్యదిమ్మిన** వి. కొయ్యగలదిమ్మన. **కొయ్యద్ద** వి. పొడవుగా లావుగాఉండేపాత్ర. **కొయ్యద్రిమ్మ (-త్రిమ్మ)** వి. దుష్టుడు, అడిబండ. **కొయ్యనగాడు** వి. మూఢుడు. బసవ. 5పు. 91 పం. **కొయ్యపట్టె** రూ. కొయపట్టె. వి. మేరువపలక, మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు బిగించిన అడ్డపట్టె. **కొయ్యపార** వి. కర్రలోపారరేకు కుసిదిగవేసిన సెలగ. **కొయ్యపిప్పలి** వి. కొమ్మలుదట్టంగాఉండే ఒకచెట్టు (Anthro cenemum iadicum). **కొయ్యబండ** వి. ఇటికమందానికి అచ్చు మధ్యలో వేసేకొయ్యముక్క. **కొయ్యబొడ్డె** వి. దుంపఎండిపోయే వరితెగులు. **కొయ్యముట్టు** వి. విత్తనాలు పడటానికి గొర్రుచెక్కలకు వేసినబెజ్జం, **కొయ్యమెట్టు** వి. కర్రలతో కట్టినమెట్టు. **కొయ్యమేకు** వి. కర్రలతో చేసిన చీల. **కొయ్యబారు** అ.క్రి. కర్రవలెఅగు. **కొయ్యరోగము** వి. మిర్చికిపట్టేఒకరకం తెగులు. **కొయ్యరోలు** వి. రోలుగా వాడే కొయ్యదిమ్మ. **కొయ్యలగోపి** రూ. కొయిలగోపి. వి. 1. ప్రౌఢాంగన ; 2. పెడకట్టెమనిషి. **కొయ్యలాను** వి. ఒకరకంలాను, చేతిలాను.

**కొయ్యలపూటీ** వి. గొడ్లుఈని బలహీనమైనప్పటిస్థితి.

**కొయ్యాపండు** రూ.చూ. గొయ్యాపండు. వి. జామిపండు.

**కొయ్యిగూర (-కూర)** రూ.చూ. కొయగూర. వి. కొయ్యతోటకూర.

**కొయ్యుగూర (-కూర)** రూ.చూ. కొయగూర. వి. నల్లతోటకూర.

**కొరక** వి. చీకటినేల, దున్ననినేల.

**కొరకచ్చు** రూ.చూ. కొఱకచ్చు. వి. సగంకాలినకట్టె.

**కొరకంచు** రూ.చూ. కొఱకచ్చు. వి. సగంకాలిన కట్టె.

**కొరకాసువెట్టు(-పెట్టు)** స.క్రి. మండించు. పీడించు.

**-కొరకు** రూ.చూ. -కొఱకు. ప్రత్య.ప్రదు. కోసం నిమిత్తం.

**కొరకూత** వి. వయసువచ్చిన కోడిపుంజు కూసేకూత.

**కొరకొరచూచు** స.క్రి. కోపంగాచూచు.

**కొరకొరమను** అ.క్రి. చెలరేగు. సారంగ. 3.127.

**కొరకొరలాడు** అ.క్రి. కోపంతో చిరచిరలాడు.

**కొరంగి** వి. ఏలకిచెట్టు మందులలోను, సుగంధ ద్రవ్యంగాను ఉపయోగించే కాయలుకాసే చెట్టు (Elettaria Canda momuns).

**కొరచోడి** వి. నాలుగైదు నెలల్లో పండే ఒకరకం ఆహారధాన్యం (Elusine Coracane Cynosurus Colocunus).

**కొరజా** చూ. కొంజా. వి. వాకిటి అవల ఉన్నఇల్లు.

**కొరట** వి. రాగి గింజలు కొట్టి పిండివేసి రాచిన నీళ్ళు, పశువుల ఆహారం.

**కొరడబండ** వి. దర్వాజా చట్టంకింద, బేసుమెంటుపైన గడపగా వేసే రాయి.

**కొరటుబండి** వి. సివంగుల్ని తెచ్చేబండి. ఉదయనోదయము 3.73.

**కొరడా** వి. చబుకు, జాటి, తరటు, కక్కసం. పశువుల్ని తోలడానికి ఉపయోగించే సాధనం. అహల్యా. 1.100.

మరా. కొరడా, కోర్డా, కోడా. ఉత్తేజం కలిగించే పలుకు.

క. కొరడా, కొఱడె, కోఱాడి, కోఱడె ; తు. కొరెజా. త. కుఱటా, కొఱటా ; మ. కోఱటా ; మాల్తో. కొర్త.

<మరా. కోర్డా.

**కొరడాకర్ర** వి. అచ్చుపోసిన పచ్చిపెంకును పెంచే సాధనం.

**కొరడు**[1] వి. 1. వంకరగా కాక తిన్నగాఉన్న ఇంద్రధనుస్సు, రోహితం. మైరా. 2.4.

క. కొరడు, కొడ్డ. రోహితం ; పో.చూ.త. కురుతి. ఎరుపురంగు ; పో.చూ.మ. కురుతి. రక్తం.

**కొరడు**[2] వి. 1. పక్షి విశేషం, గుడ్లగూబ. సుద. 3.194.

పో.చూ. త. కురంటుమ్. గుడ్లగూబ ;

బహుశః సం. కారండవ-. పక్షివిశేషం, ఒకరకం బాతు కావచ్చు.

**కొరడు**[3] వి. మత్స్యవిశేషం.

**కొరడుపాఱు** స.క్రి. తిమురుపట్టు.

**కొరణ** వి. సింధూరం, పసుపు, ముదురు ఎరుపు రంగులలో పూలుపూసే ఒకచెట్టు (Ixoraoceinea).

కొరత వి. క్రొరునగుచ్చి చంపటం.
కొరద[1] వి. మత్స్యవిశేషం. వేంక. పంచ. 1.294.
పో.చూ త. కుఱవై. (Ophiocaphaluspunctatus).
కొరద[2] వి. దున్ననినేల.
కొరదా చూ. కురదా. విఐ. మిగిలిన, శేషించిన.
కొరన చూ. కొరద వి. దున్నని నేల.
కొరనానిగండు రూ.చూ. కొరసానిగండు. వి. క్రూర మృగ విశేషం, దుమ్ములగొండి.
కొరమ వి. చీకినేల, కొరక.
కొరమ్నగడ్డి వి. ఒకజాతి గడ్డిమొక్క (Bracn'ria Distachya).
కొరందము రూ.చూ. కొరివిందము. వి. కురివిందం.
కొరవడము రూ. కొర్వడము. వి. దువ్వటి.
కొరవనికొయ్య వి. పనికిరానివాడు, దుర్మార్గుడు.
కొరవము రూ.చూ. కొఅవము. వి. గుర్రాన్ని తోలే సాధన విశేషం.
కొరమద్ది వి. వెర్రికరకచెట్టు, గృహనిర్మాణాదులకు పనికివచ్చే మాను (Bridelia Retusa).
కొరమాను వి. వెర్రికరకచెట్టు, గృహనిర్మాణాదులకు పనికివచ్చే మాను కలిగిన ఒకచెట్టు. (Bredelia Retusa).
కొరమాలు అ.క్రి. పనికిమాలు. బాళ్ళ. నం. 6.61.
కొరమీను వి. నల్లగాఉండే ఒకరకం చెరువునీటి చేప.
కొరలు రూ. కొఅలు. అ.క్రి. 1. ప్రకాశించు. కు.నం. 8.124 ; 2. కోపించు. కు.సం. 12.116.
త. కుఱు, కుఱులెనల్. కోపంతో బుసకొట్టు, ఆందోళనచెందు, అసంతృప్తితో నిట్టూర్చు.
కొరవ[1] వి. ఒకానొక కొండజాతి. నెల్లూరు శాసనం. పొదిలి 2.
కొరవ[2] విఐ. మిగిలిన, తరువాయి.
కొరవసరవ విఐ. మిగిలిన, తరువాయి.
కొరవంజి వి. 1. ఎరుక స్త్రీ. శుక. 1.17 ; 2. ఎరుకవాడు. చంద్రాంగ. 2.90 ; 3. ఎరుకల నాట్యం, నాట్యవిశేషం. దశా. 7. 1.288.
క. కొఱవంజి. ఎరుకస్త్రీ ; కొడ. కురుబె. గొర్రెల కాపరి ; పో.చూ.త. కొరాజి, కొరజి. పాములు పట్టేవాడు, కోతుల్ని ఆడించేవాడు ; కుఱవంచి. కురవజాతి స్త్రీ, ఎరుక స్త్రీ, నాట్యకావ్య విశేషం, కుఱత్తి. కొండజాతి స్త్రీ ; కుఱమ్. కురవజాతి, వంచి స్త్రీ. మ. కుఱవన్. సంచార జాతి, పాములుపట్టే జాతి ; తొ. కుర్వ్. నీలగిరి కొండల్లోని కురుంబ జాతివాడు.
కొరవడు(-వడు) చూ. కొరవ[2]. అ.క్రి. మిగిలిపోవు.
కొరవి చూ. క్రోవి[1]. వి. 1. ఎర్రగోరింట, కురవకం. కాశీ. 1.138 ; 2. తెల్లని, గట్టి మానుకలిగిన ఒకచెట్టు, కడిమి (Molinoea Canscens).
సం. కురవక- ; ప్రా. కురవయ ; పా. రత్తకురవక- ; సిం. కరవు. (Phyllanthus indicus).
<ప్రా. కురవయ-.
కొరవికారము వి. మిరపపళ్ళు చింతపండులోచేర్చి తొక్కిపెట్టిన ఊరగాయ.
కొరవితాల్పు వి. 1. దయ్యం ; 2. సోకుడు ; 3. ఎత్తు.
కొరవిపాల వి. కొరవిచెట్టు, తెల్లని పూలుపూసే ఒకచెట్టు (Ixo!aparvflora).
కొరవిమచ్చ రూ.చూ. కొరివిమచ్చ. వి. ఒంటిమీద ఎక్కడైనా కాల్చినట్టు నల్లగా ఉండేమచ్చ, అగ్గిమచ్చ.
కొరసవ వి. బొమ్మమేడి, అల్పంగా ఉండే ఒకచెట్టు (Ficus Hispida).
కొరసలు వి. బ. వ. ఉప్పు వర్తకులు.
కొరసానిగండు రూ. కొరనానిగండు, కొర్నానిగండు. వి. దుమ్ములగొండి.
కొరి[1] వి. రెప్పనడిమి వెంట్రుక.
కొరి[2] రూ. కొరింగి. వి. గొరివిచెట్టు తెల్లని పూలుపూసే ఒక రకం చెట్టు. (Ixoraparviflora).
క. కొర్గి ; త. కొరివి ;
కొరికవేయు స.క్రి. ఆములో కుండల పేర్పులో ఖాళీవచ్చిన చోట అటూ ఇటూ కదలకుండా అడ్డువేసి అమర్చు.
కొరికి వి. తెల్లనికంకి, నల్లని విత్తనాలు కలిగి జనపమొక్కలాగ ఉండే ఒక కలుపుమొక్క (Chrozophola rottleri).
కొరిగె రూ.చూ. గొరిజ[1]. వి. డెక్క.
కొరింగి రూ.చూ. కొరి[2]. వి. గొరివిచెట్టు.
కొరిచెవాఁడు రూ. కొరిజెవాఁడు. వి. 1. అడవిమనిషి, చండాలుడు, పర్వతీయుడు ; 2. నూలు సరిచేయడానికి ఉపయోగపడే కుంచెలు తయారుచేసే తెగ, ఎరుకలజాతివాడు.
కొరిజె[1] రూ.చూ. గొరిజ1. వి. గొరిసె, గుర్రపు డెక్క.
కొరిజె[2] వి. పొలిమేర.
కొరిటిచెట్టు వి. దయముల్లచెట్టు, ముళ్ళుకలిగి, పాలవంటి ద్రవం కారే ఒకచెట్టు (Pucospermum Spinosum).
కొరిత వి. బండకొయ్య లేదా బొండకొయ్య.
కొరింత రూ.చూ. కొరింద[1]. వి. ఒకానొక తీగ.
కొరింతకొలి వి. ముదురు ఎరుపురంగు పూలు పూసే ముళ్ళు కలిగిన ఒకచెట్టు (Mimosa rubicaulis).
కొరింద[1] రూ. కొరింత. వి. పచ్చనిపూలు, ఎర్రని కాయలు కాసే ముళ్ళుకలిగిన ఒకతీగ (Pterolcpium indicum)
కొరింద[2] వి. పెద్దపెద్ద ఆకులు, ముళ్ళూ ఉండే ఒకతీగ (Acacia Caesia).
కొరివి చూ. కొరివి[2]. వి. తెల్లగాఉండే గట్టి మానుకలిగిన ఒక చెట్టు (Hemigyrosa Cansocens).
కొరివం వి. ఒకరకం అంచు.
కొరిపె వి. ఒకజాతి చేప, మత్స్య విశేషం.
కొరిమి వి. కర్ణికారజాతికి చెందిన ఒకచెట్టు (Webera Corymbosa).
కొరిమిడి వి. ఒకరకంచెట్టు, వృక్షవిశేషం (Barleri alongifolia).
కొరిమిపల వి. కొడగచెట్టు, తెల్లనిమాను కలిగి, తెల్లని పూలు పూసే ఒకచెట్టు, దీనికర్ర చెక్కడపు పనులకు ఉపయుక్తం (Holarrhena antydysenterica).
కొరిమిపాల వి. తెల్లనిపూలు పూసే ఒకచెట్టు, దీనికర్రలు దివిటీ

క్రలకు ఉపయుక్తం.

కొరివాకు వి. ఆముపడుగులో పరచడానికి వాడే ఒకరకం ఆకు.

కొరివి[1] రూ.చూ. కొఱవి. వి. కొరకంచు, అలాతం,ఉల్మకం.

కొరివికంకి రూ.చూ. కొఱవికంకి. వి. కంకిబదులు కాడబయటకి వచ్చేవరి తెగులు. కొరివితెగులు రూ.చూ. కొఱవి తెగులు. వి. వరి, మొ. పంటలకు పైరు నల్లబడిపోయే తెగులు. కొరివిమచ్చ రూ. కొరవిమచ్చ. వి. ఒంటిమీద ఎక్కడైనా కాల్చినట్లు నల్లగా ఉండేమచ్చ, అగ్గిమచ్చ.

కొరివి[2] రూ.చూ. కొఱివి. వి. ఒకరకం చెట్టు.

కొరివిందము రూ. కొరందము. వి. కురింజరాయి.

కొరిశెవాఁడు రూ.చూ. కొరిచెవాఁడు. వి. అడవిమనిషి, పర్వతీయుడు.

కొరిసి రూ.చూ. కొరై. వి. ఇంటిస్తంభాలు మొ॥ వాటికి తీగ, మాను ఉపయోగపడే ఒకచెట్టు.

కొరుకు[1] వి. కాలిన కర్రముక్క.

కొరుకు[2] వి. 1. ఆములో కుండల వరసలమధ్య ఉండేస్థలం ; 2. రాళ్ళవరసలమధ్య ఉండేస్థలం.

కొరుకుడు వి. 1. పేనుకొరికి పడెలు పడెలుగా దూడలకు బొచ్చు ఊడిపోయే తెగులు ; 2. గోడలోకి బొనిపిన దంకలు మొ॥ వాటికి రంగువేయకపోవడం వల్ల కాల క్రమాన వచ్చే చారల్లాంటి గుంటలు.

కొరుకుడుతీగ వి. తేతబూడిదరంగులో ఉండే ఒకరకం లతా విశేషం (Opilia amentacea).

కొరుకుబూసి వి. చిత్రికచెట్టు, చిన్నచిన్న పూలుపూసే ఒకరకం చెట్టు (Protium Serratum).

కొరుట్రాయి వి. ఇంటినేలమీద పరిచే పలచనిరాయి.

కొరుడుమొద్దు వి. నీటిపారుదల అవసరం లేనప్పుడు తూముకు అడ్డంగా వేసే కొయ్యమొద్దు.

కొరుడురాయి వి. రాతిస్తంభాల కింద ఆధారంగాను, అలంకారానికి పెట్టే మలచిన పీట.

కొరువేల వి. మట్టినేల, మిద్దె, మెరక. నెల్లూరుశాసనం క్రీ.శ. 1814 నం.

కొరై రూ. కొరిసి. వి. ఇంటిస్తంభాలకు దడి మొ॥ వాటికిమాను ఉపయోగపడే ఒకచెట్టు (Cleistanthus Collinus).

కొర్కు రూ.చూ. -కొఱకు. ప్రత్యయం. చతుర్థీ విభక్తి ప్రత్యయం. పండి.చ. 5.54-12.

కొర్ణ రూ. కొర్న. వి. దుమ్ములగొండి.

కొర్త రూ.చూ. కొఱఁత. వి. లోటు. పార్వ. 2.99.

కొర్ద వి. ఒకరకం పెద్దచేప.

కొర్న రూ.చూ. కొర్ణ. వి. దుమ్ములగొండి, క్రూరమృగ విశేషం.

కొర్నపోతు వి. దుమ్ములగొండి, క్రూరమృగ విశేషం. కొర్నవగండు వి. దుమ్ములగొండి, క్రూరమృగ విశేషం. కాళ. 3.48.

కొర్నాసిగండు రూ.చూ. కొరసానిగండు. వి.దుమ్ములగొండి, క్రూరమృగ విశేషం.

కొర్ని రూ. కొర్పు. వి. బీటినేల, కంచె.

కొర్పు రూ.చూ. కొర్ని. బీటినేల, కంచె.

కొర్పుభూమి వి. 1. సరిగావండక వదిలివేసిన కొలుభూమి : 2. రాజీనామా ఇచ్చిన శివాలుజమా.

కొర్పడము రూ.చూ. కొరపడము. వి. దుప్పటి.

కొర్పుతీగ వి. తిప్పతీగ, మొదట కాగితంలాగ, తర్వాత బెండులాగ ఉండి బెరడు కలిగి పచ్చని పూలుపూసే ఒకతీగ (Tirrospoa cordifolia).

కొర్ర వి. చామల మాదిరిగా ఉండే ఒకరకం ఆహారధాన్యం (Panicumitalicum Sentaricaitalica).

కొర్రబంతి వి. కళ్ళం తడిపి గట్టి పడేట్టు తొక్కించటానికి కట్టినబంతి లేదా ఎడ్లవరస.

కొర్రు వి. 1. కొరడు, ఇంద్ర ధనుస్సు : 2. కొయ్యముక్క.

కొర్రుదున్నకం వి. మొదటిసారి దున్నకం, మొదటిచాలు.

కొర్వికోల రూ.చూ. కొఱవికోల. వి. ఆగ్నేయాస్త్రం, చిచ్చమ్ము. పి. శకు. 3.169.

కొర్సె చూ. కొరై. వి. ఇంటిస్తంభాలకు మొ. వాటికి మాను ఉపయోగపడే ఒకచెట్టు (Cleistanthus Collinus).

కొఱ[1] పో.చూ. కుఱు, కుట్టు. వి. 1. శేషం, మిగులు. ఉ. హరి. 4.272 ; 2. లోపం. ఆం.భా. 3.46 ; 3. న్యూనత. విశే. చిన్న, తక్కువైన, అల్పమైన. వరాహ. 5.115. ప్రబోధ. 5.18.

క. కొఱె. లఘుత్వం, అల్పత్వం, లోటు, శేషం ; తు. కొఱ ; త. కుఱై. లోటు, శేషం ; కుఱు. చిన్న ; కుఱైవు. లోటు, చిన్నమొత్తం, లేమి ; మ. కుఱ. లోపం, అవమానం.

కొఱతలఁచు స.క్రి. చెడుగాతలంచు, తప్పుగా భావించు. సానంద. 2.86. కొఱనవ్వు వి. చిరునవ్వు, మందహాసం. బహుళా. 5.52. త. కుఱునకై. మందహాసం. కొఱనెల వి. బాలచంద్రుడు. కు.సం. 3.63, నవనాథ. 2.79 పు. కొఱనెలకూపు వి. నెలవంక ఆకారంలో బాణం, అర్ధ చంద్ర బాణం. పారి. 5.31. కొఱనోము వి. ఉపయోగం లేనినోము. కొఱనోమునోచు అ.క్రి. తక్కువపుణ్యం చేయు. కొఱపోవు రూ.చూ. కొఱపోవు. అ.క్రి. దిల్లపోవు, సత్వహీనమగు, కొఱప్రాణము వి. కొనఊపిరి. కుట్టుసురు. రం.రా.ఉ. 77, పు. 12 పం. కొఱప్రాణులు వి బ.వ. కొనఊపిరిగలవారు. కు.సం. 11.128. కొఱముట్టు వి. పనిముట్టు. ఉపకరణం. క. కొరముట్టు. కొఱయిండ్లు (-ఇండ్లు) వి.బ.వ. మిగిలిన ఇళ్ళు, కోమట్లుండే ఇళ్ళు కాక మిగిలిన ఇళ్ళు. ద. హిం.శా. సంపు. 7 శా. సం. 737. క్రీ.శ. 1248. కొఱయిల్లు (-ఇల్లు) రూ. కొఱిల్లు. వి. నిర్మాణం పూర్తికానిఇల్లు. కొఱవోవు (-పోవు) రూ. కొఱపోవు. అ.క్రి. దిల్లపోవు, సత్వహీనమగు. భార. అశ్వ. 2.22. కొఱనంది వి. ఆయం, జీవస్థానం. నిర్వ.రా. 10.29. కొఱిల్లు రూ.చూ. కొఱయిల్లు. వి. నిర్మాణం పూర్తికానిఇల్లు.

కొఱ[2] విశే. 1. మనోహరమైన, అర్హమైన, యుక్తమైన. భార. సభా. 2.190 ; 2. సమర్థమైన, చాలిన. భార. విరా. 3.150 ; 3. ప్రయోజనకరమైన, ఉపయోగకరమైన. పరమ. 3.247 ; 4. శ్రేయస్కరమైన. వరాహ. 11.57.

వి. **1.** వ్యాపారం, చేష్ట. ద్వి. హరిశ్చ. ఉ. 68పం ; **2.** పని. అప్ప. 2.197 ; **3.** శ్రేయస్సు, మంచి, మేలు. సారంగ. 2.133 ; 4. అందం, ఒప్పిదం. అచ్చ.రా. అయో. 119 ; 5. ప్రయోజనం.

త. కుఱై. ఇవ్వదగిన, చేయదగిన వ్యాపారం.

**కొఱగానిది** (-కావిది) విఱ. పనికిమాలిన. **కొఱగాని వాఁడు** (-కావివాఁడు) విఱ. అప్రయోజకుడైన. ఆం. భా. 2.27. **కొఱగామి** (-కామి) వి. **1.** దోషం, లోపం, తప్పు, నేరం. భార. ఉద్యో. 2.21 ; **2.** దౌష్ట్యం, చెడ్డతనం. భార. ఉద్యో. 3.237 ; **3.** అకార్యం, దుష్టకృత్యం, చెడ్డపని, కొంటెచేష్ట. భార. అశ్వ. 4.47 ; **4.** అప్రయోజకత్వం, పనికిమాలినతనం. సు.శ. 41 ; **5.** దుర్నిమిత్తం, దుశ్శకునం, మను. 4.62 ; **6.** అపాయం, హాని, విపత్తు. ప్రభా. 4.22. **కొఱపనికొయ్య** వి. పనికిరానివాడు. **కొఱమాలు** అ.క్రి. **1**. పనికిమాలినదగు. నిరుపయోగమగు. భాగ. 10 పూ. 94 ; **2**. వికృతమగు. కాశీ. 3.138 ; **3**. నీచమగు. నీలా.13.

**కొఱ[3]** రూ.చూ. కొఱ్ఱు[2]. వి. సహస్రదంష్ట్రం, వెయ్యి దంతాలు గల చేప, పాఠీనం. ఆం. భా. 1.160.

**కొఱచేఁప** రూ.చూ. కొఱ్ఱుచేఁప. వి. కొరమీను. **కొఱమట్ట** రూ.చూ. కొఱ్ఱుమట్ట. వి. కొరమీను. **కొఱమీను** రూ.చూ. కొఱ్ఱుమీను. వి. కొరచేప.

**కొఱ[4]** వి. **1.** వికారం, ద్వి. హరిశ్చ. 463 పం ; **2.** అపరాధం. సానంద. 2.86 ; **3.** కోపాదులలో వచ్చే ఊర్పులలో కలిసేధ్వని.

త. కొఱు-కొఱ్-ఎనాల్. గొంతులో కలిగే గడగడ ధ్వని ; కొఱు-కొఱుల్, కొఱుకొఱుప్పు. కోపాదులలో కలిగేధ్వని ; కుఱుకుఱుత్తు, కుఱుకుఱుప్పు. అసంతృప్తితో రణగొణధ్వని చేయు, గుసగుసలాడు, చెవి మొ. వాటిలో కలిగేదురద.

**కొఱకొఱ** వి. **1** కొఱకొఱగలవాడు. హరి.ఉ. 8.19 ; **2**. విరోధం, ద్వేషం. ప్రబోధ. 2.48 ; **3**. కోపం. అచ్చ రా. బాల. 82; **4**. కోపాదులలో ఊర్పులవల్ల కలిగేధ్వనికి అనుకరణం. **కొఱకొఱచూచు** రూ. కొరకొరచూచు. స.క్రి. కోపంతోచూచు. **కొఱకొఱలాడు** రూ. కొరకొరలాడు. అ.క్రి. చిరాకుపడు, విసుగుకొను. రసిక. 5.163. త. కొఱుకొఱు-వెనుల్. కోపసూచకధ్వని.

**కొఱకచ్చు** రూ. కొరకచ్చు, కొరకంచు, కొఱకంచు. వి. కొరవి, అలాతం, ఉల్ముకం. రామాభ్యు. 2.94.

క. కొఱుకొళ్లి. కొరకంచు. త. కుఱైక్కొళ్లి ; మ. కుఱుకొళ్లి. తోకచుక్క, ఉల్క ; కొం. కఱొమ్. అలాతం.

**కొఱకంచు** రూ.చూ. కొఱకచ్చు. వి. అలాతం, ఉల్ముకం. కొరవి.

**కొఱకరానికొయ్య** రూ.చూ.కొఱుకరానికొయ్య. వి.**1**. మూర్ఖుడు; **2**. అసాధ్యం.

**-కొఱకు** రూ. -కొరకు-, కొఱ్కు. ప్రత్య.ద్రు. **1**. కై, కోసం. భార.అరణ్య. 7.157; **2**. సంప్రదానార్థకం. దశా. 1.242.

క. కఱై-.లోపం ; త. కుఱై. వేడికోలు, కోరిక, సిద్ధి ; మ. కుఱ. కోరిక.

<కొఱ[2] + -కు.

**కొఱకులతెరువులపట్టించు** స.క్రి. అడవులపాలుచేయు, తరిమివేయు.

**కొఱఁకు** రూ.చూ. కొఱను. వి. **1.** బీడు. ఆం.భా. 2.6 ; **2.** పక్షులు ఏరి తినే చోటు.

**కొఱడి** వి. ఆవరణగా వేసినపొడిమట్టిగోడ.

**కొఱడు** వి. ఔ. **1.** మానిమోడు. పండి.చ. పురా. 158 ; **2**. మూర్ఖుడు. ఉ.హరి. 4.106 ; **3**. స్తంభం. కాశీ. 1.138 ; **4**. ఆయుధవిశేషం, కొఱడుకోల. కళా. 8.99 ; **5**. ఇంద్రధనుస్సు.

క. కొడ్డకొంటు, కొరడు, కొఱడు, మానిమోడు, దూలం ; కొడ. కుడ్. తలుపుకమ్మి, దూలం, దుడ్డుకర్ర ; తు. కొరడు, దూలం, మానిమోడు ; త. కుఱటు, దూలం, కర్రముక్క, పట్టుకారు ; మ. కురటు, కుఱటు, కర్రముక్క , తొ. కుడ్. పెద్దకర్ర, దుడ్డుకర్ర.

**కొఱడుకోల** వి. ఆయుధవిశేషం, కొరడు. చంద్రాంగ. 2.95. **కొఱడుపడు** రూ.చూ. కొఱడువడు. అ.క్రి. మాన్పడు, నిశ్చేష్టమగు. **కొఱడుపాఱు** అ.క్రి. కొయ్యబారు, చైతన్యహీనమగు. **కొఱడుపోవు** అ.క్రి. మాన్పడు, నిశ్చేష్టమగు. **కొఱడువడు** (-వడు) రూ. కొఱడుపడు. అ.క్రి. మాన్పడు, నిశ్చేష్టమగు. అప్ప. 2.197.

**కొఱతి** రూ.చూ. కొఱవత. వి. కొండజాతిస్త్రీ.

**కొఱదల** (-తల) విఱ. తక్కువైన, మిగిలిపోయిన.

**కొఱను** రూ. కొఱఁకు. వి. ఔ. **1**. దున్నకుండా పశువుల మేతకై విడిచిపెట్టిననేల, బీడు. ఉ.హరి. 1.129 ; **2**. అడవి, చెలిక ; **3**. పక్షులు ఎరఏరుకునితినే చోటు.

పో.చూ. త. కుఱుంకాటు. చిన్నఅడవి.

**కొఱఁత** చూ. కొఱ[1]. రూ. కొర్త. వి. **1**. తక్కువ, లోపం. భార. విరా. 1.253 ; **2**. దోషం, తప్పు. భార. ఉద్యో. 4.186 ; **3**. శేషం, మిగిలినభాగం. భార.విరా. 1.313 ; **4**. అవమానం, అగౌరవం. విప్ర. 4.49. విఱ. **1**. తక్కువైన. భార. కర్ణ. 3.321 ; **2**. మిగిలిన, శేషించిన. దశకు. 6.127 ; **3** న్యూనమైన, అల్పమైన. దశా. 2.190.

క. కుఱు. చిన్నతనం. కొఱతె, కొఱంతె. న్యూనత చెందు, లోటు, కోరిక, నష్టం, లోపం, తప్పు ; కొడ. కొరవు, కొరు. లోపం, న్యూనత్వం ; తు. కొరతె. దోషం, కోరిక ; త. కుఱైచ్చల్. లోపం, అరుదు, తగ్గింపు, అపకీర్తి, తృణీకరణం ; మ. కుఱచ్చల్. కోరిక, అరుదు.

**కొఱఁతపడు** యా. కొఱఁతపడు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు, హీనమగు. **కొఱఁతపఱచు** రూ. కొఱఁతపఱచు, కొఱఁతవఱచు. స.క్రి. తక్కువపరచు, న్యూనపరచు. విష్ణు పు. 2.196. **కొఱఁతవఱచు** రూ.చూ. కొఱతపఱచు. స.క్రి. **1**. తక్కువచేయు ; **2**. దాచు. **కొఱఁతవల్కు** స.క్రి. ఉదాసీనంగా మాట్లాడు, నీచంగామాట్లాడు. ఆము. 2.40. **కొఱఁతపాటు** వి. న్యూనత్వం, తక్కువతనం, లోపం.

**కొఱఁతపెట్టు** రూ.చూ. కొఱఁతపెట్టు. స.క్రి. దాచు, వదలు, మరుగుపరుచు, మిగుల్చు. ప్రభా. 1.117. **కొఱఁతపోవు** రూ.చూ. కొఱఁతపోవు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు. **కొఱఁతపడు (-వడు)** రూ.చూ. కొఱఁతపడు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు, హీనమగు. **కొఱఁతపఱచు (-పఱచు)** రూ.చూ. కొఱత పఱచు. స.క్రి. తక్కువపఱచు, న్యూనపరచు. **కొఱఁతవెట్టు (-పెట్టు)** రూ. కొఱఁతపెట్టు. స.క్రి. దాచు, మరుగుపరుచు, మిగుల్చు. భార. విరా. 4.134. **కొఱఁతవోవు (-పోవు)** రూ. కొఱఁతపోవు. అ.క్రి. తక్కువపడు, న్యూనమగు. శుక. 2.144.

**కొఱపట్టతీగ** వి. తిప్పతీగ, మొదటకాగితంలాగ తర్వాత బెండులాగ ఉండేబెరడూ, నూగుతేనిఆకులుకలిగి పచ్చని పూలు పూసే ఒకతీగ (Timospora Cordfolia).

**కొఱపము** రూ.చూ. గొఱపము. వి. గుర్రాలను తోమేసాధనవిశేషం. హంస. 5.41.

**కొఱయు** అ.క్రి. పొలకమారు.

**కొఱలాడు** చూ. కొఱలు.

**కొఱలు** రూ.చూ. కొరలు. అ.క్రి. 1. ఒప్పు. పండి.చ. 3.198 పు. ; 2. కోపించు, రోషించు. భార. స్త్రీ. 2.87 ; 3. అతిశయించు, మించు. భాగ. 6.440 ; 4. ఉండు, వసించు. రామాభ్యు. 5.65 ; 5. నిండు, పూర్ణమగు. అప్ప. 2.197 ; 6. వెలుగు, ప్రకాశించు. అచ్చ. రా. అయో. 13; స.క్రి. 1. కోరు, అభిలషించు. భార. విరా. 1.116; 2. పొందు, పడయు, భార. అను. 5.353 ; 3. కామించు, వలచు. హరి. ఉ. 2.116.

**కొఱలాడు** అ.క్రి. కోపంతోఉండు ; స.క్రి. కోపంతో చూచు. **కొఱలుకొను** అ.క్రి. శోభించు, ఒప్పు. కవిక. 4.197.

**కొఱవ** వి. ఒకానొక కొండజాతి.

క. కొఱయ, కొఱవ. చాపలు, తట్టలుఅమ్ముకునే ఒక జాతి ; కొడ. కురుబె. గొఱ్ఱెలకాపరి ; తు. కొరగ. మాంసభక్షకులైన ఒకజాతి ; త. కుఱవన్. కొండజాతివాడు ; కుఱమ్. కురవజాతి ; మ. కుఱవన్. పాములు పట్టే ఒకజాతి, చాపలల్లేఒకజాతి : తో. కుర్బ్. కులాట జాతికిచెందినవాడు.

**కొఱవత** రూ. కొఱతి. వి. కొరవజాతిస్త్రీ, కొరవది. క. కొఱవంజి, కొఱవతి, కొఱవితి, కొరజి. భవిష్యత్తు చెప్పేస్త్రీ ; కొరజి ; తు. కొరజు. కొరగజాతిస్త్రీ ; త. కుఱత్తి, కుఱవి, కురవంచి. కొరవస్త్రీ, కొరవది విణ. కొండజాతిస్త్రీ. **కొఱవవాఁడు** విణ. కొరవజాతివాడు.

**కొఱవి** రూ. కొరివి[1]. వి. కొరకచ్చు. అలాతం, ఉల్మకం. భార. ఆరణ్య. 6.226.

క. గొరవి, గొరవు. ఒకానొకవృక్షవిశేషం.

**కొఱవికంకి** రూ. కొరవికంకి. వి. ఒకజాతివరితెగులు. **కొఱవికాటుక** వి. ఒకానొకజొన్నతెగులు. **కొఱవికారము** వి. పండుమిరపకాయలపచ్చడి. **కొఱవికోల** రూ. కొఱికోల, కొర్వికోల. వి. ఆగ్నేయాస్త్రం. **కొఱవిచీమ** వి. పెద్దఎర్ర చీమ. **కొఱవిజాల్పు** వి. పిశాచం. సాం.ని. 1.19. **కొఱవితెగులు** రూ. కొరివితెగులు. వి. పరిమిరపపత్తి మొ. పైరులు నల్లబడేతెగులు. **కొఱవితోఁదలగోఁకుకొను** అ.క్రి. బాధోపశమనార్థంపోయి మరింతబాధతెచ్చుకొను, బుద్ధిపూర్వకంగా కీడుతెచ్చుకొను. **కొఱవితోఁదలబరికికొను** అ.క్రి. బుద్ధిపూర్వకంగా కీడుతెచ్చుకొను. **కొఱవిదయ్యము** వి. పిశాచభేదం. శృం.నై. 2.122. **కొఱవిపెట్టు** అ.క్రి. చితికినిప్పుముట్టించు.

**కొఱికికొను** చూ. కొఱుకు.

**కొఱిల్లు** చూ. కొఱు[1]

**కొఱివి** రూ. కొరివి[2]. వి. ఒకరకంచెట్టు. (Ixoraparviflora Sapindus tetraphylla).

**కొఱు** రూ. చూ. కొఱ్ఱు. వి. బొ. మేకు, శూలం, గసిక. విజ్ఞా.

**కొఱుతమఱుకు** వి. 1. సాహసికుడు. భార. ఉద్యో. 1.343 ; 2. క్రూరుడు. విక్ర. 7.160 ; అ.క్రి. 1. సాహస కృత్యంచేయు. భార. స్త్రీ. 1.17 ; 2. క్రూరున దిగబడు.

**కొఱుకరానికొయ్య** చూ. కొఱుకు.

**కొఱుకు** స. క్రి. 1. కరచు, దంశనం చేయు. భార. ఆది. 6.202 ; 2. పళ్ళు కోపంతో పట పట లాడించు. వి. 1. ఆహారం, ఎర, మేత, తినడం. రగా. 3.97 ; 2. మేహరోగ విశేషం. మల్హ. 3.12 ; 3. కాలినకర్రముక్క.

క. కుఱుకు కొఱకు, కొఱుకు, కొరుకు ; కొడ. కొరి. (-కొరిప్ - కొరిబ్ -). ఎలక ధాన్యాదుల్ని పట పటలాడించి తినడం ; తు. కొర్కలు. పండు ; త. కొఱి (త్తు-ప్పు). ధాన్యపుపొల్లునుగిల్లు, గింజల్ని కొంచెం కొంచెం కొరికి తిను, తక్కువగాతిను, కుత్తి. నరకు ; మ. కొఱి. ఎలకలాగ ధాన్యాదుల్ని తిను, ధాన్యాన్ని పొల్లుతీసితిను ; గోం. కొర్క్. కొంచెం కొంచెం తిను ; కుఇ కొస్. ప్-అ (కొస్. త్-) ; పర్జి. కొర్క్. పళ్ళతోకాని కత్తెరతోకాని ముక్కలుచేయు, కొరరు ; కొలా. కొర్క్. కొరుకు, కుట్టు, కరచు.

< మూ. ద్రా. *కొత్-.

**కొఱికికొను** స. క్రి. 1. (దంతాలు) పళ్ళుకొరుకు. కాశీ. 7.31 ; 2. ఊడిపడేటట్లు కరచు. రామాభ్యు. 8.148. **కొఱుకరానికొయ్య** రూ. కొఱకరానికొయ్య, వి. 1. మొండికట్టె, మూర్ఖుడు, అసాధ్యుడు ; 2. అసాధ్యం. **కొఱుకుపుండు** వి. అవయవాల్ని కొరికే సుఖరోగ విశేషం.

**కొఱ్ఱ**[1] వి. సస్య విశేషం, ప్రియంగువు. కుచేల. 3.52. (Allophylus cobbe).

క. కొర్లె, కొఱలె. సస్యవిశేషం ; పో. చూ. త. కురల్. మొక్కజొన్న ; పో. చూ. మ. కొఱ్ఱు. బియ్యం ; కొం. కొయ్ల్ ; పో. చూ. పర్జి. కొయ్ల.

**కొఱ్ఱ**[2] రూ. కొఱు[3]. వి. మత్స్య విశేషం. ఆం. భా. 1.160. (Ophiocephallespunctatus).

త. కుఱవై ; పో. చూ. మ. కుఱుబాకు, కుఱువాఱు. చిన్నచేప.

**కొఱ్ఱచేఁప** రూ. కొఱచేఁప వి కొరమీను. **కొఱ్ఱమట్ట** రూ. కొఱమట్ట. వి. కొఱ్ఱమీను. **కొఱ్ఱమీను** రూ. కొఱమీను. వి. నల్లగాఉండే ఒకచేప వేయికోరల చేప అని

వాడుక. ప్రబంధ. 195.

**కొఱ్ఱడచు** చూ. కొఱ్ఱు.

**కొఱ్ఱబంతి** వి. కళ్ళం గట్టిపడటానికి తొక్కించే ఎద్దులవరస, మూగబంతి.

**కొఱ్ఱలు** రూ. కోఱలు. వి.బ.వ. ధాన్య విశేషం, కొఱ్రధాన్యం.

**కొఱ్ఱాయి** వి. కొరకచ్చు.

**కొఱ్ఱు** రూ. కొఱు. వి. ఔ. **1**. ముల్లు. భార. ఆది. 4.270 ; **2**. శూలం, వధసాధన విశేషం. బసవ. 6 పు. 224 పం. ; **3**. మేకు. మను. 3.34 ; **4**. ఇంద్రధనుస్సు ; **5**. ముళ్ళు తగిలి గుడ్డలో ఏర్పడ్డ చిరుగు ; **6**. కాలుతున్నపుల్ల.

త. కుఱ్ఱు-. మొద్దు, నేలలోనాటే వాడికొయ్య. కుచ్చి. చీలిక, ఇనపముల్లు, కర్ర, చెంపపిన్నీను.

**కొఱ్ఱడచు** స. క్రి. అతిగాబాధించు. <కొఱ్ఱు+అడచు. **కొఱ్ఱుఇంటికంబముసేయు (-చేయు)** స. క్రి. చిన్నదానిని పెద్దపనికి ఉపయోగించు. ఉ. హరి. 1.94 **కొఱ్ఱుదున్నకము** వి. మొదటిదాలు. **కొఱ్ఱులఁబెట్టు (-పెట్టు)** స. క్రి. మిక్కిలి పీడించు. **కొఱ్ఱెక్కికూర్చుండు** అ. క్రి. అడిగినకొలదీ దిగిరాక మరింత పైకిపోవు.

<కొఱ్ఱు+ఎక్కికూర్చుండు.

**కొఱ్ఱెక్కికూర్చుండు** చూ. కొఱ్ఱు.

**కొల**[1] చూ. కొలుచు. వి. కొలత, ధాన్యం మొ. వాటిని కొలవటం.

పో. చూ. క. కొల్. కర్ర ; మ. కొల్. కర్ర, కొలత ; కోలళవు. కొలత , కొల్క్కనమ్. తాపీ పనిలో అడుగు కొలత.

**కొలకడవ** వి. పదిమానికలకుండ. **కొలకద్ద** వి. కల్లుకొలిచి పోయడానికి వాడే చిన్నమట్టిపాత్ర. **కొలకఱ్ఱ** వి. **1**. కొలబద్ద, కొలవడానికి ఉపయోగించే కర్ర. **2**. పడవలంగరు ; **3**. స్తంబం. **కొలకాసు** వి. కొలిచినందు కిచ్చిన జీతం. **కొలకుండ** వి. ధాన్యంకొలిచేకుండ, తొమ్మిది మానికలు పట్టేకుండ. ద.హిం.శా. సంపు. **5**. శా. సం.1046, క్రి. శ. 1187సం. **కొలకొండ** వి. తవ్విన నేలలోతు తెలిసి కొనడానికి మధ్య తవ్వకుండా వదలిపెట్టే మిట్ట. కు. సం. 1.52. **కొలకొయ్య** వి. ఆనుమీద పడుగు ఎక్కువ రావటా నికి పక్కపట్టెకు బిగించినకొయ్య. **కొలకోల** వి. కొలకర్ర, మానదండం. సుద. 1.102. **కొలగడవ (-కడవ)** వి. ధాన్యం కొలిచేపెద్దమట్టిపాత్ర. **కొలగాఁడు (-కాఁడు)** వి. ధాన్యాదుల్ని కొలిచేవాఁడు. **కొలగారము** వి. **1**. ధాన్యాదుల్ని కొలిచినందుకిచ్చిన కూలి ; **2**. కొలవడం, కొలత. **కొలగోల (-కోల)** వి. భూమ్యాదుల్ని కొలవడానికి ఉపయోగించే కర్ర. నెల్లూరుశాసనం, కందుకూరు. 63. క్రి. శ. 1261 సం. **కొలచు** రూ. చూ. కొలుచు[1]. స. క్రి. ధాన్యా దుల్ని కొలచు. ధరణికోటశాసనం, గుంటూరు జిల్లా, క్రి. శ. 742 సం. **కొలతట్ట** వి. సున్నం, గులక మొ. వాటికొలతకు వాడే సాధనం. **కొలనిర్ణయము** వి. భూమిపరిమాణపు కొలతల ఒడంబడిక. ద. హిం. శా. సంపు.10. శా. సం. 748. క్రి. శ. 1568 సం. **కొలపెట్టు** స. క్రి. కొలతవేయు, కొలుచు. వరాహ. 12.43. **కొలబాన** వి. ధాన్యంకొలిచే కుండ. **కొలబుట్ట** వి. సున్నంగులక మొ. వాటికొలతకు వాడే బుట్ట. **కొలముంత** వి. బానలోనుంచి కల్లుముంచిపోయడానికి వాడే చిన్న మట్టి పాత్ర.

**కొల**[2] వి. **1**. పగ, వైరం, రం. రా. యు. **347** పు. 1 పం. ; **2**. దోషం, పాపం, కసటు. సారంగ. 2.23 ; **3**. హింస, వధ. చంద్రరే. 4.84 ; **4**. బాధ. మల్హ. 3.79.

క. కొలె. చంపడం, హత్య ; తు. కొలె ; త. కొలై. చంపడం, హత్య ; పో. చూ. మ. కుల. హత్య, చంపడం ; తొ. క్వలి. హత్య, హత్యచేసేస్వభావం కల.

**కొలగట్టుకొను (-కట్టుకొను)** స. క్రి. హత్యా పాతకాన్ని కట్టుకొను.

**కొల**[3] వి. చెంచు వాళ్ళు పిశాచాల్ని సేవించడం.

**కొలకట** వి. **1**. ఇల్లు, కవ్వ, గుడి, గూడు, అనుపోసిన నూలులో ఒకటిపైకి ఒకటి కిందికివచ్చిన రెండు పోగులు దారం ; **2**. ఊత్తె పన్నేటప్పుడు కిందిగూటానికి వేసే ఒకరకం ముడి ; **3**. అచ్చుకట్టేటప్పుడు రెండుఅచ్చుకర్రల వడి దారాలకు వేసిన లంకె.

**కొలకడ** వి. గొర్రు, నాగలి మొ. వాటిమోకు మొదటికొస.

**కొలకనఁగోడి** రూ.చూ. కొనకొనంగోడి. వి. ఒకజాతి కోడి దశా. 8.236

**కొలకమాఱు** అ. క్రి. తినేటప్పుడు ద్రవంముక్కులోకివచ్చు.

**కొలకలకోడి** రూ.చూ. కొనకొనంగోడి. వి. ఒకజాతికోడి.

**కొలకొల** రూ. గొలగొల. వి. కలకల ధ్వనిపక్షులు మొ. వాటి ధ్వనికి అనుకరణం. శృం. నై. 3.13, మను. 3.62.

త. కులుకులు (త్తు-ప్పు-). కలకలధ్వనిచేయు.

**కొలగము** చూ. కొల[1]. వి. లోహపుబిందె. ద. హిం. శా సంపు 4. శా. సం. 1140. 2. క్రి. శ. 1142 సం.

**కొలంకు** రూ. కొలఁకు, కొలఁకువు వి. చెరువు, సరస్సు. భార. అరణ్య. 3.270.

క. కొళగళ్. చెరువులు ; త. కుళంగళ్ ; మ. కుళంగళ్.

పో. చూ. సం. కూలా. నీటిగుంట.

'కొలంకులు' అనే పదాన్ని అనుచిత విభాగం చేయటం వల్ల కొలంకు శబ్దరూపం ఏర్పడింది.

**కొలఁకు** రూ.చూ. కొలంకు. వి. చెరువు, సరస్సు. కాశీ. 6.187.

**కొలఁకువు** రూ.చూ. కొలంకు. వి. చెరువు. భాగ. 8.111.

**కొలచేయు** స.క్రి. **1**. స్త్రీలను చెరచు ; **2**. హానిచేయు.

**కొలత** చూ. కొలుచు[1]. రూ. కొలఁత, కొల్త. వి. పరిమాణం, ధాన్యాదుల్ని కొలవడం.

**కొలతకొయ్య** చూ. కొలకొయ్య. వి. ఆనుమీదపడుగు ఎక్కువరావటానికి పక్కపట్టెకు బిగించిన కొయ్య. **కొలత కోల** వి. పడుగుమూర కొలవడానికి ఉపయోగించే రెండు మూరల పొడుగుండే కర్ర. **కొలతగిన్నె** రూ. కొల్తగిన్నె. వి. రంగులు కొలుచుకొనేగిన్నె. **కొలతగులిగె** వి. సుమారు అయిదు తులాలుపట్టే రంగు కొలుచుకొనే చిన్నపాత్ర. **కొలతతెడ్డు** వి. పొడుగాటి కాడకుకట్టి రంగు కొలుచుకొనే చిన్నపాత్ర. **కొలతతొట్టి** వి. సున్నం, గులక మొ. వాటి కొలతకువాడే సాధనం. **కొలతబల్ల** వి. పన్నెండంకెల మధ

బిగించే పల్లల్ని ఒకే పొదుగులో తెంచడానికి కొలిచే బిళ్ళ. **కొలతవేయు** స.క్రి. భూమ్యాదుల పరిమాణాన్ని కట్టు.

**కొలదాకు** (-తాకు) అ.క్రి. హానికలుగు.

**కొలది** పూ.చూ. కొలఁది. వి. మేర, హద్దు. కందుకూరు శాసనం, నెల్లూరు జిల్లా. క్రీ.శ. 848–849 సం.

**కొలనాడు** చూ. కొలను.

**కొలనికడవలు** చూ. కొలను.

**కొలనికాపుండు** చూ. కొలను.

**కొలనిమబ్బులు** చూ. కొలను.

**కొలనిమేఘములు** చూ. కోలను.

**కొలను** రూ. కొల్ను, కొల్లు[1]. వి.జౌ. 1. చెరువు, సరస్సు. భార. సభా. 1.12 ; 2. చిన్నగుంట. ఇందు. 2.5.

క. కొళ, కొళ, కొళహె. చిన్నగుంట ; తు. కుళ. చెరువ ; త. కుళమ్. చెరువ, చిన్నగుంట ; కుంటు. చిన్నగుంట ; పో.చూ. కుళి. చెరువు, చిన్నగుంట ; మ. కుళమ్. చెరువ.

పో.చూ. సం. కూల -. చిన్ననది, కాలవ ; కులా. చిన్నగుంట, చెరువు ; ప్రా. కుల్లా. సెలయేరు, కాలవ ; నే. కులో. కాలవ, మురికికాలవ ; హిం. కూలా. నీటి పారుదల.

**కొలనాడు** అ.క్రి. 1. తీర్థమాడు, స్నానమాడు. కువ.చ. 3.125 ; 2. తీర్థయాత్రకేగు. **కొలనికడవలు** రూ.చూ. కొలనుకడవలు. వి. నీళ్ళతో నోచేనోముకు గంగ పూజకు సంబంధించిన పాత్రలు. **కొలనికాపుండు** అ.క్రి. నిష్ప్రయోజనమైన పనిచేయు. గువ్వలచెన్న. 13. **కొలనిమబ్బులు** వి.బ.వ. వస్త్రవిశేషం. వ్య. చెరువులోని మబ్బుల్ని పోలిన వస్త్రాలు. **కొలనిమేఘములు** వి.బ.వ. వస్త్రవిశేషం. బసవ. 3.49 ప.; వ్య. చెరువులోని మబ్బుల్ని పోలిన వస్త్రాలు. **కొలనుకడవలు** రూ. కొలనికడవలు. వి. నీళ్ళతో నోచేనోముకు, గంగపూజకు సంబంధించిన పాత్రలు.

**కొలఁత** రూ.చూ. కొలత. వి. పరిమాణం, ధాన్యాదుల్ని కొలవడం.

**కొలఁది** పో.చూ. కొల[1] రూ. కొద్ది[1], కొలది, క్వాలి[1]. వి. 1. శక్తి, సామర్థ్యం, మహిమ, మహత్త్వం. కు. సం. 4.430 ; 2. మేర, అవధి. భార. విరా. 4.93 ; 3. బలం. భార. విరా. 5.66 ; 4. విధం, తెరగురీతి. భార. ఉద్యో. 2 235 ; 5. పరిమాణం, మిరి. భార. భీష్మ. 1.27, భార. అను. 5.263 ; 6. స్థితి, అవస్థ. హరి.పూ. 8.113 ; 7. గొప్పతనం. పారి. 1.63. విశ. 1. శక్యమైన, సాధ్యమైన, తరమైన. భార. సభా. 1.79 ; 2. పరిమాణం కల. భార. విరా. 5.216 ; 3. అల్పసంఖ్యాకమైన, కొంచమైన. రం.రా.ఉ. 70 ప. 11 పం. ; 4. సాటి, సమానం. దశకు. 1.92.

**కొలఁదికీడాయు** అ.క్రి. దగ్గరకువచ్చు. భాస్కరా. అరణ్య. 2.46. **కొలఁదికిమించు** అ.క్రి. అపరిమితమగు. కళా. 1.118. **కొలఁదికిమీఱు** అ.క్రి. అధికమగు. భార. ద్రోణ. 2.229. **కొలఁదిగడుచు** (- కడుచు) స.క్రి. గడువు ముగించు. భార. విరా. 4.93. **కొలఁదిమిగులు** అ.క్రి. అపరిమితమగు, అధికాధికమగు. కు.సం. 11.12. **కొలఁదిమీఱు** అ.క్రి. అపరిమితమగు. భార. అను. 5.263. **కొలఁదియిడరాని** (- ఇడరాని) విశ. అపరిమితమైన. హరి. ఉ. 10.66. **కొలదియిడు** (- ఇడు) అ.క్రి. లెక్కించు, గణించు. **కొలదివెట్టు** (- పెట్టు) స.క్రి. 1. పరిమితంచేయు, కొంచెపరచు. భార.విరా. 3.167 ; 2. ఎంచు, లెక్కించు, గణించు. భార. భీష్మ. 1.122. **కొలఁదివేరు** రూ.చూ. కొలవేరు. వి. వట్టివేరు. **కొలఁదులఁబడు** అ.క్రి. పరిమితమగు.

**కొలఁదులఁబడు** చూ. కొలఁది.

**కొలపగ** చూ. కొలము. వి. 1. జాతివైరం. శుక. 2.284 ; 2. గర్భశత్రుత్వం. వేంక. పంచ. 3.195.

త. కుల-ప్-పకై. జాతి ద్వేషం.

**కొలపగతుఁడు** చూ. కొలము. వి. సహజశత్రువు, ఆవు, పులి మొదలైనవి. వేంక. పంచ. 2.141.

**కొలమాఱు** అ.క్రి. తినేటప్పుడు ద్రవాదులు ముక్కులోకివచ్చు.

**కొలము** వి. 1. వంశం, అన్వయం. హర. 2.51 ; 2. సజాతీయప్రాణి సముదాయం. యయా. 4.15.

సం. కుల -. జాతి, తెగ ; ప్రా. కుల -. ; పా. కుల -. ; హిం. కుల్. కుటుంబం, సమూహం, జాతి.

క. కుల. ; త. మ. కులం. ; కుఇ. కూలు. కుటుంబం, జాతి, తెగ, కులం.

< ప్రా. కుల -

**కొలముసాములు** వి.బ.వ. జాతిపెద్దలు. వేంక. పంచ. 2.48.

**కొలముక్క** వి. కొడగచెట్టు తెల్లనిపూలుపూసే ఒక మొక్క (Holasrhena Autidystcuica).

**కొలయీఁగు** స.క్రి. పగతీర్చు.

**కొలయొనర్చు** (- ఒనర్చు) స.క్రి. హత్యచేయు. శుక. 1.824.

క. కొలె. హత్య ; త. కొలై.

**కొలరాగి** వి. మెట్టసాగులోనూ, మాగాణిసాగులోనూ, పండే ఒక ఆహారధాన్యం, రాగుల్లో ఒకరకం.

**కొలవణి** వి. నాట్యవిశేషం. శ్రీరం. మా. 4.162.

**కొలవేరు** రూ. కొలఁదివేరు. వి. వట్టివేరు. కు.సం. 5.628 (Audropognmurieatus).

**కొలసామి** వి. కులస్వామి, కులశ్రేష్ఠుడు. కేయూర. 3.150.

**కొలసాలు** వి.బ.వ. డొల్లుమిద్ది కప్పుకింది వాసాలు.

**కొలాబ** వి. తలుపులు మొ. వాటిని లాగి తెరవడానికి ఉపయోగపడే పరికరం.

**కొలారకము** చూ. కొల[1]. వి. కొలత. వేంక. ఆం. మాన. 68.

**కొలారము** రూ.చూ. కొల్లారు. వి. నాలుగిళ్ళభవంతి, నడుమ, బయట నాలుగు పక్కల కట్టడం కట్టిన ఇల్లు, చతుశ్శాల, మండువాఇల్లు.

**కొలారికమంపు** చూ. కొలారికము.

**కొలారికము** రూ.చూ. కోలారికము. వి. ద్వంద్వయుద్ధం చేయబోయే మల్లురకు కొలతచూచి కయిదువు లేర్పరచడం. ఆం.భా. 2.206.

కొలారికమంపు స.క్రి. ద్వంద్వయుద్ధానికి రమ్మని (కటారిని) పంపు. అహల్యా. 1.102.

**కొలారు** రూ.చూ. కొల్లారు. వి. కొలారం, చతుశ్శాల.

**కొలారుబండి** రూ.చూ. కొల్లారుబండి. వి. కంబళంతో కప్పిన బండి. శుక. 1.182.

**కొలి** వి. బిల్లంగోడు ఆడేటప్పుడు బిల్లపెట్టి కొట్టటానికి తవ్విన చిన్న గుంట. ఉ.హరి. 5.311.

క. *కుటి*. గుంట; తు. *గుళి*; త. *కటి*; మ. *కుటి*.

**కొలిక** వి. సాలెవారు.

**కొలికచేరుకోక** వి. ఒకరకం నేతచీర. **కొలికంచు** వి. రెండు పోగులు దారం నిలువుగా పడేట్టు నేసిన అంచు.

**కొలికతుకు** చూ. కొలికి.

**కొలికపట్టె** వి. మరాను కట్టుబడిలో పడుగులో దూర్చే బెజ్జాలు గల రేకు ముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె.

**కొలికి** రూ. కొల్కి. వి. **1.** కంటికొన. బసవ. 3.778 పం; **2.** కొక్కెం, హారాదులకు ముఖభాగంలో వంపుగా ఉండే బంధన సాధనం, బంధం. భాగ. 1.224; **3.** కంఠం, గొంతుక. ఆం.భా. 2.141; **4.** అనుపోసిన నూలులో ఒకటి పైకి, ఒకటి కిందికి వచ్చిన రెండు పోగుల దారం; **5.** అచ్చు కట్టేటప్పుడు రెండు అచ్చు కర్రల వడిదారాలకు వేసిన లంకె.

క. కులికె, కుణికె, కొలికె, కొళికె. కొక్కెం, మూల; తు. కొళికె, కొళ్కె. కొక్కెం, కన్ను; త. కొళుక్కి. కొక్కెం; పో.చూ. మ. కుళ. సూది రంధ్రం, కాలిఎముక; కొళుత్తు. కొక్కెం; కొంద. కొళ్. పర్జి. కొంయుజ్. కొక్కెం.

కొలికతుకు వి. బద్దెపోగులకు రెండేసి పడుగు పోగులు కలిపి అచ్చుకట్టడం. **కొలికిచెప్పు** వి. కొలికిగల పాదరక్ష. శుక. 2.545. **కొలికినేత** వి. పేకపోగులు కలవకుండా విడివిడిగా కనిపించేటట్లు నేసిన నేత. **కొలికి(దెచ్చు** (-తెచ్చు) స.క్రి. **1.** లొంగదీయు. అ.మ.క. 2.98; **2.** వస్తువుల్ని అటూ ఇటూ మార్చి గందరగోళంచేయు. **కొలికిపూస** రూ. కొల్కిపూస. వి. కొలికికి తగిలించేపూస. **కొలికిపోగులుకర్ర** వి. అనుపడుగులో మొదట అనిపడే కర్ర, ఎడంకోల. **కొలికిముంగిచీర** రూ. కొలికిమొంగిచీర. వి. రెండు పోగులు ఒక రంగు, రెండు పోగులు మరొక రంగుపెట్టి నేసే ఒక రకం చిన్న గడి చీర. **కొలికిముడి** రూ. కొల్కిముడి. వి. జారుముడి. **కొలికిముళ్ళచీర** వి. ఒక రకం గళ్ళచీర. **కొలికిమొంగిచీర** రూ.చూ. కొలికిముంగిచీర. వి. రెండు పోగులు ఒక రంగు, రెండు పోగులు మరొక రంగు పెట్టి నేసే ఒక రకం చిన్న గడి చీర. **కొలికివచ్చు** అ.క్రి. ఫలోన్ముఖమగు. పీర. 3.54. **కొలికిశారుకావికోక** వి. రెండు నాడెలలో రెండు రంగుల నూలు పెట్టి నేసిన చీర. **కొలుకులకర్ర** వి. పడుగులో పై కొల్తలకు దూర్చే కర్ర. **కొలుకులపట్టె** వి. మరానుమీద పడుగు పోసేటప్పుడు పడుగులో అనులు రావటానికి మేకులు బిగించిన కట్టె. **కొలుకులమళ్ళచీర** వి. నిలువుకు తెలుపు, అడ్డానికి రంగు నూలుపెట్టి రెండేసి పోగులు పడేట్టు నేసిన గళ్ళ చీర. **కొలుకులుతీయు** స.క్రి. సరిచేసేటప్పుడు పడుగులో చిక్కులు తీయు. **కొలుకొయ్య** వి. నేతబయలులో చివర నాటిన కర్ర, మోకు తిప్పు కర్ర. <కొలికి + కొయ్య.

**కొలికిడి** వి. రెండు కొసల్ని కలిపే ముడి.

**కొలికిలు** వి.బ.వ. మూడువందల కుంచాలు.

**కొలికెడు** వి. ఒకటిన్నర బండి ధాన్యం.

**కొలిని** వి. నల్లబలుసుచెట్టు మెరిసే ఆకులు కలిగి నదీ తీరాల్లో పెరిగే ఒక చెట్టు (Canthium didymum).

**కొలిపించు**[1] చూ. కొలుచు[1].

**కొలిపించు**[2] చూ. కొలుచు[2].

**కొలిపించు**[3] చూ. కొలుపు[3].

**కొలిమి** రూ. కొలిమె, కొలుము, కొల్మి. వి. **1.** కమ్మరి, మొ॥వారు లోహాల్ని కాల్చడానికి నిప్పుంచే గుంట. మార్క. 3.315; **2.** సంభోగం.

క. కులుమె, కులుమె, కుల్మె, కొలిమె, కొలుమె. నిప్పుంచే గుంట; కొడ. కొల్లె. కమ్మరి; తు. కొలమె. లోతుగొయ్య, అగాధం, నరకం; త. కొల్. కమ్మరవృత్తి, కొల్-ల్-ఉలై. కమ్మరి కొలిమి. పో.చూ. మ. కొల్లన్. కమ్మరి.

**కొలిమితిత్తి** రూ. కొల్మితిత్తి. వి. కొలిమి ఊదే తిత్తి, భస్త్రి. ఆం.భా. 2.299.

**కొలిమిడి** రూ. గొలమె, గొలిమి, గొలిమిడి, గొలివె, గొల్మి, గొల్మిడి. వి. ఒకానొక చెట్టు (Coix barbata).

**కొలిమిపాల** వి. తెల్లని పూలుపూసే ఒక చిన్న మొక్క లేక పొద, గారవిచెట్టు (Ixora pamiflora).

**కొలిమె** రూ.చూ. కొలిమి. వి. కొలిమి.

**కొలియా** వి. పీర్లపండగలో షర్బత్తు తాగటానికి వాడే చిన్న గురిగె.

**కొలివె** వి. తెల్ల మచ్చలుగల ఒక పిట్ట.

**కొలుకులకర్ర** చూ. కొలికి.

**కొలుకులపట్టె** చూ. కొలికి.

**కొలుకులమళ్ళచీర** చూ. కొలికి.

**కొలుకులుతీయు** చూ. కొలికి.

**కొలుకొయ్య** చూ. కొలికి.

**కొలుగుంట** చూ. కొల్లు[1]. వి. పురుడురోజుల్లో శిశువు స్నానానికి ఉపయోగించిన నీరుపోయే గుంట.

**కొలుచు**[1] రూ. కొలుచు, కొల్చు[1]. వి. ధాన్యం, వరిధాన్యం. భార.అను. 4.260. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1188. క్రీ.శ. 1250 స.క్రి. కొలతవేయు. శృం.నై. 8.39.

క. కొల్. కర్ర[1], స్తంభం; కొల్. కొలత కుపయోగించే కర్ర; కొళ్. తీసుకొను; కొళగ. కొలత ప్రమాణం; తు. కోలు. కర్ర, స్తంభం, కొలతకర్ర; త. కొళ్. (ళ్-ట్-వ్-). లోపలికి లాగు, గణించు, పూర్వకాలంలో ఉపయోగింపబడిన ఒక ప్రమాణం; పో.చూ. కోలు. (-ఇన్-వ్-). మూటకట్టు, పైకిలాగు. కొల్. కొల ప్రమాణం; మ. కోల్కక్కనల్. ఒక ఘన అడుగు ఉండే ఘనప్రమాణం; కోల్. కర్ర, స్తంభం; కొలా. కుల్. గణించు; నా. కుల్ల్. కొలుచు.

<మూ.ద్రా. *కొళ్.

**కొలుచుపెఱుక** వి. పెరికలో తెచ్చిన వడ్లు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 935. క్రీ.శ. 1269 నం. **కొలిపించు**¹ రూ.చూ. కొల్పించు¹. స.క్రి. ధాన్యాదికం కొలుచు.

**కొలుచు**² రూ. కొల్చు². చూ. కొండాడు, కొనియాడు. స.క్రి. **1.** సేవించు, ఓలగించు. భార. ఆది. 3.110; **2.** నమస్కరించు. ఆం. నా. సం. 2.31; **3.** ధ్యానించు.

క. కొళ్. పట్టుకొను; తు. కొలు. రాజసమక్షం, దైవసమక్షం; పో.చూ. త. కూలి. బత్తెం; కోలు (-ఇన్-వ్-). ఆలోచించు, ధ్యానించు; కొళ్ (-ఓ్-ట్-వ్-). విదారించు, ఆలోచించు; కొళువు (-ఇన్-వ్-). కొలువులో ఉండు; మ. కోలు. సేవ, కొలువు.

**కొలిపించు**² రూ. కొల్పించు². స.క్రి. సేవింపచేయు. భార. భీష్మ. 3.420.

**కొలువు**¹ రూ.చూ. కొల్వు¹. అ.క్రి. **1.** సమ్మతమగు. ఇష్టమగు. భార. అను. 1.11; **2.** పనికివచ్చు, చెల్లు, సాగు. ద్వి.హరిశ్చ. పూ. 1187; **3.** ఇష్టపడు, సమ్మతించు.

క. కొళ్. పూనుకొను, పొందు, లాభంపొందు; త. కోలుమై. సంసిద్ధత, ప్రారంభం; కొళ్కై. ఇష్టం, కోరిక, గౌరవం, సంబంధం, చనువు, సంఘటన.

**కొలువు**² రూ కొల్వు². చూ. కొలుచు². వి. **1.** సేవ.కు.సం. 1.12; **2.** నమస్కారం. ప్రబంధ. 8.36; **3.** గ్రామశక్తికి చేసే ఉత్సవం. ఆం.బా. 1.143.

త. కొళ్ (-ఞ్-ట్-వ్-). ఉత్సవంచేయు, గణించు, ధరించు; మ. కొలు. సేవ, రాచకొలువు.

**కొలువు**³ రూ.చూ. కొల్వు³. వి. నాట్యయోగ తద్ధితాది శబ్దోచ్చారణం.

**కొలిపించు**³ రూ. కొల్పించు³. అ.క్రి. నాట్యయోగ తద్ధితాది శబ్దాల్ని ఉచ్చరించు.

**కొలువు**⁴ రూ. కొల్వు⁴. స.క్రి. **1.** పురికొల్పు. భార. భీష్మ. 3.151; **2.** పుట్టించు, కలిగించు. హరి.పూ. 5.193; **3.** కనుగీటు, సైగచేయు; **4.** వ్యాపింపచేయు.

క. కొళిసు. దొంగలింపజేయు; త. కొళువు (-ఇన్-వ్-). ఉసిగొల్పు, ప్రేరేపించు.

**కొలువుగడ్డి** వి. పసుకుగడ్డి, అన్ని ఋతువుల్లోనూ ఉండి నిలువుగా పెరిగే ఒక మొక్క (Manesithealavis).

**-కొలువు**⁵ ప్రత్య. అనుప్రయుక్తమైన కొను ధాతువుకు ప్రేరణలో వచ్చే రూపం.

**కొలువ్పట్టె** వి. నాలికబల్ల, కోడిపీటలబండినితోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోనినాగ దగ్గర వేసిన చెక్క.

**కొలుము** రూ.చూ. కొలిమి. వి. వడ్రంగికొలిమి, కమ్మరికొలిమి.

**కొలువగు** చూ. కొలువు.

**కొలువడి** చూ. కొలుచు1. వి. కొలత. వేంక. ఆం. 2.68.

**కొలువానము** వి. **1.** ఒకవిధమైన చేప, నీరచేప; **2.** రాజీవం, ఒకవిధమైన పద్మం.

**కొలువిచ్చు** చూ. కొలువు.

**కొలువు** చూ. కొలుచు². రూ. కొల్వు. వి. **1.** ఆస్థానం, రాజసభ. భార.ఉద్యో. 4.80; **2.** ఆస్పదం, స్థానం. దశకు. 2.90; **3.** సేవ, పరిచర్య. ఆం.భా. 2.228; **4.** గ్రామశక్తికి చేసే ఉత్సవం. ఆం.బా. 1.43; ఉత్సవ విశేషం; **5.** ప్రభుత్వోద్యోగులు చేసినసేవకు పారితోషికంగా ఇచ్చిన భూమి; **6.** పాత్రలు తీర్చటానికి సారె పలకమీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద.

త. కొలు. రాచకొలువు, ఆస్థానం, రాజసభ; మ. కొలు. సేవ, రాచకొలువు, దివ్యమైన, అభివృద్ధి.

**కొలువగు** అ.క్రి. సభచేయు. హర.పీఠి. 22. **కొలువిచ్చు** స.క్రి. **1.** సభచేయు, కొలువొసగు. భార.విరా. 1.184; **2.** దర్శనమిచ్చు; **3.** నమస్కరించు; **4.** ధ్యానించు. <కొలువు+ఇచ్చు. **కొలువుకాఁడు** వి. సేవకుడు. **కొలువుకూటము** రూ. కొల్వుకూటము. వి. ఆస్థానమండపం. సభామందిరం. భార.ఉద్యో. 4.137. క. కొలుకూ్టమ్. కొలువుకూటం. **కొలువుగూర్చుండు (-కూర్చుండు)** అ.క్రి. సభాసీనుడగు, కొలువులో కూర్చుండు. విక్ర. 1,19. త. కొలువిఱ్ఱు. **కొలువుగొను(-కొను)** రూ. కొల్వుగొను. స.క్రి. **1.** సేవకునిగా పరిగ్రహించు. భార.విరా. 1.224; **2.** సభతీర్చు. సాంబో. 2.137. **కొలువుచాలించు** స.క్రి. సభచాలించు. నిరంకు. 4.48. **కొలువుడుకాఁడు** రూ.చూ. కొల్వుడుకాఁడు. వి. సేవకుడు. **కొలువుండు** రూ.చూ. కొల్వుండు. స.క్రి. కొలువుతీరు. హర. 2.38. <కొలువు+ఉండు. **కొలువుతీరు** స.క్రి. దేవీనవరాత్రులలో బొమ్మల కొలువు పెట్టు. **కొలువుదీర్చు**¹**(-తీర్చు)** రూ.చూ. కొల్వుదీర్చు. స.క్రి. సభచేయు, విడియు. **కొలువుపట్టు** స.క్రి. సేవించు. రామా. 1.74. **కొలువుమ్రొక్కు** రూ.చూ. కొల్వుమ్రొక్కు. వి. సభాపతికి చేసే నమస్కారం. **కొలువువిడియు** రూ. కొల్వువిడియు. అ.క్రి. కొలువుతీరు. **కొలువువిరియు** రూ.చూ. కొల్వువిరియు. స.క్రి. సభచాలించు. **కొలువుశాల** రూ.చూ. కొలువుసాల. వి. సభామందిరం. **కొలువుసాల** రూ. కొలువుశాల. వి. సభామందిరం, కొలువుకూటం. భార.శాంతి. 1.372. <కొలువు+సం.శాలా. **కొలువుసింగారమగు** అ.క్రి. కొలువుచేయడానికి రాజాదులు అలంకరణ చేసుకొను. ఉ.రా. 5.247. **కొలువుసింగారముచేసికొను** స.క్రి. సభకు వెళ్ళడానికి తగినట్లుగా అలంకరించుకొను. కళా. 1.208. **కొలువుసేసికొను(-చేసికొను)** అ.క్రి. సేవ సంపాదించుకొను, కొలువు కుదుర్చుకొను. భార.విరా. 1.106. **కొలువుసేయు(-చేయు)** రూ. కొల్వుసేయు. అ.క్రి. సభచేయు, నివసించు. పాండు. 1.131. **కొలువెత్తు** రూ.చూ. కోలెత్తు. స.క్రి. సారెపలకమీద మట్టిముద్దను కుండ రూపు రావడానికి మీదికి పొడవుగా, లోపల బోలుగా వచ్చేటట్లు లేవు. **కొలువొసంగు** రూ. కొల్వొసంగు. అ.క్రి. కొలువగు, సభచేయు. ఆము. 4.135.

**కొలువెత్తు** చూ. కొలువు.

**కొలువొసంగు** చూ. కొలువు.

**కొలుసు** వి. **1.** చాకళ్ళు సంక్రాంతి తర్వాత జామ బట్టలుతికే కుటుంబాలనుంచి ఏటేటా పుచ్చుకొనే బహుమానం;

2. కొలత, కొలగారం.

**-కొలె** రూ.చూ. కోలె[2]. అవ్య. 1. ఉండి, పంచమ్యర్థకం. భాగ. 9.318 ; 2. మొదలుకొని. వసు. 4.76.

**కొలెవలు** వి.బ.వ. ప్రమిదలకు పెట్టే కుదుళ్ళు.

**కొల్కట** రూ.చూ. కొల్కడ. వి. తొడుచుట్ట.

**కొల్కడ** రూ. కొల్కట. వి. తొడుచుట్ట.

**కొల్కడపెట్టు** స.క్రి. నేతమోకు చుట్ట బిగించు. **కొల్కడవేయు** స.క్రి. నేతమోకు చుట్ట బిగించు.

**కొల్కి** రూ.చూ. కొలికి. వి. 1. కంటికొన. శుక. 1.179 ; 2. లొంగుపాటు ; 3. కొక్కెం, హారాములకు ముఖభాగంలో వంపుగా ఉండే బంధనసాధనం, బంధం ; 4. కంఠం, గొంతుక.

**కొల్కిపూస** రూ.చూ. కొలికిపూస. వి. కొలికికి తగిలించే పూస. చంద్రాంగ. 4.32. **కొల్కిముడి** రూ.చూ. కొలికి ముడి. వి. జారుముడి.

**కొల్చిపోయు** స.క్రి. పెచ్చించు. తాళ్ళ.సం. 7.33.

**కొల్చు**[1] రూ.చూ. కొలుచు[1]. వి. ధాన్యం, వరిధాన్యం. ఉ. రా. 8.141. స.క్రి. కొలతవేయు. శుక. 2.406.

**కొల్పించు**[1] రూ. కొలిపించు[1]. స.క్రి. ధాన్యాదికం కొలిచేట్లు చేయు.

**కొల్చు**[2] రూ.చూ. కొలుచు[2]. స.క్రి. ఉపాసించు, ధ్యానించు. భార.ఆది. 1.22.

**కొల్పించు**[2] రూ.చూ. కొలిపించు[2]. స.క్రి. సేవింప చేయు. భార.అను. 1.369.

**కొల్త** రూ.చూ. కొలత. వి. పరిమాణం, ధాన్యాదుల్ని కొలవడం.

**కొల్తకడి** వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి. **కొల్తగిన్నె** రూ.చూ. కొలతగిన్నె. వి. రంగులు కొలుచుకొనే గిన్నె. **కొల్తతట్ట** వి. కొలతకు వాడే తట్ట. **కొల్తదబ్బ** రూ.చూ. కొల్తబద్ద. వి. లచ్చనలాక, అచ్చుతీకిన పడుగుమీద గుర్తుపెట్టడానికి కొలతచూసుకొనే బద్ద. కొల్తబద్ద, వర్ణవ్యత్యయం. **కొల్తదారం** వి. అంట్లుతాడు, అచ్చుతీకిన తర్వాత అల్లుమీద గుర్తులు పెట్టడానికి కొలిచే దారం. **కొల్తపెట్టె** వి. సున్నంగులక మొ. వాటితో అల్లిన బుట్ట. **కొల్తబద్ద** రూ. కొల్తదబ్బ. వి. లచ్చన లాక, అచ్చుతీకిన తర్వాత అల్లుమీద గుర్తులు పెట్టడానికి కొలిచే బద్ద. **కొల్తబిళ్ళ** వి. టుకినీ, పన్నె దండెలమధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కొలిచే కొయ్య బిళ్ళ. **కొల్తముంత** రూ. కొల్వముంత. వి. కల్లు కొలిచి పోయ డానికి వాడే మట్టిపాత్ర.

**కొల్ది**[1] రూ.చూ. కొలఁది. వి. 1. విధం, రీతి. భాగ. 6.453 ; 2. పరిమితి, పరిమాణం. చంద్ర.వి. 2.158 ; 3. శక్తి, బలం. శ్రరం.మా. 3.98.

క. కొళ్. జయంపొందు ; త. కోళ్. బలం, శక్తి, సామర్థ్యం ; కొళ్కై. నచ్చిలం.

**కొల్ది**[2] వి. తూముకు అడ్డంగాపెట్టే కొయ్య. కరుడుమొద్దు.

**కొల్ను** రూ.చూ. కొలను. వి.ఔ. చెరువు, సరస్సు. పాండు. 1.106.

**కొల్పించు**[1] చూ. కొల్పు[1].

**కొల్పించు**[2] చూ. కొల్పు[2].

**కొల్పించు**[3] చూ. కొల్పు[3].

**కొల్పు**[1] రూ. కొలుపు[1]. అ.క్రి. 1. ఇష్టపడు, సమ్మతించు. భార. భీష్మ. 2.252 ; 2. పనికివచ్చు, చెల్లు, సాగు. భార. శల్య. 2.52 ; 3. ఇష్టమగు, సమ్మతమగు.

**కొల్పు**[2] రూ.చూ. కొలువు[2]. వి. 1. సేవ, కొలువు, సర్పవరం శాసనం తూ.గో. జిల్లా, క్రీ.శ. 1098 సం ; 2. నమస్కారం. సాంబ. 2.25 ; 3. గ్రామశక్తికి చేసే ఉత్సవ విశేషం.

**కొల్పుడుచేతులు** వి.బ.వ. నమస్కారాలు. హంస. 4.213.

**కొల్పు**[3] రూ. కొలుపు[3]. వి. నాట్యయోగ్య తద్ధిత్తాది శబ్దో చ్చారణం. మను. 5.71.

**కొల్పించు** రూ.చూ. కొలిపించు. అ.క్రి. నాట్యయోగ్య తద్ధిత్తాది శబ్దాల్ని ఉచ్చరించు.

**కొల్పు**[4] రూ.చూ. కొలుపు[4]. స.క్రి. 1. వ్యాపింపచేయు. పాండు. 2.135 ; 2. పుట్టించు, కలిగించు ; 3. పురికొల్పు.

**కొల్మి** రూ.చూ. కొలిమి. వి. 1. కమ్మరి మొ. వారు లోహాల్ని కాల్చడానికి నిప్పుంచే గుంట. ప్రబంధ. 44 ; 2. సంతాపం.

**కొల్మితిత్తి** రూ.చూ. కొలిమితిత్తి. వి. కొలిమి ఊదేతిత్తి.

**కొల్ల** రూ. కొళ్ళ. వి. దోపిడు, ఒడచూర, లూటి. బసవ. 7.589 ; విశే. అతిమాత్రమైన, సమృద్ధమైన, పుష్కలమైన, అధికమైన. దశా. 2.15

కొళ్లై. దోపుడు. దోపిడి ; కోళ్. తీసుకొనిపోవు ; త. కొళ్ళై. దోపిడి, అధికం, కొళ్. బలవంతగా లాక్కోడం. కొళ్ (ళ్-ట్-ప్-.) బలవంతంగా లాక్కొను ; మ. కొళ్ల. దోపుడు, దోపిడి, నాశనం ; కొడ. కొళ్. కొల్లగొట్టడం.

**కొల్లకత్తె** వి. కొల్లపెట్టే స్త్రీ, దోపుడుకత్తె. **కొల్లకాఁడు** వి. కొల్లగొట్టేవాడు. ఘటికా 2.140. క. కొళ్లెగాఁడు, దోపిడీ వాడు ; త. కొళ్ళైక్కారన్. **కొల్లకొట్టు** రూ.చూ. కొల్ల గొట్టు. అ.క్రి. 1. దోచుకొను ; కొల్లగా సంపాదించు. **కొల్లకొల్ల** క్రి.విశే. చాలినంతగా. రాధి. 2.140. **కొల్లగు** అ.క్రి. నీటితోనిండు, అణుగు. < కొల్ల + అగు. **కొల్లగొట్టు** (-కొట్టు) రూ. కొల్లకొట్టు. అ.క్రి. 1. కొల్లగా సంపాదించు. కాశీ. 3.91 ; 2. కొల్లపెట్టు, దోచుకొను ; 3. ఏదోఒకటి చేయు. త. కొళ్ళైయుటి. కొల్లగొట్టడం. **కొల్లగొను**(-కొను) స.క్రి. 1. పుష్కలంగా పొందు. వరాహ. 10.13 ; 2. దోచుకొను. మను. 5.82. **కొల్లపడు** రూ.చూ. కొల్లవడు. అ.క్రి. దోపుడుపడు, అపకృతమగు. **కొల్లపఱచు** రూ. కొల్ల పఱుచు. స.క్రి. కొల్లపెట్టు, దోచుకొను. రంగ.చ. 3.265. **కొల్లపఱుచు** రూ.చూ. కొల్లపఱచు. స.క్రి. కొల్లపెట్టు, దోచుకొను. **కొల్లపుచ్చు** స.క్రి. 1. చూరగొను, అపహరించు. భాగ. ఉ. 8.38 ; 2. చెరచు, భ్రష్టంచేయు. జాహ్నవీ. 3.79. **కొల్లపెట్టు** రూ.చూ. కొల్లవెట్టు. స.క్రి. 1. దొంగి లించు, దోచుకొను, కొల్లగొట్టు. దశా. 9.196 ; 2. అధి కంగా సంపాదించు. **కొల్లపోవు** రూ.చూ. కొల్లవోవు. అ.క్రి. 1. చెడు ; 2. భగ్నమగు ; 3. దోపుడుపడు. **కొల్లఁబోవు**

(-పోవు) అ.క్రి. 1. విఘ్నమగు, చెడు. కాశీ. 2.114 ; 2. దోషయుతపడు. కొల్లరి వి. కొల్లగొనేవాడు. దోషుడురాడు. రంగ. చ. 3.265 <కొల్ల+అరి. కొల్లలాడించు స.క్రి. కొల్లగొట్టించు. ద్వి. హరిశ్చ. 1.1146. పం.<కొల్ల+-లు+ఆడు+-ఇంచు[3]. కొల్లలాడు స.క్రి. 1. దొంగిలించు, దోచుకొను. పరమ. వి. 3.80; 2. యథేచ్ఛగా అనుభవించు ; 3. కొల్లగా సంపాదించు.<కొల్ల+-లు+ఆడు. కొల్లలిడు స. క్రి. 1. దోచుకొను ; 2. అధికంగా సంపాదించు < కొల్ల +- లు +- ఇడు. కొల్లలు( గొమ్ములువోవు(-పోవు) అ. క్రి. అత్యధిక మగు, వృద్ధి నొందు. దశకు. 10.111. కొల్లలుమీఱు అ.క్రి. ఎక్కువగు. రుక్మాం. 3.129. కొల్లవట్టు(-పట్టు) స.క్రి. కొల్లగొట్టు, దోచు, పరాహ. 1.31. కొల్లవడు(-పడు) రూ. కొల్లపడు. అ.క్రి. దోపుడుపడు. కొల్లవా(డు వి. కొల్లరి. కొల్లవిడు స.క్రి. కొల్లగొట్టు. కొల్లవిడుచు స.క్రి. 1. యథేచ్ఛగా అనుభవింపనిచ్చు, పుష్కలంగానిచ్చు. జైమినీభా. 1.73 ; 2. వశపరచు, అధీనంచేయు. ప్రభా. 2.111 ; 3. తాము తీసికొనగా మిగిలినదానిని ఇతరులనుభవింపనిచ్చు. కొల్లవెట్టు(-పెట్టు) రూ. కొల్లపెట్టు. స.క్రి. 1. అధికంగా సంపాదించు. పుష్కలంగా పొందు. కాశీ. 2.156 ; 2. దొంగిలించు, దోచుకొను, కొల్లగొట్టు. భాగ. 7.225. కొల్లవోవు(-పోవు) రూ. కొల్లపోవు, అ.క్రి. 1. చూరపోవు, అపహృతమగు శుక. 2.360 ; 2 చెడు, భగ్నమగు. త. కొల్లైపో. అన్నివిధాల చెడు, కొల్లాడు స.క్రి. 1. దొంగిలించు, దోచుకొను, హరించు. ఉ.హరి. 4.84 ; 2. అధికంగాపొందు. కాశీ. 2.37 ; 3. తనివితీర అనుభవింపనిచ్చు. శుక. 4.23.<కొల్ల+ఆడు.

కొల్లగంజేరు వి. రోడ్ల పక్కలలోనూ, బంజరు నేలల్లోనూ పెరిగే తెల్లటిపూలు, నల్లటి విత్తులు కాసే ఒక కలుపుమొక్క (Trianthemamonogyna).

కొల్లజేయు(-చేయు) స.క్రి. పడుగుపోగులు విడదీయు.

కొల్లము వి కొండపైభాగం, నెత్తం. పండి.చ. 5.48 పు. 18 పం.

కొల్లా వి. ధాన్యం నిలవచేసే పెద్ద మట్టిపాత్ర.

కొల్లాటిపక్షి వి. పికిలిపిట్ట.

కొల్లాటిపిట్ట వి. పికిలిపిట్ట, ఒకానొకపక్షి.

కొల్లాడు చూ. కొల్ల.

కొల్లాపురము వి. లేనిపోని జంజాటం.

సం. కొల్లాపుర. ఒకానొక నగరం (అర్థవిపరి.).

కొల్లాబండి చూ. కొల్లారు. వి. ఒకరకం బండి.

కొల్లాము వి. పెనరపొట్టు మొ. వాటిని పోసుకొనే పెద్దగంప.

కొల్లాయ రూ.చూ. కొల్లాయి. వి. చిన్న అంగవస్త్రం, గావంచా.

కొల్లాయగుడ్డ రూ.చూ. కొల్లాయిగుడ్డ. వి. చిన్న పలచని తుండు, చిన్న అంగవస్త్రం, గావంచా. కొల్లాయపంచె రూ.చూ. కొల్లాయిపంచె. వి. చిన్న అంగవస్త్రం, గావంచా.

కొల్లాయి రూ. కొల్లాయ. వి. అంగవస్త్రం, గావంచా.

కొల్లాయిగుడ్డ రూ. కొల్లాయగుడ్డ. వి. చిన్న పలచని తుండు, చిన్న అంగవస్త్రం, గావంచా. కొల్లాయిపంచె రూ. కొల్లాయపంచె. వి. అంగవస్త్రం, మగవాళ్ళు మోకాళ్ళవరకు కట్టుకొనే వస్త్రం, చిన్న తుండుగుడ్డ.

కొల్లారము రూ.చూ. కొల్లారు. వి. చతుశ్శాల, నాలుగిళ్ళ భవంతి, నడుము, బయలువైపుల కట్టడంగల ఇల్లు.

కొల్లారు రూ. కొలారము, కొలారు, కొల్లారము. వి. చతుశ్శాల, నాలుగిళ్ళ భవంతి, నడుమ బయట నాలుగు పక్కల కట్టడం గల ఇల్లు.

క. కొల్లార, కొల్లారి, కొల్లారు. ఎద్దుబండి (కట్టు) ; త. కొల్లాప్పంటి. ఎద్దుబండి ; మ. కోలార్-వంటి.

<క. కొల్లార.

కొల్లారు బండి రూ. కొలారు బండి, కొల్లార్బండి. వి. కంబళితో కప్పబడిన బండి. కువల. 4.213. కొల్లార్బండి రూ.చూ. కొల్లారుబండి. వి. కంబళంతో కప్పినబండి. ఆం.భా. 2.201.

పో.చూ. ఉ. ఖులా.

కొల్లార్బండి చూ. కొల్లారు.

కొల్లి వి. ఒకానొక చెట్టు, వృక్షవిశేషం.

కొల్లికరజము వి. పాలంక్య, వృక్షవిశేషం. కొల్లికూర వి. తోటకూర.

కొల్లింగతీగ వి. బంతి ముసుపడు తీగ, పొదలాగపెరిగే ఒక రకంతీగ (Calycopteris floribunda).

కొల్లు[1] రూ.చూ. కొలను. వి. 1. నీళ్ళగుంట ; 2. చెరువు తూమునుంచి బయటకి నీళ్ళుఆపి పొలాలకు పెట్టటానికి తూముదగ్గర గచ్చుతోగాని సిమెంటుతోగాని కట్టిన తొట్టి ; 3. కాల్చని సున్నపు రాళ్ళగుట్ట.

పో.చూ. క.కొళ,కొళహొ. చిన్నగుంట ; గోం.కొల్. చెరువు.

కొల్లుకట్ట వి. నీటిగుంట. కొల్లుగుంట వి. 1. నీటిగుంట ; 2. మోటదోనెనుంచి వచ్చిన నీరు నిలిచేచోటు.

కొల్లు[2] స.క్రి. 1. చంపు ; 2. దోచుకొను.

క. కొల్, కొలు, కొల్లు. చంపు, హత్యచేయు ; కొడ. కొల్ల్. చంపు ; త. కొల్ (కొల్వ), కొన్ఱ్. చంపు, హత్యచేయు, నాశనంచేయు, చంపడం ; మ. కొల్లుక. చంపు, హత్యచేయు.

కొల్లుపోతు వి. 1. పెద్ద జాతిదున్నపోతు ; 2. ఎద్దైన మనిషి.

కొల్లె వి. ఒకరకం కత్తి, కుంచెపురి కొనలు సమంగా కోసే కత్తి.

కొల్లేటికొంగలు చూ. కొల్లేరు.

కొల్లేటిచేంతాడు చూ. కొల్లేరు.

కొల్లేటిమడుగు చూ. కొల్లేరు.

కొల్లేటివ్యవసాయం చూ. కొల్లేరు.

కొల్లేటువా(డు వి. తాపీవాడు.

కొల్లేరు వి. కృష్ణాజిల్లాలో ఒకచెరువు.

కొల్లేటికొంగలు వి.బ.వ. కొల్లేరుప్రాంతంలోఉండే కొంగలు. కొల్లేటిచేంతాడు వి. కొల్లేరుప్రాంతంలో చేదకు కట్టేమిక్కిలి పొడవైనతాడు, పొడవైనతాడు. కొల్లేటిమడుగు వి. 1. ఒక నరన్సు ; 2.సుదీర్ఘమైనది, అంతంలేనిది. కొల్లేటివ్యవసాయం వి. లాభంలేనిది, వృథా.

**కొల్వటి** వి. ఒకరీతినాట్యం.

**కొల్వముంత** రూ.చూ. కొల్తముంత. వి. కల్లు కొలిచి పోయ డానికివాడే మట్టిపాత్ర.

**కొల్వు** రూ.చూ. కొలువు. వి. 1. ఆస్థానం, రాజసభ. విక్ర. 3.44 ; 2. సేవ, పరిచర్య ; 3. ఆస్పదం, స్థానం ; 4. గ్రామశక్తికిచేసే ఉత్సవం ; 5. ప్రభుత్వోద్యోగులు చేసిన సేవకు పారితోషికంగా ఇచ్చినభూమి.

కొల్వుకూటము రూ.చూ. కొలువుకూటము. వి. సభ. శృం.నై. 3.105. కొల్వుగొను (-కొను) రూ.చూ. కొలువ గొను. స.క్రి. 1. సేవకునిగా పరిగ్రహించు ; 2. సభ తీర్చు. కొల్వుడుకాఁడు రూ. కొలువుడుకాఁడు. వి. సేవకుడు. ఆం.భా. 2.184. కొల్వుండు రూ. కొలువుండు. స.క్రి. సభచేసి ఉండు, కొలువుచేయు. పంచ. చ. 2.128 ప. కొల్వుదీర్చు (-తీర్చు) రూ. కొలువుదీర్చు. స.క్రి. సభ చేయు, విడియు. దశా. 1.263. కొల్వుమ్రొక్కు రూ. కొలువుమ్రొక్కు. వి. సభతీర్చి ఉన్న రాజాదులకు చేసే నమస్కారం. దశా. 2.381. కొల్వువిచ్చు స.క్రి. సభ చాలించు. ద్వి. హరిశ్చ. 318 పు. 19 పం. కొల్వువిడియు రూ.చూ. కొలువువిడియు. అ.క్రి. కొలువుతీరు. కొల్వువిరియు రూ. కొలువువిరియు. అ.క్రి. సభ చాలించు. ఆము. 4.227. కొల్వుసేయు (-చేయు) రూ.చూ. కొలువుసేయు. అ.క్రి. సభచేయు, నివసించు. కొల్వొసంగు రూ.చూ. కొలువొసంగు. అ.క్రి. కొలువగు, సభచేయు.

<కొల్వు + ఒసంగు.

**కొల్వొసంగు** చూ. కొల్వు.

**కొళకి** వి. లోపల కళాయిచేసిన ఇత్తడిపాత్ర.

**కొళపొయ్యి** రూ.చూ. కొడిపొయ్యి. వి. పెదపొయ్యి.

**కొళబె** వి. బోలుగల కొయ్య.

**కొళాయి** రూ.చూ. కుళాయి[2]. వి. 1. గొట్టం ; 2. నీటిగొట్టం ; 3. గొట్టంఆకారంలో నాలుగైదు అంగుళాలపొడవు గల ఒకరకం చిచ్చుబుడ్డి.

**కొళిగె** రూ.చూ. కొడిగె[1]. వి. నమస్కారం.

**కొళిపిగూటం** వి. నేతమోకురాపిడికి అరగకుండా గొట్టంబొడిగిన మిడిగూటం.

**కొళు**[1] రూ.చూ. కొళ్లు[2]. వి. ఉలవలు.

**కొళు**[2] రూ.చూ. క్రొళ్ళు. వి. దగ్గినప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం.

**కొళొచు** స.క్రి. 1. చెక్కు E.P.I. సంపు. 27. శా. సం. 42. క్రీ.శ. 800సం ; 2. శాపదండంచేయు.

**కొళ్లు**[1] రూ.చూ. క్రొళ్ళు. వి. దగ్గినప్పుడు అయ్యేధ్వనికి అనుకరణం. విష్ణు. పు. 4.19.

**కొళ్లు**[2] రూ. కొళు[1]. వి. ఉలవలు. వేం. పంచ. 4.45.

సం. కుళత్థ-. ఉలవలు ; ప్రా. కులత్థ-.

తు. కుడు ; త. కొళ్, కోళ్లు. ఉలవలు. ఒకమొక్క (Dolichosufours); మ. కొళ్లు. ఉలవలు ; పర్జి. కొళ్. ఒకానొక మొక్క.

<ప్రా. కులత్థ.

కొళ్లగంజి వి. ఉలవలు ఉడకవేసిన నీరు.

**కొళ్ళు**[3] వి. 1. కిటికీ ; 2. వాకిలిచట్రాలు బిగించడానికి పాటి కొయ్యలకు చివరకు వేసేశీలి.

**కొళ్ళ** రూ. చూ. కొల్ల. విశే. అధికమయిన.

**కొళ్ళపుబండ** వి. కల్లీ, సున్నం కోసం కాల్చిన తర్వాత మిగిలినరాయి.

**కొవిరె** రూ. చూ. కొమర. వి. పెద్దదూలాల మీదపిల్ల దూలాన్ని నిలిపేకొయ్య, మేలుదూలం మీదిగుజ్జు.

**కొవిల** వి. ఏనుగు పగ్గాలు పేనటానికి ఉపయోగించే పీచువంటి బెరడుకలిగిన చెట్టు.

(Sterculiavillosa).

**కొవ్వాళ్ళు** వి.బ.వ. మూతిసన్నగా పొడుగ్గాఉండే ఒకరకం తెల్లచేపలు.

**కొవ్విలివువ్వు** వి. ఒకానొక తీగ, లతావిశేషం.

**కొవ్వు** రూ. చూ. క్రొవ్వు. వి. 1. బలుపు ; 2. మదం ; 3. మెదడు. అ. క్రి. 1. బలిసిఉండు ; 2. గర్వంతోఉండు.

కొవ్వుపెంకు వి. ఇంటిపెంకుకువాడే దళసరిపెంకు, గుండు పెంకు. కొవ్వురోగం వి. మగతెగులు, పురుగులు పట్టి చెట్టు తెల్లబడిపోయే ఒకరకం తెగులు. కొవ్వువత్తి రూ. చూ. క్రొవ్వువత్తి. వి. మైనంవత్తి.

**కొవ్వురాయి** వి. సారెమొలను దించటానికి గుచ్చిగుడ్డలో పొదిగిన రంధ్రమున్నరాయి, గుబ్బిరాయి.

**కొవ్వెర** రూ. చూ. కొబ్బెర. వి. కొబ్బెరకాయలోని పేషం, కొబ్బరిగుంజు. ఆం. భా. 2.78.

**కొవ్వొత్తి** చూ. కొవ్వు. రూ. చూ. క్రొవ్వువత్తి. వి. మైనపువత్తి.

**కొశ** వి. పదును.

**కొశాకు** క్రి. విశే. బాగా ; వి. గుబురుగా ఎదిగే బీటిగడ్డి.

**'కొశ్చన్‌మార్కు' మొగంపెట్టు** స. క్రి. ప్రశ్నార్థకంగా చూచు.

ఇం. *Question mark* ప్రశ్నార్థకం.

<Question mark + మొగంపెట్టు.

**కొష్టం** రూ. చూ. కొట్టము[1]. వి. పశువుల నివాసంకోసం ఏర్పరచిన ఇల్లు.

**కొస** వి. 1. అగ్రం, చివర. వేంక. పంచ 2.194 ; 2. ఉపయుక్తంగాని తృణాదుల అగ్రాంశం ; 3. కొంగు ; 4. జడ చివర వేసేపేలిక ; 5. దూలం చివరిభాగం ; విశే. కడపటి చివర. మొల్ల. యు. 1.23.

క. కోసు. వంకరగాఉండు, నలుచదరంగా ఉండటం ; కూచి, కూచు, కోచు ; పో. చూ. త. కుమవమ్, కొయ్‌చకమ్, కొయ్చువనమ్. కోశయుక్కపైట అంచులో ఒకమూల భాగం ; కోయ్. (-మ్-క్-). కొనలు ముడుచు ; కువి. కోస్స. కొన ; పర్జి. కొచి. కొన, కొన. పో. చూ. మాల్తో. కొచి. కుచ్చిళ్ళు.

కొసకట్టు వి. కుంచె చెంపలకు వేసిన దారపుకట్టు. కొసకరించు స.క్రి. చివరకు కొనితెచ్చు. కొసకు అవ్య.ద్రు. తుదకు, కడకు. కొసగలముత్తెము వి. ముంతమామిడిపండు లాగ, ఉన్న ఒకవిలువైన ముత్యం. కొసచిట్టె వి. పంటెఆకులు బిగింపు కోసం కిందవేసేఅడ్డబద్ద. కొసనేత వి. కడతట్టునేత, బట్టచివరిభాగంలో నేసిననేత. కొసపట్టె వి. కుసి ఉన్నవైపున గల తలుపుపట్టె. కొసమలకర్ర వి. అల్లు చేసేటప్పుడు,

ఒకబట్టనేతకు సరిపడేపడుగు బిగింపుకోసం చివరపెట్టిన కట్టె. కొనమలబద్ద వి. పడుగులో చివరమార్చిన వెదురు బద్ద. కొనమలవిరుపు వి. మలలుగా ఏర్పరచిన పడుగుకట్టలో చివరిలాక. కొనవానం వి. చిట్టచివరి వానం. కొనవెట్టి రూ. కొసెట్టి. వి. ముక్కోపి. కొనవెలితి అవ్య. తలగీసి. కొసెట్టి రూ. చూ. కొనవెట్టి. వి. ముక్కోపి.

**కొసరించు** చూ. కొసరు.

**కొసరు** పో. చూ. కొదుకు. వి. 1. వాంఛ, కోరిక, ప్రార్థన. కు. సం. 4.9; 2. విజృంభణం. దశకు. 9.33; 3. సంకోచం, జంకు. భాగ. 9.194; 4. లోపం. పి. శకు. 1.7; 5. సంశయం, సందేహం. ప్రభు. 4.105; 6. అనులాపం, మాటిమాటికి పలకడం. ఆం. భా. 1.115; 7. సరకులు కొనేవాడికి అమ్మేవాడిచ్చే పెచ్చు; అ. క్రి. 1. సంకోచించు, జంకు. రం. రా. అయోధ్యా. 110వ. 13వం; 2. తప్పు, విఫలమగు. భాగ. 10వ. ఉ. 834; 3. మాటిమాటికి కూయు; 4. విజృంభించు. కాశీ. 5.168; స. క్రి. 1. కొనేవాడు తానిచ్చిన వెలకు సరిపడిన సరుకుకంటె ఎక్కువగా అడుగు. విక్ర. 1.183; 2. అపేక్షించు, కోరు, ప్రార్థించు, వేడు. మను. 5.40; 3. ఆస్వాదించు, అనుభవించు. వసు. 3.85.

క. కొసరు. అత్యాశపడు, కోరు, అత్రత, కోరు, ఆలోచించు; తు. కొసరు, కోరుని. కోరు, ఆశించు, ఊహించు; కోరికె, కోరిగె. కోరు, ఆశించు; కుసురి, కుస్ని, కొసరు. ఏదైనకొన్న తర్వాత అడిగే అధికభాగం; త. కోరు, కోరి, కోరు. ఆశించు; కోరిక్కై. కోరిక, ఆశ; కుచర్, కొచుఱు, కొచర్. ఏదైనకొన్న తర్వాత అడిగే అధికభాగం; మ. కోఱు, కోఱుక. కోఱ. ఆశించు, ఆలోచించు; కొం. కొర్కృ. దేవుడికి చేసే మొక్కు; గద. కోర్. కోరు.

కొసరించు స.క్రి. 1. కొన్నతర్వాత కొంచెం ఇమ్మని అడుగు; 2. చివరకు కొనితెచ్చు.

**కొసరుచెట్టు** వి. ఒకానొక చెట్టు. వృక్షవిశేషం (Mucuna Penifus).

సం. కండూప్రల. వృక్షవిశేషం.

**కొసి** వి. ఏదైనా స్థలంలోకాని పొలంలోకాని ఒక మూలకు హెచ్చుగా ఉన్న భూభాగం.

**కొసికింత** అవ్య. కొంచెం, కాసింత, కసింత.

**కొసిగ్గుర్దలి** వి. ఒకరకం తవ్వుపనిముట్టు.

**కొసెంగి**[1] వి. వెర్రికరకచెట్టు, గట్టిగా ఉండే ముళ్ళుండే ఒకరకం చెట్టు (Bridelia Retusa).

**కొసెంగి**[2] వి. పుసుకచెట్టు, పెద్ద ఆకులు కలిగి చమురునిచ్చే గింజలు కాసే ఒకరకం చెట్టు (Schleichena Trifinga).

**కొసెట్టి** చూ. కొన.

**కొస్సె** వి. 1. దర్భ.ఆం.భా. 2.75 (Poucynosuroides); 2. పుడక; 3. పొడవు.

సం. కుశ-; ప్రా. కుస-, ప్రా. కుస-, కుసక-; నే. కుస్; బెం. కుసా; ఒరి. కుశ; హిం. కుసా; సిం. కుస; మరా. కుశ్; తు. కుస; త. కుచై.

<ప్రా. కుస-.

**కో**[1] వి. 1. యుద్ధాదుల్లో ఉత్సాహసూచకంగా చేసే అరుపుకు అనుకరణం. భార. భీష్మ. 3.409; 2. ఘోషకుడు అరుస్తూ చేసే ధ్వనికి అనుకరణం. పారి. 2.30; 3. ఏడ్చేటప్పటి ధ్వనికి అనుకరణం. విష్ణుపు. 7.11; 4. కోయిలకూతలోని ధ్వనికి అనుకరణం. చి.భా. 3.37; 5. భయంకరంగా అరవటంలో ధ్వనికి అనుకరణం. శుక. 2.537.

త. కో. అయ్యో, అకటా; కో-కో-. ఏడ్పులో అయ్యే ధ్వనికి అనుకరణం; కో-వ్-ఇణన్. అరచు, పెద్ద శబ్దం చేయు.

కోకటించు అ.క్రి. కో అను. పండి. చ. 5.439.

**కో**[2] రూ.చూ. కొను. అవ్య. కొన్ని పట్ల 'కొను' ధాతువుకు ఆదేశంగా పచ్చేది. వసు. 2.41; ఉదా. చెప్పుకో.

క. కో-. కొళ్ళుధాతువు యొక్క విధ్యర్థక ఏకవచన రూపం; కొళ్ళు, కొళు, కొళ్. తీసికొను, గ్రహించు; త. కో. విధ్యర్థకమైన సహాయక్రియ.

**కోక** వి. 1. వస్త్రం, బట్ట. బసవ. 4.101; 2. స్త్రీలు ధరించే ఉడుపు, చీర.

పో.చూ. త. కోఙ్కలర్-. ప్రాచీనకాలపు వస్త్రం.

కోకంచు వి. తెల్లజమిలి పోగులు పెట్టిలోపల మూడువేళ్ళ వెడల్పున రంగుదారం పెట్టి నేసిన చీర అంచు. <కోక+అంచు. కోకమ్మచేట వి. ముట్టుకోకలు ఉతికిన చాకలివాడికి మాములుగా ఇచ్చే చేటెడు గింజలు. కోకలబారు వి. రెండు చీరలు బద్దెతో కలిసి ఉన్నవి. కోక-వాక వి. గుడ్డు-గుడును అన్నదానికి సమానార్థక ప్రయోగం.

**కోకడము** వి. చమురి, సవరపుమృగం.

**కోకారము** రూ.చూ. క్రొక్కారము. వి. కోడికూత.

**కోకొల్లలు** వి.బ.వ. మిక్కిలి సమృద్ధి.

**కోకో**[1] వి. 1. కోకోపొడిరంగు; 2. పానీయవిశేషం.

**కోకో**[2] వి. ఒకరకంఆట.

**కోగిరి** వి. గుర్రపుజీను.

క. కోగిరు-. జీనుగా ఉపయోగించెడి మెత్తటి దిండు.

**కోగిల** రూ.చూ. కోయిల[2]. వి. కోయిల.

**కోగెల** రూ.చూ. కోయిల[2]. వి. కోయిల.

**కోఁగు**[1] స.క్రి. గొరుగు. ఆం.భా. 2.177.

క. కొయ్, కుయ్, కొయు, కొయ్యు, కోయు. పెరుకు, పీకు; తు. కొయ్, కొయిపుని. కొడవలితో కోయు; మ. కొయ్యక. కొడవలితో కోయు; కొయ్య; గోం. కార్. గొరగు; కొరితానా, కొరియానా.

కోఁగుట రూ. గోఁగుట. వి. గొరుగుట, క్షౌరం.

**కోఁగు**[2] వి. వరి మొ. వాటి నారు.

**కోచ** రూ.చూ. కొంచ[2]. వి. 1. సందేహం; 2. పిరికితనం.

**కోచు** వి. జలజంతువిశేషం. హంస. 4.186.

**కోచెము** వి. మంచిరుచిగల చిన్నచేప.

**కోచ్చిర్త** చూ. కోతి.

**కోజులు** వి.బ.వ. నీచులు, మొరకులు.

**కోంచిగూడు** వి. త్రిభుజాకారంలో ఉండే గూడు.

**కోంచ** రూ.చూ. కొంచ[2]. విశ. పిరికి, భీరువైన. అచ్చ.రా. యు. 1.20. వి. పిరికితనం, భయం. రంగ.చ. 1.168.

**కోంచతనము** రూ. కోంచదనము. వి. 1. భీరుత్వం, పిరికితనం. ఉ.రా. 3.49 ; 2. అల్పత్వం, తక్కువతనం. ఆనంద. పీఠి. 40. **కోంచదనము** (-తనము) రూ.చూ. కోంచతనము. వి. 1. పిరికితనం; 2. అల్పత్వం. **కోంచఫాలు** (-పాలు) అ.క్రి. భయపడు, భీతిల్లు. ప్రభా. 2.58.

**కోంజేరు** రూ.చూ. కొంజేరు. వి. చేలోకోనుగాఉన్నపూల, కుని.

**కోట** వి. 1. దుర్గం. భార. ఉద్యో. 1.297 ; 2. దుర్గప్రాకారం, రాజధానిచుట్టూఉండే ప్రహరీ. కాశీ, 1.26 ; 3. చుట్టూ ప్రాకారం కలిగిన రాజులు నివసించేపురం. ఆం.భా. 2.12 ; 4. తివాసీ నేతలో ఒకరకండిజైను ; 5. కళ్ళం, చుట్టూనలిగిన గడ్డితో వేసేకట్ట.

క. కొంటె. దుర్గం, కోట ; కోటె. కోట, ప్రాకారం ; తు. కోటె. కోట. కోటె. కోట, దుర్గం ; త. కోట్టై. కోట. కోటు- రక్షకస్థలం, కోట, దుర్గం, పరున ; నదీతీరం, ఎత్తు, కొండ, పర్వతం, శిఖరం ; మ. కోటు. కోట ; కోట్లు. కోట, రక్షకస్థలం ; గోండ. కొట్. రాజభవనం, కోట ; తా. క్వట్. బంగాళ.

పో.చూ. సం. కోట-, కోట్ట-, కోట్టార-. కోట, రక్షకస్థలం ; ప్రా. కోట్ట-

< మూ.ద్రా. కోట్ట్-.

**కోటకురములు** వి.బ.వ. గొంగళ్లనేసే కురమవాళ్లలో ఒకతెగ. **కోటకొమ్మ** వి. దుర్గప్రాకారశిఖరం. ఆము. 2.5. క. కుంబె. గాదిగోడ, పిట్టగోడవరుస. త. కొమ్మై- ప్రాకారం, బురుజు, చాలఎత్తుగాఉన్న మబ్బు. **కోటకొమ్మంచు** వి. కోటగోడమీది చిన్నకట్టడం ఆకారంలో వరసగా డిజైను నేసినఅంచు. **కోటకొమ్మలు** వి.బ.వ. కోటమీదిదళాలు. **కోటకొమ్ములు** వి.బ.వ. కోటమీదిదళాలు. **కోటకొరడు** వి. అలంగం, వప్రం. **కోటగాలి** వి. పడమటిదిక్కునుంచి వీచేగాలి, వేడిగాలి. **కోటంచు** వి. కొట్లకుపెట్టేఅంచు. < కోట+అంచు. **కోటతెప్ప** వి. పెద్దమబ్బు. **కోటబురుజు** వి. వప్రం. **కోటబొమ్మంచు** వి. కోటఆకారంలో, రంగుతో బొమ్మలు అద్దిన అంచు. < కోటబొమ్మ+అంచు. **కోటబొమ్మంచులు** వి.బ.వ. ఒకదానిమీదఒకటిగాఉన్న మబ్బుల తీరు. **కోటమబ్బు** వి. నల్లంచులున్న తెల్లమబ్బు.

**కోటడు** చూ. కోటము. వి. గుడ్లగూబ. క్రీడా. 51.

క. కోటు. ఒకరకంపిట్ట ; త. కోట్టాన్. గుడ్లగూబ.

**కోటము** చూ. కోటడు. వి. గుడ్లగూబ.

**కోటరము** చూ. కోడలు. రూ. కోట్రము. వి. కోడలితనం, కోడంట్రికం. భార. ఉద్యో. 3.112.

**కోటరి** రూ.చూ. కోటరి. వి. దినమొలతోఉన్న ఆడది.

**కోటరికము** రూ.చూ. కోడటికము. వి. కోడలితనం.

**కోటరించు** స.క్రి. కోరాడు, పందిముట్టెతోనేలపెల్లగించు. లక్ష్మీ. వి. 2.102.

క. కొటె. గోడకు కన్నంచేయు, తొలచు, రంధ్రంచేయు, తవ్వు, సొరంగంచేయు ; పో.చూ. త. కోటు- కోర, దంతం, కొమ్ము ; కొటై- రంధ్రం, గొయ్యి, పల్లం, తొర్ర.

**కోటరింపు** వి. పెద్దపులికూత.

పో.చూ. త. కోటు- కొమ్ముబూర.

**కోటటికము** రూ.చూ. కోడటికము. వి. కోడంట్రికం. రామా 1.2.

**కోటా**[1] వి. కోష్ఠ. ధాన్యపుకొట్టు, కొట్టం.

సం. కోష్ఠ-. ధాన్యంకొట్టు ; ప్రా. కోట్ఠ-

< ప్రా. కోట్ఠ-

**కోటా**[2] వి. భాగం, వంతు.

ఇం. *Quota*. మొత్తంలో వ్యక్తికి రావలసిన భాగం.

< ఇం. Quota.

**కోటాకు** వి. తాటి మొ చెట్లలోపుట్టేముడతపడని లేతఆకు మొలక, మొవ్వ.

**కోటాడు** స.క్రి. చెల్లించు.

**కోటానంగోటులు** రూ.చూ. కోటానగోటులు. వి.బ.వ. పెక్కుకోట్లు. విక్ర. 5.130.

**కోటానగోటులు** రూ. కోటానంగోటులు, కోటానుగోట్లు. వి.బ.వ. పెక్కుకోట్లు. భాస్క.రా. యుద్ధ. 2.63.

మరా. కోట్యానుకోటి.

క. కోటానుకోటి. లెక్కలేని, కోట్లకొలది ; త. కోటానుకోటి. అసంఖ్యాకమైన.

**కోటానుగోట్లు** రూ.చూ. కోటానగోటులు. వి.బ.వ. అసంఖ్యాకాలు.

**కోటాబద్ద** వి. పన్నెపుల్లలు చీల్చిసాపుచేసే గీరుకత్తి బిగించడానికి, గుంజకుకట్టిన వెదురుబద్ద.

**కోటారు** రూ.చూ. కోటేరు. వి. ఉపయోగించినప్పుడు తల కిందులుగాచేసి కాడిపై మోపేనాగలి.

**కోటి** రూ. కాటికాట్టి[1]. వి. వేగు, చారుడు, ఆము. 3.17.

పో.చూ. త. కోటి. చిన్నసూచన. కోల్. చాడీలు చెప్పు.

**కోటికాడు** రూ.చూ. కాటికాడు. వి. వేగువాడు, చారుడు, కావలివాడు. **కోటియడు** (-ఇడు) స.క్రి. చారులను నియమించు.

**కోటికిబడగయెత్తు** (-ఎత్తు) రూ. కోటికిబడగెత్తు. అ.క్రి. కోటీశ్వరుడైనట్లు జెండాఎత్తుకొను, ధనాఢ్యుడగు, ఘనుడగు. కళా. 7.26.

**కోటికిబడగెత్తు** రూ.చూ. కోటికిబడగయెత్తు. అ.క్రి. కోటికి మించినద్రవ్యం కలిగివుండు.

**కోటికొండలు** విశ. అత్యధికమైన. నిర్వ.రా. 10.160.

**కోటింగు**[1] వి. పూత, పూతపైపూత, పైపొర.

ఇం. *Coating*. పైపూత.

< ఇం. Coating.

**కోటింగు**[2] వి. పొడుగులాగులు కోట్లు మొ. వాటికోసంనేసిన బట్ట.

ఇం. *Coating*. కోటులకైనబట్ట.

<ఇం. Coating.

**కోటిబుడమ** వి. మెట్టపడ్లలో ఒకరకం.

**కోటిభండాలు** వి.బ.వ. బండిపైతెచ్చే సరకులు.

**కోటిరకము** రూ.చూ. కోడటికము. వి. కోడలితనం, కోట్రటం.

**కోటిలనేత** వి. పెద్దగళ్ళుపడేట్టునేసిననేత, హొప్పిళినేత.

**కోటీలు** రూ.చూ. కోటేరు. వి. ఉపయోగించేటపుడు తలకిందులుగా చేసి కాడిపైమోపేనాగలి.

**కోటు**[1] వి. చొక్కాయి.

ఇం. *Coat.* కోటు.

<ఇం. Coat.

**కోటు**[2] వి. చీట్లాటలో గెలుపురంగు చెప్పబడేఆట.

త. కోట్టు, ఆటలోఅన్నిముక్కలుగెల్పు.

**కోటెవడ్లు** వి.బ.వ. ఒకరకంముతకవడ్లు.

**కోటేరు** రూ. కొటారు², కొడారు, కోటారు, కోటీలు, కోటేలు, గోటేరు. వి. విపరీత బద్ధలాంగలం, దుక్కికిపోయేటప్పుడు కాని దుక్కిఅయి మరలివచ్చేటప్పుడు కాని పడతమీదగా కాడికి తగిలించిన నాగలి. పరమ. వి. 7.531. ఇందు. 2.164.

పో చూ. త. కోటు- ఎత్తు, ఔన్నత్యం.

**కోటేరువేయు** అ.క్రి. నాగలినిసంకుచితపరచు.

**కోటేలు** రూ.చూ. కోటేరు. వి. ఉపయోగించేటప్పుడు తలకిందులుగా చేసి కాడిపై మోపేనాగలి.

**కోట్రేకు** రూ.చూ. కొత్రాకు. వి. పైరుపొటమీద నిటారుగా మొలచినఆకు.

**కోట్టము** వి. రాజ్యవిభాగం.

సం. కోట్ట-, దుర్గపురం, దుర్గం ; ప్రా. కోట్ట-, కుట్ట-; మరా. హిం.గు. కోట్.

<సం. కోట్ట- (అర్థవిపరి.).

**కోట్రటము** రూ.చూ. కోటరము. వి. కోడలితనం, కోడంట్రికం. విక్ర. 6.73.

**కోట్లంక** వి. పాపటకు, కుంచెపతెబట్టుచుట్టి దానిలోపున్న నేలను చదునుచేయటం.

**కోఠా** వి. సరకులు పెట్టుకొనేగది.

హిం. కోఠా. పెద్దగది.

<హిం. కోఠా.

**కోడ**[1] వి. 1. ఒకవిధమైన నారు. ఆం.భా. 2.35 ; 2. ఒకవిధమైన పొద. హంస. 4.9.

క. కొడ-, లేత, మృదువైన, చిన్నవయసు ; కూసు, పసిబిడ్డ, శిశువు, కన్య, పడుచు ; పో.చూ.త. కోటి. కొత్తదనం ; కోళ్-. వృద్ధి నొందుతున్న, భోగిఅయిన ; కొళున్తు-. అంటు కట్టటానికి కోసిన చిన్నకొమ్మ.

**కోడ**[2] వి. వేసవి, వేడిగాడ్పు.

క. కోడె-. వేడిగాడ్పు, వేసవి ; త. కోడై-. వేసవికాలం, పడమటి గాలులు వీచే సమయం, వేసవిలో కలిగే తాపం; కుడుక్కు. పడమర ; మ. కోడ-. పడమటిగాలి, చల్లగాలి.

**కోడ**[3] వి. ఒకరకం రాయి.

**కోడకత్తి** రూ. కొడగకత్తి. వి. ఒకకత్తి, పోరుచేయటానికి ఉపయోగించే కత్తి.

క. కొడపు-. క్రూరత్వం ; త. కోడుల్-. వంపు.

**కోడకొంగ** వి. గూడకొంగ.

**కోడంగి** రూ. కోడంగి, **కోణాంగి**. వి. అవయవాల్ని చూపి ప్రజల్ని నవ్విస్తూ బిచ్చమెత్తుకొనే దాసరి. పండి. చ. 2.166 వ.

క. కోడంగి. కోతిచేష్టలు చేసేవాడు, హాస్యగాడు ; తు. కోడంగి- హాస్యగాడు ; త. కోణంకి. విదూషకుడు, హాస్యగాడు ; కోడంకి. సోదె చెప్పేవాడు ; మ. కోమంకి. హాస్యగాడు, సోదె చెప్పేవాడు.

**కోడంటికము** రూ.చూ. కోడంట్రము. వి. కోడలితనం.

**కోడంట్రము** చూ. కోడలు. రూ. **కోడంటికము**, కోడంట్రికము, కోడండ్రము, కోడండ్రికము. వి. కోడలితనం. కళా. 7.89.

**కోడంట్రికము** రూ.చూ. కోడంట్రము. చూ. కోడలు. వి. 1. కోడలితనం. ఉ.రా. 4.208 ; 2. కోడలిని అత్తవారు పెట్టే బాధ.

**కోడండ్రము** రూ.చూ. కోడంట్రము. చూ. కోడలు. వి. కోడలితనం.

**కోడండ్రికము** రూ.చూ. కోడంట్రము. చూ. **కోడలు**. వి. కోడలితనం.

**కోడబడి** రూ. కోడిబడి. వి. పిల్లల ఒక దినుసు పిండివంట. హంస. 1.105.

క. కోడబళె. భక్ష్యవిశేషం ; తు. కోడుబళె ; మ. కోట్టల్. వంకరగా తిప్పు ; కోటల్. వంకర.

**కోడరికము** రూ.చూ. **కోడటికము**. వి. కోడలితనం.

**కోడటికము** చూ. కోడలు. రూ. కోటరికము, కోటటికము, కోటిరకము, కోడరికము, కోడ్రికము. వి. కోడలితనం. ఆం. భా. 2.111.

**కోడలితనము** చూ. కోడలు.

**కోడలు** వి. బా. కొడుకుయొక్క భార్య, స్నుష. భార. ఆది. 6.179.

పో.చూ.క. కొడ. మృదువైన, లేతవయసు. కొడగూసు కూసు. పడుచుపిల్ల. కొణాసు. పశువులలో చిన్నది, లేతది, లేతపశువు ; పో.చూ.త. కొళుంతు. లేతది ; కొళుంది. అన్న లేక తమ్ముని భార్య ; కొళుమై. తాజాదనం, అందం ; పో.చూ.మ. కొళుము, కొళున్తు-. లేతతీగె, లేతకొమ్మ ; గోం. కోరిఆఢె. కొడుకు భార్య. కోరిఅఢె-. తమ్ముని భార్య. కోఢిఅఢె. కోడలు ; పో.చూ. కొండ. కొరో-. కుమారుడు, బాలుడు ; కువి. కూరియ. కోడలు ; పో.చూ. కొలా. కొరల్-. తమ్మునిభార్య. కొరల్-. కోడలు, పెళ్ళికుమార్తె ; పర్జి. కొడాల్. పెళ్ళికుమార్తె; కొథ్. చాల చిన్న తక్కువ వయసు ; ఒల్లా. కొడాల్-. కుమారుని భార్య, తమ్మునిభార్య ; మాల్తో. కొర్రొ. చంటిబిడ్డ, పసిబిడ్డ.

పో.చూ. సం. కోరక. కోర. మొగ్గ ; కుణక. అప్పుడే పుట్టిన జంతువు.

<మూ.ద్రా. *కొట్+*అల్.

**కోడలితనము** వి. కోడలితనం, స్నుషాత్వం. దశా. 3.49.

**కోడాడు**[1] రూ.చూ. కోరాడు. స.క్రి. కొమ్ములతో పొడుచు. నృసింహ. 4.47 ; అ.క్రి. ప్రాణంతీయు. ఉ. హరిశ్చ. 6.45.

**కోడాడు**[2] అ.క్రి. 1. బాధపడు. భాగ. 9.483 ; 2. పరాభవపడు ; 3. ఆశ్చర్యపడు ; 4. అక్కసపడు.

క. కోడు. ముడుచుకొను, భయపడు, ఆశ్చర్యపడు ; పో.చూ.త. కొట్టమ్. క్రూరత్వం. కొరై. పిరికితనం, బిడియం, సిగ్గు ; మ. కోఙ్-. బిడియం, సిగ్గు.

**కోడారచెట్టు** వి. ఒకానొక వృక్షం. హంస. 4.9.

**కోడి**[1] వి. కుక్కుటం. భార. అను. 2.117.

క. కోళి. కోడి, కుక్కుటం ; కొడ. కొయ ; తు. కోరి ; త. కోఴి ; మ. కోఴి. కోడిపుంజు ; కోయి. కోడి ; తొ. క్వొడ్య; క్వొమ్ ; కువి. కోఙయు ; పో.చూ. పర్జి. కొఱ్ర్-. కోడి ; ఒల్లా. కొర్-. కోడి.

< మూ.ద్రా. *కోఠ్.

**కోడికట్టె** చూ. కోడిపీఁట. వి. ఒకరకం రెండునొగల బండికి రొంకిమొద్దు కిందవేసిన పట్టె. **కోడికండ్లచీర** వి. మూడు కొలుకులు నీలి ఒక కొలికి బీరపువ్వు రంగుల్లో రెండు వరుసలుపెట్టి తరువాత తొగరు, బీరపువ్వు, నీలి, 3 : 1 : 1 పోగులు చొప్పున నిలుపు అడ్డంపెట్టి నేసినచీర. **కోడికాడ** వి. ప్రశస్తమైన పశుగ్రాసం, ఒకదినుసు నల్లటితీగ. **కోడికాలు** వి. ప్రశస్తమైన పశుగ్రాసం, ఒకదినుసు నల్లటి తీగ. **కోడికుమకు** వి. అరకొర నిదుర. **కోడికూఁత** వి. కోడి అరుపు. **కోడికూఁతచుక్క** వి. పొద్దుపొడిచేముందు ఆకాశంలో కనిపించే నక్షత్రం. **కోడికూఁతవేళ** వి. కోడికూసే సమయం, తెల్లవారఝాము. త. కోఴికూనల్ కోఴికూవు నేరమ్. వేకువ, ప్రాతఃకాలం. **కోడికోడి** వి. నడుస్తున్న తేలు నిలవటానికి ఉచ్చరించే శబ్దం (కోడివచ్చి చంపుతుందని తేలు అభిప్రాయపడి నిలుస్తుందట). **కోడిగుడ్డుగూడు** వి. అండాకారంగా ఉన్న గూడు. **కోడిగుండెరాయి** వి. కోడిగుండెలాగ నలుపు కలిసిన ఎరుపురంగులో ఉన్న రాయి. **కోడిచీల** వి. బండి ఇరుసుకు తగిలించే వల. **కోడిజాబు** వి. కోళ్ళనుదాచే పెద్దబుట్ట. **కోడిజుట్టు** వి. కోడిపుంజు నెత్తిమీద ఉండే ఎర్రనికుచ్చు. త. కోఴిచ్చూట్టునే. కోడిపుంజు నెత్తిమీద ఉండే కుచ్చువంటి పెంద్రుకలు ; మ. కోఴిజుట్టు. **కోడిజెల్ల** వి. ఒక దినుసుచేప. **కోడిటెక్కమువాఁడు** వి. కుమారస్వామి. వ్యు. కోడిజెండాకలవాడు. **కోడిటెక్కము వావన్న** వి. గణపతి. వ్యు. కుమారస్వామి అన్న. **కోడిదేగ** వి. ఒక వన్నెగల పందెపుకోడి, పుంజు భేదం. **కోడిదుబ్బు** వి. ఒకవిధమైన వరితెగులు. **కోడినిద్ర** వి. కళ్ళు సగంమూసి నిద్రించడం, మెలకువతోకూడిన నిద్ర. **కోడిపట్టి** వి. ఒక ఆట. **కోడిపట్టె** వి. ఒకరకం నొగలబండికి రొంకిమొద్దు కింద వేసిన పట్టె. **కోడిపందెము** వి. రెండు కోళ్ళను ఉసిగొల్పి పోరాడేటట్లు చేసి, గెలుపోటములు నిర్ణయించటం. క. కోడపంద్య. **కోడిపీట** రూ.చూ. కోడిపీఁట. వి. కోడికట్టె, ఒకరకం రెండు నొగలబండికి రొంకిమొద్దు కింద వేసినపట్టె. **కోడిపీఁట** రూ. కోడిపీట. వి. బండిపోలు కర్రచివర కింద ఎత్తుగా ఉంచే మోపుడు కొయ్య, అనుకరం కు.సం. 4.439. **కోడిపుంజు** వి. మగకోడి. **కోడిపెట్ట** వి. ఆడకోడి. త. పెట్టైకోఴి. కోడిపెట్ట. **కోడిపేను** వి. చిక్కినదూడలకు పట్టే పేను. **కోడిపొలి** వి. 1. గ్రామాధారాల్లో దేవతల పేరపెట్టే నైవేద్యం ; 2. గ్రామదేవతలను, వ్యవసాయ ధనాన్ని ఆరాధించే విధానం. **కోడిపోరు** వి. కుక్కుట కలహం, ద్యూతభేదం. ఆం.బా. 2.306. **కోడిముచ్చు** వి. తుంగలాటి ఒకరకం కలుపుమొక్క. **కోడిమేను** వి. ఒకదినుసు చేప. **కోడిరెప్ప** రూ.చూ. కోడితెప్ప. వి. కనురెప్పలందు కలిగే రోగవిశేషం. **కోడితెప్ప** రూ. కోడిరెప్ప, కోడ్రెప్ప. వి. కనురెప్పలందు కలిగే రోగవిశేషం. బసవ. 3 వ. 788 పం. **కోడివాటము** వి. ఏటవాలుగాఉండే చూరు. క. కుడు. వంచబడిన, వంగిన, కుటిలమైన, కపటంకల ; త. కోటు-. వంపు, వంకర. **కోడివేఁడి** వి. చప్పునవచ్చే కోపం. **కోడ్రెప్ప** రూ.చూ. కోడితెప్ప. వి. కనురెప్పల్లో కలిగే రోగ విశేషం. పండి.చ. 4.273. **కోడ్లయిలు(-ఇలు)** వి. కోళ్ళను దాచే మట్టికట్టడం. **కోళ్ళగంప** వి. కోళ్ళనుదాచే పెద్దబుట్ట. **కోళ్ళగూడు** వి. కోళ్ళను దాచే పెద్దబుట్ట, కోళ్ళను దాచే మట్టికట్టడం. **కోళ్ళతొట్టి** వి. కోళ్ళకు నీళ్ళు పెట్టడానికి గుండ్రంగా అంగుళం ఎత్తుతోఉండే మట్టిపాత్ర. **కోళ్ళదుత్త** వి. కోళ్ళకు నీళ్ళు పెట్టడానికి వాడే గుండ్రని మట్టిపాత్ర. **కోళ్ళబుట్ట** వి. కోళ్ళను దాచే బుట్ట. **కోళ్ళమూకుడు** వి. కోళ్ళకు నీళ్ళుపెట్టడానికి గుండ్రంగా అంగుళం ఎత్తులో ఉండే మట్టిపాత్ర.

**కోడి**[2] వి. 1. చెరువులో ఎక్కువైన నీళ్ళు పొర్లిపోవటానికి కట్టకు పల్లంగా ఉన్న చివర ఏర్పరచిన రాతి కట్టడం ; 2. చెరువు.

త. కోటి. వంపు.

**కోడిగ** రూ. కోడి. వి. హారం, సరం. పార్వ. 2.23.

త. కోటికమ్, కోటి-అలంకరించు, తట్ట తబుకు, పూలతట్ట, నగలపెట్టె. కోటి. తలపైధరించేదండ.

**కోడిగము** రూ. కోడిగెము. వి. 1. వంచన, దశా. 5.26 ; 2. కొంటెతనం. శుక. 3.439. 3. విలాస చేష్ట, శృంగారచేష్ట అని. 1.119 ; 4. గేలి, పరిహాసం. చెన్న బసవ. 1.2 ; విణ. 1. వ్యర్థమైన. వేంక. పంచ. 3.187 ; 2. దుష్టమైన. విప్ర. 3.48.

పో. చూ. క. కోడి-కొరత, లోపం, తక్కువ ; కోడి గళె-కళె- ఉపేక్ష, అలక్ష్యం, స్వల్పం, కొంచెం ; తు. కోడంగై-హాస్యగాడు ; త. కోటు- కష్టం, శ్రమ, హింస, బాధ, ఉపద్రవం. కోటుమై. క్రూరత్వం, కాఠిన్యం ; కొట్టి. పరిహాసం, గేలిచేయు. మ. కొట్టి. గోష్ఠి-కుచేష్టలుచేయు, పరిహాసంచేయు, ముఖనికృతి.

**కోడిగించు** అ. క్రి. శృంగారచేష్టలుచేయు. పారి. పీఠి. 17. **కోడిగీఁడు** వి. 1. శృంగార చేష్టాపరుడు. విక్ర. 7.124 ; 2. కొంటెవాడు. వరాహ. 2.180.

**కోడిగించు** చూ. కోడిగము.

**కోడిగీఁడు** చూ. కోడిగము.

**కోడిగె** వి. ఉయ్యాల గొలుసుల్ని తగిలించే కొక్కెం.

**కోడిగెము** రూ. చూ. కోడిగము. వి. 1. వంచన; 2. విలాస చేష్ట, శృంగారచేష్ట; 3. గేలి, పరిహాసం; 4. కొంటె తనం.

**కోడిచ్చు** స. క్రి. ఇటుకల్ని నిలువుగాపేర్చు.

**కోడితనము** చూ. కోడిగము. వి. గేలి, అపహాస్యం.

**కోడితాఱు** రూ. చూ. కోడుతాఱు. అ. క్రి. పండినపైరు మిక్కిలిఎండు.

**కోడిబడి** రూ. చూ. కోడబడి. వి. పిల్లల ఒకదినుసు పిండివంట.

**కోడిబుడములు** వి.బ.వ. ధాన్యవిశేషం, అక్కుళ్ళు.

పో. చూ. క. కొడగద్దె-వేసవిలో పండేవరిపొలం; పో. చూ. త. కోట్-ట్-చంపా వేసవిలో లేచే 'చంపా' అనేఒకరకం వరి.

**కోడియ** రూ. కోడె. వి. గిత్త, వత్సం. వేంక. పంచ. 1.586.

పో. చూ. క. కొడ-మృదువైన, లేత. చిన్నవయసు; తు. కొణను. అడవిమృగాలలో చిన్నది; త. కోటి-కొత్తదనం, కోళుంతు. చిన్నది; చిరుప్రాయంలోనిది; కుయి. కోడి. ఆవు, ఎద్దు; కువి. కోడి, ఆవు; కజ్జకోడి-ఎద్దు; కొలా. కోడె, ఎద్దు.

**కోడిసె** రూ. చూ. కొడిస. వి. ఇంద్రవృక్షం, పాలకొడిసె.

**కోడీ** రూ. చూ. కోడిగ. వి. హారం.

**కోడీఁడు** చూ. కోడియ. వి. పిన్నవయసువాడు, చిన్నవాడు; 2. కుమారుడు.

**కోడు**[1] వి. బౌ. మంచం మొ. వాటికాలు. దశా. 1.14; 2. పత్తి రాట్నం నిలువుల మధ్య రూళ్ళకర్ర మాదిరిగాఉండే కట్టె; 3. పత్తిలో గింజలురాలగొట్టే పొడుగుకట్టె. 4. పేటుదారాలకు ఆధారంగా, డాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద; 5. దాకెపీటకు ఆధారంగా బిగించిన కొయ్య.

పో. చూ. క. కోడు. జంతువులకొమ్ము, చెట్టుకొమ్మ. పో.చూ. తు. కోడు. కొమ్ము; పో.చూ. త. కోటు. చెట్టుకొమ్మ, వీణ యొక్క ముఖ్యభాగం; తొ. క్వడ్-కొమ్ము, కొమ్మ. గోం. కోర్. పశువుల లేక జంతువుల కొమ్ము, చెట్టుకొమ్మ; కొండ. కొర్. కొమ్ములు; పర్జి. కొడ్ (బ.వ. కోడ్లు)-. కొమ్ము; ఒల్లా. కోర్. కొమ్ములు; మూ. ద్రా. *కాక్/* కాల్.

**కోడు**[2] వి. బౌ. కాలవ, ఊరిదరి నీటిపల్లం. భీమ. 3.22.

క. కోడి. కాలవ, నీరుపోటానికి ఏర్పరచిన దారి; తు. కోటి-ఒకపిల్లకాలువ; కోటు- క్రమంనుండి తొలగు.

**కోడు**[3] వి. రేఖ[3] గీత. ఆం. భా. 3.53.

త. కోటు. రేఖ; కొం. కొడ్.

**కోడుంక** రూ. చూ. కొడుంక. వి. అధివాసం.

**కోడుతాఱు** రూ. కోడితాఱు. అ. క్రి. పండినపైరు మిక్కిలి యెండు. రాధికా. 2.164.

పో.చూ. క. కోడు. చెట్టు కొమ్మ. తాఱు. ఎండు, తగ్గు, క్షీణించు, చిక్కు. పో.చూ. త. కోటు. చెట్టుకొమ్మ; తాఱు. గుంపు, సమూహం, గుత్తు.

**కోడుబిళ్ళ** చూ. కోడు[1] వి. ఒకరకం బాలక్రీడ.

**కోడె** రూ. చూ. కోడియ. వి. 1. కాడికిమరపదగిన మగదూడ, గిత్త. వరాహ. 6.86; 2. విటుడు. కవిక. 4.99; 3. సుమారు రెండేళ్ళ వయసుగల ఎద్దు. లేత ఆబోతు. విశే. 1. యుక్తవయసుగల, పడుచు. క్రీడా. 209; 2. మగదయిన. సమీర. 1.214.

**కోడెకాఁడు** వి. 1. విటుడు, పల్లవుడు. విప్ర. 2.27; 2. యువకుడు, తరుణుడు, పడుచువాడు. దశా. 6.74; 3. యౌవనానికి పూర్వదశలో ఉన్నవాడు. ఆం.భా. 2.118. **కోడెకొండ** వి. హిమాలయపర్వతం. కకుత్స. 1.194. వ్యు. వృథు చక్రవర్తి భూమిని ధేనువుగాను హిమవత్పర్వతాన్ని దూడగాను చేసిరత్నాల్ని ఓషధాల్ని పిదికినట్లుగా పురాణగాథ. **కోడెగాడ్పు** వి. పిల్లగాలి, మందమారుతం, చిరుగాలి. ప్రభా. 5.174. **కోడెతత్తడిసామి** వి. శివుడు. వ్యు. వృషాధిపుడు. **కోడెతత్తడిసామిచెలి** వి. కుబేరుడు. వ్యు. శివునిస్నేహితుడు. **కోడెతనము** వి. 1. పడుచుదనం. విక్ర. 8.8; 2. జాణతనం, ప్రౌఢ. ఉ. రా. 6.168; 3. విటత్వం. **కోడెత్రాఁచు** వి. పడుచు తాచుపాము. వేణు. 50. **కోడెదూడ** వి. చిన్నకోడెదూడ. **కోడెనాగు** వి. పడుచుతాచుపాము. వాల్మీ. 3.143. **కోడెపాము** వి. పడుచుపాము. ద్వి. సార.చ. 2 ప.66 పం. 10. **కోడెపాయము** వి. తారుణ్యం, యౌవనం. సమీర. 1.214. **కోడెపెయ్య** వి. చిన్నకోడెదూడ. **కోడెరవుతు** రూ. చూ. కోడెరౌతు వి. శివుడు, వృషభవాహనుడు. **కోడెరౌతు** రూ. కోడెరవుతు. వి. శివుడు, వృషభవాహనుడు. నరస. 5.22. **కోడెవయాశివజీరుఁడు** వి. వృషభవాహనుడు, శివుడు. శుక. 2.284.

**కోడెము** రూ. చూ. గూడెము. వి. పక్కటం.

**కోడేకు** రూ. చూ. క్రొట్టాకు. వి. పైరుపొట్టమీద నిటారుగా మొలచిన ఆకు.

**కోడేర** వి. ఒకరకం ముళ్ళమొక్క (Brideliaretusa).

**కోడేలు** వి. పుష్టిగా ఉండే ఎద్దు.

'ఏలు' అంటే జంతువు అని అర్థం. ఉదా. కుందేలు, తాదేలు <కోడె+ఏలు.

త. కొటు. లావైన.

**కోడ్రికము** రూ.చూ. కోడతికము. వి. కోడలితనం[1].

**కోడ్రెవ్వ** చూ. కోడి[1].

**కోడ్లయిలు** చూ. కోడి[1].

**కోణంగి** రూ.చూ. కోడంగి. వి. 1. శరీరావయవాల్ని వికారంగా చూపిజనులను నవ్విస్తూ బిచ్చమెత్తుకొనే దాసరి. ప్రబంధ. 78; 2. ఒకరకం కలుపు మొక్క.

**కోణంగితనము** వి. కోణంగి చేష్ట, వెక్కిరింత; క. కోడంగితన. వెక్కిరింత. **కోణంగిదాసరి** వి. దాసరినను కరించేహాస్యగాడు; త. కోణంకి-త్-తాచరి. దాసరి కులానికి చెందినకోణంకి. **కోణంగివాఁడు** వి. అంగాల్ని వికారంగా చూపి జనులనునవ్విస్తూ బిచ్చమెత్తుకొనే దాసరి.

**కోణవాటా** వి. బండి ఎద్దులను విడిచినపుడు దించకుండా నొగ (ల) కిందఎత్తుగా పెట్టిన పంగల కొయ్య.

**కోణాంగి** రూ.చూ. కోడంగి. వి. శరీరావయవాల్ని వికారంగా చూపి జనులనునవ్విస్తూ బిచ్చమెత్తుకొనే దాసరి.

**కోణామణి** రూ.చూ. కొణామణి. వి. కృష్ణాగోదావరి డెల్టాల్లో ఎక్కువగా పండించే పొడుగైన వడ్లు.

**కోణాలగొంది** వి. మిక్కిలి ఇరుకైన చీకటిమూల. పాండు. 5.296.

పో.చూ. క. కోణె. చీకటిమూల, వంటగది ; త. కోణమ్. మూల ; మ. కోణ్. మూల, కోణం. సం. కోణ. మూల.

**కోణిగి** రూ.చూ. కొణిగె[1]. వి. నమస్కారం.

**కోణిగె** రూ.చూ. కొణిగె[1]. వి. నమస్కారం.

**కోణే** వి. మూలఇల్లు, అంతఃపురం. కుపల. 2.43.

క. కోణె-. అంతఃపురం ; తు. కోణె. గది.

సం. కోణ-. మూల ; ప్రా. కోణగ-కోణయ. ఇంటి మూల.

< క. కోణె.

**కోంౘ్ర** రూ. కొంౘ్ర, గొంౘ్ర. వి. దున్నిన భూమిని చదును చేయడం.

పో.చూ. కోణె.

**కోంౘ్రగడ్డ** రూ. కోంౘ్రిగడ్డ, కోంౘ్రుగడ్డ, కోౘ్రగడ్డ. వి. కొంౘ్ర వేయవలసిన భాగం. **కోంౘ్రదుక్కి** వి. కోంౘ్ర వేసిన దున్నటం. **కోంౘ్రమలుపు** వి. నాగళ్ళు ఒక కోంౘ్ర కలిపి అవతలి కోంౘ్రలోకి తిరగడం.

**కోంౘ్రిగడ్డ** రూ.చూ. కోంౘ్రగడ్డ. వి. కొంౘ్రవేయవలసిన భాగం.

**కోంౘ్రుగడ్డ** రూ.చూ. కోంౘ్రగడ్డ. వి. కొంౘ్రవేయవలసిన భాగం.

**కోండ్లకమాను** వి. పక్కభాగాలు, వంపులు వంపులుగా ఉండే ఆర్చి.

**కోఁటరి** రూ. కోటరి. వి. దెసమొలగల ఆరది.

**కోఁడు** స.క్రి. ఓయ్యం మొ॥ వాటినించి సూకలు వేరు చేయటానికి చెరుగు. కకుత్స్థ. 5.123 ; వి. చెత్తాచెదారం తీసివేయటానికై మట్టిని జల్లించటం.

క. కొచ్చు. అనవసరపదార్థాల్ని తొలగించటానికై చెరుగు ; కొడ, త. కొఱికొడ్. చేటతో చెరుగు ; మ. కొటిక్క. చెరుగు ; తొ. క్వీట్ ; గోం.-కోస్స్ ; కుఇ. క్త్రూప్స్ ; కువి. క్రూహ్-కొర్స్స్ ; కొలా. గొన్జిప్.

**కోఁడుకొను** స.క్రి. చెరగుకొను. **కోఁడుపొయ్యి** వి. బూడిదనేలపై దాలకుండ అడుగున పెట్టినపొయ్యి.

**కోత** రూ.చూ. కోఁత. వి. 1. పండినపైరును కొడవళ్ళతో కొయ్యడం, పంట ఒడుపు ; 2. తయారైన గుడ్డను తీయ డానికి కొయ్యడం ; 3. తగ్గించడం ; 4. అసత్యం, అబద్ధం.

**కోతకచ్చి** వి. బట్టచివర, పేకదారం వెయ్యకుండా వదిలిన పడుగుపోగులు. **కోతకత్తి** వి. నేతపూర్తి అయిన తర్వాత, దోనెనుంచి బట్ట తీసివెయ్యటానికి బద్దెదగ్గర కోసే కత్తి. **కోతకర** వి. అచ్చుతుక్కోటానికి సుమారు జెత్తెడు వెడల్పు నేసి చివర జానెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ. **కోతకాలం** వి. పంటకోసేకాలం. **కోతకాలు** వి. సొరెమీదవాటను కోసిన తర్వాత మిగిలే మొదలు. **కోతగిన్నె** వి. మసాలవస్తువులు పెట్టుకోడానికి అరలు అరలుగాచేసిన మట్టిపాత్ర. **కోతగూడుకమాను** వి. పక్క భాగాలు వంపులువంపులుగా ఉండేఆర్చి. **కోతచెక్క** వి. 1. ఇటికచ్చుకు మిగిలిన మట్టినిచేసేచెక్క ; 2. ఇంటికప్పు వేయడంలో వాడే పలచని చెక్క. **కోతచ్చు** వి. రెండు గడులఇటికఅచ్చు. **కోతడోని** వి. ముప్పడోని, ఒకరకం బోటు. **కోతతాపి** వి. సన్నగా, పొడుగ్గా కోలగాఉండే రేకుగలతాపి. **కోతదబ్బ** వి. అచ్చుపెంకును కోయడానికి కమ్మర్లువాడే విల్లు వంటి సాధనం. **కోతదారం** రూ. కోద్దారం. వి. వాటలుకోయడానికి కడురుకు బదులుగా వాడే నూలుదారం. **కోతనేత** వి. నేతలోపనికిరాని భాగం. **కోతపట్టు** వి. కుండను కోయడానికి ముందు పట్టే పట్టు. **కోతపాలు** వి. పొదుగునుండి పితికిన పాలు. **కోతపెంకు** వి. కూననుంచి పగులుగొట్టి తీసిన భాగం. **కోతపొలి** వి. 1. గ్రామాల్లో దేవతల పేర పెట్టే నైవేద్యం ; 2. గ్రామదేవతలను, వ్యవసాయధనాన్ని ఆరాధించే విధానం. **కోతబద్ధ** వి. గూసపెండు నున్నపరచటానికి వాడే వెదురుబద్ద. **కోతబద్దె** వి. అచ్చుతుక్కోటానికి సుమారు జెత్తెడు వెడల్పు నేసి, చివర జానెడు పొడుగు దారాలువదిలిన గుడ్డ. **కోతముల్లు** వి. వాటల్ని కోయడానికి వాడేసన్నని ఇనపకమ్మి. **కోతరాయి** వి. రాతిపలకల ముఖాలకు మెరుగుపెట్టడానికి వాడే కఠినమైనరాయి. **కోతలరాయుఁడు** వి. అబద్ధాలు చెప్పేవాడు. **కోతలు** రూ.చూ. కోఁతలు. వి.బ.వ. 1. పైరును కొడవళ్ళతో కొయ్యటం, 2. అతిశయోక్తితోకూడిన మాటలు. **కోతలుకోయు** అ.క్రి. 1. అబద్ధాలు చెప్పు, ప్రగల్భాలుపలుకు; 2. పైరును కొడవళ్ళతో కొయ్యటం. **కోద్దారం** రూ.చూ. కోతదారం. వి. వాటలు కోయడానికి కడురుకుబదులు వాడే నూలుదారం.

**కోతి** వి. 1. ఎదురు దోనె దగ్గర అమర్చిన పళ్ళచక్రం, బిగింపుకు వేసిన ఇనప కొక్కెం ; 2. దాటికోలను లేప టానికి దిండు చక్రాన్ని గుంజే ఇనపరేకు.

**కోచ్చిర్త** రూ.చూ. కోతిచిరత. వి. నేతనేసేటప్పుడు అచ్చుకర్రల్ని సులువుగా లేపటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడ దీసిన కొయ్యపుల్ల. **కోతికట్టె** వి. నేత నేసేటప్పుడు అచ్చుకర్రను సులువుగా లేపటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడ దీసిన కొయ్యపుల్ల. **కోతికట్టెతాడు** వి. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగు తాడు. **కోతికొంకె** వి. అచ్చుగడులకు తగిలించే వంకర ఇనపఊచ. **కోతికొయ్య** వి. 1. డాబీదిండు తిప్పటానికి అమర్చిన కొయ్య ; 2. డాబీకట్టుబడిలో కుక్క కర్రను లేపేకొయ్య ; 3. డాబీకుక్కను కోతి కొయ్య కట్టెను కలిపేబద్ద ; 4. డాబీదిండుకు చేసిన బొడిపె ; 5. నేత నేసేటప్పుడు అచ్చుకర్రలు సులువుగా లేవటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. **కోతికొయ్యకట్టె** వి. కుక్కరెండో కొసబిగించిన పొడుగు బద్ద, లేదా ఇనపరేకు. **కోతిచిరత** రూ. కోచ్చిర్త. వి. నేతనేసేటప్పుడు అచ్చుకర్రల్ని సులువుగా లేపటానికి మగ్గంమీద దారంతో అడ్డంగా వేలాడదీసిన కొయ్యపుల్ల. **కోతితాడు** వి. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగు తాడు. **కోతిపట్టె** వి. గదిగోడలకు సరిగా పైకప్పు మీద

వేసే పట్టి. కోతిపుల్ల వి. నేతనేసేటప్పుడు అన్నుకర్రలు సులువుగా లేపటానికి మగ్గం మీద దారంతో అడ్డంగా వేలాడదీసిన పుల్ల. కోతిముక్కురాయి వి. గోడ కట్టేటప్పుడు మునుముందు పెంచుకోడానికి ఆనవాలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి. కోతిరాయి వి. పంచలు దించటానికి వీలుగా, అడ్డవాసాలు వేయ దానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుకు పొడుచుకొని వచ్చేటట్లుగా బిగించిన రాయి. కోతిసూత్రం వి. అచ్చును పైనుంచి వేలాడదీసే పొడుగుతాడు.

**కోౖత్రీలు** వి.బ.వ. మహాలక్ష్మి పూజకు ఉపయోగించే మట్టి పాత్రలు.

**కోదండము** వి. బాలదండన సాధనవిశేషం, నేరంచేసిన బాలురు పట్టుకొని వేలాడటానికి మీదకట్టినతాడు. హంస. 3.141.

క. కోదండ. నేరం చేసిన బాలుడు పట్టుకొని వేలాడ టానికి పైనకట్టినతాడు ; తు. కోదండ ; త. కోతంటుమ్. నేరంచేసిన బాలురు పట్టుకొని వేలాడటానికి పైనకట్టిన తాడు ; మ. కోదండమ్.పాఠశాలల్లో బాలురను దండించ టానికి వేలాడదీసిన తాడు.

పో.చూ. సం. కోదణ్డ-. విల్లు.

**కోదండముతీయు** అ.క్రి. కోదండమనే శిక్షను విధించు. **కోదండముపెట్టు** స.క్రి. 1. పైకెత్తు ; 2. కొరడాతో కొట్టడానికిగాను కట్టు.

**కోదండరామములు** వి.బ.వ. ఒకజాతి వడ్లు. హంస. 4.128.

సం. కోదండరామ-. ధనుర్ధారి అయిన శ్రీరామ చంద్రుడు.

<సం. కోదండరామ - (అర్థవిపరి.).

**కోదమ** వి. తెల్లగోదుమ.

త. కోటుమై. గోదుమ.

**కోదాడికాయలు** వి.బ.వ. హిజ్జలం, ఎర్రగన్నేరుకాయలు.

**కోదాడు** రూ.చూ. కోదాదు. వి. కాశవృక్షం.

**కోదు** వి. గంజాంలో నివసించే ఒక తెగ ప్రజ.

పో.చూ. త. కో-. కొండ ; పో.చూ. గోం- కోఇతుర్ -. గోండివాడు ; కుయి. కూఇ. గోండితెగ, గోండిబాష ; కూవిన్గ. గోండివాడు, గోండిబాలుడు.

**కోదులు** వి.బ.వ. గంజాంలో నివసించే ఒక తెగ ప్రజలు. **కోదువాండ్లు** వి.బ.వ. గంజాం ప్రాంతంలో ఉండే ఒక తెగ ప్రజలు.

**కోదువాలు** అ.క్రి. వరి ఎక్కువ ఎండి గింజలురాలిపోవు.

**కోద్దారం** చూ. కోత.

**కోన**[1] వి. 1. తోట. వసు. 2.20 ; 2. అడవి. అచ్చ.రా. ఆరణ్య. 49 ; 3. ఆశ్రమం.

పో.చూ. సం. కానన -. అడవి.

**కోనటెంకి** రూ.చూ. కోనతెంకి. వి. కోతి, వనచరం. **కోనతెంకి** రూ. కోనటెంకి. వి. కోతి, వనచరం. అచ్చ.రా. యు. 244. **కోనత్రిమ్మరి** వి. వనచరం, కోతి. అచ్చ.రా. కిష్కిం. 9. **కోనమనికి** వి. కోతి. అచ్చ.రా. కిష్కిం. 7 ; **కోనమనికిపట్టు** వి. కోతి, వనచరం. అచ్చ.రా. కిష్కిం. 11. **కోనమలహరి** వి. రాగవిశేషం. ప్రబంధ. 98. **కోనమెకము** వి. కోతి. అచ్చ.రా. యు. 311.

**కోన**[2] వి. 'కోన' అను దేశవిశేషం. మను. 1.37.

**కోనసీమ** వి. గోదావరి డెల్టాప్రాంతం. **కోనసీమ బ్రాహ్మణులు** వి.బ.వ. ద్రావిడ బ్రాహ్మణులలో ఒక తెగ వారు, పేయారిద్రావిడులు.

**కోన**[3] రూ. కోనం, కోనము. వి. 1. మూల. చేతో కోనుగా ఉన్న మూల. దశకు. 5.71 ; 2. లోయ, కొండ సందు. మను. 4.37 ; 3. కొన, అగ్రం. పాండు. 1.161.

క. కోన. మూల, కోణం. కోణ్, కోణ, కోణె ; తు. కోన. కోణె. మూల ; త. కోణమ్ ; మ. కోణమ్ ; మాల్తో. కోన్ర ; కొండ. గాన్.

సం. కోణ -. మూల.

మూ.ద్రా. *కోన్.

ఇది ద్రావిడపదమని టి. బరో అభిప్రాయం.

**కోనంచు** వి. పంచెలచాపులకు నేసే ఒకరకం అంచు. **కోనరాతి** వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగాపాతిన రాయి. **కోనఱేడు** వి. కోణపుడు, రాక్షసుడు, నైరృతుడు. **కోనవంక** వి. సెలయేరు. వేంక. 273.

**కోన**[4] వి. గోనమూహం. ఆం.నా.శే. 32.

సం. గో ; ప్రా. గో. ఎద్దు, ఆవు ; అ.మా. గోణ. ఎద్దు, గోణీ. ఆవు ; గోణసాలా. గోవులసాల ; జై. మహా. గోణె - ; మా. గోణ ;

క. కోణ. దున్నపోతు ; మూర్ఖుడు ; త. కో, కోన్ -. పశువులు ; పో.చూ. మ. కోనమ్ -. గోమాంసం.

<అ.మా. గోణ -.

**కోనం** రూ.చూ. కోన[3]. వి. రెండు భుజాలు కలిసిన మూల.

**కోనము** రూ.చూ. కోన[3]. 1. మూల ; 2. లోయ, కొండ సందు ; 3. అగ్రం.

**కోనంపీట** వి. ఒకరకం రెండునొగల బండికి మొద్దుకింద వేసిన పట్టె.

**కోనారి** వి. గొర్రెలకాపరి.

**-కోని** ప్రత్య. పురుషనామాంత శబ్దం. ఉదా.: శ్రీపురుషో త్తమకోని.

**కోనికాండ్రు** వి.బ.వ. 1. కుండలుతెచ్చేవారు ; 2. వంటవారు.

**కోను**[1] వి. ఇనపజల్లెడను పడకుండానిలిపిఉంచే పోటికర్ర.

**కోను**[2] వి. కుప్పొంమీదశంఖంలాగ ఉండే భాగం.

**కోనెము** వి. ఒకరకం చేప (Somberniger).

త. కోణమ్. వజ్రిరమనే చేప.

**కోనెటు** రూ.చూ. కోనేటు. వి. చుట్టూమెట్లు కట్టిన నలుచద రపు చెరువు, పుష్కరిణి. హంస. 4.210.

**కోనేరు** వి. శతభిషానక్షత్రం కావచ్చు, దగ్గరదగ్గరగా ఉండే నూరు చుక్కల గుంపు.

**కోనేటు** రూ. కోనెటు. వి.బొ. చుట్టూమెట్లు కట్టిన నలుచదరపు చెరువు, పుష్కరిణి. ఆం. భా. 1.162.

క. కోనేరు-. చుట్టూమెట్లు కట్టిన నలుచదరపు చెరువు ; త. కోనేరి. తిరుపతిలో ఉన్న పుష్కరిణి - స్వామిపుష్క రిణి.

**కో(త** రూ. కోత. చూ కోయు, వి. 1. ఛేదనం, ఖండనం.

ధార. శాంతి. 3.508 ; **2.** హింస, బాధ, ద్వి. సారంగ. చ. 1.28. పు. 22 పం. ; **3.** పంటకోయటం ; **4.** తగ్గింపు.

పో.చూ. క. కోత-. తగ్గింపు ; త. కొయ్‌తల్-. ఖండనం, కోత ; మ. కొయిత్తు. పంటకోయటం, కోత.

**కో(తకువచ్చు** అ.క్రి. కోసే పదునుకువచ్చు. **కో(తవట్టు** స.క్రి. కోతకోయనారంభించు. **కో(తవడు** రూ. కో(తపడు. అ.క్రి. **1.** ఖండితమగు, నరకబడు. విజ్ఞా. ప్రా. 47 ; **2.** హింసనొందు, బాధితమగు. శృం.నై. 3.120. **కో(తవదును** వి. చేనుకోసే కాలం. **కో(తలు** రూ. కోతలు. వి.బ.వ. **1.** గోరంతలు కొండంతలుగా చెప్పబడిన మాటలు ; **2.** పంట కోయటం. **కో(తలుకోయు** అ.క్రి. డంబాలుచెప్పు. స.క్రి. గోరంతలు కొండంతలుగా చెప్పు. **కో(తవడు** (- వడు) రూ.చూ. కో(తపడు. అ.క్రి. **1.** నరకబడు. భీమ. 3.37 ; **2.** హింసపొందు, బాధితమగు.

**కో(తి** రూ.చూ. క్రో(తి. వి. మర్కటం, వానరం. దశా. 1.295.

**కో(తికొమ్మకళ్ళు** వి. చెట్లపై బాలురు కోతులవలె ఆడుకొనే ఒకరకం ఆట. **కో(తికొమ్మచ్చి** రూ.చూ. కో(తికొమ్మంచి. వి. పిల్లలాడు కొనే ఒక ఆట. **కో(తికొమ్మంచి.** రూ. కో(తి కొమ్మచ్చి. వి. పిల్లలు చెట్లపై కోతులవలె ఆడుకొనే ఆట. **కో(తిగుమ్మకళ్ళు** వి. చెట్లపై పిల్లలాడే ఆట. **కో(తిపిళ్ళమామిడి** వి. ఒకరకం మామిడిపండు, మూతి దగ్గర ఎరుపు మిగిలిన భాగం ఆకుపచ్చకల మామిడి (సువర్ణరేఖ). **కో(తిపుల్లలు** వి.బ.వ. మగ్గపుపలక దారాల్ని మీదికి తగిలించే పుల్లలు. **కో(తిమామిడి** వి. కపీతనం, అంబాళం. వ్యు. కోతులకు ప్రియమైన మామిడి. **కో(తివన్నె** వి. కోతిరంగు, బూడిద రంగు.

**కో(దాడు** రూ. కోదాడు. వి. తాళవృక్షవిశేషం. హంస. 4.11.

మూ.ద్రా.*కోన్ - (బహుశా 'పెద్దది, లేదా రక్షించు') సంబంధి కావచ్చు.

**కోవగర్త** రూ.చూ. కొంద్రగర్త. వి. కొంద్రవేయవలసిన భాగం.

**కోవ్లు** వి.బ వ. చిన్నపాత్రలు పొయ్యిలోపలికి జారిపోకుండా ఉండటానికి చిలకముక్కుల్లా పెట్టిన మట్టికుండీలు.

**కోవ** రూ.చూ. కోపా. వి. ఒకరకం పింగాణీగిన్నె.

**కోవకత్తె** వి. కోపంగల స్త్రీ. క్రీడా. 1.129.

క. కోపగాతి-. కోపంగల స్త్రీ.

సం. కోప-. కోపం.

<కోప - + -కత్తె.

**కోవగా(డు** (- కా(డు) వి. కోపంకలవాడు. కాశీ. 4.90.

సం. కోప-. కోపం.

క. కోపగాఱ-. కోపంగలవాడు ; త. కోప-క్-కారణ్.

<సం. కోప - + - కా(డు.

**కోవగించు** అ.క్రి. కోపించు, కోప్పడు, కసరు. తపతీ. 4.21.

సం. కోప-. కోపం.

క. కోపిసు-, కోపించు ; త. కోపి. కోపంగల.

<సం. కోప - + - ఇంచు[2].

**కోవగిలు** రూ. కోపగిల్లు. అ.క్రి. కోపగించు. చంద్రాంగ. 3.87.

సం. కోప-. కోపం.

**కోవగిల్లు** రూ.చూ. కోపగిలు. అ.క్రి. కోపగించు, అచ్చలించు.

**కోవదారి** వి. కోపంగలవాడు. చెన్న. బసవ. 4.277.

సం. కోప-. కోపం, ధారిన్. ధరించేవాడు.

పార. దార్. కలవాడు.

<సం. కోప - + పార. దార్ లేదా సం. ధారిన్.

**కోవవడు** అ.క్రి. కినుకవహించు.

సం. కోప-. కోపం.

<సం. కోప - + పడు.

**కోపా** రూ. కోవ. వి. **1.** పాదిరిగుడుల్లో వాడే గిన్నె ; **2.** మజ్జిగపోసుకొనే చిన్నగిన్నె.

పో. కోపు. పంచపాత్ర, గళాసు ; ఫ్రెం. కూప్ ; స్పా. కోపా. సారాగిన్నె, ద్రవాన్నికొలిచే ప్రమాణం ; ఇం. Cup.

త. కోప్పై. గిన్నె ; మ. కోప, కోప్ప.

<పో. కోవ.

**కోపాగిన్నె** వి. పట్టుకోడానికి కాడపెట్టి పింగాణి గిన్నెలాగ చేసిన మట్టిపాత్ర.

**కోపార్చి** చూ. కోవు[1].

**కోపిన్** వి. కప్పుఏగరకుండా దాని మీదవేసేకట్ట.

**కోపిని** రూ. కోపిరి. వి. గృహనిర్మాణానికి కలపగా ఉపయోగ పడే ఒకరకం చెట్టు.

**కోపినికట్టె** రూ.చూ. కోపిరికట్టె. వి. లాదుమీదమోది చదునుచెయ్యటానికి వాడే కొయ్యకత్తి.

**కోపిరి** రూ.చూ. కోపిని. వి. గృహనిర్మాణానికి కలపగా ఉపయోగపడే ఒక చెట్టు.

**కోపిరికట్టు** స.క్రి. లాదుమీద చెక్కలతోకొట్టు. **కోపిరికట్టె** రూ. కోపిని కట్టె. వి. లాదుమీద మోది చదునుచెయ్యటానికి వాడే కొయ్యకత్తి. **కోపిరిగడ్డి** వి. అరణ్యప్రాంతాల్లో పెరిగేసన్నగడ్డి. **కోపిరిచెక్క** వి. **1.** తలుపురెక్కలను బొప్పగావాడేచెక్క ; **2.** లాదుమీద మోదిచదును చెయ్యటానికి వాడే కొయ్యకత్తి.

**కోవు[1]** పో.చూ. కోవ. వి. **1.** దిక్కు, కడ, పార్శ్వం, పక్క. రం. రా. అయో. 14పు. 18పం. ; **2.** పక్షం, బలగం.

**కోపార్చి** వి. మధ్యభాగం గుమ్మటంలా ఉండి పైచివర మొనతేలి ఉండేఆర్చి. <కోపు + ఆర్చి. **కోపుకమాను** వి. మధ్యభాగంలో గుమ్మటం లాగఉండి చివరమొన తేలి ఉండే ఆర్చి. **కోపురాయి** వి. ఒకవైపున కోసుగాఉండేటట్లు మలచబడిన మొనదేలినరాయి. **కోపురేవు** వి. ఆముగోడకు చివరిభాగంలో పెట్టిన రంధ్రం. **కోపులు** వి.బ.వ. చిన్న పాత్రలు పొయ్యిలోపలికి జారిపోకుండా ఉండటానికి పొక్కిళ్ళదగ్గరే లోపలకి చిలకముక్కుల్లా పెట్టినమట్టి గుబ్బలు.

**కోవు[2]** వి. **1.** నమస్కారం. భీమ. 3.211 ; **2.** నాట్యం, తీరు నాట్యగతి భేదం.యయా. 4.12.

క. కోపు-.నటించేతీరు, నటనాపద్ధతి ; త. కూప్పు-.

చేతులుజోడించు, ప్రార్థించు ; కూమ్పు. మూయు, ముకుళించు ; కువి. ప్రార్థించు ; కూప్పుదల్. నమస్కారాలు.

**కోపు**[3] వి. నిడివి, పొడుగు. దశా. 5.15.

పో. చూ. త. కువవు. విశాలత, విస్తారత.

**కోపు**[4] వి. బలం, శక్తి. శుక. 1.70.

**కోపు**[5] వి. ప్రయోజనం, నిమిత్తం. యయా. 2.55.

మ. కోప్పు. ఆస్తి, బలం, స్నేహితులు.

**కోపు**[6] వి. విధం, రీతి, క్రమం. ఉ. రా. 3.241.

త. కోప్పు-పద్ధతి, ఏర్పాటు క్రమం ; మ. కోప్పు. ఏర్పాటు క్రమం.

**కోపుతిరుగు** అ. క్రి. చెడుగుడు ఆటలో మైదానంలోని మూలలను జాగ్రత్తగాకాపాడుతూ తిరుగు. **కోపువరువడి** వి. పన్నెండు పరవళ్ళలో ఒకటి, పద్నాలుగు విసురుల్లో ఒకటి. ప్రబంధ. 78.

**కోపు**[7] వి. చక్కదనం రసిక. 1.39. విశ. మనోహరమైన. శశా. 1.26వ. 1పం.

త. కోప్పు-అందం, కొమ్మై-అందం ; మ. కోప్పు. చక్కటిఏర్పాటు.

**కోపువాఱు (-పాఱు)** అ. క్రి. అందగించు, రమ్యమగు.

**కోపు**[8] వి. మద్యం. సాం.ని. 2.47.

**కోపు**[9] వి. సమయం.

**కోపు**[10] వి. (వింటియొక్క) కొప్పు, కొన, కోటి. భాగ. 1.463 ; **2.** చేపలను గుచ్చేసూది ; **3.** పలకమీద రాసేకడ్డీ, బలపం ; **4.** దూలంచివరిభాగం ; **5.** రాతిలోమొనతేలిన భాగం ; **6.** కుమ్మరామిగోడచివరి అంచు.

క. కో-గుచ్చు. తు. కొప్పు. స్త్రీలుచెవిపైభాగంలో ధరించే ఆభరణం ; కొల్పు. స్త్రీలు చెవిపై భాగంలో ధరించే ఆభరణం, కొప్పె. చేపల్నిగుచ్చే దారం ; త. కోప్పు-గుచ్చు, చేర్చు, సూదిలోగుచ్చు.

**కోపు**[11] వి. దుకాణం.

**కోపుదారుడు** వి. దుకాణంపెట్టేవాడు, పైనుండి సరకులు తెచ్చి అమ్మేవర్తకుడు.

**కోపు**[12] వి. ఎరగకుండా వచ్చినమేలు.

పో. చూ. త. కోటు. తప్పు, ఉల్లంఘించు.

**కోపు**[13] వి. మట్టికుప్ప.

**కోపు**[14] వి. చట్రంలోని నిలువుపట్టె.

**కోపురము** వి. **1.** శత్రువుల రాకను తెలుసుకోడానికి ఉన్నత స్థలాల్లోఉంచేకావలి. మను. 3.54.

సం. గోపుర-. నగరప్రధాన ద్వారం ; ప్రా. గోఉర. <సం. గోపుర-.

**కోపెన్** వి. ప్రహరీగోడమీదఆకు, మట్టిరాయిమొదలగు వాటితో రక్షణకోసం గోడకంటె వెడల్పుగా పెట్టినకప్పు.

**కోప్టి** వి. బిస్కట్‌రంగు.

**కోబిన్‌చూరు** వి. అనుగుడుచూరు, గుండ్రంగాఉన్న చూరు.

ఇం. *Cabin.* చిన్నఇల్లు, ఓడలోని గది.

<ఇం. Cabin + చూరు.

**కోబీ** రూ. కోసు[3] గోబి. వి. కాబేజి, శాకవిశేషం.

పో. కోవి. కాబేజి.

<పో. గోవి.

**కోమ**[1] రూ. కోవ[3]. వి. వల్మీకాగ్రం, పుట్టచివర. ద్వి. హరిశ్చ. 1962పం.

త. కొమ్మై-. కూచిగాఉండు. కూంపు. కిరీటాకృతిలో ఉన్న రథ శిఖరం ; కూమ్పు. పోగుచేయు, కుప్పచేయు, కువటు. శిఖరాగ్రం, కోన ; కువి. పోగుచేయు ; కుమి. పోగుచేయు, కుమ్పె. పోగుచేయు.

**కోమ**[2] రూ. చూ. కొమ్మ[2]. వి. స్త్రీ. ఆడది. అచ్చరా. ఆరణ్య. 9.6.

**కోమటి** వి. వైశ్యుడు. భార. ఆది. 8.73.

క. కోమటి-కోమటిగ-వర్తకుడు ; తు. కోమటి, కోమటిగె ; త. కోముట్టి, కోమట్టి. తెలుగు మాట్లాడే వైశ్యజాతి ; మ. కోమట్టి. వర్తకుడు ; పర్జి. కోమటి. తెలుగుమాట్లాడే వైశ్యుడు.

**కోమటిచుక్క** వి. బుధుడిపేరుతో ఉండే నక్షత్రం. **కోమటిది** వి. వైశ్యస్త్రీ. **కోమటిపురుగు** వి. వరికిపట్టే పచ్చ రంగుపురుగు. **కోమటివాడు** వి. వైశ్యకులానికి చెందినవాడు. **కోమటిసాక్ష్యము** వి. ఉభయవాదులకు పనికిరానిసాక్ష్యం, ఎటూచెందని సాక్ష్యం. త. కోమట్టి-చ్-చాటి చి. ఉభయ పక్షంవారికి అనుకూలంగా సందిగ్ధంగా చెప్పేసాక్ష్యం. **కోమటీఁడు** వి. వైశ్యుడు. హంస. 5.120.

**కోమటీఁడు** చూ. కోమటి.

**కోమలి** వి. చక్కదనం గలస్త్రీ. భార. ఆది. 1.115.

పో. చూ. సం. కోమల-మృదువైన.

క. కోమలె, కోమళె- చక్కనిస్త్రీ ; మ. కోమలమ్-. మృదువైన.

**కోమలికము** వి. సౌందర్యం, చక్కదనం, భాస్క. రా. ఆరణ్య. 1.148.

**కోమిటంచు** వి. రెండు గీరలుపెట్టినకూటి కుందంచు.

**కోయ** రూ. కోయి[1]. వి. ఒకజాతి కిరాతుడు, ఆటవికభేదం, ఒక జాతి బోయ. చంద్రాంగ. 2.47.

పో. చూ. త. కో. కొండ.

**కోయఁడు** వి. బోయ. **కోయత** వి. కోయజాతిస్త్రీ. ప్రబంధ. 174. **కోయదొర** వి. కోయవారినాయకుడు. **కోయవాఁడు** వి. ఆటవికజాతికి చెందినవాడు. **కోయవారు** వి.బ.వ. తెలుగుదేశపు ఉత్తరప్రాంతంలో ఉండే ఆనాది జాతిప్రజలు.

**కోయంకూర** రూ. కోయికూర. వి. ఒకరకం మొక్క.

**కోయంబత్తులు** వి.బ.వ. దక్షిణాదిలో పేరుపడ్డ మంచిరకం వడ్లు.

**కోయంబత్తూరువడ్లు** రూ. కోయంబత్తూరొడ్లు. వి.బ.వ. దక్షిణాదిలో పేరుపడ్డ మంచిరకం వడ్లు, కిచిడీవడ్లు.

**కోయంబత్తూరొడ్లు** రూ. చూ. కోయంబత్తూరువడ్లు. వి.బ.వ. దక్షిణాదిలో పేరుపడ్డ మంచిరకం వడ్లు, కిచిడీవడ్లు.

**కోయి**[1] రూ.చూ. కోయ. వి. కోయజాతివాడు.

**కోఁయి**[2] రూ.చూ. గ్రోవి[1]. వి. కంఠనాళం.

**కోయికూర** రూ.చూ. కోయంకూర. వి. ఒకరకం మొక్క.

**కోయితోటకూర** రూ.చూ. కోయతోటకూర. వి. గోస్తే మళ్ళీ పెరిగే తోటకూర.

**కోయిపూస** రూ.చూ. కోవిపూస. వి. కొయ్యలాసుగొట్టం చివర అమర్చినగాజు పూస.

**కోయిల**[1] రూ. కోవిల[1], కోవెల[1]. వి. 1. ఒకానొకదివ్యస్థలం. కాశీ. 5.288 ; 2. దేవాలయం, గుడి. ప్రబోధ. 3.28.

త. కోయ్-ఇల్, కో-వ్-ఇల్. రాజభవనం, దేవాలయం ; మ. కోయి. హిందూ దేవాలయం.

< త. కో. య్. ఇల్.

**కోయిలతొత్తు** వి. వేశ్య. **కోయిలతొత్తుమారి** వి. వేశ్యాలంపటుడు. ప్రబంధ. 3.28.

**కోయిల**[2] రూ. కోగిల, కోగెల, కోవిల2. వి. కోకిల, పికం. కు. సం. 5.103. హరి. 8.38.

సం. కోకిల-; ప్రా. కోఇల. పికం; కో-ఇలా. ఆడుకోయిల; పా. కోకిల.

క. కోగిల్, కోగిలె, కోజిలె; త. కుక్కిల్, కుయిల్ మ. కుయిల్ ; పర్జి. కొయ్‌లి.

< ప్రా. కోఇల.

**కోయిలతెగడబి** వి. మన్మథుడు.

**కోయిలకూర** వి. ఒకజాతి మొక్క (Amaranthustristis).

**కోయు** స.క్రి. 1. ఖండించు, ఛేదించు, నరుకు. కు. సం. 6.35 ; 2. తుంచు. శృం. నై. 3.63 ; 3. అబద్ధాలు చెప్పు.

క. కోయ్, కొయ్యు, కుయ్, కోయి, కోయు. ఖండించు, నరుకు; తు. కోయ్‌పుని, కొయు, నరుకు; త. కోయ్. కోయు, తుంచు, తెంపు; మ. కోయ్యు, కోయ్యుక. కోయు; గోం. కోఇ. పంటకోత; కోయిడ్. కొడవలితో కోయు; కొండ. కోయ్; పర్జి. కోయ్ (-కోన్). కొడవలితోకోయు, పంటకోత; కువి. కోట్. ఏరు; ఒల్లా. కొయ్, కోన్. కోడ్. కొడవలితోకోయు; మాల్తో. కొయ్.

< మూ.ద్రా. *కొయ్.

**కోయుట** వి. అబద్ధాలు చెప్పడం. **కోయుతోటకూర**. రూ. కోయితోటకూర. వి. కోసిన మళ్ళా పెరిగేతోటకూర. **కోసుకతిను** రూ. కోసుకొనితిను. స.క్రి. మరణబాధపెట్టు. శుక. 2.37. **కోసుకొనితిను** రూ.చూ. కోసుకతిను. స.క్రి. మరణబాధపెట్టు, మిక్కిలిబాధించు.

**కోర**[1] చూ. కోల. రూ. గోర[4]. వి. 1. మద్యం మొ. వాటిని తాగడానికి ఉపయోగించే పాత్ర. భార. మౌసల. 30 , 2. కొలగిన్నె, కొలతపాత్ర. బసవ. 3.76; 3. పళ్ళెం. మను. 5.96 ; 4. ఎత్తును గాని లోతునుగాని చెప్పే పరిమాణం.

త. కోరమ్. లోహపు పళ్ళెం, కోరకమ్.

**కోర**[2] విశే. 1. వంకర; 2. పెద్ద; 3. పదునైన, వాడి అయిన.

క. కొరె. కాఠిన్యం, కఠినత్వం; త. కురంకు. వంగు, వాలు; కుఱంటు. వంపు; ఒల్లా. కోర్. కొమ్ము.

**కోరకావడి** వి. కొనలుపైకి వంగి ధనురాకారంగా ఉండే కావడిబద్ద. **కోరకొండె** వి. బిడ్డలులోనగు వారికి ముఖంపక్కన వేసేకొండె, జుట్టుముడి. **కోరకొప్పు** వి. మగవాని తలపై వికారంగా పెట్టుకొన్న కొప్పు. ద్వి. హరిశ్చ. 73. **కోరకొమ్ము** వి. వాడిగలకొమ్ము. వరాహ. 11.76, జంతువుల తలమీద జంటగా మొలిచే అవయవ విశేషం. **కోరగొను (-కొను)** అ.క్రి. కొరవోవు, కొంకరలు పోవు. పద్మ. 3.79. **కోరచూపు** వి. క్రూరదృష్టి. వరాహ. 2.45. **కోరతల** వి. కొమ్ములతో ఉన్న శరీరభాగం. **కోరదున్న** వి. దున్నపోతు జాతికి చెందిన మొగ జంతువు, ఎనుబోతు. **కోరదౌడ** వి. లోనికణగిన దౌడ, చప్పిదౌడ. భార. మౌ. 25. **కోరవన** వి. పశువుల తలమీద జంటగా మొలిచేగట్టి అవయవ విశేషం. **కోరవంది** వి. కోరలు గల పంది. **కోరపాగ** రూ.చూ. కోరపాగా. వి. ఒకపక్క కొరిగేటట్లు చుట్టిన తలపాగా. **కోరపాగా** రూ. కోరపాగ. వి. ఒకపక్కకు ఒరిగేటట్లు చుట్టిన తలపాగా. **కోరమబ్బు** వి. నల్లంచున్న తెల్లమబ్బు. **కోరమీస** రూ.చూ. కోరమీసము. వి. పెద్దమీసం, వంగిన పెద్దమీసం. శృం.నై. 7.93. **కోరమీసము** రూ. కోరమీస. వి. పెద్దమీసం. సూక్ష్మాగ్రంగల మీసం. భార. అశ్వ. 3.87. **కోరమొక్క** వి. సూదిమొక్క, నేల చీల్చుకొని పైకివచ్చిన చిన్నమొలక. **కోరవాయి** వి. కోష్ఠంలోనూ శిరస్సులోనూ పుట్టే వాతరోగం. ఆం.భా. 2.125. **కోరవాఱు(-పాఱు)** అ.క్రి. కోపంచే నేత్రాములు కుటిలమగు. వరాహ. 3.20. **కోరవోవు(-పోవు)** అ.క్రి. కొంకర్లుపోవు. విక్ర. 1.200. **కోరసిగ** వి. ఓరసిగ. ముఖపార్శ్వంలో వేసే జుట్టుముడి. రామా. 2.110.

**కోర**[3] వి. లోహంతోచేసిన చేద.

**కోరకురములు** వి. గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒక వంశం.

**కోరగించు** అ.క్రి. 1. ముడుగు, ముకుళితమగు. శృం. నై. 7.150 ; 2. మిరుమిట్లుగొను. విక్ర. 4.188 ; 3. మొగ్గ తొడగు, పొడుచు. విక్ర. 4.31 ; 4. ఎఱ్ఱబారు, ఎఱ్ఱనగు. వేంక. పంచ. 4.466 ; 5. ఏడ్చు. కుచే. 1.39.

క. కోరయిసు. మిరుమిట్లుకొను; త. కూరన్డు కూరవ్. చలితో ముడుచుకొను, కోపంతో వణకు. వడ్లముల్లు, తెలివి.

సం. కోరక-. మొగ్గ.

< సం. కోరక- + ఇంచు[3].

**కోరంగి** వి. ఉసిరికచెట్టు.

పో.చూ.క. కోరంగి-. చిన్నఏలకులు; త. కోరంకి; సం. కోరంగీ-.

**కోరటు** రూ.చూ. కోర్టు. వి. న్యాయసభ.

**కోరడ**[1] రూ. కోరడి. కోరాడ, వి. 1. చేనిచుట్టూ గుబురుగా ఉండే మొక్కలతో వేసినకంచె; 2. అడ్డగోడ.

**కోరడ**[2] వి. వాసాలమీద రాళ్ళుపరచి సున్నంలో అతికివేసిన కప్పు.

**కోరడి** రూ.చూ. కోరడ[1]. వి. 1. ఆవరణంగా వేసిన పొట్టి మట్టిగోడ, కరగోడ ; 2. కంచె.

**కోరడిగట్టు** వి. తీరం.

**కోరబాలు** వి.బ.వ. పిల్లల జబ్బులు.

**కోరంద** వి. పెసరగింజల రంగు.

**కోరము** రూ.చూ. కోఅము. వి. కొబ్బరి మున్నగువానిని కోరటాని కుపయోగించే పరికరం.

**కోరముపువ్వు** వి. ఎఱ్ఱటిపువ్వు.

**కోరరాట్నం** రూ.చూ. కోరారాట్నం. వి. పట్టుదారం.

వడికే ఒకరకం రాట్నం.

**కోరరైక** వి. ఆడపిల్లలకు సారెపెట్టే రవికగుడ్డ.

**కోరా** విశ. 1. సంస్కరించని, బాగుచేయని, చెన్న. బసవ. 5.252 ; 2. కారికం, అనాహతం. వి. 1. కలుషితలోహం ; 2. పట్టుపురుగుల నుంచి తీసిన ముడిదారం.

క. కోరా-. కొత్తది, చలువచేయని బట్ట ; తు. కోర-. చలువచేయని నూలుబట్ట ; త. కోరా. చలువచేయనిబట్ట ; హిం. కోవా. చలువచేయనిబట్ట లేక కుండ.

**కోరాహూలు** వి. చలవచెయ్యని ముడినూలు. **కోరాబంగారము** రూ. కోరాబంగారు. వి. అపరిశుద్ధమైన బంగారం, ఇతర లోహాలతో కలిసి వన్నెతగ్గిన బంగారం. **కోరాబంగారు** రూ.చూ. కోరాబంగారము. వి. అపరిశుద్ధమైన బంగారం, ఇతర లోహాలతో కలసి వన్నెతగ్గిన బంగారం. **కోరాముల్లు** వి. శుభ్రపరచని వస్త్రం. **కోరారాట్నం** రూ. కోరరాట్నం. వి. పట్టుదారం వడికే ఒకరకం రాట్నం. **కోరాపిల్క** వి. పట్టుపురుగులనుంచి వచ్చే ముడిదారం. **కోరాసున్నం** వి. సున్నపురాతిని కాల్చి దబ్బాలకెత్తిన సున్నం. **కోరాస్తంభం** వి. పొరలైన రాతిస్తంభం.

**కోరాటం** చూ. కోరా². ఎక్కువ వాలుగాఉన్న ఆకుకప్పు.

**కోరటము** వి. ఒకజాతి గద్ద.

**కోరాడ** రూ.చూ. కోరడ¹. వి. 1. చేనిచుట్టూ గుబురుగా ఉండే మొక్కలతో వేసిన కంచె ; 2. అర్ధగోడ.

**కోరాడి** వి. పశుగ్రాసంగాను, వైద్యంలోను వాడబడే అందమైన ఒకమొక్క. (Ixora Couinea)

**కోరాడు** రూ. కోడాడు, క్రోడాడు, గోరాడు. స.క్రి. 1. (ఎద్దులు, దున్నలు మొదలైనవి మదోత్సాహంతో కొమ్ములతో) కొట్టు. హరి.ఉ. 6.8 ; 2. (ఏనుగులు క్రీడార్థం దంతాలతోగట్టు మొ. వాటిని) కుమ్ము. జైమినీభా. 7.167 ; 3. (పంది ముట్టితో నేల మొ. వాటిని) కెల్లగించు. విక్ర. 2.135 ; 4. (దుమ్ము మొ. వాటిని) రేగచేయు. భాగ. 9.205 ; 5. పాడుచేయు. భాగ. 10. ఉ. 540 ; 6. (ఎలుగులు మొ. లైనవి గోళ్ళతో) చీల్చు. మను. 4.37.

త. కోఱై. శరీరంపై రక్కు, గీరు.

**కోరామొక్కు** వి. రాతిముక్క.

**కోరి** యూ.చూ. క్వారీ. వి. గని కట్టుబడికి కావలసిన రాళ్ళను తవ్వితీసే గుంట.

**కోరిఅంచు** వి. గీతలు గీతలుగా నేసిన అంచు.

**కోరిక** రూ.చూ. కోర్కి. వి. 1. వాంఛ, ఇచ్ఛ, అభిలాష. భార. శాంతి. 6.284 ; 2. వాంఛితార్థం, వరం. దశా. 1.255.

**కోరికలీరికలెత్తు** స.క్రి. కోరిక లభివృద్ధి నొందు. విజయ. 2.167. **కోరికలుడుగు** స. క్రి. వాంఛలు క్రమంగా నశించు <కోరిక+-లు+ఉడుగు.

**కోరికి** రూ.చూ. కోర్కి. వి. 1. వాంఛ, ఇచ్ఛ, అభిలాష. భార. ద్రోణ. 2.161 ; 2. వాంఛితార్థం, అభీష్టార్థం ; 3. చిత్తం, మనను, ఇచ్ఛ.

**కోరికిపడు** స.క్రి. అపేక్షపడు, తమకించు. మల్ల. 22.

**కోరికె** రూ.చూ. కోర్కి. వి. ఇచ్ఛ, వాంఛ. తపతీ. 1.7.

**కోరికెవుంచు** స.క్రి. ఆశించు, ఊహించు, విశ్వసించు. <కోరికె+ఉంచు.

**కోరికోలు** చూ. కోరు¹.

**కోరిచీర** వి. అంచులో గీరలు పడేట్టు నేసిన చీర.

**కోరింత** వి. ఒక ముళ్ళ చెట్టు.

**కోరింతదగ్గు** రూ.చూ. కోరిందదగ్గు. వి. కుక్కదగ్గు, కక్కాయిదగ్గు.

**కోరింద** రూ. కోరెంద. వి. లక్క కలిగిన ఒకానొక తీగ. ఆము. 6.13.

పో.చూ. క. కోరిందె-. ఒకరకం మొక్క.

**కోరిందపూసలు** రూ. కోరెందపూసలు. వి.బ.వ. ఆటవికులు ధరించే గాజుపూసలు. **కోరిందపొద** వి. లక్కపురుగులు గూడుపెట్టేపొద.

**కోరిందదగ్గు** రూ. కోరింతదగ్గు. వి. కుక్కదగ్గు, కక్కాయిదగ్గు.

**కోరిల్లు** చూ. కోరు³.

**కోరిశదగ్గు** వి. కక్కాయిదగ్గు, కోరింతదగ్గు.

**కోరీ** రూ. క్వారీ. వి. గని, కట్టుబడికి కావలసిన రాళ్ళను తవ్వితీసే గుంట.

**కోరు¹** స.క్రి. 1. వాంఛించు, కామించు, వరించు, భార. విరా. 1.219 ; 2. ప్రతీక్షించు, నిరీక్షించు, ఎదురుచూచు. దశా. 1.175.

క. కోఱు-. (కోరు) - కోరు, వాంఛించు, ఆలోచించు ; తు. కోరుని-. కోరు, కాంక్షించు ; త. కోరు. అర్థించు, కోరు, కాంక్షించు ; మ. కోఱుక. కోరుకొను, అభిలషించు.

**కోరికోలు** వి. పంట మొ. వాటిపాలు. **కోరుకొను** స.క్రి. ప్రార్థించు. **కోరురజమలు** రూ.చూ. కోరురాజనాలు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **కోరురాజనాలు** రూ. కోరురజనులు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **కోరువాడు** వి. వాంఛించేవాడు.

**కోరు²** స.క్రి. చీరు, గీరు. నృసింహ. 4.121. వి. కోరిన కొబ్బరి మొ. పదార్థాలు.

క. కోఱ్. కోయు ; కోఱె. కర్రను రంపంతో కోసినట్లుగాకోయు ; తు. కురెపిని, కురెవుని, కురెపుణా, కోరెపుణా. చీరు, గీరు ; కోరుని-. రంధ్రంచేయు ; త. కోఱై. చీరు, గీరు. కోఱ్-. గింజలయొక్క పొట్టు తీయు ; మ. కోఱు-. చింపు, కోయు, కోఱుక. మాంసాన్ని ముళ్ళతోచీల్చు ; కుయి. గ్రోప-. గీచు, గీరు.

**కోరు³** వి. 1. భాగం, పాలు, వంతు. భార. భీష్మ. 3.309 ; 2. రాజాదుల కిచ్చే ధనేతర వస్తురూపమైన కప్పం రామాభ్యు. 8.38 ; 3. తాకట్టు, అగావు ; 4. తులసికోట గోడలోనిభాగం ; 5. అంచు.

క. కోఱు. భాగం, పాలు, వంతు ; త. కూఱు. భాగం, పాలు, వంతు ; కుఱై. ముక్క, భాగం, పన్ను, పరిహారం ; మ. కోఱు-. చించు, కోయు, కూఱు, కూర్. భాగం, పాలు, వంతు ; కొండ. కుర్-. పాలు, వంతు ; తొ. కుర్-. తండ్రినుంచి వచ్చిన వంతు.

**కోరుగట్టు** (-కట్టు) అ.క్రి. కురుపుమాని అంచుకట్టు. **కోరుదారు** వి. కోరుకుసేద్యం చేసేవాడు. <కోరు³+

పార. దార్. **కోరుపాలు** వి. ఆసామి. సాగుచేసిన రైతు పంటలో చెరిసగం పంచుకొనే పద్ధతి. **కోరువారం** వి. పాలికి సేద్యం చేసేవాడు. **కోరువెట్టు** (-పెట్టు) స.క్రి. బలి (కానుక) ఇచ్చు.

**కోరు**[4] వి. కామదండం, మగగురి. విజ్ఞా. 1.106.

**కోరు**[5] విశే. నిలువుగా ఉన్న, నిట్రమైన. వి. **1.** వాలుగా ఉన్న ఆకుకప్పు : **2.** వాలు.

**కోరిల్లు** వి. పెంకు మొ. వాటితో మూయబడ్డ కప్పుగల ఇల్లు. **కోరుకొండ** వి. నిలువుగా ఉన్న కొండ. **కోరుచేయు** స.క్రి. ఆము పడుగును ఎత్తుపల్లాలు లేకుండా చదరంగా చేయడం. **కోరుపట్టి** వి. బంగాళపెంకుల్ని ఒకదాని కొకటి తగిలించడానికి పీలుగా పక్కలందుంచిన గాడి. **కోరుబొంత** వి. గొంగడినేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గొంగడి గడ్డి. **కోరుమగ్గం** రూ. కోరుమొగ్గం. వి. ప్రత్యేకంగా అంచులునేసే ఒకరకం మగ్గం. **కోరుమొగ్గం** రూ.చూ. కోరుమగ్గం. వి. ప్రత్యేకంగా అంచులు నేసే ఒకరకం మగ్గం.

**కోరుటు** రూ.చూ. కోర్టు. వి. న్యాయసభ.

**కోరుడుపాఱ** రూ. కోఱుడుపాఱ. చూ. కోరు[2]. వి. నేలనుచెక్కే పనిముట్టు.

**కోరువ** రూ. కోర్వ, వి. **1.** వరస ; **2.** క్రమం.

త. కోర్వై-. వరుస, క్రమం. కోవై, కోట్టు, కోప్పు-. ఏర్పాటుక్రమం.

**కోరెగడ్డి** వి. ఒకరకం కలుపుమొక్క (Rottedoellice).

**కోరెంద** రూ.చూ. కోరింద. వి. ముండ్లమొక్క.

**కోరెందపూసలు** రూ.చూ. కోరిందపూసలు, వి.బ.వ. ఆట వికులు ధరించే గాజుపూసలు.

**కోరెవ్వంకర్ర** వి. కాకవచ్చినపుడు ఆముకాల్చులో వాడే ఒకరకం కర్ర.

**కోర్కి** రూ. కోరిక, కోరికి. కోరికె, కోర్కె. వి. **1.** వాంఛ, ఇచ్ఛ, అభిలాష. భార.ఆది. 2.232 ; **2.** వాంఛితార్థం, అభీష్టార్థం. భార. శాంతి. 6.596 ; **3.** చిత్తం, మనసు, ఇచ్ఛ.రం.రా. 3.169 పు. 4 పం.

క. కోఱిక. కోరటం ; కొడ. కోరక్. ప్రార్థించు ; తు. కోరికె, కోరిగె. ఆశ.

త. కోరిక్కై. వాంఛ ; మ. కోఱు. అభిలాష.

**కోర్కులవంట** వి. వాంఛితాలనిచ్చేది. లని. 1.42.

**కోర్కులవంట** చూ. కోర్కి.

**కోర్కె** రూ.చూ. కోర్కి. వి. ఇచ్ఛ. ద్వి.తి.సా. 1.4.

**కోర్జ** వి.బ.వ. ఇరవైగుడ్డముక్కలు.

పో. కోర్జా. 'ఇరవై'కి వర్తకపరిభాష ; పో. కోర్జా. <పో. కోర్జా.

**కోర్టాయి** వి. ఒకజాతి అడవిచెట్టు.

**కోర్టు** రూ. కోరటు, కోరుటు. వి. న్యాయస్థానం.

త. కోర్ట్టు_కోటు -. నాయస్థానం ; హిం. కోర్ట్ - న్యాయస్థానం.

ఇం. *Court*-. న్యాయస్థానం.

<ఇం. Court.

**కోర్ణగండు** రూ. కోర్నగండు, కోర్నపగండు. వి. దుమ్ముల గొండి, ఇందు. 2.51.

**కోర్తండ్లుఏరు** రూ. కోర్తలుఏరు. స.క్రి. కోరతాళ్ళుఏరు.

**కోర్తల్లుఏరు** రూ.చూ. కోర్తండ్లుఏరు స.క్రి. కోరతాళ్ళుఏరు.

**కోర్న** చూ. కోంద్ర. వి. దున్నేటప్పుడు ఎడంవదిలి మొదటి అరకతో వేసిన చుట్టుచాలు.

**కోర్నగండు** రూ.చూ. కోర్ణగండు. వి. క్రూరమృగవిశేషం, దుమ్ములగొండి.

**కోర్నపగండు** రూ.చూ. కోర్ణగండు. వి. క్రూరమృగవిశేషం; దుమ్ములగొండి.

**కోర్వ** రూ.చూ. కోరువ. వి. **1.** క్రమం ; **2.** వరస.

**కోఱ** వి. **1.** పల్లు, దంష్ట్ర. భార. విరా. 4.213 ; **2.** కొమ్ము.

క. కోఱె. పదును, దంతం, పొడవుగా పదునుకల్గిన పళ్ళు ; తు. కోరె ; త. కుఱుంబు (-ఇన్-ప్-) కొమ్ము ల్లాగవంచిన, వంచబడిన, కోఱ్ఱైప్పల్-. వంకరపంతాలు, కోరమ్. క్రూరత్వం, కోరప్-పల్. కోరపళ్ళు.

పో.చూ. సం. ఖురు-. పల్లు.

**కోఱకైదువ** వి. పాము, దంష్ట్రాయుధం. ప్రబంధ. 210. **కోఱకొమ్ము** వి. సూదికొమ్ము, వాడిమొనగలకొమ్ము. విష్ణు.పు. 7.304. **కోఱపల్లు** వి. జంతువుల కోరల్లాగ వాడిమొనగలిగి పలువరుసలో పక్కఉండేపల్లు. కువ.చ. 2.102. త. కోఱై-ప్-పల్-. కుక్క లేక తోడేలు సంబంధమైన పల్లు కోర-ప్-పల్. వంకరపళ్ళు. **కోఱలుతీసినపాము** వి. నిస్సహాయుడు, అపకారం చేయాలనుకొన్నా చేయలేని వాడు.

**కోఱడమాడు** చూ. కోఱడము.

**కోఱడము** వి. **1.** ప్రతికూలవచనం. కు.సం. 6.702 ; **2.** క్రోధం, కోపం. నిర్వ. రా. 5.77 ; **3.** క్రౌర్యం. దశకు. 2.71 ; **4.** ఎగతాళి.

త. కోరమ్-. క్రూరత్వం, వేడి.

**కోఱడమాడు** స.క్రి. పరిహసించు, వేళాకోళంచేయు.

**కోఱడములాడు** అ.క్రి. అపహాస్యములాడు. నిర్వ.రా. 3.99.

**కోఱమీసములు** చూ. కోరమీసము. వి.బ.వ. పెద్ద మీసాలు.

**కోఱము** రూ. కోరము, కోఱాము. వి. కొబ్బెర మొ. వాటిని కోరడానికి ఉపయోగించే సాధనం.

త. కోఱై, శరీరంపై ఠక్కు, గీచు ; కోఱు. గింజలను కొంచెం కొంచెంగా కొరికికిను, కొల్. నరించు.

**కోఱలు** రూ.చూ. కొఱ్ఱలు. వి.బ.వ. కొఱ్ఱలు, సస్యవిశేషం.

**కోఱాము** రూ.చూ. కోఱము. వి. కొబ్బరి మున్నగువాటిని కోరటాని కుపయోగించే సాధనం.

**కోఱుడుపాఱ** రూ.చూ. కోరుడుపాఱ. వి. తవ్వుగోల.

**కోల** రూ. కోలు[4]. చూ. కోర[1]. వి. **1.** చేతికర్ర, బెత్తం. భార. ఆది. 4.260 ; **2.** కర్రదుట్లు కాల్చటానికి ఉపయోగించే శూలం. భార. విరా. 1.211 ; **3.** బాణం. భార. భీష్మ. 3.33 ; **4.** శిశ్నం, మగగురి. విజ్ఞా. ఆ.చా. 39 ; **5.** పుల్ల. పి. శకు. 3.170 ; **6.** గొడుగు మొ. వాటి కామ. ఆము. 4.129 ; **7.** చెరుకుగడ ; **8.** పత్తిరాట్నం మధ్య నిలువుల మధ్య రూళ్ళకర్రమాదిరిగా అమర్చే కట్టె

9. నాగలి కాడినీ పటితినీ కలిపే పొడుగుకొయ్య; 10. ఎత్తునుకాని లోతునుకాని తెలిపే పరిమాణం, రెండుగజాల కొలతగలది; విశే. 1. దీర్ఘ వృత్తాకారమయిన; 2. పొడుగైన.

క. కోల్, కోలు. కఱ్ఱ, దండం, పొడుగును కొలిచే దండం, బాణం, పొరుగు; తు. కోళు. కఱ్ఱ; త. కోల్ కఱ్ఱ, బాణం; కునవు. గుండ్రనితనం; మ. కోల్. కఱ్ఱ, దండం; తొ. క్వీస్; కొండ. కొల్; కువి. కోలు. రోకలి; కుయి. కోడు-, రోకలి; కొలా. కోల-, కఱ్ఱ; మాల్తో. కోల, గింజలను కాల్చటానికి ఉపయోగించే పెంకు.

మూ.ద్రా. *కోల్.

**కోలకచ్చి** వి. 1. పై కొల్తలలోపడ్డఅని; 2. పడుగులో మొదటి అని. **కోలకట్టు** వి. మొదటి అనికిగాని చివరి అనికి గాని చెదరిపోకుండా కట్టేకట్టు. **కోలకట్టె** వి. 1. కళ్ళంలో గడ్డిలాగే కఱ్ఱ, దీనికి ఒకవైపు వంపు ఉంటుంది; 2. రంగు అద్దిన నూలుగుంజకు తగిలించి పిండేకఱ్ఱ. **కోలకమాను** వి. త్రిభుజాకారంలో ఉండే ఆర్చి. **కోలకమ్మి** వి. మరాను మీదికి పడుగు తీసేటప్పుడు అచ్చటికే కొల్తల పోగులు చుట్టుకొన్న మేకులపట్టె. **కోలకఱ్ఱ** రూ.చూ. కోలకఱ్ఱ. వి. మనిషి తొక్కలేక లాగే ఏటవాలుకొయ్య. **కోలకఱ్ఱవేరు** స.క్రి. పడుగేరు కఱ్ఱమీది పోగులు నెరపి సాపుచెయ్యటం. **కోలకఱ్ఱ** రూ. కోలకఱ్ర. వి. ఏతంలోని ఒకభాగం. **కోలకళ్ళి** వి. ఒకరకంచెట్టు నీలిరంగు తయారీలో దీనిఆకులు వాడతారు (Euphorbiatirucalli). **కోలకాఁడు** వి. 1. వేత్రహస్తుడు. నవనాథ. 4.131. పు. 13 పం; 2. కాముకుడు. పండి.చ. 5.372. క. కోలుకాఱ. బంట్రోతు. **కోలకు(రెచ్చు(-తెచ్చు)** స.క్రి. బాణానికి గురిచేయు. పారి. 1.49. **కోలకొయ్య** వి. మొదటి అనుపీటకు బిగించిన కొయ్య. **కోలక్రోతు(లు** వి. బాలక్రీడావిశేషం, కోతికొమ్మంచి. విష్ణు పు. 7.202. **కోలగగ్గెర** వి. కాళ్ళకు తాడు తగిలించి ఎద్దులను మూటకట్టుగా కట్టిపడేయటం. ఆం.భా. 3.32. **కోలగగ్గెరద్రోయు(-త్రోయు)** స.క్రి. పశువును కట్టిపడేసినట్లుగా పడవేయు. ఆము. 6.27. **కోలగుంజ** వి. ఉన్నిపడుగు తోడే అనుగూటాల్లో పెద్దది. **కోలచారి** వి. నాట్యవిశేషం. శ్రీరం.మా. 4.162. **కోలచీల** వి. ఏడికోలను పటతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యపేడ. **కోలచెముడు** రూ.చూ. కోలజెముడు. వి. బొమ్మచెముడు. **కోలచేయు** స.క్రి. పడుగేసేకఱ్ఱమీద పోగులు నెరపి సాపుచేయు. **కోలజున్ను** వి. ఒకరకం తేనె, పుట్టతేనె. **కోలజెముడు** రూ. కోలచెముడు. వి. ఒకవిధమైన చెముడు, బొమ్మజెముడు, బొంతజెముడు. హంస. 4.10. **కోలతడుపు** స.క్రి. పడుగేరు కఱ్ఱమీద పోగులు తడుపు. **కోలతపేల** వి. నిలువు వాటుగా ఉన్న పాత్ర. **కోలతలచేయు** అ.క్రి. పోరుకు పూనుకొను. స.క్రి. ఎచ్చరించు. **కోలతివ్వు** స.క్రి. పడుగేరే కఱ్ఱమీదఉన్న పడుగుపోగులు పక్కకు జరుపు. **కోలదబ్బ** వి. ఒకజాతిదబ్బ. **కోలదిండు** వి. పొడవుదిండు. **కోలదిద్దు** స.క్రి. పడుగేరు కఱ్ఱమీదపోగులు పరచి చిక్కులు తీసి సాపుచేయు. **కోలదివియ** రూ. కోలదివ్వె. వి. కాగడా. దళకు. 5.90. **కోలదివ్వె** రూ.చూ. కోలదివియ. వి. కాగడా. ద్వి. హరిశ్చ. ఉ. 2319. పం. **కోలదువ్వు** స.క్రి. 1. పడుగేరే కఱ్ఱలమీది పోగులు చిక్కులుపోయేట్టు దువ్వు; 2. పడుగేరే కఱ్ఱమీది పోగులుచేత్తో విడదీయు. **కోలదేశము** వి. కళింగమనే దేశం. వ్యు. పొడుగైన (విశాలమైన) దేశం. **కోలదోన** వి. నాగజుండి. **కోలన** వి. 1. చేతికఱ్ఱ, బెత్తం; 2. కోలతనం, పొడుగు. **కోలనిమ్మ** వి. నిడుపుగా ఉండే కాయలుగల జాతినిమ్మ. **కోలనులుము** అ. క్రి. నరిచేసి చుట్టిన పడుగు, అంటుకుపోకుండా కొల్తల పోగులు మెలిపెట్టు. **కోలపట్టె** వి. మరాను కట్టుబడిలో, పడుగు పోగులు దూర్చే బెజ్జాలుగల రేకుముక్కలు. **కోలపట్టు** రూ. కోలుపట్టు, కోల్పట్టు. అ.క్రి. 1. కోలకఱ్ఱమీది పోగులు సర్దు; 2. సారెను వేగంగా తిప్పి వదలిన తర్వాత సారె పంకమీది మట్టికి నీళ్ళుచల్లి ఊపిరి బిగబట్టి చేతి బలంకొద్దీ కుండ రూపు రావటానికి మీదికి పొడవుగా లోపల డోలుగా వచ్చేటట్లుచేయు. **కోలపార** వి. తొల్లికకు వేసిన రేకు. **కోలపాల** వి. అర్కపుష్పిక. **కోలపుల్ల** వి. 1. చట్రం అను నిలువుపట్టెకు బిగించిన పుల్ల; 2. అనుపీటకు దిగగొట్టిన నిలువుకొయ్య. **కోలపొట్ల** రూ. కోలపొళ్ళ. వి. తోటల్లోనూ, పెరళ్ళలోనూ కాయలకోసం పెంచే తీగమొక్క. **కోలపొడుచు** స.క్రి. పడుగుపోగులు సవరించు. **కోలపొన్న** వి. పృశ్నిపర్ణి. అంఘ్రిపర్ణిక. ఆం.భా. 2.55. **కోలపార** వి. పై పోగులు, కింది పోగులు వదులుగాఉన్న పడుగుభాగం. **కోలపొళ్ళ** రూ.చూ. కోలపొట్ల. వి. తోటల్లోనూ, పెరళ్ళలోనూ, కాయలకోసం పెంచే తీగమొక్క. **కోలబద్ద** వి. 1. చట్రం అను నిలువుపట్టెకు బిగించిన బద్ద; 2. మరాను మేకు పట్టెల్లో అనువుపడేబద్ద. **కోలబల్ల** వి. 1. అనుపీటల్లో మొదటది, తలపీట; 2. అనుకొయ్యలకు ఆధారంగాఉండే అడ్డపట్టె. **కోలబిళ్ళ** వి. నిడుపువాటుగానున్న బిళ్ళ. **కోలబుడ్డి** వి. శంఖం ఆకారంలో ఉండే చిచ్చుబుడ్డి. **కోలమారి** వి. దుష్టుడు, పీడించేవాడు. **కోలమారితనము** వి. దౌష్ట్యం, పీడించటం. **కోలముక్కిచెక్క** వి. కుటజం (Echites antidystentarica). **కోలముఖి** వి. 1. పంది ముఖంగల స్త్రీ; 2. ఒక క్షుద్ర దేవత. **కోలమెఱుఁగు** వి. నిలువు మెరుపు. హరి. పూ. 7.160. **కోలలగుఱ్ఱం** వి. డాబీకోలలను లేపే కఱ్ఱ. **కోలలవారు** వి.బ.వ. వేత్రధారులు. దోపుదారులు. ఉ. హరి. 3.27. **కోలలాక** రూ. కోల్లాక. వి. 1. పడుగులో పడుగేరేచోట దూర్చిన లాక; 2. అచ్చతికిన పడుగులో మొదలు ఎక్కించిన బద్ద. **కోలలాట** రూ.చూ. కోలాటము. వి. స్త్రీలు చేతికోలలతో తాళంవేస్తూ, పాడుతూ, చుట్టూ తిరుగుతూ ఆడే ఒకఆట. **కోలలుఏరు** స.క్రి. పడుగేరు మీది పోగులు నెరిపి సాపుచేయు. **కోలలుతొక్కు** స.క్రి. పడుగులో రెండు చివరలా పడుగేరే కఱ్ఱలుదూర్చు. **కోలలుదువ్వు** స.క్రి. పడుగేరే కఱ్ఱలుమీదిపోగుల్ని దువ్వెనతో దువ్వు. **కోలవస** వి. జటిల అనే ఓషధి (Arlemisia Acoluscalamus). **కోలవివ్వు** రూ. కోలిప్పు. స.క్రి. పడుగేరే కఱ్ఱమీద పోగుల్ని చేత్తో విడదీయు. **కోలసూత్రం** వి. నేతలో డిజైన్లు పడటానికి డాబీ అడనుంచి రెండు పాయలు

విడదీసి అంచు పడుగులోనికి వేలాడదీసిన దారం. **కోల సేయు(-చేయు)** స.క్రి. పడుగేరే కర్రమీద పోగులునెరపి సాపుచేయు. **కోలాకుపొన్న** వి. ఒకానొకవృక్షం. ముయ్యాకు పొన్న. హంస. 4.10 (Hemiomites Cordifolia). **కోలాట** రూ.చూ. కోలాటము. వి. స్త్రీలు చేతికోలలతో తాళంవేస్తూ, పాడుతూ చుట్టూ తిరుగుతూ ఆడేఆట, హల్లీసకం. **కోలాటకమ్మ** చూ. కోలాటపుగమ్మ. వి. ఒకరకపు కమ్మ భూషణం. **కోలాటంకొయ్య** వి. 1. గజం పొడుగున్న బద్ద, సున్నంపూతను సమమట్టంలో ఉంచేందుకు వాడే సాధనం; 2. కత్తెరకొయ్య. **కోలాటపుగమ్మ** చూ. కోలాట కమ్మ. వి. ఒకవిధమగునగ, కర్ణాభరణ విశేషం. 7.66. **కోలాటము** రూ. కోలలాట, కోలాట. వి. స్త్రీలు చేతికోలలతో తాళంవేస్తూ పాడుతూ చుట్టూ తిరుగుతూ ఆడే ఒకఆట, హల్లీసకం. చంద్రికా. 2.20. క. ఈ. కోలాటు. పిల్లలు నాట్యంచేస్తూ కర్రల్తో ఆడే ఆట; త. కోల్-అట్టమ్. రంగురంగుల కర్రల్ని ధరించి వాటిని ఒకదానితో ఒకటి తగిలిస్తూ నృత్యంచేస్తూ పిల్లలుఆడే ఒక రకమైనఆట; మ. తొలటి. కర్రల్తో ఆడేఆట. **కోలాటము వైచు** అ.క్రి. పాటలు పాడుతూ చేతికోలలు తాకిస్తూ అడుగులేస్తూ ఆట ఆడు. చంద్ర. రా. 2.139. **కోలారిక మంపు** స.క్రి. ద్వంద్వ యుద్ధానికి రమ్మని (కటారిని) పంపు. కువల.చ. 5.55. **కోలారికము** రూ. కొలారికము. వి. ద్వంద్వ యుద్ధం. త. కోలారిక్కమ్-. ద్వంద్వయుద్ధం. **కోలాను** వి. కొయ్యలుతక్కువ ఉండే ఆను, మూగాను. **కోలివ్వ** రూ. చూ. కోలవిప్పు. స. క్రి. పడుగేరేకర్రమీద పోగులు చేత్తో విడదీయు. **కోలెడు** విఇ. రెండుగజాల పొడుగైన. **కోలెత్తు** రూ. కొలువెత్తు, కోలొత్తు. స. క్రి. సారెను వేగంగాతిప్పి వదిలిన తర్వాత సారెపలక మీది మట్టికి నీళ్ళుజల్లి ఊపిరి బిగపట్టి చేతులు బలం కొద్దీ కుండ రూపు రావడానికి మీదికిపొడవు లోపలబోలుగా వచ్చేటట్లు లేపు. **కోలెముక** రూ. చూ. కోలెమ్ము. వి. వెన్నెముక, కశేరుక. భార. సౌప్తి. 1.18. **కోలెమ్ము** రూ. కోలెముక, కోలెమ్ముక. వి. కశేరుక, వెన్నెముక. భార. ఆది. 6.215. **కోలెమ్ముక** రూ. చూ. కోలెమ్ము. వి. వెన్నెముక, కశేరుక. మను. 4.58. **కోలేయు** స.క్రి. సారెను వేగంగా తిప్పి వదిలిన తర్వాత సారెపలకమీద మట్టికినీళ్ళుచల్లి ఊపిరి బిగబట్టి చేతులు బలంకొద్దీ కుండరూపు రావడానికి మీదికి పొడవుగా వచ్చేటట్లు లేపు. **కోలొత్తు** రూ. చూ. కోలెత్తు. స. క్రి. సారెను వేగంగాతిప్పి వదిలిన తర్వాత సారె పలక మీద మట్టికి నీళ్ళు జల్లి ఊపిరి బిగపట్టి చేతుల బలం కొద్దీ కుండరూపు రావడానికి మీదికి పొడవులోపల బోలుగా వచ్చేటట్లు లేపు. **కోల్పట్టు** రూ.చూ. కోల పట్టు. స. క్రి. సారెను వేగంగా తిప్పివదిలిన తర్వాత సారె పలక మీది మట్టికి నీళ్ళు చల్లి ఊపిరి బిగబట్టి చేతుల బలంకొద్దీ కుండరూపు రావటానికి మీదికి పొడవుగా లోపలబోలుగా వచ్చేటట్లు చేయు. **కోల్లాక** రూ. చూ. కోలలాక. వి. 1. పడుగులో అమర్చేచోట దూర్చిన లాక; 2. అచ్చుతీకిన పడుగులో ఎక్కించిన బద్ద.

**కోలం** వి. పేడతో, మట్టితో అలికిన పూత.

**కోలంకి** వి. పక్షివిశేషం.

**కోలతాళ్ళువిరు** చూ. కోల. అ. క్రి. పడుగులో కోల్తలపోగులు విడదీయు.

**కోలము** వి. నాట్యవిశేషం. ఆము. 4.93.

పో. చూ. క. కోల-. అలంకరణ, ఆభరణం, ఆకృతి, మునుగు; తు. కోల. రాక్షసకృత్యం; త. కోలమ్-. ఆట, ఆచారం, తగిన వస్త్రధారణ, అలంకరించు, తొడుగు.

**కోలాకుపొన్న** చూ. కోల.

**కోలాఖానీ** చూ. కోల. వి. తివాసీనేతలో వచ్చే ఒకరకం డిజైను.

**కోలాట** చూ. కోల.

**కోలాటకమ్మ** చూ. కోల.

**కోలాటంకొయ్య** చూ. కోల.

**కోలాటపుగమ్మ** చూ. కోల.

**కోలాటము** చూ. కోల.

**కోలాటమువైచు** చూ. కోల.

**కోలారికమంపు** చూ. కోల.

**కోలారికము** చూ. కోల.

**కోలాస** చూ. కోలు[3].

**కోలాసకత్తియ** చూ. కోలు[2].

**కోలాసకత్తె** చూ. కోలు[3].

**కోలాపసేయు** చూ. కోలు[3].

**కోలాను** చూ. కోల.

**కోలివ్వ** చూ. కోల.

**కోలు**[1] మూ. కొను. వి. 1. అనుప్రయుక్తమైన కొనుధాతువుకు భావార్థక రూపం. ఉదా. పుచ్చుకోలు. భార. ఆది. 5.218; 2. కొల్ల. భార. భీష్మ. 3.280.

క. కొళ్-కొళు-. బలాత్కారంగా పట్టుకొను, ధ్వంసం, నాశనం, కృత్రిమారోపణం; త. కోళ్, తీసుకొను, గ్రహించు, బలవంతంగా పట్టుకొను; కొళ్ళై. దోచుకొను, కొల్లగొట్టు; మ. కోళ్. కొను, చేరమాడు, దోచుకొను.

**కోలుతనము** రూ. కోల్తనము. వి. అంగీకారయోగ్యత. **కోలుపడు** రూ.చూ. కోల్పడు. స.క్రి. కోల్పోవు, పోగొట్టు కొను. భార. ఉద్యో. 2.21; అ.క్రి. 1. అపహృతమగు. విష్ణు. 8.283; 2. హింసింపబడు; 3. క్షీణించు, తగ్గు. **కోలు వఱచు** రూ. కోల్పఱచు. స. క్రి. 1. చెరచు; 2. కొల్ల పెట్టు. **కోలుపాటు** రూ.చూ. కోల్పాటు. వి. 1. చేటు, కీడు; 2. అపజయం; 3. పోగొట్టుకొనటం; 4. చావు. **కోలుపుచ్చు** రూ. కోల్పుచ్చు. స. క్రి. 1. పోగొట్టు. భార. విరా. 2.268; 2. చంపు. భార. భీష్మ. 1.80. **కోలుపోక** రూ. కోల్పోక. వి. పోగొట్టుకొనటం. భార. శాంతి. 1.6. క. కోలు-హోగు-పోగు-. వేటకు ఆహారమగు. **కోలుపోవు** రూ. కోల్పోవు. అ. క్రి. 1. చెడు. భార. విరా. 2.262; 2. మోసపోవు. ఆం. భా. 3.97. స. క్రి. పోగొట్టు కొను. మార్క. 6.11. **కోల్తనము** రూ. చూ. కోలుతనము. వి. అంగీకారయోగ్యత. **కోల్పడిపోవు** స.క్రి. కోలుపోవు. పారి. 1.127. **కోల్పడు** రూ కోలుపడు. వి. స.క్రి.

కోల్పోవు, పోగొట్టుకొను. భార. సభా. 2.14 ; అ.క్రి. 1. హింసింపబడు. భార. కర్ణ. 3.24 ; 2. క్షీణించు, తగ్గు. హంస. 4.155 ; 3. అపహృతమగు. త. కొల్-పటు. లోబడు, వశమగు. **కోల్పఱచు** రూ.చూ. కోలుపఱచు. స.క్రి. 1. చెరచు ; 2. కొల్లపెట్టు. **కోల్పాటు** రూ. కోలుపాటు. 1. చావు. భార. కర్ణ. 3.275 ; 2. నష్టం. భాస్క. రా. అరణ్య. 1.21 ; 3. భంగం. **కోల్పుచ్చు** రూ. చూ. కోలుపుచ్చు. స. క్రి. 1. కోల్పోవచేయు, పోగొట్టు ; 2. చంపు. **కోల్పోక** రూ. చూ. కోలుపోక. వి. పోగొట్టుకొనటం. **కోల్పోవు** రూ. చూ. కోలుపోవు. స.క్రి. పోగొట్టుకొను. శృం. నై. 7.96 ; అ.క్రి. 1. చెడు ; 2. మోసపోవు.

**కోలు²** విశే. పెద్ద. క్రి.విశే. మిక్కిలి.

క. కొళ్-కోలు-. మిక్కిలి పెద్దది.

**కోలాస** వి. 1. అత్యాశ. పేరాస. బసవ. 7.579 ; 2. మూర్ఖపుఆలోచన. భాగ. 10. 4.1251. **కోలాసకత్తియ** రూ. కోలాసకత్తె. వి. అత్యాశగల స్త్రీ. పండి. చ. 2.122. క. కొళ్ళె-య్-ఆసె- అత్యాశ. **కోలాసకత్తె** రూ.చూ. కోలాసకత్తియ. వి. అత్యాసగలస్త్రీ. **కోలాసపేయు (-చేయు)** స.క్రి. మిక్కిలి ఆశించు. **కోలుకాలువ** రూ.చూ. కోలుకాల్వ. వి. ఏటికాల్వ, పెద్దకాల్వ. **కోలుకాల్వ** రూ. కోలుకాలువ. వి. ఏటినుంచి తీసిన మొదటికాలవ. **కోలుకొనిపోవు** స.క్రి. కొల్లగొట్టు. **కోలుకొను** రూ.చూ. కోల్కొను. అ.క్రి. 1. తేరుకొను, స్వస్థతపొందు. హరిశ్చ. 4.83 ; 2. ఉత్సహించు ; 3. వర్ధిల్లు, వృద్ధిపొందు ; 4. కొనసాగు. **కోలుకొలుపు** స.క్రి. ఉత్సహింపచేయు, ప్రోత్సాహపరచు. కు. సం. 6.17. **కోలుతల** రూ.చూ. కోల్తల¹. వి. 1. ఎదుట నిలిచి చేసేయుద్ధం. భార. భీష్మ. 2.109 ; 2. యుద్ధసన్నాహం ; 3. దెబ్బ. త. కొలుదల్. **కోలుతలసేయు (-చేయు)** రూ.చూ. కోల్తలసేయు. అ.క్రి. యుద్ధానికి సన్నాహంచేయు ; స.క్రి. 1. సేనల్ని నడుపు ; 2. యుద్ధానికి ప్రోత్సాహించు. **కోలుపులి** రూ. కోల్పులి, క్రోల్పులి. వి. పెద్దపులి, వ్యాఘ్రం. భార విరా. 1.83. **కోలుమసంగు** రూ. కోలుమసఁగు, కోల్మసంగు, కోల్మసఁగు. అ.క్రి. విజృంభించు, అతిశయించు. భార. విరా. 2.138 ; స.క్రి. చంపు, కసిమసగు. **కోలుమసఁగు** రూ.చూ. కోలుమసంగు. స.క్రి. చంపు, కసిమసగు. కకుత్స్థ. 2.118 ; అ.క్రి. విజృంభించు, అతిశయించు. **కోలుముందు** వి. మిక్కిలి ముందు, ముమ్మందు. వరాహ. 11.52. **కోలుమొసడి** రూ.చూ. కోల్మొసడి. వి. పెద్దమొసలి. **కోలుమొసలి** రూ.చూ. కోల్మొసడి. వి. పెద్దమొసలి. **కోలుమోట** రూ. కోల్మోట. వి. ఏటికాలవకు ఉద్దిగట్టి తోడే మోటునీరెత్తుమోట. **కోల్కొను** రూ. కోలుకొను. అ.క్రి. 1. తేరుకొను, స్వస్థతనొందు. కు. సం. 4.13 ; 2. ఉత్సహించు. శృం. నై. 4.31 ; 3. వర్ధిల్లు. ఆము. 5.116 ; 4. కొనసాగు. **కోల్తల¹** రూ. కోలుతల. వి. ఎదుటనిలిచి చేసేయుద్ధం. భార. ఉద్యో. 2.219 ; 2. యుద్ధసన్నాహం ; 3. దెబ్బ. **కోల్తలసేయు (-చేయు)** రూ. కోలుతలసేయు. అ.క్రి. యుద్ధ సన్నాహం చేయు. భార.విరా. 3.182 ; స.క్రి. 1. యుద్ధంచేయటానికి ప్రోత్సాహించు. భార. భీష్మ. 2.117 ; 2. సేనల్ని నడుపు. భార. ఉద్యో. 4.224. **కోల్పులి** రూ.చూ. కోలుపులి. వి. పెద్దపులి, వ్యాఘ్రం. భార. భీష్మ. 1.296. **కోల్మసంగు** రూ.చూ. కోలుమసంగు. అ.క్రి. విజృంభించు. అతిశయించు. స.క్రి. చంపు, కసిమసంగు. **కోల్మసఁగు** రూ.చూ. కోలుమసంగు. అ.క్రి. విజృంభించు, అతిశయించు. స.క్రి. చంపు, కసిమసగు. **కోల్మొసడి** రూ. కోలుమొసడి, కోలుమొసలి, కోల్మొసలి. వి. పెద్దమొసలి. భార. ఆది. 8.148. **కోల్మొసలి** రూ.చూ. కోల్మొసడి. వి. పెద్దమొసలి. కళా. 4.142. **కోల్మోట** రూ.చూ. కోలుమోట. వి. ఏటి కాలవకు ఉద్దిగట్టి తోడే మోటు, నీరెత్తుమోట.

**కోలు³** రూ.చూ. కోలె². అవ్య. మొదలుకొని, ఉండి. యయా. 1.106.

**కోలు⁴** రూ.చూ. కోల. వి. 1. కర్ర ; 2. ఎత్తును కానిలోతును కాని చెప్పే పరిమాణ విశేషం.

**కోలుకర్ర** వి. మట్టిపనివాళ్ళు వాడే గజం పొడుగు కర్ర. **కోలుకాఁడు** వి. 1. కావలివాడు, కాపరి. విక్ర. 8.25 ; 2. నియామాధికారి. వేంక. పంచ. 1.246 ; 3. సుంకరికింద బంటు. హంస. 248 ; క. కొలుకారబంటు ; తు. కొలుకారె ; త. కొరీకాంరన్. గ్రామ బంట్రోతు ; మ. కోల్-కారన్. **కోలుకోలన్నలు** వి.బ.వ. బాలికా క్రీడావిశేషం. హంస. 5.155. **కోలుగక్కెర** వి. మూటకట్టు. **కోలుతీయు** స.క్రి. సారెపలక మీదిమట్టి ముద్దనుకుండరూపురావటానికి మీదికి పొడవుగా లోపల బోలుగా వచ్చేటట్లు చేయు. **కోలువట్టు** రూ.చూ. కోలపట్టు. అ.క్రి. సారెనువేగఁగా తిప్పివదిలిన తర్వాత సారెపలక మీది మట్టికి నీళ్ళుజల్లి ఊపిరి బిగపట్టి చేతుల బలంకొద్దీ కుండరూపు రావడానికి మీదికి పొడవుగా లోపల బోలుగా వచ్చేటట్లుచేయు. **కోలుమంత** వి. చిన్నపూల తొట్టిలాగ ఉండే కుదురు. **కోల్తటి** రూ. కోల్తని. వి. పడుగు మొదటగాని, చివరగాని అనిపక్కన కర్ర దూర్చేభాగం. **కోల్తని** రూ.చూ. కోల్తటి వి. పడుగు మొదటగాని, చివరగాని అనిపక్కన కర్రలు దూర్చే భాగం. **కోల్తల²** వి. పడుగులో మొదటగాని చివరగాని అనిపక్కన కర్రలు దూర్చే భాగం.

**కోలు⁵** వి. రంధ్రం, కన్నం.

**కోలు⁶** వి. పాత్రలు తీర్చడానికి సారె పలకమీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద.

**కోలులేపు** స.క్రి. సారెపలకమీది మట్టిముద్దను కుండరూపురావడానికి లోపల బోలుగా వచ్చేటట్లులేపు.

**కోలురింపు** వి. పులిఅరుపు.

పో.చూ. త. కొళరి. సింహం.

**కోలె¹** వి. వెన్నుకోసిన కాడ. భార. ఆది. 8.118 ; 2. కొయ్యకాలు.

క. కోలి- వరి మొ. నవి కోసిన తరువాత మిగిలివుండే దుబ్బు, కోలదుబ్బు.

**కోలె²** రూ. కొలె, కోలు³. అవ్య. ద్రు. 1. వరకు, దాక. భార. ఆది. 3.41. 2. మొదలుకొని. ఉండు. భార. ఆది. 8.118.

త. కోలు, కోలుమై. ప్రారంభం, మొదలు.
**కోలెదు** చూ. కోల.
**కోలెత్తు** చూ. కోల.
**కోలెముక** చూ. కోల.
**కోలెమ్ము** చూ. కోల.
**కోలెమ్ముక** చూ. కోల.
**కోలేయు** చూ. కోల.
**కోలొత్తు** చూ. కోల.
**కోల్కానీ** చూ. కోలు[2].
**కోల్తబి** చూ. కోలు[4].
**కోల్తనము** చూ. కోలు[1].
**కోల్తని** చూ. కోలు[4].
**కోల్తల**[1] చూ. కోలు[2].
**కోల్తల**[2] చూ. కోలు[4].
**కోల్తలసేయు** చూ. కోలు[2].
**కోల్పట్టు** చూ. కోల.
**కోల్పడిపోవు** చూ. కోలు[1].
**కోల్పరు** చూ. కోలు[1].
**కోల్పఱచు** చూ. కోలు[1].
**కోల్పాటు** చూ. కోలు[1].
**కోల్పుచ్చు** చూ. కోలు[1].
**కోల్పులి** చూ. కోలు[2].
**కోల్పేక** చూ. కోలు[1].
**కోల్పోవు** చూ. కోలు[1].
**కోల్మనంగు** చూ. కోలు[2].
**కోల్మనఁగు** చూ. కోలు[2].
**కోల్మానడి** చూ. కోలు[2].
**కోల్మానలి** చూ. కోలు[2].
**కోల్మోట** చూ. కోలు[2].
**కోల్లాక** చూ. కోల.
**కోళ** రూ.చూ. కోళము. వి. బొండ, ద్రుపదం.
**కోళము** రూ. కోళ. వి. బొండ, ద్రుపదం. ప్రభు. 3.836.
క. కోళ. బొండ, ద్రుపదం; తు. కోళ. బొండ, ద్రుపదం; పో.చూ. మ. కోళ్. పట్టుకొను, తీసుకొను.
**కోళిగి** రూ.చూ. కొఱిగె[1]. వి. నతివిశేషం, నమస్కార విశేషం. ప్రబంధ. 880.
త. కోటు (-న్-వ్-). వొంచు, వొంపు; కోఱు. ఒంచు, ఒంపు.
**కోళిగె** రూ.చూ. కొఱిగె[1]. వి. నమస్కారం.
**కోశి** వి. 1. విస్మితుడు, వెరగుపడేవాడు. ఆం.బా. 3.9; 2. పిరికివాడు.
త. కోట్టై. పిరికివాడు; కోటే. జారిపోయెడి; కొఱున్త. మార్దవం; కూటే. అనుమానించు; కూట్టై. మూర్ఖత్వం; కుఱు. లేత; కుఱు-కుఱు. పిరికి అయిన; కుఱుమ్బు. గందరగోళంపడిన.
**కోశితనము** వి. భయశీలత్వం, బెదురు, జడుపు. త. కోట్టై-త్తనమ్. పిరికితనం, భయం.
**కోళ్ళగంప** చూ. కోడి[1].

**కోళ్ళగూడు** చూ. కోడి[1].
**కోళ్ళతొట్టి** చూ. కోడి[1].
**కోళ్ళదుత్త** చూ. కోడి[1].
**కోళ్ళబుట్ట** చూ. కోడి[1].
**కోళ్ళమూకుడు** చూ. కోడి[1].
**కోవ**[1] రూ.చూ. క్రోవ[1]. వి. 1. హారం, సరం. రాజ.చ. 1 67; 2. పేట, హారంలో ఒక భాగం; 3. ముత్తెం.
క. కో. హారం, సరం; తు. కోవె. హారం, సరం; త. కోవై. మెడకలంకరించుకొను పూసలహారం, క్రమ పరంపర; మ. కోవ. హారం, సరం.
**కోవగట్టు**[1](-కట్టు) స.క్రి. పూసలుగుచ్చినట్లు రాయు. **కోవతీయు** అ.క్రి. పొక్కు. **కోవలువడవ్రాయు** స.క్రి. పూసగుచ్చినట్లు లిఖించు. పాండు. 5.74.
**కోవ**[2] రూ. క్రోవ[2]. వి. బిడ్డలకు గొంతుకలో కలిగే రోగ విశేషం. బసవ. 3.365 పం.
పో.చూ. క. కోవె. బిడ్డలకు వచ్చే జబ్బు; తు. కోవె. ఒక విధమయిన దగ్గు.
**కోవ**[3] రూ.చూ. కోమ[1]. వి. 1. గోపురాకారంగా ఉండే పట్ట చివర కోము; పుట్టచివర; 2. మడితవ్వి పొడుగ్గా వేసిన కట్ట; 3. కాల్వగట్టు; 4. పొలం కట్ట.
క. కోవె. లోహాల్ని కరిగించే మూస; తు. కోవె; త. కొమ్మై. గోపురాకారం; కూంపు. రథం, గోపురశిఖరం; కూప్పు. కుప్ప, రాశి; కువి (ట్ట్-ప్ప్). కుప్పపోయు; కువటు. శిఖరాగ్రం; కుమి (-న్త్-; వ్-). కుప్పిపోయు; కుప్పై. కుప్ప, రాశి, పోగు.
**కోవగట్టు**[2] (-కట్టు) అ.క్రి. గనిమలువేయు.
**కోవ**[4] రూ.చూ. కోవా. వి. పాలమిఠాయి.
**కోవ**[5] వి. వంశానుక్రమం.
**కోవరము**[1] రూ.చూ. కోవురము. వి. శత్రువుల రాకను తెలిసికోటానికై ఉన్నత స్థలాల్లో ఉంచే కావలి.
**కోవరముండు** అ.క్రి. శత్రువులను కొట్టేటందుకు దారి పక్కన దాగివుండు.
**కోవరము**[2] విశే. అధికమయిన. వేంక. పంచ. 4.497.
**కోవా** రూ. కోవ[4]. వి. పాలమిఠాయి.
క. కోవె. పాలకోవ; త. పాల్-కోవా. మరా. గవా.
**కోవి**[1] రూ.చూ. క్రోవి[1]. 1. గొట్టం, కవాటం; 2. మురళి.
**కోవిపూస** రూ. కోయిపూస. వి. కొయ్య అనుగొట్టం చివర అమర్చిన గాజు పూస. **కోవులుకొలుచు** వి. ధాన్యం రూపంలో ఇచ్చే రుసుం (కొన్ని ప్రాంతాల్లో వెదురు గొట్టంతో ధాన్యాన్ని రుసుంగా కొలుస్తారు).
**కోవి**[2] రూ. క్రోవి[3]. వి. జాడు, క్షీణ సస్యం. ఆం. బా. 2.237.
క. కోవి, కొఱవి. గొట్టం, వేణువు, పూర్వకాలపతుపాకి.
**కోవిపుండు** వి. పాదంమీదయ్యెడి కాయ.
**కోవిల**[1] రూ.చూ. కోయిల[1]. వి. గుడి, దేవాలయం.
**కోవిల**[2] రూ. కోయిల[2]. వి. పికం. తాళ్ళ. 4.104. శివలీలా. 2.5.

**కోవు** చూ. కో[1]. అవ్య. అరవడంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పి.శకు. 3.34.

**కోవురము** రూ. కోవరము[1]. వి. 1. ఉక్కళం, శత్రువుల రాకను తెలుసుకోటానికి ఉన్నత స్థలంలో ఉంచే కావలి. మను. 3.54; 2. చెట్లపైకెక్కి శత్రువులను చూడటం. ఆం.భా. 3.29.

పో.చూ. త. కావఱ్-కాటు. రక్షక స్థలమైన అడవి; కావల్. రక్షణ.

**కోవులకొలుచు** చూ. కోవి[1].

**కోవెర** పో.చూ. కొబ్బరి. వి. నారికేళపేశం, కొబ్బెర.

**కోవెల[1]** రూ.చూ. కోయిల[1]. వి. గుడి, దేవాలయం. ఉ.రా. 7.26.

**కోవెల[2]** రూ.చూ. కోయిల[2]. వి. పికం, కోకిల. యయా. 2.50.

**కోవెలసోరము** వి. 1. పంచమ స్వరం; 2. కోకిల స్వరం (కోకిల స్వరం పంచమ స్వరమని ప్రసిద్ధి).

**కోష్టు[1]** రూ.చూ. కోస్టు[1]. వి. ఒకానొక మందుచెట్టు.

**కోష్టు[2]** రూ. కోస్టు[2]. వి. ఒకరకం వ్యాధి.

సం. కుష్ఠ. కుష్టువ్యాధి; కౌష్ఠ-. కుష్టు సంబంధమైన.
<సం. కౌష్ఠ-.

**కోస[1]** రూ.చూ. కోసు[2]. వి. చేలో కోసుగా ఉన్న మూల.

**కోస[2]** వి. కొంజీరు.

**-కోసము** రూ.చూ. కోసరము. అవ్య. 1. కొరకు, నిమిత్తం. ఉ.రా. 8.86; 2. కారణం, చేత. వైజ. 3.96.

**-కోసరము** రూ. కోసము. అవ్య. కోసం, నిమిత్తం, కొరకు. నర.శ. 7.

క. కోసకర, గోసకర, కోసెకె, కోసర, కోసగె. కారణంగా; ఒసకర, పెసుగర, ఓసుగ. కారణం, నిమిత్తం, కొరకు, కోసం; త. ఓచరమ్. దానికొరకై, నిమిత్తమై.

**కోసరలు** వి.బ.వ. ఒక రకమయిన బియ్యం.

**కోసి** రూ.చూ. కోసు[2]. వి. వంగివుండటం, వంగిఉన్నది.

**కోసు[1]** రూ.చూ. క్రోసు. వి. 1. రెండుమైళ్ళ దూరం, క్రోసు. భీమ. 2.88; 2. రెండువేల ధనువుల దూరం.

**కోసెఁడు** వి. క్రోశప్రమాణంకల దూరం.

**కోసు[2]** రూ. కోస[1], కోసి. విశ. దీర్ఘమైన, కొనదేలిన. వి. 1. చేలోకోసుగాఉన్న మూల; 2. రాతిలోఎత్తుగాఉన్న భాగం; 3. గానుగమొద్దు మధ్యనాటినమేకు.

క. కోసు-. దూరాన్నికొలుచు; త. కోమ. దూరప్రయాణం, దూరంకొలుచు; మ. కోస్-. చూస్పె. 25000 అడుగు, 2 మైళ్ళు; మాల్తో. కోసె. రెండుమైళ్ళదూరం.

**కోసుకమాను** వి. త్రిభుజాకారంలోఉండే ఆర్చి. **కోసువల్ల** వి. పునాదిప్లాను నిర్దేశించటానికి పురికొనకట్టి పాతినవల్ల. **కోసురాయి** వి. 1. ఇది దక్షిణభారతదేశంలో పడే పేలుదురాళ్ళ జాతికిచెందినరాయి; 2. ఒకవైపుకోసుగా ఉండేటట్టు మలచబడినరాయి. **కోసురొతు** వి. ఒకవైపు కోసుగా ఉండేటట్టు మలచబడిన మొనదేలినరాయి.

**కోసు[3]** రూ.చూ. కోబీ. వి. కూరకుపయోగపడే ఒకవిధమయిన ఆకులాకులుగా ఉండేపువ్వు. కాబేజిపువ్వు.

**కోసుకూర** వి. కాబేజిపూవుతో చేయబడిన కూర.

త. కొచ్-క్-కిరై-. కాబేజి. **కోసుగడ్డ** వి. శరీరమంతను శుభ్రపరిచేదుంప, కాబేజి.

**కోసుకతిను** చూ. కోయు.

**కోసుకొవితిను** చూ. కోయు.

**కోసురుముల్లు** వి. వాటల్నికోయటానికి వాడే సన్ననిఇనపకమ్మి.

**కోసుపువ్వు** చూ. కోసు[3]. వి. పాశ్చాత్యదేశాల్లోంచిదిగుమతి చేసుకొన్నగింజలతో చల్లటిప్రాంతాల్లో పెంచేఆకుపైరు (Brassica capilatalim).

**కోసెఁడు** చూ. కోసు[1].

**కోస్టు[1]** రూ. కోష్టు[1]. వి. ఒకానొకమందుచెట్టు.

పో.చూ. త. కోస్తయ్. (Saussureallappa, Alatbiancostum, Costus speciosus).

**కోస్టు[2]** రూ.చూ. కోష్టు[2]. వి. ఒకరకంవ్యాధి.

**కోస్తా** వి. సముద్రతీరం, సముద్రతీరప్రాంతప్రదేశం.

పో. కొస్తా. సముద్రతీరప్రాంతం; స్పా. కొస్తా. తీరం, ఒడ్డు.
<పో. కొస్తా.

**కోస్తావర్తకము** వి. సముద్రవ్యాపారం.

**కోహలి** రూ.చూ. కుల్లా[1]. వి. చిన్నటోపి, పరచితపుకుటం, శీర్షాచ్ఛాదనం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1229. క్రి.శ. 1495.

**కోహళి** రూ.చూ. కుల్లా[1]. వి. 1. చిన్నటోపి, శీర్షాచ్ఛాదనం. హర. 7.109; ఉ.హరి. 3.86; 2. మేలుకట్టు.

**కోహళీ** రూ.చూ. కుల్లా[1]. వి. బరణి మొ. వాటిమూత.

**కోహో** చూ. కో[1]. అవ్య. పరిహాసంచేయటంలో అయ్యేధ్వనికి అనుకరణం. ఆము. 4.35.

**కౌ[1]** వి. కాకికూతకుఅనుకరణం. శృం. నై. 8.19.

క. కవు, గవ్వు. అనుకరణధ్వని; పో.చూ. త. కొవై, ధ్వని; కవ్వై.

**కౌ[2]** రూ.చూ. కవును[1]. వి. కౌనుశబ్దలుప్త విశేషం, నడుం.

**కౌఁగిలి** రూ. కవుఁగిలి. వి. 1. ఆలింగనం. భార. ఆది. 2.56; 2. భుజాంతరం. భార. శల్య. 1.18.

క. కవర్. బలాత్కారం; త. కవ్వు. బలాత్కారంగా పట్టుకొను, ఆత్రంగాపట్టుకొను; కౌవు. మనసంతా ఆక్రమించు, ఆకర్షించుకొను; కవవు. కౌగిలించుకొను. ఆలింగనం చేసుకొను; కవల్. ఆలింగనం. శారీరకమైనబంధం, కౌగిలింత; కవై. కౌగిలింత; పో.చూ. మ. కవరుక. దోచుకొను; పర్జి. కవ్ంగిల్- కంగిల్. చొక్కాయయొక్క వేలాడేభాగం.

**కౌఁగిలించు** రూ.చూ. కవుగిలించు. స.క్రి. ఆలింగనం చేయు. శృం.నై. 2.7. **కౌఁగిలింత** రూ.చూ. కవుగిలింత. వి. ఆలింగనం. ఆము. 2.62. **కౌఁగిలింపు** రూ. కవుగిలింపు. వి. ఆలింగనం, చంద్రాంగ. 9.148. **కౌఁగిలు** రూ.చూ. కవుగిలు. స.క్రి. కౌగలించు.

**కౌఁగిలు** చూ. కౌఁగిలి.

**కౌచిప్ప** వి. ఆల్చిప్ప, ముత్యపుచిప్పలజంట.

**కౌచు** రూ.చూ. కవుచు. వి. 1. చేపమీదపొలుసు, శల్కం, జంతువులచర్మం, పొట్టు. ఆము. 4.17 ; 2. దుర్గంధం. నరన. 1.35. 3. మాంసం. మల్ల. ౖౖ. 16.

కౌచుముచ్చు వి. రాక్షసుడు, పొలసుదిండి. కౌచుమేపరి వి. రాక్షసుడు. ఆం.భా. 3.6. వ్యు. మాంసంతినేవాడు.

**కౌంజు** రూ.చూ. కవుంజు. వి. కపింజలం, రెక్కలందు చిత్ర వర్ణంగల బట్టవన్నెపిట్ట. యయా. 1.113.

**కౌట** రూ.చూ. కవుటు[1]. వి. కాలుబిగపట్టేవశరోగం.

**కౌటిగుల్ల** వి. గొర్లగిట్టలనందునలేచేగుల్ల.

**కౌటు** రూ.చూ. కవుటు[1]. వి. కాలుబిగపట్టేవశరోగం.

**కౌడీలు** రూ. కవుడీలు. వి.బ.వ. నమస్కారం. ప్రబంధ. 8.80.

**కౌదు** రూ.చూ. కవుదు. వి. కపటం. ఆం.భా. 1.188.

కౌదుపెట్టు రూ. కౌదువెట్టు. స.క్రి. మోసగించు. కౌదువెట్టు రూ.చూ. కౌదుపెట్టు. స.క్రి. మోసగించు.

**కౌదువు** రూ. కవుదువు. వి. మాదిరి, కైవడి. ఆం. భా. 2.302.

**కౌతి** రూ.చూ. కమిద. వి. పాత్రల్నిసర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే చాపలేక గోతాంపట్ట.

**కౌతె** రూ.చూ. కమిద. వి. పాత్రల్నిసర్సేటప్పుడు కుమ్మరి కూర్చునే చాపలేక గోతాంపట్ట.

**కౌదిచేయు** రూ.చూ. కమితిచేయు. స.క్రి. ఆముపొయ్యిరాజేసి మంటవ్యాపించడానికి విసురు.

**కౌదారి** వి. కవుజుపిట్ట.

**కౌను**[1] రూ.చూ. కవును[1]. వి. 1. నడుము, మధ్యం. భార. ఆది. 3.38 ; 2. లస్తకం. ధనుర్మధ్యం, వింటినడుము. ఆము. 1.8.

**కౌను**[2] రూ.చూ. కవును[2]. వి. ఒకవిధమగు కాలిచెప్పు.

**కౌయ** చూ. కౌచు. వి. 1. చిన్ననీటిజంతువు ; 2. చేపపొట్టు.

**కౌరు** రూ.చూ. కవురు[2]. ముదురురంగు.

**కౌరులు** వి.బ.వ. ముక్కులు, నతులు.

**కౌలలచేకట్టు** చూ. కౌలా. వి. ముందుకవులుకట్టినదర్వాజా.

**కౌలా** వి. రెండువైపుల చదునుగాచెక్కబడిన దర్వాజా పక్కనగాని తక్కినమూలలోగాని కట్టుబడికి వాడబడేరాయి.

**కౌలిచ్చు** చూ. కౌలు.

**కౌలు** రూ. కవులు[1]. కౌవులు. వి. ప్రభుత్వంవారుప్రజలకు భూమినిగూర్చి ఇచ్చే ఒడంబడిక పత్రం. శుక. 1.87. 2. ఒడంబడిక.

హిం. ఉ. కౌల్. ఒడంబడిక, కవులు.

క. కవులు, కౌలు ; త. కౌవుల్.

<ఉ. కౌల్.

కౌలిచ్చు స.క్రి. పొలాన్ని అమరకానికి ఇచ్చు. కౌలు నామా రూ. కవులునామా. వి. ఒడంబడికపత్రం.

**కౌవులు** రూ.చూ. కౌలు. వి. కవులు, ఒడంబడిక.

**కౌసు**[1] రూ.చూ. కవుసు. వి. 1. మాంసం ; 2. చేపమీది పొట్టు.

కౌసుమేపరి వి. రాక్షసుడు.

**కౌసు**[2] వి. ముందుభాగం.

**క్యాదరి** రూ.చూ. కేదరి. వి. ఏటవాలుగా వేసినమడవ.

**క్యాబేజి** రూ.చూ. కేబేజి. వి. కేబేజిపువ్వు.

**క్రక్కన** రూ.చూ. కక్కనము. విశే. 1. కఠినమైన, గట్టి. శృం.నై. 5.116 ; 2. క్రూరమైన.

క్రక్కనపడు రూ. కక్కనపడు. అ.క్రి. 1. కఠినమగు. వేంక. మా. 3.11 ; 2. క్రూరమగు. క్రక్కసించు రూ.చూ. కక్కసించు. అ.క్రి. కార్యం వహించు.

**క్రక్కసించు** చూ. క్రక్కన.

**క్రక్కించు** చూ. క్రక్కు.

**క్రక్కు** రూ. కక్కు[1]. స.క్రి. కడుపులోనిది వెలిపుచ్చు, వెడలించు. భార. అరణ్య. 2.178 ; వి. వ్యాధి విశేషం, ప్రచ్ఛర్దిక. ఆం. భా. 2.127.

క. కక్కు, కఱు, కాల్. కక్కు ; కొ. కార్. కక్కు ; తు. కక్కుని, కక్కుణ. కక్కు ; త. కక్కు, కక్కు, కొక్కినదగ్గు ; కాఱు (-ఇన్-వ్-). వేటాడు ; కోత. శ్లేషం. కఫం, చీము, రసి ; మ. కక్కుక, కారుక. కక్కు ; తొ. కక్. కక్కు ; గోం. కక్కె. కక్కు ; బ్రా. కప్-. బయటకు పంపివేయు.

<మూ.ద్రా. కట్-.

క్రక్కించు స.క్రి. కడుపులోని పదార్థాన్ని వెలిపుచ్చేట్లు చేయు, వెడలించేట్లుచేయు. భార. ఆది. 6.294. క్రక్కున రూ. గ్రక్కన, గ్రక్కున. అవ్య.ద్రు. తటాలున. క్రక్కువడు రూ.చూ. క్రక్కుపడు. అ.క్రి. స్ఖలితమగు, తొట్రుపడు. క్రక్కువడు రూ. క్రక్కుపడు. అ.క్రి. స్ఖలితమగు, తొట్రుపడు. హర. 3.92.

**క్రక్కెర** రూ.చూ. కక్కర. వి. కొంగ.

క. కొక్కరె, కొంగ ; త. కురుకు. నారాయణ పక్షి, కొంగ.

**క్రంగు** రూ. కంగు[2]. వి. గంట మొ. వానిధ్వని, శృం.నై. 3.25.

క. మోగించు. గర్జించు, పిలుచు ; కరసు, కరిసు, కరెసు, కరెయిసు. పిలిపించు, ఇద్దరు కలిసి ధ్వనిచేయు ; కరహ, కరెయువికె. పిలుపు ; తు. కరెయుని, కరెవుని. కోడి లేక కాకిలాగ కూయు ; త. కరి, కరెకరె. ధ్వనిచేయు, పిలుచు, ఆహ్వానించు, ఏడ్చు ; కఱంకు. ధ్వనిచేయు ; మ. కరయుక. అరచు, ఏడ్చు, గుర్రపు నకిలింపు ; తొ. కార్. రంకెవేయు, బిగ్గరగా అరచు ; గోం. కరింగి. పిలుపు ; కొండ. కర్వ్. రంకెవేయు, బిగ్గరగా అరచు ; కుఇ. క్రావ. గంటనాలుక, గెర్న్గ, గ్రెంగ. మూలుగు, మెల్లగా ఏడ్చు ; గ్రోంజ. మూలుగు, మెల్లగాఏడ్చు ; పర్జి. కెరిప్. కోడికూత, గుడ్లుపెట్టిన తర్వాత కోళ్ళ అరవు ; కురుఖ్, ఖర్ఖనా. గంటధ్వని, ఖంగుమనివాగు, ధ్వనిచేయు ; ఖర్ఖఅనా. ధ్వనిచేయు, మోగించు ; మాల్తో. కర్గె. అరచు.

**క్రచ్చ** చూ. క్రచ్చు. వి. కోరిక, ఇచ్చు, క్రచ్చు.

**క్రచ్చరన్** రూ.చూ. క్రచ్చుఱ. అవ్య.ద్రు. 1. పరిపాటిగా ; 2. వెంటనే ; 3. ఏకకంఠంగా ; 4. సమభాగంగా.

**క్రచ్చుఱ** చూ. క్రచ్చు.

**క్రచ్చటించు** చూ. క్రచ్చు.

**క్రచ్చఱు** చూ. క్రచ్చు.

**క్రచ్చు** వి. **1**. ధాన్యాదులలోని పనికిమాలిన పదార్థం. భార. అను. 5.104 ; **2**. కోపం. వేంక. పంచ. 1.602 ; **3**. కోరిక. అచ్చ.రా.బాల. 8 ; **4**. పేనినతాడు మొ. వాటిలో ఉపయుక్తం కాని తృణాదుల అంశం. స.క్రి. చుట్టుకొను. రామాభ్యు. 5.199.

క. కలుయు. నిండుగా ఉండు, దట్టం, పొంగిపోవు ; త. *కళివల్*. ఇష్టపడనిది ; *కళి* (-త్-ప్పు-). తీసివేయు, విసర్జించు ; కొల. పండు యొక్క తొక్క, పై తొక్క, చిప్ప ; *కఱుము*. నిండిపోవు, పూర్తిగా, సమృద్ధియైన, విస్తారమైన, పొర్లిపోవు ; కుఇ. *గర్జ*. బయటకు విస్తరించు, ఎక్కువగు, లావయి బయటకు విస్తరించు.

**క్రచ్చఱ** రూ. క్రచ్చరన్, క్రంచఱ. అవ్య. ద్రు. **1**. నవిలాసంగా. భార. ఆది. 4.27 ; **2**. శీఘ్రంగా. భార. ఉద్యో. 1.176 ; **3**. అనాలోచితంగా. భార. ఉద్యో. 3.361 ; **4**. ఎల్లప్పుడు. భార. ఆరణ్య. 7.366 ; **5**. అమోఘంగా. భార. ఆరణ్య. 7.369 ; **6**. స్పష్టంగా. భీమ. 3.160. త. *కళి*. చాల, ఎక్కువగా, అమితంగా ; *కళివు*. భూతకాలం ; *కళియ*. మిక్కిలి ఎక్కువగా, అతిశయంగా. <క్రచ్చు + -అఱు + -అ[7]. **క్రచ్చటించు** స.క్రి. మించజేయు, అ.క్రి. పెంపొందు. **క్రచ్చఱు** అ.క్రి. మిగులు, పెంపొందు. **క్రచ్చుకొను** స.క్రి. **1**. కదియు, చేరు. వసు. 2.11 ; **2**. చుట్టుకొను, ఆవరించు. వసు. 4.57.

**క్రంచఱ** చూ. క్రంచు.

**క్రంచఱు** చూ. క్రంచు.

**క్రంచు** వి. **1**. మరుగు ; **2**. జాగుచేయుటం.

**క్రంచఱ** రూ.చూ. క్రచ్చఱ. అవ్య.ద్రు. **1**. ఎడతెగకుండ. భార. ఆది. 5.166 ; **2**. శీఘ్రంగా. భార. ఆరణ్య. 4.86. **క్రంచఱు** అ.క్రి. మరుగులేకుండు. <క్రంచు + -అఱు.

**క్రంత**[1] రూ. కంత[3]. వి. పెళ్ళికొడుకువారు పెళ్ళికూతురికి తీసుకొనిపోయే ప్రధానద్రవ్యం. భార. విరా. 5.389.

**క్రంతవడచు** అ.క్రి. మగపెళ్ళివారు మేళతాళాలతో ఊరేగి పెళ్ళికూతురుకు చీరలు మొదలైనవి పట్టుకొని వెళ్ళు.

**క్రంత**[2] రూ. కంత[4]. వి. **1**. రథ్య, రాజవీథి, సందుతోవ. ఉ. హరి. 1.131 ; **2**. రచ్చ, సభ. ద్వి.హరిశ్చ.ఉ. 643. పం.

త. *కటకమ్*. సమావేశం, సభ, కవులసభ ; *కటకు*. సమావేశం ; *కఱుము*(-ఇన్-ప్-). కోడితేక కాకిలాగ కూయు ; కువి. *గ్రగఱయు*. రంధ్రం ; కువి. *గ్రైయు*. రంధ్రం.

పో.చూ. సం. *గర్త*.

**క్రంత**[3] రూ. కంత[1], గంత. వి. రంధ్రం, చిల్లి. జైమినీ భా. 2.68.

సం. కంథా. చినిగినగుడ్డలతో కుట్టినబొంత ; ప్రా. *కంథా*.

<ప్రా. కంథా.

**క్రందగు** చూ. క్రందు.

**క్రందాఱు** చూ. క్రందు.

**క్రందిలు** చూ. క్రందు.

**క్రందిల్లు** చూ. క్రందు.

**క్రందు** చూ. క్రంగు. వి. **1**. సందడి, సమ్మర్దం. భార.ఆది. 7.207 ; **2**. ఉపద్రవం. భార. విరా. 4.62 ; **3**. అతిశయం. భార. ద్రోణ. 3.6 ; **4**. అతిదారుణమైన ధ్వని. భార. శాంతి. 4.412 ; **5**. ఆక్రందనం, మొర్ర. ఆం. భా. 2.223. అ.క్రి. **1**. విలపించు. భార. అను. 4.263 ; **2**. మోగు.

క. *క్రందన*. పిలుచు, ఏడ్చు, దుఃఖించు, సవాలు చేయు ; కొడ. *కర్వ్*. రంకెవేయు, ఝంకారాలు ; తు. *కరెయుని, కరెప్పుని*. కాకిలాగకూయు ; త. *కఱుము*. గుమికూడు, కిక్కిరియు, పొర్లిపోవు ; మ. *కరయుక*. అరచు, ఏడ్చు ; తొ. *కర్*. రంకెవేయు ; గోం. *కరింగి*. పిలుచు ; నా. *కయాక్తు*. పిలుచు ; కుఇ. *క్రావ*. గంట నాలుక ; కురు. *ఖర్ఖ్*. గంట యొక్క ధ్వనిచేయు ; మాల్తో. *క్వార్గ్*. అరచు.

పో.చూ. సం. *క్రంద్*.

**క్రందగు** అ.క్రి. గుంపగు. ఆము. 1.57. <క్రందు + అగు. **క్రందాఱు** అ.క్రి. రాశి అగు, క్రందుకొను <క్రందు + -అఱు. **క్రందిలు** రూ.చూ. క్రందిల్లు. అ.క్రి. **1**. కేకలువేయు. పద్మ. 10.163 ; **2**. మోగు. **క్రందిల్లు** రూ. క్రందిలు. అ.క్రి. **1**. మోగు, వీర.వి. 4.161; **2**. కేకలు వేయు. **క్రందుకయ్యము** వి. సంకులయుద్ధం, దొమ్మిజగడం. నిర్వ.రా. 5.124. **క్రందుకొను** అ.క్రి. **1**. నిండు భాస్క.రా. కిష్కిం. 513 ; **2**. అతిశయించు. శృం.నై. 6.29 ; **3**. మూగు. వసు. 1.147. **క్రందుకొలుపు** స.క్రి. పెంపొందించు. **క్రందుగన్** క్రి.విశ.ద్రు. **1**. ఒక్కుమ్మడిగా. భార. భీష్మ. 1.66 ; **2**. అధికంగా. మను. 5.71. **క్రందువడు** రూ. క్రందుపడు. అ.క్రి. **1**. మూగు, గుంపగు. మార్క. 1.225 ; **2**. సంకులంగాపడు. **క్రందువఱచు** స.క్రి. కప్పు. కాశీ. 5.112. **క్రందుపాటు** వి. సమ్మర్దం. భార. భీష్మ. 2.103. **క్రందువడు** రూ.చూ. క్రందుపడు. అ.క్రి. గుంపుగాపడు, సంకులంగాపడు. భాస్క.రా. ఆరణ్య. 1.248. **క్రందువాయు** అ.క్రి. ధ్వనిచేయు. **క్రందుసేయు**(-చేయు) స.క్రి. భేదంపుట్టించు. భార. ఉద్యో. 4.251. **క్రందొనరించు** అ.క్రి. విరోధించు. దశకు. 5.45. <క్రందు + ఒనరించు.

**క్రందొనరించు** చూ. క్రందు.

**క్రన్న** రూ. క్రన్నన. క్రి. విశ. ద్రు. **1**. మరల. భార, ఆది. 3.168 ; **2**. పిమ్మట. భార.సభా. 2.209 ; **3**. శీఘ్రంగా. భార. సభా. 2.268.

త. *కణ్ణా*. శీఘ్రంగా, త్వరగా.

**క్రన్నన** రూ.చూ. క్రన్న. క్రి.విశ.ద్రు. **1**. పిమ్మట. మార్క. 1.37; **2**. శీఘ్రంగా, చయ్యన. ఆం.భా. 3.71.

**క్రంప** రూ. కంప. వి. ముళ్ళ కంప. భార. అను. 3.235.

త. *కఝు*. రెండువైపులా కూసిగా ఉన్న కర్ర ముక్కలు, త్రిశూలం ; *కఝు-క్-కట్టై*. కూసిగా ఉన్న ఇనప మేకు

కలిగి నేలలో పాతిన కొయ్య, పెద్ద మేకు ; కఱ-క్-కారై. కంటకావృతమైన పొద ; కఱ. కఱ ; కత్తి. ముళ్ళవంటి వెదురు, వెదురు సీసా.

క్రమ్మటన్ అవ్య. ద్రు. మరల, క్రన్నెనన్.

క్రమ్మనన్ రూ.చూ. గ్రమ్మనన్. అవ్య. ద్రు. శీఘ్రంగా. హరి. పూ. 5.243.

క్రమ్మరిలు రూ.చూ. క్రమ్మఱిలు. అ.క్రి. మరలు, మరలివచ్చు.

క్రమ్మరిల్లు రూ.చూ. క్రమ్మఱిల్లు. అ.క్రి. మరలు, మరలివచ్చు.

క్రమ్మఱన్ చూ. క్రమ్మఱు.

క్రమ్మఱఁగ చూ. క్రమ్మఱు.

క్రమ్మఱఁబడు చూ. క్రమ్మఱు.

క్రమ్మఱి చూ. క్రమ్మఱు.

క్రమ్మఱించు చూ. క్రమ్మఱు.

క్రమ్మఱిలు చూ. క్రమ్మఱు.

క్రమ్మఱిల్లు చూ. క్రమ్మఱు.

క్రమ్మఱు అ.క్రి. మరలు, మరలివచ్చు, మరలిపోవు. భార. అరణ్య. 6.237.

క్రమ్మఱన్ అవ్య. ద్రు. 1. మరల. హరి. ఉ. 3.125; 2. వాక్యాలంకారం. పారి. 1.75. క్రమ్మఱఁగ అవ్య. ద్రు. 1. మరల, పునరర్థకం ; 2. వాక్యాలంకారం. క్రమ్మఱఁబడు అ.క్రి. మరలు, క్రమ్మరు. క్రమ్మఱి అవ్య. మరల, పునరర్థకం. ఆం.భా. 3.69. క్రమ్మఱించు స.క్రి. తిప్పు, మరలించు. భార. ఆది. 1.100. క్రమ్మఱిలు రూ. క్రమ్మరిలు, క్రమ్మరిల్లు, క్రమ్మఱిల్లు. అ.క్రి. 1. పునర్జీవితు డగు. హర. 3.93; 2. మరలు, మరలివచ్చు. క్రమ్మఱిల్లు రూ.చూ. క్రమ్మఱిలు. అ.క్రి. మరలు, మరలివచ్చు. పాండు. 4.80. క్రమ్మఱుచు స.క్రి. 1. ఉపశమిల్లచేయు. భార. అరణ్య. 3.170; 2. మరలించు, తిప్పు. భార. విరా. 2.23. క్రమ్మఱుదెంచు (-తెంచు) అ.క్రి. మరలు, నివర్తిలు.

క్రమ్మించు చూ. క్రమ్ము.

క్రమ్ము రూ. కమ్ము[1]. అ.క్రి. 1. కలుగు, పుట్టు. కు. సం. 4.87; 2. వ్యాపించు, ప్రసరించు. భార. భీష్మ. 3.108; 3. ప్రవహించు, కారు. భార. స్త్రీ. 2.64; 4. కవియు, పైబడు, పడు. భార. భీష్మ. 2.217; 5. అతిశయించు, అధికమగు. పారి. 4.71; 6. ఉటుకు. దశా. 2.263; స.క్రి. 1. చుట్టు. వసు. 1.144; 2. కలియు, కూడు. వసు. 2.136; 3. పొదుగు, పక్షులు రెక్కలతో గుడ్లను కప్పు. వసు. 4.134; 4. ఆవరించు. ఆం. భా. 3.117.

పో.చూ. క. కప్పు. కప్పు, వ్యాపించు, ప్రసరించు ; త. కార్ (-త్తి-ప్పి-). చీకటిచేయు, మేఘం ; కార్-ఇరుళ్. దట్టమైన చీకటి ; కార్-ఎణల్. నలుపెక్కు ; కరుక్కల్. మబ్బుగా ఉండటం ; కమ్మ. మబ్బుగా, చీకటిగా ; కమట్ (న్తి-, న్-). వ్యాపించు ; కప్పు (-ఇన్-, న్-). మబ్బులాగ వ్యాపించు ; కవి (న్తి- ; న్-). వ్యాపించు ; కుఇ. గర్హ. బయటకు వ్యాపించు, ఎక్కువగు, లావయి బయటికి వ్యాపించు.

క్రమ్మించు స.క్రి. వ్యాపింపచేయు. దశా. 2.10; త. కార్. చీకటిచేయు, మేఘం, కార్-ఇరుళ్. దట్టమైన చీకటి. క్రమ్ముకొను చూ. కమ్ముకొను. అ.క్రి. మూగు. ప్రభా. 2.41. క్రమ్ముదనము (-తనము) వి. కుచ్చితం, కాపట్యం. క్రమ్ముదల (-తల) చూ. కమ్ముదల. వి. 1. కమ్మటం ; 2. కప్పటం, మరుగుపరచటం. క్రమ్ముదెంచు (-తెంచు) అ.క్రి. 1. ఉబుకు. భార. విరా. 5.402; 2. తోసుకొనివచ్చు. భార. శల్య. 2.31; 3. వెడలు, ఉద్గతమగు. భాస్క.రా. యు. 482; 4. వ్యాపించు. భాగ. 7.291. క్రమ్మదేరు (-తేరు) అ.క్రి. పైకుబుకు. స.క్రి. చుట్టుకొను, ఆవరించు. క్రమ్మునన్ క్రి. విశే. ద్రు. వడిగా, త్వరగా. క్రమ్ములించు స.క్రి. వ్యాపింపచేయు, మరలించు. క్రమ్ముపడు (-పడు) అ.క్రి. మూతపడు. గంధ. 66. క్రమ్మెక్కు అ.క్రి. పొరు, ప్రవహించు.

క్రమ్మెక్కు చూ. క్రమ్ము.

క్రయపెట్టు స.క్రి. వెలకుపెట్టు, అమ్మచూపు. నిరంకు. 2.26.

సం. క్రయ. వెల, కొనుగోలు.

క. క్రయ. అమ్మ, అమ్మేధర ; త. కిరయమ్. అమ్మేధర.

<సం. క్రయ- + పెట్టు.

క్రయ్య రూ. కయ్య, కెయ్య. వి. కుల్య, కాలువ. భార. సౌప్తి. 2.17.

త. కఱ-. ఉప్పుటేరు, ఉప్పునీరు ; కళర్. చవిటినేల, బురదనేల. కఱరి. చవిటినేల ; మ. కఱ. ఉప్పునేల, చవిటినేల ; కొండ. కయ్ళ్, కళ్ట్. ఉప్పునిది ; కయ్ళ్ క్ప్, కళ్ గ్ప్. ఉప్పు ఎక్కువగు.

క్రయ్యూట రూ. క్రియ్యూట, క్రియూట. వి. కాలువ ఊట, కాలువ నీరు. పండి.చ. 5.313. <క్రయ్య + ఊట.

క్రయ్యఁబడు చూ. క్రయ్యు.

క్రయ్యఁబాఱు చూ. క్రయ్యు.

క్రయ్యు అ.క్రి. 1. కలియు. భాగ. 9.230; 2. నన్నగిలు(?)

త. కఱుము. కలియు.

క్రయ్యఁబడు అ.క్రి. 1. కలియబడు, కలియు, చొరబడు, చొచ్చు. విజ్ఞా. ఆచా. 100; 2. కలియు, కూడు. భాగ. 9.577; 3. బలాత్కరించబడు. క్రయ్యఁబాఱు అ.క్రి. కలయబారు. భాగ. 9.230. <క్రయ్యు + -అ[7] + పాఱు.

క్రయ్యూట చూ. క్రయ్య.

క్రల్ల వి. బూడిద, భస్మం.

క్రల్లపడు (-పడు) అ.క్రి. దగ్ధమగు, కాలు. హరి.పూ. 6.36. త. కార్. (-న్తి-, ప్పి) నలుపెక్కు, కరి. (-న్తి-న్-) ఎండిన, కాలిన, కరుళ్. నలుపెక్కు.

క్రవ్వికొను స.క్రి. తృప్తిగా తిను.

క్రష్ వి. నలగటం.

ఇం. *Crush*. అణచు. 1. అణగతొక్కు ; 2. నలగ్గొట్టు, పిప్పిచేయు.

<ఇం. Crush.

క్రాఁక చూ. క్రాఁగు. రూ.చూ. కాఁక. వి. 1. బాధ, తాపం ; 2. కోపం ; 3. తపస్సు ; 4. జ్వరం ; 5. వేడిమి ;

6. ఎండ. విశ. వేడెక్కిన.

త. కార్. నలుపు, తీవ్రమైన ద్వేషం, అసహ్యం.

**క్రాఁగిపోవు** చూ. క్రాఁగు.

**క్రాఁగు** రూ.చూ. కాఁగు. అ.క్రి. 1. పోవు, నశించు. భార. ఆరణ్య. 2.230 ; 2. దగ్ధమగు, కాలు, మండు. భార. శాంతి. 1.93 ; 3. కినియు. వి. కాగు, పెద్దబాన. రాజ. వి. 3.13.

క్రాఁగిపోవు అ.క్రి. నశించు. మార్క. 3.315. వ్య. నీళ్ళలాగ కాగి ఆవిరయి నశించిపోవు. క్రాఁగుడు వి. తపించటం.

**క్రాచు** స.క్రి. కాంౘించి ఉమియు, వెలిగక్కు.

**క్రాఁచివుచ్చు** చూ. క్రాఁచు.

**క్రాఁచు** రూ.చూ. కాఁచు. స.క్రి. 1. నశింపచేయు, పోగొట్టు, చంపు. భార.ఆరణ్య. 2.320 ; 2. కరగించు, తపింప చేయు. భార. ఆశ్రమ. 2.151. నిర్వ.రా. 6.88 ; 3. పీడించు. శృం.నై. 7.41.

క్రాఁచివుచ్చు స.క్రి. 1. నశింపచేయు. భీమ. 3.115 ; 2. చంపు, వెడలగొట్టు, చెరచు, కరగించు.

**క్రానుగ** రూ.చూ. కానిక[1]. వి. కానుక, ఉపాయనం.

**క్రాయు** పో.చూ. కక్కు. స.క్రి. 1. ఉమియు. ఉ.హరి. 2.124 ; 2. కక్కు. శృం.నై. 8.173. అ.క్రి. కాంౘించు. కాశీ. 4.269.

క. కాఱ్, కాఱు. కక్కు, వాంతియగు ; కారిసు. కక్కించు ; కాఱు, కాఱికె, కాఱుహ. కక్కడం ; కొడ. కర్. కక్కు ; తు. కారుని. కక్కు, ఉమ్మివేయు ; కాలాభుని. కక్కించు ; త. కాఱు. (-ఇన్, -ప్-) దేగలను పంపి వేటాడు, శ్లేష్మం, కఫం ; కాల్. కక్కు, ఉమియు ; క్యాఱల్. వాంతి, దగ్గటం ; కాఱు. కఫం తెచ్చుకొను, దేగలను పంపి వేటాడు ; మ. కారుక. వాంతిచేయు ; కాలుక. ఉమియు ; కారక్కక. ఉమ్మివేయు, వాంతి చేయు ; తొ. కొసె. వాంతిచేయు ; గోం. కాహ్‌బానా. తీవ్రంగా దగ్గు ; కొండ. కర్. వాంతిచేయు.

**క్రార** వి. జడ్డ అయి ఒక అక్షరంతో కలిసే రేఫం, క్రావడి. అప్ప. 4.49.

క్రారవడి రూ. క్రారావడి. వి. జడ్డ అయి ఒక అక్షరంతో కలిసే రేఫం.

**క్రారావడి** రూ.చూ. క్రారవడి. వి. అక్షరం కింది రేఫం, క్రావడి, రావత్తు, గిలక.

**క్రాలించు** చూ. క్రాలు.

**క్రాలు** అ.క్రి. 1. ప్రవర్తిల్లు, వర్తిల్లు. నిర్వ.రా. 6.6 ; 2. అతిశయించు, విజృంభించు. భార. ద్రోణ. 4.29 ; 3. సంచరించు, తిరుగు. భార. ద్రోణ. 5.317 ; 4. సంచలించు, క్షోభపడు. రం.రా. ఆరణ్య. 187. పు. 13 పం. ; 5. ఒప్పు. ఉ. హరి. 3.9 ; 6. చలించు, కదలు. భాస్క. రా. అయో. 10 ; 7. చెదరు. భాగ. 6.425 ; 8. కమ్ము. పారి. 4.67.

క. కడల్. జారిపోవు ; త. కడల్. (-వ్-ంద్- ; -వ్-) జారిపోవు, పరిగెత్తు ; మ. కడలుక. జారు ; గోం. కరెంగ్, కసెంగ్. కదల్చివేయు.

క్రాలించు స.క్రి. కదలించు, క్రాలచేయు. క్రాలుకొను అ.క్రి. ప్రకాశించు. వసు. 4.23. క్రాలుఁగంటి రూ.చూ. క్రాల్గంటి. వి. 1. చంచలాక్షి, తరళాక్షి ; 2. స్త్రీ. క్రాలుఁగన్ను రూ. క్రాల్గన్ను. వి. 1. రోగవిశేషయుక్తమైన నేత్రం. పండి.చ. 4. పు. 273 పం. ; 2. చంచ లీక్షణం, లోలనేత్రం. క్రాల్గంటి రూ. క్రాలుఁగంటి. వి. 1. చంచలాక్షి, తరళాక్షి. నీలా. 3.36 ; 2. స్త్రీ. క్రాల్గన్ను రూ.చూ. క్రాలుఁగన్ను. వి. చంచ లేక్షణం, లోలనేత్రం. మను. 1.12.

**క్రాలుగచ్చ** వి. బావంజి, కలుగచ్చ.

**క్రాల్గంటి** చూ. క్రాలు.

**క్రాల్గన్ను** చూ. క్రాలు.

**క్రాసుబద్ద** వి. మూలబద్ద, మరాను కట్టుబడిలో అడ్డపట్టెలను ఆకులను బిగించిన కట్టె.

ఇం. *Cross*. అడ్డం.

<ఇం. Cross + బద్ద.

**క్రి-** రూ.చూ. క్రీ-. విశ. కింది. ఉదా. క్రియ్యాట.

**క్రిక్క** వి. 1. వంది, బట్టువాడు. కావ్యా. చూ. 1.63 ; 2. యతులు తాల్చే ఒక వస్తువు.

త. కీఴ్. తక్కువజాతి, తక్కువజాతి మనిషి ; కీఴ్మై. అధఃస్థితి.

క్రిక్కలు వి.బ.వ. చదువరులు, బట్టువారు.

**క్రిక్కటిలు** రూ.చూ. క్రిక్కటిల్లు. అ.క్రి. కంపించు.

**క్రిక్కటిల్లు** రూ. క్రిక్కటిలు. అ.క్రి. కంపించు. పద్మ. 9.321.

త. కిఱ్. (-న్త్-వ్) చెల్లాచెదరు చేయబడు.

**క్రిక్కిర్యు** చూ. క్రిక్కు.

**క్రిక్కిఱి** చూ. క్రిక్కు.

**క్రిక్కిఱించు** చూ. క్రిక్కు.

**క్రిక్కిఱియు** చూ. క్రిక్కు.

**క్రిక్కిఱు** చూ. క్రిక్కు.

**క్రిక్కు** రూ. క్రుక్కి. వి. 1. తిప్పు ; 2. బాధ. అ.క్రి. దట్టంగా ఉండు.

పో.చూ.క. కెక్కళిసు-. భయకంపితులగు ; కిఱ్. మూయించు, నిబంధించు, మూయు ; పో.చూ.త. కఱి (-న్త్-వ్-). సమృద్ధిగాఉండు.

క్రిక్కిర్యు రూ.చూ. క్రిక్కిఱియు. అ.క్రి. 1. గుంపుగా చేరు ; 2. నిండు ; 3. చేరు, కూడు. క్రిక్కిఱి విశ. మిక్కిలి ఇరుకైన, కొంచెమైన, ఎడంలేకుండా ఉండే. శృం. నై. 7.194. త. కఱి (-న్త్-,-వ్-). మిక్కుటమగు, తీవ్రమగు. క్రిక్కిఱించు స.క్రి. 1. ఎడములేకుండాచేయు. జైమినీ భా. 8.127 ; 2. ముడుచు. పాండు. 4.237. క. కిక్కిఱిసు. ముడుచుకొను, ఎడములేకుండచేయు ; కిక్కిఱ్. దగ్గరగు, దట్టమగు, లావగు ; కిక్కింద, కిష్కింద. సామీప్యం, ఒత్తిడి, గుంపు ; త. కఱి (--న్త్, వ్-). మిక్కుటమగు, తీవ్రమగు. క్రిక్కిఱియు రూ. క్రిక్కిర్యు. అ.క్రి. 1. ఎడములేక ఉండు, నిండు. కు.సం. 8.85 ; 2. చేరు, కూడు. అం.భా. 3.119. త. కఱుము. నిండు, పూర్తిఅగు,

కిక్కిరిసిఉండు, గుమిగూడు. క్రిక్కిఱు స.క్రి. 1. ఎడమ లేకుండచేయు, ఇరుకుగాచేయు ; 2. మోసపుచ్చు ; 3. కూడు, చేరు. క్రిక్కొను విణ. నిండిన. కు.సం. 3.26 ; అ.క్రి. 1. నిండు. కు.సం. 10.36 ; 2. క్రిక్కిరియు.

క్రిక్కొను చూ. క్రిక్కు.

క్రిగ్గాఁడి రూ.చూ. క్రీగాఁడి. వి. క్షుద్రుడు.

క్రిగ్గాడికాఁడు వి. క్షుద్రుడు.

క్రిగ్గాలి వి. తూర్పుగాలి. బసవ. 4 పు. 125 పం.

త. కీఴ్-కాఱ్ఱు. తూర్పుగాలి ; కీఴ్. తూర్పు ; కీఴక్కు. తూర్పు.

< త. కీఴ్ + గాలి.

క్రింగొడగిల్లూరుచు అ.క్రి. శరీరాన్ని కుంచించుకొను. పండి.చ. 2.362.

క్రించు చూ.క్రి. రూ.చూ. కించు. విణ. 1. దుష్టమైన. భార. స్త్రీ. 3.76 ; 2. నీచమైన. భాస్క.రా. యు. 484. వి. అల్పుడు, నీచుడు.

త. కీఴ్. తక్కువతనం, అల్పత్వం, నీచకులం, తక్కువ జాతి మనిషి.

క్రించుఁడు వి. నీచుడు, అల్పుడు. ఉ.రా. 8.96. క్రించుఁదనము వి. అల్పత్వం, నైచ్యం. భాగ. 6.106.

క్రితము వి. పూర్వం, మునుపు. బసవ. 7.137.

సం. కృత-. చేయబడిన.

< సం. కృత-.

క్రింద చూ. క్రిందు.

క్రిందట చూ. క్రిందు.

క్రిందటి చూ. క్రిందు.

క్రిందంటు చూ. క్రిందు.

క్రిందల చూ. క్రిందు.

క్రిందు వి.ఔ. 1. పూర్వకాలం. భాగ. 10. ఉ. 481. ; 2. అధోభాగం, దిగువ. ఆము. 5.137 ; 3. అధఃస్థితి, వశం. వసు. 1.65. విణ. 1. అధోభాగమందున్న. హరి.పూ. 1.53 ; 2. తక్కువ. వసు. 1.65 ; 3. కడచిన.

క. కెర్, కెఴ్. అధోభాగం ; త. కీఴ్. కిందది, పూర్వకాలం ; కీఴ్మై. అధఃస్థితి.

క్రింద రూ. కింద. అవ్య. ద్రు. దిగువ, కింద. క్రిందట అవ్య. ద్రు. కిందను, పూర్వం ; క్రిందటి ; విణ. వెనుకటి, పూర్వపుది. క్రిందంటు అ.క్రి. నశించు. ఉ.రా, 7.337 ; 2. అన్నం మొ. అడుగంటు. క్రిందల వి. కిందయిన తల, అధోముఖం. పాండు. 2.29. < క్రిందు + తల. క్రిందుచేయు రూ.చూ. క్రిందుసేయు. స.క్రి. అధోముఖంగా చేయు. పాండు. 1.152. క్రిందువడు రూ. క్రిందుపడు. అ.క్రి. 1. లోబడు, లొంగు. వరాహ. పు. 6.160 ; 2. ఓడు. నిరం. 3.29 ; 3. తగ్గు. కళా. 4.94. క్రిందువఱచు రూ.చూ. క్రిందుపఱుచు. స.క్రి. భంగపరచు. అవమానపరచు. భాగ. 10. పూ. 1328. క్రిందుపఱుచు రూ. క్రిందుపఱచు. స.క్రి. 1. అధఃస్థితంగాచేయు. భాస్క.రా. యు. 1427 ; 2. ఓడించు. వరాహ. 9.43 ; 3. ఓడించు (ఇటజీవమ్యద్యోతకం). విష్ణు పు. 5.65. క్రిందుమీఁదగు అ.క్రి. తలకిందులగు. హంస. 2.141. క్రిందులు వి.బ.వ. పాతాళాలు. క్రిందువడు(-పడు) రూ.చూ. క్రిందుపడు. అ.క్రి తక్కువగు, తగ్గు. వేంక. పంచ. 2.132. క్రిందుసేయు(-చేయు) రూ. క్రిందుచేయు. స.క్రి. అధోముఖంగా చేయు. భార. ఆది. 77.

క్రిమ్జన్ రూ.చూ. క్రిమ్సన్. వి. 1. ఒకరకం ముదురు గులాబి రంగు ; 2. చంద్రకాంత రంగు.

క్రిమ్సన్ రూ. కిమ్సన్, క్రిమ్జన్. వి. 1. ఒకరకం ముదురు గులాబి రంగు ; 2. చంద్రకాంత రంగు.

ఇం. *Crimson* కెంపువన్నె.

< ఇం. Crimson.

క్రియ వి. విధం. భార. భీష్మ. 2.45.

క. *క్రియె*, *క్రియా*, *క్రియ్యె*. సామర్థ్యం, ఆస్తి, రాబడి, అవశ్యకమైన, ఉచితమైన.

సం. *క్రియా*. పని.

< సం. *క్రియా*- (అర్థవిపరి.).

క్రియగొను(-కొను) అ.క్రి. 1. కలుగు, ఒనగూడు. భార. ఆది. 8.46 ; 2. పూను. పండి.చ. 1.69 ; క. *క్రియా*, *క్రియె*, *క్రియ్యె*. ప్రారంభించు, గైకొను.

క్రియ్యు రూ.చూ. క్రుయ్యు. అ.క్రి. 1. కృశించు. భాగ. 10. పూ. 707 ; 2. సన్నగిలు.

క్రియ్యాట రూ.చూ. క్రయ్యాట. వి. కిందిఊట. పాండు. 1.118.

క్రిష్ణ (రంగు) వి. బొగ్గుమాదిరి నల్లరంగు. విణ. నల్లని.

క్రిష్ణకమలం వి. ఒకరకం నేతచీర. క్రిష్ణకాటికలు వి బ.వ. క్రిష్ణనీలాలు, ఆరునెలల్లోపండే ఒకపంట. క్రిష్ణకాంత వి. ఒకరకం కలుపుమొక్క. క్రిష్ణనీల వి. నలుపులో తెలుపు వన్నె కలిసిన రంగు. క్రిష్ణనీలాలు వి.బ.వ. క్రిష్ణకాటికలు, మంచి సన్నటి వడ్లు. క్రిష్ణబలుగు వి. నల్లరంగు మబ్బు. క్రిష్ణరేగడి వి. నల్లరేగడి, ఎక్కువగా నల్లగాఉండే రేగడినేల, సారవంతమైనది. క్రిష్ణలీలలు వి.బ.వ. ఒకరకం నేతచీర.

క్రి- రూ.క్రి-. విణ. కింది.

క. *కీఴ్*, *కిఱ*, *కెర్*. కిందఉండు, అడుగున, దిగువ ; *కిఱతన*. తక్కువతనం ; *కెళ్లు*, *కెర్గు*. కిందుగాఉండు ; *కెళగు*. కిందుగాఉండు ; కొడ. *కి*. కింద ; *కిలి*, *కిద*. కిందఉంచు, దిగువ ; తు. *కిళు*, ఆధారం, కిందిచోటు, కింది ; *కీడు*. నీచమైన ; త. *కీఴ్*. కిందిస్థలం, కిందిది, తూర్పు ; *కీఴోర్*. నీచమైన, తక్కువ, నీచప్రజలు ; *కిఱక్కు*. తూర్పు, అడుగుభాగం, తూర్పు ; మ. *కీఴ్*, *కిఴు*. కిందివైపుస్థలం, కింద. తొ. *కి*. కిందిది ; కొండ. *కి-*. కిందిది, తూర్పు ; పర్జి, *కిఴ్*. కింద ; కురు. *కియ్యా*. అడుగున, దిగువ ; *కిలా*, *కియ్యంతా*. అడుగున, అట్టడుగున ; బ్రా. *కి-*, *కీ-*, *కే-*. కింద, అడుగున ; *కెరొమ్*. కిందివైపు, అడుగుభాగం.

< మూ.ద్రా. *కీఴ్.

క్రిగాడ్పు వి. కిందిగాలి, అపానవాయువు. పి. శకు. 2.113. క్రిగోరు వి. కిందఉన్నగోరు, కాలిగోరు. కు.సం. 1.109. క్రిఁగడుపు (-కడుపు) వి. పొత్తికడుపు, వస్తి.

ఆం.భా. 2.136. త. కీళ్-వయిఱు. పొత్తికడుపు. క్రీ(గమ్మ (-కమ్మ) వి. నేత్రాంచలు కటాక్షం. క్రీనీడ రూ. క్రైనీడ. వి. కిందినీడ. శృం.నై. 8.174. క్రీనీరు వేల వి. జలప్రాయదేశం. అనూపం. ఆం.భా. 2.7. క్రీ(దొర(-తొర) వి. కిందితొడ, తొడ అడుగుభాగం. భార. శాంతి. 1.21. క్రీ(బడు(-పడు) అ.క్రి. తక్కువఅగు. మార్క. 1.97. త. కీళ్-ప్-పడు. తక్కువఅగు. క్రీయూట (-ఊట) రూ. క్రయ్యూట. వి. కిందిఊట. క్రీవాడ వి. పాటిపొలం.

క్రీగా(డి రూ. క్రిగ్గా(డి. వి. క్షుద్రుడు.

క్రీడి వి. అర్జునుడు. భార. విరా. 4.15.
సం. కిరీటిన్. అర్జునుడు ; ప్రా. కిరీడి.
త. కిరీటి. అర్జునుడు.
<ప్రా. కిరీడి.
క్రీడిచెలితేరు వి. గరుడుడు.

క్రీస్తు వి. క్రీస్తుప్రభువు. విశే. క్రీస్తుశకసంబంధమైన.
క. క్రిస్త. ఏసుక్రీస్తు ; త. కిఱిస్తు. ఏసుక్రీస్తు.
గు. క్రిస్తాస్.
గ్రీకు. *Kristos*. ఏసుక్రీస్తు ; ఇం. *Christ*.
<ఇం. Christ.

క్రుక్కి రూ.చూ. క్రిక్కు. వి. అటమట. క్రిక్కు. కికురు, కిక్కురు.

క్రుక్కించు చూ. క్రుక్కు.

క్రుక్కిదమగు చూ. క్రుక్కిదము.

క్రుక్కిదము చూ. క్రుక్కు.

క్రుక్కు రూ. కుక్కు. స.క్రి. 1. అదచు. మను. 3.97 ; 2. (పేను మొ. వాటిని) బొటనవేలిగోటితోనొక్కు. పాండు. 3.30 ; 3. తూర్చు, చొప్పించు. విష్ణుపు. 7.324 ; 4. అదుము, కూరు. వి. వంచన, మోసం. ఆం.భా. 2.292.
క. కుక్కు. (కుడుకు) ముక్కుతోపొడిచి ఏరుకొను, పొడుచు ; త. కుఱుక్కు (-ఇన్,-ప్-). కోతకోయు, ముడుచుకొనిపోవు ; కుఱు (ఆ్-,న్-). దట్టించు, కూరు ; మ. కుఱుమ్మ్క. దురాశతోతిను ; కుఱు. కూరు ; మాల్తో. కూరు.
క్రుక్కించు స.క్రి. అదమించు, కూరించు. పరమ.వి. 5.27. క్రుక్కిదమగు అ.క్రి. నిండు. < క్రుక్కిదము + అగు. క్రుక్కిదము విశే. 1. నిండిన. కు.సం. 1.38 ; 2. పూడిన, కప్పబడిన. పండి.చ. 2 పు. 134 పం. క్రుక్కుడు వి. పీడనం, అదమటం. ఆం.భా. 1.150. క్రుక్కుమిక్కను అ.క్రి. 1. ఊపిరిఆడు ; 2. శబ్దంపుట్టించు.

క్రుంకించు చూ. క్రుంకు.

క్రుంకిడు చూ. క్రుంకు.

క్రుంకు రూ. కుంకు, కూ(కు, గ్రుంకు, గూకు[1]. అ.క్రి. 1. అస్తమించు. భార.విరా. 2.312 ; 2. మునుగు, స్నానం చేయు. భార. శల్య. 2.54 ; 3. గుచ్చుకొను, శేయూ. 3.115 ; 4. చచ్చు, మృతినొందు. ఉ.హరి. 6.180 ; 5. అడుగుకుపోవు. ఆము. 2.66. వి. అస్తమయం. పి. శకు. 4.164.
క. కుఙ్గు, కుగ్గు. ముడుచుకొను ; తు. కుగ్గుని. కుంగి పోయిన, కృశించు, నశించు ; త. కుఱుకు(-ఇన్-, వ్-). క్షీణించు ; కుఱు (ల్-, ప్ప్-) కుఙ్గు, కున్గు (-ఇన్-,వ్-). తక్కువగు, తగ్గిపోవు, నశించు ; మ. కుంకుక. క్షీణించి పోవు ; కుంచుక. ముందుకువంగు ; కుఇ. క్రూవ. అస్త మించు, క్షీణించు ; కువి. క్రూఇయలి. క్షీణించు ; పెర్ర క్రూపూ. అస్తమించు.
క్రుంకించు స.క్రి. కుంకచేయు, అస్తమింపచేయు. భార. విరా. 2.314. <క్రుంకు + -ఇంచు[3]. క్రుంకిడు అ.క్రి. స్నానంచేయు. మను. 1.68. <క్రుంకు + ఇడు. క్రుంకు గట్టు (-కట్టు) రూ. క్రుంకుడుగట్టు. వి. అస్తపర్వతం, పడమటికొండ. యయా. 5.30. క్రుంకుగుబ్బలి వి. అస్త్రాద్రి, పడమటికొండ. అచ్చ.రా. అయో. 13. క్రుంకు(గడలి (-కడలి) వి. పశ్చిమసముద్రం. సీలా. 3.3. క్రుంకు( గొండ వి. పడమటికొండ, అస్త్రాద్రి. ఆం.భా. 2.28. <క్రుంకు + కొండ క్రుంకుడు వి. అస్తమయం. క్రుంకుడు గట్టు రూ.చూ. క్రుంకుగట్టు. వి. అస్త్రాద్రి. యయా. 3.34. క్రుంకుతటి వి. అస్తమయవేళ. క్రుంకుపుడమితాల్పు వి. అస్త్రాద్రి. పడమటికొండ. క్రుంకుమల వి. అస్త్రాద్రి. పడమటి కొండ. ప్రబంధ. 1.61. క్రుంకుమెట్ట వి. అస్త్రాద్రి. పారి. 2.32. క్రుంకుమెట్టు వి. అస్త్రాద్రి. యయా. 2.70. క్రుంకులిడు అ.క్రి. స్నానంచేయు. అచ్చ.రా. బాల. 1.46. <క్రుంకు + -లు + ఇడు. క్రుంకులువెట్టు (-పెట్టు) అ.క్రి. 1. కిందికివంగు. భాస్క. రా. అయో. 37 ; 2. మునుగు, స్నానంచేయు. భీమ. 3.117 ; క్రుంకువెట్టు (-పెట్టు) అ.క్రి. మునుగు, నిమగ్నుడగు. భోజరా. 5.222.

క్రుంగ(బడు చూ. క్రుంగు.

క్రుంగ(బాఱు చూ. క్రుంగు.

క్రుంగిపోవు చూ. క్రుంగు.

క్రుంగిల(బడు చూ. క్రుంగు.

క్రుంగిలు చూ. క్రుంగు.

క్రుంగిల్లు చూ. క్రుంగు.

క్రుంగు రూ. కుంగు. అ.క్రి. 1. వంగు, కిందికొదుగు. పొట్టి దగు. భార. విరా. 2.15 ; 2. తగ్గు, నశించు. దశకు. 5.23 ; 3. అడగు. శృం.నై. 1.35 ; 4. దిగబడు. కాశీ. 3.12 ; 5. మరణించు. ఆం.భా. 2.225.
క. కుగ్గు. వంగి ఉండు ; తు. కుందుని. తగ్గు, తగ్గి పోవు ; కుడ్య. పొట్టి ; త. కుఱుక(-ఇన్-వ్-). తగ్గి పోవు, తక్కువగు ; కుృణు. తగ్గించు, నశించు, ఎక్కువ స్థాయినుండి దిగజారు ; పో.చూ. కూర్. వంగు ; మ. కుఱుక. పొట్టిఅగు, తక్కువగు ; కుఱు. పొట్టి, చిన్న ; కుఇ. క్రుంబ. నీటిలోమునుగు ; క్రువ. క్షీణించు ; కువి. క్రుఇ. మునుగు.
క్రుంగ(బడు అ.క్రి. దిగబడు, కిందికిపోవు. భాస్క.రా. కిష్కిం. 431. క్రుంగ(బాఱు (-పాఱు) అ.క్రి. 1. మెత్తనగు ; 2. కుంగిపోవు. క్రుంగిపోవు అ.క్రి. 1. నశించు. నార. పంచ. 1.144 ; 2. హీనసత్వుడగు. క్రుంగిల(బడు అ.క్రి. కిందికి అడగు. రాజగో. 56. <క్రుంగిలు + -

అ⁷ + పడు. క్రుంగిలు రూ. క్రుంగిల్లు. అ.క్రి. ముడుచు, సంకుచితావయవమగు. విజయ. 2.30. క్రుంగిల్లు రూ.చూ. క్రుంగిలు. అ.క్రి. ముడుచు, సంకుచితావయవమగు.

**క్రుచ్చియెత్తు** చూ. క్రుచ్చు.

**క్రుచ్చు** చూ. కూర్చు. స.క్రి. కూర్చు, చేర్చు, జతచేయు.
త. కూర్. విస్తారం, సమృద్ధి.
క్రుచ్చియెత్తు (-ఎత్తు) కౌగిలించు కవిక. 3.167.

**క్రుంచు** రూ.చూ. కుంచు. స.క్రి. 1. వంచు; 2. తగ్గించు; 3. అవహసించు; 4. కుంచెతో సున్నంపూయు; 5. ముడుచు.

**క్రుమ్మడఁగించు** చూ. క్రుమ్ము.

**క్రుమ్మరించు** స.క్రి. 1. కుండలులోనగువాని నుంచి ఒక్కసారిగా జలాదులను పడవేయు. సిం.ద్వా. 10.44; 2. అధికంగా ప్రసరింపచేయు. వసు. 5.109; 3. అధికంగా వెలువరచు. ఉ.రా. 3.345.

**క్రుమ్మరిలు** చూ. క్రుమ్మరించు. రూ. క్రుమ్మరిల్లు. అ.క్రి. 1. కుండలోనగువానినుండి ఒక్కసారిగా జలాదులు పడు. కవి. రా. 2.161; 2. పడు.

**క్రుమ్మరిల్లు** రూ.చూ. క్రుమ్మరిలు. అ.క్రి. 1. కుండలోనగు వానినుండి ఒక్కసారిగా జలాదులుపడు. పద్మ. 10.29; 2. పడు.

**క్రుమ్మరు** రూ. కుమ్మరు. అ.క్రి. 1. తిరుగు, సంచరించు, భార. ఆది. 7.75; 2. విహరించు. భార. ఆరణ్య. 3.176; 3. ప్రవర్తించు. చెన్న. బసవ. 5.224.
పో.చూ. క. కుఱుబ, కుఱుంబ. ఊరూరా తిరిగే గొర్రెల కాపరి; తు. కురుబె; త. కుఱై (-న్; -ప్- ముందుకు వెనుకకు ఊగు.

**క్రుమ్మికూరాకుచేయు** చూ. క్రుమ్ము.

**క్రుమ్ము** రూ.చూ. కుమ్ము[1]. స.క్రి. పొడుచు. ఉ.హరి. 1.148; వి. పోటు, పొడుపు. ఉ.హరి. 4.132.
క. కుమ్ము. కుమ్మటం, దంచు; తు. గుమ్ము. పిడికిలితో పొడుచు, గుద్దు; త. కుఱు(-త్-, వ్-). కూరటం; కుత్తు(-ఇన్,-వ్-). రోటిలోదంచు, గుచ్చు; పో.చూ. కూర్. కొనమొక్క పదును; కుమ్ము(-ఇన్-, -వ్-). మెత్తగా రోటిలోదంచు; కురుమ్. రోటిలోదంచు.
క్రుమ్మడఁగించు స.క్రి. పొడుచు, పోటు. దశకు. 3.9. క్రుమ్మికూరాకుచేయు స.క్రి. చిందరవందరచేయు. సారంగ. 1.90. క్రుమ్ముడు వి. పోటు, పొడుపు, కుమ్మటం. క్రుమ్ముడు తగరు వి. కొంకుమన్నుతగరు అనే ఆయుధం, కొమ్మతగరు. క్రుమ్ముడుపడు అ.క్రి. పోటుపడు. క్రుమ్ములాడు అ.క్రి. పోట్లాడు. కాశీ. 2.104. క్రుమ్మెనలాడు స.క్రి. పొడుచు. రంగా. చ. 3.218.

**క్రుమ్ముడి** రూ.చూ. క్రొమ్ముడి. వి. కురులముడి, కొప్పు, క్రొమ్ముడి.

**క్రుమ్మెనలాడు** చూ. క్రుమ్ము.

**క్రుయి** వి. కొప్పునముడిచిన వెంట్రుకలముడి.

**క్రుయ్యఁగఁబాఱు** చూ. క్రుయ్యు.

**క్రుయ్యఁబాఱు** చూ. క్రుయ్యు.

**క్రుయ్యు** రూ. క్రియ్యు. అ.క్రి. 1. కృశించు, తగ్గు, క్షీణించు. కు.సం. 10.91; 2. వెనుదీయు, వెనుకపడు. హరి. పూ. 6.22.
పో.చూ. క. కుర్గు. వంగి ఉండు, గూను; తు. కుఱు (-త్త్,-ప్పి-). క్షీణించు, కృశించు; మ. కురయుక. క్షీణించు, కృశించు; కుఇ. కోప్క. తగ్గించు; బ్రా. కుృఖ్. ముడుచుకొను.
పో.చూ. సం. కృశ్-. కృశించు.
క్రుయ్యఁగఁబాఱు (-పాఱు) అ.క్రి. 1. కృశించు; 2. తగ్గు; 3. బడలు; 4. కొంగు. క్రుయ్యఁబాఱు అ.క్రి. 1. కృశించు. హరి. ఉ. 3.47; 2. తగ్గు; 3. బడలు; 4. కొంకు < క్రుయ్యు + -(అ)⁷ + -పాఱు.

**క్రుళ్లగించు** చూ. క్రుళ్లు.

**క్రుళ్లగింత** చూ. క్రుళ్లు.

**క్రుళ్లగింపు** చూ. క్రుళ్లు.

**క్రుళ్లికొను** చూ. క్రుళ్లు.

**క్రుళ్లు** రూ. కుళ్లు. అ.క్రి. 1. మనసులో దుఃఖించు. భాగ. 6.509; 2. అవియు, పగులు. శుక. 3.633.
క. కొళె. పుచ్చిపోవు, కుళ్ళిపోవు; కొలకు. హెచ్చరింపబడిన; కొడ. కొల్యో. కుళ్ళిపోవు; తు. కురిపుని, కురియుని. నాశనమగు, చచ్చిపోవు; కురె. అశుద్ధం, పెంట; త. కుత్తై. తొందర పెట్టు; మ. కుఴయుక. నాశనంచేయు; కుయుంపు, కుజంపు, కుళంపల్. చెడిపోవటం, కుళ్ళిపోవటం; తో. క్వడ్. పుచ్చిపోవటం; కుర. ఖొస్. చెడిపోవు, పుచ్చిపోవు; పో.చూ. మాల్తో. గొజ్నార్. అపరిశుద్ధంగా ఉండు.
క్రుళ్లగించు రూ.చూ. కుళ్లగించు. అ.క్రి. మనస్సులో దుఃఖించు. క్రుళ్లగింత వి. మనసులో పొందే దుఃఖం. క్రుళ్లగింపు వి. మనసులో దుఃఖించటం. క్రుళ్లికొను రూ.చూ. క్రుళ్లుకొను. అ.క్రి. మనసులో దుఃఖపడు. క్రుళ్లుకొను రూ. కుళ్లుకొను, క్రుళ్లికొను. అ.క్రి. 1. లోన బాధపడు; 2. పాడగు. క్రుళ్లుపోతు రూ. కుళ్లుపోతు. వి. కుళ్ళగించే స్వభావం గలవాడు.

**క్రువ్వు** విణ. వాడియైన. స.క్రి. నీటిలో ఉప్పలించు (ఉదుకు).

**క్రూరు** విణ. వాడియైన.

**క్రెళ్లు** అ.క్రి. చచ్చు, నీల్గు, ఈలుగు.

**క్రే-** పో.చూ. క్రేవ-. వృత్తియందు క్రేవ శబ్దానికి తుదివర్ణం లోపించగా మిగిలిన రూపం అనివార్యకర్ణలు. విణ. పక్కన, పక్షాన.
త. కీఴ్-క్-కణ్. కిందనుండి చూసేచూపు, ఓర చూపు; పో.చూ. కర్రై. పక్క, పక్షం.
క్రేఁగాలి వి. పక్కగాలి. అష్ట. మ. క. 2.67 వం. క. కీఴ్- కాఱు-. తూర్పుగాలి. క్రేఁగంటిచూపు వి. కడగంటి చూపు. క్రేఁగన్ను రూ. కేగన్ను. వి.బౌ. నేత్రాంచలం, కటాక్షం. కడకన్ను. కాశీ. 4.148. త. కీఴ్-క్-కణ్. కిందనుండి చూసేచూపు. ఓరచూపు. క్రేఁగయి వి. 1 హస్తాగ్రం. అచ్చ.రా. 5.13; 2. ఎడంచేయి. క్రేఁదొట్టు అ.క్రి. గట్టొరయు. ఉ.హరి. 3.64.

**క్రేగ్** వి. హంస కూతయొక్క అనుకరణం.

**క్రేంక్** వి. మరాను కట్టుబడిలో కీలును ఒగ్గులపట్టెను ఆడించే రేకు.

ఇం. *Crank* తలచినఇరుసు.

< ఇం. Crank.

**క్రేడి**[1] రూ. కేడి[2], కేళి[3]. వి. సంబావులతో కలసిన కారు మొ. ఎఱ్ఱవడ్లు.

త. కేళ్-తరయి. తక్కువరకం శ్రేణిలేక తరగతి.

**క్రేడి**[2] రూ.చూ. క్రేణి, వి. పరిహాసం.

క్రేడించు రూ.చూ. కేడించు. అ.క్రి. తొలగు. భార. ద్రోణ. 1.374. స.క్రి. ఉపేక్షించు, అలక్ష్యంచేయు శృం.నై. 5.30. క్రేడిసేయు(-చేయు) రూ.చూ. క్రేణిసేయు. స.క్రి. పరిహాసంచేయు. జైమినీ. భా. 5.42.

**క్రేణి** రూ. క్రేడి[2], గ్రేణి. వి. 1. ఉన్నతపదం, ఉన్నతాధికారం. కవిక. 2.19 ; 2. పరిహాసం. చమ. 1.68.

పో.చూ. త. కీళ్-. ఇటు, తక్కువపదవికి తగ్గించు, అవమానించు.

క్రేణించు రూ.చూ. కేడించు, స.క్రి. అలక్ష్యంచేయు, తిరస్కరించు. రామాభ్యు. 1.188. క్రేణియొనర్చు (-ఒనర్చు) స.క్రి. పరిహసించు, జొపమ్యద్యోతకం యయా. 4.156. క్రేణివట్టు (-పట్టు) స.క్రి. పొందు. కాశీ. 3.90. క్రేణిపేయు (-చేయు) రూ. క్రేడిపేయు. స.క్రి. పరిహసించు, తిరస్కరించు. భార. ఆది. 8.71.

**క్రేఁట** చూ. క్రేఁటు.

**క్రేఁటు** అ.క్రి. 1. సకిలించు, గొంతు సవరించుకొనటానికి ఒక విధమైన ధ్వనిచేయు. మను. 6.9 ; 2. తొట్రుపడు. భల్లా. 1. వి. సకిలింత, గద్గదకంఠాన్ని బాగుచేసికోటానికై చేసే ధ్వని.

పో.చూ. త. కఱంకు (-ఇన్,-వ్-). ధ్వనిచేయు, గిరగిర తిప్పు.

క్రేఁట వి. దగ్గుత్తిక, తబ్బిబ్బు, తొట్రుపాటు. క్రేఁటుకొను అ.క్రి. కంఠం బాగుచేసుకోవటానికి ఒక విధంగా శబ్దం చేయు. మను. 3.92.

**క్రేపు**[1] రూ. కేపు[1]. వి. దూడ, వత్సం. భార. శాంతి. 2.389.

త. కరు. దూడ, జంతుశిశువు ; కరుక్కు. కొత్తది, కరుమై. కొత్తది ; కరై-క్కఱు. యుక్తకాలానికి ముందు పుట్టిన దూడ ; కరై-కుట్టి, కరైపు. మానసికమార్దవం ; కఱలై. యుక్తకాలానికి ముందు పుట్టిన దూడ ; కొల్-. కొత్తది ; పో.చూ. పర్జి. కర్. (తాత) యొక్క అంటు.

క్రేపుఁగుఱ్ఱ (-కుఱ్ఱ) వి. చిన్నదూడ. వరాహ. 10.48.

**క్రేపు**[2] వి. పర్వతశిఖరం. మను. 3.6.

పో.చూ. కరై. చెరువుగట్టు, ఒడ్డు, కట్ట ; కరైపు. ఏటవాలు.

**క్రేపు**[3] రూ.చూ. కేపు[3]. వి. రాళ్ళను పగలగొట్టడానికి వాడే పేలుడు ద్రవ్యం.

**క్రేయో** వి. వెడలగొట్టటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. భల్లా. 3 ఆ.

**క్రేళ్ల** వి.బ.వ. 1. బాహుళ్యం, అతిశయం. భాస్క.రా.యు. 2271 ; 2. గంతులు ; 3. పరువులు.

త. కళల్ (-న్-త్ ; -వ్-) వదులగు, పరుగెత్తు ; కాళ్ (త్-, ప్ప్-). పుష్కలంగా ఉండు.

క్రేళ్లగదాఁటు అ.క్రి. దుముకు, ఎగిరిపడు. భాస్క.రా. కిష్కిం. 542. క్రేళ్లచూచు రూ.చూ. క్రేళ్ళసూచు. అ.క్రి. చంచలంగా చూచు. పి.శకు. 2.160. క్రేళ్లచూపులు వి.బ.వ. చంచలదృష్టులు. కళా. 6. 200. క్రేళ్లత్రుళ్లు అ.క్రి. ఉరుకు, దూకు. కువల. 4.81. క్రేళ్లదాఁటు రూ. కేళ్లదాఁటు. అ.క్రి. 1. గంతులిడు, దుముకు. భాస్క.రా. యు. 283; 2. ఎగిరిపడు. విష్ణు.పు. 2. ఆ. క్రేళ్లదోలు (-తోలు) స.క్రి. పరుగుపెత్తించు. భార. భీష్మ. 3.368. క్రేళ్లద్రివ్వు (-త్రివ్వు) స.క్రి. గంతులువేయించు. మను. 2.30. క్రేళ్లబ్బు అ.క్రి. అతిశయించు. నరస. 5.102. < క్రేళ్ల + ఉబ్బు. క్రేళ్లమలఁగు స.క్రి. వెనుదీయు, నిరాకరించు. క్రేళ్లమసలు అ.క్రి. వదలిపోవు, తిరుగు. క్రేళ్లుఱుకు రూ. కేళ్లుఱుకు. అ.క్రి. 1. ఎగిరిపడు. భార. విరా. 2.83 ; 2. ఉరుకు, దూకు. భార.శల్య. 2.275. క్రేళ్లలు వి.బ.వ. ఎత్తు, పొడవు, కొపురు. క్రేళ్లవాఱు (-పాఱు) రూ.చూ. కేళ్లవారు. అ.క్రి. గంతులువేయు. భార. భీష్మ. 2.70. క్రేళ్లసను (-చను) అ.క్రి. ఎగిరిపడు. భాస్క.రా. యు. 5.18. క్రేళ్లసూచు(-చూచు) రూ. క్రేళ్లచూచు. అ.క్రి. చంచలంగా చూచు. కు. సం. 8.6. క్రేళ్లెగయు అ.క్రి. పైకెగరు. కు. సం. 11.275. < క్రేళ్ల + ఎగయు.

**క్రేళ్లెగయు** చూ. క్రేళ్ల.

**క్రేవ** చూ. క్రే-. రూ. కేవ. వి. 1. ప్రదేశం, చోటు కు. సం. 5.41 ; 2. పక్క, పార్శ్వం, భార. భీష్మ. 3.346 ; 3. సమీపప్రదేశం, దగ్గర. ఆం.భా. 3.21.

త. కీళ్-. కిందిప్రదేశం ; కుళ్-క్-కణ్. కళ్ళను కిందికిదించి చూసేచూపు, ఓరచూపు, పో.చూ. కరై. పక్క.

**క్రేవు** వి. అరపు, సింహనాదానుకృతి.

**క్రైంచి** రూ.చూ. కైంచి. వి. ముళ్ళకంపతో కట్టినదడి.

**క్రైలు** వి. ధాన్యాన్నినూరిచి కొలవడం, ఒబ్బిడి. ఉ.హరి 4.229.

త. కరై. ఒబ్బిడి.

క్రైలుదారి రూ.చూ. క్రైలుదారు. వి. క్రైలుచేయించే అధికారి. క్రైలుదారు రూ. క్రైలుదారి వి. క్రైలుచేయించే అధికారి.

**క్రైస్తవుడు** వి. కిరస్తాను. క్రైస్తవమతానుయాయి.

ఇం. *Christian.* క్రైస్తవమతానుయాయి.

< ఇం. Christian.

**క్రొ-** విశ. కొత్తశబ్దబుప్తశేషం అనివ్యాకర్తలు, , నూతనమైన.

త. కుఱ. వయసులో ఉన్న, చిన్న, మృదువైన.

క్రొక్కన్ను వి. కొత్తకన్ను (< కొత్ + కన్ను.) ఇట్లే సర్వత్రగ్రహించండి. క్రొక్కారు వి. వర్షాకాలం. కవిక. 6.19. క్రొక్కారుమెఱుఁగు వి. వర్షాకాలపు మెరుపు. భార. విరా. 2.83. క్రొగ్గండి వి. కొత్తగండి. క్రొంగంటి. వి. కొత్తగాపడిన గాయం. కు. సం. 11.135. క్రొచ్చెలక రూ.

క్రొచ్చెలిక. వి. కొత్తబీటినేల. క్రొచ్చెలిక రూ.చూ. క్రొచ్చెలక. వి. కొత్తబీటినేల. క్రొంజమురు వి. కొత్తనూనె. క్రొంజాయ వి. కొత్తకాంతి. ఇందు 5.173. క్రొంజిగురు వి. లేతచిగురు, అంకురం. దశా. 2.282. క్రొంజిగురువిలుకాఁడు రూ.చూ. క్రొంజిగురు విల్కాఁడు. వి. మన్మథుడు. క్రొంజిగురువిల్కాఁడు రూ. క్రొంజిగురు విలుకాఁడు. వి. మన్మథుడు. ఆం. భా. 1.45. క్రొంజిలుఁగుఁజల్వ వి. కొత్తదైన సన్నబట్ట. ఉ. రా. 5.246. క్రొంజీకటి వి. లేచీకటి, ముంజీకటి. వసు. 4.10. క్రొంజెమట వి. కొత్తచెమట. క్రొత్తమ్మి వి. కొత్తగా వికసించిన పద్మం. పి. శకు. 3.175. క్రొత్తరఁగ వి. కొత్తఅల. క్రొత్తలిరు వి. లేజిగురు, క్రొత్తావి వి. నూతన పరిమళం. పి. శకు. 2.61. క్రొందమ్మి వి. వికసించిన పద్మం. క్రొందలిరు వి. లేజిగురు, కొంజిగురు. క్రొందావి వి. నూతనపరిమళం. హంస. 5.366. క్రొందొడిమ వి. కొత్తతొడిమ. క్రొన్నన వి. కొత్త మొగ్గ. ఆము. 5.114. క్రొన్ననఁబోఁడి వి. స్త్రీ, నీలా. 1.116. వ్యు. కొత్త పూవువలె సుందరమైన ఆడది. క్రొన్ననలొత్తు అ.క్రి. పల్లవించు. చిగుర్చు. పరమ. వి. 5.114. <క్రొన్ననలు+ఒత్తు. క్రొన్ననవింటివాఁడు వి. పూవిల్తుడు, మన్మథుడు. విక్ర. 1.107. క్రొన్ననవిలుకాఁడు రూ. క్రొన్ననవిల్కాఁడు. వి. మన్మథుడు. క్రొన్ననవిల్కాఁడు రూ.చూ. కొన్ననవిలుకాఁడు. వి. మన్మథుడు. కొన్ననవిలుతుఁడు రూ. క్రొన్ననవిల్తుఁడు. వి. మన్మథుడు. క్రొన్ననవిల్కానితండ్రి వి. పెదమామ్మ. విష్ణువు. క్రొన్ననవిల్తుఁడు రూ. చూ. కొన్ననవిలుతుఁడు. వి. మన్మథుడు. క్రొన్నురుఁగు వి. నూతన ఫేనం. పరమ. వి. 1.63. క్రొన్నెత్తురు వి. కొత్త నెత్తురు. కవిక. 2.197. క్రొన్నెల వి. బాలచంద్రుడు. వేంక.ఆం. 75. క్రొన్నెలతాలుపు రూ. క్రొన్నెలతాల్పు. వి. శివుడు. రాజ. చ. 1.5. వ్యు. బాలచంద్రుని జటాజూటంలో ధరించినవాడు. క్రొన్నెలతాల్పు రూ.చూ. కొన్నెలతాలుపు. వి. శివుడు. క్రొన్నెలదారి వి. శివుడు. వ్యు. బాలచంద్రుని జటాజూటంలో ధరించినవాడు. క్రొన్నెలదారిసింగిణి వి. మేరుపర్వతం. వ్యు. శివుడుతాల్చిన విల్లు. క్రొన్నెలలు వి.బ.వ. గోటినొక్కులు, నఖక్షతాలు. క్రొంబట్టు (-వట్టు) వి. కొత్తపట్టు. దశా. 7.27. క్రొంబంట (-వంట) వి. కొత్తపంట, క్రొంబదను (-వదను) వి. కొత్తపదును. క్రొంబని (-వని) వి. వింతశిల్పం, అపూర్వశిల్పం. ఇందు. 6.131. క్రొంబసిఁడి (-వసిఁడి) వి. కొత్తబంగారం. క్రొంబసిమి (-వసిమి) వి. కొత్తపసుపురంగు. క్రొంబిడి (-పిడి) వి. కొత్తపిడి. క్రొంబుట్టము (-పుటము) వి. కొత్తబట్ట. క్రొంబులకలు (-పులకలు) వి.బ.వ. కొత్తపులకలు. క్రొంబువ్వు (-పువ్వు) వి. కొత్తపూవు. క్రొంబూవిలుకాఁడు (-పూవిలుకాఁడు) వి. మన్మథుడు, పుష్పధన్వుడు. కృ. శకు. 1.70. క్రొంబెరుఁగు (-పెరుఁగు) వి. కొత్తగా తోడుకొన్న పెరుగు. పి. శకు. 1.135. క్రొంబొగ (-పొగ) వి. కొత్తగా వ్యాపించిన పొగ. ధాన్క.రా. యు. 219. క్రొంబొగరు (-పొగరు) వి. కొత్తపొగరు. క్రొమ్మావి వి. కొత్తమామిడిచెట్టు. ఉ. రా. 3.66. <క్రొత్త + మావి. క్రొమ్మించు వి. 1. నూత్నకాంతి. హర. 5.44, 2. కొత్తమెరుపు. నీలా. 2.27. క్రొమ్మించుదారి వి. తొలకరిమబ్బు. క్రొమ్ముడి రూ. క్రుమ్ముడి. వి. కేశబంధ విశేషం. భార. ఉద్యో. 3.114. క్రొమ్మెఱుఁగు వి. 1. కొత్తమెరుపు, తొలకరి మెరుపు. హర. 2.17; 2. కొత్తకాంతి దశా. 4.29. క్రొమ్మేఘము వి. కొత్తమేఘం. రం. రా. ఉ. 39పు. 17పం. క్రొమ్మొగడ వి. కొత్తమొగ్గ. క్రొమ్మొన వి. కొత్తమొన. క్రొమ్మొలక వి. కొత్తమొలక, లేజిగురు. క్రొవ్వాఁడి విశే. మిక్కిలివాడియైన, హర. 7.67; వి. మిక్కిలివాడిమి, తీక్ష్ణత. పండి. చ. 1.61పు. క్రొవ్విరి వి. కొత్తపువ్వు. శృం. నై. 8.161. క్రొవ్వేడి వి. మిక్కిలివేడిమి.

క్రొక్కారము రూ. కొకారము. కొక్కారము, కోకారము. వి. కోడికూత. చంద్రాంగ. 2.81.

క్రొంకి రూ.చూ. కొంకి. వి. 1. చోరసాధన విశేషం. దశకు. 5.72; 2. యుద్ధసాధన విశేషం. ఉ. హరి. 2.92.

క్రొచ్చు రూ. క్రోచు. స.క్రి. 1. చెక్కు; 2. చెరుపు.

క్రొంచ రూ. కొంచ. వి. కొంగ, కొక్కెర. భార. భీష్మ. 2.30.
సం. √క్రౌంచ-. క్రౌంచపక్షి; ప్రా. కొంచ; పా. కొంచ. క. కొంచె, √కుంచ్, √కుంచు. కొరకంచె, నారాయణపక్షి; త. కిరఉంచమ, కిరపుంచమ్. భరతపక్షి.
<సం. √క్రౌంచ-.

క్రొగ్గు వి.బ.వ. ఎత్తు, మానికలో విశేషం.

క్రొత్త రూ. కొత్త. వి. అపూర్వత. భార. విరా. 1.77. విశే. అపూర్వమైన, నూతనమైన. శృం. నై. 5.108. క్రి. విశే. కొత్తగా క్రీడా. 134.
త. కుఱి. నూతనమైన, లేత, మృదువైన; కుఱంత్తై, లేతవయస్సు. కుఱుకు; ఆందం; పో. చూ. పర్జి. కర్. బాలచిన్న.

క్రొత్తచేయు అ.క్రి. వికృతికలిగించు, సరిపడకపోవు. ప్రబోధ. 3.60. క్రొత్తది వి. నవం, నవీనం <క్రొత్త+అది. క్రొత్తపడు రూ. క్రొత్తవడు. అ.క్రి. క్రొత్తగు. క్రొత్తపఱచు రూ.చూ. క్రొత్తవఱచు. స.క్రి. కొత్తపడచేయు, నూతనంగాచేయు. కొత్తమగఁడు వి. జారుడు. రంకుమొగుడు. వేంక. పంచ. 3.272. క్రొత్తమూవాస్య వి. ఫాల్గుణబహుళ అమావాస్య <క్రొత్త + అమావాస్య. క్రొత్తముట్టు[1] వి. మొదటి రజస్వల, సమర్త. క్రొత్తముట్టు[2] రూ. కొత్తముట్టు, వి. నూలిపోగు, వడకనారంభించినపుడు ఏకునుండి పరిలేక సాగదీసి కదురుకు అంటించే నూలు. భార. విరా. 1.95, ఆం. భా. 3.47. క్రొత్తలుసేయు (-చేయు) స.క్రి. కొత్తపనులు ఆరంభించు. క్రొత్తవడు (-వడు) రూ.చూ. క్రొత్తపడు. అ. క్రి. కొత్త అగు. క్రొత్తవఱచు (-వఱచు) రూ. క్రొత్తపఱచు. స. క్రి. నూతనంగాచేయు. భార. భీష్మ. 1.105.

క్రొత్తడము రూ చూ. కొత్తడము. వి. కోటబురుజు. పి. శకు. 4.177.

క్రొత్తడి వి. 1. మగనాలు, పతివత్ని. భార. ఉద్యో. 1.87; 2. సాధ్వి, పతివ్రత. ఆం. భా. 2.116.

క్రొత్తలము రూ.చూ. కొత్తడము. వి. కోటబురుజు.

క్రొత్తళము రూ.చూ. కొత్తడము. వి. కోటబురుజు.

క్రొమ్మి వి. ఎఱ్ఱగోరంట. ఆం. శా. 2.53.

సం. కురవక-. గోరంట.

క్రొయిపు వి. కైపు, మత్తు, మున్మరింపు.

త. కుత్తి (-న్తు-) అలసిపోవు.

క్రొయిపెక్కు అ.క్రి. 1. వదులు, వీడు. కాశీ. 5.119; 2. కైపెక్కు.

క్రొయిపెక్కు చూ. క్రొయిపు.

క్రొయ్య వి. కయ్య, పాయ.

క్రొళ్లు రూ. కొళ్లు[1]. వి. దగ్గటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పార్వ. 4.67.

త. కొఱ్ఱై. శ్లేష్మం, కఫం; కుళ్-ళ్ ఇరుమల్-. కోరింతదగ్గు, కుక్కదగ్గు.

క్రొవ్వడఁగించు చూ. క్రొవ్వు.

క్రొవ్వడఁచు చూ. క్రొవ్వు.

క్రొవ్వణఁగించు చూ. క్రొవ్వు.

క్రొవ్వణఁచు చూ. క్రొవ్వు.

క్రొవ్వారు చూ. క్రొవ్వు.

క్రొవ్విదము చూ. క్రొవ్వు.

క్రొవ్వు రూ. కొవ్వు. వి.బ.వ. మదోక్తులు, పొగరుబోతు మాటలు. కు.సం. 7.55; వి. 1. మదం, గర్వం. భార. శల్య. 1.228; 2. శరీరంలోని ధాతువుల్లో ఒకటి. భార. ఉద్యో. 3.333; 3. సారం, నిగ్గు. విక్ర. 1.119; 4. పుష్టి, బలుపు. శృం.నై. 8.153. అ.క్రి. 1. గర్వించు, మదించు. భార. ఉద్యో. 3.287; 2. బలియు, అతిశయించు. కాశీ. 1.49; 3. వాడిఅగు, తీక్ష్ణమగు. ఉ.హరి. 3.43.

క. కొర్బ్, కొర్బు, కొబ్బు (కుబ్బు). బలసిన, మదం, గర్వం; తు. కొమ్మె. బలుపు; త. కొఱు. బలుపెక్కు. కొఱు (త్తు-ప్పు-) బలిసిన; కొరొప్పు. కొవ్వు; మ. కొఱు. బలిసిన, మందమైన; కుఱంపు. మందమైన ద్రవ పదార్థం; తొ. కొవింజ్. బలిసిన, బలవంతమైన, కొవ్వు; కొళ్ప్. బలిసిన; గోం. కొఱ్వెంజ్. బలసిన, బలుపెక్కిన, కొవ్వు; కువ్వెంజ్. బలిసిన; కుఇ. క్రోగ. బలిసిన, చెమట; పర్జి. కొఱ్. బలిసిఉండు; కొఱుకుడ్. బలిసిన, కొవ్వు; కొలా. కొరు. బలిసిన; నా.కొరు. బలిసిన; బ్రా. కుచేన్. బరువు, కష్టం, కష్టమైన.

క్రొవ్వడఁగించు రూ. క్రొవ్వణఁగించు. స.క్రి. మదం తగ్గించు.భార. కర్ణ.3.262.<క్రొవ్వు+అడఁగించు. క్రొవ్వడఁచు రూ. క్రొవ్వణఁచు. స.క్రి. మదం తగ్గించు<క్రొవ్వు+అడఁచు. క్రొవ్వణఁగించు రూ.చూ. క్రొవ్వడఁగించు. స.క్రి. మదం తగ్గించు<క్రొవ్వు+అణఁగించు. క్రొవ్వణఁచు రూ.చూ. క్రొవ్వడఁచు. స.క్రి. మదం తగ్గించు<క్రొవ్వు+అణఁచు. క్రొవ్వారు అ.క్రి. 1. బలియు, అతిశయించు, భీమ. 5.96; 2. సారవంతమగు. విక్ర. 5.19.<క్రొవ్వు+-ఆరు. క్రొవ్విదము వి. 1. దుష్కార్యం, దుశ్చేష్ట. భార. ఉద్యో. 2.9; 2. బలుపు. పద్మ. 3.8; విజ. పరువానికి వచ్చిన, పరిపాక దశకు వచ్చిన. నృసింహ. 3.75<క్రొవ్వు+-ఇదము. క్రొవ్వుగొను(-కొను) అ. క్రి. మదించు. హరి. పూ. 9.68. క్రొవ్వుదిగు అ.క్రి. పొగరణగు. క్రొవ్వువట్టు అ.క్రి. పొగరెక్కు. క్రొవ్వువత్తి రూ. కొవ్వువత్తి, కొవ్వొత్తి, క్రొవ్వొత్తి, వి. మైనంవత్తి. క్రొవ్వెక్కు అ.క్రి. 1. పొగరెక్కు; 2. బలియు; 3. పెంపొందు.<క్రొవ్వు+ఎక్కు. క్రొవ్వెత్తు అ.క్రి. 1. పొగరెక్కు; 2. బలియు; 3. పెంపొందు.<క్రొవ్వు+ఎత్తు. క్రొవ్వొత్తి రూ.చూ. క్రొవ్వువత్తి వి. మైనంవత్తి<క్రొవ్వు+వత్తి.

క్రొవ్వెక్కు చూ. క్రొవ్వు.

క్రొవ్వెత్తు చూ. క్రొవ్వు.

క్రొవ్వెద వి. కబరి, కొప్పు. అము. 6.129.

క్రొవ్వొత్తి చూ. క్రొవ్వు.

క్రోచు రూ.చూ. క్రొచ్చు. స.క్రి. చెక్కు.

క్రోటనురంగు వి. 1. ముదురు ఆకుపచ్చ; 2. లేత వయిలెట్ రంగు; 3. నస్యం రంగు.

ఇం. *Croton*. ఒకరకం మొక్క.

<ఇం. Croton + రంగు.

క్రోటన్‌తొట్టి వి. మొక్కలు పెంచడానికి వాడే చిన్నసైజుతొట్టి.

ఇం. *Croton*. ఒకరకం మొక్క.

<ఇం. Croton. + తొట్టి.

క్రోటన్స్ అంచు వి. గోతేలకు వంకీలు, వంకీలుగా పెట్టిన పెద్దంచు.

ఇం. *Crotons*. ఒకరకం మొక్కలు.

<ఇం. Crotons. + అంచు.

క్రోటన్స్‌గోలెం వి. క్రోటన్ తొట్టి, క్రోటన్ మొ. మొక్కలు పెంచడానికి వాడే చిన్నసైజు తొట్టి.

ఇం. *Crotons*. ఒకరకం మొక్కలు.

<ఇం. Crotons + గోలెం.

క్రోడాడు రూ.చూ. క్రోరాడు. స.క్రి. 1. ఏనుగు, వృషభం మొదలగునవి కొమ్ములతో పొడుచు. హరి.పూ. 5.142; 2. పంది ముట్టెతోనేల కెల్లగించు. హరి. పూ. 6.10; 3. (దుమ్ము మొ. వాటిని) ఎత్తి పైకిజల్లు.

క్రోఁతి రూ. కోతి. వి. వానరం, కోతి. రం. రా.యు. 376. వ. 23 పం.

క. తు. కోతి; త. కురంగు. కోతి, ఒకరకమైన కోతిలాంటి జంతువు, వాలు, ఏటవాలు; కుఱంకు. గ్రహించు, పట్టు; కుఱళ్. ముందుకు వంగటం, గూను; కుఱుకు. మరగుజ్జు అగు, పొట్టి అగు; కోతి. కోతి.

క్రోఁతివి బ్రహ్మరాక్షసునిజేయుట వి. కొద్దిని గొప్పగా చేయటం. భాస్క. రా. యు. 119.

క్రోమ్ వి. కాఫీపొడి రంగుమాదిరి పన్నె.

క్రోయు స.క్రి. (సర్పం, వహ్ని మొ. జిహ్వలు) చాచు. భార. ఉద్యో. 4.12.

త. కొఱుంతు (-ఇన్, ప్-.) మండు; కుత్తి (-న్తు-; ప్) విల్లులాగ వంగిఉండు, వంగు.

క్రోల రూ.చూ. క్రోలు[2]. వి. క్రోవి, గొట్టం, పద్మాదినాళం.

**క్రోలగచ్చు** వి. నాకులీ, సర్పాక్ష చెట్టు.

**క్రోలించు** చూ. క్రోలు.

**క్రోలు**[1] స.క్రి. **1.** తాగు, పానంచేయు. కు.సం. 9.157 ; భార. విరా. 2.35; **2.** భక్షించు, తిను. మను. 3.61; **3.** మింగు. దశా. 1.289 ; **4.** పొందు, గ్రహించు.

**క్రోలు**[2] రూ.క్రోల. వి. **1.** గొట్టం, పద్మాదినాళం. కు.సం. 9.51 ; **2.** జాడు, క్షీణసస్యం. ఆం.భా. 2.237.

త. కుఴల్. వేణువు, గొట్టం, పవిత్రమైనది ; పో.చూ. మ. కోయక. దురాశతో తినటం ; కువి. గొహ్. తాగటం.

**క్రోలించు** అ.క్రి. తాగించు, కోల్చు. హరి. పూ. 5.193. **క్రోలుకసవు** వి. తృణవిశేషం, కిక్కిసకసవు. **క్రోలుగచ్చ** వి. ఒకరకం గచ్చ. **క్రోలుచు**[1] రూ.చూ. క్రోల్చు[1]. స.క్రి. తాగించు. **క్రోల్చు**[1] రూ. క్రోలుచు[1]. స.క్రి. కోలచేయు, తాగించు. నృసింహ. పీఠి. 7.

**క్రోలుచు**[2] రూ.చూ. క్రోల్చు[2]. స.క్రి. **1.** (కోకిలమున్నగునవి) పాడు, గానంచేయు ; **2.** పఠించు, అభ్యసించు ; అ.క్రి. (కోకిలాదులు) కూయు.

**క్రోల్చు**[1] చూ. క్రోలు[2].

**క్రోలెముక** వి. వెన్నెముక, కశేరుక.

**క్రోల్చు**[2] రూ. క్రోలుచు[2]. స.క్రి. **1.** (కోకిల మొ.) పాడు, గానంచేయు క్రీడా. 170 ; **2.** అభ్యసించు. శివరా. 2.82 ; **3.** పఠించు. పాండు. 5.171. అ.క్రి. కూయు. (కోకిలాదులు) కాశీ. 5.167.

క. కొరల్చు. పిలుచు లేదా అరుచు. కొరల్, కొడ్కు, కొడ్ఫు. ధ్వని, గొంతు, మెడ ; తు. కొరెజుని. ధ్వనిచేయు ; కురెలు. మెడ వెనకభాగం ; త. కురల్. శబ్దం ; కురై. అరచు. మ. కురల్. శబ్దం, గొంతు ; గోం. *గుడ్గా*. గొంతు ; కుఇ. *గురుగురు*. గురుగురుమను ; కుర. *గుఱ్ఱార్*. అరచు, గుర్రుమని ధ్వని.

**క్రోల్పులి** రూ.చూ. కోలుపులి. వి. పెద్దపులి, బెబ్బులి.

**క్రోవ**[1] రూ. కోవ[1]. వి. సరం, ముత్తెపుదండ. రామాభ్యు. 7.140.

**క్రోవ**[2] రూ.చూ. కోవ[2]. వి. రోగ విశేషం, చర్మామయం. ఆం.భా. 2.128.

**క్రోవి**[1] రూ. కోయి, కోవి[1]. వి. **1.** భూమిలోపల నీళ్ళు రావటానికి ఏర్పరచిన మార్గం. భార. ఆరణ్య. 4.332 ; **2.** మూస, లోహాలుకరిగేపాత్ర. కు.సం. 6.155 ; **3.** గొట్టం శృం.నై. 3.170 ; **4.** కంఠనాళం. రాఘవ. 4.155 ; **5.** తుపాకి. రాజ. వి. 5.15 ; **6.** రంధ్రం. వాల్మీకి. 3.140; **7.** ఆనుపోసే గొట్టం. హంస. 2.2 ; **8.** బరబీ.సీలా. 3.70 ; **9.** మురళి.

క. కొవె. వెదురు ; త. కోవై ; మ. కోవ.

**క్రోవెముక** వి. పృష్ఠాస్థి.

**క్రోవి**[2] వి. కురవకం, ఎర్రగోరంట. భార. ఆది. 4.20.

**క్రోవి**[3] రూ.చూ. కోవి2. వి. జాడు, క్షీణసస్యం.

**క్రోవి**[4] రూ. గ్రోవి. వి. కానుగచెట్టు.

**క్రోవెముక** చూ. క్రోవి[1].

**క్రోసు** రూ. కోసు[1]. వి. సుమారు రెండుమైళ్ళ దూరం. కాశీ. 2.51.

సం. క్రోశ-. కూత వినిపించేటంత దూరం ; హిం. కోస్. సుమారు రెండుమైళ్ళ దూరం.

క. కోసు. దూరపుకొలత ; త. కురోచమ్. సుమారు $2\frac{1}{4}$ మైళ్ళు.

<సం. క్రోశ-.

**క్లచ్చి** వి. చేత్తోపట్టుకొనే సాధనం.

ఇం. *Clutch*. స.క్రి. చేత్తోపట్టుకొను ; అ.క్రి. పట్టుకొనబోవు, చేత్తో అదుపులోపెట్టు.

<ఇం. Clutch.

**క్లబ్‌హౌస్** వి. సంఘంగా చేరే ఇల్లు.

ఇం. *Clubhouse*. సంఘంయొక్క నివాసం.

**క్లబ్బు** వి. **1.** దుడ్డుకర్ర ; **2.** సంఘం ; **3.** పేకలో కళావరు.

ఇం. *Club*. దుడ్డుకర్ర, కళావరు, కూర్పు.

<ఇం. Club.

**క్లర్కు** వి. రాసేవాడు, గుమస్తా.

ఇం. *Clerk*. గుమాస్తా.

<ఇం. Clerk.

**క్వయిన** రూ.చూ. క్వైనా. వి. ఒకరకం మందు.

**క్వయినా** రూ.చూ. క్వైనా. వి. మలేరియాకు వాడేమందు.

**క్వారీ** రూ. కోరి. కోరీ. వి. కట్టుబడికి కావలసిన రాళ్ళను తవ్వితీసేలోతైన గుంట.

ఇం. *Quarry*. కోరీ.

<ఇం. Quarry.

**క్వంటెంటుశ్రోత్రియం** వి. నాలుగోవంతు మాత్రమే పన్నుకట్టవలసిన నేల.

ఇం. *Quart*. నాలుగోవంతు.

**క్వైనా** రూ. కొయిన, క్వయిన, క్వయినా. వి. మలేరియాకు వాడే ఒకమందు.

ఇం. *Quinine*. మలేరియాకు వాడేమందు.

<ఇం. Quinine.

**క్షేత్రము** వి. ఉపవానం.

సం. క్షేత-. పుణ్యస్థలం, పొలం.

<సం. క్షేత్ర-. (అర్థవిపరి.).

**క్షీరోదకంబుపట్టు** వి. వస్త్ర విశేషం. బసవ. 3.54.

సం. క్షీరోదక-. పాలునీరు.

<సం. క్షీరోదక-+ పట్టు.

# ఖ

**ఖ** వి. హల్లుల్లో రెండోవర్ణం, జిహ్వామూలహనుమూలీయ మహాప్రాణ శ్వాసస్పర్శం. ద్రావిడభాషల్లో ఈవర్ణం నిసర్గంగాలేదు. ప్రతిదేయపదాల (Loan-words). ద్వారానూ, పర్యాయప్రవృత్తి (Free variation) వల్లా ధ్వన్యనుకరణంవల్లా తెలుగులో ఈవర్ణం ఉంది.

**ఖంగు** వి. **1**. గంటమోగటం, తుపాకిపేలటం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. క్రీడా. 275 ; వరాహ. 9.147 ; **2**. లోహాన్ని కొట్టేటప్పుడయ్యే ధ్వని.

క. ఖణ్. ధ్వన్యనుకరణ శబ్దం.

**ఖంగుఖంగుమను** అ.క్రి. శబ్దించు. **ఖంగుఖింగు** వి. ఆయుధం మొ. కఠిన పదార్థాలు ఒకదానినొకటి తాకినపుడు అయ్యేధ్వనికి అనుకరణం. కళా. 8.109. **ఖంగుమను** అ.క్రి. గంటమోగు, కంచువలెమోగు. **ఖంగురింగు** వి. చిన్నఫిరంగుల ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788.

**ఖచిక్కు** రూ. ఖిచిక్కు. వి. **1**. చిలకలు మొ. వాటికొరుకుడు ధ్వనికి అనుకరణం. కృ. శకు. 2.33 ; **2**. కుమ్మటంలో అయ్యేధ్వనికి అనుకరణం. హంస. 1.94 ; **3**. బాణాదులు నాటటంలో ధ్వనికి అనుకరణం. పార్వ. 2.131.

క. కచక్కనె-. బురదలో రాయిపడితే వచ్చేశబ్దం.

**ఖచ్చితం** రూ.చూ. కచ్చితము. విశే. నిర్దిష్టమైన, సుస్థిరమైన.

**ఖజాంచి** రూ. ఖజాంజి, ఖజాంజీ. వి. కోశాధికారి.

హిం. ఉ. ఖజాన్‌చీ. కోశాధికారి.

క. ఖజాన్చి.

< ఉ. ఖజాన్‌చీ.

**ఖజాంజి** రూ.చూ. ఖజాంచి. వి. కోశాధికారి.

**ఖజాంజీ** రూ.చూ. ఖజాంచి. వి. కోశాధికారి.

**ఖజాంజీదారుడు** వి. కోశాధికారి.

హిం. ఉ. ఖజాన్‌చిదార్ ; పా.-దార్.

< ఉ. ఖజాన్-దార్ (స్వార్థంలో).

**ఖజానా** రూ. కజానా. వి. **1**. ధనాగారం. రంగా. చ. 1.141 ; **2**. బొక్కసం, ధనం.

హిం. ఖజానా-. ; మరా. ఖజినా-. ; ఖజానా-. ధనాగారం ; ఉ. ఖజానా. ధనాగారం ; పార. ఖిజానత్, ఖిజానా-. ధనాగారం, ప్రజలనుండి వసూలు చేసేపన్ను; అర. ఖఝునా, ఖిజానా, ఖియూనా-. ధనాగారం.

క. ఖజానె.

< ఉ. ఖజానా.

**ఖజియా** రూ.చూ. ఖజ్జా. వి. జగడం.

**ఖజియాపడు** అ.క్రి. జగడంపడు.

**ఖజ్జదారు** వి. రైతు, సేద్యగాడు.

**ఖజ్జము** రూ.చూ. కజ్జము. వి. ఒకరకం పిండివంట.

**ఖజ్జా** రూ. ఖజియా, ఖజ్య, ఖజ్యా. వి. జగడం, యుద్ధం, కయ్యం, కజ్జా.

హిం. ఉ. కజియా. జగడం, యుద్ధం.

క. ఖజ్జా.

**ఖజ్జికి** చూ. కజ్జము. వి. కజ్జికాయ.

**ఖజ్య** రూ.చూ. ఖజ్జా. వి. జగడం.

**ఖజ్యా** రూ.చూ. ఖజ్జా. వి. జగడం.

**ఖటావణి** రూ. కటావణి, కతావణి. వి. ఆవర్జా పుస్తకం. పద్దు, ప్రకటన.

**ఖట్ల** వి. చచ్చుదాకి.

క కట్లె-. దావా.

< క. కట్లె.

**ఖడాయము** రూ.చూ. కడ్డాయము. వి. బలత్కారప్రక్రయం.

**ఖడాయించు** స.క్రి. నిలుపు, నిలబెట్టు.

హిం. ఉ. ఖడానా. నిలుపు ; మరా. ఖడా. నిలబెట్టు. గు. ఖడా-. నిలువరించు.

< ఉ. ఖడా (నా).

**ఖడియా** వి. నామసుద్దవంటి మట్టి.

హిం. ఖరియా, ఖడియా. ఒకరకం తెల్లని మట్టి.

< హిం. ఖడియా.

**ఖడేరావను** స.క్రి. ఆగమని హెచ్చరించు.

హిం. ఉ. ఖడేరహెూ. నిలబడి ఉండు.

< ఉ. ఖడేరహెూ + అను.

**ఖడ్గవజ్జేలు** రూ.చూ. ఖడ్గపద్యాలు. వి.బ.వ. చౌడేశ్వరి అమ్మవారి ఎదుట చదివే స్తోత్రపద్యాలు.

**ఖడ్గపద్యాలు** రూ. ఖడ్గపజ్జేలు. వి బ.వ. చౌడేశ్వరి అమ్మవారి ఎదుట చదివేస్తోత్ర పద్యాలు. (కత్తితోదవడలు పొడుచుకొంటారు).

**ఖడ్గాఖడ్గివాదించు** అ.క్రి. కత్తులతో పోరాడు. ఉ. హరి. 4.132.

**ఖడ్డి** రూ.చూ. కడ్డి. వి. పుడక.

**ఖణి** వి. మోగటంలో ధ్వనికి అనుకరణం. అష్ట. మ. క 5.268. పు· 10పం.

క. ఖణ్-. ధ్వన్యనుకరణ శబ్దం.

**ఖణిఖణి** వి. మిక్కిలిమోగటం.

**ఖణిలు** రూ.చూ. ఘణిల్లు. వి. **1**. ఖడ్గాదులు విరగటం మొ. వాటిలో ధ్వనికి అనుకరణం. హంస. 5.370; **2**. ఎద్దురంకెవేయటం మొ. వాటిలో ధ్వనికి అనుకరణం.

క. ఖణిల్. ధ్వన్యనుకరణ శబ్దం.

**ఖణిలుఖణిలు** వి. ఖణిలు.

**ఖణిల్లు** రూ.చూ. ఘణిల్లు. వి. **1**. ఎద్దురంకెవేయటంలో ధ్వనికి అనుకరణం. కాశీ. 3.23 ; **2**. ఖడ్గాదులు విరగటం మొ. వాటిలో ధ్వనికి అనుకరణం. దశా. 4.177.

**ఖచీలు** వి. 1. టుపాకులు పేలడంలోనిధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788 ; 2. ధ్వన్యనుకరణశబ్దం.

**ఖచీలుఖచిలు** వి. ఎద్దు రంకెవేయటం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. కాళ. 4.153.

**ఖచేలు** రూ.చూ. ఘబిల్లు. వి. ఖచీలు.

**ఖండపురాయి** రూ. కండపురాయి, కండెపురాయి, కండవారాయి, కన్నపురాయి. వి. నాలుగైదు నెంబర్లుగల పొలాలకుకలిపి హద్దుగా ప్రభుత్వంవారు పాతినరాయి.

**ఖండమండిగలు** వి.బ.వ. గోధుమపిండితో చేసే భక్ష్య విశేషం.

**ఖండరించు** రూ. గండరించు, గండలించు. స.క్రి. 1. పెంపొందు ; 2. పడిఅచ్చు మొ. వాటితో విగ్రహాదుల్ని నిర్మించు.

**ఖండనరులు** వి.బ.వ. వస్త్రవిశేషం. ధను. 3.38.

నం. *ఖండ*-. ముక్క; *సర*-. దండ.

<నం. ఖండనర (అర్థవివరి.).

**ఖండా** వి. 1. పెద్దకత్తి, ఖడ్గం. కళా. 8.66 ; 2. జంజాలి కత్తి.

హిం. *ఖండా*. ఖడ్గం, భాగం, ముక్క ; మరా. *ఖండా*. కత్తి.

<మరా. ఖండా.

**ఖండిక** రూ. ఖంఢ్రిక. వి. 1. చిన్నపల్లె. భీమ. 5.80 ; 2. ఖండిక (పన్నులేకుండా గుత్తకిచ్చిన భూఖండం).

నం. *ఖండరక*-. ప్రా. *ఖండరక్ఖ*-. పన్నులు వసూలు చేసే ఉద్యోగి ; హిం. *ఖండా*. భాగం, జిల్లా ; గు. *ఖండా*. భాగం, జిల్లా ; మరా. *ఖండరఖా*. చిన్నపల్లె.

<మరా. ఖండరఖా.

**ఖండించు** స.క్రి. నిశ్చయించు, నిర్ణయించు.

నం. *ఖండ్*. నరుకు, ముక్క(లు) చేయు.

<నం. ఖండ్ + -ఇంచు[3] (అర్థవివరి.).

**ఖండించియాడు** (-ఆడు) స.క్రి.నిష్కర్షగా చెప్పు.సారంగ. 2.255.

**ఖండిణీ** వి. ప్రతిసంవత్సరం నిర్ణయించేపన్ను.

ప్రా. *ఖండణా*. విచ్ఛేదం, భాగం ; ఒ. *ఖండా*. భాగం ; హిం. *ఖండినీ*. పన్ను, కష్టం ; గు. *ఖండణీ*. కప్పం ; మరా. *ఖండిణీ*. ప్రతిసంవత్సరం నిర్ణయించే పన్ను.

<మరా. ఖండిణీ.

**ఖండితంగా** క్రి.విశ. ద్రు. తప్పకుండా.

నం. *ఖండిత*-. నరకబడిన.

నం. ఖండిత- + -ము + అగు + -అ[7].

**ఖండింపు** చూ. ఖండించు. వి. 1. నిర్ణయం ; 2. బేరం.

**ఖండింపుచేయు** స.క్రి. (బేరం) పైసలా చేయు. నం. *ఖండ్*. నరుకు.

**ఖండియరాయ** విశ. వీరులబిరుద వాచకశబ్దం. వ్యు. భూభాగానికి అధిపతి.

**ఖండి** వి. 1. పుట్టి, పెద్దగంప, పుటిక ; 2. దాదాపు 500 - పౌనుల బరువు.

క. *కండుగ*.

హిం. *ఖండీ*.

**ఖండీగుట్ట** వి. శాశ్వతబేరీజు.

**ఖండుక** వి. ఎనభైకుంచాలపరిమితి.

**ఖండువా** రూ.చూ. కండుహా. వి. పైవస్త్రం. ఓణి, ఉత్తరీయం.

**ఖంఢ్రిక** రూ.చూ. ఖండిక. వి. 1. చిన్నపల్లె , 2. పన్ను లేకుండగుత్తకిచ్చిన భూఖండం.

**ఖతంచేయు** స.క్రి. ముగించు, చంపు.

హిం. ఉ. *ఖతమ్*-. పూర్తి, ఆఖరు.

<ఉ. ఖతమ్ + చేయు.

**ఖతీబు** వి. ధర్మోపదేశంచేసేవాడు, ప్రవక్త.

హిం. మరా.ఉ. పార. అర. *ఖతీబ్*-. ముస్లింలఇంటిపేరు.

<ఉ. ఖతీబ్.

**ఖత్తు** వి. 1. రీతి ; 2. ఉత్తరం, జాబు, కమ్మ ; 3. జత ; 4. చేవ్రాలు.

హిం. *ఖత్*. ఉత్తరం, పత్రం, లేఖ ; మరా. *ఖత్*. ఒడంబడిక, ఒడంబడికపత్రం ; ఉ. *ఖత్*. లేఖ, పత్రం, ఉత్తరం, రాజాదేశం, గుర్తు , అర. *ఖత్త*-. జవాబు, రాత.

క. *కత్తు*.

<ఉ. ఖత్.

**ఖత్తులాణము** రూ.చూ. కత్తలాని. వి. ఖత్లాన్‌దేశపు గుర్రం

**ఖత్రి** వి. పట్టుబట్టలునేసే వాళ్ళలో ఒకతెగ.

**ఖద్దరు** వి. నూలువడికి నేసినబట్ట, ఖాదీ.

హిం. *ఖద్దర్*-. ఖాదీ.

క. *ఖద్దరు*.

<హిం. ఖద్దర్.

**ఖద్ది** వి. వేళ్ళతోపెకిలించటం. మను. 4.8.

పో.చూ. క. *కద్ది*. కోరిక.

ఉ. *కద్ద్*, *కద్ద*-. వైమనస్యం, ప్రయత్నం, పరిశ్రమం ; పార. *కద్ద్*-. వస్త్రాన్ని చింపటం, విభజించటం, పగులు, వేరులతో పెకలించటం.

<ఉ. కద్ద్.

**ఖద్దించు** చూ. గద్దించు. స.క్రి. 1. పూను ; 2. తక్కువచేయు ; 3. గద్దించు.

**ఖనియ** రూ. ఖనె. వి. స్తంభం.

**ఖనె** రూ.చూ. ఖనియ. వి. స్తంభం.

**ఖంతి** వి. ఓరిమి.

నం. *క్షాంతి*- ?

**ఖందా** వి. పెద్దకుటుంబాలలోను, జమీందారుల నగళ్ళలోను చేసేఉమ్మడిపెద్దవంట, కందా.

**ఖందాయిల్లు** (-ఇల్లు) వి. వంటిల్లు. **ఖందారాజు** వి. వంటచేసేక్షత్రియుడు.

**ఖందోటి** వి. రూకలసంచి.

**ఖబరు** రూ.చూ. కబురు. వి. వార్త, సందేశం.

**ఖబరుదారి** రూ.చూ. ఖబర్దారు. వి. జాగ్రత్త, భద్రం.

**ఖబర్దారు** రూ. ఖబరుదారి, ఖబురుదారి. వి. భద్రం, జాగ్రత్త.

హిం. ఉ. *ఖబర్దార్*. జాగ్రత్త.

క. ఖబరుదారు.

<ఉ. ఖబర్‌దార్.

ఖబర్దారుచేయు అ.క్రి. జాగ్రత్తతీసికొను.

**ఖబురు** రూ.చూ. కబురు. వి. సమాచారం, వార్త.

ఖబురుకాకితము వి. సమాచారపత్రం.

**ఖబురుదారి** రూ.చూ. ఖబర్దారు. వి. జాగ్రత్త.

**ఖబ్జదార్** వి భూస్వామి.

హిం. ఉ. *కబ్జాదార్.* స్వత్వంకలవాడు, స్వాధీనపు అధికారం కల ఆసామి.

<ఉ. కబ్జాదార్.

**ఖమామషుదారు** చూ. కమావీసు. వి. పన్నులువసూలుచేసే ఉద్యోగి.

<మరా. కమావీస్+పార-. *దార్.*

**ఖమామీసు** రూ.చూ. కమావీసు. వి. 1. వ్యవహారం ; 2. రెవెన్యూపన్ను వసూలుచేసేపని.

**ఖమాయిషు** రూ.చూ. కమావీసు. వి. 1. వ్యవహారం ; 2. రెవెన్యూపన్నువసూలు చేసేపని.

**ఖమావీసు** రూ.చూ. కమావీసు. వి. 1. వ్యవహారం ; 2. రెవెన్యూపన్ను వసూలు చేసేపని.

**ఖయిదు** రూ.చూ. ఖైదు. వి. కారాగారం.

**ఖర్ఖసభూమి** చూ. ఖరఖసా. వి. రెండుసరిహద్దులమధ్య వివాదంగాఉన్న భూమి.

**ఖర్ఖసా** వి. వ్యాజ్యం, జగడం.

హిం. ఉ. పార. *ఖర్ ఖశా.* జగడం.

<ఉ. ఖర్‌ఖశా.

**ఖరడా** వి. అధికారి, ఖరోడా. రంగా. చ. 2.93. విణ. అమర్యాదకరమయిన, పరుషమయిన.

గుజ. *ఖరడపుమ్-.* అమర్యాద చేయటం ; మరా. *ఖరడ-* అమర్యాద.

<మరా. ఖరడ.

ఖరడాకాకితము వి. ముతకకాగితం.

**ఖరా** విణ. 1. నరయిన ; 2. స్థిరమయిన ; 3. ఖచ్చితమైన, అనుకొన్నట్లు, సంపూర్ణమైన.

హిం. ఖరా. తీక్ష్ణమైన, విశుద్ధమైన.

<హిం. ఖరా.

ఖరాఖండిగా క్రి. విణ.ద్రు. కుండబద్దలు కొట్టినట్లుగా, అతిస్పష్టంగా. ఖరాగా క్రి. విణ.ద్రు. సరిగా, స్థిరంగా, నిక్కచ్చిగా.

**ఖరాజు** వి. ప్రభుత్వపురాబడి.

**ఖరానా**[1] రూ.చూ. ఘరానా. విణ. నమ్మదగిన.

**ఖరానా**[2] వి. అడుగున ఇనప ఉంగరం వేసిన ఒక విధమైన కప్పాతుకట్టె.

**ఖరాబు** విణ. చెడ్డవాడు ; తుంటరి. హంస. 5.118.

హిం.ఉ. *ఖరాబ్-.* వికృతమైన, అపవిత్రమైన, నికృష్టమైన, చెడ్డ, నీచమైన ; మరా. *ఖరాబ్.* చెడ్డ ; పార. *ఖరాబ్.* నాశంచేయబడిన, పాడయిన, సారా మొదలయిన వానిచే మత్తెక్కిన, దురభ్యాసాలకు లొంగిన. అర. *ఖరాబ్.* చెడ్డ.

క. కరాబు. ఖరాబ్.

<ఉ. ఖరాబ్.

ఖరాబుచేయు స.క్రి. పాడుచేయు, చెరచు.

**ఖరామతు** రూ.చూ. కరామతు. వి. అద్భుతం, చమత్కారం.

**ఖరామత్తు** రూ.చూ. కరామతు. వి. అద్భుతం, చమత్కారం.

**ఖరాయితులు** వి. చేరుబందుతో కొట్టేవాడు.

**ఖరారా** రూ.చూ. ఖరారు. వి. ఒడంబడిక.

**ఖరారు** రూ. ఖరారా. వి. ఏర్పాటు, ఒడంబడిక, నిర్ణయం.

హిం. ఉ. *కరార్-.* స్థిరత, విశ్రాంతి, ప్రతిజ్ఞ, ఊరడింపు ; మరా. *కరార్.* అభయవచనం, అంగీకారం ; పార. *కరార్.* స్థిరంగా నివసించు, విశ్రాంతి, సహనం, స్థిరత ; అర. *కరార్.* స్థిరత.

క. కరారు.

<ఉ. కరార్.

ఖరారుచేయు స.క్రి. 1. బేరం, పరిష్కరించు ; 2. నిశ్చయించు. ఖరారునామా వి. ఏర్పాటు పత్రం, ఒడంబడిక, ఒప్పందం. క. *కరారునామె.* ఏర్పాటు పత్రం. ఖరారుమదారు వి. ఒడంబడిక.

**ఖరీజులు** చూ. ఖరీదు. వి.బ.వ. ఇరుగోరుల పొత్తునఇచ్చే రుసుములు.

**ఖరీదు** వి. వెల, విలువ, జట్టీ, రో, క్రయం.

హిం.ఉ. *ఖరీద్-.* క్రయం, కొనబడిన వస్తువు ; మరా. *ఖరీదీ, ఖరేదీ.* కొన్న వస్తువు; పార. *ఖరీద్, ఖరీదన్.* కొనబడినది, కన్య, దానిన కొనబడినది, కొను.

క. ఖరీది.

<ఉ. ఖరీద్.

ఖరీదుకట్టు అ.క్రి. వెలకట్టు. ఖరీదుచేయు స.క్రి. 1. కొను ; 2. వెల ఇచ్చికొను. ఖరీదుబంది వి. వెలయొక్క ఏర్పాటు.

**ఖరుచు** రూ.చూ. ఖర్చు. వి. వ్యయం.

ఖరుచుచేయు స.క్రి. వ్యయించు.

**ఖరుదు** రూ.చూ. కిర్దు[2]. వి. వ్యవసాయం చేయటం.

**ఖరేలు** వి. కాలులో ముల్లుగుచ్చుకొనేటప్పుడు అయ్యేధ్వనికి అనుకరణం.

**ఖర్చు** రూ. కర్చు, కరుచు[2], ఖరుచు. వి. వ్యయం, వెచ్చం. పల్నా. 69.

హిం. ఉ. *ఖర్చ్-.* వినియోగం, ఖర్చు, వ్యయం ; మరా. *ఖర్చ్-.* వ్యయం ; *ఖర్చణే.* ఖర్చుచేయు ; పార. *ఖర్చ్-.* వ్యయం ; అర. *ఖర్జ్.* వ్యయం ; *ఖర్చ్.* ప్రయాణ వ్యయం ;

క. ఖర్చు.

<ఉ. ఖర్చ్.

ఖర్చుచేయు స.క్రి. 1. ఓడించు. సత్య.సా. 1.30 ; 2. వ్యయంచేయు.

**ఖర్జకాయలు** వి.బ.వ. పణ్యారవిశేషం.

హిం. *ఖజ్, ఖజ్లా.* భక్ష్యవిశేషం.

క. కజ్జయ, కర్జి-కాయ.

**ఖర్దు** రూ.చూ. కిర్దు[2]. వి. వ్యవసాయం చేయటం.

**ఖర్బూజా** వి. ఫలవిశేషం.

హిం. ఉ. ఖర్బూజా. ; పార. ఖర్బుజా.

క. ఖర్ బూజ, కర్బూజ.

<ఉ. ఖర్బూజా.

**ఖలము** వి. కణం.

సం. కణ-. కణం.

<సం. కణ-.

**ఖలమ్‌దానీ** వి. తివాచీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**ఖలంపెల్ల** వి. నేలమీది నుంచి రెండడుగుల ఎత్తున బట్టీలో పేర్చిన ఇటిక.

**ఖలలు** వి. చెరుపు, హాని, కలత, నాశనం.

హిం. ఖలల్. జరుగుతున్న పనిలో బాధకలగటం, ఆటంకం, విఘ్నం ; మరా. ఖలల్, ఖలేల్-. విరోధం, బాధ ; ఉ. ఖలల్-. విఘ్నం, బాధ ; పార. ఖలల్. తికమకపడటం ; అర. ఖలల్. వరస తప్పటం.

<ఉ. ఖలల్.

**ఖలసా** రూ.చూ. ఖలిసా. విణ. దివాణంవారు స్వంతంగా పెట్టుకొన్న.

**ఖలిసా** రూ. ఖలసా. విణ. దివాణం వారు స్వంతంగా పెట్టుకొన్న.

హిం. ఉ. ఖాలిసా. రాజ్యం ఏర్పాట్లకు సంబంధించిన.

**ఖలీతి** వి. ప్రభుత్వం వారి ఆజ్ఞా పత్రాన్ని ఉంచుకొనే చిన్న సంచి.

హిం. ఖలీతా, ఖరీతా-. చిన్నసంచి, రాజుల ఆజ్ఞా పత్రం ఉంచుకొనే సంచి ; మరా. ఖరీతా, ఖలీతా. రాజాజ్ఞ ఉత్తరాలు ఉంచుకొనే సంచి ; ఉ. ఖలీతా, ఖరీతా. చిన్నసంచి, ప్రభుత్వం వారి ఆజ్ఞాపత్రం ఉంచుకొనే కవరు ; పార. ఖలీత. చిన్నసంచి ; అర. ఖరీత్, ఖలీత్. పట్టుసంచి.

<ఉ. ఖలీతా.

**ఖల్వతుఖానా** వి. ఏకాంతప్రదేశం.

ఉ. ఖల్వత్ ఖానా-. ఏకాంతప్రదేశం ; పార. ఖల్వత్ ఖాన-. ఏకాంతంగా ఉండటానికేర్పాటు చేయబడిన గదులు.

<ఉ. ఖల్వత్ఖానా.

**ఖళిఫెళి** రూ. ఖళిఫెళి. వి. వీరణం వాయించటంలో ధ్వనికి అనుకరణం. హంస. 2.89.

**ఖళీఫెళీ** రూ.చూ. ఖళిఫెళి. వి. కోడిపుంజులు తన్నుకొనేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. హంస. 3.216.

**ఖసాబు** వి. మాంసవిక్రేత, కసాయి.

హిం. కసాఈ-. ఘాతకుడు, దయాహీనుడు, కఠినుడు ; మరా. కసాఈ ; ఉ. కస్సాబ్-. మాంసం అమ్మేవాడు, పశువధ చేసేవాడు ; కసాఈ. మాంసవిక్రేత, దయలేనివాడు ; పార. కస్సాబ్ ; అర. కస్సాబ్. మాంసవిక్రేత.

<ఉ. కసాఈ.

**ఖసిచేయు** స.క్రి. వట్టలుకొట్టు.

క. కసి-మాడు. కొమ్ములునరుకు.

**ఖసీ** వి. కృషి, వ్యవసాయం.

సం. కృషి-. వ్యవసాయం.

**ఖసు** రూ.చూ. ఖాసా. విణ. స్వంతం, వ్యక్తిగతం.

**ఖసుబా** రూ.చూ. కసుబా. వి. 1. పెద్దగ్రామం; 2. తాలూకాలోని ప్రధాననగరం ; 3. పట్టణం.

**ఖసుబె** రూ.చూ. కసుబా. వి. 1. పెద్దగ్రామం ; 2. తాలూకాలోని ప్రధాననగరం ; 3. పట్టణం.

**ఖసువె** రూ.చూ. కసుబా. వి. 1. పెద్దగ్రామం ; 2. తాలూకాలోని ప్రధాననగరం ; 3. పట్టణం.

**ఖస్బా** రూ.చూ. కసుబా. వి. 1. పెద్దగ్రామం ; 2. తాలూకాలోని ప్రధాననగరం ; 3. పట్టణం.

**ఖాంవారిచిర్ణ** చూ. ఖామ్.

**ఖాకీ** వి. వస్త్రవిశేషం.

హిం. ఉ. పార. ఖాకీ-. ధూళిరంగు, మట్టిరంగు.

క. ఖాకి.

<ఉ. ఖాకీ.

ఖాకీరంగు రూ. కాకిరంగు. వి. ఖాకీగుడ్డ రంగు.

**ఖాంఖా** రూ. ఖామఖా, ఖాముఖా. క్రి.విణ.ద్రు. అగత్యంగా.

హిం.ఉ. ఖామ్ఖాహ్. బాగాతెలిసిన.

క. ఖామఖా.

ఖాంఖాగా (-గా) క్రి.విణ.ద్రు. అగత్యంగా.

**ఖాజఇనాం** రూ. ఖాజీఇనాం. వి. మహమ్మదీయ పురోహితులకు ఇచ్చిన బహుమతి.

ఉ. ఖ్వాజా. మహమ్మదీయ సన్యాసి ; ఇనామ్, బహుమతి.

<ఉ. ఖ్వాజా + ఉ. ఇనామ్.

**ఖాజా** వి. మధుర భక్ష్యవిశేషం.

సం. ఖాద్య-. భక్ష్యవిశేషం ; హిం. ఖాజా

క. కజ్జాయ.

<హిం. ఖాజా.

**ఖాజీ** వి. ముసల్మానుఫకీరు.

హిం. ఖ్వాజా. యజమానుడు, సర్దారు, ముసల్మాను, ఫకీరు ; ఉ. ఖ్వాజ-. స్వామి, యజమానుడు, సర్దారు, ధర్మోపదేశకుడు ; పార. ఖ్వాజ-. ధనవంతుడైన వర్తకుడు, ధర్మోపదేశకుడు, పండితుడు, ప్రభువు, యజమానుడు, ఆచార్యుడు, నపుంసకుడు ; తుర్కి. ఖ్వాజా-. పతి, స్వామి.

<ఉ. ఖ్వాజా.

ఖాజీఇనాం రూ.చూ. ఖాజఇనాం. వి. మహమ్మదీయ పురోహితులకు ఇచ్చిన బహుమతి.

**ఖాటా** రూ.చూ. కాటా. వి. ముక్కోణం వేసి తూచే పెద్ద త్రాసు.

**ఖాణము** వి. అశ్వాదులకుపెట్టే ఉలవలులోనుగాగల భక్ష్యం, దాశా. విజయ. 1.62.

సం. ఖాదన-. ఆహారం, తిండితినటం ; ప్రా. ఖాణ-. భోజనం, భక్షణం.

<ప్రా. ఖాణ-.

**ఖాడా** వి. అశ్వాదులకుపెట్టే ఉలవలులోనుగాగల భక్ష్యం. దాశా. భోజనం. శశా. 2.114.

హిం. ఉ. ఖానా. భోజనం.

<ఉ. ఖానా.

**ఖాజాదిను(-తిను)** స.క్రి. అశ్వాదులకు పెట్టే ఉలవలు లోనగు వాటిని తిను.

**ఖాతరు** రూ.చూ. ఖాతీరు. వి. 1. లక్ష్యం, గురి, లెక్క, ఎన్నిక; 2. గౌరవం.

**ఖాతరుచేయు** స.క్రి. లక్ష్యపెట్టు, లెక్కచేయు.

**ఖాతరుజమా** రూ.చూ. ఖాతర్‌జమా. వి. 1. ధైర్యం; 2. విశ్వాసం.

**ఖాతర్‌జమా** రూ. ఖాతరుజమా, ఖాతిర్జమా, ఖాతీరుజమా. వి. 1. ధైర్యం; 2. విశ్వాసం.

హిం. ఖాతిర్‌జమా-. ధైర్యం; ఉ. ఖాతిర్‌జమా. ఇచ్ఛానుసారం; అర. ఖాతిర్‌జమా-. ఇచ్ఛానుసారం.

<ఉ. ఖాతిర్‌జమా.

**ఖాతా[1]** రూ. కాతా[1]. వి. కాతా, ఇచ్చిపుచ్చుకోలులెక్క, పద్దు.

హిం.ఉ. ఖాతా-. లెక్కలు రాసుకొనే పుస్తకం.

క. ఖాతె.

<హిం. ఖాతా.

**ఖాతా[2]** వి. టెంకాయపీచు.

హిం. కాతా. దారం.

<హిం. కాతా.

**ఖాతిర్జమా** రూ.చూ. ఖాతర్‌జమా. వి. 1. ధైర్యం; 2. విశ్వాసం.

**ఖాతీరు** రూ. ఖాతరు. వి. గురి, లెక్క, ఎన్నిక, లక్ష్యం, ఆదరం. రంగా.చ. 2.89.

మరా. ఖాతిర్-. లక్ష్యం, విశ్వాసం; ఉ. ఖాతిర్. మనసు, సత్కారం, ఆదరం; పార. ఖాతిర్-. ఆలోచన, జ్ఞాపకం, జ్ఞప్తి, హృదయం, మనసు, ప్రేమ, ఆదరం; అర. ఖాతిర్-. సమ్మానం, సత్కారం.

<ఉ. ఖాతిర్.

**ఖాతీరుకు(దెచ్చు(-తెచ్చు)** స.క్రి. లక్ష్యపెట్టు, లెక్కచేయు.

**ఖాతీరుజమా** రూ.చూ. ఖాతర్‌జమా. వి. 1. ధైర్యం; 2. విశ్వాసం.

**ఖాదా** వి. ముతకరేకు.

**ఖాదిరి** వి. 1. భగవంతుడు; 2. శక్తిశాలి; 3. ఒకబిరుదు.

ఉ. కాదిర్-. ఈశ్వరుడు, శక్తిగాలి; పార, కాదిర్-. శక్తియుతమైన, ఈశ్వరుడు; అర. కాదిర్. శక్తిశాలి, సమర్థుడు.

<ఉ. కాదిర్.

**ఖాదీ** పో.చూ. ఖద్దరు. వి. 1. బట్టలాను; 2. చేత్తోవడికిన నూలు; 3. ముతకరేకు.

హిం. ఉ. ఖాదీ. ముతకబట్ట.

క. కాది.

<ఉ. ఖాదీ.

**ఖాన** రూ.చూ. ఖాను. వి. 1. మహమ్మదీయ ప్రభువు-ఖాను. నరస. 2.20; 2. తురుష్క నామధేయాంత వాచకం. యయా. 1.6.

**ఖానా** వి. 1. చిన్నగది; 2. స్థానం; 3. తూము.

హిం. ఉ. ఖానా-. ఇల్లు; పార. ఖానహ్. ఇల్లు, స్థలం.

క. ఖానె-. స్థలం, ఇల్లు.

<ఉ. ఖానా.

**ఖానిగి** విశ. 1. స్వంతఇంటి సంబంధమైన; సొంతంగా కొన్న; 2. మర్మంగా ఉన్న.

హిం. ఉ. ఖాన్‌గీ. ఇంటి సంబంధమైన, తన.

క. ఖానిగి.

<ఉ. ఖాన్‌గీ.

**ఖానిగీలెక్క** చూ. ఖానిగి. వి. ఇంటికింద రాసిన వైనం లెక్క.

**ఖానీ** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం నమూనా.

**ఖాను** రూ. ఖాన, ఖానుఁడు. వి. 1. మహమ్మదీయ ప్రభువు. వసు. 1.46; 2 తురుష్క నామాంత వాచకం. యయా. 1.44.

హిం. ఖాన్-. సర్దారు, పఠాన్ల బిరుదు; మరా. ఖాన్. సర్దారు; ఉ. ఖాన్-. కాబూలి, పఠాన్ దేశీయుడు, ఒక బిరుదు, ముఖ్యుడు; పార. ఖాన్. తార్తారుల బిరుదు, రాజకుమారుడు, ప్రభువు, ఒకరకమైన బిరుదు; తుర్కీ. ఖాన్. సర్దారు.

<ఉ. ఖాన్.

**ఖానుఁడు** రూ.చూ. ఖాను. వి. 1. మహమ్మదీయ ప్రభువు; 2. తురుష్క నామాంత వాచకం.

**ఖానుసుమారు** రూ.చూ. ఖానేషుమారి. వి. జనాభాలెక్క.

**ఖానుసుచూపు** స.క్రి. బాధపెట్టు.

హిం.ఉ. కానూన్-. చట్టం, శాసనం.

<ఉ. కానూన్ + చూపు (అర్థవిపరి.).

**ఖానెసుమారులెక్క** చూ. ఖానేషుమారు. వి. జనాభాలెక్క.

**ఖానేషుమారి** రూ. ఖానుసుమారు. వి. జనాభాలెక్క.

హిం. ఖానెహ్‌శుమారీ-. గృహగణనం; మరా. ఖానేషుమారీ-. జనాభాలెక్కలు, గృహగణనం; ఉ. ఖానాశుమారీ-. గృహగణనం; పార. ఖానహ్‌షుమారీ-. ఇంటిపన్ను.

<ఉ. ఖానహ్‌శుమారీ.

**ఖాందాన్** వి. సంసారం.

హిం.ఉ. ఖాన్‌దాన్. కులం, మంచి కుటుంబం.

<ఉ. ఖాన్‌దాన్.

**ఖాన్నిషాలు** వి.బ.వ. భయంగొల్పే పనులు. రంగా.చ. 2.32.

హిం.ఉ. ఖాన్. సర్దారు; నిగాహ్. చూపు.

**ఖాన్మహలు** వి. ఖానుని స్వంతసిబ్బంది. రంగా.చ. 2.28.

**ఖాబు** వి. పెద్ద పాత్ర.

హిం.ఉ. కాబ్-. పెద్ద పాత్రం; పార. కాబ్-. పాత్రం.

<ఉ. కాబ్.

**ఖామ్** రూ. ఖాము. విశ. కచ్చా, పచ్చి, పట్టి.

హిం. ఉ. పార. ఖామ్. తక్కువ, కచ్చా.

<ఉ. ఖామ్.

**ఖాంవారిచిల్లర** వి. వగైరాలు లేక చిన్న వస్తువులు.

**ఖామందు** రూ.చూ. ఖావందు. వి. యజమాని.

**ఖామఖా** రూ.చూ. ఖాంఖా. క్రి.విశ.ద్రు. అగత్యంగా, గట్టిగా.

**ఖామావీసు** రూ.చూ. కమావీసు. వి. 1. వ్యవహారం; 2. రెవెన్యూ పన్ను వసూలుచేసే పని.

**ఖాము** యా.చూ. ఖామ్. విశ. తీరీ తీరని.

**ఖాముఖా** రూ.చూ. ఖాంఖా. క్రి.విశ.ద్రు. అగత్యంగా, గట్టిగా.

**ఖాయం** రూ. కాయము², ఖాయము, విశ. స్థిరమైన, శాశ్వతమైన.

హిం. ఉ. కాయమ్. స్థిరమైన, నిశ్చితమైన.

<ఉ. కాయమ్.

**ఖాయపరచు** చూ. ఖాయము.

**ఖాయమగు** చూ. ఖాయము.

**ఖాయము** రూ.చూ. ఖాయం. విశ. స్థిరమైన. శాశ్వతమైన, నిక్కమైన.

**ఖాయపరచు** స.క్రి. స్థిరంచేయు. **ఖాయమగు** అ.క్రి. ఉద్యోగం స్థిరపడు. **ఖాయముగా(-కా)** క్రి.విశ.ద్రు. తప్పకుండా.

**ఖాయిదా** రూ. కాయిదా, ఖోయిదా. వి. 1. భద్రం; 2. విధి, నిర్ణయం.; 3. కమీషను అడితి; 4. క్రమం.

హిం. కాయ్‌దా. నియమం, రీతి, వ్యవస్థ, విధి; మరా. కాయ్‌దా. చట్టం, నియమం; ఉ. ఖామ్‌దా-, కాఇదా. నియమం, క్రమం, సిద్ధాంతం; పార. కాఇద, కాఇదత్. పునాది, ముఖ్యమైన పట్టణం, నియమం; పార. కాఇదా. నియమం.

క. కాయదె.

<ఉ. కాయ్‌దా.

**ఖాయిదాచేయు** స.క్రి. కట్టుదిట్టంచేయు. **ఖాయిదాచేయించు** స.క్రి. కట్టడిచేయించు.

**ఖాయిలా** వి. తెగులు, రోగం.

క. కాయిలె.

హిం. ఉ. కాయల్. సిగ్గుపడిన.

**ఖారిజ్‌ఖాతా** వి. సేద్యం చేస్తూనరిగా పంటకపోవడం వల్ల పట్టా వదులుకున్న శివాయి జమాభూమి.

హిం. ఖారిజ్. వేరైన; ఉ. ఖారాదీఖాతా, ఖరిజ్ ఖాతా.

<ఉ. ఖరిజ్‌ఖాతా.

**ఖారిస్తాను** రూ. ఖార్తిసాను. వి. పగ, ద్వేషం.

హిం. ఉ. పార. ఖార్. ముల్లు, ఈర్ష్య.

**ఖారుఖాన** రూ.చూ. కార్ఖానా. వి. కర్మగారం, స్థానం.

**ఖారుభారు** రూ.చూ. కారుబారు. వి. వ్యవహారం.

**ఖార్తిసాను** రూ.చూ. ఖారిస్తాను. వి. పగ, ద్వేషం.

**ఖాళ్లీనివేల** చూ. కారు. వి. చవిటిభూమి.

**ఖాలి** రూ.చూ. ఖాలీ. వి. శూన్యం.

**ఖాలీ** రూ. కాలీ, ఖాలి, ఖాళి, ఖాళీ. విశ. ఉత్తది, ఆక్రమించబడిన. రంగా. చ. 2.149.

హిం. ఖాలీ-. మరా. ఖాలీ. శూన్యమైన; ఉ. ఖాలీ-. ఉత్తది, రిక్తం; అ. ఖాలీ-. రిక్తం; పార. ఖాలీ-. లోనశూన్యంగల, నిరుద్యోగమయిన; అర. ఖాలీ-. రిక్తం.

<ఉ. ఖాలీ.

**ఖాలీసా** రూ. కైలీసా, ఖాలుసా, ఖాల్సా, వి. ప్రభుత్వ సంబంధమైన భూమి.

ఒ. ఖలసా. ప్రభుత్వాధీనంలో ఉన్న భూమి; హిం. ఖల్‌సా. రాజసంబంధమైన భూమి; గు. ఖలసా. ప్రభుత్వాధీనంలో ఉన్నభూమి; మరా. ఖల్‌సా. రాజసంబంధమైన భూమి, లేక సంపద; ఖలిసా. ఉ. ఖలిసా, రాజసంబంధమైనభూమి.

<ఉ. ఖలిసా.

**ఖాలుసా** రూ.చూ. ఖాలీసా. వి. ప్రభుత్వాధీనం.

**ఖాల్సా** రూ. చూ. ఖాలీసా. ప్రజల ఉమ్మడిసొత్తు.

**ఖాళి** రూ.చూ. ఖాలీ. విశ. శూన్యమైన, ఉత్తది.

**ఖాళీ** రూ.చూ. ఖాలీ. విశ. ఉత్తది, ఆక్రమింపబడినది. రంగా. చ. 2.148.

**ఖాళీచేయు** స.క్రి. విడిచిపెట్టు, వట్టిదిచేయు.

**ఖావందు** రూ. ఖామందు, ఖావిందు, ఖోదావందు. వి. 1. యజమానుడు. రంగా. చ. 2.148; 2. ప్రభువు. రంగా. చ. 2.174.

హిం. ఖావింద్; మరా. ఖావంద్, ఖావింద్; ఉ. ఖావంద్, ఖావింద్. సామి, యజమానుడు, ప్రభువు; పార. ఖావంద్.

క. ఖావంద్. ప్రభువు.

<ఉ. ఖావంద్.

**ఖావందుదారు** వి. 1. యజమానుడు; 2. ప్రభువు; 3. నాయకుడు <ఉ. ఖావంద్ +పార-దార్. **ఖావందుదారు(డు)** వి. 1. యజమానుడు; 2. ప్రభువు. 3. నాయకుడు.

**ఖావా** వి. పన్నెండంగెలమధ్య బిగించే ఈనెపుల్లలు చీల్చిసాపు చేసేకత్తి.

**ఖావిందు** రూ.చూ. ఖావందు. వి. 1. ప్రభువు; 2. నాయకుడు; 3. యజమానుడు.

**ఖాసవా(డు** చూ. ఖాసా. వి. దాసీపుత్రుడు.

**ఖాసా** రూ. ఖసు, ఖాసు. విశ. 1. ఆత్మీయమైన; తనకు సంబంధించిన, సొంతమైన, ప్రత్యేకమైన. చంద్రరే. 1.32; 2. దాసుడు, జమీందారుల సేవకుడు.

క. కాసా-. సొంతమైన.

హిం. ఖాస్-. ప్రధానం ఆత్మీయం, స్వయంగా; మరా. కాస్-. ముఖ్యమైన; ఉ. ఖాసె, ఖాస్స్-.ముఖ్యమయిన, ప్రధానమైన, తనయొక్క. ఆత్మీయమైన; అర. ఖాస్-. ప్రముఖమైన, రాజసంబంధమైన; పార. ఖాస్స్, ఖాస్ స్వీయం, ఆత్మీయమైన.

<ఉ. ఖాస్.

**ఖాసికీ** వి. సేనాపతి.

హిం. ఖాస్‌గీ. రాజసంబంధమైన; ఉ. ఖాస్‌గీ-. సేనాపతి, రాజుఉంపుడు కత్తె; పార. ఖాసగీ. ప్రత్యేకత, ముఖ్యమైనది, రాజుకుఇష్టుడు; కోశాధికారి.

<ఉ. ఖాస్‌గీ.

**ఖాసు** రూ.చూ. ఖాసా. విశ. సొంతమైన.

**ఖాస్‌దార్** వి. గుర్రపువాడు.

క. కాసదార్. గుఱ్ఱపువాడు.

ఖాప్‌దార్‌వాడు వి. గుఱ్ఱపువాడు.

**ఖాహళ్ళవాఁడు** వి. కాహళికుడు.

**ఖిచిక్కు** రూ.చూ. ఐచిక్కు. వి. కొరకటంవంటివాటిలోని ధ్వన్యనుకరణం.

**ఖిచ్చడి** రూ.చూ. కిచ్చడి. వి. పులగం.

**ఖిడికి** రూ.చూ. కిటికీ. వి. గవాక్షి, దిడ్డివాకిలి.

**ఖితాబు** రూ. కితాబు[2]. వి. బిరుదు.

హిం. కితాబ్. పదవి, బిరుదు; మరా. కితాబ్. బిరుదు; ఉ. ఖితాబ్. బిరుదు, ప్రభుత్వంవారు చేసిన ఘనకార్యానికి మెచ్చిఇచ్చిన ఉపాధి; అర. కితాబ్, ఖితాబ్. బిరుదు.

< ఉ. ఖితాబ్.

**ఖిద్మత్‌ఇనాం** వి. నుంకరి, తలారి మొ. ఊరినౌకర్లకుఇచ్చిన బహుమతి.

హిం. ఉ. ఖిద్‌మత్. సేవ; ఇనామ్. బహుమతి.

< ఉ. ఖిద్‌మత్ + ఉ. ఇనామ్.

**ఖిమ్మతు** రూ. చూ. కిమ్మతు. వి. వెల.

**ఖిరణిజివుస్సు** వి. మందు దినుసు.

హిం. ఖిర్‌నీ-. వృక్షవిశేషం; జిన్స్. దినుసు.

**ఖిరదాబాదా** వి. తెలిసికొనటం. రంగా. చ. 1.141.

< ఉ. ఖిరదాబాద్-. బుద్ధితోనిండిన.

**ఖిరదారు** చూ. ఖిర్దు. వి. కృషి. వ్యవసాయంలెక్క.

**ఖిరానా** రూ.చూ. కిరానా. వి. చిల్లరసామాను, ఉప్పు, మిరపకాయ చింతపండు మొదలయిన మసాలాలు, కిరానా.

**ఖిర్దు** వి. 1. కృషి, వ్యవసాయం; 2. కార్యం.

ఉ. కిర్ద్, కర్ద్-. పని; కార్యం, ఆమలు; పార. కర్ది. పని, కార్యం; అర. కర్ద్-.తోసివేయు, శత్రువును. వెంబడించు.

< ఉ. కిర్ద్.

**ఖిలాడి** వి. మోసగాడు, టక్కరి.

హిం. ఖిలాడీ-. ఆటగాడు, నటుడు, గారడీవాడు.

క. కిలాడి.

< హిం. కిలాడి-. (అర్థవిపరి.).

**ఖిలారి** రూ.చూ. కిలారి. వి. పసుల కాపరి.

**ఖిల్లతు** రూ. ఖిల్లీతు వి. 1. కానుక; 2. రాజులు చేసేసన్మానం.

హిం. ఖిల్‌అత్. రాజులుసమ్మాన పూర్వకంగా ఇచ్చే వస్త్రాదులు. మరా. ఖిలత్, ఖిలాత్. ఆడంబరంతో ఇచ్చే బహుమతి, గౌరవించటం; ఉ. ఖిల్ అత్. రాజులుసమ్మాన పూర్వకంగా ఇచ్చే వస్త్రాదులు; పార. ఖిల్‌అత్. రాజు గౌరవార్థం తనప్రజలకిచ్చే వస్త్రాదులు.

< ఉ. ఖిల్‌అత్.

**ఖిల్లరి** రూ.చూ. కిలారి. వి. కిలారి, పశులకాపరి.

**ఖిల్లా** రూ.చూ. కిలా. వి. పర్వతదుర్గం.

**ఖిల్లాదారి** రూ.చూ. కిల్లాదారి. వి. పర్వతదుర్గం యజమాని. **ఖిల్లాదారుఁడు** వి. పర్వతదుర్గం యజమాని.

**ఖిల్లారి** రూ.చూ. కిలారి. వి. కిలారి, పసులకాపరి.

**ఖిల్లీతు** రూ.చూ. ఖిల్లతు. వి. 1. కానుక; 2. రాజులుచేసే సన్మానం.

**ఖిల్లె** రూ.చూ. కిలా. వి. పర్వతదుర్గం.

**ఖుడక** వి. అల్పుడు.

సం. క్షుద్రక-. నీచుడు, అల్పుడు.

**ఖుతినీ** రూ.చూ. కుతినీ. వి. కుత్తినీపట్టు, పట్టుబట్ట, మడిబట్ట.

**ఖుద్** రూ.చూ. ఖుద్దు. క్రి. విఐ. స్వయంగా.

**ఖుదా** రూ. ఖోదా. వి. దేవుడు, అల్లా. కృష్ణ. 2.252.

త. ఖుద.

హిం.ఉ.పార. ఖుదా. స్వయంభువు, ఈశ్వరుడు; మరా. ఖుదా. దేవుడు, స్వయంభువు, దేవుడు, ప్రభువు; ఖ్వుద్. తనంతట తాను; అయ్. వచ్చినవాడు.

< ఉ. ఖుదా.

**ఖుద్దు** రూ. ఖుద్. క్రి విఐ. స్వయంగా, సొంతంగా, సమక్షంలో, ఎదురుగా. నె.శా.శా.సం. 44. క్రీ.శ. 1650.

హిం. ఖుద్. స్వయంగా; మరా. ఖుద్, ఖుద్ద; ఉ. ఖుద్; పార. ఖ్వుద్.

< ఉ. ఖుద్.

ఖుద్దున క్రి. విఐ. ద్రు. 1. సొంతంగా; 2. ఎదురుగా, సమక్షంలో. హిం. ఖుద్-హ్. క. ఖుద్దాని.

**ఖురదా** రూ.చూ. ఖుర్దా. వి. బత్తెం, దుడ్లు, పైసాలు.

**ఖురదా** రూ.చూ. ఖుర్దా. వి. బత్తెం, దుడ్లు, పైసాలు.

**ఖురాకి** రూ.చూ. ఖురాకు. వి. 1. కూడు; 2. బత్తెం.

**ఖురాకు** రూ. ఖురాకి, ఖొరాకి. వి. 1. కూడు; 2. బత్తెం, బత్తెపు కానులు.

హిం. ఉ. ఖురాక్. భోజనం.

క. ఖురాకు. మంచి ఆహారం.

< ఉ. ఖురాక్.

**ఖురాను** రూ. కురాను. వి. మహమ్మదీయ మత గ్రంథం. భద్ర. శ. 18.

హిం. పార. కురాన్; ఉ. కురాన్, కుర్‌ఆన్, మహమ్మదీయుల ఆదర్శ గ్రంథం; అరకుల్‌ఆన్.

< ఉ. కురాన్.

**ఖురాళము** రూ.చూ. కురాడము. వి. మేలుకట్టు. చంద్రభా. 4.50.

**ఖురాసాని** రూ. చూ. కురాసాని. విఐ. ఖురాసాన్ దేశ సంబంధమైన. హంస. 5.152.

ఉ. ఖురాసానీ. ఖురాసాన్ దేశానికి చెందిన; పార. ఖురాసానీ. దేశవిశేషం, జైహూన్ నదికి ఉత్తరాన గల దేశం.

< ఉ. ఖురాసానీ.

**ఖురాసానివాము** వి. కురంజి వాము.

**ఖురుదా** రూ.చూ. ఖుర్దా. వి. దుడ్లు, పైసాలు.

**ఖురుబుదాలు** వి.బ.వ. దగ్గర సంబంధం, పరిచయం కలవారు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 795. క్రీ.శ. 1678.

ఉ. కుర్బత్‌దార్. సామీప్యం కలవాడు, సహవాసి; పార. కుర్బత్, కుర్బుత్ + దార్. సహవాసి, సామీప్యమున్నవాడు.

<ఉ. కుర్బత్‌దార్.

ఖుర్‌ముసాఖు వి. భార్య సంపాదనపై బతికే నిర్లజ్జా వ్యక్తి. విశ్వే. శ. 39.
ఉ. కుర్ మసాక్. భార్య సంపాదనపై బతికే సిగ్గులేని మానవుడు; పార. కుర్రమసాక్. జారిణియైన భార్య కలవాడు.
<ఉ. కుర్‌మసాక్.

ఖుర్దా రూ. కురుదా, ఖురడా, ఖురదా, ఖురుదా. వి. 1. ఒకానొక దేశ భాగం; 2. బత్తెం, పైసాలు.
హిం. ఖుర్‌దా. చిన్న చిన్న వస్తువులు; మరా. ఖుర్‌దా. చిన్న పట్టణం; ఉ. ఖుర్‌దా. ఖండం, ముక్క; పార. ఖుర్‌దా. సొగసు, అత్యల్పం, విమర్శ; అర. ఖుర్‌దా. చిన్న, అల్పం.
<ఉ. ఖుర్‌దా.

ఖుర్దుబుర్దు వి. అపహరించడం.
హిం. ఉ. ఖుర్ద్‌బుర్ద్. నష్టభ్రష్టం.
క. ఖుర్దుబుర్దు.
<ఉ. ఖుర్ద్‌బుర్ద్.

ఖులాయించు అ.క్రి. అందంగా అగపడు.
హిం. ఖుల్నా. శోభనిచ్చు.
<హిం. ఖుల్నా + -ఇంచు³.

ఖులాసా¹ రూ.చూ. ఖుశాలు. వి. 1. సౌఖ్యం, నెమ్మది; 2. ఆరోగ్యం, క్షేమం; 3. ఆనందం.
ఖులాసాగా క్రి. విశే. ప్రయో. సౌఖ్యంగా.

ఖులాసా² వి. సంగ్రహం, నిగ్గు, సారాంశం.
హిం. ఉ. ఖులాసా. సారాంశం.
<హిం. ఖులాసా.

ఖుల్లము రూ. ఖుల్లస్సు, ఖుల్లా. వి. 1. వివరం; 2. నిగ్గు, సారాంశం.
హిం. ఖులాస్. సారాంశం.
<హిం. ఖులాస్.
ఖుల్లముగా క్రి. విశే. ప్రయో. ముఖ్యంగా.

ఖుల్లస్సు రూ.చూ. ఖుల్లము. వి. వివరం.

ఖుల్లా రూ.చూ. ఖుల్లము. వి. 1. వివరం; 2. సారాంశం.

ఖుశామది రూ.చూ. ఖుషామత్తు. వి. 1. స్తోత్రం; 2. పొగిడేవాడు.

ఖుశాలినామా రూ. ఖుషాల్‌నామా, ఖుషాలీనామా. వి. క్షేమ సమాచారాలు తెలియజేసే పత్రిక.
హిం. ఉ. ఖుశ్‌ల్‌నామహ్. సంతోషదాయకాలైన క్షేమసమాచారాలుగల పత్రం; మరా. ఖుశాల్‌నామా. పార. ఖుష్‌ల్‌హానామహ్.
<మరా. ఖుశాల్‌నామా.

ఖుశాలు రూ. ఖులాసా¹, ఖుషాలు. వి. సంతోష స్థితి.
హిం. ఖుశ్‌హాల్-. సంపన్నుడు, సుఖి; మరా. ఖుశాల్-. సంతోషంగల; ఉ. ఖుశ్‌హాల్-. సమృద్ధిగల, సంపదగల, మంచిస్థితిగల; పార. ఖుశ్ + హాల్-. సంతోషస్థితి.
<మరా. ఖుశాల్.

ఖుషామత్తు రూ. ఖుశామది. వి. 1. స్తోత్రం; 2. పొగిడేవాడు.
హిం. ఉ. ఖుశామత్. అబద్ధపు ప్రశంస.
క. ఖుశామత్.
<ఉ. ఖుశామత్.

ఖుషాలీనామా రూ.చూ. ఖుశాలినామా. వి. క్షేమసమాచారాలు తెలియజేసే పత్రిక.

ఖుషాలు రూ.చూ. ఖుశాలు. వి. సంతోషం.

ఖుషికి రూ.చూ. ఖుష్కి. వి. దున్నని నేల, బీడు.

ఖుషిగి రూ.చూ. ఖుష్కి. వి. దున్నని నేల, బీడు.

ఖుషి రూ.చూ. ఖుసి. వి. 1. సంతోషం; 2. ఇష్టం.

ఖుషీ రూ.చూ. ఖుసి. వి. 1. సంతోషం; 2. ఇష్టం.

ఖుష్కి రూ. కుస్కి, ఖుషికి, ఖుషిగి, ఖుష్కీ. వి. మెట్టభూమి.
హిం. ఉ. ఖుశ్కీ. మెట్టభూమి.
క. కుశ్కి.
<ఉ. ఖుశ్కి.
ఖుష్కిపైకితరి వి. మెట్టలో చేయబడ్డ మాగాణి.

ఖుష్కీ రూ.చూ. ఖుష్కి. వి. వర్షాధారంతో పండే నేల.

ఖుష్టరీదు వి చెయి వెలకు అమ్మడం.
క. ఖుష్కరీది. బజానా లేకుండ కొనడం.

ఖుష్బాషు వి. సంతోషంగా ఉండేవాడు.

ఖుసి రూ. ఖుషి, ఖుషీ. వి. 1. సంతోషం. హర. 1.22; 2. ఇష్టం.
హిం. ఖుశీ; మరా. ఖుశీ, ఖుశ, ఖూశీష. ఆనందం, సుఖం; ఉ. ఖుశీ. హర్షం, ఆనందం, ఇచ్ఛ, అంగీకారం; పార. ఖుషీ. సంతోషం, ఆనందం.
క. కుషి.
<ఉ. ఖుశీ.

ఖుసూరి వి. లోపం.
హిం. ఉ. కసూర్. దోషం.
<ఉ. కసూర్.

ఖుహో వి. అరేబియా దేశంవాడు, మహమ్మదీయుడు. రంగా. చ. 2.142.
ఉ. కుహ్లా-. పార. అర. కుహ్లా-. నిజమైన, అరేబియా దేశీయుడు.
<ఉ. కుహ్లా.

ఖూటా రూ.చూ. గూటము. వి. గూటం.

ఖూటీ వి. తివాసీ మగ్గంపై దోనె బెజ్జంలో దూర్చేటందుకు బిగించిన మేకు.

ఖూని రూ.చూ. ఖూనీ. వి. నరహత్య, కూని.
ఖూనిరియ్యతు వి. నేరస్థుడు, అపరాధి.

ఖూనీ రూ. కూని, కూనీ, ఖూని. వి. నరహత్య, కూనీ. విశ్వే. శ. 39.
హిం. ఖూన్. రక్తం; ఖూనీ. ఘాతకుడు, చంపేవాడు, అత్యాచారి; మరా. ఖూన్. హత్య; ఉ. ఖూనీ. రక్తంతో సంబంధించిన; ఖూన్. హత్య, రక్తం; ఖూనీ. హంతకుడు; పార. ఖూన్. రక్తం, హత్య, ప్రతీకారం, జీవితం, గర్వం, చదవటం, పాడటం, స్వార్థపరత.

<ఉ. ఖూనీ.
ఖూనీఖోరు వి. పాతకుడు, హంతకుడు.

**ఖూబి** రూ.చూ. ఖూబు. అవ్య. బాగు, మంచిగా.

**ఖూబు** రూ. ఖూబి. అవ్య. సెబాసు, భళీ. ప్రబంధ. 484. విశ. బాగైన, క్షేమమయిన.
క. ఖూబు.
మరా. ఖూప్, ఖూబ్. పుష్కలమైన, అతిశయమైన; హిం. ఖూబ్. మంచిది, భళీ, సెబాసు; ఉ. ఖూబ్. సుందరం, ఉత్తమమైన, భళీ, సెబాసు; పార. ఖూబ్. భళమైన, సంతోషకరమైన, మంచి, ఉత్తమమైన.
<ఉ. ఖూబ్.

**ఖూము** వి. కులం, తెగ.

**ఖూమ్వారి** వి. ఆయా కులాల వారి మీద తీసే పన్ను.

**ఖూర్నిషాలు** వి. వందనం.
ఉ. కోర్నిశ్. వంగి సలాం చేయటం; తుర్కి. కోర్నిశ్. వందనం చేయటం.
<ఉ. కోర్నిశ్.

**ఖేట** రూ.చూ. ఖేటా. విశ. వేరైన, భిన్నమైన, పరాయి.

**ఖేటా** రూ. ఖేట. విశ. వేరే.
హిం. ఉ. ఖేటా. విడిచిపెట్టటం.
<ఉ. ఖేటా.
**ఖేటాగా** క్రి. విశ. ద్రు. వేరేగా. **ఖేటాయించు** రూ. కేటాయించు. స.క్రి. వేరుపరుచు. **ఖేటించు** స.క్రి. **1.** విడిచిపెట్టు. రంగా.చ. 2.174; **2.** వేరుచేయు, కేటాయించు.

**ఖేటించు** చూ. ఖేటా.

**ఖేడము** వి. చిన్న పల్లె.
హిం. ఖేడా. గ్రామం.
<హిం. ఖేడా.

**ఖేడి** రూ.చూ. కేడి[1]. వి. కేడీ, దొంగ, అపరాధి.
**ఖేడిగఉండు** అ.క్రి. మిశ్రితంగా ఉండు (పద్లు మొదలైన వాటిని గురించిన మరాటిమాట).

**ఖేతు** వి. వరి పొలం.
హిం. ఉ. ఖేత్. పొలం.
<ఉ. ఖేత్.

**ఖేరీజు** విశ. పై. జాస్తి, వేరే.

**ఖైంబీ** వి. తివాసీ నేతకు వాడే ఉన్ని పోగులను కత్తిరించే కత్తెర.

**ఖైది** రూ. కైది, కైదీ, ఖైదీ. వి. చెరలో ఉంచబడినవాడు, కారాగార నివాసి. రా.చ.
ఉ. కైదీ. కారగారవాసి; అ. కైదీ; పార. కైదీ; మరా. కైదీ; హిం. కైదీ.
క. కైది. కారాగారవాసి.
<ఉ. కైదీ.

**ఖైదీ** రూ.చూ. ఖైది. వి. చెరలోఉంచబడినవాడు, కారాగార నివాసి.

**ఖైదు** రూ. కైదు[2], ఖయిదు. వి. చెర, కారాగృహం. రా.చ.
హిం. ఉ. మరా. అర. పార. కైదీ; ఉ. కైద్. కారాగారావాసం, కారాగారవాసశిక్ష.
క. కైదు.
<ఉ. కైద్.
**ఖైదుచేయు** స.క్రి. చెరసాలలో ఉంచు.

**ఖైరా** రూ.చూ. కైరండు. వి. పిల్లికళ్ళగుర్రం.

**ఖైరాతి** విశ. తిరిపెంగాఇచ్చిన.
హిం. ఉ. ఖైరాత్. బిచ్చంగా ఇచ్చినధర్మం, దానం. ఖైరాతీ. ధర్మార్థం, ఉచితంగాదొరికిన.
<ఉ. ఖైరాతీ.

**ఖైరాతీఇనాం** వి. దేవాదాయం, ధర్మాదాయం.
హిం.ఉ. ఖైరాతీఇనామ్. ధర్మార్థమైనబహుమతి.
<ఉ. ఖైరాతీఇనామ్.

**ఖైరాతు** వి. దానధర్మాలు.
హిం. మరా. పార. ఖైరాత్; ఉ. ఖైరాత్. దానధర్మాలు.
<ఉ. ఖైరాత్.

**ఖైరీజులు** వి. బ.వ. జాస్తి, వేరేగా.

**ఖైలుగడ్డి** రూ.చూ. కైలుగడ్డి. వి. గింజలు మిగిలినగడ్డి.

**ఖొజ్జా** రూ.చూ. కొజ్జా. వి. పేడి, నపుంసకుడు.

**ఖొదా** రూ.చూ. ఖుదా. వి. దేవుడు. విశ్వే.శ. 54.

**ఖొరాకి** రూ.చూ. ఖురాకు. వి. బత్తెం.

**ఖోగిరి** రూ.చూ. ఖోగీరు. వి. గుర్రపుజీను.

**ఖోగీరు** రూ. ఖోగిరి. వి. గుర్రపుజీను.
హిం. ఉ. ఖోగీర్. గుర్రంపైనికుషన్.
క. కోగీరు.
<ఉ. ఖోగీర్.

**ఖోజాన్** వి. ఇరవైవస్త్రాలు (వర్తకులపరిభాష).

**ఖోజు** రూ. ఖోదు. వి. మర్మం, గుట్టు, జాడ.
హిం. ఉ. ఖోజ్. శోధన, వెదకటం.
<ఉ. ఖోజ్. (అర్థవిపరి).

**ఖోట** రూ.చూ. ఖోటా. విశ. కల్లయిన, అబద్ధమైన.

**ఖోటా** రూ. ఖోట. విశ. కల్లైన, అబద్ధమైన.
హిం. ఖోటా. చెడ్డ.
క. ఖోటు;
<హిం. ఖోటా.

**ఖోదావందు** రూ.చూ. ఖావందు. వి. స్వామి.

**ఖోదు** రూ.చూ. ఖోజు. వి. మర్మం, గుట్టు, జాడ.

**ఖోయిదా** రూ.చూ. ఖాయిదా. వి. 1. చట్టం; **2.** కట్టుదిట్టం.

**ఖోసు** వి. రాజమార్గం, ఘంటాపథం. విశ్వే. శ. 55.
ఉ. ఖోస్త్ రాజమార్గం; పార. ఖోస్త్. ద్వీపం, ఘంటాపథం.
<ఉ. ఖోస్త్.

**ఖ్యాలి** రూ. ఖ్యాలు. వి. **1.** ఎంచడం, భ్రమ; **2.** పాట. హిం. ఖ్యాలీ. కల్పితం; పో.చూ. ఖవ్వాలి. ఒకరకం పాట.

**ఖ్యాలు** రూ.చూ. ఖ్యాలి. వి. **1.** ఎంచడం, భ్రమ: **2.** పాట.



గ వి. హల్లుల్లో మూడోవర్ణం. జిహ్వామూలహనుమూలీయ నాద స్పర్శం, అల్పప్రాణం, మూలద్రావిడ భాషలోలేని ఈ వర్ణం తదనంతరకాలంలో తెలుగు, కన్నడం మొదలైన అనేక ద్రావిడభాషల్లోఏర్పడింది.

గక్కడ చూ. అక్కడ. అవ్య. అక్కడ.

గగనకుసుమము వి. 1. అసంభవం. రాధా. 1.7 ; 2. శూన్యం.
 సం. గగనకుసుమ-. ఆకాశపుష్పం.
 <సం. గగనకుసుమ- (అర్థవిపరి.).

గగనప్రసూనవాదము చూ. గగనము. వి. శూన్యవాదం. కాళ. 3.169.

గగనమగు చూ. గగనము.

గగనము వి. 1. దుర్లభం. రం.రా. యు. 280 ; 2. శూన్యం; 3. అబ్బురం.
 సం. గగన- ఆకాశం.
 <సం. గగన- (అర్థవిపరి.).
 గగనమగు అ.క్రి. ఎంతోకష్టమగు. గగనముచేసికొను స.క్రి. కష్టంచేసికొను. సారంగ. 2.224.

గగరు రూ.చూ. గగ్గురు[1]. వి. రోమాంచం.

గగురించు చూ. గగురు.

గగురు రూ.చూ. గగ్గురు[1]. వి. భయహర్షాదులచేత శరీరం వెంట్రుకలు నిక్కబొడవటం, రోమాంచం. ఆం. భా. 1.141.
 గగురించు అ.క్రి. గగుర్పొడుచు. గగురుపడు రూ. గగుర్పడు. అ.క్రి. రోమాంచమగు. గగురుపాటు రూ. గగుర్పాటు. వి. రోమాంచం. ఉ.రా. 1.221. గగురుపాఱు రూ.చూ. గగుర్పాఱు. అ.క్రి. గగురుపాటుకలదగు. గగురుపొడమించు రూ. గగుర్పొడమించు. స.క్రి. రోమాంచం కలిగించు. గగురుపొడము రూ.చూ. గగుర్పొడము. అ.క్రి. గగురుకలదగు. గగురుపొడుచు రూ. గగుర్పొడుచు, గగ్గురు పొడుచు. అ.క్రి. పులకించు, రోమాంచితమగు. హరి. ఉ. 1.41. గగురుపొడుపు రూ.చూ. గగుర్పొడుపు. వి. భయహర్షాదులచేత శరీరం వెంట్రుకలు నిక్కబొడవటం, రోమాంచం. గగుర్పడు రూ.చూ. గగురుపడు. అ.క్రి. రోమాంచమగు. గగుర్పాటు రూ.చూ. గగురుపాటు. వి. రోమాంచం. ఉ.రా. 1.136. గగుర్పాఱు రూ. గగురు పాఱు. అ.క్రి. గగురుపాటుకలదగు. ఉ.రా. 3.311. గగుర్పొడమించు రూ.చూ. గగురుపొడమించు. స.క్రి. రోమాంచం కల్గించు. గగుర్పొడము రూ. గగురుపొడము. అ.క్రి. గగురుకలదగు. పాండు. 4.48. గగుర్పొడుచు రూ.చూ. గగురుపొడుచు. అ.క్రి. పులకించు, రోమాంచితమగు. పారి. 1.122. గగుర్పొడుపు రూ. గగురుపొడుపు. వి. భయహర్షాదులచేత శరీరం వెంట్రుకలు నిక్కబొడవటం, రోమాంచం. అచ్చ.రా. కిష్కిం. 66.

గగురుపు రూ.చూ. గగుర్పు. వి. రోమాంచం.

గగుర్పడు చూ. గగురు.

గగుర్పాటు చూ. గగురు.

గగుర్పాఱు చూ. గగురు.

గగుర్పు చూ. గగురు. రూ. గగురుపు. వి. రోమాంచం. చంద్రాంగ. 6.142.

గగుర్పొడమించు చూ. గగురు.

గగుర్పొడము చూ. గగురు.

గగుర్పొడుచు చూ. గగురు.

గగుర్పొడుపు చూ. గగురు.

గగ్గ[1] వి. చెవిదగ్గర లేచే కురుపు.

గగ్గ[2] వి. పొట్ట.

గగ్గ[3] వి. కోడిముడును, ఒకరకం చిన్నమొక్క (Petalidium-barberioides).

గగ్గటిల్లు రూ. గగ్గతిలు, గగ్గతిల్లు. అ.క్రి. కంపించు. సుద. 5.58.

గగ్గతిలు రూ.చూ. గగ్గటిల్లు. అ.క్రి. వణుకు, కంపించు.

గగ్గతిల్లు రూ.చూ. గగ్గటిల్లు. అ.క్రి. వణుకు, కంపించు.

గగ్గర రూ.చూ. గగ్గెర[1]. వి. పక్షి విశేషం.

గగ్గరు వి. బిక్కిచెట్టు, మందుల్లో ఉపయోగపడే జిగురునిచ్చే ఒకచెట్టు (Gardeniagummifera).

గగ్గలం విశే. గట్టి, కఠినం.

గగ్గి వి. గింజలులేని కంకి, గింజలురాని కంకి, చచ్చు కంకి.
 గగ్గిగింజ వి. పిప్పిగింజ, గగ్గులనుంచి రాలిన తాలుగింజ. గగ్గితొక్కుళ్ళు వి.బ.వ. గగ్గులనుతొక్కించగా రాలిన గింజలు. గగ్గిదంతె వి. గగ్గులను లాగే కొయ్య పనిముట్టు, కంకిదంతె. గగ్గిపదును వి. కళ్ళంలో ఒకసారి తొక్కించిన కంకులను తిరగ తొక్కించడానికి పరవటం. గగ్గిరాసి వి. పిప్పి రాసి, గగ్గులకుప్ప, గగ్గులలో రాలిన గింజలకుప్ప. గగ్గిరెట్టు వి. ఎద్దుకొమ్ము(ల)కు కుప్పకిందవేసే బోలుఉంగరం. గగ్గిరోమం చూ. గగ్గి. వి. ఒంటిమీద అక్కడక్కడ కుప్పలు కుప్పలుగాఉండే బొచ్చు.

గగ్గిర రూ.చూ. గగ్గెర[1]. వి. పక్షివిశేషం.

గగ్గు[1] పో.చూ. గగ్గురు[1]. వి. గద్గదికం, డగ్గుత్తిక. ఆం.భా. 1.122 ; అ.క్రి. జంకు, సంకోచించు.
 పో.చూ.క. గుక్కు. మాట్లాడేటప్పుడు గట్టిగా గాలిని పీల్చుకొను, ఒక్కసారిగా శ్వాసను పీల్చుకోవటం.

గగ్గు² రూ.చూ. గొగ్గు. వి. వంకర టింకర.

గగ్గురు¹ రూ. గగరు, గగురు. వి. రోమాంచం. ఆం.భా. 1.141.

సం. గద్గద-; ప్రా. గగ్గర-. గగ్గిర. డగ్గుత్తిక, గద్గిదిక కలవాడు. జై. మహా. గగ్గర; అ.మా. గగ్గియ, గగ్గర; అప. దగ్గిర.

క. గుగ్గరి, గొళ్ళు, కొళ్ళు. శరీరం వెంట్రుకలు నిక్కబొడుచుకొను.

<ప్రా. గగ్గర-.

గగ్గురుపొడుచు రూ.చూ. గగురుపొడుచు. అ. క్రి. గగుర్పొడుచు.

గగ్గురు² వి. సీతాఫలంచెట్టు (Annona Squamosa).

గగ్గులకాటగల్పు చూ. గగ్గులు.

గగ్గులకాడగు చూ. గగ్గులు.

గగ్గులకాడు చూ. గగ్గులు.

గగ్గులకాడుగావించు చూ. గగ్గులు.

గగ్గులకాడుచేయు చూ. గగ్గులు.

గగ్గులకాడులుగావించు చూ. గగ్గులు.

గగ్గులు వి.బ.వ. నూర్చిన కంకులు. ఉ.రా. 3.201.

సం. ఘర్ఘరక-. వేయించిన గింజలు; ప్రా. ఘగ్ఘర. పొచి, చెత్త మొ. వాటి పోగు.

త. కక్కు. కంకులు ఈనినట్లుగా బయటకువచ్చు;

<ప్రా. ఘగ్ఘర.

గగ్గులకాటగల్పు స.క్రి. నాశనంచేయు, పాడుచేయు. కాశ. 2.110; గగ్గులకాడగు అ.క్రి. 1. కలతపడు. తాళ్ళ. 2.41; 2. చెల్లాచెదరగు. గగ్గులకాడు విణ. 1. చెల్లాచెదరైన, నిస్సారమైన. హర. 3.10; 2. చెదరగొట్టే. కవిక. 3.229; వి.బొ. ధాన్యంరాల్చిన కంకులరాశి. గగ్గులకాడు గావించు స.క్రి. చంపు. గగ్గులకాడుచేయు స.క్రి. పాడుచేయు. శ్రీరాధా. 5.70; గగ్గులకాడులుగావించు(-కావించు) స.క్రి. వధించు, చంపు ఆం.భా. 3.123. గగ్గులుకావించు స.క్రి. వధించు.

గగ్గెర¹ రూ. గగ్గర. గగ్గిర. వి. పక్షివిశేషం.

గగ్గెర² వి. తులసిమొక్క, సువాసన కలిగి పూజాద్రవ్యంగా ఉపయుక్తమయ్యే ఒకరకం మొక్క. ఉ.రా. 3.201.

సం. గర్గరికా. వృక్షవిశేషం.

క. గగ్గె. సువాసనగల పువ్వులున్న ఒకరకంచెట్టు (Ocimum Sanctum).

<సం. గర్గరికా.

గగ్గెర³ వి. మామూలుగా పందెం ఎద్దుకు, కాలికి తొడిగే వెండి బోలు కడియం.

గగ్గెరకూర వి. పొడవైన కాడలు గలిగిన ద్రాక్షపళ్ళ వాసనిచ్చే ఆకులు గలిగినచెట్టు (Pogosternon plectranthoides).

గగ్గెరగడ్డ వి. ఒకరకం దుంప.

త. కక్కరి.

గగ్గోడు రూ.చూ. గగ్గోలు. వి. క్షోభం, పెద్దగొడవ.

గగ్గోడుపడు రూ. గగ్గోలుపడు, గగ్గోలువడు. అ.క్రి. కలగిపోవు. హర. 6.47.

గగ్గోలగు చూ. గగ్గోలు.

గగ్గోలు రూ. గగ్గోడు. వి. 1. పరాక్రమం, శక్తి. ప్రబంధ. 224; 2. క్షోభం, కలత, అల్లరి. అచ్చ. రా. 6.227; 3. సంతాపం; విణ. అధికమైన, ప్రియమైన.

సం. ఘర్ఘర-. ధ్వన్యనుకరణ శబ్దం; ప్రా. ఘగ్ఘర-శబ్ద విశేషం.

త. కక్కట్టుమ్-, ఇయు-. పెద్దగానవ్వు.

<ప్రా. ఘగ్ఘర-.

గగ్గోలగు అ.క్రి. గందరగోళమగు, గోలఅగు. రసిక. 1.108. గగ్గోలుగ క్రి.విణ. ద్రు. అకస్మికంగ. శుక. 2.215; విణ. 1. అధికంగా. గంధ. 78; 2. గందరగోళంగా. గగ్గోలువడు రూ.చూ. గగ్గోడుపడు. అ.క్రి. కలగు. కవిరాజ. 3.14. గగ్గోలుపుట్టు అ.క్రి. గోలఅగు. నీలా. 3.55. గగ్గోలుపెట్టు స.క్రి. కలచు, బెదరించు. గగ్గోలువడు(-పడు) రూ.చూ. గగ్గోడుపడు. అ.క్రి. 1. క్షోభపడు. కలతనొందు. విష్ణుపు. 3.12. అతిశయించు. కువ.చ. 4.92.

గంగ¹ విణ. పెద్ద క్రి.విణ. ద్రు. బొత్తిగా.

గంగగిన్నె వి. గంగసేరేడు. గంగచిప్ప వి. పెద్ద ముత్యపుచిప్ప. గంగడోలు వి. 1. ఆవులకు, ఎద్దులకు మెడ కింద వేలాడే పెద్దతోలు. హరి. పూ. 5.142; 2. పెద్ద డోలు. ఆం. భా. 3.47. క. గంగదొవల్. గంగనేరేడు వి. ఒకరకం నేరేడుచెట్టు. గంగపెట్టె వి. విరదాళ్ళు ఉంచి కొలువుల్లో పూజించే, పల్లత్తో అల్లిన పెట్టె. గంగరాయి వి. 1. ఆములో రెండు పొవ్వులకు మధ్యనిలిపిన నిలువు రాయి; 2. బావి అడుగుభాగం కట్టుబడికి వాడేరాయి. గంగరావి¹ వి. వృక్షవిశేషం, బ్రహ్మదారువు. ఆం.భా. 2.42 (Michelia champaca); గంగరావి² వి. గంగరేగు చెట్టు, ముదురు ఎరుపు రంగు కలవనిచ్చే ఒకరకం చెట్టు (Thespesia populnea), గంగరేగు రూ. చూ. గంగరేను¹. వి. 1. వృక్షవిశేషం, పెద్దరేగు. ఆం. భా. 2.45 (Zizyphus Jujuba.); 2. అందం కోసం పెంచే పెద్దచెట్టు (Thespesia populnea-can). గంగరేను¹ రూ. గంగరేగు, గంగరేని. వి. వృక్షవిశేషం, పెద్దరేగు. కాశ. 3.69 (Zizyphus jujuba). గంగరేను² వి. గంగరావి చెట్టు, ముదురుఎరుపురంగు కలప నిచ్చే ఒకరకం చెట్టు (Thespesia populnea). గంగరేని రూ.చూ. గంగరేను¹. వి. గంగరేగుచెట్టు. గంగరే వాకు చూ. గంగరేగు. వి. పసుప్పచ్చటి పూలు, గోధుమ వన్నె గరకుబెరడుగల చెట్టు. గంగవాడిజల్లు. వి. గుర్రం ఆభరణ విశేషం, గంగవెర్రి రూ.చూ. గంగవెట్టి. వి. ఒకరకం నరాలజబ్బు. గంగవెట్టి రూ. గంగవెర్రి. వి. గంగమ్మ వెర్రి. గంగవెఱ్ఱులు వి.బ.వ. మితంలేనంత తీవ్రత. గంగవెఱ్ఱులెత్తు అ.క్రి. అత్యావేశపూరితుడగు. గంగనరంకమ్మి వి. ఒకరకం పెద్దకమ్మి. గంగనరంచీర వి. అంచుల్లో ఎరుపు (తాకీ) మధ్య నీలిపెట్టినేసిన ఒకరకం చీర. గంగపానివడ్లు వి.బ.వ. ఒకరకంవడ్లు. గంగసింధూరము వి. బొట్టుపెట్టుకోడానికి ఉపయోగించే ఒకజాతి సింధూరం.

**గంగ**[2] వి. నీరు.
సం. *గంగా*. ఒకనది, ప్రవాహం, నది.
క. *గంగె*. నీళ్ళు. గంగానది ; త. *కంకై*.
<సం. గంగా (అర్థవిపరి.).
గంగజాతర వి. వర్షంకోసంచేసే గంగాదేవిపూజ. గంగవమ్మ రూ.చూ. గంగమ్మ. ఒకగ్రామదేవత. నీలా. 1.113. గంగమరు(గులు వి.బ.వ. గంగలోని నురుగుల లాగఉండే భక్ష్య విశేషం. ప్రభు. 4.150. షు. 19పం. గంగపాయల (కూర) రూ. గంగపాయిల (-కూర) వి. తెలంగాణాలో విస్తారంగా ఉపయోగించే ఆకుకూర. (Partulasa olerace Lim); గంగపాయిలు (-కూర) రూ.చూ. గంగపాయల (కూర). వి. తెలంగాణాలో విస్తారంగా ఉపయోగించే ఆకుకూర. గంగపాలగు అ.క్రి. నశించు. గంగపాలుచేయు స. క్రి. సర్వనాశనంచేయు. గంగపావిలి చూ. గంగపాయల (కూర). వి. తెలంగాణాలో విస్తారంగా ఉపయోగించే ఆకుకూర. గంగబాన వి. హరిజనులు వాడే అరివేణిబాన. గంగభరాయించు స.క్రి. కల్లుతాగు. గంగమయిల రూ. గంగమైల. వి. 1. నలుపు ; 2. పసుపుకలిసిన రంగుకలది. గంగమయిలావు రూ. గంగమైలావు. వి. నలుపు, పసుపు వర్ణంగల ఆవు. గంగముట్టు స. క్రి. నీరుముట్టు. గంగమూకలి వి. బండారుమూకుడు, జాతర్లలో బండారు పోసిపెట్టేమట్టి మూకుడు. గంగమైల రూ. చూ. గంగమయిల. వి. ఒకరకం కపిలవర్ణం. గంగమైలావు రూ. చూ. గంగమయిలావు. వి. పసుపు నలుపు కలిగినరంగు కల ఆవు. గంగమ్మ రూ. గంగవమ్మ, గంగానమ్మ, గంగారమ్మ. వి. 1. గంగానది. భీమ. 4.175 ; 2. గ్రామదేవత. <సం. గంగా+అమ్మ గంగలో(గలుపు స.క్రి. వ్యర్థంచేయు, పాడుచేయు. గంగలో( దోలు (-తోలు) స.క్రి. వదిలివేయు.

**గంగ**[3] వి. ఉత్తరదిక్కు.
గంగమొగరం వి. శాస్త్రపద్ధతిలో చెక్క గృహనిర్మాణానికి ఓం ప్రథమంలో ఈశాన్యంమూలను పాతేకొయ్య.

**గంగాజలాలు** వి.బ.వ. అక్కుళ్ళు, ఒకరకంవడ్లు.

**గంగాధరంచు** వి. నాలుగురంగులు పెట్టినేసిన ఒకరకం అంచు.

**గంగానమ్మ** రూ.చూ. గంగమ్మ. వి. 1. గ్రామదేవత ; 2. గయ్యాళి, గంపగంగానమ్మ ; 3. నీలితొట్లదగ్గర, గోడలమీద పెట్టిన బొట్టు, అమ్మవారిగుర్తు.
గంగానమ్మచీర వి. ఒకకమ్మికొగరు, మరొకటి నీలిరంగుల్లో పెట్టినేసిన చీర.

**గంగాబొండము** చూ. గంగ[3]. వి. నీళ్ళు ఎక్కువగా ఉన్న ఒక రకం కొబ్బరిబొండం.

**గంగాభాగీరథీసమానాలు** చూ. గంగ[2]. వి. వితంతువులను ప్రస్తావించేటప్పుడు, వారికి ఉత్తరాలు రాసేపట్ల పేరుకి ముందు ఉపయోగించే పలుకుబడి. పవిత్రురాలని భావం.
సం. *గంగాభాగీరథీసమానా*-గంగతోసమానమైనస్త్రీ.
<సం. గంగాభాగీరథీసమానా + ఆలు (అర్థవిపరి.).

**గంగారమ్మ** రూ.చూ. గంగమ్మ. వి. గంగానమ్మ, గ్రామదేవత.

**గంగాళం** రూ.చూ. గంగాళము. వి. 1. నీళ్ళు నిల్వచేసుకోడానికి వాడేమట్టిపాత్ర ; 2. పెద్దరాగిపాత్ర.

**గంగాళచిప్ప** వి. ముత్యపుచిప్ప.

**గంగాళము** రూ. కంగాళము, గంగాళం. వి. 1. భోజనపాత్రం. వేంక. పంచ. 4.456 ; 2. మూతివెడల్పున్న పెద్దపాత్ర. శుక. 3.103. ఆం. భా. 2.246.
హిం. *గంగాల్*. నీళ్ళుపోసుకొనే పెద్దపాత్ర ; మరా. *గంగాళ*. వృత్తాకారంగా ఉన్నలోహపాత్రం.
క. *గంగాళ*. భోజనపాత్రం, మూతివెడల్పున్న పెద్దపాత్ర.
<మరా. గంగాళ.

**గంగావతరణము** వి. ఆభరణ విశేషం. ద. హిం. శా. సంపు.10. శా. సం. 431.
<సం. గంగావతరణ- (అర్థవిపరి.).

**గంగి** వి. 1. సాధువైనఆవు. బసవ. 3.413 ; 2. గంగిరెద్దు ; 3.యజ్ఞానికతగినది ; 4. గంగమ్మ ; విశ. 1. పూజ్యమైన. భాగ. 9.246 ; 2. సాధువైన. కళా. 7.30.
క. *గంగె గంగమ్మ*. సాధువైనఆవు, పవిత్రగోవు.
గంగికుట్టి వి. సాధువైనఆవు. భాగ. 9.246. గంగిరెద్దవా(డు వి. గంగిరెద్దులను ఆడించేవాడు. గంగిరెద్దు రూ. గంగెద్దు. వి. గంగెద్దు, దేవవృషభం, దానరులు అలంకరించి ఆడించే ఎద్దు. రామలిం. శ. 10. గంగిరెద్దువేషము వి. ఆడంబరమైన వేషం, గంగిరెద్దుసొమ్ములు వి.బ.వ. ఆడంబర సూచకాలు. కుక్కు. 59. గంగులు వి.బ.వ. ఆవులు. గంగెద్దు రూ.చూ. గంగిరెద్దు. వి. 1. దేవవృషభం, దానరులు అలంకరించి ఆడించే యెద్దు ; 2. అన్నిటికీ తలఊపేవాడు, పల్లెటూరి మనిషి, వట్టివేషాడంబరం కలవాడు. గంగెద్దుచేప వి. మత్స్యవిశేషం. గంగెద్దువాట వి. బాలుర(క్రీడా విశేషం. హంస. 3.146.

**గంగిరేగుచెట్టు** చూ. గంగరే(గు. వి. పెద్దకాయలుకాసేరేగుచెట్టు

**గంగిరేణి** వి. రేగిజాతికి చెందినముళ్ళ చెట్టు.

**గంగురు** వి. పచ్చనిపూలు పూసే వైద్యంలో ఉపయోగపడే ఒకమొక్క (Caseniatomentosa).
గంగురుచెట్టు వి. వృక్షవిశేషం.

**గంగులు** చూ. గంగి.

**గంగెద్దు** చూ. గంగి.

**గంగెద్దుచేప** చూ. గంగి.

**గంగెద్దువాట** చూ. గంగి.

**గంగ్గా** అవ్య. కాబట్టి.

**గచ్చ**[1] రూ.చూ. గ్రచ్చ. వి. పసుప్పచ్చపూలు, గుండ్రంగాలేత బూడిద రంగులో ఉండేకాయలుగలముళ్ళమొక్క. వేమ. 2.7 (Caesalpina bonducellaflem).
క. *గజుగ, గజ్జుగ* ; త. *కళల్, కళిచ్చి, కళన్-కాయ్-కెచ్చక్కాయ్*.
గచ్చకలరు వి. నిమ్మెంటురంగుమాదిరివన్నె, గచ్చకాయ రంగు. గచ్చకాయ వి. యక్షాక్షి, శలాటువు. త. కెచ్చక్కాయ్. గచ్చకాయ. గచ్చకాయరంగు వి. లేతబూడిదవన్నె. గచ్చకాయరంగురాయి వి. ఎర్రమొరంరాయి, నున్నపురాయి. గచ్చకాయలకుండ వి. వాగుడుకాయ, గయ్యాళి. గచ్చకాయలాట వి. బాలక్రీడావిశేషం. గచ్చకాయలు వి.బ.వ. బాలక్రీడా

విశేషం. ప్రబంధ. 613. గచ్చతీఁగ వి. లతా విశేషం.

గచ్ఛ² వి. గురుపరివారం, జైనాచార్యుని శిష్యవర్గం.

గచ్చంగి వి. పొదవైన ముళ్ళుకలిగిన ఒకచెట్టు, దంతిచెట్టు. (Gymnosporia montana).

గచ్చు¹ వి. 1. కాంతి. హరి. పూ. 6.116 ; 2. కట్టుబడికి పనికి వచ్చే ఇసుక కలిపిన సున్నం. మను. 5.40 ; 3. బంగారం, సున్నం మొ. వానిపూత. ఆము. 4.58 ; 4. నీళ్ళుకోరు కోడానికి కట్టిన తొట్టి.

క. గచ్చు. సిమ్మెంటు, గార.

హిం. గచ్. గార, సున్నం ; మరా. గచ్చి. సున్నపు నేల ; ఉ. గచ్. సున్నంచేసిననేల ; పార. గచ్. చూర్ణ లేపనం, సున్నపునేల.

<ఉ. గచ్.

గచ్చుకటకం వి. సున్నపుకట్టుబడి. గచ్చుకొను¹ అ.క్రి. అంటివుండు. గచ్చుచేయు స.క్రి. సున్నంచేగారచేయు.

గచ్చు² రూ. గ్రచ్చు. వి. 1. కపటం ; ప్రబంధ. 780 ; 2. దంభం, డాబు. వేణు.శ. 17 ; 3. అబద్ధం. విశ. మింగబడిన, కొతుకు. ఆం.బా. 1.118.

సం. గ్రస్త-. మింగబడిన.

<సం. గ్రస్త-.

గచ్చుకొను² స.క్రి. 1. పట్టుకొను ; 2. వాయురోగం, మొ. వానిచే బిగిసికొను. గచ్చుగ క్రి. విశ. ద్రు. కపటంగ. హంస. 2.124. గచ్చుతనము వి. నటన, టక్కరితనం. గచ్చువడు రూ.చూ. గచ్చువడు. అ.క్రి. 1. లోపించు ; 2. తగ్గు. గచ్చుపిచ్చగు అ.క్రి. అస్తవ్యస్తమగు. గచ్చులాడి వి. 1. స్త్రీ. అహల్యా. 1.72 ; 2. మాయలాడి అయిన స్త్రీ. లక్ష్మీ. వి. 2.76. గచ్చులిడు స.క్రి. బడాయిచెప్పు. <గచ్చు² + - లు + ఇడు. గచ్చువడు (- వడు) రూ. గచ్చువడు. అ.క్రి. 1. లోపించు. శివలీలా. 2 ; 2. తగ్గు. గచ్చువిచ్చగు అ.క్రి. 1. కార్యం వికలమగు ఆం. శే. 9 ; 2. వికలమగు. కృష్ణ. వి. 3.39. <గచ్చు² విచ్చు + అగు. గచ్చువిచ్చు వి. 1. కలత ; 2. తారుమారు.

గజ విశ. పెద్ద. పండి. చ. 5.358.

సం. గజ-. ఏనుగు.

<సం. గజ-.

గజచివ్ని వి. దంతిమొక్క, ముళ్ళుకలిగిన ఒకమొక్క (Gymmosporia moutana). గజదండ వి. మల్ల విద్యావిశేషం, పన్నెండు దండల్లో ఒకటి. హంస. 1.206. గజదొంగ వి. పెద్దదొంగ, గొప్పదొంగ, జగదొంగ వర్ణవ్యత్యయంవల్ల గజదొంగ అయింది అని కొందరు. గజనిమ్మ వి. 1. పెద్దనిమ్మ, లకుచం. ఆం. బా. 2.42 (Citrus pennisesiculata) ; 2. కడప ప్రాంతంలో చీనీ అనే మేలుజాతి తియ్యనిమ్మ ; 3. పొడవైన నిమ్మ, కోలనిమ్మ ; 4. పెద్ద నిమ్మకాయ, కర్నెకాయ. గజబొంకు వి. పెద్ద అబద్ధం. గజబొంకు బొంకు స.క్రి. పచ్చి అబద్ధమాడు. గజముచ్చు రూ. గజిముచ్చు వి. కొల్లగాడు, పెద్దదొంగ. గజయీఁత (- ఈఁత) రూ. గజీత. వి. గొప్ప ఈత. గజీత రూ.చూ. గజయీఁత. వి. గొప్పఈత.

గజం¹ రూ.చూ. గజము¹ వి. 1. మూడు అడుగులు ; 2. గజం పొడవుండే కొలతబద్ద ; 3. లావాటి చువ్వ.

గజంరాయి వి. గోడలు కట్టేటప్పుడు చిన్న ఇటికలను, రాళ్ళను మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలం కోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి. గజంసర్ద వి. గజం పొడవు కంకి ఉండే సజ్జరకం. గజంకట్టె వి. గజం పొడుగున్న బద్ద. గజంకఱ్ఱ వి. గజం పొడుగున్న బద్ద. గజంచెక్క వి. గజం పొడుగున్న బద్ద. గజందబ్బ రూ. గజం బద్ద, గజెందబ్బ. వి. గజం పొడుగున్న బద్ద, గజంబద్దయొక్క వర్ణవ్యత్యయ శబ్ద రూపం. గజంపుల్ల వి. గజం పొడుగున్న బద్ద. గజంబద్ద రూ.చూ. గజందబ్బ. వి. కొలతకు, సున్నం పూత సమమట్టంలో ఉంచేందుకు బేల్దారులువాడే సాధనం.

గజం² వి. అడ్డచీల, ఏతపుబొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ.

గజగజ వి. వణకడంలోని ధ్వన్యను కరణం. నవనాథ. 3.226. వు. 17 పం.

గజగజలాడు అ.క్రి. భయంచే వణకు.

గజమ రూ.చూ. గజము². వి. 1. మోనం ; 2. డాబు.

గజపతిలాగీలు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

గజపునుడి వి. మూపురం మీద ఉండే నుడి.

గజము¹ రూ. గజం¹. వి. 1. ఇనపసలాక, తుపాకిలో మందు దట్టించే ఇనపకడ్డీ. 2. మూడు అడుగుల కొలత.

నే. గజ్. పెడల్పు. ఇనపసలాక ; హిం. ఉ. గజ్. మూడడుగుల కొలపరిమాణం.

క. గజ. రెండడుగుల కొలపరిమాణం, కొలబద్ద, మూడడుగుల కొలపరిమాణం, ఇనపసలాక ; త. కచమ్.

<ఉ. గజ్.

గజాలగేటు వి. ఇనపకమ్మలతో తయారైనగేటు.

గజము² రూ. గజను. వి. మోనం.

గజరా వి. చేతికి వేసుకొనే పూలకంకణం.

నే. గజరా. పూలగుత్తి. హిం. గజ్‌రా. పూలదండ.

<హిం. గజ్‌రా.

గజరుగజరులుపోవు (- పోవు) అ.క్రి. 1. పులకరించు. ప్రబోధ. 3.46 ; 2. నలిగిపోవు.

గజవాళము వి. ఒక దినుసుబట్ట.

గజస్నానము వి. వ్యర్థం.

సం. గజస్నాన-. ఏనుగుస్నానం.

<సం. గజస్నాన -. (అర్థవిపరి.).

గజాలగేటు చూ. గజము¹.

గజాలు వి.బ.వ. దవడకీళ్ళు.

గజిబిజి రూ. గసిబిసి. వి. 1. తమకం, ఉద్రేకం. భార. విరా. 3.131 ; 2. క్షోభం, కలత, కలవరం. భార. భీష్మ. 2.33 ; 3. గ్లానత, వాడిపోవటం. హరి. ఉ. 5.270 ; 4. సందడి, ప్రాణి సమీపధ్వని. కళా. 8.73 ; 5. పీడ, భాగ.రాజ.చ. 3.83 ; 6. అల్లరి. శశా. 5.127 ; 7. దైన్యం. విశ. 1. కలవరమొందిన. భాగ. 8.534 ; 2. పోయిన. నరస. 2.76 ; 3. నలగిన. కువ. చ. 3.54.

క. గజి, గజిబిజి. అస్తవ్యస్తం, కలత, కలవరం.

గజిబిజిచేయు స.క్రి. గందరగోళంచేయు. కాశీ. 6.179. **గజిబిజించు** అ.క్రి. కలవరపడు, కలతపడు. ఉ. హరి. 3.78; స.క్రి. గడబిడచేయు. ద్వి. భాగ. 3.51. **గజిబిజిపడు** అ.క్రి. కలతనొందు. భాగ. 8.534. **గజిబిజిపుట్టు** అ.క్రి. గందరగోళమగు. పండి. ద. 4.198. **గజిబిజియగు** (-అగు) అ.క్రి. కలవరమగు.

**గజిముచ్చు** రూ.చూ. గజముచ్చు. వి. గరిడిముచ్చు, పెద్ద దొంగ.

**గజీక** చూ. గజ.

**గజెం** చూ. గజం[1]. వి. 1. ఊత్తెను నిలబెట్టే తాడుతో బిగించటానికి నేలలో పాతిన ఇనపగూటం; 2. మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల; 3. ఎదురుదోనె బెజ్జంలో దూర్చే ఇనపగూటం; 4. రంగుల అద్దకంలో నూలు లడీలు తగిలించే ఇనపఊచ.

**గజెంకొయ్య** వి. అనుపోసిన నూలు (పడుగు) గజం పొడుగు ఎక్కువరావటానికి బిగించిన కొయ్య. **గజెంగుర్తు** వి. అచ్చుతికిన పడుగుమీద, కొలతలనుబట్టివేసిన గుర్తు. **గజెందబ్బ** రూ.చూ. గజందబ్బ. వి. అచ్చుతికిన పడుగు మీద గుర్తులుపెట్టటానికి కొలత చూచుకొనే బద్ద.

**గజేంద్రంపేటు** వి. అంచులో ఏనుగులబొమ్మలు వరసగా నేసిన డిజైను.

**గజ్జ** వి. తొడసందు, వంక్షణం. భాస్క.రా.సుందర. 308.

క. గెజ్జె. తొడసందు, వంక్షణం.

**గజ్జదుముకు** వి. మల్ల విద్యావిశేషం. ప్రబంధ. 78.

**గజ్జి** వి. కచ్చువు, తీటకురుపు. ఆం.భా. 2.129.

పో.చూ. సం. *ఖర్జూ*; *కచ్ఛూ*. చర్మరోగ విశేషం. ప్రా. *కచ్చు*, *కచ్ఛూ*; పా. *కచ్చు*.

క. *కజ్జి*, *గజ్జి*; కొడ. *కజ్జి*; తు. *గజ్జి*; కుఇ. *కపె*; పర్జి. *కగ్జ*; కుడు. *ఖ్గపా*.

<ప్రా. కచ్చు.

**గజ్జిగాడు** వి. వదలకుండా వెంటతగిలేవాడు. **గజ్జిపట్టు** అ.క్రి. గజ్జికురుపులులేచు.

**గజ్జికట్టు** రూ.చూ. గజ్జెకట్టు. స.క్రి. నాట్యం నేర్చుకోడానికి ప్రారంభించు.

**గజ్జియ** రూ.చూ. గజ్జె. వి. క్షుద్ర ఘంటావిశేషం, ఒకరకం చిన్న గంట. ద్వి. పరమ. 1. 34 పు.

**గజ్జిరాయి** పో.చూ. గజ్జి. వి. 1. గరుసురాయి (Calcite Kantar); 2. మేగ్నెటైట్ అని సాంకేతికంగా పిలవబడే నల్లని ఇనపఖనిజంతో కలిసిన 'క్వార్ట్జ్' రాశిభేదం.

**గజ్జిరాయిగుండు** వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వకిందికి జారకుండా దారంకట్టి, దండె అవతలకు వేలాడదీసిన గుండ్రటిరాయి.

**గజ్జు** వి. 1. మదం, మత్తు, గర్వం. పాండు. 4.37; 2. ఆధిక్యం; 3. అవసరం; 4. ధ్వన్యనుకరణ శబ్దం.

సం. *గర్జా*. *గర్జన*; ప్రా. *గజ్జ-*.

<ప్రా. గజ్జ-.

**గజ్జుగొలయు** అ.క్రి. కుదించు, పొగరెక్కు. సాంబో. 1.177. **గజ్జుపట్టు** అ.క్రి. గర్వించు, మదించు. ప్రభు. 4.13. **గజ్జుమను** అ.క్రి. భయపడు. **గజ్జురేగు** అ.క్రి. మదించు. పాండు. 4.37. **గజ్జులాడు** వి. గర్వి. మదించినవాడు. హర. 7.61.

**గజ్జూరము** రూ.చూ. కజ్జూరము. వి. ఖర్జూరము (Phoenix dactylibera phoenix paludosa).

**గజ్జె** రూ. గజ్జియ. వి. 1. క్షుద్ర ఘంటావిశేషం, ఒకరకం చిన్నగంట; ఉ.రా. 1.184; 2. మువ్వ ఆకారంలో నేసిన డిజైను; 3. గూన మూతిదగ్గరచేసిన నగిషీపని.

సం. *గర్జిత-*. ధ్వనించేది; ప్రా. *గజ్జియ*. ధ్వని చేసేది.

క. *గజ్జె*; కొడ. *గజ్జె*; తు. *గజ్జ*, *గజ్జె*; త. *కచ్చె*, *కెచ్చమ్*; మ. *కెచ్చ*; కోట. *గెజ్*.

<ప్రా. గజ్జయ.

**గజ్జెకట్టు** రూ. గజ్జికట్టు. స.క్రి. నాట్యం నేర్చుకొను. **గజ్జెగొలుసు** వి. స్త్రీల కాలిపట్టా, పాజేబులు. **గజ్జెగోపురం** వి. గజ్జెపలక (ఒకరకం చేతిమగ్గం పలక) కు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం. **గజ్జెపలక** వి. ఒకరకం చేతిమగ్గం పలక. **గజ్జెపూతంచు** వి. గజ్జెల పువ్వుల ఆకారాల్లో డిజైను నేసిన అంచు. **గజ్జెలకడవ** వి. పై అంచుకు పూజలు పెట్టిన మట్టిపాత్ర. **గజ్జెలకాడ** వి. గిలిగిచ్చచెట్టు (Crctolaria Sericea, Rty, Crotolaria, Verracosa. Sinn); **గజ్జెలకుండ** వి. పై అంచుకు పూజలుపెట్టిన మట్టిపాత్ర. **గజ్జెలగుఱ్ఱము** వి. 1. తెగతిరిగే బోగంసాని; 2. ఎవరిని లెక్కచేయకుండా మాట్లాడే స్త్రీ; 3. సందడిచేసే వ్యక్తి. **గజ్జెలవడ్డెడ** వి. స్త్రీలు మొలకు గుత్తంగా ధరించే నగ. **గజ్జెలపేటు** వి. అంచులోనేసే గజ్జెలవరస డిజైను. **గజ్జెలాకు** వి. గిలిగజ్జచెట్టు **గజ్జెల్తొట్టి** వి. అంచుకు పూజలుపెట్టిన పూలతొట్టి.

**గజ్జెకాయ** రూ.చూ. కజ్జికాయ. వి. ఒకరకం తీపిపిండి వంట.

**గజ్జెలచెక్క** వి. గొడుగు చెక్కకూ ఉత్తరానికీ మధ్య వేసే చెక్క.

**గంజ**[1] వి. కృషికి యోగ్యమైన భూమి.

హిం. ఉ. *గంజ్*. ధాన్యపుబజారు.

**గంజ**[2] రూ.చూ. గంజరి. వి. జనపమొక్క, నారకోసం పెంచబడే మొక్క (Canbissativa).

**గంజటిక** చూ. గంజి[1].

**గంజన** వి. బాలక్రీడావిశేషం.

సం. *ఖంజన-*. కుంటుతూ నడవటం; *ఖంజపాద-*, ఒక కాలితో కుంటడం. ప్రా. *ఖంజ-*. కుంటుపడు; *ఖంజ*. కుంటటం.

<సం. ఖంజన-.

**గంజనగాలు** (-కాలు) వి. బాలక్రీడావిశేషం. ఆం.భా. 2.307.

**గంజమ్మవారు** చూ. గంజి[1].

**గంజరి** రూ. గంజ[2]. వి. జనపమొక్క, నారకోసం పెంచబడే మొక్క (Canabissativa).

**గంజలము** వి. పంచితం, మూత్రం.

**గంజా** రూ.చూ. గంజాయి. వి. 1. మత్తు కలిగించే ద్రవ్య

విశేషం. కువ.చ. 1.41 ; **2.** గంజాయిమొక్క ; **3.** గంజాయిమొక్క ఆకు.

**గంజాంమునలమ్మ** వి. మహామారి.

**గంజాయి** రూ. గంజా, గంజావి, గెంజాయి. వి. **1.** గంజాయి పత్తిరితో చేసే పదార్థం, భంగు. శివరా. 3.62. ద్వి. హరిశ్చ. 2.188, 1451 ; **2.** గంజాయిచెట్టు ఆకు. అం. భా. 2.41 , **3.** కైపు పుట్టించే ఆకులున్న ఒకరకం మొక్క. అం.భా. 2.78.

హిం.ఉ. ఘంజా.

క. *గంజి*. గంజాయి ; త. *కంచా* ;

<ఉ. ఘంజా.

గంజాయిచెట్టు వి. కైపుకలిగించే పత్రి కల్గిన ఒకరకం మొక్క.

**గంజారుదాక** చూ. గంజి[1]. రూ.చూ. గంజేర్దాక. వి. గంజి వార్చుకోడానికి వాడే మట్టిపాత్ర.

**గంజార్పటిక** చూ. గంజి[1].

**గంజావి** రూ.చూ. గంజాయి. వి. కైపుకల్గించే మత్తుపదార్థం.

**గంజి**[1] రూ. గెంజి. వి. **1.** అన్నంవార్చిన రసం. ఆము. 6.85 ; **2.** చింతగింజలు పిండి ఉడకబెట్టి వార్చిన నీళ్ళు.

క. *గంజి*, అన్నరసం ; కొడ. *కంజి* ; తు. *గంజి* ; త. *కంచి* ; మ. *కన్ని*. కోట. *కజ్న్* ; తొ. *కొజ్*.

పో.చూ. సం. కాంజిక-కాంజి, కాంచిక-. అన్నం వార్చినగంజి.

హిం. *గంజే*.

గంజటిక రూ. గంజిఅటికె. వి. గంజివార్చడానికి చిన్న దబరాలాగ ఉండే మట్టిపాత్ర. <గంజి[1] + అటిక. గంజమ్మ వారు వి. పెద్దబొబ్బలు లేచేస్ఫోటకం వంటి వ్యాధి. గంజార్పటిక వి. గంజివార్చడానికి చిన్న దబరాలాగ ఉండే మట్టిపాత్ర. గంజిఅటికె రూ.చూ. గంజటిక. వి. పడుగుకు పెట్టటానికి గంజిపోసుకొనే ఒకరకం మట్టిపాత్ర. గంజి అలుకు వి. నరిచేసేటప్పుడు, పడుగుబాగా బిరుసెక్కటానికి పైన చిలికిన గంజి. గంజికాలు వి. వంచినకాలు. గంజికావడి వి. కుర్రవాణ్ణి చెరోరెక్క పట్టుకొని ఎత్తటం. గంజికుండ వి. 1 పల్లనీళ్ళు పోసిపెట్టడానికి వాడే బుంగమూతి మట్టి కుండ ; **2.** గంజితియ్యటానికి అన్నంవండే కుండ ; **3.** గంజిపోసుకొనే మట్టిపాత్ర. గంజికూడు వి. పలచగా ఉడకబెట్టిన పిండి. గంజికొట్టు స.క్రి. పట్టాలువేసే నార పడుగుకు చింతగంజి పట్టించు. గంజిగడ్డ(లు) వి.(బ.వ). పడుగుకుపెట్టే గంజి తయారుచెయ్యడానికి పనికివచ్చే ఒక రకం దుంప(లు). గంజిగుడ్డ వి. **1.** పడుగు తడపడానికి గంజిలో ముంచిన గుడ్డ; **2.** గంజిపోసితోమే గుడ్డ. గంజిగుండ్ర వి. గంజిపోసుకొనే మట్టిపాత్ర. గంజిగురిగె వి. గంజిపోసుకొనే మట్టి పిడత. గంజిగుల్ల వి. నీటిబుగ్గలాగ లేచే బొబ్బ. గంజిగూన వి. గంజిపోసుకొనే తొట్టి. గంజిగోలెం వి. గంజిపోసుకొనే మట్టి తొట్టి. గంజిచట్టి వి. ఒకరకం మట్టి పాత్ర. గంజిచిప్ప వి. గంజిపోసుకొనే చిప్ప. గంజితట్టు స.క్రి. అంబలిపిడచతో, ఉన్నిపడుగుకు (చింతగింజల) గంజిపట్టించు. గంజితరక రూ. గంజితొరక. వి. గంజిమీది మీగడ వంటి పదార్థం. గంజితీడు రూ. గంజితీడ్వు. స.క్రి. గంజి పెట్టిన పడుగును పాయలు పాయలుగా తీసి చేత్తో రుద్దు. గంజితీడ్వు రూ.చూ. గంజితీడు. స.క్రి. గంజిపెట్టిన పడుగును పాయలు పాయలుగా తీసి చేత్తో రుద్దు. గంజితొట్టి వి. గంజిపోసుకొనే మట్టిపాత్ర. గంజితొరక రూ.చూ. గంజి తరక. వి. గంజిమీది మీగడ. గంజిదుంగ వి. గంజిపెట్ట డానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య. గంజిపలక వి. పడుగు పెట్టుకొనే కొయ్య ముక్క. గంజిపిడచ వి. **1.** పడుగు తడపడానికి, గంజిలో ముంచిన గుడ్డ ; **2.** నేతనేసే టప్పుడు బట్టముందు భాగం (వాయి) బిరుసెక్కటానికి గంజిపూసే గుడ్డ ; **3.** గంజిపిడచ పెట్టుకొనే చిన్న మట్టి పాత్ర. గంజిపీచు వి. నేతనేసేటప్పుడు, బట్టముందు భాగం (వాయి) బిరుసెక్కటానికి గంజిపూసేకుంచె, కొబ్బరిపీచు. గంజిపూత వి. పడుగుకు గంజిపట్టించడం. గంజిపెట్టు స.క్రి. గంజిపిడచతో, పడుగుకు గంజి పట్టించు. గంజిపొక్కు వి. పొక్కనపొక్కు. గంజిబండ వి. గంజి అంబలి మొ. వాటితో పడుగు తడపడానికి పరచినరాయి. గంజిబద్దె వి. పడుగు తడపటానికి గంజిలోముంచిన గుడ్డ. గంజిబాన వి. పడుగు పెట్టే గంజిపోసుకొనే మట్టిపాత్ర. గంజిబుగ్గి వి. పొక్కిన పొక్కు. గంజిబొప్పె వి. ఒకరకం మట్టిపాత్ర. గంజిమట్ట వి. నేతనేసేటప్పుడు బట్టముందు భాగం (వాయి) బిరు సెక్కటానికి వాడే గంజిపూసే తాటిమట్ట (కుంచెమాదిరిది). గంజిమండిగె రూ. గంజిమండ్రిగ. వి. వెడల్పు మూతిగల గుండ్రటిమట్టిపాత్ర. గంజిమండ్రిగ రూ.చూ. గంజి మండిగె. గంజిమూకుడు రూ. గెంజిమూకుడు. వి. గంజివార్చే మూకుడు. గంజిమొద్దు వి. గంజిపెట్టటానికి, చుట్టిన పడుగు వేసుకొనే కొయ్య. గంజిపాదు స.క్రి. నరిచేసే టప్పుడు గంజిపెట్టిన పడుగుకు చేత్తో దూసి పిడుచు.

**గంజి**[2] రూ. గంజు[3]. వి. వ్యాపారకేంద్రం.

హిం.ఉ. పార. *గంజ్*. ధాన్యంబజారు.

**గంజిఫా** రూ.చూ. గంజీఫా. వి. ఒకరకం చీట్లాట.

**గంజివంకాయ** వి. వంకాయల్లో ఒకరకం.

**గంజివాటం** రూ.చూ. గండెవాటు. వి ద్వారం కొయ్యచట్రం.

**గంజీఫా** రూ. గంజిఫా. గంజూఫ. వి. ఒకరకం చీట్లాట.

గంజీఫాచీట్లు వి.బ.వ. ఆడేచీట్లపేకలు.

**గంజు**[1] వి. **1.** పెద్దపాత్ర ; **2.** వెడల్పుమూతఉన్న ఇత్తడి గిన్నె ; **3.** నూలుకండెలు వేసుకొనే ఇత్తడిపళ్ళెం.

క. *గంజు*. ఇత్తడిలేక రాగితోచేసిన గుండ్రటి గిన్నెలు, ఒకదాని మీద ఒకటి పేర్చడానికి వీలుగాఉంటాయి.

హిం. *గంజియా*. నిల్వచేయడానికి ఉపయోగించే మట్టి పాత్ర.

**గంజు**[2] వి. పశువులమూత్రం.

క. *గంజల*, *గంజళ*. గుర్రాలు, ఏనుగులు, గాడిదెలు, గొర్రెలు, మేకలు మొ. వాటిమూత్రం.

**గంజు**[3] రూ.చూ. గంజి[2]. వి. కూరలు మొ. అమ్మేవీథి, బజారు.

**గంజూఫ** రూ.చూ. గంజీఫా. వి. పేకాటవంటి ఆట.

**గంజెర** వి. బంజరు నేలల్లోపెరిగే కలుపుమొక్క (Trianthemamonsgna).

**గంజేరి** వి. అడవిశాఖ, కలపగడ్డ రమారమి 20 అడుగులు ఎత్తు పెరిగే కాండం కలిగిపొదలా పెరిగేమొక్క. దీని దుంప విషప్రాయమైనది. కంచెకంపగా ఉపయుక్తం (Golria-superba).

**గంజేరు** రూ.చూ. కలిజేరు. వి. ఒకరకం కలుపుమొక్క.

**గంజేర్దాక** చూ. గంజి[1]. రూ. గంజారుదాక. వి. గంజివార్చు కోడానికి వాడేమట్టిపాత్ర.

**గటక** వి. 1. జొన్నఅన్నం ; 2. పిండితో చేసినజావ, లేప నార్థం నూరి ఉడికించినపిండి.

**గటకచొప్ప** వి. కంపులో ఉన్నగడ్డి.

**గటంకుండ** రూ. గటాకుండ, గటుక్కుండు, గట్కకుండ, ఘటం కుండ. వి. మూతి చిన్నదిగా, కొంచెం పొడవుగా, పొట్ట లావుగా, గుండ్రంగా, బుంగాకారంగా అడుగునన్నంగా, కడ్డీఅంచుతో ఉండేకుండ.

**గటనము** వి. కూర్పు, కలయిక.

సం. ఘటన-. ప్రభుత్వం, కలగటం, కూర్పు.

<సం. ఘటన-.

**గటబుడ్డి** వి. మూతిచిన్నదిగా, కొంచెం పొడవుగా, పొట్టలావుగా, గుండ్రంగా, బుంగాకారంగా అడుగు సన్నంగా కడ్డీఅంచుతో ఉండేకుండ.

**గటయించు** స.క్రి. కూర్చు, రచించు. వేంక. ఆం. 0.32.

సం. ఘట్. కూర్పు, చేర్పు, అనుసంధించు.

<సం. ఘట్ + -. ఇంచు[3].

**గటాకుండ** రూ.చూ. గటంకుండ. వి. ఒకరకం కుండ.

**గటు** అవ్య. అటు, అతట్టు, అవైపు.

**గటుక్కుండ** రూ.చూ. గటంకుండ. వి. అన్నం వండడానికుప యోగించే మట్టిపాత్ర.

**గటువు** వి. కటువు.

**గటె** వి. ఘట్టం, సరుకులు కొనితెచ్చి అమ్మేచోటు, అంగడివీథి. ద. హిం. శా. సంపు. 10, సం. 489.

సం. ఘట్ట -. సుంకంపుచ్చుకొనేచోటు.

<సం. ఘట్ట-.

**గట్కకుండ** రూ.చూ. గటంకుండ. వి. మొక్కజొన్నల పిండిని పోసివంటచేయడానికి వాడేమట్టిపాత్ర.

**గట్కపేర్పు** వి. మొక్కజొన్నల పిండిని పోసి వంటచేయడానికి వాడేమట్టిపాత్ర.

**గట్ట** వి. సిద్దెనోటికి దట్టించేబిరడ.

సం. ఘట్ట-. రాపిడి.

<సం. ఘట్ట-.

**గట్టం** వి. చేత్తోడిశైల్లు అద్దేటప్పుడు బట్టకు నునుపురావటానికి దిమ్మమీద కొట్టేకొయ్య.

**గట్టన** వి. గట్టించటం.

సం. ఘట్టన-; ప్రా. గట్టణ-. గట్టించడం ; పా. ఘట్టణ ;

క. ఘట్టణె, గట్టె.

<సం. ఘట్టన-.

**గట్టనచేయు** స.క్రి. 1. కుండరూపాన్ని తీర్చినతర్వాత గట్టిగా నున్నగా రావడానికి మూడోసారి నునుసలపతో కొట్టు ; 2. దిమ్మసచేయు.

**గట్టము** విశ. గట్టి. కవిక. 2.100.

క. గట్టి. వి. గట్టితనం, బలం, ఒరునుదనం.

**గట్టాలు** వి.బ.వ. బెల్లపుపాకంతో చేసిన తినుబండారం.

**గట్టి** విశ. 1. నిశ్చితమైన, నిజమైన, కేయూ. 3.331 ; 2. కర్కశమయిన, కఠినమైన, మృదువయిన. శృం. నై. 8.139 ; 3. అధికమైన. విక్ర. 1.197 ; 4. దిట్టమయిన. భాగ. 10.690 ; 5. బిగుపయిన, సడలని. మను. 3.83 ; 6. గుల్లకాని, దట్టమైన. తరచైన. శుక. 2.24 ; వి. 1. కటిక. భార. విరా. 2.241 ; 2. శౌర్యం. భార. విరా. 4.184 ; 3. పిల్లలురానుకొనే చెక్కపలకల మీద బొగ్గు పొడిపసరు కలిపిపూసే పూత. శృం. నై. 8.770 ; 4. పొల్లుకానిగింజ. దశా. 9.50 ; 5. ధృతి, ధైర్యం. ఆం. నా. సం. 2.53 ; 6. గట్టితనం, దృఢత్వం ; 7. ఉచ్చైర్వా దంగలది.

క. గట్టి. గట్టితనం, బిరుసుతనం, దట్టం, గట్టివాడు ; తు. గట్టి, గడుసు. గట్టి ; త. కెట్టి. గట్టితనం, బలమై నది ; మ. కట్టి. గట్టిముద్దగా ఉన్నది ; కోట. కట్య్. గట్టి ముద్దగాఉన్నది.

**గట్టికాల్పు** వి. నల్లకాల్పుతో పాత్రలు కొంతతెల్లగా కాలినకాల్పు. **గట్టిగ** రూ.చూ. గట్టిగా. క్రి. విశ. ద్రు. 1. స్పష్టంగా. కళా. 4.126 ; 2. కదలకుండా, నిశ్చలంగా. కళా. 5.152 ; 3. పూర్ణంగా. విష్ణుపు. 1.71 ; 4. నిశ్చి తంగా. హంస. 2.120 ; 5. కఠినంగా. నీలా. 2.28. **గట్టిగా** రూ. గట్టిగ, ఘట్టిగా. క్రి. విశ. ద్రు. 1. శ్రద్ధతో, సావధానంగా. పాండు. 5.50 ; 2. బాగాఆనేటట్లు. దశా. 1.272 ; 3. దూఢంగా ; 4. బిగ్గరగా. **గట్టిచెర** వి. గట్టికైదు. **గట్టిచేయు** స.క్రి. నిశ్చితంచేయు. **గట్టిదెందమువాఁడు** విశ. దీరుడు. **గట్టితనం** వి. సామర్థ్యం. **గట్టిదరి** వి. గట్టిగాఉండే నేల. **గట్టిది** విశ. 1. దట్టమైనది ; 2. బిగువైనది ; 3. కద లికలేనిది ; 4. బిరుసైనది. **గట్టినాణెము** వి. వెండి లేక బంగారునాణెం. **గట్టినేత** వి. పడుగులో పేకదారం పోగులు కలసిపోయేటట్లు చిక్కగానేసిన నేత. **గట్టినేల** వి. గట్టిగా ఉండేనేల. **గట్టిపాఱు** అ. క్రి. గట్టిపడు, బెదురుతీరు. హంస. 5.110. **గట్టిపిండి** వి. పైపిండి. **గట్టిపెట్టు** స.క్రి. 1. రంగు మొ. పూయు. శృం. నై. 8.170. 2. శరీరానికి నలుగు పెట్టు. **గట్టిబంగారు** వి. బంగారుకట్టెలు. **గట్టిబొట్టు** వి. గట్టి సున్న. అప్ప. 2.27. **గట్టిముడి** వి. సులభంగా విడపకుండా రెండుసార్లు వేసేముడి. **గట్టియిడు** స.క్రి. రంగు మొ. పూయు. పాండు 4.80. **గట్టిరాయి** వి. మంచిరాతి, గట్టిగాఉండేరాయి. **గట్టివ** రూ.చూ. గట్టివా. విశ. దుర్మార్గమైన. పారి. 1.127. వి. 1. గయ్యాళి ; 2. దుండగీడు. **గట్టివయమది** రూ.చూ. గట్టివైనది. విశ. ప్రౌఢ. **గట్టివా** రూ. గట్టివ, గట్టివాయి, గట్టువా, గట్టువాయి. విశ. 1 దిట్ట. వరాహ. 6.89 ; 2. మాటకారి. ఉ.రా. 2.215 ; 3. దుష్టుడు. అచ్చ.రా. యు. 161 ; 4. కఠినమైనవాక్కు గలది, ధూర్తురాలు. వి. ధూర్త స్త్రీ. ఆం.భా. 2.117. **గట్టివాచావ** వి. 1. గయ్యాళి ; 2. మిండకత్తె. **గట్టివాఁడు** రూ. ఘట్టివాడు. విశ. దృఢచిత్తుడు.

గట్టివాతపము వి. గయ్యాళితనం, ధౌర్త్యం. చంద్రాంగ. 63. గట్టివాయి రూ.చూ. గట్టివా. వి. ధూర్తస్త్రీ, గయ్యాళి. సారంగ. 3.206. గట్టివెదురు వి. సన్నగా, గట్టిగా, పొడుగ్గా ఉండే రకం వెదురుమొక్క (Bambasstineta dendrocalamustrictus). గట్టివైను వి. 1. పడుచుదనం; 2. ప్రౌఢతనం. గట్టివైనుది రూ. గట్టివయసుది. విణ. ప్రౌఢ. సాంబ. మాన. 13.

గట్టించు పో.చూ. గట్టి. రూ. గెట్టించు. 1. గట్టనచేయు, పూత పూయు. యయా. 5.68; 2. కుండరూపాన్ని తీర్చిన తర్వాత గట్టిగా నున్నగా రావడానికి మూడోసారి నును నలపతో కొట్టు.

క. గట్టిసు. గట్టిపరుచు.

గట్టించుడుచేయు స.క్రి. కుండరూపాన్ని తీర్చినతర్వాత గట్టిగా నున్నగా రావడానికి మూడోసారి నునునలపతో కొట్టు.

గట్టితెర పో.చూ. గట్టి. వి. సారెపలకమీద వేసిన మట్టి ముద్ద.

గట్టినబోది వి. బాలక్రీడా విశేషం. కాశ. 3.33.

గట్టింతనలప వి. ఆరు పదును పాత్రలమీద నునుపూ, గట్టితనం రావడానికి సర్చే నలప.

గట్టిబోది వి. ఒకరకం బాలక్రీడ.

గట్టింపుపదును వి. పాత్రలు చెయ్యడానికి మట్టిని ఎక్కువ మెత్తగా కాకుండా, ఎక్కువ తడిలేకుండా పక్వంగా చేసుకొన్న తీరు.

గట్టింపురాయి వి. కుండలు ఆరిన తర్వాత గట్టించడానికి వాడే రాయి.

గట్టియీత వి. ఈతజాతికి చెందిన ఎడారిచెట్టు (Phoenim paludosa or clatea paludosa).

గట్టిల్లు అ.క్రి. సమకూడు, సంభవించు, ఘటిల్లు. బసవ. 4.643.

క. గడిసు. కలుగు, దగ్గరకుచేరు, సంభవించు.

పో.చూ.హిం. ఘట్ నా. కలుగు, సంభవించు.

సం. ఘట్-.

గట్టివాలు రూ. గట్టువాలు. వి. సైరంధ్రీ జాతి స్త్రీ. ఇతరుల ఇళ్ళల్లో గంధ పుష్పాదులచే అలంకరించే స్వతంత్ర స్త్రీ, గంధ పుష్పాదులమ్మే స్త్రీ. భార. విరా. 1.288, 299.

క. గట్టి. పరిమళ ద్రవ్యాల ఉండ; -వళ్లి. స్త్రీ ప్రత్యయం; గట్టివళ్లి. సైరంధ్రి.

గట్టివాల్పోటులు వి.బ.వ. పుష్పలావికలు.

గట్టివాల్పోటులు చూ. గట్టివాలు.

గట్టు వి. 1. పర్వతం. రామా. 6.92; 2. తీరం, ఒడ్డు. ఆం. భా. 3.53; 3. రెండు పొలాలమధ్య హద్దుగా వేసిన మట్టి గట్టు; 4. మాగాణిలో మడికి, మడికి మధ్య వేసిన చిన్న మట్టికట్ట; 5. బావిచుట్టూ కట్టిన పొట్టిగోడ; 6. బావిచుట్టూ కట్టిన అరుగు; 7. గట్టిగా ఉండే నేల; 8. చెరువు మొ. వాటికట్ట; 9. గట్టునమ్మెటలోని గుంటలో బిగించే పదునైన ఉక్కుముక్క.

క. గట్టు. పర్వతాల సమూహం, ఎత్తైన ప్రదేశం; గట్టిరకెళగె. పడమటితీరం; తు. కట్టు. ఆనకట్ట; త. కట్టై; మ. కెట్టు; కోట. కట్ (-కచ్). కట్టు, నిర్మించు; తొద. కొట్. కట్టు, నిర్మించు; గోం. కట్టా. చేపలుపట్ట డానికి అడ్డంగా వేసిన కట్ట; పర్జి. కట్ట్. కట్టు, నిర్మించు; కొలా. కట్, కట్టు. ఆనకట్ట; గద. కట్. కట్టు, బంధించు, నిర్మించు.

పో.చూ.సం. ఘట్ట-. నద్యాదుల రేవు; ప్రా. ఘట్ట-. నదీఘట్టం.

గట్టుచాటునిక్షేపము వి. పర్వతం ఉండేనిది (అసాధ్యం, వశంకానిది అని భావం). కవిరా. 3.48. గట్టుచూలి వి. పార్వతి, గుబ్బలిపట్టి. గట్టుచేర్చు స.క్రి. కష్టాలనుంచి బయట పడవేయు, దరిచేర్చు. గట్టుకాలువు రూ. గట్టుతాల్పు. వి. నగధరుడు, విష్ణువు. ఉ.రా. 2.50. గట్టుతాల్పు రూ.చూ. గట్టుతాల్పు. వి. కృష్ణుడు, విష్ణువు. గట్టుతూము వి. నీళ్ళు ప్రవహించడానికి ఒక అడుగు వెడల్పు, మూరెడు పొడవులో పొలంగట్లకు అమర్చే మట్టిగొట్టం. గట్టుత్రిమ్మరి రూ.చూ. గట్టుఁద్రిమ్మరి. వి. కోతి. గట్టుదాయ వి. గోత్రభిత్తు, దేవేంద్రుడు. అచ్చ.రా. 5.13. గట్టుదారి వి. గట్టుతాల్పు, కృష్ణుడు. గట్టుదొరవట్టి వి. 1. పార్వతి; 2. మైనాకుడు. గట్టుఁద్రిమ్మరి(-త్రిమ్మరి) రూ. గట్టుత్రిమ్మరి. వి. మలత్రిమ్మరి, వానరం, కోతి. అచ్చ.రా. సుందర. 128, 129. గట్టుపట్టి వి. 1. పార్వతి. వరాహ. 9.58; 2. మైనాకుడు. అచలా. 3.41. గట్టుపట్టు అ.క్రి. పాడయిపోవు. గట్టుపడు అ.క్రి. నేతలో పోగులో ముద్దగాపడు, బట్టలో కొంత చిక్కగా నేసినపుడు, మిగిలిన నేతలో తేడావచ్చు. గట్టుబండ వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి. గట్టుమొగ వి. ఆము పొయ్యి, దగ్గరగాపేర్చిన బాడీలు, గోలేలు మొ. పాత్రలు. గట్టురాకొమరిత రూ. గట్రాకొమరిత. వి. పార్వతి. గట్టురాకొమరుఁడు రూ. గట్రాకొమరుఁడు. వి మైనాకుడు. గట్టురాచూలి రూ. గట్రాచూలి. వి. హిమవత్పుత్రి, పార్వతి. రాజ. చ. 2.89. గట్టురాజల్లుడు రూ. గట్రాజల్లుడు. వి. శివుడు. రామాభ్యు. 1.43. గట్టురాజు రూ. గట్రాజు. వి. హిమవంతుడు. గట్టురావట్టి వి. పార్వతి. గట్టురాయి వి. 1. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతినరాయి; 2. కండెరాయి, మేగ్నటైట్ అని సాంకేతికంగా పిలవబడే నల్లని ఇనప ఖనిజంతో కలిసిన 'క్వార్ట్జ్' రాతి భేదం. గట్టురౌతు వి. గట్టురాయి, హద్దురాయి. గట్టులయెకిమీఁడు(-ఎకిమీఁడు) రూ. గట్లయెకిమీఁడు. వి. హిమాలయ పర్వతం. రామరా. 213. గట్టులరాయఁడు రూ. గట్లరాయుఁడు. వి. హిమాలయం. సాంబ. 55. గట్టులతేఁడు రూ. గట్లతేఁడు. వి. హిమవంతుడు. గట్టువకాఁడు వి. కూరుడు. గట్టువకాను వి. కూరుడు. గట్టువతనము వి. గొంటుతనం. గట్టువరం వి. మాగాణి పొలంచుట్టూ ఎత్తుగావేసిన మట్టికట్ట. గట్టువిలుకాఁడు రూ. గట్టువిల్కాఁడు. వి. శివుడు. అచ్చ. రా. సుందర. 152. గట్టువిల్కాఁడు రూ. చూ. గట్టువిలుకాఁడు. వి. శివుడు. గట్టువిలుతుఁడు రూ. గట్టు విల్తుఁడు. వి. శివుడు. ఆం. నా. దేవ. 6. వ్యు. మేరు పర్వతాన్ని విల్లుగా చేసుకొన్న

వాడు. గట్టువిల్తు(డు రూ.చూ. గట్టువిలుతు(డు. వి. శివుడు. గట్టువిల్గారి వి. శివుడు. గట్టువిల్గాలుపు వి. శివుడు. వ్యు. మేరుపర్వతాన్ని విల్లుగా ధరించినవాడు. గట్టుసమ్మెట వి. రాతిని పేల్చటానికి పనికివచ్చే ఉక్కు పళ్ళున్న పెద్ద సుత్తి. గట్టెక్కించు స.క్రి. దరిచేర్చు. <గట్టు+ఎక్కు+-ఇంచు³. గట్టెక్కు అ.క్రి. దరిచేరు <గట్టు+ఎక్కు. గట్రాకొమరిత రూ.చూ. గట్టురాకొమరిత. వి. పార్వతి. గట్రాకొమరు(డు రూ.చూ. గట్టురాకొమరు(డు. వి. మైనాకుడు. గట్రాచూలి రూ.చూ. గట్టురాచూలి. వి. పార్వతి. జైమినిభా. 7.92. గట్రాజల్లుడు రూ.చూ. గట్టురాజల్లుడు. వి. శివుడు. గట్రాజు రూ.చూ. గట్టురాజు. వి. హిమవంతుడు. గట్లగొంగ వి. ఇంద్రుడు. అచ్చ.రా. కిష్కిం. 474. గట్లయెకిమీ(డు(-ఎకిమీ(డు) రూ.చూ. గట్టులయెకిమీ(డు. వి. హిమాలయ పర్వతం. వేంక. ఆం. 77. గట్లయేలికమమమ(డు(-ఏలికమమమ(డు) వి. కుమారస్వామి. సాంబ. 3.1. గట్లరాయ(డు రూ.చూ. గట్టులరాయు(డు. వి. హిమాలయం. గట్లతే(డు రూ.చూ. గట్టులతే(డు. వి. హిమాలయ పర్వతం. గట్లతేవిబిడ్డ వి. హిమవత్పుత్రి, పార్వతి. ఆం. భా. 1.40. గట్లసూడు వి. గోత్రభిత్తు, దేవేంద్రుడు. అచ్చ. రా.యు. 174.

గట్టుగ వి. గర్భస్రావం.

గట్టువా రూ.చూ. గట్టివా. వి. గయ్యాళి.

గట్టువాయి రూ.చూ. గట్టివా. వి. గయ్యాళి.

గట్టువాలు రూ.చూ. గట్టివాలు. వి. సైరంధ్రి.

గట్టెక్కించు చూ. గట్టు.

గట్టెక్కు చూ. గట్టు.

గట్టెంచు చూ. గట్టి. వి. ముద్దగా (అతికి) నేసిన అంచు. <గట్టి+అంచు.

గట్టెడసలవ వి. ఆడుపదును పాత్రల మీద నునుపు, గట్టిదనం రావడానికి సర్వే సలప.

గట్టేయు చూ. గట్టి. స.క్రి. కుండరూపాన్ని తీర్చిన తర్వాత గట్టిగా నున్నగా రావడానికి మూడోసారి నునుసలపతో కొట్టు.

గట్నంవేయు రూ.చూ. గట్నేయు. స.క్రి. ఘటనంచేయు.

గట్నసలప రూ.చూ. గెట్నసలప. వి. ఆరుపదును పాత్రల మీద నునుపూ, గట్టితనం రావడానికి సర్వేసలప.

గట్నేయు రూ. గట్నంవేయు. స.క్రి. కుండ రూపాన్ని తీర్చిన తర్వాత గట్టిగా నున్నగా రావడానికి మూడోసారి నును సలపతో కొట్టు.

గట్నేసలప రూ.చూ. గెట్నసలప. వి. ఆరుపదును పాత్రల మీద నునుపుగా, గట్టితనం, రావడానికి సర్వేసలప.

గట్రి అవ్య. మొదలైన.

గట్రమన్ను వి. నిర్మాణానికి పనికిరాని మట్టి.

గట్రాకొమరిత చూ. గట్టు.

గట్రాకొమరు(డు చూ. గట్టు.

గట్రాచూలి చూ. గట్టు.

గట్రాజల్లుడు చూ. గట్టు.

గట్రాజు చూ. గట్టు.

గట్రింత వి. తరిమెనకూ, ఇంధనంగానూ ఉపయోగపడే కలపనిచ్చే ఒక చెట్టు. అడవిగోరింతచెట్టు (Erythroxylon monogynum).

గట్ల అవ్య. అట్ల, అటుల, అలా.

గట్లగొంగ చూ. గట్టు.

గట్లయెకిమీ(డు చూ. గట్టు.

గట్లయేలికమమమ(డు చూ. గట్టు.

గట్లరాయ(డు చూ. గట్టు.

గట్లతే(డు చూ. గట్టు.

గట్లతేవిబిడ్డ చూ. గట్టు.

గట్లసూడు చూ. గట్టు.

గడ[1] వి. 1. ఇక్షురంభాది కాండం, చెరకు, వెదురు మొ. వాటి కర్ర. కు. సం. 10.171 ; 2. ఓడకంబం, తెరచాప కొయ్య. శివ.సా. 2 ; 3. యుద్ధసాధన విశేషం (ఈటె). విజయ. 3.152 ; 4. ఏతవుబొక్కెన తగిలించే నిలువుగడ ; 5. గొర్రు, గుంటక మొ. వాటి దిండుకు బిగించి కాడిమీద మోసే పొడుగాటి కొయ్య (లు) ; 6. వెదురు.

క. గడె. వెదురు కర్ర ; కొడ. గళె. పొడుగాటి కర్ర ; తు. కరి. ద్వారబంధపు స్తంభం ; త. కళై. పడవనడిపే వెదురు కర్రలు, చెరకుగడలు, వెదురుకర్రల చివరిభాగం ; మ. కళ. వెదురు కావటిబద్ద ; పర్జి. కడ్ప. సన్నటి కర్ర, ఈచ ; ఒల్లా. కడ్మె. కర్ర.

పో.చూ. సం. కాండ-. కర్ర.

గడకట్టు రూ. గడగట్టు. స.క్రి. ప్రతిష్ఠించు, స్థాపించు. దాశ. 34 ; అ.క్రి. తెగించికూర్చుండు. గడకట్టె వి. రాగోల కట్టె, ఆముకాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకొని రావడానికి వాడే పంగల కర్ర. గడకర్ర వి నూలుచిలపలు ఆరవేసే వెదురుబొంగు. గడకు(గట్టినపాత వి. చంచలత్వం. తాళ్ళ. సం. 11.3, 125. గడకుప్ప వి. ఎద్దుబాడిలో వైపుకు రాకుండా కాడికన్నంలో దిగవేసిన కర్ర. గడకొయ్య వి. బండిమీద జల్ల కదలకుండా చట్టంలో గుచ్చిన కొయ్య ముక్క. గడగట్టు (-కట్టు) రూ.చూ. గడకట్టు. స.క్రి. జండాకట్టు. గడగాలు వి. బండిమీద జల్ల కదలకుండా చట్టంలో గుచ్చినకొయ్యముక్క. గడసు వి. బండిపరాన్ని దోనె (అడ్డ) కు బిగించిన చీల. గడచీల వి. ఏతపులానలో అమర్చి ఉండే దండెపు బిటలు తగల్పటానికి గరతలన ఉండే చీల, కుండకట్టెకోట ఏతంగడ చివరన అమర్చే చీల ; త. కటిక్కై. చీల ; కటిక. బక్కెటు జారకుండా ఉండటానికి అమర్చిన చీల. గడసాధన వి. సాము, వ్యాయామం. <గడ[1]+సం.సాధన. గడసాని[1] రూ. గడెసాని. వి. గడపై జీవించేది (దొమ్మరసాని).

గడ[2] వి. సమూహం. నిర్వ. రా. 8.53.

సం. ఘటా. ఏనుగుల సమూహం, గుంపు ; ప్రా. ఘడా. సమూహం ; ఘడగ.

క. గడణ. ముద్ద, కుప్ప, సమూహం.

<ప్రా. ఘడా.

-గడ[3] ప్రత్య. చేరు - మొదలైన క్రియలచివర నామవాచకాల పడం కోసం చేర్చే ఒక కృత్ప్రత్యయం,

గడక వి. నంగటిముద్దలు చేయడానికి గుండ్రని మూకటి లాంటి మట్టిపాత్ర.
గడకా విణ. మిగిలిన.
గడగడ క్రి. విణ. వడకటం మొదలైన వాటికి అనుకరణం. ఉ.హరి. 6.96.
క. *గడగడ*. గడగడ ; తు. కటుకటు. పేగులలో బాగుండక పోవటం ; *గడగడ*. ఒకరకం ధ్వని ; త. కటుకటల్-ఎనల్, కటుకట్-ఎనల్.
గడగడవడు అ.క్రి. వణుకు. గడగడవఱచు స.క్రి. వణికించు, భయపెట్టు. రం.రా.ఉ. 7 పం. గడగడలాడు అ.క్రి. వణకు.
గడగరొతు వి. పగిలి పనికిరాని రాయి.
గడగెనలు వి. పడి లేక ఒకటిన్నర పడి బియ్యం ఉడికే మట్టి పాత్ర.
గడంగు వి. సరకులను నిలవచేసే పెద్ద కొట్టు.
గడచిబ్రతుకు చూ. గడచు.
గడచు రూ.చూ. కడచు. స.క్రి. 1. దాటు ; 2. అతిక్రమించు ; 3. మించు. అ.క్రి. తొలగిపోవు.
గడచిబ్రతుకు అ.క్రి. 1. జీవితాంతం వరకు ఎగుడు దిగుడు లేకుండా జీవించు ; 2. ఇతరుల సహాయం లేకుండా బతికి పొగడబడు.
గడజేయు స.క్రి. నేసిన గొంగడి ముడతబెట్టు.
గడంచ రూ.చూ. గడమంచ. వి. ధాన్యపు గుమ్మకింది చెక్కబల్ల.
గడంచి రూ.చూ. గడమంచ. వి. ఎత్తైన బల్ల.
గడంచు రూ.చూ. గడమంచ. వి. 1. ఒకరకం పీట ; 2. చిన్న మంచం ; 3. చెక్కలువేసి ఎత్తుగా చేసిన బెంచి వంటి చట్రం.
గడంచె రూ.చూ. గడమంచ. వి. 1. ధాన్యపుబస్తాలు ఇంట్లో వేయటానికి నిలబెట్టిన బల్ల ; 2. తూర్పారపోసే మనిషి నిలబడటానికి అమర్చిన ఎత్తుపీట.
గడన[1] వి. సంపాదన, ఆర్జనం. సుమతి శ. 43.
సం. ఘటనా- ; ప్రా. *ఘడణ*. నిర్మాణం, యత్నం, పరిశ్రమ ; అ.మా. *ఘడణ*. ప్రయత్నం.
క. *గడణె*. ఎంచటం, లెక్కించటం.
<ప్రా. ఘడణ-.
గడనకత్తె వి. భోగపు స్త్రీ, వేశ్య. గడనచేడియ వి. భోగపు స్త్రీ, వేశ్య. నీలా. 2.49. గడనపడంతి రూ. గడనపడంతుక. వి. భోగపు స్త్రీ, వేశ్య. గడనపడంతుక రూ.చూ. గడనపడంతి. వి. భోగపు స్త్రీ, వేశ్య. గడనసాని రూ. గడసాని[2]. వి. భోగపుస్త్రీ, వేశ్య. <గడన[1] + సాని[1].
గడన[2] వి. 1. స్తోత్రం. భార.విరా. 5.249 ; 2. లెక్క. జైమినిభా. 5.167.
సం. *గణన*-. లెక్కించటం ; ప్రా. *గణణ-గణణా*. లెక్క, సంఖ్యానం.
క. *గడగె*. ఎన్నిక, అర్హమైంది, గణింపదగింది.
<ప్రా. గణణ-.
గడన[3] వి. దొంగమేపు, లంచం. ఆం.భా. 3.35.
గడనము[1] వి. సమూహం. కు. సం. 12.183.
క. *గడణ*. కుప్ప, సమూహం.
<క. గడణ.
గడనము[2] చూ. గడ[1]. వి. గడ.
గడనెల్లి రూ.చూ. గడ్డనెల్లి[2]. వి. నీడకోసం పెంచబడే ఒకరకం చెట్టు.
గడప రూ.చూ. కడప[1]. వి. 1. కడప, దేహళి, ద్వారం యొక్క కింది కమ్మి. ఆం. భా. 2.17 ; 2. బండి ఇరుసు చివర వేసేచీల ; కడచీల, బాయమేకు ; 3. బొప్పి (వాకిలి తగిలి తలగడప కట్టింది) ; 4. సింహద్వారానికి ముందు అరుగుల మధ్యగా ఉన్న నడిచేదారి ; 5. నాగటితో దున్నిన రెండుచాళ్ళ మధ్య కలవని భాగం ; 6. గొర్రు మొ. ఒకసారి చాళ్ళు దున్ని మలుపు తిరిగిన తరవాత మొదటి చాళ్ళకు రెండవసారి వేసే చాళ్ళకు మధ్య మిగిలి పోయిన ఎడం.
గడపత్రొక్కు అ.క్రి. ఇంటికి వచ్చు. గడపదాటు అ.క్రి. ఇల్లుదాటి బయటకు వెళ్ళు. గడపపచ్చ వి. ఒకరకం పసుపు రంగు. గడపపన్ను వి. ఇంటిపన్ను. గడపబోదె వి. మండిగం, కడప. గడపలోకాలుపెట్టు అ.క్రి. ఇంటిలో అడుగుపెట్టు, గృహప్రవేశం చేయు, రావరానికివచ్చు.
గడపరము వి. పాలేర్లకు పంటకాపులు ఇచ్చేధాన్యాదికం.
గడపు చూ. కడచు. రూ. గడుపు. స.క్రి. జరుపు, వెళ్ళబుచ్చు.
గడపుదల (-తల) రూ. గడుపుదల. వి. 1. పాలేర్లకు పంటకాపు లిచ్చే ధాన్యాదికం. 2. కాలంవెళ్ళబుచ్చటం, గడపటం.
గడపులుసు వి. ముదురు ఆకుపచ్చరంగుతో కూడిన ఊదా రంగు పూలుపూసే కొమ్మలు లేకుండనిలువుగా పెరిగే ఒక మొక్క (Cviebuhriadineearis).
గడబడ రూ.చూ. గడిబిడి. వి. 1. అల్లరి ; 2. తొందర ; 3. బాధ.
గడబద్ధకం వి. కష్టం.
గడబిడ రూ.చూ. గడిబిడి. వి. కలత, క్షోభం.
గడబిడచేయు స.క్రి. సాధనాలతో నేలను తిరగ వేయు.
గడబిడి రూ.చూ. గడిబిడి. వి. 1. అల్లరి ; 2. తొందర ; 3. బాధ.
గడమంచ రూ. గడంచ, గడంచి, గడంచు, గడంచె, గడమంచె, గడవంచి, గడవంచె, గడిమంచ, గడెమంచము. వి. 1. బరువుమూటలు పెట్టుకోడానికి చేసిన గట్టి పొట్టిబలం పీట, చట్టం ; 2. చిన్న మంచం ; 3. చెక్కలువేసి ఎత్తుగా చేసిన బెంచివంటి చట్రం.
క. *గడగంచి*. నీళ్ళకుండలు మొ. పెట్టుకోడానికి ఏర్పాటుచేసిన బల్ల.
హిం. ఘడౌంచి.
గడమంచె రూ.చూ. గడమంచ. వి. 1. మూటలు మొ. పెట్టటా నికి కోళ్ళు అమర్చిన చట్టం ; 2. పైరుకుకావలి కాచేమనిషి నిలబడడానికి గుంజలుపాతి పైన తడికవేసి కట్టిన కట్టడం.
గడమాను పో. చూ. గడప. వి. దర్వాజా చట్రపుకిందికమ్మ.
గడము వి. 1. కుండ మొ. వాటిమూత, మూకుడు ; 2. గడి.
గడరుగోయిల (-కోయిల) వి. గండుకోయిల.
గడవ వి. మంచికలపనిచ్చే ఒకచెట్టు, ఇదిపచ్చనిపూలు

పూస్తుంది (Careey arboca).

గడవంచి రూ.చూ. గడమంచ. వి. 1. చిన్నమంచం ; 2. పెక్కు అరలు అమర్చిన ఎత్తుకోళ్ళబల్ల.

గడవంచె రూ.చూ. గడమంచ. వి. మూటలు మొదలైనవి పెట్టుకోడానికి వీలుగా కోళ్ళుఅమర్చిన చట్టం.

గడవు రూ. గడువు. వి. నిర్ణీతకాలం.

క. *గడవు* ; పో. చూ. *గడ*. హద్దు, నిర్ణీతకాలం, ఒక వాయిదా.

గడసాని[2] రూ.చూ. గడనసాని. వి. భోగవుస్త్రీ.

గడసియ రూ. గడసె. వి. 1. అటక ; 2. మిద్దె ; 3. మదురు.

గడసిల్లు అ.క్రి. 1. కడదగు, చివరిదగు. భీమ. 2.77 ; 2. నమమగు ; 3. కుంగు.

గడసె రూ.చూ. గడసియ. వి. 1. అటక ; 2. మిద్దె ; 3. మదురు.

గడాకుండ రూ.చూ. గడేకుండ. వి. ఒకరకం వాద్యపుకుండ.

గడాడు వి. చుట్టుగుడిసె కొప్పుచుట్టూ కంకబద్దపరిచి పెంటితో వేసినకట్టు.

గడాన క్రి. విణ. ద్రు. త్వరగా.

క. *గడాన*. వీలైనంత తొందరగా.

గడాము వి. చిన్నగుడిసె.

గడాయించు స.క్రి. తాడు మొ. వాటితోగట్టిగాకట్టు.

హిం. *గడానా*. చొప్పించు.

<హిం. గడా (నా).

గడాయిరాతి వి. స్తంభాలు మొ. రాతికట్టడాల్లో భాగంగా నిలబెట్టిన డిజైన్లు చెక్కినరాయి.

హిం. *గడా*. ఖచితమైన.

గడార రూ.చూ. గడారి. వి. గడ్డపార, పలుగు.

గడారంకాయలు వి.బ.వ. పుల్లబద్దలు (నిమ్మకాయలు).

గడారంమరవ రూ.చూ. గడియారం మరవ. వి. గడియారం బాన.

గడారి రూ. గడార, గడారు. వి. చిన్నగునపం.

క. *గడారి*. గునపం.

గడారు రూ.చూ. గడారి. వి. 1. గడ్డపార ; 2. బండిచట్రం చక్రాలమీద తిరగటానికి ఆదారంగా ఉండేకమ్మి ; 3. రాట్నం ఆకులు తిరగటానికి నిలువులకు బిగించిన ఇనపచువ్వ ; 4. దబ్బారాట్నం తిరగటానికి నిలువులకు బిగించిన చువ్వ ; 5. ఇరుసు.

గడార్తుండు వి. గానుగుమొద్దు మధ్యనాటిన మేకు.

<గడారు+తుండు.

గడార్తుండు చూ. గడారు.

గడాలు వి.బ.వ. అరకలు, నాగళ్ళు.

గడి[1] వి. 1. దరి, సమీపం. కు. సం. 5.14 ; 2. సీమ, పొలిమేర, సరిహద్దు, మితి, మేర. పరమ. 1.24 ; 3. మర్యాద, కట్టుబాటు. హంస. 5.110 ; 4. కుండ మొదలైనవాటిమూత, గడం. ఆం. భా. 1.76 ; 5. గడితాడు ; 6. చదరంగం బల్లమీద గీచినఇల్లు ; 7. బలం ; 8. వ్యాపార విశేషం ; 9. సంవత్సరం ; 10. క్షేత్రగణిత సంబంధమైన భాగం ; 11. గదియ, అర్గళం ; 12. గీత ; 13. పశువుల కాళ్ళకు కట్టేపలుపు ; 14. తలుపులను బిగించే అడ్డకోల, గడియ ; 15. ముడి ; 16. ఒకరంగు పడుగులో వేరేరంగు పోగులతో నేసిన చతురం ; 17. కోటనిచ్చెన మెట్లకుమధ్యనున్న ముక్కోణంగా ఉండే ఖాళీ.

క. *గడి*. హద్దు, ఎల్ల, పొలిమేర.

గడికట్టు అ.క్రి. ఆరితేరు. గడికరణము వి. బాగారాయకల్గినవాడు. గడికాళ్ళువేయు స.క్రి. రెండు రెండు పశువులకు ఒక్కొక్కకాలు చేర్చి లంకెవేయు. గడికుడుకలు వి.బ.వ. వివాహాదుల్లో ఉపయోగించే ఐరేనికుండలు కాక మిగిలినకుండలు. గడికొయ్య రూ. గడిగొయ్య. వి. బండిమీద జల్లకదలకుండా చట్రంలో గుచ్చినకొయ్యముక్క. గడికొల్లలు వి.బ.వ. సరిహద్దులు దగ్గరకాచి దోచుకోవడాలు. గడిగుండు వి. పెద్దరాయి. గడిగొయ్య (-కొయ్య) రూ.చూ. గడికొయ్య. వి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండి చట్రపునిలువుపట్టెలకు బిగించిన కర్ర. గడిగొర్రు (-కొఱ్ఱు) రూ. గడిగొట్టు. వి. బండిజల్లపక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువు పట్టెలకు బిగించినకర్ర. గడిగొట్టు రూ.చూ. గడిగొర్రు. వి. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువు పట్టెలకు బిగించిన కర్ర. గడిచీర వి. గళ్ళచీర. గడిచీల వి. 1. బండిజల్ల పక్కకు తొలగకుండా ఉండటానికి బండిచట్రపు నిలువు పట్టెలకు బిగించిన కర్ర ; 2. నెమ్ముబండిచౌలుపు కిరువైపులా బిగువుకోసం కొట్టినమేకు ; 3. పరానికి దోనె మొద్దును బిగించే చీల. గడి త్రాడు వి. జాప రెండు రెండు పశువులను ఒక్కొక్క కాలుచేర్చి లంకెవేసే పలుపు. గడిదేరు (-తేరు) అ.క్రి. ఆరితేరు, నిపుణత్వాన్ని సంపాదించు. పాండు. 3.14. గడిదేశము వి. సరిహద్దు భూమి. గడిదొంగ వి. గడిదేరిన దొంగ, నిపుణత్వాన్ని పొందిన దొంగ. గడినేత వి. బట్టలో గళ్ళుపడేట్టు పెట్టినేసిన నేత. గడినేలలు వి.బ.వ. సరిహద్దుభూములు. గడిపేటుచీర వి. అంచులోగడి డిజైను పడేట్టునేసినచీర గడిపోతు వి. అంబోతు. ద్వి. హరిశ్చ. ఉ. 558. గడిబల్ల వి. 1. రెండు ఎత్తైన పీటలు మీద అడ్డంగా వేసినఅడ్డు పలక గల బల్ల ; 2. మరమగ్గం చట్రంలో, పానువుపట్టెకు పక్కన బిగించిన సొరుగుచెక్క. గడిమాను వి. తలుపు చెక్కలను మూస్తూగోడల్లోని కంతల్లోకి దూర్చబడే రోకలి వంటి పెద్దగడియ. గడిమీాఱు స.క్రి. గడిసాములు చేయటంలో ఆరితేరు. గడిమెకము వి. వేటాడటానికి చిక్కని మృగం. గడిమూల వి. వీథిమొదలు గడియు అ.క్రి. దగ్గరకుచేరు. గడిరాజు వి. ఊరుదు. గడివా(డు వి. ఎల్లల వద్దకావలి ఉండేవాడు. గడివిప్పు స. క్రి చీరమడత విప్పు, మడతవేయు. గడివోతు (-పోతు) వి. ఉడుపకుక్క, ఒకరకం వేటకుక్క. గడిసీల (-చీల) వి. గానుగ చక్రం వెనగకుండా బిగించే కొయ్యముక్క.

గడి[2] రూ.చూ. గడీ. వి. దుర్గం, కోట. రంగా. చ. 2.27.

గడిగ రూ. గడిగి. వి. ఒకపాటి మట్టికుండ.

గడిగదుత్త రూ.చూ. గరిగెదుత్త. వి. అరివేణి లేకుండా పెళ్ళి చేసేవాళ్ళువాడేమట్టిపాత్ర.

గడిగి రూ.చూ. గడిగ. వి. పక్కలేనిమట్టిపాత్ర.

**గడిచీటియిచ్చు** (-ఇచ్చు) చూ. గడి[2]. స.క్రి. విడుదల పత్ర మిచ్చు.

**గడించు**[1] రూ. గడియించు[1]. స.క్రి. 1. సంపాదించు, ఆర్జించు. వరాహ. 9.126 ; 2. కల్పించు. కళా. 5.38.

క. *గడిసు*. సంపాదించు, పొందు, దగ్గరకు చేరు.

**గడించువడఁతి** వి. ఆటవెలది, వేశ్య. సాంబ. 2.13.

**గడించు**[2] రూ.చూ. గడియించు[2]. స.క్రి. గణనచేయు, పాటించు. కళా. 3.193.

**గడిఁడు** వి. వీరగీతాల్ని పాడుతూ బిచ్చమెత్తుకొనేవాడు.

**గడితకెక్కు** చూ. గడితము. అ.క్రి. 1. గణుతికెక్కు ; 2. స్థిర పడు.

**గడితపడు** చూ. గడితము.

**గడితము** విణ. 1. ముదురైన, చిక్కని, తరచైన. హరి. ఉ. 7.213 ; 2. అధికమైన, మిక్కుటమైన, పెద్ద. రసిక. 3.151 ; వి. 1. తరచు, బాహుళ్యం. అచ్చ.రా.యు. 325 ; 2. సాంద్రత్వం, చిక్కన. పార్వ. 5.128 ; 3. ముదురుతనం ; 4. పలుపు.

సం. ఘటిత-. కూర్చబడిన ; ప్రా. ఘటిత-, ఘడిఅ. సంసక్తం, క్లిష్టం ; పా. ఘటిత-. కూడిన.

క. *గడతర*. చిక్కన, సాంద్రత్వం. బలం, స్థూలత్వం. <ప్రా. ఘటిత-.

**గడితపడు** అ.క్రి. గట్టిపడు, ఘనీభవించు. యయా. 2.71.

**గడితల** రూ. గడిదల. వి. ఒకవిధమైన ఆయుధం. కు.సం. 11.40.

**గడితెరదాక** వి. కొద్దిగా రూర పండుకోడానికి వాడే చిన్న మట్టి పాత్ర.

**గడిదల** రూ.చూ. గడితల. వి. ఆయుధవిశేషం. ప్రబంధ. 788.

**గడిపరక** రూ.చూ. గడ్డిపరక. వి. తృణలేశం.

**గడిపిడత** వి. పీర్లపండగలో పానకం ముంచుకొని తాగడానికి వాడే చిన్నపిడత.

**గడిబిడి** రూ. గడబడ, గడబిడ, గడలిడి. వి. అల్లరి, కొందర, బాధ.

పో.చూ. కుమా. *గడబడాణొ*. తప్పుడుతోవలో నడి పించు ; నే. *గడ్‌బడ్*. ఆందోళన, గాబరా ; బెం. *గడ్ బడ్* ; ఒ. *గడబడి* ; హిం. *గడ్‌బడ్*. ధ్వని, అస్త వ్యస్తం, గాబరా, ఆందోళన ; పం. *గడ్డ్-వడ్డ్* ; సిం. *గడ్‌బడి* ; గు. *గడ్‌బడ్* ; మరా. *గడ్‌బడ్*.

క. *గడిబిడి*. ధ్వని, చప్పుడు, అల్లరీ, గలబా తు. *గడబడి* ; త. కటుపటాన్-ఎనల్. ధ్వనించడం, సం దడి అవడం.

<హిం. గడ్‌బడ్.

**గడిమంచ** రూ.చూ. గడమంచ. వి. గడవంచె.

**గడిమి** వి. కడప, గుమ్మం.

**గడిమిదొండపెండలము** వి. అడవిగినుసు తీగ. మొయరు పెండ లం తీగ, సువాసనగల ఆకుపచ్చని పూలుపూసే తీగ (Dioscorea alata).

**గడియ**[1] రూ.చూ. గడె[1]. వి. 1. అర్గళం, తలుపుకు అడ్డంగా వేసిన కర్ర. శుక. 2.122 ; 2. కత్తెర అడుగున ఉన్న కమ్మి.

**గడియకన్నము** వి. దొంగచే తలుపు తీయటానికి వీలుగా తలుపుకు చేసిన రంధ్రం. **గడియమ్రాను** రూ. గడె మాను, గడెమ్రాను. వి. అర్గళం, విష్కంభం, తలుపుకు అడ్డంగా వేసేకర్ర. **గడియలువడు** అ.క్రి. గడియలు వేసి నట్లగు. పాండు. 3.103.

**గడియ**[2] రూ. గడె[2]. వి. 1. ముహూర్తం, అల్పకాలం. హరి. ఉ. 6.199 ; 2. ఇరవైనాలుగు నిమిషాలకాలం. ఆం.భా. 1.95.

సం. ఘటికా. ఇరవైనాలుగు నిమిషాలకాలం ; ప్రా. *ఘడిఆ* ; పా. ఘటికా. కుండ ; నే. *ఘడి*. ఇరవై నాలుగు నిమిషాలకాలం ; చిన్నగడియారం, ఒకగంట ; కుమా. *ఘడీ*. అవసానకాలం ; బెం. *ఘడె*, *ఘడీ* ; హిం. *ఘడీ*. ఒకనిమిషం, కాలాన్ని కొలిచేది ; పం. *ఘడీ*. కుండలో నీళ్ళునునింపి దానిద్వారా కాలాన్నికొలిచే పద్ధతి, ఇరవైనాలుగు నిమిషాల కాలంలో ఆ కుండ ఖాళీ అవుతుంది ; సిం. *ఘడీ* ; గు. *ఘడీ*.

క. *గడి*. ఇరవైనాలుగు నిమిషాల కాలం, గంటలు కొట్టడానికి వీలుగా లోహంతో తయారుచేసిన పళ్ళెం.

<ప్రా. ఘడిఆ.

**గడియకుడుక** రూ. గడెకుడుక. వి. గడియలను తెలిపే పాత్ర విశేషం. కువల. 2.125.

**గడియమరవ** రూ. చూ. గరిగెమరవ. వి. గరిగెముంత, అరివేణిలేకుండా పెళ్ళిచేసేవారు వాడే మట్టిపాత్ర.

**గడియా** వి. కట్టుబడిలో పనికిరాని చిన్నరాతిముక్క.

**గడియారంకడవ** చూ. గడియారము.

**గడియారము** చూ. గడియ[2]. రూ. గడేరము, గడ్యారము. వి. గడియలను తెలిపే యంత్రవిశేషం. బసవ. 3.1005, 1006, క్రీడా. 155.

సం. ఘటికార-.

క. *గడియార*, *గడియాల(ళ)* ; తు. *గడియాళ్* ; త. *గడికారం*.

<సం. ఘటికార-.

**గడియారంకడవ** రూ.చూ. గడేరంకడవ. వి. హరిజనులు పెళ్ళిళ్ళల్లో వాడే చిన్నపాత్ర. **గడియారంబాన** వి. హరి జనుల పెళ్ళిళ్ళల్లో కంకణం కట్టిపెట్టే చిన్నకడవ. **గడి యారంమరవ** రూ. గడారంమరవ. వి. గడియారంబాన, హరిజనుల పెళ్ళిళ్ళల్లో కంకణం కట్టిపెట్టే చిన్నకడవ.

**గడియారంబాన** చూ. గడియారము.

**గడియారంమరవ** చూ. గడియారము.

**గడియించు**[1] రూ.చూ. గడించు[1]. స.క్రి. 1. సంపాదించు, ఆర్జించు. ద్వి. సారంగ. 68. పు ; 2. కల్పించు.

**గడియించు**[2] రూ. గడించు[2]. స.క్రి. గణనచేయు, పాటించు. బసవ. 1.428.

క. *గణయిసు*. లెక్కించు, పాటించు.

**గడివడ** వి. గట్టిగాఉండే వడియం.

**గడినేలబడు** అ.క్రి. భారాదులచే కుంగిపోవు పి. శకు. 3.190.

గడిసిలు రూ.చూ. గడిసిల్లు. అ.క్రి. 1. చెరు, పారగు ; 2. కుంగు.
గడిసిల్లు రూ. గడిసిలు. అ.క్రి. 1. చెరు, పారగు ; 2. కుంగు.
గడిసుగంధి వి. సుగంధిపాల, ఒంరకం తీగ (Hemidesmus indicuslatifolius).
గడిసె వి. ధాన్యం నిల్వచేసే గాదె.
గడీ రూ. గడి². వి. దుర్గం, కోట. రంగా.చ. 2.122.
హిం. ఉ. *గఢ్*. కోట, దుర్గం ; మరా. *గఢీ*, *గఢ్*, *గఢా*.
క. *గడి* ;
<ఉ. గడ్.
గడీపిడతలు రూ. గడోపిడతలు. వి.బ.వ. పెండ్లిలో నాగవల్లి సాంగేనికివాడే మట్టిపిడతలు.
గడీలు వి.బ.వ. పీర్లపండగలో పానకం తాగడానికి వాడే చిన్న మట్టికుండలు.
గడు రూ.చూ. గడ్డు¹. వి. 1. దారువిశేషం. ఆం.భా. 2 ; 2. గొప్పతనం ; 3. గొప్పవాడు. విణ. గడ్డు, కష్టమైన.
గడు(గాయ (-కాయ) రూ. గడుగ్గాయ. వి. రాలుగాయ, తుంటరి. గడుగ్గాయ్ రూ.చూ. గడుగాయ. విణ. ఘటికుడు, గడుసుకాయ. గడుమన్నెము రూ.చూ. గడ్డుమన్నెము. వి. గడ్డుమన్నెం, లోమన్నెం, బహుమానంగా ఇచ్చిన భూమి.
గడుగు వి. చిన్న పాత్ర.
గడుగుడకలు వి.బ.వ. పెళ్ళిలో అరివేణి పక్కన సున్నం పూసి పెట్టే రెండుకుండలు.
గడుచు రూ.చూ. కడచు. స.క్రి. 1. దాటు ; 2. అతిక్రమించు ; 3. ఉల్లంఘించు.
గడువ(బడు అ.క్రి. మించబడు.
గడుపు రూ.చూ. గడపు. స.క్రి. (కాలం) వెళ్ళబుచ్చు.
గడుపుకొను స.క్రి. కాలంవెళ్ళబుచ్చుకొను. గడుపుదల (-తల) రూ.చూ. గడపుదల. వి. 1. గడపడం, కాలం వెళ్ళబుచ్చడం ; 2. పాలేర్లకు పంటకాపులిచ్చే ధాన్యాదికం.
గడువ(బడు చూ. గడుచు.
గడువు రూ.చూ. గడవు. వి. 1. కాలం యొక్క అవధి, మేర. రం.రా. కిష్కిం ; 2. మర్యాద.
గడుసరి చూ. గడుసు.
గడుసరితనము చూ. గడుసు.
గడుసు విణ. 1. కుజనుడు, కూళ. ఆము. 4.209 ; 2. గాఢం, అధికమైన, హెచ్చైన. పార్వ. 3.74 ; 3. కఠినమైన, గట్టి. శుక. 2.412 ; 4. అసాధ్యం ; వి. 1. కాఠిన్యం ; 2. మొండితనం.
క. *గడుసు*. లోహంలాంటి గట్టితనం, ఇనుము, కట్టె మొదలైన వాటిలాగ పెళుసుదనం ; *గట్టి*. శక్తి, గట్టివాడు ; తు. *గడుసు*. దృఢం, గట్టి ; త. *కెట్టి*. దృఢత్వం, గట్టితనం ; మ. *కట్టి*. లోహపు కడ్డీలాగ తయారు చేయబడ్డది.
గడుసరి విణ. 1. దుష్టుడైన, కూళ. పండి. చ. 2.116 ; 2. మాయలమారి. నార.షంచ. 1.254 ; 3. కఠినం. ద్వి. హరిశ్చ.ఉ. 619 ; 4. వంచకం. వైజ. 4.94 ; 5. కఠినుడు. ఆం.భా. 8.12 ; 6. అసాధ్యుడు ; 7. శూరుడు. గడుసరితనము వి.1. ధైర్యం ; 2. చెడ్డతనం. గడుసుకుంక వి. గడుసరివాడు. గడుసు(దనము (-తనము) వి. 1. ధార్ష్ట్యం. ప్రభా. 1.107; 2. మోటుతనం. కృ.శకు. 50; 3. కాఠిన్యం. చంపూ. రా. 4.29. గడుసునేల వి. గట్టినేల. గడుసువడు రూ.చూ. గడుసుపడు. అ.క్రి. 1. మొండితనం చేయు. వేమ. 2.194 ; 2. ధీరుడగు. గడుసుపిక్కలు వి.బ.వ. బలిసిన పిక్కలు. గడుసుబుర్ర వి. మంచిమేధగలవాడు. గడుసుమాట వి. కుచ్చితమైనపల్కు. గడుసురాయి వి. అబ్బుగుల్ల. గడుసురాలు వి. గడుసుదనం గల స్త్రీ. వేమన. 1.16. గడుసువడు (-పడు) రూ. గడుసుపడు. అ.క్రి. మొండితనం చేయు. పాండు. 3.14. గడుసువా(డు వి. తనపనులు నేర్పుగా నిర్వహించుకోగల నేర్పరి. గడుసువాన వి. తీక్ష్ణమైన వానజల్లు.
గడె¹ రూ. గడియ¹. గణె. వి. అరళం, తలుపుకు అడ్డంగావేసే కఱ్ఱ. యయా. 5.34.
క. *గడె*. వెదురుగడ ;
సం. *ఘటిత-*. అనుసంధించబడినది ; ప్రా. *ఘడియ-* ; *ఘటికా*.
<ప్రా. ఘడియ-.
గడెకన్నము వి. తలుపుగడియ కన్నం. గడెమాను రూ.చూ. గడియ(మాను. వి. ప్రధాన ద్వారానికి లోపైపు అడ్డంగానేసే రోకలివంటి కొయ్య గడియ. గడెమ్రాను రూ.చూ. గడియ(మాను. వి. అర్గళం, విష్కంభం, తలుపుకు అడ్డంగావేసే కఱ్ఱ.
గడె² రూ.చూ. గడియ². వి. ఇరవైనాలుగు నిమిషాల కాలం. కువల. 2.47.
గడెకుడుక రూ.చూ. గడియకుడుక. వి. గడియను కొలిచే గిన్నె. గడెగడెకు అవ్య.ద్రు. మాటిమాటికి.
గడెకారి రూ.చూ. గడేకారి. వి. బల్లెంవాడు, పోకిరి.
గడెకాలు అ.క్రి. బాగాకాలు.
గడెంకొట్టు స.క్రి. వ్యవసాయం చేయు.
గడెత్తు చూ. గడియ¹. వి. 1. దాటుకొని పోవటానికి ఎత్తు ; 2. యుక్తికిపై యుక్తి ; 3. పెద్ద ఆలోచన.
గడెత్తువా(డు వి. ఎత్తులమారి.
గడెమంచము రూ.చూ. గడమంచ. వి. పరుపులు, మెత్తలు, దుప్పట్లు పెట్టే మంచం.
గడెము వి. ఏడికోలను వణతలో దూర్చేచోటు, అవసరాల్ని బట్టి పైనిగాని కిందగాని ఎలుపుసలుపులకు కొట్టేపేరు.
గడెముకొట్టు స.క్రి. 1. మెట్టపొలాన్ని నాగళ్ళతోదున్ను ; 2. గొర్రుతోదున్ను.
గడెముట్లు వి.బ.వ. వ్యవసాయపరికరాలు, సేద్యపుపనిముట్లు.
గడెలువడు (-పడు) చూ. గడియ¹. అ.క్రి. వినపడకపోవు.
గడెసాని రూ.చూ. గడసాని¹. వి. గడసాని, దొమ్మరసాని.
గడేకారి రూ. గడెకారి. వి. 1. అల్లరిచేసేవాడు ; 2. రాళ్ళు చెక్కి మిద్దెలు కట్టేవాడు.
క. *గడెకాఱ*. ఏనుగు వెనుకవైపు జండా పట్టుకొని కూర్చునేవారు, గడతో పడవ మొ. వాటిని నడిపేవాడు.

గడేకారిజట్టు వి. అల్లరిగుంపు.

**గడేకుండ** రూ. గడాకుండ, గణాకుండ, గణేకుండ, గలాకుండ, గలేకుండ, గాడాకుండ. వి. భజన్లకి, బుర్రకథలకి, ఘట వాయిద్యం వాయించడానికి వాడే కుండ.

**గడేయు** స.క్రి. తాడు మొదలైన వాటితో గట్టిగాకట్టు.

**గడేరంకడవ** రూ. గడియారం కడవ. వి. హరిజనుల పెళ్ళిళ్ళలో కంకణం కట్టిపెట్టే చిన్నకడవ.

**గడేరము** రూ.చూ. గడియారము. వి. గడియారం.

**గడోపిడతలు** రూ.చూ. గడిపిడతలు. వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లికి వాడే మట్టి పాత్రలు.

**గడ్డ**[1] రూ. గడ్డయ, గెడ్డ. వి. 1. కరుడు, గట్టిపడినముద్ద, మట్టిపెళ్ళ. భార. అను. 2.40 ; 2. ఒడ్డు. కాశ. 3.65 ; 3. దుంప, మూలం. కార్తీక. 1.5 ; పు. 4. వ్రణం ; 5. ద్వీపం ; 6. రాటి తిరగడానికి రాటిదూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు ; 7. అంచు నేతలో వేసెడు పెడల్పు పట్టె ; 8. గొర్రు మొ. ఒకసారి చాళ్ళు దున్ని మలుపు తిరిగిన తర్వాత మొదటి చాళ్ళకు, రెండోసారి చాళ్ళకు మధ్య మిగిలిపోయిన ఎడం ; 9. ఇనాంగా ఇచ్చిన భూమి ; 10. బద్దె బండి చక్రం మధ్యవేసే చెక్క ; 11. గింజలురాల్చి వట్టిగడ్డితో వేసిన పెద్ద కుప్ప, చొప్పకుప్ప ; 12. ఒకే కులం వాళ్ళుండే గ్రామ భాగం ; 13. ప్రహారి గోడలో మధ్య మధ్య కట్టే దిమ్మ ; 14. తిన్నె, కుప్ప ; 15. స్తంభాల మీద ఆనే ఆర్చి అడుగు భాగం ; 16. ఇటికముక్క ; 17. కట్టుబడిలో పనికిరాని చిన్న రాతి ముక్క.

క. గడ్డె, గెడ్డె. ముద్ద, గుండ్రంగా ఉండే దుంప, నదిలో మధ్యన ఉన్న చిన్న దీపం, ఒడ్డు, తీరం ; కొడ. కండె. చిన్న చిన్న దుంపల సమూహం ; తు. గట్టె, గెట్టె, గెట్టి. ముద్ద ; త. కట్టి-. ముద్ద, గడ్డ, కురుపు, బొప్పి ; మ. కట్ట. ముద్ద ; కోట. కట్య్. ముద్ద.

గడ్డకమ్మి వి. వేసెడు పెడల్పు కడ్డీల మాదిరిగా నేసిన కమ్మి. గడ్డకిస్తీ వి. చట్రం లోపల సమానమైన మట్టంలో ఉండే కిస్తీ. గడ్డకుదమడికొట్టు స.క్రి. మొట్టమొదటకుదం నలపతో వాటను గట్టిగా కొట్టు. గడ్డకు(బెట్టు (-పెట్టు) స.క్రి. 1. చంపు ; 2. చదుము. గడ్డకొడవలి వి. ఒకరకం కోత కొడవలి. గడ్డగుడ్డ వి.బ.వ. అన్నవస్త్రాలు. గడ్డగొట్టు (-కొట్టు) స.క్రి. 1. నష్టపరుచు ; 2. అన్యాయం చేయు. గడ్డగొఱ్ఱు (-కొఱ్ఱు) వి. పెద్దగొర్రు, నాలుగు మొదలు ఆరు వరకూ చెక్కలు (కర్రుబిగించే కొయ్యలు) ఉన్న పెద్ద గొర్రు. గడ్డచీర వి. సాదారంగు పెట్టి నేసిన చీర. గడ్డతీరుతీయు స.క్రి. మాగాణిలో ఎత్తుగా ఉన్న నేలను తవ్వి నీరు పారటానికి వీలుగా చేయు. గడ్డతీరువ వి. భూమిని కొలవటం, కొలిచిన భూమి. గడ్డతుంగ వి. ఒక రకం తుంగ (Cypursspcris). గడ్డతెగులు వి. అరటి, పసుపు మొ. వాటి తెగులు. గడ్డనఉండు అ.క్రి. మంచి మేలుస్థితిలో ఉండు, అంటకుండా ఉండు. గడ్డనీలి వి. 1. నీలి వన్నెలో నలుపుఛాయ ; 2. నీలివన్నెలో తెలుపు ఛాయ ; 3. ఒకరకం (కడవ) నీలిరంగు. గడ్డనీలిరంగు వి. బజారులో దొరికే నీలిరంగు. గడ్డనెల్లి[1] వి. దూలగొండి మొక్క, లేక తీగ, తాకితే దురద కలిగించే ఆకులు కలిగిన ఒక మొక్క లేక తీగ (Giradenia heterophylla). గడ్డనెల్లి[2] రూ. గడనెల్లి. వి. సీదకోసం పెంచబడే ఒక చెట్టు (Trema orientalis). గడ్డనేల వి. సారవంతమైన నేల. గడ్డపలుగు వి. 1. గునపం, గుంటకపలుగు ; 2. ఊడైను నిలబెట్టి మోకుతో బిగించడానికి నేలలో పాతిన గునపం ; 3. నవారునేసే కోట మగ్గానికి ఒకపక్క నేలలో పాతిన గునపం. గడ్డపాగడ వి. గడ్డపార, మట్టితవ్వేపొడుగాటి ఇనప పనిముట్టు. గడ్డపాఱ వి. 1. గునపం, ఖనిత్రం. కళా. 6.27 ; 2. మట్టిపని చేయడానికి వడ్డెవాళ్ళువాడే పార ; 3. కొయ్యస్తంభం మీద పీట తగిలించడానికి నాటిన ఇనపముక్క ; 4. ఊడై గునపం ; 5. తివాసీ మగ్గంలోని బిగింపుకు, పక్కన వెజ్జంలో దూర్చిన గడ్డపార. గడ్డపాఱఈత వి. ఈత రాకపోవడం చేత నీళ్ళల్లో గడ్డపార లాగ మునిగిపోవడం. గడ్డపాఱడాగు వి. పొడుగాటి డాగు. గడ్డపాలు అ.క్రి. గడ్డకట్టు. గడ్డపింజెర (ం) వి. ఒకరకం దాబీ (నేతలో డిజైను రావటానికి అమర్చే యంత్రం). గడ్డపీలిక వి. ఓడరంధ్రాల్ని మూయటానికి ఉపయోగించే తారు (anlking tar). గడ్డపెద్ద వి. మంటిపెల్ల. గడ్డపెరు(గు వి. గట్టిగా తోడుకున్న పెరుగు. గడ్డపొదుగు వి. పెద్దపొదుగు (పాలు బాగాయిచ్చేది). గడ్డపొయ్యి రూ.చూ. గడ్డప్రొయ్యి. వి. 1. మూడురాళ్ళుగాని మట్టిపెళ్ళలుగాని పెట్టి ఏర్పరచిన పొయ్యి ; 2. వెనకవైపు పొడుగ్గా తీగెలాగ పెట్టి ముందుపక్క రెండుపొయ్యిలు అమర్చిన వంట పొయ్యి. గడ్డప్రొయ్యి రూ. గడ్డపొయ్యి. వి. గడ్డలతో ఏర్పరచిన పొయ్యి. గడ్డబలియు అ.క్రి. బాగా బలపడు. గడ్డలలోకలుపు అ.క్రి. వెలిగడదున్ని (నీరుపెట్టకుండా దున్ని) ఆగడ్డల్లోనే విత్తనాల్ని చల్లు. గడ్డలాకు వి. మొదలు సన్నగా తర్వాత లావుగా ఉండేట్లు చెక్కిన బండి ఆకు. గడ్డవతు వి. కట్టుబడికి కావలసిన రాళ్ళు దొరికే గుట్ట. గడ్డవిఱుచు అ.క్రి. పొలంలో మెరకతీయు, కొబ్బరి మొ. తోటల్లో పెల్లవిరుచు. గడ్డవేళ్ళు వి.బ.వ. ఆకుల్లో తయారయ్యే ఆహారం ఎక్కువగా ఉన్నప్పుడు ఆహారాన్ని భద్రపరచుకొనే వేళ్ళు. గడ్డారు వి. గడ్డపార.

**గడ్డ**[2] వి. 1. వాగు, చిన్నఏరు ; 2. కొండల్లో పుట్టి వేగంగా ప్రవహించే కాలవ ; 3. చెరువుకు నీళ్ళువచ్చే కాలవ.

గడ్డచిద వి. గొరివిచెట్టు. తెల్లనిపూలుకలిగి, కొమ్మలు కాగడాలకు ఉపయోగపడే చెట్టు (Ixora paruiflora). గడ్డపూతిక వి. బండిమురుదుడు తీగ, ఉత్తరసర్కారులు, దక్కను, అడవుల్లోనూ నీటిపట్టుల్లో పెరిగే ఒకతీగ (Calycopteris stroribunda).

**గడ్డం** వి. 1. పోలుగర్రకు కాడికట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క ; 2. పోతు వానంలోని మొనచెక్కిన భాగం ; 3. బండితోలే మనిషి కూర్చోటానికి పోలుగర్ర మీద వేసేబల్ల.

**గడ్డకొరింద** వి. ముళ్ళుకలిగి పచ్చనిపూలుపూసే ఒక మొక్క (Caesalpinea sepina).

గడ్డగు చూ. గడ్డు[1].
గడ్డంకురమలు వి.బ.వ. గొంగళ్ళునేసే కురమవాళ్ళలో ఒకతెగ.
గడ్డంగోకుకొను చూ. గడ్డము.
గడ్డము రూ. గెడ్డము. వి. 1. గడ్డంమీది పొడుగైన వెంట్రుకల మొత్తం. శృం.నై. 7.93 ; 2. చిబుకం. కళా. 5.61.
క. గడ్డ ; కొడ. గెడ్డ ; తు. గడ్డ ; త. కట్టుకు. గడ్డం ; కెట్టుకు-. గడ్డంమీదిపొడుగైన వెంట్రుకలమొత్తం ; కొం. గడెంకు ; పర్జి. గడ్డమ్ ; కోలా. గడ్డమ్. నా. గడ్డమ్.
గడ్డంగోకుకొను అ.క్రి. సందిగ్ధావస్థలోపడు. గడ్డము మాయు అ.క్రి. గడ్డముపెరుగు. గడ్డాలబాబు వి. మౌని, సన్యాసి.
గడ్డయ రూ.చూ. గడ్డ[1]. వి. లంక, మట్టిబెడ్డ మొదలైనవి.
గడ్డర్ వి. ఇనపదూలం.
ఇం. *Girder*. ఇనపకమ్మి.
<ఇం. Girder.
గడ్డాపురాయి వి. పంచలుదించటానికి పీలుగా అడ్డవాసాలు వేయడానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుకుపొడుచుకు వచ్చేట్లు బిగించినరాయి.
గడ్డాయము రూ. గడ్డెము. వి. బలాత్కారం.
క. కడ్డాయ. బలవంతం, ప్రజలను వస్తువులకు నిర్ణయించిన ధరను ఇవ్వమని బలవంతం చేయటం.
గడ్డారు చూ. గడ్డ[1].
గడ్డాలబాబు చూ. గడ్డము.
గడ్డి వి. 1. కసవు, తృణం, రొడ్డ, పైరులోమొలచిన గడ్డి గాదం. భార.ఉద్యో. 1.93 ; 2. ఒకరకం కలుపుమొక్క, నక్కకొర్ర ; 3. గింజలు రాల్చగా మిగిలినదంటు మొ. ; 4. ఆరిగ, కొర్ర, వరి, వరిగె మొ. పంటలు నూర్చగా మిగిలిన ఆకు, కాడ మొ; 5. పశువులకు మేతగావేసే మొక్కలు, ఆకులు, కాడలు మొ. (పచ్చివిగాని, ఎండువిగాని).
క. గద్దె (-హుల్లు) పశువులమేతకు పనికివచ్చే మేలు రకంగడ్డి ; కోలా. గడ్డి ; గోం. గడ్డీ ; నా. ఘడ్డీ.
పో.చూ. సం. కట-ఖట-ఖడ-. గడ్డి.
గడ్డికట్టు స.క్రి. గడ్డితోకట్టు. గడ్డికండువా వి. గడ్డి మోసుకువెళ్ళటానికి పనికివచ్చేట్లు నేసినఒకరకంకండువా. గడ్డికఱచు రూ. గడ్డిగఱచు. అ.క్రి. చిక్కులోఉండు. స.క్రి. 1. లంచంతీసుకొను ; 2. గడ్డితిను. గడ్డికళ్లలు వి.బ.వ. గడ్డిపరకలు. గడ్డికొడవలి వి. గడ్డికోయటానికి కలుపు తీయటానికి పనికివచ్చే కొడవలి. గడ్డిగడ్డిచేయు స.క్రి. పాడుచేయు. గడ్డిగఱచు (-కఱచు) రూ.చూ. గడ్డికఱచు. అ.క్రి. చిక్కులోఉండు. స.క్రి. 1. లంచం తీసుకొను ; 2. ఓడినట్లు సైగచేయు ; 3. కసవు తిను. గడ్డి గాదము రూ. గడ్డిగాదం. వి. గడ్డి మొదలైనవి. గడ్డిచుట్ట వి. నిప్పు చేయటానికి ముందుగా అంటించే గడ్డి చుట్ట. గడ్డితలకాయ వి. తెలివిలేని మూర్ఖుడు. గడ్డితినిపించు స.క్రి. మూర్ఖునిగా చేయు. గడ్డితిను అ.క్రి. 1. మూర్ఖుడగు ; 2. చిక్కులుపడు. స.క్రి. 1. లంచం తిను ; 2. ఓడినట్లు సైగచేయు ; 3. కసవుతిను. గడ్డితుక్కు వి. నలిగిపనికిరానిగడ్డి. గడ్డిదుబ్బు వి. 1. పొట్టకర్ర గంటకర్ర ; 2. దుబ్బుగాపెరిగినగడ్డి. గడ్డినువ్వులు వి.బ.వ. ఒకజాతినువ్వులు. గడ్డినూనె వి. మంటినూనె, కిరసనాయిలు. గడ్డినేత వి. గడ్డితోఇల్లుకప్పటం. గడ్డివంజ వి. వరిగడ్డి కట్ట. గడ్డిపడుగు వి. తొక్కించటానికి కళ్ళెంలో పరచిన గడ్డి. గడ్డిపరక రూ. గడిపరక. వి. 1. తృణ ఖండం, అల్ప తృణం. కు.సం. 10.173 ; 2. గడ్డిపరకవలె అల్పమైన(ది) వాడు. గడ్డిపాము వి. ఒకజాతిపాము. గడ్డిపిట్ట వి. పక్షివిశేషం. రసిక. 1.67. గడ్డిపెట్టు స.క్రి. 1. చీవాట్లుపెట్టు ; 2. గడ్డితినిపించు. గడ్డిపోగులకోక వి. ఒకకొంగుకిఎరుపు, రెండు కొంగులుతెలుపు చొప్పున నిలువుపోగులుపెట్టినేసిన చీర. గడ్డిపోగులచీర వి. ఒకకొంగికి ఎరుపు, రెండుకొంగులు తెలుపుచొప్పున నిలువుకుపెట్టిన నేసినచీర. గడ్డిపోచ వి. 1. అల్పతృణం ; 2. గడ్డిపోచవలెఅల్పమైన(ది)వాడు. గడ్డిబెండు వి. గడ్డికట్ట. గడ్డిబొద్దు రూ. గడ్డిబొద్దువ. వి. 1. కొన్ని మోపులపరిమాణంకలిగి బండిమీదతీసుకొనివచ్చే పెద్దగడ్డికట్ట. చంద్రరే. 1.69 ; 2. చుట్టకుదురు. గడ్డి బొద్దువ రూ.చూ. గడ్డిబొద్దు. వి. చుట్టకుదురు. గడ్డిమచ్చ వి. పొగబయటికిరాక నల్లగా గడ్డిపరకల్లాగా కుండలపై ఏర్పడేమచ్చ. గడ్డిమేటి రూ.చూ. గడ్డిమేటు. వి. గడ్డి బొద్దు. గడ్డిమేటు రూ. గడ్డిమేటి. వి. వెంటితో బిగించిన పెద్దగడ్డికుప్ప. గడ్డిమొలత్రాడు వి. ముంజదర్భలమొల తాడు. గడ్డిల్లు వి. పూరిల్లు, గడ్డితోకప్పినఇల్లు. <గడ్డి+ ఇల్లు. గడ్డివడ్లు వి.బ.వ. చాములు, సస్యవిశేషం. గడ్డివామి వి. గడ్డిని మొత్తంగాఒకచోటపేర్చిన పెద్దకుప్ప. గడ్డిసుమ్మలు వి.బ.వ. ఆములో కుండలుకట్టడానికి కుండలకింద పడుగు లాగ కుదుర్లాగపేర్చినగడ్డిచుట్టలు. గడ్డిగత్రా వి. గడ్డిమొదలైనవి. గడ్డిగాదం రూ.చూ. గడ్డిగాదము. వి. గడ్డి మొదలైనవి.
గడ్డిగము చూ. జడ్డిగము. వి. చాలువెంటనేగింజలు పడటానికి వాడే కొర్రుమీదగొట్టంలాగఉండేసాధనం.
గడ్డినక రూ.చూ. గండినక. వి. పెద్దకణాలుగాఉండేఇసక.
గడ్డిగత్రా చూ. గడ్డి.
గడ్డిగాదం చూ. గడ్డి.
గడ్డు[1] రూ. గడు, చూ. గట్టి. విశే. 1. అధికుడు, ఎక్కువ వాడు. రామలిం.శ. 26 ; 2. అసాధ్యమయిన ; 3. గట్టి, కష్టమైన ; వి. ఆధిక్యం. అతిశయం.
క. గడ్డె, గంటె. ముద్ద, మొత్తం ; తు. గట్టి, గడుసు. గట్టి, దృఢం ; త. కట్టు. గట్టిపరచు, గడ్డ, కఠిన ; మ. కట్టి. ముద్ద ; కో. కట్యా.
గడ్డగు అ.క్రి. దుష్కరమగు. గడ్డుకొను అ.క్రి. అతిశయించు, ముమ్మరించు. భీమ. 5.8. గడ్డుతిరుగు అ.క్రి. పరిష్కారంకాకుండు. గడ్డుదంటు వి. కంకివెయ్యనివట్టి దంటు. గడ్డుమన్నెము రూ. గడుమన్నెము. వి. లోమన్నెం, చొరరానికొండప్రదేశం. గడ్డురుకు రూ.చూ గడ్డుఱుకు. అ.క్రి. 1. పారిపోవు. తప్పుకొనిపోవు ; 2. పైబడు, కలియబడు, <గడ్డు[1]+ఉరుకు. గడ్డురోగం వి. మొదళ్ళ దగ్గరబుడిపెలుఏర్పడి అందులో పురుగులుచేరే పొగాకు

తెగులు. గడ్డురోజులు వి.బ.వ. కష్టకాలం, కఠినమైనదినాలు. గడ్డుఱుకు రూ. గడ్డురుకు. స.క్రి. 1. పారిపోవు, తప్పించు కొనిపోవు. హరి. ఉ. 4.29 ; 2. పైబడు. రాఘవ. 4.152. వి. బలాత్కారం. <గడ్డు[1]+ఉరుకు. గడ్డువడు (-పడు) అ.క్రి. అడ్డుపడు, గడ్డుతిరుగు. గడ్డుసమస్య వి. కఠినసమస్య.

గడ్డు[2] వి. గట్టు, ఒడ్డు.

క. *గడ్డె*. గట్టు, ఒడ్డు, తీరం.

గడ్డుగ వి. ఒకవిధమైనపన్ను లేదా సుంకం.

గడ్డుగమాడలు వి.బ.వ. ఒకవిధమైనపన్ను లేక సుంకం.

గడ్డువమడి వి. వరిపంట సేద్యానికనువైన భూమి.

గడ్డెనబొడ్డి రూ. గడ్డెనబొడ్డు. వి. బాలురక్రీడావిశేషం.

గడ్డెనబొడ్డు రూ.చూ. గడ్డెనబొడ్డి. వి. బాలక్రీడావిశేషం.

గడ్డెము రూ.చూ. గడ్డాయము. వి. బలాత్కారం.

గడ్డారుపిడత వి. కూరకు, పులుసుకు వాడే మధ్యరకంపైఉ మట్టిపాత్ర.

గడ్పపన్ను చూ. గడప. వి. ఇంటిపన్ను.

గడ్యారము రూ.చూ. గడియారము. వి. గడియారం.

గణగణ రూ. ఘణఘణ, ఘణంఘణ. వి. ఘంటాధ్వనికి అనుకరణం. ప్రబంధ. 18.

క. *గణగణ*-. ఘంటానాదానికి అనుకరణ ; త. *కణ కణ*-.

గణగణలాడు అ.క్రి. గంటమోగు.

గణాకు వి. చుక్కకూ, ఒకరకం ఆకుకూర.

గణాకుండ రూ.చూ. గణేకుండ. వి. ఒకరకం వాద్యపుకుండ.

గణాచారి వి. 1. దయ్యం లేక క్షుద్ర దేవతలు పూనినవాడు శుక. 3.18 ; 2. దయ్యాన్ని వెళ్ళగొట్టేవాడు ; 3. శ్రేష్ఠుడు ; 4. నాయకుడు.

<సం. గణాచారిన్.

గణాచారిఇనాం వి. గ్రామదేవతోత్సవాల్లో ఒళ్ళుపెరిగే వ్యక్తికిఇచ్చిన ఇనాం.

గణితంకట్టు స.క్రి. ఇంటి ఆయువును నిర్ణయించు.

సం. *గణిత*-. లెక్క.

గణితి వి. ఎంచదగిన లెక్క.

క. *గణతి*. లెక్కించడం.

హిం. *గణ్‌నా*. లెక్కించడం.

గణియము రూ. గణెము. వి. వేషధారులు ధరించే లక్క సొమ్ము.

గణిల్లు రూ. ఘణిల్లు. వి. 1. గంటమోగే ధ్వనికి అనుకరణం ; 2. ఎద్దు రంకెకు అనుకరణ ధ్వని.

క. *గణ* ; *గణల్*, *గణిల్*. గంటలుమోగే ధ్వనికి అనుకరణ ధ్వని.

గణు విణ. పెద్ద, ముఖ్యమైన.

గణుతి వి. 1. స్తోత్రం. రఘు. 3.90 ; 2. ఎన్నిక. హంస. 2.48 ; 3. లెక్క, లక్ష్యం. శశా. 2.25.

సం. *గణిత*-, గణించబడేది, గణించటం, లెక్కించటం.

<సం. గణిత - (అర్థవిపరి.).

గణుతించు స.క్రి. 1. లక్ష్యపెట్టు. నిర్వ.రా. 3.108 ; 2. ఎంచు, భావించు. భార. శాంతి. 5.247 ; 3. స్తుతించు. భీమ. 1.7 ; 4. లెక్కించు. భాగ. 120. గణుతిసేయు (-చేయు) స.క్రి. లెక్కచేయు, లక్ష్యపెట్టు.

గణుపు రూ.చూ. కణుపు. వి. జంపరు కణుపు, గుంద్రటి భాగాన్ని, పలకల భాగాన్ని వేరుచేసే చోట ఉన్న ఉబ్బెత్తు భాగం.

గణుపుగానితోలుగాఁడు వి. తొప్పె.

గణుసు (గడ్డ) రూ.చూ. గెనుసు (గడ్డ). వి. చిలగడదుంప.

గణె రూ.చూ. గడె[1]. వి. అర్గళం.

గణెము రూ.చూ. గణియము. వి. వేషధారులు ధరించే లక్క సొమ్ము.

గణేకుండ రూ.చూ. గడేకుండ. వి. ఒకరకం వాద్యపుకుండ.

గణేశభోగాలు వి.బ.వ. ఒకరకం పెద్దగింజవడ్లు.

గణేష్‌పట్టె వి. వినాయకుడి విగ్రహం చెక్కిన ద్వారబంధపు పై పట్టె.

సం. *గణేశ*-. వినాయకుడు.

గంట[1] వి. 1. వాద్యవిశేషం. కు. సం. 8.22 ; 2. కింకిణి, చిరుగంట. యయా. 4.89 ; 3. (ఒక గడియ = 24 నిమిషాల కాలం.) రెండున్నర గడియల కాలం. ఆం.భా. 3.52 ; 4. ఏమీలేకుండడం, రిక్తత.

సం. *ఘంటా*.; ప్రా. *ఘంటా* ; అప. *ఘంటు*, *ఘండా* ; పా. *ఘంటా*. నే. *ఘంటు* ; హిం. *ఘంటా* ;

క. *గంటె*. ఇంగ్లీషు కాలంలోని గంట ; తు. *గంటె* ; త. *కంటై* ; కుఇ. *గొంటు* ; బ్రా. *ఘంటు*. గంట రెండున్నర గడియల కాలం.

<ప్రా. ఘంటా.

గంటకొట్టు స.క్రి. గంటవాయించు. అ.క్రి. చచ్చు, చనిపోవు. గంటచుక్క వి. కుందేటి చుక్క, పొద్దుపొడవ టానికి ముందు తూర్పున, పొద్దుగుంకిన వెనుక పడమ టనూ కన్పించే చుక్క. గంటపగులు అ.క్రి. చీలు. గంట మొలమాలు వి. కింకిణిమేఖల. గంటల్లు రూ. గంటెర్రు. వి. పశువుల మెడమీది పుండు. <గంట[1]+అల్లు. గంటలగడ వి. ఉత్తరాలు మొ. వాటిలో ఉపయుక్తమయ్యే ఒకరకం గంటలకర్ర. గంటలమొలనూలు వి. కింకిణిమేఖల. గంటవాఁడు రూ.చూ. గంటవాండు. వి. గంటవాయించేవాడు. గంట వాండు రూ. గంటవాఁడు. వి. గంటవాయించేవాడు. గంటవాయించు స.క్రి. 1. గంటకొట్టు ; 2. ఎగవేయు. గంటవేఁట వి. రాత్రిపూట ఆడే ఒకరకం ఆట (ఇందు దీపాలు, చిరుగంటలు ఉపయోగిస్తారు). కాశ. 3.47. గంటవేఁటరి వి. గంటవేట ఆడేవాడు. అష్ట. క. 2 పు.87. గంటవ్రేయు స.క్రి. గంటలుకొట్టు. కాశీ. 5.307. గంటపాల వి. గంటకంబం. గంటనుడి వి. గంగిరెద్దు మీద నుడి. గంటనూరి (చూరు)వి. వాలుగా ఉన్న చూరు.

గంట[2] వి. గడ్డిదుబ్బు. భార. ఆది. 2.143.

క. *గంటె*. గడ్డి కర్రలు, చిన్న చిన్న చెట్లు, ఒకరకం గడ్డి ; హో.చూ. హిం. ఘంటుకరన్. ఒకరకం గడ్డి.

గంటకట్టు అ.క్రి. దుబ్బుకట్టు. గంటకఱ్ఱ వి. సస్య గుచ్ఛం. ఆం.భా. 2.237 ; గంటకొఱ్ఱలు వి.బ.వ. ధాన్య

విశేషం. గంటపిట్ట వి. పక్షివిశేషం. గంటమొలకలు వి.బ.వ. మొలకొలకుల్లో ఒకరకం. గంటలగడ్డి వి. మెట్టలో పెరిగే కలుపు మొక్క (Eleusina indica Galstn). గంటలలం వి. గంటగాకు (Eleusina indica Gaertn).

గంటం రూ.చూ. గంటము. వి. 1. రాతిమీద పూజలు చెక్కడానికి వాడే పదునైన ఇనపసాధనం; 2. దబ్బా రాట్నం బొమ్మలకుగాని, దొడ్డినిలువులకుగాని బిగించే మందపు కడ్డీ, పెద్ద కదురు; 3. మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు వేసిన అడ్డపుల్ల; 4. పేటువడికి కింద వేలాడ గట్టిన బరువు; 5. జాకార్డుడాబీ అమర్చిన మగ్గంలో, వడికి చివర కట్టిన ఇనపఊచ; 6. పత్తినుంచి గింజలు వేరు చెయ్యడానికి వాడే ఇనప కఱ్ఱ; 7. ఏకు తయారు చెయ్యడానికి ఉపయోగించే పుల్ల.

గంటంగుజ్జు వి. దబ్బారాట్నానికి గంటం బిగించే నిలువు చెక్క. గంటందిండు వి. గంటానికి బిగించిన రీలు దారపు గిలక.

గంటకాకు వి. మెట్టలో పెరిగే కలుపు మొక్క (Eleusina indica Gaertn).

గంటవామబద్ద వి. తలుపురెక్కమీద అడ్డంగా బిగించే కొయ్య బద్ద.

గంటము రూ. గంటం, గంట్లం. వి. ఉక్కు మొదలైన వాటితో చేయబడి తాటాకుల మీద రాయడానికి ఉపయోగించే సాధనం. భీమ. 1.80.

హిం. గంటమ్-. ఉక్కు మొ. వాటితో చేయబడి తాటాకులమీద రాయడానికి ఉపయోగించే సాధనం.

క. కంఠ; త. కంటమ్.

గంటలమ్మ రూ.చూ. గంటాలమ్మ. వి. ఒక గ్రామదేవత.

గంటాలమ్మ రూ. గంటలమ్మ. వి. గ్రామదేవత.

గంటి[1] రూ.చూ. గంటు. వి. 1. గాయం, క్షతం.భార.శల్య. 2.160; 2. దుఃఖం. యయా. 4; 3. రంధ్రం, కన్నం. విజయ. 3.25.

గంటిపడు రూ.చూ. గంటివడు. అ.క్రి. 1. గాయమగు; 2. కన్నమేర్పడు. గంటివఱుచు స.క్రి. రంధ్రం పడేట్లు చేయు. చంద్రాంగ. 4.193. గంటిపెట్టు రూ.చూ. గంటి వెట్టు. స.క్రి. గంటిపడచేయు. గంటివడు (-పడు) రూ. గంటిపడు. అ.క్రి. గాయపడు. భాస్క.రా. యు. 480. గంటివెట్టు (-పెట్టు) రూ. గంటిపెట్టు. స.క్రి. బొఱ్ఱెపెట్టు. శేయా. 3.143. గంటిసేయు (-చేయు) స.క్రి. గాయపరచు. దశా. 3.17.

గంటి[2] రూ.చూ. గంటె[2]. వి. సజ్జ (Pennisatum typholidicum).

గంటిముగ్గు వి. గంటెన్నుతో వేసిన పిండిముగ్గు.

గంటిగివలం వి. మెట్టలో పెరిగే కలుపుమొక్క (Eleusina indica Gaurtn).

గంటిపోట్లాటలు వి.బ.వ. బాలక్రీడావిశేషం, ఆందలాలు.

గంటియ రూ.చూ. గంటె[2]. వి. ఒకరకం ఆహారధాన్యం.

గంటియలు రూ.చూ. గంటీలు. వి.బ.వ. చెవిపోగులు.

గంటీలు రూ. కంటీలు, గంటియలు, గంట్లు. వి.బ.వ. కర్ణవేష్టన విశేషం, ఒకరకం చెవిపోగులు. హంస. 4.138.

సం. ఘంటికా. చిరుగంట; ప్రా. ఘంటియా. ఆభరణవిశేషం, చిరుగంట.

క. గంటి. ఒకరకం చిన్న బంగారపు చెవిపోగులు.

<ప్రా. ఘంటియా.

గంటు రూ. గంటి[1]. చూ. గండి. వి. 1. పెంట్రుకలముడి. భార. సభా. 1.200; 2. హృదయగ్రంథి. ప్రబోధ. 5.108; 3. సంచిముడి. ఆము. 4.3; 4. గణుపు, పర్వం, ఆం.భా. 2.74; 5. పగులు, చీలు, 6. నొక్కు, రాతిలోని గుంట; 7. వేసిన రంధ్రం. 8. గాయం; 9. వ్యవహారం; 10. పేచీ, వివాదం; 11. దెబ్బతగిలి ఏర్పడ్డ కదుం లేక కాయ (బొప్పి); 12. స్వల్పమైన పన్ను చెల్లిస్తూ వంశపారంపర్యంగా అనుభవించే ఒక విధమైన భూస్వామ్యం; 13. పేచీ; 14. ఆస్తి. స.క్రి. గాయ పరచు. నృసింహ. 5.12.

సం. /గంథి-. ముడి; ప్రా. గంఠి-. ముడి; పా. గంఠి.

క. గంటు. చెరకు, వెదురు మొదలగు వాటి కఱ్ఱల మధ్య ఉండే కణుపుముడి, సంచి, మూట మొదలైన వాటి ముడి.

<పా. గంఠి-.

గంటుగూరు (-కూరు) అ.క్రి. ధనం సమకూరు. గంటు వొప్పి వి. రుతుశూల. గంటుపోవు అ.క్రి. 1. నష్టమగు; 2. గాయపడు. గంటుబడు (-పడు) అ.క్రి. 1. పనిసాఫీగా జరగకుండా పాడయిపోవు; 2. ముడిపడు; 3. ప్రతి బంధకం ఏర్పడు; 4. పెంటబడు. గంటుబారంగి వి. ఔషధాల్లో ఉపయోగపడే ఒక మొక్క. ఆం. భా. 2.54. క. గంటుబారంగి. ఔషధివిశేషం (Clerodendron serratun). గంటుమడి వి. గడ్డెమడి, వరిమడి. గంటు మినుము వి. మినుములో ఒకరకం. గంటువెట్టు (-పెట్టు) స.క్రి. ముడిపడేట్లు చేయు. భార. ఉద్యో. 3.73. గంటువేయు స.క్రి. తెగిన ఉన్నిపోగులు ముడివేయు. గంటుసేయు (-చేయు) స.క్రి. (దబ్బు) నిలువచేయు. గంట్లాడు స.క్రి. 1. లాగు, ఆకర్షించు; 2. పోట్లాడు.

గంటె[1] రూ.చూ. గరిఁటె. వి. గరిట. ఆం.భా. 2.243.

గంటెకర్ర వి. గరిటెలాగ దొప్పగా ఉండే కరిడి. గంటెకలుపు స.క్రి. వంటచేయు. గంటెకాడ[1] వి. గరిటెకాడ. గంటెదీసోడా వి. మగ్గం దగ్గర దీపం పెట్టుకొనే చిప్ప, గరిటెమాదిరిది.

గంటె[2] రూ. గంటి[2], గంటియ. వి. ఒకరకం ఆహారధాన్యం, సజ్జ. భీమ. 3.57 (Pennisetum Typhoides).

గంటెకాడ[2] వి. ఒకానొక చెట్టు. గంటెనేల వి. గంటెలు పండే నేల. గంటెమ్న వి. ముగ్గువేయడానికి వాడే సాధనం. గంటెపిట్ట వి. వరిగంటెపిట్ట. గంటెలు వి.బ.వ. సజ్జలు.

గంటె[3] వి. మెట్టలో పెరిగే ఒక కలుపుమొక్క (Eleusin-indica gaertn).

గంటెదూలం రూ. గండెదూలం. వి. మోటబావిమీద అడ్డంగా వేసిన పట్టె.

గంటెవ వి. గిరికర్ణిక, వృక్షవిశేషం.

గంటెర్రు రూ.చూ. గంటర్రు. వి. అర్రు (మెడ) మీది పండు.

గంటెనము వి. అస్థలితోక్తి.

గంట్లం రూ.చూ. గంటము. వి. గంటం, ఉక్కు కలం.

గంట్లెకచోరము వి. షడ్గ్రంథిక.

గంట్లకామగు వి. వృక్షవిశేషం, షడ్గ్రంథం, గాదప్నం.

గంట్లము వి. 1. గర్భిణీ స్త్రీలకు పెట్టేనూడిద. యయా. 4.25 ; 2. గర్భిణీ స్త్రీ యొక్క కోరిక.

గంట్లాడు చూ. గంటు.

గంట్లు రూ.చూ. గంటిలు. వి.బ.వ. 1. కర్ణవేష్టనవిశేషం, ఒకరకంచెవిపోగులు ; 2. తునకలు.

గండ[1] వి. 1. మగడు. మను. 1.12 ; 2. శూరుడు. అచ్చ.రా. యు. 6.598 ; 3. మిండడు.

క. గండ. బలవంతుడు, శక్తిమంతుడు, భర్త ; త. కందన్ ;

నం. గండ-.

గండకట్టెలు వి.బ.వ. వంటకట్టెలు. గండకత్తెర రూ. గండ్రకత్తెర. వి. 1. మెడకత్తెర, మెడమీదకత్తిరించే ఒక రకం కత్తెర. కళా. 6.43 ; 2. కష్టం, సంకటం. గండకత్తెర వేయు అ.క్రి. మరణశిక్షవేయు. గండగొడ్డలి రూ. గండ్రగొడ్డలి. వి. ఔ. పరశువు. పరమ. 2.124. నం. ఖండ కురార-. గండ్రగొడ్డలి. గండగొడ్డలితాల్పు వి. పరశు రాముడు. అచ్చ.రా. యు. 22. గండగొండిచేయు స.క్రి. తగాదాపెట్టు, మొండితగాదాపెట్టు. గండడు వి. శూరుడు, మగడు. వీర. వి. 5.79. గండదొంగించు స.క్రి. మద మణచు. గండభేరుండము వి. రెండుతలలుమూడు కన్నులు ఉన్నపక్షి విశేషం. నం. భేరుండ-. పక్షివిశేషం. <గండ[1]+భేరుండ- గండముంగిభులు వి.బ.వ. వీరులు కావుండ తగినముందరివాకిళ్ళు. గండరి విశ. శూరత్వంగల, మొగతనంగల. గండరగండడు వి. శూరులందరికీ శూరుడు. నరస. 5.20.

గండ[2] వి. మొక్కుబడి.

గండతల రూ.చూ. గండదల. వి. 1. బలిగాఇచ్చేతల ; 2. మొక్కుబడి. గండదల (-తల) రూ. గండతల. వి. మొక్కు బడికిఇచ్చేతల. భోజ. 5.249. గండదివ్వె వి. మొక్కుబడికై పెట్టేజ్యోతి. గండదీపము రూ. గండాదీపము. వి. మొక్కుబడి దీపం. శుక. 2.495. గండదీపమెత్తు స.క్రి. మొక్కుబడి చెల్లించడానికి, గోదుమపిండితోగాని అన్నంతోగాని పెమ్మె లాగచేసి, అందులోగుంటచేసి, నెయ్యిపోసి, వత్తివేసి దీపాన్ని వెలిగించు.

గండకబరిబెవురుగు వి. ఎన్నెమ్మపురుగు.

గండంగి వి. పెద్దనల్లకోతి, కొండముచ్చు.

గండరగించు చూ. గండు.

గండరగు చూ. గండు.

గండరచు చూ. గండు.

గండఱచు చూ. గండు.

గండదూలం రూ. కండదూలం. వి. పిలదూలం, దూలానికి సమాంతరంగా గుజ్జులమీదవేసే చిన్నదూలం.

గండపర్కమాడలు వి.బ.వ. నాణెవిశేషం.

గండపెండరము రూ.చూ. గండపెండారము. వి. బిరుదుటందె. దశా. 7.250.

గండపెండారము రూ. గండపెండరము, గండపెండియము, గండపెండియరము, గండపెండెము, గండపెండెరము, గండ పెండేరము. వి. శూరులు, కవులు మొ. వారు కాలికి బిరుదుగా ధరించే అందె. కాశీ. 1.45.

క. గండపెండేర-. శూరులు, కవులు మొ. వారుకాలికి బిరుదుగా ధరించే అందె.

గండపెండియము రూ.చూ. గండపెండారము. వి. బిరుదుటందె.

గండపెండియరము రూ.చూ. గండపెండారము. వి. బిరుదు టందె. మను. 1.51.

గండపెండెము రూ.చూ. గండపెండారము. వి. బిరుదుటందె. ఉ.రా. 2.421.

గండపెండెరము రూ.చూ. గండపెండారము. వి. బిరుదుటందె. రసిక. 1.48.

గండపెండేరము రూ.చూ. గండపెండారము. వి. బిరుదుటందె (అల్లసానిపెద్దన చాటువు).

గండపెరోజా వి. శ్రీవాసం.

గండబేటము వి. ప్రేమ.

గండమాడ వి. అర్ధనిష్కం.

గండము వి. కేదారం, వరిభూమి. ద. హిం.గా. సంపు. 4. గా.సం. 1248.

గండరించు రూ.చూ. ఖండరించు. స.క్రి. 1. పడియచ్చు మొద లైన వాటిలో విగ్రహాదుల్ని నిర్మించు. కు.సం. 7.111. భార. విరా. 2.134 ; 2. పుట్టించు. మార్క; 3. అ.క్రి. 1. ఉదయించు, పుట్టు. భాగ. 6.260 ; 2. అతిశయించు, ప్రకాశించు. భాగ. 9.260.

గండరుడు వి. గండడు. వీర. వి. 4.79.

క. గండు-. మగజాతి, పురుషుడు, బలవంతుడు, ధైర్యం.

గండరులు వి.బ.వ. తునకలు.

నం. ఖండ-.ముక్క, తునక.

గండరువు రూ. గండారము. వి. పడియచ్చు, ఒత్తిరూపమేర్పరచ టానికి తొలిచిచేసినఅచ్చు. నిర్వ.రా. 6.53. భార. అను. 1.183.

గండరువొనరించు స.క్రి. దేవతాప్రతిమచేయు.

గండరువొనరించు చూ. గండరువు.

గండలించు రూ.చూ. ఖండరించు. అ.క్రి. కలుగు, పుట్టు.

గండలియతీగె వి. మహేశ్వరీలత.

గండవ వి. గండి.

గండవడము రూ.చూ. కండవడము. వి. యవనిక, తెర. షో.చ. 8.61.

గండసర్జ వి. సజ్జలోఒకరకం.

గండాగొండి వి. అరితేరినదిట్ట. విశ. అరితేరిన.

గండాగొండితనము వి. మొండితనం.

గండాడు చూ. గండు.

గండాదీపము రూ.చూ. గండదీపము. వి. మొక్కుబడిదీపం.

గండానవచ్చు అ.క్రి. ప్రమాదకరమగు. శాశ్వ. 6.8.

సం. *గండ*-. ప్రమాదం.

**గండాపిండి** వి. అనవసరప్రయాస.

**గండారపుబొమ్మ** చూ. గండారము.

**గండారము** రూ.చూ. గండరువు. వి. **1.** పడియచ్చుతోతీసినప్రతి కృతి. ఉ.హరి. 1.60 ; **2.** పడియచ్చు. ప్రబంధ. 788. **గండారపుబొమ్మ** వి. రాతితోచెక్కినబొమ్మ. ఉ.హరి. 1.60.

**గండారు** వి. చెరసాల. యయా. 4.8.

**గండి** రూ. గండె². వి. **1.** సందు, అవకాశం. భార. ద్రోణ. 3.88 ; **2.** రంధ్రం. భాగ. 10పూ. 1559 ; **3.** బిలం. భోజ. 5.75 ; **4.** గుంట. మను. 6.27 ; **5.** బట్టీలోనిప్పు పెట్టటానికి తెరచిఉంచిన రంధ్రం ; **6.** నీళ్ళుపోయేదారి ; **7.** దూలానికి దానిమీద దంతెపై మట్టానికి మధ్యఉన్న జాగా ; **8.** చెరువుకట్టగాని, పొలంగట్టుగాని నీళ్ళఉరవడికి తెగినచోటు ; **9.** మడిగట్టుతెంపినీళ్ళుపెట్టేదారి, మడవ ; **10.** పొలంలో వాననీటిపారుదలవల్ల ఏర్పడ్డ పల్లం లేక గొయ్యి.

క. *కండి, గండి*-. బెజ్జం ; తు. *కండి, గండి*. బెజ్జం ; మ. *కంటి*, ఖాళీ, గోడపగులు ; కోలా. *గండ్*- ; బ్రా. *కండి*. ఖాళీ, గండి.

<మూ.ద్రా.* కణ్-త్-.

**గండిక** వి. గండి. **గండికాఁడగు** అ.క్రి. నేర్పరిఅగు, దొంగయగు. తాళ్ళ. సం. 9.283. **గండికొట్టు** స.క్రి. దొంగిలించు. **గండిచేయు** స.క్రి. కన్నంకలదిగా చేయు. మను. 3.40. **గండిదొంగ** వి. కన్నపుదొంగ సీలా. 3.52. **గండిన** వి. **1.** రంధ్రం ; **2.** సందు ; **3.** పగులు. **గండిపడు** అ.క్రి. **1.** నష్టంవచ్చు ; **2.** గట్టుతెగు.

**గండికట్టు** స.క్రి. అత్తెనరుపెట్టు.

**గండిపనము** వి. ఒకరకంమొక్క, గ్రంథిపర్ణం, పచ్చాకు. అం.బా. 2.162.

సం. *గ్రంథిపర్ణ*-. ఒకరకంమొక్క. హిం. *గంఠివన్*. ఒకరకంమొక్క, గంధిపర్ణి.

**గండినక** చూ. గండు.

**గండినుక** చూ. గండు.

**గండీఁగ** చూ. గండు.

**గండు** వి. **1.** గర్వం. భార.సౌప్తి. 1.22 ; **2.** మగతనం. భార. స్త్రీ. 2.77 ; **3.** బలం, శక్తి. భార. అశ్వ. 3.124 ; **4.** పశుజాతిలోమగది. మను. 4.36 ; **5.** కోపం. శుక. 4.43. విశ. మగది. భార. అను. 1.181.

క. *గండు*, బలం, ధైర్యం, జంతువుల్లో మగది ; కొడ. *కండె*. కుక్కలు మొ. వాటిల్లోమగది ; తు. *గండు*. మగ, బలంగల ; త. *కెంటన్*. ధృఢకాయుడు. మ. *కంటన్*. ముఖ్యంగా పిల్లలలోమగది ; కోట. *గంగ్*. మగ.

**గండడఁగించు** స.క్రి. పొగరణచు. ఉ. హరి. 1.87. **గండడఁగు** రూ. గండణఁగు. అ.క్రి. **1.** బలహీనుడగు. భార. ద్రోణ. 4.153 ; **2.** చచ్చు ; **3.** మదమడుగు. **గండడఁచు** స.క్రి. ఓడించు, లొంగదీయు. ఐంచు. 1.152. **గండణఁగు** రూ.చూ. గండడఁగు. అ.క్రి. **1.** మంద మీదుగు ; **2.** చచ్చు. **గండాడు** స.క్రి. కలియు. సంగమించు. విజ్ఞా. 2.126. **గండినక** రూ. గడ్డిస్క. గండినుక, గండ్రినక. వి. పెద్దకణాలుగా ఉండే ఇనక. <గండు+ఇనక. **గండినుక** రూ.చూ. గండినక. వి. పెద్దకణాలుగఉండే ఇసుక. <గండు+ఇసుక. **గండీఁగ** వి. పెద్దఈగ <గండు+ఈఁగ. **గండుకరణము** వి. పక్షివిశేషం. **గండుగన్నేరు** వి. కొండగన్నేరు, ఒకరకంచెట్టు. (Alstonia nereifolia). **గండుఁగోయిల (-కోయిల)** వి. మగకోయిల. భార. అను. 1.191. **గండుచీమ** రూ. గండుఁజీమ. వి. పెద్దనల్లచీమ. **గండుఁజీమ (-చీమ)** రూ.చూ. గండుచీమ. వి. పెద్దనల్లచీమ. **గండుతెప్ప** వి. పెద్దమబ్బు. **గండుదేరు (-తేరు)** అ.క్రి. **1.** బలియు ; **2.** గర్వించు. **గండుపిల్లి** వి. మార్జాలవిశేషం. **గండుబెండువడు (-వడు)** అ.క్రి. నీరసించు, బక్కచిక్కు. **గండుమిగులు** అ.క్రి. **1.** విజృంభించు. భార.ద్రోణ. 5,95 ; **2.** ఒప్పు. దశా. 3.52. **గండుమీను** వి. నదిలోఉండేఒకరకంచేప. **గండుమీఱు** అ.క్రి. శక్తి హెచ్చు. మను. 2.77. **గండుమునురు** వి. జడివాన, ఆసారం. **గండుమూతి** వి. భీకరముఖం. **గండుమెఱయు** అ.క్రి. **1.** ఒప్పు. శృం. నై. 1.57 ; **2.** విజృంభించు, చెలరేగు. **గండుఱాయి** వి. వజ్రం, మగరాయి. హరిశ్చ.ఉ. 3.131. **గండువావిలి** వి. వృక్షవిశేషం. హంస. 4.11. **గండెక్కు** అ.క్రి. మదించు.భల్లా. 3.16. <గండు+ఎక్కు.

**గండుగుదంకొట్టు** స.క్రి. మొట్టమొదట కుదంసలపలో వాటను గట్టిగాకొట్టు.

**గండుమడి** వి. వరిమడి, గద్దెమడి.

**గండె**[1] రూ. గెండ, గెండి, గెండియ, గెండె. వి. మత్స్య విశేషం. ఆము. 5.413, ప్రబంధ. 195.

క. *గెండె-మీన్*. ఒకరకం చేప ; త. *కెండై* ; మ. *కెంట* ; *కెండ*.

**గండె**[2] రూ.చూ. గండి. వి. **1.** రంధ్రం ; **2.** సందు ; **3.** బిలం.

**గండె**[3] రూ.చూ. కండియ. వి. కండె.

**గండెం** రూ.చూ. కండెం. వి. ఎత్తునుగాని, లోతునుగాని తెలిపే పరిమాణం.

**గండెక్కు** చూ. గండు.

**గండెదూలం** రూ.చూ. గంటెదూలం. వి. ఉద్దిలేని మోటబావి మీదగాని ఏతపు బావిమీదగాని అడ్డంగావేసిన పట్టె.

**గండోలము** వి. మత్స్య విశేషం, కుచ్చలమీను.

పో.చూ.సం. *గండోల*-. బెల్లం.

**గండోలి** రూ. గండోలి². వి. హాస్యగాడు, గండోడివాడు.

సం. *గండోలి*-. కందిరీగ.

<సం. గండోలి-. (అర్థవిపరి.).

**గండోలిగాఁడు (-కాఁడు)** రూ.చూ. గండోలిగాఁడు. వి. హాస్యగాడు.

**గండ్ర**[1] విశ. **1.** పరుషమైన. మను. 5.17 ; **2.** గట్టి, పొల్లుకాని. శివ. ధ. 5.8 ; **3.** దుష్టుడైన ; **4.** పెద్దదయిన.

**గండ్రకత్తెర** రూ.చూ. గండకత్తెర. వి. ఆయుధ విశేషం. **గండ్రగుద్దలి** వి. నేలను తవ్వే పనిముట్టు. **గండ్రగొడ్డలి** రూ.చూ. గండగొడ్డలి. వి.పొ. ఒకవిధమైన గొడ్డలి

**గండ్రచీమ** వి. పెద్ద నల్లచీమ. **గండ్రమా(క** వి. పెద్దనూక, పెద్ద తండుల ఖండం. **గండ్రపురి**[1] వి. 1. పెద్దపట్టణం. పాండు. 3.56 ; 2. పోటీకర్ర. **గండ్రపురి**[2] వి. బాగా పెట్టిన పురి. **గండ్రిసక** రూ.చూ. గండినక. వి. పెద్దపెద్ద కణాలుగా ఉండే ఇసుక.

**గండ్ర**[2] వి. ఖండం, ముక్క. పండి. చ. 2. 96.

**గండ్రలుసేయు** స.క్రి. ముక్కలుచేయు. పండి. చ. 2.321. **గం(డిక** రూ. కండిక, కం(డిక[1]. వి. తునక. యయా. 2.32. **గం(డించు** స.క్రి. గం(డలుచేయు, ఖండించు. చెన్న. బసవ. 5.250.

**గం(డిక** చూ. గం(డ[2].

**గం(డించు** చూ. గం(డ[2].

**గం(డివక** చూ. గం(డ[1].

**గండ్లపెనం** చూ. గండి[1]. వి. నన్నని రం(ధ్రాలున్న పెనం.

**గండ్లమూకటి** చూ. గండి[1]. రూ. గెండ్లిమూకటి, గెండ్లుమూకటి. వి. నగభాగంవరకు రం(ధ్రాలుండి రెండంచులుకలిగి, గంజి వార్పుకు వాడే మట్టిమూకుడు.

**గతపడు** అ.క్రి. 1. చచ్చు. రం.రా.యు. 378 పు. 21 పం. ; 2. కడచు ; 3. గంతుకొను ; 4. ప్రాప్తించు.

నం. *గత-*. గతించిన ; హిం. *గత్*. అవ్వటం.

క. *గతిసు*. చచ్చు.

<నం. గత- + పడు. (అర్థవిపరి.).

**గతమగు** అ.క్రి. చనిపోవు. పల్నా. పు. 19.

నం. *గత-*. అయిపోయిన.

<నం. గత- + అగు.

**గతముసేయు(-చేయు)** స.క్రి. చంపు. పండి.చ. 5.521.

నం. *గత-*.కడచిన, నశించిన.

<నం. గత-. + చేయు.

**గతరు** వి. రావిచెట్టువంటి ఒకచెట్టు (Ceriops candoleana).

**గతి** వి. నాలుగు అనే సంఖ్యకు ఉదాహరణం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 198. క్రీ.శ. 1172.

నం. *గతి-*. ఉపాయం. (అర్థవిపరి.).

**గతిగొను** అ.క్రి. ఏకమగు. భాగ. 6.99.

<నం. గతి- + కొను.

**గతిచెక్రం** వి. పెట్టె రాట్నానికిగాని కిసాన్ రాట్నానికిగాని ఎడంవైపున కిందఉండే చిన్న కొయ్యచక్రం.

నం. *గతిచక్ర-*. తిరిగేచక్రం.

<నం. గతిచక్ర-. (అర్థవిపరి.).

**గతిచెడ్డచెడుగు** వి. గతిమాలినవాడు. ద్వి. హరిశ్చ. 2.2034 పం.

**గతిపడు** అ.క్రి. ప్రాప్తించు, లాభించు. సిం.ద్వా. 12.65.

సం. *గతి-*. ప్రాప్తి, గమనం.

**గతిమాలినచే(తలు** చూ. గతిమాలు.

**గతిమాలు** అ.క్రి. దిక్కుమాలు. శాళ్వ. సం. 5.101.

నం. *గతి-*. దిక్కు.

**గతిమాలినచే(తలు** వి.బ.వ. దిక్కుమాలిన చేతలు. సిం. ద్వా. 7.3.

**గతిసేయు(-చేయు)** స.క్రి. గతిఅగు, కాపాడు. సిం.ద్వా. 5.76.

నం. *గతి-*. తోవ.

<నం. గతి- + చేయు.

**గతుకు**[1] రూ.చూ. కతుకు[1]. స.క్రి. కతుకు (కుక్క మొ. కొంచెం కొంచెంగా తిను, నాలుకతో కొంచెం కొంచెంగా తాగు) నాకి తాగు, ఎంగిలితిను. బ్రహ్మా. 2.124.

**గతుకు**[2] వి. చిన్నగొయ్య.

క. *గతుకు*. చిన్నగొయ్య.

**గతుకులుపడు** అ.క్రి. ఎగుడుదిగుడగు.

**గతుక్కుమను** అ.క్రి. 1. బెదురుచే గుండెజారు ; 2. చచ్చు. ధ్వన్యను.

**గత్త** రూ.చూ. గత్తము. వి. ఎరువు, పిడక.

**గత్తబద్ద** వి. మగ్గానికి బిగించిన పడుగులో అచ్చుదగ్గర దూర్చిన బట్ట.

**గత్తము** రూ. గత్త, గెత్తం, గెత్తము. వి. ఎరువు, గొ(రెపెంట.

**గత్తర** వి. 1. క్రమంలేక కలిసిపోవడం. కాశీ. 2.98 ; 2. ఉపద్రవం ; 3. గాబరా ; 4. వాంతి ; 5. కలరా ; 6. గ్రామదేవతకు చేసే జాతర.

**గత్తరకా(డు** వి. క్రమంలేనివాడు. **గత్తరచేయు** స.క్రి. గ్రామదేవతకు జాతరచేయు. **గత్తరపడు** అ.క్రి. 1. క్రమ భంగమగు ; 2. చెదరిపోవు, చెదరు.

**గత్తు**[1] వి. మూత్రగంధం, రొచ్చుకంపు.

క. *గదడు*. పశువుల రొచ్చుకంపు.

**గత్తు**[2] వి. 1. బెదరింపు ; 2. దిటవు.

**గదగలమ్మ** వి. గవదలువాచే అంటువ్యాధి.

**గదమాయించు** స.క్రి. గద్దించు, గదుము.

క. *గదమాయిసు*. గద్దించు, కఠినమైన మాటలుఅను.

<క. గదమాయిసు.

**గదర** వి. ఒకవిధమైన ఎండుచేప.

నే. *గడెరా*. ఒకరకమైనచేప.

**గదరు** రూ. గదురు. వి, దుర్గంధం. కు.సం. 6.37.

**గదవ** వి. బుడ్డబురిజచెట్టు (Careya arborea).

క. *గదరు*. ఆవు మూత్రగంధం, మేకల గొ(రెలవాసన.

**గది** వి. 1. ఇంటిలోపలి అర, గదిలోపలి అర, ఇంట్లోగోడలు మొ. వాటితో వేరుచేయబడిన భాగం ; 2. అయిదున్నర మూరల పొడుగు నాలుగున్నర మూరల వెడల్పులో కొలత గల ఇంటిలోని భాగం ; 3. రోగంకలవాడు ; 4. ఊమ, గొ(రుచెక్కల మధ్యఉండే ఎడం ; 5. పన్నెండు దండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి ; 6. కొయ్యతోచేసిన పెట్టె ; 7. ఇటిక బట్టీలో ఇటికలను పేర్చేభాగం.

**గదిగె** వి. ఒసికర్ర.

**గదిపోవు** అ.క్రి. నేతనేసేటప్పుడు రెండుపోగులు తెగి వెలితి ఏర్పడు.

**గదిరి** వి. అడవిగోరింతచెట్టు. తరిమెనకూ, ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Erythroxylon monogynun).

**గదుకు** రూ.చూ. కతుకు[1]. స.క్రి. కుక్క మొ. కొంచెం కొంచెం తిను. వాసిష్ఠ. 1.7 ; వి. ఎంగిలి తినటం.

**గదుకుమూకంచు** వి. చివర ఎరుపురంగు జమిలిపోగులుపెట్టి

ముప్పాతిక అంగుళం వెడల్పున సాదాపట్టె పసేట్టునేసిన అంచు.

**గదుగుడు** వి. జరగటం, జారుడు.

**గదుము** రూ. గెదుము. స.క్రి. అదలించు, గద్దించు. సారంగ. 1.69. వి. నెట్టు, బొప్పి.

క. *గదఱు*. గట్టిగాశబ్దంచేయు, ఉరుము, గర్జన, అరుపు, ఏడ్పు, పెద్దగొంతుతో బెదిరించు ; తు. *గద్దల*. శబ్దం ; త. *కతఱు* (కతఱ్ఱె). నొప్పితోగాని బాధతోగాని గట్టిగాఅరుచు, మూలుగు, అరచు ; మ. *కతఱుక*. అరచు. బాధపడు.

గదుముకొనిపోవు స.క్రి. తరుముకొనిపోవు. గదుముకొను స.క్రి. గద్దించు, ఉరుము, బెదిరించు. యయా. 5.119.

**గదురు** రూ.చూ. గదరు. వి. దుర్గంధం, దుర్వాసన. పాండు. 2.56. విశ. 1. విన్నం, పచ్చి వాసనకల. ఘటికా. 1.153 ; 2. చెడ్డదైన. భాగ. 7.435. చంద్రాంగ. 5.121 ; స.క్రి. 1. పొందు ; 2. కమ్ముకొను.

గదురుకొను[1] అ.క్రి. చెడుకంపుకొట్టు, కమ్ము. గదురుపిల్ల వి. పదేండ్లలోపు బాలిక. గదురుపిల్లవాడు వి. పదేండ్లలోపు బాలుడు. గదురుకొను[2] స.క్రి. తిట్టు, కసురుకొను.

**గద్ద** రూ.చూ. గ్రద్ద. వి. పక్షివిశేషం, గృధ్రం, గెద్ద.

గద్దకత్తె వి. గడుసు స్త్రీ. గద్దకాడు వి. గడసరి, గడుసువాడు, నేర్పరి. గద్దగొర్తి వి. కిటికీరెక్కను తెరచి ఉంచే ఇనపకొక్కెం. గద్దగోడి రూ. గెద్దగోడి. వి. గద్దగోరులాంటి వాడైన వంకర ముళ్ళున్న కలుపు మొక్క, మల్లెచెట్టులాంటి కలుపుమొక్క (Scutia indica). గద్దగోడు వి. ఊక్తె అర్ధపట్టెకుగాని నరిగుంజకుగాని వేసిన ఇనపకొక్కెం. గద్దగోరు రూ. గెద్దగోరు[1] (Scutia indica). వి. 1. చోర సాధన విశేషం, ఇది గద్దగోరులా వంపుగా ఉండి ఎదుటి దానికి తగిలితే పట్టుకుంటుంది. ప్రబంధ. 269. వేంక. పంచ. 3.166 ; 2. వృక్షవిశేషం (Scutia indica); 3. ఒకరకమైన గొళ్ళెం ; 4. గద్దయొక్క గోరు ; 5. తాళం చెవుల గుత్తి ; 6. తోకచివర చిన్నవంకర ; 7. కిటికీ రెక్కలు వాలకుండా పట్టి ఉంచే పరికరం, ఒకవైపుకు వంగి ఉంటుంది ; 8. అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ. గద్దబొల్లి రూ. గెద్దబొల్లి. వి. ఒళ్ళు నలుపు, మొగం తెలుపుగా ఉండే బొల్లి. గద్దముక్కు వి. గద్దముక్కులాంటి ముక్కు. గద్దముక్కుచేప వి. ఒకరకం చేప. గద్దముక్కువాడు విశ. గద్దముక్కులాంటి ముక్కున్నవాడు, వాడిముక్కు గలవాడు. గద్దరెక్క వి. గద్దగోరు. కిటికీ రెక్కలు గాలికి వాలకుండా పట్టి ఉంచే పరికరం.

**గద్దన** వి. అదలింపు, గద్దింపు. ఆం.భా. 3.30.

**గద్దపిసినిక** వి. ఎరుపుతో కూడిన తెలుపురంగులో గట్టిగా ఉండే కలపకలిగి సింధూరవర్ణపు పూలుపూసే చెట్టు (Woodferdia flolibenda).

**గద్దరి** వి. పొగరు. పల్నా. 90.

**గద్దరి** విశ. 1. పొగరుగల. యయా. 2.18 ; 2. దుష్టం. ఉ.రా. 1.130 ; 3. నిపుణుడు. చంపూ.రా. 2.51 ; 4. దట్టమైన. సీమ. 160 ; 5. నేర్పుగత్తె ; 6. దిట్ట.

గద్దరికాడు వి. నేర్పరి, నిపుణుడు. అచ్చ.రా. సుందర. 12. గద్దరించు స.క్రి. భయపెట్టు, కలతపెట్టు ; అ.క్రి. గర్జించు. వరాహ. 3.4. గద్దరితనము వి. 1. పొగరు. వరాహ. 4.80 ; 2. ధైర్యం. దశా. 4.40 ; 3. గడుసుదనం ; 4. టుంటరితనం.

**గద్దవ** వి. చెంపకింది భాగం, గవుద.

**గద్ది** రూ.చూ. గద్దియ[1]. వి. సింహాసనం.

**గద్దిగ** చూ. గద్దియ[1]. వి. కంబళి, గద్దెమీద వేసే కంబళి, గద్దె కంబళి. కువ.చ. 1.86.

క. *గద్దిగె*. సింహాసనం, ఆసనం ;

నే. *గద్ది*. ఆసనం, సింహాసనం ; హిం. *గద్దీ*. గుర్రాల మీదగాని ఒంటెలమీదగాని పరచిన ఒక రకమయిన బట్ట, కూర్చునే స్థలం, ఆసనం.

<క. గద్దిగె (అర్థవిపరి.).

**గద్దిగిన్నె** వి. పచ్చడి పెట్టుకోడానికి వాడే గద్దె ఉండే చిన్న మట్టిపాత్ర.

**గద్దించు** స.క్రి. అదిలించు, బెదిరించు, గదమాయించు. ప్రభులిం. 3.58.

క. *గద్దిసు*. ఏడ్చు, గదమాయించు, తిట్టు ; త. *కతఱు* (కతఱి). నొప్పితోగాని బాధతోగాని ఏడ్చు ; మ. *కతఱుక*. అరచు.

**గద్దింపు** చూ. గద్దించు. వి. అదిలింపు, గదమాయింపు. కువ.చ. 2.69.

**గద్దియ[1]** రూ. గద్ది, గద్దె[1]. వి. 1. సింహాసనం. భార.విరా. 1.85. హరి. పూ. 1.103 ; హర. 3.40 ; 2. పువ్వుల్లో ఉండే దుద్దు. వసు. 2.32 ; 3. పీఠం, పీట. ఆం.భా. 2.165 ; 4. బీట.

క. *గద్దిగె, గద్దుగె, గర్దుగె*. సింహాసం, ఆసనం ; తు. *గద్దిగె* ; గోం. *గద్ది, గాది* ; పర్జి. *గద్దీ*. సింహాసనం ;

సం. *ఖట్టికా*. సింహాసనం, *గర్త*- (గర్తికా). ఎత్తైన ఆసనం, సింహాసనం, ఋగ్వేదంలోని పీఠం ; మా. *గాది*. ఉన్నతాసనం ; అ.మా. *గొది*. అంబారీ ; నే. *గద్దీ, గాదీ*. ఆసనం, జీవనంమీద వేసే బట్ట, సింహాసనం ; అం. *గాది*. ఎత్తైన అరుగు, వేదిక ; *గాది*. పీఠం ; హిం. *గాదీ*. పీఠం, సింహాసనం ; పం. *గద్దీ*. సింహాసనం ; గు. *గాదీ*. ఉన్నతాసనం.

**గద్దియ[2]** రూ.చూ. గద్దె[2]. వి. బంగారునాణెం, వరహా.

**గద్దియ[3]** రూ.చూ. గద్దె[3]. వి. సోదె.

**గద్దువ** వి. గడ్డం. చిబుకం. కవిక. 4.94.

క. *గద్ద*. గడ్డం ; కొడ. *గెడ్డ*. గడ్డం ; తు. *గడ్డ*. గడ్డం ; త. *కట్టమ్*. చిబుకం ; *కెట్టు*. గడ్డం ; గోం. *గడ్డా* ; కొం. *గడెయ్కు*. గడ్డం ; పర్జి. *గొడ్డం*. గడ్డం ; కొలా. *గడ్డమ్*. చిబుకం, గడ్డం ; నా. *గడ్డమ్*. గెడ్డం ;

పో.చూ. సం. *గణ్డ*-. గండభాగం.

**గద్దె[1]** రూ.చూ. గద్దియ[1]. వి. 1. సింహాసనం. విక్ర. 2.95. హర. 3.40 ; 2. పీఠం, పీట. ఆం. భా. 2.165 ; 3. పువ్వులలో ఉండే దుద్దు ; 4. సోదె ; 5. గద్యం ; 6. తులసికోట దగ్గర కట్టిన తక్కువ ఎత్తుగల చిన్న అరుగు ; 7. గ్రామంలో పెద్దలు సమావేశమయ్యే స్థానం ; 8.

మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య ; 9. గోడకట్టుబడిలో గట్టిదనం కోసం మధ్యమధ్యలో స్తంభాకారంలో కట్టే నిర్మాణం ; 10. మట్టుకూజా మొ. పాత్రలు దొర్లకుండా ఉండటానికి అడుగున మట్టిపెట్టి చేసిన భాగం.

గడ్డెకంచుడు వి. అడుగు భాగంలో గడ్డె ఉండే మట్టి పాత్ర, దీంట్లో కల్లుపోసి అమ్మవారి దగ్గర శాంతికోసం పెడ్తారు. గడ్డెకంబడి వి. గడ్డెమీద వేసే కంబళి. పండి. చ. 5.340. గడ్డెకాళులది రూ. గడ్డెకాళ్ళది. వి. పందెపు కోడిపుంజు భేదం. గడ్డెకాళ్ళది రూ.చూ. గడ్డెకాళులది. వి. పందెం కోడిపుంజు, అర చుట్టుది. గడ్డెనగరులు వి.బ.వ. లింగధార్లు ధరించే లింగం నిలకడగా ఉంచే పేటికలు. పండి.చ. 345 వ. గడ్డెపలక వి. కూర్చునే పీఠం. క్రీడా. 125. గడ్డెపొంకము వి. పరువుకు తగిన గౌరవపు మాట. చంద్రాంగ. 3.46. గడ్డెపొంకముచెప్పు స.క్రి. పెద్ద నుద్దు లాడు. చంద్రాంగ. 2.49. గడ్డెయెక్కికూర్చొను అ.క్రి. గొప్పలకుపోవు. గడ్డెరాయి వి. 1. రాతికూచాలకు, స్తంభాలకు అడుగు భాగంలో మోపు కింద ఉంచబడిన గుంటగల బండరాయి; 2. కడప బండ, దర్వాజా చట్రం కింద బేస్‌మెంట్‌పై గడపగా వేసే రాయి. గడ్డెరోతు వి. రాతి కూచాలకు, స్తంభాలకు అడుగు భాగంలో మోపుకింద ఉంచబడిన గుంటగల బండరాయి. గడ్డెసామాను వి. పెళ్ళి మండపంలో వాడటానికి కుమ్మరి ఇచ్చే దుప్పారి, గురుగులు, మూకుళ్ళు మొ. గడ్డెసిప్ప (-చిప్ప) వి. అడుగుభాగంలో అటూఇటూ దొర్లకుండా గడ్డెపెట్టిన చిప్ప.

గడ్డె[2] రూ. గడ్డియ[2]. గడ్డెము, గద్య, గద్యము. వి. బంగారు నాణెం, వరాహా. భార. అరణ్య. 2.344.

నం. *గద్యాణ-, గద్యాణక-, గద్యాన-క-*. బంగారు నాణెం, వరహా ;

క. *గద్యాణ*. ఒక రకమైన చిన్న బంగారు నాణెం.

గడ్డెగులాబి వి. గులాబి రంగులో ఒకరకం.

గడ్డె[3] రూ. గడ్డియ[3]. వి. 1. వచనం. వేం. అం. 112; 2. సోదె.

నం. *గద్య-*. చెప్పదగ్గది, వచనం ; ప్రా. *గజ్జ*. ఛందోబద్ధం కాని రచన ; అ.మా. *గజ్జం*. వచన రచన.

<నం. గద్య-. (అర్థవిపరి.).

గడ్డెము రూ.చూ. గడ్డె[2]. వి, బంగారు నాణెం. ద.హిం.శా. సంపు. 6.687. శా.సం.

గద్య రూ.చూ. గడ్డె[2]. వి. ఒక బంగారు నాణెం, 3½ లేదా 4 రూ. ఒక్కొసారి వరహా. ద.హిం.శా. సం. 10. శా.సం. 595. క్రీ.శ. 925-50.

గద్యము రూ.చూ. గడ్డె[2]. వి. వరహా. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1216.

గద్యాణము చూ. గడ్డె[2]. వి. గద్యాణము, వరహా, బంగారు నాణెం. ద.హిం.శా. సంపు. 5. (1216).

నం. *గద్యాణ-*. వరహా.

<నం. గద్యాణ-.

గద్వాలంచు వి. 1. అయిదు కొలుకులు రంగు దారంతో కడ్డీ మాదిరిగా నేసి తరవాత మూడు కొలుకుల దారంతో ఒక గీర, ఒక కొలికి దారంతో మరొక గీర దాని పక్కన బుగిడి వరసగా నేసిన అంచు ; 2. లాహిరీ, బుగిడి వరసగా నేసిన బెత్తెడు వెడల్పు అంచు.

గధిక వి. సుగంధ ద్రవ్యాలమ్మేవాడు.

నం. *గాంధిక-*. సుగంధ ద్రవ్యాలమ్మేవాడు.

<నం. గాంధిక-.

గనం[1] రూ.చూ. గనము. వి. పంట కాలవ.

గనం[2] వి. కీచుమని అరవటం.

క. *గొరె* ; త. *కిచన్, కెలి మట్టుక్కచన్, పలిన్ కచన్, పూతన్‌కెలి, చవంతిన్నికెలి, కొవరిచన్, బైకెలి, కవిపాధు* ; మ. *కిర్తియరక్కెం*.

గనగన వి. 1. కాలటానికి అనుకరణం. నిర్వ.రా. 3.63 ; 2. త్వరగా దొచ్చుకొని పోవటం యొక్క అనుకరణం. పండి.చ. 1.44 వ ; 3. కోపంతో మండిపడటానికి అనుకరణం. ఉ.హరి. 4.186. విశ. గనగన అనే కాంతి గలది. మను. 4.60 ధ్వన్యను.

నే. *గన్‌గన్*. సణగటం, గొణుగు, ఘంకారంచేయటం ; ఒ. *గణ్‌గణ్* ; హిం. *గున్‌గన్*.

గనగనమండు అ.క్రి. గనగనలాడు. ధ్వన్యను. గనగనలాడు అ.క్రి. గనగనమండు. సానందో. 2.6.

గనప- విశ. పెద్ద, ఎత్తైన. భార. శాంతి. 4.40. (దీనికి సమాసంలోనే ప్రయోగం కనబడుతోంది).

క. *గన*. పెద్దది, ఎత్తైనది, గొప్ప శుభమైన.

నం. *ఘన*. పెద్ద, గొప్ప.

గనపకొండ వి. పెద్ద కొండ. హరి.ఉ. 8.212. గనపపుట్ట వి. పెద్ద పుట్ట. భార. అశ్వ. 30.105. గనపమేను వి. దొడ్డమేను. భార. ఆశ్రమ. 2.40.

గనపర రూ.చూ. గనిమెర. వి. గన్నేరు.

గనపరాకులు వి.బ.వ. గన్నేరాకు అమ్ముల అలుగులు. ఆము. 6.78. గనపర + ఆకు + -లు.

గనపరాకులు చూ. గనపర.

గనమ రూ. గనం[1]. వి. పంట కాలవ, ఏటినుంచిగాని పెద్ద కాలవనుంచిగాని తీసిన చిన్న కాలవ.

గనమచట్టి వి. కంచెవేసి మనిషి దూరటానికి ఏర్పరచిన చిన్న దారి.

గనము విశ. అధికమైన, గొప్ప, దొడ్డ. సాంబ. మాన. 49.

నం. *ఘన-*. గొప్ప

క. *గన*. గొప్ప, గొప్పతనం, శుభ్రపదం.

<నం. ఘన-.

గనయము[1] వి. పోకముడి, నీవి. భార. స్త్రీ. 2.133.

గనయము[2] రూ.చూ. గొనయము. వి. వింటికొప్పు. ద.హిం.శా. సంపు. 10 శా. సం. 89 ; పారి. 4.22.

నం. *గుణ-*. వింటినారి.

గనరేమ వి. నాగగొలుగ చెట్టు, సువాననకల పూలు పూసే ఒక చెట్టు (Munaya exotica).

గని[1] వి. 1. ఆకరం, బంగారం మొ॥ పుట్టే స్థలం. భార.శల్య. 2.339. శృం.నై. 4.30 ; 2. రంధ్రం, బిలం. మైరా.

3.121 ; **3.** వంశం, ఆకరం ; **4.** కట్టుబడికి కావలసిన రాళ్ళను తవ్వి తీసే లోతైన గుంట.

సం. ఖని-. గని ; ప్రా. ఖణి, ఖణీ, ఖాణీ. ఆకరం. గని ; అ.మా. ఖణి, ఖాణి ; పా. ఖణ. తవ్వడం.

క. *కణి, గణి, గని*. గని ; తు. *కణి* ; త.మ. *కని* ; బ్రా. కాణ్. గని.

<ప్రా. ఖణి.

**గనిపని** వి. గనిలో పని. **గనిబొగ్గు** వి. గనిలో దొరికే బొగ్గు. **గనిమట్టి** వి. భూమిలో సుమారు ఒక గజం లోతు తవ్వి తీసిన మట్టి. **గనివా(డు** వి. గనిలో పనిచేసేవాడు.

**గని[2]** వి. గడ్డ, ముద్ద.

సం. ఘన-. నిబిడం, సాంద్రం ; ప్రా. ఘణ-. ముద్ద, పిండం.

<ప్రా. ఘణ-.

**గనికట్టు** అ.క్రి. ఘనీభవించు, గడ్డకట్టు. వసు. 2.11.

**గని[3]** వి. చెరుకు మొ॥ మొక్కలదంటుకు అక్కడక్కడ ఉండే కణుపు, పర్వం.

**గని[4]** వి. సున్నం బట్టీలోని పొయ్యి.

**గనికె** వి. చెరుకు మొ॥ మొక్కల దంటుకు అక్కడక్కడ ఉండే కనుపు, పర్వం.

**గనికెకుండలు** వి.బ.వ. బాల క్రీడా విశేషం. హంస. 3.146. **గనికెపురుగు** రూ. గెనికె పురుగు. వి. కణుపుల్లో పుట్టి జొన్న, చెరుకు మొ॥ వాటిని డొల్లచేసే పురుగు.

**గనిగుంత** వి. మగ్గం దగ్గర గోడలో పెట్టిన కిటికీ, నేత నేసే టప్పుడు మగ్గం మీదికి వెలుతురు రావటానికి పెట్టే కిటికీ.

**గనిగొయ్య** వి. కట్టుబడి రాళ్ళను తవ్విన గొయ్య.

**గనిమ** రూ. గనిమి, గనిమె, గనుము, గనెం, గెణెము. వి. (పాదు, మడి మొ॥ వాటి) గట్టు, సేతు విశేషం. వసు. 1.138, మాగాణిలో మడిచుట్టూ వేసిన మట్టి కట్ట, రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు.

**గనిమారు** చూ. గనిమ. వి. పొరలో చెక్క మడికి వేసిన గనెం.

**గనిమి** రూ.చూ. గనిమ. వి. గట్టు, పొలం, (చెరువు) కట్ట.

**గనిమె** రూ.చూ. గనిమ. వి. (పాదు, మడి మొ॥ వాటి) గట్టు.

**గనిమెర** రూ. గనపర. వి. గన్నేరు. ద్వి.పరమ. 4.268 పు. 11 పం.

**గనియ** రూ. గనె. వి. ఖండం, ముక్క. భాస్క. రా. యు. 1120.

సం. *కణికా*. ఖండం.

**గనిపోటు** (-పోటు) వి. గుర్తుకోసం రాతిమీద వేసే గుర్తు. ద్వి. పరమ. 515.

క. *కణి*. రాయి ; త. *కణె*.

**గనిపోటుకొట్టు** స.క్రి. గనిపోటుపడేట్టు కొట్టు. పరమ. 5.40.

**గనీబు[1]** రూ. గలీబు, గలేబ, గలేబి, గలేబు. వి. **1.** ఖడ్గకోశం. ఒర.ఉ.రా. 7.211 ; **2.** తలగడ.

హిం.ఉ. *గిలాఫ్*. తలగడ మొ॥ వాటి తొడుగు.

<ఉ. గిలాఫ్.

**గనీబు[2]** వి. ధనవంతుడు.

**గనీమ్** వి. **1.** శత్రువు ; **2.** మరొక దేశం మీదికి దండెత్తి పోయేవాడు.

క. *గనీమ*. శత్రువు, రాజకీయ శత్రువు.

హిం. ఉ. *గనీమ్*. దండెత్తేవాడు, దొంగ, శత్రువు.

<ఉ. గనీమ్.

**గనుగ** వి. ఎల్లగడ్డ, ఒకరకం దుంప (Discorea oppositifolia).

**గనుపు** రూ.చూ. కణుపు. వి. **1**. కనుపు, వెదురు, చెరుకు మొ. వాట్లో అక్కడక్కడ ఉండేముడి, పర్వం. ఆం. భా. 2.74 ; **2**. వావు (దెబ్బవాపు).

క. *గణలు*. వేలికణుపు, చెరుకు మొ. వాట్లోనికనుపు.

**గనుపుచిక్కుడు** వి. కనుపుచిక్కుడు.

**గనుము** రూ.చూ. గనిమ. వి. గట్టు.

**గనుసు(-గడ్డ)** రూ.చూ. గెనుసు (గడ్డ). వి. ఒకరకం దుంప.

**గనె** రూ.చూ. గనియ. వి. **1.** ఖండం, ముక్క. నవనాథ. 2.92పు. పం. 13 ; **2**. సిమెంటుదూలం ; **3**. పొడిగాఉండే మట్టి ; **4.** మొగం మీద దూలం పొరలకుండా బోదెమీద వేసినచెక్క.

**గనెం** రూ.చూ. గనిమ. వి. మాగాణిలో మడిచుట్టూ వేసిన మట్టికట్ట, రెండుపొలాల మధ్య హద్దుగావేసిన గట్టు.

**గనెంరాయి** వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగాపాతినరాయి.

**గనెచౌతి** రూ. గనెసౌతి. వి. గణపతి చవితి, వినాయకచవితి.

సం. *గణపతి-*. వినాయకుడు.

<సం. గణపతి-+చౌతి.

**గనెనాతుడు** వి. మగ్గంపైపలక, భాద్రపద శుద్ధచవితినాడు దీనికిపూజ చేస్తారు.

<సం. గణనాథ-. వినాయకుడు (అర్థవిపరి.).

**గనెపురుగు** రూ.చూ. గన్నెపురుగు. వి. ఒకరకం పురుగు.

**గనెంపార** వి. గనిమలు చెక్కటానికి ఉపయోగించే పార.

**గనెవరం** వి. మాగాణి పొలంచుట్టూ ఎత్తుగావేసిన మట్టికట్ట.

**గనెసౌతి** రూ.చూ. గనెచౌతి. వి. వినాయక చవితి.

**గనేటిరాయి** రూ.చూ. గనేటురాయి. వి. ఎర్రకంచురాయి.

**గనేటురాయి** రూ. గనేటిరాయి. వి. ఎర్రకంచురాయి.

ఇం. *Granite*. కట్టడాలకు ఉపయోగించే నల్లశాణపు రాయి.

<ఇం. Granite + రాయి.

**గంత** రూ.చూ. క్రంతక[3]. వి. **1**. చిరిగినబట్ట. ద్వి.పరమ. 2.84 ; **2**. ఎద్దు మొ. వాటిమీద వేసేగోనె మెత్త. పరమ. 2.76 ; **3**. కనబడకుండ ఎద్దులకళ్ళకు కట్టే చర్మాదికం. వైజ. 2.101 ; **4**. బొంత. ఆం. భా. 2.158.

**గంతకట్టు** స.క్రి. కళ్ళకుమూతలుకట్టు, మోసంచేయు. **గంతకు(దగినబొంత** వి. దేనికితగినది అది (అనిఅనటం). శశా. 2.27. **గంతమోయు** అ.క్రి. బరువుమోయు. **గంతసుడి** వి. పీపుకురెండుపక్కల ఉండేసుడి, గంగడోలుకింద ఉండే సుడి. **గంతావు** వి. గంతనుమోసే ఆవు. <గంత+ఆవు.

**గంతాడు** అ.క్రి. ఎగురు, గంతుపెట్టు.

**గంతావు** చూ. గంత.

గంతి రూ.చూ. కంతి. వి. బొప్పి, కంతి, కణితి.

గంతు[1] వి. గుంపు, సమూహం. కు. సం. 8.135.

గంతు[2] రూ. గెంతు. అ.క్రి. దుముకు. వి. ప్లుతగతిభేదం. మను. 4.37.

క. *గంతు*. గెంతటం. కదలటం, నాట్యంచేయడం ; త. కెంతి (-ప్ప్-ట్ట్). గెంతు, దుముకు ; కెంతు (కెంతి).

సం. *గంతు-*. పథం, దారి, బాటసారి ; *గంతృ*. పోయే వాడు.

గంతుకొట్టు అ.క్రి. 1. దుముకు ; 2. చచ్చు. గంతుకొను రూ.చూ. గంతుగొను. అ.క్రి. 1. దుముకు, దాటు ; 2. చచ్చు. గంతుగొను రూ. గంతుకొను. స.క్రి. దుముకు, దాటు. భాగ. 6.378 ; అ.క్రి. చచ్చు. ఆం. భా. 3.87. గంతుఁ బరువు (-వరువు) వి. గంతులువేస్తూ పరిగెత్తేపరుగు. భాగ. 10పూ. 1293. గంతులు వి.బ.వ. తుళ్ళు, మిడిసిపాట్లు. వసు. 4.28. గంతువేయు అ.క్రి. ఎగరవేయు. గంతాడు.

గంధకము వి. కల్పరివువ్వు.

సం. *గంధక-*. కల్పరివువ్వు.

<సం. గంధక-.

గండవటిక[1] వి. తలుపుపై అమర్చే అడ్డుకొయ్య.

క. *గరిదపుది*. వాసనఉన్న పొడి.

గండవటిక[2] వి. చందనలేపనం.

గండవట్టియ[1] రూ. గండపట్టె[1], గండెపట్టె[1]. వి. తలుపుమీద అమర్చిన అడ్డుకొయ్య. చంద్ర భా. 4. 26.

సం. *స్కంధపట్టికా* ; ప్రా. *ఖందపట్టి* ఆ.

క. *గందపట్టిగె*. అడ్డుకర్ర, రెండుతలుపులను కలప టానికి ఉపయోగించిన ఊచలు.

<ప్రా. ఖందపట్టి ఆ.

గండవట్టియ[2] రూ. గండపట్టె[2], గండెపట్టె[2]. వి. గంధంతో పెట్టే రేఖ.

సం. *గంధపట్టికా*.

గండవట్టె[1] రూ.చూ. గండపట్టియ[1]. వి. తలుపుమీద అమర్చిన అడ్డుకొయ్య. కళా. 7.110.

గండవట్టె[2] రూ.చూ. గండపట్టియ[2]. వి. గంధంతో పెట్టేరేఖ. ఆము. 2.10.

గందవుకుడక చూ. గందము.

గందవుఁగొండ చూ. గందము.

గందవుఁగొండటాణెదారు చూ. గందము.

గందవుఁగొండటాణేదారు చూ. గందము.

గందవుఁగొండతెక్కి చూ. గందము.

గందవుఁగొండతెంకి చూ. గందము.

గందవుచెక్క చూ. గందము.

గందవుపొడి చూ. గందము.

గందవుమచ్చ చూ. గందము.

గందవుమల చూ. గందము.

గందవుమ్రాను చూ. గందము.

గందపొడి చూ. గందము.

గందప్పట్టె చూ. గందము

గందప్పట్టెలతలుపు చూ. గందము.

గందప్పీట చూ. గందము.

గందము వి. 1. చందనం చెట్టు. పండి. చ. 5.351 ; 2. చందనం చెక్క. మొ. నవి అరగతీయగా వచ్చే లేపన ద్రవ్యం. విక్ర. 4.159 ; 3. సువాసన. హర. 3.71.

సం. *గంధ-*. వాసన; ప్రా. *గంధ*. వాసన; నే. *గంధ*. వాసన, మంచివాసన ; హిం. *గంధ*. సువాసన, సెంటు,

<ప్రా. గంధ-.

గందవుకుడక వి. చందనం ఉంచుకొనేపాత్ర. గందవుఁ గొండ (-కొండ) వి. మలయాచలం. రాజవా. 3.80. గందవుఁ గొండటాణెదారు రూ.చూ. గంధవుఁగొండటాణేదారు. వి. గాలి. గందవుఁగొండటాణేదారు రూ. గందవుఁగొండటాణె దారు. వి. పవనుడు, వాయుదేవుడు. వేంక. దేవ. 15. గందవుఁగొండతెక్కి వి. మలయమారుతం. గందవుఁగొండతెంకి వి. గాలి. గందవుచెక్క వి. తలుపుచెక్క మీదఅడ్డంగా బిగించేకొయ్య బద్ద. గందవుపొడి రూ.చూ. గందపొడి. వి. బుక్కా, గందపొడి. గందవుమచ్చ వి. పశువులమెడకింది చార. గందవుమల వి. మలయపర్వతం. గందవుమ్రాను వి. ఔ. చందన వృక్షం. విప్ర. 3.5. గందపొడి రూ. గందవు పొడి, గందవడి, గందవొడి, గందొడి. వి. చందనంపొడి. రసిక. 2.14. గందప్పట్టె వి. 1. గందంచెక్క ; 2. తలుపు చెక్కమీద అడ్డంగా బిగించేకొయ్యబద్ద. గందప్పట్టెలతలుపు వి. అడ్డపట్టెలమీద బిగించిన తలుపు. గందప్పీట వి. తలుపు రెక్కమీద అడ్డంగా బిగించే కొయ్యబద్ద. గందమమ్మునది విఙ. కామశాస్త్రంలో వర్ణించబడిన ఒకరకమైనదూతి. గందంమచ్చ వి. మెడకిందిచార. గందవడి రూ.చూ. గంద పొడి. వి. గందంపొడి, బుక్కా. గందవొడి(-పొడి) రూ.చూ. గందపొడి. వి. చందనంపొడి. ఆం.భా. 2.162. గంద వొడిలోబూరుగువట్టినట్టు అవ్య. మంచిలో చెడు జరిగినట్టు.

గందంమచ్చ చూ. గందము.

గందరగోళమగు చూ. గందరగోళము.

గందరగోళము రూ. గంద్రగోళము. వి. గడబిడ, అల్లరి.

గందరగోళమగు అ.క్రి. చాలాఅల్లరిఅగు. గందరగోళము చేయు స.క్రి. గడబిడచేయు. గందరగోళించు స.క్రి. గడబిడ చేయు.

గందరగోళించు చూ. గందరగోళము.

గందవట్లుతలుపులు రూ. గండెవట్లు తలుపులు, గండెవాట్ల తలు పులు. వి.బ.వ. తలుపుమీద అమర్చిన అడ్డకొయ్యతలుపులు.

గందవడి చూ. గందము.

గందవొడి చూ. గందము.

గందవొడిలోబూరుగువట్టినట్టు చూ. గందము.

గందసరులు రూ.చూ. గంధసరులు. వి.బ.వ. ధాన్య విశేషం, అక్కుళ్ళు.

గంది వి. తలుపురెక్కలమీద అడ్డంగా బిగించిన కొయ్యబద్ద.

గందిక వి. సందడి, కోలాహలం.

గందు వి. పిడసమధ్యలోని మేకులాంటిభాగం.

గందువ వి. 1. గొలుసు ; 2. బంగరుహారం.

గండెపట్టె[1] రూ. గండపట్టియ[1]. వి. తలుపుమీద అమర్చే అడ్డు కొయ్య.

గండెపట్టె[2] రూ.చూ. గండపట్టియ[2]. వి. చందనంపూత.

గండెవట్లుతలుపులు రూ.చూ. గండవట్లుతలుపులు. వి.బ.వ. తలుపులమీద అమర్చే అడ్డకొయ్య తలుపులు.

గండెవాటు రూ. గంజివాటు. వి. ద్వారం కొయ్యచట్రం, తలుపు రెక్కమీద అడ్డంగా బిగించే కొయ్యబద్ద.

గండెవాటురెక్క వి. బక్షిబద్దరెక్క, చిన్నిరెక్క, గండె వాట్ల తలుపురెక్క.

గండెవాట్లతలుపులు రూ.చూ. గండవట్లుతలుపులు. వి.బ.వ. అడ్డు పట్టెలు బిగించిన తలుపులు.

గండొడి రూ.చూ. గండపొడి. వి. గండపొడి, బుక్కా.

గండొడివాఁడు వి. 1. హాస్యగాడు, కేళిగాడు, కేదరి గాడు. హంస. 5.134; 2. తోలుబొమ్మలాటలోని హాస్యగాడు.

గండోలి[1] వి. 1. ఆరహంస; 2. భద్రానది; 3. భద్రముస్తె; 4. విషవుమొక్క.

గండోలి[2] రూ.చూ. గండోలి. వి. హాస్యగాడు.

గండోలిగాఁడు రూ. గండోలిగాఁడు, గండోళిగాఁడు. వి. హాస్యగాడు.

గండోళిగాఁడు రూ.చూ. గండోలిగాఁడు. వి. గండోలిగాడు.

గంద్రగోళము రూ.చూ. గందరగోళము. వి. గడబిడ.

గంధం వి. బిస్కట్టురంగు.

నం. గంధ-. గందం.

<నం. గంధ-. (అర్థవివరి.).

గంధతేలుమణి వి. కొండలమీద, ఉద్యానవనాల్లోను పెంచ బడే ఒక సీమమొక్క, నీలిరంగు పూలుపూస్తుంది (Heliotropium perurianum).

గంధపట్టె రూ. గంధంపట్టె. వి. గొంతుకు రెండువక్కలా ఉండే నల్లచారలు.

గంధమువళబడిమంకము వి. గంధద్రవ్యాల క్రయవిక్రయాలపై విధింపబడ్డ పన్ను. ద.హిం.శా. నంపు. 10 శా.నం. 550.

గంధంపట్టె రూ.చూ. గంధపట్టె. వి. గొంతుకు రెండువక్కలా ఉండే నల్లచారలు.

గంధవారణమాడ వి. నాణెవిశేషం. ద.హిం.శా. నంపు. 4. శా.నం. 195. క్రీ.శ. 1117.

గంధనరులు రూ. గందనరులు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంన. 4.128.

గంధ్యంవారు వి.బ.వ. సుగంధాది ద్రవ్యాల్ని అమ్మేవర్తకులు. ద.హిం.శా. నంపు. 7. శా.నం. 734. క్రీ.శ. 1228.

గవ్న వి. అక్కర, అవనరం.

గమ్న వి. రాళ్ళను పగలకొట్టే పెద్దసుత్తి.

నం. ఘన-. పెద్దది.

గమ్నమన్ను వి. తెల్లమన్ను, చవిటిమట్టి, బాగాతెల్లగాఉండేమట్టి.

గన్నె చూ. గనువు. వి. కణువు.

గన్నెవురుగు రూ. గనెవురుగు. వి. జొన్న, మొక్కజొన్న, చెరకు, మొ. వాటి గణువుల్లోచేరి దంటు తొలిచేపురుగు.

గన్నెర రూ.చూ. గన్నేరు. వి. కరదీపం, గన్నేరు. రాజ.చ. 2.149 (Nerium odorun, pluneria acutifolia).

గన్నెరాకమ్ము వి. గన్నెరాకులాంటి అలుగులున్న బాణం. భార. భీష్మ. 3.219.<గన్నేరు+ఆకు+అమ్ము. గన్నెరాకులు వి.బ.వ. గన్నెరాకువంటి అలుగులున్న బాణం, గన్నెరాకులు.<గన్నెరు+ఆకు+-లు,

గన్నెరాకమ్ము చూ. గన్నెర.

గన్నెరాకులు చూ. గన్నెర.

గన్నెరు రూ.చూ. గన్నేరు. వి. గన్నేరు. యయా. 4.20, ఆం.భా. 2.53; వి.బ.వ. ధాన్యవిశేషం. వేంక. మాన. 76.

గన్నేరు రూ. గన్నెర, గన్నెరు. వి. కరవీరం, గన్నేరు. శృం. నై. 8.103.

నం. కరవీర-; కర్ణికార-. గన్నేరు; అ.మా. కణయర- కణయార- కణవీర; మా. కలవిల; పా. కణవీర-కణవేర-కణ్ణికార; ప్రా. కణ్ణిఅర;

క. గన్-నేఱిళె. గన్నేరు (Barringtonia acutangula). త. కణవీరమ్ కవిరమ్, కయిరమ్. గన్నేరు; మ. కణవీరమ్. (Nerium odorum).

<ప్రా. కణ్ణిఅర-.

గన్నేరుపువ్వుపేటు వి. అంచులో గన్నేరుపువ్వు ఆకారం లో నేసిన డిజైను. గన్నేరులు వి.బ.వ. ఒకరకం మెట్టవడ్లు.

గన్నేఱుకాదారిప్రొద్దు వి. (నిశీథం) చీకటి. భీమ. 1.111.

గప్‌పిచ్చరు వి. నల్లరాతిని పగలకొట్టడానికి పనికివచ్చే పెద్ద నమ్మెట.

ఇం. *Gunpitcher*. తవ్వటానికి ఉపయోగించే సాధన విశేషం.

<ఇం. Gunpitcher.

గప్లగోడ వి. రంధ్రాలున్న పిట్టగోడ.

గవగవ క్రి.విశే.ద్రు. గబగబ, గవగవ. ధ్వన్యను.

గవద చూ. గవుద. వి. చెంప, గవుద, గౌద.

గప్‌చిప్ రూ. గప్‌చిప్పు. వి. నిశ్శబ్దం. ధ్వన్యను. క్రి. విశే. నిశ్శబ్దంగా.

క. గప్‌చిప్. నిశ్శబ్దం, నిలకడ.

గప్‌చిప్పు రూ.చూ. గప్‌చిప్. వి. నిశ్శబ్దం, విశే. నిశ్శబ్దంగా.

గప్పళించు అ.క్రి. ఇనుకు, ఎండు, రాజవా. 3.53, స.క్రి. పీల్చు, గ్రహించు.

గప్పాలు వి.బ.వ. బంభాలు, గొప్పలు, డప్పాలు, అతిశయపు మాటలు.

కా. గప్, గప్పు. హాస్యం; కు. గఫ్. అనంగతమైన వార్తలు; నే. గప్. మాట, నంభాషణం, కబుర్లు, గొప్పలు; అ. గప్. గొప్పలు; బెం. గప్పు. కబుర్లు (ముచ్చట్లు); ఒ. గప. గొప్పలు; హిం. గప్. పనికిమాలిన కబుర్లు; పం. గప్పు; గు. గప; మరా. గప్.

క. గప్పు. మౌనం.

<హిం. గప్.

గప్పాలుకొట్టు అ.క్రి. కోతలుకోయు.

గప్పు వి. వాననకొట్టటంలోని అనుకరణం. కిరా. 3.20.

క. గప్పనె. వాననకొట్టటంలోని అనుకరణం.

గవ్వున క్రి. విశే.ద్రు. శీఘ్రంగా. చంద్రాంగ. 5.27.

గప్పళించు న.క్రి. పీల్చు, ఆను, తాగు.

గబక్కున రూ.చూ. గబుక్కున. క్రి. విశే.ద్రు. భయంకరంగా,

హఠాత్తుగా. ధ్వన్యను.

గబగబ రూ. గబగబా, గవగవ. క్రి. విఱ. ద్రు. శీఘ్రంగా (పరుగెత్తడం మొ. వాటి అనుకరణం).

క. గబగబనె. శీఘ్రంగా, వేగంగా, త్వరగా.

గబగబలాడు అ.క్రి. తొందరపడు.

గబగబా రూ.చూ. గబగబ. క్రి.విఱ. త్వరగా.

గబాలు వి. దాటేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం.

గబాలున రూ.చూ. గభాలున. క్రి.విఱ.ద్రు. వెంటనే, గమ్మున, గబాల్న ; క. గప్పనె. వెంటనే, గమ్మన; కు. ఖప్పనా, ఖప్పలె. ఒక్కదెబ్బతో, ఉన్నట్లుండి అకస్మాత్తుగా.

గబిల్లను అ.క్రి. గబీలుమను. ధ్వన్యను.

గబీగుబీ వి. గుద్దటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

గబీలు క్రి.విఱ. 1. గుద్దటం, నీళ్ళలో దుమకటం, మండటం, కలతనొందటం మొ. వాటి అనుకరణం ; అహల్యా. 3.8. 2. మండటంలోని ధ్వనికి అనుకరణం. ధ్వన్యను.

గబీలున క్రి.విఱ.ద్రు. గబాలున. గబీలుమను అ.క్రి. మండినట్లగు, ఒక్కసారిగా బాధ కలుగు. అహల్యా. 3.8.

గబుకు రూ.చూ. గబుక్కు. వి. ఉరకటం, గుద్దటం, మండటం మొ. వాటి అనుకరణం. ధ్వన్యను.

గబుక్కు రూ. గబుకు. వి. ఉరకటం, గుద్దటం, మండటం మొ. వాటి అనుకరణం. ధ్వన్యను.

గబుక్కున రూ. గబక్కున. క్రి.విఱ.ద్రు. హఠాత్తుగా, ఉరకడం మొ. వాటి అనుకరణం. క. గప్పనె. హఠాత్తుగా, గబుక్కున; కొండ. కవక్న. హఠాత్తుగా; కుఱు. ఖప్పనా, ఖప్లె. ఒక్క దెబ్బతో, హఠాత్తుగా.

గబును వి. 1. కపటం, ఆం.భా. 1.138; 2. కిటుకు; 3. గాను ; 4. డబ్బు.

గబేలున క్రి.విఱ.ద్రు. గబుక్కున, గబాలున, త్వరగా. ధ్వన్యను.

గబేళా రూ.చూ. గమేలా. వి. గమేలా.

గబ్బ వి. 1. కపటం, మోసం; 2. డబ్బు; 3. గాను; 4. కిటుకు.

గబ్బగీము వి. కారుచీకటి, కటికచీకటి.

గబ్బటు రూ.చూ. గబ్బాటు². వి. జల్లి. విఱ. వెల తక్కువైన.

గబ్బరించు అ.క్రి. గబగబ ధ్వనిచేయు, పండి.చ. 5.484 వ.

గబ్బాటు¹ వి. 1. కలత; 2. డాబు; 3. కిటుకు.

గబ్బాటు² రూ. గబ్బటు. విఱ. వెల తక్కువ అయిన.

గబ్బి¹ విఱ. 1. గర్వి, దుష్టం.ఉ.హరి. 5.278; 2. నిక్కినది, నిగిడినది. హర. 3.23; 3. గొప్పవాడు, ఘనుడు. పారి. 1.49; 4. ధీరుడు. విష్ణుపు. 8.18; వి. 1. గాంభీర్యాన్ని బట్టి కుక్కకి పెట్టిన పేరు. మను. 4. 2. కపటం. ఆం.భా. 1.138.

సం. గర్విన్ ; ప్రా. గవ్విన్. అభిమాని, గర్వి.

క. గబ్బు. గర్వం, దుష్టం. తన పదవికి గర్వపడే వ్యక్తి ; గబ్బి :

<ప్రా. గవ్వి.

గబ్బితనము వి. 1. పెద్దతనం. భీమ. 2.7; 2. పెద్దతనం.

గబ్బిదేఱు (-తేఱు) అ.క్రి. అతిశయించు. పాండు. 2.91. గబ్బిమీఱు అ.క్రి. గర్వం అతిశయించు. గబ్బివా(ఁడు విఱ. గబ్బితనం కలవాడు. అష్టమ.క. 1.34 వ. 10 పం.

గబ్బి² వి. ముళ్ళుకలిగిన ఒక చెట్టు (Haematoxylon Campechianum).

గబ్బిడము రూ.చూ. గబ్బిడా. వి. 1. గబ్బిలం, తలకిందులుగా వేలాడే ఒక పక్షి ; సాంబ. తిర్య. 81. 2. చపల బుద్ధి ఉన్న వ్యక్తి.

గబ్బిడా రూ. గబ్బిడము, గబ్బిడాయి, గబ్బిరాయి¹, గబ్బిలము, గబ్బిలాయి. వి. 1. గబ్బిలం. సాంబ.తిర్య. 81; 2. చపల బుద్ధికల వ్యక్తి.

క. గబ్బిలాయి. గబ్బిలం.

గబ్బిడాయి రూ.చూ. గబ్బిడా. వి. 1. గబ్బిలం. ఆం.భా. 2.94; 2. చపలత్వం ఉన్న మనిషి.

గబ్బిడికట్టు రూ. గబ్బిలికట్టు. వి. పైర్లుకోసేటప్పుడు ఒక చేతికి సరిపడేట్టు పట్టుకొన్న గడ్డి.

గబ్బిరాయి¹ రూ.చూ. గబ్బిడా. వి. గబ్బిలం.

గబ్బిరాయి² వి. క్వార్ట్జ్ జాతికి చెందిన మిశ్ర శిల, కనికరాయి.

గబ్బిరి రూ. గబ్బిలి. వి. పిడికిలి, ముష్టి, గుప్పిలి.

గబ్బిలము రూ.చూ. గబ్బిడా. వి. గబ్బిలం, తైలపాయిక, ఇంటి కప్పు మొ. వాటి నుండి తలకిందులుగా వేలాడే ఒక విధమయిన పక్షి.ఆం.భా. 2.94.

గబ్బిలాయి రూ.చూ. గబ్బిడా. వి. గబ్బిలం. ఆం.నా.నం. తిర్య. 81.

గబ్బిలి రూ.చూ. గబ్బిరి. వి.బొ. పిడికిలి.

గబ్బిలికట్టు రూ.చూ. గబ్బిడికట్టు. వి. పైర్లుకోసేటప్పుడు ఒక చేతికి సరిపడేట్టు పట్టుకొన్న గడ్డి.

గబ్బిన రూ. గబ్బిని. వి. ఒక విధమైన మూలిక.

గబ్బిని రూ.చూ. గబ్బిన. వి. మూలికా విశేషం.

గబ్బు రూ. గెబ్బు². వి. 1. గర్వం. బసవ. 6.559 పం. నృసింహ. 4.114; 2. దుర్గంధం. చంద్రాంగ. 2.88; 3. గంధం. ఆం.భా. 1.106; 4. గజాదుల మదం; 5. ఒకరకం కలుపు మొక్క.

సం. గర్వ- : ప్రా. గవ్వ-. అహంకారం, అభిమానం ; నే. గర్వ. గర్వం.

క. గబ్బు. గర్వం, అహంకారం; గబ్బి. పొగరు, మదం, ఉన్నతం.

<ప్రా. గవ్వ-.

గబ్బుకొను అ.క్రి. వాసనకొట్టు, పరిమళించు. దశా. 2.69. గబ్బుగదుగు (-కడుగు) స.క్రి. అవమానించు. గబ్బుచీ(కటి వి. గాఢాంధకారం. గబ్బుచీకు వి. ఒకానొక కంచెమొక్క (Mezoneurun Cucullatum). గబ్బు చెంకమెకము వి. మదం కారే, చెంపలున్న మృగం, ఏనుగు. ఆం.భా. 1.37. గబ్బుచెట్టు వి. వృక్షవిశేషం (Prennaintegrifolia). గబ్బుచెంపమెకము వి. మదంకారే చెంప లున్న మృగం, ఏనుగు. గబ్బుతుంగ వి. తుమ్మజాతికి చెందిన ముళ్ళచెట్టు (Acatialatranum orleucopholea). గబ్బుతుమ్మ¹ వి. ముళ్ళు కలిగి సువాసన నిచ్చే

పూలుపూసే ఒక మొక్క (Acacia Farnesiana). గబుతుమ్మ[2] వి. తెల్లని, పొడవైన ముళ్ళు కలిగిన ఒక చెట్టు (Acacia ebarua). గబ్బుదేఱు (-తేఱు) అ.క్రి. అతిశయించు. పాండు. 2.91. గబ్బుమూవె వి. కిరననాయిలు. గబ్బునెల్లి వి. చెడువాసన కల పూలుపూసే ఒక చెట్టు (Premma integrifolia). గబ్బుపులుగు రూ.చూ. గబ్బులుఁగు. వి. ఒకానొక శకునపక్షి. గబ్బుమీఱు అ.క్రి. గట్టిదగు. పాండు. 1.107. గబ్బురాయి[1] వి. అసహ్యంగా వికృతంగా ఉండే రాయి. గబ్బురాయి[2] వి. విపరీతంగా కాలిన సున్నం రాయి. గబ్బులుఁగు రూ. గబ్బుపులుఁగు. వి. గంపపులుగు, శకునపక్షి. హర. 2.18. గబ్బులేచు అ.క్రి. అల్లరిపాలగు, సంగతి బైటపడు. గబ్బువలచు అ.క్రి. మాంసం వాసనవేయు. గబ్బుసీకాయ వి. మలబారు. తిరువాన్కూరు ప్రాంతాల్లో పెరిగే ఒక తీగ (Mezoneum auculatum). గబ్బెక్కు అ.క్రి. గబ్బుమీఱు, సాంద్రమగు, దట్టమగు. వేంక. పంచ. 3.107. <గబ్బు+ఎక్కు.

గబ్బుజాలి చూ. గబ్బు. వి. వంటచెరకుగాఉపయోగపడే ఒకరకం తుమ్మచెట్టు, తెల్లని పూలుపూస్తుంది (Acacia latronum).

గబ్బెక్కు చూ. గబ్బు.

గబ్బెల్లి వి. దెయ్యంవస్తుంది అని పిల్లల్ని భయపెట్టటానికి ఉపయోగింపబడే శబ్దం.

క. కబ్బల్లి. పిల్లలు ఏడ్చినపుడు భయపెట్టేశబ్దం.

గభాగాల వి. పడకగది.

సం. గర్భాగారా. లోనిగది, పడకగది ; ప్రా. గబ్భ-. లోపల.

గభాలున రూ. గడాలున. క్రి.విఱ.ద్రు. ఒక్కసారిగా, ఆందోళనకరంగా.

గభిల్లున రూ. గభీలున. క్రి.విఱ.ద్రు. ఒక్కసారిగా, హఠాత్తుగా, దూకినప్పటి ధ్వన్యనుకరణం.

గభీలున రూ.చూ. గభిల్లున. క్రి.విఱ.ద్రు. ఒక్కసారిగా, హఠాత్తుగా దూకినప్పటి ధ్వన్యనుకరణం.

గభీలుమను రూ. గభేలుమను. అ.క్రి. విపరీతమైన ఆందోళన కల్గించు. ధ్వన్యను.

గభేలుమను రూ.చూ. గభీలుమను. అ.క్రి. ఎక్కువగా అదురు, గుభేలుమను, ధ్వన్యను.

గమకత్వము చూ. గమకము.

గమకము వి. 1. నైపుణ్యం. భాగ. 6.99 ; 2. పూనిక. యత్నం. యయా. 1.72 ; 3. ఉత్సాహం. ఉ.రా. 2.91 ; 4. పష్టి. ప్రబంధ. 22 ; 5. బలం. ప్రబంధ. 81 ; 6. అధికం. చంద్రాంగ. 1.7 ; విఱ. 1. మనోజ్ఞమైన, సొంపైన. రం.రా. బాల. 73 ; 2. స్థూలమైన. ఆం.భా. 3.20 ; 3. అధికమైన, ఉరువు, గొప్పదైన.

సం. గమక-. వెళ్ళేది, తోసేటట్లు చేసేది, ప్రమాణంచే నిరూపించేది, స్వర విన్యాసభేదం.

<సం. గమక-. (అర్థవివరి.).

గమకత్వము వి. వాక్యంలో లుప్తమైన మాట. సం. గమకత్వ-. వెళ్ళటంయొక్క భావం, తోసేటట్లుచేసేదానిభావం, <సం. గమకత్వ-. (అర్థవివరి.). గమకముకొను రూ.చూ. గమకముగొను. అ.క్రి. యత్నంచేయు, యత్నించు. భాగ. 7.343. గమకముగొను (-కొను) రూ. గమకముకొను. అ.క్రి. యత్నించు. భాగ. 7.333. గమకించు అ.క్రి. 1. యత్నించు, పూను. రం.రా.సుందర. 252. ప. 7. పం ; 2. మనోజ్ఞమగు, ఒప్పు. వై జ. 4.30. గమకింపు వి. 1. అదలింపు, గమకించటం, బెదరించటం. చంపూ. రా. 3.14 ; 2. పూనిక.

గమకించు చూ. గమకము.

గమకింపు చూ. గమకము.

గమగమ వి. 1. కోపగించటం మొ. వానిలో అయిన అనుకరణం. ఉ.హరి. 4.186 ; 2. సువాసన. కకుత్థ్స. 1.144 ; 3. పరిమళించటం మొ. వాటిలో అయిన అనుకరణ ; 4. కోపించటంలో అయ్యే అనుకరణం. దశా. 3.16.

క. గమగమ. సువాసన మొ. వానిని తెలుసుకోటానికి ఉపయోగించే పదం ; తు. గమగమ. సువాసన ; త. కమకమ. సువాసన ; కో. గమల్. మంచివాసన (భోజన పదార్థం మొ. నవి) ; నా. కప్. వాసన ; కుఱు. గమ్ గమ్ర్నా. (పూవల) సువాసన ;

హిం. గమక్. సువాసన.

గమగమలాడు అ.క్రి. గమగమవాసనకొట్టు < గమగమ+-లు+ఆడు[1]. గమగమవలచు అ.క్రి. గమగమవాసన వేయు. మను. 2.55. గమగమలు వి.బ.వ. 'బాన్మతి' అనే పరిమళ ధాన్యం. గమగమించు అ. క్రి. గమగమ వాసన కొట్టు. శేష. 4.

గమగమించు చూ. గమగమ.

గమతము వి. పశువులమేత.

గమనిక వి. 1. విధం. భాగ. 10.1318 ; 2. సూచన.

సం. గమనికా. అల్పమార్గం ; సూక్ష్మపద్ధతి.

<సం. గమనికా (అర్థవివరి.).

గమయు అ.క్రి. ఘుమఘుమ వాసనకొట్టు. సాంబో. 5.296.

గమళ్ళ వి. కల్లు గీసుకొనేజాతి.

గమళ్ళది వి. గమళ్ళజాతి స్త్రీ. < గమళ్ళ + అది. గమళ్ళవాఁడు వి. 1. కల్లుగీతవాడు ; 2. క్షత్రియ స్త్రీకి శూద్రునికి పుట్టినవాడు.

గమాతు రూ.చూ. గామత్తు. వి. ఓడకి అయిన కన్నం, చిల్లిఊట.

గమాయించు అ.క్రి. గమగమించు, పరిమళంకొట్టు, వాసనవేయు. అని. 1.105.

గమారువాఁడు రూ.చూ. గవారువాఁడు. వి. గ్రామీణుడు.

గమి రూ. గుమి[3]. వి. సమూహం, గుంపు. భార. ఉద్యో. 1.29 ; విఱ. సాంద్రమైన, తరచైన. భార. కర్ణ. 3.5.

క. గుమి. గుంపు, సమూహం.

గమికత్తె రూ. గమిగత్తె. వి. 1. అంతఃపుర పరిచారికల్లో ముఖ్యురాలు. శకా. 4.164 ; 2. చెలికత్తె. గమికాఁడు వి. 1. ముఖ్యజనుడు. పరమ. 5.11 ; 2. అధిపతి. యయా. 3.94 ; 3. అల్పసేనాధిపతి. ఆం.భా. 2.184 ; 4. సేనాధిపతి. అచ్చ. రా. అరణ్య. 2.14 ; 5. కాకి

గమికాండ్లు వి.బ.వ. అధికారులు. ద.హిం.శా. సంపు. 10 శా. సం. 757. క్రీ.శ. 1650. గమికూడు రూ.చూ. గమిగూడు. అ.క్రి. గుంపుగూడు. గమికొను రూ.చూ. గమిగొను. అ.క్రి. పోగుపడు. గమిగత్తె రూ.చూ. గమికత్తె. వి. అంతఃపుర పరిచారికల్లో ముఖ్యురాలు. గమిగూడు రూ. గమికూడు. అ.క్రి. గుంపుకూడు. కువ.చ. 4.12. గమిగొను రూ. గమికొను. అ.క్రి. పోగుపడు. హరి.ఉ. 1.157. గములుకొను రూ.చూ. గుములుగొను. అ.క్రి. గుంపుకూడు. గములుగట్టు (-కట్టు) అ.క్రి. గుంపుకూడు. పండి.చ. 5.374. పు. గములుగములుగా(గ క్రి.విశే.దు. గుంపులుగుంపులుగ. భీమ. 2.28. గములుగూడు(-కూడు) అ.క్రి. గుంపులుగాచేరు. పండి.చ. 2.33. గములుగొను(-కొను) రూ. గుములుకొను అ.క్రి. గుంపుకూడు. భాగ. 10.156.

గమికీలుకొట్టు అ.క్రి. పిల్లిగింతలుకొట్టు. లడాయికొట్టు.

గమిడి రూ. గెమిడి. వి. సరిహద్దు, ఊరుచుట్టూఉన్న సరిహద్దు.

గమిడిగేదె వి. జంగిడిగేదె.

గమిడిదున్న వి. తూరుపుకొండల దున్న.

గమియ అ.క్రి. దగ్గరదగ్గరగాపెరుగు. సాంబో. 1.177 ; స.క్రి. 1. అణచు, పోగొట్టు. సాంబో. 3.110 ; 2. అందిచ్చు. సాంబో. 5.74.

సం. గమ్. వెళ్ళు, నడచు.

గముడు వి. గమరుటేకు, సామాగ్రి తయారుచేయటానికి ఉపయోగించే కలపనిచ్చే ఒకచెట్టు (Gmelina arborea).

గములుకొను చూ. గమి.

గములుగట్టు చూ. గమి.

గములుగములుగా(గ చూ. గమి.

గిములుగూడు చూ. గమి.

గములుగొను చూ. గమి.

గమేలా రూ. గబేలా, గమేళా[1]. వి. ఇనపగంప, ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.

పో. గమెలా. కొయ్యతొట్టి ; స్పా. గామెల ; ఫ్రెం. గమెల్. భోజనపాత్ర.

<పో. గమేలా.

గమేళా[1] రూ.చూ. గమేలా. వి. ఇనపగంప.

గమేళా[2] వి. ఓడస్తంభంలో మనిషి నిలిచేట్టుగా కట్టిన అంతస్తు.

పో. కమేరా. ఓడగది, అర ; స్పా. కామరా.

<పో. కమేరా.

గంప వి. వెదురు మొ. వాటితో అల్లినపాత్ర, కండోలం. అము. 1.75.

క. గంపె. బుట్ట ; త. కెంపరై. బుట్ట, ధాన్యం పోసుకొనే బుట్ట ; పర్జి. గప్ప. వెదురుబుట్ట.

గంపకొప్పు వి. లావాటి కొప్పు. తాళ్ళ. సం. 35. గంపగంపవమ్మ వి. 1. ఒకానొక దేవత ; 2. ఆ దేవతను తట్టలోపెట్టుకొని తిరిగి బిచ్చమెత్తుకొనే స్త్రీ. గంపగంగానమ్మ వి. 1. గంపలమ్మ అనేదేవత ; 2. ఆ దేవతను తట్టలో పెట్టుకొని బిచ్చమెత్తుకొనే స్త్రీ. గంపచాకిరీ వి. లాభంలేని చాకిరి. గంపచిక్కులు వి.బ.వ. అలవికాని బాధలు. గంపచిప్ప వి. దృఢకర్పరం. గంపచుక్క వి. సూర్యుడు, పొద్దు. గంపజాతర వి. వానరాకపోతే చేసేవనభోజనం, గంపలలో తినుబండారాల్ని పెట్టుకొని ఊరేగుతూ ఊరిబయట తోటలో కలసిమెలసి భుజించే ఉత్సవ విశేషం. గంపతరం వి. గంపలవరస. గంపతిరుగుడు వి. డొంకతిరుగుడు. గంపతెవులు వి. వరితెగులు, ఈ జబ్బువల్ల నిలువునాకాల్చినట్లు ఎండిపోయేతెగులు. గంపనట్టి వి. వరితెగులు, మొక్క తల ఎండిపోయే తెగులు. గంపనమ్ము స.క్రి. బయలుపెట్టు, రట్టుచేయు. తాళ్ళ. సం. 5. 129. గంపంతబలగము వి. ఊరంతబలగం. గంపపులుగు వి. అడవికోడి, గబ్బులుగు. ఆం. భా. 2.97. గంపమోపుకోరికలకాలము వి. యవ్వనం. తాళ్ళ. సం. 8.32. గంపరోగం వి. వరితెగులు. దంటు. గంపలనమ్మవచ్చు స.క్రి. వచ్చినవారి కల్లాఅమ్ము, తాళ్ళ. సం. 3.515. గంపలమ్మ వి. 1. గంగానమ్మ ; 2. గయ్యాళి. వ్యు. గంపలోకూర్చుని ఊరేగేదేవతా విశేషం అర్థవిపరిణామం కారణంగా గయ్యాళి అనే అర్థం వచ్చి ఉంటుంది. గంపసిడి వి. గ్రామదేవతకు మొక్కు చెల్లించడానికి మనిషిని గంపలో కూర్చోబెట్టి యాచించే వరం. గంపెడాశ వి. ఎక్కువాశ <గంప+-ఎడు+ఆశ. గంపెడుపిల్లలు వి.బ.వ. ఎక్కువమంది సంతానం. <గంప+-ఎడు+పిల్లలు.

గంపెడాశ చూ. గంప.

గంపెడుపిల్లలు చూ. గంప.

గంబుర రూ.చూ. గంబూర. వి. కర్పూరం. శుక. 1.94.

గంబురము రూ.చూ. గంబూర. వి. కప్పురం. ఆం. భా. 2.162.

గంబురా రూ.చూ. గంబూర. వి. కప్పురం. శకా. 1.1.

గంబూర రూ. గంబుర, గంబురము, గంబురా, గంబూరము, గంబూరు. వి. 1. కప్పురం. అము. 2.3 ; 2. కర్పూరవృక్షం (Cinnamomum Camphor).

సం. కర్పూర-. కప్పురం, పచ్చకర్పూరం ; ప్రా. కప్పూర-.

<ప్రా. కప్పూర-.

గంబూరరాజనాలు వి.బ.వ. ధాన్యవిశేషం, అక్కుళ్ళు. హంస. 4.128.

గంబూరము రూ.చూ. గంబూర. వి. కప్పురం. వసు. 6.84. ఆం. భా. 2.162.

గంబూరు రూ.చూ. గంబూర. వి. కర్పూరం.

గమ్మత్తు రూ. గమ్ముత్తు. వి. 1. చమత్కారం. హంస. 2.6. 2. కేళుక.

క. గమ్మత్తు. ఆనందంగా కాలం గడపటం.

గమ్మత్తుచిమ్ము అ.క్రి. వేడుకకల్పించు. హంస. 2.6. గమ్మత్తుచేయు స.క్రి. వినోదం కల్గించు.

గమ్మను చూ. గమ్ము.

గమ్మము వి. చెమట. చంద్రికా. 4.107.

సం. ఘర్మ-. చెమట ; ప్రా. ఘమ్మ-.

క. గమ్మ. చెమట.

<ప్రా. ఘుమ్మ-.

**గమ్ము** రూ.చూ. ఘుమ్ము. వి. **1**. వాసనకొట్టటం మొ. వాటి లోని అనుకరణం. భోజ. 5.47 ; **2**. గుద్దులాట.

గమ్మను అ. క్రి. పరిమళించు. పెద్దనచాటువు. గమ్మన క్రి. విశ. ద్రు. శీఘ్రంగా, వెంటనే.

**గమ్మత్తు** రూ.చూ. గమ్మత్తు. వి. వేడుక, తమాషా.

**గయగొట్టు (-కొట్టు)** అ.క్రి. చచ్చు.

సం. *గయా*. ఒకపుణ్యక్షేత్రం.

<సం. గయా + కొట్టు.

**గయాలి** రూ. గయాలు, గయాళు, గయ్యాళు. వి. బీడుపడ్డ భూమి, ప్రభుత్వంవారి అధీనంలో ఉన్న భూమి.

**గయాలు** రూ.చూ. గయాలి. వి. బీడుపడ్డభూమి, ప్రభుత్వం వారి అధీనంలో ఉన్న భూమి.

**గయాళము** రూ.చూ. గయ్యాళము. వి. **1**. ధిక్కారపుమాట ; **2**. నిందావాక్యం.

**గయాళి** రూ.చూ. గయ్యాళి. వి. **1**. వదరుబోతు. కళా. 4,62, ఆం. భా. 2.117 ; **2**. ధూర్తస్త్రీ. ఆం. భా. 2.117 ; విశ. క్రూరం. అచ్చ. రా. బాల. 63.

గయాళించు రూ.చూ. గయ్యాళించు. అ.క్రి. **1**. ఉద్ధతి చూపు. విప్ర. 3.89 ; **2**. అరచు. శుక. 4.42, 43 ; **3**. ధిక్కరించిమాటాడు.

**గయాళు** రూ.చూ. గియాలి. వి. సేద్యం చెయ్యటానికి తగని పొలం, ప్రభుత్వ అధీనంలో ఉన్న భూమి, పోరంబోకు. గయాళుభూమి వి. సేద్యంచేయటానికి తగనిపొలం.

**గయావళి** వి. గయక్షేత్రం దగ్గరస్నానం చేయించే పండా బ్రాహ్మణుడు.

సం. *గయావళి*-. గయానమూహం.

<సం. గయావళి. (అర్థవిపరి.).

**గయి** వి. **1**. గుంత, గుంట ; **2**. పెద్దకర్ర, వెదురుబొంగు ; **3**. లక్ష్యం, మాన్యపరచడం ; **4**. గౌరవం.

**గయిరమ్మ** రూ. గైరమ్మ. వి. గ్రామదేవత, గవరమ్మ, గౌరి, గవురమ్మ.

సం. *గౌరీ*-. పార్వతి.

<సం. గౌరీ + అమ్మ.

**గయిరి** రూ. గైరు[1]. విశ. మిన్నఅయిన.

**గయిరువిలియా** విశ. అక్రమమైన.

హిం. ఉ. గైర్వాజిబ్. అక్రమమైన, అయోగ్యమైన, అనమయమైన.

క. గైరు-విలె-. అక్రమమైన, పోయిన.

<ఉ. గైర్వాజిబ్.

**గయిను** రూ. గైను. వి. పొలం కంచెకు ఏర్పాటుచేసినదారి.

**గయ్యాళము** రూ. గయాళము. వి. **1**. ధిక్కారపు మాట ; **2**. నిందా వాక్యం.

క. *గయ్యాళి, గయాలి*. గద్దింపు, ధిక్కారం.

**గయ్యాళి** రూ. గయాళి. విశ. **1**. ధూర్తుడు. హర. 5.10 ; **2**. ధూర్తురాలు, ధిక్కరించి మాట్లాడేది. శుక. 3.18. వి. ధూర్త స్త్రీ. ఆం.నా.నం. 2.4.

క. *గయ్యాళి*. మూఢుడైన, దుర్బలమయిన.

గయ్యాళించు రూ. గయాళించు. స.క్రి. ధిక్కరించు. ద్వి.హరిశ్చ. ఉ. 355 పం. ; అ.క్రి. ధిక్కరించి మాట్లాడు. కళా. 3.222.

**గయ్యాళు** రూ.చూ. గయాలి. వి. సేద్యం చేయటానికి తగని పొలం.

**గర[1]** వి. జూదమాడటానికి ఉపయోగించే ఒక రకమైన పాచిక. సిం. ద్వా. 10.89.

**గర[2]** వి. **1**. ముద్ద, గడ ; **2**. భోజనం.

గరకట్టు రూ. గఱకట్టు. అ.క్రి. గడ్డకట్టు. జైమినీ. భా. 6.196. గరకొను యా.చూ. గఱకొను. అ.క్రి. గరకట్టు, గడ్డకట్టు. గరవడు రూ. గరవడు, గఱవడు. అ.క్రి. గడ్డకట్టు, ఘనీభవించు. గరవడు (-వడు) యా.చూ. గరపడు. అ.క్రి. గడ్డకట్టు, ఘనీభవించు.

**గర[3]** వి. రేఖా విశేషం. ఆం. భా. 2.34.

క. *గెరె*. గీత, చార.

**గర[4]** వి. మొక్క తలెత్తిన తర్వాత విస్తరిల్లే పచ్చటి భాగం.

**గరకచెక్క** వి. మోట బావి దోనెకు రెండు వైపులా నిలబెట్టిన బండ.

**గరకసా** వి. తగవులాట. ద. హిం. శా. సంపు. 10, శా. సం. 959, క్రీ.శ. 1663.

హిం. ఉ. *ఖర్ ఖశా*. జగడం.

<ఉ. ఖర్ఖశా.

**గరగ[1]** రూ. గరిగ, గరిగె. వి. **1**. నీళ్ల తాగటానికి ఉపయోగించే చిన్న పాత్ర. భార. అను. 2.388 ; **2**. ఘటం. హర. 2.123 ; **3**. గ్రామదేవతా ఘటం. రం.రా.సుందర ; **4**. చిన్న కుండ.

సం. *కరక*-. విద్యార్థులు సాధువులు వాడే జలపాత్ర, కొబ్బరి చిప్పతో చేసిన పాత్ర ; ప్రా. *కరగ-కరయ*. జల కలశం, జలపాత్ర.

క. *కరగ, గడిగె*. మట్టిపాత్ర.

<ప్రా. కరగ-.

గరగడ వి. నూనె మొ॥ చిన్న నోరున్న పాత్రల్లో పోయడానికి అడుగున తోకలా క్రోవి అమర్చి చేసిన విశాల మైన ముఖం ఉన్న పాత్ర, గరాటు, <గరగ + గడ. గరగపని వి. దప్పిక తీర్చటానికి పాత్రతో నీళ్ల పోసే పని. ద. హిం. శా. సంపు. 5, శా. సం. 82. గరగపనిచేయు బ్రాహ్మణుఁడు వి. దేవమజ్జనార్థం గరగతో నీళ్ల తెచ్చే బ్రాహ్మణుడు. ద. హిం. శా. సంపు 5, శా. సం. 82. గరగముంత వి. **1**. నీళ్ల తాగటానికి మొ॥ వాటి కుపయోగించే చిన్న పాత్ర ; **2**. ఘటం ; **3**. గ్రామదేవతా ఘటం. గరగలవారు వి.బ.వ. అభిషేకానికి గరగలు తెచ్చేవారు. శా.శ. కోశం. పు. 91.

**గరగ[2]** వి. మందుల్లో ఉపయోగపడే జిగురునిచ్చే ఒక చెట్టు, బిక్కచెట్టు (Gardenia gummifera).

**గరగడం** రూ.చూ. గరగడము. వి. ధాన్యరాశి చుట్టూ గీచిన గీతమీద పోసే పేడనీళ్ల.

**గరగడము** రూ. గరగడం. వి. ధాన్యరాశి చుట్టూ గీచిన గీత

మీద పోసే పేడ నీళ్లు.

గరగడముపేయు స.క్రి. ధాన్యరాశి చుట్టు (దొంగిలించకుండా) పేడ నీళ్ళతో వంకరగా గీతలు గీయు.

గరగర విశే. 1. రుచ్యమైన. భార. విరా. 1.76 ; 2. చక్కనైన. మను. 3.9 ; 3. మధురమైన. క్రి. విశే. ద్రు. చక్కగా, బాగుగా, పూర్తిగా. ప్రభు. 4.150 పు. 2 పం. ; వి. కాంతి, శోభ. నవనాథ. 1.62 పు. 18 పం.

గరగరవ విశే. 1. చక్కని, అందమైన, అనుకూలమైన. వరాహ. 7.19, కాశీ. 6.80 ; 2. నునుపైన. భాగ. 10.2.19. గరగరనివాఁడు విశే. చక్కనై నున్ననివాడు, మేదురుడు. విజయ. 2.164. గరగరలాడు అ.క్రి. శోభిల్లు, అందగిల్లు.

గరగరి వి. పింజ పింజ.

గరగరిక రూ. గరాగరిక. చూ. గరగర. వి. 1. విదం. వేంక. పంచ. 2.131 ; 2. నైర్మల్యం. ఆము. 1.60 ; 3. చక్కదనం, అందం. యయా. 4.42 ; 4. అలంకారం. కళా. 4.129 ; 5. శృంగార రసం. ఆం. భా. 1.131. విశే. 1. సుందరమైన, అందమైన. శశా. 4.70 ; 2. పరిశుభ్రమైన.

క. *గరగరికె*. మనోహరత, శుభ్రత, అందం ; తు. *గరకెనె*. శుభ్రం, స్పష్టమైన.

గరగరికతనము వి. పరిశుభ్రత. కవిచా. శ. 61.

గరగరిగా క్రి. విశే. ద్రు. సుందరంగా.

గరగు[1] వి. వృక్ష విశేషం. హంస. 4.135.

క. *గరగ*. ఒక రకం కలుపు మొక్క (Eclipta olbattassk).

గరగు[2] వి. 1. రెండు కొండల నడుమ ఏర్పడిన ఇరుకు, కనుమ, లోయ ; 2. ఎఱ్ఱని మట్టి ; 3. గరగు నేల.

గరగొర వి. తక్కువ, లోపం.

గరజు రూ. గరుజు. వి. అక్కర, అగత్యం.

నే. *గర్జ*. అక్కర, అగత్యం ; హిం. *గరజ్*. అవసరం, అగత్యం, అత్యవసరం.

క. *గరజు*. అవసరం, అత్యవసరం.

<హిం. గరజ్.

గరడి రూ.చూ. గరిడి. వి. 1. సమీపం ; 2. చోటు.

గరంటె రూ.చూ. గరిఁటె. వి. గరిటె, గంటె. ద.హిం.శా. సంపు 4, శా. సం. 935, క్రీ.శ. 1013.

గరండాలు వి.బ.వ. 1. వంతెన, ఇనప దూలాలు వేసి కట్టిన ఇనప వంతెన ; 2. ఇనప దూలాలు.

గరండీ వి. ఎత్తుగా ఉండే సిపాయి.

గరప వి. 1. సన్నని గులకరాయి కలిసిన నేల ; 2. వర్షాధారంతో పండే నేల.

గరపవాగలి వి. మెట్టనేల దున్నే నాగలి. గరపనేల రూ. గరుప నేల. వి. ఎఱ్ఱని ఇసుకతో కూడిన నేల.

గరయ వి. లోహంతో చేయబడిన బిందె, వంటపాత్ర. ద.హిం. శా. సంపు 6, శా. సం. 745, క్రీ.శ. 1393.

గరలమురువులు వి.బ.వ. కుమ్మరవాడు కుండలపై చెక్కే అలంకార విశేషం.

గరవడము రూ. గరవళము. వి. మల్లబంధ విశేషం. భాగ. 10, పూ. 1345.

గరవడు (-వడు) అ.క్రి. గడ్డకట్టు. భోజ. 7.215.

<గర[2] + పడు.

గరవళము రూ.చూ. గరవడము. వి. మల్లబంధ విశేషం. ప్రబోధ. 81.

గరవులు వి.బ.వ. కానుకలు.

గరసన వి. ఘర్షణ, పోట్లాట.

సం. ఘర్షణ-. ఒరపిడి.

<సం. ఘర్షణ- (అర్థవిపరి.).

గరసించు స.క్రి. ఘర్షించు.

సం. ఘర్ష్. ఒరయు.

<సం. ఘర్ష్ + -ఇంచు[3].

గరసులు వి.బ.వ. చర్మాలు.

గరాకు రూ.చూ. గరియాకు. వి. వరిపైరుకొన ఆకు.

గరాగరిక రూ.చూ. గరగరిక. విశే. సుందరమైన. అహల్యా. 2.9.

గరాట రూ. గరాటా, గరాటు. వి. నూనె మొ. నవి పోయడానికి ఉపయోగపడే సాధనం.

గరాటా రూ. చూ. గరాట. వి. వడపోసే గాజుపని ముట్టు.

గరాటు రూ.చూ. గరాట. వి. వడపోసేగాజుపనిముట్టు, గళ్ళాన, కుప్పెన, వాశిగ.

గరాను వి. 1. కుజనుడు, దుష్టుడు. శుక. 2.474 ; 2. దుష్టురాలు. విప్ర. 3.16 ; 3. క్రవ్యాసి, రక్కసి.

గరానులు వి.బ.వ. రక్కసులు, పొలదిండ్లు.

గరి[1] వి. 1. అతిశయం ; 2. వాడి ; 3. నాలుగుఅణాలు ; 4. పచ్చనిపైరు (మొక్కతలెత్తిన తరవాతవిస్తరిల్లిన పచ్చటి భాగం) ; 5. యుద్ధసన్నాహం.

క. *కరడు*. కరకుదనం, కరకైన, రంపంయొక్కపళ్ళున్న భాగం ; తు. *గరు*. కరకు, కాఠిన్యం ; త. *కరడు*. కరకు, మెరకపల్లాలు, అసభ్యమైనస్వభావం ; *కరట్టు*. మెరకపల్లాలుగల, మెరుగులేనట్టి, అనాగరికమైన, వ్యర్థంచేయు, పనికిరాని లేదా దుష్టమైన ; *కఱుకు, కరుక్క, కకుక్క, గఱుకు, గరకు, కరుక్క, గరసు*. పల్లు, గంటు, బొట్ట ; మ. *కఱు*. కరకు ; *కరుప్పా*. కరకు తనం ; కొండ. *కర్ప్*. కఠినత్వం ;

హిం. *గరిమా*. అతిశయం.

గరిగొను (-కొను) అ.క్రి. అతిశయించు. రం.రా.యు. 359 పు. 5 పం. గరిచిక్కం వి. తాటిమట్టపేళ్ళతో అల్లిన చిక్కం. గరిచిప్ప వి. ముత్యంచిప్ప. గరిచిలుకు వి. రెక్కలు కట్టినబాణం. గరిపడు రూ.చూ. గరిబడు. అ.క్రి. 1. గరుకుపారు ; 2. పగబూను ; 3. పట్టుదలవహించు. స.క్రి. కలియబడు, ఢీకొను. గరిబడు రూ. గరిపడు. అ.క్రి. కలియబడు, ఢీకొను. ప్రబంధ. 53.

గరి[2] వి. విచిత్రమైననిర్మాణంకలిగిన ఒకచెట్టు, చిన్నచెట్టు, గారచెట్టు (Balanites Roxburghi).

గరిక రూ. గర్క. వి. నేలలోలోతుగావేళ్ళు పాతుకొని పెరిగే

కలుపుమొక్క.

గరికపోచలచీర వి. గడ్డిపోగులకోక, ఒకకొలికి ఎరుపు రెండుకొలుకులు తెలుపు చొప్పున నిలువుకుపెట్టి నేసిన చీర.

గరికసన్నం రూ. గరికెనన్నం. వి. దాళవాపంటవడ్లు.

గరికసూదులు వి.బ.వ. ఒకరకంవడ్లు.

గరికి వి. ముళ్లుగలకొమ్మలుకలిగి కంచెలకుఉపయోగపడే ఒక చెట్టు (Scutiaindica).

గరికెవడ్లు చూ. గరికసన్నం. వి.బ.వ. దాళవావడ్లు.

గరికెనన్నం రూ.చూ. గరికసన్నం. వి. రెండోపంటవడ్లు.

గరికెనంబావులు చూ. గరికసన్నం. వి.బ.వ. గరికసన్నాలకు మరోపేరు.

గరిగ రూ.చూ. గరగ[1]. వి. 1. చిన్నకుండ. అహల్యా. 2.50 ; 2. కుండ. ఆం.భా. 2.247 ; 3. చందనంబుడ్డి.

గరిగుమ్మడి[1] వి. ఊదారంగుపూలుపూసే ఒకతీగె (Vitis-tomelosa).

గరిగుమ్మడి[2] వి. ఒకేగింజకలిగిన నీలిరంగువళ్లుకాసేఒకతీగ. (Vitislinnaei).

గరిగె రూ.చూ. గరగ[1]. వి. చిన్నకుండ.

గరిగెబుడ్డి రూ. గెరికిబుడ్డి, గెరిగిబుడ్డి. వి. చందనంబుడ్డి, పెండ్లితర్వాత దీనిలోపసుపుపోస్తారు. గరిగెమరవ రూ. గడియ మరవ. వి. అరివేణిలేకుండాపెళ్ళిచేసేవారు వాడేమట్టిపాత్ర. గరిగెముంత వి. అరివేణిలేకుండా పెళ్ళిచేసేవారు వాడేమట్టి పాత్ర.

గరిజె రూ.చూ. గరింజె. వి. రంగునీళ్ళలోనూలు ఉడకపెట్టి నప్పుడు లడీలు తిరగవేసే ఇనపగరిజె.

గరిడి రూ. గరడి, గరిడీ. వి. 1. అభ్యాసస్థానం. భీమ. 4.105; 2. చోటు, స్థానం. భీమ. 6.4 ; 3. సాము. కళా. 3.130; 4. సమీపం, సన్నిధి. రాఘవ. 2.19.

క. *గరడి, గరుడి.* నివాసస్థలం, సాము, సాముఆటలు మొ. నవి నేర్చుకొనేస్థలం ; త. *గరడి, గరాడి* ; త. *కరటి, కరుటి, కెరుటి.* సాము, సాము, గరడీ మొ. ఆటలు నేర్చుకొనే స్థలం.

పో.చూ. నం. ఖురలీ.

గరిడికెక్కు అ.క్రి. నైపుణ్యసంపాదించుకొను. పండి.చ. 3.176 వ. <గరిడె+-కు+ఎక్కు. గరిడిముచ్చు వి. ఆరి తేరినదొంగ. కళా. 2.45.

గరిడియ రూ. గరిడె. వి. వెదురుబుట్ట. భార. ఆరణ్య. 7.266.

నం. *కరండక-.* పెట్టె.

గరిడీ రూ.చూ. గరిడి. వి. సాము మొ. వాటిని చేసేచోటు.

గరిడీపాల వి. తాలింఖానా, సాముచేసేఇల్లు.

గరిడె రూ.చూ. గరిడియ. వి. వెదురుబుట్ట.

గరిడెవడ్లు చూ. గరిగె. వి.బ.వ. ఒకరకంవడ్లు.

గరింటె రూ. గంటె[1], గరంటె, గరిటె, గటింటె. వి. కర్ర. ఇనుము మొ. వానితో చేసినతెడ్డు, కంబి. ఆం.భా. 2.243.

త. *కరంటి.* గరిటె ; మ. *కరణ్టి.*

గరింటెకామ వి. ఓషధీవిశేషం.

గరిత రూ. గర్త[1]. వి. భార్య, గేస్తురాలు. ఉ.హరి. 2.144 ; 2. పతివ్రత. భాగ. 9.60 ; 3. ఆడది. ద్వి.హరిశ్చ. ఉ. 1196 పం.

నం. *గృహస్థా-.* ఇల్లాలు ; ప్రా. *ఘరత* ; అప. *ఘర.* ఇల్లు ; *ఘరణీ.* గృహిణి ; అ.మా. *ఘతక్.* పతివ్రత.

క. *గరతి.* గుణవతి అయినస్త్రీ, భార్య, ఇల్లుచూసు కొనేది ; తు. *గర్తి.* వివాహిత, పతివ్రత.

<ప్రా. ఘరత.

గరితతనము వి. పాతివ్రత్యం. శుక. 2.372.

గరిది రూ. గర్ది. వి. 1. దండయాత్ర ; 2. ప్రభుత్వం.

గరిమ వి. విధం, రీతి. విక్ర. 2.69.

నం. *గరిమన్.* భారం, గొప్పతనం.

<నం. గరిమన్ (అర్థవిపరి.).

గరిమిడి[1] వి. 1. పందికొక్కు. కకుత్స. 4.98 ; 2. ఎల్లెలుక.

గరిమిడికొక్కు వి. పందికొక్కు. ఆం.భా. 2.86.

గరిమిడి[2] వి. గరిక, దూర్వ, తృణవిశేషం. ప్రబంధ. 201.

గరియ వి. ములగచెట్టు.

గరియాకు (-ఆకు) రూ. గరాకు, గణాకు. వి. పరిపైరుకొన ఆకు.

గరివడియము రూ.చూ. గరివడెము. వి. ఒకవిధమైనవడియం.

గరివడె రూ.చూ. గరివడెము. వి. ఒక విధమయిన వడియం.

గరివడెము రూ. గరివడియము, గరివడె. వి. గరివడియం. ఆం.భా. 2.255.

నం. *ఖరవటుక-*; ప్రా. *ఖరవడగ-.*

గరివించు అ.క్రి. గర్వపడు. కవిక. 3.226.

నం. *గర్వ్.* గర్వించు.

<నం. గర్వ్+-ఇంచు[3].

గరిశ రూ.చూ. గరిసె. వి. 1. గాదె ; 2. మానవిశేషం.

గరిసియ రూ.చూ. గరిశ. వి. 1. గాదె, పాణక ; 2. నాలుగువందల కుంచాలపరిమాణం.

గరిసె రూ. గరిశ, గరిసియ, గటిసె. వి. 1. గాదె, పాణక. హరి. పూ. 6.138 ; 2. 600 కుంచాలు పరిమాణం (ఆడి దము సూరకవి చాటువు) ; 3. నేలలో గచ్చుతో కట్టిన కట్టు ; 4. ఇంట్లోఒకమూల చెక్కకూర్పుతో ఏర్పరచిన గది.

ప్రా. *కరిస-.* ఒకానొకకొలత ; పా. *కరీస-.* భూపరి మాణం, గరిసెడు విత్తులుపట్టేనేల ; *ఖారి-ఖారీ.* గింజల కొలత.

క. *గరసె, గెరసె* ; త. *కరచె, కరిచై.*

గరిసెబావి వి. మెల్లెలతో గరిసెలాగ అల్లి భూమి లోపలికి కుంచి ఎత్తేనూయి, ఒరలు మొ. వాటికి బదులుగా చువ్వలతో గాదెలా అల్లి నేలలోపలికి దింపి ఏర్పరచిన ఒకరకమైన నూయి. గరిసెలిల్లు వి. వడ్లకొట్టు.

గరిసెన వి. భక్ష్యవిశేషం. శ్రీరం. మా. 6.110.

గరిసెనేల వి. నల్ల కంకరనేల.

గరీబు విణ. 1. మహమ్మదీయుల్లో ఒక తెగ. రాజవా. 5.13 ; 2. బీదవాడు, దీనుడు. ద.హిం.శా. సంపు. 10 శా.సం. 753 క్రీ.శ. 1572.

నే. *గరీవ్, గరీబ్.* బీదవాడు ; హిం.ఉ. *గరీబ్.* బీదవాడు.

క. గరీబ.

<ఉ. గరీబ్.

గరు చూ. గగ్గురు. వి. గగ్గురు, రోమాంచం. శివరా. 1.61.

గరుదాల్చు (-తాల్చు) అ.క్రి. గగుర్పొడుచు. కాశీ. 2.149. గరుదాల్పు (-తాల్పు) వి. గగుర్పాటు. ఆం.భా. 1.141. గరుపాటు వి. గగుర్పాటు. శశా. 3.64. గరుపాటు మొన వి. పందిముట్టె. వేంక. పంచ. 1.73. గరుపారు అ.క్రి. గగుర్పొడుచు. భార. విరా. 4.51. గరుపొడుచు అ.క్రి. 1. గగుర్పొడుచు ; 2. మీదికి తూలిపడు.

గరుకు వి. 1. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ గీసేగీత ; 2. పైరు పొట్టవేయటానికి ముందరి దశ.

గరుకుచోడి రూ.చూ. గరువచోడి. వి. మెట్టసాగులో పండించే ఒకరకంచోడి.

గరుగ రూ.చూ. గరుగుడు. వి. మంచి కలపనిచ్చే ఒక చెట్టు, దీనిపళ్ళు తింటారు (Garuga pinnata).

గరుగు[1] రూ.చూ. గరువు[1]. వి. నల్లని గులకరాయి కలిసేనేల, తెల్లని పొడిరాయి ఉండే నేల, వర్షాధారంతో పండేనేల.

గరుగు[2] రూ.చూ. గరుగుడు. వి. మంచి కలపనిచ్చే ఒక చెట్టు, దీనిపళ్ళు తింటారు (Garuga pinnata).

గరుగుడు రూ. గరుగ, గరుగు[2], గర్గ, గర్గు. వి. మంచి కలప నిచ్చే ఒక చెట్టు, దీని పళ్ళు తింటారు (Garuga pinnata).

గరుజు రూ.చూ. గరజు. వి. అక్కర, అగత్యం.

గరుజుపట్టు అ.క్రి. అక్కరపడు.

గరుటామంతుఁడు రూ.చూ. గరుటాలమంతుఁడు. వి. గరుత్మంతుడు. ఆం.భా. 1.53.

గరుటాలమంతుఁడు రూ. గరుటామంతుఁడు, గరుడామంతుఁడు, గరుడాలమంతుఁడు. వి. గరుత్మంతుడు. యయా. 2.3.

సం. గరుత్మత్, గరుడ-. గరుడుడు.

క. గరుత్మంత. గరుడుడు.

<సం. గరుడ-. గరుత్మత్.

గరుటి వి. గరుత్మంతుడు. సాంబ. 1.15.

సం. గరుడ-. గరుత్మంతుడు.

<సం. గరుడ-.

గరుడ వి. గరుడపచ్చ.

సం. గరుడ-. గరుత్మంతుడు.

<సం. గరుడ- (అర్థవిపరి.).

గరుడకంబము రూ.చూ. గరుడకంభము. వి. గరుడస్తంభం. ఉ.రా. 2.298.

గరుడకంభము రూ. గరుడకంబము. వి. నేరం చేసిన వారిని బంధించడానికై కొత్వాలు చావడి ఎదుట పాతబడిన స్తంభం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 570 క్రీ.శ. 1399.

<సం. గరుడ- + కంభము. మిశ్రన.

గరుడటెక్కము వి. గరుడధ్వజం. ఉ.రా. 8.294.

<సం. గరుడ- + టెక్కము. మిశ్రన.

గరుడఁడు వి. అరజుట్టు, పందెంకోళ్ళలో ఒక తెగ జాతి.

సం. గరుడ. గరుత్మంతుడు.

<సం. గరుడ- (అర్థవిపరి.).

గరుడపచ్చ వి. 1. మరకతం, పచ్చవన్నెల మాణిక్యం. యయా. 4.86 ; 2. గరుడపచ్చ వన్నెగల వస్త్రవిశేషం. ప్రబంధ. 272.

<సం. గరుడ + పచ్చ. మిశ్రన.

గరుడమల్లె వి. మల్లెజాతికి చెందిన తెల్లటి పూలుపూసే మొక్క (Jasminum engustifolium).

గరుడమానిక వి. కొలమాన విశేషం, మానిక అంటే కుంచంలో నాల్గోభాగం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 218, క్రీ.శ. 1254.

<సం. గరుడ + మానిక. మిశ్రన.

గరుడముక్కు వి. చంచువు.

<సం. గరుడ- + ముక్కు. మిశ్రన.

గరుడసరులు వి.బ.వ. ధాన్యవిశేషం. హం.స. 4.128.

<సం. గరుడ- + సరులు. మిశ్రన.

గరుడాడువారు వి. గరుత్మంతుడు. ద.హిం.శా.సంపు. 10.శా. సం. 565 క్రీ.శ. 1391.

<సం. గరుడ + ఆడువారు. మిశ్రన.

గరుడామంతుఁడు రూ.చూ. గరుటాలమంతుఁడు. వి. గరుడుడు.

గరుడారతి వి. ఆరాత్రికాభేదం.

<సం. గరుడ- + ఆరతి. మిశ్రన.

గరుడారోహణకంభము వి. దారువుతోగాని, రాతితోగాని విష్ణాల యానికి ఎదుట కట్టబడి దాని అడుగున గరుడ విగ్రహ మున్న ధ్వజస్తంభం. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 919 క్రీ.శ. 1401.

<సం. గరుడారోహణ- + కంభము. మిశ్రన.

గరుడాలమంతుఁడు రూ.చూ. గరుటాలమంతుఁడు. వి. గరుడుడు.

గరుడి వి. గరుత్మంతుడు. కు. సం. 2.29.

సం. గరుడ-. గరుత్మంతుడు ; ప్రా. గరుడ, గరుల ; అ.మూ. గరుల. గద్ద.

తు. గరడె, గరుడ, గరుడె.; మ. కెరుటన్.

<సం. గరుడ-.

గరుడిరవుతు రూ. గరుడిరౌతు. వి. గరుడవాహనుడు, విష్ణువు. గరుడిరౌతు రూ.చూ. గరుడిరవుతు. వి. విష్ణువు.

గరువనేల రూ.చూ. గరపనేల. వి. గులకరాళ్ళు గల మెరక నేల.

గరుబు రూ.చూ. గరువు[1]. వి. గరపనేల, గరువు, గరుసు.

గరుము రూ.చూ. గరువు[1]. వి. గులకరాళ్ళతో గట్టిపడిననేల.

గరువతనము[1] చూ. గరువము[1]. వి. 1. నియమం ; 2. కట్టడ.

గరువతనము[2] చూ. గరువము[2]. వి. గర్వం.

గరువము[1] వి. 1. గొప్పతనం. భార. ఆరణ్య. 6.405 ; 2. విస్తృతి, విరివి. విష్ణుపు. 1.129 ; విణ. 1. విస్తృత మైన, సవిస్తరమైన. భార. ఉద్యో. 4.298 ; 2. అధిక మైన, అతిశయమైన, పెద్దదయిన. విక్ర. 6.51.

సం. గౌరవ-. భారం, గురుభావం ; ప్రా. గౌరవ-; క. గరువ. భారం (గరిమా శబ్దభవమని కిట్టెల్).

<ప్రా. గౌరవ-.

**గరువము²** రూ. గఱువు³. వి. గర్వం. భార. భీష్మ. 1.112.
సం. *గర్వ-*. గర్వం; ప్రా. *గవ్వ* ; అప. *గబ్బ*. *గావ* ; అ.మా. *గవ్వ-* ; నే. *గర్బ*. గర్వం ;
క. *గరువ*. పొగరు, మదం, మోసం ; *గరువికె గర్బు*. గర్వం ; మ. కెరువె.
<సం. గర్వ-.

**గరువాడు** రూ.చూ. గర్వాడు. అ.క్రి. మేపుమేయు.

**గరువు¹** రూ. గరుగు¹, గరుబు, గరుము, గఱువు³. వి. 1. నన్నని గులకరాయి కలిసిన నేల. మను. 4.60 ; 2. వర్షాధారంతో పండే నేల.
క. *గరసు*. గులకరాయి.
సం *గురు-*. పెద్దదయిన ; ప్రా. *గరు-*.
గరువుచోడి రూ. గరుకుచోడి. వి. మెట్టసాగుతో పండించే ఒకరకంచోడి. గరువుభూమి వి. మెరకనేల. ద.హిం.కా.సంపు. 5. కా.సం. 82. గరువుసెలక వి. గులకరాయి కలిసిన ఎర్ర నేల, మెట్టపొలం.

**గరువు²** రూ.చూ. గఱువు¹ వి. చెంప. మను. 5.58.

**గరువ** రూ.చూ. గరుసు². వి. హద్దు.

**గరుసు¹** రూ. గర్స, గర్సు¹, గర్సె, గఱ్సె. వి. 1. గులకరాయి. కు.సం. 7.90 ; 2. తోలు, చర్మం. ఆము. 5.17; 3. గరువు నేల, కఠినమైనభూమి. ఆం.భా. 2.4 ; 4. గట్టితనం.
క. *గరసు*, *గరుసు*. గులకరాయి ; తు. కరికల్లు. గులకరాయి, కఠినమైనభూమి ; త. *కరటు*. కరకుదనం.

**గరుసు²** రూ. గరున, గర్సు². వి. 1. ఒడ్డు. కు.సం. 6.119 ; 2. హద్దు, మేర, మర్యాద, అవధి. భార. అరణ్య. 4.228 ; 3. రెండు పొలాలకు మధ్య హద్దుగా వేసిన గట్టు ; 4. మాగాణిలో మడికీ, మడికి వేసిన మట్టికట్ట.
క. కరె. ఒడ్డు, హద్దు, బట్టంచు ; కొడ. *కరె*. ఒడ్డు ; తు. *కరె*. సముద్రపుటొడ్డు, నదిఒడ్డు. అంచు, బట్టకున్న రంగంచు ; త. *కరై*. ఒడ్డు, పొలానికున్న హద్దు, బట్టంచు; మ. *కర*. ఒడ్డు, నదిఒడ్డు, బట్టకున్న రంగంచు ; కో. *కర్*. బట్టచివరనున్న రంగుచారలు ; తొ. *కర్*. రంగునేత.
గరుసెక్కు అ.క్రి. మేరమీరు, పొంగు. వరాహ. 10,47. <గరుసు² + ఎక్కు.

**గరుసెక్కు** చూ. గరుసు².

**గరేకుండ** వి. బిందె, ఇత్తడి లేదా రాగి కుండ.

**గర్క** రూ.చూ. గరిక. వి. నేలలో లోతుగా వేళ్ళు పాతుకొని పెరిగే కలుపుమొక్క.

**గర్గ** రూ.చూ. గరుగుడు. వి. మంచి కలపనిచ్చే ఒకచెట్టు (Garuga pinnata).

**గర్గు** రూ.చూ. గరుగుడు. వి. మంచి కలపనిచ్చేచెట్టు.

**గర్త¹** రూ.చూ. గరిత. వి. భార్య. భార. శాంతి. 3.472.

**గర్త²** వి. పల్లం, గొయ్యి.

**గర్ది** రూ.చూ. గరిదె. వి. 1. దండయాత్ర ; 2. ప్రభుత్వం.

**గర్బ** వి. ఆకుతోటల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క.
సం. *గర్భ-* లోపల.
<సం. గర్భ-.

**గర్భదులు** వి.బ.వ. పూర్వాషాఢ. ఉత్తరాషాఢ అనే కార్తెలు.

**గర్భం** వి. ఏర్పడుతున్న ఎన్ను, ఆకులు ఆవరించి ఉబ్బెత్తుగా కనబడే ఎన్ను.
సం. *గర్భ*. లోపల, కడుపు.
<సం. గర్భ- (అర్థవిపరి.).

**గర్భసందు** వి. మగ్గం దోనెకూ దండెకూ మధ్య నేత భాగం.
సం. *గర్భ-*. లోపల.
<సం. గర్భ- + సందు. మిశ్రసమా.

**గర్భసుడి** వి. బొడ్డుసుడికి జానెడు ఎడంగా వెనకవైపున ఉండే సుడి.
సం. *గర్భ-* లోపల, కడుపు.
<సం. గర్భ- + సుడి.

**గర్రిచీర** వి. చెక్క అరలరలుగాఉండే ఒకరకం చీర.

**గర్రిబిక్కి** వి. ఎర్రిబిక్కిచెట్టు, ఔషధాల్లో ఉపయోగపడే జిగురు నిచ్చే ఒకచెట్టు (Gandinia lucida).

**గర్వాడు** రూ. గరువాడు. అ.క్రి. మేయు. ఆం.భా. 3.97.

**గర్స** రూ.చూ. గరుసు¹. వి. గులక లేక సున్నం రాళ్ళతో కూడిన నేల ద.హిం.కా. సంపు. 5, కా.సం. 1221. క్రీ.శ. 1809.

**గర్సు¹** రూ.చూ. గరుసు¹. వి. 1. గులకరాయి ; 2. తోలు, చర్మం ; 2. గరువునేల, కఠినమైన భూమి.

**గర్సు²** రూ. చూ. గరుసు². వి. 1. హద్దు ; 2. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన గట్టు.

**గర్సె** రూ.చూ. గరుసు¹. వి. గరుసుభూమి.

**గఱకట్టు** రూ.చూ. గరకట్టు. అ. క్రి. నెత్తురుగడ్డకట్టు.

**గఱకొను** రూ. గరకొను, అ.క్రి. నెత్తురుగడ్డకట్టు.

**గఱగఱ** వి. గరుగ్గా ఉన్న వస్తువును స్పృశించటంలో అయ్యే అను కరణం, భక్ష్యాన్ని నములుతున్నప్పుడయ్యే ధ్వనికి అను కరణం.
క. *గఱగఱ*. గట్టివస్తువులు తిన్నప్పుడైన చప్పుడుకు అనుకరణం ; తు. *కరకర*. తిన్నప్పుడు, రాసినప్పుడు అయినచప్పుడు ; త. *కఱుకఱుప్పు*. గట్టిదనం. చప్పుడు ; మ. *కఱుకఱే*. అరచినప్పుడైన చప్పుడుకు అనుకరణం ; కురు. *ఖడ్ ఖర్నా*, మాట్లాడినపుడు చెవికి అసహ్యంగా వినబడే శబ్దం.
గఱగఱలాడు అ.క్రి. గరగరనిమోగు <గఱగఱ + -లు + ఆడు.

**గఱగొఱ** వి. తక్కువ, లోటు. భార. ద్రోణ. 1.223.

**గఱవడు (-పడు)** రూ.చూ. గరపడు. అ.క్రి. నెత్తురు గడ్డ కట్టు.

**గఱాకు** రూ.చూ. గరియాకు. వి. వరిపైరు అధికంగా పెరిగే టప్పుడు చివరకోసే ఆకులు, <గఱి² + ఆకు.

**గఱి¹** వి. పక్షి. 1. బాణం మొ. వాటిరెక్క. వరాహ. 4.83 ; 2. ఈక. ఆము. 2.38.
క. *గఱి*. ఈక, రెక్క, తాటిఆకు. కొడ. *గర్-*. ఈక తు. *గరి*. ఈక, రెక్క ; మ. ఎకిఱు. రెక్కలు.
పో.చూ. సం. *గరుత్*. రెక్క.

గఱిచిలుకు వి. రెక్కలుకట్టిన బాణం. యయా. 1.42.

గఱియాఁక(-ఈఁక) వి, పక్షిరెక్క.

గఱి[2] వి. తాటికమ్మ. విణ. గరుకైన.

గఱికమ్మ రూ.చూ. గఱిగమ్మ. వి. గరుకుకల తాటాకు బద్ద, గరుకు అంచులున్న తాటాకుబద్ద. గఱికమ్మి వి. గరుకు కల తాటాకుబద్ద. గఱికొను అ.క్రి. పదునెక్కు. గఱిగప్పు (-కప్పు) రూ. గఱికమ్మ. వి. రంపంవలె గరుకంచులుఉన్న తాటికమ్మ. గఱిచిప్ప వి. ముత్యంచిప్ప, గఱిపడు అ.క్రి. 1. కరకుపారు ; 2. పగబూను ; 3. పట్టుదలవహించు. గఱిబద్ద వి. గరిగమ్మ.

గఱిక రూ. గఱికి, గఱికె. వి. దూర్వ, ఒకరకంగడ్డి. ఆము. 4.35.

క. గఱికె. ఒకరకంగడ్డి ; కఱికె. ఒకరకం గడ్డి. (Agrostistinaris). కొడ. గఠికె. గడ్డి. (Agrostistireans) ; తు. కదికె. ఒకరకం గడ్డి ; (Cynodon-dactylon). త. అఱుకు, అఱుక, అఱుకై. పండగ సమయంలో వాడే ఒకరకంగడ్డి. (Cynodon dactylon). మ. కఱుక. శ్రాద్ధకర్మ మొ. నవి చేసినప్పుడు ఉపయోగించే గడ్డి (Agrostislinearis). కో. కర్గ్. గడ్డి ; తొ. కర్ట్స్. చిన్నగడ్డి ; గోం. కార్. గడ్డి.

హిం. గలీ. ఒకరకం గడ్డి.

గఱికచెక్క వి. పచ్చికతోఉన్న మట్టిపెల్ల, పచ్చికపెల్ల. గఱికచెక్కు వి. పచ్చికతోటి మట్టిపెల్ల, పచ్చికపెల్ల. గఱికపూజల మెచ్చుగబ్బవేల్పు వి. వినాయకుడు వ్యు. దూర్వా పూజవల్ల మెచ్చుకొనే దేవుడు. గఱికమోడిచెక్క వి. పచ్చికతోడు మట్టిపెల్ల. గఱికనవ్వాలు వి.బ.వ. గరిక నూదులు. గఱికనూదులు వి.బ.వ. ధాన్యవిశేషం.

గఱికి రూ.చూ. గఱిక. వి. దూర్వ, గరికగడ్డి.

గఱికె రూ.చూ. గఱిక. వి. దూర్వ, గరికగడ్డి.

గఱిఁటె రూ. చూ. గరిఁటె, వి. గరిటె.

గఱిసె రూ.చూ. గరిసె. వి. 1. గాదె ; 2. ఒకకొలత.

గఱుకు వి. కొడవలి మొ. వాటికక్కు. విణ. నునుపుకాని.

గఱుగు వి. 1. ఒకానొకచెట్టు ; 2. అడవిలాదట్టమైంది.

క. గరగ. ఒకరకం మొక్క (Echipta albattassk).

హిం. గర్గరా. పంటనునాశనంచేసే ఒకరకంగడ్డి. ఎడ్లకి ఒకరకమైన ఆహారం.

గఱుచు విణ. అడవివలె దట్టమైన.

గఱువ వి. 1. పెద్ద, వృద్ధు, గొప్పవాడు. భార. సభా. 2.228 ; 2. మర్యాదగలది, గౌరవంకలది. భార. సభా. 3.55 ; 3. గంభీరం, గాంభీర్యం కలది. భార. విరా. 3.55 ; 4. ప్రౌఢం. ప్రభా. 3.52 ; 5. మగటిమి.

క. గరువ. గౌరవింపదగ్గమనిషి.

సం. గురు-. పెద్దఅయిన, ఆచార్యుడు ; ప్రా. గరు.

గఱువలు వి.బ.వ. పెద్దవారు. ప్రభా. 3.52.

గఱువు[1] రూ. గరువు[2]. వి. చెక్కిలి.

గఱువు[2] రూ.చూ. గరువము[2]. వి. గర్వం.

గఱువు[3] రూ.చూ. గరువు[1]. వి. గట్టినేల. విణ. పెద్ద, గొప్ప వారయిన.

గఱువునేల వి. ఇనకనేల.

గఱుసుదేఱు(-తేఱు) అ.క్రి. కరకుదనం చెందు.

గఱుసుమీఱు అ.క్రి. కరకుదనం చెందు.

గఱ్ఱు వి. గర్వం, పొగరు.

సం. గర్వ-. గర్వం.

గఱ్ఱు వి. తేన్చటంలో అయ్యే అనుకరణ ధ్వని. ధ్వన్యను. కాశీ. 4.237.

క. గఱ్ఱు. త్రేన్చటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

గఱ్ఱె వి. చేపలుపట్టే తిత్రివంటి సాధన విశేషం.

గఱ్ఱె రూ.చూ. గరును[1]. వి. గరుసు భూమి. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 126. క్రి. శ. 1296.

గల వి. 1. అందెలు మొ. కదిలేటప్పుడైనధ్వని. కళా. 6.199 ; 2. చెట్లు, మొ. నవి కదిలేటప్పుడయ్యేధ్వని. రామాభ్యు. 7.127.

క. గల. గొలుసులచప్పుడు, ఘల్లుఘల్లుమనే శబ్దం, గణగణమనే శబ్దం (గజ్జెలచప్పుడు).

గలగల వి. 1. భూషణాల కదలికలో అయ్యేధ్వనికి అనుకరణం. మల్లు. 4.65 ; 2. చెట్లు, మొ. నవి కదలటంలో అయినధ్వనికి అనుకరణం. రామాభ్యు. 7.127 ; 3. నాణాల చప్పుడు ధ్వన్యను. క. గలగల. గొలుసుల చప్పుడు, ఘల్లుమనే చప్పుడు, గంటలశబ్దం ; కొడ. గల్ గల్ ఇల్. కదలికలు ; తు. గలగల. కడియాల చప్పుడు ; గళుగళు. కడుపులో అయిన చప్పుడు ; గళగళ ; శబ్దం ; మాల్తో. కాల్-క్రతె. సీక్కు, లేదా గవ్వలు కదుపు. సం. కల. అస్పష్టత, నెమ్మది, శ్రవణానందకరమైన. గలగల లాడు అ.క్రి. పోట్లాడు < గలగల + -లు + ఆడు.

గలగర రూ.చూ. కలకర[1]. వి. గుంటగలగర, గుంటగలిజేరు (Eclipta prostrata).

గలగరించు స.క్రి. బాగాకలుపు, రంగరించు.

గలగుదంటు వి. సముద్ర ప్రాంతంలో పెరిగేఒకరకం మొక్క నుంచి తీసిన వల్ల.

గలంగ వి. గులుంగ.

క. గలగు. కలాలు చేసుకునే ఒకరకమైన రెల్లు. (Rostbodlia exaltata).

గలగండవక్షి వి. మర్కటం, కోతి.

గలజర రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ, గలిజేరు.

గలజెరు రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ.

గలజేర రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ, రోడ్లపక్కను, బంజరునేలల్లోనూ పెరిగే తెల్లటిపూలు నల్లటి విత్తులు కలకలువు మొక్క.

గలజేరి రూ.చూ. గలిజేరు. వి. రోడ్లపక్కను, బంజరునేలల్లో పెరిగే తెల్లటి పూలున్న నల్లటి విత్తులుగల కలుపుమొక్క.

గలజేరు రూ.చూ. గలిజేరు. వి. పునర్నవ.

గలతరించు అ.క్రి. ఒళ్ళుజల్లుమను.

గలతి రూ.చూ. గలంతియ. వి. గిండి, చెంబు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 1334. క్రి. శ. 1470.

గలదము వి. సామాన్యగంధం.

గలంతి రూ.చూ. గలంతియ. వి. గిండి, చెంబు.

గలంతియ రూ. గలతి, గలంతి, గలంతె. వి. గిండి, చెంబు. పండి. చ. 5.314.

సం. గలంతికా. తులసిమొక్క మీదగాని లింగంమీద గాని బొట్టు బొట్టుగా నీరుపడేట్టు కట్టిన అడుగున చిల్లున్న చెంబు ; ప్రా. గంతఅ, గలంత, గలింత. స్రవించడం, బొట్టుబొట్టుగా పడటం.

గలంతె రూ.చూ. గలంతియ. వి. గిండి, చెంబు. ఆం. భా. 2.247.

గలపడింపు రూ. గలపడింపు. వి. అప్రయోజకుడు.

గలపడింపు రూ.చూ. గలపడించు. వి. అప్రయోజకుడు.

గలపరించు అ.క్రి. గగుర్పొడుచు.

గలబ రూ. గలబా, గల్బా. వి. 1. కలత. భాగ. 7. స్కం ; 2. అల్లరి. జగడం. దుండగం. సిం. ద్వా. 7.64.

క. కలిబలి, గలబరి, గలిబిలి. గజిబిజి, సంభ్రమం, తత్తరపాటు ; తు. గలిబిలి. గజిబిజి, కలత ; గలబు. కలత, గజిబిజి, తత్తరపాటు. త. కలిపలి, కలిపిలి. అల్లరి, కలకలు. పోట్లాట.

మరా. గలబలణే. అల్లరిఅగు ; గలభా. క్షోభం.

<మరా. గలభా.

గలబరించు అ.క్రి. 1. డోకువచ్చు. శివరా. 3.92 ; 2. పక్కలముక్కలానమలి నీళ్ళుపోసుకొని మింగు; 3. కలగలపు చేయు, మురికిచేయు ; 4. నోటిలోనీళ్ళుపోసికొని గొంతు వరకు పుక్కిలించు ; 5. కుండలో నీళ్ళుపోసి తిప్పిపార వేయు , 6. నీళ్ళుకలచెట్టు.

గలబా రూ.చూ. గలబ. వి. 1. అల్లరి ; 2. జగడం ; 3. కలత.

గలబాచేయు అ. క్రి. అల్లరిచేయు. గలబాయించు రూ. గలభాయించు, గల్బాయించు. స.క్రి. కలవరంకల్గించు, అల్లరి చేయు.

గలబిలి రూ. గలబెల. వి. గడబిడ.

క. గలి-బిలి. కలవరం, గందరగోళం ;

హిం. గడ్-బడ్. కలత, తత్తరపాటు.

<క. గలిబిలి.

గలబుకట్టె వి. సముద్రప్రాంతంలో పెరిగే ఒకరకం మొక్క నుంచి తీసినపుల్ల.

గలబెల రూ.చూ. గలబిలి. వి. గడబిడ.

గలభాయించు రూ.చూ. గలబాయించు. స.క్రి. అల్లరిచేయు, కలవరం కలుగచేయు.

గలరి రూ.చూ. గలిజెరు. వి. గలిజేరు, మెట్టనేలల్లో మొలిచే కలుపుమొక్క.

గలస వి. గులకఇసక కలిసినవదులునేల, మెట్టపొలం.

గలసనేల వి. మెట్టపొలం, గరువు.

గలహ వి. 1. రోత ; 2. ఛీత్కారం.

సం. గర్హ-. నింద, దూరు.

<సం. గర్హ. (అర్థవిపరి.).

గలాకుండ రూ.చూ. గడేకుండ. వి. ఒకరకం వాద్యపుకుండ.

గలాటా రూ. గవాటా. వి. 1. అల్లరి ; 2. అంటువ్యాధి విస్తరించటం.

హిం. ఉ. గల్లా. రొద ; అర. గుల్.

క. గలబె. అల్లరి, గడబిడ.

<ఉ. గల్లా.

గలామ వి. కళ్ళెం.

గలాయించు అ.క్రి. 1. దొంగిలించు ; 2. కరిగించు.

హిం. గలానా. మెల్లమెల్లగా లోపింపచేయు, కరిగించు.

<హిం. గలా (నా) + -ఇంచు[3].

గలాసు వి. 1. పానపాత్ర ; 2. కోటగోడతో చేరినట్టుగా ఏట వాలుగాఉండేప్రదేశం.

ఇం. *Glass*. గాజు.

క. గళాసు, గళాసు. గ్లాసు.

<ఇం. Glass (అర్థవిపరి.).

గలిగ రూ.చూ. గలుగ. వి. పెద్దపెద్ద ఆకులు కలిగి తెల్లటి పూలుపూసే ఒకచెట్టు (Millettiaracemosa).

గలిజర రూ.చూ. గలిజేరు. వి. పునర్నవ.

గలిజెరు రూ. గంజేరు, గలజర, గలజెరు, గలజేర, గలజేరి, గలజేరు, గలరి, గలిజర, గలిజేర, గలిజేడు, గల్జైరు, గల్జేరు, వి. పునర్నవ. ఆం.భా. 2.69.

గలిజేర రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ.

గలిజేరు రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ. హంస. 4.10.

గలినేల వి. జిగురుగాఉండేనేల.

గలిబిలి వి. 1. నలుగుడు. భార.విరా. 5.56 ; 2. కలత, క్షోభ. దశకు. 11.89 ; 3. సందడి, రొద. ధ్వన్యను. శ్రీరం.మా. దశా. 6.27.

క. గలిబిలి. గజిబిజి, కలత ; తు. గలిబిలి, గలబు. కలత, అరాజకం ; త. కలిపలి, కలిపిలి. కలత, క్షోభ, పోట్లాట ; మరా. గల్‌బల్-ణె. కలతపడు ; గల్బా. క్షోభ.

గలిబిలిసేయు (-చేయు) స.క్రి. 1. అల్లరిచేయు ; 2. కలచు ; 3. నలుగుడుపెట్టు.

గలీబు రూ.చూ. గసీబు[1]. వి. 1. తలగడ మొ. వాటితొడుగు. 7.211. 2. కత్తిఒర. ఆం.భా. 2.215.

గలుగ రూ. గలిగ. వి. పెద్దపెద్దఆకులుకలిగి తెల్లటిపూలుపూసే ఒకచెట్టు (Millenttiaracemosa).

గలుగల్లు రూ.చూ. గల్లుగల్లు. వి. భూషణాదుల కదలికతో అయ్యేచప్పుడు. కృ.శకు. 3.35.

గలుగుకట్టె వి. సముద్రప్రాంతంలోపెరిగే ఒకరకంమొక్కనుంచి తీసినపుల్ల.

గలుగుదంటు వి. సముద్రప్రాంతంలో పెరిగే ఒకరకంమొక్క నుంచి తీసినపుల్ల.

గలుమ రూ. గల్మ. వి. పేరొకమడికి నీళ్ళుపోయే తోవ.

గలుపరించు చూ. గలబ. స.క్రి. నీళ్ళుపోసిచేవ.

గలుసు వి. గులకరాతినేల.

గలేకుండ రూ.చూ. గడేకుండ. వి. 1. బిందె ; 2. ఒకరకపు వాద్యపుకుండ.

గలేబ రూ.చూ. గసీబు[1]. వి. 1. తలగడ మొ. వాటితొడుగు ; 2. కత్తిఒర.

గలేబి రూ.చూ. గసీబు[1]. వి. 1. తలగడ మొ. వాటితొడుగు ; 2. కత్తిఒర.

గలేబు రూ.చూ. గలీబు[1]. వి. 1. తలగడ మొ. వాటితొడుగు. కవిచా.సీ.17 ; 2. కత్తిఒర.

గల్జెరు రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ.

గల్జేరు రూ.చూ. గలిజెరు. వి. పునర్నవ.

గల్జోడు వి. కొంకతిరుగుడు.

గల్బతు వి. అల్లరి.

గల్బా రూ.చూ. గలబ. వి. అల్లరి, జగడం, దుండగం.

గల్బాయించు రూ.చూ. గలబాయించు. స.క్రి. అల్లరిచేయు, కలవరంకలిగించు.

గల్మ రూ.చూ. గలుమ. వి. వేరొకమడికి నీళ్ళుపోయేతోవ.

గల్ల[1] రూ. గల్లా. వి. 1. పొల్లు ; 2. ధాన్యంలో గింజపట్టని అరక ; 3. గడ్డిగలిగినదుగ్గుకలిసిన పొట్టు ; 4. తూర్పారపోసిన ధాన్యంలో అక్కడక్కడ పడిఉన్న ఆకుపొట్టు ; 5. తూర్పారపట్టినతర్వాత పోసిన మంచిగింజలకుప్ప ; 6. డబ్బులువేసేపెట్టె.

హిం. ఉ. గల్లా. పంట, ధాన్యం అమ్మగావచ్చినడబ్బు.

<ఉ. గల్లా.

గల్ల[2] వి. మాదిగవాడుతోలునానవేసే చట్టి.

గల్ల[3] వి. గొంతు.

సం. గల-. గళం, గొంతు ; ప్రా. గళ-; కా. గొలు-. తోవ ; కు. గలొ. తోవ ; నే. గల్, గలొ. గొంతు, మెడ ; అ. గల్ ; బెం. గలా ; ఒ. గళా ; హిం. గలా. గొంతు, మెడ ; పం. గలా ; ల. గళ్ ; సిం. గరొ ; గు. గళొ. గొంతు ; మరా. గలా ; సింహ. గల ;

క. గల. మెడ, గొంతు.

<సం. గల-.

గల్లత్తు రూ.చూ. గల్లంతు. వి. అల్లరి, గత్తర, గందరగోళం.

గల్లదోనె వి. దోనెమలుపు తర్వాత ఉన్నభాగం.

గల్లంతు రూ. గల్లత్తు. వి. అల్లరి.

హిం.ఉ. గల్లా. కోలాహలం, రొద.

<ఉ. గల్లా.

గల్లా రూ.చూ. గల్ల[1]. వి. 1. ధాన్యం ; 2. గల్లాపెట్టె.

గల్లాకొస్త వి. భూకామందుకు ఇంతడబ్బు ఇచ్చేట్టు అని ముందుగా నిర్ణయించుకొని చేసే వ్యవసాయం. హిం. గల్లా. పంట. గల్లాకొలుపు స.క్రి. ధాన్యమమ్ము. గల్లాపెట్టె వి. అంగడిలో చేరండబ్బు పెట్టుకొనే చిన్నఅరలపెట్టె.

గల్లామక్త రూ.చూ. గల్లామక్తా. వి. పంటపండినా పండక పోయినా నిర్ణయించుకున్న పంటలోపాలు తప్పనిసరిగా ఇచ్చేట్టు ఒప్పందం కుదుర్చుకొనిచేసే కౌలు లేక మక్తా.

గల్లామక్తా రూ. గల్లామక్త. వి. పంటపండినా పండకపోయినా నిర్ణయించుకొన్న పంటలోపాలు తప్పనిసరిగా ఇచ్చేట్టు ఒప్పందం కుదుర్చుకొనిచేసే కౌలు లేదా మక్తా.

హిం. ఉ. గల్లా-. పంట ; మక్తా. మగతా.

<ఉ. గల్లామక్తా.

గల్లి వి. సందు.

కా. గొలు, గల్తె. దొంగలఉనికిపట్టు ; నే. గల్లి. చిన్న సందు ; బెం. గలి. సందు ; ఒ. గలి. సందు ; హిం. గలి ; పం. గలి ; సిం. గలి ; గు. గలి ; మ. గల్లి ; ఉ. గలి.

క.గల్లి. సందు.

<ఉ. గలీ.

గల్లినేల వి. జిగురుగాఉండేగట్టినేల.

గల్లు[1] వి. భూషణాదుల కదలికలో అయ్యేచప్పుడు, ధ్వన్యను. కళా. 3.25.

క. గలగల, గళగళ. గొలుసులు గంటల చప్పుడు. ఘల్లుమనేశబ్దం ; కొడ. గలగలన్. కదలికలు ; తు. గలగల. కడియాలచప్పుడు ; త. కలకలెనన్ : గంటలు మొ. వాటిచప్పుడుకు అనుకరణధ్వని ; మ. కళకళ. కలవరపరిచేశబ్దం ; మాల్తో. కల్కల్తెని. నీళ్ళుగాని గవ్వలు కాని కదుపు.

గల్లుగల్లు రూ. గలుగల్లు, గళ్లుగళ్లు. వి. భూషణాదుల కదలికలో అయిన చప్పుడు. హర. 5.51. గల్లుగల్లుమను అ.క్రి. గల్లుగల్లను.

గల్లు[2] వి. 1. మరణదండన ; 2. ఉరితీసేమాను.

క. గల్లు. ఉరితీయటంద్వారా మరణదండనను అమలు పరచు.

గల్లుగుడు వి. పాటలవృక్షం, సువాసనగలపచ్చనిపూలుపూసే ఒకచెట్టు (Steospermum chelonoides).

గల్లురు వి. భూషణాదులకదలికలోఅయ్యే ధ్వని.

గల్లురుమను అ.క్రి. గల్లుగల్లుమను.

గల్వ వి. పంటకాలవఏటినుంచిగాని చిన్నకాలవనుంచిగాని తీసిన చిన్నకాలవ.

గళకత్తెర వి. మల్లబంధవిశేషం, అంటమెడపట్టు. హంస. 1.206.

సం. గళ-. గొంతు ; హిం. గల్కోడా-. మల్లబంధ విశేషం.

<సం. గళ-+కత్తెర.[1]

గళగళ వి. 1. నీరుపోయటం, పుక్కిలించటం, త్వరగా చెప్పటం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. పండి.చ. 1.42 వ ; 2. గొలుసులధ్వనికి అనుకరణం. మను. 4.103.

క. గటగట. త్వరత్వరగా కదలటంలో అయ్యేధ్వనికి అనుకరణశబ్దం, నడిచేసేశబ్దం.

గళబద్ధం వి. కష్టం.

సం. గళ-. గొంతు ; బద్ధ-. కట్టబడిన.

<సం. గళబద్ధ-.

గళబద్ధకం వి. 1. ఆపత్తు ; 2. గొంతుపట్టుకోవటం ; 3. ప్రాణం మీదకి వచ్చే పని ; 4. గడబిడ.

సం. గళ్. గొంతు ; బద్ధక-. కట్టేది.

<సం. గళబద్ధక-.

గళాయి రూ. గళ్ళా, గళ్ళాయి. వి. నూనె మొ. వాటిని సీసాలో పోసే సాధన విశేషం.

హిం. గలా. కంఠం, గొంతు.

గళ్ల[1] రూ.చూ. కళ్ళె. వి. శైత్యంతో గట్టిపడిన ఉమ్ము.

గళ్ల[2] వి. చర్మం నానవేసే పాత్ర.

గళ్లగళ్లెము వి. తోలు నానవేసే పాత్ర.

గళ్లచీర చూ. గడిచీర. వి. గళసీర, అంచుల మధ్యభాగంలో

రంగు పోగులు పెట్టి గదులు గదులుగా నేసిన చీర.

గళ్లము రూ. గళ్లెము. వి. పాల మీగడలాంటి లేత కొబ్బరి గుంజు.

గళ్లగళ్ల రూ.చూ. గల్లుగల్లు వి. గజ్జెల చప్పుడు. ధ్వన్యను.

గళ్లచాళ్లచిక్కు అ.క్రి. పొలిమేరతో నహా లోబడు.

గళ్లపడు (-పడు) అ.క్రి. చెవులు హఠాత్తుగా వినబడకపోవు.

గళ్లె రూ.చూ. కళ్లె. వి. శైత్యంతో చిక్కబడిన ఉమ్మి.

గళ్లెము రూ.చూ. గళ్లము. వి. పాలమీగడలాంటి లేత కొబ్బరి గుంజు.

గళ్ళా రూ.చూ. గళాయి. వి. నూనె మొ. వాటిని సీసాలో పోసే సాధన విశేషం.

గళ్ళాయి రూ.చూ. గళాయి. వి. నూనె మొ. వాటిని సీసాలో పోసే సాధన విశేషం.

గవక రూ.చూ. గవఁకు. వి. 1. కోటవాకిలి ; 2. గోపురం, గవను.

గవగవ రూ.చూ. గబగబ. క్రి.విశ.ద్రు. శీఘ్రంగా (కలియడం, పరిగెత్తడం మొ. వాటిలో అయిన ధ్వనికి అనుకరణం). కృ.శకు. 1.66.

గవఁక రూ.చూ. గవఁకు. వి. పురద్వారం.

గవఁకు రూ. గవక, గవఁక, గవుకు. వి. గవను, గోపురం, కోటవాకిలి. ఆం..భా. 2.21.

గవటం రూ.చూ. గవటము. వి. గ్రామస్థులందరికి ఉమ్మడిగా కొన్న బంజరు.

గవటము రూ. గవటం. వి. గ్రామస్థుల ఉమ్మడి నేల (కొన్ని చోట్ల శిస్తుకూడ ఉమ్మడిగానే ఇస్తారు).

సం. గ్రామకంఠ-.

గవతము వి. కసవు. ఆం. భా. 2.76.

సం. గవార్ధం ; ప్రా. గవత్త-. కసవు, తృణం, పశువులు మేసే గడ్డి.

క. గవత. మైదానం, కసవు.

<ప్రా. గవత్త-.

గవద రూ.చూ. గౌద. వి. చెవికింది భాగం, గాలిబిళ్ళ.

గవదలమ్మ చూ. గదగలమ్మ. వి. గవదలు వాచే అంటు వ్యాధి. గవదలు వి.బ.వ. గొంతులోని గ్రంథులు.

గవనికావరి చూ. గవను.

గవను రూ. గవిని. వి. ఔ. పురద్వారం, గోపురం. భాస్క. రా.యు. 84.

త. కవుని. పురద్వారం

సం. గమన. పోవటం.

గవనికావరి వి. కోటవాకిలి కాపరి. సీలా. 2.47.

గవర వి. లేత ఎరుపు, విశ. ఈషద్రక్తం. ద్వి.పరమ. 8.188 ప. 6 పం.

సం. గౌర-. లేతఎరుపురంగు ; ప్రా. గఉర-. ఎర్రనిది ; హిం. గౌర్. లేత ఎరుపు.

క. గౌర. లేత ఎరుపు.

<ప్రా. గఉర.

గవరగ విశ. ఈషద్రక్తంకల. శృం.నై. 7.53. వి. కొంచెి ఎరుపుగల.

క. గౌర-. లేత ఎరుపు.

హిం. గౌర్. లేత ఎరుపు.

గవర్నమెంటు వి. ప్రభుత్వం.

ఇం. *Government*. ప్రభుత్వం.

<ఇం. Government.

గవరమ్మ రూ. గవురమ్మ. వి. గ్రామదేవత.

సం. గౌరీ. పార్వతి.

క. గవరమ్మ. గ్రామదేవత.

<సం. గౌరీ + అమ్మ.

గవర్నరు వి. పరిపాలకుడు, రాష్ట్ర పరిపాలనాధికారి.

ఇం. *Governor*. పరిపాలకుడు.

<ఇం. Governor.

గవలవాఁడు వి. గమళ్లవాడు, ఈడిగ.

గవాక్షి వి. కిటికీ, మగ్గం దగ్గర వెల్తురుకోసం ఇంటి మిద్దెకు చేసిన కంత, మట్టిమిద్దెల్లో గోడలో ఎత్తున పెట్టిన చిన్న రంధ్రం.

సం. గవాక్ష-. కిటికీ.

<సం. గవాక్ష-.

గవాటా రూ.చూ. గలాటా. వి. 1. గలాటా ; 2. అంటు వ్యాధి ప్రబలటం.

గవారు విశ. మడ్డి, మోటు.

నే. గమార్, గావార్, గావర్. పల్లెటూరివాడు ; ఒ. గమిర. మోటైన ; హిం. గఁవార్. పల్లెటూరివాడు ; పం. గాహర్ ; గు. గమిర్ ; మరా. గాఁహర్ ;

క. గవార. పల్లెటూరివాడు.

<హిం. గఁవార్.

గవారువాఁడు రూ. గమారువాఁడు. వి. పల్లెటూరివాడు.

గవాళము వి. నగలపెట్టె, దేవతార్చన పేటిక.

గవాకిలి వి. గవాక్షం.

సం. గవాక్ష. కిటికీ ; హిం. గవాక్ష చిన్న కిటికీ.

క. గవాక్ష. ఎద్దు కన్ను, చిన్న గుండ్రని కిటికీ.

గవి వి. 1. గుంట, ఖాతం, పల్లం. వేంక. పంచ. 1.294 ; 2. గుహ. రామాభ్యు. 3.84.

క. గవి. గుహ ; తు. గవి. కన్నం, గుహ ; త. కెవి. లోతైన లోయ, గుహ.

గవిని రూ.చూ. గవను. వి. 1. పురద్వారం ; 2. ఊరి వీధి చివర.

గవియ వి. నాగవల్లి పిడత.

గవిరి వి. గౌరిదేవి, పార్వతి.

సం. గౌరీ. పార్వతి ; ప్రా. గఉరీ.

<ప్రా. గఉరీ.

గవిరిదేవత వి. పార్వతి. ద.హిం.కా. 5.675.

గవిల రూ.చూ. కవిల[1]. వి. పుల్లావు, కపిలగోవు.

గవిలపుతీగ వి. కర్రలాగ గట్టిగా ఉండి లేత నీలరంగు పూలు పూసే ఒక తీగ (Debergia volubilis).

గవిలా రూ.చూ. కవిల[1]. వి. కపిల గోవు.

గవిలె రూ.చూ. కవిల[1]. వి. పుల్లావు, కపిలగోవు.

గవిలెము వి. గంధంలో రాసి కలిపే విత్తు, సోపు వంటి పరిమళ

పదార్థం.

గవిలెములు వి.బ.వ. ఒక దినుసు పరిమళ బీజాలు.

గవిసె వి. గాదె.

క. కెరసె. గాదె.

గవిసెన రూ.చూ. గవుసెన. వి. 1. గౌసెన, గలేబు, మునుగు; 2. పండగల్లో ఎద్దు మూపుమీద కప్పే చిత్ర వస్త్రం.

గవుకు రూ.చూ. గవఁకు. వి. కోటవాకిలి, గవను.

గవుకున రూ. గవుక్కున. క్రి.విశ. అవ్య. ద్రు. గబుక్కున, త్వరగా. శుక. 2.249. ధ్వన్యను.

క. గబక్కనె. దెబ్బతో లాక్కొను.

గవుక్కున రూ.చూ. గవుకున. క్రి.విశ.ద్రు. గబుక్కున, త్వరగా.

గవుచెన రూ.చూ. గవుసెన. వి. గలేబు.

గవుడ రూ. గౌడ. వి. దవుడ.

గవుడపేరు రూ. గౌడపేరు. వి. కంఠభూషా విశేషం. క్రీడా. 128. గవుడసరము రూ. గౌడసరము, గౌడసరము. వి. భూషా విశేషం. ప్రభు. 4.143. పు. 16 పం.

గవుండ్లది రూ. గౌండ్లది. వి. 1. సారా అమ్మే స్త్రీ; 2. కల్లు గీసేవారి కులంలో పుట్టిన స్త్రీ.

గవుండ్లవాడు రూ.చూ. గౌండ్లవాఁడు. వి. 1. సారా అమ్మే వాడు; 2. కల్లుగీసే కులంవాడు.

గవుఁడు రూ. గౌడు, గౌండా, గౌఁడ, గౌళ[1]. వి. 1. సారాయి అమ్మేవాడు; 2. కాపువారి పట్టపు పేరు.

క. గవుడ. గ్రామపెద్ద, కాపుల్లో మంచి తెగ.

గవుద రూ.చూ. గౌద. వి. చెంప, చెక్కిలి. ప్రబంధ. 398.

గవుదకట్టు రూ.చూ. గౌదకట్టు. వి. చెంపల్ని మూసి కట్టినకట్టు. స.క్రి. చెంపల్ని మూసికట్టు.

గవుర రూ.చూ. గౌర. వి. వర్తకుడు.

గవురమ్మ రూ.చూ. గవరమ్మ. వి. పార్వతి, గౌరమ్మ.

గవురు[1] రూ.చూ. గౌరు[1]. వి. ఏనుగు.

గవురు[2] రూ.చూ. గౌరు[2]. వి. కాహళి, బాకా.

గవురు[3] రూ.చూ. గౌరు[3]. వి. వర్తకుడు, బేహారి.

గవురు[4] రూ.చూ. గౌరు[4]. వి. కపటం.

గవురువానన వి. పాలుపొంగి పొయ్యిలో పడినప్పుడు కొట్టే వానన.

గవులి రూ.చూ. గౌళి. వి. బల్లి.

గవులు రూ.చూ. గౌలు[1]. వి. 1. దుర్గంధం, దుర్వాసన. యయా. 3.7; 2. గంధం వానన. ఆం.బా. 1.106.

గవుళి రూ.చూ. గౌళి. వి. బల్లి.

గవును రూ. గౌను. వి. వరి, జొన్న, కొర్ర మొ. పైర్లకు అధిక వర్షాలవల్ల ఏర్పడిన తాలుగింజల కంకులు.

గవునుపోవు రూ. గౌనుపోవు, అ.క్రి. తాలుగింజవడు.

గవుసెన రూ. గవిసెన, గవుచెన, గౌచన, గౌచెన, గౌసెన. వి. 1. పీఠ, విల్లు మొ. వాటిని తొడిగే గలేబు. ఉ.హరి. 3.159; 2. దిండుమునుగు.

క. గవసణి, గవసణికె, గవసణిగె, కప్పు. గలేబు; గవణిసు, కప్పు; తు. గవసణిగె. ఫిడేలుని కలిపేది; త. కవి (-వ్-రిల్-) కప్పు, వరచు, చుట్టు, . కవిప్పు. కప్పటం, గొడుగు; కవిచనై, కప్పు; కో. కవ్ప్-(కవె-) బట్టకప్పు; తొ. కాఫ్చ్. బహువంఖ్యాకం; కుయి. కఫినై. బయటకుపోవు, అంచు; పర్జి. కప్ప్. కప్పు, పరచు; కురు. ఖఫ్నా. సరిగ్గా సరిపోయేట్టు కట్టు, కలుపు. పో.చూ. సం. కవచ-. కవచం.

గవ్యము వి. పశువులుమేసే పొలంపైవేసే పన్ను లేదా పల్లరి. నె.గా. ఆత్మకూరు. శా.సం. 17 క్రి.శ. 1549.

గవ్యమంటే పెళ్ళిసుంకమనే శాసన పరిష్కర్తలభావం సరికాదు.

సం. గవ్య-. పశువులుమేసే పొలం.

<సం. గవ్య (అర్థవిపరి.).

గవ్వ వి. 1. ఒక చిన్న నాణెం. ద.హిం.గా. సంపు. 5. శా.సం. 1236 క్రి.శ. 1277; 2. వరాటిక, కపర్దకం. ఆము. 4.85; 3. పత్తి తీసిన పట్టికాయ లేదా గుల్ల.

క. కవడె, కవడెకె, కవడె; తు. కవడి, కవడిగె, కవడె; కొరగా. కవ్డె; త. కవడు.

గవ్వచుక్క వి. పశువులనొనటి మీది మచ్చ. గవ్వచౌకము వి. 1. నాలుగ్గవ్వలు శృం.నై. 8.156; 2. చెలికారం. గవ్వంచు వి. చిగురువదిలి తెల్లకొలికిగాని జరీకొలికిగాని పెట్టి వరసగా నేసిన అంచు. <గవ్వ+అంచు. గవ్వరాయి రూ. గువ్వరాయి. గువ్వలాయి వి. అబ్బుగుల్ల. గవ్వసరులు వి.బ.వ. ధాన్యవిశేషం, అక్కుళ్లు. హంస. 4.128. గవ్వసాంబ్రాణి వి. ఒకరకమైన సాంబ్రాణి.

గవ్వట్లాడు చూ. గవ్వ. అ.క్రి. పనిలేక తిరుగు.

గవ్వము వి. మత్స్య విశేషం.

గశిక రూ.చూ. గసిక. వి. తవ్వటానికి అనువుగా కొనచెక్కిన కొయ్య.

గష్మి వి. అంచులో వేసే ఒకరకం డిజైను.

గస వి. ఉబ్బసం.

సం. కాస-. దగ్గు; ప్రా. కాస-. రోగవిశేషం;

త. కళం.

<ప్రా. కాస-.

గసగస రూ. గసగసా. వి. ఒక దినుసు మసాల విత్తులు. కాశీ. 3.23.

క. గసగసె. గసగసాలు; త. కసకసా;

హిం.ఉ. పార. ఖశ్ఖశ్; అర. ఖశ్ఖాశ్.

<ఉ. ఖశ్ఖశ్.

గసగసలు రూ. గసగసాలు. వి.బ.వ. ఒక దినుసుమసాలా విత్తులు. కాశీ. 7.185.

గసగసా రూ.చూ. గసగస. వి.బ.వ. గసగసాలు. రఘునా. 3.243.

గసగసాగడిచీర వి. రెండుకొలుకులు ఒక రంగు రెండు కొలుకులు మరో రంగు పెట్టి నేసిన గళ్ళచీర. గసగసాల చుక్క రూ. గసగసాల్సుక్క. వి. అంచుల్లోవేసే ఒకరకం అద్దకం డిజైను. గసగసాలు రూ.చూ. గసగసలు. వి.బ.వ. నల్లమందు విత్తులు, యయా. 1.103. గసగసాల్సుక్క రూ.చూ. గసగసాల చుక్క. వి. ఒకరకం అద్దకం డిజైను.

గసాబు వి. తుపాకి వంటి యుద్ధసాధన విశేషం. అష్ట.మ.క. 3.1 పు. 171 పు. 15 పం.

గసాలచీర చూ. గసాలు.
గసాలు చూ. గసగస. వి.బ.వ. గసగసాలు.
గసాలచీర వి. ఒకరకం నేతచీర.
గసి[1] వి. 1. ఒకవిధమైన మేకు. రం.రా.యు. 395 పు. 12 పం. 2. ఒకానొక వేట సాధనం. పి.శకు. 1.116.
గసిపోసికొను అ.క్రి. ఆయాసపడు.
గసి[2] వి. కాచిననెయ్యిలోనగు వానిలోదిగే మడ్డి. ఆం.భా. 2.259.
క. గసి. నూనె, కాచిన వెన్న మొ. వాటిలో దిగిన మడ్డి. తు. కసట్టు. మడ్డి; త. కంచల్. చెత్త; మ. కచ్చి. గడ్డి, చెత్త; కొ. కొస్ప్. చెత్త; పర్జి. కసటూ. చెత్త; కురు. కస్సా. ఒంటిమీదున్న మట్టిపొర; మాల్తో. కసె. శరీరం మీద మట్టి.
సం. కచ్చర. చెత్త మొ. నవి; పా. కసట. చెత్త.
గసిపిండి వి. అప్పుడప్పుడే విసిరిన మెత్తని తెలకపిండి.
గసిక రూ. గశిక, గసికె, గసిగి. వి. 1. శూలం, శలాక. ద్వి. హరిశ్చ. 16.24; 2. కొయ్యబాణం. కాశ. 3.15; 3. తప్పటానికి అనువుగా కొనచెక్కిన కొయ్య.
గసికరాయి వి. మొనతేలినరాయి.
గసికిపోవు రూ. గసిగిపోవు. అ.క్రి. తెలియకుండా క్షీణించు, తగ్గిపోవు.
గసికె రూ.చూ. గసిక. వి. ఊడ్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం.
గసికెపుల్ల వి. మగ్గం గుంటలో పావుచెక్కల గూటం ముందుకు జరగకుండా ఆపే కొయ్యపుల్ల.
గసిగి రూ.చూ. గసిక. వి. 1. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య; 2. మగ్గం మీద నేతబిర్రు పెట్టడానికి మోకుకట్టే కొయ్య.
గసిగిపోవు రూ.చూ. గసికిపోవు. అ.క్రి. తెలియకుండా క్షీణించు.
గసిబిసి రూ.చూ. గజిబిజి. విశే. 1. తారుమారు. బసవ. 7.915 పం.; 2. చెల్లాచెదురు, మిక్కిలి చెదిరినది. భాగ. 8.343; 3. కలగినది. భోజ. 7.100; 4. పీడనం.
క. కసిమిసి. చెల్లాచెదరు.
గసిబిసిచేయు రూ. గసిమసిచేయు. స.క్రి. 1. కలతపెట్టు; 2. తారుమారుచేయు.
గసిమసిచేయు రూ.చూ. గసిబిసిచేయు. స.క్రి. 1. కలతపెట్టు. బసవో; 2. తారుమారుచేయు.
గసుకు స.క్రి. గెంటు. అ.క్రి. కదలి ఆడు.
గస్తాలు వి.బ.వ. మల్ల విద్యావిశేషం. మల్లువు. 3.69. ఆం.భా. 2.207.
హిం.ఉ. పార. గశ్త్. తిరుగు.
<ఉ. గశ్త్.
గస్తీ వి. వేగులు రాత్రియందు కావలి ఉండటం.
హిం.ఉ. గశ్తీ. తిరిగేవాడు, తిరగటం.
<ఉ. గశ్తీ.
గస్తీలు వి.బ.వ. కావలివాడు; హిం. గశ్త్. గస్తీ తిరగడం.

గస్తు[1] వి. రాత్రివేళ దొంగతనం లోనగునవి జరక్కుండా కాచే కావలి. ద్వి. హరిశ్చ. ఉ. 1668 పం.
హిం. ఉ. గశ్త్. తిరగడం; పార. గశ్త్. పహరా కావలి కాయటం; మరా. గశ్తపహరా. కావలి.
క. గస్తు. గస్తీ తిరగడం.
<ఉ. గశ్త్.
గస్తు[2] వి. చెడువాసన. విశే. దుర్వాసన గల.
గస్తుకంపు వి. దుర్వాసన.
గహనము వి. దుర్లభం.
సం. గహన-. అడవి, గుహ, దుఃఖం.
<సం. గహన-. (అర్థవిపరి.).
గహి వి. తృణీకారం, బెదరింపు.
గహిచేయు స.క్రి. బెదరించు.
గా ప్రత్య. 1. ఇది మహద్వాచకాలకు అనుప్రయుక్తమై మిత్రత్వాన్ని తెలుపుతుంది. అహోబల. పు. 356; 2. ఇది మహద్వాచకాలకు అనుప్రయుక్తమై నీచత్వాన్ని తెలుపుతుంది. అచ్చ.రా.యు. 122.
గాగపొట్టు వి. కళ్ళల్లో చీముకారే పుండు.
గాగర రూ.చూ. గాగరా. వి. స్త్రీలు కట్టుకునే పావడ.
గాగరా రూ. గాగర. వి. స్త్రీలుకట్టుకొనే పావడ.
హిం. ఘఘ్రా. మరా. ఘాగ్రా. పావడ.
<మరా. ఘాగ్రా.
గాంగేరు వి. జిబిలిక. ఒకరకం బీర.
సం. గాంగేరుకీ. బీర.
<సం. గాంగేరుకీ.
గాజ రూ. గాజి[2]. వి. ధాన్యం మొ. పోసుకోటానికి ఏర్పరిచిన చిన్న బుట్ట, కునూలం, హౌజిక.
గాజంగి[1] వి. 1. గులాబి; 2. జపావృక్ష విశేషం.
గాజంగి[2] వి. మొగలిజాతికి చెందిన ఒకచెట్టు, దీని ఆకులు చాపలు అల్లడానికి, పీచుతాళ్ళు పేనడానికి, వేళ్ళు కుంచెలు, బుట్టలు తయారుచేయడానికి ఉపయోగిస్తారు (Pandanus odoratisnimus).
గాజరగడ్డ వి. సారవంతమైన తేమనేలల్లో సాగుచేసి పెంచే దుంపపైరు.
గాజరుదుంప వి. ఒకరకం దుంప.
గాజావరుజు రూ. గాజుపరుజు. వి. ఖడ్గాది ముష్టి సంగ్రాహ్యతలం, కత్తి మొ. వాటి పిడి. ఆం.భా. 2.215.
గాజి[1] వి. సిరిగిచెట్టు. సింధూరవర్గపు పూలుపూసే ఒకచెట్టు (Woodfordia flolibunda).
గాజి[2] రూ.చూ. గాజ. వి. కునూలం, హౌజిక.
గాజిగ వి. గానుగ.
గాజియ రూ.చూ. గాదియ. వి. కునూలం, ధాన్యం మొదలైనవి. పోసుకోటానికి ఏర్పరచిన చిన్నబుట్ట.
గాజు వి. 1. ఇసుక కరిగించి చేసిన పదార్థం, కాచం. బసవ. 201 పు. 15 పం; 2. గాజుతో చేసిన హస్తవలయం. ఉ.హరి. 4.157; 3. ఒకరకం మట్టి. భల్లా. 3; 4. పట్టుదారం వడికేటప్పుడు, కదురుకుంచి వచ్చిన పోగును దూర్చటానికి కొయ్య పట్టెకు బిగించిన ఇనపచుట్టు;

5. ఉన్నికత్తెర, కొడవలి మొ. వాటికి వేసే ఇనపచుట్టు ; 6. మట్టితోగాని, సిమెంటుతోగాని పలచగా గుండ్రంగా చేసి ఒకదానిమీద ఒకటిపేర్చి బావిచుట్టూ గోడకు బదులుగా నిలిపిన వస్తువు ; 7. ఆర్చీ పక్కలనున్న వంపులకు లోపలి భాగం.

సం. కాచ-. గాజు ; ప్రా. కచ్చ. కాయ ; పా. కాచ-. ఇసకతో తయారైన పదార్థం ; నే. కాచ్ ; హిం. కాచ్, కాఁచ్ ;

క. కాజు, గాజు, గాస ; తు. గాజి, గాజు.

<సం. కాచ-.

గాజుకడియము రూ.చూ. గాజుఁగడియము. వి. గాజుతో చేయబడిన కడియం. కుచే. 2.110. గాజుకడియములు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112. గాజుకప్పెరలు వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. గాజుకమాను వి. పక్కభాగాలు వంపులుగా ఉండే ఆర్చి, పళ్ళార్చి. గాజుకమ్ము అ.క్రి. చీకటికమ్ము. గాజుకాయ వి. గాజుబుడ్డి, సీసా. గాజుకుప్పె వి. కాచపాత్ర విశేషం. వైజ. 3.74. సం. కాచకూపి-. గాజుపాత్ర.<సం. కాచకూపి-. గాజు కొప్పెర వి. గాజుతోచేసిన పాత్రవిశేషం. ఆం.భా. 2.245. గాజుగడపినట్లు(-కడిపిన+అట్లు) అవ్య. అతిప్రయాసంతో అతిజాగ్రత్తతో. శుక. 3.246. గాజుగిన్నె వి. కాచపాత్రం. గాజుగుడ్డ వి. 1. సన్నగా నాజూకుగా వుండే ఒక తరహానారగుడ్డ ; 2. శస్త్రచికిత్సల్లో కట్లకువాడే గుడ్డ. గాజుఁగడియము(-కడియము) రూ. గాజుకడియము. వి. గాజుతో చేయబడిన కడియం. పల్నా. 2.7. గాజుటోవరి వి. గాజువని. శృం.నై. 7.154.<గాజు+ఓవరి. గాజునీలము వి. కృత్రిమమైన ఇంద్రనీలం, ముదురునీలం లేదా నలుపు. నృసింహ. 5.46. గాజునూనె వి. భూగర్భం నుంచి తీసిన ఒకరకం నూనె. గాజువడు అ.క్రి. 1. చిన్నాభిన్న మగు. చిత్రభా. 7.121 ; 2. కాంతిహీనమగు. గాజుపండ్లు వి.బ.వ. పెద్దకానరచెట్టు పళ్ళు. గాజుపరుజు రూ.చూ. గాజా పరుఁజు. వి. ఖడ్గాదిముష్టి సంగ్రాహ్యతలం, కత్తి, మొ. వాని పిడి. గాజుపారు రూ.చూ. గాజువాఱు. అ.క్రి. కాంతి హీనమగు. గాజుపాఱు రూ.చూ. గాజువాఱు. అ.క్రి. 1. రంగుమారు. కాశీ. 1.105 ; 2. ఎఱ్ఱబడు. ద్వి. హరిశ్చ. ద్వి. పం. 1831. గాజుపురుగు రూ. గాజుఁబురుగు. వి. వరి, జొన్న, సజ్జ మొ. మొక్కల దంటులోని సారాన్ని తినే దొలుపడు పురుగు. గాజుపూస వి. గాజుతోచేసిన పూస. గాజుపూసకుబంగారుపాదుగు అ.క్రి. అయోగ్యుని గౌర వించు. గాజుప్పు వి. ఒకానొక లవణం, కాచలవణం, గాజు వండగా వచ్చిన మడ్డి < గాజు + ఉప్పు. గాజుబన్నెరులు వి.బ.వ. గాజుబొమ్మలు. కు.సం. 3.36. గాజుబురుగు రూ.చూ. గాజుపురుగు. వి. ఒకరకం పురుగు. గాజుఁబులుగు వి. ఒకరకం నీలంరంగు. గాజుమన్ను వి. ఒకరకం గాజు మన్ను. గాజుముడి వి. నాగలిమోకు చివరవేసే ముడి. గాజురాయి రూ.చూ. గాజుఱాయి. వి. కాచమణి, గాజుతో చేసిన రాయి. గాజురొడ్డ వి. ఒకరకంగడ్డి. గాజురొయ్య వి. పెద్దరొయ్య. గాజుఱాయి రూ. గాజురాయి. వి. గాజుతోచేసిన రాయి, గాఁజువంటిరాయి. గాజులకట్టె వి. పట్టుదారం వడికే టప్పుడు పెద్దరాట్నం దగ్గర కదుర్లపీటకు కిందగా (కొన్ని చోట్ల పక్కగా) పెట్టే కొయ్యకట్టె. గాజులగాఁడు(-కాఁడు) వి. ఒకరకం కోడి, ఒకరకం పందెం కోడిపుంజు. గాజులచేట వి. పాలేరు భార్యకు గాజులనిమిత్తం కళ్ళంలో ఇచ్చే చేటెడు గింజలు. గాజులనుదొడవుగాఁగల్పించు స.క్రి. పౌరుషహీను లనుచేసి ఇంటిలోకూర్చుండబెట్టు, గాజులుతొడుగు. ఉ.హరి. 4.157. గాజులపట్టె వి. పట్టుదారం వడికేటప్పుడు పెద్ద రాట్నం దగ్గర కదుర్లపీటకు కిందగా, (కొన్నిచోట్ల పక్కగా) పెట్టే కొయ్యపట్టె. గాజులపేర్లరోకలిదాఁకినట్లు(-తాకినట్లు) అవ్య. శక్తిహీనులు శక్తిమంతుల్ని ఎదుర్కొనేరీతిగా. బాస్క. రా. యు. 675. గాజులబలిజె వి. గాజుసామాగ్రి తయారు చేసి అమ్మేవాడు. గాజులమాన్యం వి. గాజులుచేసి ఇచ్చే వారికిచ్చిన భూమి. గాజులలంకదున్న వి. సోమరి, స్వేచ్ఛా చారి. గాజులవాఁడు వి. గాజులమ్మేవాడు. గాజులవాని మర్యాద వి. తనకుతానే చేసుకొనే మర్యాద. గాజులు వి.బ.వ. గాజుమట్టితో చేసిన వలయాలు, మురుగులు, ఒత్తులు, తోడాలు. గాజులుతొడుగు స.క్రి. పౌరుషహీనుని చేయు. గాజులుతొడుగుకొనికూర్చుండు అ.క్రి. ఏమీచేతకాక మూలకూర్చుండు. గాజువన్నె వి. పచ్చ నీలం కలసిన (గాజు) రంగు. గాజువన్నెచీర వి. మూడుపోగులు ఎరుపు మూడుపోగులునలుపు చొ॥ పడుగు అతికినేసిన చీర. గాజువన్నెరాయి వి. బొరైట్. ముగ్గురాయి. గాజువాఱు (-పాఱు) రూ. గాజుపారు, గాజుపాఱు. అ.క్రి. కాంతిహీన మగు, గాజువడు. మార్క. 1.254.

గాజె రూ.చూ. గాదియ. వి. కుసూలం, ధాన్యం మొదలైనవి పోసుకోటానికి ఏర్పరచిన చిన్నబుట్ట.

గాజెలమన్ను రూ.చూ. గాదెలమన్ను. వి. ఊకమట్టి, గాదెల తయారీకి ఒకభాగం మన్ను రెండుభాగాలు పొట్టు కలిపి తొక్కి మురగబెట్టిన మన్ను.

గాంజ వి. కలంజ, గాంధారి, గంజాయి, బంగి.

పో.చూ.సం. గృంజ-. గంజా, గంజాయి ; ప్రా. గంజ ; నే. గాఁజా ; అ. గాఁజా ; బెం. గాఁజా ; ఒ. గంజా ; బీ. గాఁజా ; హిం. గాఁజ ; పం. గాఁజా ; సిం. గాఁజొ ; గు. గాఁజొ ; మరా. గాఁజా ;

క. గాంజి ; గాంజి.

<మరా. గాంజా-.

గాంజర[1] వి. ఒకానొకదుంప. హంస. 4.131.

పో. చూ. సం. గర్జర-.ఒకరకంగడ్డి; గార్జర-. కారెట్ ; ప్రా. గజ్జర ; నే. గాజర్-. కారట్ ; అ. గాజర్ ; బెం. గాజర్ ; ఒ. గాజర ; బీ. గాజర్ ; హిం. గాజర్ ; పం. గాజర్ ; సిం. గజర. గాజరొ ; గు. గాజర్ ; మరా. గాజర్.

క. గజ్జరి.

<మరా. గాజర్.

గాఁజరగడ్డ వి. కందవిశేషం, ఒకగడ్డపేరు.

గాఁజర[2] వి. పొగాకు. ఆం. భా. 2.73.

గాటపోటీ వి. కుందపోటు, గాతనూల, పోటిగడ.

**గాటము** విశ. **1.** సాంద్రమైన, దట్టమైన. వరాహ. 2.45 ; **2.** అధికమైన. ద్వి. హరిశ్చ. పూ. 586, పరమ. 1.112 ; **3.** ఎక్కువైన ; **4.** గట్టి ; **5.** కష్టమైన ; వి. **1.** కష్టం ; **2.** కాఠిన్యం.

సం. *గాఢ*-. బిగువైన, మునిగిన, దట్టమైన.

క. *గాటు*. విశాలత, సమూహం.

<సం. గాఢ-.

**గాటాలు** వి.బ.వ. అనుభవాలు, దెబ్బలు.

గాటాలుపడు అ.క్రి. కష్టాలచే అనుభవం గడించు.

**గాటికంబం** చూ. గాడి[1].

**గాటికళ్ళం** చూ. గాడి[1].

**గాటిగుంజ** చూ. గాడి[1].

**గాటిచెక్క** చూ. గాడి[1].

**గాటిపాడు** చూ. గాడి[1].

**గాటిపొల్లు** చూ. గాటు[2].

**గాటిబిగువు** చూ. గాడి[1].

**గాటిమేపు** చూ. గాడి[1].

**గాటిలు** అ.క్రి. చచ్చు. ఈలుగు.

**గాటిమడి** చూ. గాడి[1].

**గాటు[1]** రూ. ఘాటు[2]. వి. **1.** కటువు, కారం. ఆం. భా. 1.104 ; **2.** (తీవ్రమైన,) వాసన. చెన్న. బసవ. 4.264 ; **3.** బలం ; విశ. **1.** కారంగల ; **2.** తీవ్రమైన వాసనగల.

క. కాటు, *గాటు*,గాఱు. కటువైన, కారమైన ; తు. *గాఱు*, *గాటి* ; త. కాట్, కట్ప్పు, కాట్టు.

**గాటు[2]** వి. **1.** విగ్రహాల పోతకుసిద్ధం చేసినఅచ్చు ; **2.** కాటు ; **3.** దెబ్బగుర్తు, గాయం ; **4.** అచ్చుగుది బిగింపుకు పూను గగ్గరకు రెండువైపులా పెట్టేగాడి ; **5.** కాడువెంటపారతో కొట్టినగీత.

గాటిపొల్లు వి. వీపుమీద ఒకపక్కన ఉండేమచ్చ.

**గాఢ[1]** విశ. ముకత్తైన, వి. ముడిపత్తి.

సం. *గాఢ*- ; ప్రా. *గాఢ*- ; ఒ. గాఢ్హా ; హిం. గాఢ్హా ; పం. గాఢ్హా ; గు. *గాఢ్హ* ; మరా. గాఢ్హ.

<ప్రా. గాఢ-.

**గాఢ[2]** వి. ఆర, అక్కర.

**గాఢవాలు** వి. ఒకవిధమైన పొద.

**గాడా** వి. **1.**కోట; **2.** చోటు.

హిం. మరా. *గడ్*. కోట, చోటు.

<మరా. గడ్.

**గాడాకుండ** రూ.చూ. గడేకుండ. వి. భజనలకి, బుర్రకథలకి ఘట వాయిద్యం వాయించడానికి వాడేకుండ.

**గాడి[1]** రూ. గాడె, గాడెము, గాండి, గాని[1], గాల. వి. **1.** పొయ్యి. బసవ. 4.482 పం ; **2.** గాటం. బిల్హ. 2.29 ; **3.** కోనేరు ; **4.** నీళ్ళుబయటికి పోవటానికి ఏర్పరచినదారి ; **5.** చిల్ల కంపనాటటానికి చేనిచుట్టూ తీసినగాడి ; **6.** కొట్టంలో పశువులకు మేతవేయడానికి ఏర్పరచిన అర ; **7.** చేతి మగ్గంపలక ; **8.** నాడె మొ. కర్రసామానుమీద చెక్కిన నందులేక కాలవ ; **9.** రాతిమీద అర్ధచంద్రాకారంగా చెక్కినగుంట ; **10.** పునాది, బట్టీపొయ్యికి తవ్వినగుంట ; **11.** తులసికోటలో మొక్కను పాతడానికి ఉంచిన జాగా ; **12.** గొడ్లకుమేతవేసే స్థలం.

క. *గాడ*, *గాడికె* ; త. కాడి.

పో. చూ. సం. *గాఢ*-. సాంద్రమైన ; ప్రా. *గాఢ*.

గాటికంబం వి. గాడిదగ్గర పశువును కట్టి వెయ్యటానికి పాతినగుంజ. గాటికళ్ళం రూ.చూ. గాడికళ్ళం. వి. జొన్న, నజ్జ మొ. పైర్లుకోసి కుప్పవేసిన చోటనే కంకులు కొయ్య టానికి బాగుచేసిన చోటు, కంకులుకోసే చోటు. గాటిగుంజ రూ. గాడిగుంజ. వి. గాడిదగ్గర పశువునుకట్టి వెయ్యటానికి పాతినగుంజ. గాటిచెక్క వి. గాడిలోఅమర్చే తలుపుచెక్క. గాటిపాడు రూ.చూ. గాడిపట్టు. వి. గాడిదగ్గర పశువుల్ని కట్టివేసే చోటు. గాటిబిగువు వి. స్థానబలం. గాటిమేపు వి. పశువులకు గాటిలో వేసినగడ్డి. గాటినుడి రూ. గాడినుడి. వి. **1.** వీపుకు ఇరువైపులా ఉండేనుడి ; **2.** డొక్కలోఉండే నుడి ; **3.** గంగడోలు కిందిభాగంలో ఉండే నుడి. గాడికట్టు అ.క్రి. పాడుకొను. భాఖ్య. నం. 3.139. గాడికవ్వు వి. గుమ్మంపక్కన గోడలో ఒకఇటుక పరసన ఖాళీవదిలి గూడులాగా తయారుచేసిన కవ్వు. గాడికళ్ళం రూ. గాటి కళ్ళం. వి. జొన్న, నజ్జ మొ. పైర్లుకోసి కుప్పవేసినచోటనే కంకులు కొయ్యటానికి బాగుచేసినచోటు, కంకులు కోసే చోటు. గాడికుంచె వి. పురికిమధ్యగాడి ఉన్నకుంచె. గాడి గుంజ రూ.చూ. గాటిగుంజ. వి. గాడిదగ్గర పశువును కట్టి వెయ్యటానికి పాతినగుంజ. గాడిగూటం వి. గాడిదగ్గర పశువును కట్టివెయ్యటానికి పాతినగుంజ. గాడిచిల్ల రూ. గాడిసిల్ల. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల, ఇనపపుల్లకొండి. గాడితట్టి వి. గాడిదగడపరాకు. గాడిదర్వాజా వి. విడివిడిచెక్కలను ఒక దానిమీద ఒకటి పేర్చడానికి వీలుగా గాడితీసిన దర్వాజా. గాడిదీయు అ.క్రి. లోతుగుంటతీయు. గాడిపట్టు రూ. గాటిపాడు, గాడిపాటు, గాడిపాడు[1], గాడుపాటు. వి. **1.** గాడిదగ్గర పశువుల్ని కట్టివేసే చోటు ; **2.** నివాసస్థలం ; **3.** కొట్టం. గాడిపట్టె వి. మరమగ్గంలో పన్నెబిగించిన కింది కొయ్య. గాడిపండగ వి. పశురోగనివారణకు జరిపేపండుగ. గాడిపన్ను వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపుల్ల, ఇనపపుల్ల, కొండి. గాడిపలక వి. కొట్టులోని విడిచెక్క. సొరుగుపలక. గాడిపాటు రూ.చూ. గాడిపట్టు. వి. గాడిదగ్గర పశువుల్ని కట్టేసేచోటు. గాడిపాడు[1] రూ.చూ. గాడిపట్టు. వి. గొడ్లను కట్టివేసేచోటు, కొట్టం. గాడిపాడు[2] వి. ఆరులో కర్రబిగించటానికి తొలిచినగాడి. గాడిపొయ్యి వి. ఏకంపొయ్యి, గద్దపొయ్యి, తేనెపొయ్యి, పాలపొయ్యి, వెనకవైపుపొడుగ్గా దిన్నెలాగపెట్టి ముందు పక్క రెండుపొయ్యిలు అమర్చికట్టిన వంటపొయ్యి, పొడుగ్గా తవ్వినపొయ్యి. గాడిబండి వి. పోలుగర్రబండి, ఒంటి నొగబండి. గాడిబద్ద వి. మరమగ్గంలో చట్రంలో, నిలువుపట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె. గాడిమొద్దు వి. **1.** చెరువుకున్న కిందితూముమూసేమొద్దు; **2.** పొలంలోవాన నీళ్ళు పారటం వల్ల కోసుకుపోయి ఏర్పడ్డపల్లం లేదా గొయ్యి. గాడివరాహ వి. కరకువరహా, నాల్గురూపాయలు విలువగల

నాజెం. గాడిసిల్ల (-చిల్ల) రూ.చూ. గాడిచిల్ల. వి. దోనె గాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యపల్ల, ఇనపపల్లకొండి ; గాడిసుడి రూ.చూ. గాటిసుడి. వి. 1. వీపుకు ఇరువైపులా ఉండేసుడి ; 2. డొక్కలో ఉండేసుడి ; 3. గంగడోలు కింది భాగంలో ఉండేసుడి. గాడిస్టోన్ వి. రాతిగోడలో పగుళ్ళను సరిచేస్తూ బిగించేరాయి.

గాడి² రూ.చూ. గాడీ. వి. కొలారుబండి.

గాడిఖాన వి. బళ్ళసాల. హిం. ఉ. ఖానా. స్థానం.

గాడిగడ(గు (-కడ(గు) స.క్రి. కడతేర్చు, సంచయనంచేయు.

గాడించు రూ.చూ. గాఢించు. అ.క్రి. పెద్దగాఅరచు.

గాడిత్రోకతెవులు చూ. గాడిద.

గాడిద రూ. గాడిదె, గార్ద. వి. గాలివాడు, ఖరం ; భార. ఆది. 8.231.

క. కత్తె, కత్తె, గాడిద ; కొడ. కత్తి- ; తు. కత్తై ; త. కయుతై ; మ. కయుతి ; కొ. కడత్ ; తొ. కత్య్ ; పర్జి. గదె ; కొలా. గడ్డె ; నా. గాడ్డి.

హిం. గధా.

పో.చూ. సం. గర్దభ-, గార్దభ-. గాడిద.

<మూ.ద్రా. *కఴ్త్.

గాడిత్రోకతెవులు రూ.చూ. గాడిదతోకతెవులు. వి. సజ్జ తెగులు. గాడిదకాళ్ళవాడు రూ. గాడిదెకాళ్ళవాడు. వి. ముట్టుమోకాళ్ళవాడు, ముడికాళ్ళవాడు, నంజ్జువు. గాడిద కాళ్ళు వి.బ.వ. దొడ్డికాళ్ళు, ఒకదానికొకటి తగిలే మోకాళ్ళు. గాడిదకుగంతగట్టు (-కట్టు) స.క్రి. చేతకానివాడికి పని అప్పగించు. గాడిదకొడుకు వి. ఒకానొక తిట్టు. గాడిద గడపర రూ. గాడిదెగడపర. వి. ఒకానొక ఓషధీవిశేషం. పిండీతకం, విషగంధిక. హంస. 4.10. గాడిదగడపాకు వి. త్రివృత్పత్ర, విషగంధిక. గాడిదగత్తము వి. గాడిదలద్ది. గాడిదగత్తర వి. గాడిదగోల. గాడిదగుడ్డు రూ.చూ. గాడిద గ్రుడ్డు. వి. వట్టిది, లేనిది. గాడిదగ్రుడ్డు రూ. గాడిదగుడ్డు. వి. 1. నిస్సారాన్ని సూచించే మాటలోను, తిరస్కారం లోనూ, అహంభావంలోనూ, వక్రగతిని పోయేవారిపట్ల ఉప యోగించే ఊతపదం ; 2. గాడిదకనేగుడ్డు, గాడిదగుడ్డు పెట్టదు కనుక లేనిది అని అర్థం (అర్థవిపరి.). గాడిదగ్రుడ్డులు వి.బ.వ. ఖరనందన సంవత్సరాలు. సం. ఖరనందన-. గాడిదకొడుకు అనూదితాదానం (Loan Translation) తో చమత్కారప్రయోగం. గాడిదచాకిరి వి. ఎక్కువచాకిరి. గాడిదచావుచచ్చు అ.క్రి. ఎక్కువ చాకిరీ చేసి దిక్కు మాలిన చావుచచ్చు, గాడిదవలెచచ్చు. గాడిదతోకతెవులు రూ. గాడిత్రోకతెవులు. వి. సజ్జతెగులు, సజ్జఎన్ను ఆకులూ ముద్దగా అయిపోతాయి. గాడిదవ్రాకు వి. గాడిదగడపర, మాగాణిలో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క. గాడిదవల్లేరు వి. ఇనకనేలల్లో ఎక్కువగా మొలిచే పాడు కలుపు మొక్క. గాడిదపిటకలు వి.బ.వ. గాడిదెలద్దె, గాడిదపెంట. గాడిదపిల్ల కోమలికం వి. త్వరలోనే మాసిపోయే కోమలత్వం. గాడిదపులి రూ. గాడిదెపులి. వి. దుమ్ములగొండి, కొర్నవ గుండు. గాడిదమబ్బు వి. గాడిదరంగుమబ్బు. గాడిదమపర వి. గాడిదరంగువంటిరంగు. గాడిదమైల వి. బూడిదవన్నె పెండ. గాడిదలద్ది రూ. గాడిదెలద్దె. వి. గాడిదలపెంట. గాడిదలొట్ట వి. ఒకరకం పెద్ద చెట్టు (Saccopetalum tomentosum). గాడిదవంకాయ వి. ఒకరకం వంకాయ. గాడిద్రేకు వి. గాడిదగడపర నల్లరేగడి నేలల్లో ఎక్కువగా మొలిచే మొండిరకం కలుపు మొక్క.

గాడిదె రూ.చూ. గాడిద. వి. గాడిద.

గాడిదెకాళ్ళవాడు రూ.చూ. గాడిదకాళ్ళవాడు. వి. ముట్టుమోకాళ్ళవాడు, నడిచేటప్పుడు మోకాళ్ళు ఒకదానితో ఒకటి తగిలేవాడు. గాడిదెగడపర రూ.చూ. గాడిదగడపర. వి. ఒకానొక ఓషధీ విశేషం. గాడిదెపులి రూ.చూ. గాడిదపులి. వి. దుమ్ములగొండి, కొర్నవగండి. గాడిదెలద్దె రూ.చూ. గాడిదలద్ది. వి. గాడిదపెంట.

గాడిద్రేకు చూ. గాడిద.

గాడీ రూ. గాడి². వి. 1. బండి, రథం. కవిచౌ.శ. 191 ; 2. ఎడ్లబండి.

సం. గర్త- ; దేశీ.ప్రా. గడ్డీ. కా. గొడి ; నే. గాడి ; అ. గారి ; బెం. గాడి ; ఒ. గాడి ; బీ. గాడీ ; హిం. గాడీ. బండి ; పం. గడ్డ్, గాడ్డీ ; ల. గడ్డ్ ; సిం. గాడొ ; గు. గాడీ ; మరా. గాడీ. బండి ; ఉ. గాడీ-. బండి.

క. గాడి.

<ఉ. గాడీ.

గాడు¹ వి. 1. తీవ్రమైనకోరిక, ఆశపడటం ; 2. పొగరు ; విశే. 1. వాలివున్న ; 2. దుష్ప్రవర్తన కల ; అ.క్రి. 1. ప్రవేశించు, దూరు ; 2. పొడుచు.

గాడుచను అ.క్రి. 1. ప్రవేశించు, దూరు ; 2. పొడుచు. గాడువడు అ.క్రి. దిగ్భ్రమనొందు, గాడుపారు అ.క్రి. 1. ప్రవేశించు, దూరు ; 2. పొడుచు.

గాడు² అ.క్రి. కారు, కు.సం. 11.57.

గాడు³ రూ.చూ. గాఱు. వి. చేటు, హాని, కీడు.

గాడు⁴ వి. తెగులు.

గాడు⁵ వి. గుదం.

క. గాణ్డు. గుదం.

గాడుపాటు రూ. చూ. గాడిపట్టు. వి. గాడిదగ్గర పశువుల్ని కట్టివేసే చోటు.

గాడుపు¹ రూ.చూ. గాడ్పు. వి. 1. గాలి, వాయువు. పాండు. 2.29 ; 2. కలరా ; 3. ఒకరకం పశురోగం.

గాడుపుకొడుకు రూ.చూ. గాడ్పుకొడుకు. వి.1. భీముడు. రాఘవ. 4.33 ; 2. హనుమంతుడు. గాడుపుచుట్టము రూ.చూ. గాడ్పుచుట్టము. వి. 1. భీముడు. 2. అగ్ని. గాడుపుచూలి రూ.చూ. గాడ్పుచూలి వి. 1. హనుమంతుడు. అచ్చ.రా. సుందర. 171 ; 2. భీముడు. గాడుపుచూలు రూ.చూ. గాడ్పుచూలి. వి. 1. హనుమంతుడు ; 2. భీముడు. గాడుపుచెలికొడుకు రూ. గాడ్పుచెలికొడుకు. వి. కుమారస్వామి. గాడుపుటరదపుదొర రూ. చూ. గాడ్పుట రదపుదొర. వి. మన్మథుడు. గాడుపు తండ్రి రూ. గాడ్పుతండ్రి. వి. ఆకాశం. అచ్చ.రా. యు. 490. గాడుపుతూపు రూ.చూ. గాడ్పుతూపు. వి. వాయ

వ్యాఘ్రం. గాడుపువెచ్చెలి రూ.చూ. గాడ్పువెచ్చెలి. వి. అగ్ని. గాడుపుపట్టి రూ.చూ. గాడ్పుపట్టి. వి. 1. హనుమంతుడు; 2. భీముడు. గాడుపుబిడ్డఁడు రూ.చూ. గాడ్పుబిడ్డఁడు. వి. 1. ఆంజనేయుడు; 2. భీముడు. గాడుపుమేవరి రూ.చూ. గాడ్పు మేవరి. వి. పాము, సర్పం, పవనాశనం. గాడుపు సంగడీఁడు రూ. గాడ్పు సంగడీఁడు. వి. అగ్ని, వాయుసఖుడు. అచ్చ.రా.యు. 138.

గాడె రూ.చూ. గాడి[1]. వి. త్రైను డోరికట్టినరాయి.

గాడెము రూ.చూ. గాడి[1]. వి. 1. బండినడిచిన దారి; 2. కారెం మెరకపొలాలకు నీళ్ళుపోసే కాటిదోనె; 3. బండి ఇరుసు వెయ్యటానికి దొలువకు తొలిచిన గాడి. గాడెమువడు (-పడు) అ.క్రి. బండిదారి ఏర్పడు.

గాడ్డ రూ.చూ. గాడిద. వి. గాలిగాడు, ఖరం. వేఙు. శ. 64.

గాడ్పు రూ. గాడుపు. వి. గాలి, వాయువు. భార.ఆది. 4.38.

క. *గాళి, గాళ్*. గాలి; తు. *గాలి, గాళి*; కొం. కువి. కొలా. నా. గాలి.

గాడ్పుకొడుకు రూ. గాడుపుకొడుకు. వి. 1. భీముడు. భార. ఆది. 5.178; 2. హనుమంతుడు. రాఘవ. 4.38. గాడ్పుచుట్టము రూ. గాడుపుచుట్టము. వి. 1. అగ్ని. అచ్చ. రా.సుందర. 151; 2. భీముడు. గాడ్పుచూలి రూ. గాడుపుచూలి, గాడుపుచూలు, గాడ్పుచూలు. వి. 1. హనుమంతుడు. అచ్చ.రా.సుందర. 2; 2. భీముడు. గాడ్పుచూలు రూ.చూ. గాడ్పుచూలి. వి. 1. హనుమంతుడు; 2. భీముడు. గాడ్పుచెలికొడుకు రూ.చూ. గాడుపుచెలికొడుకు. వి. కుమారస్వామి. గాడ్పుటరదవుదొర రూ. గాడుపుటరదపుదొర. వి. మన్మథుడు. గాడ్పుతండ్రి రూ.చూ. గాడుపుతండ్రి. వి. ఆకాశం. గాడ్పుతూపు రూ. గాడుపుతూపు. వి. వాయవ్యాస్త్రం. అచ్చ.రా.యు. 247. గాడ్పుదిండి వి. సర్పం, పాము, పవనాశనం. అచ్చ.రా.బాల. 11. గాడ్పుదిండిములికి వి. నాగాస్త్రం. అచ్చ.రా.యు. 353. గాడ్పువెచ్చెలి రూ. గాడుపువెచ్చెలి. వి. అగ్ని. వేంక. ఆం. 1.16. గాడ్పువట్టి రూ. గాడుపుపట్టి. వి. భీముడు.భార. ఆది. 5.166. గాడ్పుబిడ్డఁడు రూ. గాడుపుబిడ్డఁడు. వి. 1. హనుమంతుడు; 2. భీముడు. గాడ్పుమేవరి రూ. గాడుపుమేవరి. వి. గాలి తిండిగా కలది, సర్పం, పాము. గాడ్పుసంగడీఁడు రూ.చూ. గాడుపుసంగడీఁడు. వి. అగ్ని.

గాణ రూ. గాణుఁడు. వి. 1. పాటకత్తె. కు.సం. 6.48; 2. పాటకాడు.

సం. *గాన*-. పాట; ప్రా. *గాణ*-; నే. *గానా*; హిం. *గాన్*; మరా. *గాణె*.

క. *గాణ*-. పాట; కుఇ. *గాణ*. పాట.

<ప్రా. గాణ-.

గాణతనము వి. గాయకత్వం. చంద్రరే. 4.112.

గాణి[1] రూ.చూ. గాణి[1]. వి. గాయకురాలు, పాటకత్తె.

గాణి[2] రూ. గాణి[2]. వి. గానుగ.

గాణి[1] రూ. గాణి[1]. వి. గాయకురాలు, పాటకత్తె. వసు. 2.11.

సం. *గాయని*. పాటకత్తె; ప్రా. *గాఅణీ, గాణీ*.

క. *గాణి*. గాయకురాలు.

<ప్రా. గాణి.

గాణి[2] రూ.చూ. గాణి[2]. వి. గానుగ.

గాణు రూ. గాడు[3]. వి. చేటు, హాని, కీడు. ప్రబోధ. 2.75.

సం. ఘాతన-. చంపటం, హింసించటం, బాధించటం; ప్రా. ఘాణ-. ఘాయణ. హత్య, హింస, నాశం, హంతకుడు.

<ప్రా. ఘాణ-.

గాణుఁడు రూ.చూ. గాణ. వి. గాయకుడు, పాటగాడు. ఉ.హరి. 7.120.

గాండసున్నం వి. గానిగ సున్నం.

గాండి వి. గానుగ.

గాండికమ్మి వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య.

గాండీవముఅడ్డుపెట్టు అ.క్రి. ఒక వ్యక్తిని అడ్డు పెట్టడానికి సామర్థ్యాన్ని చూపు.

సం. *గాండీవ*-. అర్జునుని ధనువు.

గాండీవానికివచ్చు అ.క్రి. కష్టసాధ్యమగు

సం. *గాండీవ*-. అర్జునుని విల్లు.

గాండ్ర రూ.చూ. గాండ్రు. వి. కాండ్రుమనే చప్పుడు.

గాండ్రించు చూ. గాండ్రు.

గాండ్రు రూ. గాండ్ర. వి. పులి అరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. మను. 4.37.

గాండ్రించు రూ. గాడించు. అ.క్రి. 1. ముఖం ఉబ్బు; 2. పెద్దగా అరచు. గాండ్రుగాండ్రుమను అ.క్రి. పులి అరుచు. గాండ్రుపెట్టు అ.క్రి. గాండ్రుమను. ద్వి.సార.చ. 2.80 పు. 12 పం.

గాండ్ల వి. నూనె అమ్మి జీవించే ఒక జాతి.

క. *గాణిగ*. గానుగవాడు; *గాణిగిత్తి*. గానుగవాడి భార్య; *గణిగరు*. నూనె వ్యాపారి కులం.

గాండ్లది వి. నూనె అమ్మి జీవించే జాతికి చెందిన స్త్రీ. గాండ్లవాఁడు రూ. గాళ్లవాఁడు. వి. తెలికలవాడు. హంస. 3.29. గాండ్ల<గానుల<గానుగుల.

గాఁడి రూ.చూ. గాడి[1]. వి. 1. పశువులు నీళ్ళు తాగటానికి గాడి రాతితో కట్టిన తొట్టి. వేంక. పంచ. 3.121; 2. పశువులను కట్టేచోట కనుపువేసే పలకలు మొ. వాటితో గాడిఏర్పరచిన ప్రదేశం. పి.శకు. 4.4; 3. తొలిచికాని, తవ్వికాని నిడుపుగా ఏర్పరచిన పల్లం; 4. కందకం, అగడ్త; 5. పగులు, చీలిక; 6. (గుండిగలతో వండటానికి తవ్విన) నిడుపాటి పొయ్యి.

గాఁడికళ్ళెము వి. వరికుప్పవద్ద కుప్పనూర్పుకై చదును చేసిన నేల, గూడు కళ్ళం. గాఁడిగడుగు (-కడుగు) స.క్రి. సంచయనంచేయు, చనిపోయినవారి ఎముకల్ని సాధారణంగా రెండో రోజున పోగుచేయు. గాఁడిముయ్యి వి. పశువులు నీళ్ళు తాగటానికి తొట్టిగాఉన్న నుయ్యి. గాఁడి పండుగ వి. పశురోగ నివారణకై రైతులు చేసే ఉత్సవం. గాఁడిపొయ్యి రూ.చూ. గాఁడిప్రొయ్యి. వి. గాడితవ్వి ఏర్పరచిన పొయ్యి. గాఁడిప్రొయ్యి రూ. గాఁడిపొయ్యి. వి. 1. గాడితవ్వి ఏర్పరచిన పొయ్యి; 2. (గుండిగలతో

వంటకి అనువుగా తవ్విన) నిరుపాటి పొయ్యి.

**గా(డు**[1] వి. 1. దురద, కండూతి. ఆం.భా. 2.129; 2. గుదం; 3. కామమదం; 4. పొగరు.

ఒ. గాణ్డి. గుదం; గు. గాఁడ్. గుదం.

క. గణ్డు. గాండు.

<ఒ. గాణ్డి.

**గా(డు**[2] అ.క్రి. 1. దూసికొనిపోవ; 2. గుచ్చు, నాటు.

**గాత**[1] వి. 1. దెబ్బ, వేటు, పెట్టు. మను. 4.8; 2. ద్రోహం. చెన్న. బసవ. 2.24.

సం. ఘాత-. దెబ్బ.

క. గాత. దెబ్బ, వేటు; తు. గాత, గాతక. హంతకుడు.

<సం. ఘాత-.

గాతకట్టు[1] అ.క్రి. గడ్డకట్టు.

**గాత**[2] రూ. గాద[2]. వి. కథ, గొడవ. విష్ణు.మా. 4.165.

సం. గాథా. పాట, పద్యం; అ.మా. గాథా, గాహ. ఒక పద్యము, ఛందో విశేషం.

క. గాదె. జనోక్తి; గాదెగార. సామెతలలో నిపుణుడు; జాతిగాదె. ఛందో విశేషం; తు. గాదె. సామెత.

<సం. గాథా-.

**గాత**[3] వి. ఎర్రగొదచెట్టు. వి. ఆకుపచ్చని పూలు, ఎర్రబూడిద రంగు కాయలు కాసే చెట్టు, ఒక చిన్న ముళ్ళ చెట్టు (Diospyros montana).

గాతకట్టు[2] వి. కలువు గడ్డి, గాదం. గాతకంప వి. గాత రొద్ద, ఆముకాల్చడానికి ఉపయోగించే గాతచెట్టు కంప. గాతరొద్ద వి. గాతకంప, ఆముకాల్చుకు ఉపయోగపడే ఆకులతో కూడిన గాతచెట్టు కంప.

**గాత**[4] రూ.చూ. గాతము. వి. 1. కుంట, మాగాణి పంటలకు, తోటలకు నీళ్ళు పెట్టటానికి పొలంలో తవ్విన చిన్న జలాశయం; 2. స్తంభాలు పాతడానికి లోతుగా తవ్విన గుంట; 3. చిరత.

గాతకట్టె వి. గాతకొయ్య. గాతకొయ్య వి. 1. గాడి కున్న రంధ్రంలో పెట్టే కొయ్యముక్క; 2. బండిమీద జల్ల కదలకుండా చట్టంలో గుచ్చిన కొయ్యముక్క.

**గాతం** రూ.చూ. గాతము. వి. స్తంభాలు పాతటానికి లోతుగా తవ్విన గుంట.

**గాతము** రూ. గాత[4], గాతం, గాతాం, గాతాము, గాతు[4]. వి. 1. పల్లం, గోయి, గుంత. వాసి.రా. 5. చంద్రాంగ. 2.64; 2. చేనుచుట్టూ కంప పాతటానికి తీసిన గాడి లేదా గొయ్యి; 3. పునాదికై తవ్విన పొడుగాటి గుంట, స్తంభాలు పాతటానికి లోతుగా తవ్విన గుంట.

క. గాత. లోతు.

సం. ఖాత-. లోతైన, గుంట.

గాతముతీయు అ.క్రి. గుంటచేయు<గాతము+-లు+తీయు.

**గాతమూల** వి. గాటపోటీ.

**గాతాం** రూ.చూ. గాతము. వి. స్తంభాలు పాతడానికి లోతుగా తవ్విన గుంట.

**గాతాము** రూ.చూ. గాతము. వి. 1. స్తంభాలు పాతడానికి లోతుగా తవ్విన గుంట; 2. జాతి బట్టి, సున్నంకాల్చే గుండ్రటి బట్టి.

గాతాలుపొంగు వి. చెరకు పాకం కాచినప్పుడు వచ్చే చివరి పొంగు.

**గాతాలుపొంగు** చూ. గాతాము.

**గాతి**[1] వి. 1. దెబ్బ; 2. చరుపు.

సం. ఘాతి-. దెబ్బ, గాయం.

క. గాతి.

<సం. ఘాతి-.

గాతికల(గు అ.క్రి. వేరుపడు. గాతిగొను (-కొను) అ.క్రి. కొట్టు. వరాహ. 6.130.

**గాతి**[2] వి. గ్రాసం, తిండి. చంపూ.రా. 6.90.

క. గాతి. ఆహారం.

**గాతు**[1] వి. 1. అగాదు, పేల్చటం; 2. గద్దింపు; 3. దిట్టతనం.

గాతుకల(గు అ.క్రి. పేలు, పగులు. రామాభ్యు. 8.74. గాతుగా క్రి.విశ. తప్పకుండా విరుపక. ద్వి. హరిశ్చ. ఉ. 1679 పం. గాతుగావించు (-కావించు) స.క్రి. అగాదు చేయు, పేల్చు, పగుల్చు. రంగా.చ. 3.66.

**గాతు**[2] వి. ధైర్యం.

**గాతు**[3] వి. అమాదుతాడు, మోకు.

**గాతు**[4] రూ.చూ. గాతము. వి. స్తంభాలు పాతటానికి లోతుగా తవ్విన గుంట.

**గాత్రము** విశ. స్థూలమైన. ఆం.భా. 3.20. వి. 1. కంఠ స్వరం. మను. 2.43; 2. కంఠం.

సం. గాత్ర-. శరీరం, అవయవం.

<సం. గాత్ర-. (అర్థవిపరి.).

గాత్రకచేరి వి. కంఠంతో చేసే సంగీత కచేరి. <సం. గాత్ర-+కచేరి. గాత్రవాలు వి. మొనగాలు. ఆం.పదా. 5.8.

**గాత్రకచేరి** చూ. గాత్రము.

**గాత్రవాలు** చూ. గాత్రము.

**గాద**[1] రూ. గాదము[1]. వి. 1. కదుం, బొప్పి, గాదం, పైత్యం దద్దులు. వాసి.రా. 2.192; 2. చెమటకాయలు పేలటం.

క. గాదరి. కొరడా దెబ్బలవల్ల కలిగిన మచ్చ, గోళ్ళ వల్ల కలిగిన గీటు.

**గాద**[2] రూ.చూ. గాత[2]. వి. వృత్తాంతం, సమాచారం. విజయ. 3.68.

**గాద**[3] రూ.చూ. గాదము[2]. వి. గాదం, కసవు, గడ్డి. ఉ. హరిశ్చ. 4.13.

**గాద**[4] వి. చిన్న పళ్ళు కాసే ఒక చెట్టు, తెల్ల గాద చెట్టు (Diospyros sylvatica).

**గాదము**[1] రూ.చూ. గాద[1]. వి. కదుం, మూతభవ గ్రంథి. ఆం.భా. 2.130.

**గాదము**[2] రూ. గాద[3]. వి. 1. కసవు, గడ్డి. వరాహ. 3.24; 2. ఆకు. విక్ర. 5; 3. పైరులోని కసవు, కలుపు గడ్డి.

పో.చూ. క. గాదు. గడ్డిదుబ్బు.

గాదములోనికాయ వి. మాటుపడినది, నిక్షేపం. విక్ర. 4.60. గాదములోనిదోసకాయ వి. మాటుపడినది, నిరుప

ద్రవం. వరాహ. 3.24.

గాదర వి. వంట చెరకుగాను, తరిమెన పెట్టడానికి ఉపయోగ పడే ఒక చెట్టు, అడవి గోరింత చెట్టు (Erythroxylon monogynum).

గాదరదుంప వి. అడవి ఉల్లి.

గాదలూటి వి. చిన్న పళ్ళు కాసే ఒక చెట్టు, తెల్లగాద చెట్టు (Diaspyros sylvatica).

గాది[1] రూ.చూ. గాదియ. వి. **1.** ధాన్యం మొ. పోసుకోటానికి ఏర్పరచిన చిన్న బుట్ట, కుమూలం; **2.** గాదె, గాజ, హెంజ.

గాదివండ వి. ధాన్యం నిల్వచేసే పెద్ద మట్టి పాత్ర. గాదిబండ వి. గాదెకింద బండరాయి. గాదిబిళ్ళ వి. గాదె తయారీలో అడుగు భాగానికి వాడే గుండ్రని మట్టి పళ్ళెం. గాదిమూత వి. గాదెమీద మూతకి వాడే గుండ్రని మట్టి పళ్ళెం. గాదివొర వి. ధాన్యం నిల్వకు ఉపయోగపడే పెద్ద ఒర.

గాది[2] వి. **1.** కూర్చోవటానికి వాటమైన దిండు, చిన్న మెత్త; **2.** సింహాసనం, గద్దె.

క. *గాది*.

పో.చూ. సం. *గర్త*; నే. *గాదీ*; అ. *గాది*; బెం. *గాది*; ఒ. *గాది*; హిం. *గాదీ*; పం. *గద్దీ, గడ్డీ*; సిం. *గదొ*; గు. *గాదీ*; మరా. *గాదీ*;

గాదియ రూ. గాజియ, గాజె, గాది[1], గాదె. వి. **1.** ధాన్యం మొ. పోసుకోటానికి ఏర్పరచిన చిన్న బుట్ట, కుమూలం. రాజవా. 3.45; **2.** గాదె, గాజ, హెంజ.

సం. ఖాతికా. వల్లం, గోయి.

క. *గాదిగె*.

<సం. ఖాతికా.

గాదియకొలుచు అ.క్రి. ఇంటి గాదెలో ధాన్యం వలె అందుబాటులో ఉండు. పండి.చ. ప్రథ.పురా. ప. 360.

గాదిరి వి. దేవదారు, జాజిచెట్టు లేదా కొయ్య.

గాదిలి విశ. ప్రేమపాత్రమైన. భార. సభా. 1.135. వి. **1.** భార్య. ఉ. సం. 2.163; **2.** ప్రేమ, కూర్మి. భార. మౌసల. 4; **3.** తల్లి కొడుకును పిలవటం. బసవ. 4 ప. 446 పం.; **4.** భర్త. హరి. పు. 1.3; **5.** చుట్టం. ఆం. భా. 3.46; **6.** ప్రియుడు, ప్రియురాలు.

క. *కాదల్, కాదల్మె, కాదల, కాదలె*. ప్రేమ; త. *కాతల్*. ప్రేమ, కామం, కోరిక; *కాతలన్, కాతలాన్, కాతలోన్, కాతలి*. ప్రియుడు, సన్నిహిత, స్నేహితుడు; *కాతలి*. ప్రేమించు.

గాదె రూ.చూ. గాదియ. వి. ధాన్యం మొ. పోసుకోటానికి వెదురు పేళ్ళతోగాని, చెక్కతోగాని మట్టితోగాని ఏర్పరచిన సాధనం, కుమూలం. పండి.చ. 1. 4 ప.

గాదెలకొలుచు స.క్రి. అందుబాటులో ఉన్న అపూర్వ ధాన్యాన్ని ఇచ్చు. తాళ్ళ. సం. 10.51. గాదెలబోయు స.క్రి. కూడబెట్టు. తాళ్ళ. సం. 7.32. గాదెలమన్ను రూ. గాజెలమన్ను. వి. ఈతమట్టి, గాదెల తయారీకి ఒక భాగం మన్ను రెండు భాగాలు పొట్టు కలిపి తొక్కి మురగ బెట్టిన మన్ను.

గాదెర వి. ఇంటి కప్పుకు పనికి వచ్చే కాడలు గల మొక్క.

గాన రూ.చూ. కాన[2]. అవ్య. అయితే, కనుక.

గానకర్ర రూ.చూ. గానుగకర్ర. వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం.

గానగకర్ర రూ.చూ. గానుగకర్ర. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం.

గానగరాయి రూ.చూ. గానుగరాయి. వి. గానుగకున్న రాతి చక్రం.

గానగాడు వి. కూలీ, సంవత్సర జీతం మీద భూస్వామి వద్ద నౌకరీచేసేవాడు.

గానదబ్బ వి. అచ్చు దారానికి కట్టిన పుల్ల.

గాని[1] రూ.చూ. గాడి[1]. వి. గొడ్లకు మేతవేసే స్థలం.

గాని[2] రూ.చూ. గానుగ. వి. నూనె మొ. వాటిని తీసే యంత్రం, తైల యంత్రం.

గాని[3] వి. పెరకోలను మోసే కొయ్య చక్రం.

గానిక రూ.చూ. గానుగ. వి. తైల యంత్రం.

గానిక్కట్టె రూ.చూ. గానిగకట్టె. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిక్కొయ్య రూ. చూ. గానిగకొయ్య. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం.

గానిక్కట్టె చూ. గానిక.

గానిక్కొయ్య చూ. గానిక.

గానిగ రూ.చూ. గానుగ. వి. తైల యంత్రం.

గానిగకట్టె రూ. గానిక్కట్టె. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగకంబీ వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగకొయ్య రూ. గానిక్కొయ్య, గానిగ్గొయ్య. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగగుండు వి. గానుగరాయి, గానుగకున్న రాతి చక్రం. గానిగదూలం వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగపోలు వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగబండ వి. గానుగరాయి, గానుగకున్న రాతి చక్రం. గానిగమాను వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగమొద్దు వి. గానిగకట్టె, గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం. గానిగరాయి రూ.చూ. గానుగరాయి. వి. గానుగకున్న రాతి చక్రం. గానిగరోలు వి. గానుగరాయి, గానుగకున్న రాతి చక్రం. గానిగసున్నం వి. గాండ సున్నం ఆడించిన సున్నం, గారాసున్నం, గానుగ తిప్పి జిగురు, మెత్తదనం కలిగించిన సున్నం. గానిగ్గొయ్య రూ.చూ. గానిగకొయ్య. వి. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం.

గానిగెచెక్క రూ.చూ. గానుగచెక్క. వి. ఎట్టి నూనె గింజలలో తీసిన పిప్పి.

గానిగెతొట్టి రూ.చూ. గానుగతొట్టి. వి. చెరుకు పాకం నింప టానికి వాడే మట్టి తొట్టి.

గానిగ్గొయ్య చూ. గానిగ.

గానిక్యము వి. సానులు, గణికా సమూహం.

సం. *గాణిక్య*-. వేశ్యా సమూహం.

<సం. గాణిక్య-.

**గాను** రూ. గాలు². వి. 1. బండి నడవటానికి ఆకులతో ఉన్న చక్రం; 2. మట్టితో పాత్రలు చేయటానికి కుమ్మరి ఉపయోగించే చక్రం; 3. దబ్బా రాట్నం ఇరుసుకు బిగించిన (రేకు) చక్రం; 4. ఊడ్తై అడ్డ పట్టెకు బిగించిన ఇనప చుట్టు; 5. కొయ్య రోలు, రోలుగా వాడబడే కొయ్య దిమ్మ; 6. బండి కుండలో బిగించిన ఆకుల్ని పట్టి ఉండే గుండ్రటి కొయ్య చట్రం, చక్రం.

**గానుకచెక్క** రూ.చూ. గానుగచెక్క. వి. తెలికెపిండి, గానుగ పట్టిన నూనె గింజల పిట్టు.

**గానుగ¹** రూ.చూ. కానుగు. వి. కరంజం, సముద్ర తీరపు అడవుల్లోనూ, ఏటిగట్లమీద, కొండమీద, పెరిగే చెట్టు (Pongamdia glabra).

**గానుగ²** రూ.చూ. గానువు. వి. నూనె మొ. వాటిని తీసే యంత్రం.

గానుగఎద్దు రూ.చూ. గానుఁగెద్దు. వి. 1. ఇతరప్రపంచం తెలియకుండా అందులోనే (గానుగు కట్టిన ఎద్దువలె) పడి కొట్టుకొనేవాడు; 2. గానుగును తిప్పేఎద్దు. గానుగకర్ర రూ. గానకర్ర, గానగ కర్ర. వి. గానుగ రాతిని తగిలించే కొయ్యదూలం. గానుగచెక్క రూ. గానిగెచెక్క, గానుకచెక్క, గానెగచెక్క. వి. ఎట్టినూనె గింజలతో తీసిన పిప్పి. గానుగతొట్టి రూ. గానిగెతొట్టి. వి. పాల్తొట్టి, చెరుకు పాకం నింపడానికి వాడేమట్టి తొట్టె. గానుగపిండికూర వి. బాటల పక్కన, బంజరు భూముల్లో పెరిగే ఒక మొక్క (Melocheia corchorifolia). గానుగరాయి రూ. గానగరాయి, గానిగరాయి. వి. గానుగ కున్న రాతి చక్రం.

**గానుఁగ** రూ.చూ. గానువు. వి. 1. నూనె తీసే యంత్రం. పల్నా. 53; 2. చెరుకు రసం మొ. తీసే యంత్రం.

గానుఁగది రూ. గానుఁగుది. వి. తెలికల స్త్రీ. క్రీడా. 104. గానుఁగపట్టె రూ. గాన్గపట్టె. వి. గానుగ ఆడేటప్పుడు గానుగవాళ్ళు కూర్చునే ఫలక. క్రీడా. 103. గానుఁగపిండి రూ.చూ. గానుఁగుఁబిండి. వి. తెలగపిండి. గానుఁగరోఁకలి రూ. గాన్గరోకలి. వి. గానుగాడటానికి ఉపయోగించే రోకలి. పరమ. 1.89. గానుఁగతోలు రూ. గాన్గతోలు. వి. రోలులాగ ఉండే గానుగ భాగం. చంద్రరే. 1.85. గానుఁగవాఁడు రూ. గానుఁగువాఁడు, గాన్గవాఁడు. వి. తెలికలవాడు. ఆం.భా. 2.285, గానుఁగాట వి. పిండిచేయటం. గానుఁగాడు రూ. గాన్గాడు. స.క్రి. నువ్వులు మొ.నవి గానుగలో పెట్టి ఆడు.

**గానుఁగాట** చూ. గానుఁగ.

**గానుఁగాడు** చూ. గానుఁగ.

**గానుఁగు** రూ.చూ. గానువు. వి. నూనె మొ. వాటినితీసే యంత్రం.

గానుఁగుది రూ.చూ. గానుగది. వి. తెలికల స్త్రీ. గానుఁగు పిండి రూ.చూ. గానుఁగుఁబిండి. వి. తెలికపిండి. గానుఁగుఁబిండి రూ. గానుఁగపిండి, గానుఁగుపిండి, గాన్గపిండి, గాన్గుపిండి గాన్గుఁబిండి. వి. తెలికపిండి. గానుఁగులాడు రూ. గాన్గులాడు. స.క్రి. చెరకులోనగు వాటిని గానుగులో పెట్టి రసంతీయు. రామాభ్యు. 1.127. గానుఁగువాఁడు రూ. చూ. గానుఁగవాఁడు. వి. తెలికలవాడు. గానుఁగెద్దు రూ. గానుగఎద్దు, గాన్గెద్దు. వి. గానుగుతిప్పేఎద్దు.

**గానుఁగెద్దు** చూ. గానుఁగు.

**గానుడు** వి. 1. పాటగాడు; 2. సంగీతజ్ఞుడు.

సం. *గాన-*. పాట.

<సం. గాన-. (అర్థవిపరి.)

**గానువు** రూ. గాని² గానిక, గానిగ, గానుగ². గానుఁగ, గానుఁగు, గాన్గ, గాన్గు. వి. నూనె మొ. వాటిని తీసే యంత్రం. కు. సం. 2.96.

క. *గాణ*. నూనెమర, చెరకురసం; తు. *గాణ*; త. *కాణం*; పర్జి. *గాన*.

గానువుఁబెట్టియార్చు స.క్రి. శిక్షించు, గానుగలోపెట్టి తిప్పి నులిమివేయు.

**గానెగచిక్కుడు** వి. ఒకరకం చిక్కుడు.

**గానెగచెక్క** రూ.చూ. గానుగ చెక్క. వి. ఎట్టినూనెగింజలతో తీసినపిప్పి.

**గాన్గ** రూ.చూ. గానువు. వి. నువ్వులు మొ. వాటినూనె తీసే యంత్రం.

గాన్గపట్టె రూ.చూ. గానుఁగపట్టె. వి. గానుగవాళ్ళు కూర్చుండేపలక. గాన్గపిండి రూ.చూ. గానుఁగుఁబిండి. వి. తెలికపిండి. గాన్గరోకలి రూ.చూ. గానుఁగరోఁకలి. వి. గానుగాడటానికి ఉపయోగించే రోకలి. గాన్గతోలు రూ.చూ. గానుఁగతోలు. వి. రోలులాగఉండే గానుగభాగం. గాన్గవాఁడు రూ.చూ. గానుఁగవాఁడు. వి. తెలికలవాడు. గాన్గాడు. రూ.చూ. గానుఁగాడు. స.క్రి. నువ్వుల్ని గానుగలోపెట్టిఆడు.

**గాన్గాడు** చూ. గాన్గ.

**గాన్గు** రూ.చూ. గానువు. వి. నువ్వులు మొ. వాటినూనె తీసే యంత్రం.

గాన్గుపిండి రూ.చూ. గానుఁగుఁబిండి. వి. తెలికపిండి. గాన్గుఁబిండి రూ.చూ. గానుఁగుఁబిండి. వి. తెలికపిండి. సొంబ. మాన. 47. గాన్గులాడు రూ.చూ. గానుఁగులాడు. స.క్రి. గానుగాడు. గాన్గెద్దు రూ.చూ. గానుఁగెద్దు. వి. గానుగుతిప్పే ఎద్దు.

**గాన్గెద్దు** చూ. గాన్గు.

**గాందమృగపువెత్తురు** వి. ఎర్రవేగినచెట్టు (Pterocarpus indicus).

**గాందారి** వి. నోరుగల (జగడమాడే) స్త్రీ.

సం. *గాంధారీ*. ధృతరాష్ట్రునిభార్య.

<సం. గాంధారీ. (అర్థవిపరి.).

**గాంధిసుంకాలు** వి.బ.వ. గంధ్య భండారాలపై విధించే సుంకాలు. శా.శ. కో. పు. 92.

**గాంధీకమ్మి** వి. ఒకరకం కమ్మి.

**గాౘ్రేగుమద్ది** వి. పులివెలగచెట్టు, ఆకులు గుండ్రంగాఉండేఒక చెట్టు (Flacountia sepiara).

**గావతాడు** రూ. గాబతాడు. వి. తొండపుతాడు, మోటబొక్కెన తొండానికి కట్టినతాడు.

**గాఫరా** రూ.చూ. ఘాబరా. వి. భయం, కలవరం.

హిం. ఘబ్‌రానా. వ్యాకులపడటం, ఏమిచేయాలో తోచకపోవు.

గాబ రూ. గాబము. వి. 1. కొండలమీద పెరిగేఒకమొక్క. ద్వి. పరమ. 7.499. వ. 4 పం. ; 2. కలుపుగడ్డి (Desomodium latifolium).

గాబతాడు రూ.చూ. గావతాడు. వి. కొండపుతాడు. బొక్కెన తొండానికి కట్టినతాడు.

గాబము రూ.చూ. గాబ. వి. 1. తృణవిశేషం ; 2. కలుపుగడ్డి.

గాబరా రూ.చూ. ఘాబరా. వి. తొందర, బెదురు, గత్తర.

గాబరాపడు అ.క్రి. కంగారుపడు, కలగు, చలించు, బెదురు.

గాబాగూబీ వి. గడబిడ, హడవుడి, అల్లరి, గందరగోళం. చంద్ర రే. 3.148.

గాబారు రూ.చూ. గాబు². వి. గడ్డిపరకలు, గాబు.

గాబు¹ వి. 1. కొప్పెర, మూతివెడల్పుగల పెద్దపాత్ర, బాన. ఆం. భా. 2.245 ; 2. ధాన్యంనిల్వ చేయడానికి వాడే మట్టిపాత్ర ; 3. రంగునీళ్ళు ఉడకబెట్టేతొట్టి ; 4. పశువులు కుడితి తాగేపెద్దతొట్టి.

గాబుగోలెం వి. కుడితితొట్టి. గాబుతొట్టి రూ. గాబుతొట్టె. వి. గూనతొట్టి, నీళ్ళుపోసిపెట్టడానికి వాడేచిన్నసైజు మట్టి తొట్టి. గాబుతొట్టె రూ.చూ. గాబుతొట్టి. వి. నీటితొట్టె, నీటి కాగు. గాబుమట్టి వి. గాబులు తయారు చేయడానికి మాగ బెట్టిన మన్ను. గాబుమన్ను వి. గాబుమట్టి, గాబులుతయారు చేయడానికి మాగబెట్టిన మన్ను.

గాబు² రూ. గాబారు, గావు². వి. 1. కలుపు, పైరులో మొలిచిన గడ్డిమొక్కలు ; 2. పడుగుతీసిన తరవాత పొలికట్టెతో తుడిచే గడ్డిపరకలు, చెత్త ; 3. జొన్నలరాశి తూర్పార పట్టగా వచ్చిన నన్నని పొట్టు ; 4. ధాన్యంనిలవచేసుకొనే పెద్దబాన ; 5. చొప్ప మొ. వాటిమీదినూగు.

గాబుతీయు రూ. గాబుదీయు. అ.క్రి. కలుపుతీయు. గాబు దీయు(-తీయు) రూ.చూ. గాబుతీయు. అ.క్రి. కలుపుతీయు.

గాబు³ వి. తుమికిచెట్టు, చిగుళ్ళు ఎర్రగాను, అకులువచ్చగాను ఉండేఒకచెట్టు. దీనిపళ్ళు ఒకవిధమైన జిగురుకలిగి ఉంటాయి (Diospyros embryopiteries).

గాబురా రూ.చూ. ఘాబరా. వి. భయం, కలవరం.

గాభరా రూ.చూ. ఘాబరా. వి. కంగారు, తొందర, గత్తర.

గామ¹ వి. పిపీలికా విశేషం, చిన్నచీమ. ద్వి. హరిశ్చ. ఉ. 1894 పం.

గామ² రూ.చూ. గామము. వి. పల్లె.

గామడఁచు చూ. గాము.

గామత్తు రూ. గమాతు. వి. ఓడు, చిల్లిఊట.

పో. గామోతి. చిల్లిపడటం, కారటం ; ఫ్రె ; ఫీ.ఠ్.స్పా. గోతియో.

<పో. గామోతి.

గామము రూ. గామ² వి. ఊరు, పల్లె. ఆం. పదా. 612.

నం. (గ్రామ-. పల్లె ; ప్రా. గామ- ; పా. గామ- ; కా. గామ్ ; హిం. మరా. ఉ. గాఁవ్.

<ప్రా. గామ-.

గామికత్తె రూ.చూ. గామిడికత్తె. వి. 1. దుష్టురాలు ; 2. గయ్యాళి.

గామికాఁడు రూ.చూ. గామిడికాఁడు. వి. 1. శ్రేష్ఠుడు ; 2. పందుల మందపెద్ద.

గామిడి విశే. 1. దుష్టమైన. బసవ. 3.1125 పం ; 2. శ్రేష్ఠమైన, ఉత్తమమైన. పాంచాలీ 4.38 ; 3. గయ్యాళిఅయిన. విప్ర. 4.42 ; 4. బలసిన, బిల్హ. 3.69.

నం. (గ్రామణీ-. ముఖ్యుడు ; ప్రా. గామణీ, గామణీ. శ్రేష్ఠుడు ; గామడ. చిన్నఊరు ; గామిల్ల. గ్రామీణుడు, గావియ, గ్రామాధికారి ; అ. మా. గామణీ. ముఖ్యుడు ; పా. గామణీ, గామణిక, గామణీ. సంస్థకు ముఖ్యాధికారి ; అప. గామ-. గ్రామం.

క. గావిల-. గ్రామాధిపతి.

<ప్రా. గామణి.

గామిడికత్తె రూ. గామికత్తె. వి. 1. దుష్టురాలు. బహులా. 5.122 ; 2. గయ్యాళి. గామిడికాఁడు రూ. గామికాఁడు ; వి. 1. దుష్టుడు. కాళిందీ. 3.89 ; 2. పంది కదుపుకు మొనగాడైన పంది. ఆం.భా. 2.82 ; 3. వరాహ యాదవం. గామిడిపంది వి. వరాహం, గామిడికాడు. మల్లు. 1.59.

గాము వి. 1. పిశాచం. భార. సౌప్తి. 1.156 ; 2. సూర్యాది గ్రహం. అచ్చ.రా.బాల. 84 ; 3. విరహబాధ. ఆం.భా. 1.68 ; 4. తాపం.

నం. (గ్రహ-. చంద్రాదిగ్రహం ; ప్రా. పా. గహ- ; అ.మా. గహ-.

క. గర.

<ప్రా. గహ-.

గామడఁచు స.క్రి. గ్రహమావేశించు < గాము + అడఁచు. గాముగొను(-కొను) అ.క్రి. తపించు, కాఠియపడు. గాములదొర వి. శివుడు, భూతేశుడు. గాములమేటి వి. సూర్యుడు, గ్రహపతి. కృ.శకు. 3.58. గాములమోచివ గంప వి. ప్రమాదకరం. తాళ్ల. సం. 4.122. గాములఱేఁడు వి. సూర్యుడు, గ్రహపతి. ద్వి. హరిశ్చ. పూ. 2201 పం. గాములఱేనిపట్టి వి. శని. గాములవారు అ.క్రి. చీకటిపడు, కాలహరణమగు. తాళ్ల. సం. 10.166.

గాముకోట వి. 1. ఊరిచుట్టుకోట ; 2. మాయ, మోసం, మోహం.

గాముగావాలు వి.బ.వ. గ్రామంయొక్క లెక్కలు.

హిం. గామ్, గావ్-. గ్రామం ; గామ్‌గానా ; ఉ. గాఁవ్‌గానా. గ్రామంలెక్కలు.

<ఉ. గాఁవ్‌గానా.

గాముండి వి. గ్రామాధికారి, గావుడ్డి. పెనుకుపర్రు శాసనం. క్రీ. శ. 774-87.

నం. (గ్రామణీ. గ్రామాధికారి ; ప్రా. గామఉడ.-

<ప్రా. గామఉడ-.

గాముఁడు వి. 1. గ్రామీణుడు ; 2. శూద్ర పురుషనామాంత్య పదం.

నం. (గ్రామ-. పల్లెటూరు.

గాయ వి. పునాదికై తవ్విన పొడుగాటి గుంట.

**గాయకము**[1] విణ. 1. గూఢమైన. మను. 3 ; 2. వంచనకల. సారంగ. 3.204 ; వి. 1. మాయ. వంచన. కాళ. 4.30 ; 2. మర్మం.
సం. ఘాతక-, ఘాతుక-. మారణం, హాని, దెబ్బ ; ప్రా. ఘాయగ-. దుష్టుడు, హంతకుడు, వినాశకం.
త. కాయకం. వ్యామోహం.
<ప్రా. ఘాయగ -.

**గాయకము**[2] విణ. 1. ప్రియమైన, ఎక్కువ వెలగల ; 2. లోకజ్ఞత కల.

**గాయకి** వి. గాయకురాలు, పాటపాడే స్త్రీ.
సం. గాయికా. గాయకురాలు.
సంస్కృతంలో గాయకపదానికి జీప్ ప్రత్యయాన్ని తెలుగువారు కల్పించి గాయకిగా ప్రయోగించి ఉంటారు.

**గాయకుఁడు** వి. 1. ప్రౌఢుడు, నేర్పరి. బహుళా, 5.154 ; 2. గ్రహణశక్తి గలవాడు.
సం. గాయక-. పాటగాడు.
<సం. గాయక-(అర్థవిపరి.).

**గాయగాఁడు** చూ. గాయము.

**గాయపడు** చూ. గాయము.

**గాయపాకు** చూ. గాయము.

**గాయపాకుచెట్టు** చూ. గాయము.

**గాయపెట్టు** చూ. గాయము.

**గాయమానము** వి. 1. శస్త్రవిద్యా భేదం. ప్రబంధ. 78 ; 2. ఒకవిధమైన సాధన. ఆం.భా. 2.205.
సం. గాయత్. గానంచేస్తున్న. ఆత్మనే పద ధాతువులకు మాత్రం చేర్చవలసిన మాన శత్రంత ప్రత్యయాన్ని పరస్మైపదగైధాతువుకు చేర్చటం తర్వాత అర్థవిపరిణామం తెలుగులో కల్గడం విశేషాలు.

**గాయము** వి. నరుకు, క్షతి, కత్తి మొ. వాటివలన కలిగే దెబ్బ. రాజవా. 3.48.
సం. ఘాత-. దెబ్బ ; ప్రా. ఘాయ-, ఘాయగ-, అ.మా. ఘాయ-; పా. ఘాత- ; అ.ఒ.వం. ఘా ; నే. ఘాఉ ; మరా. ఘాయ, ఘావ.
క. గాయ-. దెబ్బ, గాయం ; కొడ. గారయ. తు. గాయ, ఘాయ ; త.మ. కాయం ; కుఇ. కువి. గహ ; గావె. ; పర్జి. గావ్.
<ప్రా. ఘాయ-.
గాయగాఁడు వి. దెబ్బతిన్న మనిషి. గాయపడు అ.క్రి. దెబ్బతిను, బాధనొందు. గాయపాకు వి. గాయాన్ని మాన్చే ఆకు. గాయపాకుచెట్టు వి. బంజరు నేలల్లో పెరిగే ఒక మొక్క, పత్రబీజం (Sidacecuta). గాయపెట్టు స.క్రి. నొప్పించు. అ.క్రి. పెద్ద కేకవేయు. గాయముచేయు స.క్రి. గాయం కలదిగాచేయు. ఆము. 6.86.

**గాయి** వి. అల్లరి, అరుపు, గోల.

**గాయిజుబాన్** వి. ఎద్దునాలుక చెట్టు.
హిం.ఉ. జబాన్. నాలుక.

**గాయిణి** వి. గాయకురాలు, పాటకత్తె.
సం. గాయినీ. గాయకురాలు ; ప్రా. గాఇణీ.
<ప్రా. గాఇణీ.

**గాయు** రూ. గ్రాయు. అ.క్రి. ఉమియు.
తు. కారుని, కారావుని ; త. కాల్, కాన్దల్. కాఉ ; మ. కాలుక, కాల్వ, కాఉుక, కాయక, కారేక్కుక; గోం. కాహ్‌చానా.

**గార**[1] వి. 1. రత్నదోషవిశేషం. రత్న. 28 ; 2. గోడ మొ. వాటి పూతకై ఇసక చేర్చి దంచిన సున్నం. గచ్చు. ఉ.రా. 2.292 ; 3. డాగు, మరక ; 4. పట్టు.
ప్రా. గార-. రాయి ; పో. చూ. కు. గారో ; హిం. గారా ; పం. గారా ; ల. గారొ ; సిం. గారొ ; గు. గార్, గారో ; మరా. గారా.
క. గారె ; త. కారై.
గారకాఁడు వి. సూపరి, గచ్చుపని చేసేవాడు, సున్నం పనివాడు. ఆం.భా. 2.282. గారకాళ్లు రూ. గేరకాళ్లు, గ్యారకాళ్లు. వి.బ.వ. మేక, పొట్టేళ్ళ మోకాటి కిందికాళ్ళు, గేరకాళ్ళు. గారచెక్క వి. చెక్కతాపి, కొయ్యతోచేసిన తాపి. గారచేయు స.క్రి. గచ్చుచేయు, గారపూయు. గారతెవులు వి. వరి, జొన్న, మొక్కజొన్న మొ. వాటికి పట్టే పేనుతెగులు. గారపట్టు అ.క్రి. తాంబూలంవల్ల పళ్ళు ఎర్రకప్పువేయు. గారపడు అ.క్రి. తాంబూలంవల్ల పళ్ళు ఎర్రకప్పువేయు. గారపూఁత వి. ఇంటితిన్నె గోడల అడుగున, మూలలోను తీర్చే ఎర్రమట్టిపట్టె. గారపోఁత వి. దండెకట్టు, తూర్పార పోసేటప్పుడు మేలురాశి పక్కనపడే పొట్టు, గింజలు కలిసిన భాగం, తాలుగింజలు.

**గార**[2] వి. 1. గారచెక్కతో తీసిన గంధం. భాగ. 8.696, వైజ. 2.140 ; 2. ఇంగుది, ఒకానొకచెట్టు, గరిచెట్టు. దశా. 1.179 (Balanites Roseburgi).
క. గారె, కారె. ఒకరకం పొద ; కొడ. కరిమర ; త కారై ; మ. కార. ముళ్ళపొద.
గారకంప వి. ఆముకాల్వలో వాడే గారచెట్టు కంప. గారకాయ వి. 1. ఇంగుదీఫలం ; 2. గారకాయలో మందు కూరి చేసిన ఒకానొక బాణసంచు. గారచెట్టు వి. ఇంగుదం, అంగారవృక్షం. గారమావె వి. ఇంగుదీతైలం, గారకాయల నుంచి తీసేనూనె. గారవండు వి. ఇంగుదం. గారపిండి వి. గారకాయలపిండి. రం.రా. అయో. 138. పు. 29. పం. గారపొడి వి. గారచెక్కతో తీసిన గంధం.

**గార**[3] వి. ఒకజాతి చేప.
త. కారై-. సముద్రం చేప ; మ. కార-. ఒకరకంచేప.

**గార**[4] వి. గంగరేగుచెట్టు, నల్లని, గట్టి కలపనిచ్చే ఒకరకంచెట్టు (Thesperia Papulnea).

**గారగ** వి. బిక్కిచెట్టు (Gardenia Gummifera).

**గారడము** రూ. గారడి, గారడీ, గారిడి. వి. 1. మాయ. శుక. 1.15. ; 2. అసత్యం. శుక. 1.99 ; 3. పరిహాసం. శశా. 2.133 ; 4. విషమంత్రం ; 5. మోసం ; 6. ఆట.
సం. గారుడ-. గరుడ సంబంధమైనది.
క. గారుడ, గారడ, గారడి, గారుడిగ. విషమంత్రం ; త. కారుటం, కాయటం, కాయటన్ ; కువి. గారిడగత్తసి ;

**గీఁకు** స.క్రి. గోటితోగీచు. ద్వి. హరిశ్చ. పూ. 741 పం.; **2.** కత్తి మొ. వాటితో గీరు.

క. గీకు-, గీచు ; కొడ. గిచ్. గుర్తుపడేటట్టు గిల్లు ; తు. కిరుని-గీరుని. గిచ్చు ; త. కీరు. గిల్లు, గీతలుగీయు ; మ. కీఱుక. గిచ్చు, గీతలు గీయు ; కుఇ. గీర్-. గీత, గుర్తు, గిల్లు ; పర్జి. గీర్-. గీత, గుర్తు.

**గీచు** చూ. గిచ్చు. స.క్రి. **1.** గీయు. ఉ.రా. 1.180 ; **2.** గోకు.

క. గీసు-.గీచు, గీయు, గిచ్చు, చెట్లనుండి పాలు తీయటానికి గాట్లుపెట్టు ; కొడ. గిచ్. గుర్తుపడేట్టు గిల్లు ; తు. కిరుని, గీరుని. గిల్లు ; త. కీరు. గీతలుగీయు, గిలుకు. మ. కీఱుక. గీతలుగీయు, గీచు ; కుఇ. గీర్. గీత. గుర్తు ; పర్జి. గీర్.

**గీజాడు** చూ. గీజు.

**గీజు** రూ. గీదు. వి. పీకులాట.

సం. గృధ్య-, గృధ్యా. అత్యాశగా కోరటం ; ప్రా. గిజ్ఝ-. తగులుకొను, ఆసక్తమగు ; జై.మహా-. అ.మా. గిజ్ఝ-. కోరు, ఇచ్ఛగించు.

<ప్రా. గిజ్ఝ-

**గీజాడు** అ.క్రి. పీకులాడు. **గీజుపోరు** రూ.చూ. గీదుపోరు; అ.క్రి. **1.** విరామం లేకుండ జగడమాడు. శుక. 2.456 ; **2.** మిక్కిలి మారాంచేయు. శుక. 3.244.

**గీటడఁగించు** చూ. గీటు².

**గీటడఁగు** చూ. గీటు².

**గీటడఁచు** చూ. గీటు².

**గీటణఁగించు** చూ. గీటు².

**గీటణఁగు** చూ. గీటు².

**గీటణఁచు** చూ. గీటు².

**గీటు¹** వి. మట్టిగోడ నిర్మాణంలోని దశలను గుర్తించే గీత; **2.** మూతి గూనమీద పగలగొట్టవలసిన చోటును గుర్తించే గీత ; **3.** కిటికీచెండుమీది గీత ; **4.** ముగ్గుతో గీసిన గీత ; **5.** గీత ; **6.** నుదుటిగీత.

క. గీటు. గీత.

**గీటుకొట్టు** అ.క్రి. **1.** గీతపెట్టు ; **2.** ఒల్లకుండు. **గీటుపెట్టు** స. క్రి. మేలు కీళ్ళ పరీక్షకై బంగారాన్ని ఒరగంటిపై నొక్కి రాయు. **గీట్లబ్రద్ద** వి. కాగితంమీద గీట్లుపడేట్టు గీసేందుకు ఉపయోగించే కోల. **గీట్లు** వి.బ.వ. చదువు సంధ్యలు.

**గీటు²** వి. **1.** గర్వం, పొగరు ; **2.** అనాదరం, ఉపేక్ష.

క. కీటు. అనాదరం.

**గీటడఁగించు** రూ.చూ. గీటణఁగించు, స.క్రి. **1.** చంపు, నశింపచేయు. భాగ. 10 పూ. 1166 ; **2.** ఓడించు, జయించు ; **3.** పొగరణచు. **గీటడఁగు** రూ. గీటణఁగు, అ.క్రి. **1.** చచ్చు, నశించు. భార. మౌసల. 108 ; **2.** పొగరణచు ; **3.** ఓడు. **గీటడఁచు** రూ. గీటణఁచు. స. క్రి. **1.** చంపు. భార. విరా. 5.331 ; **2.** ఓడించు ; **3.** పొగరణచు. **గీటణఁగించు** రూ. గీటఁడగించు. స.క్రి. **1.** చంపు, నశింపచేయు. భార. విరా. 2.135 ; **2.** ఓడించు, జయించు ; **3.** పొగరణచు. **గీటణఁగు** రూ.చూ. గీటడఁగు. అ.క్రి. **1.** చచ్చు, నశించు ; **2.** పొగరణచు ; **3.** ఓడు. **గీటణఁచు** రూ.చూ. గీటడఁచు, స.క్రి. **1.** చంపు ; **2.** ఓడించు ; **3.** పొగరణచు. **గీటునఁబుచ్చు(-వుచ్చు)** స.క్రి. **1.** అనాదరించు. ఉపేక్షించు. భార. విరా. 2.42 ; **2.** పోగొట్టు. భార.శల్య. 2.310. **గీట్పాటు** వి. **1.** దురదృష్టం; **2.** ఆపద.

**గీటుకంప** రూ.చూ. గీ్రటుకంప. వి. కళ్ళెంలో ఊడ్చడానికి కందిమండలతో కట్టిన చీపురు.

**గీట్పాటు** చూ. గీటు².

**గీ్రటుకంప** రూ. గీటు కంప. వి. కళ్ళెం ఊడ్చడానికి కంది మండలతో కట్టిన చీపురు.

**గీట్లబ్రద్ద** చూ. గీటు¹.

**గీట్లు** చూ. గీటు¹.

**గీంౖదు** వి. ప్రతిధ్వని.

**గీంౖదుమను** అ.క్రి. గింగురుమను. వేంక. పంచ. 4.433.

**గీఁటించు** చూ. గీఁటు.

**గీఁటు** స.క్రి. **1.** కన్నుగిలుపు. ఉ.హరి. 5.59 ; **2.** మీటు. శృం.నై. 1.17 ; **3.** కొట్టు. భాగ. 9.408 ; **4.** పళ్ళు కొరుకు. సిం.ద్వా. 8.26 ; **5.** చిమ్ము. వాశి.రా. 4.40 ; **6.** చీల్చు. దాశ. 33.

**గీఁటించు** స.క్రి. (పళ్ళు) కొరుకు. రా.గో.శ. 13.

**గీత** రూ.చూ. గీఁత. వి. **1.** రేఖ ; **2.** గీయటం ; **3.** అదృష్టం.

**గీతగుండంచు** వి. జమిలిపోగులతో నేసిన ఒకరకం అంచు. **గీతపని** వి. చెక్కమీదచేసే నగిషీపని. **గీతబద్ద** వి. గట్టితెరపిడతలకు అడుగుగీసే వెదురుబద్ద. **గీతబయటపడు** అ.క్రి. అదృష్టంకలుగు. **గీతబుడ్డి** వి. గీతలుపెట్టిన మట్టి బుడగ. **గీతముగ్గు** వి. వేళ్ళసందుల నుంచి ముగ్గుపిండి వదులుతూ గీసిన సమాంతర రేఖలు. **గీతలదువ్వెన** వి. కుండల నానేటప్పుడు గీతలుగీయటానికి వాడే దువ్వెన. **గీతవేయు** స.క్రి. పాత్రల మొకం దగ్గర అంచుకింద ఒక వేలెడు దూరంలో గోటితో గాని ఇనపబద్దతోగాని గీతలు గీయు.

**గీతగోవిందముపాడు** అ.క్రి. ఏడ్చు.

సం. గీతగోవింద-. జయదేవుని గ్రంథం, సంగీత ప్రధానమైన గ్రంథం.

<సం. గీతగోవింద-+పాడు (అర్థవిపరి.).

**గీది** రూ.చూ. గీదియ. వి. గీతపద్యం. ద. హిం.శా. సంపు. 10. శా.సం. 84. క్రి.శ. 1125.

**గీదియ** రూ. గీది. వి. వృత్తభేదం. ఎత్తుగీతి. కవిజనా. జాత్యధి. 20.

సం. గీతికా. పాట ; ప్రా. గీఇఆ, గీఇ, గీదిఆ. ఛందోవిశేషం, ఆర్యావృత్తభేదం ; పా. గీత, గీతక, గీతికా-. చిన్నపాట.

<ప్రా. గీదిఆ.

**గీదు** రూ.చూ. గీజు. వి. పీకులాట.

**గీదుపోరు** రూ. గీజుపోరు. అ.క్రి. పీకులాడు. విక్ర. 3.15.

**గిద్దాళి** చూ. గీత. వి. నోరు వెడల్పుగాఉండి పొట్టమీద గీత లేసి ఉండే మట్టిపాత్ర.

గీ(త రూ. గీత. వి. 1. రేఖ, గీటు ; 2. గీయటం ; 3. అనాదరం.

గీ(తకట్టియ రూ. గీ(తకట్టె. వి. వడ్లవాడు నాములు తీర్చటానికి ఉపయోగించే పనిముట్టు, కత్తికాను. గీ(తకట్టె రూ.చూ. గీతకట్టియ. వి. వడ్లవాడు నాములు తీర్చటానికి ఉపయోగించే పనిముట్టు, కత్తికాను. గీ(తకత్తి వి. ఈం(డ్రవాని కత్తి, గీతగీసే కత్తి. గీ(తగీసేకాలము వి. తాటిచెట్టు నుండి కల్లుతీయటానికి అనువైన కాలం.

గీపెట్టించు చూ. గీపెట్టు.

గీపెట్టు అ.(క్రి. 1. మొరపెట్టు. భాగ. 10 పూ. 468 ; 2. మోగు, ధ్వనిచేయు. పాండు. 3.182 ; 3. ఘీంకారం చేయు. అచ్చ.రా.యు. 322.

గీపెట్టించు న.(క్రి. మొరపెట్టించు. హ.న. 2.19.

గీవుడుచెక్క వి. ఇటుకబెడ్డను కోయటానికి వాడే కొయ్యకత్తి.

గీమాలు న.(క్రి. బతిమాలు, దేవురించు.

గీము వి. 1. ఇల్లు. చం(ద్రభా. 2.6 ; 2. నివాసం. ఉ.రా. 5.302.

నం. గృహ, గేహ. ఇల్లు ; (ప్రా. గిహ, గేహ ; జై. మహా. గేహ. ఇల్లు ; అ.మా. గిహం, గేహం, గేహ. ఇంటియజమాని ; పా. గహ, గిహ, గిహిన్. యజమాని. క. గిఱు. ఇల్లు, నివాసం ; మ. కిరియం. ఇల్లు.
<(ప్రా. గిహ-.

గీమువేల్పు వి. గృహదేవత, ఇలవేల్పు. అచ్చ.రా.బాల. 102.

గీయు న.(క్రి. 1. చివ్వు, చెక్కు. హర. 2.107 ; 2. గోకు. ఆము. 4.180 ; 3. గంట. మొ. నవి కొడువు మొ. వాటితో రాచు. మను. 4.115 ; 4. అరగదీయు. పాండు. 3.16 ; 5. బలపం మొ. వాటిపై గీచు ; 6. తాడిచెట్టు మొ. వాటిని గీయు.

క. గిచు, గీతగీచు ; కొడ. గిచ్. గీతలద్వారా గుర్తించు ; తు. కిరుని, గిరుని-. గీచు ; త. కిరు ; మ. కిఱుక ; కుఇ. గిర. గీత, గుర్తు ; పర్జి. గిర్.

గీర[1] వి. 1. గర్వం ; 2. నీరసం.

నం. గర్వ-. గర్వం.

గీర[2] రూ. గీరె[2]. వి. 1. బండి నడవడానికి ఆకులతో ఉన్న చక్రం ; 2. దబ్బారాట్నం ఇరుసుకు బిగించిన రేకుచక్రం.

గీర[3] రూ. గిర, గీరు, జీర. వి. 1. నేతలో సన్నగా గీతపెట్టినట్టు వేరే రంగుదారంతో నేయటం ; 2. కమ్మి నేతలో జానెడు పొడుగు చెరగునేసిన తర్వాత పెట్టిన జంటగీరలు.

గీరకట్టు వి. పంకాబట్టీలోని ఇనపపట్టాముక్క.

గీరచెక్క వి. రెండడుగుల పొడుగున్న చెక్కముక్క.

గీరంచుధోవతి రూ.చూ. గోరంచు ధోవతి. వి. గోరంచు పెట్టి నేసిన పంచె.

గీరంచుపంచె వి. గీరంచు పెట్టి నేసిన పంచె.

గీరజగింజలు రూ. చూ. గీరనగింజలు. వి.బ.వ. బాల(క్రీడా బాల్య విశేషం.

గీరవగింజలు రూ. గీరజగింజలు, గీరనంగింజలు. వి.బ.వ. బాల్య(క్రీడా విశేషం. కాశ. 3.33.

గీరనంగింజలు రూ.చూ. గీరనగింజలు. వి.బ.వ. బాల(క్రీడా విశేషం. కళా. 6.202.

గీరవుల్ల రూ.చూ. గీరుపుల్ల. వి. నేతనేసేటప్పుడు చెదిరిన పోగుల్ని సాపుచేసే పుల్ల.

గీరలంచు రూ. గీర్లంచు. వి. వరుసగా గీతపడేట్టు నేసిన అంచు.

గీరలువిడుచు రూ. గీర్లిడుసు. న.(క్రి. గీరలు పడేట్టు నేయు.

గీరా చూ. గిరదా. వి. గిరజా.

గీరు రూ.చూ. గీర[3]. వి. 1. నేతలో సన్నగా గీత పెట్టినట్టు వేరే రంగుదారంతో నేయటం ; 2. కమ్మినేతలో జానెడు పొడుగు చెరగునేసిన తర్వాత పెట్టిన జంటగీరలు.

గీరుకత్తి వి. కలపపుల్లలు చీల్చి సాపుచేసే కత్తి.

గీరుపుల్ల రూ. గీరవుల్ల. వి. నేతనేసేటప్పుడు చెదిరినపోగుల్ని సాపుచేసే పుల్ల.

గీరె[1] వి. మోటబావిగిలక.

గీరె[2] రూ.చూ. గీర[2]. వి. బండి నడవటానికి ఆకులతో ఉన్న చ(క్రం.

గీర్నామము రూ.చూ. గీఱునామము. వి. గోటితో గీరి తీర్చే బొట్టు. ఇందు. 1.20.

గీర్బొట్టు రూ. గీఱుబొట్టు. వి. గీరునామం. శృం.నై. 7.63, హర. 5.140.

గీర్లంచు రూ.చూ. గీరలంచు. వి. వరసగా గీతలు పడేట్లు నేసిన అంచు.

గీర్లిడుసు రూ.చూ. గీరలు విడుచు. న.(క్రి. గీరలు పడేట్టు నేయు.

గీఱ వి. గీత, రేఖ. వరాహ. 3.92.

క. గిఱు-. గీత, గుర్తు, రేఖ.

గీఱు అ.(క్రి. నాటు, గుచ్చుకొను. భార.భీష్మ. 2.398. న.(క్రి. 1. ఛేదించు. ఉ.హరి. 1.148 ; 2. భేదించు. నృసింహ. 1.95 ; 3. (పళ్ళతో) చీకు. ఆము. 6.17 ; 4. దువ్వు. హంస. 1.17 ; 5. గోకు.

కొడ. కిర్. చించు, చీల్చు ; తు. కిరుని ; త. కిరు. చించు, ఛేదించు, కోయు ; మ. కిఱు. పీలిక, తునక ; తొ. కిర్-. చింపు.

గీఱుకొను న.(క్రి. 1. గీరు ; 2. గోకు. గీఱుగాజు వి. ఒక విధమైన గాజు. గీఱుడు వి. 1. గోకుడు ; 2. ఛేదనం. గీఱునామము రూ. గీర్నామము. వి. గోటితో గీరి తీర్చే బొట్టు. విజయ. 3.13. గీఱుబొట్టు రూ.చూ. గీర్బొట్టు. వి. గీరునామం.

గీలెత్తు చూ. గీర[1]. అ.(క్రి. దిమ్మతిరుగు.

గీలు అ.(క్రి. (స్రవించు, కారు. ఆము. 4.

గీలుకొను రూ. గీల్కొను. అ.(క్రి. అభిముఖమగు. గీల్కొను రూ.చూ. గీలుకొను. అ.(క్రి. అభిముఖమగు.

గీలుకొలుపు రూ.చూ. కీలుకొలుపు. న.(క్రి. 1. పుష్పాదుల్ని ధరించు ; 2. పొందించు.

గీల్కొను చూ. గీలు.

గీల్కొలుపు రూ.చూ. కీలుకొలుపు. న.(క్రి. 1. పువ్వులు మొ. వాటిని పెట్టుకొను ; 2. పొందించు.

గీవు రూ.చూ. గిరవు. వి. 1. కుదువ, తాకట్టు ; 2. కానుక, ఉపాయనం.

గీస వి. వాటా, సగం వంతు.
గీసర వి. ఒకవిధమైన లేడి.
గుంయ్యిమను అ.క్రి. 1. సొమ్మసిల్లు ; 2. అధికారం తగ్గు.
గుక్క రూ.చూ. గ్రుక్క. వి. 1. నోరు పట్టినంత ద్రవం ; 2. శ్వాసకు శ్వాసకు మధ్యఉన్న కాలం.
గుక్కత్రిప్పుకొను అ.క్రి. ఆశ్వాసం పొందు. గుక్క విలువు అ.క్రి. 1. గుక్కపట్టు, శ్వాసబిగించి ఏడ్చు ; 2. ఊపిరి తిరగకుండా బిగపట్టు. గుక్కవట్టు రూ. గుక్క బట్టు. అ.క్రి. 1. గుక్కనిలువు, శ్వాసబిగించి ఏడ్చు ; 2. ఊపిరి తిరగకుండా బిగపట్టు. గుక్కబట్టు (-పట్టు) రూ.చూ. గుక్కపట్టు. అ.క్రి. పిల్లలు ఎక్కువగా ఏడ్చు, లేదా ఏడ్చినపుడు ఊపిరాడకుండు. గుక్కమిక్కను అ.క్రి. ఉక్కిరి బిక్కిరి అగు. గుక్కిరిమిక్కిరిలాడు అ.క్రి. ఉక్కిరి బిక్కిరి అగు. గుక్కిలి రూ.చూ. గ్రుక్కిలి. వి. 1. గొంతు ముడి ; 2. గుక్క, గుటక. గుక్కిళ్ళుమింగు రూ.చూ. గ్రుక్కిళ్ళు మింగు. అ.క్రి. సంకోచించు. గుక్కెడు విణ. గుక్కకొలది. < గుక్క + -ఎడు.
గుక్కిరిమిక్కిరిలాడు చూ. గుక్క.
గుక్కిలి చూ. గుక్క.
గుక్కిళ్ళుమింగు చూ. గుక్క.
గుక్కుమిక్కువక అవ్య. పలుకక, నోరెత్తకుండ. శుక. 3.275.
గుక్కుమిక్కుమనకుండా అవ్య. కాదనకుండా.
గుక్కెడు చూ. గుక్క.
గుగ్గళకడవ వి. పెళ్ళిళ్ళలో హోమం చేసేటప్పుడు వాడే మట్టి పాత్ర.
గుగ్గిలవడగ చూ. గుగ్గిలము.
గుగ్గిలవడిగి చూ. గుగ్గిలము.
గుగ్గిలవుచెట్టు చూ. గుగ్గిలము.
గుగ్గిలవు(జెట్టు చూ. గుగ్గిలము.
గుగ్గిలవువడిగ చూ. గుగ్గిలము.
గుగ్గిలపొడి చూ. గుగ్గిలము.
గుగ్గిలవ్వడిగ చూ. గుగ్గిలము.
గుగ్గిలము వి. 1. గుగ్గులు వృక్షపుబంక. అచ్చ.రా.యు. 438 , 2. గుగ్గులువు, గుగ్గిలం చెట్టు. హంస. 4.11 (Aegiceras Corniculatum).

నం. *గుగ్గుల-; గుగ్గులు-.*

క. *గుగ్గులు, గుగ్గిళ.* గుగ్గిలం చెట్టు ; త.మ. *కుంగిలియం ;*

< నం. గుగ్గుల-.

గుగ్గిలవడగ రూ.చూ. గుగ్గిలంపడిగె. వి. గణాచార్లకు గుగ్గిలంతో ధూపం వేయడానికి వాడే మట్టిపాత్ర. గుగ్గిల వడిగి రూ.చూ. గుగ్గిలంపడిగె. వి. గణాచార్లకు ధూపం వేయడానికి వాడే మట్టిపాత్ర. గుగ్గిలవుచెట్టు రూ.చూ. గుగ్గిలవు(జెట్టు. వి. వంటచెరకుగా ఉపయోగపడే ఒకఅంద మైనచెట్టు (Aegiceras Corniculatum). గుగ్గిలవు(జెట్టు (-చెట్టు) రూ. గుగ్గిలవుచెట్టు. వి. గుగ్గులువు, గుగ్గిలం చెట్టు. గుగ్గిలవువడిగ రూ.చూ. గుగ్గిలం పడిగె. వి. గణాచార్లకు ధూపం వేయడానికి వాడే మట్టి పాత్ర. గుగ్గిలపొడి వి. గుగ్గిలవుపొడి. గుగ్గిలవ్వడిగ రూ.చూ. గుగ్గిలంపడిగె. వి. గణాచార్లకు ధూపం వేయడానికి వాడేమట్టిపాత్ర. గుగ్గిలంపడిగె రూ. గుగ్గిలపడగ, గుగ్గిలపడిగి, గుగ్గిలవుపడిగ, గుగ్గిలప్పడిగ, గుగ్గిళపడిగ. వి. గణాచార్లకు గుగ్గిలంతో ధూపం వేయడానికి వాడే మట్టిపాత్ర.
గుగ్గిలంపడిగె చూ. గుగ్గిలము.
గుగ్గిళ్ళగంప చూ. గుగ్గిళ్ళు.
గుగ్గిళ్ళు రూ. గుగ్గెళ్ళు. వి.బ.వ. అభ్యూషం, ఉడికిన గుగ్గిళ్లు. బహుళా. 5.163.

క. *గుగ్గరి, గుగ్గురి, గుగ్గి.* ఉడికిన అనుములు ; తు. *గుగ్గురి.*

గుగ్గిళ్ళగంప వి. పంటసమయంలో చెల్లించే పన్ను.
గుగ్గీళవడిగ రూ.చూ. గుగ్గిలంపడిగె. వి. గణాచార్లకు గుగ్గిలంతో ధూమం వేయడానికి వాడే మట్టిపాత్ర.
గుగ్గెళ్ళు రూ.చూ. గుగ్గిళ్లు. వి.బ.వ. గుగ్గుళ్ళు, పశువులకువేసే దాణా, ఉడకబెట్టిన దినుసు.
గుంగుకూర వి. నారకోసం పెంచబడే ఒకరకం మొక్క (Hibiscus Cannabinus).
గుంగురు వి. ఎద్దుమెడ మువ్వ, పెద్దసైజుగజ్జె.
గుచ్చం వి. నాలుగు పోగుల ఉన్నిదారం.

నం. *గుచ్ఛ-.* పూలగుత్తి, పొద. సమూహం.

< నం. గుచ్ఛ - (అర్థవివరి.).

గుచ్చలి రూ.చూ. కుచ్చలి. వి. పాలివికూర.
గుచ్చిక్కుడు రూ.చూ. గుత్తిచిక్కుడు. వి. గోరుచిక్కుడు.
గుచ్చు రూ.చూ. గ్రుచ్చు[1]. స.క్రి. కూర్చు, నాటించు.
గుచ్చుకొను స.క్రి. నాటుకొను. గుచ్చుగర్ర (-కర్ర) వి. బద్దె గుచ్చుకర్ర, అచ్చుతికిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్నబెత్తం.
గుజగుజ వి. 1. గుసగుస. బసవ. 5.51 పం ; 2. గజిబిజి ; 3. తొక్కులాట, గులగుల ; 4. అదుముడు. విణ. బాధించ బడ్డ.

క. *గుజు-.* గుసగుసలకు అనుకరణ శబ్దం ; *గుజుగుజు-.* గుసగుస.

గుజగుజగుంపు వి. 1. గుసగుస. కువ.చ. 4.142; 2. అడావడి. లక్ష్మి. వి. 1.114. గుజగుజగుంపుపెట్టు అ.క్రి. అల్లరిపెట్టు. ద్వి. భాగ. 2.38 ప. గుజగుజవడు అ.క్రి. రహస్య మంతనాలాడు. గుజగుజపోవు రూ.చూ. గుజగుజ వోవు. అ.క్రి. రహస్య మంతనాలాడు. గుజగుజయగు (-అగు) అ.క్రి. బాధపడు, గిజగిజలాడు, తహతహలాడు, విలవిల్లాడు, గజిబిజిఅగు. హర. 3.10. గుజగుజరేకులు రూ. గుజగుజతేకులు. వి.బ.వ. బాలికా క్రీడా విశేషం. హంస. 5.155. గుజగుజతేకులు రూ.చూ. గుజగుజ రేకులు. వి.బ.వ. బాలికా క్రీడా విశేషం. దశా. 8.81. గుజగుజలాడు అ.క్రి. 1. గుసగుసలాడు. భార. విరా. 2.146 ; 2. గజిబిజిపడు, తొక్కులాడు. ద్వి. హరిశ్చ. పూ. 223 పం. గుజగుజలు వి.బ.వ. 1. గుస గుసలు ; 2. ఇక్కట్లు. గుజగుజలువోవు (-పోవు) అ.క్రి. గుసగుసలుపోవు, గుసగుసలాడు. భార. విరా. 2.201.

గుజగుజపోవు (-పోవు) రూ. గుజగుజపోవు. అ.క్రి. గునగున లాడు, గునగునలుపోవు. భాగ. 10 ఉ. 376.

గుజగుంపు వి. 1. గునగున. కువ.చ. 4.142. 2. అడావుడి. లక్ష్మి. వి. 1.114.

గుజగుంపుపెట్టు స.క్రి. అల్లరిపెట్టు. ద్వి. భాగ. 2.38 వ.

గుజరాతి రూ. గుజరీ, గుజ్జరాతి, గుజ్జరి, గుజ్జరీ. వి. 1. ఘూర్జరదేశం. రం. రా. బాల. 73 వ. 17 పం; 2. నాట్యభేదం. ఉ.రా. 4.175; 3. ఘూర్జరదేశభాష. యయా. 1.47.

క. గుజరాథ-. గుజరాత్‌లోని జిల్లా; గుజ్జరి.

సం. ఘూర్జర-. గుజరాత్ రాష్ట్రం.

గుజరావాయిచ్చు అ.క్రి. భరణమిచ్చు.

హిం. ఉ. గుజ్‌రానా, గుజ్‌రాన్. నిర్వాకం; గుజారా. జీవన నిర్వాకం.

<ఉ. గుజ్‌రానా + ఇచ్చు.

గుజరాని రూ.చూ. గుజరాను. వి. వృత్తి, జీవనం.

గుజరాను రూ. గుజరాని. వి. అర్పణం, ఇవ్వటం, సమర్పణ.

హిం. గుజరాన్. గతి, చేరు, ప్రదేశం, నిర్వాహం; ఉ. గుజ్‌రాన్. నిర్వాహం, ప్రదేశం, చేరు; పార. గుజరాన్. ప్రవేశించు, జీవిక, ఉద్యోగం; గుజ్‌రాన్ చన్. బహూకరించు.

<ఉ. గుజ్‌రాన్.

గుజరానుపఱచు రూ. గుజరానువఱచు. స.క్రి. 1. కానుకఇచ్చు, సమర్పించు, గుజరాయించు. రంగా. చ. 2.85; 2. వెళ్ళబుచ్చు, దాటించు, ఈగిచేయు. గుజరానువఱచు (-వఱచు) రూ.చూ. గుజరానుపఱచు. స.క్రి. 1. కానుక ఇచ్చు; 2. దాటించు.

గుజరాయించు స.క్రి. 1. గుజరానుపరచు, ఈగిచేయు, సమర్పించు, ఇచ్చు. రంగా. చ. 2.146; 2. శిస్తుకట్టు; 3. వెళ్ళబుచ్చు.

హిం. గుజ్‌రానా, గుజరానా-. కడపటం, చేరటం, ఎదుటఉంచు; ఉ. గుజ్‌రానా-. ఎదుటఉండు.

క. గుజరాయిసు-. ఇచ్చు.

<ఉ. గుజ్‌రా (నా) + -ఇంచు[3].

గుజరి వి. 1. ఒకరకం జాజిపూవు; 2. చీకటివేళ, రాత్రులు తెరిచేఅంగడి, దొంగబజారు.

క. గుజ్జిగె. ఒకరకం జాజిపూవు.

గుజరీ రూ.చూ. గుజరాతి. వి. 1. గుజరాతి. శుక. 1.133; 2. సంతదోటు; 3. చీకటివేళ, రాత్రులుతెరిచేఅంగడి, దొంగబజారు; 4. నాట్యభేదం.

గుజస్తా రూ. గుదసా. వి. గతసంవత్సరం. విణ. గడిచిపోయిన, వెనుకటిసాలుకు సంబంధించిన.

హిం. గుజిస్తా-. గడచిన.

ఉ. గుజ్‌శ్తహ్-. గడచిన, వ్యతీతం; పా.గుజాష్తహ్-. పూర్తయిన, గతించిన, భూతకాలం.

<ఉ. గుజశ్తహ్.

గుజాడి రూ. గుజారి, గుజాటి. వి. 1. ధనవంతుడు; 2. అచ్చుకుప్ప.

గుజారతు[1] వి. సంతదోటు.

క. గుజరి-. సాయంత్రం, సంత.

గుజారతు[2] వి. వశం, లోకువ.

గుజారా ప్రత్య. ద్వారా, చేత.

హిం. ఉ. గుజారా. నిర్వాకం, జీవనభృతికైనవృత్తి.

<ఉ. గుజారా.

గుజారి రూ.చూ. గుజాడి. వి. 1. ధనవంతుడు; 2. అచ్చుకుప్ప.

గుజాటి రూ.చూ. గుజాడి. వి. 1. ధనవంతుడు; 2. అచ్చుకుప్ప.

గుజి రూ.చూ. గుది[1]. వి. 1. నూరుతెక్క; 2. దారంనూలు.

గుజికొయ్య వి. గుజిమాకులోని రంధ్రాల్లోదూరి దారికడ్డంగా ఉండేకర్ర.

గుజిదూలం వి. కొమరమీద బిగించే పిల్లదూలం.

గుజిపీవేళ వి. నలుగురూఒకచోట చేరే సమయం.

గుజిమాకు వి. దడివాకిలి ఇరువైపులాపాతిన మాను.

గుజిరీ రూ. గుజిలి. వి. 1. సంతదోటు; 2. చీకటిబజారు, దొంగబజారు.

గుజిరీఅంగడి వి. బజారుస్థలం, సాయంత్రం తెరిచే అంగడి, దొంగబజారు.

గుజిలి రూ.చూ. గుజిరీ. వి. 1. సంతదోటు; 2. చీకటిబజారు, దొంగబజారు.

గుజిలీబజారు చూ. గుజిలి. వి. నిత్యావసరాలకు కావలసిన సామాను అమ్మే అంగడివీథి.

గుజివడ్లు వి.బ.వ. తెలంగాణాలో పండే ఒకరకం వడ్లు.

గుజురు రూ. గిజరు, గిజురు. వి. 1. పేశం, బేశం; 2. విత్తనం, గింజ, గుంజు, గుజ్జు, గిజురు.

క. కుసురి, కుసురు. గుజ్జు; తు. కుసి.

గుజ్జంగి రూ.చూ. గొజ్జంగ. వి. సుగంధతైలం కోసంపెంచే ఒకరకం గడ్డిమొక్క.

గుజ్జన చూ. గుజ్జు[2]. విణ. పసిపిల్లలకు సంబంధించిన.

గుజ్జనగుళ్లు రూ.చూ. గుజ్జనగూళ్లు. వి.బ.వ. గుజ్జనగూళ్ళు. గుజ్జనగూడు పిడతలు చూ. గుజ్జు[2]. వి.బ.వ. ఆడపిల్లలు ఆడుకొనే చిన్నసైజు మట్టిగురిగలు. గుజ్జనగూళ్లు రూ.చూ. గుజ్జనగూళ్లు. వి.బ.వ. 1. బాలికలు బొమ్మలుపెట్టి ఆడుతూ వండే వంటకం. యయా. 3.157; 2. బాల్యక్రీడా విశేషం.

గుజ్జరాతి రూ.చూ. గుజరాతి. వి. 1. ఘూర్జరదేశం, గుజ్జరి; 2. ఘూర్జర దేశభాష; 3. నాట్యభేదం.

గుజ్జరి రూ.చూ. గుజరాతి. వి. 1. రంగుల్లో ఒకటి. కవిక. 3.195; 2. రాగభేదం. ప్రబంధ 95; 3. ఘూర్జరదేశం. ఉ. రా. 6.160. వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

గుజ్జరిదుముకు వి. మల్లయుద్ధవిశేషం. గుజ్జరివాడు వి. ఘూర్జరదేశస్థుడు. ఆం. భా. 2.103.

గుజ్జరీ రూ.చూ. గుజరాతి. వి. 1. ఘూర్జరదేశం; 2. రంగుల్లో ఒకటి; 3. రాగభేదం.

గుజ్జలిపార వి. పికాసిపార, మన్నుతవ్వడానికి, చెట్లునరకడానికి

ఉపయోగించే పనిముట్టు.

గుజ్జు[1] వి. 1. కోడెదూడ. భార. శాంతి. 4.40; 2. పొట్టి కొయ్య. ఆం. భా. 2.233; 3. పొట్టిఎద్దు. విశ. పొట్టి. భార. అను. 5.104.

సం. కుబ్జ-; ప్రా. కుజ్జ-.

క. గుజ్జు. పొట్టిదనం; కొడ. కుర్స్; త. కుఱళన్. పొట్టివాడు, మరుగుజ్జు; మ. కుఱుక, కుఱళన్.

<ప్రా. కుజ్జ-.

గుజ్జుకొమ్మ వి. పొట్టికొమ్మ. గుజ్జుకొమ్ములు వి.బ.వ. వెనక్కువాలి కొనలుకలిసిన కొమ్ములు. గుజ్జుది విశ. పొట్టిది. గిడసది. గుజ్జు(దనము (-తనము) వి. కుబ్జత్వం. గుజ్జుపొట్ల వి. పొట్టికాయలు కాచేపొట్ల. గుజ్జుప్రాలు వి. ఒకజాతిబియ్యం. గుజ్జుమామ వి. పొట్టిచెట్టు. గుజ్జుమామిడి వి. పొట్టిరకం మామిడి, రాజాత్రం. పి. శకు. 4.4. గుజ్జుముగరం వి. పొట్టిగాఉన్న కొయ్యస్తంభం. గుజ్జుమెఖకరి వి. పొట్టి, వడుగు, వామనుడు. గుజ్జుమొలకలు వి.బ.వ. ఒకజాతిమోటు వడ్లు. గుజ్జురోక వి. పొట్టిగాఉండే రాకబద్ద. గుజ్జువా(డు వి. పొట్టిదేవుడు, వామనుడు, గణపతి. గుజ్జువేలుపు రూ. చూ. గుజ్జువేల్పు వి. విఘ్నేశ్వరుడు. రామలిం. శ. 1. గుజ్జువేల్పు రూ. గుజ్జువేలుపు. వి. విఘ్నేశ్వరుడు. భీమ. 3.184. గుజ్జువేల్పుతండ్రి వి. శివుడు. గుజ్జుసైదోడు వి. కుమారస్వామి. వ్యు. గణపతితోబుట్టువు.

గుజ్జు[2] రూ. గూజు. వి. 1. కొవ్వు, వస. కాశీ. 3.32; 2. అనుకయినరసద్రవ్యం. శ్రీరం.మా. 6.103; విశ. చిక్కని. శృం.నై. 6.120; 3. మెత్తగా ఉండే పదార్థం.

గుజ్జువారికెడము వి. ఒకరకం కొబ్బరిచెట్టు. గుజ్జువోగిరము వి. వులుసుకలిపిన అన్నం. బసవ. 3.426 పం. <గుజ్జు +ఓగిరము.

గుజ్జు[3] రూ.చూ. గురుజు. వి. 1. కామిరె, నిలువుగుంజ, దోర్న ప్పట్టె కాధారంగా ఉండే నిలువుగుంజ; 2. కామిరెసిడె (ఏతవుమాను)కు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య; 3. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో దూర్చిన కొయ్యముక్క; 4. కొడతం, ఒంటి వలుగు గుంటకకు నాగల బదులు అమర్చిన రెండడుగుల పొడు గున్న కర్రముక్క; 5. ఒసి, బండిజల్ల వక్కకు తొలగ కుండా ఉండడానికి బండి చట్రపు నిలువు పట్టెలకు బిగిం చిన కర్ర; 6. పొగగూడు నిర్మాణంలోని నిలువు ఇటిక.

గుజ్జుగంబం(-కంబం) వి. సిడె (ఏతవుమాను)కు ఆధా రంగా నేలలోపాతిన నిలువుకొయ్య. గుజ్జుదూలం వి. పిల్ల దూలం, దూలానికి సమాంతరంగా, గుజ్జులమీదవేసే చిన్న దూలం. గుజ్జువరం వి. గూటాలు నాట్లు, మొదలైన వాటితో కూడిన చట్రం. గుజ్జుపీట రూ.చూ. గురుజుపీట. వి. గుజ్జు బరువు, గుజ్జులమీద బిగించిన పీట. గుజ్జుబరువు వి. గుజ్జుల మీద బిగించిన పీట. గుజ్జుబొంద వి. ఒసికర్ర వెయ్య టానికి పారుపట్టెకు తొలిచిన బెజ్జం. గుజ్జులకడ్డీ రూ.చూ. గురుజులకడ్డీ. వి. దొడ్డికడ్డీ. గుజ్జులమీద బిగించే అడ్డకర్ర. గుజ్జులచట్రం వి. గుజ్జులతో కూడిన ఇంటిచట్రం. గుజ్జుల పట్టి వి. డొంకిపట్టి, కోడిపీటల బండికి గలరెండవ దిండు.

గుజ్జులపీ(ట వి. గుజ్జులపట్టి, గుజ్జులమోదం, పరంమీద ఉండే వంపు కొయ్యమొద్దు. గుజ్జుల మోదం వి. గుజ్జులపీట, పరంమీద ఉండే వంపుకొయ్య మొద్దు. గుజ్జువన్నెకోమలి వి. దక్కను, కర్ణాటకల్లో పెరిగే ఒక మొక్క, పొడవైన కొమ్మలు కలిగి తెల్లనిపూలుపూస్తుంది (Boerhallia Verticillata).

గుజ్జెకుక్క రూ.చూ. గుర్జికుక్క. వి. కుచ్చికుక్క.

గుజ్జెడ వి. దోనెగాడిలో, బద్దెచువ్వ బిగించటానికి, వుల్లకు కట్టిన తాడు.

గుజ్జెన విశ.పసితనపు, బిడ్డలకు సంబంధించిన. వి. ఆకులబుట్ట.

గుజ్జెనగూడు(-కూడు) వి. 1. బాలికలు బొమ్మలుపెట్టి ఆడు కొనేటప్పుడు వండే వంటకం. ఆం.భా. 2.257; 2. బాలిక లాడుకొనే ఒకఆట. గుజ్జెనగూళ్లు రూ. గుజ్జనగుళ్లు, గుజ్జన గూళ్లు. వి.బ.వ. 1. బాలికలాడుకొనేటప్పుడు గురుగులతో వండిన వంటకం. భాగ. 10 పూ. 1688; 2. బాలికల క్రీడా విశేషం. కళా. 6.20; 3. నెలల పిల్లలకు అను కూలంగా గుజ్జువలె వండిన వంటకం.

గుజ్జేరికుక్క రూ.చూ. గుర్జికుక్క. వి. కుచ్చికుక్క.

గుంచిప్ప రూ. గుంజిప్ప. వి. గుండ్రంగాఉండే మట్టిచిప్ప.

గుంజ[1] వి. 1. స్తంభం, కట్టుగొర్రు, గూటం. ప్రబంధ. 622; 2. రాట్నంయొక్క అవయవం. శుక. 2.416; 3. కామిరి.

క. కూచు, కూచ. దూలానికి ఆధారంగా గోడలో పాతిన గుంజ; గుజ్జు; తు. గుజ్జి, గుజ్జు. నీటిలో పాతిన గుంజ, లేదా కొయ్య; త. కూచ్చం. కట్టడంలో ఉపయోగించే చిన్నసైజు గుంజ.

గుంజకేయు స.క్రి. తడిసిన నూలులడీలు, కాని గుంజ అడ్డకట్టెకు తగిలించి పిండు. గుంజగొలుసు వి. పడుగు చాపే టప్పుడు, గురిగుంజకువేసి పడుగేరే కర్రకు తగిలించే ఇనప పనిముట్టు. గుంజలపీట వి. 1. రాట్నం నిలువులు బిగించిన అడుగుపీట; 2. దబ్బారాట్నం తొక్కుడు పీటకు ఎడమవైపు బిగించిన చిన్న పట్టె; 3. దబ్బారాట్నం నిలు వులు బిగించిన కింది పీట.

గుంజ[2] వి. పాటల వర్ణపు పూలుపూసే ఒకతీగ. గురివింద తీగ, దీని గింజల్ని స్వర్ణకారులు తూకపు కట్టెలుగా వాడతారు (Abrus precatorius).

గుంజమసకు రూ.చూ, గుంజనున(గు. స.క్రి. ఎగతాళిచేయు, వి. ఎలుగుగొడ్డాట.

గుంజమసు(గు రూ.చూ. గుంజునును(గు. స.క్రి. పరిహాసం చేయు. వి. ఎలుగుగొడ్డాట.

గుంజమ్మ వి. ఒకతిట్టు.

గుంజర వి. తుంగజాతి కలుపుమొక్క.

గుంజలిపెట్టు స.క్రి. దాచు, మరుగుపెట్టు.

గుంజా వి. ఒకవిధమైన రంగు.

సం. గుంజా. గురివెంద.

<సం. గుంజా (అర్థవిపరి.).

గుంజాచీరెలు వి.బ.వ. వస్త్ర విశేషం.

గుంజాటవ వి. 1. వ్యసనం; 2. ఈగులాట; 3. ఆరాటం; 4. ఆవేదన.

నం. గుంజా-. అవ్యక్త మధురధ్వని. తప్పెట. అటన-. తిరగటం.

గుంజాటము చూ. గుంజాటన. వి. లంపటం, తగులం.

గుంజాయించు స.క్రి. 1. వెనుకకు ముందుకులాగు ; 2. సందేహించు.

హిం.ఉ. గుంజాయిస్. అవకాశం.

గుంజాయిషీ రూ. గుంజాయిషు. వి. 1. అవకాశం ; 2. లాభం ; 3. లోపం.

హిం. గుంజాఇశ్-. పీలుపట్టటానికి తావు ; మరా. గుంజాయిష్-ఉత్పన్నం, వైభవం ; ఉ. గుంజాఇశ్-. విస్తారం, సామర్థ్యం ; పార. గుంజాయిష్-. సామర్థ్యం, లాభం, అవకాశంగల చోటు ; అర. కుంజాయిష్-. సామర్థ్యం, అవకాశం ;

<ఉ. గుంజాఇశ్.

గుంజాయిషు రూ.చూ. గుంజాయిషీ. వి. అవకాశం, తెరపి.

గుంజి వి. గృహోపకరణాలకు ఉపయోగపడే కలపనిచ్చే అందమైన చెట్టు, చిల్లచెట్టు (Glycormis pentaphylla).

గుంజికొను చూ. గుంజు1.

గుంజిగాఁడు వి. పనికిమాలినవాడు.

గుంజిచిప్ప రూ.చూ. గుంచిప్ప. వి. గుండ్రంగాఉండే మట్టిచిప్ప.

గుంజిలి[1] వి. గోపనం, దాపరం ; 2. గుంపులు.

గుంజిలిపెట్టు[1] స.క్రి. 1. గోపనంచేయు, దాచు. వేంక. పంచ. 4.469 ; 2. గుంజిళ్ళుతీయు ; 3. చెప్పిన పనులన్నీ చేయు.

గుంజిలి[2] వి. చేతులుకట్టుకొని రెండు కాళ్ళు చేర్చి పెట్టి కూర్చుండి లేవటం. సాంబ. దేవ. 2.

గుంజిలిపెట్టు[2] అ.క్రి. గుంజిళ్లు తీసేవాడివలె పైకిపోతూ కిందికి వస్తూఉండు. వాల్మీ. 3.81. గుంజిళ్లు రూ. గుంజీలు. వి.బ.వ. గిడిగిళ్ళు. గుంజిళ్లతీయు అ.క్రి. గుంజీలుతీయు. గుంజిళ్లపెట్టించుకొనువేల్పు వి. గణపతి. గుంజిళ్లపెట్టు అ.క్రి. గుంజిళ్లుతీయు. గుంజీలు రూ.చూ. గుంజిళ్లు. వి.బ.వ. గుంజిళ్ళు.

గుంజిళ్లు చూ. గుంజిలి[2].

గుంజీలు చూ. గుంజిలి[2].

గుంజు[1] స.క్రి. 1. బట్టఉతికినట్లు కొట్టు. కాశీ. 3.157 ; 2. ఉతుకు. భోజ. 4.145 ; 3. (వల మొ. వాటిని) జాడించు. కాశ. 4.96 ; 4. లాగు. హరిశ్చ. 4.162.

క. గుంజు. లాగు ; గోం. గుంజానా.

గుంజికొను స.క్రి. లాగికొను, అంకించు. గుంజుకపోవు అ.క్రి. బక్కటిల్లు. స.క్రి. పట్టుకొనిపోవు. గుంజుకొను స.క్రి. 1. లాగుకొను ; 2. రోషపడు. గుంజుడుగొయ్య(-కొయ్య) వి. కట్టుడు కొయ్య, మిడిగూటానికి వేసిన నేతమోకు, వడుక్కు అడ్డురాకుండా తగిలించటానికి పాతిన గూటం. గుంజుడుబావి వి. చేదుడుబావి. చుట్టుగోడఉన్న బావి. గుంజునుసుకు రూ.చూ. గుంజునుసుఁగు. స.క్రి. గేలిచేయు. వి. ఎలుగుగొడ్డాట. గుంజునుసుఁగు రూ. గుంజనుసుకు, గుంజనుసుఁగు, గుంజునుసుకు. స.క్రి. పరిహసించు. వి. ఎలుగుగొడ్డాట గుంజుపిట్ట వి. 1. పిల్లలదాజు ; 2. ఒక జాతి పక్షి. గుంజుపిడి వి. లాగడానికి పీలయ్యేపిడి. గుంజులాడు అ.క్రి. పెనగులాడు, లాగులాడు, అల్లిబిల్లికొను.

గుంజు[2] చూ. గుజ్జు[2]. వి. 1. ఈతచెట్టు, తాడిచెట్టు మొ. వాటి మొవ్వ. కాశ. 3.151 ; 2. తాళపేశం, బుర్రగుంజు. ఆం.భా. 2.77 ; 3. పళ్ళు మొ. వాటిలో ఉండే గుజ్జు ; 4. మెదడు.

గుటక రూ.చూ. గుటుకు. వి. 1. ఒకసారి నోటపోనుకొని మింగే నీళ్ళలోనగువాటి కొలది ; 2. ఒక్కసారిగా మింగటం.

గుటకలుమ్రింగు అ.క్రి. గుటకలువేయు, ఉవ్విళ్ళూరు. గుటకలువేయు అ.క్రి. ఉవ్విళ్ళూరు, తమకించు, ఎంతో ఆశించు.

గుటకాయస్వాహాచేయు స.క్రి. అపహరించు, మింగివేయు.

'గుటక' శబ్దాన్ని సంస్కృత పదంగా భావించి 'నమః స్వస్తిస్వాహాస్వధాలం వషడ్యోగాచ్చ' (2-3-16) అనే సూత్రప్రకారం 'గుటకాయస్వాహా' అని కల్పించారు.

గుటగుట[1] రూ. ఘుటఘుట. వి. 1. వ్యాఘ్రం, భల్లూకం. వరాహం మొ. చేసే ధ్వని విశేషానికి అనుకరణం. వరాహ. 7.80 ; 2. అన్నం ఉడకటం, నీళ్ళు తాగటం మొ. వాటి ధ్వనికి అనుకరణం.

క. కుడుకు, గుటుకు, గుటుకు. గుటక; కొడ. గుడర్స్. గుటక ; తు. గుటుక, గుటుకు ; త. కుడుకుడు. గుటగుట ; తా. కొడ్క్-. ధ్వన్యను.

గుటగుటమను అ.క్రి. సంకోచం కలుగు. గుటగుటలు వి.బ.వ. 1. వ్యాఘ్రాదుల ధ్వనికి అనుకరణం. వరాహ. 3.26 ; 2. పెద్దరికపు మాటలు. మను. 5.16 ; 3. గుడగుడలు.

గుటగుట[2] వి. అవమానం.

గుటాయించు స.క్రి. కొయ్య సాధనాలతో మెల్లగా కొట్టు, బాదు.

గుటిక వి. సీటమునిగి లేవటం, బుటక.

గుటికె వి. పికాసి, మరమగ్గంనాడెను, ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలవటానికి అమర్చిన కొయ్యగిలక.

నం. గుటికా-. గుండ్రటివదార్థం.

<నం. గుటికా. (అర్థవిపరి.).

గుటికెతాడు వి. పికాసితాడు, మగ్గంపికాసికి బొమ్మకూ కట్టిన దారం.

గుటుకు రూ. గుటక, గుటుక్కు, గుడుక్కు. వి. మింగేటప్పుడు అయ్యేధ్వనికి అనుకరణం. హర. 6.69.

క. కుటుకు, గుటుక, గుటుకు. గుటక ; కొడ. గుడక్స్ ; తు. గుటుక, గుటుకు ; తా. కుడ్క్.

గుటుకుగుటుకు రూ.చూ. గుటుగుటుకు. వి. తాగటంలోనూ, మింగటంలోనూ అయ్యేధ్వనికి అనుకరణం.

గుటుకుమనుచుమ్రింగు స.క్రి. ఒక గుక్కతో మింగు.

గుటుక్కుమ చూ. గుటుక్కు.

గుటుక్కు రూ.చూ. గుటుకు. వి. మింగటం, తాగటంలో అయ్యేధ్వనికి అనుకరణం. నరస. 5.130.

గుటుక్కుమ అ.క్రి. చచ్చు, కీటడగు ; స.క్రి. నమలకుండ మింగు. గుటుక్కున అవ్య.క్రియా. ఒక్కగుక్కలో. గుటుక్కుమను అ.క్రి. చచ్చు.

గుటుగుటుకు చూ. గుటుకు. రూ. గుటుకుగుటుకు. వి. తాగటంలోనూ, మింగటంలోనూ అయ్యేధ్వనికి అనుకరణం. భాగ. 10 పూ. 225.

గుట్కటికె వి. జొన్నసంగటిచేయడానికి వాడే మట్టిపాత్ర.

గుట్ట[1] రూ. కుట్ట[1]. వి. 1. ఉపలరాశి, రాతిగుట్ట. రామాభ్యు. 7.122; 2. పర్వతం. చంద్రాంగ. 2.45; 3. రాశి, పోగు. దశా. 6.137 ; 4. మోటబావి, కుంట మొ. వాటినుంచి నీళ్ళుతోడి పోసేవైపు ఎత్తుగా కట్టినకట్ట.

క. గుడ్డ, గుడ్డు. పర్వతం ; కొడ. గుడ్డె. రాశి ; తు. గుడ్డె. కొండ ; కొంర. గుడ్డె. రాశి, కుప్ప ; గుట్ట, గుట్టె, మిట్ట.

సం. గోత్ర-. పర్వతం ; ప్రా. కోడ.

గుట్టకూలు అ.క్రి. 1. ఒక్కుమ్మడికూలు, చచ్చు, గుట్టగాపడు, పూర్తిగా పడిపోవు ; 2. పాడుచేయు. గుట్టకూల్చు స.క్రి. చంపు, నశింపచేయు, పాడుచేయు. గుట్టజాలు వి. కొండవాగు, సెలయేరు. గుట్టపొదలు వి.బ.వ. మెట్టమీది పొదలు. గుట్టరాతి వి. ఉత్తరాతి, గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. గుట్టవరద వి. కొండవాగు, సెలయేరు. గుట్టవఱ్ఱు వి. కొండవాగు, సెలయేరు. గుట్టవాగు వి. కొండవాగు, సెలయేరు.

గుట్ట[2] విశే. భీరువు, అకుకువాడు. ఆం.భా. 3.53.

గుట్టిచ్చు చూ. గుట్టు.

గుట్టీక చూ. గుట్టు.

గుట్టు వి. 1. మోసం, వంచన. యయా. 3.123 ; 2. ధైర్యం. రాజ.చ. 3.73 ; 3. రహస్యం. దశా. 7.60 ; 4. ఆయం, జీవస్థానం.

క. గుట్టు. రహస్యం, లోపలి ఆలోచన, సొంత విషయాలు ; కొడ. గుట్టి. రహస్యం ; తు. గుట్టు. రహస్యం ; త. కుట్టు. రహస్యం ; తొ. కుట్. రహస్యం.

గుట్టిచ్చు స.క్రి. మర్మం తెలుపు. గుట్టీక అవ్య. మనసులోని బాధ ఇతరులకు తెలియనీక. పాండు. 3.24. గుట్టుకీడు వి. గూఢ శత్రువు. ఆము. 4.250. గుట్టుకోల్పడు అ.క్రి. బయట పడిపోవు, కొంచెపడు, పారి. 1.127. గుట్టుగైకొను(-కైకొను) స.క్రి. రహస్యం ఎరుగు. గుట్టుచప్పుడు కాకుండా క్రి విశే. రహస్యంగా, ఎవరికీ తెలియకుండా. గుట్టుచెడు అ.క్రి. ధైర్యంచెడు. రాజవా. 5.32. గుట్టువ(బో)విచ్చు స.క్రి. ఊరకే అల్లరి లేకుండా వదిలిపెట్టు. నిరంకు. 3.15. గుట్టుపట్టు వి. హృదయం, గుండె. ఉ. హరి. 4 44. గుట్టుబిట్టాడు అ.క్రి. క్రక్కదలు, మిక్కిలి కదలు. గుట్టుమట్టు వి. లోతుపాతు, రహస్యం, ఆంతర్యం. గుట్టు(బేడు(-పేడు) వి. రాజమంత్రం బయటపడటం. ఆము. గుట్టుపీడు అ.క్రి. బయల్పడు. రాజ.గో. 2.68. గుట్టుపాకిరి వి. ప్రతివాది యొక్క సాక్ష్యమంతా పొందివుండి రహస్యంగా విన్న సాక్షి.

గుత్రాయి వి. 1. కండెరాయి, ఇది 'మేగ్నటైట్' అని సాంకేతికంగా పిలవబడే నల్లని ఇనప ఖనిజంతో కలిసిన క్వార్ట్జ్ రాయిభేదం ; 2. ఉత్తరాతి, గోడల కట్టుబడికి పనికి వచ్చే రాయి.

గుడ వి. ఉన్నిదారం ఉండ, రంగు అద్దిన ఉన్నిదారం కట్ట.

గుడక రూ. కుడక. వి. 1. టెంకాయచిప్ప, కొబ్బరిచిప్ప, కొబ్బరిపెంకు ; 2. అల్పిప్ప, ఉగ్గుచిప్ప.

క. కుడికె. కఱ్ఱ లేదా మట్టి లేదా లోహం పాత్ర ; తు. కుడిక్క, కుడుక, కుడ్కె. మట్టిపాత్ర ; త. కుటుక్కై. కొబ్బరిచిప్ప ; కుటువై. చిన్న మూలికలపాత్ర ; మ. కుటుక్క, కుటుక, కుటువ. చిన్న పాత్ర ;

పో.చూ. సం. గుడక-. ఉండ, కబళం.

గుడగుడ వి. 1. ఉడకటంలోనూ, తాగటంలోనూ అయ్యే ధ్వనికి అనుకరణం. పిం.ద్వా. 8.188 ; 2. కడుపులో అయ్యేధ్వని.

గుడగుడలాడు అ.క్రి. 1. గునగునలాడు, గుణగుణలాడు; 2. అజీర్తితో కడుపులో గూండ్రించు. < గుడగుడ + -లు + ఆడు.

గుడపాలతీగ వి. కొండలమీద పెరిగే ఒక తీగ (Aganosama Caryplylcata).

గుడబండి వి. పిల్లలు ఆడుకొనే బండి.

గుడమతీగె వి. ఒక నన్ననితీగె. (Vitisadenta).

గుడవ వి. కడవ.

గుడా[1] వి. కొబ్బరిచిప్ప మట్టిగొట్టం పెట్టి చేసిన హుక్కా.

గుడా[2] చూ. గుడిగుడీ. వి. హుక్కాగొట్టం, హుక్కాపొడి వేసే జాడి.

గుడాకి రూ.చూ. గుడాకు. వి. 1.కొబ్బరిచిప్ప ; 2. మట్టిగొట్టం పెట్టి చేసిన హుక్కా.

గుడాకిచిలిమి వి. కొబ్బరిచిప్ప మట్టిగొట్టంపెట్టి చేసిన హుక్కా.

గుడాకు రూ. గుడాకి, వి. బెల్లంతో మర్దించిన పొగాకు, తంబాకు. పార్వ. 2.98.

క. గుడాకు. పొగాకు ; త. కుడుకుడా.

గుడాకుపొంగ వి. కొబ్బరిచిప్ప, మట్టిగొట్టంపెట్టి చేసిన హుక్కా.

గుడాటికాపు వి. కాపుల్లో (రెడ్లలో) ఒకతెగ.

గుడాణము రూ. గుడాణి. వి. చిన్నమూతి బాన, కూజా.

క. గుడాణ. మజ్జిగను చిలికే మట్టికుండ, నీళ్ళ మట్టి కడవ, ధాన్యం పాత్ర.

< క. గుడాణ.

గుడాణి రూ.చూ. గుడాణము. వి. సుమారు బస్తా ధాన్యం పట్టే మట్టిపాత్ర.

గుడాంబ వి. బెల్లం పొగాకు మొదలైనవి దంచి ముద్దగాచేసి హుక్కా తాగటానికి ఉపయోగించేది.

గుడారము రూ.చూ. గూడారము. వి. 1. పటకుటీరం, బట్టతో ఏర్పరచిన డేరా, ఇల్లు. చంద్రాంగ. 1.76 ; 2. గుడారం వలె ఉండే చెవిభాగం. ఆం.భా. 3.54.

గుడారమెత్తు అ.క్రి. పెనుతిరుగు, తోకముడుచు, వెళ్ళిపోవు < గుడారము + ఎత్తు.

గుడారమెత్తు చూ. గుడారము.

గుడారి వి. నీరు ప్రవహించే దోనె, మోట బొక్కెన, కుమ్మరించిన నీళ్ళుపోయేదారి లేదా కాలవ.

గుడారు రూ.చూ. గూడారము. వి. 1. వస్త్రగృహం, దేరా. శక. 1.100 ; 2. చెవిభాగం.

గుడారులు రూ. గుడార్లు వి.బ.వ. ఎర్రపట్టు గుడారాలు. గుడార్లు రూ.చూ. గుడారులు. వి.బ.వ. ఎర్రపట్టు గుడారాలు.

గుడార్లు చూ. గుడారు.

గుడాలవంగి చూ. గుడాలు.

గుడాలు వి.బ.వ. 1. గుగ్గిళ్ళు, చుండలు ; 2. ఉండ్రాళ్ళు.

గుడాలవంగి వి. దోరగా పండిన గింజ.

గుడి వి. 1. ఒకవిధమయిన గుడారం. కు.సం. 10.104 ; 2. గుండ్రంగా ఉండే గీత. శృం.నై. 2.38 ; 3. 'ఇ'కార చిహ్నం. అప్ప. 3.34 ; 4. దేవాలయం. ఆం.నా.సం. 1.26 ; 5. పరివేషం. ఆం.భా. 1.82 ; 6. వర్తుల దేవాలయం. ఆం.భా. 2.16 ; 7. పాఠశాల ; 8. ఆడుగురి ; 9. కాలికి, ఆనుపోసి ఒకటిపైకి ఒకటి కిందకి వచ్చిన రెండుపోగుల దారం ; 10. కుప్ప, గుట్ట ; 11. తిప్ప, తిన్నె.

క. గుడి. వృత్తం, గిరి ; కొడ. కుడ్‌జ్‌ల్-పాక, స్నానాలగది. తు. గుడి. చిన్నగుడి ; త. కుటి. ఇల్లు, కుటుంబం, పట్టణం ; మ. కుటి. ఇల్లు, గుడిసె, కుటుంబం, భార్య, జాతి ; కుఇ. గుడి. ఇంటిమధ్య గది, ఉండేగది ; పర్జి. గుడి. దేవాలయం ; గ్రామ విశ్రాంతి మందిరం ; కొలా. గుడి. దేవాలయం ; గ. గుడి. దేవాలయం ; కురు. కుడ్‌యా. చిన్నపాక, ఒక పెద్ద ఇంటితో సంబంధించిన చిన్న ఇల్లు ; మాల్తో. కుడ్‌య. పొలంలో ఉండే గుడిసె ; బ్రా. గుడి, గుడ్డి. గుడిసె ;

పో.చూ.సం. కుటి-. గుడిసె.

<మూ.ద్రా. కుట్.

గుడికట్టు వి. 1. గ్రామం నాలుగు దిక్కుల ఎల్లలఏర్పాటు. హంస. 4.29 ; 2. సూర్యచంద్రుల చుట్టును ఏర్పడిన గాలిగుడి ; 3. దేవాలయాల్లో ధన నిక్షేపాలున్నచోట్లు తెలిపే పుస్తకం ; 4. దేవాలయానికి సంబంధించిన నియమాలు ; 5. గుడిసేవకులు ; 6. ఉమ్మడి ; 7. గ్రామం యొక్క ఆయకట్టు లేక గ్రామంలో దేవాలయం నిమిత్తం మీయబడిన భూమి ; అ.క్రి. పరివేషమేర్పడు. గుడికి ముద్రవేసికొను అ.క్రి. బ్రహ్మచారిణిగా ఉండు. ప్రబంధ. 654. గుడికొంగ వి. పక్షివిశేషం. గుడికొను రూ.చూ. గుడిగొను. అ.క్రి. 1. వ్యాపించు, కమ్ము. పాంచాలీ. 2.68 ; 2. ఉబుకు, పైకివచ్చు. సారంగ. 3.164 ; 3. అతిశయించు. ఉ.రా. 8.72 ; 4. గుండ్రంగా తిరుగు. ఉ. హరిశ్చ. 2.126 ; 5. ఎక్కువగు, అలుముకొను. త. గుడికోళ్. గుడికొయ్య వి. గుడిసేవకుడు, గుడికొలువుగాడు. గుడిగుడిగంటలు వి.బ.వ. బాలక్రీడావిశేషం. గుడిగొను (-కొను) రూ. గుడికొను. అ.క్రి. వ్యాపించు. శాకు.సం. 7.273 ; గుడిచాటుకా(డు వి. పనిచేయనివాడు, గుడిసీడ చల్లగా ఉంటుందని అక్కడే పడిఉండేవాడు. ద్వి. హరిశ్చ. ద్వితీ. 1706 పం. గుడిచుట్టు అ.క్రి. 1. మండలాకారంగా తిరుగు. భాగ. 6.236 ; 2. గుర్రం మండలకారంగా తిరుగు. వి. 1. పరివేషం ; 2. అశ్వమండలాకారగతి ; 3. సూర్యచంద్రుల చుట్టూ ఏర్పడే మండలం. గుడిచేటి రూ. గుడిసేటి. వి. 1. దేవదాసి ; 2. లంజ. వ్యు. గుడిపరిచారిక. గుడిజెల్ల వి. మత్స్యవిశేషం. గుడితిరుగుకొను రూ.చూ. గుడిదిరుగుకొను. అ.క్రి. గుండ్రంగాతిరుగు. గుడిత్రిప్పు అ.క్రి. 1. గుర్రాన్ని గుండ్రంగా తిప్పు ; 2. గుండ్రంగా తిప్పు. గుడిదిరుగు(-తిరుగు) అ.క్రి. గుండ్రంగా తిరుగు. గుడిదిరుగుకొను రూ. గుడితిరుగుకొను. అ.క్రి. గుండ్రంగా తిరుగు. జైమినీభా. 5.35. గుడిదొమ్మ వి. ఒకరకం జబ్బు, గుండెల్లో గుడ్లుగుడ్లుగా పుండు పెరుగటం, మాదకావచ్చు. గుడిమండి గుడిరాళ్లగోయు(-కోయు) స.క్రి. ఒకరి ఆశ్రయంలో ఉంటూ వారికే అపకారం తలపెట్టు. గుడిమండి గుడిరాళ్లతీయు అ.క్రి. కృతఘ్నుడగు. పాండు. 3.68. గుడివల్లి కూటము వి. 1. పాఠశాల; 2. గుడి. గుడిపాడుచిక్కు అ.క్రి. సర్వశూన్యమగు, పాడయిపోవు. కాశీ. 5.267. గుడిపాత్ర వి. గుడిసాని. గుడిపాము వి. ఇల్లువదలని వ్యక్తి. గుడిభోగము వి. దేవుని కైంకర్య వ్యయాలకు ఇచ్చిన దేవభోగం. గుడిమణియము వి. 1. గుడిపెత్తనం, స్థానపత్యం ; 2. గుడి అధికారి, స్థానపతి. గుడిమండపము వి. దేవాలయ మండపం. గుడిమాని వి. దేవాలయ సేవకుడు. గుడిమాన్యం వి. దేవదాయం. గుడిముద్రవేసికొను అ.క్రి. బ్రహ్మచారిణిగాఉండు. శక. 2.506. గుడివడు(-పడు) అ.క్రి. గుండ్రనగు, ప్రదక్షిణించు. అష్టమ.క. 2.88. వ. 12 పం. గుడివడు(గు వి. గుడి పూజారి, అర్చకుడు, తంబళి. గుడివృత్తి వి. దేవుని కైంకర్య వ్యయాలకై ఇచ్చిన దేవ భోగం. గుడిసాని వి. దేవదాసి, దేవాలయంలో ఆటపాటలు జరిపే భోగం స్త్రీ. ద.హిం.కా. సంపు. 6. కా.సం. 200. గుడిసేటి రూ.చూ. గుడిచేటి. వి. 1. దేవదాసి ; 2. లంజ. గుడిసేటిలంజ వి. కులట. గుడ్లు వి.బ.వ. దేవాలయాలు ; విప్పర్ల శాసనం. క్రీ.శ. 633.63.

<గుడి+-లు.

గుడిగ వి. చిన్న మట్టిపాత్ర.

గుడిగి వి. మోకాలివరకు తొడిగికొనే వస్త్ర కవచం, లాగు, నిక్కరు.

క. గుడిగి-. షరాయి ; గుడిచణ్ణ.

గుడిగుడి[1] విశే. 1. అల్పమైన. ద్వి. హరిశ్చ. ఉ. 177 పం ; 2. పొంగివచ్చేది.

గుడిగుడికన్నీరు వి. బొటబొటరాలే కన్నీరు.

గుడిగుడి[2] చూ. గుడుగుడుపొంగ. వి. పొగాకుగొట్టం.

గుడిగుడిపుంచములు వి.బ.వ. ఒక బాలక్రీడ, అందలాలు. ధ్వన్యను.

గుడిగుడిగుంజము రూ.చూ. గుడుగుడుగుంచము. వి. బాలక్రీడా విశేషం, గుడుగుడు కుంచాలు.

గుడిగుడి వి. హుక్కాగొట్టం, హుక్కాపొడివేసే జాడీ. సింహ. శ. 20. రంగా.చ. 2.85.

హిం. గుడ్‌గుడ్-హుక్కా గొట్టంనుండి వచ్చే పొగ ;

*గుడ్ గుడ్-.* హుక్కా గొట్టం. ఉ. *గుడ్ గుడీ-.* హుక్కా గొట్టం. మరా. *గుడ్ గుడీ-.* పొడుగైన గొట్టం కలిగి పొగ పీల్చటానికి ఉపయోగింపబడే పనిముట్టు.

<ఉ. గుడ్‌గుడీ.

**గుడిగుండమవక** అవ్య. ఇదీఅదీ అనకుండా ఎల్లచోటులా. వేంక. పంచ. 1.25.

**గుడిగె** వి. కఱ్ఱ, బంధం, గుదికొయ్య.

**గుడిచెంచలము** వి. ఒక ఆకుకూర.

**గుడిదీ** రూ.చూ. గుడిదె. వి. చిన్నకొయ్యముక్క.

**గుడిదె** రూ. గుడిదీ. వి. తలుపు తిరగటానికి వేసే కీలు, మేకు, గూటం.

క. *గుడిద.* మేకు.

**గుడిదొమ్మలు** వి.బ.వ. చిన్న మంచినీటి చేపలు.

**గుడిశెవగుల్లు** వి.బ.వ. రథయాత్ర ఉత్సవంలో దేవుని ఊరేగించి తీసికొనివెళ్ళి పదిరోజులపాటు ఉంచే మందిరం.

**గుడిప** వి. మంచె, చాల ఎత్తున వేసిన పందిరి.

**గుడిసి** రూ.చూ. గుడిసె[2]. వి. 1. కుటీరం, స్తంభాలు, గోడలు, వెనుపట్టె లేకుండ తృణాదులతో ఏర్పరచిన ఇల్లు; 2. ప్రయాణం బండి (గూడుబండి) మీదవేసే కప్పు.

**గుడిసియ** రూ.చూ. గుడిసె[2]. వి. కుటీరం.

**గుడిసె**[1] రూ.చూ. గొడిసె. వి. ఒకవిత్తు చింతపండు. ఆం.బా. 2.47.

**గుడిసె**[2] రూ. గుడిసి, గుడిసియ, గుడుసు[2]. వి. 1. కుటీరం, స్తంభాలు గోడలు వెనుపట్టె లేకుండా తృణాదులతో ఏర్పరచిన ఇల్లు. భార. అను. 1.276; 2. ప్రయాణం బండి (గూడు బండి) మీద వేసే కప్పు.

క. *గుడసలు.* పూరిగుడిసె; కొడ. *కుడి.* సేవకుల కుటుంబం నివసించే గుడిసె; తు. *గుడిసలు, గుడిసిలు.* గుడిసె, పాక; త. *కుటిచై, కుటిఱై, కుటుంకర్.* చిన్న గుడిసె, కుటీరం; మ. *కుటిజిల్.* గుడిసె, పూరిగుడిసె; *కుటిల్*; కొంద. *కుడ్ళీ.* చిన్న దూడల పాక; కుఇ. *కూడి.* చెట్టు కొమ్మలు మొ. వాటితో వేసిన గుడిసె; పర్జి. *గుడి.* గ్రామ విశ్రాంతి గృహం; కురు. *కుడ్య.* చిన్న పాక లేదా ఉపగృహం; మాల్తో. *కుడ్య.* పొలంలో ఉండే పాక.

**గుడిసెబండి** వి. గూడుబండి, పైన గూడు ఉన్న ప్రయాణం బండి. **గుడిసెలోకూచున్నది** విబ. రజస్వలయైనది. **గుడిసెపాటు** వి. కులట. **గుడిసెపాటుది** వి. కులట. భాగ. 2.117. **గుడిసెవేటు** వి. కులట. నీచపులంజ, గుడిసేటి. వేమ. శ. 7. **గుడిసెవేటుకత్తె** వి. కులట. **గుడిసెవేటుది** వి. కులట. ఆం.బా. 2.117. **గుడిసెవైచు** అ.క్రి. వ్యభిచరించు.

**గుడిసె**[3] వి. పక్షి విశేషం. హంస. 3.12.

**గుడిసెతెవులు** వి. వేరుసెనగకు పట్టే చీడ.

**గుడిసెపురుగు** వి. వేరుసెనగకు పట్టే ఒక రకం పేను.

**గుదు** స.క్రి. చప్పరించు.

**గుడుక్కు** రూ.చూ. గుటుకు. వి. గుటుకు, మింగటంలో అనుకరణం.

**గుడుగుడుక్కునమ్రింగు** స.క్రి. గుడుగుడుక్కు అనే శబ్దం వచ్చేట్టు మింగు. ద్వి.నల. 5.101. పం.

**గుడుగు** వి. ఉరుము.

క. *గుడుగు.* ఉరుము.

**గుడుగుడు**[1] వి. 1. నడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పార్వ. 4.123; 2. పరిగెత్తటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 3. కబడి ఆటలోని కూత.

క. *గుడుగుడు.* పరుగెత్తటంలో అయ్యే అనుకరణం; త. కుటుకుటుప్పై.

**గుడుగుడుప్రాణంగా** క్రి.విఱ. వచ్చే పోయే ప్రాణంగా. **గుడుగుడుమనినడచు** అ.క్రి. గునగున నడచు. పార్వ. 4.123.

**గుడుగుడు**[2] వి. 1. గంజాయి తాగుడు యొక్క అనుకరణం; 2. చిన్న హుక్కా.

క. *గుడుగుడి.* హుక్కా గొట్టం.

**గుడుగుడుక్కునమ్రింగు** చూ. గుడుక్కు.

**గుడుగుడుగుంచము** రూ. గుడిగుడి గుంజము. వి. బాల్య క్రీడా విశేషం. విష్ణు పు. 7.202. ధ్వన్యను.

**గుడుగుడుగుంచాలు** వి.బ.వ. కుందెనగుడి. బాల్య క్రీడా విశేషం. హంస. 3.146.

**గుడుగుడుగుంచాలు** చూ. గుడుగుడు గుంచము.

**గుడుగుడుగుంచెము** చూ. గుడుగుడు గుంచము. వి. అంతర రహస్యం.

**గుడుగుడుగుండం** చూ. గుడుగుడు పంచెం. వి. 1. పిల్లలాడుకొనే ఆట; 2. స్థలాంతరాన్నెరగ కుండటం.

**గుడుగుడుపంచెం** వి. పిల్లలు కూర్చొని ఒకరి పిడికిలిపై ఒకరి పిడికిలి పెట్టి 'గుడుగుడు పంచెం గుండే రాగం' అని పాడి 'చేతు తెక్కడకి పోయేయ్' అని అడిగి సమాధానం పొందుతూ ఆడే ఆట.

**గుడుగుడుబుర్ర** చూ. గుడుగుడు సొంగ. వి. పొగాకు పీల్చే మట్టి గొట్టం.

**గుడుగుడుపిలిం** చూ. గుడుగుడు సొంగ. వి. పొగాకు పీల్చే మట్టి గొట్టం.

**గుడుగుడుసొంగ** వి. టెంకాయ చిప్పకు బెజ్జం పెట్టి దాన్లో నీళ్ళు పోసి దాని కొక 12 అంగుళాల పొడవుండే బోలు కఱ్ఱ ఎత్తు పెడ్తారు. ఆ కఱ్ఱకి మట్టితో చేసిన నిలువు సొంగను బిగించి పొగాకు పెట్టి అగ్గి ముట్టిస్తారు. ఆ టెంకాయ చిప్పకే ఇంకో రంధ్రం చేసి అందులో నుంచి సొంగను పీలుస్తారు. పీలుస్తుండగా 'గుడగుడ' అంటుంది. రబ్బరు పంపు పెట్టి నీళ్లలో కారు (గాటు) పోయేటట్లు చేసి పీలిస్తే పొగ చల్లగా వస్తుంది. పొగాకు గొట్టం. ధ్వన్యను.

**గుడుగుపాట(-ఆట)** వి. చెడుగుడు, కబాడి, బలిగుడు.

క. *గుడుగు.* క్రీడా విశేషం.

**గుడుగువత్తి** వి. తెల్ల పత్తిలో ఒక రకము.

**గుడుగుమల్లప్ప** వి. ఉరుముల అధిదేవత.

**గుడుగురావిలము** వి. పక్షి విశేషం, అంబటి జోరిగాడు. చంద్రాంగ. 2.81.

**గుదువ** వి. ముద్గరం, గుదియ, గునపం. ఆం.బా. 2.216.

గుడువ వి. నీళ్ళకు వాడే పెద్ద మట్టి పాత్ర.

గుడువరి చూ. గడసరి. వి. కపటి, మోసగాడు, వంచకుడు.

గుడుసు[1] విణ. 1. గుండ్రని, వర్తులం. భాస్క.రా. అరణ్య. 1.209; 2. గుడి, ఇకార చిహ్నం. అప్ప. 3 80; 3. పరివేషం. ఆం.భా. 1.82.

క. గుడసు. గుండ్రం, వర్తులం, ఇకార చిహ్నం; త. కుండు; కొం. గుడు. గుద్దు; కొలా. గుడ్. వృషణం.

గుడుసుకయిదువ రూ.చూ. గుడుసుకైదువ. వి. 1. విష్ణు చక్రం; 2. సుడికత్తి. గుడుసుకయిదువు రూ.చూ. గుడుసుకైదువ. వి. విష్ణు చక్రం. గుడుసుకైదువ రూ. గుడుసుకయిదువ, గుడుసుకయిదువు, గుడుసుకైదువు. వి. 1. చక్రం; 2. సుడికత్తి. గుడుసుకైదువజోదు వి. చక్రపాణి, విష్ణువు. అచ్చ.రా. బాల. 70. గుడుసుకైదువు రూ.చూ. గుడుసుకైదువ. వి. విష్ణు చక్రం. గుడుసుకొండ వి. చుట్టుకొండ, చక్రవాళ పర్వతం. చంద్రాంగ. 2.66. గుడుసువడు రూ.చూ. గుడుసుపడు. అ.క్రి. 1. గుండ్రమగు; 2. తిరుగు, తగ్గు. గుడుసువఱచు రూ. గుడుసుపఱుచు. స.క్రి. కొంచెపరచు, కొంచెంసేయు, హీనం చేయు. ధను. వి. 1.35. గుడుసువఱుచు రూ.చూ. గుడుసుపఱచు. స.క్రి. తిప్పు, తగ్గించు. గుడుసులువడు స.క్రి. చుట్టుకొను. గుడుసువడు (-వడు) రూ. గుడుసుపడు. అ.క్రి. 1. గుండ్రమగు. భార. కర్ణ. 3.41; 2. తగ్గు, తరుగు. హరి.పూ. 6.129; 3. తిరుగు. గుడుసువాలు వి. చక్రం, గుడుసుకైదువు. అచ్చ.రా.యు. 64. గుడుసువాల్దాలువు వి. వెన్నుడు, చక్రి. గుడుసువాల్నెఱజోదు వి. చక్రి, విష్ణువు.

గుడుసు[2] రూ.చూ. గుడిసె[2]. వి. కుటీరం, పాక. ఆం.భా. 2.14.

గుడెము రూ.చూ. గూడెము. వి. చిన్న పల్లె, పేట, బోయ పల్లె.

గుడ్డ[1] వి. 1. వస్త్ర ఖండం. ఆం.భా. 2.157; 2. వస్త్రం.

క. గుడ్డ. వస్త్ర ఖండం; కుట్టై. జేబురుమాలు, తుండు, వస్త్ర ఖండం.

గుడ్డకట్టె వి. కుంచె, సన్నని కర్రకు ఒక చివర నారనో గుడ్డనో కట్టి తయారుచేసిన సాధనం. గుడ్డగొడుగు వి. గుడ్డ కప్పుకల గొడుగు. గుడ్డదోనె వి. మగ్గంమీద, నేసిన బట్టచుట్టే కొయ్య దూలం. గుడ్డపాత వి. సారెమీద పాత్రల స్వరూపం తయారవుతున్నపుడు నునుపు పట్టటానికి అంచుఏర్పరచడానికి వాడేతడిగుడ్డ. గుడ్డపిడచ వి. పదును తడపటానికి గంజిలో ముంచినగుడ్డ. గుడ్డపీలిక వి. కుండల్ని నర్సేటప్పుడు నలపను తడుపుకోడానికి వాడే తడిబట్ట. గుడ్డబొందెము వి. చిక్కం కట్టిన మోటుబొక్కెన. గుడ్డవృత్తి వి. దేవభోగంగా కాని బ్రాహ్మణభోగంగా కాని ఇచ్చిన భూదానం. గుడ్డవృత్తులు వి.బ.వ. ఇనాంభూములు. పాండు. 3.16. గుడ్డేయు స.క్రి. కుడిచేత్తో అడ్డంవేలు వేసిముఖమేర్పర చడానికి కుండనాల్గుపక్కలా సావుగా రావడానికి బట్టతో పట్టు. గుడ్డొత్తు స.క్రి. కుడిచేత్తో అడ్డంవేలువేసి ముఖమేర్పర్చడానికి కుండనాల్గుపక్కలా సావుగా రావడానికి బట్టతో పట్టు.

గుడ్డ[2] వి. బిడ్డ పంది. చ. 2.156 పు.

గుడ్డ[3] వి. 1. స్థానం. బసవ. 2.133పం; 2. క్షేత్రఖండం. పాండు. 3.16.

గుడ్డకాగు వి ఊరిబయటగుడిదగ్గర పొంగలిచేయడానికి వాడే మట్టిపాత్ర.

గుడ్డము రూ. గుడ్డాము. వి. 1. చేను. పాండు. 3.75; 2. పర్వతం; 3. చేనివంప.

క. గుడ్డ. పర్వతం, కొండ.

గుడ్డాము రూ.చూ. గుడ్డము. వి. 1. పొలం; 2. పర్వతం.

గుడ్డి[1] వి. అట్టచెమ్మఆటలో వెలికిల వచ్చ ఒంటికాయ.

గుడ్డి[2] రూ.చూ. గ్రుడ్డి. వి. 1. చీకు; 2. అంధభావం; విణ. అల్ప, నీచం.

గుడ్డికన్పాదుపా వి. కుబేరుడు. గుడ్డికాల్పు వి. ఆములో కుండలు బాగాకాలని తీరు. గుడ్డికుంకాళమ్మ తిరునాళ్ల వి.బ.వ. మబ్బు చినుకులతో మూగాము వేసి ఉండటం. గుడ్డికొక్కిరాయి రూ.చూ. గ్రుడ్డికొక్కెర. వి. గుడ్డికొక్కెర. కోయష్టికం. గుడ్డికొక్కెర రూ. చూ. గ్రుడ్డికొక్కెర, వి. గుడ్డికొక్కిరాయి, గుడ్డికొంగ. గుడ్డికొక్కిరాయి రూ.చూ. గ్రుడ్డికొక్కెర. వి. గుడ్డికొక్కెర. గుడ్డికొంగ. గుడ్డికొంగ వి. చీకుకొక్కెర. గుడ్డిగవ్వ రూ.చూ. గ్రుడ్డిగవ్వ. వి. విలువ లేనివస్తువు. గుడ్డిగుఱ్ఱపుతాపు వి. తాకితేతాకుతుంది, తప్పితే తప్పుతుంది అనిచెప్పేటప్పుడు వ్యవహరించే నుడికారం. గుడ్డింగిలాయి రూ.చూ. గ్రుడ్డింగిలాయి. వి. మత్స్యవిశేషం. (Scarusviridis).గుడ్డిచుక్క వి. శుక్రుడనే నక్షత్రం, శుక్రుడు గుడ్డివాడని ప్రసిద్ధి. గుడ్డిచెంగలి వి. చెంగలి గడ్డితో ఒకరకం కలుపుమొక్క. గుడ్డిచెంగాయి వి. చెంగాయిలో ఒకరకం. గుడ్డితనము రూ.చూ. గ్రుడ్డితనము. వి. అంధత్వం. గుడ్డిదర్బారు వి. వివక్షణ లేని పెత్తనం. గుడ్డిదివ్వె వి. తక్కువ కాంతినిచ్చేదీపం. గుడ్డిదీపము వి. తక్కువకాంతితోడి దీపం. గుడ్డినమ్మకం వి. అంధవిశ్వాసం. గుడ్డిపాఠము రూ.చూ. గ్రుడ్డిపాఠము. వి. అర్థంలేనిచదువు. గుడ్డిపురుగు వి. 1. జొన్నతెగులు; 2. కంకిదోమ. కంకినల్లి. గుడ్డిపూలాకు వి. ఒకరకం కలుపుమొక్క. గుడ్డిబేరము రూ. చూ. గ్రుడ్డిబేరము. వి. అర్థంలేనితెలివి తక్కువబేరం. గుడ్డిమబ్బు వి. వర్షించని మబ్బు. గుడ్డిరాయి వి. ఎర్రరాయి. ఇది 'క్వార్ట్జ్' జాతికి చెందిన మిశ్రశిల. గుడ్డిలోమెల్ల వి. కొంతలోకొంతమేలు, పూర్తిగుడ్డి కావటం కంటె మెల్లకన్నుకలిగి ఉండటం మంచిది అనే దాన్ని బట్టిఏర్పడ్డ నుడికారం. గుడ్డివడు (-వడు) రూ. చూ. గ్రుడ్డివడు. అ.క్రి. అంధకార బంధురమగు, గుడ్డివెన్నెల రూ.చూ. గ్రుడ్డివెన్నెల. వి. కనిపించీ కనిపించని వెన్నెల. గుడ్డివేటుగా (-కాన్) క్రి. విణ. ద్రు. అనుకొనకుండ. గుడ్డీగ వి. ఒకరకం చెదుఈగ. <గుడ్డి[2]+ఈగ. గుడ్డిబొడ్డి వి. గేయాజోరూ. తుక్కూదూగర, పక్కిరిబిక్కిరి. పనికిరానిచెత్త చెవారం. గుడ్డెద్దుచేలోబడినట్లు అవ్య. ఇష్టంవచ్చినట్లు.

గుడ్డి[3] వి. మిట్టపొలం.

గుడ్డీగ చూ. గుడ్డి[2].

గుడ్డిబొడ్డి చూ. గుడ్డి[2].

గుడ్డు[1] యా.చూ. గ్రుడ్డు. వి. 1. అండం ; 2. కంటిపాప ; 3. సున్న; 4. చొప్పదంటు కనుపు, 5. సున్నపుండ, కోడిగుడ్డు. గుడ్డువెట్టు (-పెట్టు) అ.క్రి. 1. అకస్మాత్తుగా చనిపోవు ; 2. పరీక్ష మొదలగు వాటిలోతప్పు ; 3. పనిచెడిపోవు ; 4. ఆరిపోవు ; 5. సున్నాపెట్టు. గుడ్లకాటుక వి. ఒకజాతివరి తెగులు. గుడ్లుగుబ్బలి వి. 1. ఘూకం ; 2. పశువులకు గుడ్లవలె ఏర్పడు పుండు. గుడ్లగురివి వి. శకునపక్షి. గుడ్లగూబ యా.చూ. గ్రుడ్లగూబ. వి. 1. ఘూకం ; 2. పశువులకు గుడ్లవలె ఏర్పడేపుండు. గుడ్లతెవులు వి. గుడ్లుగుడ్లుగా ఏర్పడేపుండు, పట్టరణం, మాదభేదం. గుడ్లదొమ్మ వి. ఒకరకం రోగం, గుండెల్లో గుడ్లు గుడ్లుగా పుండు పెరుగుతుందట, మాద కావచ్చు. గుడ్లమాద వి. ఒకరకం రోగం. గర్భకోశంలో ఏర్పడే పుండు. గుడ్లలం వి. ఒకరకం కలుపుమొక్క. గుడ్లల్లోకూవ వి. ఎత్తిపొడుపుగా మరీచిన్నవాడులే అనేటప్పుడు అనేమాట. గుడ్లుఅప్పగించి అవ్య. ఏమీచేయలేక. గుడ్లుతేలవేయు స.క్రి. ఏమీచేయలేక తనపని ముగిసినట్లు తెలియజేయు, ప్రాణంపోయేటప్పుడూ, మూర్ఛపోయేటప్పుడూ గుడ్లు తేలవేసేదానిపై వచ్చినపలుకుబడి. గుడ్లువెళ్ళుకవచ్చు అ.క్రి. 1. చనిపోవు ; 2. కనుగ్రుడ్లు బయటికివచ్చు.

గుడ్డు[2] వి. అబ్బుగుల్ల, ఉష్ణదేశాల్లో వానాకాలం తర్వాత భూమి పొరల్లో ఉన్న సుద్దనీరు ఉపరితలానికి వచ్చి. ఆతర్వాత వెట్టగాఉండే దీర్ఘకాలంలో ఎండి, భూమిపై పొరకు దిగువనే పొర గట్టిపడుతుంది.

గుడ్డుకుడుచు చూ. గుడ్డు[1]. అ.క్రి. గర్వమణగు.

గుడ్డె వి. నేలమీద ఎత్తైనస్థలం, మిట్టపొలం.

క. గుడ్డె.

గుడ్డెంగలము చూ. గుడ్డు[1]. వి. ఎక్కువ ముళ్లుకల ఒక రకంచేప.

గుడ్డెద్దుచేలో(బడివట్లు చూ. గుడ్డి[2].

గుడ్డేయు చూ. గుడ్డ[1].

గుడ్డొత్తు చూ. గుడ్డ[1].

గుఢ్రాయి వి. గడరాతు, పనికిమాలినరాయి.

గుడ్లకాటుక చూ. గుడ్డు[1].

గుడ్లగుబ్బలి చూ. గుడ్డు[1].

గుడ్లగురివి చూ. గుడ్డు[1].

గుడ్లగూబ చూ. గుడ్డు[1].

గుడ్లతెవులు చూ. గుడ్డు[1].

గుడ్లదొమ్మ చూ. గుడ్డు[1].

గుడ్లమాద చూ. గుడ్డు[1].

గుడ్లలం చూ. గుడ్డు[1].

గుడ్లల్లోకూవ చూ. గుడ్డు[1].

గుడ్లు చూ. గుడి.

గుడ్లుఅప్పగించి చూ. గుడ్డ[1].

గుడ్లుతేలవేయు చూ. గుడ్డు[1].

గుడ్లువెళ్ళుకవచ్చు చూ. గుడ్డు[1].

గుణక వి. పశువుల మెడలుపక్కకు తిప్పకుండా ఉంచేకొయ్య ముక్క.

గుణకె వి. గణకుడు.

నం. *గణక*-. లెక్కలు వేసేవాడు.

గుణవర్ధము వి. గోడల కట్టటానికి భూమిలో తీసినగాడులలో గట్టిగా కంకరతో కట్టించినది, అస్తిభారం, పునాది.

గుణసుందరికుండ వి. చంకబిందిలాగా ఉండి మూతి బూసిగా వక్కపొడుగ్గా ఉండే మట్టిపాత్ర.

గుణహో వి. జరిమానా, జుల్మానా.

గుణాది వి. గుణవర్ధనం, అస్తిభారం, పునాది.

నం. *గుణాది*-. గుణం మొ. నవి.

<నం. గుణాది-. (అర్థవిపరి.).

గుణావర్తము వి. పునాది, అస్తిభారం, గుణవర్ధం.

నం. *గుణావర్త*-. పునాది.

<నం. గుణావర్త-. (అర్థవిపరి.).

గుణింతము వి. 1. హల్లులతో అచ్చులను, హల్లులను చేర్చటం. హంన. 3.41 ; 2. అంకెలను హెచ్చవేయటం.

నం. *గుణిత*-. హెచ్చవేయబడిన.

క. *గుణిత*-. హెచ్చవేత, గుణకారం.

<నం. గుణిత-.

గుణిపింపు చూ. గుణుపు.

గుణు వి. గుంద్రటిరాయి.

గుణుపు వి. గుణుగు, బులిపింపు.

గుణిపింపు వి. లోపలి ఉద్దేశాన్ని బయట పెట్టకుండా ప్రతిదానికి అడ్డుచెప్తూ చేసే సణుగుడు.

గుణుపురంసన్నం వి. ఒరిస్సా ప్రాంతంలో పండే సన్నరకం ధాన్యం.

గునేగారి యా., గునాగారి. వి. అపరాధం.

ఉ. *గునాహ్‌గారీ*. అపరాధం.

<ఉ. గునాహ్‌గారీ.

గుంట యా.చూ. కుంట. వి. 1. చిన్నగొయ్యి. మను. 4.60 ; 2. చిన్నచెరువు. ఆము. 4.236 ; 3. కొంద్ర. $\frac{1}{40}$ ఎకరం. ఆం. భా. 2.233 ; 4. పిరికివాడు, భీరువు ; 5. ఆడుగురి, యోని ; 6. నడుంమీది గుంట ; 7. బాలుడు ; 8. బాలిక.

గుంటకలకర యా.చూ. గుంటకలగర. వి. భృంగరాజం. గుంటకలగర యా. గంటకలకర, గుంటకలవర, గుంటగలగర. వి. భృంగరాజం. ఆం. భా. 2.69. గుంటకలవర యా.చూ. గుంటకలగర. వి. భృంగరాజం. గుంటకాలు వి.బ.వ. గుంటలు, గోతులు. గుంటకుగంతువేయు అ.క్రి. చచ్చు. గుంటకొయ్య వి. పావు చెక్కల గూటం, మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు పాతిన కొయ్య. గుంటకోవి యా.చూ. గుంటక్రోవి. వి. ఫిరంగి విశేషం. గుంటక్రోవ యా.చూ. గుంటక్రోవి. వి. ఒకరకమయిన ఫిరంగి. గుంటక్రోవి యా. గుంటకోవి, గుంటక్రోవ. వి. ఒకరకం ఫిరంగి. ఆం. భా. 2.218. గుంటగలగర యా.చూ. గుంటకలగర. వి. గుంట కలగర, భృంగరాజం. గుంటగలిజేరు యా. కుంటగల్జేరు, గుంటగల్జేరు. గుంటగింజేరు. వి. గుంటకలగర, భృంగరాజం. హంన. 4.10. గుంటగల్జేరు యా.చూ. గుంటగలిజేరు. వి. గుంటకలగర, భృంగరాజం. హంన.

4.10. గుంటగింజేర రూ.చూ. గుంటగలిజేరు. వి. గుంట కలగర. గుంటగూటం చూ. గుంతలగూటం. వి. పావుచెక్కల గూటం, మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. గుంట(గూర్చు(-కూర్చు) స.క్రి. నాశనంచేయు. గుంట(గూలు అ.క్రి. కూలిపోవు, కూలబడు. గుంటచాళ్లు వి. బ.వ. బాలక్రీడా విశేషం. విష్ణుపు. 7.202. గుంటచిక్కులు వి.బ.వ. అనంతంగా మధ్యలోవచ్చే చిక్కులు. గుంటచీపురు వి. చీపురులో ఒకరకం కలుపు మొక్క. గుంటచ్చు వి. అడ్డంగా నిలువుగా తోలిన చాలు. గుంట(డు వి. బాలుడు (విశాఖపట్నం ప్రాంతంలో). గుంటదూలం రూ.చూ. కుంటదూలము. వి. గోడమీదనుంచి దూలంమీదికి వేసే మరో చిన్న దూలం. గుంటదూలము రూ.చూ. కుంట దూలము. వి. గోడమీదనుంచి దూలం మీదికి వేసే మరో చిన్న దూలం. గుంటనక్క వి. 1. కుతంత్రాలు పన్నేవాడు, కుయుక్తిశాలి, కపటి; 2. చిన్నజాతి నక్క. గుంటప్రొయ్యి వి. గుంటతవ్వి ఏర్పరచిన పొయ్యి. గుంటబెట్టు స.క్రి. రూపుమాపు, చెరచు. గుంటమగ్గం రూ. గుంతమగ్గం. వి. గోతిమగ్గం, నేతబయలులో గుంటదగ్గర అమర్చిన మగ్గం. గుంటమాన్యం వి. చిన్న మాన్యం. గుంటమారి వి. దుర్మార్గుడు. హంస. 5.110. గుంట(బెట్టి గంటవాయించు స.క్రి. 1. మోసగించు; 2. పాడుచేయు. గుంటయోవములు(-ఓనములు) వి.బ.వ. తొలి అక్షరాలు, తొలిమెట్టు. గుంటలుపడు అ.క్రి. పల్లమగు, లోతగు. దశా. 2.53.

గుంట[2] వి. రాతిగుట్ట.

గుంటక రూ. గుంటవ, గుంటిక[2], గుంటికె, గుంటుకు, గుండుక, గూటవ. వి. దున్ని, విత్తులు చల్లిన వెనుక నేల చదును చేసే సాధనం, పాపటం. ఆం.భా. 2.233.

క. కుంటె. మరమగ్గంలోని నేతకడ్డీ; తు. కుంటె.

గుంటకగుజ్జులు వి.బ.వ. గుంటకకు ఉన్న గుజ్జులనే భాగాలు. గుంటకచాలు వి. గుంటకతో తోలిన చాలు. గుంటకదిండు వి. గుంటకకు ఉన్న కొయ్య. గుంటకపట్టె వి. గుంటుకచాలు. గుంటకపలుగు గుంటకకు ఉన్న ఇనప భాగం. గుంటకపాయు స.క్రి. గుంటకతో చదును చేయు, గుంటకతోపొలందున్ను. గుంటకపొయ్యు స.క్రి. చదునుచేయు. గుంటకయడ్డ వి. గుంటకలోని కొయ్య దుక్క.

గుంటవ రూ.చూ. గుంటక. వి. మెట్టచేను పదును చేసే పనిముట్టు.

గుంటాము చూ. గుంట[1]. వి. జాతిబట్టి, జాతిబట్టినున్నం కాల్చే గుండ్రటిబట్టి.

గుంటాముచాపు వి. కమ్మిలో నాలుగేసి గీరలు పడేట్టు నేసిన రెండు పంచెలు.

గుంటి రూ. గుంటు[1]. చూ. కుంట. వి. 1. చేనిభాగం, పైరుతో కూడిన చిన్న భూఖండం; 2. దున్నటం మొ. వానికేర్పర చుకొన్న భూభాగం; 3. నెలవు, స్థానం.

క. గుంటె-. 121 చదరపు గజాలు లేదా ఎకరంలో 40 వ వంతు.

గుంటికోండ్ర వి. పొలం పొడుగైనప్పుడు మధ్యనుంచే మలిపివేసే కొండ్ర. గుంటిచాలు వి. గంటుపెట్టి దున్నే చాలు. గుంటిమలుపు వి. చేను నిడివిలో సగం దూరం మాత్రం చాలు దున్ని వెనక్కు తిరగటం.

గుంటిక[1] వి. భూమికొలత, 2 ఎకరాలు.

గుంటిక[2] రూ.చూ. గుంటక. వి. మెట్టచేనును చదును చేసే పనిముట్టు.

గుంటిక్ర్ర చూ. గుంట[1]. వి. పానువు పట్టె, మరమగ్గంలోపన్నె బిగించిన కిందికొయ్య.

గుంటికాలవ చూ. గుంట[1]. వి. చిన్నపంటకాలవ.

గుంటికె రూ.చూ. గుంటక. వి. దున్ని, విత్తులు చల్లిన వెనుక నేల చదును చేసే సాధనం, పాపటం.

గుంటిక్రోవి చూ. గుండు.

గుంటు[1] రూ.చూ. గుంటి. వి. 1. చేని భాగం; 2. దున్నటం మొ. వాటికేర్పరచుకొనిన భూమి; 3. చతురస్రంగా లేని పొలంలో కొంతవరకు కోండ్ర వెయ్యటం.

గుంటు[2] వి. ఒకరకం ఆయుధం.

గుంటుకా(డు వి. గుంటు అనే ఆయుధం కలవాడు. కు. సం. 11.40.

గుంటుకు రూ. గుంటక. వి. నేలను చదును చేసే కృషి సాధనం, గుంటక.

గుంటుకుగొట్టు(-కొట్టు) అ.క్రి. (వ్యంగ్యంగా) నశించు; స.క్రి. నశింపచేయు.

గుంటూరుకమ్మి వి. ఒకరకం దోవతుల కమ్మి.

గుంటూరురాయి వి. గుంటూరు ప్రాంతంనుంచి వచ్చే చలవ రాయి.

గుంటూరునన్నం వి. మార్టేరు 19వ నెంబరు కునుమ ధాన్యం కావచ్చు.

గుంటెదొమ్మ వి. కృశత్వం, రొప్పు, ఎగపోత ఎక్కువగా ఉన్న దొమ్మ.

గుంటేకు వి. సామానుల తయారీకి పనికి వచ్చే కలపనిచ్చే ఒక చెట్టు. (Gumelina arborea).

గుండ[1] వి. గుడ్డ, బట్ట. యయా. 2.50.

గుండంచు[1] వి. చివర కొంత పడుగువదలి, పైన వేలెడు వెడల్పున రంగులో నేసిన అంచు, ఎనిమిది కొలకుల దారంతో నేసిన ఒకరకం అంచు. <గుండ[1] + అంచు. గుండంచుచీర వి. మాములుగా నేసిన (ఒకరకం) చీర.

గుండ[2] వి. పొడి.

పర్జి. *గుండ-*.దుమ్ము; కువి. *గుండూ*. పిండి.

పో.చూ. సం. *గుండక-*. దుమ్ము, పొడి.

గుండకూడు అ.క్రి. గుంపుకట్టు. గుండాడు స.క్రి. గుండగాచేయు, పొడిచేయు, నులిచివేయు. వరాహ. 10.15. <గుండ[2] + ఆడు.

-గుండ[3] రూ. గుండా[1]. ప్రత్య.ధ్రు. పంచమీ విభక్తి ప్రత్యయం. వరాహ. 12.25.

గుండకొయ్య రూ.చూ. గుండ(గొయ్య. వి. దుష్టుడు, తుంటరి.

గుండ్రక్రియ వి. ఒకానొక రాగం.

గుండగొయ్య (-కొయ్య) రూ.చూ. గుండఁగొయ్య. వి. 1. దుష్టుడు, తుంటరి, మూర్ఖుడు ; 2. బొక్కెనపైన తాడు కట్టే ఇనప కడియం, బండి కొట్టికర్ర.

గుండగొయ్యతనము వి. తుంటరితనం.

గుండంగి రూ. గుండఁగి. వి. 1. నలిలకుక్కుటం, నీటికోడి. వాల్మీ. 2.92 ; 2. తోకలేని కోతి వంటి జంతువు.

గుండఁగి రూ.చూ. గుండంగి. వి. 1. నలిలకుక్కుటం, నీటి కోడి. ఆం. బా. 2.92 ; 2. తెల్లని మొహంగల నల్లనికోతి ; 3. తోకలేని కోతివంటి జంతువు.

గుండఁగిపిట్ట వి. ఒకజాతిపక్షి.

గుండఁగొయ్య (-కొయ్య) రూ. గుండకొయ్య, గుండగొయ్య. వి. 1. దుష్టుడు, తుంటరి ; 2. బొక్కెనపై తాడుకట్టే ఇనప కడియం ; 3. బండి కొట్టికర్ర.

గుండంచు[2] చూ. గుండు.

గుండటిక చూ. గుండు.

గుండఁడు వి. బంటు, దాసుడు. హంస. 5.113.

క. *గుండ-*. సేవకుడు ; మ. కుంటు-. బానిస, నీచస్త్రీ.

గుండతనము రూ.చూ. గుండాతనము. వి. 1. రౌడీ తనం ; 2. తెగువ.

గుండతుంగ రూ.చూ. గుండ్రతుంగ. వి. గుండ్రతుంగ, దీర్ఘరాజం.

గుండపోరాకు వి. ఒకరకంకలుపుమొక్క.

గుండప్ప చూ. గుండు.

గుండబిగులు వి. పంటెంగచెట్టు, ఉత్తరసర్కారులు, దక్కను, కడప కర్నూలుల్లోని కొండలమీద పెరిగేఒకరకంచెట్టు. (Brideliamoutena).

గుండము రూ. గుండాము, గొండము. వి. 1. నిప్పులగుంట. రం.రా.యు. 290వ. 20 వం ; 2. నద్యాదులలోతుభాగం. విక్ర. 5.170 ; 3. తనంతటఏర్పడిన జలాశయం ; 4. పెద్దనున్న.

సం. *కుండ-*. నిప్పులగండం, గొయ్యి, నుయ్యి.

క. *గుండి-*. రంధ్రం, గుంట, వల్లం ; తు. *కుండ*. గొయ్యి ; త. కుంతుం.

<సం. కుండ-. ద్రావిడశబ్దంకావచ్చు.

గుండావడిపోవు అ.క్రి. కష్టాల్లోపడు.

గుండవ వి. 1. దాసి ; 2. బానిస.

గుండవిసె వి. అవిసెలో ఒక రకం.

గుండా[1] రూ.చూ. గుండ[3]. ప్రత్య. పంచమీవిభక్తిప్రత్యయం.

గుండా[2] విశే. 1. ధీరుడు ; 2. పోకిరి, గడుసరి.

హిం. *గుండా-*.చెడుమార్గం అనుసరించేవారు, బద్మాష్; మరా. *గుండా-*. కుమార్గగామి, దూర్తుడు.

సం. *గుండక-*.

<హిం. గుండా.

గుండాతనము రూ. గుండతనము. వి. పొగరుబోతుతనం.

గుండాం[1] చూ. గుండము. వి. గాతం, పునాదికై తవ్విన పొడుగాటిగుంట.

గుండాం[2] బియ్యంగాలించడానికి వాడేమట్టిపాత్ర.

గుండాడు చూ. గుండ[2].

గుండానగ చూ. గుండు.

గుండానవ వి. ఆనపలో ఒకరకం.

గుండావడిపోవు చూ. గుండము.

గుండాపిండియగు చూ. గుండ[2]. అ.క్రి. ధ్వంసమగు, పిండి పిండిఅగు.

గుండాము రూ.చూ. గుండము. వి. 1. యాగం, క్రతువుల్లో నిర్మించబడిన అగ్నిహోత్రగుండం ; 2. గుండ్రంగా గోడ లేకుండానే కుండలు మొ. అమర్చిఎర్రగా వచ్చేటట్లుకాల్చే ఆముకుప్పాం.

గుండాయ్నట్టి రూ.చూ. గుండునట్టి. వి. కిందిభాగంచదరంగా ఉండే మట్టిపాత్ర.

గుండారము రూ.చూ. గూడారము. వి. డేరా.

గుండారు వి. 1. లుంగీ ; 2. చీర, కోక.

గుండాల వి. జలోద్భవ, వృక్షవిశేషం.

గుండాలచిప్ప చూ. గుండు.

గుండాలు వి.బ.వ. కుచ్చెళ్ళు.

గుండావర్తం వి. గోడకాలు, కరగోడ.

గుండానట్టి రూ.చూ. గుండునట్టి. వి. గుండ్రటిమట్టిపాత్ర.

గుండి[1] రూ. గుండీ[2]. వి. 1. మోటబావిబొక్కెనపైన మోకు తగిలించే ఇనపరింగు ; 2. గుండకొయ్య.

గుండి[2] రూ.చూ. గుండిగ. వి. 1. పెద్దబిందె ; 2. ఒకరకం వంటపాత్ర.

గుండిక రూ.చూ. గుండిగ. వి. పెద్దబిందె.

గుండిక్కుండ్లు చూ. గుండుకుండ. వి.బ.వ. గుండ్రంగాఉండే మట్టిపాత్ర.

గుండిగ రూ. గుండి[2], గుండిక, గుండీ[3]. వి. వెడల్పునోరు గల లోహపాత్ర.

సం. కుండికా. జలపాత్ర; ప్రా. *కుండిగా*, *కుండియా*, కుండీ. ఒకపాత్ర.

క. *గుండిగె*. పెద్దమట్టి లేదా లోహపాత్ర ; త. కుంటికై.

<ప్రా. కుండిగా.

గుండిగంచు రూ.చూ. గుండుగంచు. వి. గుండంచు, పాత్రల మూతికింద మాడుపెట్టి పైనకడియంచుట్టినట్లు చేసినఅంచు.

గుండిగె వి. 1. గొంతు ; 2. కంఠధ్వని.

పో.చూ. క. *గుండిగె*. గుండెకాయ.

గుండియ రూ.చూ. గుండె. వి. 1. గుండె. హరి.ఉ. 7, వేంక. పంచ. 4.86 ; 2. దారవ.

గుండియగూడువట్టు (-పట్టు) స.క్రి. హృదయంచిక్కబట్టు కొను. బహుళా. 4.60. గుండియయదురు (-అదురు) అ.క్రి. భయపడు. శుక. 1.458. గుండియలు క్రుళ్లఁదన్ను స.క్రి. బాగుగాతన్ను. శుక. 3.627.

గుండినక చూ. గుండు.

గుండీ[1] వి. బొత్తాం.

క. *గుండి-*. బొత్తాం ; త. *గొండి*.

గుండీ[2] రూ.చూ. గుండి[1]. వి. అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ.

గుండీ[3] రూ. గుండిగ. వి. 1. గుండ్రటివంటపాత్ర ; 2. బరణి, డబ్బా ; 3. ఒకరకంపువ్వు.

గుండీపెనం రూ.చూ. కొండీలుపెనం. వి. పిండివంటలు చేసుకొనేమట్టిపాత్ర.
గుండీసుబల్ల వి. గుండ్రటిరాతిముక్క.
గుండీసురాయి వి. 1. ఎఱ్ఱరాయి. ఇది 'క్వార్ట్జ్' జాతికి చెందిన మిశ్రశిల ; 2. కనికరాయి.
గుండు వి. ఔ. 1. లంగరు. దశకు. 10.68 ; 2. పిరంగి, తుపాకీలోనగువాటిగుండు. ఉ. హరి. 3.36 ; 3. పెద్ద రాయి. ఉ.హరి. 4.26 ; 4. పర్వతం. నరస. 2.129 ; 5. నగలలో అమర్చేరాయి. శుక. 2.332 ; 6. గుండ్రపు రాయి. ఆం. భా. 2.29 ; 7. ఉండ, గోళకం. ఆం.భా. 2.275 ; 8. తూనికరాయి ; 9. కపిలెగుండు ; 10. గుఱ్ఱం ; 11. సున్న ; 12. చుట్టుగుడుసునడికొప్పున కట్టే రవ్వలచుట్ట ; 13. పెండి ; 14. చెక్కడంలోని గుండ్రనిభాగం ; 15. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు ; 16. గింజలు రాల్చటానికి పడుగుమీద తోలించే రాతిగుండు లేక 'రోలరు' ; 17. పలకమరమగ్గంలో పన్నె బిగించిన పైచెక్క లేదా కింది చెక్క ; 18. నూలులెక్క, లడీలో 70వ వంతునూలు ; 19. చేతిమగ్గం పన్నెబిగించిన కిందికొయ్య ; 20. దూది ఏకేటప్పుడు కమానునరంకొట్టే కొయ్యబడితె, గూటం ; 21. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు, నవలక్షగుండు ; 22. అంచుతో అడ్డంగా పట్టెమాదిరిగా నేసిననేత ; 23. పొడుగువైపు అంచులో నేసిన పట్టె, గడ్డ ; 24. జుట్టులేని తల. విణ. గుండ్రని, వర్తులమైన.

క. *గుండు*, గుండు, గుండ్రాలు, తుపాకిగుండు ; కొడ *గుండ్‌గల్*. గుండ్రని పెద్దరాయి ; తు. *గుండు* గుండ్రంగాఉండేది, బంతి, తుపాకిగుండు ; కొలా. *గుండ్*. రాయి ; నా. *ఘండ్*. రాయి.

పో.చూ. సం. *గండ*-. గుండ్రాయి.

గుంటిక్రోవి వి. 1. ఒకరకంతుపాకి ; 2. బాణానంచా.
గుండంచు² చూ. గుండ్రంచు. వి. పాత్రలమూతికి కింద మాడులాగపెట్టిపైన కడియం చుట్టినట్టు చేసినఅంచు. గుండటికె వి. గుండ్రంగా ఉండే చిన్నమట్టిపాత్ర. గుండప్ప వి. రాయి, నర్సేటప్పుడు వాటలోపల మోపుగా పెట్టుకొనే గుండ్రటిరాయి. గుండానగ వి. ఒకరకం ఆనప. గుండానప వి. ఆనపలో ఒకరకం. గుండాలచిప్ప వి. లోపలచిన్న రాళ్ళుఅతికించి చేసినమట్టిచిప్ప. గుండినక వి. పెద్దకణాలుగా ఉండే ఇనక <గుండు+ఇనక. గుండుక రూ.చూ. గుంటక. వి. మెట్టచేనును చదును చేసేపనిముట్టు. గుండుకటారి వి. ఒకగీరలాహిరిపడేట్టు నేసినఅంచుడిజైను. గుండుకడవ వి. గుండ్రంగాఉండే సాదా మట్టిపాత్ర. గుండుకంటం వి. పాత్రల మూతికికింద మాడులాగపెట్టి పైన కడియంచుట్టినట్లుచేసిన అంచు. గుండుకమ్మి వి. బిళ్ళ కమ్మి, కొంగులో ఒకేరంగుది, బెత్తెడువెడల్పు పట్టెమాదిరిగా నేసినకమ్మి. గుండుకాగు వి. గుండుబాన, రెండుమూరలఎత్తులో ఉండి ధాన్యం నిలవచేసుకోడానికి వాడే మట్టిపాత్ర. గుండుకాలు వి. ఔ. సీరుకాలు, మోటబొక్కెన వలిగానికి వేసిన అర్ధ చువ్వ. గుండుకుండ రూ. గుండుక్కుండ, గుండ్రకుండ, దుండుకుండ. వి. గుండ్రంగా ఉండే మట్టిపాత్ర. గుండుకుప్ప వి. గుండ్రంగా వేసిన గడ్డికుప్ప. గుండుకూజా వి. గుండ్రంగా ఉండే కూజా. గుండుకొట్టం వి. చుట్టు గుడిసె, గుండ్రటి గుడిసె. గుండుకొట్టించుకొను అ.క్రి. బుర్రగీయించుకొను. గుండుకొట్టు స.క్రి. భంగుతాగు. గుండుకొను స.క్రి. చుట్టుకొను. ఆవరించు. వాశిష్ఠ. 4.103. అ.క్రి. గుంపుకట్టు. గుండుకొమ్ము రూ. గుండుగొమ్ము. వి. లోపలివైపుకు గుండ్రంగా తిరిగి కొనలు కలిసిన కొమ్ము. గుండుకొయ్య వి. గుది, దొంగగొడ్లకు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య. గుండుకోవి వి. 1. ఒకరకం ఫిరంగి ; 2. పెట్లదిమ్మ. గుండుక్కుండ రూ.చూ. గుండు కుండ. వి. గుండ్రంగా ఉండే మట్టిపాత్ర. గుండుగంచు రూ. గుండిగంచు. వి. గుండంచు, పాత్రల మూతికి కింద మాడుపెట్టి పైన కడియం చుట్టినట్లు చేసిన అంచు. గుండుగఱ్ఱ (-కఱ్ఱ) వి. దోనె (కొయ్య), అచ్చుపోసిన పచ్చిపెంకును వంచేసాధనం. గుండుగల్లకోక వి. ఒకరకం నేతచీర. గుండుగల్లు (-కల్లు) వి. గుండ్రాయి, నన్నెకంటి పోత్రం. గుండుగాజె వి. ధాన్యం దాచడానికి వాడే పెద్ద మట్టిపాత్ర, నాలుగు వలయాలను చేర్చి అమర్చి చేసిన గట్టి మట్టిపాత్ర. గుండుగాడి రూ. గుండుగాడెం, గుండుగాల. వి. గుండుగాల, గుండుదోనె, చేతిమగ్గం గుండుకు పన్నె కింద వైపు బిగించటానికి చేసిన నందు. గుండుగాడెం రూ.చూ. గుండుగాడి. వి. గుండుగాల, గుండుదోనె, చేతి మగ్గం గుండుకు, పన్నె కిందవైపు బిగించటానికి చేసిన నందు. గుండుగాల రూ.చూ. గుండుగాడి. వి. గుండుగాడి, చేతి మగ్గం గుండుకు, పన్నె కిందివైపు బిగించటానికి చేసిన నందు. గుండుగిద్ద వి. పై భాగం గుండుగా ఉండే మట్టిగిన్నె. గుండుగిలు అ.క్రి. చుట్టచుట్టుకొనిపడు, చాప చుట్టుగాపడు. నిర్వ. రా. 5.58. గుండుగుడిసె వి. చుట్టుగుడిసె, గుండ్రటిగుడిసె. గుండుగుత్త వి. సమస్త స్వాతంత్ర్యాలతో ఇచ్చే గుత్త. గుండుగుఱ్ఱము వి. రాతి గుఱ్ఱం. గుండుగూడు[1] (-కూడు) అ.క్రి. నిలుచు, ఒక్కసారిగా పూను, గుంపుకట్టు. గుండుగూడు[2] వి. గుండ్రంగా ఉండే గూడు. గుండుగూడుకొను (-కూడుకొను) అ.క్రి. గుండుకొను, కలియు, ముట్టడించు. గుండు గూలఁగఁగొట్టు (-కూలఁగఁగొట్టు) స.క్రి. పొడిపొడిచేయు. రుక్మాం.చ. 3.10. గుండుగొమ్ము (-కొమ్ము) రూ.చూ. గుండుకొమ్ము. వి. లోపలివైపుకు గుండ్రంగా తిరిగి కొనలు కలిసిన కొమ్ము. గుండుచువ్వ వి. మగ్గం దండెదగ్గర, నేత పడుగులో దూర్చిన చువ్వ. గుండుజల్ల రూ. గుండుజెల్ల. వి. 1. పెద్దగంప ; 2. బండిజల్ల, ఒకరకం ఎరువుజల్ల. గుండుజాడి వి. మట్టితో చేసిన చిన్న జాడి. గుండుజెల్ల రూ.చూ. గుండుజల్ల. వి: 1. పెద్ద గంప ; 2. బండిజల్ల. గుండుజొన్న వి. గింజ, కంకికూడ ముద్దగా గుండ్రంగా ఉండే పచ్చజొన్నలో కొన్నిరకాలకు చెందినది. గుండుతపాళ రూ. గుండ్రతెపాళ. వి. తపేలాకుండ, కొంచెం ఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కివంచి మూతి వెడల్పుగా చేసినట్టి మట్టిపాత్ర. గుండుతాడు వి. నవలక్షగుండు

వేలాడదీసిన దారం. గుండుదాక రూ.చూ. గుండ్రదాక, వి. అంచు గుండ్రంగా లోతుగా ఉండే మట్టిపాత్ర. గుండుదోమగ వి. మగ్గం మీద, నేతగుడ్డ చుట్టే ఒకరకం దోనె. గుండుదోనె వి. 1. నక్కనిదోనె, సావుగోట్టం, గుండ్రంగా తయారు చేసిన మట్టితూము ; 2. చేతి మగ్గం గుండుకు పన్నె కిందివైపు బిగించడానికి చేసిన సందు; 3. మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం. గుండునూలు వి. జమిలినూలు, రెండు పోగులు కలిపి పురిపెట్టిన మిల్లునూలు. గుండుపవ వి. గుండుకొమ్ము, లోపలి వైపుకు గుండ్రంగా తిరిగి కొనలు కలిసిన కొమ్ము. గుండువరకపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను. గుండువరుపుకుంచి రూ.చూ. గుండుపరుపుకుంచె. వి. వరి అడుగుభాగం గుండ్రంగా ఉన్న కుంచె. గుండువరుపుకుంచె రూ. గుండుపరుపుకుంచి. వి. వరి అడుగుభాగం గుండ్రంగా ఉన్న కుంచె. గుండువలక వి. 1. చేతి మగ్గం పన్నె బిగించిన కింది కొయ్య ; 2. మరమగ్గంలో, పన్నె బిగించిన కింది కొయ్య. గుండుపునుఁగు రూ.చూ. గుండుఁబుల్లు. వి. చక్రవాకం. గుండుపురుగు వి. ఆకులకు, కొమ్మలకు పట్టే నల్లటిపేను. గుండుపులుఁగు రూ.చూ. గుండుఁబుల్లు. వి. చక్రవాకం. గుండుపెంకు వి. కొప్పుపెంకు, ఇంటి కప్పుకు వాడే గుండ్రని పెంకు. గుండుపెంది వి. చుట్టుపెంది, మొలతాడుపెంది, గుండ్రంగా అల్లినపెండె. గుండుపొదుగు వి. కుండపొదుగు. గుండుపొయ్యి వి. ఒకటే చుట్టు కైవారంగా గుండ్రంగా ఉండే మట్టిపొయ్యి. గుండుబద్ద వి. 1. దూది ఏకేటప్పుడు, కమాను నరం కొట్టే కొయ్య బడితె ; 2. కీపరు (పట్టె), ఇంటికప్పు వేయడంలో వాడే పలచని చెక్క. గుండుబల్ల వి. మరమగ్గంలో పన్నె బిగించిన కొయ్య. గుండుబాన వి. 1. గుండుకాగు ; 2. ధాన్యంనిల్వకు రెండు మూరల ఎత్తున్న మట్టిపాత్ర. గుండుబాయి రూ.చూ. గుండుబావి. వి. గోలుబావి, గుండ్రటి చుట్టుగోడల బావి. గుండుబావి రూ. గుండుబాయి. వి. గోలుబావి. గుండుబిళ్ళ వి. రకరకాల రంగుల పట్టె వరసగా వచ్చేటట్లు నేసిన జంపఖానా. గుండుబుడ్డి వి. సాటుబుడ్డి, గుండ్రంగా మూతి బోసిగా ఉండే పాత్ర. గుండుబెండారు అ.క్రి. చలించు, స.క్రి. కదలించు. గుండుబెండు వి. ఇలారం ఇటు అటు బెనగకుండ చుట్టూ కట్టిన కట్టు. గుండుబొక్కెన వి. గుండ్రటి బొక్కెన. గుండుమక్కా వి. రాయలసీమ ప్రాంతంలోని ఒకరకం దోస జాతి మొక్క. గుండుమలుపుగాఁడు వి. పక్షి విశేషం. గుండుమల్లె వి. వృత్తమల్లిక, బొండు మల్లె, మల్లెజాతికి చెందిన ఒక మొక్క, తెల్లగా, ముద్దగా ఉండే పూలుపూస్తుంది (Jasminum Sambac). గుండుమిటుకుళ్ళు వి.బ.వ. తెలంగాణాలో పెసల మాదిరిగా ఉండే ఒకరకం ధాన్యం. గుండుమూకుడు వి. గుండంచు ఉండే మూకుడు. గుండుమేకు వి. గుబ్బ గంధపుబొట్టెల మీద బలానికి అలంకారానికి నాటిన గుండ్రటి మేకు. గుండుఁబులుఁగు రూ.చూ. గుండుఁబుల్లు. వి. చక్రవాకం. గుండుఁబులుఁగులవేఁటకాఁడు వి. చంద్రుడు. బహుళ. 3.59 గుండుఁబుల్లు రూ. గుండుపునుఁగు, గుండుపులుఁగు, గుండుఁబులుఁగు. వి. చక్రవాకం. రాజవా. 3.29. గుండురాయి వి. ౙౌ. 1. పాలరాయి, ఇది 'ఫెల్‌స్పార్' అని సాంకేతికంగా పిలవబడేరాయి ; 2. గుండు, గుండ్రంగా ఉండే రాయి. గుండురాసి వి. మేలు రాశి, తూర్పార పట్టి గుండ్రంగా పోసిన మేలుగింజల కుప్ప. గుండురుమాలు వి. తలకు గుండ్రంగా చుట్టుకోటానికి నేసిన తెల్లపాగ. గుండురోతు రూ.చూ. గుండ్రౌతు. వి. గుండు, గుండ్రంగా ఉండే రాయి. గుండులంగరు వి. గుండకాలు. గుండుల్‌నీరుగ క్రి. విణ.ద్రు. రాళ్ళు కరిగేటట్లు. ఆము. 6.7. <గుండు + -లు + నీరు + -అగు + -అ[1]. గుండుల్లగడ్డ రూ.చూ. గుండుల్లిగడ్డ. వి. తెలంగాణాలో ఒకరకం ఉల్లిభేదం. గుండుల్లిగడ్డ రూ. గుండుల్లగడ్డ. వి తెలంగాణాలో ఒకరకం ఉల్లిభేదం. గుండువేయు అ.క్రి. 1. తుపాకి పేల్చు ; 2. అడ్డుపెట్టు ; 3. చచ్చు. గుండువేస్తే అందకుండాపెళ్ళు అ.క్రి. కనిపించకుండాపోవు. గుండువోర (-ఒర) వి. రాయిబిళ్ళ, చేదబావికి పైనపెట్టే గుండ్రని మట్టి ఒర. గుండుసట్టి (-చట్టి) రూ. గుండాయిసట్టి, గుండాసట్టి. వి. గుండ్రంగాఉండే చిన్న మట్టిపాత్ర. గుండుసపోటా వి. రాయలసీమలోని ఒకరకం సపోటా. గుండుసాల వి. మద్రాను చుట్టుఉన్న మండలం, సుప్రీంకోర్టు అధికారం కిందఉన్న మద్రాసు విస్తీర్ణం. గుండుసుత్తి వి. రాతిపని వాళ్ళువాడే ఒకరకం సుత్తె. గుండుసున్న వి. గుండ్రని సున్న. విణ. పూర్తిగా చెడిన. గుండుసున్నఅగు అ.క్రి. పని చెడిపోవు. గుండుసూది వి. తలగల సూది, పైన గుండు కల చిన్నసూది. గుండుసూల చూ. గుండాము. వి. గుండ్రంగా గోడ లేకుండానే కుండలు మొ. నవి అమర్చి ఎర్రగా వచ్చేటట్లుకాల్చే ఆము. గుండుసెనగ వి. కోస్తా జిల్లాలలోని ఒకరకం సెనగ. గుండుసొర వి. సొరతీగె మొక్కలలో ఒకరకం. గుండూరు వి. 1. పలయాకారం ; 2. వర్తులం. గుండెనల వి. గుండ్రంగా ఉండే చిన్న మట్టి పాత్ర. <గుండు + ఎనల. గుండ్రా రూ. గుండ్రాయి. వి. ౙౌ. 1. సన్నెకల్లు. మను. 5.17 ; 2. పెద్దరాయి. గుండ్రాయి రూ.చూ. గుండ్రా. వి.ౙౌ. 1. పెద్దరాయి, అచ్చ.రా. బాల. 148 ; 2. సన్నెకల్లు, పొత్రం. గుండ్రాళ్ళు వి.బ.వ. 1. కొన్నలు నానవేసి దంచిన తర్వాత నిలబడే గట్టి గింజలు ; 2. బెల్లం మొదలైనవి పొడిగా దంచటానికి ఉపయోగించే రాళ్ళు, నకిలరాళ్ళు. గుండ్రౌతు రూ. గుండురౌతు, గుండ్రౌతు. వి. గుండు. గుండ్రంగా ఉండే రాయి. గుండ్లచీర వి. ఒకరకం నేతచీర. గుండ్లచెల్లా రూ. గుండ్లసెల్లా. వి. ఎదురకోళ్ళ సెల్లా, ఒకరకం కండువా. గుండ్లజాతిగొంగడి వి. చారల చారల డిజైన్లు నేసిన ఒకరకం గొంగడి. గుండ్లంచు వి. పట్టెలు పట్టెలుగా నేసిన అంచు. గుండ్లటిక్కులజాడి వి. చారలు చారలుగా నేసిన ఒకరకం గొంగడి డిజైను. గుండ్లదండ వి. గళ్ళసరం, ఆభరణ విశేషం. గుండ్లపేరు వి. గుళ్ళదండ, ఆభరణ విశేషం. గుండ్లసెల్లా రూ.చూ. గుండ్లచెల్లా. వి. ఒకరకం కండువా, ఎదురకోళ్ళసెల్లా. గుండ్లు వి.బ.వ. 1. ఎత్తెగుండ్లు, సాలె తయారీలోపల పెట్టెపెదురు చువ్వలు ; 2. రాళ్ళు.

గుండ్లుగూల్చినభంగిన్(-కూల్చినభంగిన్) అవ్య.ద్రు. పైనుంచి రాళ్ళు దొర్లించినట్లు. కు.సం. 6.105. గుండ్లుతేలిబెండ్లు మునిగినట్లు అవ్య. అస్తవ్యస్తమయినట్లు. గుండ్లుబెండ్లాడు స.క్రి. చలింపచేయు, కదలించు. రం.రా. ఉ. 10 ప. 14. వం.

గుండుక రూ.చూ. గుంటక. వి. పావటం.

గుండుకదిర వి. దక్కను కర్ణాటకల్లో పెరిగే ఒక మొక్క (Gruriapopulifolia).

గుండుమాద వి. వంటచెరకుగా ఉపయోగించే ఒక మొక్క. (Auicennia officinatis).

గుండూరు చూ. గుండు.

గుండె రూ. గుండియ. వి. **1.** ధైర్యం. భార. అరణ్య. 6.197; **2.** మనసు. హరి.పూ. 5; **3.** గుండెకాయ, హృదయం. ఉ.రా. 1.149.

క. *గుండిగె.* గుండెకాయ; తు. *గుండిగె, గుండె కాయ్.* గుండెకాయ, ధైర్యం, వక్షస్సు; త. *కుంటి.* గుండె; మ. *కుంటిక్కాయ్.* గింజలేని జీడిమామిడి పండు; పర్జి. *గుండెర్-కాయ.* గుండె.

**గుండెఅగిపోవు** అ.క్రి. **1.** దిగ్భ్రాంతి కలుగు; **2.** మరణించు. **గుండెకాయ** వి. కాయవలె ఉండే హృదయావయవం, కందనకాయ. భార.ద్రోణ. 3.95. **గుండెకుళ్ళు** వి. అంబేర, అప్రయోజకుడు. **గుండెగతుక్కుమను** అ.క్రి. భీతి కలుగు. **గుండెగాలము** వి. హృదయ శల్యం. **గుండెగాలి** వి. ప్రాణవాయువు. **గుండెగుబ్బుమను** అ.క్రి. గుండె జల్లుమను. కళా. 4.21. **గుండెగూడగట్టు (-కూడగట్టు)** అ.క్రి. మనసు దృఢపరచుకొను. విష్ణుపు. 1.157. **గుండెగూడుదిగు** అ.క్రి. గుండెమీది బరువు తొలగిపోవు, దిగులుతీరు. కాశీ. 2.61. **గుండెగూడుపట్టు** రూ. గుండె గూడువట్టు. అ.క్రి. ఎంత బాధలున్నా గుండె బిగబట్టుకొను. బహులా. 4.60. **గుండెగూడువట్టు** రూ.చూ. గుండె గూడుపట్టు. అ.క్రి. ఎంత బాధలున్నా గుండె బిగబట్టుకొను. **గుండెగొంతుకలోకొట్లాడు** అ.క్రి. మాట పెగలనీయనంత భావోద్రేకం కలుగు. **గుండెచిక్కబట్టుకొను** అ.క్రి. గుండె దిటవు కల్పించుకొను. **గుండెచెక్కలగు** అ.క్రి. హృదయ విదారకమగు. **గుండెచెదరు** అ.క్రి. **1.** బెదరు; **2.** జాలికలుగు. **గుండెచెఱువగు** అ.క్రి. భయ కంపితమగు. **గుండెచెఱువుచేసికొను** అ.క్రి. భయపడు. **గుండెచేర్లు** వి.బ.వ. పశువుయొక్క ఎదురు రొమ్ముపైన ఉబికే ఉబ్బు జబ్బు. **గుండెజల్లుమను** అ.క్రి. భయపడు. మను. 5.19. **గుండెఝల్లను** అ.క్రి. **1.** బెంగగొను, దిగులుపడు. పండి.చ.పూ. 2.467 ప.; **2.** బెదరు. **గుండెతల** వి. వక్షం, రొమ్ము. దశకు. 6.148. **గుండెతల్లడము** వి. భయంకరం, గుండె బెదురు. **గుండెదిగులు** రూ.చూ.గుండె దివులు. వి. **1.** శత్రువు; **2.** మనోవ్యాధి. **గుండెదివులు** రూ. గుండెదిగులు. వి. మనోవ్యాధి. శుక. 3.20. **గుండెధైర్యము** వి. ధైర్యం. **గుండెనీరగు** అ.క్రి. **1.** మిక్కిలి బెదరు; **2.** జాలిపడు; **3.** భయభ్రాంతి కలుగు. **గుండెపగులబొడుచు (-పొడుచు)** స.క్రి. గట్టిగా చావుపోటు పొడుచు. **గుండెపగులు** అ.క్రి. **1.** మిక్కిలి (బెదరు) బెంగగొను; **2.** భయం కలుగు. **గుండె పటుక్కనన్** అవ్య.ద్రు. గుండెలో బాధ కలుగగా. శుక. 3.215. <గుండె పటుక్కు+అను+అ[7]. **గుండెపట్టు** అ.క్రి. గుండెలో నొప్పి వచ్చు. **గుండెపట్టుకొను** అ.క్రి. **1.** ధైర్యం తెచ్చుకొను. ప్రబోధ. 3.40; **2.** గుండె నొప్పి కలుగు. **గుండెపైచేయిడినిద్రపోవు** అ.క్రి. ఆదమరచి నిద్రపోవు. **గుండెబలం** వి. ధైర్యం, స్థైర్యం. **గుండెబెదరు** వి. భీతి, వెరపు. **గుండెభగ్గుమను** అ.క్రి. దిగులు కలుగు. సారంగ. 2.270. **గుండెముక్కర** వి. పశువుల గుండె జబ్బు, నెరిదె. **గుండెముక్కు** వి. గుండె ముక్కర, పశువుల గుండె జబ్బు. **గుండెమునర** వి. ముసరలో దొమ్మవావు. **గుండెరాయిచేసికొను** అ.క్రి. ఏదోవిధంగా అతికష్టంపై గుండె దిటవు కల్పించుకొను. **గుండెరోమాలుమొలిచినవాడు** వి. ధైర్యశాలి, ధీరుడు. **గుండెలపైకుంపటి** వి. అతి సన్నిహితమై ఎల్లవేళలా వేసే దిగులు, భారం. **గుండెలపై బండగాతయారగు** అ.క్రి. భారంగా, బాధాకరంగా పరిణమించు. **గుండెలమీదబరువుదించు** స.క్రి. దిగులును తగ్గించు. **గుండెలలోనిద్రపోవు** అ.క్రి. భయంకరంగా ఉండు. **గుండెలు** వి.బ.వ. హృదయం. **గుండెలుకొట్టుకొను** అ.క్రి. భయంకలుగు. **గుండెలుద్రుక్కుల్లు** అ.క్రి. దిగులుపడు. భోజ. 6. **గుండెలుజారిపోవు** అ.క్రి. ధైర్యం సడలు, దిగులు కలుగు. **గుండెలుతీసినబంటు** వి. **1.** మహాధీరుడు; **2.** బంటువలె దయాదాక్షిణ్యం లేనివాడు; **3.** కఠిన హృదయుడు. **గుండెలునీరగు** అ.క్రి. ధైర్యం చెడు. జైమినీ.భా. 8.156. **గుండెలుపగిలిపోవు** అ.క్రి. ఎక్కువ భయాందోళనలు పడు. **గుండెలుబాదుకొను** అ.క్రి. దుఃఖావేశాల్ని తెలుపుతూ గుండెల్ని చేతుల్తో కొట్టుకొను. **గుండెలేనివాడు** వి. భీరువు. **గుండెలోగాలము** వి. హృదయ శల్యం, భయ కారణం. **గుండెలోరాయిపడు** అ.క్రి. నిరాశ కలుగు. **గుండెల్లోరైళ్ళు పరిగెత్తు** అ.క్రి. వ్యాకులపడు, కలతచెందు. **గుండెవగరు** వి. పశువులకు వచ్చే శ్వాసరోగ విశేషం. **గుండెవట్టు (-పట్టు)** అ.క్రి. దిటముకొను, బలపడు. **గుండెవావు** వి. రొమ్మువావు, పశువుల వ్యాధి విశేషం. **గుండెసెల** వి. గుండె పట్టుకు పోవటం, గుండెబిగియటం.

గుండెసల చూ. గుండు.

గుండ్ర[1] విణ. వర్తులమైన.

**గుండ్రకుండ** రూ.చూ. గుండుకుండ. వి. గుండ్రంగా ఉండే మట్టి పాత్ర. **గుండ్రకొమ్ము** వి. గుండుకొమ్ము. **గుండ్రకొయ్య** వి. సంగటికోల, పత్తిరాట్నం నిలువుల మధ్య యాళ్ళకర్ర మాదిరిగా ఉండే కట్టె. **గుండ్రగుబ్బ** వి. బొడ్డుగొయ్య. మగ్గంమీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమ ప్రక్కన నేలలో పాతిన గూటం. **గుండ్రజాడి** వి. గుండుజాడీ. **గుండ్రంచు** చూ. గుండంచు. వి. పాత్రల మూతికి కింద మాడులాగా పెట్టి పైన కడియం చుట్టినట్లు చేసిన అంచు. **గుండ్రటటిక** రూ.చూ. గుండ్రటిక. వి. గుండ్రంగా ఉండే చిన్న మట్టి పాత్ర. **గుండ్రటిక** రూ. గుండ్రటటిక. వి. గుండ్రంగా ఉండే మట్టి పాత్ర. **గుండ్రతనము** వి. వర్తులత. **గుండ్రతుంగ** రూ. గుండతుంగ.

వి. ఒకదినుసుముస్త. గుండ్రతెపాళ రూ.చూ. గుండుతపాళ. వి తపేలాకుండ, కొంచెంఎత్తుగా గుండ్రంగా అంచు వెనక్కి వంచి మూతిపెడల్పుగా చేసిన మట్టిపాత్ర. గుండ్రదాళ. రూ. గుండుదాళ. వి. అంచుగుండ్రంగా లోతుగా ఉండే మట్టిపాత్ర. గుండ్రన వి. వర్తులత. విశ. వర్తులమైన. గుండ్రనతనము వి. వర్తులత. గుండ్రని విశ. వర్తులమైన. గుండ్రనితనము వి. వర్తులత. గుండ్రనిది వి. గోళాకార వస్తువు. గుండ్రనైన విశ. వర్తులమైన. గుండ్రపంచు వి. గుండ్రంచు. గుండ్రపంచుకుండ వి. గుండ్రంచుకుండ, అన్నం వండడానికి వాడేచిన్నమట్టిపాత్ర. గుండ్రపాయ వి. ఒక్కటే పెద్దగడ్డగా ఉండేరకం. గుండ్రపిడత వి. క్రరంచుండే మట్టిపాత్ర. గుండ్రపొయ్యి రూ. గుండ్రపొయ్యి, గుండ్రం పొయ్యి. వి. చుట్టుపొయ్యి, ఒకటేచుట్టుకై వారంగా గుండ్రంగా ఉండేమట్టిపొయ్యి. గుండ్రప్పొయ్యి రూ.చూ. గుండ్రపొయ్యి. వి. చుట్టుపొయ్యి. ఒకటేచుట్టు కైవారంగా గుండ్రంగా ఉండేమట్టిపొయ్యి. గుండ్రబాన వి. 1. గుండు కాగు ; 2. ధాన్యం నిల్వకు రెండుమూరల ఎత్తున్న మట్టిపాత్ర, గుండ్రరాసి వి. మేలురాసి, తూర్పారపట్టి గుండ్రంగా పోసిన మేలుగింజల కుప్ప. గుండ్రలు వి.బ.వ. 1. రసాన్ని తీయటానికై చెరుకు మొ. వాటిని నొక్కేరాట్నం కోలలు. కు. సం. 11.171 ; 2. పిండికొట్టి చెరిగితే వెనక్కినిలచిన ఉండలు ; 3. విత్తనాలకై ప్రత్యేకించి పెట్టిన వేరుసెనగ గింజలు ; 4. గుండ్రంగాఉన్న సాదామట్టిపాత్రలు ; 5. తిరగటాలు, భ్రమణాలు. గుండ్రసట్టి (-చట్టి) వి. గుండ్రంగా ఉండేచిన్నమట్టిపాత్ర, గుండుసట్టి. గుండ్రసాంబవులు వి.బ.వ. సాంబవుల్లో ఒకరకం. గుండ్రించు అ.క్రి. 1. తిరగబడు. కు. సం. 12.64 ; 2. త్రేచు. ద్వి. పరమ. 4.300 ప ; 3. కడుపులో తిప్పు గుండ్రింపు వి. గుండ్రించటం, తేన్పటం. గుండ్రు వి. గుండు. గుండ్రూసుతంతె వి. రౌండ్‌మెట్టు, గుండ్రంగా ఉండేమెట్టు.

గుండ్ర² వి. వృక్షవిశేషం. హంస. 4.9.

గుండ్ర³ రూ. గూండ్ర. వి. గుర్లగూబ కూత, ఘూకధ్వని.

గుండ్రలుకొను అ.క్రి. గుండ్ర గుండ్రమని ధ్వనిచేయు.

గుండ్రలుకొలుపు అ.క్రి. గుర్లగూబకూయు. భాగ. 1.342.

గుండ్రం వి. 1. ఇలారం, గుండు ; 2. వర్తులం, వలయాకారం.

గుండ్రంపొయ్యి రూ.చూ. గుండ్రపొయ్యి. వి. చుట్టు పొయ్యి. ఒకటేచుట్టు కైవారంగా, గుండ్రంగా ఉండేమట్టి పొయ్యి, గుండ్రంబట్టీ. వి. రౌండ్‌బట్టీ, గుండ్రంగాఉండే సున్నపుబట్టీ.

గుండ్రపుమెట్టు చూ. గుండ్రము

గుండ్రము విశ. వర్తులమైన.

సం. కుండల-. వలయం, గుండ్రన.

గుండ్రపుమెట్టు వి. రౌండ్‌మెట్టు, గుండ్రంగా ఉండేమెట్టు.

గుండ్రముకుంచము వి. గుండ్రని ఆకారంగల కుంచం.

గుండ్రా చూ. గుండు.

గుండ్రాయి చూ. గుండు.

గుండ్రాళ్ళు చూ. గుండు.

గుండ్రిగొర్రె వి. చెవులు అంటుకుపోయిన గొర్రె. కనీకనబడని చెవులుగలది.

గుండ్రించు చూ. గుండ్ర¹.

గుండ్రింపు చూ. గుండ్ర¹.

గుండ్రు చూ. గుండ్ర¹.

గుండ్రూసుతంతె చూ. గుండ్ర¹.

గుండ్రోతు చూ. గుండు.

గుండ్లకమ్మ వి. నదీవిశేషం, ఒకఏరు. కాశ. 3.188.

గుండ్లచీర చూ. గుండు.

గుండ్లచెల్లా చూ. గుండు.

గుండ్లజాతిగొంగడి చూ. గుండు.

గుండ్లంచు చూ. గుండు.

గుండ్లటిక్కులజాడి చూ. గుండు.

గుండ్లదండ చూ. గుండు.

గుండ్లపేరు చూ. గుండు.

గుండ్లసెల్లా చూ. గుండు.

గుండ్లు చూ. గుండు.

గుండ్లుగూర్చినభంగిన్ చూ. గుండు.

గుండ్లుతేలిబెండ్లు మునిగినట్లు చూ. గుండు.

గుండ్లుబెండ్లాడు చూ. గుండు.

గుతప రూ.చూ. కుదప. వి. కుదెప.

గుతాయించు స.క్రి. నిర్బంధించు, గూటించు.

హిం. గుధానా. ఒకదానిలో ఒకటి దాప్పించు.

<హిం. గుధా (నా). +-ఇంచు³.

గుతి రూ.చూ. గుది¹. వి. చేరుకట్టెలను రెంటినీ బిర్రుపెట్టటానికి కట్టిన చిన్నతాడు.

గుతిమెల వి. బిర్రుకట్టెమెల, బిర్రుకట్టె (తిరుగుడు) చెక్కకుతాడు కట్టిన చివరిభాగం.

గుతుపకట్టె వి. దుడ్డుకర్ర, బడిత.

గుతుప రూ.చూ. గుదిపె. వి. గూటం, కొట్టేకొయ్యబడిత.

గుత్త రూ. గుత్తు². వి. 1. భూమ్యాదుల్ని తగినఫలమివ్వటానికి ఒప్పుకొని అనుభవంలో ఉంచుకోవటం. పి. శకు. 4.175 ; 2. సమస్తం ఒకసారికి వెలకు కొనటం ; విశ. గుత్తకు తీసుకోబడిన. బహుళా. 5.81.

క. గుత్తిగె-. గుత్తె-. భూమిమీద కౌలు రూపంలో వచ్చే ఆదాయం ; త. కుత్తకై.

గుత్తకాడు రూ. గుత్తగాడు. వి. గుత్తకుపుచ్చుకున్నవాడు, పాలెగాడు. గుత్తగ రూ. గుత్తవ. వి. ముక్తా, ఇజారా. గుత్తగట్టు (-కట్టు) స.క్రి. గుత్తకిచ్చు. నీలా 1.118. గుత్తగా ఉంచుకొను స.క్రి. స్వంతంగాపెట్టుకొను. గుత్తగాడు రూ. చూ. గుత్తకాడు. వి. గుత్తకుపుచ్చుకొన్నవాడు. గుత్తగొను (-కొను) స.క్రి. గుత్తగాపుచ్చుకొను. కళా. 3.73. గుత్తచేలు వి.బ.వ. సంవత్సరానికి ఇంతడబ్బు అన్న ఒప్పందంపై సాగుకు తీసుకొన్నభూములు. పాండు. 3.16. గుత్తజట్టి వి. టోకునబేరం చేయటం. గుత్తదారు వి. కౌలుదారు. పార. - దార్. కలవాడనే అర్థంలో పారసీప్రత్యయం. గుత్తరైతు వి. కౌలుదారు. గుత్తలంజియ రూ. గుత్తలంజె. వి. సమూహంతో పోయేకులట, దండులంజె. గుత్తలంజె రూ.

చూ. గుత్తలంజియ. వి. దండులంజె. గుత్తలంజెకాఁడు వి. కోడెగాడు, బొజుగు, విటుడు. గుత్తవ రూ.చూ. గుత్తగ. వి. మక్తా, ఇజారా. గుత్తవట్టు (-వట్టు) స.క్రి. గుత్తగొను, ఆము. 6.69. గుత్తవారం వి. కౌలుదారు.

గుత్తకర్ర చూ. గుత్త. వి. మగ్గానికి పడుగులో, అచ్చుదగ్గర దూర్చినకర్ర.

గుత్తవుదాని చూ. గుత్తము².

గుత్తవుసాల చూ. గుత్తము¹.

గుత్తము¹ విశే. 1. హెచ్చుతక్కువలు లేకసరిగాఉండెడి, కచ్చితమైన. మను. 4.27 ; 2. కఠినమైన, గట్టి. వసు. 2.2 ; 3. బిగువు. నరస. 3. వి.

క. గుత్త-. ఇరుకు, బిగువు, సామీప్యం ; త. కుత్తె-. కడియంయొక్క కొక్కెం ; మ. కుతం-. బిగువుతనం.

గుత్తవుసాల రూ. గుత్తావుసాల. వి. పనులకొట్టం, ఇలారం.

గుత్తము² వి. గుప్తం, రహస్యం, గూఢం. భార. అరణ్య. 1.140.

క. గుత్త -. రహస్యం ;

సం. గుప్త -. రహస్యం.

<సం. గుప్త-.

గుత్తవుదాని వి. ఉంపుడు కత్తె. కృ. శకు. 1.80.

గుత్తాడు చూ. గుది¹.

గుత్తావుసాల రూ.చూ. గుత్తవుసాల. వి. నాలుగుపక్కలా పెనక దించినపాక.

గుత్తి రూ. గుత్తు¹. వి. 1. పూవులు, పళ్ళు, పూసలు మొ. వాటి గుచ్ఛం. కు.సం. 2.46 ; 2. చీలమండ, కాలి మొదలు. నిర్వ.రా. 4.61 ; 3. (కవ్వం యొక్క) బిళ్ళ, ముద్ద కవ్వం. భాగ. 8.208 ; 4. వన్యవృక్ష విశేషం హంస. 4.1 (Polycthia cersoides) ; 5. మణికట్టు కింది హస్త భాగం ; 6. కూరను కలపటానికి ఉపయోగించే పనిముట్టు ; 7. కష్టం.

క. గుత్తి. పళ్ళు, పువ్వులు మొ. వాటి గుచ్ఛం ; కొత్తు. గుచ్ఛం, గుత్తి. త. కొత్తు. గుచ్ఛం, గుత్తి ; కుచ్చు. గుత్తి, కుచ్చు, జడకుచ్చులు ; మ. కొత్తు. ఆకులు లేదా పూల గుచ్ఛం, గుత్తి.

సం. గుచ్ఛ-. పూల గుత్తి ; ప్రా. గుత్తి-.లత, శిరసున ధరించే పూలమాల.

గుత్తికట్ట వి. అరక కట్టే మోకు మొదలైన వి. గుత్తికట్టు వి. ముక్కుకట్ట పంటెకు కిందివైపున అకుల చివర్లను కామకు కలిపివేసిన కట్టు. గుత్తికంది వి. కందులలో ఒకరకం భేదం. గుత్తికవ్వము వి. వెదురు కొయ్య చివరను చీల్చి దారంతో కట్టి ఏర్పరచిన కవ్వం, గుత్తివలె ఉండే కవ్వం. గుత్తికాయలు వి.బ.వ. వేరుసెనగలు, బుడ్డలు. గుత్తికుసుమ వి. ఎన్ను ముద్దగా ఉండేరకం. గుత్తిక్రామగ వి. దంతధావనం, గుత్తినెమలుదుగు , వృక్ష విశేషం. గుత్తిగన్నేరు¹ వి. బర్మానుండి దిగుమతి చేయబడిన ఒకమొక్క, దీన్ని తోటల్లో పెంచుతారు (Kopsia fruticosa). గుత్తిగన్నేరు² వి. దేవాలయాల్లో పెంచబడే ఒక చెట్టు, నడుమ పచ్చగాఉండే తెల్లనిపూలు పూస్తుంది (Plumeria acutifolia). గుత్తిగుత్తులు వి.బ.వ. అక్కుళ్ళు, గుత్తిమల్లెలు. గుత్తిచిక్కుడు రూ. గుచ్ఛిక్కుడు. వి. గోరుచిక్కుడు. గుత్తిజల్ల వి. గుదిజల్ల. గుత్తిజిల్ల వి. మోట బొక్కెన తూములో దూర్చి మోకు జారకుండా వేసిన కొయ్య ముక్క. గుత్తినెమిలడుగుక్రామగ వి. స్నిగ్ధ పత్రం, ఫేనిలం. గుత్తినెమలదుగుమ్రాను వి. స్నిగ్ధ పత్రం, ఫేనిలం. గుత్తిపండ్లు వి.బ.వ. గుత్తులుగుత్తులుగా పండే పళ్ళు. గుత్తిపూసలు వి.బ.వ ఒకజాతి వడ్లు. గుత్తిబలుగుత్తులు రూ. గుత్తిబల్లుత్తులు. వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. గుత్తిబల్లుత్తులు రూ.చూ. గుత్తిబలుగుత్తులు. వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. గుత్తిబీర రూ.చూ. గుత్తిబీఱ. వి. బీరతీగవలెనే ఉండే ఒకరకం బీర, నప్తపత్రి. గుత్తిబీఱ రూ. గుత్తిబీర. వి. నప్తపత్రి, లముకోశాతకి. గుత్తిబుర్ర వి. గుత్తి వేరుసెనగ. గుత్తిమల్లెలు వి.బ.వ. ధాన్య విశేషం. భాను. 1.9. గుత్తిమొలకొలకులు వి.బ.వ. కోస్తాజిల్లాలలో పండే ఒకరకం వడ్లు. గుత్తివంకాయ వి. రెండు మూడేసి కలిసి గుత్తిగా కాసేరకం. గుత్తివడు (-వడు) అ.క్రి. 1. ముడుగు, ముడుచుకొను. కాశీ. 1 ; 2. కష్టపడు. గుత్తిసెనగ వి. వేరుసెనగ. గుత్తులు వి.బ.వ. ఒకరకం వడ్లు. గుత్తులుగున్నాయి వి. స్త్రీల ఆభరణ విశేషం. గుత్తులుగొను (-కొను) అ.క్రి. గుత్తులు బయలుదేరు. కు.సం. 4.87.

గుత్తిక రూ. గుత్తుక. వి. పాదం.

గుత్తికగువ్వ వి. కపోతాంఘ్రి, గువ్వ గుత్తిక.

గుత్తు¹ రూ.చూ. గుత్తి. వి. 1. గుత్తి, కొత్తు, గొత్తు, గుది ; 2. గెల ; 3. తాళం చెవుల గుత్తి.

గుత్తుగుత్తులు రూ.చూ. గుత్తులుగుత్తులు. వి.బ.వ. ఒక దినును వడ్లు. గుత్తులుగుత్తులు రూ. గుత్తుగుత్తులు. వి.బ.వ. ఒక దినును వడ్లు.

గుత్తు² రూ.చూ. గుత్త. వి. శిస్తు.

గుత్తుక రూ.చూ. గుత్తిక. వి. పాదం.

గుత్తుగుత్తు వి. మహాభయం కలిగినపుడు ప్రాణాలు కొట్టుకోటానికి అనుకరణం. హరి.పూ. 9.132.

గుత్తులకోల రూ.చూ. గుదులకోల. వి. పొట్టికోల, నేతపడుగు చివర పాయల కాళ్ళు కట్టిన కర్ర.

గుత్తులు చూ. గుత్తి.

గుత్తులుగున్నాయి చూ. గుత్తి.

గుత్తులుగొను చూ. గుత్తి.

గుత్ప రూ.చూ. కుదప. వి. కుదెప.

గుదగుద వి. పరితపించటంలోని అనుకరణం. క్రి.విశే.ద్రు. రహస్యంగా.

గుదగుదపడు అ.క్రి. పరితాపపడు. బసవ. 7.565. పం. గుదగుదమను అ.క్రి. పరితపించు, దిగులుకలుగు, కలతచెందు. బసవ. 6.264.పం. గుదగుదలాడు అ.క్రి. దగ్గుత్తికతో ఏడ్చు. గుదగుదలు వి.బ.వ. సందేహాలు. బసవ. 3.426 పం.

గుదలం వి. కొబ్బరి బొండాల పొపిర్లకు వేసిన ముడి.

గుదసా రూ.చూ. గుజస్తా. వి. గతసంవత్సరం. విణ. వెనుకటి సాలుకు సంబంధించిన.

గుదాం రూ.చూ. గోదాము. వి. ధాన్యాదుల్ని నిలవ ఉంచే పెద్దకొట్టు.

గుదాంగోలె వి. చర్మాలు ఉడక బెట్టే మట్టిపాత్ర.

గుది[1] రూ. గుజి, గుతి, గుదె[2]. వి. 1. ఆకులులోనగువాటి సరం. కు.సం. 2.211; 2. పూలు మొ. వాటి గుత్తి, దండ. ఉ.రా. 6.10; 3. పదాల కూర్పు; 4. కొబ్బరి చెట్టు మొ. వాటిని ఎక్కేటపుడు కాళ్ళకు తగిలించు కొనే బందం; 5. పశువులు బెదిరి పరిగెత్తి పోకుండ అడ్డుపడటానికి మెడలో జారవిడిచి కట్టిన లావుపాటి పొడవైన కొయ్య దుంట, గుదిపెండెం; 6. నూలులెక్క, రెండుల డీలు; 7. ఊర్తెగుది, పడుగు దాపేటప్పుడు, ఊర్తె అడ్డపట్టెనూ పడుగేరే కర్రనూ కలిపేతాడు; 8. అచ్చుగుది, అచ్చుకర్రకు పైన కట్టిన దారం; 9. జంత్రపుగుది, అచ్చుకొట్టే జంత్రం కొయ్యకు కట్టిన దారం; 10. పాయ, పడుగుపోగుల్లో కొంత భాగం; 11. పంటిగుది, దోనెగాడిలో, బద్దె చువ్వ బిగించటానికి, పుల్లకు కట్టిన తాడు; 12. బిగుతాడు, చేదు కర్రలకు మధ్యన రెంటినీ బిగించే పైతాడు; 13. పావతాడు, పూను గర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు; 14. మలగుది, పెనకోలకు తగిలించే మలగర్ర దారం; 15. పొట్టితాడు, నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం; 16. దనలి దారం వడికే పూన్పు కొమ్ముకు కట్టిన తాడు; 17. సర్వటి గుంజల అడ్డకట్టెకు జమళ్ళ బొంగుకు తగిలించినదారం; 18. రంగు అద్దటానికి రెండులడీలు కలిపి కట్టిన నూలు.

క. గుది. గుచ్ఛం; త. కొత్తు. గుచ్ఛం, గుత్తి, సమావేశం, కుటుంబం, కొంతు, పూలగుత్తి; మ. కొత్తు. ఆకుల, పువ్వుల గుత్తి.

గుత్తాడు రూ.చూ. గుద్రాడు. వి.బౌ. 1. ఊర్తెగుది; 2. తిరుగుడుగుది; 3. పొట్టితాడు, నేతపడుగులో చివరి పాయకు కట్టినతాడు; 4. అచ్చుగుది; 5. చేదు బిగితాడు. గుదికట్టు అ.క్రి. కాళ్ళుస్తంభించు, భారంమోపు, సమూహమగు. గుదికట్టె వి. గుదిమాను. గుదికమ్మి వి. కొండి, అచ్చుగుదులు తగిలించే వంకర ఇనపఊచ. గుదికర్ర రూ.చూ. గుదిగట్టి. వి. 1. నాటుకర్ర, బండిమీదజల్ల కదలకుండా చట్రంలో గుచ్చిన కొయ్యముక్క; 2. గెలవానం, ఒకదాని కొకటి తగిలించిన వాసాల జంట. గుదికుచ్చు స.క్రి. పేర్చు, కూర్చు. గుదికూర్చు స.క్రి. సవరించు. గుదికూర్పు వి. మాటలు మొ. వాటి కూర్పు, రచన. గుదికొయ్య వి. 1. పశువులుబెదిరి పరిగెత్తుకు పోకుండా అడ్డుపడటానికి మెడలో కట్టిన కర్ర, గుదిపెండెం; 2. గెలవానం. గుదిగర్ర రూ. గుదిగట్టి. వి. అల్లుపట్టేటపుడు పడుగుకు చివరగుదులు కట్టిన కర్ర. గుదిగట్టి రూ. గుదికర్ర, గుదిగర్ర. వి. పరిగెత్తిపోకుండా పశువుల మెడలోకట్టే కర్ర, గుదిబండ. గుదిగాడి రూ. గుదుగాడి. వి. తొలి, నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున ఉండే గుదులు తగిలించుకొనే గాడి. గుదిగుంజలు వి.బ.వ. పసులదొడ్డి మొ. వాటి ద్వారం దగ్గర నిలువుగా పాతిన స్తంభాలు. గుదిగుంపులుచేయు స.క్రి. 1. గుదిగుచ్చు. నిరంకు. 2.32; 2. కలతపెట్టు. గుదిగొను(-కొను) అ.క్రి. 1. దట్టమగు, స్థూలమగు. ఉ.హరి. 2.122. 2. తడబడు. ఉ.హరి. 3.136; 3. అతిశయించు. విష్ణు పూ. 3; 4. మూట కట్టుగా కూలబడు. హరిశ్చ. 4.214. గుదిగ్రుచ్చు స.క్రి. 1. సవరించు. ప్రభు. 7.74; 2. పోగుచేయు, గుదిగూర్చు. గుదిచీల వి. చక్రపుటిరుసు చివర వేసే మేకు, సాయి మేకు. గుదిచెక్క వి. 1. మునుగు చెక్కకుసి తగిలించటానికి రంధ్రం ఉంచి ద్వారబంధంపై కమ్మిమీద పరచిన చెక్క; 2. గెలవానం, ఒకదాని కొకటి తగిలించిన వాసాల జంట. గుదిజిల్ల వి. చిల్ల, బొక్కెన తూములో దూర్చి మోటమోకు తగిలించే కొయ్యముక్క. గుదితాడు రూ. చూ. గుద్రాడు. వి.బౌ. 1. ఊర్తెగుది, పడుగు దాపేటప్పుడు ఊర్తెపట్టెను పడుగేరే కర్రనూ కలిపి కట్టిన తాడు; 2. పంటిగుది; 3. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పుల్లకు కట్టిన తాడు. గుద్రాడు రూ. గుదితాడు, గుత్తాడు. వి. బౌ. దూడకాలికట్టుతాడు. గుదిత్రోయు స.క్రి. కాళ్ళుకట్టితోయు. ద్వి. హరిశ్చ.పూ. 1716 పం. గుదిదారం రూ. గుద్దారం. వి. 1. ఊర్తెగుది; 2. పంటిగుది. గుదిపాయ రూ. గుదిపాయి. వి. అచ్చుపాయ, అచ్చువళ్ళలో అచ్చుకర్రకు గుదికట్టిన చోట పాయగా చీలిన భాగం. గుదిపాయతాడు వి. అచ్చువళ్ళలో చివరి గుది పాయదగ్గర అచ్చుకర్రకు కట్టినదారం. గుదిపాయి రూ.చూ. గుదిపాయ. వి. అచ్చుపాయ. అచ్చువళ్ళలో గుదులు కట్టిన చోట పాయగా చీలిన భాగం. గుదిపుల్ల వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి అమర్చిన కొయ్యచువ్వ లేక ఇనపచువ్వ. గుదిబండ వి. గుదికర్ర గుదిమోకు వి. జువ్వాయిమోకు, బండి కాడినుండి పోలు కర్ర కిందుగా తొలుపు వరకు అమర్చిన తాడు. గుదిపడు (-వడు) అ.క్రి. 1. కట్టుపడు, మాన్పడు. భార విరా. 3.27; 2. వణుకు. గుదివానం వి. గెలవానం, ఒకదాని కొకటి తగిలించిన వాసాలజంట. గుదివెట్టు (-పెట్టు) స.క్రి. కట్టు, బంధించు. దశకు. 3.108. గుదులకోల రూ. గుత్తులకోల. వి. పొట్టికోల, నేతపడుగు చివర పాయల తాళ్ళు కట్టిన కర్ర. గుదులగూటం వి. పావుచెక్కల గూటం, మగ్గం గుంటలో చెక్కల బిగింపుకు పాతిన కొయ్య. గుదులబద్ద వి. మలబద్ద, నేతపడుగు చివర పొట్టెలుచుట్టే వెదురుబద్ద. గుదులలాక రూ. గుదుల్లాక, గుదుళ్ళలాక. వి. మలబద్ద. నేతపడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద. గుదులుగుదులు వి.బ.వ. గుంపులు గుంపులు. గుదులుపడు అ.క్రి రహస్యాలోచనకు వేరువేరుగా గుంపులు కట్టి మాట్లాడుకొను. గుదులుపెట్టు అ.క్రి. కదలకుండా కూర్చుండటంవల్ల కాళ్ళు స్తంభించు, తిమ్మిరెక్కు. గుదుల్లాక రూ.చూ. గుదులలాక. వి. మలబద్ద, నేతపడుగు చివర పొట్టెలు చుట్టే వెదురుబద్ద. గుదుళ్ళకర్ర వి. అచ్చుకట్టే జంత్రం, కొయ్యలకు అడ్డంగా బిగించి అచ్చుగుదులు తగిలించిన కర్ర. గుదుళ్ళబద్ద వి. మలబద్ద, నేతపడుగు చివర పొట్టెలుచుట్టే వెదురుబద్ద

గుదుళ్ళలాక రూ.చూ. గుదులలాక. వి. మలబద్ద. నేత పడుగు చివర పొట్టెలుచుట్టే వెదురుబద్ద. గుదేఫు రూ. గూదేకు. వి. ఎన్నును గుదిగా ఆవరించిఉన్న ఆకు. గుదేకునద్ద వి. మూడు నెలల్లో పండే ఒక పంట.

గుది² వి. 1. కంతి. మల్ల. వై. 16 ; 2. చీలమండ. ఆం.భా. 2.135.

గుదికాలు రూ. గుదిగాలు. వి. చీలమండ దిగువఉండే భాగం, మడమ. తు. కుతి, కుతిన్-కాల్, కుతి-క్కాల్, కుటి-కాల్ ; మ. కుతి, కుతి-కాల్. గుదిగాలు రూ.చూ. గుదికాలు. వి. చీలమండ దిగువఉండే భాగం, మడమ. గుదిగాళ్ళు వి.బ.వ. సరిగా నడకరాక పోవటం. గుదిత్రాడు వి. దూడకాలికి కట్టేతాడు, బందం. గుదిత్రోయు స.క్రి. కాళ్ళుకట్టి తోయు. ద్వి. హరిశ్చ. పూ. 1716 పం. గుదిపెట్టు వి. కొమ్ముపాపు, ఒకరకం సెలరోగం. గుదివాపు వి. పశువుల రొమ్ముపాపు జబ్బు, గుండెముక్కర. గుదులుకట్టు అ.క్రి. కాళ్ళునెప్పులు పుట్టు. గుదులుకొను అ.క్రి. కూలు, ఎక్కువగు, సంకటపడు.

గుదిచివట్టు స.క్రి. కుదియ బట్టు.

గుదిపి వి. 1. చేతికట్టె ; 2. గుదియ ; 3. బడితె.

క. గుదిగె. దుడ్డుకర్ర, బడితె.

గుదిపె రూ. గుతువ, గుదిబి, గుదిబె, గుదుప. వి. గూటం కొట్టేకొయ్యబడితె.

గుదిబి రూ.చూ. గుదిపె. వి. గూటం, కొట్టేకొయ్యబడితె.

గుదిబె రూ.చూ. గుదిపె. వి. గూటం, కొట్టేకొయ్యబడితె.

గుదిమె వి. పూతకురాని మామిడి, నారింజ మొదలైనవి.

గుదియ రూ. గుదె¹. వి. 1. ముద్గరం, గద. మార్క. 1.135 ; 2. నాలుగు మూరలు నిడివిగల దండం. హరి. ఉ. 6 ; 3. దండం, కర్ర. పార్వ. 4.67 ; 4. యమదండం. అచ్చ.రా.బాల. 68 ; 5. గుది కర్ర.

క. కుత్తు, గుదిగె. గద ; తు. గుద్దుని, గుద్దు ; త. కుత్తు, కుత్తల్ ; మ. కుత్తుక ; కో. కుత్ ; తొ. కుడ్ ; మాల్తో. గుత్యొ.

సం. గదా. గద.

గుదియకళ్ళలు వి.బ.వ. గుదిగుంజలకి అడ్డంగా పెట్టే కర్రలు. గుదియతాలుపు రూ. గుదియతాల్పు, గుదెతాల్పు. వి. యముడు, దండధరుడు. అచ్చ.రా. సుందర. 23. గుదియతాల్పు రూ.చూ. గుదియతాలుపు. వి. యముడు. గుదియతాల్పుతూపు వి. యామ్యాస్త్రం. అచ్చ.రా.యు. 265. గుదియమోవరి వి. యముడు. గుదియలు వి.బ.వ. ఒక జాతి వడ్లు.

గుదియించు స.క్రి. నిలుపు, నెలకొల్పు.

గుదిలకొను అ.క్రి. వగచు, బాధపడు.

గుదిలపుచెట్టు వి. కంకచెట్టు, హరీతకి (Punicagrantum sterculia colorata).

గుదిలి వి. గొడ్డలి, కొయ్యలు, కర్రలు, చొప్ప మొదలైనవి నరకడానికి పనికి వచ్చే పరికరం.

గుదిలికట్టె వి. గొడ్డలికి వేసే కట్టె.

గుదుం వి. పిలకలు వేసి మొక్క గుబురుగా పెరిగి రావటం.

గుదుకొళ్ళకట్టె వి. పూనుగర్ర, పాపుచెక్క తొక్కినపుడు అచ్చు కర్రను కిందికి లాగే కర్ర.

గుదుగాడి రూ.చూ. గుదిగాడి. వి. తొలి, నేతగుడ్డ చుట్టే దోనెకు ఒక వైపున చేసిన చిల్లి.

గుదుప రూ.చూ. గుదిపె. వి. గూటం, కొట్టే కొయ్యబడితె.

గుదుపులు చూ. కుదుపు. వి.బ.వ. దెబ్బలు, పోట్లు.

గుదుము చూ. కుదప. వి. మట్టిగోడ కట్టుబడిలో వచ్చే ఉబ్బు, కుదప.

గుదుముకట్టు అ.క్రి. పైరు గుబురుగా పెరుగు.

గుదులకోల చూ. గుది¹.

గుదులగూటం చూ. గుది¹.

గుదులబద్ద చూ. గుది¹.

గుదులలాక చూ. గుది¹.

గుదులుకట్టు చూ. గుది².

గుదులుకొను చూ. గుది².

గుదులుగుదులు చూ. గుది¹.

గుదులువడు చూ. గుది¹.

గుదులుపెట్టు చూ. గుది¹.

గుదుల్లాక చూ. గుది¹.

గుదుళ్ళకర్ర చూ. గుది¹.

గుదుళ్ళబద్ద చూ. గుది¹.

గుదుళ్ళలాక చూ. గుది¹.

గుదె¹ రూ.చూ. గుదియ. వి. 1. గద, ముద్గరం. ప్రబోధ. 5.99 ; 2. దండం, కర్ర, దుడ్డు. కాశి. 2.99.

గుదెకట్టె వి. పూరికప్పు ఎగరకుండా పైన లంకె వేసి పడవేసిన దుక్క. గుదెతాల్పు రూ.చూ. గుదియతాలుపు. వి. యముడు, గుదియతాల్పు. గుదెతాల్పువీడు వి. నరకలోకం. గుదెలవాడు వి. రక్షకుడు, వేత్రధారి.

గుదె² రూ.చూ. గుది¹. వి. 1. నూలు లెక్క ; 2. ఊడ్లె గుది ; 3. అచ్చు గుది ; 4. దారం.

గుదేకు చూ. గుది¹.

గుదేకునద్ద చూ. గుది¹.

గుద్ద వి. 1. అపానం, పాయువు. వేమ. 58 ; 2. యోని, ఆడుగురి ; 3. అడుగు, నేలపై ఆనే పాత్రల కింది భాగం.

ప్రా. గుద-. ముడ్డి ; ప్రా. గుద-. గుదా ; పా. గుద-.

క. గుద. అపానం, మలద్వారం.

<ప్రా. గుద-.

గుద్దకప్పు స.క్రి. వాటలకు మొదట టక్కలు కొట్టి తర్వాత అడుగు భాగం మూయు. గుద్దకోయు స.క్రి. సారె మీద తయారయిన పాత్రను బయటకు తీయడానికి అడుగున ముల్లుతోగాని దారంతోగాని కోయు. గుద్దగూడ్పు స.క్రి. గుద్ద కప్పు, వాటకు మొదట పక్కలు కొట్టి తర్వాత అడుగు భాగం మూయు. గుద్దనోరుతెలియకుండు అ.క్రి. ఏమీ తెలియకపోవు. గుద్దబిల్ల వి. మొలబిళ్ళ, ఆడ పిల్లల మొలకు కట్టే బిళ్ళ.

గుద్దలి రూ. గుద్దెల, గుద్దెలి, గుద్దేలి, గుద్దేలు. వి. ఔ. చెట్లవేళ్ళు మొదలైనవి పెల్లగించే సాధనం, కుద్దాలం, గునపం. హరి. ఉ. 2.16.

క. గుద్దలి, గుద్లి. గొద్దలి; కొడ. గుద్దలి; తు. గుద్దలి, గుద్దాలి; త. కుంతాళం, కుంతాళి; మ. కుంతాలి; పర్జి. ఒల్లా, కొటల్; కో. కుదయ్; మాల్తో. క్వొదలి.

పో.చూ. సం. కుద్దాల-. గొద్దలి; ప్రా.పా. కుద్దాల; మరా. కుదళ్, కుదాల్, కుద్‌ళా. ద్రావిడ పదమని కిట్టెల్ గుండెర్టుల భావన.

గుద్దలిగొమ (-కొమ) అ.క్రి. హానిచేయ తలచు. భార. శల్య. 2.328; స.క్రి. గుద్దలితో తవ్వు. విక్ర. 2.129. గుద్దలించు స.క్రి. 1. తవ్వు, గుద్దలితో తవ్వు. దశకు. 3.53; 2. వెదకు. కాశీ. 2.41. గుద్దలిపూజ వి. శంకుస్థాపన వేళ చేసే పూజ. గుద్దలిపెట్టు వి. వినాశ కారణం.

గుద్దారం రూ.చూ. గుదిదారం. వి. 1. ఊడ్తె గుది; పడుగు చాపేటప్పుడు, ఊడ్తె అడ్డ పట్టెనూ పడుగేరే కర్రనూ కలిపే తాడు; 2. పంటి గుది, దోనె గాడిలో, బద్దె చువ్వ బిగించటానికి పల్లకు కట్టిన తాడు.

గుద్దిపిచ్చు స.క్రి. వదును చేయు.

గుద్దిబాయి వి. గుర్రబ్బండ్ల బాయి, గుర్రవు మెదలాగ కొక్కేలుగా ఉన్న రాళ్ళను అమర్చి వాటిమీద చుట్టు కట్ట వేసి కట్టిన బావి.

గుద్దియింగల్లు వి. భారత దేశంలోని ఒక రకమైన చిన్న చేప.

గుద్దీ చూ. గుద్దలి. వి. చెట్లవేళ్ళు మొదలైనవి పెల్లగించే సాధనం, కుద్దాలం, గునపం.

గుద్దు[1] రూ.చూ. గ్రుద్దు. స.క్రి. పిడికిలితో పొడుచు. వి. గుద్దు.

గుద్దుముగ్గు రూ. కుద్దుముగ్గు. వి. మొట్టికాయల ముగ్గు, పిడికిల్లో ముగ్గు పోసుకొని పక్కలకు కొడుతూ వేసే ముగ్గు. గుద్దులాట వి. ముష్టా ముష్టి <గుద్దు+-లు+ఆట. గుద్దులాడు అ.క్రి. ఒండొరులతో యుద్ధంచేయు. <గుద్దు+-లు+ఆడు.

గుద్దు[2] వి. పొరు, చీలికలాగ ఉండే రంధ్రం.

గుద్దు[3] వి. దిమ్మ, రాతితో కట్టిన స్తంభం.

గుద్దువాలు వి. గుద్దలించే ఆయుధం, గుద్దలి.

గుద్దెల రూ.చూ. గుద్దలి. వి. తవ్వడానికి ఉపయోగించే సాధనం.

గుద్దెలి రూ.చూ. గుద్దలి. వి. తవ్వకోడానికి వాడే పరికరం.

గుద్దేలి రూ.చూ. గుద్దలి. వి. తవ్వకోడానికి వాడే పరికరం.

గుద్దేలు రూ.చూ. గుద్దలి. వి. తవ్వడానికి ఉపయోగించే సాధనం.

గునక[1] రూ. గునుక. వి. చిన్న పరుగు, మెల్లని పరుగు.

గునక[2] రూ.చూ. గులక[3]. వి. గువ్వ, పత్తి తియ్యగా మిగిలిన పట్టి కాయ లేదా గుల్ల.

గునకలు రూ.చూ. గునుకులు. వి.బ.వ. తృణ ధాన్య విశేషం.

గునకాలకట్టె వి. పూనుగర్ర, పావుచెక్క తొక్కినపుడు, అచ్చు కర్రంత పొడుగునా అడ్డంగా ఉంటుంది.

గునగున క్రి. విశే. ద్రు. వేగంగా (నడవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం). విక్ర. 2.129.

గునగునపరచు అ.క్రి. గునుకు పరువులతో నడచు.

గునంగి రూ.చూ. గున్నంగి[1]. వి. కొండ చింత చెట్టు (Phyllanthus chiolizandra).

గునపనకోడి రూ.చూ. గున్నన కోడి. వి. అడవి కోడి.

గునపము వి. గడ్డపార, ఖనిత్రం. హరి. ఉ. 2.16.

క. కొణపి. బడిత, ధాన్యాన్ని కూర్చే సాధనం.

పో.చూ. సం. కుణప-. గడ్డపార; ఖనిత్ర-. గునపం.

గునబాన వి. వెడల్పు మూతిగల బాన.

గునహ వి. నేరం, పాపం.

హిం. ఉ. గునాహ్. పాపం.

<ఉ. గునాహ్.

గునాగారి రూ.చూ. గుణేగారి. వి. అపరాధం.

గునాదరం వి. పునాది, నిర్మాణం నమూనా ప్రకారం గోడల బలంకోసం భూమిలో మొట్ట మొదట తవ్వే గుంట.

గునాది వి. పునాది, నిర్మాణం నమూనా ప్రకారం గోడల బలంకోసం భూమిలో మొట్ట మొదట తవ్వే గుంట.

గునాదిగుంత వి. పునాదిగాడి, పునాదిగొయ్య. గునాదిగోడ వి. పునాదిగోడ, పునాదిలో కట్టిన గోడ. గునాదిబాండు వి. పునాది గోడమీద పరిచే పెద్ద రాయి.

గునామొలమాలు వి. బిడ్డలు కట్టుకొనే కటిసూత్ర విశేషం. భాను. వి. 1.69.

గునావర్దం చూ. గునాది. వి. పునాదులు తవ్వే ముందు సరిచూచుకొనే కొలత.

గునితి వి. దూలానికి తగిలించే ఇనప కొక్కెం.

గునియు అ.క్రి. 1. నర్తించు, ఆడు. పండి. చ. 1.55; 2. చలించు. భాగ. 10. ఉ.488; 3. కులుకు. పాండు. 1.165; 4. బెదరు; 5. గొణుగు, లోలోన పల్లించుకొను; 6. బాధపడు.

క. కుణి. నర్తించు, ఆడు; గుణి, గుణు, గొణి. నణుక్కోవడంలోని అనుకరణం; తు. గుణుగుణు, గుణుగుట్టు, గునుగును. నణుక్కోవటం; త. కుని. నర్తించు, ఆడు. కుణుకుణు. నణుగుడు; మ. కునిక్క. నర్తించు, దుముకు.

గునిసాడు రూ.చూ. గునిసియాడు. అ.క్రి. 1. నర్తించు, ఆడు. బ్రహ్మో. 4.113వ; 2. చలించు. గునిసినడచు అ.క్రి. కులుకుతూ నడుచు. శుక. 3.314. గునిసియాడు (-ఆడు) రూ. గునిసాడు. అ.క్రి. 1. నర్తించు, ఆడు. కు. సం. 12.103; 2. చలించు. బహులా. 3.6.

గునిసాడు చూ. గునియు.

గునిసినడచు చూ. గునియు.

గునిసియాడు చూ. గునియు.

గునిసె రూ. గొనిసె. వి. పొట్టివాడు, వామనుడు. ఆం. భా. 2.123.

గునుక రూ.చూ. గునక[1]. వి. చిన్నపరుగు, మెల్లనిపరుగు.

గునుకలు రూ.చూ. గునుకులు. వి.బ.వ. ఒక దినుసుపైరు.

గునుకు[1] రూ. గున్కు. అ.క్రి. 1. పరిగెత్తు. భాగ. 6.325; 2. మందంగా పరుగెత్తు. మను. 4.47; వి. చిన్న పరుగు, మెల్లనిపరుగు. ఆం. భా. 2.224.

గునుకుడు రూ. గునుగుడు. వి. చిన్నపరుగు, మెల్లని

పరుగు. ఆం. భా. 2.224. గునుకునడ వి. మెల్లనినడక, మందగమనం. రాజవా. 2.44 గునుకునడుపు రూ. గునుగునడుపు. వి. మెల్లనినడక, మందగమనం. చంద్ర. భా. 2.3. గునుకుపరుగిడు అ.క్రి. గునుకులాడు. గునుకుపరుగు రూ.చూ. గునుకుపరువు. వి. అల్పధావనం, మెల్లని పరుగు. గునుకుపరువు రూ. గునుకుపరుగు, గునుకుపర్వు, గునుగుపరుగు. వి. చిన్నపరుగు, మెల్లనిపరుగు. వరాహ. 11.76. గునుకుపర్వు రూ.చూ. గునుకుపరువు. వి. అల్పధావనం, మెల్లనిపరుగు. దశా. 7.23. గునుకురాటం వి. నూలుతీసేరాట్నం. గునుకులాడు అ.క్రి. గునుకుపరుగిడు. (గునుకు¹ +-లు+ఆడు). గునుకెత్తు అ.క్రి. పరిగెత్తు. వేంక. పంచ. 4.571. <గునుకు¹+ ఎత్తు.

**గునుకు²** రూ. గునుగు. వి. 1. తృణ విశేషం. ఆము. 6.13; 2. కరువుకాలంలో తినే తృణ ధాన్య విశేషం.

పో. చూ. క. *గుంద*. ఒకరకం గడ్డి.

గునుకుగడ్డి వి. కరువుకాలంలో తినే తృణధాన్య విశేషం. గునుకుబ్రాలు వి.బ.వ. గునుకు బియ్యం. కాశ. 3.67. గునుకులు రూ. గనకలు, గునుకలు. వి.బ.వ. తృణధాన్య విశేషం, అమడలు. కాశ. 3.151, ఆం. భా. 2.236.

**గునుకు³** స.క్రి. 1. దీపం వత్తిని రెండువేళ్ళతో ఒత్తి ఆర్పివేయు; 2. ఊచు; 3. మలుపు; 4. మూయు.

**గునుకెత్తు** చూ. గునుకు¹.

**గునుకోలుకర్ర** వి. పూనుగర్ర, పావుచెక్క తొక్కినపుడు, అచ్చు కర్రను కిందికి లాగేకర్ర.

**గునుగు** రూ.చూ. గునుకు². వి. ఒకజాతిగడ్డి, తృణం.

**గునుగుడు** రూ.చూ. గునుకుడు. వి. మెల్లనిపరుగు.

**గునుగుపరుగు** రూ.చూ. గునుకుపరువు. వి. మెల్లనిపరుగు.

**గునుగునడుపు** రూ.చూ. గునుకునడుపు. వి. మెల్లనినడక, మందగమనం.

**గునుచు** అ.క్రి. చిన్నగా ఏడ్చు.

**గునుపము** వి. గద, ఇనపదుడ్డు. ఆం. భా. 2.216.

**గునుపు** రూ. గొనపు, గొనుపు. 1. విలాసం. ఆం. భా. 1.139; 2. సొగసు; 3. వృక్షవిశేషం.

**గునుపుకోడి** రూ.చూ. గున్ననకోడి. వి. అడవికోడి.

**గునుక్క** రూ.చూ. గునుకు¹. అ.క్రి. 1. మందంగా పరిగెత్తు. ఆము. 4.169; 2. పరిగెత్తు.

**గుంత** రూ.చూ. గ్రుంత. విణ. లోతైన, పల్లమైన. మార్క. 5.141. వి. 1. చిన్నగొయ్యి, గుంట. వేంక. పంచ. 1.308; 2. పిరిది మీదగుంట, కూపకం.

గుంతకండ్లు వి.బ.వ. లోతుకళ్ళు. గుంతపురుగు వి. క్రిమి విశేషం. ప్రబంధ. 130. గుంతపొంగలి వి. ఆవిరి కుడుం. గుంతబింది వి. పంటెంగచెట్టు (Bredehia mantana). గుంతమగ్గం రూ.చూ. గుంటమగ్గం. వి. గోతిమగ్గం, నేల బయలులో గుంటదగ్గిర అమర్చిన మగ్గం. గుంతలకొయ్య వి. పావుచెక్కల గూటం, మగ్గం గుంటలోపావు చెక్కల బిగింపుకు పాతినకొయ్య. గుంతలగూటం వి. గుంట గూటం. పావుచెక్కల గూటం మగ్గం గుంటలో పావు చెక్కల బిగింపుకు పాతిన కొయ్య. గుంతనల్వ వి. కుదం కొట్టిన తర్వాత పల్చగ సన్నగ సర్పడానికి వాడేనలప.

**గుందరి** వి. వైద్యుడు, వెజ్జు.

**గుంది** వి. పాదు, గుంజలు మొదలైనవి పాతటానికి గడ్డపలుగుతో తవ్విన లోతైనగుంట.

**గున్న** వి. 1. పంది, ఏనుగు, హంస మొ. వాటిపిల్ల. సిం. ద్వా. 8.29; 2. క్షుపం, కురచకొమ్మలు, ఊడలు గల చెట్టు, గుబురుగా పెరిగిన (మామిడి మొ. వాటి) మొక్క. ఆం.భా. 2.36. విణ. వామనం, పొట్టి. ఆం. భా. 2.123.

క. *గున్న*. చిన్న, పొట్టిఏనుగు, *కున్ని*. పిల్లజంతువు; త. *కున్ను*. పక్షులు, జంతువులపిల్లలు; మ. *కున్ను*, *కున్ని*. చిన్న, పసి; కో. *కుంజ్*. దేవుడిచ్చినబిడ్డలు. *కున్*. చిన్న; కొలా. *కున*. కుక్కపిల్ల.

నం. *కుణక-*. పిల్ల.

గున్నపురుగు వి. అవిసెచెట్లకు పట్టేనల్లని లావాటి పురుగు. గున్నపెంకు వి. పూలతొట్టి. గున్నసుర రూ.చూ. గున్నసొర. వి. నల్లరెక్కలుగల సొరచేప. క. *నెయికప్లి ధాంతి*; త. *కొప్పావిసుర, కత్తసుర, కలకుమత్తైసుర*; మ. *మూకన్‌స్రావు*. గున్నసొర రూ. గున్నసుర. వి. నల్లరెక్కలసొరచేప. గున్నేనుగు వి. 1. పొట్టిగా లావుగా ఉన్నవ్యక్తి; 2. పొట్టిఏనుగు. <గున్న+ఏనుగు.

**గున్నంగి¹** రూ. గునంగి. వి. 1. కొండచింతచెట్టు, వృక్ష విశేషం. హంస. 4.11; 2. మూలికావిశేషం (Phyllanthus chorizandra).

**గున్నంగి²** వి. పక్షివిశేషం. ప్రబంధ. 234.

**గున్నపకోడి** రూ.చూ. గున్పనకోడి. వి. గునప (అడవి) కోడి.

**గున్నాపట్టి** రూ. గున్నాబట్ట. వి. వెండి, బంగారువలె మెరిసే కాగితం.

క. *గున్నాం, గున్నాంపట్టె*. ఆభరణాలుగా ఉపయోగించే కాకిబంగారంతో ఉన్న పేపరుమలాం; త. *కుయినా*. ఆభరణాలుగా ఉపయోగించే కాకిబంగారంతో ఉన్న పేపరు మలాం.

**గున్నాబట్టి** రూ.చూ. గున్నాపట్ట. వి. నగడ. ఎద్దుకొమ్ములకు అలంకారానికి తొడిగే కాకి బంగారంరేకు.

**గున్నేనుగు** చూ. గున్న.

**గున్నెలమూకుడు** వి. కొండిలమూకుడు.

**గుప్పవకోడి** రూ. గునపనకోడి, గునుపుకోడి, గున్ననకోడి. వి. అడవికోడి, ప్రబంధ. 2.34.

**గుప్రౌతు** రూ.చూ. గుంద్రౌతు. వి. గుండు, గుండ్రంగాఉండే రాయి.

**గుపారము** రూ. గుబారము. వి. మల్లయుద్ధవిన్నాణం.

**గుపారు** రూ. గుబారు. వి. 1. అంతటావ్యాపించటం; 2. అపవాదు.

**గుప్తా** ప్రత్య. వైశ్యులపేర్లచివర చేర్చబడే నామానుబంధం.

నం. *గుప్త*- వైశ్యుల ఉపనామం.

<నం. గుప్త-.

**గుప్పటించు** చూ. గుప్పు¹.

**గుప్పన** చూ. గుప్పు².

**గుప్పనకూర** చూ. గుప్పు¹.

గుప్పలించు చూ. గుప్పు[1].
గుప్పళించు చూ. గుప్పు[1].
గుప్పించు చూ. గుప్పు[1].
గుప్పిడి చూ. గుప్పు[1].
గుప్పిలి చూ. గుప్పు[1].
గుప్పిలించు చూ. గుప్పు[1].
గుప్పు[1] స.క్రి. 1. బాణాదులను అధికంగా ప్రయోగించు. నిర్వ.రా. 3.16 ; 2. పొడుచు. భోజ. 6.21 ; 3. (అధికంగా) పెట్టు, ఉంచు. భోజ. 7.226 ; 4. గట్టిగాదంచు. వాల్మీ. 2.105 ; 5. చల్లు, చిమ్ము. చంద్రాంగ. 4.163 ; 6. వర్షించు. ద్వి.సార. చ. 3.120.

క. గుప్పు, కుప్పు, గుప్పె, కుప్పె. పోగు, రాసి. తు. గుప్పె ; పో.చూ. గోం. గుప్. మూసివేయు; కొలామ్. పిడికెడు, పో.చూ. తు. గుప్పని, గూమని, ఒలకపోయు ; బ్రా. ఖుంబ. కౌగలించుకొను.

గుప్పటించు రూ.చూ. గుప్పళించు. స.క్రి. ఉప్పళించు. అ.క్రి. పుక్కిళించు. గుప్పనకూర వి. చిందరవందర. గుప్పలించు రూ.చూ. గుప్పళించు. స.క్రి. 1. చల్లు ; 2. ఉప్పళించు ; అ.క్రి. పుక్కిలించు. గుప్పళించు రూ. గుప్పటించు, గుప్పలించు, గుప్పిలించు. స.క్రి. 1. కలిగించు. పుట్టించు. పాండు. 3.190 ; 2. చల్లు. పాండు. 4.16 ; 3. అడుగులుగంతులువేయు. పాంచాలీ. 2.16 ; 4. ఉప్పళించు, అ.క్రి. 1. అతిశయించు. రాజవా. 2.58 ; 2. పుక్కిళించు. భాను. 2.73. గుప్పించు స.క్రి. 1. గుప్పు (బాణాదులను అధికంగా) ప్రయోగించు. భార. భీష్మ. 3.319 ; 2. (అధికంగా) ఇచ్చు. హర. పీఠి. 7 ; 3. వర్షించు.విష్ణు.పు. 7.244. గుప్పిడి రూ.చూ. గుప్పిలి. వి. పిడికిలి. గుప్పిలి రూ. గుప్పిడి. వి. ౙౌ. పిడికిలి. క్రీడా. 166. గుప్పిలించు రూ.చూ. గుప్పళించు. స.క్రి. 1. చల్లు ; 2. ఉప్పళించు. అ.క్రి. పుక్కిలించు. గుప్పుడు వి. గుప్పటం, పోటు. ప్రబంధ. 78. గుప్పుతెప్పున క్రి.విశే.ద్రు. అతిశీఘ్రంగా. శుక. 1.450. గుప్పున[1] క్రి.విశే.ద్రు. 1. శీఘ్రంగా, వేగంగా. బసవ. 7.676 ; 2. అకస్మాత్తుగా. రామాభ్యు. 6.176. గుప్పెఁడు విశే. పిడికెడు <గుప్పు[1]+-ఎఁడు.

గుప్పు[2] వి. 1. దిగడం, దూకడం, లేవడం, వెళ్ళడం, పడడం, మొ. వాటిలోఅయ్యే ధ్వనికి అనుకరణ. జైమినీ భా. 8.158 ; 2. వాసనకొట్టడం, మోయటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. ఉ.రా. 6.24 ; 3. గుద్దడం, పొడవడం, తోయడం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. వాల్మీ. 2.96.

గుప్పన[2] వి. తియ్యన, మధురిమ. గుప్పున[2] క్రి.విశే.ద్రు. గుప్పునేటట్లుగా. గుప్పుప్పున క్రి.విశే. ద్వి. మిక్కిలి తొందరగా. గుప్పుమను అ.క్రి. వార్త (వాసన) వెంటనే వ్యాపించు.

గుప్పెఁడు చూ. గుప్పు[1].
గుబ వి. గుడ్లగూబ.

పో.చూ. సం. ఘూక-. గుడ్లగూబ.

గుబక వి. తలుపుగందపట్టెమీదిగుబ్బ.

క. గుబ్బి. గుబ్బ ; తు. గుబ్బి, గుబ్బె. గుండి, లోహపుగుబ్బ ; త. కుమిఴ. గుబ్బ; కుమిఴ్. గుబ్బ ; మ. కుమిఴ. గుబ్బ.

పో.చూ. సం. కుంభక-. చిన్నకుండ ; కుంభస్థలం పైభాగం.

గుబగుబ వి. 1. సముద్రతరంగాలు మొ. వాటిధ్వనికి అనుకరణం. హరిశ్చ. 2.126 ; 2. నీరు మొ. వచ్చేటప్పటి ధ్వనికిఅనుకరణం. సుదంతా. 2.159 ; 3. కోకిలపలుకటంలోనిధ్వనికి అనుకరణం. శశా. 2.86 ; 4. గందరగోళం.

క. గుబుగుబు. అనుకరణధ్వని.

గుబగుబలాడించు స.క్రి. తొందరచేయు. గుబగుబలు వి.బ.వ. తొందరపనులు.

గుబదాడ రూ.చూ. గూబతడ. వి. ఒకరకం చిన్నచెట్టు.
గుబదార రూ.చూ. గూబతడ. వి. ఒకరకం చిన్నచెట్టు.
గుబరేయు స.క్రి. బోర్లేయు, కుండలు అడుగుభాగం పైకి వచ్చేటట్లు ఒకదానిపై ఒకటిపేర్చు.
గుబలకమ్మ వి. 1. చన్నులురాని స్త్రీ ; 2. ఏపనీ చేయకుండా కూర్చునే స్త్రీ.
గుబలి రూ.చూ. గుబిలి[1]. వి. శకునపక్షి.
గుబాటున క్రి.విశే.ద్రు. హఠాత్తుగా, చటుక్కున. ధ్వన్యను.
గుబాదెబ క్రి.విశే.ద్రు. చప్పుడయ్యేటట్లుగా. వి. హొయలు, విలాసం.
గుబార వి. లేనిమాటలు కల్పించటం.
గుబారము రూ.చూ. గుపారము. వి. మల్లబంధ విశేషం.
గుబారు వి. 1. పుకారు ; 2. గందరగోళం.

క. గుబారు. సమూహం, ధ్వని.

గుబారుచేయు అ.క్రి. 1. కుట్రపన్ను. రాధా. 3.78 ; 2. పుకారు పుట్టించు, లేనిపోని మాటలు కల్పించు.

గుబాలను చూ. గుబాలు.
గుబాలు రూ.చూ. గుభాలు. వి. పగలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. శేష. 1.

గుబాలను అ.క్రి. గుభిల్లను, గుండె గుబేలను. గుబాలున రూ. గుబాళున, గుభాలున. క్రి. విశే.ద్రు. గుబాటున, చటుక్కున. గుబాలుమను అ.క్రి. గుభిల్లను, గుబాలను.

గుబాళించు అ.క్రి. 1. పరిమళించు, సువాసనకొట్టు. విజయ. 2.157 ; 2. ఉక్కబెట్టు.
గుబాళింపు వి. 1. ఉక్క ; 2. సువాసన.
గుబాళున రూ.చూ. గుబాలున. క్రి.విశే.ద్రు. హఠాత్తుగా, వెంటనే.
గుబావరి రూ. గుబావరీ. వి. స్త్రీ చెవి గూబలకు ధరించే నగ.
గుబావరీ రూ.చూ. గుబావరి. వి. స్త్రీలు చెవి గూబలకు ధరించే ఆభరణం.
గుబి రూ.చూ. గుబ్బి[2]. వి. గుబ్బిగుడ్డ, సారె సులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ.

గుబిదుంక వి. గుబ్బికన్ను, సారె మొలదించడానికి గుబ్బరాయి మధ్యలోని రంధ్రం. గుబిరాయి రూ.చూ. గుబ్బిరాయి. వి. కనికరాయి, సారెమొలను దించడానికి గుబ్బి

గడ్డిలో పొదిగిన రంధ్రమున్న రాయి. గుబిరాయిబొక్క వి. గుబ్బికన్ను, సారె మొలను దించడానికి గుబ్బిరాయి మధ్య లోని రంధ్రం. గుబిలిగడ్డ రూ.చూ. గుబ్బిగడ్డ. సారె నులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గుబితలుపు రూ.చూ. గుబ్బితలుపు. వి. కుసితలుపు, కుసి మీద తిరిగే తలుపు.

గుబిరిక వి. ఒకరకం వల.

గుబిలి[1] రూ. గుబలి, గుమిలి. వి. పక్షివిశేషం, ఒకానొక శకున పక్షి, కనకాక్షి. ఆం.భా. 2.91.

క. గుబిరి. పక్షివిశేషం.

గుబిలిగాఁడు వి. ఒకానొక పక్షి. హంస. 3.12.

గుబిలి[2] రూ. గులిబి, గులిమి, గులివి, గుల్మి. వి. గుమిలి, చెవిలో ఏర్పడే నల్లని పదార్థం. ఆం.భా. 2.134.

క. కుఱుగణి, కూకణి, కూగణి, కూగబె, కొగ్గు, కుగ్గె. గుమిలి; తు. కిరమ్బిలు, కిరమ్బిల్లు. గుమిలి; త. కుఱుంపి. గులిమి; పర్జి. గిరుబ్. గులిమి; గోం. కొరంగెడ్. గులిమి; కువి. కిర్ పెజ్జి. గులిమి.

గుబిల్లను అ.క్రి. గుబేలుమను, గుండెబెదరు.

గుబీలు రూ.చూ. గుబిల్లు. వి. పడటంలోని ధ్వనికి అను కరణం.

గుబుకు[1] రూ. గుముకు, గూకు[2]. అ.క్రి. గుద్దు, పిడికిటితో పొడుచు.

క. కుమ్ము. పిడికిలితోకొట్టు, కుమ్మసు, కుమ్మిసు. దంపించు; కొడ. కుమ్మ్, గుమ్మ్. గుద్దు; త. కుమ్ము. పిసికికలుపు. నొక్కు; కుముక్కు. పిడికిలితోకొట్టు; కుమి. ఎక్కువ దంచటం; కుమై. పిడికిలితో గుద్దటం లేక కొట్ట టం; మ. కుమ్ము. రోటిలోవేసి కొట్టు; తో. కుమ్. మెల్లగా దంచు; కిమ్మ్. కొట్టు, దంచు; కోం. కుమ్. పొట్టు తీయటాని. మెల్లగా దంచడం.

గుబుకు[2] వి. నడవటంలోని ధ్వనికి అనుకరణం.

గుబుక్కున క్రి. విణ. ద్రు. గుభాలున.

గుబుగడ్డ రూ.చూ. గుబ్బిగడ్డ. వి. సారె నులువుగా తిరగ డానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ.

గుబురాయి రూ.చూ. గుబ్బిరాయి. వి. కనికరాయి, సారె మొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్న రాయి.

గుబురు రూ.చూ. గుమురు. వి. 1. సమూహం, గుంపు; 2. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగావేసి ఏపుకువచ్చేదశ.

గుబురుకొను రూ.చూ. గుమురుకొను. అ.క్రి. సాంద్ర మగు. జాహ్న. 3.32. గుబురులుకొను అ.క్రి. గుంపులుకట్టు. నిర్వ.రా. 5.141.

గుబులు వి. 1. గుప్పుమనికొట్టే వాసన. చమ. 1.12; 2. భయం; 3. ఉన్మాదం; 4. ఉడుకు, తాపం.

గుబులుకొను రూ. గుబుల్కొను. అ.క్రి. వాసన గుప్పున కొట్టు, పరిమళించు. విక్ర. 8.7. గుబులుగా (కావ్) క్రి.విణ. ద్రు. గట్టిగా, బిగ్గరగా. గుబులుగుబులుగా క్రి.విణ.ద్రు. ప్రతి ధ్వనించేటట్లు. గుబుల్కొను రూ.చూ. గుబులుకొను అ.క్రి. గుప్పున వాసనకొట్టు.

గుబుల్కొను చూ. గుబులు.

గుబుసు వి. కపటం, మోసం.

గుబేలను చూ. గుబేలు.

గుబేలు రూ.చూ. గుభాలు. వి. పడటంలో అయ్యే ధ్వనికి అను కరణం.

గుబేలను అ.క్రి. అకస్మాత్తుగా గుండెలో బెదురు కలుగు. గుబేలున రూ.చూ. గుభేలున. క్రి.విణ.ద్రు. 1. గభాలున, హఠాత్తుగా; 2. హఠాత్తుగా బెదురుకలుగగా. గుబేలుమను అ.క్రి. అకస్మాత్తుగా, గుండెలో బెదురు కలుగు.

గుబ్బ రూ. గుబ్బె. వి. 1. తలుపు గందపెట్టెలు మొ. వాటి మీది బొగడ. బసవ. 3.520; 2. గొడుగుమీది గుబ్బ. హరి. పూ. 7.178; 3. బాణం అలుగుకింది గుబ్బ. మను. 4.115; 4. కుచం, చన్ను, ఆము. 5.104; 5. పర్వ తం. రామాభ్యు. 1. 26; 6. కంతి. ఆం.భా. 2.74; 7. గుండుమేకు, గుబ్బచీల; 8. బరువుగా ఎత్తుగాఉన్న రాతిగుండు; 9. పిట్టగోడమీద అక్కడక్కడ అలంకారానికి కట్టిన చిన్న దిమ్మ; 10. సుత్తితల; 11. పిడచ కింది గుండ్రటి లోహపు ముద్ద; 12 దోనుగ బొద్దు; 13. మరనాడెమొన అరిగి పోకుండా బిగించిన ఇనప పొన్ను; 14. గుబ్బుకొయ్య, ఎదురుదోనెను మోపే కొయ్యగూటం; 15. బొద్దుకొయ్య, మగ్గంమీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం; 16. నాటుకొన్న చెట్టు ఆకులు దట్టంగా వేసి ఏపుకు వచ్చే దశ; 17. కాలిజోడుమీద ముడి; 18. బొద్దు. విణ. గుండ్రనైన. శృం.నై. 6.22.

క. గుబ్బి, గుబ్బ, బుడిపె; కుప్ప. శరీరంపై అస్వాభావికమైన గుండ్రటికాయ, కణితి; తు. గుబ్బి, గుబ్బె. గుండి, బుడిపె; త. కుమిజ్. గుండి, గుబ్బమేకు, కుమిఴ. గుబ్బ, గుబక; కుప్పి. బెత్తం మొ. వాని లోహపు పొన్ను; మ. కుమిఴ్.-గుబ్బ, గుబక.

గుబ్బకాయ వి. పీఁకకు అమర్చే సొరకాయ. వాల్మీ. 3.132. గుబ్బకారు వి. చివర లావుగా ఉండి పట్టునిచ్చే పట్టుకారు. గుబ్బ కూరుడుతలుపు వి. కుసితలుపు, కుసిమీద తిరిగే తలుపు. గుబ్బకొయ్య రూ. గుబ్బెకొయ్య. వి. బొద్దు కొయ్య, మగ్గం మీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమపక్కనేలలో పాతిన కొయ్య గూటం. గుబ్బగురుడు వి. బొద్దుకొయ్య, మగ్గం మీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమపక్కన నేలలోపాతిన కొయ్య గూటం. గుబ్బగూరుడు వి. నేలమీద ఆనుతూ ఒంటిరెక్కతలుపు తిరగడానికి తోడ్పడే తలుపు పట్టెలోని చెక్కబడిన భాగం. గుబ్బగొడుగు వి. గుద్దగొడుగు. గుబ్బచీల వి. గుబ్బ, గందపు పట్టెలమీద బలానికి అలంకారానికి నాటిన గుండ్రటి మేకు. గుబ్బపీట వి. కొండచరియ. గుబ్బపొన్ను వి. బొద్దుకొయ్యకు అమర్చే, దోనె చివరి భాగం (గుబ్బ) అరిగిపోకుండా వేసిన ఇనపకట్టు. గుబ్బమాను వి. బొద్దు కొయ్య, మగ్గంమీద, నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా,

ఎడమవక్కన నేలలోపాతిన కొయ్య గూటం. గుబ్బమేకు రూ. గుబ్బామేకు. వి. 1. తలగల ఒకరకమైన మేకు; 2. గంధపెట్టెలమీద బలానికి అందానికి నాటిన గుండ్రటి మేకు. గుబ్బమొల రూ. గుబ్బిమళ. వి. గంధపెట్టెల మీద బలానికి, అందానికి నాటిన గుండ్రటి మేకు. గుబ్బభ్రామ వి. కుండలుచేసే సాధనం. గుబ్బఱేఁడు వి. హిమవంతుడు. గుబ్బలకొమరాలు వి. గుబ్బెత, యువతి. శృం.నై. 6.66. గుబ్బలతలుపు వి. ఇత్తడిపొన్నులు గందెవాట్ల మీద బిగించిన తలుపు. గుబ్బలాఁడి వి. పెద్ద గుబ్బలు కలది, యువతి. నరస. 5.177. గుబ్బలు వి.బ.వ. చూచుకాలు, చనుమొనలు. గుబ్బవిలుకాఁడు వి. మేరుధన్వుడు, శివుడు. గుబ్బసరము వి. ఒకవిధమైన హారం. ఉ.హరి. 2.172. గుబ్బెత వి. పెద్ద గుబ్బలు కలది, యువతి. ప్రభా. 5.99.

గుబ్బటిలు[1] రూ.చూ. గుబ్బటిల్లు[1]. అ.క్రి. వానన మొ. వ్యాపించు.

గుబ్బటిలు[2] రూ. గుబ్బటిల్లు[2]. అ.క్రి. ఘూర్ణిల్లు, తిరుగుడుపడు. ఉ.హరి. 4.216.

గుబ్బటిల్లు[1] రూ. గుబ్బటిలు[1]. అ.క్రి. వానన మున్నగునవి వ్యాపించు.

గుబ్బటిల్లు[2] రూ.చూ. గుబ్బటిలు[2]. అ.క్రి. ఘూర్ణిల్లు, తిరుగుడు పడు

గుబ్బతి వి. గుబ్బ. పర్వతం, ఆం.భా. 2.127.

సం. కుమ్భ-. కడవ, ఒకరాశి.

గుబ్బతిలు రూ. గుబ్బతిలు. అ.క్రి. 1. ప్రజ్వలించు, మండు. భార.శాంతి. 3.268; 2. ఉప్పొంగు, పొంగు, నిట్టగమ్ము. జైమినీభా. 92; 3. అతిశయించు. హంస 1.186; 4. ఉడుకు, పరితపించు.

గుబ్బతిల్లు రూ.చూ. గుబ్బతిలు. అ.క్రి. 1. అతిశయించు. వసు. 1.137; 2. ఉడుకు, పరితపించు, ద్వి.పరమ. 5.420 వ; 3. మండు; 4. ఉప్పొంగు, పొంగు.

గుబ్బదారె[1] వి. ఉత్తర సర్కారులు, కర్ణాటకల్లోని కొండ ప్రాంతాల్లో పెరిగే పెద్ద ఆకులు కల మొక్క (Grewia-abutilifolia).

గుబ్బదారె[2] వి. తెల్లని పూలుపూసే ఒకతీగ (Symphorema involucratum).

గుబ్బవ క్రి. విశే. ద్రు. శీఘ్రంగా. వేగంగా. విక్ర. 2.105.

గుబ్బలి చూ. గుబ్బ. వి. పర్వతం, కొండ. ఆం.భా. 2.127.

గుబ్బలికాఁడు రూ. గుబ్బిలికాఁడు. వి. చిరుగూబ, కనకాక్షి, ఒకరకం శకునపక్షి. గుబ్బలిదొర వి. గుబ్బలి రాజు, హిమవంతుడు. గుబ్బలివట్టి వి. పార్వతి హిమ వంతుని కుమార్తె. దశా. 2.69. గుబ్బలివట్టిపట్టము వి. సింహం. వ్యు. పార్వతియొక్క వాహనం. గుబ్బలియొకి మీఁడు (-ఎకిమీఁడు) వి. గుబ్బలిదొర, హిమవంతుడు. గుబ్బలిరాకన్నియ వి. పార్వతి, పర్వతరాజ పుత్రి. అచ్చ. రా.బాల. 170. గుబ్బలిఱేఁడు వి. హిమవంతుడు. వ్యు. పర్వతరాజు. గుబ్బలిఱేనిగారాబుకూఁతురు వి. పార్వతి. వ్యు. హిమవంతుని ప్రియపుత్రిక. గుబ్బలివిలుకాఁడు రూ. గుబ్బలివిల్కాఁడు. వి. శివుడు. అచ్చ.రా.యు. 501. వ్యు. మేరుధన్వుడు, మేరుపర్వతం విల్లుగా కలవాడు. గుబ్బలివిలుతుఁడు రూ. గుబ్బలివిల్తుఁడు. వి. శివుడు. వ్యు. మేరు పర్వతాన్ని విల్లుగా ధరించినవాడు. గుబ్బలివిల్కాఁడు రూ.చూ. గుబ్బలివిలుకాఁడు. వి. శివుడు. గుబ్బలివిల్తుఁడు రూ.చూ. గుబ్బవిలుతుఁడు. వి. శివుడు. గుబ్బలివిల్దారి వి. శివుడు. వ్యు. మేరుపర్వతాన్ని విల్లుగా ధరించినవాడు.

గుబ్బామేకు రూ.చూ. గుబ్బమేకు. వి. గంధపుపట్టెల మీద బలానికి అందానికి నాటిన గుండ్రటి మేకు.

గుబ్బాయిగడ్డి వి. ఒకరకం గడ్డి (Eragostis poaeoides).

గుబ్బావిలాలు వి.బ.వ. కమ్మికి తగిలించి పైకిలాగి బిగించే నగలు.

గుబ్బి[1] వి. ఒక దినును చెట్టు.

గుబ్బి[2] రూ. కుబ్బి, గుబి, గుబ్బు[1]. వి. 1. సారె నులువుగా తిరగడానికి పీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ.

గుబ్బికన్ను వి. ఉగులు, కన్ను, గుబిదుంక, గుబ్బితొల, సారెమొలదించటానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బిగద్ద రూ. గుబిలిగద్ద, గుబుగద్ద, గుబ్బిగద్దె, గుబ్బిగెద్ద, గుబ్బుగెద్ద, గూబిగద్ద. వి. సారెనులువుగా తిరగడానికి పీలుగా రంధ్ర మున్నరాయికి మట్టి. వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టినమట్టిదిమ్మ. గుబ్బిగద్దె రూ.చూ. గుబ్బిగద్ద. వి. సారె నులువుగా తిరగడానికి భూమిలో పాతిన మట్టిదిమ్మ. గుబ్బిగుంట వి. సారె మొలదించటానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బిగెద్ద రూ.చూ. గుబ్బిగద్ద. వి. సారె నులువుగా తిరగడానికి భూమిలో పాతిన మట్టిదిమ్మ. గుబ్బిగెద్దకన్ను చూ. గుబ్బికన్ను. వి. సారె మొలదించ డానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బిచక్రం రూ. గుబ్బిసెక్రం. వి. ఒకరకం మరానులో బెండకాయ చక్రం పక్కన బిగించిన ఇనప చక్రం. గుబ్బితొల రూ. గుబ్బితొలి. వి. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బితొలి రూ.చూ. గుబ్బితొల. వి. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బిబొజ్జం వి. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యలోని రంధ్రం. గుబ్బిరాయి రూ. గుబిరాయి, గుబురాయి, గువ్వి రాయి, గూబిరాయి. వి. కనికరాయి, సారె మొలదించ డానికి గుబిగద్దలో పొదిగిన రంధ్రం. గుబ్బిరాయిసుంత వి. సారె మొలదించడానికి గుబ్బిరాయి మధ్యనున్న రంధ్రం. గుబ్బిరోతు వి. గుబ్బిరాయి, సారె మొలదించడానికి గుబ్బి గద్దలో పొదిగిన రంధ్రమున్న రాయి. గుబ్బిసెక్రం రూ చూ. గుబ్బిచక్రం. వి. ఒకరకం మరానులో బెండ కాయ చక్రం పక్కన బిగించిన ఇనప చక్రం.

గుబ్బికె రూ. గుబ్బికె. వి. పక్షుల్ని పట్టడానికి వేసే ఒక విధమైన ఉచ్చు. హంస. 2.88.

గుబ్బికలుగడ్డి వి. నూలిగడ్డి, పశుగ్రాసంగా ఉపయోగపడే ఒక రకం శ్రేష్ఠమైన గడ్డి (Eragrostris Bifaria).

గుబ్బికె రూ.చూ. గుబ్బిక. వి. పిట్టల్ని పట్టడానికి వేసే ఒక రకమైన ఉచ్చు.

గుబ్బితలుపు రూ. గుబితలుపు. వి. కుసితలుపు, కుసిమీద

తిరిగే తలుపు.

గుబ్బిమళ రూ.చూ. గుబ్బమొల. వి. గంధప్పెట్టెలమీద బలానికి అందానికి నాటిన గుండ్రటి మేకు.

గుబ్బిరి వి. వృక్ష విశేషం. హంస. 4.10.

గుబ్బిలి వి. పక్షి విశేషం.

క. గుబ్బిల్. ఒకరకం పక్షి.

గుబ్బిలికాఁడు రూ.చూ. గుబ్బలికాఁడు. వి. చిరుగూబ, పైడికంటి.

గుబ్బినలాడు అ.క్రి. గునగునలాడు.

గుబ్బ[1] రూ.చూ. గుబ్బి[2]. వి. సారె నులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ.

గుబ్బగెద్ద రూ.చూ. గుబ్బగడ్డ. వి. సారె నులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన మట్టిదిమ్మ. గుబ్బదిండు వి. గుప్పిటి, సారెమొలను దించడానికి మట్టిగుబ్బికి బదులుగా చేసిన చిన్న ముక్కాలి పీటవంటి దిమ్మ.

గుబ్బ[2] వి. జొన్న సజ్జ, వడ్లు మొ. వాటి కంకిపొట్టు.

గుబ్బ[3] వి. 1. పగిలేటప్పటి ధ్వనికి అనుకరణం. భాగ. 8.208 ; 2. గుండె అదరటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

గుబ్బగుబ్బరను అ.క్రి. గుండెగుబ్బని అదరు. వీర. వి. 3.210. గుబ్బన క్రి. విశ. ద్రు. గుబాలున, గుబుక్కున. గుబ్బుమను అ.క్రి. గుండె గుబ్బని అదురు. కళా. 4. గుబ్బరను అ.క్రి. గుండెగుబ్బని అదరు. రాజవా. 2.68.

గుబ్బ[4] రూ. గుమ్మ[2]. వి. చెరకు పొదలాగ పెరిగేస్థితి.

గుబ్బ[5] రూ.చూ. గుమ్మ[1]. వి. గాదె.

గుబ్బె రూ.చూ. గుబ్బ. వి. నాడెగుబ్బ, మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనప పొన్ను.

గుబ్బెకొయ్య రూ.చూ. గుబ్బకొయ్య. వి. బొడ్డుకొయ్య, మగ్గం మీద నేత బట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా, ఎడమ పక్కనేలలో పాతిన కొయ్య గూటం.

గుబ్బెత చూ. గుబ్బ.

గుబ్బోగర వి. చిత్తరువు చెక్కటం.

గుభగుభ వి. గందరగోళం. ధ్వన్యను.

గుభాలు రూ. గుబాలు, గుబేలు, గుభేలు. వి. 1. పడటం, పగలటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 8.16 ; 2. వానన వ్యాపించటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కువ.చ. 8.32.

గుభాలున రూ.చూ. గుబాలున. క్రి. విశ. ద్రు. గబుక్కున.

గుభిల్లు రూ. గుబీలు, గుభీలు. వి. వాలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వసు. 2.146.

గుభిల్లున రూ. గుభీలున. క్రి. విశ. ద్రు. గుబుక్కున, గుబాలున గుద్దేటప్పటి శబ్దానుకరణం.

గుభీలు రూ.చూ. గుభిల్లు. వి. 1. శిలాదులు కూలటంలోని ధ్వనికి అనుకరణం. రామాభ్యు. 6.99 ; 2. ఉరకటం మొ. వాటిలోనిధ్వనికి అనుకరణం. రామాభ్యు. 8.229.

గుభీలున రూ.చూ. గుభిల్లున. క్రి. విశ. ద్రు. గుబాలున, గుబుక్కున.

గుభులు రూ. గుభుల్లు. వి. 1. భేరి, తుపాకిలోనగువాటి ధ్వనికి అనుకరణం. నరస. 2.78 ; 2. దుమకటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. భాను. 2.80 ; 3. నీరు మొ. వాటిలో రాయి మొ. నవి పడటంలోని ధ్వనికి అనుకరణం ; 4. గుండెలు అదరటంలోని ధ్వనికి అనుకరణం.

గుభుల్లు రూ.చూ. గుభులు. వి. 1. గుండెలు అదరటంలోని ధ్వనికి అనుకరణం. సారంగ. 3.28 ; 2. దుమకటంలోని ధ్వనికి అనుకరణం. భాను. 2.80 ; 3. నీరు మొ. వాటిలో రాయి పడేటప్పటి ధ్వనికి అనుకరణం. శుక. 2.135 ; 4. భేరి తుపాకి మొ. వాటి ధ్వనికి అనుకరణం.

గుభేలు రూ.చూ. గుభాలు. వి. 1. ఉరకటం మొ. వాటి ధ్వనికి అనుకరణం ; 2. శిలాదులు కూలటంలోని ధ్వనికి అనుకరణం.

గుభేలున రూ. గుబేలున. క్రి. విశ. ద్రు. గుబ్బున, గబాలున, గబుక్కున. సిం.ద్వా. 6.135. గుభేలురను అ.క్రి. గుబేలు అనేధ్వనికలుగు. రామాభ్యు. 6.99.

గుమగుమ రూ.చూ. ఘుమంఘుమ. వి. 1. అగ్ని మండటంలోని దానికి అనుకరణం. నిరంకు. 2.99 ; 2. సువానన కొట్టటంలోని దానికి అనుకరణం. విప్ర. 1.74 ; 3. గుమగుమ వానన.

గుమగుమలాడు అ.క్రి. గంధం వెదజల్లు. గుమగుమాయించు అ.క్రి. సువానన వ్యాపించు.

గుమగుమాయించు చూ. గుమగుమ.

గుమంజి వి. సుగంధ ద్రవ్య విశేషం. కవిక. 3.195.

గుమడి రూ.చూ. గుముడు. వి. కంచెకట్టు కోడానికి, వంటచెరకు గానూ ఉపయోగపడే ఒకచెట్టు (Gmelina asiatica).

గుమర వి. మద్దెలవంటి వాద్య విశేషం.

గుమరటేకు రూ.చూ. గుముడుటేకు. వి. వ్రాతబల్లలు మొ. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే బూడిదరంగు కల్గి, పసుపు పూలు పూసే ఒకరకం చెట్టు. (Gmelina arborea).

గుమానా చూ. గుమాను

గుమాని చూ. గుమాను.

గుమాను వి. అనుమానం.

హిం.ఉ. గుమాన్. అనుమానం, గర్వం.

క. గుమాన. అనుమానం, జాగ్రత్త.

<ఉ. గుమాన్.

గుమానా విశ. అనుమానం గల. గుమాని విశ. సందేహించబడ్డ.

గుమాయించు[1] అ.క్రి. 1. పరిమళించు ; 2. ఉక్కపోయు.

పో.చూ. హిం. ఘుమానా. తిప్పటం.

గుమాయించు[2] స.క్రి. కొయ్య సాధనాలతో మెల్లిగా కొట్టు, బాదు.

గుమాయింపు చూ. గుమాయించు[1]. వి. 1. ఉక్క ; 2. పరిమళం.

గుమాస్తా రూ. గుమాస్తె. వి. కింది ఉద్యోగస్థుడు.

హిం. ఉ. పార. గుమాస్తా. కిందపని చేసే ఉద్యోగి.

<ఈ. గుమాస్తా.

గుమాస్తె రూ.చూ. గుమాస్తా. వి. కింది ఉద్యోగస్థుడు.

గుమి¹ వి. మడుగు. భాగ. 10. పూ. 635.

గుమి² రూ.చూ. గమి. వి. 1. సమూహం, గుంపు. రం.రా.; యు. 317; 2. పొద. భాస్క. రా. అరణ్య. 1.125; 3. రాశి, పోగు. వసు. 4.128; 4. గుది. దశా. 1.289.

క. గుమి, గుమ్మి, గుయ్మ, గుమ్మె, గుంపు. సమూహం, పొద; గుబరు, గుబురు. మంద, గుంపు. తు. గుముగుము. సమూహం యొక్క శబ్దం; గుంపు. సమూహం; త. కుమి, కువి, కువవు, కువాల్, కువై, కువియల్, కువివు, కుంపు, కుంపల్. కుంపమ్, కుంపి, కూప్పు. గుంపు, సమూహం; మ. కుమి. గుంపు. సమూహం; కుమియుక. గుంపుగా చేరటం; కుమిక్క, కుమెక్క. గుంపగు; కువిక. సమూహంగా చేరు; కుంపిక్క. గుంపు; కొండ. గుబ్. ఒకవర్గం ప్రజలు; గుబ్ల్. గుంపు; తొ. కుబిల్. మంద; కుపి. గుంపు.

గుమికట్టు అ.క్రి. గుంపుగూడు, సంఘమగు. దశకు. 5.123. గుమికాడు వి. వాయసం, కాకి. సాంబ. 4.82. గుమిగూడు(-కూడు) రూ. గమికూడు. అ.క్రి. గుమికట్టు. చంద్రాంగ. 2.62. గుమిగొను(-కొను) అ.క్రి. గుమికూడు. శుక. 2.40. గుములుకొను రూ.చూ. గములుకొను. అ.క్రి. గుంపులుకూడు. గుములుగట్టు(-కట్టు) అ.క్రి. గుంపుకూడు. భార.భీష్మ. 2.166. గుములుగూడు(-కూడు) అ.క్రి. గుంపులుకూడు. దశా. 2.434.

గుమిక వి. నాయకుడు.

గుమిచి వి. పావురాలు నిల్చునే గూడు.

గుమిడికము వి. విల్లు. శుక. 2.119.

గుమితి రూ.చూ. గుమ్మితి¹. వి. ఆయుధ విశేషం.

గుమితికాగు వి. ఓడకాగు, ధాన్యం నిల్వకు వాడే పెద్దసైజు మట్టి పాత్ర.

గుమితె రూ.చూ. గుమ్మితి¹. వి. గూటం, కొట్టే కొయ్యబడితె.

గుమిరిక వి. ఒకవిధమైన నవల.

గుమిలి రూ.చూ. గుబిలి¹. వి. పక్షి విశేషం. శకునపక్షి.

గుమిలించు స.క్రి. తపింపచేయు.

గుముకు రూ.చూ. గుబుకు¹. స.క్రి. పిడికిలి, మోచేయి మొ. వానితో పొడుచు. చంద్రాంగ. 2.63.

గుముడు రూ. గుమడి. వి. ఒకవిధమైన జేకు. ద్వి. పరమ. 2.54 (Gmelinaasiatica).

క. కుముళె, కుంబు, కూళె. వృక్షవిశేషం; కొడ. కుమ్మి, కుంబిళి. వృక్షవిశేషం; త. కుమిఙ్. ఒకవిధమైన జేకు; కూంపల్. వృక్షవిశేషం; మ. కుమిఙ్, కుంపిళ్. వృక్షవిశేషం; గోం. గుమ్మర్ మఞా. వృక్ష విశేషం; పర్జి. గ్రుమి. వృక్ష విశేషం; కొలా. క్రుమె. వృక్ష విశేషం.

గుముడుటేకు రూ. గుమరటేకు. వి. వ్రాతబల్లలు మొ. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే ఒకరకం చెట్టు (Gmelina arborea).

గుమురు రూ. గుబురు. వి. 1. సమూహం, గుంపు. రం.రా. కిష్కిం. 281 పు. 9 పం.; 2. కొమ్మలు, ఆకులు, చిగుళ్ళు మొ. వాని సమూహం, విటపం. కళా. 4.224. విశే. సాంద్రమైన, దట్టమైన. పారి. 4.16.

క. గుబరు, గుబురు. దట్టం, సాంద్రం; గుమి, గుమ్మి, గుమ్మె, గుంపు. సమూహం; తు. గుముగుము. శబ్దసమూహం; గుంపు. సమూహం; త. కుమి. గుంపు; కువి, కువవు, కువాల్, కువై. సమూహం. కట్ట, కుప్ప; కుంపల్. కుంపమ్. కుంపి. కుప్ప; కూప్పు, కూవై; మ. కుమి. పోగు, కుప్ప: కుమియుక. పోగగు, కుమిక్క, కుమెక్క, కూంపల్, కూంపిక్క. కుప్ప; కొండ. గుబ్. ప్రజాసమూహం; గుబ్ల్: తొ. కుబిల్. మంద; కుపి. గుంపు, మంద; కొలా. గుమ్, గుమెర్; పర్జి. కుమ్; నా. ఘుమ్ ఎర్.

గుమురుకొను రూ. గుబురుకొను, గుముర్కొను. అ.క్రి. గుమురుకట్టు. పాండు. 2.91. గుమురుగట్టు (-కట్టు) అ.క్రి. గుంపుకట్టు, గుంపగు. భార. విరా. 5.223. గుమురులగట్టు (-కట్టు) రూ. గుముర్లగట్టు. అ.క్రి. గుంపులుకట్టు. కు.సం. 4.107. గుముర్కొను రూ.చూ. గుమురుకొను. అ.క్రి. గుమురుకట్టు. పాండు. 3.69. గుముర్లగట్టు రూ.చూ. గుమురులగట్టు. అ.క్రి. గుంపులుకట్టు. వీర.వి. 4.162.

గుముర్కొను చూ. గుమురు.

గుముర్లగట్టు చూ. గుమురు.

గుములుకొను చూ. గుమి².

గుములుగట్టు చూ. గుమి².

గుములుగూడు (-కూడు) చూ. గుమి².

గుంపని రూ. గుంపిని, గుంపిర, గుంపెన¹, గుంపెని. వి. జిగురునిచ్చే ఒక చెట్టు (odina wodier)

గుంపించు చూ. గుంపు.

గుంపిని రూ. చూ. గుంపని. వి. జిగురునిచ్చే ఒక చెట్టు (odina wodier).

గుంపిర రూ. చూ. గుంపని. వి. జిగురునిచ్చే ఒక చెట్టు (odina wodier).

గుంపు వి. 1. సమూహం. పోగు. భార.ఉద్యో. 2.88; 2. నూలు వడికేటప్పుడు మధ్యలోవచ్చే ఉండ. శుక. 2.418; 3. ప్రాణి సమూహం; 4. ముడి; 5. మంద, గుబురు; 6. విత్తనాలు పడటానికి గొర్రుచెక్కలకు వేసిన బెజ్జం; 7. పత్తిలో ఉండకట్టిన నలుసులు; 8. పన్నెకట్టుబడిలో దండెల మధ్య బిగించటానికి వాడే కొండచీపురుపుల్లల కణుపులు.

క. గుంపు. సమూహం, మంది; త. కుంపు.

సం. గుంఫ-. కూర్పు; ప్రా. గుంబ-.

గుంపించు స.క్రి. 1. అతిక్రమించు. భాగ. 7.270; 2. కుప్పచేయు. గుంపుగూడు (-కూడు) అ.క్రి. మల్లడిగొను, గుంపుగాచేరు. ఆం.భా. 3.103. గుంపుగొను (-కొను) అ.క్రి. గుంపుగూడు. శుక. 3.79. గుంపుచేయు స.క్రి. ఒకచోటికిచేర్చు. గుంపుచేరు అ.క్రి. గుంపుగూడు, గుమిగూడు. గుంపుతీయు స.క్రి. పడుగులో కలిసిపోయిన పోగులు విడదీయు. గుంపు

దీర్చు(-తీర్చు) స.క్రి. 1. గుంపుగాచేయు. కాళిందీ. 2.63 ; 2. సవరించు, చెదిరిన కురులు సవరించి గుంపుగా చేయు. గుంపుదేర్చు(-తేర్చు) స.క్రి. చెదిరిన కురులు సవరించి గుంపుగా చేయు. గుంపులుగట్టు(-కట్టు) అ.క్రి. గుంపులగు. హర. 2.27. గుంపులుగుంపులుగొను (-కొను) అ.క్రి. గుంపులు గుంపులుగా చేరు. రం.రా.అయో. 121 పు. 29 పం. గుంపులుగూడు (-కూడు) అ.క్రి. గుంపులుగా చేరు. వరాహ. 10.35. గుంపులుగొను (-కొను) అ.క్రి. గుంపులుగా చేరు. భార.విరా. 5.177.

గుంపెకేయు అ.క్రి. పుక్కనిచ్చు, పుక్కేయు, కుంగనిచ్చు.

గుంపెన[1] రూ.చూ. గుంపని. వి. సముద్రతీర ప్రాంతాల్లోని కొండల్లో బాగా పెరిగే ఒకానొక పెద్దచెట్టు. యయా. 4.15 (odina wodier).

గుంపెన[2] వి. 1. గంతు. శుక 3.21 ; 2. పోటు, దెబ్బ. శశా. 5.14 ; 3. విజృంభణం.

గుంపెని రూ. చూ. గుంపని. వి. జిగురునిచ్చే ఒక చెట్టు (odina wodier).

గుంబద్ రూ. గుమ్మజు. వి. భవనంపై ఉన్న గోళాకారపు మంటపం.

ఉ.హిం. గుంబద్. మశీదు మొ. వానిలో గోళాకారంగా ఉన్న కప్పు. పా. గుంబద్. అర్ధచంద్రాకారంగా ఉండే ప్రవేశ ద్వారం.

<ఉ. గుంబద్.

గుంబము రూ. గుమ్మం, గుమ్మము. వి. వాకిలి.

గుమ్మ[1] వి. పాలు పిండినపుడు వచ్చే ధార. హరిశ్చ. 4.199.

గుమ్మకాంభోజి వి. ముప్పైరెండు నపుంసక రాగాల్లో ఒకటి. ప్రబంధ. 96.

గుమ్మ[2] వి. ఆడుది, స్త్రీ. కు.సం. 6.27.

త. కుమ్మిలి.

గుమ్మ[3] వి. గాదె, కుసూలం, బుట్ట. ఆం.భా. 3.64.

క. గుమ్మి. గాదె.

గుమ్మకొమ్ము వి. లోపలివైపు గుండ్రంగా తిరిగి కొనలు కలిసిన కొమ్ము. గుమ్మపడు అ.క్రి. (గాదెలో ధాన్యం పడినట్లు) కుప్పగా కూలు.

గుమ్మం రూ.చూ. గుంబము. వి. 1. ప్రవేశమార్గం ; 2. సింహద్వారానికి ముందు అరుగుల మధ్యగాఉన్న నడిచే దారి.

గుమ్మంరాయి వి. సెంబరురాయి, నర్వేరాయి, హద్దురాయి.

గుమ్మంతడికె వి. జజ్జరతలుపు, వెదురుబద్దలతో అల్లినతలుపు.

గుమ్మజు రూ.చూ. గుంబద్. వి. గుమ్మటం.

గుమ్మటం చూ. గుమ్మటము. వి. కిందిభాగం వెడల్పుగా పైభాగం పొడవుగా మధ్య పొట్ట లావుగా కూజామాదిరిఉండే మట్టి పాత్ర.

గుమ్మటము వి. 1. రాయి. తాటాకు, కాగితం మొ. వాటితో నిర్మించిన దీపంగూడు. సానంద. 3.46 ; 2. పొగ గుమ్మటం ; 3. ఉత్సవాదుల్లో విగ్రహాదులనుంచి ఊరేగించే విమానాదికం ; 4. నూలుతోడుకొనే సాధన విశేషం ; 5. ఉమటాం, గోపురంవంటి నిర్మాణం ; 6. మంద, చెట్టు ఆకులు గుబురుగా కనపడే స్థితి.

క. గుమ్మటు. గుమ్మటం ; త. కుమ్మట్టం.

గుమ్మటిల్లు అ.క్రి. 1. గుబ్బటిల్లు, తిరగబడు ; 2. తపించు ; 3. అతిశయించు.

గుమ్మడ[1] రూ.చూ. గుమ్మడి. వి. గుమ్మడికాయ, కూష్మాండం.

గుమ్మడ[2] వి. వాననీరు కిందికి కారేటట్లు మిద్దెపైన ఏర్పడిన రంధ్రం.

గుమ్మడపడు అ.క్రి. మిద్దెలో కన్నమేర్పడు.

గుమ్మడన్నకసమ చూ. గుమ్మడి. రూ. గుమ్మడన్నకన్న. వి. తెల్లపోగులు కలిపినేసిన రవికెలగుడ్డ.

గుమ్మడన్నకన్న రూ.చూ. గుమ్మడన్నకసమ. వి. తెల్లపోగులు కలిపినేసిన రవికెలగుడ్డ.

గుమ్మడి రూ. గుమ్మడ[1], గుమ్మళి, గుమ్మిడి[1], గుమ్ముడు[1]. వి. 1. కూష్మాండం. హర. 2.99 ; 2. గుమ్మడి తీగ (Cucrubita Maxima).

సం. కూష్మాండ-. గుమ్మడి ; ప్రా. కుష్మండ- ; పా. కుమ్భండ-.

క. కుంబళ. గుమ్మడికాయ ; కొడ. కుంబళ. గుమ్మడి కాయ ; తు. కుంబుడ. గుమ్మడికాయ ; కుంబళ. గుమ్మడికాయ ; త. కుంబళమ్. గుమ్మడికాయ ; మ. కుంపళమ్. గుమ్మడికాయ ; కో. కుబళమ్. గుమ్మడి కాయ ; తొ. కుబిలికొయ్. గుమ్మడికాయ ; కొంద. గుముంది. గుమ్మడికాయ ; కొలా. క్వె. గుమ్మడికాయ; మాల్తో. కుమ్డె. గుమ్మడికాయ.

<ప్రా. కుష్మండ-

గుమ్మడికాయ వి. 1. గుమ్మడికాయ ఆకారంతో చేసిన మట్టిబూజా ; 2. గుమ్మడిపాదునుంచి పుట్టే కాయ, దీన్ని కూరగా ఉపయోగిస్తారు. గుమ్మడిగింజ నామము వి. తిలక విశేషం. కువ.చ. 4.188. గుమ్మడిజాడి వి. గుమ్మడికాయ ఆకారంలో చేసిన గుండ్రని జాడి. గుమ్మడితీగ వి. విశాఖ, గోదావరి జిల్లాలోనూ, పడమటి కనుముల్లోనూ పశ్చిమ తీరంలోనూ పెరిగే ఒకతీగ (euitispedata). గుమ్మడిదల(-తల) వి. మంద, నాటుకొన్నచెట్టు ఆకులు దట్టంగా వేసి గుబురుగాఉండే స్థితి. గుమ్మడిపురుగు వి. గుమ్మడి కాయలోని పురుగు. గుమ్మడిపువ్వన్నె రూ.చూ. గుమ్మడి పూవువన్నె. వి. 1. గోల్డ్ ఆరంజ్ రంగు, నిమ్మపండు రంగు ; 2. తెలుపులో పసుప్పచ్చరంగు ; 3. తీరవుప్పురం గులో ముదురురంగు ; 4. పసుపుఎరుపు కలిసినరంగు ; 5. ఒకరకం పసుపురంగు. గుమ్మడిపూలు వి.బ.వ. బొద్దుమూకుడు, పాలకుండలమీద పెట్టేమూత. గుమ్మడి పూవన్నె రూ.చూ. గుమ్మడిపూవువన్నె. వి. 1. గోల్డ్ ఆరంజ్ రంగు. నిమ్మపండురంగు ; 2. తెలుపులో పసుప్పచ్చరంగు ; 3. తీరవుప్పురంగులో ముదురురంగు. 4. పసుపు ఎరుపు కలిసిన రంగు ; 5. ఒకరకం పసుపురంగు గుమ్మడిపూవువన్నె రూ. గుమ్మడిపువ్వన్నె, గుమ్మడిపూవన్నె. వి. 1. నిమ్మపండురంగు, ఆరంజి, పటిక, తాజావు, నేసి నెప్తాలు రంగు, గోల్డు ఆరంజి ; 2. తెలుపులో పసుప్పచ్చ రంగు ; 3. తీరవుప్పులో ముదురు రంగు ; 4. పసుపు ఎరుపుకలిసిన రంగు ; 5. ఒకరకం పసుపురంగు. గుమ్మడి

మూట వి. గుమ్మడిపండుమాదిరి ఉండేమూట. క్రీడా. 46. గుమ్మడిరేఁగు వి. కాయఫలం, కట్పలం. గుమ్మడివిత్తునామము వి. గుమ్మడి గింజ నామం. ప్రభా. 4.137. గుమ్మడిసొర వి. గుండ్రంగా ఉండేఒకరకంకాయ.

గుమ్మడిచెట్టు చూ. గుముడు. వి. కంచె కట్టుకోడానికి, వంట చెరకు గానూ ఉపయోగపడే ఒకచెట్టు (Gumelina ariatica).

గుమ్మఁడు వి. అలంకరించు కొనేవాడు ఆం. భా. 3.10.

గుమ్మతలు రూ.చూ. గుమ్మతీలు. వి.బ.వ. కత్తెరబావిలీ, అంటు కోడు.

గుమ్మతీలు రూ. గుమ్మతలు. వి.బ.వ. కర్ణభూషా విశేషం, చెవితమ్మె నుంచే వస్తువులు.

గుమ్మను స.క్రి. అలుముకొను, కమ్ము.

గుమ్మపాలు వి. అప్పుడేపితికిన పాలు.

గుమ్మము రూ.చూ. గుంబము. వి. వాకిలి, ద్వారం.

గుమ్మరింపు వి. మల్లయుద్ధ విన్నాణం.

గుమ్మళి రూ.చూ. గుమ్మడి. వి. కూష్మాండం.

గుమ్మనరులు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

గుమ్మాగది రూ. గుమ్మిగది. వి. గాదె, నరుకులుంచుకొనేగది.

గుమ్మాలి రూ.చూ. గుమ్మాళి. వి. పాదుక, పాదరక్ష.

గుమ్మాళి రూ. గుమ్మాలి. వి. పాదుక, పాదరక్ష.

గుమ్మి[1] రూ. గుమ్మె[1]. వి. గుంట, మాగాణిపంటలకు, తోటలకు నీళ్ళు పెట్టటానికి పొలంలో తవ్విన చిన్నజలాశయం, గుంట, గొయ్యి.

గుమ్మి[2] వి. 1. బురద ; 2. పఱ్ఱ.

తు. గుమ్మ. కంపు, దుర్గంధం; త. కుంపి. బురద, కంపు, దుర్గంధం.

గుమ్మి[3] రూ. గుమ్మె[3] వి. 1. రాటి, గుమ్మటం లాంటిపనిముట్టు ; 2. రొలక, పట్టు దారం చుట్టేకొయ్య పనిముట్టు.

గుమ్మిఆకు వి. 1. రాటి పైనా కిందా కట్టిన వెదురుబద్ద ; 2. పట్టుదారం చుట్టేరొలక కట్టుబడిలో ఇరుసుచుట్టూ బిగించిన గాటికొయ్యం పట్టె. గుమ్మిఇరుసు రూ. గుమ్మిరుసు. వి. అర్ధగుమ్మి తిరగడానికి ఆధారంగా ఉండేకఱ్ఱ. గుమ్మికర రూ.చూ. గుమ్మికఱ్ఱ. వి. బెజ్జంకట్టె. గుమ్మికఱ్ఱ రూ. గుమ్మికర. వి. బెజ్జంకట్టె, రాటినూలం దూర్చినకట్టె. గుమ్మికామ వి. శూలం, రాటితిరగటానికి ఆధారంగా ఉన్నఇరుసు. గుమ్మికొయ్య వి. 1. రాటి శూలం, రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు ; 2. రాటికిఆధారంగా పాతిన నిలువుకొయ్య. గుమ్మిచిప్ప రూ. గుమ్మిసిప్ప. వి. రాటిపైబద్దల్ని బిగించి వాటిమధ్య బోర్లించి కట్టినచిప్ప. గుమ్మితాడు వి. రాటిఆకుల పైపీ కిందిపీ కలిపికట్టిన దారం. గుమ్మిదారం రూ. గుమ్మె దారం. వి. ఆకులతాడు, గుమ్మితాడు, రాటిఆకులపైపీ కిందిపీ కలిపికట్టిన దారం. గుమ్మిదిండు వి. రాటికి ఆకులు బిగించిన వెదురుగొట్టం. గుమ్మినిలువు వి. గురకగుంజ, అర్ధగుమ్మి తిరగటానికి ఆధారంగా అర్ధకట్టెకు పాతిననిలువు కొయ్య. గుమ్మిపీట వి. రాటితిరగటానికి, రాటిశూలానికి ఆధారంగా ఉన్నకొయ్యమొద్దు. గుమ్మిపుల్ల వి. శూలం, రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. గుమ్మిబండ వి. రాటి తిరగడానికి. రాటిశూలానికి ఆధారంగాఉన్న రాయి. గుమ్మిబద్ద వి. రాటికిపైనా కిందా కట్టిన వెదురుబద్ద. గుమ్మిమొద్దు రూ. గుమ్మెమొద్దు, గుమ్మొద్దు. వి. రాటితిరగటానికి రాటిశూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. గుమ్మిరుసు రూ.చూ. గుమ్మిఇరుసు. వి. అర్ధగుమ్మి తిరగటానికి ఆధారంగా ఉండే కఱ్ఱ. గుమ్మిసలాకి వి. రాటితిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. గుమ్మిసిప్ప(-చిప్ప) రూ.చూ. గుమ్మిచిప్ప. వి. రాటిపై బద్దల్ని బిగించి వాటిమధ్య బోర్లించి కట్టిన చిప్ప. గుమ్మిసీకు వి. రాటితిరగడానికి ఆధారంగా ఉన్న ఇరుసు. గుమ్మొద్దు రూ.చూ. గుమ్మిమొద్దు. వి. రాటితిరగటానికి రాటిశూలానికి ఉన్న కొయ్య మొద్దు < గుమ్మి[3] + మొద్దు.

గుమ్మి[4] రూ.చూ. గుమ్ము[1]. వి. గాదె, ధాన్యం నిల్వచేయడానికి ఎత్తుగాచేసిన మట్టిగాదె.

క. గుమ్మి. ధాన్యం నిలవ చేసుకొనే పెద్దబుట్ట.

గుమ్మిట రూ గుమ్మిత, గుమ్మితి[2]. వి. 1. గాదె, రాతితో కాక ఇంటిబయట ధాన్యం నిలవచేసుకోడానికి వాడేనిర్మాణం ; 2. కింది వెడల్పుగా పైన పొడవుగా మధ్య భాగంలో పొట్టలావుగా కూజామాదిరి ఉండేమట్టిపాత్ర. గుమ్మిటకుండ రూ.చూ. గుమ్మెటకుండ. వి. కిందిమూత వెడల్పుగా పై మూత పొడవుగా మధ్యభాగంలో పొట్టలావుగా కూజా మాదిరిగా ఉండేఒకరకం వాయిద్యం. గుమ్మిబోరెం వి. ధాన్యం పోసుకోటానికి నేసిన నారసంచి.

గుమ్మించు స.క్రి. కుమ్ము, రాతితోతొక్కు.

గుమ్మిటబుఱ్ఱ చూ. గుమ్మెట. వి. జంగాలు మొ. వారు వాయించే ఒకరకం వాయిద్యం.

గుమ్మిడి[1] రూ.చూ. గుమ్మడి. వి. కూష్మాండం.

గుమ్మిడికమ్మి వి. గుమ్మడిపండు నమూనా నేసినకమ్మి.

గుమ్మిడి[2] రూ.చూ. గుముడు. వి. కంచెకట్టుకోడానికి వంటచెరకు గానూ ఉపయోగపడే ఒకచెట్టు (Gmelina asiatica).

గుమ్మిత రూ.చూ. గుమ్మిట. వి. కిందిమూత వెడల్పుగా, పై మూత పొడవుగా మధ్యభాగంలో పొట్టలావుగా కూజా మాదిరి ఉండేమట్టిపాత్ర.

గుమ్మితి[1] రూ. గుమితి, గుమితె, గుమ్మితీ. వి. ఆయుధవిశేషం. శశా. 2.70.

గుమ్మితి[2] రూ.చూ. గుమ్మిట. వి. కిందమూత వెడల్పుగా పై మూత పొడవుగా మధ్యభాగంలో పొట్టలావుగా కూజా మాదిరి ఉండేమట్టిపాత్ర.

గుమ్మితీ రూ.చూ. గుమ్మితి[1]. వి. ఆయుధవిశేషం. అహల్యా. 3.41.

గుమ్మిగది రూ.చూ. గుమ్మాగది. వి. గాదె.

గుమ్ము[1] రూ. గుబ్బు[5]. గుమ్మి[4], గుమ్మె[4], వి. గాదె, ధాన్యం నిలవ చేసుకోటానికి వెదురు బద్దలతోగాని, ఈత పేళ్ళతో గాని అల్లిన పెద్ద గంప.

గుమ్ము[2] రూ.చూ. గుబ్బు[4]. వి. చెరకు పొదలాగ పెరిగే స్థితి, ఖాళీ లేకుండా గాలి ఆడకుండా ఉండే స్థితి.

గుమ్ము[3] వి. పాదు, గుంజలు మొ. పాతడానికి గడ్డ పలుగుతో తవ్విన లోతైన గుంట.

గుమ్ము[4] రూ. ఘుమ్ము. వి. 1. పరిమళించటం, తిప్పటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. హర. 6.74 ; 2. పిడికిటి పోటు.

గుమ్ము[5] రూ.చూ. కుమ్ము[1]. స.క్రి. పొడుచు.

గుమ్ముడు[1] రూ.చూ. గుముడు. వి. 1. టేకు, కుముదిక. ఆం.భా. 2.46 ; 2. కాశ్మర్యం, ఒక రకమైన టేకు (Ipomaea digigata, Ipomaea paniculata).

గుమ్ముడుచెట్టు వి. టేకుచెట్టు. గుమ్ముడుమాను వి. పర్వత ప్రాంతాల్లో పెరిగే కలప నిచ్చే పెద్ద చెట్టు, టేకు చెట్టు (Gmelina arborea).

గుమ్ముడు[2] రూ.చూ. గుమ్మడి. వి. గుమ్మడి, కూష్మాండం.

గుమ్మాన వి. కింది భాగం వెడల్పుగా పై మూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే మట్టి పాత్ర.

గుమ్మె[1] రూ.చూ. గుమ్మి[1]. వి. గుంట, గొయ్యి.

గుమ్మె[2] వి. 1. నొక్కు. సారంగధ. 2.247 ; 2. గుడారం, గుడారు.

గుమ్మె[3] రూ.చూ. గుమ్మి[3]. వి. 1. రాటి, గుమ్మటం లాంటి పని ముట్టు ; 2. కొలక, పట్టుదారం చుట్టే కొయ్య.

గుమ్మెదారం రూ.చూ. గుమ్మిదారం. వి. ఆకుల కాడు. గుమ్మెమొద్దు రూ.చూ. గుమ్మిమొద్దు. వి. రాట తిరగటానికి రాటి శూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు.

గుమ్మె[4] రూ.చూ. గుమ్ము[1]. వి. గాదె.

గుమ్మె[5] వి. పిలక, అరటిచెట్టు చుట్టూ మొలిచే పిలక లేక చిన్న అరటి మొక్క.

గుమ్మెట చూ. గుమ్మటం. రూ. గుమ్మెత, గుమ్మెతము. వి. 1. కుంభ వాద్యం, ఢుడుం. ఆము. 4.85 ; 2. గుమ్మిట బుర్ర, కింది మూత వెడల్పుగా, పై మూత పొడవుగా, మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే మట్టిపాత్ర, ధాన్యం నిలవ చేసికొనే పెద్ద బాన.

త. కుమ్మట్టమ్. కుంభ వాద్యం.

గుమ్మెటకాఁడు రూ.చూ. గుమ్మెతకాఁడు. వి. ఢుడుం వాయించేవాడు. గుమ్మెటకుండ రూ. గుమ్మిటకుండ, గుమ్మెత కుండ. వి. కింది మూత వెడల్పుగా పై మూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే ఒక రకం వాద్యం.

గుమ్మెత రూ.చూ. గుమ్మెట. వి. 1. వాద్య విశేషం. హంస. 3.188 ; 2. కింది మూత వెడల్పుగా, పై మూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరిగా ఉండే మట్టి పాత్ర.

గుమ్మెతకాఁడు రూ. గుమ్మెటకాఁడు. వి. ఢుడుం వాయించేవాడు. హంస. 5.186. గుమ్మెతకుండ రూ.చూ. గుమ్మెటకుండ. వి. కింది మూత వెడల్పుగా పై మూత పొడవుగా మధ్య భాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే ఒకరకం వాయిద్యం. గుమ్మెతగుడారము వి. గుమ్మెత వంటి ఆకారంగల గుడారం. కువ.చ. 2.86.

గుమ్మెతము రూ.చూ. గుమ్మెట. వి. ఢుడుం, తమ్మటం, డప్పు.

గుమ్మెర వి. గుముడుచెట్టు, వ్రాత బల్లలు మొ. గృహోపకరణాల తయారీకి ఉపయోగపడే కలప నిచ్చే చెట్టు, బూడిద రంగులో కలిసిన పసుపు రంగు పూలు పూస్తుంది (Gmelina asiatica)

గుమ్మొద్దు చూ. గుమ్మి[3].

గుయిగుంజ వి. మిడిగూటం, నేతబయలులో చివర పాతిన కొయ్య.

గుయ్‌గడ్డ రూ.చూ. గుయ్యిగడ్డ. వి. సారె సులువుగా తిరగటానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరి పొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గుయ్‌గడ్డబొర్ర వి. సారె మొలదించడానికి గుల్చి రాయి మధ్యలో రంధ్రం.

గుయ్యారము వి. గుహ్యాగారం, చెరసాల, చీకటికొట్టు. ఆం. భా. 2,226.

సం. గుహ్యాగార-. రహస్య ప్రదేశం.

<సం. గుహ్యాగార-.

గుయ్యి[1] వి. గడిమాను, తలుపు చెక్కలను మూస్తూ గోడల్లోని కంతల్లోకి దూర్చబడే రోకలివంటి పెద్ద గడియ.

గుయ్యి[2] వి. సారె మొలను దించడానికి ఏర్పరచిన గుల్చిరాయి మధ్యలోని రంధ్రం.

గుయ్యిగడ్డ రూ. గుయ్‌గడ్డ, గూగడ్డ. వి. సారె సులువుగా తిరగడానికి వీలుగా రంధ్రం ఉన్న రాయికి మట్టి వరి పొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గురం రూ.చూ. గుర్రం. వి. గుర్రప్పీట, పోలు గర్రకు కాడి కట్టే వైపు అడుగున వేసిన కొయ్య ముక్క.

గురక[1] రూ.చూ. గుఱక. వి. నిద్రలోని ధ్వని.

గురకకొట్టు అ.క్రి. గురకపెట్టు. గురకపెట్టు రూ.చూ. గుఱకపెట్టు. అ.క్రి. గురకనిడు.

గురక[2] రూ.చూ. గుఱుకు. వి. మామూలుగా నల్ల గొర్లకు వచ్చే జబ్బు.

గురగుర[1] వి. 1. పంది కూతకు అనుకరణం. హరి. పూ. 4.16 ; 2. ఇఱ్ఱి చేసే ధ్వనికి అనుకరణం. చంద్రభా. 2.21.

పో.చూ. క. గురు. గడగడ ధ్వనికి అనుకరణం.

గురగురలాడు అ.క్రి. గొంతులో గురకపెట్టు.

గురగుర[2] రూ.చూ. గుఱగుఱ. వి. ఒక విధమైన దురద.

గురజకాయ వి. ఫల విశేషం.

గురజకూర వి. ఒక రకపు మొక్క యొక్క ఆకులతో చేయబడే శాక విశేషం.

గురవలతీగె వి. ఒక రకం పెద్ద తీగ (Aganosma caryphyllata).

గురబిడి వి. అడవిగోవు, గవయం.

గురపోతు రూ.చూ. గురుపోతు. వి. పురుష గవయం.

గురవలయ్య వి. కుమ్మర్ల కుల గురువు.

సం. గురు. ఆచార్యుడు, గురువు.

<సం. గురు- + -వ + -లు + అయ్య.

గురస్తు రూ. గ్రస్తు. వి. గృహస్థు, ఇంటికాపు. శుక. 2.478.

సం. గృహస్థ-. గేస్తు.

<నం. గృహస్థ-.

గురాలు వి.బ.వ. గొబ్బి బొమ్మలు, గురిగెలు.

గురి[1] వి. అర్బుదపలి, ములక. అం.బా. 2.64.
క. గురి. ములక.

గురి[2] రూ.చూ. గుటి. వి. **1.** లక్ష్యం; **2.** గుర్తు; **3.** దృష్టాంతం; **4.** మితి; **5.** నిశ్చయం.
గురికట్టు వి. హద్దు. గురికాఁడు వి. కృతహస్తుడు. గురికిబెత్తెడు విశ. దాదాపు, ఇంచుమించు. గురికొండి వి. ఆయం, జీవస్థానం. గురిగజ్జె వి. ఎద్దు మెడకు కట్టే చిరు మువ్వ. గురించు స.క్రి. గురిఉంచు, ఉద్దేశించు.

గురిక రూ.చూ. గురిగి[2]. వి. **1.** లక్కపిడత, గొబ్బెమ్మ; **2.** గయ్యాళి.

గురికొచ్చ వి. తెలివి, జ్ఞానం.

గురిగ రూ.చూ. గురిగి[2]. వి. **1.** గిన్నెలాగ ఉండే చిన్న మట్టి పాత్ర; **2.** గయ్యాళి.

గురిగడ్డ రూ. గుర్గడ్డ. వి. సారెను సులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గురిగమ్మ వి. బుద్ధిమంతురాలు.

గురిగి[1] వి. పాదు, మధ్యలో నీళ్ళుపోసి గచ్చును గట్టిపరచడానికి వీలుగా మట్టితో కట్టిన కట్ట.

గురిగి[2] రూ. గురిక, గురిగ, గురిగె, గురియ, గురుగు[4], గొరిగి. వి. **1.** అత్యల్ప భాండం, ఆడపిల్లలు ఆడుకొనే చిన్న పిడత. అం.బా. 2.247; **2.** గయ్యాళి.
గురిగిదుత్త రూ. గురిగెదుత్త. వి. గురిగెముంత, అరివేణి లేకుండా పెండ్లి చేసేవారు వాడే మట్టి పాత్ర.

గురిగింజ రూ. గురిగుజ, గురిజ[1], గురివింద, గురివెంద, గురుగింజ, గురువింద, గురువెంద, గుర్వెంద, గులివింత, గులివింద. వి. **1.** గురివిపూన; **2.** బాల క్రీడా విశేషం.
క. *గురుగంజి*, *గురుగుంజ*, *గురుగుంజె*; తు. *గుర్గుంజ*, *గుగ్గాంజ*; త. *కురువిందమ్*.
సం. *గుంజా*. గుంజాలత (Afrus precatarius),

గురిగిరాయి వి. గురిగెల్ని నర్పడానికి వాడే పొడుగాటి రాయి.

గురిగిలు వి.బ.వ. చాల చిన్న మట్టి పాత్రలు.

గురిగుజ రూ.చూ. గురిగింజ. వి. బంజరు భూముల్లో పెరిగే ఒక తీగ ఒక వైపు నల్లగా ఉండే ఎర్రని చిన్న గింజలు కాస్తుంది. ఈ గింజల్ని స్వర్ణకారులు తూకానికి ఉపయోగిస్తారు (Abrus precatorius).

గురిగుబ్రాయి రూ.చూ. గురుగులరాయి. వి. గురుగెల్ని నర్పడానికి వాడే పొడుగుపాటి రాయి.

గురిగె రూ.చూ. గురిగి[2]. వి. **1.** పిడత, గిన్నెలాగ ఉండే చిన్న మట్టి పాత్ర; **2.** గొబ్బెమ్మ.
గురిగెదుత్త రూ.చూ. గురిగిదుత్త. వి. గురిగెముంత.

గురిజ[1] రూ.చూ. గురిగింజ. వి. **1.** గురివెంద. హర. 7.41; **2.** గురిగింజపూన. సిం.ద్వా. 11.6 (A Precatorius).

గురిజ[2] వి. ముల్లంగి.
సం. *గృంజన-*. ముల్లంగి.
<సం. గృంజన-.

గురిజె రూ.చూ. గురుజు[1]. వి. గింజ సుంకు కంకిమీద ఏర్పడే నూగు.

గురిమాసి వి. కైజీతగాడు, బత్తెగాడు.

గురిమిడి వి. ఒక జాతి దుంప.
గురిమిడిగడ్డ వి. చల్ల గడ్డ వంటి ఒకానొక మూలిక.

గురియ రూ.చూ. గురిగి[2]. వి. ఆడపిల్లలు ఆడుకొనే చిన్న పిడత. అం.బా. 2.297.

గురివింద రూ.చూ. గురిగింజ. వి. **1.** గురిజ (పూన) తీగె; **2.** పిల్లలు ఆడుకొనే ఒక ఆట.

గురివిపాల వి. గురివిచెట్టు, తెల్లని పూలు పూసే ఒక చెట్టు, దీని కొమ్మలు కాగడాలకు ఉపయోగిస్తారు (Ixora paruiflora).

గురివెంద రూ.చూ. గురిగింజ. వి. **1.** గుంజాలత, గురిజ. హర. 7.140; **2.** పిల్లలు ఆడుకొనే ఒక రకం ఆట.
గురివెందగింజ వి. గురివెంద.

గురు వి. గవయ మృగం. నవనాథ. 1.47 పు. 6 పం.
గురుపోతు రూ. గురపోతు, గుఱపోతు. వి. పురుష గవయం. మను. 4.35.

గురుం రూ.చూ. గురుగు[2]. వి. జనప మొక్కలాటి కలుపు మొక్క (Chrozophora rolteleri khotzsch).

గురుక రూ.చూ. గుఱుకు. వి. **1.** గొరకకట్టె; **2.** పశువ్యాధి భేదం.

గురుకు[1] వి. పోగు, కుప్ప.

గురుకు[2] వి. **1.** పిండి ముద్దపై దీపారాధనకు చేసే గుంట; **2.** పల్లం.

గురుకు[3] రూ.చూ. గుఱుకు. వి. **1.** శ్లేష్మావరోధం చేత కలిగే కంఠధ్వని, గురక; **2.** పశురోగ విశేషం.

గురుకుళ వి.బ.వ. శివార్చకుడు, తంబళ.

గురుకొను రూ.చూ. గుఱుకొను. స.క్రి. **1.** యత్నించు, ఉద్యోగించు; **2.** కమ్ముకొను.

గురుగాకు చూ. గురుగు[3].

గురుగింజ రూ.చూ. గురిగింజ. వి. గురువెంద గింజ.

గురుగు[1] వి. భక్ష్య విశేషం. ప్రబంధ. 112.

గురుగు[2] రూ. గురుం, గురువు[1]. వి. **1.** నదుల ఒడ్డున వరి పొలాల్లోను మొలిచే ఒక రకం కలుపు మొక్క (Caloria argenta, Heliotropum indicum); **2.** జనుము లాటి కలుపు మొక్క (Chrozophara rottleri-klotzsch).

గురుగు[3] వి. ఒక విధమైన కూరాకు, భూదుండి. ఆము. 4.134.
క. *గురుగులు*. సూర్యకాంతం పువ్వు (Heliotropium indicum).
గురుగాకు వి. ఒక ఆకు కూర. గురుగుకూర వి. ఒక రకం శాకం. గురుగువల్లిక వి. ఉత్తుండి.

గురుగు[4] రూ.చూ. గురిగి[2]. వి. అత్యల్పభాండం, ఆడపడుచులు ఆడుకొనే చిన్న పిడత.
గురుగుముంత వి. పెళ్ళి సమయంలో ఉపయోగించే చిత్ర వర్ణం కల్గిన మట్టి పాత్ర.

గురుగు[5] వి. పెద్ద రాతిబండ నుంచి కావలసిన పరిమాణంలో

పలకలను చీల్చడానికి మందుగుండు పెట్టి విభజించిన పెద్ద సైజు చెక్కని రాయి.

గురుగుడు వి. చిలకదుడ్డి పొద (Casearia tomentosa).

గురుగుడాలతీగె వి. సుగంధ పాలతీగ (Cryptolepia buchanani).

గురుగురువెంట్రుకలు వి.బ.వ. ఉంగరాల జుట్టు.

గురుగులరాయి రూ. గురిగుల్రాయి, గురుగుల్రాయి. వి. గురిగెల్ని నర్సడానికి వాడే పొడుగుపాటి రాయి.

గురుగుల్రాయి రూ.చూ. గురుగులరాయి. వి. గురిగెల్ని నర్సడానికి వాడే పొడుగుపాటి రాయి.

గురుచ రూ.చూ. గురుజ². వి. ఉత్తుండి.

గురుజ¹ రూ. గురిజె, గొరిసె. వి. గింజ, సుంకు, కంకిమీద ఏర్పడుతున్న నూగు.

గురుజ² రూ. గురుచ. వి. ఒక జాతి కూరాకు చెట్టు ఉత్తుండి. భార. అను. 3.189.

గురుజ³ వి. వచ్చ, ముక్క భాగం.

గురుజ⁴ వి. మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క (Clerodendran infortunatum).

గురుజా వి. వజ్రం, రవ్వ, మగరాయి. ఆం.భా. 2.278.

గురుజు రూ. గుజ్జు³, గుర్జు. వి. 1. తిరగలికి కొట్టే గుజ్జువంటి కొయ్య; 2. స్తంభం; 3. కొమ్మర్లలో ఒకటి, నరం.

గురుజుపీట రూ. గుజ్జుపీట. వి. గుజ్జులమీద బిగించిన పీట. గురుజులకర్ర రూ. గుజ్జలకర్ర. వి. గుజ్జలమీద బిగించే అడ్డ కర్ర. గురుజువద్రం వి. పెంకుటింటికి దూలం, దాని మీద గుజ్జులు వాటిమీద వాసాలు పరచి చట్రం కట్టే పని.

గురుజులు వి.బ.వ. ఒక రకం బాజా సంచు.

గురుటితీగ వి. పాలు కలిగిన ఒక నన్నని తీగ (Daemia extensa).

గురుతు రూ.చూ. గుఱుతు. వి. చిహ్నం.

గురుదా¹ వి. జెట్టి, యోధుడు.

హిం.ఉ. గుర్‌దా. సాహసం.

<ఉ. గుర్‌దా (అర్థవిపరి.).

గురుదా² వి. కత్తి, ఖడ్గభేదం.

హిం.ఉ. గుర్దా. తుపాకి.

<ఉ. గుర్దా.

గురునాథపొంగలి వి. కొత్త పెళ్ళికొడుకు పెళ్ళికూతురు ఇంటిలో ప్రవేశించేటప్పుడు చేసే పూజాక్రమం.

గురుపుచెట్టు వి. తెల్లని పూలుపూసే ఒక తీగ, దీని కొమ్మలు కాగడాలకు ఉపయోగిస్తారు (Ixoraparuviflora).

గురుపెట్టు రూ.చూ. గుఱుపెట్టు. అ.క్రి. గురకపెట్టు.

గురుమాలచెక్క వి. చెక్కతాపి, కొయ్యతో చేసిన తాపి.

గురుమాపి వి. ఎరుపు ఊదా కలిసిన రంగు, మెజెంటా.

గురుమూర్తం వి. ముఖ్యమైన ముహూర్తం.

నం. గురు-. గొప్ప, ఘనమైన; ముహూర్త-. శుభ కాలం.

<నం. గురుముహూర్త-.

గురుమెకము వి. చమరీమృగంవంటి జంతువు, వృ. పెద్ద జంతువు.

<నం. గురు- + మెకము (వైరిసమానం).

గురులువాఱు(-పాఱు) అ.క్రి. గిరగిర తిరుగు, పెంపుమీరు.

గురువింద రూ.చూ. గురిగింజ. వి. గురివిపూస. నం. 4.97.

గురువు¹ రూ.చూ. గురుగు². వి. జనపమొక్కలాటి మొక్క (Chrozophora roteriklotzschor).

గురువు² వి. 1. పరుగు, ధావనం, 2. వేగపు పరుగు. విశే. బరువైన.

నం. గురు-. అధికమైన, భారమైన.

క. గురు. బరువైన;

<నం. గురు- (అర్థవిపరి.).

గురువుదేఱు(-తేఱు) అ.క్రి. పరుగిడు, రక్తం మొదలైనవి జర్రున పైకి ఉబుకు. భాస్క.రా.యు. 2145. గురువులు దాటు న.క్రి. మించు. అతిక్రమించు. గురువులువాఱు అ.క్రి. 1. హర్షంతో ఉప్పొంగు. ఉబుకు. కు.నం. 10.81; 2. విజృంభించు. అతిశయించు. భార. ద్రోణ. 1.135; 3. పరిగెత్తు. మార్క. 5.7. గురువువాఱు అ.క్రి. 1. పరిగెత్తు. ద్వి. హరిశ్చ. 1643 పం; 2. అతిశయించు, విజృంభించు; 3. ఉబుకు, హర్షంతో ఉప్పొంగు.

గురువెంద రూ.చూ. గురిగింజ. వి. గురివెంద.

గురుసింగుగడ్డి వి. పశువులు తినే ఒకరకం గడ్డి (Hackelochola granularis).

గురుసు వి. 1. మర్మం, ఆయువుపట్టు. భార. ద్రోణ. 5.185; 2. పాదు, మూలం. భాస్క.రా.యు. 674; 3. మేర; 4. పశురోగ విశేషం; 5. తోకచివర పొడుగు వెంట్రుకలుండేది.

గురుసులు వి.బ.వ. కేశమూలాలు. గురుసుపడు (-పడు) అ.క్రి. కలగబారు.

గుర్గడ్డ రూ.చూ. గురిగడ్డ. వి. సారె సులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి పరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గుర్గురించు అ.క్రి. గుర్గురుమని ధ్వనిచేయు.

గుర్గురించుమెకము వి. అడవిపంది. గుర్గురింత వి. అడవి పంది. సాంబ. 4.75.

గుర్గురింత చూ. గుర్గురించు.

గుర్జికుక్క రూ. గుజ్జెకుక్క, గుజ్జెరికుక్క. వి. కుచ్చికుక్క.

గుర్జు రూ.చూ. గురుజు. వి. 1. దర్వాజా చట్రాలు బిగించే కొయ్యమేకు; 2. బండిమీద జల్ల కదలకుండా చట్రంలో గుచ్చిన కొయ్యముక్క; 3. నిలువు నవారు మగ్గం కట్టుబడిలో అడ్డపీటకు బిగించిన నిలువుకొయ్య; 4. తిరగలికి కొట్టే కొయ్యముక్క; 5. కొమరల్లో ఒకటి, గురం.

గుర్తగు చూ. గుర్తు.

గుర్తించు చూ. గుర్తు.

గుర్తు రూ.చూ. గుఱుతు. వి. 1. పరిమితి; 2. ఆస్పదం, స్థానం; 3. ఆనవాలు, చిహ్నం; 4. ప్రసిద్ధి, కీర్తి; 5. సాక్షి; 6. విధం; 7. లక్ష్యం; 8. మచ్చ; 9. చుక్క.

గుర్తగు అ.క్రి. చిహ్నమగు, గురుతువచ్చు. గుర్తించు రూ.చూ. గుఱుతించు. స.క్రి. గురుతుపట్టు. గుర్తుదారం వి. అంట్లతాడు, అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి

కొలిచే దారం. గుర్తుపెట్టు[1] రూ.చూ. గుఱుతుపెట్టు. స.క్రి. చిహ్నితంచేయు. గుర్తుపెట్టు[2] వి. లచ్చన, అచ్చుతికిన పడుగుమీద కొలతనుబట్టి వేసినగుర్తు. గుర్తులలాకి వి. లచ్చనలాక, అచ్చుతికిన పడుగుమీద గుర్తులు పెట్టటానికి కొలత చూసుకొనే బద్ద. గుర్తువేయు స.క్రి. అచ్చుతికిన పడుగుమీద, కొలతనుబట్టి గుర్తువేయు. గుర్తెరుగు రూ.చూ. గుఱుతెఱుఁగు. స.క్రి. ఆనవాలుపట్టు.

గుర్తెరుగు చూ. గుర్తు.

గుర్ద వి. లక్కాకు, చక్రంకుంద అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలిపైపునా, లోపైపునా వేసిన ఇనపకట్టు.

గుర్పెట్టు రూ.చూ. గుఱుపెట్టు. అ.క్రి. గురకపెట్టు. భాగ. 10. పూ. 218. వి. గురక.

గుర్ర వి. ఒకటో శాఖ.

గుర్రం చూ. గుఱ్ఱము. రూ. గురం. వి. 1. దంతె చెవి, దంతెను మోసే పంగలకొయ్యపై భాగం ; 2. మరమగ్గం బొమ్మకు నిలువుపట్టె ఏటవాలుగా బిగించిన కర్ర ; 3. మరమగ్గం పొడుగు చివర, నాడె బయటకి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క ; 4. ఉడతబొమ్మ ; 5. దాలికోలను తీసే కర్ర ; 6. నారపట్టా నేసేటప్పుడు, అచ్చును నడిపించటానికి వాడే కొయ్య పనిముట్టు ; 7. దర్వాజామీద చెక్కదనానికి బిగించిన బొమ్మ ; 8. గుర్రంబొమ్మ ; 9. రెండు పొట్టి నిచ్చెనల్ని పైన కలుపుతూ అడ్డపలకవేసి బిగించిన ఎత్తైనబల్ల ; 10. గుర్రప్పీట, పోలుగర్రకు కాడికట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క ; 11. ఆవ. తలుపులు గాలికి పడకుండా దర్వాజాలపై వేసిన కొయ్యముక్క ; 12. సన్‌షేడ్ దించడానికి దన్నుగా గోడలో పెట్టే రాయి ; 13. అశ్వం.

గుర్రంపీట వి. బండిపోలు కర్రకు కాడికట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క. గుర్రంబద్ద వి. రీపరు (పట్టె), ఇంటికప్పువేయడంలో వాడే పలచని చెక్క. గుర్రంబీగు వి. దర్వాజామీది జంటవానం. గుర్రంబొమ్మ వి. మరమగ్గం పొడుగుకు మొదట బిగించిన చెక్క. గుర్రంమాన్యం వి. గుర్రాన్నిబాగా ఆడించినందుకు గుర్రంవాడికిచ్చే మాన్యం.

గుర్రపుకొంకి చూ. గుర్రము.

గుర్రపుకొయ్య చూ. గుర్రము.

గుర్రపుగిటికె చూ. గుర్రము.

గుర్రపుగిట్ట చూ. గుర్రము.

గుర్రపుగిట్టె చూ. గుర్రము·

గుర్రపుగెట్టె చూ. గుర్రము.

గుర్రపుగొట్టె చూ. గుర్రము.

గుర్రపుచెక్క చూ. గుర్రము.

గుర్రపుతాడు చూ. గుర్రము.

గుర్రపువాచు చూ. గుర్రము.

గుర్రపువాను చూ. గుర్రము.

గుర్రపుపీట చూ. గుర్రము.

గుర్రపుమాతిపురుగు చూ. గుర్రము.

గుర్రపురాయి చూ. గుర్రము.

గుర్రపులద్ది చూ. గుర్రము.

గుర్రపులద్దె చూ. గుర్రము.

గుర్రపునవారి చూ. గుర్రము.

గుర్రప్పీట చూ. గుర్రము.

గుర్రప్రాయి చూ. గుర్రము.

గుర్రబ్బండి చూ. గుర్రము.

గుర్రబ్బండ్లబాయి చూ. గుర్రము.

గుర్రము రూ.చూ. గుఱ్ఱము. వి. హయం, అశ్వం.

గుర్రపుకొంకి వి. కాలిమడమవెనకవైపువాచికాలు బిగదీసుకుపోవటం. గుర్రపుకొయ్య వి. పసిరిగుర్రం, పంచదించడానికి వీలుగా గోడలోనాటిన చివరచెక్కిన కొయ్య. గుర్రపుగిటికె రూ.చూ. గుర్రపుగిట్ట. వి. డెక్క. గుర్రపుగిట్ట రూ. గుర్రపుగిటికె, గుర్రపుగిట్టె, గుర్రపుగెట్టె, గుర్రపుగొట్టె. వి. డెక్క. కాలికొనన జంటగామొలిచేగట్టి గోరువంటి అవయవం. గుర్రపుగిట్టె రూ.చూ. గుర్రపుగిట్ట. వి. డెక్క. గుర్రపుగెట్టె రూ.చూ. గుర్రపుగిట్ట. వి. డెక్క. గుర్రపుగొట్టె రూ.చూ గుర్రపుగిట్ట. వి. డెక్క. కాలికొనన జంటగామొలిచే గట్టి గోరువంటి అవయవం. గుర్రపుచెక్క వి. మగ్గంపొడుగు చివర, నాడె బయటకుపోకుండా ఆపడానికి బిగించినకొయ్య చెక్క. గుర్రపుతాడు వి. కొండితాడు, అచ్చుకట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీద మెలికల్లో దూర్చిన పురిబారం. గుర్రపువాచు రూ. గుర్రపువాను. వి. కాడలు లేకుండా పొడుగాటి ఆకులుండి నిలకడ నీటిలోపెరిగే నీటి కలువ మొక్క (Blyxauctandral Vallisneria Octandra). గుర్రపువాను రూ.చూ. గుర్రపువాచు. వి. కాడలులేకుండా పొడుగాటి ఆకులుండి నిలకడనీటిలో పెరిగే నీటికలువమొక్క. గుర్రపుపీట రూ. గుర్రప్పీట. వి. గుర్రాల బొమ్మలున్న చెక్క. గుర్రపుమాతిపురుగు వి. నజ్జతెగులు, మిన్నుమీదినుంతుతినిపొయ్యే కుమ్మరిపురుగు. గుర్రపురాయి రూ. గుర్రప్రాయి. వి. 1. బంకిరాయి, పంచలుదించడానికి వీలుగా అడ్డవాసాలు వేయడానికి అనువుగా ఇంటిగోడల్లో ముందుపొడుచుకొని వచ్చేటట్లుగా బిగించిన రాయి ; 2. కపిలబావి గుంజకింద నిలబడ్డరాయి. గుర్రపులద్ది రూ.చూ. గుర్రపులద్దె. వి. గుర్రప్పెంట. గుర్రపులద్దె రూ. గుర్రపులద్ది. వి. గుర్రప్పెంట, గుర్రపుపేడ. గుర్రపునవారి వి. ఒకరకంఅద్దకం డిజైను. గుర్రప్పీట రూ.చూ. గుర్రపుపీట. వి. కోడిపీట, ఒకరకంరెండునాగల బండికి, డొంకిమొద్దుకింద వేసినపట్టె. గుర్రప్రాయి రూ.చూ. గుర్రపురాయి. వి. 1. బంకిరాయి ; 2. కపిలబావిగుంజకింద నిలబడ్డరాయి. గుర్రబ్బండి వి. పెదకోలచక్రం, పెదకోలను మోసేకొయ్యచక్రం. గుర్రబ్బండ్లబాయి వి. గుద్దిబాయి, గుర్రపుమెడలాగా కొక్కేలుగా ఉన్నరాళ్ళను అమర్చి వాటిమీద చుట్టూకట్టవేసి కట్టినబావి.

గుర్లవారు వి. కుమ్మరగురువు, గురువులవారు గుర్లవారుగామారి ఉండవచ్చు.

గుర్వడఁగించు చూ. గుర్వు.

గుర్వడఁగు చూ. గుర్వు.

గుర్వఙగించు చూ. గుర్వు.

**గుర్వణఁగు** చూ. గుర్వు.

**గుర్వు** విశే. 1. అధికమైన. నిర్వ.రా. 3.25 ; 2. పూర్ణమైన. నిండైన. బసవ. 4.2 పం ; వి. ఆధిక్యం. అతిశయం.

గుర్వడఁగించు రూ.చూ. గుర్వణఁగించు. స.క్రి. చెరచు, చంపు. గుర్వడఁగు రూ. గుర్వణఁగు. అ.క్రి. పెంపడగు, చెడు. గుర్వణఁగించు రూ. గుర్వడఁగించు. స.క్రి. చెరచు, చంపు. బసవ. 4.431 పం. గుర్వణఁగు యా.చూ. గుర్వడఁగు. అ.క్రి. నశించు.

**గుర్వెట్టు** రూ.చూ. గుఱువెట్టు. అ.క్రి. గురకపెట్టు, గుర్రుపెట్టు.

**గుర్వెంద** రూ.చూ. గురిగింజ. వి. గుంజాలత, గురిజ.

**గుఱక** రూ. గురక[1], గుఱుక. వి. 1. నిద్రలోచేసేధ్వని, గుర్రు, శుక. 2.107 ; 2. వ్యాఘ్రాదులు కోపభయాదులు చేసేధ్వని. శుక. 2.252.

క. *గుఱు, గుఱుగుఱు.* గురకఅనుకరణధ్వని ; *గుఱుగుట్టు, గుఱకె, గుఱుకు, గుఱగుఱ.* పందికొక్కు కోపంతోచేసేధ్వని ; *గుఱ్ఱు.* అనుకరణధ్వని. *గుఱ్ఱుగుట్టు.* గుర్రు, *గుఱ్ఱుగుఱ్ఱు* ; తు. *గురనె.* కుక్కమొరిగేధ్వని ; *గురగుట్టుని, గుర్కుట్టని.* గుర్రుగుర్రుమనటం ; *గురుకుగుట్టుని, గురుగుట్టు, గురుగురు.* గుర్రుగుర్రుమనటం. *గుర్కాయిసుని, గుక్కాయ్‌సుని.* గుర్రుగుర్రుమనటం. *గుర్కు, గుర్కుగుర్కు.* త. కుఱుకుఱుప్పు, కుఱుకుఱుప్పై. గురక ; కుఱట్టై, కుఱుక్కై. గురకపెట్టటం ; మ. కుఱుకుఱుక్క. కష్టంగాశ్వాసించు ; కుఱుకుక్క, కుఱుణ్ణుక. కూయు ; గోం. కుహస్పానా. మొరుగు ; పర్జి. *గుర్ర్.* కూయు. కూర్. కూయు ; కొలా. *గుర్గడిల్.* గుర్రుగుర్రుమను ; కురు. *గుర్రానా.* అరచు, బొబ్బరించు ; బ్రా. *ఘుర్రింగ్.* గుర్రుమనటం.

గుఱకగొను (-కొను) అ.క్రి. 1. నిద్రించు ; 2. గుర్రుపెట్టు. గుఱకపెట్టు రూ. గురకపెట్టు. అ.క్రి. గురకలిడు. ఉ.హరిశ్చ. 4.15. గుఱకపోతు వి. నిద్రపోతు. గుఱకయిడు (-ఇడు) అ.క్రి. నిద్రలో గుర్రుమనిధ్వనిచేయు. గుఱకలిడు అ.క్రి. గురకపెట్టు. మను. 2.7. <గుఱక+-లు+ఇడు. గుఱకలుపెట్టు అ.క్రి. గురకపెట్టు. ఉ.రా. 2.295.

**గుఱగుఱ** రూ. గురగుర[2], గులగుల[3] విశే. దురదకల. వరాహ. 10.53 ; వి. ఒకవిధమయిన దురద.

త. కుఱుకుఱుత్తల్.

గుఱగుఱలాడు అ.క్రి. దురదపెట్టు<గుఱగుఱ+-లు+ఆడు.

**గుఱపోతు** రూ.చూ. గురుపోతు. వి. పురుషగవయం.

**గుఱము** రూ.చూ. గుఱ్ఱము. వి. గుర్రం, అశ్వం. పాండు. 2.38, యయా. 4.155.

గుఱాలగోచ వి. అశ్వపాలకుడు. ఆం.భా. 2.204.

**గుఱాము** వి. తూనికలో ఒకపరిమాణం.

**గుఱాలగోచ** చూ. గుఱము.

**గుఱి** రూ. గురి[2]. వి. 1. నిర్ణయం, ఏర్పాటు. నెల్లూరిశాసనం. 48. క్రి.శ. 1145. నం ; 2. దృష్టాంతం, నిదర్శనం. భార. ఉద్యో. 3.305 ; 3. లక్ష్యం, భార. ద్రోణ. 3.262 ; 4. సాక్షి. భాస్క.రా. యు. 2.366 ; 5. పరిమితి, హద్దు. మర్యాద. ద్వి.హరిశ్చ. ఉ. 1479 పం ; 6. గుర్తు, చిహ్నం. ఆము. 5,31 ; 7. గిరి, వలయాకార రేఖ. ఘటికా. 2.41. 8. విశ్వాసం, నమ్మిక. సీలా. 1.3 ; 9. మచ్చ, కళంకం; ఆం.భా. 1.80 ; 10. యుక్తి. ఉపాయం. చెన్నబసవ. 2.230.

క. *గుఱి, గురు* ; కుఱి. లక్ష్యపెట్టు ; తు. గురి. లక్ష్యం, గుర్తు ; *గురితూపుని.* లక్ష్యపెట్టు ; త. కుఱి, ఉద్దేశించు ; కుఱిప్పు. ఉద్దేశం ; మ. కుఱిక్క. గుర్తించు ; కుఱి. గుర్తు.

గుఱికట్టు వి. 1. కట్టుపాటు, ఏర్పాటు. దశా. 7.138. 2. అంచు ; 3. మితి. గుఱికాఁడు వి. రేడు, పతి. హర. 6.79 ; విశే. లక్ష్యంతప్పకుండాకొట్టేవాడు, కృతహస్తుడు ; గుఱికుదురు అ.క్రి. నమ్మకంఏర్పడు. గుఱికొండి వి. 1. గుర్తుకోసం కొండివలె కట్టినతాడు. అష్టమ.క. 1.35. పు. 17పం. 2. సాటి, పోలిక. కాళిందీ. 6.53 ; 3. ఆయం, జీవస్థానం. గుఱికొను స.క్రి. లక్ష్యంగా చేయు. రసిక. 4.95. గుఱిచెదరు అ.క్రి. నమ్మకం తగ్గు. గుఱిచేయు రూ.చూ. గుఱిసేయు. స.క్రి. 1. లక్ష్యంచేయు. కవిరా. 4.95 ; 2. దృష్టాంతంగా చేయు ; 3, లక్ష్యపెట్టు. గుఱించు రూ. గుఱియించు. స.క్రి. 1. లక్ష్యంగా ఉంచుకొను. శృం. నై. 8.202 ; 2. మితిఇడు. శుక. చ. 3,15 ; అ.క్రి. తలపెట్టు. రాజవా. 3,174. గుఱిపడు అ.క్రి. పేరుపడు, ప్రసిద్ధికెక్కు. రఘునా. 18పు. 13పం. గుఱిపఱుచు స.క్రి. 1. నిర్ణయించుకొను. రామాభ్యు. 7.288 ; 2. ఏర్పరుచుకొను గుఱియగు (-అగు) అ.క్రి. నమర్థుడగు. కుచే. 1.51. గుఱియించు రూ. చూ. గుఱించు. స. క్రి. 1. లక్ష్యంగా ఉంచుకొను ; 2. మితిఇడు ; 3. సంకల్పించు, తలపెట్టు. గుఱివేయు స.క్రి. 1. వశపరచుకొను. మల్హ. 2.22 ; 2. గురిచూచి కొట్టు ; 3. వాతపెట్టు. గుఱివ్రాయు స.క్రి. గిరిగీయు. గుఱిసేయు (-చేయు) రూ. గుఱిచేయు. స.క్రి. 1. లక్ష్యం చేయు. శృం. నై. 5.146 ; 2. దృష్టాంతంగా చేయు. భాగ. 7.379 ; 3. లక్ష్యపెట్టు. కళా. 3.213.

**-గుఱిచి** రూ.చూ. -గుఱించి. ప్రత్య. కూర్చి. హరి. పూ. 2.97.

**-గుఱించి** రూ. -గుఱిచి. చూ.- కూర్చి. ప్రత్య. కూర్చి. భార. శల్య. 2.73.

**గుఱు** రూ.చూ. గుఱ్ఱు. వి. నిద్రపోయేటప్పుడు చేసేధ్వని.

గుఱుపెట్టు రూ.చూ. గుఱువెట్టు. అ.క్రి. గురకపెట్టు. హరిశ్చ. 5.55. వి. గురక. ఆం. భా. 1.142. గుఱుపొడుచు అ.క్రి. గురకపెట్టు. భాస్క. రా. యు. 2.76. గుఱువెట్టు (-పెట్టు) రూ. గురుపెట్టు, గుర్పెట్టు, గుర్వెట్టు, గుఱుపెట్టు, గుఱ్ఱుపెట్టు, గుఱ్ఱువెట్టు, గుఱ్ఱెట్టు. అ.క్రి. గురకపెట్టు. భాగ. 8.713. వి. గురక.

**గుఱుక** రూ.చూ. గుఱక. వి. నిద్రపోయేటప్పుడు కొందరు చేసే ధ్వని విశేషం.

**గుఱుకు** రూ. గురక[3], గురుక, గురుకు[3]. వి. పశురోగ విశేషం. ఆం. భా. 2.125.

**గుఱుకొను** రూ. గురుకొను. అ.క్రి. 1. యత్నించు, పూను.

భార. ఆది. 5.178 ; **2.** అతిశయించు. భార. ఆది. 8.270.

**గుఱుగుఱ్ఱు** వి. పాము ఒరలటంలో అయ్యేధ్వనికి అనుకరణం. శృం. నై. 8.125. ధ్వన్యను.

క. గుఱ్ఱు. అనుకరణధ్వని ; త. కుఱుకుఱుత్తల్.

**గుఱుతగు** చూ. గుఱుతు.

**గుఱుతించు** చూ. గుఱుతు.

**గుఱుతిడు** చూ. గుఱుతు.

**గుఱుతు** యా. గురుతు, గుర్తు. వి. **1.** పరిమితి. నృసింహ. 5.142 ; **2.** స్థానం. మార్క. 4.84 ; **3.** ఆనవాలు, చిహ్నం. భీమ. 3.9 ; **4.** ప్రసిద్ధి, కీర్తి. పాండు. 1.80 ; **5.** విధం. ప్రబంధ. 7.880 ; **6.** లక్ష్యం. వైజ. 2.86 ; **7.** సాక్షి. సారంగ. చ. 2.61 ; **8.** మచ్చ. ఆం. భా. 1.80, విశే. **1.** నిజమైన ; **2.** తెల్లమైన ; **3.** ఘనమైన.

క. గుఱుతు. చిహ్నం.

**గుఱుతగు** అ.క్రి. ఘనమగు. రం. రా. అయో. 135 పు. 26పం. **గుఱుతించు** రూ. గుర్తించు. స.క్రి. **1.** ఆలోచించు. హర. 1.20 ; **2.** ఆనవాలుపట్టు. **గుఱుతిడు** స.క్రి. అపేక్షించు, కోరు. బసవ. 5.199 పం. **గుఱుతుగ** రూ. గుఱుతుగా. క్రి. విశే.ద్రు. **1.** స్పష్టంగా. ద్వి. పరమ. 3.237 పు ; **2.** నిజంగా. సారంగ. చ. 2.14 ; **3.** శ్రద్ధతో, బాగుగా. కుచే. 1.122. **గుఱుతుగా** రూ.చూ. గుఱుతుగ. క్రి. విశే.ద్రు. **1.** శ్రద్ధతో, బాగుగా ; **2.** నిజంగా ; **3.** స్పష్టంగా. **గుఱుతుపట్టు** స.క్రి. గుర్తించు. **గుఱుతువడు** అ.క్రి. తెలియు, విదితమగు. వేమన. 1.153. **గుఱుతుపెట్టు** రూ.చూ. గుఱుతుపెట్టు స.క్రి. చిహ్నితం చేయు. **గుఱుతుపొడుచు** స.క్రి. చిహ్నితంచేయు. **గుఱుతుమాట** వి. ప్రసిద్ధిగలమాట, లోకోక్తి. కుచేల. 1.46. **గుఱుతుమీఱు** అ.క్రి. తెలియకపోవు. **గుఱుతువెట్టు** (-పెట్టు) రూ. గుర్తుపెట్టు[1]. గుఱుతుపెట్టు. స.క్రి. చిహ్నితం చేయు. **గుఱుతెఱుఁగు** రూ. గుర్తెరుగు. స.క్రి. ఆనవాలుపెట్టు, తెలిసికొను. కళా. 3.267. < గుఱుతు + ఎఱుఁగు.

**గుఱుతెఱుఁగు** చూ. గుఱుతు.

**గుఱుమ** రూ.చూ. గుఱుము. వి. గింజ, విత్తు.

**గుఱుము** రూ. గుఱుమ. వి. **1.** బీజం. భార. శాంతి. 5.241 ; **2.** గింజ. భార. అను. 5.28.

**గుఱ్ఱపుగచ్చ[1]** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుగచ్చ[2]** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుగడ్డి** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁగట్టాకు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁగొంకి** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుచబుకు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుచెక్కతుంగ** చూ. గుఱ్ఱము.

**గుర్రపుజల్లి** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁజదువు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁజుక్క** (-చుక్క) చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁజొంగ** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుడెక్క** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుతీగ** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁదోఁకలు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుబాదము** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుమారిజిట్ట** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుమూతిచేప** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుమూతిపురుగు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుమూతివాఁడు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుమోమువేల్పు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁబిల్ల** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁబీఁట** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుఁబెరజు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపువాఁడు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపువానము** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపుసారము** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱపెక్కుడు** చూ. గుఱ్ఱము.

**గుఱ్ఱము** రూ. గుర్రము, గుఱము. వి. **1.** అశ్వం. భార. విరా. 1.95 ; **2.** కోడిపిట, కొయ్యపిట.

క. కుదిరె, కుదురె, కుదరె. గుర్రం ; కొడ. కుదిరె. గుర్రం ; తు. కుదురె. గుర్రం ; త. కుతిరై. గుర్రం ; మ. కుతిర. గుర్రం, గుర్రపు దండు ; కొంద. కుదిర్. గుర్రం ; దవి. గూరుమి. గుర్రం ; గుర్రొమి. గుర్రం ; పర్జి. గుర్రొల్. గుర్రం ; నా. ఘుర్రెమ్. గుర్రం.

**గుఱ్ఱపుగచ్చ[1]** వి. ఒక రకం తీగ, ఒకే గింజ కలిగిన కాయ కాస్తుంది (Mucuna monosperma). **గుఱ్ఱపుగచ్చ[2]** వి. పచ్చని పూలు, ఎర్రని పళ్ళు కాసే ఒక తీగ (Pterolobium indicum). **గుఱ్ఱపుగడ్డి** వి. మందుల్లో ఉపయోగపడే ఒక మొక్క, గురుజ మొక్క (Clerodendron infortunatum). **గుఱ్ఱపుఁగట్టాకు** వి. వాకుడు. **గుఱ్ఱపుఁగొంకి** (-కొంకి) వి. పశువులకు కాలు బిగదీసుకుపోయే జబ్బు. **గుఱ్ఱపుచబుకు** వి. కొరడా < గుఱ్ఱము + ఉ. చాబుక్. **గుఱ్ఱపుచెక్కతుంగ** వి. వృక్షవిశేషం. **గుఱ్ఱపుజల్లి** వి. పెల్లగుముదు చెట్టు, పలచని ఆకులు కలిగి, పుల్లని పళ్ళు కాసే ఒక చెట్టు (Antidesma diandrum). **గుఱ్ఱపుఁజదువు** (-చదువు) వి. నెమరుకు రాని చదువు. **గుఱ్ఱపుఁజుక్క** (-చుక్క) వి. అశ్వినీ నక్షత్రం. **గుఱ్ఱపుఁజొంగ** (-చొంగ) వి. హాలాహలం. **గుఱ్ఱపుడెక్క** వి. పుటం. **గుఱ్ఱపుతీగ** వి. గంజాం, పడమటి కనుమల్లో పెరిగే ఒక తీగ (Elematis Smilacifolia). **గుఱ్ఱపుఁదోఁకలు** (-తోఁకలు) వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **గుఱ్ఱపుబాదము** వి. పెద్ద బాదం చెట్టు, పూలు దుర్వాసన కలిగి ఉండే ఒక బాదం చెట్టు (Sterculia foetida). **గుఱ్ఱపుమారిజిట్ట** వి. వృక్షవిశేషం (Anthus rubulus). **గుఱ్ఱపుమూతిచేప** వి. ఒక రకం చేప. **గుఱ్ఱపుమూతిపురుగు** వి. తుమ్మెర పురుగు. **గుఱ్ఱపుమూతివాఁడు** వి. కింపురుషుడు. **గుఱ్ఱపుమోమువేల్పు** వి. కింపురుషుడు. **గుఱ్ఱపుఁబిల్ల** వి. అశ్వపోతం. **గుఱ్ఱపుఁబీఁట** వి. ద్వారబంధం మీద ఉంచే గుర్రపు మూతి కొయ్య. **గుఱ్ఱపుఁబెరజు** వి. ఒక జాతి సర్పం. సిం.ద్వా. 8.98.

గుఱ్ఱపువా(డు వి. అశ్వపాలకుడు. గుఱ్ఱపువానము వి. ఇంటి కప్పులోని ఆధారం. గుఱ్ఱపుసారము వి. సప్త స్వరాల్లో ఒకటి, దైవతం. గుఱ్ఱపెక్కు డు వి. బాల క్రీడా విశేషం. గుఱ్ఱమెక్కు అ.క్రి. 1. గుర్రంమీద ఎక్కు ; 2. గర్వించు ; 3. తాగి నిషాలో ఉండు. గుఱ్ఱమెక్కుడు వి. బాల క్రీడా విశేషం. హంస. 3.146.

గుఱ్ఱమెక్కు చూ. గుఱ్ఱము.

గుఱ్ఱమెక్కుడు చూ. గుఱ్ఱము.

గుఱ్ఱు రూ. గుఱు. వి. 1. కోపించటంలో అనుకరణం. వాసిష్ఠ. 1.7 ; 2. నిద్రా ధ్వని, గురక ; 3. పగ, కంటు. ధ్వన్యను.

క. గుఱ్ఱు. గురక, నిద్రా ధ్వని.

గుఱ్ఱుకలుగు అ.క్రి. గుర్రుపెట్టు. గుఱ్ఱుగామాట్లాడు స.క్రి. ఈర్ష్యగా మాట్లాడు. గుఱ్ఱుగుఱ్ఱు వి. 1. దగ్గేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. విప్ర. 4.19 ; 2. మూలగటంలోని ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 788. గుఱ్ఱుపెట్టు రూ.చూ. గుఱుపెట్టు. అ.క్రి. గుర్రుపెట్టు. గుఱ్ఱుమను అ.క్రి. మూలుగు. గుఱ్ఱువెట్టు(-పెట్టు) రూ.చూ. గుఱుపెట్టు. అ.క్రి. గుర్రు పెట్టు ; వి. గురక. గుఱ్ఱెట్టు రూ.చూ. గుఱుపెట్టు. అ.క్రి. మూలుగు వంటి ధ్వనిచేయు. < గుఱ్ఱు + పెట్టు. గుఱ్ఱెత్తు చూ. గుఱుపెట్టు. అ.క్రి. 1. గుర్రుపెట్టు ; 2. చిరచిర లాడు, కోపం కలుగు.

గుఱ్ఱెట్టు చూ. గుఱ్ఱు.

గుఱ్ఱెత్తు చూ. గుఱ్ఱు.

గుల వి. దురద, గులగుల, తీట.

గులక[1] వి. మొరం, ఒక విధమయిన రాయి.

గులకనేల రూ. గులురునేల. వి. మొరుం, నన్నరాయి ఎక్కువగా కల్సిన నేల. గులకరాయి రూ. గులకఱాయి, గులుకురాయి, గుల్కరాయి, గొలుకురాయి, గొల్కురాయి, వి. 1. అచ్చుగుల్ల ; 2. కంకరరాయి. గులకరాయిమొరన వి. గులకరాయి ఎక్కువగా ఉన్న మొరననేల. గులకరేవడి వి. గులకరాళ్లు కలసిన రేగడి. గులకఱాయి రూ.చూ. గులక రాయి. వి. మొరం, చిన్న రాళ్లు.

గులక[2] రూ. గొలుకు. వి. గుల్లదంటు, పశువులు తినగా మిగిలిన చొప్ప.

గులక[3] రూ. గునక[2]. వి. గవ్వ, బుడ్డి, పత్తి తియ్యగా మిగిలిన వట్టి కాయ లేదా గుల్ల.

గులకందు రూ.చూ. గుల్కందు. వి. గులాబీ పూల లేహ్యం.

గులకరము వి. మొలక, మొక్క, మోక.

గులకరములుగొను (-కొను) అ.క్రి. మొలకెత్తు. భాగ. 8.396 ; గులకరించు[3] అ.క్రి. 1. నిర్ణయించు, వెలువడు. క్రీడా. 95 ; 2. వ్యాపించు. చంద్రాంగ. 3.92 ; 3. అంకురించు. సురా. 96 ; స.క్రి. వెలార్చు, బయల్పరుచు. వసు. 4.23.

గులకరించు[1] అ.క్రి. ధ్వనిచేయు, శబ్దించు. వరాహ. 3.126.

గులకరించు[2] స.క్రి. కుళ్ళగించు, పాదనాలతో నేల తిరగవేయు.

గులకరించు[3] చూ. గులకరము.

గులకరింత వి. క్షుద్ర జల జంతు విశేషం. హంస. 4.186.

గులగుల[1] వి. 1. పక్షుల కూతకు అనుకరణం. శృం. నై. 1.108. ధ్వన్యను ; 2. ఎలుగుబంటి పుట్ట కోరాడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. మను. 4.37.

గులగుల[2] వి. చూర్ణం. అచ్చ.రా. సుందర. 22 ; వి.బ.వ. ముక్కలు ముక్కలు.

గులగులయగు (-అగు) అ.క్రి. 1. శిథిలమగు, నలిగిన దగు. పాండు. 4.297 ; 2. లోతుగా అగు ; 3. బూటక మగు.

గులగుల[3] రూ.చూ. గుఱగుఱ. విశ. దురదకల. వి. దురద.

గులగులలాడు అ.క్రి. పురుగులు గుప్పలుగా ఏర్పడి పాకు. గులగులలు వి.బ.వ. ముక్క ముక్కలు. భాస్క.రా.యు. 1966.

గులప చూ. గులాము. వి. అశ్వపాలకుడు. ఆం. భా. 2.204.

గులాంకాయలు చూ. గులాము. వి.బ.వ. నాగజెముడు పళ్ళు.

గులావువా(డు చూ. గులాము.

గులాబి[1] వి. 1. ఎరుపు నీలం కలసిన రంగు ; 2. రోజా పుష్పం (Rosa centifolia).

హిం. ఉ. గులాబ్. గులాబి పువ్వు.

క. గులాబ ; మ. గులాబ.

< ఉ. గులాబ్.

గులాబిజామ రూ. గులాబిజామి, గులాబ్జామ. వి. ఒక రకం ఫల వృక్షం (Eugenia javania). గులాబిజామి రూ.చూ. గులాబిజామ. వి. జంబూ ఫలం. గులాబిటమోట రూ. గులాబి టోమాట, గులాబి తమాట, గులాబి తమోట. వి. రామములగ. గులాబిటోమాట రూ.చూ. గులాబి టమోట. వి. రామములగ. గులాబితమాట రూ. చూ. గులాబి టమోట. వి. రామములగ. గులాబితమోట రూ.చూ. గులాబి టమోట. వి. రామములగ. గులాబినేరేడు వి. ఒక రకం నేరేడు. గులాబిరంగు వి. ఒక రకం లేత ఎరుపు రంగు, గులాబి రేకుల రంగు. గులాబిరంగుకాల్పు వి. కుండల ఎర్ర కాల్పులో గులాబి రంగు వచ్చిన కాల్పు. గులాబ్జామ రూ.చూ. గులాబిజామ. వి. ఒక రకం ఫల వృక్షం (Eugenia javanica).

గులాబి[2] వి. తలుపు మొదలైన వాటిని లాగి తెరవడానికి ఉపయోగపడే పరికరం.

గులాబ్జామ చూ. గులాబి[1].

గులాము రూ. గుల్లాము, గోలావు, గోలాము. విశ. హీనుడు. వేంక. పంచ. 1.763 ; వి. 1. బిచ్చం. వైజ. 2.128 ; 2. బానిస, దానుడు. అడిదము సూరకవిచాటువు ; 3. దాసి.

హిం.ఉ. గులామ్.

క. గులాము. బానిస ; తు. గులామె ;

< ఉ. గులామ్.

గులావువా(డు వి. బిచ్చగాడు. గులాముసేయు (-చేయు) స.క్రి. సేవించు. గులామెత్తు స.క్రి. బిచ్చమెత్తు, యాచించు. వైజ. 2.122. < గులాము + ఎత్తు.

గులామెత్తు చూ. గులాము.

**గులాల్** రూ.చూ. గులాలు. వి. బచ్చలిపండురంగు, బుక్కారంగు.

గులాల్‌పీతాంబరం వి. కొంగులో పువ్వుల డిజైనులో నేసిన పట్టుబట్ట.

**గులాలు** రూ. గులాల్. వి. ఎఱ్ఱని కుంకుమవంటి ద్రవ్యం.

హిం.ఉ. *గులాల్*. బుక్కా ; పార. *గుల్లాలా*.

క. *గులాలు*. హోలిసందర్భంలో చల్లుకొనే ఎఱ్ఱరంగు పొడి.

< ఉ. గులాల్.

గులాలుపొడి వి. ఎఱ్ఱపొడి, బుక్కా.

**గులి**[1] రూ.చూ. గుల్లి[3]. వి. తెల్లగాఉండేకఱ్ఱ కలిగినఒకచెట్టు (Capparis grandis).

**గులి**[2] రూ.చూ. గుల్లె. వి. నూలుతెక్క, ఎనబై పోగులునూలు.

**గులిగి** వి. ముతకనూలు, పోగుమందంగాఉండేనూలు.

**గులిబి** రూ.చూ. గుబిలి[2]. వి. గులిమి. ఆం.భా. 2.134.

**గులిబుద** వి. ఊదారంగు పూలుపూసే ఒకచిన్నచెట్టు (Sterculiapopulifolia).

**గులిమి** రూ.చూ. గుబిలి[2]. వి. కర్ణమలం, పింజూషం. ఆం.భా. 2.134.

గులిమికదురు వి. గులిమితీసుకొనే వెండి మొ. వాని పుల్ల. గులిమితెడు రూ.చూ. గులిమితెడ్డు. వి. గులిమితీసికొనే పనిముట్టు. గులిమితెడ్డు రూ. గులిమితెడు. వి. గులిమికదురు.

**గులిమిడి** వి. ఒకరకంపూలచెట్టు.

క. *గుల్మని*.

**గులిమెంది** వి. 1. పుష్పవిశేషం ; 2. మత్స్యవిశేషం.

**గులివి** రూ.చూ. గుబిలి[2]. వి. కర్ణమలం.

**గులివింత** రూ.చూ. గురిగింజ. వి. బంజరుభూముల్లో పెరిగే ఒకతీగ.

**గులివింద** రూ.చూ. గురిగింజ. వి. బంజరుభూములో పెరిగే ఒకతీగ.

**గులు** వి.బ.వ. పెద్దలు, గురువులు.

నం. *గురు-*. పెద్దదైన, ఉపాధ్యాయుడు.

<నం. గురు-+-లు.

**గులుకునేల** రూ.చూ. గులకనేల. వి. నన్నరాయిఎక్కువగా కలిసిననేల.

**గులుకురాయి** రూ.చూ. గులకరాయి. వి. 1. అబ్బుగుల్ల ; 2. కంకరరాయి.

**గులుకోలకట్టె** వి. పూనుగఱ్ఱ, పావుచెక్క తొక్కినపుడు అచ్చుకఱ్ఱను కిందికిలాగేకఱ్ఱ.

**గులుగు**[1] రూ. గుల్గు. అ.క్రి. 1. లోలోనగొణుగు ; 2. విలాసంగా వర్తించు ; వి. కులుకుదనం.

గులుగులుసేయు (-చేయు) స.క్రి. గిలిగింతపెట్టు.

**గులుగు**[2] రూ.చూ. గొలుగు[1]. వి. తుప్పగా పెరిగే ఒకరకం కలుపుమొక్క (Careya arborea).

**గులుగు**[3] వి. జనపనారమొక్క, నారకోసంసాగు చేయబడేఒక పంట (Hibiscus Cannatbinus).

**గులెదావుది** వి. సీతమాధవి అనేపూవు.

**గుల్కంద** రూ. గులకందు. వి. గులాబీపూలలేహ్యం.

**గుల్కరాయి** రూ.చూ. గులకరాయి. వి. 1. అబ్బుగుల్ల ; 2. కంకరరాయి.

**గుల్గు** రూ.చూ. గులుగు[1]. అ.క్రి. గొణుగు, నణగు.

**గుల్బంది** వి. చిన్నఉన్నిగుడ్డ, రుమాలు.

**గుల్మి** రూ.చూ. గుబిలి[2]. వి. 1. గుబ్బిలికాడు ; 2. గులిమి.

**గుల్ల** రూ. గుల్లు. వి. 1. చింతపండు మొ. వాటిమీద కోశం వలెఉండే పదార్థవిశేషం. భాస్క.రా. యు. 680 ; 2. జలజంతువిశేషం, క్షుద్రశంఖం. ఆము. 2.53 ; 3. పొక్కు, బొబ్బ ; 4. కప్పచిప్ప, శంబూక ; 5. లోతైనగంప, తట్ట ; 6. పొల్లు ; 7. ఆముకాల్పులోవాడేచిన్న కఱ్ఱముక్కలు ; 8. ఇనపగంప, ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర ; 9. పొలాలకు నీళ్లతోడటానికి ఉపయోగించే సాధనవిశేషం ; 10. తివాసీ నేసేటప్పుడు వడిదారాల్లో దూర్చిన కఱ్ఱ, అచ్చుకఱ్ఱ. విణ. 1. అల్పమైన. శేష. 1.139 ; 2. డొలుగావున్న, గట్టిదికాని.

నం. *క్షుల్ల-*, *క్షుల్లక-*. నీచమైన, తక్కువైన. ప్రా. *ఖుల్ల-*, *ఖుల్లగ-*. చిన్న.

<ప్రా. ఖుల్ల-.

గుల్లకడియము వి. వరికుప్పమట్టుచుట్టూనూర్చేటప్పుడు వేసేవరి. గుల్లకాఁడు విణ. 1. అంతస్సారంలేనివాడు, క్షేత్రయపదాలు ; 2. దరిద్రుడు. గుల్లకావి వి. కొంచెం నీలపుడాలుగలఎరుపు. బహుళా. 4.181. గుల్లకాసు వి. వెలతక్కువనాణెం, డొలునాణెం. వేమ. 1.150. గుల్లగుట్టు (-కుట్టు) అ.క్రి. నశించు, తరుగు, నిరంకు. 2.115. గుల్లగురుగులు వి.బ.వ. లక్కపిడతలు, చిన్నపిల్లలు ఆడుకోటానికి చిన్న సైజులో చేసిన రకరకాల మట్టిపాత్రలు. గుల్లచేయు అ.క్రి. పూర్తిగావెచ్చించు. గుల్లతాపి వి. డొల్లగాఉండేరేకుతాపీ. గుల్లతెర వి. డోలుతెర, సారెపలకమీది మట్టినిగొట్టంలాగ కొంతఎత్తుగా పైకితీర్చేఆకారం. గుల్లతెవులు వి. మిరపతెగులు, ఆకులుముడుచుకుపోయేఒకతెగులు. గుల్లదంటు వి. గులక, పశువులుతినగా మిగిలినచొప్ప. గుల్లనేఁత వి. పలచగానేసిననేత. గుల్లపట్టు స.క్రి. పొంగబట్టు, సారెమీద వాటతయారవుతున్నపుడు వాటలో పలకచేయి వెలుపలఒకచేయి పెట్టిమధ్యలావుగా వచ్చేటట్టుచేయు. గుల్లపడు అ.క్రి. అవమానపడు. గుల్లపఱచు రూ.చూ. గుల్లపఱుచు. స.క్రి. అవమానపరచు. గుల్లపఱుచు రూ. గుల్లపఱచు. స.క్రి. అవమానపరచు. ద్వి.హరిశ్చ. ఉ. 168 పం. గుల్లపుటికె వి. చిన్నగంప. గుల్లపొట్టు వి. కంకిపొట్టునుసి. గుల్లపాదుగు వి. పెద్దపొదుగు, పాలుబాగాఇచ్చేది. గుల్లముక్క వి. డోలుగా మోగేరాతిముక్క. గుల్లరాయి వి. 1. అబ్బుగుల్ల ; 2. గోడలుకట్టుబడిలోవాడేరాతిముక్క. గుల్లరేగడి రూ. గుల్ల రేవడి. వి. బొగ్గురేగడి, గుల్లగాఉండేరేవడి. గుల్లరేవడి రూ.చూ. గుల్లరేగడి. వి. బొగ్గురేగడి, గుల్లగాఉండేరేవడి. గుల్లసున్నము వి. సున్నపుగుల్లలతో తయారుచేసిన సున్నం. గుల్లెట్టు స.క్రి. కుళ్ళగించు, సాధనాలతో నేలనుతిరగవేయు. <గుల్ల+ పెట్టు. గుల్లెడు విణ. గంపెడు. <గుల్ల+-ఎడు.

గుల్లగిచ్చు రూ.చూ. గుల్లగించు. స.క్రి. గులకరించు, నేలను తిరగవేయు.

గుల్లగించు చూ. గుల్ల. రూ. గుల్లగిచ్చు, గుళ్లగిచ్చు. స.క్రి. గులకరించు, విరుచు, ఒరబెట్టే సాధనాలతో నేలను తిరగవేయు.

గుల్లడము వి. వర్ణవిశేషం.

గుల్లడి చూ. గుల్ల. వి. బిగువుతక్కువగా ఉన్న రేవడినేల.

గుల్లమంజరి వి. గంటల్లాగఉండేతెల్లటిపూలుపూసే ఒకతీగ, దీన్నితోటల్లో అందంకోసంపెంచుతారు (Beaumontia-grandiflora).

గుల్లా వి. రాళ్ళవరసలకు మధ్యనున్న స్థలం, సందు.

గుల్లాము రూ.చూ. గులాము. వి. 1. గులాము, దాసుడు. వేమన. 1.63 ; 2. అశ్వపాలకుడు. ఆం.భా. 2.204.

గుల్లి[1] విశే. 1. చిన్న ; 2. తోకలేని.

గుల్లి[2] రూ.చూ. గుల్లె. వి. నూలులెక్క, ఎనబై పోగుల నూలు.

గుల్లి[3] రూ. గులి[1], గుల్లెము. వి. తెల్లగా ఉండే కర్ర కలిగిన ఒక చెట్టు (Capparis grandis).

గుల్లెము రూ.చూ. గుల్లి[3]. వి. తెల్లగా ఉండే కర్ర కలిగిన చెట్టు (Capparis grandis).

గుల్లించు స.క్రి. 1. కుదించు ; 2. నాటు.

గుల్లు రూ.చూ. గుల్ల. వి. వ్యాధి విశేషం.

గుల్లె రూ. గులి[2], గుల్లి[2]. వి. నూలులెక్క, లడీలో డెబ్బయ్యో వంతు నూలు, ఎనబై పోగుల నూలు, అరవై దనలి కాయల లెక్క.

గుల్లెట్టు చూ. గుల్ల.

గుల్లెడు చూ. గుల్ల.

గుల్షబ్ వి. ఒకరకం పొద.

హిం.ఉ. పార. గుల్‌శబ్బో. రజనీగంధం.

<ఉ. గుల్‌శబ్బో.

గుళావులు వి.బ.వ. అలంకారార్థం పెట్టే గాజుగోళీలు.

ఇం. *Globe*. గోళం ; పో. గ్లోబు ; స్పా. గ్లోబో.

<పో. గ్లోబు.

గుళిగ వి. ఘుటిక, ఉండ, గుళిక. చికి. 2.

సం. గుళికా. ఉండ, మాత్ర.

<సం. గుళికా.

గుళ్లకాడి వి. పచ్చని పూలుపూసే ఒక తీగ (Ipomaea chryseides).

గుళ్లగిచ్చు రూ.చూ. గుల్లగించు. స.క్రి. నేలను తిరగవేయు.

గుళ్లు వి.బ.వ. కందెనగుడి అనే బాలక్రీడా విశేషం. విష్ణుపు. 7.203.

గుళ్ళ వి. మాడు, మట్టిపాత్రలను నర్పేటప్పుడు అడుగు పై భాగంలో చుట్టూ కడియంలాగ నిలిపిన అంచు.

గుళ్ళనలిగం వి. రాతిస్తంభాల చుట్టు అంచుల వంపుగా నరికిన మలుపు.

గుళ్ళబేరింగు వి. మరాను. ఇరుసు సులువుగా తిరగటానికి, ఉక్కు గుండ్లు అమర్చిన పనిముట్టు.

ఇం. *Bearing*. సులభంగా తిరగడానికి ఉపయోగపడే యంత్ర భాగం.

గుళ్ళమనేరిపేటు వి. అంచులో నేసే ఒకరకం గళ్ళ డిజైను.

గుళ్ళారిగా(డు వి. పొడుగాటివాడు.

గుళ్ళితాడు వి. పొట్టితాడు. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం.

గువగుత్తి రూ.చూ. గువ్వగుత్తి. వి. కపోతాంఘ్రి అనే మొక్క.

గువముసురు రూ.చూ. గువ్వముసురు. వి. తెరిపిలేని జడివాన.

గువగో వి.బ.వ. పోకచెక్కలు.

గువ్వ రూ.చూ. గ్రువ్వ. వి. 1. కపోతభేదం, అడవి పావురం. హంస. 3.13 ; 2. పక్షి, పిట్ట. ఆం.భా. 2.96.

గువ్వకన్నంచు వి. గువ్వకన్ను ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. గువ్వకన్నంచు రూ. గూకన్నంచు. వి. గువ్వకన్నుపేటు, గువ్వకన్ను ఆకారంలో డిజైను, పడేట్టు నేసిన అంచు. గువ్వకన్నుపేటి రూ.చూ. గువ్వకన్ను పేటు. వి. అంచులో గువ్వకన్ను ఆకారంలో నేసిన డిజైను. గువ్వకన్నుపేటు రూ. గువ్వకన్నుపేటి, గూకన్నుపేటు. వి. అంచుల్లో గువ్వకన్ను ఆకారంలో నేసిన డిజైను. గువ్వకరి వి. విజృంభణం. భోజ. 3.26. గువ్వకరిగొను (-కొను) అ.క్రి. విజృంభించు, రేగు. జైమినీ. భా. 4.72, వరాహ. 10.41. గువ్వకుత్తుక రూ. గువ్వగుత్తుక[2]. వి. ఆకలిచేత కలిగే హీనస్వరం. పాండు. 3.20. గువ్వకుత్తుకపడు రూ. గువ్వగుత్తుకపడు. అ.క్రి. ఆకలిచేత హీనస్వరం పడిన వాడగు, కృశించు. ద్వి. హరిశ్చ. ఉ. 1280 పం. గువ్వకూర్చుండుట వి. నీరు లేకుండా టెంకాయ చెడిపోవటం. గువ్వకొను అ.క్రి. 1. గుమిగూడు ; 2. మంతనాలాడు. గువ్వకొరింద వి. పచ్చని పూలూ, ఎర్రని పళ్ళూకాసే ఒక తీగ (Pterolobium indicum). గువ్వకోలు వి. గుమిగూడటం. గువ్వకోలుకొను రూ.చూ. గువ్వకోల్కొను. అ.క్రి. చుట్టుకొను, గుంపుకూడు. శుక. 1.372. గువ్వకోల్కొను రూ. గువ్వకోలుకొను. అ.క్రి. గుమిగూడు. మను. 3.109. గువ్వగుత్తి రూ. గువగుత్తి, గూగుత్తి, గూగుర్తి, గోగుత్తి, గోవుగుత్తి. వి. మెట్టలోను, ఎర్ర నేలల్లోను ఎక్కువగా పెరిగే కలువ మొక్క, కపోతాంఘ్రి. ఆం.భా. 2.65 (Arum colocoste). గువ్వగుత్తిక రూ. గువ్వగుత్తుక[1]. వి. కపోతాంఘ్రి. ఆం.భా. 2.65. గువ్వగుత్తిగడ్డి వి. కపోతాంఘ్రి. గువ్వగుత్తిజొన్న వి. కంకి ముద్దగా ఉండే రకం. గువ్వగుత్తుక[1] రూ.చూ. గువ్వగుత్తిక. వి. కపోతాంఘ్రి. గువ్వగుత్తుక[2] (-కుత్తుక) రూ.చూ. గువ్వకుత్తుక. వి. హీనస్వరం. గువ్వగుత్తుకపడు రూ.చూ. గువ్వకుత్తుకపడు. అ.క్రి. 1. నీరసిల్లు ; 2. నోరెండుకొనిపోవు. గువ్వగుత్తులు వి.బ.వ. స్త్రీల నగలు. గువ్వడెక్క రూ. గువ్వడెక్కె. వి. ఆకుగిట్ట, పల్చగా, వెడల్పుగా ఉన్న గిట్ట. గువ్వడెక్కె రూ.చూ. గువ్వడెక్క. వి. ఆకుగిట్ట, పల్చగా, వెడల్పుగా ఉన్న గిట్ట. గువ్వదడ వి. పెద్ద పెద్ద ఆకులు కలిగిన ఒక చెట్టు (Grewia abutifolia). గువ్వపుల్లడు వి. గువ్వ రంగులో ఉన్న బీడునేల. గువ్వముసురు రూ. గువముసురు. వి. నిరంతరం తుప్పరగా పడే వాన.

గువ్వము వి. 1. ముక్కలవులును ; 2. ఆవకాయలోని పిండి, గుజ్జు.

గువ్వరాయి రూ.చూ. గవ్వరాయి. వి. గులకరాయి.

గువ్వఱాయి రూ.చూ. గవ్వరాయి. వి. గులకరాయి.

గువ్విగడ్డ చూ. గుబ్బిగడ్డ. వి. సారెనులువుగా తిరగడానికి వీలుగా రంధ్రమున్న రాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టిన దిమ్మ.

గువ్వించు స.క్రి. కుళ్ళగించు, సాధనాలతో నేలను తిరగవేయు.

గువ్విరాయి రూ.చూ. గుబ్బిరాయి. వి. సారెమొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్న రాయి.

గుశెలవాకిలి వి. కుసి తలుపు బిగించిన వాకిలి.

గుష్టి వి. 1. ఎరుక , 2. గురుతు.

గుస వి. లోతుతక్కువ గల చేట.

గుసగుస వి. 1. సల్లాపం, గుసగుసధ్వనితో కూడిన రహస్యపు మాట. శశా. 2.77 ; 2. రహస్యపు మాటల చప్పుడు.

క. కుచు, కుస, కుసు, గుజి, గుజు, గుస, గుసు, కిసు, గిసు. గుసగుసలాడటంలోని అనుకరణం ; తు. గుజి, గుజు, గుజ్జి, గుజ్జు, గుసు, కుసుకుసు. గుసగుస మాటలాడటం ; త. కుచుకుచు. గుసగుస మాటలాడటం ; కుచుకుచుప్పు. గుసగుస మాటలాడటం ; కుచుకుచ్-ఎన్ఱల్. అనుకరణ ధ్వని, కచు-కుచ్-ఎన్-ల్-కుచు-ముఞ్-ఎన్ఱల్. చెవిలో గుసగుసలాడు ; మ. కుశుకుశుక్క, కుచుకుచుక్క. గుసగుసలాడటం ; కుశలిక్క. గుసగుసలాడటం ; కొండ. గుచ్ గుచ్ ఇన్. గుసగుసలాడటం ; కుఱు. కుస్మ్సఅనా. గుసగుస లాడటం.

గుసగుసలంబోవు అ.క్రి. గుసగుసలాడు. ఉ.రా. 6.348.

గుసగుసలాడు అ.క్రి. రహస్యంగా మాటలాడు. రాజవా. 3.114. <గుసగుస + -లు + ఆడు. గుసగుసలువోవు (-పోవు) అ.క్రి. గుసగుసలాడు. కువ.చ. 2.29.

గుసాయి వి. వంట చేసే ఓఢ్రుడు.

గుసి రూ.చూ. కుసి[1]. వి. బండి గూటం.

గుసిచెక్క వి. మునుగుచెక్క.

గుసితలుపు రూ.చూ. కుసితలుపు. వి. కుసిమాను తలుపు, కుసి మీదతిరిగే తలుపు.

గుసిపట్టె వి. మునుగుచెక్క, కుసితగిలించటానికి రంధ్రంఉంచి దర్వాజాపై కమ్మిమీద పరచినచెక్క.

గుసిబద్ద వి. మునుగుచెక్క. కుసితగిలించటానికి రంధ్రంఉంచి దర్వాజాపై కమ్మిమీద పరచిన చెక్క.

గుసిలింత వి. నవ్వు, హాసం.

గుసులాడు అ.క్రి. సంధిబంధాలు తెగు.

గుహారు రూ.చూ. గుపారు. వి. అపవాదం, వాదు.

గూకన్నంచు రూ.చూ. గువ్వకన్నంచు. వి. గువ్వకన్నుపేటు.

గూకన్నుపేటు రూ.చూ. గువ్వకన్నుపేటు.

గూకాలు వి. జడ్డిగం కాళ్ళు తగిలించటానికి గొర్రుదిండుకు రెండు చివర్ల దిగ్గొట్టిన ఇనపకొండి.

గూకు[1] రూ.చూ. క్రుంకు. అ.క్రి. 1. కుంకు ; 2. చచ్చు, అస్తమించు.

గూకు[2] రూ.చూ. గుబుకు[1]. స.క్రి. గుద్దు, కొట్టు. వి. దెబ్బ.

గూగడ్డ రూ.చూ. గుయ్యిగడ్డ. వి. సారెనులువుగా తిరగటానికి వీలుగారంధ్రం ఉన్నరాయికి మట్టి, వరిపొట్టు కలిపి భూమిలో పాతిపెట్టినదిమ్మ.

గూగిరాయి వి. సారెమొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం ఉన్నరాయి.

గూగు వి. 1. రోమాంకురం ; 2. మిక్కిలి సన్ననిముళ్ళు, నూగు.

గూగుత్తి రూ.చూ. గువ్వగుత్తి. వి. స్త్రీలభూషణ విశేషం.

గూగుర్తి రూ.చూ. గువ్వగుత్తి. వి. కపోతాంఘ్రి అనే కలుపు మొక్క.

గూగుళ్ళు వి.బ.వ. చెరువులోపలి వైపు కొంతమెరకన ఉన్న రాళ్ళు.

గూగె వి. పైర్లతెగులు, పైరంతా తెల్లబడిపోయే తెగులు.

గూజు రూ.చూ. గుజ్జు[2]. వి. గుజ్జు.

గూట వి. కుండలు కాల్చే ఆముపద్ధతి.

గూటం రూ.చూ. గూటము[1]. వి. 1. సారెను పంచడానికి ఆధారంగా అడుగుభాగం లావుగాను పైభాగం సన్నగా కొయ్యమేకులాగా చేసినట్టి కర్రదిమ్మ ; 2. గానిగకట్టె తిరగటానికి ఆధారంగా నాటబడిన లావాటికొయ్యదుంప ; 3. నేలలోపాతిన పెద్దకొయ్యమేకు ; 4. గొడ్లను కట్టే గుంజ ; 5. వేల్దారులు, వడ్రంగులు వాడే కొయ్యసుత్తి ; 6. అచ్చుపోసిన పచ్చిపెంకును వంచేసాధనం ; 7. గుంజపైభాగాన అడ్డంగా నాటబడిన పీటలాగా వాడబడే కొయ్యముక్క ; 8. గోడలో బిగించిన కొయ్యముక్క ; 9. అటకలను అమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క ; 10. బండిమీది జల్లకదలకుండా చట్టంలో గుచ్చిన కొయ్యముక్క ; 11. ఆడబండు తిరగటానికి వీలుగా కమ్ములకు బిగించిన ఇనపదిమ్మ ; 12. దూదిఏకేటప్పుడు కమాను సరంకొట్టేకొయ్యబడితె ; 13. రాటి తిరగడానికి ఆధారంగా, దూపిరికి దిగగొట్టిన కొయ్య గూటం ; 14. ఊడ్తెను నిలబెట్టి తాడుతో బిగించడానికి నేలలోపాతిన గూటం ; 15. ఊడ్తెగూటాన్ని నేలలోకి దిగగొట్టే ఇనపమొద్దు ; 16. మగ్గంగూటంలో పాపుచెక్కల బిగింపులకు పాతినకొయ్య ; 17. దండెను మోపే పంగలకొయ్య ; 18. మగ్గం మీదనేత బిర్రుపెట్టటానికి మేకుకొట్టే కొయ్య ; 19. మగ్గంకుచ్చు తాడు కట్టటానికి ఆధారంగా చట్రంనిలువుపట్టెకు బిగించిన కొయ్యపుల్ల , 20. ఉన్నిపడేటప్పుడు నరం కొట్టేపనిముట్టు ; 21. ఉన్నిపడుగు తోడడానికి నేలమీద పాతినపుల్ల ; 22. ఉన్నిమగ్గం దోనెను మోపే ఎడమవైపు కొయ్యగూటం ; 23. ముంతలు మొ. చిన్నపాత్రలను గట్టించడానికి వాడే చిన్నకొయ్యసుత్తి ; 24. దొంగగొడ్లకు మెడకు వేలాడేగట్టే బరువుకొయ్య.

గూటంరాయి వి. 1. రాతితో కట్టినఆర్చి మధ్యభాగంలో బలంకోసం బిగించిన పెద్దరాయి ; 2. రాతిగోడల పగుళ్ళను సరిచేస్తూ బిగించేరాయి. గూటంతాడు వి. పావుచెక్కకు గూటానికి బిగించే వెనకతాడు. గూటంపార వి. తొడిమ పార.

గూటంసుడి రూ.చూ. గూటిసుడి. వి. తోకకిందిసుడి.

గూటదిబ్బి వి. బెడ్డకొట్టుకొనే జాగా.

గూటదీపంపెట్టేదిక్కు చూ. గూడు.

గూటము[1] రూ. ఖూటా, గూటం, గూటాం, గూటాము, గూంటము.

వి. 1. దేరామేకు. వాల్మీ. 3.96 ; 2. గుంజ, కంబం ; 3. వడ్రంగి, మాదిగవాడు, దూదేకులవాడు, మొ. వారు ఉపయోగించే పనిముట్టు ; 4. మేకు ; 5. నిలువెత్తుకొయ్య ; 6. గట్టివస్తువులను మెదిపే (నలగగొట్టే) గట్టికర్రదుంగ.

క. కూటు, గుంటు, గూటు, గుంటు. మేకు ; కొడ. గూటు ; తు. గూటు, గూటి. మేకు ; కుఇ. కూటె.

పో.చూ. సం. కూటు-. నాగటికర్ర, ఇనపగుదియ ; పా. కూటుం ; హిం. కూడ్.

గూటాలతొట్టి వి. మగ్గంగుంటలో పావుచెక్కల గూటాల బిగించిన చట్రం.

గూటము² వి. 1. మేలును కీడుగా చెప్పటం (అనభీష్టం) ; 2. ఇబ్బంది, వ్యతిరేకత.

సం. కూటు-. అసత్యం, కపటం, మాయ.

<సం. కూటు-.

గూటవ రూ.చూ. గుంటక. వి. మెట్టచేనును చదునుచేసే పనిముట్టు.

గూటవగుంటక వి. పైరులోగడ్డి, కలుపుతీసేగుంటక.

గూటవేయు చూ. గూటవ. స.క్రి. కుదుటపరుచు. తాళ్ళ. సం. 11.40.

గూటాం రూ.చూ. గూటము¹. వి. 1. గుంజ ; 2. దేరామేకు ; 3. వడ్లవాళ్ళు మొ. వారుఉపయోగించే పనిముట్టు ; 4. చిలకకొయ్య.

గూటాంరాయి వి. కోపురాయి, ఒకవైపుకోనుగా ఉండేటట్లు మలచిన మొనదేలినరాయి.

గూటాము రూ.చూ. గూటము¹. వి. 1. దేరామేకు ; 2. కొయ్యమేకు ; 3. గుంజ ; 4. వడ్లవాడు మొ. వారిపనిముట్టు ; 5. చిలకకొయ్య.

గూటాయించు చూ. గూటము¹. రూ. గూటించు. స.క్రి. 1. బాగాచీవాట్లుపెట్టు. 2. నిర్బంధించి అడుగు , 3. దట్టించు.

గూటాలతొట్టి చూ. గూటము¹.

గూటి¹ రూ.చూ. గూఁటి. వి. పంది.

గూటి² వి. చప్పరింత.

గూటి³ వి. గొరిలిచెట్టు, ముళ్ళుకల్గిన ఒకచెట్టు (Plecospernum Spinoxum).

గూటిగడ్డ వి. దెబ్బమీదగడ్డ.

గూటిగువ్వ చూ. గూడు.

గూటిచెక్క చూ. గూడు. వి. మరమగ్గం సొరుగుచివర, నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క.

గూటించు రూ.చూ. గూటాయించు. స.క్రి. 1. బాగాచీవాట్లు పెట్టు ; 2. నిర్బంధించిఅడుగు ; 3. దట్టించు.

గూటిదొమ్మ వి. 1 కృశత్వం ; 2. రొప్పుఎగపోత ఎక్కువగా ఉన్నదొమ్మ ; 3. క్షయ.

గూటిపటచు స.క్రి. కప్పిపుచ్చు. చంద్రభా. 1.134.

గూటిబండ వి. మోటబావిలోపలి వైపున్న నూతిమాకులమీద అడ్డంగావేసిన బండ లేదా నాపరాయి.

గూటిబండి వి. మనుష్యులు కూర్చోడానికి పైన గూడులాగ కప్పుకట్టిన సవారిబండి.

గూటిబిళ్ళ వి. దవడలకింద వాపు, గవదబిళ్ళ.

గూటిమడప వి. చేలోవేసిన మడవ (అడ్డకట్ట) కింద ఏర్పడ్డ బొక్క.

గూటింపు చూ. గూటించు. వి. 1. దట్టించటం ; 2. చీవాట్లు పెట్టటం.

గూటిల్ల వి. దూది ఏకేటప్పుడు కమానునరం కొట్టే కొయ్య బడితె.

గూటిసుడి రూ. గూటంసుడి. వి. తోకకింద సుడి.

గూటీలుద్రోయు(-త్రోయు) స.క్రి. కఠినవాక్కులు వినిపించు.

గూటు¹ స.క్రి. 1. దూరు ; 2. తిను ; 3. గూటించు.

గూటు² వి. సంఘం, కమిటీ.

సం. కూటు-. సమూహం.

గూటులు వి.బ.వ. నల్లామునుంచి పొగపోవడానికి, కాక కాల్చు చూచుకోడానికి నల్లాముచుట్టూ మంట వెనక్కి రావడానికి వీలుగా దాతలమధ్యగా భూమికి జానెడెత్తులో ఉంచిన మట్టి కుదుళ్ళు.

గూటొంపు వి. బండిచక్రం తయారీలో వాడే వంగిన కొయ్య.

గూడ¹ వి. 1. వానకు తడవకుండా తలమీద వేసుకొనే గుడ్డ. ఆము. 4.183 ; 2. పుష్పాలు మొ. నవి ఉంచే బుట్ట, సజ్జ. ఆము. 5.38 ; 3. భక్ష్యాలు మొదలైనవి పెట్టుకొనే పాత్ర. హంస. 1.105 ; 4. జలనముత్క్షేప పాత్రం, ఓడలో వచ్చిన నీళ్ళను తీసివేసే పాత్ర. ఆం.భా. 1.157 ; 5. పల్లంనుంచి మెరకకు నీళ్ళుతోడే పెదురుగూడ ; 6. చేపల్ని పట్టే సాధనం ; 7. తిరుపబుట్ట, వైష్ణవులు తిరుమణి పెట్టి మొ. ఉంచి చంకన తగిలించుకొనే తాటాకులబుట్ట ; 8. బండిజల్ల ముందరి భాగం ; 9. బోయగూడ మొదలైనవి ; 10. తుంటి ; 11. భుజంకీలు ; 12. నిలువన పెట్టిన చొప్పకుప్ప ; 13. మేకలు మందగా మేతకు వెళ్ళినపుడు అడవిలో వాని పిల్లల్ని ఉంచే పెద్ద వెదురు అల్లకం ; 14 ఇంటిపైని గుమ్మటంలాగ నిర్మించిన కట్టడం ; 15. పచ్చి ఇటుకల్ని బట్టీకి నిలువుగా పేర్చిన పేర్పు ; 16. రెండువైపులా తాళ్ళుకట్టిన వెదురుబుట్ట ; 17. కంకులలో బండిజల్ల తెరచిఉన్నవైపు అడ్డంపెట్టిన తడికెతేక చొప్ప కట్టలు ; 18. పొట్టుకంకులు మొ. నవి మోసుకుపోవటానికి ఉపయోగించే గంప ; 19. తలపై పెట్టుకునే తుంగ చాప.

క. గూడ, గూడె. బుట్ట, నీళ్ళు తోడడానికి ఉపయోగించే సాధనం ; కూళె, కూళి. చేపలుపట్టటానికి ఉపయోగించే బుట్ట. కొడ. కూటె. బుట్ట ; తు. గూడె. బుట్ట ; త. కూడై. వెదురు కర్రలతోగాని తాటాకులతో గాని తయారుచేసిన బుట్ట ; కూడు. చేపలు పట్టటానికి ఉపయోగించే బుట్ట ; మ. కూటు ; గోం. గూతా. బుట్ట.

గూడకట్టు రూ. గూడగట్టు¹. వి. కచ్చతేకుండకట్టిన బట్టల కట్టు, గోచిలేకుండ కట్టిన పంచెకట్టు. గూడకట్టుపంచె వి. మగవాళ్ళు నడుంకు చుట్టుకొనేబట్ట. గూడకొంగ వి. పెద్దకొంగ. గూడకొమ్ము వి. గూడకు పైవైపు కాడుకట్టే చోటు.

గూడగట్టు¹ (-కట్టు) రూ.చూ. గూడకట్టు. వి. తమిళులు మొలపంచెను అడ్డంగా (దట్టీగా) కట్టేకట్టు, బ్రహ్మణికట్టు.

గూడగట్టు² (-కట్టు) అ.క్రి. దెబ్బతగిలి నెత్తురు కదుంకట్టు.

గూడగుంట వి. గూడతో పొలాలకు నీళ్ళుతోడేగుంట. గూడచా(వ వి. గూడ. గూడచెవి వి. గూడకొమ్ము. గూడచేట వి. వెదురుతో అల్లిన బుట్ట. గూడచేరు వి. గూడతాడు. గూడతట్ట వి. గూడచేట. గూడతరవ వి. గూడతాడు. గూడతల వి. లోపలికి తిరిగి కొనలు కలిసిన కొమ్ములున్న తల. గూడతాడు వి. గూడవేసే మనిషి పట్టుకోటానికి గూడచేటకు కట్టినతాడు. గూడతోట వి. గూడలాగ ఒత్తుగా రెక్కలున్న ఒకజాతికొంగ. గూడదారం వి. గూడతాడు. గూడదాసరి వి. మాలదాసరి, ఒక తెగవాడు. గూడవగ్గం వి. గూడతాడు. గూడవట్టి వి. దూలాం అంచుమీద వేసే కమ్మీ. గూడవ(రె వి. గూడగుంట. గూడపాల వి. మామెన, కారిబ, వృక్షవిశేషం. గూడబాతు వి. **1.** పెద్దకొంగ; **2.** గూడలాగ పెద్ద రెక్కలున్న ఒక జాతి బాతు. హంస. 3.13; గూడబావ వి. గూనబాన. ఒకరకంబాన. గూడబావి వి. గూడగుంట. గూడబుట్ట వి. గూడచేట. గూడబొంద వి. గూడగుంట. గూడరేవు వి. గూడగుంట. గూడవేత వి. గూడతో నీళ్ళు తోడటం. గూడవేయు స.క్రి. చేనికి గూడలతో నీరుపెట్టు.

**గూడ**² వి. తూర్పు కనుమల్లోను, గంజాంనుంచి గోదావరి వరకు రమారమి 2000 అడుగుల ఎత్తున ఉండే కొండల మీద అడవుల్లోను, పొదగా పెరిగే పొడుగాటి మొక్క (Fleminga stricta).

**గూడవుతీగ** వి. ఒకానొక తీగ (Eleamatis smilacifolia).

**గూడలబీడ** చూ. గూ(డు. వి. ఆకులమీద గూళ్ళు కట్టుకొని ఉండే పురుగులవల్ల కలిగే చీడ.

**గూడలి** రూ.చూ. కూడలి. వి. నదులకూడలి.

**గూడల్వ** వి. మూడు చీలికలుగా ఉన్న కాలవ.

**గూడాబాదరు** వి. పెండ్లిబొట్టు (కల్యాణ తిలకం) మాదిరిగా, మూడేసి చుక్కలు రెండు వరుసల్లో పెట్టి, వాటిమధ్య నిలువు గీర పడేట్టు నేసిన అంచు.

**గూడారము** రూ. గుడారము, గుడారు, గుండారము, గూడారు. వి. **1.** బట్టతో ఏర్పరచిన ఇల్లు, డేరా. కు.సం. 11.30; **2.** గుడారంవలె ఉండే చెవి భాగం.

పో.చూ.సం. కూటాగార-. మేడమీది గది, మిద్దెమీద కట్టింది; *గూడాగార-.* దుర్గంలో బలిష్ఠమైన బురుజు; దుర్గంలోని నేలమాళిగ; మరా. *గుఢార్.* పటకుటీరం.

క. *గుడార, గుడారె, గుండార.* గుడారం; తు. *గుడార*; త. కుటారమ్, కూటారమ్;

<సం. కూటాగార-. లేదా గూఢాగార-.

**గూడారు** రూ.చూ. గూడారము. వి. గోనెపరదా, గుడారం. ఆం.భా. 2.159.

**గూడి** రూ.చూ. గోడు¹. వి. ఇటుకను తారసను వెదల్పుమీద నిలబెట్టిన పేర్పు.

**గూడిగోన** వి. వంటబాన, పెళ్ళిళ్ళు మొ. సందర్భాల్లో వంటకు వాడే పెద్ద మట్టిపాత్ర.

**గూడు** రూ.చూ. గూ(డు. వి.బౌ. **1.** వస్తువులు పెట్టుకోటానికి వీలుగా గోడలో కొంతమేర కట్టుబడిలో వదిలేసిన అర; **2.** ఇటుకను మాత్రమే కాల్చే కట్టడం; **3.** సందులు సందులుగా పేర్చిన ఇటుక పేర్పు; **4.** పిట్టగోడలోని డిజైను కంత; **5.** రెండు ఎముకలు కలిపే కీలు; **6.** పశువుల గుదస్థానం; **7.** రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య బొర్లించి కట్టిన చిప్ప; **8.** అనుపోసిన నూలు లేదా ఉన్నిలో ఒకటి పైకి ఒకటి కిందికి వచ్చిన రెండు పోగుల దారం; **9.** పన్నెరండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి; **10.** మగ్గం దగ్గర, సామాను పెట్టుకోడానికి గోడలో వదిలిన జాగా; **11.** పట్టుపురుగు, దారంతో తనచుట్టూ అల్లుకొన్నది; **12.** మోటలాగే ఎద్దులు దారిపైకి ఎక్కివచ్చి నిలిచే చోటు; **13.** ప్రయాణపు బండిమీదవేసే కప్పు; **14.** అడుగునస్థూపాకారంగాను, పైన కోనుగాను ఉండేట్టు పేర్చిన పెద్ద గడ్డికుప్ప; **15.** కులాయం.

గూటదీవంపెట్టేదిక్కు వి. వారనుడు. గూటిగువ్వ రూ.చూ. గూ(టిగువ్వ. వి రెక్కలురాల్చిన పక్షి. గూడుకట్టు స.క్రి. గూడుగాకట్టు. గూడుకళ్ళం రూ.చూ. గూడుకళ్లము. వి. గాడికళ్ళం. గూడుకళ్లము రూ. గూడుకళ్ళం. వి. **1.** కుప్పదగ్గరే కంకులు కోయడానికి బాగు చేసిన కళ్ళం; **2.** చుట్టూరా ఎంట్లు (గడ్డితాళ్ళు) పెట్టి లోపల చాపలువేసి ధాన్యం, పొట్టు మొ. నవి నిలవచేసుకొనె చోటు. గూడుకామపు రూ.చూ. గూ(డుకానుపు. వి. పిట్ట. వ్యు. గూడునుంచి పుట్టింది. గూడుకొమ్ము వి. గుండ్రంగా లోపలికి వంపుతిరిగిన కొమ్ము. గూడుదిగు అ.క్రి. గుండెబరువు తగ్గు. గూడుపుట్టువు రూ.చూ. గూ(డుపుట్టువు. వి. పక్షి. గూడుపురుగు వి. ఆముదపు తెగులు, ఆకుల మీద సాలీడులాగ గూడుకట్టుకొనే సన్నటి తెల్లపురుగు. గూడుపేటు వి. అంచులోనేసే ఒకరకం డిజైను. గూడుబండ వి. గూడుమీది గోడ కుంగకుండాపైన పరచిన బండ. గూడుబండి రూ.చూ. గూ(డుబండి. వి. తాత్కాలికంగా గూడులాగ చాపతో కప్పినబండి గూటిబండి. గూడుబెట్టు (-పెట్టు) స.క్రి. ఇటుకల్ని నిలువునపేర్చు.

**గూడువరిగె** వి. భక్ష్య విశేషం. హంస. 1 105.

**గూడుపుటాని** రూ. గూడుపురాణీ. వి. **1.** మోసం చెయ్యటం; **2.** కుట్రపన్నటం.

**గూడుపురాణీ** రూ.చూ. గూడుపుటాని. వి. **1.** కుతంత్రం; **2.** మోసం.

గూడుపురాణీచేయు స.క్రి. కుట్రపన్ను.

**గూడెం** రూ.చూ. గూడెము. వి. **1.** ఒకే కులంవాళ్ళుండే గ్రామభాగం; **2.** గొర్లసాలచుట్టూ ఉన్న చోటు.

**గూడెము** రూ. కోడెము, గుడెము, గూడెం, గోడము, గోడెము. వి. **1.** బోయపల్లె, పక్కణం, కొండదొన నాశ్రయించి ఉండే బోయపల్లె. అచ్చ.రా. బాల. 13; **2.** చిన్నపల్లె; **3.** పేట.

**గూడ్క** వి. ఎరువు తోలటానికి ఒడ్డె బండి మీద వేసే జల్ల.

**గూంటము** రూ.చూ. గూటము¹. వి. **1.** గూటం; **2.** సుత్తి, కొయ్యతోగాని ఇనుముతోగాని చేసిన సుత్తి.

**గూంద్ర** రూ.చూ. గుంద్ర³. వి. గుడ్లగూబకూత.

గూంద్రించు అ.క్రి. **1.** (గుడ్లగూబ) కూయు; **2.** కడుపులో వికారం కలుగు; **3.** అరుచు. గూంద్రిలు రూ.చూ.

గూం[డిల్లు. అ.[కి. **1.** గుడ్లగూబ కూయు ; **2.** అరుచు ; **3.** కడుపులో వికారం కలుగు. గూం[డిల్లు రూ. గూం[డిలు. అ.[కి. **1.** గుడ్లగూబ కూయు ; **2.** అరుచు ; **3.** కడుపులో వికారం కలుగు.

**గూం[డించు** చూ. గూం[డ.

**గూం[డిలు** చూ. గూం[డ.

**గూం[డిల్లు** చూ. గూం[డ.

**గూఁటి** రూ. గూటి[1]. వి. పంది.

నం. ఘృష్టి-. పంది.

**గూఁటిగువ్వ** చూ. గూఁడు.

**గూఁటిపడు** చూ. గూఁడు.

**గూఁటిపఱచు** చూ. గూఁడు.

**గూఁడు** రూ. గూడు. వి.జా. **1.** పక్షి గృహం, కులాయం. మను. 1.36 ; **2.** పంజరం. పారి. 5.27 ; **3.** గోడలో దీపం మొ. ఉంచటానికి ఏర్పరచిన గుంట. శుక. 3.131 ; **4.** కుండలం మొ. వాటిలో రత్నాలు పొదగడానికి ఏర్పరచిన గుంట ; **5.** సులోచనాలు పెట్టుకొనే గొట్టం ; **6.** ఆకు గుడిసె, **7.** చాప మొ. వానితో కట్టిన బండి కప్పు ; **8.** ఎముకలగూడు ; **9.** కీటకాలపై కప్పు ; **10.** పూలుపెట్టుకొనే సజ్జ; **11.** పిల్లలు పడుకొనేటప్పుడు దోమలు మొ. నవి కుట్టకుండా పైన ఉంచే బోనులాంటి పరికరం.

క. *గూడు*. పంజరం, బోను, ఎముకలలోని బోలుగా ఉండే భాగం ; కొడ. *గూడు*. పక్షి గృహం ; తు. *గూడు*. గూడు, పంజరం, బోను, గోడలో ఏర్పరచిన గూడు ; త. కూటు. గూడు, పక్షి గృహం, గాదె, తట్ట మొ. ; మ. కూటు. గింజలు నిల్వచేసుకొనే గాదె, తట్ట, పంజరం ; కోట. *గుఢ్*. గూడు ; తో. కుడ్. గూడు ; కువి. కూడ. వెదురు కర్రలతో చేసిన బోను ; పర్జి. *గూడ*. గూడు, వెదురుకర్రలతో చేసిన బోను ; గద. *గూడె*. గూడు.

**గూఁటిగువ్వ** రూ. గూటిగువ్వ. వి. ఈకలురాల్చిన పక్షి. ఆం.భా. 2.98. **గూఁటిపడు** అ.[కి. దాగు, మరుగగు. **గూఁటిపఱచు** స.[కి. దాచు, మరుగుపరచు. చం[దభా. 1.134. **గూఁడుకానుపు** రూ. గూడుకానుపు, గూఁడుకాన్పు. వి. పక్షి. అచ్చ.రా.సుందర. 57. **గూఁడుకాన్పు** రూ.చూ. గూఁడుకానుపు. వి. పక్షి, నీడోద్భవం. అచ్చ.రా. యు. 6.161. **గూఁడుపుట్టువు** రూ. గూడుపుట్టువు. వి. పక్షి. అచ్చ.రా. ఆరణ్య. 75. **గూఁడుబండి** రూ. గూడుబండి. వి. గూడులాగ చాప కట్టిన బండి. **గూళ్ళతడికె** వి. పట్టు పురుగులను పెంచడానికి వాడే బుట్ట. **గూళ్ళతెగులు** వి. వరితెగులు, ఆకులపై గూళ్ళుపెట్టి పైరుతినేసేటటు వంటి పురుగులుపట్టే తెగులు. **గూళ్ళముగ్గు** వి. ఆరుముఖాల నక్షత్రం రూపంలో వేసిన ముగ్గు. **గూళ్ళపిడలు** వి.బ.వ. ఒకరకం తినుబండారం. హంస. 1.105. **గూళ్ళు** వి.బ.వ. జొన్న, సజ్జదంటు పేర్చిన కుప్పలు. **గూళ్ళుపడు(-పడు)** అ.[కి. **1.** చిక్కిపోవు ; **2.** కళ్ళుగుంటలుపడు ; **3.** జబ్బులు నొప్పిపెట్టు.

**గూద[1]** వి. కిందకిదిగినగుదం, ఒకానొక రోగం.

నం. *గుద*-. ముడ్డి, పాయువు.

క. *గూదె*, *గూద* ; తు. *గూదె* ;

<నం. గుద-.

**గూద[2]** వి. మెత్తగా ఉండే రాతిపొర.

**గూదేకు** రూ.చూ. గుదేకు. వి. గరేకు, ఎన్నును గుదిగా ఆవరించుకొన్నఆకు.

**గూన** వి. **1.** లోతుకుండ, పెద్దకుండ. ఆము. 1.83 ; **2.** మేడ మీద నుంచి నీళ్ళుపడే సాధనం ; **3.** గంజిపోసుకొనే తొట్టి ; **4.** పట్టుదారం తోడే కొయ్య పనిముట్టుకు ఏట వాలుగా ఉండేటట్టు అడుగునపెట్టే కొయ్యదిమ్మ ; **5.** రంగు నీళ్ళు పోసే తొట్టి ; **6.** పెంకు ; **7.** మోటగట్టినీళ్ళు తోడే పరికరం ; **8.** ఏతంనీళ్ళు తోడే పాత్ర ; **9.** పశువులు కుడితి తాగే మట్టితొట్టి ; **10.** సారెమీద తయారయ్యే గుం[డటి పెంకు ; **11.** ధాన్యం దాచే పెద్దకుండ ; **12.** నీళ్ళుపోయే దారి ; **13.** మట్టితోగాని, సిమెంటుతోగాని పలచగా గుం[డంగా చేసి ఒక దానిమీద ఒకటి పేర్చి బావిచుట్టూ గోడకు బదులుగా నిలిపిన వస్తువు; **14.** పెద్ద బొక్కెన.

క. కూని. మట్టిలో తయారు చేసిన బేసిను ; త. కునై. నీళ్ళు కాచుకొనే పెద్ద మట్టికుండ, బొక్కెన.

**గూనఅటికె** వి. నీళ్ళు తెచ్చేదానికి వాడే పెద్ద అటికె. **గూనకక్కెరచెక్క** వి. గూనపెంకు నున్నబరచడానికి వాడే పల్చని వెదురు కొయ్య. **గూనకడవ** వి. పెద్ద మట్టిపాత్ర. **గూనగాజు** వి. అడుగు ఎత్తులో మూడు నాలుగు అడుగుల కైవారంతో చేసిన మట్టి వలయం. **గూనచెక్క** వి. గూన పెంకు నున్నబరచడానికి వాడే పల్చని వెదురు కొయ్య. **గూనంచు** వి. బెత్తెడు వెడల్పుగా నిలబడి ఉండే అంచు. <గూన+అంచు. **గూనతూము** వి. మట్టిగొట్టాలతో వేసిన చెరువు తూము. **గూనతొట్టి** వి. **1.** నీళ్ళుపోసి పెట్టడానికి వాడే చిన్నసైజు మట్టితొట్టి ; **2.** గంజిపోసుకొనే తొట్టి. **గూనంతరం** వి. గూనతోకప్పిన పై అంతస్తు. **గూనపలక** వి. **1.** అచ్చుపోసిన పచ్చిపెంకును వంచే సాధనం; **2.** చదునుగా ఉండేపెంకు. **గూనపులి** వి. గూనకడుపు గలది. **గూనపెంకు** రూ. కూనపెంకు. వి. పెంకుటింటి కప్పులో వెన్నుగాడుకు కప్పే పెద్దసైజు పెంకు. **గూనపెండలము** వి. కవిలగడ్డ, ఒకరకం పెండలం (Dioscoreaglabora). **గూనపొట్టె** రూ. గూనప్పొట్టె. వి. ధాన్యందాచే పెద్ద మట్టి పాత్ర. **గూనప్పొట్టె** రూ.చూ. గూనపొట్టె. వి. ధాన్యం నిలవచేసుకొనే పెద్ద బాన. **గూనబద్ద** వి. **1.** గూనపెంకు నున్నపరచడానికివాడే పల్చని వెదురు పొయ్య ; **2.** గూన పెంకును నున్నపరచటానికి కుమ్మర్లు వాడే పల్చని కొయ్య ముక్క. **గూనబాన** వి. గూడబాన, మూతి వెడల్పు అడుగు గుం[డంగా ఉండే మట్టిపాత్ర. **గూనమన్ను** రూ. గూలం మన్ను. వి. పెంకులు మొదలైనవి చేయడానికి ఉపయో గించే ఎ[రమన్ను. **గూనముంత** వి. మూరెడు పొడవుతో ముంతలాగా చేసిన మట్టిదిమ్మ. **గూనరాయి** వి. గూన పక్కల్లో సర్దేదానికి ఉపయోగించే పెద్దరాయి. **గూనరేకు** వి. గుం[డటిరేకు. **గూనలబావి** వి. వరలు వేసిన బావి. **గూన[రాయి** వి. గూనపక్కల్లో సర్దేదానికి ఉపయోగించే

పెద్దరాయి. గూనిల్లు రూ.చూ. కూనిల్లు. వి. కూనపెంకు కప్పిన ఇల్లు.

గూనిది చూ. గూను.

గూనిల్లు చూ. గూన.

గూనివాఁడు చూ. గూను.

గూను వి.ౘా. 1. వీపుమీద వంపుగా ఉన్న భాగం, నడుం మీది వంపు. ఉ.హరి. 2.122 ; 2. కురుచదనం.

క. కూను. వంగు. ఉబ్బు. గూను ; కూన. గూన. గూనిమనిషి ; తు. గూను. ఉబ్బు ; త. కూన్. వంపు, వెనకవైపు వీపుమీద ఉన్న గూని, నత్త ; మ. కూని, కూనిచ్చి. అర్ధవలయాకారం.

గూనిది వి. గూనుకలది. గూనివాఁడు వి. గూనుగల వాడు. భార.అను. 5.104. గూనుగిలు రూ. గూనుగిల్లు. అ.క్రి. వంగు. శివరా. 2.21. గూనుగిల్లఁబడు అ.క్రి. వంగు, గూనుగలదగు. కాశీ. 6.175. గూనుగిల్లు రూ.చూ. గూను గిలు. అ.క్రి. 1. వంగు. నవనాథ. 5 వు. 2392 పం. ; 2. గూనుకలుగు. గూనుపోవు(-పోవు) అ.క్రి. గూనుకలదగు. వరాహ. 10.15.

గూపవాలగుల్ల వి.బ.వ. చిన్న పిల్లలు ఆడుకొనే ఒకరకం ఆట. విష్ణువు. 7.211.

సం. గూహన-. దాగటం.

గూపము రూ.చూ. గూబము. వి. గుంజు, గుజ్జు.

గూపెట్టు స.క్రి. పోగుచేయు.

గూబ¹ వి. 1. గోడలో బిగించే దర్వాజా కమ్మి ; 2. ఏతపు బొక్కెన పైవైపున అడ్డచీల దూర్చడానికున్న రింగు.

గూబదూరుడు వి. చెక్కలోని నన్నటి చిల్లి, చిల్లులు పడిన భాగం. గూబవేలుగు వి. దంతెగుజ్జులను దాటి పక్కలకు వచ్చిన ఇనప పలుగు. గూబపొక్క వి. గోడలో పెట్టిన రంధ్రం, చువ్వలులేని కిటికీ.

గూబ² వి. కర్ణమూలం. రామాభ్యు. 8.148.

గూబబావిలీలు రూ. గూబ్బాలీలు. వి.బ.వ. స్త్రీల కర్ణ భూషణం, గూబ్బలీలు. గూబలదరఁగొట్టు స.క్రి. బెదిరించు, దండించు. <గూబ + -లు + అదరు + -అ⁷ + కొట్టు. గూబలవల్లివసూలుచేయు స.క్రి. బలాత్కారంగా వసూలుచేయు, చెవినులిపివసూలుచేయు. గూబలోఁ బురుగు (-పురుగు) వి. నిరంతరం పోరేది.

గూబ³ రూ. గూబి. వి. 1. గుడ్లగూబ. ఉ.హరి. 2.24 ; 2. ఒకరకం తిట్టు.

క. గూగె, గూగి, గూబె. గుడ్లగూబ ; గూగె, గుమ్మె ; త. కూకై ; మ. కూమన్ ; కోట. గుమ్న్ ; కోలా. గుప.

పో.చూ. సం. ఘూక- ; ప్రా. ఘూఅ.

గూబకండ్లు వి.బ.వ. భయంకరమైన, వికారమైన కళ్ళు. గూబజంకెన వి. గూబబెదిరింపు వంటి బెదిరింపు, వ్యర్థమైన బెదిరింపు. ద్వి. హరిశ్చ. ఉ. 768 పం. గూబజంకెలు వి.బ.వ. వట్టి బెదిరింపులు. నిరంకు. 3.

గూబతర రూ. గుబదార, గుబదార, గూబదర్ద. వి. వంట చెరకుకు, బెరడు పీచు తీయడానికి ఉపయోగపడే ఒక చెట్టు. ఆం.భా. 2.56 (Helicteres isora).

గూబతర వి. తరచెట్టు, అందంగా ఉండే ఒక చెట్టు (Pterospermum heyuednum).

గూబదర్ద రూ.చూ. గూబతర. వి. వంటచెరకుకు, బెరడు పీచు తీయడానికి ఉపయోగపడే ఒకచెట్టు (Helicteres isora).

గూబదొక్కు అ.క్రి. గువ్వకూర్చుండు. <గూబ³ + త్రొక్కు.

గూబము రూ. గూపము, గూవము. వి. గుంజు, గూపం.

గూబరి వి. మాదిగవాడు. ఆం.భా. 2.289.

గూబాకు వి. ఒకరకం పొగాకు.

గూబి రూ.చూ. గూబ³. వి. గుడ్లగూబ.

గూబిగర్ద రూ.చూ. గుబ్బిగడ్డ. వి. గబ్బిగడ్డ, సారెనులువుగా తిరగడానికి భూమిలో పాతిన మట్టిదిమ్మ.

గూబిరాయి రూ చూ. గుబ్బిరాయి. వి. సారెమొలను దించ డానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్నరాయి, కనికి రాయి.

గూబు వి. అశ్వ విశేషం. ఆం.భా. 2.196.

గూబ్బాలీలు రూ.చూ. గూబబావిలీలు. వి.బ.వ. గూబబావి లీలు.

గూము¹ వి. ఆభరణం.

గూము² వి. అయిదారు చెరకుగడల పొది.

గూరాయి వి. సారెమొలను దించడానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రమున్న రాయి.

గూరు వి. చాల కాలంగా ఉండే దగ్గు.

గూలంమన్ను రూ.చూ. గూనమన్ను. వి. పెంకులు మొద లైనవి చేయటానికి ఉపయోగించే ఎర్రమన్ను.

గూలుదిబ్బ వి. నిలువున ఉన్న ఇటుకరాళ్ళ గుట్ట.

గూళి¹ వి. 1. ఆంబోతు ; 2. బలిసిన కుర్రాడు.

గూళికర్ర వి. ఆపతెద్దు. గూళియెద్దు (-ఎద్దు) వి. దేవర పేర వదిలిన ఆబోతు.

గూళి² వి. చేపలుపట్టే సాధనం.

గూళి³ రూ. గూళీ. వి. పెద్ద గద్ద.

సం. గృధ్ర-. గద్ద.

త. కూళి. ఒకరకం గద్ద.

గూళీ రూ.చూ. గూళి³. వి. పెద్ద గద్ద.

గూళ్ళతడికె చూ. గూఁడు.

గూళ్ళతెగులు చూ. గూఁడు.

గూళ్ళముగ్గు చూ. గూఁడు.

గూళ్ళాపిడలు చూ. గూఁడు.

గూళ్ళు చూ. గూఁడు.

గూళ్ళువడు (-పడు) చూ. గూఁడు.

గూవాలు వి.బ.వ. బాలక్రీడా విశేషం. విష్ణువు. 7.202.

గూవము రూ.చూ. గూబము. వి. గుజ్జు, గూపం.

గూవు వి. చెక్కలో పుచ్చిన చచ్చుభాగం.

గూవ¹ వి. దెబ్బ.

గూవ² వి. 1. ఆబోతు ; 2. బలిసినవాడు.

గృహస్థు రూ.చూ. గృహస్థుఁడు. వి. ఇంటి యజమాని.

గృహస్థుఁడు రూ. గృహస్థు. వి. యజమాని, ఇంటి సొంతదారు.

సం. గృహస్థ-. గృహస్థాశ్రమంలోనివాడు.

<సం. గృహస్థ- (అర్థవిపరి.).

గెగ్గలు రూ. గెగ్గిలి. వి. గేలి, పరిహాసం.

త. కెక్కటుమ్. పెద్దగా నవ్వేవాడు; కెక్కలి. పెద్దగా నవ్వు. పెద్దగా నవ్వేవారు; తొద. వెక్. చిరునవ్వు.

గెగ్గిలి రూ.చూ. గెగ్గలు. వి. గేలి, పరిహాసం.

గెగ్గెలు వి.బ.వ. గడ్డలు.

గెంగమ్మ చూ. గంగమ్మ. వి. 1. దూము, కలరా; 2. గంగమ్మ.

గెంగెట రూ.చూ. కెంగట. వి. తాటి టెంక.

గెచ్చ రూ.చూ. గ్రచ్చ. వి. గచ్చ, యక్షాక్షి.

గెచ్చచెట్టు వి. వృక్ష విశేషం (Caesalpinia bonducella).

గెచ్చియ రూ.చూ. గెచ్చె. వి. ఒక జాతి చేప.

గెచ్చు వి. పొడవుగా పెరిగినవాడు.

గెచ్చె రూ. గెచ్చియ, గెజ్జె. వి. మత్స్య విశేషం. హంస. 4.187.

గెజ్జిలు వి.బ.వ. మట్టి పాత్రలకు పెట్టిన గజ్జెల ఆకారం డిజైన్లు.

గెజ్జె రూ.చూ. గెచ్చె. వి. ఒక రకం చేప.

గెంజాయి రూ.చూ. గంజాయి. వి. ఒకరకం మత్తు పదార్థం.

గెంజి రూ.చూ. గంజి[1]. వి. కలి, వార్పు.

గెంజిమూకుడు రూ.చూ. గంజిమూకుడు. వి. సగ భాగం వరకు రంధ్రాలుండి గంజి వార్చుకు వాడే రెండంచుల్తో ఉండే మట్టి మూకుడు.

గెంజిరిగడ్డ వి. కేరెట్, ఒక రకం దుంప.

గెటిక రూ.చూ. గిట్ట[1]. వి. గుర్రం డెక్క.

గెట్ట రూ.చూ. గిట్ట[1]. వి. గుర్రపు డెక్క.

గెట్టికల్ల వి. ఆము కాల్పులో వాడే ఎండిన బొంద (చెట్టు).

గెట్టిచ్చునలప రూ.చూ. గెట్టించునలప. వి. ఆరే పదును పాత్రల మీద నునుపు గట్టిదనం రావడానికి నర్సే నలప.

గెట్టించు రూ.చూ. గట్టించు. స.క్రి. 1. గట్టనచేయు; 2. కుండ రూపాల్ని తీర్చిన తర్వాత గట్టిగా, నున్నగా రావటానికి మూడోసారి నునుపు నలపతో కొట్టు.

గెట్టించుడునలప రూ.చూ. గెట్టించునలప. వి. ఆరు పదును పాత్రల మీద నునుపు, గట్టిదనం రావడానికి నర్సే నలప. గెట్టించునలప రూ. గెట్టిచ్చునలప, గెట్టించుడు నలప. వి. ఆరే పదును పాత్రల మీద నునుపు, గట్టిదనం రావడానికి నర్సే నలప.

గెట్టింపుచేయు స.క్రి. కుండ రూపాన్ని తీర్చిన తర్వాత గట్టిగా, నున్నగా రావటానికి మూడోసారి నునుపు నలపతో కొట్టు.

గెట్టింపునలవ చూ. గెట్టించునలప. వి. ఆరే పదును పాత్రల మీద నునుపు గట్టిదనం రావడానికి నర్సే నలప.

గెట్టె రూ.చూ. గిట్ట[1]. వి. గుర్రపు డెక్క.

గెట్నునలప రూ. గట్నునలప, గట్నేనలప. వి. ఆరే పదును పాత్రల మీద నునుపు, గట్టిదనం రావడానికి నర్సే నలప.

గెట్నాలుచేయు స.క్రి. గట్టనచేయు.

గెట్లించు స.క్రి. గెంటించు.

గెట్నేనలప వి. ఆరే పదును పాత్రల మీద నునుపు, గట్టిదనం రావడానికి నర్సే నలప.

గెద[1] వి. 1. కడ, సమీపం, పార్శ్వం. కు. సం. 3.14; 2. జత. భార. ఉద్యో. 4.125; 3. పోలిక, పగిది. కావ్యా. చూ. 5.16; 4. చెలిమి, స్నేహం.

గెదకత్తియ[1] రూ. గెదకత్తె[1]. వి. చెలికత్తె, స్నేహితురాలు. కు.సం. 9.108. గెదకత్తె[1] రూ.చూ. గెదకత్తియ[1]. వి. చెలికత్తె. గెదగూడిపొరు అ.క్రి. పరిగెత్తు. బోజ. 7.42. గెదగూడు (-కూడు) అ. క్రి. 1. రతిలో కలియు, జతగూడు. భార. విరా. 3.12; 2. వెంటబడు, వెన్నంటు. గెదసేయు (-చేయు) స.క్రి. కలుపు, కూర్చు. ఉ.హరి. 5.13.

గెద[2] వి. 1. వేల సాధన విశేషం. భల్లా. 3; 2. నిడుపాటి కోల; 3. కంబం; 4. వెదురు; 5. ఒడ కంబం.

గెదకత్తియ[2] రూ. గెదకత్తె[2]. వి. దొమ్మరిసాని, గెద మీద ఆడే స్త్రీ. గెదకత్తె[2] రూ.చూ. గెదకత్తియ[2]. వి. దొమ్మరిసాని. గెదసాని వి. గెదకత్తె, దొమ్మరిసాని.

గెదంచి రూ. గెదంచు. వి. సిపాయి పీట.

గెదంచు రూ.చూ. గెదంచి. వి. గదమంచి, గదవంచి, గాదె కింద ఉండే పెద్ద పీట.

గెదవేయు స.క్రి. కూర్చు, కలుపు.

గెదపు స.క్రి. కింద పడవేయు. వి. కింద పడవేయటం.

గెదపులాట వి. పోట్లాట. <గెదపు+-లు+ఆట.

గెదపులాడు అ.క్రి. పోట్లాడు. <గెదపు+-లు+ఆడు.

గెదయు రూ.చూ. కెదయు. అ.క్రి. చచ్చు.

గెది వి. కుండ.

గెదిగ రూ. గెదిగె. వి. 1. కుండ; 2. చిన్న మూతి ఉన్న పంటి కంటె చిన్న కుండ.

గెదిగె రూ.చూ. గెదిగ. వి. 1. కుండ; 2. చిన్న మూతి ఉన్న పంటి కంటె చిన్న కుండ.

గెదితేరుదాక వి. కొద్దిగా కూర వండుకోడానికి వాడే చిన్న మట్టి పాత్ర.

గెదుము స.క్రి. గెంటివేయు, పారదోలు.

గెదెం రూ.చూ. గెరెము. వి. సేద్యపు సామగ్రి.

గెదెము రూ.చూ. గెరెము. వి. సేద్యపు సామగ్రి.

గెడ్డ రూ.చూ. గడ్డ[1]. వి. మట్టిగడ్డ.

గెడ్డమట్టి వి. కుండల తయారీకి చెరువులో తవ్వి తెచ్చిన ఎండిన మట్టి పెళ్ళలు.

గెడ్డజొన్న రూ.చూ. గిడ్డజొన్న. వి. చిరుజొన్న.

గెడ్డము రూ.చూ. గడ్డము. వి. గడ్డం, చిబుకం.

గెడ్డముంత వి. నీళ్ళు ముంచి పోసుకోడానికి వాడే చిన్న ముంత.

గెడ్డంపుల్ల వి. అచ్చు కట్టేటప్పుడు, పన్నె గూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల.

గెణ వి. రెక్కలు తెరచుకోడానికి మూసుకోడానికి వీలుగా కమ్ములకు పట్టి ఉంచే పరికరం.

గెణుసు(గడ్డ) రూ.చూ. గెనుసు(గడ్డ) వి. కందగడ్డ, రామ కంద, రత్నపురిగడ్డ, చిలగడదుంప, తెల్లదుంప.

గెణెము రూ.చూ. గనిమ. వి. పొలంగట్టు.

గెంటరి చూ. గెంటు.

గెంటనమాడు చూ. గెంటనము.

**గెంటసము** వి. 1. పరుష వచనం, నిష్ఠురోక్తి, కట్టెవిరుపుమాట. భోజ. 6.330; 2. స్థలితోక్తి. ఆం.భా. 1.117; విశే. తీక్ష్ణమైన, వాడి అయిన. వైజ. 1.118.

గెంటసమాడు స.క్రి. హాస్యమాడు, న్యూనత పరుస్తూ మాట్లాడు. పాండు. 3.193.

**గెంటించు** చూ. గెంటు.

**గెంటివేయు** చూ. గెంటు.

**గెంటు** స.క్రి. 1. (అస్త్రం) ప్రయోగించు. జైమినీభా. 5.11; 2. (అప్పు మొ.) తీర్చు. ద్వి.హరిశ్చ. ఉ. 1477; 3. జయించు. ఉ.రా. 1.30; 4. తోయు, నెట్టు; వి. చలనం, కదలిక. కళా. 3.4; అ.క్రి. 1. చలించు, కదులు, తొలగు. జైమినీభా. 8.96; 2. తప్పిపోవు, తప్పు. వరాహ. 12.14; 3. చెడు, భగ్నమగు. కళా. 3.257; 4. కడచు. విష్ణుపు. 6.147; 5. వెనుదీయు, సంకోచించు. ద్వి. హరిశ్చ. పూ 300 పం.

క. గెంటు. దూరం, దూరంగా తొలగించింది.

గెంటరి వి. వీరుడు. పి.శకుం. 3.225. <గెంటు+-అరి. **గెంటించు** స.క్రి. 1. చలింపజేయు, కదల్చు (మెడ పట్టి) తోయించు. కాశీ. 4.221; 2. కొట్టు, పడగొట్టు. భాగ. 1.359; 3. తొలగించు. భాగ. 8.223; 4. పాడుచేయు, నాశంచేయు. భాగ. 10. ఉ. 887; 5. ఓడించు. సిం.ద్వా. 5.133; 6. సాధనాలచే పడగొట్టు; 7. నాటిపెట్టిన గూటం మొ. వాటికి పెరకటానికి అటూ ఇటూ సెరిమి చెందడిచేయు. **గెంటివేయు** స.క్రి. తోయు. **గెంటుగుంటునులేక** రూ. గెంటుగొంటునులేక. అవ్య. నవురుగా, నవురుగా. **గెంటుగొంటు** అ.క్రి. చెక్కు చెదరు. **గెంటుగొంటునులేక** రూ.చూ. గెంటుగుంటునులేక. అవ్య. నవురుగా, నవురుగా. **గెంటుట** వి. తోపుడు. **గెంటువడు** రూ.చూ. గెంటువడు. అ.క్రి. 1. పోవు; 2. తప్పిపోవు. **గెంటువడు** రూ. గెంటుపడు. అ.క్రి. 1. తప్పిపోవు. జైమినీభా. 3.100; 2. పోవు.

**గెంటె** వి. చలికి రెండు చంకల కిందుగా మాడివేసి కట్టే ఉత్తరీయపు కట్టు, ఏటకట్టు.

**గెంటెన** వి. తెల్లదంతిన, పెద్దదంతిన, వృక్ష విశేషం.

**గెంటెపుబోరము** చూ. గెంటెము.

**గెంటెము** రూ. గింటెము విశే. 1. అధికమైన. మను. 5.14; 2. రెట్టింపైన; 3. దట్టమైన. వి. జంట నేత వస్త్రం. మను. 6.102.

క. గింటు. జమిలిపోగు నేతబట్ట, గింటం; త. కింటన్. ఒక విధమైన గుడ్డ, గింటం; మ. కింటమ్. జమిలిపోగు నేతబట్ట.

గెంటెపుబోరము వి. జమిలి నేత వస్త్రంతో చేసిన దూది మొ. వాటిని మూట కట్టడానికి ఉపయోగించే సంచి. హంస. 5.97.

**గెంట్లము** వి. గుడ్డు, అండం.

**గెండ** రూ.చూ. గండె[1]. వి. 1. గండకం; 2. గండు చేప; 3. పౌరుషం.

**గెండి**[1] రూ.చూ. గండె[1]. వి. వెడల్పుగా ఉండే మంచి నీటి చేప.

**గెండి**[2] వి. గోడ కట్టేటప్పుడు రాళ్ళ మధ్య వచ్చే సందు.

**గెండియ** రూ.చూ. గండె[1]. వి. ఒక రకం చేప.

**గెండిరాయి** రూ.చూ. గేడిరాయి. వి. 1. నిలువుగా ఉంచిన పొడుగాటి రాయి; 2. గొడ్ల కొట్టాల్లో నిలువుగా పాతిన పొడుగాటి రాయి.

**గెండె** రూ.చూ. గండె[1]. వి. మత్స్య విశేషం. సిం.ద్వా. 1.240.

**గెండ్లిమూకటి** రూ.చూ. గండ్లమూకటి. వి. జల్లిమూకుడు.

**గెండ్లుమూకటి** రూ.చూ. గండ్లమూకటి. వి. జల్లిమూకుడు.

**గెత్తం** రూ.చూ. గత్తము. వి. 1. ఎరువు; 2. అయిదారడుగుల లోతున్న గుంటలో కుళ్ళబెట్టిన పశువుల పేడ.

గెత్తంపోగు వి. ఎరువుపోగు.

**గెత్తము** రూ.చూ. గత్తము. వి. ఎరువు, పెంట.

**గెత్తిర** వి. చవిటినేల, పంటకు పనికిరాని భూమి.

**గెదుము** రూ.చూ. గదుము. స.క్రి. అదుము, గద్దించు. సీతావి. 1.103.

**గెద్ద** రూ.చూ. గ్రద్ద. వి. గృధ్రం.

గెద్దగోడి రూ.చూ. గద్దగోడి. వి. ఒక రకం కలుపు మొక్క. గెద్దగోరు[1] రూ.చూ. గద్దగోరు. వి. చిన్న గొళ్ళెం. గెద్దబొల్లి రూ.చూ. గద్దబొల్లి. వి. ఒక రకం బొల్లి.

**గెద్దగోరు**[2] వి. నల్ల ఉప్పి, వృక్ష విశేషం.

**గెన** వి. గెత.

**గెనయు** అ.క్రి. 1. వర్ధిల్లు, పెంపొందు. విష్ణుపు. 2.98; 2. తృప్తిపడు.

**గెనసు (గడ్డ)** రూ.చూ. గెనుసు (గడ్డ). వి. చిలకడదుంప, తియ్యదుంప.

**గెనికెపురుగు** రూ.చూ. గనికెపురుగు. వి. జొన్న, చెరుకు మొ. వాటిని డొల్లచేసే పురుగు.

**గెనిశెగడ్డ** వి. తెల్లదుంప.

**గెనిసె(గడ్డ)** రూ.చూ. గెనుసు(గడ్డ). వి. చిలకడ దుంప, తియ్య కంద.

**గెనుసు(గడ్డ)** రూ. గణుసు(గడ్డ), గనుసు(గడ్డ), గెణుసు(గడ్డ), గెనసు(గడ్డ), గెనిసె(గడ్డ). వి. చిలకడదుంప. బహులా. 4.15 (Dioscorea aculeata).

క. గెణసు, గెణిసు, గెణసు; తు. కెకెంగు; త. కిళంకు; మ. కిళన్ను.

<క. గెణసు.

గెనుసుదుంప వి. చిలగడ దుంప.

**గెనెమన్ను** వి. నేలను తవ్వి తెచ్చిన మన్ను.

**గెంతు** రూ.చూ. గంతు[2]. అ.క్రి. దుముకు.

**గెందిరి** వి. అనూయాపరుడు, ఉడుకుబోతు.

**గెపితి** రూ.చూ. గెప్తి. వి. 1. గుర్తు; 2. బుద్ధి.

**గెప్తి** రూ. గెపితి. వి. 1. గుర్తు; 2. బుద్ధి.

సం. జ్ఞప్తి-. జ్ఞాపకం.

<సంజ్ఞప్తి-.

**గెబ్బు**[1] స.క్రి. 1. చంపు. ఉ.రా. 7.391; 2. గెంటు. విజయ 1.84; 3. అపహరించు. విజయ. 1.150; 4. గ్రహించు.

**గెబ్బు**[2] రూ.చూ. గబ్బు. వి. **1.** గర్వం. ఆం.బా. **1.133 ; 2.** మత్తు.
**గెమిడి** రూ.చూ. గమిడి. వి. సరిహద్దు, ఊరు చుట్టూ ఉన్న సరిహద్దు.
**గెర** వి. గొల, గెల.
**గెరగట్టుకొను (-కట్టుకొను)** అ.క్రి. కుదురు కట్టుకొను. రాధికా. 7.53.
**గెరచెక్క** వి. ఒడ్డె బండి చక్రానికి ఇరువైపుల అమర్చిన కొయ్య పలక.
**గెరబువ్వకుండ** వి. అన్నం వండుకొనే మట్టి పాత్ర.
**గెరవయ్య** రూ.చూ. గొరవయ్య. వి. **1.** శైవ భక్తుడు ; **2.** యాచకుడు.
**గెరవాటు** రూ.చూ. గిరవాటు. వి. విసిరివాటు.
**గెరసట్టి** వి. అంచు మీద గీతలుండే చిన్న మట్టి పాత్ర.
**గెరాంచి** వి. **1.** పొలం చేసే రైతు భూకామందుకు డబ్బుగాని, పంటగాని ఇంత ఇచ్చేట్టు అని ముందుగా చేసుకొనే ఒప్పందం, కౌలు ; **2.** కౌలు చేసే భూమి.
**గెరి**[1] రూ.చూ. గిఱ్ఱు. వి. **1.** గీత ; **2.** పాత్రలపై అలంకారంగా గీసే గీత.
**గెరి**[2] వి. నీటిని సులభంగా తోడడానికి వాడే చక్రం.
**గెరి**[3] రూ.చూ. గిరి[3]. వి. గెల.
**గెరికిబుడ్డి** రూ.చూ. గరిగెబుడ్డి. వి. అరివేణి లేకుండా పెళ్ళి చేసే వాళ్ళు వాడే మట్టి పాత్ర.
**గెరికెదాత** వి. ఆము చుట్టూ లెవెల్‌గా పేర్చిన కుండల వరస.
**గెరిక్కుంరి** వి. అరివేణి లేకుండా పెండ్లి చేసే వాళ్ళు వాడే మట్టి పాత్ర.
**గెరిగిబుడ్డి** రూ.చూ. గరిగెబుడ్డి. వి. అరివేణి లేకుండా పెళ్ళి చేసే వాళ్ళు వాడే మట్టి పాత్ర.
**గెరువు** వి. వర్షాభావం.
**గెర్రంచు** వి. గీరలు పడేట్టు నేసిన ఒక రకం అంచు.
**గెర్రి** రూ.చూ. గిఱ్ఱు. వి. **1.** గీత ; **2.** పాత్రలపై అలంకారంగా వేసే గీత.
**గెర్రె**[1] రూ.చూ. గిఱ్ఱు. వి. **1.** అంచు దిగువగా కంఠం కింద ఉబ్బుపైన గోటితోగాని, రేకుతోగాని అలంకారంగా వేసే గీత ; **2.** గీటు, గీత.
**గెర్రె**[2] వి. మొరపగడ్డు నేల.
**గెఱ** రూ. కెఱ. వి. **1.** రేఖ. భాగ. 1.516 ; **2.** ఆకారం, రూపం. పల్నా. 3.18 ; **3.** గిరి. హంస. 3.216 ; **4.** సున్న ; **5.** రూపు.
క. గెఱ. రేఖ ; తు. గెరె.
**గెఱకట్టు** అ.క్రి. ఆకృతి కలుగు, రూపేర్పడు. నరస. 5.113. **గెఱగొను (-కొను)** అ.క్రి. రూపమందు. ఉ.హరి. 1.151. **గెఱవ్రాయు** స.క్రి. హద్దు నేర్పరచు, గిరిగీయు.
**గెఱాయించు** స.క్రి. చుట్టుగొను.
హిం. గిరా(నా). పడకొట్టు.
**గెల** రూ. గొల. వి. **1.** పళ్ళగెల. ఆము. 1.69 ; **2.** పూవుల యొక్క గొల. చంద్రాంగ. 2.68 ; **3.** అరటి, తాటి, అలచంద, పెసర మొ. వాటి కాయల గుది.
త. కులై. గెల.
**గెలచిక్కుడు** వి. గోరుచిక్కుడు. **గెలవాసం** వి. ఒక దాని కొకటి తగిలించిన వాసాల జంట.
**గెలిడిపెండెం** వి. దర్వాజాలాగా నిలిపిన గెలిడి రాతికి అడ్డుగా పెట్టిన కర్ర.
**గెలిడిరాయి** వి. కంచె తలుపులను నిలపడానికి వీలుగా గుంట గాని, చిల్లిగాని ఏర్పాటు చేయబడిన రాయి.
**గెలిపించు** చూ. గెలుచు.
**గెలివి** రూ. గెలివిడి, గెల్వి, గెల్విడి. వి. **1.** సంతోషం, ఉల్లాసం. చంద్రాంగ. 4.154 ; **2.** సౌందర్యం ; **3.** పూనిక ; **4.** ఓర్పు.
**గెలివికాఁడు** రూ. గెల్వికాఁడు. వి. **1.** సౌందర్యవంతుడు ; **2.** సంతోషంతో గోల చేసే వాడు. **గెలివివాఁడు** వి. సంతోషంతో గోల చేసే వాడు. ఆం.బా. 3.12.
**గెలివిడి** రూ.చూ. గెలివి. వి. **1.** సంతోషం ; **2.** పూనిక ; **3.** ఓర్పు.
**గెలీఫ** చూ. గలీబు[1]. వి. ఒర.
**గెలీఫుకత్తులు** వి.బ.వ. ఒరలో ఉన్న కత్తులు.
**గెలుచు** రూ. గెల్చు. స.క్రి. **1.** జయించు, నిగ్రహించు. భార. ఉద్యో. 4.146 ; **2.** కడపు, పుచ్చు. భోజ. 7.207 ; **3.** పోగొట్టు. జాహ్న. 3.77 ; అ.క్రి. **1.** పోవు, వెళ్ళు. రామాభ్యు. 6.198 ; **2.** జయంపొందు.
క. గెలిసు, గెల్లిసు, గెలుగె, గెలులికె, గెల్లులికె, గెలవటం ; కొడ. గెల్ల్-. (గెల్లువ్-) గెలుచు ; తు. గెలిపుని, గెల్పుని, గెన్దుని. గెలుచు ; త. కెలిప్పు గెలవటం, జయం ; కోట. గెల్. గెలుచు ; గెల్వ్-(గెల్వ్) గెలిచిఏదైనప్రతిఫలంపొందు ; తొ. కెల్వ్ ; కువి. గెల్లినై ; కొలా. గెల్ల్ ; నా. ఖెల్.
<మూ.ద్రా. *కెల్.
**గెలిపించు** రూ.చూ. గెల్పించు. స.క్రి. జయింపజేయు. శుక. 3.42. <గెలుచు+-ఇంచు[3].
**గెలుపము** రూ.చూ. గెలుపు. వి. జయం.
**గెలువరి** చూ. గెలుపు.
**గెలుపు** చూ. గెలుచు. రూ. గెలుపము, గెల్పు. వి. జయం. భార.ఉద్యో. 3.340.
**గెలువరి** రూ.చూ. గెల్పరి. వి. గెల్పుకాడు. విజేత. **గెలుపుకాఁడు** రూ. గెల్పుకాఁడు. వి. జేత, జయించేవాడు. అచ్చ.రా. యు. 152. **గెలుపుకొను** రూ. గెల్పుకొను. స.క్రి. గెలుచు, జయించు. విక్ర. 6.26. **గెలుపుఁగంబము (-కంబము)** రూ. గెల్పుఁగంబము. వి. జయస్తంభం. వరాహ. 1.20. **గెలుపుపేరుగలాఁడు** రూ. గెల్పుపేరుగలాఁడు. వి. అర్జునుడు. పాంచా. దేవ. 16. **గెలుపుపేరువజీరు** రూ. గెల్పుపేరువజీరు. వి. అర్జునుడు. విజయుడు. ప్రబంధ. 160. **గెలుపుబానయొడయఁడు (-ఒడయఁడు)** రూ. గెల్పుబానయొడయఁడు. వి. విజయుడు, అర్జునుడు. వేంక. ఆం. దేవ. 21. **గెలుపులచ్చి** రూ. గెల్పులచ్చి. వి. జయలక్ష్మి. ప్రబంధ. 142. **గెలుపుసిరి** రూ. గెల్పుసిరి. వి. జయలక్ష్మి. యయా. 1.66. **గెలుపోటములు** వి.బ.వ. జయాపజయాలు.

పి.శకు. 1.164. <గెలుపు + ఓటమి + - లు.

**గెలుపోటములు** చూ. గెలుపు.

**గెలువడి** చూ. గెలుచు. వి. జయం, గెలుపు. ఆం.భా. 2.223.

**గెలువము** చూ. గెలుచు. వి. గెలుపు. కకుత్థ్స. 1.187.

**గెలెము** రూ.చూ. గెళెము. వి. వ్యవసాయంలో ఉపయోగించే పనిముట్టు.

**గెల్చు** రూ.చూ. గెలుచు. స.క్రి. జయించు, నిగ్రహించు. శృం.నై. 1.2 ; అ.క్రి. జయాన్ని పొందు, సర్వోత్కర్షంతో వర్తిల్లు. కకుత్థ్స. 4.35.

**గెల్పరి** చూ. గెల్పు.

**గెల్పించు** చూ. గెల్పు.

**గెల్పు** రూ.చూ. గెలుపు. వి. జయం. ఆం.భా. 2.223.

**గెల్పరి** రూ. గెలుపరి. వి. గెల్చేవాడు, జేత. చెన్న బసవ. 2.158. **గెల్పించు** రూ. గెలిపించు. స. క్రి. జయింపజేయు. ప్రబో. 3.57. **గెల్పుకాఁడు** రూ.చూ. గెలుపుకాఁడు. వి. జయించేవాడు. **గెల్పుకొను** రూ.చూ. గెలుపుకొను. స.క్రి. జయించు. అచ్చ. రా. సుందర. 157. **గెల్పుఁగంబము (-కంబము)** రూ.చూ. గెలుపుఁగంబము. వి. జయ స్తంభం. **గెల్పుపేరుగలాఁడు** రూ.చూ. గెలుపుపేరుగలాఁడు. వి. అర్జునుడు. **గెల్పుపేరువజీరు** రూ.చూ. గెలుపుపేరువజీరు. వి. అర్జునుడు. **గెల్పుబానయొడయుఁడు (-ఒడయుఁడు)** రూ.చూ. గెలుపుబానయొడయుఁడు. వి. అర్జునుడు. **గెల్పులచ్చి** రూ.చూ. గెలుపులచ్చి. వి. జయలక్ష్మి. **గెల్పుసిరి** రూ.చూ. గెలుపుసిరి. వి. జయలక్ష్మి.

**గెల్ల** వి. పార్శ్వం, పక్క.

**గెల్లాడు** అ.క్రి. చలించు, కదులు. భాగ. 8.396.

**గెల్లి** వి. ఉప్పుకుప్ప.

**గెల్లిబతుంగ** వి. ఒకరకం తుంగ (Cyperus tenuiflorus).

**గెల్లు** రూ.చూ. గొల్లు. వి. 1. కలకలధ్వని, గొల్లు. ఆం.భా. 1.21 ; 2. చలనం, కదలిక.

**గెల్లువడు** రూ.చూ. గెల్లువడు. అ.క్రి. రంకెవేయు. **గెల్లువడు (-వడు)** రూ. గెల్లుపడు. అ.క్రి. రంకెవేయు, విజృంభించు. పద్మ. 7.238.

**గెల్వి** రూ.చూ. గెలివి. వి. సంతోషం.

**గెల్వికాఁడు** రూ.చూ. గెలివికాఁడు. వి. 1. సౌందర్యవంతుడు ; 2. సంతోషంతో గేలచేసేవాడు.

**గెల్విడి** రూ.చూ. గెలివి. వి. సంతోషం.

**గెళెం** రూ.చూ. గెళెము. వి. సాగుపనిముట్టు, పొలంలోదున్నే ఏదైనా ఒక పరికరం.

**గెళెము** రూ. గెడెం, గెడెము, గెలెము, గెళెం. వి. 1. వ్యవసాయపరిభాషలో కాడి ; 2. ఒకకాడెద్దులతో సేద్యంచేయ గల్గిన విస్తీర్ణమున్న సేద్యపునేల ; 3. కాడెద్దులు.

క. గెళె, కెళె. స్నేహం, స్నేహితం, స్నేహితురాలు లేక స్నేహితుడు ; త. కేళ్. స్నేహం.

<క. గెళె.

**గెళ్ళ** వి. (బ. వ. ?) రాతిముక్క.

**గేగు** వి. గజమెత్తు పెరిగినచెట్టు (తాటి, కొబ్బరి, అరటి మొ.)

**గేగులు**[1] రూ. చూ. గేంగులు. వి. బ. వ. తెగులు.

**గేగులు**[2] వి. బ. వ. తిగలు.

**గేంగులు** రూ. గేగులు[1] వి.బ.వ. తెగులు.

**గేజి** వి. ఆంగ్లంలోని 'A' అనే అక్షరం ఆకారంలో ఉండే కొయ్య పరికరం.

ఇం. *Gauge*. పరిమాణం, కొలత.

<ఇం. Gauge.

**గేటు** వి. 1. వీథి వాకిలి ; 2. ద్వారం.

ఇం. *Gate*. గేటు.

<ఇం. gate.

**గేటుకుండీ** వి. బంగళాల్లో గేటుగోడ మీద పెట్టే పూల కుండీ.

**గేడి**[1] రూ. గేడు[1], గోడి[1]. వి. మట్టిపాత్రకు నర్పేటప్పుడు ఆడుగు పైభాగంలో చుట్టూవెన్ను లాగనిలిపిన అంచు.

**గేడిచేయు** స. క్రి. ఇటుకలను నిలువునపేర్చు. **గేడిబందె** వి. 1. ద్వార బంధంనిలువు కమ్మికి, గోడకూ మధ్యలో బిగించినరాయి ; 2. దర్వాజాచట్రం కిందదేనుమెంటుపైన గడపగా వేసేరాయి. **గేడిరాయి** రూ. గెండిరాయి. వి. 1. నిలువుగా ఉంచిన పొడుగాటిరాయి ; 2. గొడ్ల కొట్టాల్లో నిలువున పాతిన పొడుగాటిరాయి. **గేడివల** వి. రాత్రిపూట చేపలవేటలో ఉపయోగించేవల.

**గేడి**[2] రూ. చూ. గోడు[2]. వి. 1. గొడిక, ఇటుకల్ని నిలువున పేర్చిన పేర్పు ; 2. నిలువుపక్క ; 3. ఉబ్బెత్తు.

**గేడికట్టు** వి. బండి ఆకుల మీద చెక్కడం.

**గేడికాళ్లవాఁడు** రూ. చూ. గేడెకాళ్లవాఁడు. విఅ. కొంగ కాళ్ళవాడు.

**గేడిగి** వి. చిన్నచట్టి.

**గేడించు** స. క్రి. 1. గెంటు ; 2. నిరసించు ; 3. తరుము.

**గేడియము** రూ. గేడెము. వి. నీళ్ళుతోడే తాటిదోనె.

**గేడు**[1] రూ. చూ. గేడి[1]. వి. రాతికూడంలో ఉబ్బెత్తుగా తీసింది.

**గేడు**[2] స.క్రి. నీళ్ళు చల్లి నున్న బరుచు, గట్టిగా అలుకు.

**గేడుకొయ్య** వి. మరమగ్గంసొరుగుకు మొదట బిగించినచెక్క.

**గేడుబిగువు** వి. బద్దను పైన ఎడంగా పెండెబిగించి ఈతమెల్లెల్తో చిక్కగా అల్లిగట్టిగా కట్టేబిగింపు.

**గేడెకాళ్లవాఁడు** రూ. గేడికాళ్లవాఁడు. వి. కొంగకాళ్ళవాడు, నన్నంగాను, పొడుగ్గాను ఉండేకాళ్ళవాడు.

**గేడెము** రూ.చూ. గేడియము. వి. నీళ్ళుతోడేతాటిదోనె.

**గేతు** వి. మిరత.

**గేదగితేవినాశించు** చూ. గేదఁగి. స.క్రి. నోరుతీపుచేయు, కాస్త తడిచేయు.

**గేదంగి** రూ.చూ. గేదఁగి. కేతకి, మొగిలి.

**గేదఁగి** రూ. గేదంగి. వి. 1. మొగిలిపూవు. వరాహ. 8.16 ; 2. మొగిలి. పారి. 2.38 ; 3. పచ్చపువ్వుల మొగలి. ద్వి.సా.చ. 2 వ. 79. పం. 19. (Pantanusodorati ssiunus).

సం. కేతక-, కేతకి ; ప్రా. కేఅగి.

క. కేదగె, కేదిగె, గేదగి ; తు. కెదై, కెదయి, కెదాయి ; త. కైతల్, కైతై ; మ. కైత.

<సం. కేతకి.

గేది రూ.చూ. గేదె. వి. ఎనుం, బఱ్ఱె.
గేదియ రూ.చూ. గేదె. వి. ఎనుం, బఱ్ఱె.
గేదిలి వి. వృక్ష విశేషం.
గేదిలికంప వి. ఆముకాల్వులో గేదిలిచెట్టుకంప.
గేదె రూ. గేది, గేదియ. వి. 1. బఱ్ఱె. మహిషి. ఆం. నా. నం. తిర్య. 10 ; 2. పొట్టిబఱ్ఱె. ఆం. భా. 2.264.
గేదెకాళ్ళు వి.బ.వ. కదురుకాళ్ళు, కొంగకాళ్ళు. గేదెచెలప వి. మూడేళ్ళగేదెదూడ. గేదెదూడ వి. ఏడాదిలోపు ఎనుం దూడ. గేదెదూలగొండి వి. ఒకరకం తీగ (Mucumatno purpurea). గేదెపడ్డ వి. సుమారుగా నాలుగేళ్ళ వయసు గల గేదెదూడ. గేదెపెయ్య. వి. సుమారుగా రెండేళ్ళ గేదె దూడ. గేదెపెయ్యేరు వి. ఒకానొకతీగ, చిన్నచిన్న గుత్తులుగా ఉండేపూలు, కాయలుకాస్తుంది. దీనికొమ్మల్ని తోలు కఱ్ఱలుగా ఉపయోగిస్తారు (Combreteem Ovalifolium). గేదెమండ వి. వృక్ష (లతా) విశేషం (Caropegiaeluoltri). గేదెర వి. ఒకరకం చెట్టు (Ceriops Condolleana). గేదెసుగందపాల వి. పలచని ఆకులుకలిగి పచ్చని పూలుపూసే ఒక తీగ (Cryptolepisclegans). గేదెసుగంది వి. సుగందపాల, ఒకరకం తీగ (Hemidesmus indicus).
గేనము వి. ప్రజ్ఞ.
సం. జ్ఞాన-. తెలివి.
<సం. జ్ఞాన-.
గేవాంకఱ్ఱ వి. వేలాడదీసిన పడుగుచుట్టూ దగ్గరకిగాని, దూరానికిగాని, జరుపుకోడానికి వీలుగా మగ్గానికి పైన కట్టినకఱ్ఱ.
గేవాంతాడు వి. పడుగుచుట్టుకు రెండువైపులాకట్టి మగ్గానికి పైన కొన్నిచోట్ల, రాయబారపుకఱ్ఱకు వేలాడతీసినతాడు.
గేబిలికట్టుడు వి. దూలాల పైభాగాన కట్టినగోడ.
గేబు వి. తీగ.
గేబుల్ (గోడ) వి. చుట్టుగోడల మీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు కట్టిన పక్కగోడ.
ఇం. *Gable.* వాలిన ఇంటికప్పులమధ్య ముక్కోణాకృతిలో ఉన్నబయటిగోడ.
<ఇం. Gable.
గేర వి. 1. బండికుండలో బిగించిన ఆకుల్ని పట్టిఉండే గుండ్రటి కొయ్యచట్రం ; 2. నాగలితో దున్నిన రెండు చాళ్ళమధ్య కలవనిభాగం.
గేరకాళ్లు రూ.చూ. గారకాళ్లు వి.బ.వ. పొట్టేలు, మేక మొ. వాటి ముంగాళ్ళు.
గేరా చూ. గిరదా. వి. గిరజాలు.
గేరావేయు స.క్రి. గిరివేయు, చుట్టూముట్టడించు.
హిం. ఘేరా. పరిధి, ముట్టడింపబడినచోటు.
<హిం. ఘేరా+వేయు.
గేరి[1] వి. మూర్ఛ.
గేరి[2] వి. 1. వీథి, సందు. శుక. 3.15 ; 2. విశాలమైనచోటు.
క. కేరి. వీథి ; కొడ. కేరి. గ్రామం ; తు. కేరి. వీథి ; త. చేరి. పట్టణం, గ్రామం, వీథి, సందు మొ. ; మ. చేరి. గ్రామమార్గం ; కోట. కెర్వ్, కెర్. వీథి ; తా. బదగ. గ్రామంలోనివీథి.
గేరూబీరూ వి. పనికిరాని చెత్తాచెదారం.
గేలి వి. అపహాస్యం, పరిహాసం. భార. కల్య. 2.100.
సం. కేలి-. వినోదం, పరిహాసం.
క. గేలి. పరిహాసం ; తు. గేలి. నింద, పరిహాసం, వేళాకోళం ; త. కేలి, కేళి. తమాషా, పరిహాసం : మ కేళి. ఆట.
దేశ్యమని కిట్టెల్ అభిప్రాయం.
<సం. కేలి-.
గేలికొట్టు స.క్రి. పరిహసించు, అపహసించు. పాంచాలి. 2.52. గేలిగొను(-కొను) స.క్రి. గేలికొట్టు. భార. కల్య. 2.215. గేలిచేయు రూ.చూ. గేలిసేయు. స.క్రి.హాస్యంచేయు. ప్రభా. 5.69. గేలించు స.క్రి. అపహసించు, పరిహసించు. ద్వి. పరమ. 1. 15ప. 6పం. గేలిదు స.క్రి. ఎగతాళిచేయు. గేలిపెట్టు స.క్రి. పరిహసించు, వేళాకోళంచేయు. కవిక. 4.191. గేలియొనర్చు (-ఒనర్చు) స.క్రి. గేలిచేయు. భోజ. 4.14. గేలిసేయు (-చేయు) రూ. గేలిచేయు. స.క్రి గేలికొను. బసవ. 2.418పం.
గేవాసి వి. మగ్గం దగ్గరగోడలో పెట్టినకిటికీ.
గేసుమానె వి. కిరసనాయిలు, భూగర్భం నుంచితీసిన ఒకరకం నూనె.
ఇం. *Gas.* గాలి, బొగ్గునుంచి నిప్పున్నపై వేడిచేయటానికి పనికివచ్చేగాలి.
<ఇం. Gas+నూనె.
గేస్తు రూ. గేస్తుఁడు. వి. 1. గృహస్థుడు. దశా. 2.62 ; 2. యజ్వ, సోమయాజి ; 3. భర్త.
సం. *గృహస్థ-గేహస్థ-* ; అ. మా. *గిహత్థ* ; ప్రా. *ఘరత్థ-గిహత్థ* ; శౌ. ప్రా. *ఘరస్త* ; మరా. *గిరస్తు.* ఇంటివాడు.
క. *గిరస్త, గిస్త, గెరత్తె, గెరస్తి.*
<సం. గేహస్థ-. (అర్థవిపరి.).
గేస్తురాలు వి. 1. కులస్త్రీ. సా. చ. 3.46 ; 2. భార్య. అచ్చ.రా.అయో. 82. <గేస్తు+ఆలు.
గేస్తుఁడు రూ.చూ. గేస్తు. వి. 1. యజ్వ, సోమయాజి. అచ్చ. రా. బాల. 215 ; 2. భర్త. నీలా. 2.119 ; 3. గృహస్థుడు.
గేస్‌లైట్‌బుడ్డి వి. పొట్టిగా కురచగా గుండ్రంగా చుంచుబుడ్డి లాగాఉండే చిప్పబుడ్డి.
ఇం. *Gaslight.* వాయుకాంతి.
<ఇం. Gaslight+బుడ్డి.
గేస్‌లైటు వి. ఒకరకం లేతఎఱ్ఱకాంతి.
ఇం. *Gaslight.* వాయుకాంతి.
<ఇం. Gaslight.
గేస్‌లైటుచీర వి. ఒకరకం లేత ఎఱ్ఱరంగు చీర.
గై రూ. చూ. గైరు[2]. ప్రత్య. వ్యతిరేకార్థాన్ని తెలిపే ప్రత్యయం.
గైహాజరు రూ.చూ. గైర్‌హాజరు. వి. అప్రత్యక్షం.
గైకట్టి వి. ఏతపు బొక్కెన తగిలించే నిలువుగడ.
గైగడ్డ వి. పెండలం, నీటివనరున్న చోటగాని, మంచివానలు

పడేచోట గానిపెరిగే ఒక పైరు.
గైత వి. కిరాతభేదం, బోయవాడు. ప్రబంధ. 193.
గైబత్తు వి. హజారులో కాక బయట.
గైబు విఱ. కానరపోయిన.
గైరంగము వి. 1. ఉమ్మకావు, చెట్ల రెండోకాపు, కారుపంట ; 2. అకాలం.
గైరంగామీ వి. అనావృష్టి.
గైరమ్మ రూ.చూ. గయిరమ్మ. వి. గవరమ్మ. గ్రామదేవత, గౌరి.
గైరాదా చూ. గైరు[2].
గైరాన్ వి. పోరంబోకు, గవర్నమెంటు ఆధీనంలోఉన్న భూమి.
గైరు[1] రూ.చూ. గయిరి. విఱ. మిన్న అయిన.
గైరు[2] రూ.గై. ప్రత్య. 1. ఇతరమైన ; 2. వ్యతిరేకార్థాన్ని తెలిపే ప్రత్యయం.
ఉ. గైర్. వ్యతిరేకార్థాన్ని తెలిపే ప్రత్యయం.
<ఉ. గైర్.
గైరాదా రూ. గైరుఆదా. విఱ. 1. ఖాళీగాఉండే ; 2. బాకీగా ఉండే. హిం.ఉ. అదా. బాకీ లేకుండటం<ఉ. గైర్ అదా. గైరుఆదా రూ.చూ. గైరాదా. వి. ఎక్కువ వసూలు. గైరుమంజూరు వి. అంగీకరించబడినది. హిం. ఉ. మంజూర్. అంగీకారం.<ఉ. గైర్‌మంజూర్. గైరువాజిబి విఱ. సమర్థించరాని, న్యాయంకాని. హిం.ఉ. గైర్ వాజిబ్. అయోగ్యమైన, అనుచితమైన. < ఉ. గైర్ వాజిబ్. గైర్‌హాజరు రూ. గైహాజరు. వి. అప్రత్యక్షం. హిం. ఉ. గైర్ హాజిర్. అనుపస్థితి<ఉ. గైర్‌హాజిర్.
గైను రూ.చూ. గయిను. వి పొలం కంచెకు ఏర్పాటుచేసిన దారి.
–గొ రూ.చూ. –గో. ప్రత్య. నిర్దేశార్థంలో వచ్చే అంత్య ప్రత్యయం.
గొ చూ. గొట్టు. వి. గొప్పయొక్క సంక్షిప్తరూపం.
గొంల్పి రూ.చూ. గొండ్లి. వి. 1. కుండలాకారవృత్తం ; 2. శైలూషి, నర్తకి ; 3. నృత్యం ; 4. ఆట.
గొక్క వి. రాతిలోని మొనదేలిన భాగం.
గొగ్గకూర వి. సువాసననిచ్చే ఒకరకంచెట్టు (Pogostemon plectranthordes).
గొగ్గి రూ. కొక్కి[1]. విఱ. ఎచ్చుతగ్గులుకల. శృం.నై. 7.93 ; వి. 1. శిరస్త్రాణం, బొమిడికం. ఆం.భా. 2.204 ; 2. కొనగల ముత్తెం, ఎచ్చుతగ్గులున్న ముత్యం. ఆం.భా. 2.276.
గొగ్గిట వి. మూర్ఖత్వం ఆం.భా. 2.124 ; గొగ్గిపండ్లవాఁడు విఱ. హెచ్చుతగ్గు పళ్ళున్నవాడు. ఆం.భా. 2.121.
గొగ్గు రూ. గగ్గు[2]. వి. 1. రాతిలో ఎత్తుగాఉన్న భాగం ; 2. వంకర టింకర కొక్కి.
గొగ్గువదుము వి. నరిచేసేటప్పుడు పదుగులో అక్కడక్కడ ఆరని తడి. గొగ్గులువచ్చు అ.క్రి. పోగులు వత్తుగా వచ్చు.
గొంకిమ్రాను వి. ఒకదినుసు చెట్టు.
గొంకుమన్నుతగరు వి. ఒకానొక శస్త్రం.
గొంగ వి. 1. సంహారకుడు. నిర్వ. రా. 1.39 ; 2. శత్రువు. భాస్క.రా.సుందర. 170 ; 3. చావు.
గొంగడి రూ. గొంగలి, గొంగళి, గొంగోడి. వి. 1. గొంగళి, కంబళి. భాగ. 10 పూ. 437 ; 2. పక్షి విశేషం. హంస. 3.12.
క. గొంగడ-. కంబళి ;
మరా. ఘొంగడే.
గొంగడికాఁడు రూ.చూ. గొంగడిగాఁడు. వి. సీతాకోక చిలుక. గొంగడికోరు వి. గొంగడి నేసేటప్పుడు ముందు భాగం తడిపే పిడచ, ఉన్నిబట్ట. గొంగడిగాఁడు(-కాడు) రూ. గొంగడికాఁడు. వి. సీతాకోకచిలుక. చంద్రాంగ. 2.84. గొంగడిపురుగు రూ. గొంగళిపురుగు. వి. కంబళిపురుగు. గొంగడిబొంత వి. గొంగడినేతలో పదుగు తడపటానికి అంబలితో ముంచిన గొంగడిగుడ్డ.
గొంగరకోరి వి. నర్సేటప్పుడు కుండకు ఆధారంగా పెట్టుకొనే చినిగిన కంబడి.
గొంగలి రూ.చూ. గొంగడి. వి. రంగుతొట్టిలో, పింజెరమీద ఒత్తుగా కప్పిన ఉన్నిగుడ్డ, దీనిమీద రంగుపోసి కొయ్యఅచ్చుతో రంగు అద్దుతారు.
గొంగళి రూ.చూ. గొంగడి. వి. గొంగలి, కంబళి. పరమ వి. 4.6.
గొంగళిచిక్కుడు వి. శూకరపాదిక, ఒకరకం చిక్కుడు. గొంగళిపురుగు రూ.చూ. గొంగడిపురుగు. వి. కంబళిపురుగు. గొంగళ్ళునేయువాడు వి. కంబళ్ళను నేసేవాడు, అజాజీవుడు.
గొంగళ్ళునేయువాఁడు చూ. గొంగళి.
గొంగి వి. ఆకెరువుగా ఉపయోగపడే ఒకరకం మొక్క.
గొంగోడి రూ.చూ. గొంగడి. వి. కంబళి.
గొచ్చి వి. పచ్చని పూలుపూసే ఒకచెట్టు (Caesalpinia Bonduchella).
గొచ్చు వి. నారకట్ట.
గొచ్చెట్టు స.క్రి. ఏ వరసకు ఆ వరస డోరియాపెట్టి పెంకు పేర్చు.
గొచ్చెము వి. గుత్తి, సమూహం. ఆం.భా. 1.458.
సం. గుచ్ఛ-: ప్రా. గొచ్ఛ, గుచ్ఛ-.
<ప్రా. గొచ్ఛ-.
గొజ రూ.చూ. గొజ్జ. వి. ఇగిరిన పులుసుకూర.
గొజంగి రూ.చూ. గొజ్జఁగ. వి. పన్నీరు పూలచెట్టు. ఆం.భా. 2.52.
గొజ్జంగి రూ.చూ. గొజ్జఁగ. వి. 1. పన్నీరు పూలచెట్టు. బహుళా. 2.21 ; 2. గేదగి (Pandarrusodoratisimus).
గొజ్జంగినీరు రూ.చూ. గొజ్జెఁగనీరు. వి. పన్నీరు. గొజ్జంగిపువ్వు రూ.చూ. గొజ్జఁగిపూవు. వి. పన్నీరుపువ్వు.
గొజ్జఁగ రూ. గుజ్జంగి, గొజంగి, గొజ్జంగి, గొజ్జఁగి, గొజ్జెంగ, గొజ్జెఁగ, గొంజగి.వి. 1. సేమంతికా విశేషం, పెద్దచేమంతి. మను. 3.84 ; 2. పచ్చపువ్వుల మొగలి.
సం. కుబ్జ-, కుబ్జక- ; ప్రా. కుజ్జ, కుజ్జగ-, కుజ్జయ, కొజ్జ, కొజ్జగ, కొజ్జయ. శతపత్రిక, దీనిపూవు ; అమా. కజ్జ, కుజ్జ-.

క. గుజ్జగె, గుజ్జిగె, గుజ్జుగె, గొజ్జిగె, గొజ్జుగె. <ప్రా. కొజ్జగ-.

గొజ్జఁగనీరు రూ.చూ. గొజ్జెఁగనీరు. వి. పన్నీరు. పారి. 2.10. గొజ్జఁగమంచు రూ.చూ. గొజ్జఁగిమంచు. వి. పన్నీరు.

గొజ్జఁగి రూ.చూ. గొజ్జఁగ. వి. 1. పెద్దచేమంతి. భీమ. 1.118; 2. పచ్చపువ్వుల మొగలి.

గొజ్జఁగినీరు రూ.చూ. గొజ్జెఁగనీరు. వి. పన్నీరు. గొజ్జఁగిపూవు రూ. గొజ్జంగిపువ్వు. వి. పన్నీరుపువ్వు. గొజ్జఁగిమంచు రూ. గొజ్జఁగమంచు. వి. గొజ్జంగినీరు. వసు. 3.168. గొజ్జఁగిఁబ్రాలు(-ప్రాలు) రూ.చూ. గొజ్జుఁబ్రాలు. వి. ధాన్యవిశేషం. వ్య. గొజ్జగి వాననవచ్చే ధాన్యం.

గొజ్జింక వి. బొద్దింక.

గొజ్జు రూ. గొజు, గ్రొజ్జు. వి. వంకాయ, మామిడి మొ. వాటితో చేసిన పులుసు.

క. గొజ్జు.

గొజ్జుమామిడి వి. ఒకరకం మామిడిచెట్టు (Maginefera indica).

గొజ్జుఁబ్రాలు రూ. గొజ్జఁగిఁబ్రాలు. వి. ధాన్యవిశేషం. హంస. 4.128.

గొజ్జెంగ రూ.చూ. గొజ్జఁగ. వి. కుబ్జక పన్నీరు పూలచెట్టు. వరమ. వి. 3.189.

గొజ్జెఁగ రూ.చూ. గొజ్జఁగ. వి. 1. రేకులచేమంతి; 2. పచ్చపువ్వుల మొగలి.

గొజ్జెఁగనీరు రూ. గొజ్జంగినీరు, గొజ్జఁగనీరు, గొజ్జఁగినీరు. వి. పన్నీరు. భీమ. 5.121.

గొంచి వి. పొలం.

గొంచికాఁడు రూ. గొంచిగాఁడు. వి. ఉమ్మడి సేద్యం పెద్ద. గొంచిగాఁడు(-కాడు) రూ.చూ. గొంచికాఁడు. వి. భూస్వామి, భూమిని కౌలుకు తీసుకొన్నవాడు. గొంచిసేద్యం వి. నమిష్టి సేద్యం.

గొంజ వి. వంజ, గొడ్డుటావు. ఆం.భా. 2.263.

గొంజగొడుగు వి. ఆతపత్రం. తాళ్ళ.సం. 11.3. భా. 53.

గొంజఁగి రూ.చూ. గొజ్జఁగ. వి. పచ్చపూమొగలి.

గొంజి వి. ఒకానొక ఫలవృక్షం. కాశ. 3.69. మామిడి తోటల్లోనూ, కంచెల పక్కనూ పెరిగే ఒకమొక్క లేక చిన్న చెట్టు (Glycosmis cochinchinesis).

గొటగొట రూ.చూ. ఘొటఘొట. వి. పులి గాండ్రించటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. ద్వి. హరిశ్చ. ఉ. 1948 పం. ధ్వన్యను.

గొటి వి. అడవుల్లో పెరిగే ముళ్ళు కలిగిన ఒకమొక్క (Zizyphusrugosa).

గొటిక[1] రూ. గొటికె, గొట్క, గొట్టి, గొట్టె[2], గొతకి. వి. పసుప్పచ్చని పూలుపూసే ముళ్ళచెట్టు, కంచెలకు, వంటచెరకు వాడతారు, దీనిపళ్ళు తోళ్ళను నలుపు చేయడానికి వాడతారు (Zizyphus horrida).

గొటిక[2] వి. కుక్క గొడుగు.

గొటికె రూ.చూ. గొటిక[1]. వి. పొదగా పెరిగే ముళ్ళచెట్టు.

గొట్క రూ.చూ. గొటిక[1]. వి. పొదగా పెరిగే ముళ్ళచెట్టు.

గొట్టం రూ.చూ. గొట్టము. వి. 1. కప్పుమీది నీరు కిందికి కారడానికి వీలుగా అమర్చిన పొడుగాటి క్రోవి; 2. అము నుంచి పొగపోవడానికి ఉంచిన గొట్టం; 3. ఇటుక కాల్చే కుంపటాము మధ్యనున్న ఖాళీజాగా; 4. బావిగోడ; 5. పంటెకు బదులు నూలుచుట్టుకొనే రేకుడబ్బా.

గొట్టంబూజా వి. పక్కభాగంలో కొళాయి అమర్చిన కూజా.

గొట్టపురోగము చూ. గొట్టము.

గొట్టపుమవ్వతాళము చూ. గొట్టము.

గొట్టము రూ. గొట్టం, గొట్టాం. వి. 1. వెదురు మొ. వాటి క్రోవి; 2. తారాజువ్వ; 3. కొళాయి.

క. కొట్టు, గొట్టు. పశువులకు ఆహారంగాని, మందుగాని ఇచ్చే వెదురు గొట్టం; త. కొట్టిమ్. పశువులకు మందిచ్చే లోతైన వెదురుముక్క.

గొట్టపురోగము వి. ఒకజాతి వరితెగులు. గొట్టపుమవ్వతాళము వి. గొట్టంవంటి ఒకరకం తాళం. గొట్టముక్రోవి వి. 1. తారాజువ్వ; 2. కొళాయి. గొట్టముమూన వి. 1. తారాజువ్వ; 2. కొళాయి. గొట్టాలపురుగు వి. వరి, జొన్న మొ. వాటి దంటుతొలిచే పురుగు. గొట్టాలమ్మ వి. కలరాదేవత. గొట్టాలు వి. నల్లాం నుంచి పొగ పోవడానికికాక చూసుకోడానికి దాతల మధ్యగా భూమికి జానెడెత్తులో ఉంచిన మట్టి దార్లు.

గొట్టరాయి వి. పునాదులు దిట్టపరచడానికి, గ్లాబులు పోతపొయ్యడానికి, రోడ్లు వేయడానికి పనికివచ్చే రాయి.

గొట్టాం రూ.చూ. గొట్టము. వి. గొట్టం.

గొట్టాంపొయ్యి వి. పొగపోయే ఏర్పాటున్న బట్టీపొయ్యి. గవర్నమెంటు పొయ్యి.

గొట్టాలపురుగు చూ. గొట్టము.

గొట్టాలమ్మ చూ. గొట్టము.

గొట్టాలు చూ. గొట్టము.

గొట్టి రూ.చూ. గొటిక[1]. వి. ఒకదినుసుగడ్డ, కేతుకం, గచ్చతీగలాంటి ముళ్ళ జాతి వృక్ష విశేషం, నమ్మిడుంప (Zizyphusxylopyus).

గొట్టికంటి వి. ఒకరకం తినేదుంప. గొట్టికంప వి. ముళ్ళతో కూడిన ఒకరకం చెట్టు. గొట్టికాఁడు వి. వేఁవాడు, చారుడు. గొట్టికాయ వి. గోలీ. గొట్టిగడ్డ వి. ఒకరకం గడ్డ. గొట్టిచెట్టు వి. ముళ్ళతో కూడిన ఒకరకం చెట్టు.

గొట్టిక వి. కరువు.

గొట్టు[1] విశే. 1. భీకరుడు. భాగ. 6.321; 2. విరోధి. రాజవా. 3.8; 3. దుష్టుడు, దుర్మార్గుడు. ఉ.రా. 2.309; 4. కఠినం, కర్ణ కఠోరం. ఉ.రా. 6.343. వి. 1. దౌష్ట్యం. విష్ణు పు. 4; 2. అల్లరి. శశ. 3.586; 3. మూర్ఖత.

క. గొట్టు. గట్టిగా ఉండే పరిస్థితి లేదా చాల అరుదైన.

గొట్టుకాలము వి. కరువు కాలం. గొట్టుగ (-కన్) క్రి. విశే.ఁదు. కఠోరంగా, పూర్ణంగా. వసు. 3.149. గొట్టుచేయు

రూ.చూ. గొట్టుసేయు. స.క్రి. బాధించు. గొట్టుతనము వి. దౌష్ట్యం. ఉ.రా. 2.309. గొట్టుమాట వి. కఠినమైన మాట, పరుషవాక్కు. గొట్టుసేయు (-చేయు) రూ. గొట్టు చేయు. స.క్రి. 1. బాధించు, సారంగ. 3.39; 2. ప్రకటించు, వెల్లడిచేయు. శుక. 3.586; 3. నిందించు, తిట్టిపోయు. శుక. 3.21.

గొట్టు² వి. గాలి, వాయువు. ఆం.నా. నం. దేవ. 23.

గొట్టు³ ప్రత్య. తాచ్ఛీల్యాద్యర్థాల్లో వస్తుంది. ఉదా. గొడవగొట్టు (తాచ్ఛీల్యం) పిసినిగొట్టు (స్వార్థం).

గొట్టె¹ రూ.చూ. గిట్ట¹. వి. గుర్రపుడెక్క.

గొట్టె² రూ.చూ. గొటిక¹. వి. 1. ఘోటజటి, రేగుచెట్టు; 2. పసుప్పచ్చని పూలుపూసే ముళ్ళచెట్టు.

గొట్టెకంప వి. ఆము కాల్పుకు వాడే గొట్టిచెట్టు కంప. గొట్టెవడ్లు వి.బ.వ. ఒకరకం వడ్లు.

గొట్రాయి రూ.చూ. గోడురాయి. వి. నిలువుగా ఉంచిన పొడుగాటి రాయి.

గొట్లియ రూ. గొట్లె. వి. రేగుచెట్టు.

గొట్లె రూ.చూ. గొట్లియ. వి. రేగుచెట్టు.

గొడ రూ.చూ. గొడవ. వి. 1. గొడవ; 2. హింస; 3. బాధ; 4. మారి తెగులు.

గొడలాడు అ.క్రి. గొడవచేయు < గొడ + -లు + ఆడు.

గొడగ రూ. గొఱగ. వి. ఏడికోల లేని నాగలి.

నం. *కూటక–*. నాగటి కర్ర, ఫాలం; ప్రా. *కూడగ–*. నాగటిదుంప.

< ప్రా. కూడగ–.

గొడగర రూ. చూ. గొడగరి. వి. చెప్పులు కుట్టి జీవించే జాతి.

గొడగరది వి. చెప్పులుకుట్టేది. గొడగరవాఁడు వి. చెప్పులుకుట్టేవాడు.

గొడగరి రూ. గొడగర, గొడారి. వి. చర్మకారుడు. విజ్ఞా. 1.58.

గొడగించు అ.క్రి. 1. మోగు; 2. గిపెట్టు.

గొడగొడలాడు స.క్రి. వదరు, వాగు, గొణుగు.

గొడఁగు రూ. కొణుగు, గొణఁగు, గొణుగు. గొణుఁగు. స.క్రి. 1. ఎదుటి వారికి వినబడకుండా నోటిలో ఉచ్చరించు. కకుత్థ్స. 5.130; 2. కూయు (పావురాలు). చంద్ర భా. 4.49; 3. కసరు. చంద్రాంగ. 3.97; 4. ఆడు, పలుకు.

క. *గుణ, గుణు, గొణ*. సణగటంలో అయ్యే చప్పుడుకు అనుకరణం; *గుణగుణ*. సణగటం, ఝుంకారం చేయటం, గునగునలాడ్డం; *గొణగు*. ముక్కుతో సణగు; *గొణగ*. ముక్కుతో సణిగేవ్యక్తి; తు. *గుణుగుణు, గుణుగుట్టు, గునుగును*. సణగటం, గొణగటం మొ.; త. కుణుకుణు. మూల్గటం. గొణగటం, ముక్కుతో మాట్లాడటం; కొ. *కొడ్గ్*. మోగు.

గొడబ రూ.చూ. గొడవ. వి. గొడవ.

గొడలి రూ.చూ. గొడ్డలి. వి. గొడ్డలి.

గొడలిమాడ వి. గొడ్డలి వెనక భాగం.

గొడవ రూ. గొడ, గొడబ. వి. 1. జోలి, సంబంధం. రం. రా. కిష్కిం. 198 వ. 29పం; 2. కయ్యం, కలహం. వరాహ. 9.26; 3. ఆపద, ఇడుము. మను. 4.63; 4. దోషం, తప్పు. విష్ణు పు. 6.339; 5. అశుభం, కీడు, అచ్చ. రా. అయో. 2.71; 6. దుఃఖం, బాధ. అచ్చ. రా. యు. 1.9; 7. అల్లరి; 8. కలత; 9. విరోధం.

క. *గొడవె*. అపాయం. గందరగోళం; *గొడ్డ*. అపాయం.

గొడవగొట్టు వి. గొడవ చేసే స్వభావం కలవాడు. పండి. చ. 2.116 వ. గొడవగొంట్లు వి.బ.వ. కలహశీలురు. పండి. చ. 2.343 వ. గొడవపోతు విశే. గొడవచేసే స్వభావంగల. భల్లా. 2.28.

గొడవు రూ.చూ. గొడుగు. వి. ఛత్రం.

గొడవుకామె వి. గొడుగు పట్టిన ఆడది.

గొడసాల వి. దేవగంధ, గొడపాల అని కొందరు.

గొడారి రూ.చూ. గొడగరి. వి. చెప్పులు కుట్టే జాతి. బసవ. 4.100 పం.

గొడారివాఁడు వి. చెప్పులు కుట్టేవాడు.

గొడి వి. ఊర్తె అడ్డపట్టెకుగాని, నరిగుంజకుగాని వేసిన ఇనప కొక్కెం.

గొడికట్టె వి. 1. ఊర్తె తాడు తగిలించి బిర్రుపెట్టే పంగలకొయ్య, కొన్ని చోట్ల దుప్పికొమ్మువాడుతారు; 2. ఎడ్లకాడిలో పక్కకు జరగకుండా కాడి కన్నంలో దిగవేసిన కర్ర. గొడిగట్టు (-కట్టు) వి. 1. నిద్రాడు; 2. పనికిమాలినవాడు. గొడిగుజ్జు వి. ఎడ్లకాడిలోపలివైపుకు జరగకుండా కాడి కన్నంలో దిగవేసిన కర్ర. గొడిదబ్బ వి. మోటలాగే ఎద్దుమెడ కిందవేసే కొయ్యబద్ద.

గొడిక వి. ఇటుకను, తాదనను వెదల్పు మీద నిలబెట్టిన పేర్పు.

గొడిగ వి. గులకరాయి.

నం. *గులికా*. గులకరాయి.

గొడితె రూ. గొటితి. వి. మోకు చివర వేసిన ముడి.

గొడిబూమి చూ. గొడిగ. వి. గులక రాళ్ళున్న రేగడినేల.

గొడిమి వి. నేలమీద అనుతూ ఒంటిరెక్క తలుపు తిరగటానికి తోడ్పడే తలుపు పట్టెలోని చెక్కబడిన భాగం.

గొడియ రూ. గొడె. వి. 1. నేరం చేసిన వాని చేతులకు వేసే బంధన సాధనం. క్రీడా. 48; 2. అందలంయొక్క ఒకానొక భాగం. దశా. 7.129; 3. దండెంకర్ర.

గొడియకారి వి. గొడిరాళ్ళు కలిసిన కారినేల.

గొడిరేవడి చూ. గొడిగ. వి. తెల్లటి గులకరాయి కలిసిన రేగడి.

గొడివారు వి. పట్టెడ చివర కాడికి కట్టే తోలుతాడు.

గొడిపె వి. ఇడుమ, కష్టం. అచ్చరా. యు. 189.

గొడిసె రూ. గుడిసె¹. వి. 1. చింతకాయ. సిం.ద్వా. 3.159; 2. పండిన చింతకాయలో ఒకగింజ ఉండే భాగం.

గొడుక్కమామ చూ. గొడుగు. వి. మధ్యభాగం గుమ్మటం

లాగుండి పైచివర మొనదేలి ఉండే ఆర్చి.

**గొడుగు** రూ. గొడవు, గొడువు. వి. 1. కోట కొమ్మలు మొ. వాటిపై కట్టబడ్డ గొడుగు వంటి కట్టడం. బసవ. 3.504 పం.; 2. ఛత్రం, ఆతపత్త్రం. హరి. ఉ. 4.237 ; 3. పావుకోళ్ళు, బొంగరం మొ. తొడుగులా ఉండేగుబ్బ. భీమ. 2.127 ; 4. హస్తతలంలో ఉండే ఛత్రాకారం రేఖ. ఆము. 5.31 ; 5. మామిడి తోటల్లోను అడవుల్లోను పెరిగే చిన్న మొక్క లేక చెట్టు (Glycosmis pentaphylla).

క. కొడె. చిన్నగొడుగు ; కొఢ్, కొడ్ ; కొద. కొడె. గొడుగు ; తు. గొడె. చిన్నగొడుగు ; త. కుడై. గొడుగు, వితానం ; కోట. కొడ. ఆకులతో చేసిన గొడుగు ; తొ. క్వడ్. ఆకుల్తో చేసిన గొడుగు ; కువి. గుడగు, గుదుగు. గొడుగు.

గొడుగుకాడలు వి.బ.వ. గొడుగు కామలు. గొడుగు కామలు వి.బ.వ. గొడుగు కాడలు. గొడుగుకొమ్ము వి. ఉడుగుకొమ్ము. గొడుగుక్రిందిరూపు వి. రాజు. కు. సం. 11.37. గొడుగుగడ్డి వి. గడ్డికామంచి, అతిచ్ఛత్రం. గొడుగుచెక్క వి. బొమ్మలు పెట్టుకోడానికి వీలుగా అమర్చిన చెక్క, ఉత్తరాసి మీద వరచిన చెక్క. గొడుగుతుమ్మ వి. తెరచి పెట్టిన గొడుగు ఆకారంగా కొమ్మలు విస్తరించి పెరిగేతుమ్మ (Acaciapalmifions). గొడుగుపాగలు రూ. గొడుగుపావలు. వి.బ.వ. గొడుగు లాంటి పాదరక్షలు. గొడుగుపావలు రూ.చూ. గొడుగు పాగలు. వి.బ.వ. గొడుగులాంటి పాదరక్షలు. గొడుగుపీట చూ. గొడుగుచెక్క. వి. బొమ్మలు పెట్టుకోడానికి వీలుగా అమర్చిన చెక్క. గొడుగుబండ వి. ఎలక చుంచు, గోడమీది చూరుజంద. గొడుగుబల్ల వి. 1. తలుపు మీది కుబునం తిరిగేపట్టె ; 2. బొమ్మలు పెట్టుకోడానికి వీలుగా అమర్చిన చెక్క. గొడుగుబొంగరము వి. గొడుగులా ఉండే బొంగరం. గొడుగుమాన్యం వి. రాజుకు గొడుగుపట్టే వాడికి ఇచ్చింది. గొడుగుమెట్టెలు వి.బ.వ. వాటంపెట్టి ఓరలు సన్నగా తీర్చిన వెడల్పు మెట్టెలు. గొడుగురాయి వి. నాలుగు వీథుల కూడలిలో నిలిపిన రాయి. గొడుగులవారు వి.బ.వ. దేవుడివల్లకి వెంట గొడుగులు పట్టుకొని నడిచేవారు. గొడుగులు వి.బ.వ. నీటి బుడగలు. గొడుగుసుడి వి. ఎద్దు మూపురం మీద ఉండేసుడి.

**గొడుగుజాల** చూ. గొడుగు. వి. గొడుగు తుమ్మచెట్టు, గొడుగు లాగ పెరిగే చెట్టు, తెల్లని పూలుపూస్తుంది. దీని కలప పని ముట్లు చేయడానికి, వంటచెరకుకువాడతారు (Acaciaplamifions).

**గొడుగుర** వి. కాంచన వృక్షం, పెద్దపెద్ద ఆకులు కలిగిన చెట్టు, దీనికలపతో పనిముట్లు చేస్తారు (Baudhinapurperea).

**గొడువు** రూ.చూ. గొడుగు. వి. 1. ఛత్రం, ఆతపత్రం ఆం. భా. 2.193 ; 2. కోట కొమ్ములు మొ. వాటిపై కట్టబడిన గొడుగు లాంటి కట్టడం ; 3. పావుకోళ్ళు, బొంగరం మొ. వాటి తొడుగులా ఉండే గుబ్బ ; 4. హస్తతలంలో ఉండే ఛత్రాకార రేఖావిశేషం.

**గొడుసు** వి. పిడస మధ్యలోని మేకువంటి భాగం.

**గొడె** రూ.చూ. గొడియ. వి. 1. అందలం యొక్క ఒకానొక అవయవం. రాజవా. 2.43 ; 2. నేరం చేసిన వాని చేతులకు వేసే బంధన సాధనం ; 3. కఱ్ఱ, దండం.

**గొడ్డ** విశే. బిరుసైన. ద్వి. హరిశ్చ. 647 పం. వి.బ.వ. బిరుసుమాటలు, స్వోత్కర్షను తెలిపేమాటలు. రాజావా. 1.54. వి. 1. కోపం ; 2. తొడబిళ్ళ ; 3. రాయి ; 4. ముద్ద, పిడచ ; 5. సుద్ద ; 6. మట్టి ఉండ.

క. గుడ్డు, గుడ్డి. కనుగుడ్డు, కోడిగుడ్డు, గుడసు. గుండ్రనిది ఏదైనా, గుడి. చక్రం, గోయి ; కొం. గుడు. గుడ్డు ; కొలా. గడ. వృషణం.

సం. కుట్ట–. ఛేదనం.

గొడ్డతనము వి. 1. బిరుసుదనం. చంద్ర భా. 3.17 ; 2. మూఢత్వం. గొడ్డవెట్టు (-పెట్టు) స.క్రి. నిరోధించు, అడ్డగించు. పండి. చ. 1.289 పం.

**గొడ్డకము** రూ.చూ. గొడ్డగము. వి. దుశ్చేష్ట. విశే. బాధక మయిన.

**గొడ్డగము** రూ. గొడ్డకము. వి. దుశ్చేష్ట. వరాహ. 10.15 ; విశే. బాధకమైన. శివయో. 3.74.

సం. కుట్టక–. ఛేదించేది.

**గొడ్డటిచివ్వి** చూ. గొడ్డలి. వి. ఒకరకం చెట్టు (Gymenosporia royleana).

**గొడ్డన్నము** చూ. గొడ్డు[1].

**గొడ్డము** వి. ఆపద, అశుభం. భార. శాంతి. 208.

క. గొడ్డ. అపాయం, గండం.

సం. కష్ట–. కష్టం, బాధ.

**గొడ్డంబలి** చూ. గొడ్డు[1].

**గొడ్డలి** రూ. గొదలి, గొడ్డెలి, గొడ్డేలి. వి.బా. 1. చెట్లు మొ. వాటిని నరికే సాధనం. భార. ఉద్యో. 2.61 ; 2. పరశువు. గండ్రగొడ్డలి. దశా. 6.116 ; 3. పిడస మధ్యలోని మేకువంటి భాగం.

క. కొడలి. గొడ్డలి ; తు. కొడరి, కుడరి ; త. కొటాలి ; మ. కొటాలి, కొటాళి ; ఒల్లా. కొటల్ ; పర్జి. కొటల్ ; నా. ఘొళి ; బ్రా. కోడాల్.

సం. కుఠార-, కుఠారి-, కుఠారిక. గొడ్డలి ; ప్రా. కుఢార- ; పా. కుఠాలి.

గొడ్డలికత్తి వి. రెండువైపులా పదునున్న పోటకత్తి వంటిది. గొడ్డలిచివ్వ వి. చిన్న కంచెమొక్క (Gymnospolia emarginata). గొడ్డలిపెట్టు స.క్రి. వ్యాఘాతం కలిగించు. గొడ్డలిమాడు వి. గొడ్డలి వెనుక భాగం.

**గొడ్డలిపులుసు** వి. తగుడుచెట్టు, పచ్చని పూలుపూస్తుంది (Stereospermum chelonoides).

**గొడ్డలియివ్వ** వి. దేవదారు చెట్టును పోలిన అందమైన చెట్టు (Chukrasiatbalaris).

**గొడ్డలు** వి. నిరర్థకం.

**గొడ్డాగొడ్డకర** చూ. గొడ్డు[1].

**గొడ్డావు** చూ. గొడ్డు[1].

గొడ్డిగట్టు వి. ఎఱ్ఱగొద చెట్టు, ఆకుపచ్చని పూలు, బూడిద రంగుతో కూడిన ఎరుపురంగు పళ్ళుకాసే ఒక చెట్టు (Diospyrosmontana).

గొడ్డు[1] వి. 1. గుంజ, సంతతి లేని ఆవు. భార. విరా. 1.286; 2. గొడ్రాలితనం హరి.పూ. 5.165. భాస్క. రా. అయోధ్య. 73; విణ. 1. వంధ్య అయిన, సంతతి లేని విష్ణుపు. 4.221; 2. ఫలించని (చెట్టు మొ.). ఆం. భా. 2.35; 3. తీక్ష్ణమైన వాననగల; 4. కావలసిన ఇతర వస్తువులు లేని; 5. శూన్యమైనట్టి; 6. ప్రయోజనం లేని.

క. గొడ్డు. గొడ్డైన, పిల్లలు లేని, గొడ్డావు మొ. గొడ్డి; కొడ. గొడ్డ. పిల్లలు లేనివాడు; తు. గొడ్డె. గొడ్డైన; త. కొట్టు. గొడ్రాలు.

గొడ్డన్నము వి. వ్యంజనంలేని అన్నం, <గొడ్డు[1] + సం. అన్న-. గొడ్డంబలి వి. అన్నం లేని అంబలి < గొడ్డు[1] + అంబలి. గొడ్డాఁగాఁకర చూ. గొడ్డుఁగాఁకర. వి. వంధ్యా కర్కోటకి. గొడ్డావు రూ.చూ. గొడ్డుటావు. వి. గొడ్డుటావు, వంజ. <గొడ్డు[1] + ఆవు. గొడ్డుకారం వి. వట్టికారం. గొడ్డుకాఁడు వి. వ్యర్థుడు. పార్వ. 3.99. గొడ్డుగాఁకర (-కాఁకర) వి. గొడ్డుతనాన్ని పోగొట్టే కాకర, వంధ్యా కర్కోటకి. గొడ్డుగేదె వి. ఈనిక లేని గేదె. గొడ్డుచెట్టు వి. ఫలించని చెట్టు. గొడ్డుజావ వి. వ్యంజనం లేని ఉత్తరాగి జావ. గొడ్డుటావు రూ. గొడ్డావు. వి. వంధ్య అయినగోవు. వేమన. <గొడ్డు[1] + ఆవు. గొడ్డుతుంగ వి. చిన్న మొక్క (Cyperus corymbosus). గొడ్డుతెవులు వి. ఉలవ. కంది, జొన్న మొ. వాటి తెగులు. గొడ్డుపోతు రూ.చూ. గొడ్డుఁబోతు. వి. 1. పిల్లలు లేని వాడు; 2. పిల్లలు లేనిస్త్రీ; 3. నిష్ప్రయోజకుడు; 4. కాపులేని (చెట్టు మొ.). గొడ్డుపోతువాఁడు విణ. పిల్లలు లేని వాడు గొడ్డుఁబోతుది విణ. పిల్లలు లేని (స్త్రీ). గొడ్డుపోవు రూ.చూ. గొడ్డువోవు. అ.క్రి. 1. గొడ్రాలగు; 2. వ్యర్థమగు. గొడ్డుమాటలు వి.బ.వ. నిష్ప్రయోజనమైన మాటలు. గొడ్డుఁబోతు (-పోతు) రూ. గొడ్డుపోతు. వి. 1. పిల్లలు లేని వాడు; 2. పిల్లలు లేని స్త్రీ; 3. కాపులేనిది, ఫలించనిది; 4. నిష్ప్రయోజకుడు. గొడ్డుమ్రాఁకు వి. ఫలించని చెట్టు. గొడ్డుఁబోతుకు కాయముకొట్టు స.క్రి. వ్యర్థ ప్రయత్నంచేయు. గొడ్డుఁబోతుచెట్టు వి. కాపులేని వృక్షం, ఫలించనిచెట్టు. గొడ్డుబోతుది విణ. పిల్లలులేనిది. <గొడ్డుఁ బోతు + అది. గొడ్డుఁబోతువాఁడు విణ. పిల్లలులేనివాడు. గొడ్డురాలు రూ. చూ. గొడ్రాలు. వి. ఔ. వంధ్య అయిన స్త్రీ. ప్రబంధ. 3.760. <గొడ్డు[1] + ఆలు. గొడ్డుపీగికన్న బిడ్డ వి. ప్రథమ సంతానం. పండి. చ. మహి. పు. 167. గొడ్డువీగు అ.క్రి. సంతానవతి అగు. గొడ్డువోవు (-పోవు) రూ. గొడ్డుపోవు. అ.క్రి. 1. పౌరుషహీనుడగు. భార. ఉద్యో. 1.352; 2. వ్యర్థమగు. నృసింహ. 4.135; 3. గొడ్రాలగు. జైమినీ భా. 6.115; 4. సృష్టిలేకుండా ఉండు. శివరా. 1.51. గొడ్డుసంకటి వి. వ్యంజనంలేని రాగిసంకటి. గొడ్డేరితెచ్చు చూ. గొడ్డేఱు[2]. స.క్రి. ఒకనిర్దిష్ట లక్ష్యంతో తెచ్చు. తాళ్ళ. సం. 12.312. గొడ్డేఱు[1] క్రి.విణ. 1. వ్యర్థంగా. క్రీడా. 248; 2. దిక్కులేకుండా. భాగ. 8.217; విణ. వ్యర్థమయిన. హర. 2.132. వి. నీళ్ళు లేని ఏరు. <గొడ్డు[1] + ఏఱు[1]. గొడ్డేఱు[2] స.క్రి. గుత్తకుతీసు కొను, గుత్తఎత్తు, స్వార్థంలోనే ప్రయోగాలు (శ్రీనాథుని చాటువు). గొడ్రాలు రూ. గొడ్డురాలు. వి. గొడ్డురాలు. శృం. నై. 7.138. <గొడ్డు[1]. + ఆలు.

గొడ్డు[2] వి. 1. ఎద్దు. హర. 2.48; 2. పశువు. జైమినీ భా. 6.265.

గొడ్లకొట్టి వి. కుడితికొట్టి. గొడ్లదొడ్డి వి. 1. ఆలమంద, శతభిషా నక్షత్రం కావచ్చు. దగ్గరగా ఉండే నూరు చుక్కలగుంపు; 2. పశులదొడ్డి. గొడ్లబొచ్చు వి. ఉన్ని మట్టిలో కలిపి సారెపెట్టుకి ఉపయోగిస్తారు.

గొడ్డుకూర వి. మంచిరకం కలపను, తుమ్మచిగురువంటి చిగురునుఇచ్చే చెట్టు (Bauhinaretusa).

గొడ్డుజంగు వి. ఒకరకం మొగలిచెట్టు. దీనిఆకులు చాపలు, గొడుగులు చేయటానికి, ఆకుల పీచు తాళ్ళుపేనటానికి, వేళ్ళు, బుట్టలు, కుంచెలు చేయడానికి ఉపయోగిస్తారు. పుష్పసంబంధమైన దీనిఆకులు తింటారు (Pandanus odoratissimus).

గొడ్డెలి రూ.చూ. గొడ్డలి. వి. పరశువు, కుఠారం.

గొడ్డేరితెచ్చు చూ. గొడ్డు[1].

గొడ్డేఱు[1] చూ. గొడ్డు[1].

గొడ్డేఱు[2] చూ. గొడ్డు[1].

గొడ్డేఱు[3] వి. ఒకఅడవి చెట్టు.

గొడ్డేలి రూ.చూ. గొడ్డలి. వి. కుఠారం, పరశువు.

గొడ్రాలు చూ. గొడ్డు[1].

గొడ్లకొట్టి చూ. గొడ్డు[2].

గొడ్లదొడ్డి చూ. గొడ్డు[2].

గొడ్లబొచ్చు చూ. గొడ్డు[2].

గొడ్లసోగ వి. రాతికూచాలపై దూలాలువేసి చెరుకాకు పరచిన పందిరి.

గొణగ రూ.చూ. గొడగ. వి. ఏడికోల లేనినాగలి.

గొణగొణ వి. గొనగటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

క. గుణ, గుణు, గొణ. నణగటం, గొణగటం; గుణుగుణు. నణగటం, జనంలో గునగున లాడటం; గొణగు. ముక్కుతోనణగు; గుణగ. ముక్కుతో నణిగే వ్యక్తి; తు. గుణుగుణు, గుణుగుట్టు, గునుగును. గొణగటం, నణగటం; త. కుణుకుణు (ప్స-ట్ట-). మూల్గటం, గొణగటం, ముక్కుతో మాట్లాడటం.

గొణగొణలాడు అ.క్రి. గొణగొణ అను. <గొణగొణ + -లు + ఆడు.

గొణఁగు రూ.చూ. గొడఁగు. అ.క్రి. 1. మాట వెడలనీక. నోటనేఉచ్చరించు. కువ. చ. 2.24; 2. గానంచేయు. అచ్చ. రాయు. 154; 3. నిందించు.

గొణిగలు వి.బ.వ. మొక్కులు, నతులు.

గొణిజ రూ. గొణిద, గొణెద. వి. తలుపుగ్రంథి తగిలించడానికై ద్వారబంధం మొ. వాటినిలుపుల్లో బిగకొట్టినచీల.

గొటితి రూ.చూ. గొడితె. వి. మోకుచివర వేసినముడి.

గొటిద రూ.చూ. గొటిజ. వి. తలుపుగ్రంథి తగిలించటానికై ద్వారబంధం మొ. వాటి నిలువుల్లో బిగ్గొట్టిన చీల.

గొణుగు రూ.చూ. గొణఁగు. అ.క్రి. గొణుగు.

గొణఁగు రూ.చూ. గొడఁగు. అ.క్రి. అస్ఫుటోచ్చారణ మొనర్చు.

గొణఁగుపడు అ.క్రి. మాట్లాడే శక్తి తగ్గు.

గొణెం వి. మోటబొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ.

గొణెద రూ.చూ. గొటిజ. వి. మడతబందు, రెక్కలు తెరుచు కోడానికి మూసుకోడానికి వీలుగా కమ్ములకు పట్టిఉంచే పరికరం

గొణెబిళ్ళ రూ. గొనెబిళ్ళ. వి. క్రీడావిశేషం.

గొణెము రూ.చూ. గొండ్లెము¹. వి. గొళ్ళెం.

గొంటరి చూ. గొంటు¹.

గొంటి చూ. గొంటు¹. విశ. చెడ్డ.

గొంటితనము వి. దౌష్ట్యం.

గొంటు¹ విశ. 1. కఠినుడు, క్రూరుడు. పండి. చ. 116పు ; 2. దుష్టమైన. హరి. ఉ. 4.233 ; 3. వంచకుడు. భాగ. 10పూ. 1149 ; 4. దిట్ట. రాజవా. 3.3.

సం. కుంఠ-. సోమరి, మూఢుడు ; ప్రా. కుంఠ-, కొంఠ-. మూర్ఖుడు, బుద్ధిహీనుడు, అలసుడు, మందుడు.

<ప్రా. కొంఠ-.

గొంటరి విశ. 1. కఠినుడైన. హ.న. 4.41 ; 2. దుష్టురాలు. విప్ర. 5.31 ; 3. దుష్టమైన. ఇందు. 3.6 ; 4. దిట్ట. శకా. 2.110. <గొంటు¹+-అరి (స్వార్థంలో). గొంటుకాఁడు విశ. 1. కఠినుడు. క్షేత్రయ పదాలు ; 2. మోసగాడు. వి. 1. మోసం ; 2. నేర్పు. <గొంటు+-కాఁడు (స్వార్థంలో). గొంటుతనము వి. 1. కాఠిన్యం. భాస్క.రా.యు. 1430 ; 2. నైపుణ్యం, చతురత. భాగ. 10 పూ. 1149 ; 3. వంచన, మోసం. శుక. 2.347 ; 4. దౌష్ట్యం.

గొంటు² వి. మొద్దువక్క, బందనలేనివక్క. బహుళా. 5.9.

క. గోటు. బాగాఎదిగినప్పటికి గట్టిగాఉండేస్థితి ; గొట్-అడికె. గట్టి, నాసిరకపుచెక్క ; కొడ. గొట్-అడికె. పూర్తిగాఎదిగిన, గట్టిపోకచెక్క.

సం. ఘోంటా-. పోకచెక్క.

గొంటుపోఁక రూ.చూ. గోఁటుపోఁక. వి. బందనలేని వక్క. గొంటువక్క రూ.చూ. గోఁటువక్క. వి. మొద్దువక్క, బందనలేనివక్క.

-గొంటు³ ప్రత్య. కలది, కలవారు అనే అర్థాల్ని తెలిపే ప్రత్యయం. ఉదా. తెగులుగొంటు.

గొంట్ర వి. నాగలి.

గొండ¹ రూ. గొండం. వి. మరమగ్గంలో ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టడానికి చేత్తో తాళ్ళను గుంజే పిడి.

గొండ² వి. 1. జొన్న మొ. వాటి బొంతు, కంకిపొట్టు పీకని గింజలు ; 2. పొగచెట్టు తలపైన వేసే పూత.

గొండం రూ.చూ. గొండ¹. వి. మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టడానికి చేత్తో తాళ్ళను గుంజే పిడి.

గొండనువ్వులు వి.బ.వ. నల్ల నువ్వుల్లో ఒకరకం.

గొండము రూ.చూ. గుండము. వి. నిప్పులగుంట. ఆం.భా. 2.241.

గొండాట వి. (ఊపిరి తీసుకోటానికికూడ తీరికలేని) పని. <గుండి+ఆట.

గొండాలపెనం రూ.చూ. కొండీలుపెనం. వి. పిండివంటలు చేసుకొనే మట్టిపాత్ర.

గొండి¹ వి. ఊర్తె అడ్డపట్టెకుగాని సరిగుంజకుగాని బిగించిన ఇనప పనిముట్టు.

గొండికర్ర వి. పదుగు చాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి, నున్నటికర్ర.

గొండి² వి. సీళ్ళుపోయేదారి, మిక్కిలి ఇటవాలుచోటు.

-గొండి³ ప్రత్య. తాచ్ఛీల్యంలో వచ్చే ప్రత్యయం. పండి.చ. 2.116. ఉదా. లంచగొండి.

గొండి⁴ వి. దుష్టత.

గొండిలి రూ.చూ. గొండ్లి. వి. 1. కుండలాకార నృత్యం. ఉ. హరి. 4.216 ; 2. నర్తకి ; 3. ఆట.

గొండిలపెనం రూ.చూ. కొండీలుపెనం. వి. పిండివంటలు చేసుకొనే మట్టిపాత్ర.

గొండీలు వి.బ.వ. మొక్కులు, గిడిగిళ్ళు, నాట్యవిశేషం. ప్రబంధ. 880.

గొండెము రూ.చూ. గొండ్లెము¹. వి. గొళ్ళెం.

గొండెలలం వి. ఒకరకం కలుపుమొక్క.

గొంద్ర రూ.చూ. కొంద్ర వి. దున్నిన భూమిని చదును చేయడం.

గొండ్లం రూ.చూ. గొండ్లెము¹. వి. గొళ్ళెం.

గొండ్లకోల వి. డిజైన్లు నేసే మగ్గంలో, అడ్డబేలును పైకి ఎత్తడానికి వేలాడదీసిన కర్ర.

గొండ్లి రూ. గొంళ్ళి, గొండిలి, గొళ్ళి. వి. 1. కుండలాకార నృత్యం. బసవ. 1.529 ; 2. నర్తకి. దశకు. 11.123. హరి.పూ. 6.107 ; 3. నృత్యం. కాశీ. 5.52 ; 4. ఆట. అచ్చ.రా. అయో. 77.

త. కొంతళమ్. ఒకరకమైన నాట్యం ; కొంత, మునుగు, మారుమొగం కట్టుకొని చేసే నాట్యం.

గొండ్లికాఁడు వి. నటుడు. విప్ర. 5.10. గొండ్లికొను అ.క్రి. నటించు, నాట్యమాడు. గొండ్లియాడు అ.క్రి. నాట్యమాడు. గొండ్లిసలుపు అ.క్రి. 1. నృత్యమాడు ; 2. జూదం మొ. వాటిని ఆడు.

గొండ్లెము¹ రూ. గొణెము, గొండెము, గొండ్లం, గొణ్ణెము, గొళ్లెము, గొళ్ళెము. వి. 1. తలుపు చిలుకు. ద్వి. హరిశ్చ. ఉ. 1078. పం ; 2. కుంపటి. గంగాళం మొ. వాటి చెవి ; 3. గుండ్రని కడియం.

గొండ్లెము² వి. బండికుంపటి, ఒకచోటనుండి మరోచోటుకు తీసికొని వెళ్ళటానికి ఉపయోగించే కుంపటి. ఆం. భా. 3.51.

గొణ్ణెం వి. అచ్చు గుదులు తగిలించే వంకర ఇనప ఊచ.

గొణ్ణెము రూ.చూ. గొండ్లెము¹. వి. గొళ్ళెం.

గొణ్ణెలకమ్మి వి. రాకెట్టు మగ్గం నిలువులకు పైన అడ్డంగా బిగించిన పట్టె, ఒకరకం మేరువు పలక.
గొత రూ.చూ. గొత్త[1]. వి. గోత్రం, వంశం.
గొతకి రూ.చూ. గొటిక[1]. వి. దక్కను, కర్నూలు, మైసూరుల్లో పెరిగేముళ్ళు కలిగిన మొక్క (Zizyphus horrida).
గొతుపు వి. నీలమణి విశేషం. ఆం.భా. 2.178.
గొత్త[1] రూ. గొత. వి. గోత్రం, వంశం.
సం. గోత్ర-. వంశం; ప్రా. గోత్త-. సంతతి.
<ప్రా. గోత్త-.
గొత్తడి రూ. క్రొత్తడి. వి. 1. మగనాలు; 2. పతివ్రత.
గొత్త[2] వి. అడ్డుకర్ర, అటకలమర్చేందుకు గోడలో నాటిన కొయ్యముక్క.
గొత్తి వి. పనివాడు, సంవత్సరం జీతానికుంచిన సేవకుడు.
గొత్తు[1] వి. గుత్తి. దశా. 7.2.
క. కొత్తు. గెల, గుత్తి; కొత్తణి, గొత్తణి. గుంపు, కుప్ప; గొండణి, గుండణి, గొండళి. గుంపుగూడు, జనసమూహం, గుంపు; గుత్తి, గుడి. పళ్ళు లేదా పూల గుత్తు; త. కొతు. గుత్తు, గెల, సమూహం.
సం. గుచ్ఛ-. పూలగుత్తి.
గొత్తు[2] వి. 1. క్రమం, వరస; 2. నిశ్చయం.
గొత్తుసేయు(-చేయు) స.క్రి. క్రమంగా జరుపు.
గొత్తు[3] వి. పాసిపోయిన వెన్న, పాలు మొ. వాటి కంపు.
గొత్తు[4] వి. 1. పశువుల్ని కట్టే కొయ్య; 2. గుర్తు.
గొత్తు[5] వి. బావిపరిధికి కేంద్రం.
గొద[1] వి. ఆకలి, క్షుత్తు. ఆం.భా. 2.260.
సం. క్షుధా-. ఆకలి; ప్రా. ఖుదా. జై.మహా. ఖుహా; మహా. అ.మా. అప. ఖుదా, ఖుహా; పా. ఖుద-. ఆకలి.
<ప్రా-ఖుదా.
గొదగొను[1] (-కొను) అ.క్రి. ఆకలిగొను. భార. ఉద్యో. 2.139.
గొద[2] వి. 1. త్వర; 2. అతిశయం.
క. గొద.
గొదగొను[2](-కొను) అ.క్రి. 1. త్వరపడు. భార. విరా. 2.240; 2. అతిశయించు, విజృంభించు, చెలరేగు. భార. విరా. 4.271; స.క్రి. వహించు, తాల్చు. ఆం.భా. 3.119.
గొద[3] వి. ఆకుపెంకు కప్పులున్న ఇళ్ళచూరు జారకుండా వాసాల చివర వేసిన బెజ్జంలో బిగించిన కొయ్యముక్క.
గొదగొద వి. పగ, విరోధం, అసూయ. వేంక. పంచ. 3.99.
క. కుదీ. ఉడుకు, పొంగు, మరుగు, నొప్పితో బాధపడు లేదా మనసులో బాధపడు; కుదిసు, కుదియును, కుదసు. ఉడుకు; కొడ. కొదీ. కుతకుత. ఉడుకు, ప్రేమించు, చింతించు; తు. కుదిపుని, కొదియుని. ఉడుకు; కొదిపావుని. ఉడుకునట్లుచేయు; కొదిపెల్లు, కొదుపెలు. ఉడుకు; కొది. లోభం, కంగారు; త. కొతి (-ప్పి-త్తి-). ఉడుకు, వేడితో పొంగు, బుస్సుమని పొంగు, వేడెక్కు (శరీరం, భూమి మొ.), జ్వరం, కోపం, బాధ, కోరిక; కొతికొతి. పొంగు (ఉడుకుతున్న అన్నంలాగ); కొతిప్పు, కొతియల్. ఉడకటం, పొంగటం, వేడి, జ్వరం, తీవ్రత, బాధ; కొతియన. ఆహారం కోసం అత్యాసపడే వ్యక్తి; కుతంపు (కుతంపి-). ఉడుకు, పొంగు (మరిగే నీళ్ళలా) కోపగించు; మ. కొతి. కంగారు, లోభం; కొతిక్క. లోభత్వం, ఓర్వలేని, తనదుకాని దానిని కోరు; కొతియన్. తిండిపోతు.
గొదపులుమ వి. కొమ్మలుండని ఒక చెట్టు. ఆకుపచ్చని రంగుతో కూడిన ఎరుపురంగుపళ్ళు కాస్తుంది (Nicbuhria-linearis).
గొదాము రూ.చూ. గోదాము. వి. ధాన్యాదుల్ని నిలవచేసే పెద్ద ఇల్లు.
గొద్ది రూ. గొద్దిక, గొద్దె. వి. మేకలు, పందులు మొ. వాటి పెంట.
గొద్దిక వి. మేకలు, పందులు మొ. వాటి పెంట.
గొద్దిళ్ళు వి.బ.వ. మొక్కలు, గుంజిళ్ళు.
గొద్దె రూ.చూ. గొద్ది. వి. మేక మొ. వాటి పెంట.
గొద్దెర వి. గులకరాతి ఆకారంలో కనిపించే వంపు, వంకర.
గొనం రూ.చూ. గొనము. వి. అరగిపోయిన మెట్టనాగలి.
గొనకొను రూ. కొనకొను. అ.క్రి. 1. ఇదికొన్ని చోట్ల స్వార్థక రూపంలో వాక్యాలంకారంగా ఉంటుంది; భార. ఆది. 4.104; 2. నమ్మతించు. భార. శాంతి. 1.39; 3. ఉద్యమించు, హను. భార. శాంతి. 4.243; 4. అతిశయించు. రం.రా. ఆరణ్య. 170 పు. 3 పం.; 5. తటస్థించు, సంభవించు. రం.రా. యు. 289 పు. 1 పం.; 6. నెలకొను. భాగ. 3.622; 7. బయల్దేరు.
గొనకొలుపు రూ. గొనకొల్పు. స.క్రి. పురికొల్పు, ప్రేరేచు. భార. ఆశ్రమ. 1.161. గొనకొల్పు రూ.చూ. గొనకొలుపు. స.క్రి. పురికొల్పు, ప్రేరేచు.
గొనకొలుపు చూ. గొనకొను.
గొనకొల్పు చూ. గొనకొను.
గొనటి విశే. వికారమైన.
గొనము విశే. పొట్టివాడు. ఆం.భా. 2.123.
గొనప[1] రూ.చూ. గొనము. వి. అరిగిననాగేలు.
గొనపనాగేలు వి. అరిగిపోయిన మెట్టనాగలి.
గొనప[2] రూ. గొనబ. విశే. 1. పొట్టివాడు. ఆం.భా. 2.123; 2. పొట్టి.
గొనపకోడి వి. పక్షి విశేషం.
గొనపు రూ.చూ. గుసుపు. వి. 1. విలాసం; 2. ప్రకాశం.
గొనబ రూ.చూ. గొనప[2]. విశే. వామనుడు, పొట్టివాడు.
గొనబగు చూ. గొనబు.
గొనబారు చూ. గొనబు.
గొనబు విశే. 1. శ్రావ్యమైన. వసు. 3.28; 2. మంజులమైన, సొగసైన. శుక. 3.105; 3. పరిమళంకల. దశా. 8.39; 4. మధురమైన. శశా. 3.43; 5. మృదులమైన. శేత. శశా. 3.95; వి. 1. సొగసు, విలాసం. ఆం.భా. 1.139; 2. సౌందర్యం.
గొనబగు వి. ఇంపగు, చక్కనగు. <గొనబు+అగు.

గొనబారు అ.క్రి. మనోజ్ఞమగు, సొగసగు. రసిక. 3.72. <గొనబు+ఆరు. గొనబుకాఁడు వి. సొగసరి, అందగాడు. అచ్చరా. సుందర. 181. గొనబుపాట విణ. సంచుపాట, మధురవిలాస గీతం.

గొనమ రూ. గొనం, గొనప1, గొనెము. వి. అరిగిన నాగేలు. ఆం.భా. 2.232.

గొనము[1] వి. పొశీల్యాది గుణం, శౌర్యాది గుణం. భార. ఆరణ్య. 1.189.

సం. గుణ-. గుణం; ప్రా. గుణ-; అ.మా.అ.ప. గుణ;

మ. కొణం. సద్గుణం;

<ప్రా. గుణ-.

గొనములప్రోక వి. గుణాల రాశి. దశకు. 1.40.

గొనము[2] చూ. గొనయము. వి. వింటినారి. సాంబ. 44.

సం. గుణ-. వింటినారి; ప్రా. గుణ-.

<ప్రా. గుణ-.

గొనము[3] వి. మడుగు.

గొనయము రూ. గనయము[2]. వి. 1. వింటినారి, మౌర్వి.కు. సం. 1.15. భార. ద్రోణ. 3.204; 2. ధనురగ్రం ఆం. భా. 351.

సం. గుణక- గుణ. వింటినారి; ప్రా. గుణ, గుణయ-. తాడు;

క. గొణెయ. వింటినారి, నడిమిభాగం.

<ప్రా. గుణయ-.

గొనిసె రూ.చూ. గునిసె. విణ. పొట్టివాడు. ఆం.భా. 2.123.

గొనుగు రూ.చూ. గొలుగు[1]. వి. గుడపలం.

గొనుదు వి. తలుపుల్ని మూసి ఉంచడానికి వాడే సాధనం.

గొనువు రూ.చూ. గునువు. వి. 1. విలాసం; 2. సొగసు. 3. వృక్ష విశేషం.

గొనుమురొద్ద వి. ఆము కాల్చడానికి వాడే ఒకరకం అడవి కంప.

గొనె వి. మూలవాసాల మధ్యనున్న వాసాలను కలిపే కఱ్ఱ.

గొనెబిళ్ళ రూ.చూ. గొణెబిళ్ళ. వి. క్రీడావిశేషం.

గొనెము రూ.చూ. గొనమ. వి. అరిగిన మెట్ట నాగలి.

గొంతరించు అ.క్రి. అతిశయించు. లక్ష్మీ. వి. 3.57.

గొంతారిపోవు చూ. గొంతు.

గొంతి రూ. గోఁతి వి. 1. పాండురాజు పెద్ద భార్య. భార.ఆది. 5.23; 2. స్త్రీ. బసవ. 3.575 పం.

సం. కుంతీ; ప్రా. కొంతీ, కుంతీ. పాండవ మాత; అ.ప. కొంతిక, కుంతి;

క. కొంతి.

<ప్రా. కొంతీ.

గొంతెమ రూ.చూ. గొంతెమ్మ. వి. ఒకానొక గ్రామ దేవత. గొంతెమకోరిక రూ. గొంతెమ్మకోరిక, గొంతెమ్మ కోర్కె. వి. అసాధ్యపుకోరిక, కోరతగనికోరిక. పాండు. 4.166. గొంతెమగొమరు రూ.చూ. గొంతెమగోరు. వి. లంజెనపరం, సారణి. గొంతెమగోరు రూ. గొంతెమ గొమరు. వి. సారణి, లంజెనపరం ఆం.భా. 2.70 (Paederiafoetide). గొంతెమ్మ రూ. గొంతెమ, గొంతేనమ్మ, గొంతేలమ్మ. వి. 1. హరిజనులు పూజించే గ్రామ దేవత; 2. శూన్యం. <గొంతి+అమ్మ. గొంతెమ్మకోరిక రూ.చూ. గొంతెమకోరిక. వి. అసాధ్యపుకోరిక, కోరతగని కోరిక. గొంతెమ్మకోర్కె రూ.చూ. గొంతెమకోరిక. వి. తగనికోర్కె, అసాధ్యపుకోరిక. వ్యు. మహాభారతంలో కుంతీ దేవి అనేకాలైన తగని కోర్కెల్ని అసాధ్యపు కోర్కెల్ని కోరింది. కాబట్టి ఈ అర్థాలు. గొంతెమ్మపండుగు వి. ఒక పండుగ. గొంతెమ్మలుపెట్టు స.క్రి. గొబ్బెమ్మలు పెట్టు. గొంతేనమ్మ రూ.చూ. గొంతెమ్మ. వి. హరిజనులు పూజించే ఒకానొక గ్రామదేవత. గొంతేలమ్మ రూ.చూ. గొంతెమ్మ. వి. గొంతేనమ్మ.

గొంతు రూ.చూ. గొంతుక. వి. 1. కంఠధ్వని. హంస. 3.222; 2. కంఠం. ఆం.భా. 2.141; 3. కుక్కుటాసనం; 4. తాపీరేకును పిడినికలిపే వంగిన ఇనప చువ్వ; 5. పాత్రల అంచుకు కిందుగా ఉండే మెడభాగం.

గొంతారిపోవు అ.క్రి. గొంతెండిపోవు. <గొంతు+ఆరి పోవు. గొంతుకమ్మ అ.క్రి. డగ్గుత్తిపడు. గొంతుకూర్చుండు అ.క్రి. మోకాళ్ళు గొంతుదాక అనేట్లు కూర్చుండు. గొంతు కూర్చుండుకొను అ.క్రి. మోకాళ్ళు గొంతుదాక అనేటట్లు కూర్చుండు వేమ.శ. 50. గొంతుకొను అ.క్రి. మోకాలు చిప్పలు గొంతుదాకా వచ్చేటట్లు కూర్చొను. పండి.చ. 5.440. పు. 8 పం. గొంతుకోలు వి. కంఠనాళం. గొంతుక్రోవి వి. కంఠనాళం. గొంతుగోయు(-కోయు) స.క్రి. అపకారం చేయు. పాంచాలీ. 3.65. గొంతుచించుకొను అ.క్రి. గొంతుక పగిలేటట్లు అరచు. గొంతుపట్టు అ.క్రి. ఉక్కిరి బిక్కిరి అగు. గొంతుపట్టుకొను అ.క్రి. అపాయమేర్పడు. గొంతుపోఁక రూ. గొంతుకపోఁక. వి. గొంతుముడి, గొంతు కలో పోకకాయవలె ఉండే ఎముక. గొంతుమాటు వి. ముప్పదిరెండు విన్నాణాల్లో ఒకటి, మల్లబంధ విశేషం హంస. 1.206; అ.క్రి. కంఠధ్వని వేరేగా అగు. గొంతు ముడి వి. గొంతులో ముందువైపు పోకకాయవలె ఉండే ఎముక. గొంతుమూఁగపోవు అ.క్రి. స్వరం తగ్గు. గొంతు రాయి వి. బావి అడుగు భాగంలోని చట్టురాయి. గొంతు రాయు అ.క్రి. డగ్గుత్తిపడు. గొంతువిచ్చు అ.క్రి. గొంతు చించుకొను. గొంతెండు అ.క్రి. గొంతారిపోవు. <గొంతు+ ఎండు. గొంతెత్తు అ.క్రి. కంఠధ్వని పెంచు, ఎలుగెత్తు. <గొంతు+ఎత్తు.

గొంతుక రూ. గొంతు. వి. కంఠం. జైమినీ భా. 6.175.

క. కుతిగె. గొంతు, మెడ; నా. కుట్కు. గొంతు.

గొంతుకపోఁక రూ.చూ. గొంతుపోఁక. వి. గొంతుముడి, గొంతుక ముందరివైపుకు పోకవలె ఉండేఎముక.

గొంతెండు చూ. గొంతు.

గొంతెత్తు చూ. గొంతు.

గొంతెమ చూ. గొంతి.

గొంతెమకోరిక చూ. గొంతి.

గొంతెమగొమరు చూ. గొంతి.

గొంతెమగోరు చూ. గొంతి.

గొంతెమ్మ చూ. గొంతి.

గొంతెమ్మకోరిక చూ. గొంతి.

గొంతెమ్మకోర్కె చూ. గొంతి.

గొంతెమ్మపండుగు చూ. గొంతి.

గొంతెమ్మలుపెట్టు చూ. గొంతి.

గొంతేనమ్మ చూ. గొంతి.

గొంతేలమ్మ చూ. గొంతి.

గొంది[1] రూ. గొందు. వి. **1.** కొండయొక్క చిన్నమరుగుచోటు. భార. శాంతి. 3.62 ; **2.** స్థానం, లోకం. భాగ. 3.505 ; **3.** మూల. అని. 3.85 ; **4.** చిన్నసందు ; **5.** మహానసం, వంటిల్లు ; **6.** మధ్యలో ఆగిపోయేబాట.

క. *గొంది, గొందు.* సందు, చిన్నపీధి, సముద్రంలో చిన్నతోవ.

గొందిపెట్టు రూ.చూ. గొందిఁబెట్టు. స.క్రి. దాచు, మరుగుపరుచు. గొందిఁబెట్టు రూ. గొందిపెట్టు. స.క్రి. దాచు. గొందిరిస్తా వి. కాలిబాట. హిం. ఉ. రాస్తా. బాట. గొందిల్లు వి. వంటచేసేగది <గొంది + ఇల్లు. గొందులఁబెట్టు స.క్రి. దాచు, మరుగుపరుచు.

గొంది[2] వి. తుమ్మచిగురువంటి చిగురునిచ్చే చెట్టు (Bauhina-retusa).

గొందులఁబెట్టు చూ. గొంది[1].

గొందు రూ.చూ. గొంది[1]. వి. **1.** దేవుడిబొమ్మపెట్టుకొనేగూడు ; **2.** సందు.

గొవ్నాం వి. జనపనారత్తో అల్లినసంచి.

గొప్ప విఱ[1]. వెడల్పైన, విశాలమైన. విజయ. 2.164 ; **2.** (వెల మొ. వాటిలో) పెద్దదైన, లేదా అధికమైన. సీలా. 1 61 ; **3.** బహుళమైన, ఎక్కువైన. దశా. 1.187 ; **4.** గౌరవించతగిన ; వి. **1.** గొప్పతనం ; **2.** భాగ్యం.

గొప్పగా (-కాన్) క్రి. విఱ.ద్రు. ఎత్తుగా, బిగ్గరగా, పెద్దగా. గొప్పగోడులు వి.బ.వ. కొద్దిగొప్పలు. గొప్పచెప్పు స.క్రి. దాంబికాలు పలుకు. గొప్పచేయు స.క్రి. పెద్దచేయు. గొప్పచేసికొను స.క్రి. స్వోత్కర్ష చెప్పుకొను. గొప్పడుగు మెకము వి. ఏనుగు. వేంక. ఆం. 3.33. గొప్పబొజ్జగలాఁడు వి. గణపతి. వ్యు. పెద్దకడుపు కలవాడు. గొప్పమనసుచేసికొను అ.క్రి. ఎక్కువ ఔదార్యం చూపు. గొప్పమెయిప్రోడ వి. ఏనుగు, గణపతి. గొప్పయునుఖు (-ఉసుఖు) వి. దీర్ఘాయువు. గొప్పలుచెప్పు స.క్రి. డాబులుకొట్టు. గొప్పవేల్పు వి. పరమేశ్వరుడు.

గొప్పించు స.క్రి. తప్పించు.

గొప్పి యా.చూ. గొప్పు. వి. **1.** గొప్పు, మెట్ట, దిబ్బ ; **2.** బొప్పి.

గొప్పు రూ. గొప్పి. వి. **1.** నిమ్నోన్నతమైన భూమి ; **2.** మిట్ట ; **3.** గోపానసి, చూరుపట్టె ; **4.** బొప్పి.

గొప్పుతవ్విగొయ్యితవ్వి సంపాదించు స.క్రి. నానాబాధలు పడి సంపాదించు. గొప్పుపైరు వి. కలుపైరు, కలుపుతీయటానికి వీలైనంత ఎత్తుగాపెరిగినపైరు. గొప్పులు వి.బ.వ. **1.** మిరపతోట మొ. వానిలోకొంచెం ఎత్తుగాఉండేచోట్లు ; **2.** గోపానసి, చూరుపట్టె.

గొబ వి. **1.** గుహ. హరి. ఉ. 5.161 ; **2.** గొంది, మూల. ఉ. హరి. 5.36.

సం. *గుహా.* గుహ ; దేప్రా. *గుంఫు.* దాగుమనటం ; హిం. మరా. *గుఫా.*

త. కెవి. గుహ ;

<సం. గుహా.

గొబడి వి. పక్షి విశేషం, ఒకానొకపక్షి. ఆం. భా. 2.98.

గొబ్బ వి. బానలోనుంచి కల్లుముంచిపోయడానికి వాడే మట్టిముంత.

గొబ్బం వి. నేలతవ్వడానికి పనికివచ్చే ఒకరకం తొల్లిక.

గొబ్బగూడు వి. పచ్చిగోడలోడబ్బు దాచుకోడానికి చిన్న ముంతను అమర్చిన గూడు.

గొబ్బందు వి. గొప్పపందు. పాండు. 1.118.

<గొప్ప + పందు.

గొబ్బన రూ. గొబ్బున. క్రి. విఱ. ద్రు. శీఘ్రంగా. భాగ. 10. ఉ. 456.

త. *కొప్పె-ఎనల్.* త్వరగా కదలటంవల్ల అయ్యే అనుభవం ; *కొప్పుఎనల్.* ఆకస్మికంగా జరిగేదాని అనుభవం.

గొబ్బరము వి. ఎరువుదిబ్బలో కుళ్ళినపేడ, చేలకువేసేపెంట, ఎరువు.

సం. *గోవర-, గోమయ-.* పేడ ; హిం. *గోబర్.*

క. *గొబ్బర.* ఎరువు ;

<హిం. గోబర్.

గొబ్బరి రూ.చూ. కొబ్బెర. వి. కొబ్బరి.

గొబ్బి[1] వి. **1.** ధనుర్మాస దినాల్లో సాయంకాలాల్లో గడపలకు ముందు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుతూ చుట్టివచ్చి జరిపే వేడుక. హంస. 5.14 ; **2.** సమర్తాడినపుడు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుతూచుట్టివచ్చి జరిపించే వేడుక ; **3.** హైందవ దేవతా విశేషం.

తు. *గొబ్బు.* ఆట, నాట్యం ; *గొబ్బులి.* ఆడు, పరిహసించి తృణీకరించు ; త. *కొప్పి.* చేతులు తడుతూ పాట పాడుతూ యువతులు ఆడేఒకఆట.

గొబ్బిపదములు వి.బ.వ. గొబ్బితడుతూ పాడుకొనే పాటలు. పండి. చ. 3. 513వ. గొబ్బిళ్లు[1] వి.బ.వ. **1.** బాల్యక్రీడా విశేషం. విష్ణువు. 7.202 ; **2.** ఒకానొకపాట. శుక. 2.433. గొబ్బులాడు అ.క్రి. గంతులుపెట్టు <గొబ్బి + -లు + ఆడు. గొబ్బెమ్మ వి. **1.** గొబ్బెమ్మ ; **2.** బాలికల నృత్యవిశేషం. గొబ్బి[1] + అమ్మ.

గొబ్బి[2] వి. గొలిమిడి. ఆం.భా. 2.56.

గొబ్బికాయలు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. గొబ్బిగింజలు వి.బ.వ. కోకిలాక్ష బీజాలు. గొబ్బిచెట్టు వి. కోకిలాక్షకం, గొలిమిడి.

గొబ్బి[3] వి. పచ్చని పూలు పూసే ఒక చెట్టు (Barleria cuspidata).

గొబ్బిలి వి. ఉపయోగంలేని ఒకానొక చెట్టు.

గొబ్బిళ్లు[2] వి.బ.వ. నమస్కార భేదం. హంస. 4.213.

గొబ్బు వి. నీరు గొబ్బిచెట్టు (Asteracantha longifolia).

గొబ్బిగొబ్బిన అవ్య. ద్రు. 1. వేగంగా; 2. హఠాత్తుగా.

గొబ్బిన రూ.చూ. గొబ్బన. అవ్య.ద్రు. 1. ఆకస్మికంగా. శృం.నై. 3.116; 2. శీఘ్రంగా, వేగంగా. వసు. 2.59.

గొబ్బెమ్మ చూ. గొబ్బి[1].

గొమలి వి. మొగలి.

గొమలిరేకు వి. మొగలిరేకు. క్రీడా. 176.

గొముకు స.క్రి. గొప్పలు చెప్పు.

గొమ్మవేల రూ. గొమ్మనేల. వి. ఏటివరద తాకే నేల.

గొమ్మరేకు వి. ఒకానొక ఫల వృక్షం (Averrhoa Bilimbi).

గొమ్మువేల రూ.చూ. గొమ్మనేల. వి. ఏటి వరదల తాకిడి గల నేల.

గొయి రూ. గొయ్య[1], గొయ్యి, గోయి, గ్రొయ్యి. వి. గోయి. వి్రక. 3.81.

కో. కుయ్. గొయ్యి; కువి. గ్రొయు. రంధ్రం.

గొయ్య రూ. చూ. గొయి. వి. 1. లోతైన గుంట; 2. గానుగ రాతి చక్రం తిరిగే నన్నటి గుండ్రటి కాలవ.

గొయ్య[3] వి. జామచెట్టు. ఒక ఫల వృక్షం (Psedium guajava).

పో. గొయాబ. జామపండు; స్పా. గూయాబా; ఫ్రె. గొయావ్.

క.మ. కొయ్యా, గొవ; త. కొయ్యప్పళమ్.

<పో. గొయాబ.

గొయ్యపండు రూ.చూ. గొయ్యాపండు. వి. జామపండు.

గొయ్యాపండు రూ. కొయ్యాపండు, గొయ్యపండు. వి. జామ పండు. హంస. 4.134.

గొయ్యి రూ.చూ. గొయి. వి. 1. గుంట, కుంట; 2. మరాను చక్రం తిరగటానికి అనువుగా తవ్విన పల్లం ప్రదేశం; 3. నేతబయల్లో పావుకోళ్ళు అమర్చటానికి తవ్విన చోటు.

గొయ్యిమగ్గం వి. గోతి మగ్గం.

గొయ్యలకూర వి. పొదలాగ పెరిగే ఒక మొక్క (Suaeda monoica).

గొర వి. పంది చేసే ముర్ఘర ధ్వని. ధ్వన్యను.

గొరక[1] వి. 1. ఇనప బాణం. అమ్ము. మను. 4.47; 2. చిన్న ఈటె. సారంగ. 1.96.

సం. క్షురక-. ఇనప ములికి; ఖురాలక. ఇనప బాణం; ప్రా. ఖురగ-.

<ప్రా. ఖురగ.

గొరకకట్టె రూ.చూ. గొఱకకట్టె. వి. 1. అలుగున్న చేతి కర్ర; 2 చేతి ఈటె.

గొరక[2] రూ.చూ. గొఱక. వి. మృగ విశేషం, కారెనుము.

గొరక[3] విశే. 1. చింపిరి. జాహ్నవి. 4.20; 2. గరుకు, బిరుసు. పద్మ. 3.189.

గొరకచేవ వి. విలువలేని చేవ, ఒక రకం చేవ.

గొరకు[1] రూ.చూ. గొఱకు. వి. క్షుద్రుడు, నీచుడు.

గొరకు[2] రూ.చూ. గొరగ[2]. వి. వృక్ష విశేషం.

గొరగ[1] రూ. గొరవ. వి. 1. మైలారు అనే క్షుద్ర దేవతను కొలిచే ఒకానొక మతంవాడు. యుద్ధ మల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 858; 2. భిక్షుకుడు. కు.సం. 7.38; 3. శివభక్తుడు. బసవ. 3.645.

క. గొరగ. శైవ భిక్షుకజాతి; కొడ. గురు. పురోహితుడు; త. కొరవన్. పూజ్యుడు; కొరవర్. పెద్దలు; మ. కురు. గురువు: కోరన్. శివుడు; కువి. గురు, గూరెని. మతబోధకుడు;

సం. గురు-. గురువు; ప్రా. గురుఅ, గురుయ, గురవ. గురువు; శౌ. గురఅ. అ.మా. గురుయ; అ.ప. గురుఅ.

<క. గొరగ.

గొరగవల్లము వి. శైవభిక్షుకుని వరిచేను.

గొరగ[2] రూ. గొరకు[2]. వి. వృక్ష విశేషం.

గొరగ[3] రూ.చూ. గొఱకు. వి. 1. నీచుడు; 2. దుష్టుడు.

గొరగముడి వి. కుంటి నేరేడు చెట్టు. తెల్లని పూలు, ఎర్రని కాయలు కాసే చెట్టు (Eugenia bracteata).

గొరగొర రూ. గొఱగొఱ. వి. 1. వేగం. నీలా. 3.11; 2. బారుబుతీరి వచ్చేప్పుడయ్యే ధ్వనికి అనుకరణం; 3. ముర్ఘు రింత, పంది ముర్ఘుర ధ్వని. ధ్వన్యను.

గొరంక వి. గోరువంక, మైనా.

గొరజ రూ. గొర్జ. వి. కాలి తోవ.

గొరపెట్టు అ.క్రి. 1. గురకపెట్టు; 2. హుంకరించు.

గొరమ వి. మిట్ట. నవనాథ. 46.

గొరవ రూ.చూ. గొరగ[1]. వి. శివభక్తుడు. ఆం.భా. 86.

గొరవయ్య రూ. గెరవయ్య. వి. 1. ఒక యాచకుడు; 2. శైవ భక్తుడు.

గొరవక రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక, శారిక. పండి. చ. 2.342 పు. 3 పం.

గొరవంక రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక, శారిక. వి్రక. 7.49.

గొరవంకతెగరబి వి. మన్మథుడు. గొరవంకరాజనాలు వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112.

గొరవ వి. చేపల గుంపు.

గొరవకత్తి వి. రెండు వైపుల పదును గల కత్తి, దుడ్డు కత్తి.

గొరవగాలి వి. గిట్టల్లో పురుగులుపడి గొడ్డు నడవలేక పోవడం.

గొరి రూ.చూ. గొరివి. వి. తెల్లని పూలు పూసే చెట్టు (Ixorapassiflora).

గొరిగి రూ.చూ. గురిగి[2]. వి. పిడత.

గొరిగె వి. ఇనప మొక్కలాటి కలువ మొక్క.

గొరిజ[1] రూ. కొరిగె, కొరిజె[1], గొరిజియ, గొరిజె, గొరిసె[1]. వి. గిట్ట. నృసింహ. 3.36.

క. గరసె, గుజును, గొరసు, గొరిసె. డెక్క; త. కురచు, కురప్పై. గుర్రపు డెక్క.

గొరిజ[2] రూ.చూ. గొఱిజ. వి. డేరా.

గొరిజియ రూ.చూ. గొరిజ[1]. వి. గొరిజ.

గొరిజె రూ.చూ. గొరిజ[1]. వి. గొరిసె.

గొరితి రూ.చూ. గొర్తి. వి. గూటిమొక్క, ముళ్ళు కలిగిన పొద (Plecospermum spinoxm).

గొరిదబరాయి వి. గుబ్బిగడ్డలో బిగించే రంధ్రమున్న నునుపు రాయి.

గొరియ రూ.చూ. గొఱియ. వి. గొఱ్ఱె.

గొరివి రూ. గొర్వి. వి. తెల్లని పూలు పూసే చెట్టు (Ixorapassiflora).

గొరిసె[1] రూ.చూ. గొరిజ[1]. వి. గొరిజ. దశా. 2.224.

గొరిసెగాలి వి. పశువుల గొరిసెల మధ్య పుండై పురుగులు పడే వ్యాధి.

గొరిసె[2] రూ.చూ. గురుజ[1]. వి. గింజ నుంకు కంకిమీద ఏర్పడే నూగు.

గొరుకాళ్లు రూ.చూ. గొరుకోళ్లు. వి.బ.వ. ఆరుద్రా నక్షత్రం.

గొరుకొయ్యలు రూ.చూ. గోరుకొయ్యలు. వి.బ.వ. ఆరుద్రా నక్షత్రం.

గొరుకోళ్లు రూ. గొరుకాళ్లు. వి.బ.వ. ఆరుద్రా నక్షత్రం.

గొరుగించు చూ. గొరుగు[1].

గొరుగించుకొను చూ. గొరుగు[1].

గొరుగు[1] రూ.చూ. గొఱుగు. స.క్రి. క్షౌరంచేయు.

గొరుగించు రూ.చూ. గొఱుగించు. స.క్రి. క్షౌరంచేయు. గొరుగించుకొను స.క్రి. క్షౌరం చేయించుకొను.

గొరుగు[2] రూ. గొలుగు[2], గోగు. వి. గొలుగు (Heliscus campinus).

గొరుపడము రూ.చూ. గొఱుపడము. వి. నల్లకంబళి.

గొరుమట్టు రూ.చూ. గొఱుమట్టు. వి. విత్తనాలు పడటానికి గొర్రు చెక్కలకు వేసిన బెజ్జం.

గొరుముంత రూ.చూ. గొఱుముంత. వి. జడ్డిగానికి అమర్చిన కొయ్య గిన్నె.

గొరువంక రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక, శారిక.

గొరె రూ.చూ. గొఱియ. వి. గొఱ్ఱె.

గొర్గు రూ.చూ. గొఱుగు. స.క్రి. క్షౌరంచేయు. కాశీ. 1.48.

గొర్గెపురోగం వి. మిరప తెగులు.

గొర్జ రూ.చూ. గొరజ. వి. కాలితోవ.

గొర్తి రూ. గొరితి. వి. గూటిమొక్క, ముళ్ళు కలిగిన పొద (Plecospermum spinomus).

గొర్తికొయ్యలు చూ. గొర్రు.

గొర్తిగిన్నె చూ. గొర్రు.

గొర్తివేల చూ. గొర్రు.

గొర్తిపట్టెలు చూ. గొర్రు.

గొర్తివదును చూ. గొర్రు.

గొర్తిమొలలు చూ. గొర్రు.

గొర్తియర్ద చూ. గొర్రు.

గొర్పడము రూ.చూ. గొఱుపడము. వి. నల్లకంబళి, బొచ్చు కంబళి.

గొర్రియ రూ.చూ. గొట్టియ. వి. గొట్టె.

గొర్వి రూ.చూ. గొరివి. వి. తెల్లని పూలు పూసే చెట్టు (Ixorapassiflora).

గొర్రు రూ.చూ. గొట్టు. వి. జా. 1. 32 కుంటల పొలం; 2. దున్నిన పొలం మీద దున్నే యంత్రం.

గొర్తికొయ్యలు వి.బ.వ. గొరుకొయ్యలు, గొర్తికొయ్యల వలె ఉండే మూడు చుక్కలు. గొర్తిగిన్నె వి. జడ్డిగాని కమర్చిన కొయ్య గిన్నె, దీనిలో గింజలు కింది వెదురు గొట్టాల గుండా జారి చాళ్ళలో పడతాయి. గొర్తివేల రూ.చూ. గొత్తివేల. వి. ఒక నాగలితో దున్న తగిన నేల. గొర్తిపట్టెలు రూ.చూ. గొత్తిపట్టెలు. వి.బ.వ. గొర్తి అర్దకు వేసి తగిలించే పట్టెలు. గొర్తివదును వి. గొర్రులో విత్తటానికి వీలుగా తవ్వడం. గొర్తిమొలలు రూ.చూ. గొత్తిమొలలు. వి. గొర్తి కర్రకు వేసే నాగసరం. గొర్తియర్ద రూ.చూ. గొత్తియర్ద. వి. గొర్తికి బళ్ళు తగిలించే అర్ద. గొర్రుతోలు అ.క్రి. దున్ను.

గొర్రె రూ.చూ. గొఱియ. వి. మేషం, కురరి.

గొర్రెకొమ్ము[1] వి. నల్లకాల్పులో కుండలు నల్లగా వచ్చేటట్లు చూడటం. గొర్రెకొమ్ము[2] వి. గొర్రెకొమ్ము లాగ మొదలు దగ్గరే చుట్టలు తిరిగిన కొమ్ము. గొర్రెగడ్డం రూ.చూ. గొట్టెగడ్డము. వి. బంజరు నేలల్లోను, రోడ్లపక్కను మొలిచే కలుపుమొక్క. గొర్రెచీమిడి రూ.చూ. గొత్తెచీమిడి. వి. మెట్ట నేలల్లో ఏటా లేచి పెరిగే ఒక కలుపుమొక్క. గొర్రెచెదలు రూ.చూ. గొత్తెచెదలు. వి.బ.వ. ఒక రకం చెదపురుగులు. గొర్రెతుప్పటి వి. సారెపట్టు మన్ను తయారీకి వాడే గొర్రెదొచ్చు. గొర్రెతొక్కుడు వి. గొర్రె తొక్కిన నేలమాదిరి ఉన్న మబ్బు. గొర్రెతోలు వి. సర్వే టప్పుడు కుమ్మరి కూర్చోడానికి కింద పరచుకొనే గొర్రె చర్మం. గొర్రెనుచ్చు రూ.చూ. గొత్తెనుచ్చు. వి. గొర్రె పేడ, దీంతో కారం తయారుచేసి ఎర్ర రంగు అద్దే ముందు నూలును దీంట్లో వేసి పిసుకుతారు. గొర్రెపిల్ల వి. గొర్రి పిల్ల. గొర్రెబూరు వి. సారెపెట్టు మన్ను తయారీకి వాడే గొర్రె ఉన్ని. గొర్రెరువు వి. గొర్రెల పెంట.

గొర్లమంద చూ. గొఱియ. వి అమాయకులూ, అజ్ఞానులూ, బుర్రను ఉపయోగించకుండా ఇతరుల్ని అనుకరించేవారి సమూహం.

గొర్లు చూ. గొఱియ. వి.బ.వ. గొర్రెలు.

గొఱక రూ. గొరక[2]. వి. 1. అడవిదున్న అరపు. మను. 4.48; 2. అడవిదున్న, కారుపోతు, ధ్వన్యను.

గొఱకవేయు అ.క్రి. కారుదున్నలా అరచు, ధ్వనిచేయు.

గొఱకకట్టె రూ. గొరకకట్టె. వి. అలుగున్న చేతి కర్ర.

గొఱకు రూ. గొరకు[1], గొరగ[3]. విశ. 1. దుష్టుడు. విజ్ఞా. ఆచా. 139; నృసింహ. 4.86; 2. నీచుడు.

సం. క్షుల్లక-. నీచుడు.

గొఱకు(దపము (-తనము) వి. దౌష్ట్యం. దశకు. 3.11.

గొఱగయ్య చూ. గొరగ[1]. వి. ఈశ్వరుడు, ఒక తెగ శివ భక్తుడు.

గొఱగొఱ రూ.చూ. గొరగొర. వి. ఒకానొక ధ్వన్యనుకరణం, శబ్దం.

గొఱపము రూ. కొడపము, కొఱపము. వి. 1. కొరపం, అర్ధ చంద్రాకార బాణం. రం. రా. ఉ. 52 పు. 8 పం.; 2. గుర్రాన్ని తోమటానికి ఉపయోగించే పనిముట్టు. ఆము. 4.35.

క. కొరప, గొరప; త. కురప్పమ్. గుర్రాన్ని

తోమే సాధనం ; త. కురప్పమ్, కురప్పన్.

సం. క్షుర్ప్ర-. గుర్రంనాడా ఆకారంగల బాణం, కలుపు తీయటానికి ఉపయోగించే సాధనం ; ప్రా. ఖురప్ప-, ఖురుప్ప-. బాణ విశేషం, గడ్డి కోసే కత్తి ; ఖుర్పి. గడ్డి తవ్వే సాధనం ; పా. ఖురప్ప. గుర్రపు నాడావంటి కత్తి ; నే. ఖుర్పా. కొడవలి ; ఖుర్పి. కలుపుతీసే సాధనం ; బెం. ఖుర్పా. గడ్డికోసే కత్తి. హిం. ఖుర్పా, ఖుర్పీ. కలుపుతీసే కత్తి ; గు. ఖరప్వు, ఖర్పో. తురుము సాధనం, కోరం ; ఖుర్పీ. తవ్వకోల ; మరా. ఖుర్పి, ఖుర్పె. వంకర తవ్వకోల.

**గొఱపోతు** రూ.చూ. గొఱియపోతు. వి. మగ గొర్రె.

**గొఱబోతు** (-పోతు) రూ.చూ. గొఱియపోతు. వి. మగ గొర్రె.

**గొఱిగించు** చూ. గొఱుగు.

**గొఱిజ** రూ. గొరిజ[2]. వి. డేరా.

**గొఱిమి** వి. గొలిమిడి అనే ముళ్ళచెట్టు.

**గొఱియ** రూ. గొరియ, గొరె, గొర్రియ, గొర్రె, గొఱె, గొఱ్ఱె. వి. **1.** గొర్రె. భార. అరణ్య. 4.295 ; **2.** మూర్ఖప్రాణి, తెలివిమాలిన జంతువు. బసవ. 5.91.

క. కుఱి, కొఱి. గొర్రె ; తు. కురి ; త. కొఱి ; మ. గొఱి. చిన్నగొర్రె ; కొండ. గొర్య. గొర్రె ; కొలా. గొర్రె ; కువి. (F) గోరి.

పో.చూ. సం. కురరీ. ఆడగొర్రె.

**గొఱియగొంగ** వి. తోడేలు. వేంక. అం. 4.95. **గొఱియపోతు** రూ. గొఱపోతు, గొఱబోతు. వి. మేషం, మగ గొర్రె. అచ్చ. రా. యు. 2.31. **గొఱియలసూడు** వి. తోడేలు. సాంబ. 4.76.

**గొఱుకు** రూ.చూ. గొఱుగు. స.క్రి. క్షౌరంచేయు.

**గొఱుకొయ్యలు** రూ.చూ. గోరుకొయ్యలు. వి.బ.వ. గొర్రి కొయ్యలు.

**గొఱుగు** రూ. గొరుగు[1], గొర్గు, గొఱుకు. స.క్రి. క్షౌరం చేయు. భార. అరణ్య. 6.250 ; వి. గొరగడం.

గోం. కోరీ. జుట్టు కత్తిరించు. గొరుగు ; కొలా. గుడిప్. గడ్డికోయు ; బ్రా. గొర్ఘ్.

సం. క్షుర్. క్షౌరంచేయు ; ప్రా. ఖుర.

**గొఱిగించు** రూ. గొరుగించు. స.క్రి. **1.** గొరిగేట్లుచేయు. కాశీ. 1.48 ; **2.** ఖర్చుచేయించు ; **3.** పనిచెడగొట్టు. **గొఱుగులుపడు** రూ.చూ. గొఱుగులువడు. అ.క్రి. గొరగబడ్డవగు. **గొఱుగులువడు** (-పడు) రూ. గొఱుగులుపడు. అ.క్రి. గొరగబడ్డవగు. పద్మ. 2.191.

**గొఱుపడము** రూ. గొరుపడము, గొర్పడము, గొఱువడము, గోరుపడము, గోర్పడము. చూ. గొఱియ. వి. నల్లకంబళం, బొచ్చుకంబళి. బసవ. 3.1137. పం.

**గొఱుమట్టు** రూ. గొరుమట్టు. వి. విత్తుపడడానికై గొర్రు చెక్కలకు వేసిన బెజ్జం.

**గొఱుముంత** రూ. గొరుముంత. వి. గొర్రికి అమర్చబడ్డ జడ్డిగం పిడత.

**గొఱువడము** రూ.చూ. గొఱుపడము. వి. బొచ్చుకంబళి, నల్లకంబళి.

**గొఱె** రూ.చూ. గొఱియ. వి. **1.** గొర్రె. పాంచాలీ. 2.4 ; మూర్ఖప్రాణి, తెలివిమాలిన జంతువు.

**గొఱ్ఱికఱ్ఱలు** చూ. గొఱ్ఱు.

**గొఱ్ఱినాగలు** చూ. గొఱ్ఱు.

**గొఱ్ఱిపట్టెలు** చూ. గొఱ్ఱు.

**గొఱ్ఱిమొలలు** చూ. గొఱ్ఱు.

**గొఱ్ఱియడ్డ** చూ. గొఱ్ఱు.

**గొర్రియడ్డపట్టె** చూ. గొఱ్ఱు.

**గొఱ్ఱిగడ్డము** రూ. గొర్రెగడ్డం. వి. ఒకజాతి కలుపు మొక్క.

**గొఱ్ఱిచీమిడి** రూ. గొఱ్ఱెచీమిడి. వి. ఒక జాతి కలుపు మొక్క.

**గొఱ్ఱియ** రూ. గొర్రు. వి.జా. **1.** దున్నినపొలాన్ని చదును చేసే సాధనం. శుక. 2.408 ; **2.** ముప్పైరెండు కుంట్ల కొలది.

**గొఱ్ఱు** రూ. గొర్రు. వి.జా. **1.** దున్నినపొలాన్ని చదునుచేసే సాధనం. శుక. 2.408 ; **2.** ముప్పైరెండు కుంటల నేల.

**గొఱ్ఱికఱ్ఱలు** వి.బ.వ. గొర్రిపట్టెలువేసే కర్రలు. **గొఱ్ఱినేల** రూ. గొర్రినేల. వి ముప్పైరెండు కుంటలకొలది. **గొఱ్ఱినాగలు** వి.బ.వ. అడ్డుకువేసి కాడికి తగిలించే కూలరాలు. **గొఱ్ఱిపట్టెలు** రూ. గొర్రిపట్టెలు. వి. గొర్రి అడ్డకువేసి తగిలించే పట్టెలు. **గొఱ్ఱిమొలలు** రూ. గొర్రిమొలలు. వి. గొర్రికర్రలకువేసే నాగవాసాలు. **గొఱ్ఱియడ్డ**(-అడ్డ) రూ. గొర్రియడ్డ. వి. గొర్రికిబట్కు తగిలించే అడ్డ. **గొఱ్ఱియడ్డపట్టె** వి. నాగలుపైనవేసి గొర్రిపళ్ల మొలను కట్టినది.

**గొఱ్ఱె** రూ.చూ. గొఱియ. వి. **1.** గొర్రె, మేషం. నీలా. 2.41 ; **2.** తెలివిమాలినవాడు ; **3.** ఒక తిట్టు (చవట).

**గొఱ్ఱెగుమ్మడి** వి. కొండల మీద పెరిగే మొక్క ఒకే గింజ ఉండే నీలం రంగు కాయలు కాస్తుంది. (Vitis Linnaei). **గొఱ్ఱెచీమిడి** రూ. గొర్రెచీమిడి. వి. ఒక రకం కలుపుమొక్క. **గొఱ్ఱెచెదలు** రూ. గొర్రెచెదలు. వి.బ.వ. గొర్రెచెదలు. క. గొద్ద. కుడితేనొప్పి పుట్టే ఒకరకమైన నల్ల చీమ. కొఱవె. ఒకరకమయిన చీమ ; గద. కొడకి. నల్ల చీమలు. **గొఱ్ఱెతోకగామండు** అ.క్రి. ఎదుగూబొదుగూలేకుండా ఉండు. **గొఱ్ఱెదాటు** వి గొర్రెలవలె గుడ్డిగా అనుసరించటం. **గొఱ్ఱెనచ్చు** రూ. గొర్రెనుచ్చు. వి. గొఱ్ఱెపెంటిక. **గొఱ్ఱెపాలు** వి. అవిసోపం. **గొఱ్ఱెపోతు** వి. గొర్రెపోతు. సాంబ. 3.74. **గొఱ్ఱెవలెవెఱ్ఱికూతలుకూయు** అ.క్రి. అజ్ఞానభాషితాలాడు.

**గొల** రూ. గెల. వి. గెల, గొలక, పూగుత్తి. పారి. 2.69.

**గొలక**[1] వి. పూలగుత్తి. హ.వ. 4.14.

**గొలకలు** వి.బ.వ. తాటిచన్నులు, గులకలు.

**గొలక**[2] రూ. గొలకు. వి. కలకలధ్వని, గొల్లు. అం.భా. 1.121.

**గొలకనకోడి** వి. ఒకనీటి పక్షి.

**గొలకు** రూ.చూ. గొలక[2]. వి. సేనాదుల కలకలం.

**గొలగొల** రూ.చూ. కొలకొల. వి. **1.** కొలకొల. మను 5.75 ; **2.** కలకల ధ్వని. నీలా. 3.15.

**గొలగొలలాడు** అ.క్రి. గొలగొల ధ్వనిచేయు. శివలీ. 2.76.

**గొలమె** రూ.చూ. కొలిమిడి. వి. ఒకరకం కంచె మొక్క.

**గొలవింద** వి. నల్లతీగ, తెలుపు, ముదురు ఎరుపు పూలుపూసే

కీగ (Derris Candens).

గొలికాలు రూ.చూ. గొలికోల. వి. ఆనుపై పీటకు బిగించిన మొదటికొయ్య.

గొలికోలు రూ. గొలికాలు. వి. ఆనుపై పీటకు బిగించిన మొదటి కొయ్య.

గొలిమి రూ.చూ. కొలిమిడి. వి. చిత్తడి నేలల్లో, వరిచేలల్లో, చెరువుగట్లమీద మొలిచే కలుపు మొక్క, శృంఖలీ వృక్షం. హంస. 4.10.

గొలిమిడి రూ.చూ. కొలిమిడి. వి. వృక్షవిశేషం.

గొలివె రూ.చూ. కొలిమిడి. వి. తృణవిశేషం.

గొలివెలు వి.బ.వ. దున్నకుండా పండినవడ్లు. ఆం.భా, 2.239.

గొలుం వి. ఉష్ణప్రాంతాల్లో పెరిగే చిన్నచెట్టు (Clywins Cochinnuis).

గొలుక వి. 1. చేరిక ; 2. పంక్తి, వరస.

గొలుకురాయి రూ.చూ. గులకరాయి. వి. ఒకరకం రాయి.

గొలుగు[1] రూ. గులుగు[2], గొనుగు. గొల్లు. వి. తుప్పగా పెరిగే ఒకరకం కలుపు మొక్క (Geycosmis pentaphylla).

గొలుగు[2] రూ. చూ. గొరుగు[3]. వి. గోగు, గోంగూర (Hibiscus cannabinus).

గొలుము వి. ఒకజాతి పళ్ళచెట్టు.

గొలునక్షరము చూ. గొలుసు.

గొలునంచు వి. గొలుసు మాదిరిగా డిజైనుపడేట్టు నేసిన అంచు.

<గొలుసు+అంచు.

గొలుసు వి. 1. కుక్క మొ. వాటికి కట్టే గొలుసు. మను. 4.27 ; 2. సంకెల. ఆము. 2.48 ; 3. గొలుసులాఉండి మెడ చేతులు మొ. వాటిలో ధరింపబడే ఆభరణ విశేషం. ఆం.భా. 2.149 ; 4. భూమిని కొలిచే గొలుసు ; 5. మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి బాల్‌బేరింగుల్లో ఉండేది ; 6. మరాసు పళ్ళ చక్రాలు తిప్పేది ; 7. ఊత్తె గొలుసు, కొండ్లగొలుసు, గొండి, గొళ్ళెం, తంతె, వరి గొలుసులు; 8. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల వడి దారాలకు వేసిన లంకె ; 9. డాబీకోలలు లేవటానికి గొలుసుమాదిరిగా నన్నబద్దలు కూర్చిన సాధనం ; 10. గొంగడి మగ్గంలో, జంత్రం పై కట్టెకు కిందికట్టెకు బిగించిన జనపకొండి ; 11. తలుపులను మూసి ఉంచడానికి వాడే సాధనం ; 12. గానుగకర్రను కాడికి కలిపికట్టే జనప కొక్కెలవరస.

క. గొలను, గొణసు. గొలుసు ; తు. గొణసు, గణసు. గొలుసు ; త. కొలుచు. చేతికిగాని కాలికిగాని వేసుకొనే బంగారు లేదా వెండిగొలుసు.

గొలునక్షరము వి. గొలుసుకట్టురాత. <గొలుసు+అక్షరము. గొలుసుకట్టు వి. 1. పొయ్యికిగాని, గోలెంకుగాని పక్కలో చుట్టూ నన్నని తాలికలంటించి వేలితో నొక్కి అలంకారంగా గొలుసులాగ ఏర్పరచడం ; 2. గొలుసు మోడి. గొలుసుకడియం వి. ఊత్తె అడ్డపట్టెకు బిగించిన జనపచుట్ట. గొలుసుకొండి వి. పడుగేరే కర్రకు తగిలించే జనపగొలుసు కొక్కెం. గొలుసుగొను(-కొను) అ.క్రి. గొలుసులా ఉండు, ఒకదానితో ఒకటి అంటిఉండు. నరస. 4 21. గొలుసుచిలుకు వి. తలుపులను మూసిఉంచడానికి వాడే సాధనం. గొలుసుదప్పినకో(తి(-తప్పినకో(తి) వి. పట్టటానికి అసాధ్యమైనవాడు. ద్వి. హరిశ్చ. 1506 పం. గొలుసుపట్టె వి. ఏడికోలకు బదులు తాళ్ళతోగాని గొలుసుతో గాని బిగించే ఒకపనిముట్టు. గొలుసుపింజెర వి. ఒకరకం డాబీ. నన్నబద్దగొలుసు దిందుకు తగిలించింది. గొలుసుబద్ద వి. డాబీగొలుసుకు అడ్డంగా బిగించిన నన్నబద్ద. గొలుసుబుగిడి వి. గొలుసుకట్టుమాదిరిగా మొగ్గలుపడేట్టు నేసిన డిజైను. గొలుసుబుగిడిఅంచు వి. గొలుసుకట్టుమాదిరిగా నేసి వరసగా మొగ్గలుపడేట్టు డిజైనులో నేసిన అంచు. గొలుసుమలుకు వి. పన్నెకట్టుబడిలో దండెలమధ్య ఈనెలు బిగించి దారంతో నేసిన ఒకరకం కట్టు. గొలుసుముగ్గు వి. లంకెలు లంకెలుగా గీతలుగీస్తూ వేసినముగ్గు. గొలుసు మోడి వి. గొలుసుకట్టు, కలిపిరాత. గొలుసువ్రాత వి. ఒకఅక్షరంతో ఇంకో అక్షరం కలసిపోయినట్లు గొలుసులా రాసే రాత. గొలుసెట్టు స.క్రి పొయ్యి. గోలెం, జాడీ మొ. వాటికి అలంకారంగా సం పక్కలో చుట్టూ నన్నని తాలిక లంటించి వేలితో నొక్కి గొలుసులాగ ఏర్పరచు.

<గొలుసు+పెట్టు.

గొలుసెట్టు చూ. గొలుసు.

-గొలె రూ.చూ.- గోలె. ప్రత్య. ద్రు. అప్పటినుంచి.

గొల్కురాయి రూ.చూ. గులకరాయి. వి. 1. అల్పుగుల్ల ; 2. కంకరరాయి.

గొల్లు రూ.చూ. గొలుగు[1]. వి. తుప్పగా పెరిగే ఒకరకం కలుపు మొక్క.

గొల్తి రూ.చూ. కొలిమిడి. వి. క్షురం.

గొల్తిడి రూ.చూ. కొలిమిడి. వి. క్షురం, శృంఖలీ వృక్షం.

గొల్ల వి. 1. గొల్లజాతివాడు, గోవుడు. భార. విరా. 1.281. ద.హిం.గా. సంపు. 10. గా సం. 235. క్రీ.శ 1271 ; 2. ధనపాలుడు, కోశాగారాన్ని కాపాడేవాడు. రం.రా.అయో. ; 3. పసులనుమేపి పాలు, నెయ్యి అమ్మి జీవించేజాతి. పారి. పీఠి. 17 ; 4. ద్వారపాలకుడు. పరమ. వి. 2.97.

సం. *గోపాల-, గోపాలక-*. గోవుల్ని మేపి పోషించేవాడు ; ప్రా. *గోఅల, గోపాల-, గోపాలయ, గోపాలిణీ* ; అ.మా. *గోపాల* ; పా. *గోపాలక-*.

క. గొల్ల. గొల్లవాడు ; *గొల్లతి, గొల్లితి, గొల్లిత్తి*. గోపిక ; *గవళి, గవళిగ*. గొల్లజాతి ; *గోవళ*. గోపాలుడు ; కొడ. *గొల్ల* ; తు. *గొలె* ; కువి. *గొల్లసి* ; బ్రా. *గోపాల్*. గోపాలకుడు.

గొల్లకండువా వి. గొల్లవాళ్ళు కప్పుకొనే నెమలికన్నుపేటు మాదిరి డిజైనుపెట్టి నేసిన ఒకరకం కండువా. గొల్లకత్తి వి. ఉక్కుముక్కతో చేసినకత్తి. గొల్లకంబడి వి. గొల్లవాళ్ళు కప్పుకునే కంబడి. గొల్లకార్తె వి. హస్తకార్తె. గొల్ల కావడి వి. గొరికొయ్యలు. గొల్లకావిడిచుక్కలు వి.బ.వ. పాలకావిడి చుక్కలు. గొల్లకిలారి రూ.చూ. గొల్ల కిలారి. వి. గొల్లగోవుడు. గొల్లకిలారి రూ. గొల్లకిలారి. వి.

గోపుడు, గొల్ల. గొల్లకుప్పడం వి. గొల్లవాళ్ళు కట్టుకొనే ఒక రకం పంచె. గొల్లకుమ్మరి వి. కుమ్మర్లలో ఒకతెగ. గొల్లకోడి వి. పక్షి విశేషం. గొల్లగొడ్డలి వి. నిడుపుకామ ఉన్న చిప్పగొడ్డలి. గొల్లగోపాలుడు వి. ద్వారపాలకుడు. గొల్లచీర వి. గోపికలు (గొల్లతలు) కట్టుకొనే చీర. గొల్లచీర్లవాళ్ళు వి.బ.వ. బీరప్ప లింగాన్ని ఊరూర తిప్పుతూ కురమల దగ్గర అడుక్కునే వాళ్ళు, కురమల గురువులు. గొల్లజిడ్డు వి. నాగిని, వృక్షవిశేషం. హంస. 4.10. గొల్ల(డు వి. 1. అలకాపరి. విజ్ఞా. వ్యవ. 80 ; 2. మూర్ఖుడు. సు.శ. 28. గొల్లత రూ.చూ. గొల్లెత. వి. గోపిక. హరి.పూ. 5.223. గొల్లతనము వి. 1. అలకాపరితనం. భార. విరా. 1.281 ; 2. అనాగరకత. గొల్లత్తకొక్కు వి. జంతు విశేషం. (Nesociabengalensis). గొల్లది వి. గొల్లస్త్రీ. వ్రేత <గొల్ల + అది. గొల్లదొంద వి. మత్స్యవిశేషం. హంస. 4.167. గొల్లవల్లియ రూ.చూ. గొల్లపల్లె వి. గొల్లపల్లె. గొల్లవల్లె రూ. గొల్లపల్లియ. వి. గొల్లపల్లె. ఆం.భా. 2.23. గొల్లభామ రూ.చూ. గొల్లభాము. వి. 1. గోపిక ; 2. మిడత వంటి కీటకం. గొల్లభామ రూ. గొల్లభాము. వి. 1. గోపిక ; 2. మిడతవంటి కీటకం. గొల్లభామకొంగు వి. నెత్తిన పాల కడవ మోస్తున్న గొల్లపడుచు బొమ్మలునేసిన చీరకొంగు. గొల్లభామపమిటకమ్మి వి. పైటకొంగులో గొల్లభామ బొమ్మ పడేట్టు నేసిన కమ్మి. గొల్లభామపేటు వి. చీరలో పువ్వులు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. గొల్లమాట వి. దురుసైన భాష. గొల్లమాన్యం వి. పశువులు కాచేవాడికి బహుమానంగా ఇచ్చిన భూమి. గొల్లవా(డు వి. గోపాల కులానికి చెందిన వాడు. సిం.ద్వా. 3.10. గొల్లసివాలు వి.బ.వ. గొల్లవారు సివమెత్తి పాడే పాటలు. కువ.చ. 2.114. గొల్లసుద్దులు వి.బ.వ. ఒకరకం పాటలు. గొల్లాగారము వి. గొల్లవాళ్ళ నుంచి తీసుకొనే పన్ను. గొల్లెత రూ. గొల్లత. వి. గొల్లది. బసవ. 2.525.

గొల్లగుండి వి. ఎరుపు, నీలంరంగుల పూలుపూసే ఒకమొక్క లేక తీగ (Cyantois axillaris).

గొల్లపుల్లెర వి. బందారు చెట్టు, దీనికలపతో చేతికర్రలు చేస్తారు (Dodonaeauiscosa).

గొల్లము వి. 1. పల్లం. పండి. చ. 5.348. ప ; 2. పడియం, నీళ్ళగుంట. ఉ. హరి. 5.311.

క. కొళ. నీళ్ళగుంట ; కొళ్ళ ;

సం. ఖల్ల-. పల్లమైన.

గొల్లాం వి. కొట్టంలో పశువులకు మేతవెయ్యడానికి ఏర్పరచిన అర.

గొల్లాగారము చూ. గొల్ల.

గొల్లి[1] వి. 1. కొంటెతనం ; 2. యోని.

క. గొల్లి. యోని ; తు. కొయిలె.

గొల్లికాయ వి. యోనిలింగం.

గొల్లి[2] వి. నూగు కలిగిన ఒక చెట్టు (Maesadutria).

గొల్లియన రూ.చూ. గొల్లెన. వి. ఒకవిధమైన గుడారం, నంతలో కట్టే ఒక రకంగుడారం. కవిక. 2.96.

గొల్లు రూ. గెల్లు. వి. 1. సవ్వడం, నక్క కూయడం మొ. వాటి ధ్వనికి అనుకరణం. భాను. 2.78 . 2. కలకలధ్వని. అచ్చ. రా. యు. 227 ; 3. ఏడ్పు. చంపూరా. 4.85 ; 4. గందరగోళం.

క. గుల్లు, గొల్లు, నంచడి ; తు. గుల్లు. పెద్దచప్పుడు, అరుపు, గొడవ.

గొల్లునహుయి అ.క్రి. బిగ్గరగా అరచు, పెద్దగా కూపెట్టు. గొల్లుపవవ్వు అ.క్రి. గట్టిగానవ్వు. గొల్లుమను అ.క్రి. 1. ఎక్కువగు, అతిశయించు. ఇందు. 2.123 ; 2. ఏడ్చు. చంపూరా. 4.85 ; 3 పెద్దగాగొడవపెట్టు.

గొల్లె రూ.చూ.- గోలె. ప్రత్య.(ద. నాటగోలె, అప్పటినుంచి.

గొల్లెత. చూ. గొల్ల.

గొల్లెతము వి. గొరిసెగాలి, తెక్కలుపుచ్చి ఊడిపోవటం.

గొల్లెన రూ. గొల్లియన. వి. ఒకరకమైన గుడారం. పండి. చ. 350 ప.

గొల్లెనబండి వి. గూడుకట్టినబండి. జైమినీ భా. 2.113.

గొల్లెము రూ.చూ. గొండ్లెము[1]. వి. గొళ్ళెం. గొండ్లెం.

గొల్లెరువు వి. నల్లకాల్వలో వాడేమేక, గొర్రెల పెంటిక.

గొళ్ళి రూ.చూ. గొండ్లి. వి. 1. ఆట ; 2. నృత్యం.

గొళ్ళెంవేయు స.క్రి. నేతమోకు మిడిగూటానికి చుట్టికొలికి వేయు.

గొళ్ళెము రూ.చూ. గొండ్లెము[1]. వి. 1. తలుపుల్నిమూసి ఉంచడానికి వాడే సాధనం. బసవ. 4.288 ; 2. గానుగ దూలానికి చివర బిగించే (S) ఆకారపు ఇనపకొక్కెం , 3. పడుగేరే కర్రకు తగిలించే ఇనపగొలుసు ; 4. ఊతై అడ్డ పట్టెకుకాని నరిగుంజకుగాని బిగించిన రెండుఇనపకొండ్లకల ఇనపపనిముట్టు.

గొవరు వి. 1. తాపం ; 2. ఉక్క ; 3. అక్కసం.

గొవరుపోవు (-పోవు) అ.క్రి. తపించు. కాశీ 1.137.

గొవ్వ వి. ముడిపత్తి.

గొపికాకు వి. ఒకేమందంలో ఉండేట్లు చెక్కబడిన బండిఆకు.

గొహరు వి. 1. ఉపద్రవం. సారంగ. చ. 2.180 ; 2. పెద్ద మోత. ఆం. భా. 1.115 ; 3. పట్టిది ; 4. ఉక్క.

గొహరుచేయు రూ. గొహరుసేయు. స.క్రి. 1. పెచ్చు చేయు, ఉడికించు, తపింపజేయు. పాండు. 2.180 ; 2. బాధ పెట్టు. గొహరుసేయు (-చేయు) రూ.చూ. గొహరుచేయు. స.క్రి. 1. బాధించు. కువ. చ. 5.19 ; 2. పెచ్చుచేయు. ఉడికించు, తపింపచేయు.

-గో రూ.-గా. ప్రత్య. విర్దేశార్థంలో వచ్చే అంత్య ప్రత్యయం. ఉదా. అదిగో, ఇదిగో.

గోకడ రూ.చూ. గోగర. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క.

గోకవగద్యాలు వి.బ.వ. ఒకజినుసు నాదేలు.

గోకరకాణి వి. $\frac{1}{4096}$ యొక్క భాగం.

సం. గోకర్ణ-. ఆవుచెవి.

<సం. గోకర్ణ-. + -కాణి.

గోకరకాయ రూ.చూ. గోకిరికాయ. వి. గోరుచిక్కుడు.

గోకరాయి వి. పక్షివిశేషం.

గోకర్ణము రూ. గోకానం. వి. 1. ఉగ్గుగిన్నె ; 2. దాడ మొ.

నవి వడ్డించటానికి లోతు, పొడవుముక్కు, పట్టుకొనటానికి ఉగ్గంవంటిపై కాడకలిగిన పాత్ర.

గోకర్ణపింగరూకలు వి.బ.వ. గోకనగద్యాలు, ఒకరకం నాణేలు.

గోకళు వి.బ.వ. 1. కొంగలు; 2. పెంపుడుబాతులు.

గోకానం రూ చూ. గోకర్ణము. వి. సోమనత్తెర, చాడు, పరమాన్నం వడ్డించడానికి ముక్కు పెట్టిచేసినపాత్ర.

గోకికొను చూ. గోఁకు. స.క్రి. గీరుకొను, గీకుకొను.

గోకిరయెలిసె వి. బూడిదరంగు పురిడిపిట్ట.

గోకిరికాయ రూ. గోకరకాయ, గోకెరకాయ. వి. గోరుచిక్కుడు.

గోకురు వి. 1. కొన్ని జంతువులుచుట్టూ ఉండేరక్షక కవచం; 2. గవ్వ.

గోకురుసున్నం వి. గవ్వసున్నం, గవ్వల్ని కాల్చితయారు చేసిన సున్నం.

గోకులుపెట్టు స.క్రి. సరిగోక (గంజిపిడచ) తో పడుగుతట్టు.

గోకెరకాయ రూ.చూ. గోకిరికాయ. వి. గోకరకాయ, గోరుచిక్కుడు.

గోగట రూ.చూ. గోగద. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క.

గోగద రూ. గోకద, గోగట, గోగడి². వి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క.

గోగడి¹ రూ. గోఁగడి. వి. ఆంబటిజోరిగాడు అనేపక్షి.

గోగడి² రూ.చూ. గోగద. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా మొలిచే కలుపుమొక్క.

గోగడిసెత్త (-చెత్త) వి. ఆముపైన కప్పడానికి వాడేగోగద మొక్కలచెత్త.

గోగాకుతెవులు వి. పత్తికి పట్టే పేను తెగులు.

గోగు రూ.చూ. గొరుగు². వి. పొట్టికాండం కలిగి చిన్నచిన్న కాయలు, పూలు పూసే, కర్ర తెల్లగా ఉండే చెట్టు. దీని పుల్లలు పళ్ళుతోముకోడానికి వాడతారు (Salvadora pensica).

గోగునార రూ చూ. గోఁగునార. వి. గోగు మొక్కల ముదురు కాడలను ఊరబెట్టి ఒలిచిన చర్మం లోపలి దారాలు.

గోగుత్తి రూ.చూ. గువ్వగుత్తి. వి. ఒకజాతి కలుపుమొక్క.

గోగుముక్క వి. కంకర, పునాదులను దిట్ట పరచడం, గ్లాబులు పోత పొయ్యటం, రోడ్లు వేయటం మొ. పనులకు పనికి వచ్చేరాతి ముక్క.

గోంకారం వి. కుక్క ఏడుపు.

గోంగూర చూ. గోను¹.

గోఁకు స.క్రి. 1. దురద పోయేటట్లు నెమ్మదిగా గీకు. భార. అను. 4.102; 2. గీకు, దురద పోయేటట్లు నెమ్మదిగా గీకు. భార. ఆరణ్య. 5.19.

క. కొఱ. తీక్ష్ణమైన, పదునైన; గోఱు. గీకు, గీరు; కొడ. కొరె. ఏనుగు లేక అడవి పంది కోర; తు. కోరుని. గోరుని. తవ్వు; త. కోఱై. నీరు; మ. కోఱుక, ముళ్ళతోమాంసాన్ని గీరు; కోఱు. కోయు, చించు; కుయి. (గోప. గోళ్ళతో బరుకు, గీరు; కొలా. కొక్. దురద పోవటానికి గోకు; కొక్. గోకు; నా. కొక్క్. దురదకి గీరు.

గోఁకుడు వి. 1. పాలు కాచినపుడు అడుగున అంటుకొన్నది, మడ్డి; 2. దురద, గజ్జి. గోఁకుడుపాఱ వి. దోకుడు పార, తవుగోల. గోఁకురు వి. కొబ్బరి కోరం.

గోఁగడి రూ.చూ. గోగడి¹. వి. ఆంబటి జోరిగాడు అనేపక్షి.

గోఁగాకు చూ. గోఁగు.

గోఁగు వి. 1. కొండగోగు, కర్ణికారం. వసు. 3.146; 2. ఊరగోగు. హంస. 4.11.

క. గోగి, గోంగూర.

గోఁగాకు వి. గోను, గోంగూర, పీలువు. గోఁగునార రూ. గోగునార. వి. గోగు చెట్ల యొక్కనార. గోఁగువిత్తులు వి.బ.వ. కర్ణికార బీజాలు.

గోఁగుట రూ.చూ. కోఁగుట. వి. ముండనం, గొరగడం. ఆం. దా. 2.117.

గోఁగులమ్మ వి. 1. ఒకానొక గ్రామదేవత. భీమ. 1.98; 2. చేనేత పనిచేసే కైకాలబత్తుల కులదేవత.

గోఁగూర చూ. గోను¹.

గోచారము వి. పచ్చిక పొలం, బీడు. పశువులు గడ్డిమేసే పొలం.

సం. గోచర-. పశువులు మేసేపొలం.

<సం. గోచర—.

గోచిపెట్టకముందుమంచే చూ. గోఁచి. అవ్య. చాల చిన్నతనం నుంచే.

గోచిపెట్టినవాటినుంచి చూ. గోఁచి. అవ్య. చాల చిన్నతనం నుంచి.

గోచీరిక వి. వెనక తొడమీద చిన్న పాము పడగలాంటి మడి.

గోజంగి రూ. గోజఁగి. వి. కుబ్జిక, పన్నీరు పూలచెట్టు.

గోజఁగి రూ.చూ. గోజంగి. వి. కుబ్జిక, పన్నీరు పూలచెట్టు.

గోజుఅర్ర చూ. గోజు¹. వి. రంగులో కలిపిన జిగురు పోసుకునే ఒకరకం మట్టి పాత్ర, బెంకె.

గోఁచి వి. కౌపీనం, కచ్చడం, గోణం, గోణాం. ఉ. హరి. 1.102.

సం. కచ్ఛ-. కచ్చ, వెనక దోపుకొనే దోవతి కొంగు.

గోఁచికట్టు వి. 1. కౌపీనధారి, గోచిమాత్రం ధరించిన వాడు, బ్రహ్మచారి. పాండు. 5.238; 2. పేదవాడు. గోఁచి కాఁడగు అ.క్రి. దరిద్రుడగు. ప్రబంధ. 754. గోఁచికాఁడు వి. 1. దరిద్రుడు, గోచిమాత్రం మిగిలినవాడు. ద్వి. హరిశ్చ. ఉ. 1051; పం.; 2. బ్రహ్మచారి. గోఁచిగట్టినవాటఁగోలె అవ్య.ద్రు. చిన్నప్పట్నించి. ద్వి.హరి. ద్వితీ పం. 886-87. గోఁచిగడ్డము వి. పశువులకు ముడ్డివద్ద ఆకువలెఉండే చెడ్డ మడి, చెరుప. గోఁచిగానిచేయు స.క్రి. గోచిమిగిలేటట్లు చేయు. ద్వి. నల. 2.693 పం. గోఁచిచేతికిచ్చు స.క్రి. నిరుపేదగాచేయు, సన్యాసిగాచేయు. గోఁచిదరిద్రము వి. 1. దిగంబరత్వం; 2. అతిపేదరికం. గోఁచిపాఁత వి. గోచిగుడ్డ, గోణం. శివర. 5.68. గోఁచిపాఁతరగాఁడు వి. గోచిపెట్టుకు తిరిగేవాడు, ఏమీలేనివాడు. గోఁచిపాఁత రాయఁడు వి. దరిద్రుడు. కుచే. 3.47. గోఁచిబాపఁడు వి. బ్రహ్మచారి, ఒంటిజందెపువాడు. ద్వి. హరిశ్చ. ఉ.

1405 పం. గో(చివా(డు విజ. 1. బ్రహ్మచారి. హ.న. పీఠి. 11 ; 2. పేదవాడు.

గో(జాట చూ. గో(జు[1].

గో(జాడు చూ. గో(జు[1].

గో(జారు చూ. గో(జు[1].

గో(జు[1] వి. 1. బాధ, పీడ. పార్వ. 4.131 ; 2. పీడించి అడగడం ; 3. వెత ; 4. వేడిమి ; స.క్రి. పీడించి అడుగు.

క. గోజు. చిక్కులోపెట్టు, చిక్కులోఉండు ; గుంజు. చిక్కులోపెట్టు, చిక్కులోఉండు.

గో(జాట వి. 1. పీడించి, అడగటం, దేవురింపు ; 2. పీడ. గో(జాడు రూ. గోదాడు. వి. 1. బాధపడు ; 2. దేబిరించు ; 3. పీడించి అడుగు. గో(జారు స.క్రి. పీడించు, గోజులాడు, పలుమార్లు దేబిరించి అడుగు, గోగురిల్లు, గోణాడు. గో(జులాడు స.క్రి. పీడించి అడుగు.

గో(జు[2] రూ. గోదు, గోందు, గో(దు. వి. బంక, తుమ్మ జిగురు.

గోటకము వి. పశువులశాల, కొట్టం.

నం. ఘోటక-. గుర్రం.

<నం. ఘోటక-. (అర్థవిపరి.).

గోటదొర్లుడుకాయ చూ. గోరు. వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146.

గోటమీటు చూ. గోరు.

గోటరించు అ.క్రి. గోండ్రించు.

గోటరింపు వి. పులిగోండ్రింపు.

గోటరింపు చూ. గోటరించు.

గోటావన వి. 1. (పక్షి) ఈక, రెక్క. నీలా. 3.26 ; 2. ఘోషించడం, ఘోష ; 3. ఉంకింపు, యత్నం ; 4. విజృంభణం, చెలరేగటం ; 5. గందరగోళం.

గోటి వి. కర్రల్తోఆడే ఒక రకంఆట.

గోటికాయ వి. బాలక్రీడావిశేషం, గోలీఆట.

గోటిచిక్కుడు చూ. గోరు.

గోటిచిడి చూ. గోరు.

గోటిచెనకు చూ. గోరు.

గోటివాటు చూ. గోరు.

గోటినెలవంకలు చూ. గోరు.

గోటినొక్కులు చూ. గోరు.

గోటిమొద్దు చూ. గోరు.

గోటిమొన చూ. గోరు.

గోటిరాయి కట్టుబడి వి. అలమారల వెనక అరరాయి మందంతో పల్చని గోడకట్టే పద్ధతి.

గోటు[1] వి. 1. మాంసంతో కూడిన వనభోజనం, విందు ; 2. పానగోష్ఠి.

గోటు[2] వి. గర్వం, బడాయి.

గోటు[3] వి. 1. పట్టి వేళ్ళ చాపకు కుట్టే అంచు ; 2. ఇటుకకు అతుక్కున్న మట్టి పెళుసు.

గోటువరన రూ. గోటార్స. వి. చదరపు రాళ్ళను నిలువున అతికే తీరు.

గోటు[4] రూ.చూ. గోడు[2]. వి. గొడిక, దొరెం.

గోటువాయిద్యము వి. వీణలో భేదం, రుద్రవీణ.

గోటేరు రూ.చూ. కోటేరు. వి. నాగేటి చాలు.

గోటొర్స రూ.చూ. గోటువరన. వి. చదరపు రాళ్ళను నిలువున అతికే తీరు.

గోట్లు[1] వి. హాకీ వంటి ఆట.

గోట్లు[2] చూ. గోరు. వి.బ.వ. అలంకారానికి ఓడ అంచుకు గోటితో పెట్టిన గుర్తులు.

గోడ[1] వి. నేలపై రాయి, ఇటుక, మట్టి మొ. వాటితో ఎత్తుగా ఇంటి అవరణ, గది మొ. వాటికి కట్టిన నిర్మాణ విశేషం, భిత్తి. అచ్చ.రా. 5.95.

నం. కుడ్య-. గోడ ; ప్రా. కుడ్డ. ; పా. కుడ్డ ; మరా. కూడ్ ;

క. గోడె- ; కొ. గొఢ్. గోడ ; గోడె- ; తు. గోడె, కుఇ. కుడు ; పర్జి. కుడి, కుడ్డి ; కొలా. గొడా.

<ప్రా. కుడ్డ-.

గోడకమ్మి వి. గోడలోకి దూర్చిన కత్తెర కమ్మి. గోడకాలడుగు వి. పునాదిగా తవ్విన గుంట అడుగు భాగం. గోడకాలు వి. 1. కరగోడ, వెలుగు నాటటానికి పొడి మట్టితో ఏర్పరచిన గోడ. రాజవా. 3.81 ; 2. గోడలు కట్టటానికి భూమిలో తీసే పొడవు గుంటలు. గోడకి కొట్టానికి తగులకుండు అ.క్రి. విషయం అంటీఅంటకుండా మాట్లాడు. ఆకుకు అందకుండ పోకకు పొందకుండ మాట్లాడు, గోడకు చెవులుండు అ.క్రి. రహస్యం వెల్లడి అగు. గోడకుర్చీ వేయించు స.క్రి. బడిలో పిల్లల్ని గోడకానుకొని కుర్చీలో కూర్చున్నట్టుగా అడుగున ఏ ఆధారం లేకుండా కూర్చోబెట్టి ఉపాధ్యాయుడు శిక్షించు. గోడగోలెం వి. గోడతొట్టి, గుమ్మం పక్కలో గోడకి తగిలించి అలంకారానికి మొక్కలు పెంచే మట్టితొట్టి. గోడచేర్పు వి. 1. ఎప్పుడూ గోడకు చేరబడి ఉండేవాడు, జడుడు, సోమరి, మొద్దు. ద్వి.హరిశ్చ.ఉ. 1199 పం. ; 2. ఆసరా, రక్షణ. గోడచేర్పుప్రతిమ వి. పనికిరానివాడు. తాళ్ళ.సం. 3.640. గోడతొట్టి వి. గోడగోలెం, గుమ్మం పక్కల్లో గోడకి తగిలించి అలంకారానికి మొక్కలు పెట్టే మట్టితొట్టి. గోడదావు వి. పక్కదావు, మొదటిదావు, ఆముగోడ. వెంబడిఅనిచ్చే ఓటికుండల వరస. గోడదుమికేవయసు వి. యౌవనం. గోడదూ(కు అ.క్రి. వ్యభిచరించు. గోడదాల్చెడిబా(గ వి. ఎలుక. అచ్చ.రా.బాల. 7. గోడదొమ్మ వి. జంతువులలో గుండెపక్కఉండే అవయవం, దూదిగుండె. గోడదొల్కులప్రోద వి. ఎలుక. గోడనరాతి వి. గుడారపుగోడ. గోడనిక్కిచూచు స.క్రి. కుతూహలంతో దారినిపోయేవారిని దొంగచూపులు చూచు. జైమినీ భా. 3.29. గోడపాల వి. దేవగంధం, వృక్షవిశేషం. గోడపురుగు రూ. గోడపురువు. వి. 1. నల్లి ; 2. ఈగ. వ్యు. గోడను చేరి ఉండే పురుగు. గోడపురువు రూ.చూ. గోడపురుగు. వి. నల్లి. పాంచ. 4.13. గోడపెట్టు వి. ఇటూఅటుపోటు, చెంపపెట్టు. గోడపైనున్నము వి. అశాశ్వతం. తాళ్ళ.సం. 3.546. గోడపోత వి. గోడకు గుంజలు బిగించి అనుపోసే పద్ధతి. గోడబారు వి. 1. అంచుబాటులోని వస్తువు ; 2. గోడకు

చేరగిలబడటానికి పొడవుగా, గుండ్రంగా కుట్టి ఉంచిన దిండు, ఒరుగుదిండు, బాలీసు. రామలిం.శ. 12. **గోడమీఁది పిల్లి** వి. **1.** ఎటు గాలివీచితే అటుతిరిగే రకం; **2.** నమ్మ తగనివాడు. **గోడమీఁదిసున్నము** వి. ఉపయోగించుకొన వీలులేనిది. శాళ్వ.నం. 7.34. **గోడమూటు** వి. ఎర్రకాల్వకు గోడపెట్టి కట్టిన ఆము. **గోడమెట్టు** వి. గోడపై అంచు. **గోడరాయి** వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి. **గోడరేవు** రూ. గోడిరేవు, గోడ్రేవు, గో్రేవు. వి. కొమ్ముదేవు, మంట వ్యాపించడానికి గోడకు ఉంచిన కన్నం. **గోడలుదుముకు** రూ. గోడలుదూఁకు. అ.క్రి. వ్యభిచరించు, కట్టుతప్పి ప్రవర్తించు. **గోడలుదూఁకు** రూ.చూ. గోడలు దుముకు. అ.క్రి. వ్యభిచరించు, కట్టుతప్పి ప్రవర్తించు. **గోడలుపైడిసేయు** (-చేయు) స.క్రి. ఎంతైనా సంపాదించగలుగు. శుక. 3.76. **గోడాము** వి. గుండ్రంగా ఉండే ఆము. <గోడ[1]+ఆము.

**గోడ[2]** రూ.చూ. గోడా. వి. గుర్రం. ఇందు. 2.56.

**గోడగము** వి. **1.** దుండగం; **2.** బాధాకరం; **3.** దుఃఖకరం.

**గోడగించు** అ.క్రి. **1.** పోటీపడు. కాశీ. 4.294; **2.** పాటు పడు, శబ్దించు, మాటలాడు. కవిక. 3.87; స.క్రి. **1.** తిరస్కరించు; **2.** మించు; **3.** ఈసడించు.

**గోడనియేడ్చు** చూ. గోడు.

**గోడనుబోవు** చూ. గోడు[1].

**గోడపిందె** వి. పెసర, వేరుసెనగ మొ. వాటి లేతకాయ.

**గోడము** రూ.చూ. గూడెము. వి. బోయపల్లె, గోడెము, గూడెం.

**గోడంబి** రూ.చూ. గోడంబీ. వి. ముంతమామిడిపప్పు, జీడిపప్పు.

**గోడంబీ** రూ. గోడంబి. వి. వేయించని (పచ్చి) ముంతమామిడి పప్పు, పచ్చి జీడిపప్పు.

**గోడలు** వి.బ.వ. గోపులు.

**గోడవారము** వి. **1.** యుద్ధం; **2.** గొడవ, గంద్రగోళం.

**గోడా** రూ. గోడ[2], ఘోడా. వి. గుర్రం. ఉ.రా. 7.399.

**గోడాడు** చూ. గోడు[1].

**గోడాము** చూ. గోడ[1].

**గోడాలు** వి.బ.వ. నూలు నిచ్చెన మెట్లు.

**గోడి[1]** రూ.చూ. గేడి[1]. విశ. **1.** మొనపైకున్న, కొనమీది కున్న. వంపుగల. కాశీ. 3.138; **2.** ఒకపక్క కిందికొరిగి రెండోపక్క పైకి లేచిన; **3.** లోపమున్నా లేనట్లు కనబడే స్వభావంకల; వి. **1.** మార్గం; **2.** విధం; **3.** ఆకారం; **4.** వంపు.

**గోడిగుంజ** వి. గుట్టడుగింజ, మరమగ్గంచట్రం నిలబెట్ట టానికి నేత బయలులో పాతిన కొయ్యరాట. **గోడిచెక్క** రూ. చూ. గోరచెక్క. వి. గోరపలక. **గోడిపట్టిలు** రూ. చూ. గోడిపట్టెలు. వి. బ. వ. బాల క్రీడా విశేషం. **గోడిపట్టెలు** రూ. గోడిపట్టిలు. వి బ.వ బాలక్రీడా విశేషం, కోడిపిల్లలు అనే ఆట. విష్ణుపు. 7.202. **గోడిపడు** రూ.చూ. గోడివడు. అ.క్రి. ఏటవాలగు, అణగు, వంపగు, కొన పైకుండు. **గోడిపెట్టు** రూ. గోడివెట్టు. స.క్రి. **1.** వంచు; **2.** మొట్టికాయలు, నెత్తిమీద కొట్టే దెబ్బ. **గోడిరెప్ప** వి. కంటిలోని వావు. **గోడివడు** రూ. గోడిపడు. అ.క్రి. **1.** ఒడ్డగెరవగు, ఏటవాలుగా, ఒంపగు. కు నం. 12.27; **2.** అణగు. **గోడివెట్టు** రూ.చూ. గోడిపెట్టు. స.క్రి. వంచు, వంగించు, ఏటవాలుగా పెట్టు.

**గోడి[2]** రూ.చూ. గోడు[2]. వి. గొటిక, ఇటుకల్ని నిలువుగ పేర్చిన పేర్పు.

**గోడిగుంత** వి. కానెం, ఆముదగ్గర ఆముమనిని పోసిన గుంట.

**గోడిగ** రూ. గోడిగె. వి. ఆడగుర్రం. భార.విరా. 1.95.

నం. ఘోటికా. ఆడగుర్రం; ప్రా. ఘోడగ, ఘోడయ-, ఘోడీ. గుర్రం; అ.మా. ఘోడ, ఘోడగ, ఘోడయ; పా. ఘోటుక; నం. ఘోటికా; అప. ఘోడా.

క. *గొట్టిగె*, ఘోఱిగె; తు. *గోడ*-. గుర్రం; గోం. *కోడా*; కుఇ. *గోడ*; కువి. *గోడ*; ఒల్లా. *గోడ*.

<ప్రా. ఘోడగ-.

**గోడిగె** రూ.చూ. గోడిగ. వి. ఆడగుర్రం.

**గోడిపట్టె** రూ. గోడిపట్టె, గోడుపట్టె, గోలిపట్టె. వి. గోడుపట్టె.

**గోడిరాయి** రూ.చూ. గోడురాయి. వి. నిలువుగా ఉంచిన పొడు గాటి రాయి.

**గోడిరేవు** రూ.చూ. గోడరేవు. వి. కొమ్ముదేవు, మంట వ్యాపించ డానికి గోడకు ఉంచిన కన్నం.

**గోడివట్టె** రూ.చూ. గోడిపట్టె. వి. గోడుపట్టె.

**గోడిబల్ల** వి. అక్కంపుబల్ల, జాడీలకు అతుకుభాగంలో తట్ట డానికి వాడే నలప.

**గోడు[1]** రూ. గోలు[1]. వి. **1.** దుఃఖం, పీడ, పదుపు, వగ, బాధ. భార. ఆశ్రమ. 2.92; **2.** ఏడ్వటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పరమ. 4.113; **3.** ఏడుపు, రోదనం. ఉ.రా. 4.94; **4.** లోపం ఉన్నా లేనట్లు కనపరిచే నైపుణ్యం; **5.** ఓటమి, అపజయం; **6.** ఉసురు, బాధించిన పాపం.

క. *గోళ్*, *గోఀ*. శోకయొక్క శబ్దం, దుఃఖించటం, ఏడ్వటం, అరవటం; *గోడు*, *గోళు*, *గోళొ*. దుఃఖంలోను, ఏడుపులోను వచ్చేశబ్దం; కొడ. *గొళి*. బాధతోకొట్టుకొను, విపరీతమైన బాధ; తు. *గోళు*, *గోలు*. వేదన, దుఃఖం.

**గోడనియేడ్చు** అ. క్రి. బిగ్గరగా ఏడ్చు. కుచే. 3.114. < గోడు[1] + అను +- ఇ + ఏడ్చు. **గోడనుబోవు** అ.క్రి. మొరపెట్టు కోడానికిపోవు. ఉ.హరి. 1.42. **గోడాడు** అ. క్రి. దుఃఖించు, విలపించు, బాధపడు. భాగ. 9-483. <గోడు[1] + అడు. **గోడుకుడుచు** అ. క్రి. గోడుపెట్టుకొను; అవస్థలుపడు. ద్వి.హరిశ్చ. పూ. 1774.75. **గోడుకుడువు** స.క్రి. కష్టపెట్టు. కాశీ. 7.95. **గోడుకూఁత** వి. మూలుగు, ఏడ్వటం. **గోడుగోడునేడ్చు** అ.క్రి. ఎక్కువగా ఏడ్చు. శుక. 2.42. **గోడుపెట్టుకొను** స.క్రి. వేధించు, బాధించు. **గోడు పోసికొను** అ.క్రి. ఉసురందు, క్షోభపెట్టిన పాపం కట్టుకొను. కవిక. 4.110. స.క్రి. బాధించు, భేదించు. **గోడుసేయు** (-చేయు) స.క్రి. **1.** బాధపెట్టు. క్రీడ. 9; **2.** ఓడగొట్టు.

**గోడు[2]** రూ. గూడి, గేడి2, గోటు[4], గోడి[2], గోడె, గోళి[1]. వి. గొడిక, దోరెం, ఇటుకను లారనను వెడల్పు మీద నిల బెట్టిన పేర్పు.

**గోడురాయి** రూ. గొ్రాయి, గోడిరాయి. వి. నిలువుగా

ఉంచిన హొడుగాటిరాయి, గొడ్ల కొట్టాల్లోనిలువున పాతిన హొడుగాటిరాయి. **గోడెట్టు** స.క్రి. ఇటుకల్ని నిలువునపేర్చు. <గోడు[2]+ పెట్టు.

**గోడు**[3] వి. కచ్చు, అచ్చులో ఉన్నపచ్చి ఇటికను నేలమీదినన్న సన్నరాళ్ళు, మట్టిఅతికి నందున ఏర్పడినబుడిపె.

**గోడు**[4] స.క్రి. (కా ంరసరాతి) కప్పువేయు.

**గోడు**[5] వి. 1. కొయ్య మొ. వాటి ఎత్తువైపు; 2. మాగాణిలో తోలేగోరచెక్క; 3. పిడికి కిందగా ఉండేకుంచెపైభాగం.

**గోడుపట్టి** వి. బండి పరంలో అడ్డపట్టి. **గోడుపట్టె** రూ. చూ. గోడిపట్టె. వి. 1. మెరకపల్లాల్ని సమంచేసే పని ముట్టు; 2. గొలుసుపట్టె వంటిపట్టె; 3. బండిపరంలోని అడ్డపట్టె. **గోడుబిళ్ళ** రూ. గోణబిళ్ళ, గోనెబిళ్ళ. వి. గోణ బిళ్ళ, గోనుబిళ్ళ, బాలక్రీడా విశేషం.

**గోడుచిక్కుడు** రూ.చూ. గోరుచిక్కుడు. వి. ఒకరకం చిక్కుడు.

**గోడె** రూ.చూ. గోడు[2]. వి. గొడిక, దోరెం.

**గోడెట్టు** చూ. గోడు[2].

**గోడెము** రూ.చూ. గూడెము. వి. బోయపల్లె. శబరాలయం, కొండదొనవాశ్రయించి ఉండే బోయపల్లె. అం. బా. 2.28.

**గోడ్రెప్పకన్ను** వి. రెప్పలువాచినకన్ను. పండి. చ. 3.108వ.

**గోడ్రేవు** రూ.చూ. గోదరేవు. వి. కొమ్మురేవు, మంటవ్యాపించ దానికి గోడకు ఉంచిన కన్నం.

**గోణము** రూ.చూ. గోవణము. వి. గోచి, రెండువైపులా తాళ్ళుగల గోచి. వరాహ. 3.109.

**గోణముదారి** వి. సన్యాసి, కౌపీనధారి.

**గోణాం** వి. గాడి, కొట్టంలోపశువులకు మేతవెయ్యటానికి ఏర్ప రచిన అర.

**గోణాము** రూ.చూ. గోవణము. వి. గోచి, రెండువైపులను తాళ్ళు గలగోచి. కాశీ. 1.30.

**గోణెబిళ్ళ** రూ.చూ. గోడుబిళ్ళ. వి. కర్రల్తో ఆడే ఒకరకం. పిల్లలఆట, గోడుబిళ్ళ, గోనుబిళ్ళ.

**గోణెము** రూ.చూ. గోవణము. వి. గోచి.

**గోణెలమూకుడు** చూ. గోణము. వి. కొండిలమూకుడు.

**గోంట్లు** రూ.చూ. గోంటులు. వి.బ.వ. గాజులు.

**గోండాల** వి. గుండాల, సీతిపుట్టువు.

**గోండు** వి. గోండ్వానాప్రాంతంలో నివసించే ఒకజాతి. మహ రాష్ట్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లలో సుమారు 15 లక్షల మందిఉన్నారు. వీరు మాట్లాడే గోండీద్రావిడ భాష.

**గోండ్ర** వి. గర్జనం, అరుపు.

**గోండ్రకప్ప** వి. గోదురుకప్ప, పెద్దకప్ప. **గోండ్రపెట్టు** అ.క్రి. ఉరుము, అరచు, గురకపెట్టు, గోటరించు. **గోండ్రలుపెట్టు** అ.క్రి. గర్జించు, ఉరుము. **గోండ్రించు** అ. క్రి. 1. ఎలుగు మొ. కూయు, అరచు. నవనాథ. 3; 2. అడవి మృగంలా గర్జించు; 3. వాంతిచేసుకొనేటపుడు చేసే శబ్దం; 4. పులికూయు. **గోండ్రింపు** వి. పులి మొ. వాటి కూత.

**గోండ్రించు** చూ. గోండ్ర.

**గోండ్రింపు** చూ. గోండ్ర.

**గోండ్రిలు** చూ. గోండ్రు.

**గోండ్రిల్లు** చూ. గోండ్రు.

**గోండ్రు** వి. 1. (ఎనుబోతు మొ.) అరవటంలో అయ్యేధ్వనికి అనుకరణం. వరాహ. 11.76; 2. అంగలార్చటంలోని ధ్వని కనుకరణం. ఆము. 3.19; 3. గుఱ్ఱుమని అరవటం, రంకెవేయటం, బొబ్బపెట్టటం, ఆవు మొ. వాటిఅరుపు.

**గోండ్రిలు** రూ. గోండ్రిల్లు. అ.క్రి. పులి మొ. నవి ధ్వని చేయు. ద్వి. నల. 3.118వ. **గోండ్రిల్లు** రూ.చూ. గోండ్రిలు. అ.క్రి. పులి మొ. ధ్వనిచేయు. **గోండ్రుకప్ప** చూ. గోండ్ర కప్ప. వి గోండ్రుకప్ప. **గోండ్రుపెట్టు** అ.క్రి. గర్జించు, రంకెవేయు.

**గోఁటు** వి. 1. వస్త్రభూషా విశేషం. ఆం. భా. 2.149; 2. కోకఅంచునచేర్చి కుట్టినసన్నని నరిగపట్టె; 3. ఒయ్యారం; 4. రేఖ; 5. అంచులో రెండురకాల డిజైన్లు నేసినభాగా లకు మధ్య మామూలుగా నేసినభాగం.

క. గోటు, వస్త్రం అంచు; తు. గోటు. బుటాలు వేయటం, సరిగ, జలతారు; కొంద. కొ. ఎబ్‌టబ్‌ళ్. పైన కప్పుకొనే వస్త్రం అంచు పైభాగం.

**గోఁటుకత్తె** వి. సీటుకత్తె, ఒయ్యారంకలది, విలాసిని. **గోఁటుకాఁడు** వి. ఒయ్యారం కలవాడు, సీటుకాడు, హొయలుకాడు.

**గోఁటుపోఁక** రూ. గొంటుపోఁక. వి. గొట్టుపక్క.

క. గోటు-. గట్టి; కొ. గొట్-అడకె-. గొట్టుపోవక్క.

**గోఁటులు** రూ. గోంట్లు. వి.బ.వ. 1. మూడేసివలయాలు కలిగిన వెండి కడియాలు; 2. గాజులు.

**గోఁటువక్క** రూ. గొంటువక్క. వి. తక్కువరకంవక్క.

**గోతపెట్టు** చూ. గోయి. స.క్రి. 1. గోతిలోపూడ్చు; 2. చంపు.

**గోతము** రూ. గోతాము. వి. 1. మల్లసాధన విశేషం, మల్లులు సాధనకోసం రాళ్ళునించి ఉంచుకొనే గోనె. మను. 4.8; 2. ఒకవిధమయిన చిన్నగోనె. హంస. 4.84.

**గోతాము** రూ.చూ. గోతము. వి. 1. మల్లసాధన విశేషం. మల్లులుసాధన కోసం రాళ్ళునించి ఉంచుకొనే గోనె; 2. ఒకవిధమయిన చిన్నగోనె.

**గోతాంపట్ట** రూ.చూ. గోతాంపట్టా. వి. ఒకరకం నారతో నేసినపట్టాగుడ్డ.

**గోతాంపట్టా** రూ. గోతాంపట్ట. వి. ఒకరకం నారతో నేసినపట్టా గుడ్డ.

**గోతి**[1] వి. గొయ్యి.

**గోతిమగ్గం** చూ. గొయ్యిమగ్గం. వి. గుంటమగ్గం, నేతబయ లులోగుంట దగ్గర అమర్చిన మగ్గం. **గోతులుతీయు** అ.క్రి. ద్రోహం తలపెట్టు, శాస్తిచేయటానికి సిద్ధంగా ఉండు.

**గోతి**[2] వి. 1. స్త్రీ. భార. అను. 3.234; 2. భార్య, పత్ని. హరి. పూ. 1.61.

**గోతింగార్చి** వి. త్రిభుజాకారంలో ఉండే అర్చి.

**గోతీ** వి. మూతిపగిలిన కడవ.

**గోతులుతీయు** చూ. గోతి[1].

**గోద** వి. 1. ఎద్దు, ఆబోతు. బసవ. 3.653 పం.; 2. గొడ్డు. జంతువు.

గోదరి[1] వి. 1. గొడగరి, గొడారి, చర్మకారుడు. ఆం. ధా. 2.283 ; 2. చిత్తరువులు రాసేవాడు. < గోద + -అరి. గోదవి వి. గొడ్లను కట్టే చోటు.

గోదరి[2] రూ.చూ. గోదారి[2]. గోదావరినది.

గోదరిల్లు అ.క్రి. బాధపడు.

గోదా[1] వి. కుస్తీచేసే చోటు, తాలింఖానా.

గోదా[2] రూ.చూ. గోదాము. వి. ధాన్యాదుల్ని నిలవచేసే పెద్ద కొట్టు.

గోదాం రూ.చూ. గోదాము. వి. ధాన్యాదుల్ని నిలవచేసే పెద్ద కొట్టు.

గోదాడు రూ.చూ. గోఁజాడు. స.క్రి. అడిగి వినిపించు.

గోదాన రూ.చూ. గోదాము. వి. ధాన్యపు కొఠా, 'గోడౌన్.'

గోదాము రూ. గుదాం, గొడాము, గోదా[2], గోదాం, గోదాను. వి. ధాన్యాదుల్ని నిలవ ఉంచే పెద్ద కొట్టు.
మలయా. గోదోంగ్. పెద్ద కొఠారు.
<మలయా. గోదోంగ్.

గోదారి[1] వి. వెన్నకాచిన మడ్డి.

గోదారి[2] రూ. గోదరి[2]. వి. గోదావరి నది.
సం. గోదావరీ. నదీ విశేషం.
<సం. గోదావరీ.

గోదావరిజనకలు వి.బ.వ. గోదావరి జిల్లాలో పండే సన్నరకం ధాన్యం.
సం. గోదావరీ. ఆంధ్రలో ప్రవహించే ప్రధానమైన ఒక నది.
<సం. గోదావరీ + జనకలు.

గోదావరులు వి.బ.వ. ధాన్య విశేషం, గోదారి జనకలు.

గోదియ రూ. గోదె. వి. ధాన్యం గాదె.

గోదు రూ.చూ. గోఁజు[2]. వి. బంక, జిగురు.

గోదుమ రూ. గోద్మ. వి. ధాన్య విశేషం, గోదుమలు. ఆం.ధా. 2.234 (Triticum diocum).
సం. గోధుమ-, గోధూమ-. ధాన్య విశేషం ; ప్రా. గోహుమ- ; అమా. గోధుమ, గోహుభు- ; పా. గోధూమ ;
క. గోది, గోదివె, గోదుమె, గోమవె ; తు. గోది ; త. కోతుమై, కోతుంపై ; మ. కోతంపు ; కుఇ. గోహుమె : కువి. గొహైంగ : పర్జి. గొంగ్ : నా. గోద్మ : బ్రా. ఖులుం.
<సం. గోదుమ-.
గోదుమజాల వి. గోధుమవన్నె చార. గోదుమపుల్ల వి. గోధుమవన్నె. గోదుమపూసలు వి.బ.వ. స్త్రీ కంఠభూషా విశేషం, స్త్రీ మెడనగ. గోదుమపొర వి. గోధుమవన్నె మచ్చ. గోదుమరాతు వి. ఎర్రరాయి, నున్నపు మస్తురాయి. గోదుంపయ్యి రూ. గోధుంపయ్యె. వి. గోధుమ వంటి ఎరువు.

గోదుమలు చూ. గోదుమ. వి.బ.వ. నవధాన్యాల్లో ఒకటి.

గోదుంపయ్యి చూ. గోదుమ.

గోదురు విశే. పెద్ద, గొప్ప, విస్తారమైన, అధికమైన.
గోదురుగవ్వ వి. పెద్ద ఆల్చిప్ప.

గోదె రూ.చూ. గోదియ. వి. ధాన్యం నిలవచేసుకొనే చిన్న కాగు.

గోధుంకలరు వి. గోధుమ రంగు, ఒకరకం బూడిద రంగు, చామనఛాయ.
సం. గోధుమ-. ధాన్య విశేషం.

గోధుమబోడి వి. బోడిలో ఒకరకం, నాలుగైదు నెలల్లో పండే ఒకరకం ఆహారధాన్యం.
సం. గోధుమ-. ధాన్యవిశేషం.

గోధుమజొన్న వి. పొట్టు గోధుమ వర్ణంగా ఉండే ఒకరకం జొన్న.
సం. గోధుమ-. ధాన్యవిశేషం.

గోధుంపయ్యె రూ.చూ. గోదుంపయ్యి. వి. గోధుమ వంటి ఎరువు.

గోద్మ రూ.చూ. గోదుమ. వి. ఒకరకం ఆహారధాన్యం.

గోనపట్ట రూ.చూ. గోనిపట్ట. వి. గోనెపట్ట.

గోని రూ.చూ. గోనె. వి. ధాన్యం మొ. వాటిని నింపే సంచి.
గోనిగుడ్డ వి. గోనెపట్ట, కుమ్మరి కూర్చోడానికి లేక తడిమట్టి ఆరకుండా వాడటానికి వాడే గోతాం పట్ట. గోనిపట్ట రూ. గోనపట్ట, గోనెపట్ట. వి. గోనెవట్ట. గోనిపీసురౌజు వి. సారెపెట్టు మన్నులో కలపడానికి వాడే గోనిసంచి తుక్కు. గోనిముక్క వి. నందతయారీలో అంచు కట్టడానికి వాడే చినిగిన గోతాం ముక్క. గోనిసుట్ట(-చుట్ట) వి. కమిది కట్ట, సర్వేటప్పుడు పాత్రల కింద ఒత్తుగా పెట్టుకొనే మడత పెట్టిన గోతాం.

గోనియ రూ.చూ. గోనె. వి. గోనె, జనపనార పట్టలసంచి.

గోను[1] వి. గోగు. వేంక. పంచ. 4.522.
గోంగూర రూ. గోఁగూర. వి. గోగు ఆకులు. గోఁగూర రూ.చూ. గోంగూర. వి. గోగు ఆకులు.

గోను[2] రూ.చూ. గోనె. వి. ధాన్యాదుల్ని ఉంచే జనపనార సంచి.
గోనుతట్టు వి. పట్టా, రంగుతొట్టెలో పింజెర మీద కప్పిన గోనెగుడ్డ.

గోనుగోఁజు వి. బంక, జిగురు, బందన.

గోనె రూ. గోని, గోనియ, గోను[2]. వి. 1. ధాన్యం మున్నగు నవి నింపే జనపనారసంచి. కళా. 7.25 ; 2. కాలిబస్తా ; 3. 80 ముంతలు (= 120 బళ్ళారిశేర్లు, 5 తూములు = 150 బళ్ళారిశేర్లు).
సం. గోణికా. ఒక తరహా పట్టుగుడ్డ ; గోణ. ఎద్దు ; గోణీ. సంచి ; ప్రా. గోణియ, గోణీ ; మరా. గోణ ;
క. గోణి ; తు. గోణి ; త. కోణి, కోణికై, కోణియల్ ; మ. కోణి ; కువి. గొని. మూట ; బ్రా. గూని.
<ప్రా. గోణియ.
గోనెటెద్దు వి. ధాన్యాదులుగల గోనెల్ని మోసే ఎద్దు. <గోనె + ఎద్దు. గోనెపట్ట రూ.చూ. గోనిపట్ట. వి. 1. గోనెసంచి ; 2. సంచిపట్ట ; 3. పాత్రల్ని వర్సేటప్పుడు కూర్చోడానికి లేక పాకంమన్ను ఆరిపోకుండా కప్పడానికి వాడే గోతాం. గోనెపణము వి. పటకాలు గల గుడ్డ, పురితో నేసి పట్టాలు కుట్టి పరుచుకొనేది. గోనెపరదా వి. అడ్డం కట్టినగోనె. గోనెపాత వి. గోనెపట్ట తడిమట్టి ఆరిపోకుండా

కప్పడానికి వాడే గోతాం పట్ట. గోనెబ్రెలవాళ్ళు రూ. గోనెబ్రెలోల్లు. వి.బ.వ. సరితాళ్ళు, నేతమోకులు తయారు చేసే ఒక తెగవారు. గోనెబ్రెలోల్లు రూ.చూ. గోనెబ్రెల వాళ్ళు. వి.బ.వ. సరితాళ్ళు, నేతమోకులు తయారు చేసే ఒక తెగవారు. గోనె(బట్టినబంక వి. జిగురులా వదలనిది. తాళ్ళ. నం. 11.3 భా. 125. గోనెసంచి వి. 1. గోనె, సుమారు నూరుశేర్ల దాకా ధాన్యం మొ. నవి పట్టే నార సంచి ; 2. బండికి సరిపడేంత పెద్ద గోతాం ; 3. గాడిద మీద రెండువైపుల బరువు వచ్చేటట్లు వేసిన సంచి.

గోనెకొఱ్ఱ వి. కొఱ్ఱల్లో ఒక భేదం, చామలమాదిరిగా ఉండే ఒకరకం ఆహారధాన్యం.

గోనెబిళ్ళ రూ.చూ. గోడుబిళ్ళ. వి. గోజబిళ్ళ, గోడుబిళ్ళ, ఒక ఆట.

గోందు రూ.చూ. గోంజు[2]. వి. బంక.

గోందుపుల్ల వి. అంచుల్లో జరీపెట్టి నేసేటప్పుడు, పోగులు అతుక్కోటానికి జిగురు రాసేపుల్ల. గోంద్లు వి.బ.వ. జిగురు, కొన్ని చెట్లనుంచి దొరికే చిక్కనిద్రవం.

గోంద్లు చూ. గోందు.

గోంతి రూ.చూ. గొంతి. వి. కుంతీదేవి.

గోందు రూ.చూ. గోంజు[2]. వి. బంక, బందన.

గోందురు వి. పెద్దజాతి కప్ప.

గోందురుకప్ప వి. పెద్దజాతి కప్ప, మండూక భేదం. హంస. 4.186. గోందురుగవ్వ వి. ఒకజాతి పెద్దగవ్వ.

గోపరం రూ.చూ. గోపురం. వి. ఊపురం, చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం.

గోపాడి వి. వెలిచె, ఒకజాతి పూరేడు పిట్ట.

గోపాదం యా. గోవుపాదం. వి. నాలుగు అంగుళాలు.

సం. గోపాద-. ఎద్దుపాదం, ఇవి 4 ఉంటాయి.

<సం. గోపాద- (అర్థవిపరి.).

గోపాలమెత్తు అ.క్రి. బిచ్చమెత్తు. వ్యు. గోపాల అనే పదం పాడుతూ దానరులు బిచ్చమెత్తు కుంటారు కాబట్టి ఈ అర్థంవచ్చి ఉంటుంది.

సం. గోపాల-. కృష్ణుడు.

<సం. గోపాల- + ఎత్తు.

గోపాల్ఖానీ వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

గోపిచందనం వి. ఒకజాతి సుద్దమన్ను.

సం. గోపీచందన-. ఒకజాతి సుద్దమన్ను.

<సం. గోపీచందన-.

గోపిపువ్వు రూ.చూ. గోబిపువ్వు. వి. కాలిఫ్లవర్.

గోపీచంద్ రూ.చూ. గోపీచందనం. వి. పసుప్పచ్చ, వర్ణపట్టికలో అయిదోరంగు.

గోపీచందనం రూ. గోపీచంద్. వి. పసుప్పచ్చ, వర్ణపట్టికలో అయిదోరంగు.

సం. గోపీచందన-. ఒకజాతి సుద్దమన్ను.

<సం. గోపీచందన-(అర్థవిపరి.).

గోపీరంగు చూ. గోపీచందనం. వి. పసుప్పచ్చ, వర్ణపట్టికలో అయిదోరంగు..

గోపు వి. 1. ఆకతాయి, దుండగీడు. హంస. 5.113. 2. గొల్లవాడు ; 3. మూఢుడు.

సం. గోప-. గోవులను రక్షించేవాడు.

<సం. గోప-(అర్థవిపరి.).

గోపురపార్చి వి. తమలపాకార్చి. మధ్యభాగం గుమ్మటంలాగా ఉండి, పైచివర మొనతేలి ఉండే ఆర్చి.

సం. గోపుర-. గవను, దేవాలయ ద్వారం.

<సం. గోపుర- + ఆర్చి.

గోపురం యా. గోపరం, గోప్రం. వి. ఊపురం, చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం.

సం. గోపుర-. గవను, దేవాలయ ద్వారం.

<సం. గోపుర-(అర్థవిపరి.).

గోపురంగూడు వి. కమానుగూడు (త్రిభుజాకారంలో ఉండే గూడు).

గోపురము వి. ఎద్దు పీపు మీద ఉండే మూపురం.

సం. గోపుర-. గవను, దేవాలయ ద్వారం.

<సం. గోపుర - (అర్థవిపరి.).

గోప్రం యా.చూ. గోపురం. వి. ఊపురం, చేతిమగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్నభాగం.

గోప్రవేశము వి. సాయంవేళ, గోధూళివేళ.

సం. గోప్రవేశ-. ఎద్దుల, ఆవుల ప్రవేశం.

<సం. గోప్రవేశ - (అర్థవిపరి.).

గోబ యా. గోవ[0]. వి. పరంజా, మంచె.

గోబి యా.చూ. కోబీ. వి. క్యాబేజి.

గోబిగడ్డ వి. గోబీ. గోబిపువ్వు యా. గోపిపువ్వు. వి. కాలిఫ్లవరు.

గోబీ రూ.చూ. కోబీ. వి. క్యాబేజికూర.

గోభారపచ్చ యా.చూ. గోహారుపచ్చ. వి. గోహారుపచ్చ.

గోమ వి. చీమల పుట్టలకు చుట్టూ ఉన్న చోటు.

గోమతి వి. ఇటికె పొడిరంగు, లేతనస్యం రంగు.

గోమి యా. గోమీ, గోము[2]. వి. అంచుడిజైనుల్లో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు (మూతనేత) నేసిన భాగం.

గోమిఅంచు రూ. గోమీఅంచు. వి. బెనారసు అంచు, ఏట వాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసినఅంచు. గోమిపేటు రూ. గోంపేటు. వి. అంచుడిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు నేసిన భాగం. గోమిపేటంచు రూ. గోంపేటంచు. వి. బెనారసు అంచు, ఏటవాలు వరసల్లోడిజైను కనబడేట్టు నేసిన అంచు.

గోమించు చూ. గోము[1].

గోమిడి వి. వెలిచె, ఒకజాతి పూరేడు పిట్ట.

గోమీ రూ.చూ. గోమి. వి. అంచుడిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు (మూలనేత) నేసిన భాగం.

గోమీఅంచు రూ.చూ. గోమిఅంచు. వి. బెనారసు అంచు, ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసినఅంచు.

గోము[1] వి. 1. గారాబం, అతిలాలనం, శ్రమఎరగని తనం. హరి.పూ. 5.250 ; 2. గౌరవం. హరి.పూ. 7.33 ; 3. గర్వం, మదం, పొగరు. ఉ. హరి. 5.139 ; 4. విధం, రీతి. ఇందు. 2.44 ; 5. వికానం. కృ.శకు. 2.195 ; 6. సౌకుమార్యం. హంస. 1.91 ; 7. గుట్టు. విజ. 1.

బలిష్ఠమైన, బిగువైన. రాధా. 3.41; 2. మృదువైన, సుకుమారమైన. ఆం. భా. 3.24; 3. అందమైన, సుందరమైన. కలు.శ. 26.

త. ఉక, ఉకప్పు. సంతోషించు; ఉకవై. సంతోషం; ఉవ, ఉవకై. సంతోషపడు; ఉవప్పు, ఉవవు. సంతోషం; మ. ఉవక్క. ప్రేమించు; ఉవప్పు. సంతోషం; ఉవవి. ఇష్టపడు; ఉవవి, ఓవి, ఒవి, ఉవవిక్క; కో. ఒగ్. కోరు, ఇష్టపడు.

గోమించు స.క్రి. ప్రేమించు, గారాం చేయు, గోము చేయు. శుక. 1.338. గోముచేయు రూ. గోముసేయు. స.క్రి. గారాబంచేయు. గోముసేయు (-చేయు) రూ.చూ. గోము చేయు. స.క్రి. గారాబం చేయు.

**గోము**[2] రూ.చూ. గోమి. వి. 1. అంచుల్లో డిజైన్ల నెయ్యటానికి వాడేపనిముట్టు, అంచుపోగులను లేపే చిన్నఅచ్చు; 2. అంచుల్లో పువ్వుపడేట్టు నేసిన ఒకరకం డిజైను.

గోముకోల వి. ఒకరకం డిజైను నేతకు, అంచుల్లో పడులు కట్టిన కర్ర. గోముగిరక వి. ఒకరకం డిజైనునేతకు, పైనుంచిఅచ్చు దారాలు వేలాడదియ్యటానికి అమర్చిన గిలక. గోమునేత వి. అంచుల్లో పువ్వులు, మొగ్గలు మొ. డిజైన్ల నేతఅంచులకు ఒక రంగు, నడిమి భాగానికి మరొక రంగు పెట్టి నేసిన నేత. గోముపడి వి. అంచునేతలో గోము డిజైను పడడానికి అమర్చిన పేటుపడి. గోముసూత్రం వి. ఒకరకం డిజైను నేతకు గోముకోలను లేపే దారం.

**గోముక్కురాయి** వి. అబ్బుగుల్ల, కండెరాయి.

**గోమేదికము** వి. పసుపు రంగుగల రత్న విశేషం. యయా. 4.116.

సం. గోమేదక-. రత్న విశేషం.

< సం. గోమేదక-.

**గోంపేటంచు** చూ. గోంపేటు.

**గోంపేటు** రూ.చూ. గోమిపేటు. వి. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు నేసిన భాగం.

గోంపేటంచు రూ.చూ. గోమిపేటంచు. వి. బెనారసు అంచు, ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసినఅంచు.

**గోయి** రూ.చూ. గొయి. వి.ఔ. పల్లం, గుంట, గొయ్యి. సీలా. 2.76.

**గోయిందగొట్టు(-కొట్టు)** అ.క్రి. 1. చనిపోవు; 2. వ్యర్థమై పోవు; 3. దొంగిలించబడు.

సం. గోవింద-. కృష్ణుడు; ప్రా. గోవింద-.

< ప్రా. గోవింద - + కొట్టు.

**గోర**[1] రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక. రసిక. 1.67.

గోరపిట్ట వి. గోరువంక.

**గోర**[2] వి. 1. నేలను చదునుచేసే పనిముట్టు; 2. ధాన్యం కుప్పచేసే పనిముట్టు.

గోరపలక వి. మాగాణిలో దున్నిన తరవాత చదును చేసే సాధనం.

**గోర**[3] వి. అరటిపువ్వులోపల ఉండే ఒక వస్తువు.

**గోర**[4] రూ.చూ. కోర[1]. వి. చెంబు. ముంత, కోర.

**గోరగించు** చూ. గోరము. అ.క్రి. 1. భయంకరమగు; 2. ఎర్రనగు, మొగ్గకొడుగు.

గోరగింత వి. 1. భయంకరత్వం; 2. ఘోరకృత్యం. ఆం.భా. 1.132.

**గోరగింత** చూ. గోరగించు.

**గోరంక**[1] రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక. ఆం.భా. 2.89. సాంబ. 4.78.

**గోరంక**[2] రూ. గోరంకి[2]. వి. వడ్లు కుప్పచేసే పనిముట్టు.

**గోరంకి**[1] రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక.

**గోరంకి**[2] రూ.చూ. గోరంక[2]. వి. వడ్లు కుప్పచేసే పనిముట్టు.

**గోరంకుడు** వి. 1. దిగంబరుడు, బట్ట కట్టనివాడు; 2. జామీనుదారు.

**గోరక్క** రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక.

**గోరచనము** రూ.చూ. గోరజము. వి. ఆవు కడుపులోని చేదు కట్టు, పిత్త కోశం.

**గోరచెక్క** రూ. గోడిచెక్క. వి. గోరపలక, మాగాణిలో దున్నిన తరవాత చదును చేసే సాధనం.

**గోరజము** రూ. గోరచనము, గోరోజనము, గోఅచనము, గోఅజము. వి. 1. పశువు కడుపులోని చేదుకట్టు. మను. 4.13; 2. గోరోచనం, కస్తూరి.

సం. గోరోచనా-. పశువుల పిత్తకోశం నుంచి తీయబడ్డ పసుపుపచ్చటి పదార్థం.

< సం. గోరోచనా.

**గోరంచు** వి. బట్ట అంచు బద్దె.

గోరంచుకమ్మి వి. నాలుగు కొలకుల (రంగు) దారంతో పంచెలకు నేసే కమ్మి. గోరంచుచాపు వి. ఒకరకం సన్నటి అంచు పెట్టి నేసిన రెండు పంచెలు. గోరంచుధోవతి రూ. గిరంచుధోవతి. వి. గోరంచు పెట్టినేసిన పంచె. గోరంచులుంగీ వి. గోరంచు పెట్టినేసిన లుంగీ.

**గోరడము** రూ.చూ. గోఅడము. వి. ఎగతాళి, అపహాస్యం.

**గోరడి** చూ. గోరు. వి. గోటినొక్కు, పాంచాలీ. 5.32.

**గోరంట** రూ.చూ. గోరఁట. వి. గోరింటాకు చెట్టు (Lausonia alba).

గోరంటచెట్టు రూ. గోరింటు చెట్టు. వి. గోరింటాకు చెట్టు (Lenna plant). గోరంటపోతు వి. అందమైనపోతు.

**గోరఁట** రూ. గోరంట, గోరింట, గోరింత. వి. ఒక జాతి చెట్టు. పారి. 4.16 (Lausonia alba).

త. కుఱన్చి, కుఱిన్చి, కురంటుమ్, గోరింట.

సం. కురణ్టక-.

**గోరతనము** చూ. గోరము.

**గోరదబోగి** వి. ఒకతెగ బైరాగి.

**గోరనగింజలు** వి.బ.వ. ఒక బాలికా క్రీడ.

**గోరంత** చూ. గోరు.

**గోరవ** వి. పెద్ద ధ్వని, ఆఘోషణం. ఆం.భా. 1.115.

**గోరవడు** చూ. గోరము.

**గోరవన** చూ. గోరము. వి. 1. భయం; 2. ఆపద; 3. దేహం యొక్క అస్వాస్థ్యం; 4. అపవాదు.

**గోరబిళ్ళ** చూ. గోర[2]. వి. ఆముకాలేటప్పుడు ఆముపైన రంధ్రాలు పడకుండా మసిని దట్టించడానికి, కాల్పు

తర్వాత పై కుండల్ని తీయడానికి వాడే వెదురు కఱ్ఱ.

**గోరము** వి. 1. ఘోరకృత్యం, దారుణకార్యం. భాస్క.రా. యు. 2.611 ; 2. బాధ. శుక. 2.112 ; 3. ఆపద. అచ్చ.రా. అరణ్య. 47 ; 4. అనారోగ్యం ; 5. రోత ; 6. పోరు ; 7. అపవాదు. విణ. 1. భయంకరమైన. నృసింహ. 4.39 ; 2. రోతకల.

సం. ఘోర-. భయంకరం.

<సం. ఘోర-.

**గోరతనము** వి. చెడునడవడి, దుండగం. కాశీ. 4 91. **గోరపడు** అ.క్రి. 1. విసుక్కొను. పరమ. 1.84 ; 2. రోతపడు.

**గోరవంక** రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక. వేంక. అం.తిర్య. 98.

**గోరాడు** రూ.చూ. కోరాడు. స.క్రి. కొమ్ముతో నేలను ఎగజిమ్ము.

**గోరాము** స.క్రి. వ్యాధితోనసబెట్టు.

**గోరి** రూ.చూ. గోలీ[2]. వి. తురకలనమాధి.

**గోరింక** రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక. అం.భా. 2.89. **గోరింకపిట్ట** వి. గోరువంక. **గోరింకబట్ట** వి. ఒంటిమీద నలుపు తెలుపు కలిసిన ఒకరకపు రంగుచార. **గోరింకముక్కులు** వి.బ.వ. ఒక దినుసు వడ్లు.

**గోరించు** అ.క్రి. వ్యాధి వల్లననవెళ్ళబోయు, ఎగయు. శశా. 3.111.

**గోరింపు** వి. 1. ఎగవు. శశా. 4.68 ; 2. బంతులాట ; 3. గర్వం. **గోరింపుబంతులు** వి.బ.వ. బాల్యక్రీడా విశేషం. ఉ. హరిశ్చ. 3.15. **గోరింపులాడు** స.క్రి. సంహరించు, చంపు. నిరంకు. 3.9.

**గోరిడు** చూ. గోరు.

**గోరింట** రూ.చూ. గోరంట. వి. చిన్న చిన్న ఆకులు కలిగి తెల్లని పూలుపూసే చెట్టు. దీని ఆకును నూరి చేతులను కాళ్ళను అలంకరించుకోడానికి ఉపయోగిస్తారు.

**గోరింటచెట్టు** రూ.చూ. గోరంటచెట్టు. వి. గోరింటాకు చెట్టు.

**గోరింత** రూ.చూ. గోరంట. వి. చిన్న చిన్నఆకులుకలిగి తెల్లని చిన్నపూలుపూసే చెట్టు. దీనిఆకును నూరి చేతులకు కాళ్ళకు అలంకరించుకోడానికి ఉపయోగిస్తారు (Leusonia alba).

**గోరింతదగ్గు** వి. ఒకరకమయిన దగ్గు.

**గోరిమీటీ** చూ. గోరు.

**గోరింపు** చూ. గోరించు.

**గోరింపుబంతులు** చూ. గోరించు.

**గోరింపులాడు** చూ. గోరించు.

**గోరీ** రూ.చూ. గోలీ[2]. వి. తురకలనమాధి.

**గోరీకాయ** వి. గోరుచిక్కుడు.

**గోరు** వి. జా. 1. నఖం. హర. 5.44 ; 2. తంతిమీటడానికి బంగారుతో జేసి వేలికివేసుకొనే ప్రతినఖం. మను. 5.64. 3. చోరసాధన విశేషం, గడ్డగోరు. ఆము. 5.30 ; 4. కదిలీకేసరాగ్రం. ఆము. 5.30 ; 5. తమలపాకుల్ని కత్తిరించే ఇనపసాధన విశేషం ; విణ. అల్పం, చిన్నది.

క. ఉగుర్. గోరు ; ఉగి. గిల్లటం ; ఉగురిసు. గోరు ; కొడ. ఒయి. గోరు ; తు. ఉగురు. గోరు ; త. ఉకి. చేతిగోరు ; మ. ఉకిర్ ; కో. ఉర్, ఉర్ గన్. చేతిగోరుకొన ; తొ. ఉ.ర్ ; ఉ.ర్.క్పాన్. చేతిగోరుకొన.

**గోటమీటు** స.క్రి. తేలికగాసాధించు. **గోటిచిక్కుడు** చూ. గోరుచిక్కుడు. వి. గోరుచిక్కుడు. **గోటిచిడి** వి. 1. గోరుచుట్టు ; 2. పాత్రలకు పక్కల్లో వేసేడిజైను. **గోటిచెవకు** వి. గోటినాటు, నఖక్షతం. ఉ. రా. 4.221. **గోటివాటు** వి. నఖక్షతం. కవిరా. 5.230. **గోటివెలవంకలు** వి.బ.వ. నఖక్షతాలు. **గోటివొక్కులు** వి.బ.వ. నఖక్షతాలు, **గోటిమొద్దు** వి. రంగు అద్దినూలు లడీలు పిండటానికి తగిలించేకొయ్య. **గోటిమొన** వి. నఖాగ్రం. **గోరంత** వి. నలుసంత, కొంత, ఆపంత. వరాహ. 9.60. **గోరిడు** అ.క్రి. నఖక్షతంచేయు. శృం.నై. 8.84 ; **గోరిమీటీ** రూ.చూ. గోరుమీటీ. వి. భక్ష్యవిశేషం. **గోరుకల్లు** రూ.చూ. గోరుగల్లు. వి. జా. ముల్లు తీసేఇనప పనిముట్టు. **గోరుకాలు** వి. జా. ముల్లుతీసే ఇనప దబ్బనం. **గోరుగండ్లు** వి.బ.వ. గోళ్ళుతీసే ఆయుధాలు. పండి. చ. 2.32 పం. **గోరుగల్లు** రూ. గోరుకల్లు. వి. జా. మంగలిగోళ్ళు తీసేపనిముట్టు. కశా. 3.108. **గోరుగాలము** రూ. గోర్గాలము. వి. 1. ముల్లుతీసే లావు ఇనపసూది వంటి పనిముట్టు ; 2. ఉక్కుతో గోటివలెచేసిన చేపల్ని పట్టే పనిముట్టు. **గోరుగీతేయు** అ.క్రి. అంచుదగ్గర కుండకు గోరుతో గీతలుపెట్టు. **గోరుగొండి** రూ. గోర్గొండి. వి. గోరుగల్లు. పండి. చ. 4.250పు. **గోరుగోలు** వి. మంగలి గోళ్ళుతీయటానికి ఉపయోగించే ఇనపసలాక. **గోరుచిక్కుడు** రూ. గోరుచిక్కుడు. వి. చిక్కుడులో ఒకరకం (Cyamopsis Tetragonoba).

క.గోరి-, కాయి. **గోరుచీరదము** రూ. గోరుచీరణము. వి. గోరువలెకొనలో వంపుగల ఉలి. **గోరుచీరణము** రూ.చూ. గోరుచీరదము. వి. గోటివలె వంపుగల ఉలి, గోరులి. **గోరుచుట్టు** రూ.చూ. గోర్చుట్టు. వి. గోటిచుట్టూ లేచేకురుపు. హరిశ్చ. 5.89. **గోరుబుగిడి** వి. అంచునేతలో, చిన్నగోరంత మేరకొలుకులు పడేట్టు నేసినడిజైను. **గోరుమీటీ.** రూ. గోరిమీటీ. వి. భక్ష్యవిశేషం. ఈ తినుబండారాన్ని గోటితోచేస్తారు. **గోరుమీటు** వి. గడ్డగోరును తగిలించేకొండి. **గోరుమీటులు** వి.బ.వ. భక్ష్యవిశేషం. **గోరుముక్కు** రూ. గోర్ముక్కు. వి. గోటికొన. పాండు. 3.30. **గోరుముద్ద** వి. గోటిమీదికి తీసికొని పిల్లలకుపెట్టే అన్నంముద్ద. **గోరురాజనాలు** వి.బ.వ. ఒకజాతి వడ్లు. ప్రబంధ. 112. **గోరులి** వి. గోరుగొండి. <గోరు+ఉలి. **గోరులుంచు** అ.క్రి. నఖక్షతం చేయు. దశా. 8.41. **గోరువంక**[2] వి. నఖక్షతం. అం. భా. 3.60. **గోరువెచ్చ** రూ.చూ. గోర్వెచ్చ. వి. అల్పమైన వెచ్చదనం. విణ. కొంచెం వెచ్చని. **గోరువెచ్చన** రూ.చూ. గోర్వెచ్చన. వి. నులివెచ్చన. **గోరుమట్టు** వి. పాత్రలకు పక్కల్లో గోటితో వేసే డిజైను. **గోరెత్తు** స.క్రి. ఇటుక తారనరాళ్ళను వాటి మందం మీద పదుకోపెట్టు. **గోరొత్తు** అ.క్రి. గోటనొక్కు, నఖక్షతం చేయు. రామాభ్యు. 2.100. వి. నఖక్షతం. కళా. 7.161.

గోర్గాలము రూ.చూ. గోరుగాలము. వి. 1. చేపల్నిపట్టేపని ముట్టు; 2. ముల్లుతీసే పనిముట్టు; గోర్గొండి రూ.చూ. గోరుగొండి. వి. మంగలి గోళ్లను తీయటానికి ఉపయోగించే ఇనపసలాక. గోర్చుట్టు రూ. గోరుచుట్టు. వి. గోటిచుట్టూ లేచేకురుపు. శేష. 3.263. గోర్ముక్కు రూ.చూ. గోరుముక్కు. వి. గోటికొన. గోర్వెచ్చ రూ. గోరువెచ్చ. విశ. కొంచెం వెచ్చని. పాండు. 3.74; వి. అల్పమైన వెచ్చదనం. గోర్వెచ్చన రూ. గోరువెచ్చన. వి. నులివెచ్చన. గోళ్లకొరుకు అ.క్రి. పనిలేకుండా ఉండు. గోళ్లనాకు అ.క్రి. సంతోషించు. వరాహ. 11.95. గోళ్లమీటు అ.క్రి. ఏపనీలేకుండా సోమరిగా ఉండు. శుక. 2.333.

గోరుకట్టు వి. తడికలువేసి కప్పినకప్పు.

గోరుకొయ్యలు రూ. గొరుకొయ్యలు, గొఱుకొయ్యలు వి.బ.వ. ఆరుద్రానక్షత్రం. గొర్తిచెక్కల్లాగవరసగా ఉండే మూడు చుక్కలు.

గోరుచు రూ.చూ. గోర్చు. స.క్రి. బంతిని ఎగరగొట్టు.

గోరుచెక్క రూ. గోర్చెక్క. వి. గోరుపలక, గోరుపట్టె.

గోరుపడము రూ.చూ. గొఱుపడము. వి. 1. నల్లకంబళి, గొంగడి. ఆం. భా. 2.158, చెన్నబసవ. 3; 2. ఏనుగు మీదపరచే ఎర్రకంబళి.

గోరుపదను రూ. గోర్పదను. వి. గొర్తిపదను, గొర్రుతో విత్తటానికి వీలుగా నేలతడియటం.

గోరుపలక రూ. గోర్పలక. వి. గోరుపట్టె.

గోరుపిల్లాడు చూ. గోరుపిల్ల.

గోరుపిల్ల రూ.చూ. గోర్పిల్ల. వి.బ.వ. బంతులాట, గోరింపులు. గోరుపిల్లాడు రూ.చూ. గోర్పిల్లాడు. స.క్రి. గోరుపులాడు.

గోరుపు చూ. గోరుచు. రూ. గోర్పు. వి. బంతిని ఎగరగొట్టటం. గోరుపులాడు రూ. గోర్పులాడు. స.క్రి. పుట్టచెండ్లాడు, బంతికొట్టు. చంద్రాంగ. 2.122.

గోరుపోవు రూ. గోర్పోవు. అ.క్రి. పళ్ళువులియు.

గోరుముట్టు వి. పూరిల్లుపైభాగం చివరన కట్టినరెట్టగోత.

గోరువంక[1] రూ. గొరవక, గొరవంక, గొరువంక, గోర[1], గోరంక[1], గోరంకి[1], గోరఁక, గోరవంక, గోరింక, గోరెంక, గోర్వంక. వి. గోర, శారిక. ఉ.రా. 6.158.
క. గొరవక, గొరవంకె. మైనా, గోరువంక; త. కురకమ, మైనా.

గోరె వి. పొడుగాటి వాముకు చివర దీర్ఘ చతురస్రాకారపు ఇనపరేకు బిగించి తయారుచేసిన ఒకరకం పార.

గోరెంక రూ.చూ. గోరువంక[1]. వి. గోరువంక.

గోరెత్తు చూ. గోరు.

గోరొత్తు చూ. గోరు.

గోరోజనము రూ.చూ. గోరజము. వి. 1. గోరోచనం, పశువుల పిత్తరసం నుండి తీయబడిన పదార్థం. ఆం భా. 2.163; 2. గర్వం.

గోర్గాలము చూ. గోరు.

గోర్గొండి చూ. గోరు.

గోర్చు రూ. గోరుచు. స.క్రి. 1. బంతినికొట్టు. చంద్రికా. 1.102; 2. ఖండించి ఎగురగొట్టు. చంద్రాంగ. పీఠి. 21.

గోర్చుట్టు చూ. గోరు.

గోర్చెక్క రూ.చూ. గోరుచెక్క. వి. పెంకుటింటి చూరుకింద వేసిన వెడల్పాటి చెక్క.

గోర్జా వి. రాళ్ళ వరసలకు మధ్యనున్న స్థలం.

గోర్జి వి. 1. సందు; 2 మార్గం; 3. రోడ్డుపక్కనున్న గుంట.

గోర్పడము రూ.చూ. గొఱుపడము. వి. 1. ఒకవిధమైన కంబళి, పండి.చ 5.34 ప; 2. ఏనుగుమీద పరచే ఎర్రని కంబళి.

గోర్పదను రూ.చూ. గోరుపదను. వి. గొర్రుతో విత్తటానికి అనువుగా నేల తడియటం.

గోర్పలక రూ.చూ. గోరుపలక. వి. గోరుపట్టె.

గోర్పిటలాడు రూ.చూ. గోర్పిల్లాడు. స.క్రి. గోరుపులాడు. బంతినికొట్టు.

గోర్పిల్లాడు చూ. గోర్పిల్ల.

గోర్పిల్లార్చు చూ. గోర్పిల్ల.

గోర్పిల్ల రూ. గోరుపిల్ల. వి.బ.వ. గోరింపులు, బంతులాట. గోర్పిల్లాడు రూ. గోరుపిల్లాడు. గోర్పిటలాడు. అ.క్రి. బంతివలె ఎగురు. స.క్రి. అమ్మనగాయలాడు, ఎగరేయు. గోర్పిల్లార్చు స.క్రి. చెండువలె ఎగరేయు. రామాభ్యు. 6.206.

గోర్పు రూ.చూ. గోరుపు. వి. బంతినెగరగొట్టడం. గోర్పులాడు రూ.చూ. గోరుపులాడు. స.క్రి. బంతినికొట్టు.

గోర్పోవు రూ.చూ. గోరుపోవు. అ.క్రి. పళ్ళువులియు.

గోర్ముక్కు చూ. గోరు.

గోర్రేవు రూ.చూ. గోడరేవు. వి. కొమ్మురేవు, మంట వ్యాపించ డానికి గోడకు ఉంచిన రంధ్రం.

గోర్లాకు వి. మెట్టలో మొలిచి తీగగా పాకే కలుపు మొక్క (Cyapotis axillaris).

గోర్వంక[1] రూ.చూ. గోరువంక[1]. వి. గోర, శారిక. ఆం.భా. 2.89.

గోర్వెచ్చ చూ. గోరు.

గోర్వెచ్చన చూ. గోరు.

గోఱచనము రూ.చూ. గోరజము. వి. గోపిత్తం.

గోఱజము రూ.చూ. గోరజము. వి. కస్తూరి, ఇర్రిగోరజం. మను. 4.14.

గోఱడము రూ. గోరడము. వి. పరియాచకం, గేలి.

గోల[1] వి. 1. ముగ్ధుడు, తెలివిమాలినవాడు. మను. 3.64; 2. ముగ్ధ. ఆం. నా. సం. మాన. 4; 3. ఆడవి, స్త్రీ. అచ్చ. రా. అయోధ్య. 77.
గోలక్రీడలు వి. బాలక్రీడా విశేషం. వేంక. పంచ. 7.211. గోలతనము వి. ముగ్ధత్వం. రసిక.5. 172.

గోల[2] వి. కలకలం, అతిదారుణ ధ్వని, అల్లరి.
గోలపెట్టు అ.క్రి. 1. ఏడ్చు, రోదించు; 2. మొరపెట్టు; 3. అల్లరిచేయు.

గోల[3] వి. ఎత్తునుగాని, లోతునుగాని చెప్పే పరిమాణం.

గోల[4] వి. కుమ్మరింట్లో మట్టి కలిపే స్థలం.

గోల[5] వి. రెమ్మ.

గోలం రూ.చూ. గోలెము. వి. 1. ధాన్యం నిల్వచేసే పెద్ద మట్టిపాత్ర; 2. వెడల్పైన బాన.

గోలకొండతెగులు వి. అరటి, తమలపాకు తోటలకు పట్టే తెగులు.

గోలకొండమిరప వి. ఒకరకం మిరపచెట్టు (Capsicum-futescens).

గోలగొండి వి. వృక్షవిశేషం (Tradescantia axillaris).

గోలాకు వి. కలత, కలవరం, తబ్బిబ్బు.

గోలాపు రూ.చూ. గులాము. వి. దాసుడు.

గోలాము రూ.చూ. గులాము. వి. దాసుడు.

గోలి[1] వి. కొండముచ్చు.

గోలికాఁడు వి. కొండముచ్చు.

గోలి[2] వి. ఏటవాలైన పంచపాళి.

గోలిగోడ వి. ఇంటిపక్కగోడ. గోలిచెక్క వి. మిద్దెటిల్లు గెలవాసాల మధ్య వేసే మూలచెక్క. గోలిమట్టు. వి. గోలి చెక్కల జత.

గోలి[3] రూ.చూ. గోళి1. వి. బాలురు ఆడుకొనే చిన్న రాతి ఉండ.

గోలిగుండు వి. బాలురు ఆడుకొనే చిన్న రాతి ఉండ.

గోలించు స.క్రి. చమురుపోసి వేచు, వేలుచు.

గోలిదిబ్బ చూ. గోలి[2]. వి. వల్లకాడు, శ్మశానం.

గోలివట్టె రూ.చూ. గోడిపట్టె. వి. గోడుపట్టె.

గోలియము రూ.చూ. గోలెము. వి. గోలెం, కాగు.

గోలిల్లు చూ. గోల[2]. వి. ఒకవైపున దడిగోడ ఉన్న ఇల్లు.

గోళి[1] రూ. గోలి[3], గోళీ[2]. వి. బాలురు ఆడుకొనే రాతితో లేక గాజుతో చేసిన ఉండ.

నం. గోలక-. ఉండ; గోల-, గోలా, గోళ-. గోళీ, గుండ్రనిపదార్థం.

గోళీకాయ వి. పిల్లలు ఆడుకొనే చిన్న రాతిఉండ.

గోళీ[2] రూ. గోరి, గోరీ. వి. తురకల సమాధి. వసు. 1.46.

హిం.ఉ.పార. గోర్. సమాధి భవనం.

<ఉ. గోర్.

గోళీ[3] రూ.చూ. గోలు[2]. వి. వర్తులం, వలయాకారం.

గోలు[1] రూ.చూ. గోడు[1]. వి. ఏడవటంలో అయ్యేధ్వనికి అనుకరణం. శృం. నై. 1.108.

గోలుగోలు రూ. గోల్గోలు. వి. గొల్లుమనేధ్వని, పెద్దఏడ్పు.

గోల్గోలు రూ.చూ. గోలుగోలు. వి. గొల్లుమనేధ్వని, పెద్ద ఏడ్పు.

గోలు[2] రూ. గోళి[3]. వి. 1. చెక్కడపుపనిలో ఉబ్బెత్తుగా ఉండే భాగం; 2. గుండ్రం, వలయాకారం; 3. స్తంభానికిపైన, దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొనగుండ్రంగా ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తు భాగం; 4. పేపబొద్దుకు పక్కన ఏర్పరిచే సన్నని పేపబొద్దు.

గోలుకమాను వి. గుండ్రంగా ఉండేఆర్చి. గోలుకాలవ వి. సున్నబ్బట్టీలో పొయ్యి దగ్గర వేసినగాడి. గోలుకొమ్ము వి. గుండ్రంగా లోపలికి వంపు తిరిగిన కొమ్ము. గోలుగోడ వి. ఇంటిపక్క గోడ. గోలుతాపి వి. సన్నగా, పొడుగ్గా, కోలగా ఉండే రేకుగల చిన్నతాపి. గోలుదివ్వ (-తివ్వ) స.క్రి. మోసంచేయు. గోలుపొయ్యి వి. గుండ్రటి పొయ్యి. గోలుబావి వి. గుండ్రటి చుట్టు గోడగల బావి. గోలురాయి వి. గుండ్రంగా ఉండే రాయి. గోలుపీడి (-చీరి) వి. గుండ్రంగాఉండే మెట్టు.

గోలుకొలుపు చూ. గోలు[1]. రూ. గోల్కొలుపు. స.క్రి. మతి పోగొట్టు, వెర్రెక్కించు.

గోలుమాలు వి. గందరగోళం.

హిం. ఉ. గోల్‌మాల్. గడబిడ, అవ్యవస్థ.

<హిం. గోల్‌మాల్.

గోలురించు అ.క్రి. (పులి) గాండ్రించు.

గోలురింపు వి. పులికూత, వ్యాఘ్రగర్జనధ్వని. ఆం.బా. 2 82.

గోలురింపు చూ. గోలురించు.

-గోలె రూ. -గాలె, -గాల్లె. ప్రత్య.ద్రు. ఆరంభ కాలనిశ్చయాద్యర్థాల్లో వచ్చేప్రత్యయం.

గోలెం[1] రూ.చూ. గోలెము. వి. 1. మట్టితో చేసిన లోతైన పాత్ర; 2. ధాన్యం నిలవ చేసే పెద్దమట్టి పాత్ర; 3. గుడిసెకప్పు మీద బోర్లించే మట్టి కుండ; 4. మూతి వెడల్పుగా ఉండే మట్టిపాత్ర.

గోలెంపటవ వి. పెద్ద మట్టిపాత్ర. గోలెంపొట్టె వి. గోలెం కంటె చిన్నదైన మట్టిపాత్ర.

గోలెం[2] వి. బావులకు పెట్టే ఒర.

గోలెంబావి వి. లోపల చుట్టూ ఒరలు అమర్చిన నుయ్యి.

గోలెము రూ. గోలం, గోలియము, గోలెం[1]. వి. బాన, కాగు. భల్లా. 1.

నం. గోల-. వలయం.

<నం. గోల- (అర్థవిపరి.).

గోలేలజోడింపు వి. ఆము పడుగులో కింద మూడు, మీద మూడు గోలీలను బోర్లించడం. గోలేలంచు వి. గోలేలకు పెట్టిన పెద్ద అంచు. గోలేలరాయి వి. 4 అంగుళాల వెడల్పు 2 అంగుళాల మందం ఉండే రాయి.

గోలేలజోడింపు చూ. గోలెము.

గోలేలంచు చూ. గోలెము.

గోలేలరాయి చూ. గోలెము.

గోలొన్ వి. పుల్ల పావెల (Portulaca species).

గోల్‌కర్ర చూ. గోలు[2]. వి. గరిటలాగా దొప్పగా ఉండే కరిటి.

గోల్కొండచేకిడి వి. అయిదు కొలుకులు వక్కరంగు.

గోల్కొలుపు రూ.చూ. గోలుకొలుపు. స.క్రి. మతిపోగొట్టు, వెర్రెక్కించు.

గోల్‌గలతా చూ. గోలు[2]. వి. స్తంభానికి పైన దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కొన గుండ్రంగా ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తు భాగం.

గోల్‌గుండు చూ. గోలు[2]. వి. తాపీపనివాళ్ళు గోడల మట్టం సరిచూడటానికి వాడే పరికరం.

గోల్గోలు చూ. గోలు[1].

గోల్డెన్‌బ్రౌను వి. ఒకరకం గోధుమరంగు.

ఇం. *Golden brown*. ఒకరంగు.

<ఇం. Golden brown.

**గోల్పునాయివేత** వి. నాలుగు పావు చెక్కలు అమర్చిన మగ్గం మీదకుట్టు, కోత లేక బట్ట నెయ్యడం.

**గోళి** వి. ఒకానొక ఆకు కూర. హంస. 4.183.
నం. ఘోలి. ఒకజాతి కూరాకు.
**గోళికూర** వి. ఒకానొక ఆకు కూర (Spinarch). హంస. 4.166.

**గోళించు** న.క్రి. (నూనెలో) వేయించు.

**గోళీ¹** రూ.చూ. గోడు². వి. ఇటుకను తారనను వెడల్పు మీద నిలబెట్టిన పేర్పు.

**గోళీ²** రూ.చూ. గోలీ1. వి. పిల్లలు ఆడుకొనే చిన్నరాతిఉండ.

**గోళ్లకుతికంటు** వి. స్త్రీ కంఠ భూషా విశేషం, అడ్డిగ.

**గోళ్లగొండి** వి. తృణవిశేషం.

**గోళ్లగొండులు** వి.బ.వ. ధాన్యవిశేషం. కాళ. 3.151.

**గోళ్లలం** వి. మెట్టలో మొలిచి తీగగా పాకే కలుపు మొక్క (Cyanotis axillaris).

**గోళ్లకొరుకు** చూ. గోరు.

**గోళ్లవాకు** చూ. గోరు.

**గోళ్లమీటు** చూ. గోరు.

**గోవ¹** వి. 1. పురుష గవయం, గురుపోతు. ఆం.భా. 2.85 ; 2. శరభం.
**గోవకోడె** వి. అడవి పసరం, పొగరు బోతైనగిత్త.

**గోవ²** విశే. 1. మనోజ్ఞమైన. దశకు. 6.33 ; 2. అసాధువైన, పొగరుబోతైన, చెడ్డ. విష్ణుపు. 7.147 ; వి. 1. యౌవనం; 2. అందం.
**గోవతనము** వి. పొగరుబోతుతనం. దశకు. 4.24. **గోవమీఱు** అ.క్రి. అర్థం లేక తిరుగు. **గోవావు** వి. సాధువు కాని ఆవు <గోవ² + ఆవు. **గోవావుకోడెలు** వి.బ.వ. పొట్లాడే కోడె దూడలు.

**గోవ³** వి. పశ్చిమ సముద్ర తీరమందలి ఒక పట్టణం.
**గోవజవాది** రూ. గోవజవ్వాజి, గోవజవ్వాది. వి. గోవపట్టణపు జవ్వాది. విజయ. 3.191. **గోవజవ్వాజి** రూ.చూ. గోవజవాది. వి. గోవపట్టణపు జవ్వాది. **గోవజవ్వాది** రూ.చూ. గోవజవాది. వి. గోవపట్టణపు జవ్వాది. ధనా. 3.39. **గోవతేజీ** వి. గోవపట్టణపు గుర్రం. శుక. 1.108.

**గోవ⁴** వి. పేనని నార.
**గోవకట్టు** వి. తాటితో కట్టిన కట్టు. **గోవతాడు** యా.చూ. గోవత్రాడు. వి. పిల్లల మొలకు పెట్టే ఆభరణం. **గోవత్రాడు** రూ. గోవతాడు. వి. పురుషులు మొలను ధరించుటకై వెండి తీగతోగాని బంగారు తీగతోగాని అల్లబడిన మొల తాడు. **గోవమొల్త్రాడు** వి. పురుషులు మొలను ధరించ టానికి వెండి తీగెతోగాని బంగారు తీగెతోగాని అల్లబడిన మొలతాడు.

**గోవ⁵** చూ. గొయ్యా. వి. ఒక ఫలవృక్షం, జామిచెట్టు (Psidiumguayauoa).
**గోవపండు** రూ. గోవాపండు. వి. గొయ్యాపండు.

**గోవ⁶** యా.చూ. గోబ. వి. ఎత్తుగా ఉండే గోడలను కట్టడానికి వాటి పక్కనే కట్టిన తాత్కాలిక నిర్మాణం, పరంజా.

**గోవ⁷** వి. 1. పొదవు ; 2. దినదినాభి వృద్ధి ; 3. సారవ ; 4. అంచులో చిట్టచివరి భాగం.

**గోవణము** రూ. గోణము, గోణాము, గోణెము. వి. గోచి. రెండువైపుల తాళ్ళు గల కౌపీనం. కాశీ. 2.55.
పో.చూ. నం. కౌపీన-. గోచి ; గోపన-. దాచటం, కప్పిపుచ్చటం ; ప్రా. గోవణ-. రక్షణం.
క. తు. కోవణ. గోచి ; త. కోవణం ; మ. కోవణం, కోణకం, కోణం ; తా. క్వన్.
<ప్రా. గోవణ-.

**గోవసీద** వి. పక్షి విశేషం.

**గోవాపండు** రూ.చూ. గోవపండు. వి. గొయ్యాపండు.

**గోవాళలు** రూ.చూ. గోవాళ్లు. వి.బ.వ. 1. యౌవనవంతులు. కాళ. 8.11 ; 2. విటులు.

**గోవాళ్లు** చూ. గోవ², రూ. గోవాళలు. వి.బ.వ. 1. యౌవన వంతులు. మను. 4.83 ; 2. విటులు, ముండలమారి. ప్రబంధ. 7.8.
<గోవ² + వారలు.

**గోవావు** చూ. గోవ².

**గోవావుకోడెలు** చూ. గోవ².

**గోవిచెట్టు** వి. కానుగ చెట్టు, రేలచెట్టు. మను. 2.5.

**గోవిందకొట్టు** అ.క్రి. 1. చనిపోవు ; 2. నష్టపడు.

**గోవిందగంతులు** వి.బ.వ. గోవింద గోవింద అని వేసే గంతులు. నవనాథ. 3. 150 వ.

**గోవిందములు** వి.బ.వ. 1. నతివిశేషం ; 2. అల్లనేరేడు పళ్ళు.
నం. గోవింద-. విష్ణువు, కృష్ణుడు.
<నం. గోవింద - (అర్థవివరి.).
**గోవిందములుకొట్టు** అ.క్రి. ఉత్సాహంతో గోవిందస్మరణ చేయు.

**గోవిల** వి. వృక్ష విశేషం (Aristolochia indica).

**గోవు** వి. ఆవు.
నం. గో-. ఎద్దు, ఆవు.
<నం. గో- (అర్థవివరి-.).
**గోవుపాదం** రూ.చూ. గోపాదం. వి. నాలుగు అంగుళాలు. **గోవురాయి** వి. పశువులు ఒంటిని రాసుకోటానికి నాటిన నిలువు బండ.

**గోవుకట్టె** వి. పరంజాను నిలిపే పొడుగాటి కర్ర.

**గోవుగపెరుగు** చూ. గోవ². అ.క్రి. బాగా గారాబంగా పెరుగు.

**గోవుగుత్తి** రూ.చూ. గువ్వగుత్తి. వి. మెట్టలో, ఎర్రనేలల్లోను ఎక్కువగా పెరిగే కలుపు మొక్క, పగడపు తీగె, కపోతాంఘ్రి (Arum colocosta).

**గోషా** యా.చూ. ఘోషా. వి. అంతఃపురం, రాణివాసం, ముసుగు.

**గోషుపేచు** వి. పాగామీద సొగసుగా కట్టుకోబడిన వస్త్రం. హంస. 4.86.
హిం. గోశ్. చెవి ; మరా. గోష్‌పేచ్, గోస్పేచ్. చెవుల మీద అలంకారం కొరకు చుట్టుకొనేది.

**గోష్టకము** వి. పశువుల శాల. ద. హిం.శా. సంపు. 5. శా.సం.

124. క్రీ.శ. 1306.

సం. గోష్ఠక-. పశువులుండే చోటు.

< సం. గోష్ఠక-.

గోష్వారా రూ.చూ. గోష్వారా. వి. సారం, పీఠిక.

గోష్వారా రూ. గోష్వారా. వి. సారం, పీఠిక.

హిం.ఉ. గోశ్‌వారా. ఆయవ్యయాలు సంక్షిప్తంగా రాయబడే లేఖ.

< ఉ. గోశ్‌వారా (అర్థవిపరి.).

గోస రూ.చూ. గోసు. వి. 1. తిట్టు, నింద ; 2. ఘోష ; 3. మొర ; 4. గొప్పదనం.

గోసవుచ్చు స.క్రి 1. చాటించు ; 2. మెచ్చు. గోసవెట్టు (-పెట్టు) స.క్రి. బాధపెట్టు, గోసపుచ్చు.

గోసగినైవేద్యము చూ. గోసంగి. వి. ప్రాతఃకాలనైవేద్యం.

గోసంగి రూ. గోసఁగి. వి. 1. మాదిగవాడు, గూబరి. ద్వి. హరిశ్చ. ఉ. 1571, ఆము. 6.64 ; 2. ఆకతాయి, గురు భార్యను అపహరించినవాడు ; 3. సన్యాసి ; 4. పనికి మాలిన వాడు.

గోసఁగి రూ.చూ. గోసంగి. వి. 1. చర్మకారజాతికి చెందిన వాడు ; 2. సన్యాసి.

గోసడచు చూ. గోసు.

గోసడుచు చూ. గోసు.

గోసన వి. 1. చాటించటం. భార.విరా. 2.102 ; 2. గోల. పి. శకు. 3.82.

సం. ఘోషణా. ప్రకటించటం, ధ్వని ; ప్రా. ఘోసణా.

క. గోసనె.

< ప్రా. ఘోసణా.

గోసవపుచ్చు స.క్రి. 1. స్తుతించు, పొగడు, మెచ్చు. దశకు. 1.7 ; 2. చాటించు, ప్రకటించు. దశకు. 10.126.

గోసరిలు రూ.చూ. గోసరిల్లు. అ.క్రి. దుఃఖించు, స.క్రి. ఘోషించు.

గోసరిల్లు రూ. గోసరిలు. అ.క్రి. దుఃఖించు ; స.క్రి. ఘోషించు.

గోసా రూ.చూ. ఘోషా. వి. రాణివాసం, అంతిపురం, ముసుగు.

గోసాయి వి. 1. చైతన్యమతం అవలంబించిన సన్యాసి. విష్ణుపు. 1.16 , 2. సన్యాసి.

సం. గోస్వామిన్-. జితేంద్రియుడు ; హిం. ఉ. గోసాఈ. సాధువు ; మరా. గోసావి. జితేంద్రియుడు, విరక్తుడు, బైరాగి.

< ఉ. గోసాఈ.

గోసాయిచిటకా రూ.చూ. గోసాయిచిట్కా. వి. వ్యాధిని త్వరలో నయంచేసే ప్రక్రియ. గోసాయిచిట్కా రూ. గోసాయిచిటకా. వి. పెద్ద వ్యాధికి త్వరలో నయం చేసే ప్రక్రియ.

గోసినగ రూ.చూ. గోసినాగ. వి. కోడిపిటల బండికి దొంకి పట్టినుంచి కాడివరకు ఉన్ననాగ.

గోసినాగ రూ. గోసినగ. వి. కోడిపిటల బండికి దొంకిపట్టినుంచి కాడివరకు ఉన్ననాగ.

గోసిరము వి. గొప్పచేసి చెప్పటం.

గోసు రూ. గోస. వి. 1. దూరు, నింద. హరి. పూ. 5.324 ; 2. చాటింపు, గోసన. ఆం. భా. 1.114 ; 3. గర్వం ; 4. రోషం.

సం. ఘోష-. ధ్వని.

< సం. ఘోష-. (అర్థవిపరి.).

గోసడచు రూ.చూ. గోసడుచు. స.క్రి. నిందించు, తిట్టు. < గోసు + అడచు. గోసడుచు రూ. గోసడచు. స.క్రి. నిందించు. నిర్వ.రా. 2.93 < గోసు + అడుచు. గోసెక్కఁగఁజేయు స.క్రి. తప్పుగాఎంచు. భార.విరా. 2.98. గోసెక్కించు స.క్రి. స్తుతించు, పొగడు, మెచ్చు. హరి. ఉ. 10.243. < గోసు + ఎక్కు + -ఇంచు[3]. గోసెక్కు అ.క్రి. మెప్పు పొందు, దూరబడు. < గోసు + ఎక్కు.

గోసున చూ. గోసన. వి. ఘోషణ.

గోసుముట్టి చూ. కోసు. వి. పాశ్చాత్య దేశాలనుంచి దిగుమతి చేసుకొన్న గింజలతో చల్లటి ప్రాంతాల్లో పెంచేఆకు. క్యాబేజి (Brassia capitata lim).

గోసెక్కఁగఁజేయు చూ. గోసు.

గోసెక్కించు చూ. గోసు.

గోసెక్కు చూ. గోసు.

గోసెసుడి వి. ఒకరకం సుడి.

గోహత్యగాఁడు (-కాఁడు) వి. గోవధచేసినవాడు. వరాహ. 10.65.

సం. గోహత్యా. గోవధ.

< సం. గోహత్యా + -కాఁడు (మిశ్రన.).

గోహరి వి. పరాక్రమం. జైమినీ భా. 6.154.

ఉ. గోహార్-. రక్షణకొరకైనపిలుపు, గోల.

< ఉ. గోహార్.

గోహరుపచ్చ రూ. గోభారపచ్చ. వి. 1. ఒకరకం లేతపచ్చ రంగు ; 2. పాలపిట్టరంగు ; 3. దమయంతిపచ్చకంటె లేతరంగు.

ఉ. గౌహర్-. ముత్తెం, రత్నం.

< ఉ. గౌహర్ + పచ్చ.

గౌచన రూ.చూ. గవుసెన. వి. గలీబు.

గౌచెన రూ.చూ. గవుసెన. వి. దిండుగుడ్డ, గవుసెన.

గౌజబాన్ వి. ఎద్దునాలుక చెట్టు (Cacaliakleinia).

సం. గో-. ఆవు. హిం. ఉ. జబాన్. నాలుక.

< సం. గో- + ఉ. జబాన్.

గౌడకాకర వి. పొట్టికాయరకంకాకర.

గౌడముద్దియ వి. ముదుసలి.

గౌడలి వి. 1. ముసలిబల్లి ; 2. ముసలిస్త్రీ.

గౌడిగేదె వి. నల్లగాఎత్తుగా ఉండేబర్రె, పొట్టికొమ్ముల పెద్దబర్రె.

గౌడు రూ.చూ. గవుఁడు. వి. గౌండ్లవాడు, ఈడిగవాడు.

గౌడుపోతు వి. నాటుపోతులకంటే పెద్దసైజుపోతు.

గౌండా రూ.చూ. గవుఁడు. వి. ఇల్లుకప్పే పనివాడు.

గౌండ్లది రూ.చూ. గవుండ్లది. వి. ఈడిగస్త్రీ.

గౌండ్లవాఁడు రూ. గవుండ్లవాడు. వి. గమళ్లవాడు, ఈడిగ

